


శా. శ్రీమంతుం డయి సర్వగుం డపరిచ్ఛిన్నుం డనై సాక్షి యై
సామర్థ్యంబున నన్నిటి న్నడుపుచు న్సర్వాత్ముఁడై నిత్యుఁడై
యేమాన్యుం డు వచింపఁగా మనముచే నింతేని భావింపఁగా
స్థేమ న్శక్యుఁడు గాఁడు స్వప్రమితు నాధీసాక్షి తద్రూపసం
స్థామాహాత్మ్యమునం భజింతు గతభేదధ్వాంత నైజస్థితిన్. ౧

శా. ఆయేకాత్మునికంటె నన్య మిల లే దట్లౌట నానాగతిన్
ఏమేయున్కి ప్రకాశసౌఖ్యములు వీక్షింపంగ నావిశ్వమం
బాయాసర్వము నేక మైన నదియే యాత్మం డటంచుర్వ మహా
మాయాగాధసుషుప్తిఁ బాపి ధృతి సంపాదించు నవ్వాణిఁ జే
దోయిన్ మోడ్చి నమస్కరింతు మతి వస్తుజ్ఞాన మేపారఁగన్. ౨

ఉ. ముక్కిడి కారుచక్షునకుఁ బుణ్యునకు న్మఱి పాపవృత్తికిన్
మక్కువ జ్ఞానమూర్ఖతలమధ్యమునం బడి వ్రేలువానికిం
దక్కినయన్నిజాతులకుఁ దత్త్వముఁ దెల్పఁగ నాదిఁ బూనెఁ దా
నక్కఱ భేదము న్స్మృతి క్రమాభ్యుదయంబు నొసంగు నిచ్చలోన్.

చ. ఎవని సముద్ధరింపఁ దలఁ పేర్పడు వానిమతంబు నాదిలోఁ
దవిలి గ్రహించి యంద మతిదార్ఢ్యముఁ బెంపక తద్వికాసహే
తువు లొగిఁ గూర్చి తాన మతదార్ఢ్య మెఱింగినదాఁక నిల్వకే
ప్రవరసుసూక్ష్మము న్దెలుపఁ బాడియె భ్రష్టుఁడు గాఁడె రెంటికిన్?. ౪

ఉ. కావున నాత్మ శేషములుగా శ్రుతి కొన్నిటిఁ గర్మ యాదిగాఁ
గేవలచిత్తశుద్ధి కయి కిల్బిషవానికి నై వచించెఁ ద
ద్భావ మెఱుంగలేక బహుభంగుల నాకుల మందు నందఱున్
వావిరి బ్రహ్మసూత్రకృతి వైఖరి దేర్చిన వ్యాసుఁ గొల్చెదన్. ౫

సీ. శ్రుతిసూచకము లౌట సొరిది వేదంబట్ల
తగ సూత్రములును దాత్పర్యకలన
ప్రౌఢంబు లగుటఁ దద్భావంబు నెఱుఁగక



స్వమతంబ వ్యాసతాత్పర్య మనుచుఁ

తే. కడఁగితిఁ గృతజ్ఞభావంబు గడలుకొనఁగ
నైదువేలు పదియు నెన్మిదైన కలియు
గాబ్దమునఁ బింగళాభిఖ్యమందుఁ దనర
బ్రహ్మసూత్రార్థచంద్రికఁ బ్రబలఁజేయ. ౧౪

శ్లో. "న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్ త్రిభి ర్గుణైః." ౧౫

మ. అని శ్రీకృష్ణుఁడు పల్కె నట్లు జగమం దాస్తంబరుద్రంబుగాఁ
గనసత్త్వాదివిముక్తమైన యది యొక్కండైనఁ గన్పట్ట లే
దన మర్త్యుండు గలి నృసింహమాగ్ని కెరగా కత్యంతశుద్ధాత్ముఁ డ
య్యెను నా నౌనె చెలంగఁగావలయుఁగా కెం తేఁకమాపూరముల్. ౧౬

తే. పరమసుఖసాధనిశ్శ్రేణి పథ్యవాణి
చిత్తరత్నప్రసాధనశ్రేష్ఠశాణి
ఆశ్రితజనప్రదత్తసదభయపాణి
సజ్జనశ్రేణి వినెడు వాత్సల్యమూని. ౧౭

సీ. ఒంగవోల్ సీమ శ్రీటంగుటూ రనుపురి
గ్రంథగ్రథనపీఠి క్రాలుఁగాక
విఘ్ననాయకుకృపావిస్తృతి. లేఖని
యప్రతిహత యయి యలరుఁగాక
శ్రీగురువాణీవిశిష్టదయాయుక్తి
వాగ్విజృంభణము మై వఱలుఁగాక
శంకరవ్యాసాదిసదమలకరుణచే
బుద్ధి సత్వగుణంబుఁ బూనుఁగాక

తే. జ్ఞానమై వ్యవహారనిదాన మగుచు
సాక్షియై సర్వకల్పనాధ్యక్ష మగుచు
నేకమై సర్వగతచిదాలోక మగుచు
వెలుఁగువెలుఁగు మనంబున వెలుఁగుఁగాక. ౧౮



శ్రీ గురుభ్యోనమః.

# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము - ప్రథమపాదము.

---

# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## శాస్త్రావతారిక.

---

శ్లో. శ్రుతిమందారకుసుమం, బుధషట్పదసేవితం
ఆనందమకరందాఢ్యం, మావాసితదిశం భజే.

శ్రీమంతంబై బహువిధములు నాయాయధికారులకుఁ దగిన ట్లుపదేశించి సర్వజనోపకారము సేయునట్టివేదము "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" "వేదమును నుపనిషత్సహితముగ నభ్యసింపవలయును" అని సర్వవేదాధ్యయనమును విధించియున్నది. ఇట్టి యధ్యయనమువలన జ్ఞానవంతుఁ డగువానికి విమర్శదృష్టిబలమువలన తమపూర్వులున్న స్థితికంటె నున్నతస్థితియైనను ఆయున్నతస్థితిని సంపాదించునిచ్ఛచే తదనుకూలసాధనముల నార్జించు ప్రయత్నమైనను కలుగవచ్చును కదా! ఇట్టి సందర్భములయందొకవేళ నొకానొకఁడు సన్న్యాసాశ్రమము నంగీకరించి పిదప నటు ముక్తిసిద్ధియు నిటు కర్మసిద్ధియుఁ జెందకుండుట తటస్థించినను, అభ్యుదయార్థమై చక్కనిపూన్కితోఁ బ్రయత్నించినవాఁడే యగుటచే వాని కెట్టిహానియుఁ గలుగదు. "నహి కళ్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి" "ఓయర్జునా! శుభము నొనరించువాఁ డెప్పటికైనను దుస్థితిని జెందునా?" అను గీతావాక్య మీవిషయమునే స్పష్టము చేయుచున్నది. ఎట్లు చూచినను విచారసామర్థ్యము గలవివేకి యెవ్వఁడును దృఢవిశ్వాసము లేక తనస్థితిని విడిచి రెండవదాని నంగీకరింపఁడు. చంచలస్వభావము గలవారికి సహితము బుద్ధిభ్రంశము కలుగకుండఁ దత్తదధికారానుగుణముగఁ దత్తచ్ఛాస్త్రములు తత్తదాశయయుక్తులచే సర్వవేదమును దత్త

దంశమాత్రబోధకములనుగ సమన్వయించియున్నవి. అభ్యుదయార్థమై యొనర్పఁబడిన కార్య మెట్టిదైనను దోషయుక్తము కానేరదు. కావున నేశాస్త్రమెట్లు సమన్వయించినను దోష మేమియులేదు. అట్లు చేయకుండినఁ దత్తదంశములయందుఁ దత్తదధికారులకుఁ జిత్తసమాధానము కలుగుట దుర్ఘటము కదా ! కావున సంపూర్ణ వేదాధ్యయనమువలనఁ జెడువార లెవ్వరును లేరు.

ఇట్టి సంపూర్ణ వేదాధ్యయనమువలన "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః. ఆత్మా వా రే! ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః." "ఆయాత్మను వెదకవలయును. ఆయాత్మను తెలిసికొనఁ బ్రయత్నింపవలయును. ఆయననే విచారదృష్టిచేఁ దెలిసికొనిన నదియే పురుషార్థము. ఈపురుషార్థమును సాధించుటకై శ్రవణమనననిదిధ్యాసనములను గావింపవలయును" అను మొదలగు శ్రుతివాక్యములమూలమున వివేకి యగువానికి "ఆత్మశ్రవణమే ముఖ్యము" అని తోఁచును. "వేదమంతయు నాత్మనుగూర్చియే చెప్పును. వేదాంతవాక్యములు ప్రధానముగాను తదితర వేదవాక్యములు పరంపరగాను ఆయాత్మనే బోధించును". అనువిషయమును నిర్ణయించునట్టి బహువిధన్యాయముల విచారించుటయే శ్రవణము. కావున నట్టివిచారము గలశాస్త్రమును (వేదాంతశాస్త్రమును) అవశ్యముగ విమర్శింపవలయు ననుట దృఢమగును. అయినను అనాది యగుసంసారవాసనయుఁ, దదనుకూలముగఁ బ్రవర్తించుచు పురుషుని భేదసాధ్యము లగుబహువిధవ్యాపారములయందుఁ బ్రవర్తింపఁ జేయుచు నున్నశాస్త్రములును వానికిఁ బై విషయమున సందేహమును గలిగించును.

ఎట్లనిన :—

౧ - వ పూర్వపక్షము—అట్టిశాస్త్ర మొక్కటియుండుటకును వీలులేదు. దానిని విచారించుటకును వీలు లేదు. విషయము (విచారింపదగినయంశము), ప్రయోజనము (దానిని విచారించుటవలనఁ గలుగు ఫలము), అధికారి (దానిని విచారించువాఁడు), సంబంధము (విషయమునకును శాస్త్రమునకును గలపొందిక) అను నీ నాలుగును ప్రమాణసిద్ధములై యేశాస్త్రమునకు గలవో యట్టిదానికి [illegible] బంధములు విచా

రింపఁబూనరు. ప్రకృతశాస్త్రమునం దన్ననో యట్టియనుబంధములు (పై నవర్ణించిన విషయాదులకు ననుబంధము లని పేరు.) లేవు.

ఎందైనను విచారింపఁబడువిషయము సందిగ్ధమై యుండవలయును గదా? బొక్కఁడును దనకుఁ గలసందేహమును తొలఁగించుకొనుటకే విచారము నాచరించు ననుట సర్వలోకప్రసిద్ధము. ప్రకృతశాస్త్రమునకు విషయమగు బ్రహ్మము సందిగ్ధము కాదు. అదియే యాత్మ (తాను) కావున "నేను నేను" అనుశబ్దముచే వ్యవహరింపఁబడుచు సర్వప్రసిద్ధమై యున్నది.

౨-వ పూర్వపక్షము.—ఇది సరికాదు. "తత్త్వ మసి" "ఆ బ్రహ్మమే నీవు" అను మొదలగుశ్రుతులు జీవబ్రహ్మములకు నభేదమును జెప్పుచున్నవి. లోకవ్యవహారమునం దన్ననో భేదము కానవచ్చుచున్నది. ఈకారణమువలన బ్రహ్మము సందిగ్ధమే. "అది జీవునికంటె భిన్నమా? కాదా? అనుసంశయము పెద్దదియై యున్నది కదా?" అనిన నది యుక్తము కాదు. సర్వానుభవసిద్ధ మగుటచే ప్రపంచవ్యవహారమునం దనుభవములోనున్న భేదమే నిస్సంశయముగఁ బారమార్థికము. అభేదశ్రుతియన్ననో "నీవు బ్రహ్మముతో సమానుఁడవు" అను మొదలగు నర్థములఁ దెలుపుచు జీవుని నుతించుటకై యౌపచారికముగ నభేదమును జెప్పుచున్నది. లోకమునఁ గార్యార్థు లగువారు రాజసేవకులను గూడ "నీవే రాజవు" అనుట కలదు గదా!

౩-వ పూర్వపక్షము:—మఱియు "వీఁడు కర్త. ఇది కార్యము. ఇదిసాధనము" అనుభేదమే బంధమని ఈశాస్త్రమునఁ జెప్పఁబడియున్నది. ఆబంధము జీవునకుఁ గల దనియు, అది యజ్ఞానకల్పితమే యారోపితమే యగుటచే యథార్థజ్ఞానమువలన నశించుననియు, వాస్తవస్థితిలో జీవబ్రహ్మలకు భేదము లేదనియుఁ గూడఁ జెప్పఁబడియున్నది. ఇదియు యుక్తముకాదు. సర్వప్రమాణసిద్ధ మగుటచే నీభేదము కల్పితము కానేరదు. యథార్థజ్ఞానమాత్రముచే నశింపనేరదు. కావున బద్ధుఁ డగు జీవునితో బంధములేని బ్రహ్మమునకు నైక్యము కూడ సంభవింపదు. బ్రహ్మము నిర్వికార మగుటచే దానియందు మఱియొకదాని నారోపించుటయే సంభవింపదుకదా! ఈకారణమువలనఁ గూడ నభేదము పారమార్థికము [illegible] దు.

౪-వ పూర్వపక్షము—కావున నీవేదాంతశాస్త్రమునకు మొట్ట మొదట విషయమే లేదు. విషయము లేకపోవుటచే సంబంధము (నాల్గవ యనుబంధము) కూడ లేదు. మఱియు బంధము పరమార్థమే యగుట చేత జ్ఞానమాత్రమున నశింపదు. కావున ముక్తియనునదియే లేకపోవలసి వచ్చుటచే నీశాస్త్రమునకుఁ బ్రయోజనంబును (రెండవయనుబంధం బును) లేదు. అనఁగ నీశాస్త్రమును విమర్శించుటవలనఁ గలుగులాభ మేదియు లేదు. ఇంతియకాక నితరశాస్త్రములయందు నిరూపించిన యధికారులకంటెఁ గ్రొత్తయధికారియు దీనికి లేఁడు. (మూఁడవయను బంధంబును లేదు.) ఆశాస్త్రములయందే యన్నివిధముల నధికార ములు నిరూపింపఁబడి యున్నవి కదా! అంతకంటె నిది యపూర్వవిశే షణముల (భేదముల) నెవ్వానిని జూపి చెప్పఁగలదు? కావున విష యాదులు నాల్గును లేకుండుటచే నీశాస్త్రము నాదరింపఁదగదు.

౫-వ పూర్వపక్షము—"ఇట్లు చెప్పనేల? ఈశాస్త్రముకూడ వేదార్థమును నిర్ణయించుననియే చెప్పకూడదా? అప్పుడు పూర్వమీ మాంసాశాస్త్రమునకువలెనే దీనికిని అనుబంధచతుష్టయ ముండును కదా?" అనిన నప్పుడు ఈశాస్త్రము పూర్వమీమాంసకంటె భిన్నము కానేకానేరదు. మఱియు పూర్వమీమాంసకంటె నన్యముగ రచింపఁ బడియుండుటకును అర్హము కాదు. అప్పటికిని దీనిని విచారించుట నిరర్థకమే యగును కదా!

౧-వ సిద్ధాన్తము.—ఇట్లు సంశయింపఁ బని లేదు. ఈవేదాంత శాస్త్రమునకు అనుబంధచతుష్టయము కలదు. పరబ్రహ్మమే దీనికి విష యము. అది నీవు తలంచినట్లు ప్రసిద్ధమె. అయినను అభేదశ్రుతివలన సంశయము జనించుచున్నది.

౨-వ సిద్ధాన్తము.—నీవు తలంచినట్లు అభేదశ్రుతులు ఔపచారి కములు కానేరవు. ఉపక్రమము ఉపసంహారము (ఆరంభము-ముగింపు) అనుమొదలగువానిని విమర్శించిన నవి (అభేదశ్రుతులు) ముఖ్యార్థప్రతి పాదకములే యనుట నిశ్చయమగును. "దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" "ఓశాంతుఁడా! ఈప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వము బ్రహ్మ మాత్రముగానే యుండెను" అని యుపక్రమించి, "తత్తేజోఽసృజత" "ఆబ్రహ్మము తేజస్సును సృష్టించెను," అని ...బ్రహ్మమునుండియే

మృత్తికనుండి ఘటము జనించినట్లు ఈప్రపంచము జనించె నని చెప్పి, యంతమున "ఐతదాత్మ్య మిదం సర్వం" "బహువిధభేదములతోఁ గానవచ్చు నిది యంతయు బ్రహ్మమే" యని ప్రపంచబ్రహ్మముల కభేదము చెప్పి, శ్రుతి "స ఆత్మా తత్త్వ మసి" "ఆసృష్టికర్తయేయాత్మ! అట్టి బ్రహ్మమే నీవు" అని యుపసంహరించుచున్నది. దీని నంతయు విమర్శించిన నీసంశయమునకు నెట్టియవకాశమును లేదు కదా! ఇంతదృఢముగ నభేదమును జెప్పుచున్నవాక్యముల నౌపచారికము లనుటకంటె విచార శూన్యత వేఱేమి కలదు ?.

౩-వ సిద్ధాన్తము, ౧:—మఱియు బంధము కల్పితము కాదనుటయు యుక్తము కాదు. వేదాంతు లొక్కరే కాక వైశేషికాదులగు నితర మతస్థులు కూడ "నేను మనుష్యుఁడను" అను మొదలగు వ్యవహారములను భ్రమలనియే యంగీకరించియున్నారు. సర్వసాధారణముగ నీవిషయము మందలకును బ్రత్యక్షముగఁ గూడ నున్నది.

ఎట్లనిన;—

౩-వ సిద్ధాన్తము, ౨:—లోకమున "ఇది, నేను" * అని భేదము వర్షముగనున్నది. అందఱును దమకు గోచర మగువిషయమును "ఇది" అను శబ్దముతోను, ఆత్మను "నేను"అనుశబ్దముతోను వ్యవహరించుచున్నారు. ఈవిషయాత్మలకు రెంటికిని తేజస్తిమిరములకువలె ప్రత్యక్షవిరోధము. ఎప్పటికిని ఐక్యము కలుగుటకు వీలు లేని భేదము కలదు కదా! ఇట్లు భేదము సర్వానుభవసిద్ధ మైనను అభేదముగ లోకులు వ్యవహరించుచున్నారు. అస్మచ్ఛబ్దార్థ మగునాత్మ సర్వము నెఱుంగువాఁ డగుటచే జ్ఞానమాత్రస్వరూపుఁ డనియు "ఇది" అని వ్యవహరింపఁబడు పదార్థసమూహ మట్టిది కాదనియు, ఆత్మచే నెఱుంగఁబడునది మాత్రమే యనియు బాగుగఁదెలిసియున్నను, విచార మింతయైనను లేక విషయములను వానిధర్మములను ఆత్మయం దారోపించుచున్నారు; ఆత్మను

* భాష్యమునందు "యుష్మదస్మత్ ప్రత్యయ" అనిమాత్రమే యున్నది. ఈగ్రంథమున "ఇది, నేను" అని వ్రాయఁబడియున్నది. ఇందు దోష మేమియులేదు. లోకమున ప్రతిపురుషుఁడును "నీవు నీవు," అనివ్యవహరింపఁబడుపదార్థమునే "ఇది, ఇది" అని వ్యవహరించుచున్నాఁడు. ఒక్కొకఁడును తనయెదుట నున్నవానినే కదా "నీవు" అనియు "ఇది" అనియు వ్యవహరించుట. కావున "నీవు, ఇది" అనుశబ్దములకు భేదములేదు.

దద్ధర్మములను విషయములందుఁ గూడ నారోపించుచున్నారు. తన కంటె నన్యులని ప్రత్యక్షముగఁ దెలిసియున్నను నిర్వివాదముగ భేదము సర్వప్రసిద్ధ మైనను, ప్రతిపురుషుఁడును భార్యాపుత్త్రాదులు దుఃఖితులై నపుడు వారిదుఃఖమును తనపై నారోపించుకొని "నాకు మహాదుఃఖము తటస్థించినది" యని పరితపించుటయు వారికి సంతసము గలిగినపుడు తన కాధ్యాత్మికము లగుదుఃఖము లున్నను (ఆధ్యాత్మిక దుఃఖములనఁగ తలనొప్పి మొదలగు బాధలు.) "నాకేఁక నేకొఱంతయు లేదు" అని సంతసించుటయు నీవిషయమున ప్రబలదృష్టాంతము కదా! ఈవిధముగనే "ఇదినా దేహము. ఇది నామనస్సు" అని దేహాదులఁ దన కంటె నన్యములనుగాఁ జూచుచుండియు "నేను పుట్టుచున్నాను. వృద్ధిఁ జెందుచున్నాను. సంకల్పించుచున్నాను. గ్రుడ్డివాఁడను"అని యా దేహాదులధర్మములఁ దనయం దారోపించుకొనుచున్నారు. ఆత్మధర్మములగు జ్ఞానాదులను "దేహమే నేను. నేనుచూచుచున్నాను."అను మొదలగు వ్యవహారములమూలమున దేహమునం దారోపించుచున్నారు. ఈ యారోపము అనాదిసిద్ధమై సర్వానుభవగమ్యమై బహువిధానర్థదాయకమై యున్నది. దీనినే పండితు లవిద్య యందురు. యథార్థజ్ఞానమువలన నిది నశించును. కావున నాయథార్థజ్ఞానమునే ముక్తిసాధన మందురు. పైననిరూపించినవిధముగ ఆత్మానాత్మలయన్యోన్యాధ్యాసమే బంధ మగుటచేతను, అదిపైవిమర్శమును బట్టి చూచినఁ గల్పితమాత్రమే యగుటచేతను, తత్త్వజ్ఞానమువలన నాబంధము నశించును. ఒకత్రాటిని జూచి సర్ప మని తలంచి నిరర్థకముగ భీతిల్లువానికి "ఇది త్రాడు" అను యథార్థజ్ఞానము కలుగఁగనే యజ్ఞానము నశించుటచే భీతితొలఁగును కదా! బంధమునుండి కలుగువిడుదలయే ముక్తి. కావున సంసారరూపమగునీకల్పితబంధమునుండి విడుదల చేయునదియగుటచే జ్ఞానమే మోక్షసాధనము. ఇట్టియారోపితబంధమువలన నాత్మకు నెట్టిహానియును లేదు. ఒకత్రాటియందు సర్పము నారోపించినను ఆత్రాటికి నెప్పటికిని స్వస్వరూప మట్లే యుండును గాని విషము, చలనము, బుసకొట్టుట మొదలగు వికారముల నొక్కదానినైనఁ జెంద దనుట నిర్వివాదాంశమే కదా! కావున నాత్మ నిర్వికారుఁడును గానచ్చును. ఆయన యందు అనాత్మారోపణము కూడ నుండవచ్చును.

3-వ సిద్ధాన్తము, 3:—ఆరోపము, అధ్యాసము, అవిద్య, భ్రాంతి, అజ్ఞానము అనునవి యన్నియుఁ బర్యాయనామములు! ఒకదానియందు మఱియొకదానిధర్మములు దోఁచుటయే వీనికి స్వరూపము. ఈవిషయము నందఱువాదులు నేకగ్రీవముగనంగీకరించియున్నారు. "ఈముత్యపుచిప్ప వెండివలెఁ దోఁచుచున్నది." అని లోకానుభవము చేతఁగూడ నీవిషయమే స్పష్టము చేయఁబడుచున్నది. ఇది (అధ్యాసము) యనాదినుండియు వచ్చుచున్న సంస్కారమువలన జనించును. ఇంతకుఁ బూర్వ మొక్కమాఱు చూచియుండుటచే రజతసంస్కారము చిత్తమున నిలిచియుండును. ఆకారణమువలన ముత్యపుచిప్పను చూచినప్పుడు ఆరజతము జ్ఞప్తికి వచ్చుటచే "ఇది రజతము" అనుభ్రాంతి కలుగును. ఇట్లె అనాదినుండియుఁ బ్రపంచసంస్కారము చిత్తమున నుండుటచేఁ బ్రత్యక్షముగ బ్రహ్మమునే చూచుచున్నను ఈసంసారాధ్యాసము సంభవించుచున్నది.

3-వ సి[illegible]ము, ర:— "ఒకదానియందు మఱియొక పదార్థమును గాని దానిధర్మములనుగాని ఆరోపింపవలయు ననిన రెండును బ్రత్యక్షములై యుండవలయును. అందు ముఖ్యముగ నధిష్ఠానము (దేనియందు అన్యధర్మముల నారోపింతుమో ఆపదార్థము) ఎదుటనే యుండితీరవలయును. ఇట శుద్ధబ్రహ్మము కన్నులకుఁ గానరాదు కదా? ఆయనయందు అనాత్మ యారోపింపఁబడియె ననుట యెట్లు సంభవించును?" అనియెదవేమో, వినుము. "ఎదుట నున్నదానియందు మాత్రమే యన్యధర్మముల నారోపింపవలయును" అనుట నియమము కాదు. ఆకాశము రూపము కలది కాకపోవుటచేఁ గన్నులకుఁ గానరాదు కదా! ఇట్లైనను బాలురు దానియందు నలుపు మొదలగువర్ణములను ఆరోపించుచున్నారు. "ఆకాశము నిర్మలముగ నున్నది. ఆకాశము నలుపు. బాగుగఁ జూచిన నదియు భూమివలెనే చవరముగఁ గానవచ్చును. మనయెదుటఁ గొంతదూరమున నది భూమితోఁ గలిసియున్నది" అనుమొదలగు వ్యవహారము లీవిషయమునఁ బ్రమాణములు. ఇదియునుగాక "నేను" అను శబ్దముచేఁ జెప్పఁబడువాఁడు శుద్ధబ్రహ్మమే కావునను, వాస్తవస్థితిలో బంధము తోఁచుటమాత్రమే కాని యెవ్వనికిని లేదు కావునను "ఆబ్రహ్మము ప్రత్యక్షముగఁ దెలియవచ్చుట లేదు" అనుటయు నసంగతమే. ప్రత్యక్షముగనే కానవచ్చుచున్నను

"నే నాబ్రహ్మము నెఱుంగను" అని భ్రాంతిచేఁ దలంచుచున్నారు. "నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః, అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః" "ఓ యర్జునా! అవిద్య యనఁబడునీయోగమాయ నన్నావరించియున్నది. కావున నన్నందఱు నెఱుంగలేరు. అజ్ఞానులు మాయామోహితులై యుండుటచే స్వప్ర కాశుఁడ నగునన్ను, ఒకప్పుడు ప్రకాశింపకుండి మఱియొకప్పుడు ప్రకా శించినవానినిగా తమజ్ఞానావస్థయందుఁదలంతురు" అనువాక్యములచే గీతాచార్యుఁ డీవిషయమునే స్పష్టము చేసియున్నాఁడు.

3-వ సిద్ధాన్తము, ౫:—"ఇట్లైనను మఱియొక దోషము కలదు. ఏపదార్థమును మన మొకదానిపై నారోపింతుమో ఆపదార్థము.(ఆరో పిత పదార్థము) నిత్యమై కాని, నిత్యము కాకున్నను అంతకు ముందొక మాఱు చూడఁబడి కాని యుండవలయును. ఈప్రపంచ మన్నన్నోయజ్ఞాన కల్పిత మగుటచే నసత్య మనియే కదా మీరు చెప్పుదురు ? పదార్థమే లేకుండిన దానిని మఱియొకదానియం దారోపించి రనుట యెట్లు సంభవించును ? " అనియెద వేమో, వినుము. "అధిష్ఠానమునందొక దాని నారోపింప వలయు ననిన నయ్యారోపితపదార్థము ముందొక మాఱు చూడఁబడియుండ వలయును. దాని సంస్కారము చిత్తమున దృఢమై యుండవలయును" అనుటమాత్రమే యావశ్యకము కాని "ఆయారోపితపదార్థము నిత్యమై పరమార్థమై యుండవలయును" అనుట యావశ్యకము కాదు. సంస్కారము యథార్థజ్ఞానమువలన నెట్లు కలుగునో, అయథార్థజ్ఞానమువలనఁ (భ్రాంతివలన) గూడ జనించును కావున నీప్రపంచ మసత్య మయినను భ్రాంతికల్పిత మయినను అనాది యగుటచే పూర్వపూర్వభ్రాంతివలనఁ గలిగినసంస్కార ముత్తరోత్తర భ్రాంతికిఁ గారణ మగుచుండును. కావున ఆత్మయం దనాత్మ యారో పింపఁబడియున్న దనుటలో దోష మేమియు లేదు."

3-వ సిద్ధాన్తము, ౬:—"ఇట్లైన సర్వశాస్త్రములును 'నీవు కర్తవు' అని చెప్పుటకును, ప్రత్యక్షము మొదలగు సర్వప్రమాణములును బ్రవర్తిం చుటకును వీలులేదు. శాస్త్రాదులు సత్యములైనచో నధ్యాసము లేదు. అధ్యాసము సత్యమైన శాస్త్రాదులు వ్యర్థములు. ఈవిరోధమునకుఁ బరి హారమెద్ది ? " అనియెద వేమో, వినుము. సర్వశాస్త్రములును సర్వ

ప్రమాణములును ఈయధ్యాసము నాశ్రయించియే ప్రవర్తించుచు న్నవి. "అధ్యాసము సర్వానుభవసిద్ధము" అనువిషయమును మొట్ట మొదటనే చక్కఁగ నిరూపించియున్నాము. కావున నది యింతమాత్ర మున నసత్యము కానేరదు. శాస్త్రములకును దాని ననుసరించుటవలన లోప మేమియు లేదు. హితబోధము నాచరించునవి మొట్టమొదట శిష్యులచిత్తపరిపాకము నాశ్రయించియే ప్రవర్తింపవలయును కదా! పైనవివరించినవిధముగ నాత్మ సాక్షియే యగుటచే నాయనకు దేని తోను సంబంధముండుటకు వీలులేదు; దేహేంద్రియములతో నేదియో యొకవిధముగ సంబంధపడక నెట్టివ్యవహారమును కలుగనేరదు. ఇంద్రి యములయం దాత్మాభిమానము లేకున్న "నేను చూచుచున్నాను, విను చున్నాను" అను మొదలగువ్యవహారములు సంభవింపవు; ఆయింద్రియ ములును దేహము నాశ్రయించి యుండినవి కావున దేహసంబంధము లేక కార్యముల నాచరింపనేరవు. కావున నింద్రియములమూలమున దేహమునందును వ్యవహారదశలో నాత్మాధ్యాసముండియే తీరవలయును. వాస్తవస్థితిలో నాత్మసంబంధము లేకుండిన నన్నియు నంధప్రాయములే (అనగా: ప్రపంచమంతయు గ్రుడ్డిదియే) కావలసివచ్చును. మఱియు ప్రత్యక్షాదిప్రమాణములలో నేది ప్రవర్తింపవలసి వచ్చినను మొట్ట మొదట ప్రమాత (ప్రమాణముచే విషయములను గ్రహించువాఁడు) కావలయును. ప్రమాత యనఁగ ప్రమాణమున కాశ్రయభూతుఁడు. ప్రమాణము జ్ఞానరూప మని కాని మనోవృత్తిరూప మని కాని చెప్ప వలయును. జ్ఞానరూపమనినచో అదియే ప్రమాత యగును. కావున నది మఱియొకదాని నాశ్రయించుటకు వీలు లేదు. మఱియొకటియు దాని నాశ్రయించుటకు వీలులేదు. ఇట్లుగాక "కేవలచిత్తవృత్తియే ప్రమాణము" అనినచో నది జడమే కావున ప్రపంచ మంతయు గ్రుడ్డిది కావలసివచ్చును. కావున "చిత్తవృత్తియందు ప్రతిబింబించి యధ్యాససంబంధముచే నున్నజ్ఞానమే, లేక, జ్ఞానసహిత మగు చిత్త వృత్తియే ప్రమాణము" అని చెప్పితీరవలయును; అట్టిచిత్తవృత్తితో నాత్మకుఁగూడ నధ్యాససంబంధము కల దనవలయును. అట్లు కాకున్న నిర్వికారసాక్షికి ప్రమాణాశ్రయత్వము కలుగదు కదా. కావున నీసర్వ ప్రమాణములును సర్వశాస్త్రములును అవివేకవంతునిం గూర్చియే

(అనఁగ : ఆత్మానాత్మవిభాగముఁ జేయనేరని వానింగూర్చియే) ప్రవర్తించుచున్నవి యనుట నిస్సంశయము!

3-వ సిద్ధాంతము, ౭:—లోకమున పశువులు అజ్ఞానులని ప్రసిద్ధి కదా? వానికిని మనుష్యులకును ప్రమాణ ప్రవృత్తివిషయమునఁ (వ్యవహారమున) గలభేద మేది? అవియును దండహస్తుఁ డగుపురుషునిఁ జూచి భయమున పరువు లిడును;తృణహస్తునిఁ జూచి సమీపమునకు వచ్చును. పురుషులు నట్లే ఖడ్గహస్తులై తనను నఱకవచ్చువానిని జూచి తొలఁగుదురు; ప్రియము నాచరించు వానిని సేవింతురు. ఇట్లుండ నాపురుషులు జ్ఞానులనియు పశువు లజ్ఞాను లనియు నెట్లు చెప్పనగును? పురుషులు పరలోకాపేక్షచేఁ బశ్వాదులకంటెఁ గొన్నికర్మముల నధికముగ నాచరించినను అది సంపూర్ణవిజ్ఞానము కానేరదు. పశువులయందు రజోగుణ మధికము; పురుషులయందు సత్త్వగుణ మధికము. ఈకారణము వలన మనుష్యులు పశువులకంటెఁ గొన్నివిషయముల నధికముగ గ్రహింతు రనుటయే కాని వ్యవహారమున మాత్రము భేద మేమియు లేదు. ఇహాపరభేదమే కాని ఇష్టమును గూర్చి ప్రవర్తించుటయు ననిష్టమునుండి నివర్తించుటయు ననునది సమానమే కదా? ఇంతయేల? శాస్త్రములు శుద్ధాత్మనుగూర్చి యేవిషయమును జెప్పనేరవు; ఆయన నేయధికారమునందును నియోగింప నేరవు; ఆత్మసర్వసాక్షి కాదుఁడు; సాక్షియగుటచే దేనితోను సంబంధము లేనివాఁడు. ఇట్టివానికిఁ గర్మాద్యుపదేశమువలనఁ బ్రయోజనమేమి? ఆతఁడు దేనిని నాచరింపఁడు; అట్లాచరించుటకును వీలు లేదు కదా! కావున నెట్లు చూచినను "బంధమారోపితము" అనుటలో నెట్టిసంశయమును లేదు. ఆరోపిత మగుటచే తత్త్వజ్ఞానమువలన నశించు ననుటకును ఆక్షేపము లేదు; జీవబ్రహ్మైక్యటియే యను విషయమునందును వివాదము లేదు.

౮-వ సిద్ధాన్తము:—కావున నీవేదాంతశాస్త్రమునకు పరబ్రహ్మమే విషయము;ఆయనయే ఫలము. తెలియునంతవఱకు నాబ్రహ్మమే విషయముగ నుండును; తెలిసిన పిదప నాబ్రహ్మమునకంటె నన్యమగుముక్తియే లేదు. కావున నాయనయే ఫల మగును. ఈబ్రహ్మము ప్రతిపాదింపఁబడునది, శాస్త్ర మీబ్రహ్మమును ప్రతిపాదించునది, యగుటచే శాస్త్రవిషయములకుఁ బరస్పరసంబంధంబును గలదు. వైరాగ్యము లేనివా

నికి, "ఇది సత్యము, ఇది యసత్యము" అను వివేకము గలుగనివానికి, చిత్తసమాధానము నొందనివానికి, మోక్షేచ్ఛచే ద్వరపడనివానికి నీశాస్త్రమును విచారించుటయందు దర్హత కలుగదు. కావున నట్టివాని మనస్సు అంతర్ముఖము కాదు. కావున వైరాగ్యాదిసంపన్నుఁడే ఈశాస్త్రమున నధికారి. ఈవిధముగ ననుబంధ చతుష్టయమును గలది యగుటచే నీశాస్త్ర మవశ్య మాదరణీయము. దీనిని రచియింపను వలయును; విచారింపను వలయును.

౫-వ సిద్ధాన్తము:—మఱియుఁ బ్రత్యేకముగ ననుబంధచతుష్టయముండుటచే నిది పూర్వమీమాంసాశాస్త్రముతో నేకభవింపనేరదు. పూర్వమీమాంస కర్మను బోధించును. ఈవేదాంతశాస్త్రము బ్రహ్మమును బోధించును. పూర్వమీమాంసయందు ధనాఢ్యుఁడును ఇంద్రియపాటవము గలవాఁడును అధికారి ; ఈశాస్త్రమునందు వైరాగ్యాదిసంపన్నుఁ డధికారి. ఆశాస్త్రాధ్యయనమునవలన భేదసాధ్య మగుస్వర్గము కలుగును; ఈశాస్త్రమును విచారించుటవలన స్వతస్సిద్ధ మగుముక్తికలుగును. ఈవిధముగ నన్నివిషయములయందును పరస్పరభేదము గలవి యగుటచే రెండుశాస్త్రములు నొక్కటి కానేరవు

౧-వ పూర్వపక్షము, ౧:—ఈవిధముగ ననుబంధచతుష్టయమున్నను శాస్త్రమును ఆరంభింపను పనిలేదు ; విచారింపను పనిలేదు. బంధము కేవల మారోపితమే యగుటచే దానితో నాత్మకు నెప్పుడును సంబంధము లేదు. కావున విచారించినను విచారింప కున్నను ఆత్మ యొక్కతీరుగనే యుండును.

౧-వ పూర్వపక్షము, ౨:—మఱియు లోకమున సామాన్యముగ నొక విషయము నెఱింగియున్న దానిని విశేషముగఁ దెలిసికొనుటకై విచారము సేయఁబడుచున్నది. ఇచ్చట బ్రహ్మము నిర్వికారమును, ఏకరూపమును అగుటచే దీనియందు సామాన్యవిశేషభావములు (అనఁగ: మొట్టమొదట సామాన్యముగఁ దెలిసికొనుట, పిదపవిశేషముగఁ దెలిసికొనుట యనునవి)సంభవింపనేరవు. కావున విషయమున్నను శాస్త్రము విచారార్హము కానేరదు.

౧-వ సిద్ధాంతము, ౧:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. ఆత్మ ఎప్పటికిని (అనఁగ: విచారించినను విచారింపకున్నను) ఏకరూపముతో

నుండువాఁడే. అయినను ప్రస్తుత మనుభవములో నున్న యారోపిత సంసారమువలన జనులు బహువిధశ్రమముల నొందుచున్నారు. సంసారమునుగూర్చి విసుగుఁ జెందనివాఁ డెవ్వఁడును లేఁడనుట సర్వజనవిదితమే. ఇది పరమార్థజ్ఞానము లేకపోవుటచే కలిగినదియే. కావున నీదుఃఖము నశించి చిత్తశాంతి కలుగుటకై బ్రహ్మవిచార మావశ్యకము. అట్టి విచారమునవలన యథార్థజ్ఞానము జనించె నేని పిదప సంసారము యథాపూర్వముగనే తోఁచినను దుఃఖమును కలిగింపఁజాలదు. ఇంద్రజాలవిద్యాకల్పిత మగుభూతమునుజూచి భయము నొందువానికి "ఇది యథార్థభూతము కాదు" అని తెలిపిన పిదప భూతము మాత్రము యథాపూర్వముగనే తోఁచుచున్నను భయముమాత్రము తొలఁగి పోవును గదా! కావున సంసారదుఃఖశాంతికై విచార మావశ్యకము.

౧-వ సిద్ధాంతము, ౨:— మఱియు నీవన్నట్లు బ్రహ్మమునందు సామాన్యవిశేషభావము లుండుటకు వీలు లేకపోయినను ప్రత్యక్షానుభవము ననుసరించి బంధమువలెనే యనియు నాయనయం దారోపింపఁ బడియున్నవి. అస్మచ్ఛబ్దార్థ మాత్మ యని సామాన్యముగఁ నెల్లరు నెఱుంగుదురు. "దేహ మాత్మయా? ఇంద్రియము లాత్మయా?" అని మఱియు ననేకవిధములుగ నాయనను గూర్చి యొక్కొకఁడును విశేషవిజ్ఞానము లేక సంశయించుచుండును. కావున "ఆత్మయందు ఆరోపితసామాన్యవిశేషభావము కలదు" అనుట లోకానుభవసిద్ధ విషయము. శాస్త్రముకూడ దీని నాశ్రయించియే ప్రవర్తించుచున్నది. కావున నిస్సంశయముగ నీవేదాంతశాస్త్రము విచారణీయము. సంసారదుఃఖశాంతిని గోరువారికి నత్యంతావశ్యకము. "జ్ఞానా దేవ తు కైవల్యం" "పరబ్రహ్మస్వరూపమును యథార్థముగ నెఱుంగుటచేత మాత్రమే మోక్షము కలుగును" అను శ్రుతియు సర్వవిషయమును స్పష్టము చేయుచున్నది.

దీని నంతయు నెఱింగి భగవంతుఁ డగు శ్రీవేదవ్యాసమహాముని*ముముక్షుజనుల ననుగ్రహించుటకై వేదాంతమీమాంసాశాస్త్రమును

---

* వేదములను విభాగించి పురాణముల రచించి భారతమును గావించిన కృష్ణద్వైపాయనులే బ్రహ్మసూత్రమును రచించిన బాదరాయణులు. వీరికాలము ద్వాపరకలియుగముల సంధికాలము. దాదాపు అయిదువేలసంవత్సరముల క్రిందికాలము.

నిర్మించెను. సర్వార్థమును కంఠస్థముగ నుంచుకొనవలయునను తలం
పునఁ బూర్వు లందఱకును శాస్త్రములసూత్రములను సంక్షిప్తవాక్యము

---

"జైమినిమతము భారతమున లేకుండుటచేతను, పురాణములలో జైమిని వేద వ్యాసశిష్యుఁ డని యుండుటచేతను, ఈ బ్రహ్మసూత్రములయందు బాదరాయణులు జైమినిమతమును పలుమాఱు ఉదహరించుటచేతను, ఈబాదరాయణులు కృష్ణద్వైపాయనులకంటె భిన్ను లని తోఁచుచున్నది." అని కొందఱు వ్రాసియున్నారు. అది యుక్తము కాదు. పురాణములయందు "జైమిని కృష్ణద్వైపాయనులకు శిష్యుఁడు" అని మాత్రమే కాక "వేదాంతశాస్త్రివేత్త" అని కూడఁ జెప్పఁబడియున్నది. తత్త్వజ్ఞానము కలిగినను భిన్నభిన్నాభిప్రాయములతో నున్నపామరుల నుద్ధరించుటకై కొన్నికొన్నివిషయముల తత్తదనుకూలములుగ వర్ణింపవచ్చును. (శిష్యాభివృద్ధికై యెట్లయినను చెప్పవచ్చును అనువిషయమునుగూర్చి పుట ౫-౬ చూడుఁ) అది తత్త్వమునకు విరుద్ధ మగుటచే వ్యాసులును తమశాస్త్రమునందు పూర్వపక్షములుగ నుదాహరింపవచ్చును. యుక్తములైనవాని సిద్ధాంతసార్థ్యమునకై యంగీకరింపవచ్చును. క్రొత్త మతకర్తయై బహుజనులచే నాదరింపఁబడినవానిశిష్యుఁడనునంతమాత్రమున నవాదరము చేయవలయు ననుట యొక నియమమా ? గురువుగా నే భావించె ననుటకుఁ బ్రమాణము కలదా ? కావున నీ హేతువులవలన బాదరాయణవ్యాసులకు భేదము నెన్నుట తగదు.

"బ్రహ్మసూత్రమునందలివిషయములకు స్మృత్యుదాహరణముల నిచ్చుచోటుల యందు భారతములోనివాక్యముల నుదాహరించుటచే భారతకర్తకును బ్రహ్మసూత్రకర్తకును భేదము" అనియుఁ గొందఱు వాదించుచున్నారు. ఇదియు యుక్తముకాదు. ఆభారతకర్త భారతకాలమునందే యున్నవాఁడు. కావున శ్లోకములు మాత్రమే వేదవ్యాసమునివి కాని అభిప్రాయములు ఆయినవి కావు. కావున నాశ్లోకముల నుదాహరించుటవలన లోప మేమియు నుండదు. "ఋషిభి ర్బహుధా గీతం" అను మొదలగు గీతాశ్లోకమునందు బహువచనము ప్రయోగింపఁబడియుండుటచే ఒక్కఋషి యగు బాదరాయణుఁడు మాత్రమే సూత్రముల నిర్మించెననుట యుక్తము కాదు" అనియుఁ గొంద ఱనుచున్నారు. ఇంతకంటె హాస్యాస్పద మగువిషయము వేఱేమికలదు. ఔడులోమి, బాదరి, కాశకృత్స్నుఁడు, అశ్మరథ్యుఁడు, అను నద్వైతులు నలువురు కలరు. మఱియు నల్పభేదములతో నద్వైతము నంగీకరించినవారును అనేకులున్నారు. వీరి నుద్దేశించియే ఆబహువచనము ప్రయోగింపఁబడియున్నది. "బ్రహ్మసూత్రపదైశ్చైవ" అని యాశ్లోకమునందే చెప్పఁబడియుండుటవలన బ్రహ్మసూత్రములు గీతలకంటెఁ బూర్వమున నుండినవనియు దానిచే గ్రంథద్వయకర్తలకు భేదము కలుగవలయునని యు మఱికొందఱు చెప్పుచున్నారు. ఇదియును యుక్తము కాదు. ఒకపక్షమున భారతరచ

లచే నిర్మించుట స్వభావము. "అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతో ముఖం, అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః" "సాధ్యమగునంతవఱకు నల్పసంఖ్యగల యక్షరములు గలిగి యర్థమును నిస్సం

నకుఁ బూర్వ మాకవియే బ్రహ్మసూత్రములఁ గల్పించియుండవచ్చును శాస్త్రకర్త యగుటచే నమ్మహాత్మునిమతమును శ్రీకృష్ణుఁడు ప్రమాణముగ నంగీకరించియు నుండవచ్చును. మఱియొకపక్షమున నామునులు ప్రతికల్పములందును జనించి శాస్త్రముల రచించువారగుటచే పూర్వకల్పస్థితబ్రహ్మసూత్రములనుగూర్చి ప్రకృతకల్పమునఁ జెప్పి యుండవచ్చును. ఈవిషయమునుగూర్చి "వ్యాసాభిధేన జీవేన తేనైవాన్యేన వా కృతం, ఏతచ్చ సప్తమం వారం క్రియతే విస్మృతిం గతం" అని జ్ఞానవాసిష్ఠమునఁ జెప్పఁబడియున్నది. ఇట్లు గాక శంకరవ్యాఖ్యానుసారముగ "బ్రహ్మసూత్రపదము లనఁగ బ్రహ్మవిషయక వేదాంతవాక్యములు" అని యర్థము చెప్పిన నే పూర్వపక్షమునకు నవకాశమే లేదు.

బుద్ధమతమును ప్రత్యక్షముగా వర్ణింపలేదనియు, శిష్యులమతములను మాత్రమే వర్ణించిరనియు, వారిమతము 400, 500, సంవత్సరములవరకు నభివృద్ధిదశలో నున్నదని చరిత్రకారులు నిర్ణయించుటవలన బ్రహ్మసూత్రములు ఈలోపలనే పుట్టియుండుననియు కృష్ణద్వైపాయనులు 5000 ల సంవత్సరములకు క్రింద నుండిరి కావున వారికి సూత్రకర్తలకును సంబంధముండదనియు వేఱొక కొందఱు పలుకుచున్నారు. పురాణములయందు ఈబుద్ధ జైన మతములుకూడ నభివర్ణింపఁబడియున్నవి.

కావున నెట్లుచూచినను కృష్ణద్వైపాయనబాదరాయణులకు భేదము లేదు.

ఇదియును గాక "బుద్ధ శిష్య జైనమతములు సూత్రములయం దనువాదము చేయఁబడెను" అను నంతమాత్రముననే "సూత్రకర్తలకాలము 400, 500, సంవత్సరములకు లోఁబడినది" అనుటకు వీలు లేదు. సాంఖ్యమతము పురాతన మనుటలో నెవ్వరికిని ఆక్షేపము లేదు కదా! దానియందు ఈబ్రహ్మసూత్రమత మనంతముగ ననువాదము చేసి ఖండింపఁబడియున్నది. ఇట్లే ప్రాచీనము లని నిర్వివాదముగ నంగీకరింపఁబడియున్న వైశేషికాదిసూత్రములయందును ఈమత మనువాదము చేయఁబడియున్నది. ఈసూత్రములు మొన్నమొన్న పుట్టినవగు నేని వానియం దెట్లనువాదము చేయఁబడును. "అనియు నీసూత్రముల కనంతరముననే పుట్టినవి" అనుటయు సంభవింపదు. అప్పుడు తన్మతమే తత్సూత్రములయం దనువాదము చేయఁబడియుండుటకు వీలు లేదు కదా? కావున నీశాస్త్రకర్తలు ప్రతికల్పమునను జనించువా రగుటచే చరిత్రానుసారికాలనిర్ణయము లిచ్చట పనికిరావు. (ఈవిషయము నాచే వివరింపఁబడిన వ్యాసతాత్పర్యనిర్ణయమునఁ జూచునది.)

శయముగ నొసంగుచు మిగుల సారవంతమై శాస్త్రమునందంతటను వ్యాప్తికలిగి స్తోభము (అన్యార్థమునఁ బ్రయోగించుపదమున నభీష్ట పద మంతర్భూతమై యుండుట, 'చరామః' అను పదమునందు రామ పదముండుట. ఆ రామపదమును జెప్పుటకయ్యును 'చరామః' అను పద మును నొక్కదానినే ప్రయోగించుట స్తోభము.) లేక నిర్దోషమై యుండువాక్యమునకు సూత్రమని పేరు" అను లక్షణము ననుసరించి ఇతరమునులవలెనే ఈ బాదరాయణుఁడును ఈశాస్త్రమును ఏనూట యేఁబదియైదు సూత్రములతో నిర్మించెను. అవియు నాలుగధ్యాయ ములుగ విభజింపఁబడియున్నవి. "వేదాంతవాక్యము లన్నియు పర బ్రహ్మము నొక్కదానినే చెప్పును." అను విషయము ప్రథమాధ్యాయ మునందును, "అన్యమతస్థులు చూపుయుక్తులవలనను మందబుద్ధులకు నున్నట్లు తోఁచు వేదవాక్యములలోని పరస్పరవిరోధములవలనను పై సిద్ధాంతమునకు భంగ మేమియును లేదు" అను విషయము ద్వితీయా ధ్యాయమునందును, సాధనములు తృతీయమునందును, ఫలమగుముక్తి చతుర్థాధ్యాయమునందును క్రమముగ నిరూపింపఁబడియున్నవి. ఇందుఁ బ్రతిసూత్రమునందును బ్రత్యక్షముగఁ గాని పరోక్షముగఁ గాని శ్రుతి వాక్యార్థము నిర్ణయింపఁబడుచుండును. కావున శాస్త్రమున కంతకును ఉపనిషద్వాక్యములతో సంబంధముకలదు. ఈవిషయము నంతయును గ్రమముగ నిరూపింపఁ బోవుచున్నాము.

---



శ్లో. ఉపాసనాం జ్ఞాన మథాపి కర్మ
వదంశ్చ విశ్వోద్భవనాశసంస్థాః,
య మేవ తాత్పర్యవశా ద్బ్రవీతి
శ్రుతి స్త మాత్మాన ముపైమి భక్త్యా.

## అధికరణావతారిక.

ఈశాస్త్రము నూటతొంబదిరెండధికరణములుగ విభాగింపఁబడి యున్నది. అధికరణ మనఁగ విషయనిర్ణయస్థానము. ప్రత్యధికరణము నందును సంగతి (పూర్వాధికరణములోఁ గలసంబంధము) సందేహము (విచారింపవలసినసంశయకారణము), విషయము (విచారింపవలసినశ్రుతి వాక్యము నిర్ణయింపవలసినవిషయము) పూర్వపక్షము (విషయనిర్ణయ ముపై నాక్షేపము), సిద్ధాంతము (ఆయాక్షేపమునకు సమాధానము) అను నైదవయవములుండును.

## ౧. జిజ్ఞాసాధికరణము.

సంగతి:—ఈసూత్రము తక్కినశాస్త్రమునకంతయు నుపోద్ఘాత మగుటచే మొట్టమొదట వ్రాయఁబడియున్నది. ఈయధికరణమున కంటె ముందుగ నధికరణములు లేకపోవుటచే దీనికి పూర్వసంబంధము (సంగతి) లేదు. కావున నిది స్వతంత్రాధికరణము. ఇచ్చటనుండియు నీపాదాంతమువఱకుఁ గలసూత్రము లన్నియు స్పష్టబ్రహ్మలింగము లగు వేదవాక్యముల ("ఇవి పరబ్రహ్మమును గూర్చియే చెప్పుచున్నవి" అని స్పష్టముగఁ దెలియుచున్నశ్రుతివాక్యముల) విచారించునవి యగుటచే నొక్కసమూహముగఁ గూర్పఁబడియున్నవి.

సందేహము:—ఎవ్వనికైనను సందేహము కలిగిన నది సామా న్యముగ రెండుపక్షములుకలదై యుండును. ఆరెండుపక్షములకును

ప్రత్యేకప్రయోజనములు గూడ నుండును. అట్లుండక పోయిన పురుషుఁ డేదియో యొకపక్షమునందు నిలువఁబడును; కాని రెండుపక్షముల నవ లంబించి కలఁత నొందఁడు కదా !

ప్రకృతమున "బ్రహ్మవిచార మనునది సంభవింపదు" అనియు "సంభవించును" అనియు రెండుపక్షములు కలవు. అందు మొదటిది పూర్వపక్షము ; రెండవది సిద్ధాంతము. "బ్రహ్మవిచారము లేకున్నను మోక్షము నితరోపాయములచే సంపాదింపవచ్చును." అనుట పూర్వ పక్షమునకు ఫలము. "బ్రహ్మవిచారముచేతనే మోక్షమును సంపాదింప వలయును గాని ఇతరసాధనములచే నక్కార్యము జరుగదు" అనుట సిద్ధాంతమునకుఁ బ్రయోజనము.

ఈ రెండుపక్షములును ఈ అధికరణమునందు సందేహకారణ ములు. వీనివలన "బ్రహ్మ ప్రతిపాదకము లగు వేదాంతవాక్యముల విచారింపవలయునా ? యక్కఱలేదా" అను సంశయ ముదయించును. నీయధికరణమున వ్యాసమహాముని నివారించుచున్నాఁడు. శాస్త్రావతా రికయందు ఈవిషయమును గూర్చి చక్కఁగ విమర్శించియున్నాము.

విషయము:—"ఆత్మా వా రే! ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" "పరబ్రహ్మమునుగూర్చి శ్రవణము నాచరింపవల యును. వినినయర్థమును విమర్శింపవలయును. పిదప నేనే బ్రహ్మ మని ధ్యానింపవలయును. ఇదియే పరమపురుషార్థము" అను నిట్టి జాతిగల శ్రుతివాక్యములయర్థ మీయధికరణమునందు నిర్ణయింపఁబడును. బ్రహ్మమును విచారించుట యావశ్యక మనువిషయము సిద్ధాంతము చేయఁబడును.

---

## ౧. అథాతో బ్రహ్మజిజ్ఞాసా. ౧. ౧. ౧.

తాత్పర్యము:—వేదము పూర్వకాండమునందు "కర్మముల నవశ్య మాచరింపవలయును" అని విధించుచున్నది. అదియే ఫలమును జెప్పును త్తరకాండము "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే, పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్." "పూర్వకర్మచే వచ్చిన యిహలోక

మెట్లు నశించునో (పురుషుఁడు మృతిఁ జెందిన వానికి నిహలోకభోగములు లేకపోవుటచే "ఇహలోకమున నశించినది" అని తెలిసికొనవలయును.) పుణ్యకర్మమువలన వచ్చిన పరలోకముగూడ నట్లే నశించును. ఈవిధముగ కర్మసాధ్యము లగు నుభయలోకములకును అనిత్యత్వము నెఱింగి బ్రాహ్మణుఁడు కర్మఫలములయందు వైరాగ్యమునొందవలయును" అని కర్మపరిత్యాగమును బోధించుచున్నది. "బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మవేత్త ముక్తిని జెందును." అని బ్రహ్మజ్ఞానమొక్కటియే పరమసుఖ మగుముక్తికిసాధన మనియు చెప్పుచున్నది. "శాంతోదాంతః" "శమదమములు కలవాఁడు" అను మొదలగువాక్యములచే బ్రహ్మవిచారాధికారినిగూడ నిరూపించియున్నది. కావున * సాధనచతుష్టయసంపత్తిగలవాఁడు కర్మఫలముల ననిత్యము లని ఎఱింగి మోక్ష

* 1 నిత్యానిత్యవస్తువివేకము, 2 ఇహాముత్రార్థఫలభోగవిరాగము, 3 శమాదిషట్కసంపత్తి, 4 ముముక్షుత్వము అను నాలుగును సాధనచతుష్టయము.

ఇందు "బ్రహ్మము నిత్యము, ఇతరపదార్థము లనిత్యములు" అని తలంచుట నిత్యానిత్యవస్తువివేకము. ఇది కలుగుటకుఁ దత్త్వజ్ఞాన మక్కఱ లేదు. వేదాంతవాక్యములను ఆపాతమాత్రమున (స్వయముగ విచారింపకున్నను వారును వీరును చెప్పుకొనువాక్యములవలన మాత్రమే) వినుటచే కలుగును. ఇది కలిగినవాఁడేకాని బ్రహ్మమును విచారింప నుత్సహింపఁడు. కావున మోక్షశాస్త్రాధికారికి నిది యంతరంగసాధనము. (ఆవశ్యకమగు సాధనము.)

ఈలోకమున ననుభవింపఁబడుచున్న నారీచందనమాల్యాదిభోగములయందును పరలోకమున ననుభవింపఁబడు రంభాసంభోగాదులయందును ఇచ్ఛ లేకపోవుట ఇహాముత్రఫలభోగవిరాగము. ఇది నిత్యానిత్యవస్తువివేకము కలవానికిఁ గలుగును. దృఢమైనిలుచును ఈ ప్రపంచ మనిత్యము. "తద్యథేహకర్మచితో లోకః క్షీయతే ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే." "పూర్వకర్మచే సంపాదింపఁబడిన యీలోకము ఎట్లు క్షీణించునో పుణ్యకర్మలచే సంపాదింపఁబడిన స్వర్గాదిలోకములు కూడ నట్లె క్షీణించును" అని శ్రుతి చెప్పుచున్నది. కావున "నీ ప్రపంచమునందు నిరర్థకముగ నభిమానమునుంపనేటికి ? బ్రహ్మమే మోక్షము కావున పరమానందంబును నిత్యంబు నగుమోక్షమును సంపాదింపవలయును" అను సంకల్పము నిత్యానిత్యవస్తువివేకము కలవానియందు స్థిరమై యుండునుకదా ?

శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అను నాఱును శమాదులు. వీనిఁ గలిగియుండుటయే శమాది షట్కసంపత్తి.

మునకై బ్రహ్మవిచారమును (అనఁగ : బ్రహ్మప్రతిపాదక మగు వేదాంత వాక్యవిచారమును) జేయువలయును." "ఆత్మా వారే! ద్రష్టవ్యః" అను మొదలగువాక్యములచే నీవిషయమును శ్రుతియు స్పష్టముగఁ జెప్పుచున్నది.

## సూత్రార్థవిచారము.

అథశబ్దార్థవిచారము:— "మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యే ష్వథో అథ" అనుకోశము ననుసరించి, మంగళము, తర్వాత యనుటయు, ఆరంభించుచున్నా మనుటయు, ప్రశ్నంబును, అంతయు ననుటయు, నని 'అథ'శబ్దమునకు నర్థము లైదు కలవు. అందు ప్రకృతసందర్భము ననుసరించి ప్రస్తుతసూత్రమున నున్న 'అథ' శబ్దమునకు ప్రశ్నార్థముగాని "అంతయు" ననునర్థముగాని లేదనుట నిర్వివాదము. మఱియు శాస్త్రములు ఉపదేశరూపములే (అనఁగ "నీవిట్లు చేయవలయును" అని చెప్పునవియే) కాని, "మేము ఇట్లు చేయుచున్నాము" అని చెప్పునవి కావు. కావున నిచ్చటి "అథ" శబ్దమునకు "ఆరంభము" అనునర్థముకూడ సరి కానేరదు. ఆయర్థమును జెప్పినచో "మేము బ్రహ్మవిచారము నారం

---

మనస్సును నిగ్రహించుట శమము; ఇంద్రియనిగ్రహము దమము; బ్రహ్మవిషయమునందుఁ దప్ప నన్యవిషయములయందు సంకల్పములు లేకుండుట యుపరతి; గృహస్థునకు బాహ్యసంకల్పములు లేకుండుట తటస్థింపదు కావున నీయుపరతి సన్న్యాసులకు మాత్రమే కలుగు ననియు, దీనినే యాధారముగాఁ గైకొని "ముముక్షువు అవశ్యముగ సంన్యసింపవలయును" అని సిద్ధాంతము చేయవచ్చు ననియు మహాత్ములు చెప్పుచున్నారు. సంన్యాసికిఁ గూడ నాహారాదివిషయక సంకల్పము లుండినను అవి యత్యంతావశ్యకములు; కావున వానివలన గృహస్థునకు వలెఁ జిత్తవిక్షోభము కలుగదనియు, ఈకారణమువలన పై అభిప్రాయమునకు భంగము రాదనియు వక్కాణించుచున్నారు. వేదాంతవాక్యములయందును గురువాక్యములయందును ఉంచవలసిన నమ్మకమె శ్రద్ధ. శాస్త్రవిచారైకపరాయణుఁడై, శీతోష్ణాదుల లక్ష్యము సేయకుండుట తితిక్ష. సర్వసంకల్పములను విడిచి మనస్సు బ్రహ్మమునందే నిలిచి శాంతి నొందుట సమాధానము.

ఇట్టిసాధనములు గలిగినవానిమనస్సు మోక్షము కలుగునంతవఱకు శ్రమల కోర్చి పని చేయఁగలుగును. ఇదియే ముముక్షుత్వ మనునాల్గవసాధనము. వీనికన్నిటికిని ప్రధానము వైరాగ్యము. అదిలేకుండిన శమాదులు కలుగవు? మోక్షమునందును దృఢానురాగము జనింపదు కదా ?

భించుచున్నాము'' అనియే కదా సూత్రార్థ మేర్పడును. ఇది యుక్తము కాదని ఇదివఱకే నిరూపించియున్నాము. ఇదియునుగాక యీ 'అథ' శబ్దమునకు మంగళార్థముకూడ లేదు. సామాన్యముగ మంగళార్థమై గ్రంథాదులయం దుపయోగింపఁబడు శ్రీకారము మగణము మొద లగునవి వానిస్వాభావికార్థములయందే యుపయోగింపఁబడుచున్నవి; శ్రవణమాత్రముచే మంగళమును గూడ సంపాదించుచున్నవి. కావున నిచ్చటి అథశబ్దమును గూడ మంగళార్థముగ నంగీకరించినను వేఱొక ముఖ్యార్థ ముండియే తీరవలయును.

కావున ''తర్వాత'' అనునర్థ మొక్కటియే ఈ అథశబ్దమునకు కల దనుట పైవిమర్శమువలన సిద్ధాంత మగుచున్నది. అప్పుడు ''దేని కంటె 'తరువాత' బ్రహ్మవిచారమును జేయవలయును'' అనుప్రశ్న మొక్కటి యంకురించును. బ్రహ్మవిచారము సేయఁబోవు సాధకునకు నేవిషయము విచారారంభమునకంటెఁ బూర్వమున నత్యంతావశ్యక ముగనుండవలయునో, ఆవిషయమునే యాప్రశ్నమునకు సమాధాన ముగాఁ జెప్పవలయును.

అట్టివిషయ మేది ? యేది లేకున్న సాధకుఁడు బ్రహ్మవిచార మునుఁ జేయ నర్హుఁడు కానేరఁడు?—

'' ఏకార్యము నాచరింపవలసినను మొట్టమొదట సాధకుఁడు సంపూర్ణవేదాధ్యయనమును జేసి యుండవలయును. కావున బ్రహ్మ విచారాధికారికిఁ గూడ మొట్టమొదట నత్యావశ్యకముగ నుండవలసినది యీ వేదాధ్యయనమే యనకూడదా?'' అనిన నది యుక్తము కాదు. ఈబ్రహ్మవిచారమునకుఁ గూడ నది (వేదాధ్యయము) వలసినదియే. అయినను సర్వసాధారణ మగునది కావున (సర్వవిషయములకును ఆవ శ్యకమయినదియే కావున) విశేషసాధనము (ప్రత్యేకసాధనము) కా నేరదు. ''అత్యంతావశ్య మగువిషయము'' అనఁగ ''దీనికి (బ్రహ్మవిచార మునకు) మాత్రమే యావశ్యకమైయుండి యితరములతో (కర్మ మొదలగు వానితో) నించుకయైనను సంబంధము లేనిది''అనియే కదా యర్థము. కావున నిచ్చటి అథశబ్దమునకు ''వేదాధ్యయనమునకుఁ దరువాత''అని యర్థము చెప్పిన దోష మేమియును లేకున్నను స్వారస్యము లేదు.

ఇట్లైన "కర్మజ్ఞానమునకుఁ దర్వాత" అని యర్థము చెప్పవచ్చును. అప్పు డది ఇతరములతో సంబంధము లేని దగుటచే (బ్రహ్మేతరము లగు కర్మాదులకంటెఁ బూర్వమున నుండునది కాకపోవుటచే) బ్రహ్మవిచారము నకుఁ బ్రత్యేకసాధనమే యగునుకదా?" అనిన నిది బొత్తిగనే అంగీకారార్హము కాదు. కర్మల నెఱింగిన తర్వాతనే బ్రహ్మమును విచారింపవలయు ననునియమము లేదు. సంపూర్ణవేదాధ్యయనము చేసినవాఁడు కర్మకంటె పూర్వముననే బ్రహ్మవిచారము నుపక్రమించిన నుపక్రమింపవచ్చునుకదా! మఱియు జన్మాంతరసంస్కారమువలన బ్రహ్మచర్యాశ్రమమునందుఁ గూడ బ్రహ్మవిచారమునం దిచ్ఛ జనింపవచ్చును. ఆయాశ్రమమునకు కర్మలతో సంబంధము లేదు. వేదాధ్యయన మొక్కటియే యాయాశ్రమమునఁ బ్రధానము. ఇట్లగుటచే "కర్మజ్ఞానము కలిగిననేగాని బ్రహ్మవిచారేచ్ఛ జనింపదు" అను నియమము లేదు. అట్టి ప్రమాణంబును లేదు. కావున నీకర్మజ్ఞానము చిత్తశుద్ధికి సాధనము మాత్ర మగును గాని బ్రహ్మవిచారము సేయువానికి మొట్టమొదట (అనఁగ: విచారారంభమునకు ముందు) ఆవశ్యకముగ నుండవలయు ననునియమము లేదు. (కర్మజ్ఞాన బ్రహ్మవిచారములకుఁ గలభేదము శాస్త్రావతారికయందుఁ గొంత విమర్శింపఁబడియున్నది.) అట్టిపరస్పర భేదము గలవి భిన్నములే కావలయును గాని సాధనసాధ్యభావముతో (కర్మజ్ఞానము సాధనము, బ్రహ్మజ్ఞానముసాధ్యము, అను స్థితితో) నుండవు. సామాన్యముగ సాధనసాధ్యములు సమానప్రయోజనము లైయే (ఒక్కటే ఫలము నిచ్చునవియైయే అందు సాధనము పరంపరగాను సాధ్యము ప్రత్యక్షముగాను ఒకఫలమునే యిచ్చు నని తెలిసికొనవలయును.) యుండవలయు ననుట నియమము కదా!

కావున బ్రహ్మవిచారసాధనమును ప్రత్యేకముగ వెదకి నిర్ణయింపవలయు ననుటయే సిద్ధాంతము. "పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూ స్తస్మా త్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్" "పరమేశ్వరుఁ డింద్రియముల బహిర్ముఖములుగాఁ జేసియున్నాఁడు. కావునఁ బ్రతిపురుషుఁడును వెలుపలికిఁ జూచును గాని లోపలికి బ్రహ్మమును జూడనేరఁడు" అనుశ్రుతి ననుసరించి సర్వజనుల ఇంద్రియములను వానికి నధ్యక్ష మగు మనంబును రాగద్వేషవశగతమై బాహ్యవిషయములయందే ప్రవర్తించు

చున్నవి. ఈప్రవర్తనములకు "ఈపదార్థము సుఖకరమయినది" అను మొదలగు తలంపులే కారణములు. ఆతలంపులును బ్రహ్మమునకంటె భిన్నములై, శబ్దాదివిషయములు నిత్యములై ఆనందకరములైయున్న వనుభ్రాంతిచేఁ గలుగుచున్నవి. కావున "పరబ్రహ్మము నిత్యము. ఈ ప్రపంచము అనిత్యము" అనువివేకము కలిగినచో నాతలంపులు నశించును. ఆతలంపులు నశించినచోఁ జిత్తము పూర్వమువలె బాహ్య విషయముల నభిమానింపదు. "వీనివలనఁ గలుగుసుఖమెంత" యని విషయసుఖమును తృణీకరించును. ఇదియే వైరాగ్యము. ఈవైరాగ్యము వలన శాంతి మొదలగునవి చేకూరును. ఇట్లు చిత్తము నిర్మలమైన నప్పుడు మోక్షేచ్ఛ దృఢ మగును. ఈచెప్పఁబడిన నిత్యానిత్యవస్తువివేకాదులు గలిగినపిదప బ్రహ్మవిచార మొక్కటి మాత్రమే సంభవించును; కాని మఱియేదియుఁ గలుగనేరదు కదా. కావున నీసాధనచతుష్టయము బ్రహ్మ విచారమునకుఁ బ్రత్యేకసాధనము. అథశబ్దమునకును "సాధనచతుష్టయ సంపత్తి కలిగినతర్వాత" అనియే యర్థము చెప్పవలయును.

అతశ్శబ్దార్థవిచారము:—'అతః' అనుశబ్దము 'ఇదం' శబ్దము మీఁద 'తసిల్' ప్రత్యయము చేరుటచేఁ గలిగినది; కారణమును జెప్పును. 'ఇదం' శబ్దమునుండి జనించినది యగుటచే "ఇదమస్తు, సన్నికృష్టం" "ఇదంశబ్దము సమీపమునం దున్నదానినిఁ జెప్పుటకై యుపయోగింపఁ బడును." అనున్యాయము ననుసరించి సమీపమునందున్నవిషయమునే చెప్పుటకు ప్రయోగింపఁబడును. కావున నిచ్చటి 'అతః' శ్శబ్దము 'అథ' శబ్దముచేఁ జెప్పఁబడిన సాధనచతుష్టయసంపత్తినే చెప్పును; కావున దానికి "ఆసాధనచతుష్టయసంపత్తి సంపూర్ణ మగుటవలన" అనియే యర్థము. మఱియు ఆసాధనచతుష్టయము దృఢవైరాగ్యముచేతనే కాని పరిపూర్ణము కాదు. స్వర్గాదిసుఖములఁ గోరుచుఁ బ్రవర్తించువానికి నాసుఖములయం దిచ్ఛ పరిపూర్ణముగ నశించినం గాని వైరాగ్యము దృఢము కాదు. "కర్మఫలములు అనిత్యములు. వానివలనఁ బ్రయోజనము లేదు. ఎట్లైయినను నిత్యఫలమునే సంపాదింపవలయును" అను నిశ్చయము స్థిర మయిననే కాని యాస్వర్గాదులయందలి ఇచ్ఛ తొలంగదు. కావున నీ'అతః'శ్శబ్దము "కర్మఫలము లనిత్యము లని బాగుగఁ దెలియుటవలన" అనునర్థమును సూచించును. అట్లు నిశ్చయించుకొను

టకు కర్మను విధించినవేదమే దానిని నిరాకరించె ననుట ప్రబలకారణము కావున దానిని గూడ ("కర్మను విధించినవేదమే దానిని నిషేధించుటవలన కర్మఫలము లనిత్యము లనినిశ్చయించి" అను విషయమును గూడఁ సూచించును.

బ్రహ్మజిజ్ఞాసాశబ్దార్థవిచారము:—మఱియు "బ్రహ్మణః జిజ్ఞాసా-బ్రహ్మజిజ్ఞాసా"అని షష్ఠీసమాసము. ఇందులషష్ఠి కర్మార్థమునఁ బ్రయోగింపఁబడినది; కాని సంబంధార్థమునఁ గాదు. ఎట్లైనను బ్రహ్మము జిజ్ఞాసకుఁ గర్మయే యయినను కర్మార్థషష్ఠియనిన మిగుల నుచితముగ నుండును. ఏల యనిన: కర్మార్థషష్ఠి "ఈబ్రహ్మము ప్రత్యక్షముగఁ గర్మయే" యనువిషయమును బోధించును. సంబంధషష్ఠి మొట్టమొదట "జిజ్ఞాసా బ్రహ్మలకు నేదియో యొకసంబంధము కలదు" అని చెప్పి పిదప విచారానంతరమున "ఆసంబంధము కర్మత్వమే" అని చెప్పును. కావున రెండును తుద కొకయర్థమునే చెప్పినను ప్రత్యక్షమును విడిచి పరోక్షము నంగీకరించుట యుక్తముకాదు.

"ఇదియునుంగాక, ఈసూత్రమున 'కర్తవ్యా (చేయవలయును), అనుపదము అధ్యాహారముగఁ దెచ్చికొనవలయును. ఇప్పుడు విచారము కొంతకలదు. 'జిజ్ఞాస' యనఁగ 'తెలిసికొనవలయు ననునిచ్ఛ'. ఇచ్ఛ స్వయముగ జనించునదియే కాని చేయంబడునది కాదు. జ్ఞానమును గూర్చి యాలోచించిన నదియుఁ గొంత సందిగ్ధముగ నున్నది. పరబ్రహ్మవిషయక మగు జ్ఞాన మందఱకును గలదు. దానినిః గూర్చి ఇచ్ఛ జనింప నక్కఱలేదు. ఇట్లగుటచే "బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" అనువాక్యమునకు నన్వయ మెట్లును కుదురదు. కావున నిచ్చట నర్థనిర్ణయ మెట్లు చేయవలయుననిన.

సామాన్యముగఁ బదములపైఁ గానవచ్చునర్థములకు సంబంధము కుదురనప్పుడు తాత్పర్యానుకూలముగ నర్థము నూహించుట కలదు. దీనికే లక్షణావృత్తి యని పేరు. ప్రకృతమున నీలక్షణావృత్తిచే "బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" అనువాక్యమునకు నర్థమును నిర్ణయింప వలయును. సామాన్యజ్ఞానవాచక మగు జ్ఞానపదముచే జీవబ్రహ్మైక్యరూప మగు నపరోక్షజ్ఞానమును గ్రహింపవలయును. ఆజ్ఞానపదముపై 'సన్' ప్రత్యయము వచ్చి ఇచ్ఛను తెలియచేయుచున్నది. ఆ 'సన్' ప్రత్యయముచే

నిచ్ఛాసాధ్యమగు విచారమును (ఇచ్ఛ జనించినపిదప చేయందగిన విచారమును) గ్రహింపవలయును. అప్పుడు అన్వయము బాగుగ కలుగును. "పరబ్రహ్మమును అపరోక్షముగ నెఱుంగుటకై విచారమును (వేదాంతవాక్యవిచారమును) చేయవలయును" అనునర్థ మేర్పడును.

పూర్వపక్షము:— ఈ అధికరణమున "పరబ్రహ్మమును విచారింప వలయును" అని నిర్ణయించి యున్నారు. ఎట్లు చూచినను బ్రహ్మవిచారము సంభవింపదు. ఎట్లనిన; బ్రహ్మము ప్రసిద్ధమని చెప్పెదరా? అప్రసిద్ధమని చెప్పెదరా? ప్రసిద్ధమనిన దానిని విచారింపవలసిన పనియే లేదు. అప్రసిద్ధమనినచో, బొత్తిగనే తెలియఁ బడనిదగుటచే దానిని విచారించుటకే వీలులేదు. కావున నెట్లుచూచినను బ్రహ్మము విచారార్హము కాఁదు. కావున నీయధికరణమునందలి సిద్ధాంతము సరియైనది కాదు.

సిద్ధాంతము:— ఈ ఆక్షేపము యుక్తము కాదు. బ్రహ్మము ప్రసిద్ధమే. సామాన్యముగ నహంప్రత్యయార్థ మగుటచే ("నేను" అనుశబ్దమునకు నర్థ మగుటచే) "బ్రహ్మము కలదు" అని యందఱకును తెలిసియున్నను, "బ్రహ్మ మెయ్యది?" అనువిషయమునఁ నెల్లరును ప్రమాదమును జెందుచున్నారు. కొందఱు దేహమే బ్రహ్మమనియు మఱికొందఱు ఇంద్రియము లనియు వేఱొకకొందఱుమన స్సనియుఁ గొందఱు విజ్ఞానమనియుఁ గొందఱు జీవుఁడే యనియు నిట్లు అనేకు లనేకవిధములుగఁ జెప్పుచున్నారు. కావున బ్రహ్మస్వరూపమును నిర్ణయించుటకై విచార మావశ్యకము. విచారింపక యంధప్రాయుఁడై యేదియైన నొకపక్షము నంగీకరించిన నప్పుడు ముక్తి దొరకకపోవుట యేకాక సంసారదుఃఖము మరలమరల వచ్చుచుండును. కావున నీయధికరణమునం దొనర్పఁబడిన సిద్ధాంతమునకు భంగ మేమియు లేదు.

---

## ౨. జన్మాద్యధికరణము.

సంగతి:— "స్వరూపమే లేకపోవుటచే పరబ్రహ్మమును విచారింపవలయుననుట యుక్తముకాదు." అని పైఅధికరణముపై నొక యాక్షేపము కలదు. దీనికి నీయధికరణమున సమాధానము చెప్పఁ

బడును. కావున పయి నుదాహరించినయాక్షేపమే దీనికి పూర్వాధి కరణముతోఁ గలసంబంధము.

సందేహము:— ఇచ్చటఁ గూడఁ బూర్వాధికరణమునందు వలెనే "బ్రహ్మమునకు స్వరూపము లేదు" అని పూర్వపక్షము. "కలదు" అనిసిద్ధాంతము. "స్వరూపమే లేకుండుటచే బ్రహ్మవిచారమువలన ముక్తి లేదు" అనుట పూర్వపక్షమునకుఁ బ్రయోజనము. "స్వరూపముండుటచే బ్రహ్మవిచారమువలన ముక్తి కలదు" అనుట సిద్ధాంతమునకు ఫలము. ఈరెండు పక్షముల నాశ్రయించియే "పరబ్రహ్మమునకు లక్షణము కలదా లేదా?" అనుసంశయ ముదయించును. దానిపై "పరబ్రహ్మమునకు లక్షణము లేదు. "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసంవిశంతి" "ఈ భూతములు దేనినుండి జనించుచున్నవో, ఎచ్చట నిలిచి యున్నవో, నశించినపిదప దేనిఁ జేరుచున్నవో, అదియే బ్రహ్మము" అనుశ్రుతియు బ్రహ్మలక్షణములఁ జెప్పదు. ఏల యనిన: ఆశ్రుతిచేఁ జెప్పఁబడు జన్మాదులు ప్రపంచమునకు సంబంధించినవియే కాని పరబ్రహ్మమునకు సంబంధించినవియే కావు గదా. మఱియు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఉనికియు జ్ఞానంబును బ్రహ్మమునకు రూపములు. మఱియు నాయన యనంతుఁడు" అనుశ్రుతియు బ్రహ్మస్వరూపమును జెప్పదు. ఆసత్యాదిపదములకు నర్థము లగుఉనికి మొదలగునవి లోకము ననుసరించి చూచిన ననేకభేదములు గలవియై యున్నవి. "ఆకాశ మున్నది వాయు వున్నది" అని యునికి పరస్పరభిన్నముగ వ్యవహరింపఁ బడుచున్నది. ఇట్లే "మనుష్యుఁడు చేతనుఁడు. పశువు చేతనము" అని కాని, "మనుష్యుఁడు ప్రకాశించుచున్నాఁడు. పశువు ప్రకాశించుచున్నది అని తోఁచుచున్నది." (అని కాని ప్రకాశరూపమగుజ్ఞానము కూడ) ననేకభేదములతో వ్యవహరింపఁ బడుచున్నది. బ్రహ్మమునకు నిట్టిభేదములు లేవుకదా! కావున నీసత్యాదులు బ్రహ్మలక్షణములు కానేరవు. కావున బ్రహ్మమునకు లక్షణమే లేదు." అని యొకపూర్వపక్ష ముదయించును.

విషయము.—దీనిని నివారించుటకై ఈయధికరణమున "యతో వా ఇమాని....సత్యం జ్ఞానం" అను నిట్టిజాతి గలశ్రుతులయర్థమే విచా

రింపఁబడును. దానిపై— "ప్రపంచమునకుఁ గలయుత్పత్తిస్థితిప్రళయములే బ్రహ్మమునకు లక్షణములు కావు. ఇఁక నేమనిన:—"ఆసృష్ట్యాదులకుఁ గారణ మెద్దియో అదియే బ్రహ్మము" అని తెలిసికొనవలయును. మఱియు సత్యజ్ఞానములు నీవు తలంచినట్లు లోకమున బహుభేదములు కలవిగాఁ గానవచ్చుచున్నను వాస్తవస్థితిలో నవి యఖండార్థమును జెప్పునవియే. పదార్థములకు భేదమున్నను, ఉనికికిని ప్రకాశమునకును భేద ముండదు. అన్నియునుకులు నొక్కటియే; అన్ని ప్రకాశములు నొక్కటియే కదా. కావున నఖండము లగు సత్తాజ్ఞానముల (ఉనికిని ప్రకాశంబును) లక్షణావృత్తిచేఁ జెప్పుచు నీసత్యజ్ఞాన పదములు బ్రహ్మమును బోధించును. ఉనికియు జ్ఞానము ననునీరెండును బ్రహ్మమునకు స్వరూపము లని వివరించును. కావున బ్రహ్మమునకు లక్షణముకలదు." అని సిద్ధాంతము చేయంబడును.

---

## ౨. జన్మాద్యస్య యతః. ౧. ౧. ౨.

తాత్పర్యము—ప్రత్యక్షము మొదలగు సర్వప్రమాణములకును గోచరమగుచు నీప్రపంచము కానవచ్చుచున్నది కదా ? ఇది దేనివలన జనించుచున్నదో యెందు నిలిచియున్నదో నశించినపిదప నెందు లీనమగుచున్నదో అదియే పరబ్రహ్మము. ఈప్రపంచము నానావిధము లగు నామరూపములును దేశకాలాదిబహువిధభేదములును కలిగియున్నది. కర్తలును(కార్యముల నాచరించువారు),భోక్తలును (దానిఫలము ననుభవించువారును) లెక్కకు మిక్కిలిగ నున్నారు. కొందఱు దుఃఖమును మఱికొందఱు సుఖము ననుభవించుచున్నారు. ఇంతయేల? ఈప్రపంచస్థితి మనసునకుఁ గూడ నగోచరమై యున్నది. ఇట్టిదానిని బాగుగ నిర్వహించుచున్నాఁడు కావున నాపరబ్రహ్మము సర్వజ్ఞుఁడుగాను సర్వశక్తియుక్తుఁడుగాను గూడ నుండవలయును. "ఇది కుండ; దీని నిట్లు చేయవలయును"అని తెలిసికొనిననే కాని కుమ్మరి కుండను చేయఁజాలఁడు కదా ! కావున బ్రహ్మము సర్వజ్ఞము.

పూర్వపక్షము:—ఇంతలక్షణము చెప్పనక్కఱలేదు. "ప్రపంచము ఎవ్వనివలనఁ బుట్టుచున్నదో ఆతఁడే బ్రహ్మము" అనినఁ జాలును.

ప్రపంచోత్పత్తికి రెండవకారణము లేదనియే కదా నిూహితము. ఇది యునుగాక—లోకమున "ఉన్నది, పుట్టుచున్నది, వృద్ధిఁ జెందుచున్నది, పరిణమించుచున్నది, క్షీణించుచున్నది, నశించుచున్నది." అను ప్రసిద్ధ వ్యవహారము ననుసరించి చూచిన భావపదార్థములకు ('కలవు' అని చెప్పంబడు పదార్థములకు) వికారము లాఱు కలవు. ఇట్లుండ జన్మాదుల మూఁటినిమాత్రమే గ్రహించితి రేల ?

సిద్ధాంతము:—లోకమున ఉపాదానకారణ మనియు నిమిత్త కారణ మనియుఁ గారణములు రెండు ప్రత్యక్షముగ నున్నవి. ఏకారణము కార్యరూపముగాఁ బరిణమించునో అది యుపాదానకారణము, ఏది నిమిత్తమాత్రమై యుండునో అది నిమిత్తకారణము. కుండకు మట్టి యుపాదానకారణము; కుమ్మరి నిమిత్తకారణము. ఇట్లగుటచేత కార్యములకు నీరెండుకారణములలో దేనివలన నైనను పుట్టుక కలుగవచ్చును కదా! కావున "బ్రహ్మము ప్రపంచమునకు నుపాదానకారణము" అను విషయమును నిరూపించుటకై యట్లు ("బ్రహ్మము ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితిప్రళయములకుఁ గారణము" అని) చెప్పితిమి.

మఱియు పుట్టుట మొదలు నశించుటవఱకుఁ గలవికారము లన్నియు స్థితియందే చేరును. 'ఉండుట, వృద్ధిచెందుట' మొదలగు వికారములు పుట్టినయనంతరమునను, నశించుటకుఁ బూర్వమునను కదా కానవచ్చుచున్నవి; కావున నన్నిటిని జెప్పుట నిరర్థక మని యుత్పత్త్యాదుల మూఁటిని మాత్రమే చెప్పితిమి.

పూర్వపక్షము:—అగునుగాక. ప్రధానము, పరమాణువులు, జీవుఁడు, స్వభావము, మొదలగునవి యనేకము లుండ నీప్రపంచమునకు బ్రహ్మ మొక్కఁడే కారణ మననేల ?

సిద్ధాంతము:—వినుము. ప్రధానాదు లచేతనము లని యాయా శాస్త్రములవారే యంగీకరించియున్నారు. జీవుఁడు చేతనుండైనను సర్వజ్ఞుఁడు కాకపోవుటచే, నానాభేదములు గల ఈప్రపంచమును నిర్మింపఁజాలఁడు. ఇఁక స్వభావమును జూచిన నది యెట్లును బ్రపంచకారణము కానేరదు. ఎట్లనిన:—

"స్వస్యభావః స్వభావః" అను వ్యుత్పత్తిచే స్వభావ మనఁగ నొక పదార్థముయొక్క స్వస్వరూపస్థితి యని యర్థము. "ప్రపంచము స్వభా

నమువలన నుత్పత్తిస్థితివినాశములఁ జెందును." అనిన "ఇది దేని స్వభావమువలన నాజన్మాదులఁ జెందునా? తనయొక్క స్వభావము వలననా? తనకంటె భిన్నమగుపదార్థముయొక్క స్వభావమువలననా?"

ఇందు మొదటిపక్షము నంగీకరించుటకు వీలు లేదు. ఒకవస్తువునకు విరుద్ధధర్మములు స్వభావములుగ నుండవు. అగ్నికి వేఁడిమి చల్లదనము కూడ స్వభావములు కానేర వనుట లోకప్రసిద్ధము గదా. ఇట్లే ఇచ్చటఁ గూడ పరస్పరవిరుద్ధము లగునుత్పత్తివినాశములు ఒక్కపదార్థమునకే (ప్రపంచమునకే) స్వభావము లగు ననుటకు వీలు లేదు. ఈకారణమువలన "ప్రపంచము తనస్వభావమువలనఁ దానే పుట్టును, నశించును" అనుటకు వీలు లేదు కదా!

ఇఁక రెండవపక్షము నంగీకరించిన నప్పుడు మామతమునే ప్రవేశించినవాఁడ వగుదువు. "మఱియొకపదార్థముయొక్క స్వభావమువలన సృష్ట్యాదులు కలుగును" అనినచో నాపదార్థము బ్రహ్మమే కావచ్చును గదా! స్వభావ మనఁగ స్వరూపమే కావున బ్రహ్మస్వభావ మనినను బ్రహ్మస్వరూపమనినను నొక్కటియే కావున నింతమాత్రమున నాబ్రహ్మము సగుణము కానేరదు. మఱియు నీస్వభావమువలన నాకస్మికముగ జనించిన దానికి నిట్టి చక్కని నియమము ఉండుటయే సంభవింపదు. కావున నిట్లు చూచినను సర్వజ్ఞమగు బ్రహ్మమే ప్రపంచకారణము.

పూర్వపక్షము:—ఇట్లైనను ఈరెండవ యధికరణ మీశాస్త్రమున నుండఁతగదు. ఏల యనిన:— ఈశాస్త్రమున ప్రతిసూత్రమునందును వేదాంతవాక్యముల మాత్రమే విచారించెద మని ప్రతిజ్ఞఁ జేసియున్నారు. ప్రస్తుతసూత్రమం దన్ననో అనుమానమును మాత్రమే (ఊహానుమాత్రమే) యుపన్యసించియున్నారు. "యత్కార్యం తత్సకర్తృకం" = "కార్యము (చేయఁబడినపదార్థము, లేక, పుట్టిన పదార్థము) లన్నిటికిని గర్త యొక్కఁ డుండియే తీరవలయును" అను నియమము ననుసరించి "ఈశ్వరుఁడు ప్రపంచమునకుఁ గారణము" అని చెప్పు మతస్థు లందఱు నీయనుమానమునే కదా యాధారము చేసికొనియున్నారు!. "ఈప్రపంచము పుట్టుచున్నది. దీని కవశ్యముగ కర్త యొకఁ డుండవలయును! ఆతఁడే ఈశ్వరుఁడు." అని చెప్పుచున్నారు, మీరు నట్లే చెప్పితిరి. కావున నీప్రతిజ్ఞ భంగ మయ్యెను.

సిద్ధాంతము:—ఇట్లు తలంపవలదు. ఈసూత్రమున "యతో వాచో", "సత్యం జ్ఞానం" అను మొదలగుజాతి గల శ్రుతులే విమర్శింపఁ బడియున్నవి. దీనికి ననుమానోపన్యాసమునం దుద్దేశము లేదు. ఆయుద్దేశము కలదు అనినను బాధకము లేదు. శ్రుతియందు నిరూపింపఁబడిన యర్థము దృఢముగ నిశ్చిత మగుటకై యనుమానముకూడ మాకు నంగీకారార్హమే. పూర్వమీమాంసకులవలె వేదాంతశాస్త్రమునకు వేద మొక్కటిమాత్రమే ప్రమాణ మనియు ప్రత్యక్షాదులు కావనియు లేదు. ఈశాస్త్రము నిత్యసిద్ధ (విచారించినను విచారింపకున్నను సర్వకాలములయందు నేకరూపముతో నుండునట్టిది)మగుపదార్థమునుగూర్చి చెప్పునదియే కావున దీనికి ననుభవములు (ప్రత్యక్షము మొదలగునవి) కూడ ప్రమాణములై తీరవలయును. పూర్వమీమాంస యిట్టిది కాదు. అది ఇఁక నెప్పటికో కలుగఁబోవు పదార్థమును గూర్చి చెప్పును. శాస్త్రజ్ఞానమువలన "ఈకర్మము నిట్లు చేయవలయును" అని నిశ్చయించిన పిదప "కర్మము నాచరింపవలయును", అను నిచ్ఛ జనించును. పిదప నాకర్మము నాచరింతురు. కావున పూర్వమీమాంసయందుఁ జెప్పఁబడుకర్మము భవిష్యత్కాలమున జనింపఁబోవునదియే కదా? ఇట్లగుటచే దానిని గూర్చిన యనుభవము లుండుటకు వీలు లేదు. కావున పూర్వమీమాంసకు ననుభవములు ప్రమాణము లగుటకును వీలు లేదు. కావున వేదాంత శాస్త్రమర్యాద ననుసరించి చూచిన మాకు ప్రతిజ్ఞాభంగము లేదు.

"బ్రహ్మము సర్వకాలములయందు నేకరీతిగ నున్నదనుటయు విరుద్ధమే. అట్లుండిన నింద్రియములకుఁ గానరాదా?" అనియెదవేమో అది యుక్తముగాదు. "పరాంచిఖాని," అను మొదలగుశ్రుతి ననుసరించియు ననుభవమును బట్టియుఁ జూచిన నింద్రియములు బాహ్యవిషయములఁ జూడఁగలవు గాని యంతరాత్మను జూడనేరవు. మఱియు నాబ్రహ్మ మింద్రియగోచరమే యగునేని, "ఈమహాత్ముఁడు ప్రపంచమునకుఁ గర్త" అని ప్రమాణము ననుసరించియే నిరూపించుటకు వీలు గలుగుచుండ నితరమతస్థులుగూడ సంశయాస్పద మగునసుమాన ప్రమాణము నాశ్రయింపనేటికి? కావున బ్రహ్మము స్వతసిద్ధమైనను ఇంద్రియగోచరము కాదు. ఇంతమాత్రమువలన స్వతస్సిద్ధికి భంగంబును రాదు.

 

విశేషించి యాయన ఇంద్రియగోచరుఁడైనచో స్వతస్సిద్ధుఁడగుటకే వీలులేదు. ఇంద్రియములకుఁ దోఁచుపదార్థము లన్నియు నుత్పత్తిస్థితి వినాశములు కలవియే కదా !

కావున నెట్లుచూచినను ఈ అధికరణమునందుఁ జేయఁబడిన సిద్ధాంతమునకు హాని లేదు.



# ౩. శాస్త్రయోనిత్వాధికరణము.

## ప్రథమవర్ణకము.

సంగతి:—పై అధికరణమునందుఁ బరబ్రహ్మము ప్రపంచమునకు గారణ మనియు అట్లగుటచేత నది సర్వజ్ఞమని నిర్ణయింపవలసియున్న దనియు సిద్ధాంతము చేయఁబడియున్నది. సర్వజ్ఞము కానివస్తు విట్టి ప్రపంచమును సృజించెననుటయు సంభవింపదు. అయినను బరబ్రహ్మ మునుమాత్రము సర్వజ్ఞమనుటకు నాధారము లేదు. ఈవిషయమున నిర్ణయమెట్లు? అనునాక్షేప మొక్కటి పయిసిద్ధాంతముపైఁ గలుగును. దీనిని నివారించుటకే యీయధికరణ మారంభింపంబడినది.

సందేహము —ఇట్లగుటచే "బ్రహ్మము సర్వజ్ఞము కాదు"అను పూర్వపక్షంబును సిద్ధాంతంబును ఇందు విచారణీయములు. "బ్రహ్మము సర్వజ్ఞము గాదేని యప్పుడు ప్రపంచ సృష్టికర్త యగుటకు వీలు లేదు. అట్లైన దాని విచార్థించుటయు సంభవింపనేరదు" అనునది పూర్వపక్షఫలము. "బ్రహ్మము సర్వజ్ఞము కావున నన్నియు సంభవించును" అనునది సిద్ధాంతమునకు ఫలము.

ఈ రెండుపక్షముల నాశ్రయించియే సాధనకు నీక్రింధివిధమున సంశయము జనించును.

లోకమున వేద మొక్కటి మాత్రమే సర్వవిద్యలకు నాధారభూతమై "వీనినుండి జనించెను" అని నిర్ణయించుటకు వీలులేనిదై యున్నది. ఈపరబ్రహ్మము దానికిఁ గర్త యగునేని యప్పుడు సర్వజ్ఞుఁడు కావచ్చును; ప్రపంచస్రష్టయు విచారణీయుఁడును కావచ్చును; కాని అట్టి నిర్ణయమునకు నాధారము లేదు. "వాచా విరూప నిత్యయా" "అనాది

నిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా, ఆదౌ వేదమయీ"—
"విరూపుఁడనువేరుగల యో దేవతా! నీవు శాశ్వత మగు వాక్కుచేఁ(వేద
ముచే) నాచేత స్తోత్రము చేయించుకొనుము." "ఉత్పత్తివినాశములు
లేనట్టియు శాశ్వతమైనట్టియు వేదరూప మగువాక్కును బ్రహ్మదేవుఁడు
మొట్టమొదట లోకమునకుఁ దెలిపెను" అనుశ్రుతిస్మృతులు "వేదము
నిత్యము" అని చాటిచెప్పుచున్నవి. నిత్య మగుదానికిఁ గర్త కలఁడనుట
యసంభవము కదా! ఆబ్రహ్మము వేదకర్త కాదేని యప్పుడు ప్రపంచ
కారణము కూడఁ గానేరదు కదా! ఇఁక నీబ్రహ్మము విచారణీయ
మగుట యెట్లు ?

విషయము:—ఈసందేహమును నివారించుచు నీయధికరణమున
"అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతద్య దృగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషద
స్సూత్రాణీతి"—"ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వణ
వేదము వానియర్థమును ప్రకటించునట్టి యితిహాసములు పురాణములు
శిక్షావ్యాకరణాదివిద్యలు ఉపనిషత్తులు సూత్రములు అనునివి యన్నియు
సర్వజ్ఞుఁడగు నాపరమాత్మునియొక్క నిశ్వాసములే.(అనఁగ: పురుషుఁడు
నిట్టూర్పు విడిచినంతే సుకరముగ బ్రహ్మము వేదముల స్మరించెను.) అను
నిట్టిజాతి గలవేదవాక్యములను సూత్రకారుఁడు విచారించుచున్నాఁడు.

---

## 3. శాస్త్రయోనిత్వాత్. ౧. ౧. 3.

(శాస్త్రస్య యోనిః, శాస్త్రయోనిః—శాస్త్రమునకుఁ గారణ
భూతుఁడు (అనఁగ: శాస్త్రమును నిర్మించినవాఁడు) అను షష్ఠీసమా
సము నాశ్రయించి ఈసూత్రమునకు నర్థము చెప్పఁబడుచున్నది.)

తాత్పర్యము :—"అస్య మహతో భూతస్య" అను మొదలగు
ననేకశ్రుతులయందు వేదమును బ్రహ్మమే కల్పించెను" అని వివరింపఁబడి
యున్నది. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము,
కల్పము, పూర్వోత్తర మీమాంసలు, ధర్మశాస్త్రము, న్యాయశాస్త్రము
మొదలగు సర్వశాస్త్రములకును వేదమే యాధారము. అన్నియు వేద
మునుండి యే[illegible]మై సర్వజ్ఞ

మనఁదగిన వేదమును కల్పించినవాఁడు అల్పజ్ఞుఁడు కానేర్చునా? ఎప్పటికిని గానేరఁడు. లోకమున గ్రంథమునందలి విషయములకంటె నధిక విషయములు దెలిసియుండుననుట యనుభవసిద్ధమైయున్నది. ఈకారణమువలన వేదములను రచించిన పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడై తీరవలయును. కావున జగత్కర్తయు నీయనయే.

పూర్వపక్షము:— ఇట్లైన "వేదములు నిత్యములు" అని చెప్పు "వాచా విరూప నిత్యయా" "అనాదినిధనా నిత్యా" అను మొదలగు శ్రుతిస్మృతులకు నర్థమేమి.? ఒకనిచేఁ గల్పింపఁబడినవి నిత్యములు కానేరవుకదా ?

సిద్ధాంతము:— "వేదము నిత్యము" అనుటవలన నీకు నభిప్రాయ మేమి ? ప్రళయకాలమునందుఁగూడ సర్వజంతువులు నశించినను, ఈవేద మిట్లే యుండుననియా ?, లేక, ఈవేదమునఁ జేయఁబడిన సిద్ధాంతములు ఎప్పటికిని (అనఁగఁ, ప్రతికల్పమునందును) ఏకరూపములై యుండుననియా ?

ఇందు మొదటిపక్షము సరికాదు. అక్షరపంక్తియే స్వరూపముగాఁగలయీ వేదము పఠించువా రుండునంతవఱకు నిలచి యుండవచ్చునే కాని అందఱును నశించినపిదపఁ గూడ నుండుటకు వీలు లేదు కదా ?

ఇఁక రెండవపక్షము సంగీకరింతువేని అది మాకు సమ్మతమే. వేదమునందలిసిద్ధాంతములు ప్రతికల్పమునందును ఒక్కతీరున నేయుండు ననుటకు సంశయము లేదు. ఈయభిప్రాయము నవలంబించియే పయి నుదహరింపఁబడిన "వాచా విరూప" అనునవి మొదలగు శ్రుతిస్మృతులు "వేదవాక్యములు నిత్యములు" అని స్తుతిఁ జేయుచున్నవి. కావున నావాక్యము లర్థవాదములు. వీనికి వేదప్రశస్తిని బోధించుటయే పని గాని తాముచెప్పినవిషయమును సత్యము చేసికొనుట పని గాదు. *అర్థవాదములన్నియు నిట్టివేకదా. కావున వేదము నిత్యంబును కావచ్చును; పరమేశ్వరుఁడు దానికిఁ గర్తయుఁ గావచ్చును.

పూర్వపక్షము:—ఇట్లైన వేదము పౌరుషేయ మగును. అప్పుడు దీనియందలి విషయములు ప్రామాణికములు కాకపోవలసివచ్చును.

* తాత్పర్యలింగములను వివరించిన (44. పు) చోట చూచునది.

స్వభావసిద్ధమైనపదార్థ మగునేని యప్పుడు దోషములేవియు నుండవు; కాని ఒకనిచేఁ గల్పింపఁబడిన దగునేని యప్పుడు అది నిర్దోషము కానేరదు కదా ? లోకమునందలి సామాన్యగ్రంథములవలెనే ఈ వేదముకూడ నొకనిచే కల్పింపఁబడిన దగునేని భ్రమప్రమాదదోష యుక్తముగ భావింపఁబడి యప్రమాణముగ నెన్నఁబడవలసివచ్చును. ఇది సమ్మతము కాదుగదా!

సిద్ధాంతము:—ఇచ్చట నీయభిప్రాయమేమి? వేదమునందు అచ్చటచ్చట ప్రతిమంత్రమునందును కొన్నికొన్ని ఋషినామములు వినవచ్చుచుండుటచే (అనఁగ : ఆమంత్రకర్తలుగ కొందఱు కొందఱు ఋషులు పేర్కొనఁబడుచుండుటచే) వారే యామంత్రములను గల్పించిరనియా? లేక, పరమేశ్వరుఁడే కల్పించెననియా ? ఆపరమేశ్వరుఁడైనను "ఈయర్థమున నీవాక్యమును రచింతునుగాక" అని సంకల్పించి తదనుగుణముగ వేదరూపగ్రంథమును నిర్మించెననియా? లేక, మఱియొకవిధముగ నిర్మించెననియా?.

ఇందు మొట్టమొదటి పక్షము సరికాదు. ఆఋషులు తపఃప్రభావమువలన నాయామంత్రముల నాయానియమముల నాయారహస్యార్థములఁ దెలిసికొనిన వారలే కాని కల్పించినవారలు కారు. ప్రస్తుతము పాశ్చాత్యులు ఆయాపదార్థములయందుఁ గలవిచిత్రసామర్థ్యములను బుద్ధిబలముచే గ్రహించిరి. ఆసామర్థ్యములను వీరు కల్పించిన వారగుదురా? గ్రహించినను గ్రహింపకున్నను ఆపదార్థములయం దాసామర్థ్యములు ఎప్పటికిని ఉన్నవేకాని ఇప్పుడు క్రొత్తగావచ్చినవికావుగదా? ఇట్లే వేదములయందలి సిద్ధాంతములు ఆయామునులచే నప్పుడప్పుడు కనిపట్టఁబడినవైనను వారిచే కల్పింపఁబడినవి మాత్రము కానేరవు. కావున మునులు వేదములకు కర్తలు కారు ; వారిభ్రమప్రమాదాదులతో వేదమునకు సంబంధము లేదు.

ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నది మాకు సమ్మతమే కాని అందును పక్షద్వయము చూపఁబడియున్నది. వానిలో దేని నంగీకరింతువు?.

"ఇచ్ఛాపూర్వకముగ పరమేశ్వరుఁడు వేదమును నిర్మించెను" అందువేని అదిసరియే: ఆపరబ్రహ్మము నిర్వికారమైనను విచిత్రశక్తిమతి.

యగుమాయతోఁ గూడినది; కావున ప్రపంచమును కల్పించినట్లే ఈ వేదమునుగూడఁ గల్పించినది. ఆపరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు కావున నా యనకు భ్రమప్రమాదాదిదోషములు కలుఁగనేరవు. వేదసిద్ధాంతము లన్నియు నిర్వివాదములే.

అయిన నొక్కవిశేషము కలదు. ప్రపంచమునకువలె నీవేదమున కును "ఆరంభమిప్పుడు" అని నిర్ణయించుటకు వీలులేదు. ప్రపంచము నందుఁ జేరినదియే కావున నీవేదముకూడ అనాది. ఇట్లగుటచేత పూర్వ కల్పానుసారముగ మాయాసహితుఁ డగుపరమేశ్వరుఁడు ఈవేదమును (అనఁగ : వేదసిద్ధాంతములను, ఆసిద్ధాంతములను ప్రతిపాదించు పద ములను) స్మరించుచున్నాఁ డని మాత్రమే చెప్పవలయును. "బ్రహ్మ వేదమును చేయుచున్నాఁడు" అనుటకు నిదియేయభిప్రాయము. లోకము నఁగూడ నిట్టివ్యవహార మనుభవములో నున్నది. ఒకపురుషుఁడు ఒకశా స్త్రము నభ్యసించి ముగించినపిదప మఱియొకసమయమున నెవ్వఁ డైనను ఆశాస్త్రవిషయములలో నేదియైన నొకదానినిగూర్చి పూర్వపక్ష ముచేసిన నాపురుషుఁడు సిద్ధాంతముచేయును. ఇందు వాఁడు క్రొత్తగాఁ గాని స్వయముగాఁ గాని యాచరించినపని యేది కలదు ? వెనుక నభ్య సించియున్న శాస్త్రార్థముల స్మరించుట మాత్రమేకదా! ఇట్లైనను "వీఁడు సిద్ధాంతమును చేయుచున్నాఁడు" అని వ్యవహారము కలదు. కావున బ్రహ్మ వేదమును స్మరించుచుమాత్రమే యుండువాఁడైనను "వేదమును చేయుచున్నాఁడు"అని వ్యవహరింపఁబడుచున్నది. ఇట్లగుటవలన రెండవ పక్షమును (పరమేశ్వరుఁడు ఇచ్ఛాపూర్వకముగాఁ గాక, యేదియోయొక విధముగ వేదమును సృజించెను" అనుపక్షమును) ఆశ్రయించినను దో షములేదు. స్మరింపఁబడినది కార్యము కానేరదుకద!.

ఈకారణమువలన నెట్లు చూచినను వేదమునకు పరమేశ్వరుఁడే కర్త. "స్మరించువాఁడు" అని మాత్రమే చెప్పితివిగదా యందువేమో, పరబ్రహ్మమునందు సర్వమును ఉపాధికృతమే కావున లోకవ్యవహారము ననుసరించి కర్తయనియే చెప్పవచ్చును. స్మరించువానికిఁ గూడఁ గర్త యను వ్యవహారము కలదని చెప్పితినిగదా! కావున వేదకర్త యగుటచే నీపరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు; ఇట్టివాఁడగుటచే నీయనయే ప్రపంచకారణ

ణము; విచారణీయుఁడు. ఇదియే సిద్ధాంతము. మొట్టమొదట తాఁజెప్ప వలసినయర్థము నొకదానిని నిర్ణయించి తదనుసారముగ పదములను గూర్చి గ్రంథము రచియింపఁబడెనేని యది పౌరుషేయ మగును గాని శబ్దార్థముల నొక్కమాత్రే స్మరించుటచే నిచ్చట వేదము పౌరుషేయము కానేరదు.

---

# 3. శాస్త్రయోనిత్వాధికరణము.

## ద్వితీయవర్ణకము.

సంగతి:—పైయధికరణమునందు బ్రహ్మమునకు లక్షణము చెప్పఁబడియున్నది. "ఈబ్రహ్మమును గ్రహించుటకు *ప్రత్యక్షాదులలో నేప్రమాణము సాధనమగును? అన్నియును సాధనములేనా? లేక, వానిలో

---

* ప్రత్యక్షము అనుమానము ఉపమానము శబ్దము అర్థాపత్తి అనుపలబ్ధి అని వేదాంతమతస్థు లంగీకరించిన ప్రమాణము లాఱు. ఇతరు లగుపౌరాణికాదులు ఐతిహ్యము భావికము అని మఱిరెండు ప్రమాణములను కూడ నంగీకరించిరి.

ప్రత్యక్షము—ఇంద్రియములచే విషయములఁ దెలిసికొనుట. ఇది యొక్కటియే ప్రమాణము (విశ్వాసయోగ్యము) అని చార్వాకులు (నాస్తికులు) చెప్పుదురు.

అనుమానము—ఒకగుఱుతునుబట్టి యొకపదార్థముయొక్క యునికి నూహించుట. పొగను చూచియాస్థలమున నగ్ని కలదని నిర్ణయించుట. ప్రత్యక్షముతోఁ గూడ నిదియుఁ బ్రమాణ మని వైశేషికులు (కాణాదమతస్థులు) పలుకుదురు.

ఉపమానము—తా నెఱింగినయొకపదార్థముయొక్క పోలికను బట్టి మఱియొక దాని గ్రహించుట. ఆవును తెలిసియుండుటచే ఆజ్ఞానబలమున దానివంటిగవయమృగమును తెలిసికొనుట.

శబ్దము—యథార్థవాది యన సుప్రసిద్ధుఁడగువాఁడు గాని ఆప్తశాస్త్రము గాని చెప్పువాక్యము. ఈయుపమానశబ్దములు రెండును గూడ బ్రమాణములే యని నైయాయికులు (గౌతమమతస్థులు) చెప్పుదురు.

అర్థాపత్తి—తాఁ జూచుకార్యమునకు కారణము లేకున్నచో (అనఁగా: గానరాకున్న) దాని ననుభవానుసారముగ నూహించుట. "ఈమనుష్యుఁడు గ్రామముననే యు

నేదియైన నొక్కటిమాత్రమే సాధనమా?" అనువిషయమును నిర్ణయించుటకై యీయధికరణ మారంభింపఁబడెను. పైయధికరణంబును ప్రస్తుతాధికరణంబునుగూడ పరబ్రహ్మమును నిర్ణయించుటయందే ప్రవర్తించునవి యగుటచేత నీరెంటికిని పరస్పరసంబంధము. రెంటికిని ఫల మొక్కటియే కదా!

సందేహము:—ఈబ్రహ్మము "అంకురాదికం సకర్తృకం; కార్యత్వాత్; ఘటవత్"—"కార్యములే యగుటవలన కుండలు మొదలగు వానికివలె మొలకలు మొదలగువానికిఁగూడ కర్త యొకఁ డుండవలయును అను ననుమానప్రమాణమునకే గోచరమగును." అనునది పూర్వపక్షము. "ఆయన వేదాంతవాక్యములకుమాత్రమే గోచరుఁడగును"అనుట సిద్ధాంతము. "అనుమాన ప్రమాణమునందలి గుణదోషములనే యీశాస్త్రమున విచారింపవలయును" అనునది పూర్వపక్షమునకు ఫలము. "వేదాంతవాక్యములను మాత్రమే విచారింపవలయును" అనునది సిద్ధాంతమునకు ఫలము.

ఈరెండుపక్షముల నవలంబించియే యీక్రిందివిధముగ సందేహము జనించును:—

పరబ్రహ్మము అనాదినుండియు విచారించినను విచారింపకున్నను ఏకరూపముతో నుండువస్తువు. ఇట్లగుటచే నది సర్వప్రమాణంబులకును గోచరముకావచ్చును. వేదమునకు మాత్రమే గోచరము కావలయు

---

న్నాఁడు; కాని ఇంటియందు మాత్రము లేఁడు" అనిన "కార్యార్థముగ వెలికిఁ బోయియుండును" అని యూహించుట. దీనిఁ గూడఁ బ్రమాణముగ నంగీకరింపవలయు నని మీమాంసకు లనుచున్నారు. (మీమాంసకు లనఁగా పూర్వమీమాంసామతము నవలంబించినవారు) "ఇది యనుమానములోనే చేరిపోవును" అని వైశేషికులనుచున్నారు.

అనుపలబ్ధి — ఒకపదార్థ మింద్రియములకు గోచరము కాకుండిన "ఇది కానరాలేదు కావున లేదు" అని యభావమును నిర్ణయించుట. ఇది ప్రత్యేకప్రమాణ మని వేదాంతులును, ప్రత్యక్షములో నంతర్భావము నొందు నని వైశేషికులును జెప్పుదురు.

ఐతిహ్యము — చరిత్ర. భావికము—"ఇది కలుగవచ్చును" అని తగినంతబలవంతమైనకారణములేకయే చేయఁబడు నూహచే ఈరెండునుగూడఁ బ్రమాణము లని పౌరాణికులు వచింతురు. ఇవి దుర్బలము లని ఇతరులయభిప్రాయము. దీనియందు భ్రమప్రమాదాదిదోషము లనేకము లుండవచ్చును కదా!

ననునియమము లేదు. పూర్వాధికరణమునందును అనుమానప్రమాణము అంగీకరింపఁబడియున్నది. కావున నీశాస్త్రమున వేదాంతవాక్యములను మాత్రమే విచారింపవలయు నను నియమము లేదు.

విషయము:—ఈ అధికరణమున "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" "ఉపనిషద్వాక్యములచేత మాత్రమే వర్ణింపఁబడునాపురుషునిఁగూర్చి నిన్నడుగుచున్నాను" అను నిట్టిజాతిగల వేదాంతవాక్యముల సహాయము నవలంబించి ఈసంశయము నివారింపఁబడుచున్నది. "పరమేశ్వరుఁడు స్వతస్సిద్ధుఁ డగుట (ఎప్పటికి నేకరూపముతో నుండువాఁడగుట) నిశ్చయమే యైనను ఆయనకు శబ్దస్పర్శాదిగుణములలో నొక్కటియైనను లేదు కావున ప్రత్యక్షప్రమాణముచే నాయనను గ్రహింపలేము. ఆయనకంటె నన్యమగుపదార్థ మేదియు లేదు. కావున వ్యాప్తిజ్ఞానము గలుగుటకు వీలు లేదు. * వ్యాప్తిజ్ఞానము లేకున్న ననుమానము ప్రవర్తింపలేదుకదా! ఇట్లే సాటిలేకపోవుటచే నుపమానంబును, గుణము క్రియ మొదలగునవి లేకుండుటచే శబ్దప్రమాణంబును గూడ నాయనను నిరూపింపనేరవు. ఇట్లు సర్వప్రమాణములును సమానము లేయైయున్నను శబ్దప్రమాణమునందుమాత్రము (వేదమునందుమాత్రము) ఒకవిశేషసామర్థ్యము కలదు. ప్రత్యక్షముగ "ఈబ్రహ్మ మీగుణము కలది. ఈపని చేయునది" అని చెప్పుటకు వీలు లేకున్నను నిషేధముఖముగ నైన ("ఈబ్రహ్మమునకు గుణము లేదు. కర్మ లేదు." అని యైనను) వాక్యములచేతఁ గొంతవఱకు వస్తునిరూపణఁ జేయవచ్చును గాని ప్రత్యక్షాదులచే నట్లు నిరూపించుటకు నించుక యైన నవకాశము లేదు

---

* అనుమానప్రమాణస్వరూపము ఇంతకుముందే (39. పు) వివరింపఁబడియున్నది. అందు ఒకగుఱుతునుబట్టి యొకపదార్థ మూహింపఁబడును. ఆగుఱుతునకును పదార్థమునకును నిత్యసంబంధము లేకుండిన నిట్టియూహకు నవకాశము కలుగుటకు వీలు లేదు. ఆగుఱుతు ఏయేస్థలములయందు ఉండునో ఆస్థలములయందెల్ల నాపదార్థము నిత్యముగ నుండితీరవలయును. పొగయున్నచోట నెల్ల నగ్ని యుండు ననుట నియతము. కావుననే పురుషుఁడు "పొగ ఇచ్చట నున్నది కావున నగ్నియు నుండవలయును" అని నిర్ణయింపఁగలుగుచున్నాఁడు. ఇట్లు గుఱుతునకును (లింగమునకును) పదార్థమునకును గలసంబంధమునకే వ్యాప్తి యని పేరు.

కదా! కావున నీబ్రహ్మమును నిరూపించునది వేద మొక్కటియే.'' అను విషయ మిందు సిద్ధాంతము చేయఁబడుచున్నది.

---

## ౩. శాస్త్రయోనిత్వాత్. ౧. ౧. ౩

(ఈ ద్వితీయవర్ణకమునందు ''శాస్త్రం యోనిః యస్య తత్ = శాస్త్రయోనిః''= ''శాస్త్రమనఁగ వేదము. అదియే ప్రమాణముగాఁ గలది'' అను బహువ్రీహిసమాసము నాశ్రయించి సూత్రమున కర్థము చెప్పఁబడుచున్నది.)

తాత్పర్యము:— ''తం త్వౌపనిషదం'' అనుమొదలగుశ్రుతి ''బ్రహ్మము వేదమునకుమాత్రమే గోచరము''అనువిషయమును స్పష్టము చేయుచున్నది. ఈశ్రుతిబలమువలన నిశ్చయముగ బ్రహ్మము నెఱుంగుటకు నితరప్రమాణములు లేవని చెప్పవలయును. ప్రత్యక్షాదు లన్నియు వానివానికి నావశ్యకము లైన రూపాదులు కలపదార్థమును గూర్చియే ప్రవర్తించును. శబ్ద మట్లుగాక తనకావశ్యకము లగుగుణక్రియాదు లున్నను లేకున్నను ప్రవర్తించునుగదా!

పూర్వపక్షము:—''యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ''—''వాక్కుగాని మనస్సు గాని ఎవ్వనిచెంతకుఁ బోలేక మరలునో అట్టివాఁడె పరమేశ్వరుఁడు''అను నిట్టిజాతిగలయనేకశ్రుతులు''బ్రహ్మము అవాఙ్మానసగోచరము''అని చెప్పుచున్నవి. వేదము వాగ్రూపమే యగుటచే పైశ్రుతి ననుసరించి చూచిన పరబ్రహ్మమును నిరూపించుననుటకు వీలు లేదుకదా! ఇట్లైన నీసిద్ధాంత మెట్లునిలుచును?

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరికాదు. వినుము. ''పరమేశ్వరుఁడు కలఁడా లేఁడా'' అనువిషయము మాత్రమే ప్రస్తుతము విచారింపఁబడుచున్నది. ఈవిషయమున వేదము ప్రమాణము కాకపోదు. అట్లు చెప్పుటకును వీలు లేదు. ఇఁక శ్రుతి కభిప్రాయ మే మనిన:—

పరబ్రహ్మమునకు గుణము మొదలగునవి లేవు. దానిస్వరూపము నిర్మలజ్ఞానమే. ఇట్లగుటచేత దానిని గూర్చి వేదము వివరింపలేదు.

జ్ఞానము సర్వమును గ్రహించునది యై యుండ దానిరూపమును గుఱు
తెఱుఁగుటకు మఱియొక్కటి దోఁచు ననుట యసంభవముకదా! మనచేఁ
జూడఁబడు స్తంభకుడ్యాదులు మనలఁ జూడఁగలుఁగుచున్నవా? ఈకార
ణమువలన "వేదము బ్రహ్మస్వరూపమును గూర్చి వివరింపనేరదు"
అనుటయే "యతో వాచో నివర్తంతే" అను మొదలగుశ్రుతులకు నభి
ప్రాయము. ఇట్లగుటచేత "తం త్వౌపనిషదం పురుషం" "యతో వాచో"
అను నిట్టిజాతి గలశ్రుతులకుఁ బరస్పరవిరోధము లేదు. "సత్యం జ్ఞానం"
అనుమొదలగుశ్రుతులును లోకమునం దనుభవములో నున్న సత్తను
("ఆకాశము కలదు, వాయువు కలదు" అని వ్యవహరింపంబడుచున్న
కలిమిని)జ్ఞానంబును ఆనందంబును అవలంబించి వానియుదాహరణముచే
"బ్రహ్మస్వరూప మిట్టిది యని స్వానుభవముతో నెఱుంగుఁడు (అనుభ
వింపుఁడు)" అని చేచాయగా బ్రహ్మరూపమును చూపుచున్నవి కాని
ప్రత్యక్షముగఁ జూపుట లేదు.

పూర్వపక్షము:—ఇట్లైన నీవిషయము పై సూత్రమునందే వివ
రింపఁబడియున్నది. దీనికై రెండవయధికరణమేల? మఱియు పూర్వాధి
కరణమునందు అనుమానప్రమాణమును గూడ నంగీకరించియే
యున్నారు. "ఇప్పుడుమాత్రము అది కార్యసాధకము కాదు" అనుచు
న్నారు. ఇది యెట్లు?

సిద్ధాంతము:—నీవనినది సత్యమే; అయినను పూర్వాధికర
ణమునందు "బ్రహ్మమునకు శాస్త్రమొక్కటియే ప్రమాణము" అను
విషయము సూత్రాక్షరములచేతనే స్పష్టముగఁ జెప్పఁబడి యుండలేదు.
ఇట్లగుటచే శాస్త్రవిచారము చేయువారికి నాసూత్రమువలన "బ్రహ్మ
జ్ఞానమునకు అనుమానముకూడ సాధక మగును" అని సంశయము తోఁ
చును. దానిని నివారించుటకై ఈరెండవయధికరణ మారంభింపఁబడెను.
మఱియు అనుమానము పరబ్రహ్మము కల దనువిషయమును స్వతంత్ర
ముగఁ జెప్పనేరదు. కావున నీయధికరణమునందు దానిని నిరాకరించి
తిమి. ఈవిషయమునుగూర్చి మొట్టమొదటనే (మూఁడవఅధికరణము,
రెండవవర్ణకము. విషయమున) వివరించి యున్నాము. ఇట్లైనను విచార
మునకు మాత్రము పనికివచ్చును గావున దానిని (అనుమానప్రమాణ

మును) తక్కినయన్నిప్రమాణములతోఁ గూడ పైయధికరణమునందు అంగీకరించి యున్నాము; ఇప్పటికిని అంగీకరించుచునే యున్నాము. కావున నెట్లు చూచినను బ్రహ్మజ్ఞానము కోరువాఁడు వేదాంతవాక్యములనే విచారింపవలయును.

---

# ౪. సమన్వయాధికరణము.

## ప్రథమ వర్ణకము.

సంగతి :—పయి అధికరణమునందు రెండవవర్ణకమున "బ్రహ్మమును తెలిసికొనుటకు వేదములు మాత్రమే సాధనములు." అని వినరింపఁబడియున్నది. దానిపై "వేదములు బ్రహ్మమును తెలుపనేరవు. పూర్వమీమాంసాశాస్త్రసిద్ధాంతము ననుసరించి వేదములు కర్మను చెప్పునవియే కావలయును" అనునాక్షేపము వచ్చును. దీనికి సమాధానము చెప్పుటకై ఈయధికరణ మారంభింపంబడినది.

సందేహము :—ఇందు "ఉపనిషత్తులు బ్రహ్మమును చెప్పవు. బ్రహ్మమునే చెప్పును" అనునవి క్రమముగ పూర్వపక్షసిద్ధాంతములు. "ఉపనిషత్తులు బ్రహ్మముచు చెప్పకపోవుటచే మోక్షేచ్ఛ గలవాగు ఉపనిషద్విచారమును జేయ నక్కఱ లేదు." అనునది పూర్వపక్షఫలము. "ఉపనిషత్తులు బ్రహ్మబోధకములే కావున మోక్షేచ్ఛ గలవాఁడు వానినవశ్యము విచారింపవలయును" అని నిర్ణయించుట సిద్ధాంతమునకు ఫలము.

ఈ రెండుపక్షముల నాశ్రయించి ఈసంశయము గలుగును :—

ఈవేదాంతములు పరబ్రహ్మమును చెప్పుననుటకు వీలులేదు. పూర్వ మీమాంసాశాస్త్రమునందు "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్య మతదర్థానాం" = "వేద మంతయును కర్మకొఱకే చెప్పఁబడినది. కావున కర్మను విధింపనివాక్యము లన్నియు నిరర్థకములు" అని చెప్పఁబడియున్నది. కావున నీవేదాంతవాక్యములు కర్మకు సంబంధించినవి కాకపోయెనేని నిరర్థకములు కావలయును. ఇది సమ్మతము కాదు కదా! మఱియు పరమేశ్వరుఁడు నిత్యసిద్ధుఁడు. ఇట్టివాఁడు ప్రత్యక్షాదిసర్వ

ప్రమాణములకును గోచరుఁడు కావలయును. ఇట్టివానిని చెప్పుటవలన ఫల మేమియు నుండదు; ప్రమాణాంతరగోచర మగుపదార్థమునే తా నును చెప్పిన నది దోషముకదా ? అప్పు డది శాస్త్రమే కాకపోవలసి వచ్చును. ఇట్లగుటచే నీయుపనిషత్తులుకూడ కర్మల నాచరించు జీవుని గూర్చికాని ఆకర్మచే నుపాసింపఁబడు దేవతనుగూర్చి కాని కర్మఫలము లనుగూర్చి కాని చెప్పవలయునే కాని ప్రత్యేకముగ బ్రహ్మమును జెప్ప నక్కఱ లేదు. ఇదియునుగాక "ఈ వేదాంతము (అనఁగ: ఉపనిషత్తులు) కర్మప్రకరణము కాదు. వేఱొకప్రకరణము కదా !" అనిన నప్పటికిని మీసిద్ధాంతము సరి కానేరదు. ఉపనిషత్తులయందుఁగూడ ఉపాసన లనే కములు కలవు. కావున అందలివాక్యము లన్నియు ఉపాసనలకు నైనను సంబంధించినవిగా నుండవలయును. ఇట్లగుటచే నెట్లు చూచినను ఉప నిషద్విచారమువలన బ్రహ్మము తెలియఁబడదు.

విషయము:—ఈయధికరణమున పైసంశయమును నివారించుటకై వేదాంతప్రకరణ మంతయును విచారింపంబడును. ఉపక్రమము మొదలగు * తాత్పర్యలింగములసాహాయ్యమున విమర్శించినచో "ఉప నిషత్తులు పరబ్రహ్మము నొక్కదానినే చెప్పును" అను విషయము తేట

---

* ఏవాక్యమునందైనను గ్రంథమునందైనను "దీని కిదియే యభిప్రాయము" అని నిర్ణయింపవలసిన దానికి సాధనము లాఱు కలవు. ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి అను నీయాఱును ప్రతిసందర్భమునందును తాత్పర్యమును నిర్ణయించును.

ఉపక్రమము— ఆరంభము; తాత్పర్యమును నిర్ణయింపఁదలచినవాఁడు మొట్ట మొదట విమర్శింపవలయును.

ఉపసంహారము—ముగింపు; అట్లే "ఆసందర్భము ఏవిధముగా ముగింపఁబడెను" అనువిషయమును కూడ తాత్పర్యనిర్ణయార్థికి విమర్శింపక తప్పదు. ఆరంభమునందును సమానముగ ఏవిషయము వక్కాణింపఁ బడునో అదియే యాసందర్భమునకు (గ్రంథము నకుఁగాని వాక్యమునకుఁ గాని) తాత్పర్య మని నిర్ణయించుట సుఖసాధ్య మగుననుట స్పష్టమే కదా ?

అభ్యాసము:—ఒక్కదానినే జ్ఞానదార్ఢ్యమునకై పలుమాఱు చెప్పుట ప్రతిసందర్భమునందును ఉపక్రమోపసంహారములకు నడుమఁగాని పిదపఁ గాని తాత్పర్య భూత మగువిషయము పలుమాఱు వర్ణింపఁబడుట యలవాటు. దాని విమర్శించి చూచిన "దీని తాత్పర్య మిదియే" అని నిర్ణయించుట సుఖసాధ్యమగును.

పడుననియు, రూపాదులు లేనివాఁడగుటచే పరమేశ్వరుఁడు నిత్యసిద్ధుఁ
డయ్యును ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుఁడు కానేరఁడు. కావున

---

అపూర్వత: —పూర్వసందర్భములయందుఁ జెప్పఁబడినవానికంటె భిన్నమై యుం
డుట (ప్రకృత సందర్భమునందలి విషయము క్రొత్తదై యుండుట); ఇది కూడ తాత్ప
ర్యనిర్ణయమునకు సహాయకారి. ఈవిషయమును విమర్శింపకున్న తాత్పర్య మటుండ
పూర్వోత్తర సందర్భములకుఁ గలభేదమే మొట్టమొదట తెలియదు కదా.

ఫలము: —ఈవిషయమును గ్రహించుటవలనఁ గలుగుప్రయోజనము; ప్రయో
జనభేదము లేకుండిన విషయభేదమును నిర్ణయించుట యశక్యము. కావున సందర్భతాత్ప
ర్యమును నిర్ణయించువాఁడు ఫలవిచారము నవశ్యముగఁ జేయవలయును.

అర్థవాదము: —తాత్పర్యమును గ్రహించుటయందు పూన్కి కలుగుటకై చేయఁ
బడుస్తోత్రము; ఈస్తోత్రమును విమర్శించుటవలన కూడ తాత్పర్యము స్పష్టమగును.
స్తోత్రములు తాత్పర్యము ననుసరింపకమానవు. ఒకవ్రతమును కాని కర్మను కాని విధిం
చిన ప్రకరణమున "ఈకర్మ నాచరించినవారు స్వర్గమున స్థిరముగ నుందురు" అను నిట్టి
స్తోత్రము లుండును. బ్రహ్మము నుపదేశించు ప్రకరణమున "ఈబ్రహ్మము నెఱుంగు
వాఁడు పునర్జన్మము నొందఁడు" అను నిట్టివాక్యము లుండును. కావున వీనిఁబట్టి కూడఁ
దాత్పర్యమును నిర్ణయింపవచ్చును.

ఉపపత్తి: —"ఈవిషయమును గ్రహించుటవలన నీఫలమే కలుగును" అని నిర్ణ
యించుటకుఁ దగినయుక్తి; ఈయుక్తులును వానియౌచిత్యములను విచారించిన తాత్పర్యము
తేటపడు ననుటకు సంశయమే లేదు. కర్మను చెప్పుప్రకరణమున "లోకమున సర్వఫల
ములును కర్మలవలననే కలుగుచున్నవి; కావున స్వర్గాదిఫలములును కూడ కర్మలచే సాధింప
వచ్చు ననుటకు సంశయము లేదు" అను మొదలగుయుక్తు లనేకము లుండును. బ్రహ్మ
ప్రకరణమునందు "సర్వమును అసత్యమనుట ప్రత్యక్షము. ఇట్లగుటచేత దీనిని పరిత్య
జించిననేకాని శాశ్వతసుఖము కలుగదు" అను నిట్టియుక్తు లుండును. ఇట్లగుటచే
నిదియు తాత్పర్య నిర్ధారణకు సహాయకారి.

మఱియొక విశేషము: —ప్రతిసందర్భమునందును ఈయాఱు నుండ నక్కఱ
లేదు. ఇందుఁ గొన్నియైన నుండవచ్చును. ఉపక్రమోపసంహారములు రెండైనను తాత్ప
ర్యనిర్ణయమునకు జాలును కదా !

"ఇందు అపూర్వత కూడ తాత్పర్యనిర్ణయమునకు సహాయకారి యని చెప్పితిరి ?
ఉపనిషత్తులు నూటయెనిమిదికలవు. ఇన్నియు నొకబ్రహ్మమునే చెప్పును. ప్రతిప్రకరణ
మునందును అపూర్వత యెటనుండివచ్చును?" అందురేమో, ఇది యొకయాక్షేపముకాదు.
ఒకవిషయమునే వివరించునవి కావున నన్నియు నొకప్రకరణమే కావచ్చునుకదా ?

ఈ వేదాంతవాక్యములు వానిని బోధించుటవలన దోష మేమియుఁ గలుగదనియు నిరూపింపఁబడును.

---

## ౪. తత్తు సమన్వయాత్. ౧. ౧. ౪.

తాత్పర్యము:—ఉపనిషత్తులు పరబ్రహ్మమునే చెప్పు ననుటలో సంశయము లేదు. ఉపక్రమము(ఆరంభము)ఉపసంహారము (ముగింపు), అనుమొదలగు తాత్పర్యలింగముల నారసి విచారించిన సర్వవేదాంతములకును పరబ్రహ్మమునందే తాత్పర్యము కలదనుట స్పష్టమగును. "స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమే వా ద్వితీయం" "ఈకనఁబడు ప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వమున సద్రూపుఁడును * సజాతీయ విజాతీయ స్వగతభేదములుఁ లేని వాఁడును అగు పరమేశ్వరుఁడు గానే యుండెను." అని యారంభించి అంతమున "ఐతదాత్మ్య మిదం సర్వం" "ఇప్పుడు కాన వచ్చుచు నున్న యీ ప్రపంచమంతయు బ్రహ్మమే"అని ఛాందోగ్యోపనిషత్తునందు బ్రహ్మమునుగూర్చియే బోధింపఁబడియున్నది. ఇట్లే ఏయుపనిషత్తును విచారించినను దానికి బ్రహ్మమునందే తాత్పర్యము కలదనుట స్పష్టమగును. ఇట్లు అతిస్పష్టముగ "ఉపనిషత్తులు బ్రహ్మపరములు" అని తెలియవచ్చుచుండ మఱియొక తెఱంగున సిద్ధాంతము చేయఁబూనుట యనుచితము కదా!.

---

* సజాతీయభేదము, విజాతీయభేదము, స్వగతభేదము అని భేదములు మూఁడు విధములు.

సజాతీయభేదము—ఒకపదార్థమునకు సమానజాతి గలరెండవ పదార్థముతోఁ గలుగుభేదము సజాతీయభేదము. ఒకమామిడిచెట్టునకును మఱియొక మామిడిచెట్టునకును కల భేదము.

విజాతీయభేదము:—ఒకపదార్థమునకు భిన్నజాతిగల మఱియొకపదార్థముతో నుండుభేదము. వృక్షమునకు రాతితోఁ గలభేదము.

స్వగతభేదము:—ఒకపదార్థమునందే అవయవములకుఁ బరస్పరము గలభేదము. ఒకవృక్షమునందే ఆకునుండి పువ్వునకును పువ్వునుండి కాయకును గలభేదము. ఒకమనుష్యునియందే చేతినుండి కాలికిని కాలినుండి కంటికిని గలభేదము. ఈ భేదములు మూఁడును బ్రహ్మమునందులేవు.

౧-వ పూర్వపక్షము:— (భట్టమతస్థులది). పూర్వమీమాంసా సిద్ధాంతము ననుసరించి వేదములు సంపూర్ణముగ కర్మలను బోధించు నవియే. శాస్త్ర మనునది విధిని గాని నిషేధమును గాని (అన:గ: "నీవీ పనిని చేయవలెను" అని కాని "నీవు దీనినిఁ జేయరాదు" అని కాని) బోధింపవలయును కదా! ఇట్లుండ నడుమ "ఉపనిషత్తులుమాత్రము స్వతస్సిద్ధుఁ డగు పరమేశ్వరునిఁ జెప్పును" అనుట ఎట్లు సంభవించును?

౨-వ పూర్వపక్షము:— "ఇట్లు చెప్పుట సరి కాదు. పరమేశ్వరుఁడు స్వతస్సిద్ధుఁడైనను జ్ఞానరూపుఁ డగుటచే సర్వసాక్షి కావుననే యింద్రియములకును గోచరుఁడు కాఁడు. ఇట్లగుటచే నాయనను గూర్చి యుపదేశించుటవలన శాస్త్రమునకు దోషము రాదు. మఱియు రూపము కార్యము మొదలగునవి యేవియు లేనివాఁ డగుటచే ప్రత్యక్షాది ప్రమాణములలో దేనికిని గోచరుఁడు కాఁడు." అందు రేమో యింత మాత్రమువలన మీసిద్ధాంతము నిలువదు. మీరు బ్రహ్మము స్వస్వరూపమే యనుచున్నారు కదా! ఇట్టివానిని విడచుటకుఁ గాని యంగీకరించుటకుఁగాని శక్యము కాదు. ఏశాస్త్రమునందుఁ గాని యుపదేశింపంబడు విషయము విడువఁ దగినది యైనను అంగీకరింపఁ దగినదియైనను అయితీరును. అనర్థకరము లగువాని విడువవలయు ననియు శుభకరము లగువాని స్వీకరింపవలయు ననియు ప్రతిశాస్త్రమును బోధించును అట్లు చేయుటవలన పురుషులకు ఫలము కలుగును. ప్రకృత మీ వేదాంత శాస్త్రము మీమతము ననుసరించి బ్రహ్మమును బోధించునదియే యగు నేని యప్పుడు ఆబ్రహ్మము విడుచుటకు నంగీకరించుటకును శక్యము కానిదగుటచే నట్టియుపదేశమువలన ఫల మేమియునుండదు. తనకుఁ దానే విడువఁదగినవాఁడుగాఁ గాని యంగీకరింపఁదగినవాఁడుగాఁ గాని యుండుననుట యసంభవము కదా?

3-వ పూర్వపక్షము:— "ఇట్లన నేల? కర్మకాండకును దీనికిని సంబంధము లేదు కదా? ఈయుపనిషత్తులు ప్రత్యేకప్రకరణ మగుటచే దీనియందలి నిబంధనలు వేఱుగ నుండవచ్చును"అందురేమో. అట్లయినను మీసిద్ధాంతము నిలువదు. ఉపనిషత్తులయందుఁగూడ నచ్చటచ్చట పంచాగ్నులు మొదలగు దేవతలనుగూర్చి చేయవలసిన యుపాసనలు చెప్పఁబడియున్నవి. అవియును కర్మలే; కావున, సర్వవేదాంత

వాక్యములును ఆకర్మలతో సమన్వయింపవచ్చును. కర్మకాండయందుఁ జెప్పఁబడినవి శరీరసాధ్యము లగుయజ్ఞాదులు. ఉపనిషత్తులయందు చెప్పఁబడినవి మానసికము లగు నుపాసనలు. ఇట్లయినను ప్రకరణములు భిన్నములు కావచ్చును కదా! కావున నెట్లు చూచినను నీసిద్ధాంతము సరి కాదు. ఉపనిషత్తులు కర్మాంగము లగుకర్తృదేవతాఫలములను వర్ణించును. వాని ప్రశంసనైనం జేయును ; గాని నూతనముగాఁ బరబ్రహ్మమును చెప్పవు. కావున "బ్రహ్మమును వేదములవలనఁ దెలిసికొన వచ్చును" అనుట అయుక్తము.

౧-వ సిద్ధాంతము (భట్టపూర్వపక్షఖండనము):— ఇట్లు చెప్పుట సరికాదు. "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అను మొదలగు వాక్యముల నచ్చటి యుపక్రమాదులఁ బరికించి చూచిన నుపనిషత్తులకు బ్రహ్మము నందే తాత్పర్యము కల దనువిషయము స్పష్టమగును. ఇట్లుండ యథాశ్రుత మగునర్థమును విడిచి యతిక్లిష్టముగ నన్యార్థమును గల్పింపవలసిన యక్కఱ యుండదు. అట్లు చేయుటయు దోషమే కదా?

"వేద మంతయు విధినిషేధాత్మకమై కర్మపరమై యుండ నుపనిషత్తులుమాత్రము మఱియొకవిధముగ నున్న వని చెప్పవచ్చునా?" అనియెదవేమో వినుము. "వేదము ప్రమాణము" అను విషయమును నిరూపించుటకు ననుమానాదిప్రమాణాంతరముల సాహాయ్య మక్కఱ లేదు. "సర్వమును కర్మపరమై విధినిషేధరూపమై యుండుటచే నుపనిషత్తులుకూడ నట్లే యుండి తీరవలయును. (ఉపనిషదః కర్మపరాః; వేదస్య విధినిషేధరూపత్వాత్, కర్మకాండవత్)" అను ననుమానముతో నెప్పటికిని కార్యము లేదు. మఱియును వేదప్రామాణ్యమును ప్రమాణాంతరముతో నిర్ణయింపఁ జూచుట దోషము. మీకుఁ గూడ ననిష్టము. అనుమానము ప్రవర్తించిననే కదా ఉపనిషత్ప్రామాణ్యమును నిర్ణయించుటకుఁ గర్మకాండ దృష్టాంతము కావలసి వచ్చుట. ఈకారణమువలన వేదము ఎచ్చటెచ్చట నేశైట్లు చెప్పునో అచ్చటచ్చట నట్లట్లే ప్రమాణమగును.

"ఇట్లైనచో కర్మకాండకును ఉపనిషత్తులకును పరస్పరవిరోధ మేర్పడుటచే వేద మప్రమాణము కావలయును కదా!" అందువేమొ, ఇది సరికాదు. బాగుగ నిష్పక్షపాతబుద్ధితో సర్వమును విమర్శించి

చూచిన విరోధ మేమియు లేదు. ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడిన బ్రహ్మము అవాఙ్మానసగోచరము కావునను, దానిని పొందుటయే పురుషార్థము కావునను, మనశ్శుద్ధి కలుగుటకై వేదము మొట్టమొదట కర్మాదుల నుపదేశించియున్నది. మనశ్శుద్ధిలేక యంత యున్నతపదార్థమును గ్రహించుట కష్టము కదా! ఈవిధముగ కర్మకాండ బ్రహ్మజ్ఞానమునకు సాధన మగుకర్మ నుపదేశించుటచే బ్రహ్మమునకు శేషభూతము (బ్రహ్మకొఱకే పరివర్తించునది) అగును. కావున వేదమునందు పరస్పరవిరోధము లేదు. ఈకారణమువలన ఉపనిషత్తులు బ్రహ్మపరములే కాని కర్మపరములు కావు.

2-వ సిద్ధాంతము (భట్టపూర్వపక్షఖండనము) :— మఱియు "బ్రహ్మము స్వతస్సిద్ధమైనను ప్రత్యక్షాదులకు గోచరము కాకపోవుటచే నాయననుగూర్చి చెప్పుట శాస్త్రమునకు నావశ్యకమే యైనను, ఆపరమేశ్వరుఁడు ఆత్మస్వరూపుఁడే యగుటచే విడువఁదగినవాఁడుగాఁ గాని యంగీకరింపఁదగినవాఁడుగాఁ గాని యుండఁడు. కావున నాయనను నిరూపించుటవలన శాస్త్రమునకుఁ బ్రయోజనము లేదు" అనుట సరియైనది కాదు.

బ్రహ్మము విడువఁ దగినది గాని యంగీకరింపఁ దగినది గాని కాదనుట నిశ్చయమే. ఉపనిషత్తులు అట్టి బ్రహ్మమునే బోధించుననుటయు యథార్థమే. కర్మోపదేశమువలన కలుగుఫలమునకంటె సర్వవిధముల నధిక మగుమోక్షఫలము ఈ బ్రహ్మోపదేశమువలన కలదు. మోక్ష మనఁగ, స్వస్వరూపస్థితియే! అది యొకప్పుడు క్రొత్తగాఁ గలుగునది కాదు ; ఒకప్పుడు లేకపోయినదియుఁ గాదు. అయినను అజ్ఞానమువలన బ్రహ్మమే జీవుఁ డగుచున్నది ; ఈకారణమునలన తన్నే తనకంటె నన్యునిగా భావించుచున్నాఁడు. కావున ఈయజ్ఞానమును తొలఁగించినచో నప్రయత్నముఁగనే మోక్షము చేకూరును. ఇంతకంటె ఫల మేది కావలయును? కర్మయందైనను వాక్యార్థము నెఱింగినపిదప సాధనసంపాదనపూర్వకముగాఁ గొంతయాచరణము నలసియుండును కాని ఇచ్చట నేమియు లేదు కదా ?

లోకమున విడువఁ దగినదిగాని యంగీరింపఁ దగినదిగాని ప్రత్యేకముగ రెండువిధములుగ నున్నదనుట స్పష్టము. కొందఱు తమకు నంటు

కొని బాధను కలిగించుపదార్థముల (కాలికి చుట్టుకొనిన సర్పము మొదలగువానిని) విడుచుచున్నారు. మఱికొందఱు అట్లుకాక భ్రాంతిచే తమనంటి బాధించుచున్నట్లు భావించుచు నట్లు కానిపదార్థమును గూడ (కాలికి తగిలిన గడ్డిపోఁచను సర్పముగా భావించి దానిని కూడ) విడుచుచున్నారు. ఇట్లే కొందఱు తమకు లేని ధనాదులఁ గోరుచున్నారు. మఱికొందఱు గృహములో నున్నదానిని సహితము లేదని భావించి వెదకుచున్నారు. యథార్థానుభవమువలె అయథార్థానుభవము కూడ (భ్రాంతికూడ)లోకమున ననుభవసిద్ధమై యుండ నిది యొకవింతయా? ఇట్లగుటచే బ్రహ్మమునందు భ్రాంతిచే క్రొత్తదిగఁ గల్పింపఁబడి బహువిధదుఃఖములఁ గలిగించుచున్నట్లున్న ఈజీవత్వము జ్ఞానోపదేశముచే తొలఁగవచ్చును; భ్రాంతిచే స్వాభావికమయ్యు లేనిదిగ భావింపఁబడుచున్న బ్రహ్మత్వము రావచ్చును. ఇట్లు జీవత్వము హేయము (విడువందగినది); బ్రహ్మత్వ ముపాదేయము (అంగీకరింపఁదగినది.)

సర్వవ్యవహారములును యథార్థములై యే యుండవలయు నని నియమము లేదు; అట్టినియమము నాశ్రయించి వేదార్థములకు అన్యథాభావమును గల్పించుటయు యుక్తము కాదు కదా! ఈకారణము వలన ఉపనిషత్తులకు పారమార్థికము లగు హేయోపాదేయత్వములు లేకున్నను, భ్రాంతికల్పితము లగు హేయోపాదేయత్వములు కలవు. సర్వశాస్త్రములును భ్రాంతి నాశ్రయించియే ప్రవర్తించుచున్నవి కదా! (చూడు. శాస్త్రావతారిక ౧౨ పేజి. సిద్ధాంతము 3-౪) కావున నెట్లు చూచినను ఉపనిషత్తులు నిత్యసిద్ధస్వప్రకాశబ్రహ్మమును చెప్పుననుటలో సంశయ మింతయైనను లేదు. ఒకవేళ ''ఉపనిషత్తులు కూడ కర్మనే చెప్పును'' అని పట్టు పట్టిన ''యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్తత్కేన కం పశ్యేత్'' ''సర్వము ఆత్మరూపమే' అని యెఱింగిన ఏపదార్థమును ఏసాధనముచే నేకర్త కనుఁగొనఁ గలఁడు?'' అను శ్రుతి నెట్లు సమన్వయించుకొనఁగలవు? బ్రహ్మభిన్నముగాఁ గర్త కాని సాధనము కాని ఫలము కాని విషయము కాని లేదని చెప్పుచున్నది కదా! కావున నీపక్షము యుక్తమైనది కాదు.

''ఇట్లయిన ప్రమాత ఎవ్వఁడు? సర్వము నాత్మయేయైన నెవ్వఁడెవ్వనిఁ గూర్చి విచారము చేయును? ఎవ్వనిఁ దెలిసికొనును?'' అందు

వేమో, ఇది యొకదోషము కాదు. లోకమున నెల్లరును దేహమున కంటె భిన్నుఁడగు నాత్మను దేహమాత్రమునుగా భావించుచున్నారు. ఇట్లు ఈ దేహాత్మాభిమానము భ్రాంతియని సర్వమతస్థులు సామాన్యముగ నంగీకరించియున్నారు. శాస్త్రములు కూడ నీభ్రాంతి నంగీకరించియే ప్రవర్తించుచున్నవనుట నిర్వివాదాంశము. ఇట్లుండ మేము మాత్ర మీభ్రాంతినేల యంగీకరింపరాదు? భ్రాంతిచే జీవత్వ ముండునంతవఱకు నా బ్రహ్మమే స్వస్వరూపమును విచారించును; తెలిసికొనును. భ్రాంతి తొలఁగినపిదప నాబ్రహ్మమే స్వస్వరూపముతో నిలుచును. ముక్తుఁ డగును. ఇందు విరోధ మేమి?

3-వ సిద్ధాంతము (భట్టపూర్వపక్షఖండనము) :—ఇదియునుఁగాక, ఈబ్రహ్మము ఉపాసనకు సంగముగానుండ నక్కఱలేదు. బ్రహ్మజ్ఞానము అభేదజ్ఞానము. ఉపాసనావిధి భేదజ్ఞానముండినఁ గాని సాధ్యము కాదు. ఇట్లుండ నీరెంటికిని సంబంధ మెట్లు కలుగును? చిత్తశుద్ధికై మొట్ట మొదట కొన్నియుపాసనలఁజెప్పిన జెప్పునుగాక. సర్వవాక్యములును వానితో నేల సంబంధింపఁవలయును? ఉపాసనలఁ జేయునంత యధికారములో నున్నవానికి సర్వము నట్లే తోఁపవచ్చును! అట్లు తోఁపఁవలయు నను నుద్దేశముతో వేదముకూడ నట్టివాక్యములను చెప్పియుండ వచ్చును; కాని విచారదక్షు లగువారు తాత్పర్యమును నిర్ణయించునప్పుడు అదియంతయు ప్రమాణముః కానేరదు కదా? ''కేన కం పశ్యేత్'' అను శ్రుతిగూడ ''ఉపనిషత్తులు; ఇవియే యన నేల? వేదము సమగ్రముగాఁగూడ, ముఖ్యతాత్పర్యముతో భేదమును చెప్పుట లేదు.'' అను విషయమును స్పష్టము చేయుచున్నది. కావున నెట్లును భట్టమతము అంగీకరింపఁ దగినది కాదు.

౧-వ పూర్వపక్షము (ప్రభాకరమతస్థులది) :—ఇట్లయినను మీ సిద్ధాంతము సరికానేరదు. బ్రహ్మ మనునది యొక్కటి బొత్తిగనే లేదు. ఉన్నవాఁడు జీవుఁడే. వాఁడు సర్వలోకప్రసిద్ధుఁడు; కావున వానిఁగూర్చి శాస్త్రము ప్రవర్తింప నక్కఱలేదు.

౨-వ పూర్వపక్షము :— ''సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, తత్త్వమసి'' ''సత్యము జ్ఞానము అనునవి స్వరూపముగాఁ గలదియును నాశరహితమైనదియు నగుబ్రహ్మపదార్థము కలదు. దానికిని నీకును

భేదము లేదు" అని చెప్పు శ్రుతు లనేకములు కలవు. ఇవి యన్నియు స్వతస్సిద్ధమగు నానానేక పదార్థమునుంగూర్చి చెప్పుచున్నవి. వీనికేమి గతి?" అనియెదవేమో వినుము. బ్రహ్మము ప్రత్యక్షము కాకపోవుటచే దానినిఁగూర్చి యేది యెట్లు చెప్పినను అసత్యమే యగును. ప్రత్యక్షాది ప్రమాణములుకూడ నావిషయమునఁ బ్రవర్తింపనేరవు. ఇట్టిదానిని వేదము నిరూపించుచుననుట యేటిమాట? పయివాక్యము లన్నియు కర్మల నాచరించు జీవుని స్తోత్రముచేయు నర్థవాదములు. సిద్ధవస్తువును చెప్పిన శాస్త్రమునకుఁ బ్రయోజన ముండదు కదా ?

3-వ పూర్వపక్షము:— "భ్రాంతిచే స్వతస్సిద్ధ మగు బ్రహ్మమే జీవుఁడై స్వస్వరూపమును తెలిసికొనలేక దేహమునే యాత్మగ భావించుచున్నది. ఈభ్రాంతిని తొలఁగించుటకై శాస్త్రము బ్రహ్మస్వరూపమును వివరింపవలయును" అనియెదవేమొ, అది సరికాదు. భ్రాంతి యనునదియే లేదు. అన్యస్థలములయం దొకవేళ నున్నను దేహాత్మాభిమానము భ్రాంతికాదు. అది గౌణము. ఇట్లగుటచే వేదాంతశాస్త్రము బ్రహ్మమును చెప్పుననుట ఎట్లును సంభవింపదు.

౧-వ సిద్ధాంతము (ప్రభాకరపూర్వపక్షఖండనము):— ఈమతము సరికాదు. ప్రత్యుపనిషత్తునందు ఉపక్రమోపసంహారములు మొదలగు తాత్పర్యలింగములను నిష్పక్షపాతబుద్ధితో విమర్శించి చూచిన నిత్యంబును నిరాకారంబును నిర్వికల్పంబును శుద్ధంబును జ్ఞానమాత్రరూపంబును అద్వితీయంబును అగుబ్రహ్మమును గూర్చియే వేదము చెప్పుచున్నదనుట స్పష్టమగును. జీవబ్రహ్మములకు భేదము లేకపోవుటచేతను, అట్టి శ్రుతులు వేనవేలు కానవచ్చుటచేతను, నీకు "జీవభిన్న మగుపదార్థము లేదు" అను విషయము తోఁచినది. ఇంతియే కాని వాస్తవస్థితిలో వేదము బ్రహ్మనుగూర్చియే చెప్పుచున్నది. ఆబ్రహ్మమే జ్ఞానము; కావున "ఇది కలదు ఇది లేదు" అని అంగీకారమును గాని నిషేధమును గాని చేయునది బ్రహ్మమే. "ప్రపంచము కలదు" అని సాక్షియై తెలిసికొనుచున్నది. ఇట్టిది లేనిదగునా ? ఏదియయినను సాక్షి లేక ప్రవర్తింప నేరదనుట సర్వవాదిసమ్మత మగువిషయము. నీవు కలిగినఁ గదా నీకుఁ గొన్నివిషయములు గోచరము లగుట. కావున బ్రహ్మము కలదు; శాస్త్రంబును బ్రహ్మపరమే.

"సత్యం జ్ఞానం"అను మొదలగు వాక్యము లన్నియు నా బ్రహ్మ మును జెప్పునవియే. జీవుని నుతించునవి కావు. "నాకు సుఖము కలదు. దుఃఖముకలదు" అని దేహమునకుఁ గలుగు సుఖదుఃఖాదులఁ దనవిగాఁ భావించు జీవుఁడు శుద్ధరూపుఁ డెట్లగును ? ఆనందమయుఁ డెట్లగును ? కర్మలనాచరించువాఁడు అకర్త ఎట్లగును?అద్వితీయుఁ డెట్లగును ? దేహాభిమానము కలవాఁడు అసంగుఁ డెట్లగును ? జ్ఞానరూపుఁ డెట్లగును ? ఇది యంతయు విరుద్ధము కదా.

మఱియు పరమేశ్వరుఁడు భ్రాంతిచే స్వయముగనే జీవరూపముగ తోఁచుచున్నాఁడు; కావున స్వస్వరూపవివేకము కలుగుటకై బ్రహ్మోప దేశ మావశ్యకము. "తనకుఁ దానే విరుద్ధరూపముతోఁ దోఁచు ననుట ఏటిమాట ? ఇది విరుద్ధము కదా ?" అనియెదవేమో వినుము. మండ లాకారముగ నిలువఁబడినప్పుడు, ఏదియో యొకకారణమున తమ్ముఁ దాము గణించుకొనవలసినప్పుడు అవివేకి యగువాఁడు తన్ను మఱచి తక్కినవారినే లెక్కించుటయు నచ్చటచ్చట ననుభవములో నున్నది. ఇట్లే అనాద్యవిద్యావశంబున తనస్వరూపమును మఱచుట యొకవిరోధము కాదు. "శుద్ధునియం దవిద్య యెట్లు కలిగెను?" అని యందు వేమో వినుము. లోకానుభవము నంగీకరించి దానిని కల్పించితిమే కాని వాస్తవస్థితిలో నది యెందును లేదు. ఉన్నను బ్రహ్మము దానికిఁ గూడ సాక్షియే యగుటచే నది యాబ్రహ్మమును బాధింపదు. మఱియు సత్తాస్వరూపము (ఉనికి) బ్రహ్మమే కావున నది బ్రహ్మభిన్నముగా నుండు టకు వీలులేదు.

ఇట్లగుటచేత "దేహాత్మాభిమానము భ్రాంతి కాదు; గౌణము" అనుట తప్పు. గౌణ మనఁగ రెండుపదార్థములు ప్రత్యేకముగ సత్య ములై విభాగ మేర్పడి యుండఁగా గుణములయందలి సమానత్వముచే "వీఁడు సింహమువంటివాఁడు" అను మొదలగు విధములతోఁ గలుగు జ్ఞానము. ఇట్టిది దేహాత్మలవిషయమున నుండుటకు వీలులేదు. ఆత్మ కంటె భిన్నముగ దేహ మొక్కటి లేదనువిషయము "మాయా మాత్ర మిదం ద్వైతం" "ఈప్రపంచ మంతయును మాయయే; వాస్త వము కాదు" అను మొదలగు శ్రుతులచే బహువిధములఁ జాటి చెప్పఁ బడుచున్నది. అది యట్లుండ దేహాత్మవిభాగము ప్రపంచమున నను

భవములో లేదు; గుణములయందును ఆ రెంటికిని పోలిక లేదు. ఇట్లుండ గౌణజ్ఞాన మెటనుండి కలుగును? ఇట్లగుటచేత నిది యవశ్యముగ భ్రాంతియే. భ్రాంతియందు ఒక పదార్థముమాత్రమే సత్యమైనఁ జాలును కదా?

ఈ కారణమువలన నెట్లు చూచినను "ఉపనిషత్తులయందు బ్రహ్మము చెప్పఁబడు" ననుటలో నించుక యైన సంశయము లేదు.

---

# ౪. సమన్వయాధికరణము.

## ద్వితీయ వర్ణకము.

సంగతి:—పూర్వాధికరణమున వేద మొక్కటియే బ్రహ్మమును నిరూపించునని చెప్పఁబడియున్నది. దాని నంగీకరించియే మఱియొకవాది (ఈబ్రహ్మసూత్రములకు వృత్తిని చేసిన బోధాయనమహర్షి. ఈతనిసిద్ధాంతమే ప్రస్తుతవిశిష్టాద్వైత సిద్ధాంతము) "వేదాంతములు బ్రహ్మస్వరూపమునుమాత్రమే నిర్విశేషముగ (అనఁగ: ఇట్లు చేయవలయు నని కాని ఉపాసనచేయవలయునని కాని చెప్పక, ఊరక 'బ్రహ్మ మిట్టిది' అని మాత్రమే) వివరించుననుట తప్పు. అవి బ్రహ్మోపాసననే చెప్పుచున్నవి" అని వాదించుచున్నాఁడు. ఈయాక్షేపమునకు సమాధానమును జెప్పుటకై ఈయధికరణ మారంభింపఁబడుచున్నది. ఐనను దీనికిని పై అధికరణమునకును గల సంబంధము ఆక్షేపరూపము కాదు. ఏల యనిన; గ్రంథకర్త మొట్టమొదట ఒక విషయమునుచెప్పి దాని నిర్ధారణసేయుటకై స్వయముగనే మఱియొక విషయమును చెప్పిన నారెండు విషయములకును గలసంబంధము ఆక్షేపసంబంధ మనఁబడును. "బ్రహ్మము కలదు." అని మొట్టమొదట చెప్పి దానిస్వరూపమును నిరూపింపవలయును కావున "జగత్కారణ మగుపదార్థమే బ్రహ్మము" అని చెప్పఁబడి యున్నది. ఈ రెండును మఱియొకవాది చేయు నాక్షేపమునకు సమాధానములు గాక స్వయముగనే గ్రంథకర్తచే చెప్పఁబడియున్నవి గావున వీనికిఁ గల సంబంధ మాక్షేపసంబంధము. ఇట్టి యధికరణములయందును ఆక్షేపములను పూర్వపక్షయుక్తులును వినరింపఁబడుట, ఆయాయధికరణముల

యందలి విషయములను స్పష్టముచేయుటకే యని గ్రహింపవలయును. ఇట్లుగాక పనులు చేయునాక్షేపమును మనసునందే యూహించి దానికి సమాధానముగ నొకవిషయమును చెప్పినచో, అప్పుడు దానికిని పూర్వ విషయమునకును గలసంబంధము ప్రాస్తావికసంబంధమనఁబడును. ప్రస్తా వము ననుసరించి వచ్చిన దగుటచే (అనఁగా : తన సిద్ధాంతమును ధృఢము చేసికొను ప్రస్తావమునఁ గలిగినదగుటచే) దీని కీ పేరు కలి గెను. యీ ప్రకృతాధికరణమునకును పూర్వాధికరణమునకును గల సంబంధ మిదియే.

సందేహము:—ఇట్లగుటచే "బ్రహ్మము నుపాసింపవలయు నని వేదము చెప్పుచున్నది. లేక, బ్రహ్మము నెఱుంగుట యనుమానసిక కర్మను ఉపనిషత్తులు బోధించుచున్నవి" అనుట ఈయధికరణమునందలి పూర్వ పక్షము. "ఉపనిషత్తులు బ్రహ్మస్వరూపమును మాత్రమే చెప్పును. ఆ విషయమును గ్రహించుటయే పురుషార్థ మని బోధించును." అనుట సిద్ధాంతము. "ఉపాసనలవలన మోక్షము కలుగును" అనుట పూర్వ పక్షులచే నిర్ణయింపఁబడును. దానిని ఖండించి "బ్రహ్మస్వరూపవిజ్ఞాన ముచే మోక్షము కలుగును" అను విషయము సిద్ధాంతులచే దృఢీక రింపఁబడును.

ఈరెండుపక్షముల నవలంబించి ఈసందేహము కలుగును:—

"ఆత్మే త్యే వోపాసీత" "ఆత్మ యనియే బ్రహ్మము నుపాసన చేయవలయును" అను మొదలగు ననేకవాక్యములచే శ్రుతి యుపా సననే చెప్పుచున్నది. ఆయాత్మస్వరూపమును వివరించుటకై "విజ్ఞాన మానందం బ్రహ్మ, స ఆత్మా"="జ్ఞానమును ఆనందమును పరబ్రహ్మము నకు రూపములు (అనఁగ : బ్రహ్మము జ్ఞానాదులు గలది.) ఆబ్రహ్మ మే నీయాత్మ" అని చెప్పుచున్నది. ఇట్లు ఉపనిషత్తుల నన్నిటిని ఉపా సనాపరములనుగ సమన్వయింపవలయును. ఇట్లు కాకున్నను, ఆత్మ స్వరూపవిజ్ఞానమునకునై బ్రహ్మస్వరూప విజ్ఞానము కావలయును ; కా వున "బ్రహ్మమును తెలిసికొన వలయును" అని జ్ఞానరూపక్రియ నుపదేశించుచున్నఁదని యైనను చెప్పవలయును. బాగుగా స్వస్వరూ పము తెలిసినపిదపఁ గర్తవ్య మేమియు లేకపోవుటచేతను, సత్యకామ సత్యసంకల్పత్వాదిగుణములు అప్పటికి తమంత దామే సంభవించును

కావునను పైన వర్ణించినజ్ఞానము ఉపాసనవలనఁ గలుగును. సత్యకామత్వాదిగుణప్రాప్తిరూపమైన మోక్షము నొసంగును.

ఇట్లు చెప్పకుండిన ననేకదోషములు వచ్చును. శాస్త్రములు ఏదియైన నొకదానిని విడువుమని కాని దేనినైన నొకదాని నంగీకరింపుమని కాని యుపదేశించుచుండును. ఇట్లు గాక నీవేదాంతశాస్త్రము మాత్రము కేవలవస్తుస్వరూపమును చెప్పు ననుట యుక్తియుక్తము కాదు గదా ?

విషయము :— ఈసందేహమును నివారించుటకై యీయధికరణమున వేదాంతతాత్పర్య మంతయు వర్ణింపఁబడును.

---

## ౪. తత్తు సమన్వయాత్. ౧. ౧. ౪.

తాత్పర్యము :— బాగుగ సమన్వయించి చూచినచో వేదాంత వాక్యము లన్నియు బ్రహ్మస్వరూపమునుగూర్చి మాత్రమే చెప్పును కాని యుపాసనలను గూర్చి చెప్ప ననువిషయము స్పష్టమగును.

"య ద్వాచా ఽనభ్యుదితం యేన వా గభ్యుద్యతే త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే" "ఏపదార్థము వాక్కుచేఁ జెప్పఁబడుటకు శక్యము కానిదో, దేనిప్రభావము వలన వాక్కు సర్వశబ్దముల నుచ్చరింపఁగలుగుచున్నదో, అదియే బ్రహ్మ మని తెలిసికొనుము. లోకమున జనులు దేని నుపాసింపుచున్నారో అది బ్రహ్మము కాదు" అని స్పష్టముగనే ఈవిషయము ("బ్రహ్మము నుపాసన చేయుటకు నవకాశము లేదు" అను విషయము) శ్రుతిచే నిరూపింపఁ బడియున్నది. మఱియు.—

"విజ్ఞాతార మరే కేన విజానీయాత్" "సర్వమును తెలిసికొనువానిని (సాక్షిని) ఏసాధనముచేఁ దెలిసికొనఁగలము?" అను మొదలగు వాక్యములచే నాశ్రుతియే "బ్రహ్మము జ్ఞానక్రియకు కర్మ కానేరదు" అనియు స్పష్టముగనే చెప్పియున్నది. కావున నీయుపనిషత్తులు కర్మకాండవలె క్రియను చెప్పునవి కావు. ఈరెంటికిని (కర్మజ్ఞానకాండలకు) ఫలమునందును విశేషభేదము కలదు.

 

౧-వ పూర్వపక్షము :—ఇట్లుచెప్పిన నీయుపనిషత్తులు శాస్త్రములే కాకపోవును. లోకమున శాస్త్ర మనునది సామాన్యముగ విధిని కాని నిషేధమును గాని చెప్పునుండు ననుట స్పష్టము.

౨-వ పూర్వపక్షము : —"అయినను ఫలభేదమునలన శాస్త్రభేదము విషయభేదము నియనుభేదము కూడఁ గలుగు" నందు వేమొ అది సరి కానేరదు. బ్రహ్మనుకూడ విధిపూర్వకముగానే ఉపాసనకొఱకే చెప్పును గావున ఈశాస్త్రమునందు నిరూపింపఁబడు ఫలముకూడ కర్మజన్యమే యగును; కాని తద్భిన్నము కానేరదు.

3-వ పూర్వపక్షము:—"ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" "ఆత్మను తెలిసికొనుటయే పురుషార్థము. ఆయననుగూర్చి విననలయును; విచారింపనలయును; ధ్యానముఁ గావింపవలయును." అని శ్రుతియే ఈవిషయమును స్పష్టముగఁ జెప్పుచున్నది.

౪-వ పూర్వపక్షము:—ఇదియంతయుఁ గాక జ్ఞాన మనునది మనస్సునకు సంబంధించిన పని. కావున "ఉపనిషత్తులు 'బ్రహ్మమును తెలిసికొనవలయును' అనియే చెప్పును." అనినను బ్రహ్మ కర్మశేషుఁడు (కర్మకు స్వాధీనుఁ డగువాఁడు. అనఁగా: ఒక క్రియకు కర్మ యగువాఁడు) కావలసి వచ్చును. ఇట్లగుటచే నెట్లు చూచినను ఉపనిషత్తులు బ్రహ్మమును కర్మశేషమునుగాఁ జెప్పునే కాని స్వతంత్రముగాఁ జెప్పదు.

౧-వ సిద్ధాంతము:—ఈ పక్షము సరియైనది కాదు. శాస్త్రము విధినిషేధములనుగూర్చి మాత్రమే చెప్పవలయు ననునియమము లేదు. "విధినిషేధాన్యతరవిషయం శాస్త్రం" "విధినిషేధములలో దేనినైన నొకదానిని చెప్పునదియే శాస్త్రము" అని లక్షణము చెప్పినఁ దోషము వచ్చును. వేదమునందు అనేకభాగములలో విధి కాని నిషేధము కాని కాకుండు సందర్భములు పెక్కులు కలవు. ఉపనిషత్తులవిషయ మటుండనిమ్ము. కర్మకాండమునందును "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" "స్వర్గరూపసుఖమును గోరువాఁడు జ్యోతిష్టోమయాగమును చేయువలయును." అనుమొదలగు వాక్యములచే విధినిషేధరూపములు కానికొన్నిపదార్థములు చెప్పఁబడియున్నవి. పై వాక్యమువలన "స్వర్గ మొకటి నిత్యముగ నున్నది. దానిని జ్యోతిష్టోమములో సంపాదింపవలయును" అని స్పష్ట మగుచున్నది. ఇందు స్వర్గమునుగూర్చి చెప్పుట

విధినిషేధములలోఁ జేరినది కాదుగదా. ఇట్లే అనేకస్థలములలో విధి నిషేధములకు సంబంధింపనికథలు మొదలగు ననేకవిషయములు నిరూపింపఁబడియున్నవి.

"ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానాం"
"వేదమంతయు కర్మకొఱకే ప్రవర్తించుచున్నది. కావున కర్మకొఱకై చెప్పఁబడని విషయము లన్నియు నిరర్థకములు." అని శాస్త్రతాత్పర్యము నెఱింగినమహాత్ములు చెప్పియున్నారు. కావున మీామతము ననుసరించిన, స్వర్గమునుగూర్చి చెప్పినవాక్యము నిరర్థకము కావలసి వచ్చును. ఐనను, "ఇచ్చట నీదోషము లేదు. స్వర్గము యాగవిధికి నంగముగాఁ జెప్పఁబడెను. కావున విధియే యగును." అని యాక్షేపింతువేమో వినుము.

నీయభిప్రాయము యుక్తము కాదు. నీ వెట్లు చెప్పినను "స్వర్గము కలదు" అనువాక్యము విధియును గానేరదు; నిషేధంబును గానేరదు. దానియర్థము నెఱుంగుటవలన (స్వర్గస్వరూపము నెఱుంగుటవలన) యాగమునకు నుపయోగ ముండిన నుండుఁ గాక; అది మాత్రము విధినిషేధములలో దేనియందైనఁ జేరు ననుట యెట్లును సంభవింపదు కదా!

కావున నెట్లు చూచినను "శాస్త్రము విధినిషేధములలో దేనినైనఁ జెప్పి తీరవలయును" అనునియమము లేదు. దేని నెట్లు చెప్పినను "హితమును బోధించుట; దానియందు పురుషునఁ బ్రవర్తింపఁ జేయుట; అహితమునుగూడ బోధించి దానినుండి నివర్తింపఁజేయుట" అనునవియే శాస్త్రమునకుఁ బనులు. కావున నీయుపనిషత్తులు కూడ సంసారదుఃఖమును తొలఁగించి స్వస్వరూపమాత్ర మగు మోక్షసుఖమును జెందించుటకై హితమును బోధించుచున్నవి. కావున వీనికి శాస్త్రత్వము కల దనుటలో సంశయము లేదు.

౨-వసిద్ధాంతము:— ఇట్లగుటచేత "ఉపనిషత్తులు బ్రహ్మమును విధిపూర్వకముగానే బోధించును. అట్లే యొప్పుకొని తీరవలయును. అట్లు కాకున్న నవి శాస్త్రములే కాకపోవును" అనుటకు నవకాశము లేదు. మఱియు నీయుపనిషత్తులు తెలుపు మోక్షఫలమునకును కర్మకాండము చెప్పు స్వర్గాదిఫలములకును భేద మనంతముగాఁ గలదు.

స్వర్గాదిఫలములను శరీరముతోఁ గూడియే (తత్తల్లోకములకుఁ దగినశరీరములతోఁ గూడియే) యనుభవింప నలయును; మోక్షమునకు శరీరసంబంధము లేదు. "అశరీరం వా వసంతం న ప్రియాప్రియే స్పృశతః" = "శరీరము లేనివానికి సుఖదుఃఖము లంటవు" అను శ్రుతి "సుఖదుఃఖాభావరూప మగు మోక్షమునకు శరీరము లేకుండుటయే స్వరూపము" అని చెప్పుచుఁ బైవిషయమును దృఢము చేయుచున్నది. ఆస్వర్గాదులకు తారతమ్యము కలదు. యాగాదుల నాచరించినవారు ఉత్తరమార్గమునను, సామాన్యము లగునిష్టాపూర్తముల (ఇష్టమనఁగా, నగ్నిహోత్రము. ఆపూర్త మనఁగా తటాకాదులఁ ద్రవ్వించుట) నాచ రించినవారు దక్షిణమార్గమునను పరలోకములకుఁ బోదురనుటయు, వచ్చుటను దారతమ్యములతో సుఖానుభవముల నొనర్తు రనుటయు శాస్త్రప్రసిద్ధము. మోక్షమునం దిట్టి భేదములు లేవు. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "బ్రహ్మము నెఱింగిన బ్రహ్మమే యగును" అను మొదలగు శ్రుతుల ననుసరించి చూచిన స్వస్వరూపమగు బ్రహ్మమే మోక్షమైయుండ నందుఁ దారతమ్యము లెటనుండి వచ్చును? ఎవ్వఁడును తనకుఁ దానే యల్పముగా నధికముగా నుండుననుట సంభవింపదు కదా! మఱియు సుఖదుఃఖములే కర్మఫలములకు రూపము; "అశరీరం" అను మొదలగు శ్రుతిప్రామాణ్యము ననుసరించి సుఖదుఃఖాభావమే మోక్షమునకు స్వరూపము. ఉపదేశము కలిగినపిదప నద్విజ్ఞానము సంభ వించినతర్వాతఁగూడ నేడిమో యొక కర్మ నాచరించిననే కాని స్వర్గాది ఫలములు కలుగవు; మోక్ష మట్లు కాక జ్ఞానము కలిగినయుత్తరక్షణ ముననే సిద్ధించును. "తస్య తావ దేవ చిరం" "సాధనకు మోక్షము కలుగుటకు జ్ఞానముకలుగుటయే యాలస్యము" అను మొదలగు ననేక శ్రుతులు ఈ విషయమును స్పష్టముగఁ జెప్పుచున్నవి. ఆ స్వర్గాదులు ఆత్మకంటె భిన్నములు. ఈమోక్షములు ఆత్మరూపము. మఱియును ఈమోక్షము కర్మవలనఁ బుట్టు ననుటకు నెట్లును వీలులేదు. అట్లు పుట్టిన నిత్యము కావలసివచ్చును. మే మొక్కరమే కాదు. మోక్షము కలదని వాదించు వా రందఱును మోక్షమునకు ననిత్యత్వము నంగీక రింపరు; అది యెట్లనిన :—

ఉత్పాద్యము (క్రొత్తగాఁబుట్టునది), వికార్యము (పాలు పెరుఁగుగా మాఱినట్లు ఒకపదార్థమే మఱియొకవిధముగ మాఱుటచే జనించినది.), ప్రాప్యము (ఒక స్థలమునుండి మఱియొక స్థలమునకుఁ బోవునట్లు కొంతదూరముపోయి యాశ్రయింపవలసినదే), సంస్కార్యము (శుద్ధిచేయఁదగినది)అని కర్మఫలములు నాలుగువిధములగుట ప్రసిద్ధము. ఇందు, మోక్ష ముత్పాద్యమైనను వికార్యమైనను అనిత్య మగునను టలో సంశయము లేదు. మఱియు ఆత్మస్వరూపమే కావున నామోక్షము ప్రాప్యము కానేరదు. స్వస్వరూపముతో నిలుచుటకు నెవ్వఁడైనఁదా నున్నస్థలమును విడచి యన్యదేశమునకుఁ బోనఁ దలంచునా? ఇట్లు గాక మోక్షరూప మగు బ్రహ్మము జీవునకంటె భిన్నమే యనినను దత్ప్రాప్తికై యన్యదేశమునకుఁ బో నక్కఱ లేదు. ఆబ్రహ్మము సర్వగతము కదా? ఇదియునుగాక "మోక్షము సంస్కార్యము (గుణవృద్ధిని గాని దోషాభావమును గాని పొందింపవలసినది)" అనుటకు వీలు లేదు. బ్రహ్మమే మోక్షము కావునను, బ్రహ్మమునకంటె అధికమగునది ఏదియు లేకపోవుటవలనను, గుణవృద్ధిని చేయుటకు నింతయైన నవకాశము లేదు. నిత్యమగుటచే దోషసంస్పర్శము లేని దగుటచే దోషాభావముఁ గావింపవలయు ననుటయు సంభవింపదు. "ఇట్లు గాదు. అద్దము ఎప్పటికిని నిర్మలమే యైయున్నను పైన సోకినమాలిన్యమువలన నొక్కొకసమయమున నపరిశుద్ధముగాఁ గానవచ్చును. అప్పుడు బూడిద మొదలగు పదార్థములచేఁ దుడిచిన శుభ్రమై మఱల తనస్వాభావిక నైర్మల్యమును ప్రకటించును. ఇట్లే మోక్షరూపమగు బ్రహ్మముకూడ నిత్యశుద్ధమే యైనను పరిశోధనముచే తనస్వతస్సిద్ధనైర్మల్యమును ప్రకటించును" అని చెప్పెదవేమో, అదియు సరి కానేరదు. శోధనము చేయఁబడవలయు ననిన శోధకుఁడు (శోధనమును చేయువాఁడు), శోధ్యము (శోధనముచే సంస్కరింపఁ దగినది) అని రెండుపదార్థములును, శోధించుట యను క్రియయు నుండవలయును. ఆక్రియ యొక్కని నాశ్రయింపక స్వతంత్రముగ నిలువనేరదు. ఆశ్రయించినవాని కైనను వికారమును కలిగింపక స్థిరము కానేరదు. ఇది యనుభవసిద్ధ మగు విషయము. శ్రుతియం దన్ననో "ఏక మే వా ద్వితీయం బ్రహ్మ" "పరబ్రహ్మమునకు సజాతీయాదిభేదములు లేవు. అది యొక్కటియే"

అనియు "అవికారీ వా అయ మాత్మా" "ఈ యాత్మకు వికారములు లేవు" అనియుఁ జెప్పఁబడియున్నది. కావున నెట్లుచూచినను మోక్షము బ్రహ్మరూపమే కావున సంస్కారయోగ్యము కానేరదు.

ఇట్లగుటచే ఉపనిషత్తులకును కర్మకాండమునకును ఫలభేదము అనంతముగ నుండుటవలన నించుకయైనను సంబంధము లేదు. కర్మకాండము ప్రత్యేకశాస్త్రము; ఉపనిషత్తులును ప్రత్యేకశాస్త్రమే. ఇట్లగుటచే మోక్షము కర్మఫల మనుట యుక్తము కాదని వేఱుగాఁ జెప్ప నేల ? కర్మఫలము లనిత్యము లగుట సర్వప్రమాణసిద్ధము.

"ఇట్లు కాదు. కర్మఫలమైనను ఒకానొకటి నిత్యము కావచ్చును. కార్యములను కారణదృష్టితోఁ జూచిన సత్యములే యగును. కార్యకారణములకు భేదము లేకుండుట యందఱకును సమ్మతమే; కావున నట్టి దృష్టియు విరుద్ధము కాదుకదా!" అనియెద వేమోఁ వినుము. "కార్యములను కారణదృష్టితోఁ జూచుట" యనఁగ "కారణరూపమునకంటె కార్యరూపము ప్రత్యేకముగ లేదు" అని చూచుటయే కదా ! ఈచూపు వలన "కార్యము అసత్యము" అనియు "కారణము సత్యము" అనియు నేర్పడును; ఇట్లైన మోక్ష మసత్యమగును. దానికిఁ గారణ మని చెప్పఁబడిన కర్మము సత్యమగును. ఇంతియే కాని మోక్షమునకు నీచూపు వలన సత్యత్వ మేర్పడదు ; కావున "మోక్షము కర్మఫలము, లేక, ఉపాసనాఫలము" అని చెప్పినప్పుడు అదియు స్వర్గాదులకంటె కొంచె మధికమగుగతి మాత్రమే కావలసివచ్చును. అప్పుడు "అథాతో ధర్మజిజ్ఞాసా" "ఇఁక ధర్మములను విచారింపవలయును" అని యారంభింపఁబడిన పూర్వశాస్త్రమునందె చెప్పఁబడియుండుట తేటపడుచుటచే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని క్రొత్తశాస్త్రము నారంభించుట వ్యర్థమగును. పయిన నిరూపింపఁబడిన విధముగ ఉపనిషత్తులు చెప్పువిషయము భిన్నమై యుండ దానిని నిరూపించుటకై యన్యశాస్త్ర మారంభింపఁబడవలయు ననుటయు నావశ్యకము.

3-వసిద్ధాంతము :—మఱియు "ఆత్మా వా రే ద్రష్టవ్యః" అను మొదలగువాక్యములు నీవు తలంచినట్లు విధివాక్యములు ("నీవు ఇట్లు చేయవలయును" అని యాజ్ఞాపించువాక్యములు—కర్మను చెప్పువాక్యములు) కావు. "త త్కేన కం పశ్యేత్" "జ్ఞానదశయందు ఎవ్వఁడు ఏ

పదార్థమును దేనితోఁ జూచును? సర్వమును ఏకరూపమే కదా॥ "న దృష్టే ర్ద్రిష్టారం పశ్యేః॥" "చూపును చూచువానిఁ జూడలేవు॥" అను మొదలగు వాక్యములచే శ్రుతి "బ్రహ్మము జ్ఞానమునకు గోచరము కాదు॥" అని చెప్పుచున్నది. "య ద్వాచా ఽనభ్యుదితం యేన వా గభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥" అని "బ్రహ్మమును ఉపాసన చేయుటకు వీలు లేదు॥" అనియుఁ బ్రకటించుచున్నది. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥" "ఏ బ్రహ్మమునందు ప్రవర్తింప నేరక వాక్కులు మనస్సుతోఁ గూడి మఱలుచున్నవో॥" అను మొదలగు వాక్యములచే "బ్రహ్మము అవాఙ్మానసగోచరము॥" అని నిరూపించుచున్నది. కావున నిది బ్రహ్మమును విధిశేషమునుగాఁ జెప్పు ననుట సంభవించునా? ఎన్నటికిని సంభవింపనేరదు. ఐనను బహిర్ముఖుఁడై సంసారమునఁ బడి పొరలువాని నంతర్ముఖునిఁగాఁ జేయుటకై యట్టివాక్యములు పుట్టినవి. ఇంతియే. కాని విధించు నభిప్రాయముచేఁ గాదు.

౪-వసిద్ధాంతము :—జ్ఞానముకూడ మానసక్రియ కానేరదు. క్రియ పురుషునకు నధీనమై చేయుటకుఁగాని చేయకుండుటకుఁగాని ఒక విధముగాఁ జెప్పిన మఱియొకవిధముగఁ జేయుటకుఁ గాని శక్యమగుచుండును. "యోషా వావ గౌతమాగ్నిః॥" "ఓగౌతముఁడా! స్త్రీ యనున దియు నొకయగ్నియే; కావున స్త్రీయందు అగ్నిబుద్ధి నుంచి యుపాసింపుము॥" అను మొదలగు శ్రుతులయందు స్త్రీని అగ్నిరూపముతోఁ జూడుమనినచో పురుషుఁడు వేదవిశ్వాసముచే నట్లు చూచినను చూడ వచ్చును ; ఊరకున్న నూరకుండవచ్చును. ప్రత్యక్ష మగునగ్నిని గూర్చి "ఇది యగ్ని" అని చెప్పిన నట్లు సేయుటకు వీలు లేదు కదా ? ఇచ్చట వర్ణింపఁబడినవి రెండును మానసిక క్రియలే. మొదటిది ధ్యానము, రెండవది జ్ఞానము; కావున జ్ఞానము ప్రత్యక్షాదిప్రమాణములవలన కలుగునది యగుటచే నెట్టిమార్పును జెందక పురుషునకు నధీనము కాక ఎప్పటికి నొక్క విధముననే నిలిచియుండును. ఈ కారణమువలన మానస క్రియకును జ్ఞానమునకును హస్తిమశకాంతరము కలదు.

"బ్రహ్మము జ్ఞానమునకు విషయము కాదనినచో నప్పుడు శాస్త్రమా బ్రహ్మమును గూర్చి చెప్పుననుట సంభవింపదు. అప్పుడు మూలఘాతము సంభవించును కదా॥ అని సంశయింతువేమొ, వినుము. మా

సిద్ధాంతమున నిట్టిదోషము లేదు. శాస్త్రము బ్రహ్మమును తనకు విషయము చేసికొని "ఇది బ్రహ్మము. దీనిని చూడుము, లేక, ఉపాసింపుము" అని చెప్పదు ఇంక నేమనిన: "బ్రహ్మము నీస్వరూపమే. దానిని నీవు చూడలేవు, తెలిసికొనలేవు దానికిని నీకును భేదము లేదు. కావున దాని విషయమున నేకార్యములును పనికిరావు." అని మాత్రమే చెప్పును; తెలిసికొనువాఁడు, తెలివి, తెలిసికొనఁబడునది అను భేదములు పరబ్రహ్మవిషయమున లేవని నిరూపించును. ఇట్టి నిరూపణవలన నజ్ఞానకల్పిత మగుభేదమును తొలఁగించును: స్వస్వరూపస్థితి యగుమోక్షమును కలిగించును. "అన్య దేవ త ద్విదితా దథో అవిదితా దధి"= "ఆబ్రహ్మము తెలియఁబడుచున్న కార్యములకంటెను తెలియఁబడని కారణములకంటెను వేఱైనది" "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః, అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం" "ఎవ్వఁడు పరబ్రహ్మము (నా) బుద్ధికి గోచరము కాదు" అని తెలిసికొనునో వాఁడు బ్రహ్మరూపము నెఱింగినవాఁడు; ఎవ్వఁడు "నేను బ్రహ్మము ను తెలిసికొంటిని" అని తలంచునో వానికి బ్రహ్మరూపము తెలియదు. ఈకారణమునవలన ఆబ్రహ్మము తెలియువారికి తెలియనిది. తెలియనివారికిఁ తెలిసినది. బుద్ధికి సాక్షియైన బ్రహ్మము బుద్ధికి విషయమెట్లగును?" అను మొదలగు శ్రుతులు పైవిషయమును స్పష్టము చేయుచున్నవి; కావున నెట్లుచూచినను బ్రహ్మము ఉపాసనార్థమై శాస్త్రమున చెప్పఁబడలేదు.

పూర్వపక్షము :—ఇట్లయిన ప్రపంచమున బ్రహ్మశబ్దమునకు నర్థమే తెలియకపోవలయును. ఏల యనిన:—

లోకమున పదార్థములను గ్రహించుటకు విధినిషేధములు రెండుమాత్రమే మార్గము లై యున్నవి. అనుభవము కలవాఁడు "ఘటమును తెమ్ము" అని యొకపురుషునకు నాజ్ఞాపించినఁ దత్క్షణమే వాఁడు దానిని తెచ్చును. అప్పుడు దానియాకారమును చూచి పార్శ్వమునందున్న బాలుఁడు "ఇట్టి యాకారము కలవస్తువు ఘటశబ్దముచేఁ జెప్పఁబడును." అని ఘటశబ్దార్థమును తెలిసికొనును. ఇట్లే "నీవు ఆకుడ్యమును తాఁకవలదు" అని కుడ్యసమీపముననున్న యొకపురుషునకు నాజ్ఞనొసంగిన, వాఁడు తత్క్షణమే కుడ్యసమీపమునుండి యీవలకు

వచ్చును. దానిచే పార్శ్వమున నున్నబాలుఁడు "ఈపురుషుఁడు ఇంత వఱకు ఆకనఁబడుచున్న యున్నతపదార్థమునొద్ద నుండి 'కుడ్యమును తాఁకవలదు' అనఁగానే యీవలకు వచ్చెను. కావున నాపదార్థమే కుడ్య శబ్దముచే చెప్పఁబడును" అని కుడ్యశబ్దార్థమును తెలిసికొనును. ఇట్లుండ ఉపనిషత్తులు బ్రహ్మమును గూర్చి ఎట్టికార్యమును ఉపదేశింపకుండిన నాశబ్దమునకు నర్థ మెట్లు తెలియును ?

సిద్ధాంతము:— ఈ యభిప్రాయము సరికాదు. శబ్దార్థజ్ఞానము నకు విధినిషేధములు రెండు మాత్రమే కారణము లనుటకు వీలు లేదు, మఱియొకటి కారణము కాఁగూడదని నిర్బంధము లేదు. ఎవ్వఁ డైనను "నీకు పుత్త్రుఁడు కలిగెను" అని చెప్పినఁ దండ్రి యగువాఁడు సంతసించును. అప్పుడుకూడ పార్శ్వమునం దున్నబాలుఁడు "ఈతనికి సంతోషకర మగుపదార్థ మొక్కటి కలిగినది. అట్టిపదార్థమే పుత్త్రశబ్ద మునకు నర్థము" అని తెలిసికొనవచ్చును. "గ్రామములోనికి దొంగలు వచ్చిరి" అని విని భయము నొందువానిఁ జూచి పార్శ్వమునం దున్న బాలుఁడు "దొంగలు అనుపదమునకు భయహేతు వగునొకానొక పదార్థ మర్థము" అని తెలిసికొనును. ఇట్లు విధినిషేధములు లేకున్నను శబ్దార్థమును తెలిసికొనుట కుపాయము లనేకములు కలవు. ఇంతమా త్రమున నే శాస్త్రము పరబ్రహ్మమును విధిపూర్వకముగాఁ జెప్ప నక్కఱ లేదు. ఈకారణమువలన "పరబ్రహ్మము స్వతంత్రము ఉపాసనాదులకు శేషము కాదు. ఉపాసనవలన మోక్షము రాదు"అను సిద్ధాంతమున నేమి యుఁ గొఱఁత లేదు.

చతుస్సూత్రి సంపూర్ణము.

---

## ౫. ఈక్షత్యధికరణము.

సంగతి:—పైన వర్ణించినవిధముగ చతుస్సూత్రియందు "సర్వ జ్ఞమై సర్వశక్తులు కలిగి యుండు బ్రహ్మమే జగత్కారణము. వేదాంత వాక్యములన్నియు దానిని గూర్చియే ప్రవర్తించుచున్నవి"అను విష యము నిరూపింపఁబడి యున్నది. దానిపై "ప్రపంచము జడమైయున్నది. దీనికి చేతనము ఉపాదానకారణముగా నుండు ననుట యసంభవము,

దీనివలన బ్రహ్మము చేతనమో కాక యచేతనమో" అను సంశయము ముదయించును. దీనిని నివారించుటకై ఈయధికరణము మొదలుగల ప్రథమాధ్యాయమంతయు సామాన్యముగ ప్రవర్తించుచున్నది.

అందు సాంఖ్యులు "అచేతన మగు ప్రధానమే జగత్కారణము. లోకమున సుఖదుఃఖమోహములు కానవచ్చుచున్నవి. కావున వీనికిఁ గారణము లగుసత్త్వరజస్తమోగుణములే ప్రపంచకారణములు కావలయును. ఈప్రధానము గుణసముదాయరూపమే. కావున నిదియే ప్రపంచమునకుఁ గారణము" అని చెప్పుచున్నారు. వీరి యాక్షేపమునకు సమాధానము చెప్పుటకై ఈయధికరణ మారంభింపఁబడుచున్నది. ఈపక్షము సూత్రములందె యనువాదము చేయఁబడియుండుటచే నిచ్చట ప్రసంగసంగతి (దీని స్వరూపము అధి. ర. వర్ణక. ౨. సంగతి యందు వివరింపఁబడియున్నది) కాదు; ఆక్షేపసంగతియే.

విషయము:—ఈయధికరణమునందు "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్, తత్తేజోఽసృజత" "ఓశాంతుఁడా! ఈకనఁబడుప్రపంచమంత యును సృష్టికిఁ బూర్వమున సత్‌పదార్థరూపమై యుండెను. పిదప నాసత్పదార్థమె అగ్నిని సృజించెను" అను మొదలగు శ్రుతివాక్యములు సృష్టిని దెలుపునవి "బ్రహ్మమును చెప్పునో, ప్రధానమును చెప్పునో" అను విషయము స్పష్ట మగుటకై విచారింపఁబడును.

సందేహము:—ఇచ్చట సచ్ఛబ్దమునకుఁ బ్రసిద్ధార్థ మేదియు లేకుండుట సంశయకారణము. "జగత్కారణము ప్రధానము, బ్రహ్మము" అను రెండుపక్షములు క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు, పూర్వ పక్షమునకు "ప్రధానాత్మలకు నైక్యము సంభవింపదు. కావున ప్రధాన పురుషసంయోగమును (అనఁగా: సగుణబ్రహ్మమును, లేక, ప్రధానా తీతుఁ డగుపురుషుని) ఉపాసించుటవలన ముక్తి కలుగును" అనుట పూర్వపక్షమునకు ఫలము. "బ్రహ్మాత్మలకు నైక్యము సంభవించుట చేతను,అది స్వతస్సిద్ధమైకరూపమై నుండుటచేతను, తద్విషయకమగు జ్ఞానము మాత్రము కలిగిన మోక్షము దొరకును. ఆజ్ఞానమును సంపాదించు టకై శాస్త్రవిచారమును చేయవలయును" అనుట సిద్ధాంతమునకు ఫలము.

ఈపక్షముల ఆశ్రయించి ఈక్రిందివిధముగ సంశయము కలుగును:—

వేదములు బ్రహ్మమును చెప్పు ననుట సంభవింపదు. ఎవ్వఁ డెన్ని చెప్పినను స్వతస్సిద్ధమై సర్వవ్యాపకమై యున్నపదార్థము ప్రత్యక్షాదులకు గోచరము కాకపోదు. మఱియు బ్రహ్మము ఏకరూపమైనదియే యని చెప్పఁబడియుండుటచే దానియందు జ్ఞానశక్తి గాని క్రియాశక్తి గాని ఉండుటకు వీలు లేదు. ప్రధానమన్ననో అది త్రిగుణాత్మకము. దానియందు సత్వగుణము కలదు. కావున జ్ఞానంబును రజస్తమోగుణములు కూడ నున్నవి. కావున క్రియాశక్తియు నిర్వివాదముగ నుండవచ్చును. ఇదియునుగాక ఏకరూప మగుటచే బ్రహ్మము ప్రపంచరూపముగ పరిణమించె ననుటకు వీలు లేదు; కాని సావయవ మగుటచే (సత్త్వాదిగుణములను మూఁడవయవములతోఁ గూడిన దగుటచే) ప్రధానమునకు నిది విరుద్ధము కానేరదు.

అవతారిక:—ఈసంశయమును నివారించుచు "వేదము బ్రహ్మమునుగూర్చియే చెప్పును" అని సిద్ధాంతము చేయుచున్నాఁడు.

---

## ౫. * ఈక్షతే ర్నాశబ్దమ్. ౧. ౧. ౫.

తాత్పర్యము:—వేదాంతములు సృష్టిని వర్ణించునప్పుడు కాని, మఱి యెచ్చటనైనను కాని బ్రహ్మమును విడిచి యన్యపదార్థమును చెప్పవు. కావున నీప్రధానము జగత్కారణము. కాదు ఉపనిషత్తుల

* "ఇక్తిపౌ ధాతునిర్దేశే" "ధాతువును (క్రియను) నామరూపముగ నిర్దేశింపవలసివచ్చినప్పుడు (ఈక్ష + తి) అను ప్రత్యయములను చేర్చి ఇకారాంతశబ్దరూపములతోఁ జెప్పవలయును." అను వ్యాకరణనియమము ననుసరించి యిట నీక్షతిశబ్దము ఈక్షధాతువునకు తిప్రత్యయముఁ జేర్చుటచే నేర్పడినది. కావున దీనికి "ఈక్షధాతువు వలన" అని యర్థము. "వేదమునందుఁ జెప్పఁబడకుండుటచే ప్రధానము జగత్కారణము కాదు; అవేదమున నీక్షధాతువు కలదు" అనిన వాక్యార్థము కుదురదు. కావున నీయీక్షతిశబ్దమువలన లక్షణావృత్తిచే "చూపు" అను నర్థమును గ్రహింపవలయును. "వేదమునందు చూపునుగూర్చి చెప్పఁబడియుండుటవలన చూచుటకు సమర్థము కాని యచేతనపదార్థము జగత్కారణము కాదు." అని యర్థము చెప్పవలయును.

యందు "సృష్టికర్త సంకల్పించెను" అని, "స ఐక్షత" "ఆసృష్టికర్త సంకల్పించెను" అను వాక్యముచేఁ జెప్పఁబడియున్నది. ఈసంకల్పము అచేతనమునకు శక్యము కాదు కదా? "ప్రధాన మచేతనము" అని మీరే యంగీకరించియున్నారు కదా?. బ్రహ్మమునకు జ్ఞానమే స్వరూపము కావునను, అది నిత్యము కావునను, "జ్ఞానశక్తియొకటి; తద్భిన్నముగ దాని కాశ్రయభూతమగు బ్రహ్మము మఱియొక్కటి" అను భేదమే మొట్టమొదట సంభవింపదు. వాస్తవస్థితిలో క్రియ యను నదియే లేక పోవుటచేతను, "ఉన్నది" అని చెప్పిన యెడల నది మాయామయ మగుట చేతను, మాయాసహితుఁడగు పరమేశ్వరుఁడు మామతమునందును అంగీకరింపఁబడియే యుండుటచేతను, క్రియాశక్తి సర్వశక్తుఁడగు నప్పరమేశ్వరునికే కలదు. ప్రధానమునకు జ్ఞానశక్తి గలసత్వగుణ మున్నను జ్ఞానప్రతిబంధశక్తి కలరజస్తమోగుణములుకూడ నుండుటచేత "ప్రధానము సర్వజ్ఞము" అని చెప్పుటకు వీలులేదు. "ప్రపంచకారణము ప్రపంచరూపముగాఁ బరిణమించెను" అనునది మొట్టమొదట సిద్ధాంతమైననే కాని "బ్రహ్మము ఏకరూప మగుటచే ప్రపంచరూపముగఁ బరిణమింపదు" అనుటకు వీలు కలుగదు. ఈవిషయము "న విలక్షణత్వాదస్య తదాత్మ్యం చ శబ్దాత్" (౨.౧.౪.) అనుసూత్రమున విమర్శింపఁబడును కావున నెట్లు చూచినను ప్రధానము జగత్కారణము కానేరదు.

పూర్వపక్షము:—"సత్త్వాత్సంజాయతే జ్ఞానం"—"సత్త్వగుణమువలన జ్ఞానము జనించును." అని గీతలయందుఁ జెప్పఁబడియున్నది. కావున మీసిద్ధాంతము సరి కాదు. సర్వరజస్తమోగుణములు గల ప్రధానమే జ్ఞానమునకు నాశ్రయ మగుటచే జగత్కారణము కావలయును.

సిద్ధాంతము:—ఇట్లనఁగూడదు. సత్త్వగుణమువలె రజస్తమోగుణములుకూడ ప్రధానమునకుఁ గలవు కదా? అవి జ్ఞానమునకు నాటంకము లనుట నిర్వివాదము.

మఱియొక విశేషము. సత్త్వగుణమువలన జనించిన దనినచో జ్ఞానము మనోవృత్తిరూపం బైనదియే యనవలయును. నిత్యజ్ఞానమునకు నొకస్థలమునుండి యుత్పత్తి కలదనుట యసంభవము కదా? ఇట్ల

యినచో నాసత్త్వజన్యజ్ఞానమునకు సాక్షి కావలయును. సాక్షి లేదనిన "ఇది జ్ఞానము" అని తెలిసికొనుట సంభవింపదు. లోకమున జ్ఞానము సర్వజనప్రసిద్ధమేకదా ?.

ఇప్పుడు చెప్పుము. ప్రధానమునకంటె నధికమై సాక్షియై యుండుపదార్థము లేకున్న నీజ్ఞానమునకు సాక్షి ఎవ్వఁడు? ప్రధానము చేతనమనుట మీకు సమ్మతమే కదా ?

ఇట్లు కాక జయేచ్ఛచే సేశ్వరసాంఖ్యులమతము (సేశ్వరసాంఖ్యులనఁగా: యోగులు. వారు ప్రధానమునకంటె నధికుఁడై ఈశ్వరుఁడున్నాఁడనియు జీవులు యోగాభ్యాసబలముచే అణిమాదిసిద్ధులను జెందిన నా యీశ్వరునితో సమానులగుదురనియు అదియే మోక్షమనియుఁ జెప్పుదురు.) నవలంబించి "ప్రధానాతిరిక్తుఁ డగుసీశ్వరుఁడే యాజ్ఞానవృత్తికి సాక్షి" అని చెప్పుదు రేని యదియు సరికాదు. ఆసేశ్వరసాంఖ్యులు ప్రధానమునకుఁ గలసర్వజ్ఞత్వము కూడ దానియందు సంబంధపడియున్న పరమేశ్వరునివలననే కల్గెననుచున్నారు. అగ్ని ఇనుముతో సంబంధపడినప్పుడు లోకులు "ఇనుము కాల్చుచున్నది" అని యగ్నిధర్మమును ఇనుమునందు ఆరోపించి వ్యవహరించుచున్నారనియు, ఇట్లే పురుషసంబంధమువలన ప్రధానమునకుఁ గూడ సర్వజ్ఞత్వము కలదని వ్యవహరించుచున్నారనియు, ఇదియే ప్రధానమునకు సర్వజ్ఞత్వము కలదనుటకుఁ దాత్పర్యమనియుఁ జెప్పుచున్నారు. ఇంతియే కాని వారు మీవలె "సత్త్వగుణము కలదు. కావునఁ బ్రధానము సర్వజ్ఞము" అని చెప్పుట లేదు కదా ?

అది యటుండె. వారిమతముకూడ సమంజసము కానేరదు. ఏపరమేశ్వరుని యనుగ్రహమువలన బ్రధానమునకు సర్వజ్ఞత్వము కలిగెనో అట్టి పరమేశ్వరునకు సర్వజ్ఞత్వము లేదనుట ఏటియుక్తి? కావున నెట్లు చూచినను ప్రధానము సర్వజ్ఞము కానేరదు. ప్రపంచకారణమును గానేరదు. అచేతనమగుటచే దానికిఁ గ్రియాశక్తి కలదనుటయు యుక్తము కాదు. "అయస్కాంతము అచేతనమయ్యు ఇనుమును ఆకర్షించుచున్నదికదా? ఇట్లె ప్రధానముకూడ అచేతనమయ్యుఁ బ్రపంచమును నిర్మించుచున్నది. కావున ప్రధానమునందుఁ గ్రియాశక్తి కల

దనుటలో విరోధము లేదు" అనియెదవేమో వినుము. "రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే, ప్రకాశం చ ప్రవృత్తించ" "రజోగుణము అభివృద్ధియై యున్నకాలమున మృతి నొందిన పురుషుఁడు కర్మాసక్తి గలవారలలోఁ బుట్టును. సత్వగుణకార్యమైన జ్ఞానరూపప్రకాశమును రజోగుణకార్యమైన కర్మాసక్తిని, లేక, వ్యాపారమును" అను మొదలగు వాక్యములచే స్మృతి "క్రియ రజోగుణమునకు స్వాధీనమైనది. రజోగుణము నుండియే జనించినది" అని చెప్పుచున్నది. ప్రధానమునం దన్ననో సత్త్వగుణమునకువలె రజోగుణమునకుఁ గూడ విరుద్ధమైనతమోగుణము కలదు. ఇట్లగుటచేత నీప్రధానమునకు జ్ఞానశక్తివలెనే క్రియాశక్తికూడ సంభవింపదు. కావున ప్రధానము జగత్కారణము కాదు. వేదాంతవాక్యములు ప్రధానమునందు సమన్వయింపవు.

౧-వ పూర్వపక్షము:—ఇట్లయిన మీ బ్రహ్మము కూడ జగత్కారణము కానేరదు. అది ఏకరూపమే యగుటచే దానియందు క్రియాజ్ఞానశక్తు లుండవు.

౨-వ పూర్వపక్షము:—"జ్ఞానరూపుఁడే పరమేశ్వరుఁడు. జ్ఞానశక్తియని యొకపదార్థ ముండ నక్కఱలేదు" అనియెదవేమో అట్లయిన నప్పు డాతని సర్వజ్ఞుఁడనికాని కించిజ్జ్ఞుఁడని కాని చెప్పుటకు వీలు లేదు. లోకమున సత్త్వగుణ మెవ్వరికి అధికముగ నుండునో వాఁడు సర్వసిద్ధుల నొంది సర్వజ్ఞుఁడని పిలువఁబడుచున్నాఁడు. కావున నెవ్వఁడు చెప్పినను "సర్వవస్తువులను తెలిసికొను తెలివి ఎవ్వని నాశ్రయించి యున్నదో వాఁడే సర్వజ్ఞుఁడు" అనియే చెప్పి తీరవలయును.

3-వ పూర్వపక్షము:—మఱియొకవిశేషము. ఇట్లు బ్రహ్మము జ్ఞానాశ్రయమే యన్నను మీకు విరోధము రాకపోదు. జ్ఞానము నిత్యమా? అనిత్యమా ? నిత్య మనిన దానివిషయమున బ్రహ్మమునకు స్వాతంత్ర్యముండదు. కావున సర్వజ్ఞుఁడు కానేరఁడు. అనిత్య మనిన నాజ్ఞాన మొకప్పు డుండుటకును మఱియొకప్పుడు లేకపోవుటకును అవకాశ ముండుటచే నాయన సర్వజ్ఞుఁడు కానేరఁడు. జ్ఞానమనునది 'పని' యనుటలో వివాదమేమియు నుండదు, కావున దానివిషయమై స్వాతంత్ర్యము లేనివాఁడుదాని నాచరింపనేరఁడు కదా?

౪-వ పూర్వపక్షము:—సృష్టికి పూర్వమున బ్రహ్మ మొక్కటిమాత్రమే యుండుటచే నప్పుడు దానికి గోచరంబగుపదార్థ మేదియు నుండదు గావున దాని సర్వజ్ఞత్వమును శ్రమపడి సాధించినను ప్రయోజనము కలుగదు.

౫-వ పూర్వపక్షము:—అజ్ఞానముకూడ దేహాదిసంబంధము లేక సంభవింపదు కావునను, బ్రహ్మమునకు దేహాదులు లేకపోవుటచేతను గూడ మీమతము యుక్తికి నిలువదు.

౧-వ సిద్ధాంతము:—మీవాదము సరియైనది కాదు. సృష్టిని తెలుపువేదాంతవాక్యము లన్నియు సర్వజ్ఞునివలనఁ బ్రపంచము జనించె ననుచున్నవి. ఆసర్వజ్ఞత్వము బ్రహ్మభిన్నపదార్థములకు సంభవింపదని ఇదివరకే నిరూపించియున్నాము.

"క్రియ కలదు" అను విషయము మొట్టమొదట దృఢమైనఁగదా "క్రియాశక్తి బ్రహ్మమునకుఁ గలదా? లేదా?" అనువిచారము!. మొట్టమొదట నాక్రియకే యునికి తటస్థింపదు. "ఏకమే వాద్వితీయం బ్రహ్మ. మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" "బ్రహ్మము ఒక్కటియే; రెండవపదార్థ మేదియు లేదు. ఎవ్వఁడు రెండవపదార్థము కలదని భావించునో వాఁడు మరణమునుండి మరణమును చెందును" అని శ్రుతి విధినిషేధపూర్వకముగా భేదమును నిరాకరించుచున్నది. యుక్తియు దాని ననుసరించుచున్నది. భేదస్వరూపమును (భేదలక్షణమును) తెలుపవలయు ననిన మొట్టమొదట "రెండు పదార్థములు కలవు" అనువిషయము తెలియవలయును "రెండు పదార్థములుకలవు" అని తెలిసికొనవలయు ననిన మొట్టమొదట భేదస్వరూపము నెఱుంగవలయును. ఇట్లు ఒకదాని నొకటి యపేక్షించుచుండుటచే నన్యోన్యాశ్రయదోషము కలుగుచున్నది. ఈదోషమువలన భేదమునకు "ఇది స్వరూపము" అని యేర్పడదు. స్వరూపములేనిపదార్థమున్నదనుట సంభవింపదుకదా? అనుభవంబును, "భేదము లేదు" అను విషయము నిట్లే యనువర్తించుచున్నది. లోకమున "నీవు" అను శబ్దమునకు నర్థమగుపురుషుఁడే "నేను" అనుశబ్దమునకు నర్థ మగుచున్న దనుట ప్రసిద్ధమే కదా! అదేనవిధార్థముననే ... అనుశబ్దము

నకు నర్థమగుచున్నను "నేను" అని వ్యవహరించుకొనలేకున్నను, "నీవు" అనుశబ్దమునకు నర్థమగుపురుషులవలె భేదదృష్టితోఁ జూడఁబడుచున్నవి. కావున "నేను" అనుపదమునకు నర్థము లగును; తనతో నేకరూపములే యగును. ఈవిధముగ శ్రుతియుక్త్యనుభవములచే భేదమనునది శూన్యమయ్యెను. క్రియ—కర్త, కర్మ, సాధనము, ఫలము, హేతువు, ఆధారము అను నాఱుపదార్థములు లేక ప్రవర్తింపదు. ఇట్లుండ క్రియ కలదనియు, బ్రహ్మ మేకరూపమగుటచే నందుఁ గ్రియ యుండుటకు వీలులే దనియుఁ జెప్పుట యనుచితము. కావున నింత మాత్రమునవలన బ్రహ్మమునకు జగత్కర్తృత్వహాని కలుగనేరదు.

మఱియు "పరబ్రహ్మమునకు జ్ఞానశక్తి యుండుటకు వీలు లేదు." అనుట యుక్తియుక్తము కానేరదు. పయిన వర్ణించినవిధముగ భేదమనునది యసత్యమే యగుటచే, జ్ఞానశక్తి యని యొక్కటి బ్రహ్మమునకంటె భిన్నముగ నుండుటకు వీలు లేదు. ఇట్లుండ "జ్ఞానము బ్రహ్మము నాశ్రయించును" అని చెప్పుట యెట్లు సంభవించును? కావున జ్ఞానము బ్రహ్మమునకు స్వరూపమే యై తీరవలయును. సర్వవస్తువులను స్వాభావికముగాఁ బ్రకాశింపఁజేయునది కావున నాబ్రహ్మమును సర్వజ్ఞమనవచ్చును. సూర్యుఁడు ఏమియుఁ జేయకున్నను, కేవలము కాంతిని మాత్రమే కలిగియున్నను, "సూర్యుఁడు సర్వమును ప్రకాశింపఁజేయును" అని లోకులు వ్యవహరించుచున్నారు. కదా? సూర్యునిసాన్నిధ్యము వలన వస్తువులు ప్రకాశించినట్లు బ్రహ్మసాన్నిధ్యమువలన భ్రాంతికల్పితమగునీసర్వమును ప్రకాశించుచున్నది. ఇట్లగుటచే బ్రహ్మము జగత్కారణ మగుటలో సంశయము లేదు.

ఇదియునుగాక జ్ఞానము క్రియయనుటయే యసంభవము. (జ్ఞానమునకును క్రియకును కలభేదము నాల్గవయధికరణమున రెండవవర్ణకమున నిరూపింపఁబడి యున్నది.) కావున సర్వజ్ఞుఁడు కర్త కానక్కఱ లేదు.

జ్ఞానము బ్రహ్మరూపమే యగుటచేత నది యనిత్యము కాదు. అది స్వస్వరూపమే యగుటచే బ్రహ్మమునకు దానియందు స్వాతంత్ర్యము లేకపోవుననుట సంభవింపదు; లేకపోయినను హాని లేదు.

మనోవృత్తిరూప మగుజ్ఞానమే యనిత్యము గాని మేముచెప్పుబ్రహ్మరూప మనిత్యము కాదు.

౪వ సిద్ధాంతము:—"సర్వజ్ఞుఁ డగువానికి విషయము లేకున్నఁ బ్రయోజనము లేదు. దేనినైన నొకదానిని చూచుచుండిననే కాని జ్ఞాన మనునది వ్యవహారయోగ్యము కాదు; స్వరూపసిద్ధినిఁ గూడఁ జెందదు." అనుటయు సయుక్తికము కాదు. లోకమున కర్మసంబంధ ముతో నావశ్యకత లేకయే "సూర్యుఁడు ప్రకాశించుచున్నాఁడు." అని యేమియుఁ జేయనిసూర్యునిఁ గర్తగ వ్యవహరించుచున్నారు కదా! ఇట్లే ఏమియుఁ జేయనివాఁ డయినను పరమేశ్వరునిఁ గర్తగఁ జెప్పుచున్నారు. ఇందు విరోధ మేమి?

౫-వ సిద్ధాంతము:—"ఇట్లు చెప్పుట సరికాదు. ఈక్షతి యను క్రియ సకర్మకము. కావున దానికి నవశ్యముగఁ గర్మ యుండవలయును." అనియెదవేమొ, అట్లైనను విరోధము కలుగదు. "ఇది యిట్టిది; కలదు; లేదు" అని నిరూపించుటకు వీలులేనిదై యీప్రపంచము మొట్టమొదట (అనఁగ:సృష్టికిఁ బూర్వమున,) బీజమునందున్న వృక్షమువలెఁ గారణము నందు నిలిచియుండును. సృష్ట్యారంభమున నదియే ప్రకటించుట కుద్దేశింపఁబడును. ఇట్టి యీసూక్ష్మప్రపంచమే బ్రహ్మచేసిన యీక్షణము నకుఁ గర్మ యైనను కావచ్చును కదా!

పైనిరూపించిన యుక్తులవలన బ్రహ్మమునకు "శరీరాదుల సంబంధముచేతనే కాని జ్ఞానము కలుగదు" అను నియమముతోఁ బని లేదని మఱియొక్కమాఱు చెప్ప నక్కఱ లేదు కదా. ఇదియునుగాక ప్రత్యక్షమ్ము ననుసరించిచూచినను, ఆదేహాదులు సర్వవ్యాపకత్వమునకును సర్వజ్ఞత్వమునకును భంగము కలిగించునవియె. సర్వజ్ఞు లనఁబడు యోగులు గూడ తనకంటె భిన్న మగుపదార్థమును గ్రహించువారే కాని సంపూర్ణవిజ్ఞానము (సర్వము నొక్కటియే యనుజ్ఞానము) కలవారు కారు కదా? ఇదియునుగాక వారిదృష్టి చైతన్యదృష్టి. సత్వగుణము అత్యుత్కర్షమును జెందుట యనఁగా, సాధనమువలన (యోగసాధనము వలన) రజస్తమోగుణసంబంధము విడిచి నిర్మల మగుటయే. అప్పుడు దానియందు చైతన్యప్రకాశము, పరిశుద్ధమగు నద్దమునందు ముఖము వలె విస్పష్టముగ ప్రతిబింబించును, లేక, ప్రకాశించును. ఆచైతన్యము

సర్వజ్ఞము కావున వారికిని (శుద్ధసత్వము కలవారికిని) సర్వజ్ఞత్వము కలుగును. కావున బ్రహ్మమునకు దేహాదిసంబంధము కలిగిననేకాని జ్ఞానము సంభవింప దన నవసరము లేదు. అజ్ఞానము, కామము, కర్మ మొదలగు వానిచే నావరింపఁబడిన జీవునకు జ్ఞానప్రకాశము కలుగుటకై మనస్సు మొదలగు కరణములయొక్క (సాధనములయొక్క) సాహాయ్యము కావలయును. బ్రహ్మము ఆవరణములు లేనిది గావున దానికి నట్టిసాహాయ్యముతో నవసరము లేదు. "న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే, పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" "ఆబ్రహ్మమునకు కార్యమును సాధనంబులును లేవు. ఆయనకంటె నధికుఁడుగాని ఆయనతో సమానుఁడు గాని లేఁడు. ఆయనశక్తి బహువిధము లైనది. జ్ఞానంబును బలమును వానికి సంబంధించిన కర్తృత్వంబును ఆయనకు స్వభావసిద్ధములె; (ఇచ్చట కర్తృత్వ మనఁగ: * సాన్నిధ్యమాత్రసాధ్య కర్తృత్వము)" అని యీవిషయమును శ్రుతి ప్రకటించుచున్నది.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కాదు. "నాన్య అతోఽస్తి ద్రష్టా, నాన్య అతోఽస్తి శ్రోతా" "ఈజీవునికంటె భిన్నుఁడగు ద్రష్టయు లేఁడు. శ్రోతయు లేఁడు" అను మొదలగుశ్రుతి, జీవబ్రహ్మలకు భేదము లే దనుచున్నది. ఇట్లుండ "జీవునకు నావరణములు కలవు" అనియు "ఈకారణమువలన నాతనికి జ్ఞానప్రకాశమునకై మనస్సు మొదలగు

---

* లోకమునఁ గర్తృత్వము (కార్యమును జేయుట) రెండువిధములుగ నున్నది. సాధనసాధ్యకర్తృత్వము-సాన్నిధ్య సాధ్యకర్తృత్వము.

సాధనసాధ్యకర్తృత్వము:—ఎవ్వఁడు పనులఁ జేయ నుద్దేశించునో వాఁడే స్వయముగ సాధనములను (చక్రము ఆయుధము మొదలగువాని) గైకొని కార్యము నాచరించుట.

సాన్నిధ్యసాధ్య కర్తృత్వము:—తా నేమియుఁ జేయకయే పరులచే సర్వకార్యముల నిర్వహింపఁజేయుట; ఈరెండును లోకమునఁ బ్రత్యక్షములైయే యున్నవి. పరమేశ్వరునకు నీసాన్నిధ్యసాధ్య కర్తృత్వమే కలదు. ఆయన నిర్వికారుఁడై యుండి, సూర్యుఁడు తా నేమియుఁ జేయకుండియుఁ దనసహజప్రకాశమువలన సర్వజనుల స్వకీయ కార్యములందుఁ బ్రవర్తింపఁజేయునట్లు సర్వేంద్రియములను, లేక, మూలావిద్యను స్వకార్యములయందుఁ బ్రవర్తింపఁజేయును.

సాధనములు కావలయును" అనియు "బ్రహ్మమునకు నావరణములు లేవు. కావున నాయనకు దేహాదులతోఁ బని లేదు." అనియుఁ జెప్పుట యయుక్తముకదా ?

సిద్ధాంతము:—నిశ్చయమే! అయినను ఒకవిశేషము కలదు. ఉన్నది యని కాని లేదని కాని నిరూపించుటకు వీలులేనిదై యవిద్య యనునొకపదార్థము కలదు. అది సర్వానుభవసిద్ధ మైనదియే. శ్రుతులు "జీవబ్రహ్మములకు భేదము లేదు"అనువిషయము నెన్నిమాఱులు బోధించుచున్నను, వివేకము ఎన్నివిధములఁ దెల్పుచుండినను, జ్ఞానుల యనుభవము ఎన్ని తెఱంగుల స్పష్టమగుచున్నను, జనులందఱును "నా కేమియుఁ దెలియదు. నాకు సుఖదుఃఖములు కలవు"అని యిట్లు తమకు స్వాభావికములు కానివానిని తమయం దారోపించుకొనుచున్నారు కదా ?

ఈయవిద్యవలన జీవబ్రహ్మలకుఁ గల్పితభేద మేర్పడినది. జీవబ్రహ్మాభేద మొక్కటియే యన నేల? బ్రహ్మమునుండి ప్రపంచము పుట్టె ననుటయు బ్రహ్మమునకు ప్రపంచకర్తృత్వము కల దనుటయు, ఏకస్వరూపముతో నున్నను ఆబ్రహ్మము జగద్రూపముతోఁ బరిణమించు ననుటయు, పరిణమించుట సంభవింపదు కావున త్రాటియందు సర్పము తోఁచునట్లు (భ్రాంతిచే) బ్రహ్మమునందు ప్రపంచము తోఁచుచున్నదని చెప్పుటయు నెల్ల నాయవిద్యాప్రభావమువలననే; కావున బ్రహ్మమే సర్వజ్ఞము. ప్రధాన మట్టిది కాదు. ఈ కారణమువలన శ్రుతియందు "ఆలోచించెను" అని చెప్పఁబడియుండుటచే నచేతన మగుప్రధానము సృష్టికర్త కానేరదు.

---

## అ ౧. పా ౧. సూ ౬. ఆరంభము.

పూర్వపక్షము:—ఇది సరికాదు. "ఆలోచన" అనుశబ్దము శ్రుతియందున్నంతమాత్రమున ప్రధానమునకు జగత్కారణత్వము కలుగక పోదు. లోకమున చేతనవ్యాపారము లనేకము లచేతనములందు గౌణముగాఁ జెప్పఁబడుచున్నవి. నదిగట్టు పడఁబోవుచుండినయెడల దానిఁ జూచి "గట్టు పడఁదలంచుచున్నది" అని చెప్పునలవాటు కలదు. ప్రకృతము ప్రధానమునందుఁ గూడ నిట్టివ్యవహార ముండుటలో సంశయము లేదు. లోకమున చేతనుఁడగుపురుషుఁడు "నేను మధ్యాహ్నము భోజ

నముచేసి పిదప రథము నెక్కి యూరికిం బోయెదను" అని నిశ్చయించి అట్లే నియమముగా నాచరించును. అట్లే ఈప్రధానముకూడ సంకల్పము లేకపోయినను మహదహంకారాదిరూపములతో నియతముగఁ బరిణమించును. ఈపోలికవలన (నియమము రెండుస్థలములయందును కలదను పోలికవలన) చేతనధర్మ మచేతన మగుప్రధానమునం దారోపింపఁబడు చున్నది.

"ఇట్లయిన ముఖ్యమగు చేతనమును విడిచి అముఖ్యమగు నచేతనము ను గ్రహింపనేటికి? వేదము అచేతనమునకే సంకల్పము కల దని చెప్పుచున్నది యన నేటికి? ఇట్లు చెప్పుట విరుద్ధముకదా?" అనియెద వేమో, వినుము. వేదము అనేకస్థలముల నిట్లే యౌపచారికముగ నచేతనములయందుఁ జేతనధర్మముల నారోపించి యున్నది. "త త్తేజ ఐక్షత— ఆప ఐక్షంత" "ఆ తేజస్సు సంకల్పించెను—జలము సంకల్పించెను" అని ప్రకృత మగు నీక్షణ క్రియనే అచేతనము లగు తేజోజలాదులకుఁ గలదానిఁగాఁ జెప్పియున్నది. ఇట్లే ప్రధానమునుగూర్చికూడ నీక్షణక్రియను చెప్పియుండవచ్చును. ఇంతమాత్రమువలనఁ బ్రధానము జగత్కారణము కాకపోదు.

అవతారిక:— ఈపూర్వపక్షమును నిరాకరించుటకై ఈక్రింది సూత్ర మారంభింపఁ బడుచున్నది.

---

## ౬. గౌణ శ్చే న్నాత్మశబ్దాత్. ౧. ౧. ౬.

తాత్పర్యము(సిద్ధాంతము):—"సేయం దేవ తైక్షత, హంతాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి" "నేను సూక్ష్మరూపముగ సృష్టింపఁబడియున్న యీ యగ్న్యాదిభూతములయందు ఆత్మభిన్నము కాని జీవరూపముతోఁ బ్రవేశించి వీనినామరూపముల విస్తరింపఁజేయుదునుగాక' అని ఆసృష్టి కర్త్రియగు దేవత తలంచెను." అని శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. దీనిచే సృష్టికర్తకును ఆత్మశబ్దముచేఁ జెప్పఁబడినజీవునకును భేదము లేదని తెలియుచున్నది. మీమతమునందుఁగూడ జీవుఁడు చేతనుఁడే కదా. మఱియు "స ఏషోఽణిమా; ఐతదాత్మ్య మిదం సర్వం; తత్స త్యం; స ఆత్మా; తత్త్వమసి శ్వేతకేతో" "ఆసృష్టికర్తయే సూక్ష్మ

రూపుఁడు; ఈకనఁబడు ప్రపంచమంతయును ఆయనకంటె భిన్నము కాదు; వికారము లన్నియు అనిత్యములు కావున ఆజగత్కారణమగు పదార్థమొక్కటియే సత్యము; అదియే యాత్మ; ఓ శ్వేతకేతుఁడా! అదియే నీవు." అని శ్రుతియందు చేతనుఁడగు శ్వేతకేతునిగూర్చి "నీవే జగత్కారణము." అని చెప్పఁబడియున్నది. దీనిఁబట్టి చూచిన ఆత్మశబ్దము చేతనవాచక మనియు, దానికిని జగత్కారణమునకును భేదము లేదని చెప్పఁబడియుండుటచే జగత్కారణముకూడఁ జేతనమే యనియు స్పష్ట మగుచున్నది. ఇట్లగుటచే నిట నీయూహలు చెల్లవు. ఈక్షణశబ్దము ప్రధానమునందు గుణముగాఁ బ్రయోగింపఁ బడలేదు.

"ఇట్లయిన 'త త్తేజ ఐక్షత' అనుమొదలగు వాక్యములకు నభిప్రాయ మేమి?" అనియెదవేమొ, వినుము. ఆ తేజోజలాదులు అచేతనము లగుటచే వానికి సంకల్పము లేదనుట నిశ్చయము. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డగుటచేతను, సర్వకారణభూతుఁ డగుటచే నాయనకును తేజోజలాదులకును భేదము లేకపోవుటచేతను, కార్యకారణములకు భేదము లేదనుట నిర్వివాదమే యగుటచేతను, "సత్పదార్థముచే నధిష్ఠింపఁబడి ఈ తేజస్సు మొదలగునవి సంకల్ప పూర్వకముగా స్వ * వివర్తరూపములగు నుత్తరభూతముల సృజించెను" అనునభిప్రా

---

* లోకమున నేపదార్థమైనను జనింపవలయుననిన నాజన్మమునకు ఆరంభమనియుఁ బరిణామ మనియు రెండుకారణము లుండును.

ఆరంభము:—కొన్నిపదార్థములు ఒకదానితో నొకటి చేరి తనసముదాయము వలన మఱియొకపదార్థమును బుట్టించుట; నూలుపోగులు ఒకదానితో నొకటిచేరి వస్త్రము నేర్పఱుచుచుండుట ప్రత్యక్షమేకదా.

పరిణామము:—కారణ మగుపదార్థమే అన్యసహాయముచే కార్యరూపమును జెందుట; పాలు తక్రసాహాయ్యముచే పెరుఁ గగుచున్నది. మృత్తిక కుమ్మరవాని సాహాయ్యముచే కుండగ మాఱుచున్నది కదా!

ఇతర మతస్థు లందఱును జన్మములకెల్ల నీరెంటిని మాత్రమే కారణములనుగా నంగీకరించి యున్నారు. మనుష్యులు మొదలగువాని శరీరముల యుత్పత్తికిఁ గూడ శుక్రశోణిత పరిణామమే కారణ మనుచున్నారు. వేదాంతులు (అద్వైతులు) వివర్త మను మఱియొక కారణమువలనఁ గూడఁ బదార్థోత్పత్తి కలుగవచ్చుననుచున్నారు.

వివర్తము:—ఒకపదార్థము స్వస్వరూపమున కేమియు హాని కలుగకుండఁగనే యన్యపదార్థరూపమును జెందుట; ఇది తఱచుగ భ్రాంతివలననే సిద్ధించును. చీఁకటి

యముతో శ్రుతి "త త్తేజ ఐక్షత" అను మొదలగు వాక్యములను చెప్పి యున్నది.

---

---

యందు త్రాటిని జూచినపురుషుఁడు దానిని పాముగాఁ దలంచుట కలదు. అప్పుడు పాము జన్మించిన దనియె చెప్పవలయును కదా! అప్పుడు వానికి నాత్రాటియందు సర్పచేష్టలన్నియుఁ గానవచ్చు ననుట కూడ ననుభవసిద్ధమే. ఇఁక విచారింపుఁడు. ఈసర్పజన్మము నకుఁ గారణ మేది? ఆత్రాటియందు సర్పావయవములు లేకపోవుటచే నారంభము కాదు; సర్పదేహమునకు పరిణామి కారణము లగు శుక్రశోణితములు లేకుండుటచేఁ బరిణామమును కాదు. కేవలభ్రాంతివలన మాత్రమే యట్లు తోఁచుచున్నది గావున వివర్తమే (సంకల్పబలమువలన కలిగినమార్పే) దానికిఁ గారణము. అప్పుడు త్రాటికి స్వస్వరూపహాని ఇంచుకయైనను లేదు కదా? ఇట్లే ముత్యపు చిప్పలయందుఁ దోఁచువెండి, స్తంభమునందు దోఁచుపురుషుఁడు, ఎండమావులయందుఁ దోఁచునీరు మొదలగు భ్రాంతిసిద్ధముల జన్మములకు నిల్ల నీవివర్తమే కారణము.

భ్రాంతి యొక్కటియే కాక, వ్యాధి ఇంద్రజాలము మొదలగునవి కూడ ఈవివర్తమును కలిగించును. తిమిరరోగము (రేచీఁకటి) ఉన్మాదము, అపస్మారము మొదలగు వ్యాధులు గలవారు వ్యాధిప్రభావమువలన నొకపదార్థమునే ఖండఖండములుగాను, ఒక వర్ణము గలవానినే మఱియొకవర్ణము గలవానినిగాను జూతురు. లేనివానిని యున్నవానినిగ వ్యవహరింతురు. ఇంద్రజాలశక్తివలనఁ గూడ నొకపదార్థము మఱియొకపదార్థముగఁ గానవచ్చుట సర్వానుభవసిద్ధము. ఇవి యన్నియును భ్రాంతులు కానేరవు కదా?

ఇట్లననేల? త్రాటిని పాముగాఁ దలంచిన వానిచిత్తము చీఁకటిచే భ్రమింపఁ జేయఁబడును. ఒకపదార్థము భిన్నముగ గాంచువాఁడు మొదలగు వారిచిత్తమును వ్యాధ్యాదులు భ్రమింపఁజేయును" అనియెదవేమొ? అట్లు కాదు. చీఁకటిలో నొకానొకపురుషుని చిత్త మొకానొకప్పు డొకానొకపదార్థమును మాత్రమే యొకానొక విధముగుమార్పు గలదానినిగ (అనఁగ: ఒకత్రాటినే యొకప్పుడు సర్పమునుగాను మఱియొకప్పుడు జలధారగాను) జూచును. ఇట్టిది కేవలచిత్తవికారమే కావున భ్రాంతి యనఁబడును. కావున దీనికి చీఁకటి కారణము కానేరదు. అదియే కారణ మని సాధించిన బ్రతిపురుషునిచిత్తంబును సర్వపదార్థవిషయములందును సర్వకాలములయందును నియమముగ భ్రాంతి నొందుచుండవలయును. ఇది యనుభవమున లేదు కదా!

ఇఁక వ్యాధ్యాదులవిషయ మిట్టిది కాదు. అది నియతము. తిమిరరోగము గలప్రతి మనుజుఁడును ప్రతిపదార్థమును సర్వకాలములయందును ఖండఖండములుగఁ జూచును. ప్రతిపదార్థమును ఏవర్ణముతో నున్నను ఎఱ్ఱగాఁ గాని తెల్లగాఁ గాని చూచును. ప్రత్యున్మాదాపస్మారరోగియు సర్వకాలములయందును క్రొత్తగనే లేని వ్యక్తుల వీక్షించుచుం

# అ ౧. పా ౧. సూ ౭. ఆరంభము.

పూర్వపక్షము:—ఆత్మశబ్దము అచేతనమును చెప్పదనియు,దానిచే

డును. ఇట్లగుటచేత వ్యాధ్యాదులు గలిగించువివర్తము భ్రాంతికల్పితవివర్తము కానేరదు. భ్రాంతి చిత్తమాత్రాధీనము; ఇది (వ్యాధ్యాదులవలన కలుగుచిత్తవికారము) వ్యాధ్యాదుల కధీన మయినది.

"ఇట్లైన నీవ్యాధికృతవస్తుజన్మము వివర్తరూపము కానేరదు. వ్యాధికిఁ గారణములగు దోషములు ఆయారూపములతోఁ బరిణమించు ననవచ్చును కదా?" అనియెద వేమో,అట్లు చెప్పుటకు వీలులేదు.పరిణామమున కారణభూత మగుపదార్థమునకు స్వరూపహానియు నన్యరూపస్వీకారంబును కలుగవలయును. వ్యాధ్యాదులకుఁ గారణము లగు దోషాదులకు నట్టి దేదియును కానవచ్చుటలేదు. ఒకవేళ కల దని సాధించినను అవి (దోషాదులు) శరీరాదిరూపపరిణామయోగ్యము లగు శుక్రశోణితాదులు లేకపోవుటచే, నట్లు పరిణమించె ననుటయు సంభవింపదు. "ఇట్లననేల? లోకమున మృత్తిక స్వస్వరూపమునకు హానిఁ జెందకయె ఘటరూపముగ పరిణామము నొందుచున్నట్లును,దారువు శిల సువర్ణము మొదలగునవియు స్వరూపహానిం బొందకయే ప్రతిమాభూషణాదిరూపములతోఁ బరిణమించునట్లును, ఈదోషములుకూడ స్వస్వరూపహాని లేకయే తత్తత్పదార్థరూపములతోఁ బరిణమింపవచ్చును" అనియెదవేమో, అది సరి కాదు. నీవు పరిణామములనియుదాహరించిన వన్నియు మాపక్షమున వివర్తములే. అట్లు కాదనిన"కారణము స్వస్వరూపమును విడిచి యన్యరూపమును స్వీకరించుటయుఁ బరిణామమై స్వస్వరూపమును విడువక అన్యరూపమును,స్వీకరించుటయుఁ బరిణామమే" యయిన విరోధము వచ్చును కదా. ఈకారణమువలన నందేదియైన నొక్కటి పరిణామ మనియు మఱియొక్కటి తద్భిన్న కారణాంతర మనియు నంగీకరింపక తప్పదు. సామాన్యముగఁ బరిణామశబ్దము స్వరూపహానివలనఁ గలుగు పరిణామమునకే వాచకమగుటచే పయిపక్షములయందు మొదటిదాని నే పరిణామముగ నంగీకరింతము. ఇది మీకును సమ్మతిమే కదా? ఇఁక రెండవదానికి వివర్త మని పేరు పెట్టుదము. ఒకపదార్థము స్వస్వరూపముతో నుండి మఱియొకవిధముగఁ దోఁచుటకే వివర్తపదము వాచక మగుచున్నది. పయి యుదాహరణములలో బాగుగ విచారింపవలయుఁగాని, మృత్తిక మొదలగునవి ఘటాదిరూపములతోఁ దోఁచుననుటయే కాని మఱేమియు లేదు కదా!

ఈవాదము ననుసరించియే వివర్త మను నొక్కటి కల దని యంగీకరించి వేదాంతులు "ప్రపంచ మంతయు బ్రహ్మవివర్తము" అనుచున్నారు. మాయ యనాది యనియు, దానియందే ఈసర్వప్రపంచంబును బీజమునందు వృక్షమువలె నడఁగియున్న దనియు,ఆమాయ బ్రహ్మభిన్న మని కాని కాదని కాని, నిరూపించుటకు వీలులేని దగుటచేఁ సర్వానుభవసిద్ధ మయినదైనను వాస్తవము కా దనియు, ఆమాయా ప్రభావమువలన

ఈక్షణము అచేతనమునకు కలుగదనియుఁ జెప్పితిరి. అది యుక్తము కాదు. ఈఆత్మశబ్దమునకు ననేకార్థములు కలవు. ఒక ప్రభువు, తన కార్యములనన్నిటిని విశ్వాసపాత్రుఁడై నిర్వహించు నొకానొకభృత్యుని గూర్చి కూడ "వీఁడు నాయాత్మయే (అనఁగా : నేనే")అని చెప్పు ననుట లోకమునఁ బ్రసిద్ధమై యున్నది. పురుషుఁడు కూడ నిట్లే తనకు భోగ మోక్షములఁ గలిగించుప్రధానమును, "ఇది నాయాత్మ"యన వచ్చును. మఱియు నీయాత్మశబ్దము చేతనపదార్థములయందువలె అచేతనపదార్థ ములయందుఁ గూడఁ బ్రయోగింపఁ బడుచున్నది. భూతాత్మ యనియు ఇంద్రియాత్మయనియు వ్యవహారము కలదు కదా? కావున నొక్క యాత్మశబ్ద మున్నంతమాత్రమున ప్రధానమునకు నీక్షణము లేదనుట సంభవింపదు.

అవతారిక:— అనిన నీపూర్వపక్షమును ఖండించుటకై యుత్త రసూత్ర మారంభింపఁబడుచున్నది.

---

## *౭. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్. ౧. ౧. ౭.

తాత్పర్యము (సిద్ధాంతము):— ఈపక్షము సరియైనది కాదు. శ్రుతియందు "స ఏషోఽణిమా" అని సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడినపదా ర్థము ననువాదము చేసి "స ఆత్మా" అని చెప్పి, పిదప "తత్త్వమసి శ్వేతకేతో", "ఓశ్వేతకేతుఁడా! ఆజగత్కారణమునకు నీకును భేదము లేదు." అని చేతనుఁడైన శ్వేతకేతునిగూర్చి చెప్పఁబడియున్నది. అచే తన మగుప్రధానమే సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడియుండె నేని ఇది తటస్థిం పదు. జీవుఁడు చేతనుఁడనుటయు ప్రధాన మచేతన మనుటయు మీకును సమ్మతమే. కావున వీనియైక్యమును మీరు మాత్ర మెట్లు సమ్మతింతురు?

---

ఆబ్రహ్మమే ప్రపంచరూపములోఁ గానవచ్చుచున్నదనియు, మొట్టమొదట నాబ్రహ్మము ఆకాశరూపముతోఁ దోఁచుననియు, ఆయాకాశరూపబ్రహ్మమే వాయురూపము తోను, అతఁడే యగ్నిరూపముతోను, అట్లే పరంపరగ సర్వప్రపంచరూపముతోను తోఁచుచున్నాఁడనియుఁ జెప్పెదరు.

*ఈసూత్రమునకు పైసూత్రముతో సంబంధ మక్కఱ లేదని కొందఱందురు.

మఱియు నీశ్వేతకేతుఁడు మోక్షార్థి. ఇట్టివానికి చేతనత్వము స్వాభావికమై యుండ "నీ వచేతనుఁడవు"అని శాస్త్ర ముపదేశించునా? "అథ సంపత్స్యే" "ప్రారబ్ధకర్మ నశింపఁగానే తనకును జగత్కారణమునకును భేదము లేదని యెఱింగినవాఁడు విదేహకైవల్యమును జెందును." అని స్వయముగనే శ్రుతి ఆయభేదజ్ఞానికి మోక్షమును చెప్పుచున్నది. అచేతనముతో నైక్యము కలుగుటయే ముక్తి యని మీరు మాత్రము చెప్పుదురా?

ఈకారణమువలన సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడినది చేతనరూప మగు బ్రహ్మమే కాని యచేతన మగు ప్రధానము కాదు. శాస్త్రమునందలి విశ్వాసమువలన విచారశూన్యుఁడై యెవ్వఁడైనను *గోలాంగూలన్యాయము ననుసరించి మీమతము నవలంబించి సచ్ఛబ్దమునకు నచేతన

*న్యాయము లనఁగ సామెతలు. పూర్వకాలమున లోకమునందు వ్యవహారములో నున్నసామెతల నన్నిటిని ప్రస్తావముల యందువలెనే, శాస్త్రములయందును దృష్టాంతములకై న్యాయము లను పేర వ్యవహరించుచుండిరి. ఇప్పుడుకూడ సర్వవ్యవహారసిద్ధము లగువానిని సమయోచితముగ నుదాహరించుకొనుటవలన దోషమేమియు రాదు.

ప్రస్తుతము భాష్యమున "విచారశూన్యుఁడై యెవ్వఁడయిన నాత్మ నచేతనునిగ సాంఖ్యపక్షము నవలంబించి శాస్త్రవిశ్వాసమువలన నిశ్చయించుకొనునేని, వాఁడు అనర్థమును బొందును" అనుటకు దృష్టాంతముగ, ఆవుతోఁకను బట్టికొనిన యొకనివృత్తాంతము 'గోలాంగూలన్యాయ' మనుపేర నుదాహరింపఁబడెను.

"ఒకయూరిలో నొకగ్రుడ్డివాఁడు కలఁడు. వాఁడు భిక్షార్థమై ప్రక్కయూరునకు పోఁదలంచి రాజమార్గమును జూపుఁడని తోవ నడచువారి నెల్ల నడుగుచుండెను. అప్పుడొక దుర్మార్గుఁడు వాని నపహాసము చేయుటకై స్వేచ్ఛగ గంతులిడుచున్న యొకకోడె తోఁకను వాని చేతికందించి "ఓయిఅంధుఁడా! మేము తోవనుమాత్రమే చూపుదుము; గాని నీ వూరుచేరునంతవఱకు తోడనుండము కదా? ఇట్లైన నీకు నంతయుపయోగ ముండదు. ఈవృషభము నీవు చేరఁదలఁచిన యూరునకుఁ బోవును. దీనితోడఁ బొమ్ము" అని చెప్పెను. ఆయంధుఁడును వానిమాటల విశ్వసించి ప్రయాణమయ్యెను. అంతట నా కోడె తనతోఁక నొకమనుష్యుఁడు పట్టుకొనియుండుటచే మఱింత చెలరేగి దుముకసాగెను. ఆయంధుఁడును "ఇఁకపై రాజమార్గము వచ్చును. ఇఁకపై రాజమార్గము వచ్చును" అని తలఁచుచు రాలనక ముండ్లనక నాకోడె ననుసరించి పరుగిడసాగెను. రాజమార్గము మాత్ర మెప్పటికిని రాలేదు."

 

మగుప్రధానమే యర్థమని భావించి "నేను అచేతనుఁడను" అని భావించునేని, అట్టివానికి ననర్థప్రాప్తియే కలుగును గాని సుఖము కలుగదుగదా. అప్పుడు (అనఁగ: మీమతము యథార్థమగునేని) శాస్త్రము అసంబద్ధార్థములఁ జెప్పునది యగుటచే నప్రమాణము కావలసివచ్చును. నిర్దోషమైన వేదమును నిరర్థకముగ నప్రమాణముఁ జేయుటకంటె కీడు కలదా? ఒకానొకచోట ఆత్మశబ్దమునకు గౌణార్థ ముండిన నుండుఁగాక. అన్నిస్థలములయందు నట్లేయుండి తీరవలయు ననుట నియమమా? మఱియు ముఖ్యార్థము చేతనే ప్రకరణార్థము నిర్వహింపఁబడుచుండ గౌణార్థమును స్వీకరింప నేల? "ఈ భృత్యుఁడు నాయాత్మ" అను మొదలగు వాక్యములయందు ముఖ్యార్థముచేఁ దాత్పర్యము నిర్వహింపంబడుటకు వీలు లేకపోవుటచే నాత్మశబ్దమునకు గౌణార్థముకు స్వీకరింప వలసివచ్చినది; కాని మఱేమియు లేదు కదా? అన్నిచోట్లను గౌణార్థమునే స్వీకరింపవలయుననిన నన్నిచోట్లను సంశయింప వలసివచ్చునుకదా! కావున నెట్లు చూచినను ఆత్మశబ్దము అచేతనపదార్థమును చెప్పదు. ఆయీక్షణక్రియయు అచేతనమునకు సంభవింపదు. సచ్ఛబ్దమునకు నచేతన మర్థంబును గానేరదు.

---

## అ ౧. పా ౧. సూ ౮. ఆరంభము.

పూర్వపక్షము:— పయివిషయమును గూడ మఱియొకవిధముగ సమన్వయింపవచ్చును. లోకమున*అరుంధతీనక్షత్రమును చూపఁదలఁచినవాఁడు, అతిసూక్ష్మమగు దానియాకారము మొట్టమొదటనే గోచరము కాదు కావున "అల్లదియే యరుంధతి" యనుచు దానిపార్శ్వముననున్న యొకపెద్దనక్షత్రమును చూపును. పిదప "ఇది యరుంధతి కాదు. దాని ప్రక్క నున్న సన్ననినక్షత్రము అరుంధతి" యనుచు

---

ఇదియే 'గోలాంగూలన్యాయ' మని వ్యవహరింపఁబడినసామెతకర్థము. ఆదుష్టుని మాటను విశ్వసించిన గ్రుడ్డివానివలె సాధకుఁడును సాంఖ్యులమతము ననుసరించి శాస్త్రమాత్మనచేతనరూప మనియే చెప్పును" అని విశ్వసించినచో నెన్నటికిని సంసారపారమును జెందనేరఁ డనుటయే దీనినుదాహరించుటకు నభిప్రాయము.

*అరుంధతీ నక్షత్రము చూపుటకై మొట్టమొదట దానిచెంత నున్న యొకస్థూలనక్షత్రమును జూపుదు రనువిషయమును "స్థూలారుంధతీన్యాయము" అను పేర వ్యవహరింతురు.

ప్రసిద్ధారుంధతిని జూపును. ఇట్లే వేదముకూడ బ్రహ్మమునే చెప్పఁదలఁచినను, తత్స్వరూప మతిసూక్ష్మ మగుటచే, తదాశ్రితమై భోగ్యరూపముతో ప్రసిద్ధమై స్థూలమై యున్న ప్రధానమును గ్రహణసౌకర్యముకొఱకై "ఇదియె యాత్మ"యని చెప్పియుండవచ్చును. ఇట్లయినను మాప్రధానము సచ్ఛబ్దవాచ్య మగును కదా.

అవతారిక:—ఈ పూర్వపక్షమును ఖండించుటకై మఱి రెండు హేతువులు చెప్పఁబడుచున్నవి.—

---

## ౬. హేయత్వావచనాచ్చ. ౧. ౧. ౬.

తాత్పర్యము (సిద్ధాంతము):—ఈపూర్వపక్షము యుక్తియుక్తము కాదు. స్థూలారుంధతీన్యాయము ననుసరించి వేదము ప్రధానము నాత్మగ బోధించునేని యప్పుడు ముముక్షువునకు దానియందే దృఢవిశ్వాసము ("ఆప్రధానమే నేను" అను విశ్వాసము) కలుగకుండుటకై ఉపదేశానంతరమున మరలను దానిని నిరాకరింపవలయును. బ్రహ్మమును నూతనముగ బోధింపవలయును. ఇట్లు చేయక ప్రధానోపదేశముతోనే * ప్రకరణమును ముగించెనేని ముముక్షువును చెఱచినదియే యగును కదా? ఇఁక వేదమునందన్ననో సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడిన పదార్థములకు నిషేధ మెటను గానరాలేదు. ఛాందోగ్యోపనిషత్తునందలి షష్ఠ ‡ప్రపాఠకము "స ఆత్మా; తత్త్వ మసి శ్వేతకేతో" అను నిట్టివాక్య

---

* ౭౫-౭౬వపుటలక్రింద ఉపక్రమాది తాత్పర్యలింగములస్వరూపమును వివరించియున్నాము. ఆయుపక్రమాదులలో నన్నిటిని గాని కొన్నిటినిఁగాని కలిగి యేక విషయమును ప్రతిపాదించునట్టివాక్యము కాని వాక్యములు కాని ప్రకరణమనంబడును.

‡ ఆశ్వాసము, సర్గము, అధ్యాయము మొదలగువానివలె ఛాందోగ్యోపనిషత్తునందలి భాగమునకు ప్రపాఠక మని పేరు. ఇతరోపనిషత్తులందు ఖండము లనియు వల్లు లనియు విభాగనామములు కలవు.

ఈషష్ఠప్రపాఠకమున నీక్రిందివిషయము వర్ణింపఁబడియున్నది.

"ఉద్దాలకుఁ డనుమహాముని గురుగృహమునుండి వచ్చిన తనపుత్రుని శ్వేతకేతుఁ డనువానిని జూచి ఇట్లనియె. "ఓపుత్రా, దేనిని వినిన సర్వమును వినిన ట్లగునో, దేనిని తెలిసికొనిన సర్వమును తెలిసికొనినట్లగునో, అట్టి పదార్థమును గూర్చి నీగురుని బ్రశ్నించి

ములతోనే ముగింపబడినది. ఇట నొక్కచోటనే కాదు. "ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" "సృష్టికిఁ బూర్వమున నామరూపాత్మక

లివా? ఆపదార్థము నీకు గోచర మయ్యెనా!" అనిన నట్టిపదార్థ మొక్కటి యున్న దను టయే యసంభవ మనుతలంపుతో పుత్త్రుఁడు జనకున కిట్లనియె. "తండ్రీ! దాని నేను ప్రశ్నింపలేదు. అట్టి దొకటి ప్రపంచమునఁ గల దనుటయే నాకుఁజిత్రముగ నున్నది. అట్టిది కలదేని నాకు వివరింపుఁడు".

అనినఁ దండ్రి ఇట్లనియె. "ఓపుత్రా! అట్టి పదార్థము కలదనుటలోఁ జిత్ర మేమి? లోకమున మృత్తికతోఁ జేయఁబడినపదార్థము లనేకనామరూపములతో నున్నను సర్వమును మృత్తికకంటె భిన్నము కాదు. ఇప్పుడు మృత్తికాస్వరూపము నెఱింగినయెడల మృణ్మయ స్వరూప మంతయు నెఱింగినట్లె యగును కదా? ఇట్లె ప్రపంచకారణమగు నొక్కపదార్థము నెఱిగింప సర్వము నెఱింగినట్లె యగును. నామరూపభేదములు పదార్థ భేదమును కలిగింపలేవు. ఆనామరూపములు భేదవ్యవహారమును మాత్రమే సాధించును. కొంచెము విమర్శింపఁగలిగిన దీనిఁ గూర్చి యధికముగఁ జెప్ప నక్కఱలేదు.

ఈప్రపంచ మంతయు మొట్టమొదట సన్మాత్రమై యుండెను. ఆసత్పదార్థము సంకల్పపూర్వకముగ సర్వభూతములను సృజించెను. "నే నజ్ఞానిని నాకు నేమియుఁ దెలియదు" అనువ్యవహారముచే నాబాలగోపాలముగ ననుభవసిద్ధ మగుటచేత "ఇది భావ పదార్థము" అని యవశ్యముగ చెప్పఁబడవలసియున్న మాయ యనాదిగ నాసత్పదార్థ మున కలదు. విమర్శింప నారంభించినచో దానియునికి నిర్వచించుటకు శక్యము కాదు; గాని యజ్ఞానదృష్టి ననుసరించి యున్న దనక తీరదు. అందఱచేత ననుభవింపఁబడుచున్న భావపదార్థములయొక్క స్థితి కూడ నిట్టిదియే కదా! దేనిఁ గైకొని విచారించినను వ్యవహారార్థము లగునామరూపముల తొలిసివేయ నారంభించినచో కారణపదార్థముల కంటె భిన్న మగుస్థితి యించుకయైనను కానరాదు కదా! ఇట్టి ఈమాయ పూర్వకల్పాం తమునందలిజీవులకర్మలు ఫలోన్ముఖములు కాఁగానే సృష్టికిఁ బ్రారంభించును. ఇట్లు చెప్పుటకంటె "జీవులు అజ్ఞానులు కావున వారికర్మలు ఫలము నొసంగ నారంభింపఁ గానే వారియజ్ఞానమువలన వారికి ప్రపంచము యథాపూర్వముగ భోగార్థమై కాన వచ్చును" అని చెప్పుట విశదతరముగ నుండును. ఇదియే సత్పదార్థమునకుఁ గలసంకల్పము.

ఇట్లు సర్వప్రపంచమునకును సత్పదార్థమే కారణము; కావున దాని నెఱింగిన ప్రపంచమంతయు నెఱుంగఁబడినట్లెయగును. పయిన నిరూపించినవిధముగ మాయయుఁ దద్భిన్నము కాకపోవుటచే నీప్రపంచమునకు నిమిత్తోపాదానకారణములు రెండును సత్ప దార్థమే. అది యతిసూక్ష్మమైనది. దానికంటె ప్రపంచమునందు జడపదార్థములుగాని చేతనపదార్థములు గాని భిన్నములు కావు. నీవును ఆపదార్థమే? నేనును ఆపదార్థమే."

మగు నీప్రపంచ మంతయు నాత్మమాత్రముగానే యుండెను." అను మొదలగు నుపక్రమములతోఁ గూడిన సర్వోపనిషత్తులయందును "జగత్కారణమునకును ఆత్మకును భేదము లేదు" అని చెప్పుటతోనే ముగింపు కానఁబడుచున్నది. కావున సచ్ఛబ్దమునకు ప్రధాన మర్థ మగుననుట యయుక్తము.

మఱియు నీసూత్రమునందు "చ" అను *సముచ్చయార్థకము ప్రయోగింపఁబడి యుండుటచే మఱియొక హేతువునుకూడ సూత్రకర్త యుద్దేశించియున్నాఁ డని తెలియవచ్చుచున్నది. అదియు నిచ్చటఁజూపిన హేతువుతో నేదియో యొకవిధముగ సంబంధపడి యుండవలయు ననుట యుక్తము. "శ్రుతి సచ్ఛబ్దవాచ్య మగుపదార్థమును నిరాకరింప లేదు" అను కారణము ననుసరించి పయిన పూర్వపక్షఖండనము చేయఁబడెను. "శ్రుతి సచ్ఛబ్దవాచ్యమును నిరాకరించుచున్నది" అని యంగీకరించినను పూర్వపక్షము నిలువ దని నిరూపించుటకై తగిన రెండవ కారణము చకారముచే నుద్దేశింపఁబడి యుండవలయును.

అట్టికారణముకూడ నొక్కటి కలదు. ఆషష్ఠప్రపాఠకమునకు నారంభమున "యథా సోమ్యై కేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యం; ఏవం సోమ్య స ఆదేశో భవతి" "ఓశాంతుఁడా! మృత్తికను తెలిసికొనినయెడల మృణ్మయము లగుపదార్థము లన్నియును కార్యకారణముల కభేద మగుటచే నెట్లు తెలిసికొనఁబడునో, కుంభ మొదలగు వికారములన్నియు నెట్లు నామమాత్రములో, కారణ మగుమృత్తిక యొక్కటియే యెట్లు సత్యమో, అట్లే ఈప్రపంచ మంతయు కారణమాత్రము. కారణభిన్నముగ దీనికి నునికి లేదు. కారణము నెఱింగిన

---

అని ఇట్లు చెప్పఁబడియున్నది. కావున అసత్పదార్థము అచేతనము కానేరదు. శ్వేతకేతువు చేతనుఁడు కావున నాతని కభిన్న మగుపదార్థము గూడ చేతనమై యుండవలయు ననుట నియమము. చేతనాచేతనములకు నైక్యము సంభవింప దనుట నిర్వివాదాంశము కదా!.

*రెండుపదార్థములయొక్క కాని అనేకపదార్థములయొక్క కాని చేరికను తెలుపుమాట, లేక, అక్షరము (సంస్కృతమున—చ అపి, ఆంధ్రమున—ను మొదలగునవి) సముచ్చయార్థక మనఁబడును.

నిది యంతయు నెఱుంగఁబడినట్లే యగును" అని సదృష్టాంతముగ నుపక్రమింపఁబడియున్నది; కారణపదార్థము నెఱింగిన సర్వము నెఱుంగఁబడు నని ప్రతిజ్ఞ చేయఁబడియున్నది. ఆ జగత్కారణమే సచ్ఛబ్దము చేఁ బిమ్మట చెప్పఁబడియున్నది. ఇఁక నాసచ్ఛబ్దమునకు నచేతన మగు ప్రధాన మర్థ మయినయెడల ఈప్రతిజ్ఞకు విరోధము వచ్చును. అది యచేతన మగుటచే దానిఁ దెలిసికొనిన నచేతనము లగు భోగ్యపదార్థములు తెలిసికొనఁబడునవి కావచ్చును; కాని చేతను లగుజీవులు తెలిసికొనఁబడినవారు కానేరరు. వారు ప్రధానపరిణామభూతులుకారు కదా! ఇట్లగుటచేత నెట్లు చూచినను సచ్ఛబ్దార్థము ప్రధానము కానేరదు.

---

## అ ౧. పా ౧. సూ ౯. ఆరంభము.

అవతారిక :—ఈ యధికరణమున మొదటినుండియు పరంపరా హేతువులచే (ఒకదాని నొకటి దృఢపఱుచుచున్న హేతువులచే) ప్రధానకారణవాదము ఖండింపఁబడెను. ఇఁక మూఁడుసూత్రములలో స్వతంత్ర హేతువులతో నావాదమునే ఖండించుచున్నాఁడు —

---

## ౯. స్వాప్యయాత్ ౧-౧-౯.

తాత్పర్యము:—"యత్రైత త్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మా దేనం స్వపితీ త్యాచక్షతే; స్వం హ్యపీతో భవతి" "ఓశాంతుఁడా ! లోకమున సుషుప్తి యను నొక యవస్థ సర్వానుభవసిద్ధమై యున్నది. అప్పుడు జీవుఁడు జగత్కారణ మని చెప్పఁబడిన సత్పదార్థముతో నైక్యము నొందును. ఆసత్పదార్థమే యాత్మ. 'స్వం అపీతః' అను వ్యుత్పత్తిచే నట్టి స్థితిని జెందినవాని గూర్చి 'స్వపితి' ('నిదురించుచున్నాఁడు') అనుచున్నారు. ఆసమయమున జీవుఁడు స్వస్వరూపమును జెందును కదా" అను శ్రుతి స్వపితిశబ్దమునకు వ్యుత్పత్తినిఁ జెప్పుచు "సచ్ఛబ్దముచే ప్రధానము చెప్పఁబడదు. ప్రధానము జగత్కారణము కాదు" అని స్పష్టము చేయుచున్నది. ఈశ్రుతియు "సదేవ" అను మొదలగు నుపక్రమముతోఁ గూడిన షష్ఠప్రపాఠకమునందే యున్నది.

జీవుఁడు బహిర్ముఖ మగుమనస్సుతోఁ గూడి ఇంద్రియములమూలమున విషయముల గ్రహించుస్థితి జాగ్రదవస్థ. ఆజాగ్రదవస్థయందలి సంస్కారములను కేవల మనోమాత్రోపాధితో (ఆవరణముతో): గూడిచూచుట (అనఁగ: ఆసంస్కారములవలనఁ దోఁచిన పదార్థములఁజూచుట) స్వప్నావస్థ. ఈరెండునుగాక గాఢనిద్రయనఁబడు మఱియొకస్థితి కలదు. ఇదియే సుషుప్త్యవస్థ. అప్పుడు మనస్సు మొదలగునవి యేవియు నుండవు. ఇట్లగుటచేత సర్వోపాధులును లేవు. కావున నాజీవుఁడు నిర్వికల్ప నిరంజన మగు స్వస్వరూపముతో నిలుచును. ఇదియే యాత్మైక్యము.

"ఇట్లు ప్రతిదినమును సుషుప్త్యవస్థయందు జీవునకు నాత్మైక్యము కలుగు ననుట యసంభవము. ఒకమాఱు ఐక్యము నొందిన నదియే మోక్షము కావున పునరావృత్తి సంభవింపదు. మోక్షము నొందినవాఁడు కూడ మరలి వచ్చుననిన నది యెవరికిని సమ్మతము కాదు కదా" అనియెదవేమో, వినుము. ఏజీవుఁడు జ్ఞానముచే *మూలావిద్యను నశింపఁ జేయునో వాఁడు "అహం బ్రహ్మాస్మి" "నేనే పరబ్రహ్మమును" అని భ్రాంతిశూన్యుఁడై జ్ఞానపూర్వకముగ పరబ్రహ్మమునం దైక్యము నొందును. అట్టివాఁడు మరల రాఁడు. అట్లుగాక, స్వాభావికముగ మనస్సు, కారణమున (తనకు నుత్పత్తిస్థాన మగు మూలావిద్యయందు) లయము

*వేదాంతమతమునందు అవిద్యలు రెండు గలవు. అందొక్కటి భావరూపమై అనాదియై సర్వప్రపంచకారణమై యుండునది. ఇదియే మాయయనియుఁ జెప్పఁబడును. ఈవిషయమును సవిమర్శముగ దేవతాధికరణమునందు (అధ్యాయ. ౧. పాదము 3. సూత్రము ౨౬-33) వివరించెదము. భ్రాంతిరూపమై ముత్యపు చిప్పను వెండిగాను త్రాటిని పాముగాను చూచునట్లు చేయునదియు, వ్యవహారదశయందు మనసును జెదరునట్లు చేయునది మఱియొక యవిద్య. ఇందు మొదటిదానికి మూలావిద్యయని, రెండవదానికి తూలావిద్యయనియుఁ బేరు. "ఇది వెండికాదు ముత్యపుచిప్ప" అను మొదలగు నాప్తవాక్యములచే తూలావిద్య నశించును. శాస్త్రవిచారమువలన "నేనే బ్రహ్మమును" అని తెలిసికొనినచో మూలావిద్య నశించును. మూలావిద్యానాశము కలిగిననేకాని ముక్తి దొరకదు. సుషుప్త్యవస్థయందు విచారజనితజ్ఞానము లేకపోవుటచే నామూలావిద్య నశింపదు. ఇఁక నేమనిన: మనస్సు మొదలయిన బాహ్యప్రవృత్తిసాధనములు లీనము లగుటచే (తనయందే= మూలావిద్యయందే, లయము నొందుటచే) జీవునకు బాహ్యప్రవృత్తిని కలిగింపదు; సంబంధ మున్న దనినను లే దనినను అది (మూలావిద్య) బ్రహ్మమునందు ఆరోపింపఁబడియున్నదియే కావున నాజీవునకు బ్రహ్మమునుండి భేదమును కలిగింపదు. జీవబ్రహ్మలకు నామమాత్రమునను భేదముకాని స్వరూపమున నించుక యైనను లేదు కదా.

నొందుటచేఁ గలిగిన బ్రహ్మైక్యము శాశ్వతము కానేరదు. అజ్ఞానముతో రాజభవనమును ప్రవేశించినను అది యంత ప్రయోజనకారి కానేరదు గదా! వాస్తవస్థితిలో కేవలము సుషుప్త్యవస్థయందుమాత్రమే యననేల? సర్వావస్థలయందును జీవబ్రహ్మలకు నైక్యము స్వభావసిద్ధమే. అజ్ఞాన మొక్కటియే వారికి నెప్పటికిని భేదమును కల్పించుచున్నది. ఆయజ్ఞానము సుషుప్త్యవస్థయందును నశింపలేదనుట సర్వానుభవసిద్ధముకదా!

ఈ విధముగ వేదమున సచ్ఛబ్దవాచ్య మగుపదార్థమే యాత్మ యనియు, జీవుఁడు సుషుప్త్యవస్థయందు ఉపాధు లన్నియు నశించుటచే నాయాత్మయందే నైక్య మగుననియు, అదియే స్వపితిశబ్దార్థమనియుఁ జెప్పఁబడియుండుటచే, సచ్ఛబ్దమునకు ప్రధాన మర్థము కానేరదు. చేతనుఁ డని ప్రసిద్ధి నొందియున్న జీవుఁడు అచేతన మగు ప్రధానమున నైక్యము నొందు ననుట యసంభవము కదా! విరుద్ధము కదా!

పూర్వపక్షము:—శ్రుతియందు స్వపితిశబ్దార్థమును వివరించు నప్పుడు స్వశబ్దము ప్రయోగింపఁబడియున్నది. "స్వో జ్ఞాతా వాత్మని స్వంత్రి ష్వాత్మీయే స్వో ఒస్త్రియాం ధనే" "స్వశబ్దము బంధువు తాను (ఆత్మ) అను నర్థములు చెప్పునప్పుడు పుంలింగము. తనది యను నర్థము చెప్పునప్పుడు త్రిలింగము. ధనము అనునర్థము చెప్పునప్పుడు పున్నపుంసకలింగము." అను నిఘంటుకోశముల ననుసరించి స్వశబ్దమునకు "తాను—తనది" అను రెండర్థములు కలవు. ఇందొకయర్థము ననుసరించి ప్రధానము సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడ దని తేలుచున్నను రెండవయర్థము ననుసరించిన మాపక్షమునకు ననుకూలముగ నుండెనేమొ (అనఁగ: ప్రధానమే సచ్ఛబ్దమున కర్థ మని సాధించుటకు వీ లగునేమొ!).

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుటకును వీలులేదు. ఏయర్థము నవ లంబించినను మీపక్షము నిలువదు. అందు "స్వశబ్దము ఆత్మను తెలుపును" అను పక్షము నవలంబించిన మీసిద్ధాంత మెట్లు నిలువదో, ఆ విషయమును మొట్టమొదటనే వివరించియున్నాము. ఇఁక రెండవ పక్షము నవలంబించినను దేనికిని తనదియైనంతమాత్రముననే తనతో సంబంధములేనిపదార్థములయం దైక్యము సంభవింపదు. కుండ తన యందే నిలిచియుండుటచే తనవి, యైనను జలములందు లయము నొందదు; కార్యకారణభావసంబంధము గల మృత్తికయందు మాత్రమే

లీన మగును. ఇట్లే భ్రాంతికల్పిత మగు వెండియుఁ దన కాధార మగుటచే తనది యైనభూమియందు లయము నొందదు; అధిష్ఠానసంబంధము గల ముత్యపుచిప్పయందుమాత్రమే లయము నొందును. ఇట్లే జీవుఁడును, సర్వభోగముల నొసంగునది యగుటచేఁ దనదియే యైనను ప్రధానము నొందు లయము నొందఁడు; భ్రాంతికల్పితుఁ డైన తనకు నధిష్ఠానభూతమై స్వస్వరూప మై యున్న బ్రహ్మమునందు మాత్రమే లయము నొందును. కావున నేపక్షము నంగీకరించినను (స్వశబ్దమునకు 'తాను' అని యర్థ మనినను, 'తనది' యని యర్థ మనినను) మీపక్షమునిలువదు; సచ్ఛబ్దమునకు ప్రధాన మర్థము కాదు.

---

# ౧౦. గతిసామాన్యాత్. ౧. ౧. ౧౦.

తాత్పర్యము:—ఇచ్చట గతి యనఁగ జ్ఞానము. (జగత్కారణమును గూర్చిన బోధ) ఈగతి ఉపనిషత్తులయందంతటను "ఆత్మనుండి ప్రపంచము జనించెను" అని యేకరూపముగ నున్నది. "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" "నామరూపాత్మకమై కనఁబడుచున్న ఈప్రపంచ మంతయును ఆత్మరూపముగానే యుండెను" అని ఋగ్వేదములోని యైతరేయోపనిషత్తునందు "ఆత్మనుండియే ప్రపంచము జనించెను." అని చెప్పఁబడియున్నది. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" "పైన వర్ణింపఁబడిన సత్యజ్ఞానానందరూపపరమాత్మనుండియే యీయాకాశము జనించెను" అను మొదలగు వాక్యములచే యజుర్వేదము నందలి తైత్తిరీయోపనిషత్తునందును అట్లే చెప్పఁబడియున్నది. మఱియు నిట్లే యన్నియుపనిషత్తులయందును ఐకకంఠ్యముగ నాత్మనుండియే ప్రపంచోత్పత్తి వర్ణింపఁబడియున్నది. ఆత్మయనఁగ చేతనపదార్థమే యని యిదివఱకే నిరూపించియున్నాము. ఇట్లగుటచే ప్రధానము జగత్కారణము కానేరదు.

సిద్ధాంతము:— ఈకారణమువలనఁ గూడ మీపక్షము నిలువదు. అన్నిస్థలములయందును విషయ మేకరూపముగ నుండుట యనునది నమ్మకమునకు చక్కనికారణముకదా? "నేత్రము రూపమును గ్రహించును. చెవి శబ్దమును గ్రహించును" అనువిషయములను లోకులు విశ్వసించు

చున్నారుగదా.? దానికిఁ గారణ మేమి? ఎచ్చట కూడ మార్పు లేక నన్నియు నేకరూపముతో నుండుటయే లోకమున నందఱికన్నులును రూపమునే గ్రహించును; కాని ఒకనికన్ను రూపమును, మఱియొకనికన్ను రసమును, మఱియొకనికన్ను గంధమును గ్రహింపదుకదా? ఇట్లే యందఱిచెవులును శబ్దమునే గ్రహించును కాని యన్యమును గ్రహింపవు కదా? ఇట్లు ఎచట చూచినను మార్పు లేకుండుటచే లోకులు "కన్ను చూచును" అను మొదలగువిషయములను అంగీకరించుచున్నారు. వేదాంతవాక్యములయందును "సృష్టి చేతనపదార్థమునుండి కలిగెను" అనువిషయమున నవ్యభిచారము (ఏకరూపత్వము) కానవచ్చుచున్నది. కావున నిది విశ్వాసయోగ్యము. ఈకారణమునలన ప్రధానము జగత్కారణము కాదు. సచ్ఛబ్దమునకు నర్థంబును కాదు.

---

# ౧౧. శ్రుతత్వాచ్చ. ౧. ౧. ౧౧.

తాత్పర్యము (సిద్ధాంతము):—ఈ యూహలతోఁ గూడఁ బని లేకయే శ్రుతియందుఁ బ్రత్యక్షముగనే "సర్వజ్ఞుఁ డగుపరమేశ్వరుఁడు జగత్కారణము."అని చెప్పఁబడియున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తునందు సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుని గూర్చి చెప్పుట కారంభించి "సకారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః" "ఆపరమేశ్వరుఁడే ఈ ప్రపంచమునకుఁ గారణము. ఆయనయే ఇంద్రియములకు నధిపతులయిన జీవులకు నధిపతి(నియామకుఁడు). ఆయనకు మఱియొకకారణము లేదు.నియామకుఁడును లేఁడు."అని స్పష్టముగనే వివరింపఁబడియున్నది. ఈకారణమునలన "అచేతన మగుప్రధానము జగత్కారణము. పరమాణువులు జగత్కారణములు" అను మొదలగు వాదము లేవియు యుక్తియుక్తములు కావనుటయే సిద్ధాంత మయినది.

---

# ౬. ఆనందమయాధికరణము.

ఉత్తరగ్రంథావతారిక:—"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రము మొదలు "శ్రుతత్వాచ్చ"అను సూత్రమువరకు కలసందర్భముచే,

బ్రహ్మమును విచారింపవలయు ననియు, అది ప్రపంచసృష్టి స్థితిలయము లకుఁ గారణ మనియు, దానిని విచారించుటకు ఉపనిషత్తులు తప్ప నితర ప్రమాణములు పనికిరావనియు, ఆయుపనిషత్తులును బ్రహ్మాభిన్నము లగుప్రధానాదులఁ జెప్ప వనియు నిరూపింపఁబడియున్నది. "గతిసామాన్యాత్" (౧-౧-౧౦) అను సూత్రముచే "సర్వవేదాంతవాక్యములును, లేక, సర్వోపనిషత్తులును ఐకకంఠ్యముతో నాపరమేశ్వరునిగూర్చియే చెప్పును" అనియు సిద్ధాంతము చేయఁబడియున్నది.

అయినను ఈవిషయములు సవిమర్శముగ నిరూపింపఁబడలేదు. వేదాంతవాక్యములు విచారింపఁబడలేదు. ఉపనిషత్తులయందు, నిరుపాధిక మగుస్వాభావికరూపముతో నుపదేశింపఁబడుటకు శక్యుఁడు కాక పోవుటచే నాపరమేశ్వరుఁడు ఏదియో యొకయుపాధి నాశ్రయించియే యుపదేశింపఁబడియున్నాఁడు. ఆయుపాధులును కొన్నికొన్నిస్థలముల యందు ఉపాసనార్థమై ముఖ్యములుగ నంగీకరింపఁబడియున్నవి; మఱి కొన్నిస్థలములయందు అట్లుద్దేశింపఁబడక బ్రహ్మస్వరూపమును బోధించు విషయమునందుమాత్రమే వినియోగింపఁబడియున్నవి. మఱియును అభివృద్ధిఁగలిగించునవి యగు ప్రతీకోపాసనలును (మనసున నాపరమేశ్వరు నొక దేహధారిరూపముతో భావించి చేయఁబడు నుపాసనలు), *క్రమముక్తి నొసంగు †దహరాద్యుపాసనలును, కర్మలకు మాహాత్మ్యమును కలిగించు ‡నుద్గీథాద్యుపాసనలును, కర్మకాండమునందుఁ జెప్పఁదగిన వైనను బ్రహ్మభావనారూపము లనుకారణమున నీయుపనిషత్తులయందే చెప్పఁబడియున్నవి.

"యత్ర హి ద్వైత మివ భవతి త దితర ఇతరం పశ్యతి" "అవిద్యాదశయందు భేద మున్నట్లు తోఁచిన నప్పు డొకఁడు మఱి యొకనిఁ జూచును" అను మొదలగువాక్యములచేఁ గొన్నిచోట్ల నుపాధి భేదము నాశ్రయించి శ్రుతి బ్రహ్మభేదమును జెప్పుచున్నది. "నిష్కళం

* క్రమముక్తి—౪-వ అధ్యాయము, 3-వ పాదములో వివరింపఁబడియున్నది.

† దహరోపాసన—అధ్యాయము ౧. పాదము 3. సూత్రము ౧౪. మొ. ౨౧ వరకు చూచునది.

‡ ఉద్గీథోపాసన యనఁగ నోంకారోపాసన; లేక, సామవేదమునఁ గలయైదుభాగములలో నుద్గీథ మనుభాగ మొక్కటి కలదు. దాని నోంకారరూపముతో భావించి యుపాసించుట.

నిష్క్రియం శాంతం" "ఆబ్రహ్మము విభాగములు లేనిది. ఏకార్యముల నాచరింపనిది. శాంతమైనది." అను మొదలగువాక్యములచే సర్వోపాధి నిషేధపూర్వకముగ శుద్ధబ్రహ్మమును బోధించుచున్నది.

"బ్రహ్మము ఏకరూపమైయుండ దానికి నుపాధులవలన భేద మెట్లు సంభవించును? ఉపాసనలకును తత్ఫలములకును భేద మెట్లు కలుగును?" అనియెదవేమో, వినుము. సూర్యుఁడు ఏకరూపుఁడై యే యున్నను అనేకజలపాత్రములయందు ఒక్కమాటే ప్రతిబింబించిన నప్పు డా ప్రతిబింబములకుమాత్రము పరస్పరము కల్పితభేదము లోకమున వ్యవహరింపఁబడుచున్నది. వాయువు ఏకరూపుఁడే యై యున్నను గృహభేదములను కాని గ్రామభేదములను కాని స్థలభేదములను కాని యవలంబించి "గ్రామములోనిగాలి దుష్టమైనది. బయలులోనిగాలి మంచిది" అని కల్పితభేదముతో వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇట్లే ఆపరమేశ్వరుఁడు కూడ నేకరూపుఁడే యైనను ఆయనకు నుపాధిభేదమువలన వ్యావహారిక మగుకల్పితభేదము కలుగవచ్చును. ఈభేదము నాశ్రయించియే యుపాసనలకును తత్ఫలములకును భేదము కలుగును.

"ఇట్లైనను ఆపరమేశ్వరుఁడు సర్వవ్యాపకుండు కావున 'ఉపాసించువాఁడు ఉపాసింపఁబడువాఁడు' అనుభేద ముండుటకు నవకాశము లేదు. ఒక్కొకఁడును స్వయముగనే పరమేశ్వరుఁడు కదా" అనియెదవేమో వినుము. నీపూర్వపక్షము యుక్తమైనదియే యైనను కొంత విశేషము కలదు. ఆపరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడే యైనను, అనాది యగు నవిద్యయొక్క తారతమ్యమువలన నాయాయుపాధులయందు తారతమ్యముతోఁ గానవచ్చుచున్నాఁడు. పర్వతములు వృక్షములు మొదలగు స్థావరభూతములయందు బొత్తిగనే లేనివాఁడుగను, పశువులు మొదలగు తిర్యగ్జంతువులయందు మిగుల నీచుఁడుగను, మనుష్యులయందు మధ్యమప్రకాశము కలవాఁడుగను, గంధర్వాదులయందు అంతకంటె నధికుఁడుగను, దేవతలయందు సర్వోత్కృష్టుఁడుగను కానవచ్చుచున్నాఁడు. సూర్యుఁడు సర్వకాలములయందును ఏకరూపముతోఁ బ్రకాశించుచునే యున్నను, మేఘావరణము మొదలగుకారణములవలన, వర్షాకాలమునందు మందకాంతి కలవాఁడుగాను, శరదృతువునందు తీవ్రకాంతికలవాఁడుగాను, భావింపఁబడుచున్నట్లు ఈపరమేశ్వ

రుఁడును భావింపఁబడుచున్నాఁడు. ఇది యంతయును స్వస్వరూపమును తెలిసికొనకపోవుటచే వచ్చినదియే. కావునఁ దనకు స్వాభావిక మైన పరమేశ్వరత్వమును తెలిసికొనలేక నధిక మగునజ్ఞానమునకు లోఁబడి యున్నవాఁడు, తనకంటె నుత్తముఁడై యల్పాజ్ఞానము కలవాని నుపాసన చేయవచ్చును. అజ్ఞానము అల్ప మగు కొలఁది విభూతి (ప్రభావము) యధికమగుచు వచ్చును కదా! "యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేన వా, త త్త దే వావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవం" "ప్రభావము సంపద ప్రసిద్ధి యనునవి గలిగి యుండుభూతము నాయంశమువలన (పరమేశ్వరునియంశమునలన) జనించిన దని తెలిసికొనుము" అనువాక్యముచే "ప్రభావాదులు కల భూతమునందు అవిద్య యల్పమగుటచే తనప్రకాశము (పరమేశ్వరప్రకాశము) అధికమై యుండును" అను నుద్దేశముతోఁ బరమేశ్వరుఁడు (కృష్ణుఁడు) పైవిషయమునే నిరూపించి యున్నాఁడు. కావున ఉపనిషత్తులు ఉపాసనలను జెప్పుటవలన విరోధ మేమియు లేదు.

ఇట్లగుటచేత "ఏవాక్యములు ఉపాసనలను చెప్పును? ఏవాక్యములయందుఁ జెప్పఁబడిన యుపాధులు గ్రహింపఁదగినవి? ఏవాక్యములయందుఁ జెప్పిన యుపాధులు అంగీకార్యములు కావు? సర్వశ్రుతులును బ్రహ్మమునుమాత్రమే చెప్పు ననుట యెట్లు సంభవించును?" అనునీవిషయము లింకను విచారణీయములై యున్నవి. కావున వీనిని విమర్శించుటకై సూత్రకారుఁడు ఉత్తర మగునధ్యాయశేషమును ఆరంభించుచున్నాఁడు.

## వృత్తికారమతానుసార మీయధికరణమునకు వ్యాఖ్యానము.

సంగతి :— పై అధికరణమునందు "గౌణశ్చే న్నాత్మశబ్దాత్" అనుసూత్రమును వ్యాఖ్యానము చేయునప్పుడు, "త త్తేజ ఐక్షత" అను మొదలగు ననేకవాక్యములయందు ఈక్షణక్రియ గౌణముగఁ (అప్రధానముగ) బ్రయోగింపఁ బడియున్న దనుపూర్వపక్షమును ఖండించియున్నారు. ఆఖండనమునలన పాఠక్రమమాత్రమువలన (పలుమాఱు ఒక్కవిధముగ చెప్పఁబడియున్నంత మాత్రము వలనఁ) బ్రయోజనము లేదని స్పష్ట మగుచున్నది. దానిపై ఇది యుక్తము

కాదు. ఒకమాఱు విధింపఁబడిన నియమము ఎచ్చటను భిన్నము కాకూడదు. తైత్తిరీయోపనిషత్తునందలివాక్యసందర్భమును విమర్శింపఁబోయినఁ బై నియమము (పాఠమాత్రమువలనఁ బ్రయోజనము లేదను నియమము) నిలువదు. అచ్చటఁ గ్రమముగ అన్నమయప్రాణమయమనోమయవిజ్ఞానమయపదములను ప్రయోగించి పిదప నానందమయపదమును శ్రుతి ప్రయోగించి యున్నది. అన్నమయాదిశబ్దములవలన అన్నవికారుఁ డగు నాత్మ (అన్నమువలన నుత్పత్తిస్థితిలయములఁ జెందు దేహము) మొదలగువారు వర్ణింపఁబడియున్నారు. కావున నచ్చట పాఠక్రమమును మాత్రమే యనుసరించి యానందమయశబ్దమునకుఁ గూడ "ఆనందవికారుఁ డగు నాత్మ (జీవుఁడు)" అనియే యర్థముచెప్పి తీరవలయును కదా ? కావున మీఁదు పై యధికరణమునఁ జెప్పిన నియమములకు నిది *"ప్రత్యుదాహరణస్థానము" అను నాక్షేపము వచ్చును. దాని నివారించుటకై ఈయధికరణ మారంభింపఁబడుచున్నది. పై యధికరణమునందలి విషయమునకు నీయధికరణమునందలి విషయము ప్రత్యుదాహరణముగఁ జేయఁబడెను. కావున నీరెండధికరణములకును గల సంబంధము ప్రత్యుదాహరణసంబంధ మనఁబడును.

విషయము:—ఈకారణమువలన నిందు "అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః" "ఆవిజ్ఞానమయకోశమునకంటె లోపల నానందమయుఁ డగు మఱియొక యాత్మ కలఁడు" అను వాక్యముయొక్క యర్థము విచారింపఁబడును.

సందేహము :— ఇచ్చట మయట్ప్రత్యయమునకు వికారము, ప్రాచుర్యము అను రెండర్థము లుండుట సంశయకారణము. "పై నుదాహ

---

* లోకమున నుదాహరణ మనునది సర్వజనులకును అనుభవసిద్ధము. ఒకవిషయమును చెప్పి దానిని బాగుగ మనసున నాటించుటకై దానితో నున్నపోలికనుబట్టి వర్ణింపఁబడు రెండవవిషయ ముదాహరణ మనఁబడుచున్నది. దృష్టాంతము కూడ నిదియే.

ఇట్లు కాక మొట్టమొదట తానుపదేశించిన విషయముతో నేమియు పోలిక లేని (అనఁగ : తానుపదేశించిన విషయమునకు విరుద్ధమైన) మఱియొక విషయమును కూడ బోధించి "మేము చెప్పిన నియమము ఇట్టిస్థలములయం దుండదు, కావున నీస్థలములయందు మాత్రమే యుండును." అని యీ నిరూపించునలవాటు కలదు. ఈవిషయము (అనఁగ: మొదటి విషయముతో సంబంధములేని రెండవవిషయము) ప్రత్యుదాహరణ మనఁబడును.

రింపఁబడిన ఆనందమయవాక్యము జీవునిగూర్చియే చెప్పును; బ్రహ్మ మునుమాత్రమే చెప్పును" అనునవి క్రమముగ పూర్వపక్షసిద్ధాంత ములు. "జీవు నుపాసించి ముక్తిని జెందవచ్చును" అనుట పూర్వపక్ష మునకు ఫలము. "బ్రహ్మము నుపాసన చేయుటవలన ముక్తి" యనుట సిద్ధాంతమునకు ఫలము.

ఈ రెండుపక్షముల నాధారముచేసికొనియే ఈ క్రిందివిధముగ సంశయము కలుగును.

ఆనందమయవాక్యము పరబ్రహ్మమును చెప్పు ననుటకు నవకాశము లేదు. అన్నమయాదిశబ్దములు చెప్పునర్థమునకంటె నానందమయశబ్దము చెప్పునర్థము భిన్నముగ నుండు ననుట యుక్తియుక్తము కాదు. మఱియు "తస్య ప్రియ మేవ శిరః" "ప్రియమనఁగ: ఇష్టవస్తువులను చూచుట వలన కలుగుసంతోషము. ఆప్రియము ఆనందమయాత్మకు శిరస్సు"అను మొదలగువాక్యములచే శ్రుతి యయ్యానందాత్మకు నవయవములు కల వని చెప్పుచున్నది. బ్రహ్మమునకు నవయవములు లేవు కదా!

అవతారిక:—ఈపూర్వపక్షమును క్రిందిసూత్రముచే ఖండించు చున్నాఁడు—

## ౧౨. ఆనందమయో ఽభ్యాసాత్. ౧. ౧. ౧౨.

తాత్పర్యము:—"అన్యోఽంతర ఆత్మానందమయః" అను వాక్య మునందలి యానందమయుఁడు పరమాత్మయేకాని జీవుఁడు కాఁడు. ఆనందశబ్దమునకు శ్రుతియం * దభ్యాసము కలదు. "రసో వై సః. రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి. కో హ్యేవాన్యా త్కః ప్రాణ్యా ద్య దేష ఆకాశ ఆనందో న స్యాత్" "ఈయానందమయుఁడే సారభూతుఁడు. ఈసారభూతుని నాశ్రయించియే ప్రతివాఁడును ఆనందము నొందుచు న్నాఁడు. సర్వాంతర్యామి యగు నీపురుషుఁడు ఆనందరూపుఁడు కాఁడేని యెవ్వఁడు భుజింపఁగలఁడు? లేక, కార్యముల నాచరింపఁగలఁడు? ఎవ్వఁడు ప్రాణధారణము నొనర్పఁగలఁడు?" అని ఇట్లనేకస్థలముల యందు ఆతైత్తిరీయోపనిషత్తునందే, ఆనందపదము బ్రహ్మవాచకముగ నుపయోగింపఁబడి యున్నది. "విజ్ఞాన మానందం బ్రహ్మ" "జ్ఞానము

* అభ్యాసస్వరూపము—చూ. ౪౫. పుటలో నున్నది.

ఆనందము అనునవియే పరబ్రహ్మరూపములు" అని ఇతరము లగు నుప నిషత్తులయందుఁ గూడఁ బ్రయోగింపఁబడియున్నది. కావున నిచ్చటి యానందమయుఁడు జీవుఁడు కానేరఁడు. శ్రుతియందు లోకులబుద్ధిని అవలంబించి (అనఁగ: మూఢు లగువారు ఈస్థూలదేహమునుకూడ నాత్మనుగ భావించుచున్నారు కావున వారిభావము ననుసరించి) మొట్ట మొదట "ఈ దేహమే యాత్మ" యనియు "దీనికి ఆధారభూతుఁడై *ప్రాణమయాత్మ యొక్కఁడు దీనికి లోపల నున్నాఁడు" అనియు, "వానికంటె లోపల తదాధారుఁడై † మనోమయాత్మయు, తదాధా రుఁడై ‡ విజ్ఞానమయాత్మయు కలఁడు" అనియుఁ జెప్పఁబడియున్నది. పిదప "ఆవిజ్ఞానమయాత్మకు లోపల § ఆనందమయాత్మ కలఁడు" అని

---

* పంచకోశములు:—"అన్నమయము ప్రాణమయము విజ్ఞానమయము మనో మయము ఆనందమయము" నని కోశము లైదు కోశ మనఁగ: ఆవరణము. ఈ అన్న మయాదులు పరబ్రహ్మమునకు నావరణము లగుటచే కోశములనఁబడుచున్నవి.

† అన్నమయకోశ మనఁగ: ప్రత్యక్షముగఁ గన్నులకుఁ గానవచ్చుచు కరచరణా ద్యవయవయుక్తమై యుండు నీదేహము. ఇది యన్నముచే జనించి యన్నమువలననే యభివృద్ధి యగుచున్నది. కావున దీనిస్వరూప మంతయు నన్నమే కదా?

‡ ప్రాణవాయువు లైదును వానిసహాయముచే ప్రవర్తించు కర్మేంద్రియము లైదునుఁ గలసి ప్రాణమయకోశ మనఁబడును. ఇందు కర్మేంద్రియప్రేరకము లగుటచే ప్రాణములె ప్రధానములు కావున దీనికి ప్రాణమయ మని మాత్రమే పేరు. వాక్కు- హస్తము పాదము పాయువుఁ (గుదము) ఉపస్థ(గుహ్యము) అను నివి కర్మేంద్రియములు. జ్ఞానేంద్రియసహాయము లేక స్వతంత్రముగఁ బ్రవర్తింప నేరవు. కావున వీనికి కర్మేంద్రి యము లని పేరు. ఇవి కార్యముల నాచరించుట మాత్రమే కాని స్వయముగ నేపదార్థ మును తెలిసికొన నేరవు కదా? ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అను నీయైదును ప్రాణవాయువులు.

§ మనస్సును, దానిచేఁ బ్రేరింపఁబడి ప్రవర్తించు జ్ఞానేంద్రియములును గలసి మనోమయకోశము. ఇందును పూర్వమువలెనే మనస్సు ప్రధాన మగుటచే దీని కీపేరు కలిగినది. శ్రోత్రము త్వక్కు (చర్మమున నుండి స్పర్శమును గ్రహించు నింద్రియము) నేత్రము నాలుక నాసిక (ఇచ్చట కర్మేంద్రియ జ్ఞానేంద్రియము లన్నియు "మనసుబా హ్యముకుఁ గానవచ్చు గోళములు కావనియు వానిలోపల నుండి యాయాకార్యములఁ జేయుసూక్ష్మపదార్థము లనియుఁ దెలిసికొనవలయును.) అనునవి జ్ఞానేంద్రియములు.

మాత్రమే చెప్పఁబడియున్నది; కాని ఆయానందమయాత్మకుఁ గూడ లోపల మఱియొకయాత్మ కలఁ డని చెప్పఁబడలేదు. స్థూలారుంధతీన్యాయము (పుట ౮౨.) ననుసరించి ముఖ్యబ్రహ్మమును బోధించుటకై శ్రుతి యముఖ్యాత్మల (అన్నమయాద్యాత్మల) బోధించె ననుట దోషముకాదు; అంతమాత్రమునవలన అన్నమయాదిశబ్దములకువలెనే ఆనందమయశబ్దమునకుఁ గూడ నముఖ్యాత్మను బోధించునర్థమే యుండవలయు నను నియమము లేదు. మఱియు ఆశ్రుతియందు మొట్టమొదటనుండియు నన్నమయాద్యాత్మలకు నవయవములు చెప్పఁబడియున్నవి, కావున నీయానందమయాత్మకుఁగూడ నవయవములు కల్పింపఁబడినవి కాని యవి ప్రధానములుకావు. శుద్ధబ్రహ్మమును ఉపదేశించుటకు వీలు లేదు. కావున నేదియో యుపాధి తప్పక యాశ్రయింపఁబడుననియు, ఆయుపాధి కొన్ని స్థలములయందు అప్రధానముగాను మఱికొన్నిస్థలములయందు ప్రధా

---

బుద్ధియుజ్ఞానేంద్రియములను గలసి విజ్ఞానమయకోశము. ఇచ్చట బుద్ధికి విజ్ఞానమను పేరు కలదు కావున ఇచ్చట నదియే ప్రధానము కావునను దీని కీపేరు వచ్చినది. అంతఃకరణమునకు వృత్తిభేదములవలన మనోబుద్ధి చిత్తాహంకారము లను నాలుగు నామములు కలవు. ఇందు చిత్తాహంకారములు భిన్నములే యని కొందఱును, మనోబుద్ధులలోనే యేకీభవించు నని కొందఱును, చెప్పుచున్నారు. ఇందు మనోబుద్ధులను రెంటిని ప్రత్యేకముగ గ్రహించి వానితోఁ బ్రత్యేకముగ జ్ఞానేంద్రియములకు సంబంధము కల దని భావించి ఈ రెండుకోశములు కల్పింపఁబడినవి. మనస్సు సంకల్పించి తదనుసారముగ నింద్రియములను ప్రవృత్త్యున్ముఖము లైన నప్పుడు దానికి మనోమయకోశమనియు, బుద్ధి కార్యనిశ్చయముచేసినపిదప తదనుసారముగ నింద్రియములు ప్రవర్తించిన నప్పటి సంయోగమునకు విజ్ఞానమయకోశ మనియుఁ బేర్లు.

మనము సర్వవిధముల ననుభవించు నానందము ఆనందమయకోశము.

ఈకోశము లైదును పరబ్రహ్మమునకు నావరణములుగఁ గల్పింపఁబడినవి. కాని వాస్తవములు కావు. లోకమున ప్రతివాఁడును "నేను" అను పదమునకు దేహమునే యర్థమునుగఁ దలంచుచున్నారు. జ్ఞానము కలుగుకొలఁది ఇంద్రియప్రాణమనోబుద్ధ్యాద్యానందములను గూడ (విషయానందములనుగూడ) పరబ్రహ్మమునుగా భావించుచున్నారు; ఈకారణమువలన యథార్థబ్రహ్మరూపమును గనుఁగొనలేకయున్నారు. ఈవిధముగ నీయన్నమయాదులు ఆత్మజ్ఞానమునకు ప్రతిబంధకము లగుటచే నావరణములుగఁ జెప్పఁబడియున్నవి.

నముగాను నిరూపింపఁబడుననియు ఇదివఱకే వివరింపఁబడియున్నది. ప్రస్తుత మగునానందమయవాక్యమునందలి యుపాధి (అవయవాదు లను చెప్పుట) యప్రధానము కావచ్చును కదా ? ఇట్లగుటచేత నెట్లు చూచినను ఆనందమయుఁడు జీవుఁడు కా నక్కఱ లేదు.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ఈయానందమయాత్మ సర్వాంతరుఁ డనుటకు వీలు లేదు. అన్నమయాదు లగు కోశముల నాల్గింటినిఁ జెప్పి పిదప నానందమయకోశమును గూర్చి జెప్పఁబడి యున్నది. కావున నాయానందమయకోశము సజాతీయము లగు తక్కిన కోశములకంటె నాంతరము (లోపల నుండునది) కావచ్చును; గాని, సర్వమునకు నాంతరము కానేరదు. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" "ఆయా నందమయాత్మకు పరబ్రహ్మము పుచ్ఛము, ఆధారము" అని శ్రుతి పర బ్రహ్మమును దానికిఁ గూడ నాంతరముగఁ జెప్పుచు నున్నది కదా ! లోకమున "దేవదత్తుఁడు బలవంతుఁడు." అనినచో, "దేవదత్తుఁడు సమానజాతీయు లగుమనుష్యులలో బలవంతుఁడు" అనిమాత్రమే యర్థ మగును కాని "ప్రపంచములోఁ గలసర్వపదార్థములకంటెను బల వంతుఁడు" అని యర్థము కానేరదు కదా ! మఱియు వేఱుగఁ జెప్పినను చెప్పకున్నను "దేవదత్తునికంటె నధికబలాఢ్యము లగుజంతువులుకూడఁ గొన్ని కలవు" అని స్ఫురించునట్లు, ప్రకృతమున వేదము (బ్రహ్మమును గూర్చి) చెప్పినను చెప్పకున్నను, ఆనందమయాత్మకంటె నితర మగు పర బ్రహ్మము స్ఫురించును. కావున నెట్లు చూచినను, ఎంత యభ్యాస మున్నను ఆనందమయము బ్రహ్మము కానేరదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యయుక్తము. "దేవదత్తుఁడు బల వంతుఁడు" అనువాక్యమును గూర్చి విచారించిన నాసందర్భమునందు "దేవదత్తునికంటె బలిష్ఠములగు నితరజంతువులు కలవు" అను విష యము ఇతరప్రమాణములచే గోచరమగుచున్నది. ప్రకృతమున బ్రహ్మ మట్టిది. ఇతర ప్రమాణములకు (శాస్త్రభిన్నప్రమాణములకు) గోచర మగునది) కాదు కదా. మఱియు "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్య మునందు చెప్పఁబడిన బ్రహ్మము ఆనందమయాత్మకు నవయవముగ చెప్పఁబడియున్నది, కాని స్వతంత్రముగ కాదు. ఇంతమాత్రమున నా బ్రహ్మ మానందమయునకు నాంతరుఁడు (అంతర్యామి) కానేరఁడు,

ఈవిధముగ విమర్శించిన నానందమయునికంటె నితర మగుపదార్థ మేదియు సర్వాంతర మయినది లేదు. ఈకారణమువలన నానంద మయుఁడె సర్వాంతరబ్రహ్మము.

## అ ౧. పా ౧. సూ ౧౩. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లైనను ఆనందమయుఁడు బ్రహ్మము కానేరదు. మీ రుదహరించిన యభ్యాసము ఆనందశబ్దమునకే కలదు కాని ఈ ఆనందమయశబ్దమునకు లేదు. "ఆనందమయ మాత్మాన ముపసంక్రామతి" "ఆనందమయాత్మను విడుచును" అని యొకానొకచోట యానందమయశబ్దము కూడఁ గనుపట్టినను ఇంతమాత్రమున దానికి బ్రహ్మమే యర్థ మనుటకు వీలు లేదు. మయట్ ప్రత్యయమునకు వికారమే (ఆ ప్రత్యయమునకు "మయ" అనునదియే స్వరూపము; అది, ఏ పదముపై బ్రయోగింపఁబడునో ఆపదముచేఁ దెలుపఁబడు పదార్థముతో చేయఁబడిన వస్త్వంతరమును తెలియజేయును. అన్నపదముపైఁ బ్రయోగింపఁబడిన యాప్రత్యయము, అన్నముచే గల్పింపఁబడిన యన్నమయ కోశమును (దేహమును) దెలియఁజేయును. ఇట్టి యర్థమునకే వికారార్థ మని పేరు. వికార మనఁగ : ఒకపదార్థముయొక్క పరిణామముచే నేర్పడిన మఱియొకపదార్థము.) అర్థముగ నంగీకరించి మొట్టమొదటనుండియుఁ జెప్పుచున్నశ్రుతియొక్క యానందమయశబ్దమున మాత్రము మఱియొక యర్థమును చెప్పె ననుటయె యుక్తము కదా?

అవతారిక:—పై పూర్వపక్షమును అనువాదపూర్వకముగ ఖండించుచున్నాఁడు—

## ౧౩.
## వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్. ౧.౧.౧౩.

తాత్పర్యము (సిద్ధాంతము):—"మయట్ప్రత్యయమునకు వికారమే యర్థమగుటచే నన్నమయాదిపదములకువలెనె ఆనందమయపదమునకుఁ గూడ "ఆనందవికారుఁ డగునాత్మ" అనియె యర్థము చెప్పవలయును. కావున నానందమయుఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు. పరమేశ్వరుఁడు నిర్వికారుఁ డగుటచే నానందవికారుఁడు కాఁడు కదా?" అనిన నది సరికానేరదు. మయట్ ప్రత్యయమునకు "ప్రాచుర్యము విశేష

ముగఁ గలిగియుండుట" అనునర్థముకూడ *వ్యాకరణసిద్ధాంతప్రకారము కలదు. ఇచ్చట నాయర్థము నంగీకరింపవచ్చును. అప్పుడు "బ్రహ్మము

*వ్యాకరణసిద్ధాంతము:— ప్రాచుర్యార్థమున మయట్ ప్రత్యయ ముపయోగింపఁబడు ఆమవిషయమున వ్యాకరణమున "తత్ప్రకృతవచనే మయట్. ౫. ౪. ౨౧" అను సూత్రము కలదు. ఈసూత్రమునకు రెండర్థములు వ్యాకరణసూత్రవ్యాఖ్యాతలచే తెలుపఁబడినది.

"ఏపదార్థము అతిశయముగఁ జెప్పంబడునో ఆపదార్థమునకు(అనఁగ: నాపదార్థమును తెలియఁజేయు ప్రాతిపదికమునకు (ప్రాతిపదిక మనఁగ విభక్తివచనాది ప్రత్యయములు పరములు కాకపూర్వ ముండుశబ్దరూపము; రామ హరి మొదలగునవి) స్వార్థమునందు (అనఁగ: విశేష మేమియు లేక పదార్థస్వరూపమాత్రమునే తెలుపునర్థమునందు) మయట్ప్రత్యయము వచ్చును" అనుట యీసూత్రమునకు నొకయర్థము. "అన్నమయం. యవాగూమయి" అను మొదలగునవి యుదాహరణములు. పయిఁజూపినసూత్రార్థము ననుసరించిన నన్నమయశబ్దమునకు "ప్రచుర మగునన్నము" అనియు, యవాగూమయీ శబ్దమునకు "అధికమయినగంజి" యనియు నర్థ మని తెలిసికొనవలయును. ఇచ్చట మయట్ప్రత్యయము స్వార్థమును మాత్రమే చెప్పు నని తెలిపియుంటిమి కదా. ఈ కారణమువలన నీమయట్ప్రత్యయము పరమైనను లింగభేదము కలుగదు. కావున నే యన్నశబ్దము నపుంసకలింగ మగుటచే నన్నమయశబ్దము కూడ నపుంసకలింగమే యయ్యెను; యవాగూశబ్దము స్త్రీలింగ మగుటచే యవాగూమయీశబ్దము కూడ స్త్రీలింగమే యయ్యెను. ఈవిషయము పైయుదాహరణములయందు స్పష్టముగ దెలుపఁబడియున్నది.

"ఈస్థలమున నీపదార్థ మధికముగ నున్నది." అని చెప్పవలసినప్పుడును, అధికత్వము కలపదార్థమునకు (ఏపదార్థమునకు నాధిక్యము కలదని చెప్పఁబడునో దానికి (అనఁగ: దానినితెలుపు ప్రాతిపదికమునకు) మయట్ప్రత్యయము పరమగును." అనుట యీసూత్రమునకు రెండవయర్థము.

"అన్నమయో యజ్ఞః, అన్నమయం దినం" ఇత్యాదులు దీని కుదాహరణములు. "ఈయజ్ఞమున నన్నమధికముగ నున్నది. ఈదినమున నన్న మధికము" అనునది వాని కర్థములు. ఇచ్చట మయట్ప్రత్యయము విశేష్యము ననుసరించునది యగుటచే దానికి విశేష్యానుసారముగ లింగములు వచ్చును. ఇంతియేకాని "ఈయజ్ఞము అధికాన్నముకలది" అనునర్థము మాత్రము రాదు.

బాగుగ విచారించి చూచిన వృత్తికారమతమునకు నీరెండర్థములలో నేదియు ననుకూలము కాదు. మొదటియర్థమున, మయట్ప్రత్యయయుక్తపదమునకు స్వార్థము

నందు ఆనందము మిగుల నధికము" అని యర్థ మేర్పడును. కావున దోష మేమియు కలుగదు.

"అన్నమయాదిశబ్దములయందు క్రమముగ వికారార్థమే గ్రహింపఁబడుచుండ నీయొక్క యానందమయ శబ్దమునందుమాత్రము భిన్నార్థమును గ్రహింప నేటికి?" అనియెద వేమొ వినుము. ఈ ఆనందమయాత్మ సర్వాంతరుఁడని ఇదివఱకే నిరూపించియున్నాము. కావున నీయానందమయాత్మ నుపదేశించుటకై శ్రుతి స్థూలారుంధతీన్యాయము ననుసరించి యన్నమయాదులఁ జెప్పినది. ఇంతమాత్రమువలన కేవలక్రమపాఠమును మాత్రమే యవలంబించి ముఖ్యాత్మను దెలుపు నానందమయ

---

మాత్రమే యుండుటవలన, ఆనందమయపదమునకు "అధిక మగు నానందము" అని మాత్రమే యర్థ మగును. ఇట్లగుటచే దీని నాశ్రయించిన "బ్రహ్మమునందు ఆనంద మధికము" అనునర్థము సిద్ధింపదు. ఇఁక రెండవయర్థమున, మయట్ప్రత్యయము విశేష్యభిన్నమయినను, ప్రస్తుతానందమయవాక్యమున నానందమయపదమునకంటె భిన్నముగఁ విశేష్య మేదియు లేకుండుటచే నచ్చటి యానందమయపదమునకు "ఆనందమధికముగ గలది" అనునర్థము వచ్చినను బ్రహ్మప్రస్తావ మేమియు నుండదు. ఆత్మపద మున్నను, దానిని విశేష్య మని చెప్పుటకు వీ లున్నను, వృత్తికారుఁడు దాని ననుసరించి సిద్ధాంతము చేయఁ బూనలేదు కదా?

"సత్యజ్ఞానవాక్యమునందలి బ్రహ్మపదమే ఆనందమయవాక్యమువరకు ననువర్తించుచుండుటచే విశేష్యమును క్రొత్తగా వెదుక నక్కఱ లేదు" అనియెద వేమో; అదియు సరి కాదు. అచ్చటి బ్రహ్మశబ్దమే విశేష్యమగునేని, యిచ్చటి యానందమయ శబ్దము దానికి విశేషణ మగుటకు వీలు లేదు. రెంటికిని లింగములు భిన్నములు కదా! ఇది యంతియుఁ గాక "బ్రహ్మము ఆనందమున కాధారము" అనుటయు నేవాదికిని సమ్మతము కాదు.

వాస్తవస్థితిలో "రెండవయర్థము ననుసరించినను మయట్ ప్రత్యయయుక్తములగు నన్నమయాదిపదములకు, 'అధికాన్నము కలది.' యనునర్థమేరాదు." అని యిదివరకే చెప్పియున్నాము. ఇప్పుడు "ఇట్టియర్థము వచ్చినను వృత్తికారమతమునకు నానుకూల్యము లేదు" అనియు నిరూపించియున్నాము. వాస్తవస్థితిలో వ్యాకరణవిరుద్ధమగునర్థమును గ్రహించుటయే దోషము కదా!

ఇట్లయినను వృత్తికారుఁడు తనమతమును నిలిపికొనుటకై ప్రథమార్థము నంగీకరించియున్నాఁడు. వికారార్థము తొలఁగి ప్రామర్థ్యార్థము వచ్చుట మాత్రమే స్వమతసిద్ధాంతమునకుఁ జాలు నని తలంచుచున్నాఁడు.

శబ్దమునకుఁ గూడ వికారార్థమునే చెప్ప నక్కఱలేదు. * "శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యానాం పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అను జైమినీసూత్రము ననుసరించి †ప్రకరణమునకంటె ‡శ్రుతి బలాధికమైనది. కావున వ్యాకరణసిద్ధమై లోకానుభవగమ్యమై ప్రస్తు

* ఈ సూత్రము పూర్వమీమాంసా శాస్త్రములోనిది. వేదార్థనిర్ణయము చేయుటకు నేర్పఱుపఁబడిన నియమమును చెప్పునది. లోకమునందును వాక్యార్థనిర్ణయము చేయవలసి వచ్చినప్పుడు కూడ దీని నవలంబింపవచ్చును.

ఇందు శ్రుతి, లింగము, వాక్యము, ప్రకరణము, స్థానము, సమాఖ్య యను నాఱువిషయములు క్రమముగ "వెనుకటివానికంటె పూర్వపూర్వమున నున్నవై తాత్పర్య నిర్ణయమునఁ బ్రబలసాధనములు" అని చెప్పఁబడియున్నవి.

శ్రుతి:—వీనికి యథాశ్రుత మగుశబ్దమునుబట్టి వాక్యార్థమును నిర్ణయించుటకు నిది సాధన మగును. ఇది తక్కినవాని కన్నిటికంటె ప్రబలము.

లింగము:—గుఱుతు; ఇది శబ్దార్థము స్పష్టము కానప్పుడు వాక్యమునఁ జెప్పఁబడినధర్మముల ననుసరించి యర్థనిర్ణయము చేయుటకు వీలు కలిగించును. ఇది శ్రుతి కంటె మాత్రము బలహీనమే కాని తక్కినవానికంటె బలవత్తరము.

వాక్యము:—అనేకపదములతోఁ గూడి యొక పరిపూర్ణార్థము నిచ్చునది; ఇది తాత్పర్యముచే నర్థనిర్ణయమును చేయుటకు శక్తిని కలిగించును. ఇది పైరెంటికంటె బలహీనము.

ప్రకరణము:—అనేకవాక్యములు కలిగి యుపక్రమోపసంహారాదులచే నొక్క యర్థమునే బోధించు గ్రంథభాగము. ఇది పూర్వాపరపర్యాలోచనముచే నర్థనిర్ణయము చేయ ననువు కలిగించునది.

స్థానము:—ఒక్కవిధముగాఁ బలుమాఱు పఠించుట; ఇది పాఠక్రమము ననుసరించి "ఇచ్చట కూడఁ బైపాఠములవలెనే పాఠ ముండవచ్చును" అనునూహచే నర్థనిర్ణయమును చేయించునది.

సమాఖ్య:—నిర్ణయింపఁవలసిన పదార్థమును తెలుపుపదము లేకున్నను దానితో నేవిధముగానైన పోలిక గలిగిన రెండవ పదముండుట; ఇదియు "ఈపదము దీనితో (ప్రస్తుతపదముతో), పోలిక గలదియే యగుటచేతను ఇది (ప్రస్తుతపదము) లేకున్నఁ దాత్పర్యము కుదురదు కావునను, 'ఇచ్చట నిదియే (ప్రస్తుతపదార్థమే) కలదు' అనియే నిర్ణయింపవలయును " అనునూహచే విషయ నిర్ణయమును చేయుటకు సామర్థ్యమును కలిగించును. ఇది యన్నిటికంటెను బలహీనము.

† ప్రకరణస్వరూపము పైన వివరింపఁబడినది.

‡ శ్రుతిస్వరూపము పైన వివరింపఁబడినది.

తోపయోగియైన మయట్ ప్రత్యయమునందు తెలియవచ్చుచున్న ప్రాచుర్యార్థమును విడచుట న్యాయముకాదు. లోకమునందును "ఈ యజ్ఞము అన్నదానమయము. ఈసభ పండితమయము" అను నిట్టి వ్యవహారములు వేనవేలు కలవు గదా!

పూర్వపక్షము:—ఇట్లు చెప్పినను ఆనందమయము బ్రహ్మము కానేరదు. "ఆనందప్రచురము=ఆనందమే యధికముగాఁ గలది" అనిన "దుఃఖ మల్పముగఁ గలది" అని చెప్పిన ట్లగును. పరబ్రహ్మమునకు దుఃఖసంబంధము కలదనుట యెవ్వనికిని సమ్మతము కాదు కదా!

సిద్ధాంతము:—ఇట్లన నక్కఱ లేదు. వాస్తవస్థితిలో శుద్ధబ్రహ్మమునకు నానందముతోఁగాని దుఃఖముతోఁగాని మఱియేయుపాధితోఁగాని సంబంధము లేదు. శుద్ధబ్రహ్మమును బోధించుటకే వీలులేదు. గావున నెప్పటికి నేదియోయొకయుపాధి యాశ్రయింపఁబడుచునే యుండును. ఇచ్చట ఆనందమయోపాధి గ్రహింపఁబడినది. ఇందు దుఃఖసంస్పర్శము కూడ కొంచెము కలిగిన కలుగనిండు. దానివలన బ్రహ్మమునకు లోప మేమి? దానికి దేనితోను సంబంధము బొత్తిగనే లేదు కదా?

## అ ౧. పా ౧. సూ ౧౪. ఆరంభము.

అవతారిక:— మఱియొకకారణమువలన గూడ "మయట్ప్రత్యయమునకు ఇచట ప్రాచుర్యార్థమే చెప్పవలయును" అను విషయమును నిర్ధారణ చేయుచున్నాఁడు.

## ౧౪. తద్ధేతువ్యపదేశాచ్చ. ౧. ౧. ౧౪.

తాత్పర్యము:— శ్రుతియందు ఆనందమయాత్మను వర్ణించుట కారంభించి "ఏష హ్యే వానందయతి" "ఈయానందమయాత్మయే దుఃఖరూప మగుప్రపంచమునకు నానందమును కలిగించుచున్నాఁడు" అని చెప్పఁబడియున్నది. పరులకు నానందము నొసంగువాఁడు మొట్టమొదట స్వయముగ నానందప్రచురుఁడై యుండవలయును. లోకమున స్వయముగ ధనవంతుఁడు కాకుండినఁ బరుల నెట్లు ధనవంతులఁ జేయఁగలఁడు. కావున "ప్రపంచమున ననుభవింపఁబడు నానందమునకు నానందమయాత్మయే కారణము" అని చెప్పఁబడియుండుటచే నానంద

మయాత్మ యానందప్రచురుఁడే యనియు, మయట్ప్రత్యయమునకు ప్రాచుర్యార్థమే చెప్పఁబడవలయు ననియు స్పష్ట మగుచున్నది.

## ౧౫. మాంత్రవర్ణిక మేవ చ గీయతే. ౧.౧.౧౫.

తాత్పర్యము:—మఱియొకవిశేషము. ఆతైత్తిరీయోపనిషత్తునందు మొట్టమొదట సర్వవేదాంతతాత్పర్యమును సూచించుచు "బ్రహ్మవిదాప్నోతి పరం" "బ్రహ్మవేత్త సర్వోత్తమ మగుస్థానమును చెందును" అని సూత్రరూపముగ నారంభింపఁబడియున్నది. పిదప— "బ్రహ్మ మనఁగ నేది ?" అని సంశయము కలుగఁగ, దానిఁ దీర్చుటకై "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "సత్యమును జ్ఞానంబును ఆనందంబును బ్రహ్మరూపములు. దానికి †త్రివిధ పరిచ్ఛేదములు లేవు"అని బ్రహ్మలక్షణము చెప్పఁబడియున్నది. తర్వాత—"ఆబ్రహ్మమును తెలిసికొనుట యెట్లు?" అనిన నాసంశయమును నివారించుటకై "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" "పై వర్ణించిన ఈయాత్మనుండియే యాకాశము జనించెను" అను మొదలగువాక్యములచే సృష్టిని జెప్పి, సత్యజ్ఞానాది వాక్యమునందు ప్రశంసింపఁబడిన గుహను వర్ణించుటకై యన్నమయాదికోశములు వర్ణింపఁబడియున్నవి. ఇట్లు క్రమక్రమముగ సర్వవాక్యములయందును సత్యజ్ఞానాది మంత్రమునందును వర్ణింపఁబడిన బ్రహ్మమే ఈయానందమయవాక్యమునందును ప్రశంసింపఁబడియున్నది. ఈయానందమయాత్మను చెప్పినపిదప నా‡యానందవల్లియందు మఱియేవిషయమును చెప్పఁబడియుండలేదు. కావున సత్యజ్ఞానాదిమంత్రమునకును ఆనందమయాదిబ్రాహ్మణమునకును అర్థభేదము లేదు; అట్లుండు

---

† పరిచ్ఛేద మనఁగా విభాగము. దేశకృతపరిచ్ఛేదము, కాలకృతపరిచ్ఛేదము, వస్తుకృతపరిచ్ఛేదము నని యిది మూఁడువిధములు.

౧. దేశకృతపరిచ్ఛేదము:—ఒకచోట నుండి మఱియొకచోట లేకుండుట.

౨. కాలకృతపరిచ్ఛేదము:—ఒకకాలమున నుండి మఱియొకకాలమున లేకుండుట.

౩. వస్తుకృతపరిచ్ఛేదము:—ఒకపదార్థమున నుండి మఱియొకపదార్థమున లేకుండుట.

‡ ఆనందవల్లి యనఁగా తైత్తిరీయోపనిషత్తునందలి రెండవభాగము. "బ్రహ్మవిదాప్నోతి పరం" అని యారంభింపఁబడినది.

టకును వీలులేదు. ఎప్పటికిని మంత్రము ఉపాయమును చెప్పును. ఆయు పాయముచేఁ బొందఁదగినపదార్థమును బ్రాహ్మణ మభివర్ణించును. ఇట్టి వానికిఁ బరస్పరభేద ముండుట యసంభవము కదా? కావున నానంద మయుఁడు పరబ్రహ్మమే యై తీరవలయును.

(ఈయర్థము భాష్యానుసారముగ వ్రాయఁబడినది. వాచస్పతి మిశ్రుఁడు మాత్రము తనభామతియందు, అన్నమయాదికోశములను జెప్పు వాక్యమే మంత్ర మని చెప్పియున్నాఁడు. ఆనందమయవాక్యము నందు జెప్పఁబడినశుద్ధబ్రహ్మమును తెలిసికొనుటకై యాయన్నమయాది వాక్య ముపాయమును చెప్పునది యగుటచే గౌణముగ మంత్ర మని చెప్పఁబడినది. "సత్యం జ్ఞానం" అను మొదలగువాక్యమునే మంత్ర మని చెప్పిన, ఆబ్రహ్మపదమునకు నానందమయాదివాక్యమున గుఱుతు లేక పోవుటచేతను, "ఆబ్రహ్మమే ఇచ్చట చెప్పఁబడెను" అని నిర్ణయించు టకు, నా రెండువాక్యములకును గలసంబంధము స్పష్టము కాకపోవుట చేతను, ఆయన యట్టి యభిప్రాయమును చెందియున్నాఁడు. "అన్నమ యాదివాక్యముకూడ వాస్తవస్థితిలో కోశములను చెప్పునదియే యైనను ఆయాయుపాధులయందున్న బ్రహ్మమునే చెప్పుననుట నిర్వివాదము; కావున మంత్ర మగునన్నమయాదివాక్యమునకును బ్రాహ్మణ మగు నానందమయవాక్యమునకును ఐక్యమును కలదు" అని నిరూపించి యున్నాఁడు.)

## ౧౬. నేతరోఽనుపపత్తేః. ౧. ౧. ౧౬.

తాత్పర్యము:—ఇదియును గాక నీఆనందమయుఁడు జీవుఁడను టకు నెట్లును వీలులేదు. ఆనందవల్లియందు ఆనందమయుని వర్ణింప నారం భించి "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" "ఆయానంద మయుఁడు 'నేనీప్రపంచరూపముతోఁ దోఁచుదును గాక' అని తలం చెను" అని వర్ణింపఁబడియున్నది. ఇట్లు "సృష్టికర్త యానందమయుండు" అని చెప్పఁబడియుండుటచే జీవుఁ డానందమయుఁడు కానేరఁడు. పంచ భూతసృష్టికిఁ బిదపఁ గాని దేహోత్పత్తి లేదు; దేహోత్పత్తికిఁ బిదపఁ గాని బ్రహ్మమునకు జీవత్వము లేదు. కదా! మఱియు "బహుస్యాం" అని చెప్పుటవలన ఈప్రపంచమునకును సృష్టికర్తకును అభేదము తెలి

 

యనచ్చుచున్నది. జీవప్రపంచములకు భేదము సర్వానుభవసిద్ధమై ప్రత్యక్షమై యున్నది. "ఇది నాది" అను మొదలగు వ్యవహారము లిందులకుఁ బ్రమాణములు కదా! కావున నెట్లు చూచినను "ఆనందమయుఁడు జీవుఁడు" అనుటకు తగినయుక్తి లేదు.

## ౧౭. భేదవ్యపదేశాచ్చ. ౧. ౧. ౧౭.

తాత్పర్యము:—ఇంతమాత్రమే కాదు. ఆనందవల్లియందు ఆనందమయాత్మను ప్రస్తావించి "రసో వై సః" "ఆయానందమయాత్మయే సర్వప్రపంచసారభూతుఁడు". (అందఱును ఆనందమునే కోరుచుందురు గావున సర్వపదార్థములకంటె ఆనందమే శ్రేష్ఠమైనది యని తాత్పర్యము)" అని చెప్పఁబడి, పిదప "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీభవతి" "ఈరసమును పొందియే జీవుఁడు ఆనందము కలవాఁ డగుచున్నాఁడు" అని చెప్పఁబడియున్నది. దీనివలన రసరూపుఁ డగు నానందమయాత్మకును, తత్సంప్రాప్తిచే నానందము నొందుజీవునకును భేద ముండవలయు ననుట స్పష్టమగుచున్నది. ఇట్లు ఆనందమయుఁడు జీవునికంటె వేఱైన నాతఁడు పరమేశ్వరుఁడే యనుట నిర్వివాదముగ సిద్ధించును.

ఎట్లనిన:—"అన్యోఽన్తర ఆత్మానందమయః" అను వాక్యమునందు,'ఆత్మన్'శబ్దము ప్రయోగింపఁబడి యుండుటచే,ఆనందమయుఁడు చేతనుఁడే కావలయును. ఆత్మశబ్దమునకు నచేతన మర్థము కాదని ఈక్షత్యధికరణమున (బ్ర.సూ.అ ౧.౧.౭-౮) నిరూపించియున్నాము కదా! లోకమున జీవ పరమేశ్వరజీవు లిరువురే చేతను లనుట ప్రసిద్ధముగ నున్నది.ఆనందమయుఁడును జీవుఁడు కాఁడనుట నిరూపింపఁబడెను. కావున నానందమయుఁడు బ్రహ్మమే యనుట సిద్ధించినది.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. కల దని చెప్పఁబడిన జీవబ్రహ్మముల భేదము సత్యమా? అసత్యమా? సత్యమైనచో నాజీవబ్రహ్మలకు నెప్పటికి నైక్యము కలుగదు. అసత్యమైన మీమతము నిలువదు.

సిద్ధాంతము:—వినుము. నీవు చెప్పినది సరియే. ఐన నొక్కవిశేషము కలదు. లోకమున సత్యాసత్యపదార్థములు ప్రత్యేకముగ రెండు తెఱంగులై యున్నవి. బ్రహ్మ మొక్కటియే పారమార్థికసత్యము; ఆకా

శాదులు వ్యావహారికసత్యములు. "ఈయాకాశము శాశ్వతమయినది. వాయువు సత్యమయినది" అని యూరక చెప్పుటయేకాని విచారించిన నాయాకాశాదులు ఇతరపదార్థములకంటె కొంత యధికకాలము నిలుచునేకాని యెప్పటికి నేకరూపముతో నుండవు కదా! ఇట్లే ఈప్రపంచ మంతయుఁ బారమార్థికాసత్యము; శీఘ్రముగ నశించు స్వభావముగల ఘటపటాదిపదార్థములు వ్యావహారికాసత్యములు. "ఈఘటము బహుకాల ముండదు" అనుటయేకాని వాస్తవస్థితిని బట్టి చూచిన నీప్రపంచమున నట్టిపదార్థ మేదియు లేదు కదా. * ఇట్లగుటచే జీవబ్రహ్మలకు గలభేదము పారమార్థిక సత్యముగాని పారమార్థికాసత్యము గాని కాక పోయినంతమాత్రమున దోష మేమియు రాదు. ఆభేదము పారమార్థికాసత్యము వ్యావహారికసత్యము నై యున్నది. వ్యవహార మంతయు నవిద్యయే (శాస్త్రావతారిక. ౧౧-౧౨ పేజీ చూడుడు.) కావున జీవబ్రహ్మలకు కలదని చెప్పఁబడినభేదము అవిద్యాకల్పితము. అవిద్య యనఁగ నజ్ఞానము; కావున బ్రహ్మ మేకరూపముగ నుండియు అజ్ఞానమువలన రెండురూపములు కలదిగ నేర్పడుచున్నది. ఒక యైంద్రజాలికుఁడు తాను భూమిపై నుండియే మాయాశక్తివలన నాకసముపై నెక్కియున్నట్లు తోఁచువిధంబునను, ఒక్కయాకసమే తనకు భేదములు లేకున్నను ఘటోపాధివలన ఘటాకాశ మహాకాశ భేదములతోఁ గానవచ్చినట్లును, ఒకపరమేశ్వరుఁడే అవిద్యోపాధివలన రెండువిధములఁ దోఁచుచున్నాఁడు. ఇట్టిభేదము నాశ్రయించియే "నేతరో ఽనుపపత్తేః" "భేదవ్యపదేశాచ్చ" అను రెండు సూత్రములును, సూత్రకారునిచే నిర్మింపఁబడినవి.

పూర్వపక్షము:—ఇట్లైన మఱియొక విధముగఁ జెప్పవచ్చును. ఏకరూపమగు బ్రహ్మమునందు భేద మున్నట్లే ఏకరూపుఁడగు జీవుని యందుఁగూడ వ్యావహారికభేద ముండవచ్చును. ఆతనికిఁగూడ స్థూల సూక్ష్మదేహోపాధులు కలవు కదా ?

ఇట్లు జీవునకుఁ గూడ రూపద్వయము కలదేని యప్పుడు ఆనందమయాత్మయు తత్ప్రాప్తిచే సుఖించువాఁడును గూడ నొక్కజీవుఁడే

* ఈవిషయమును గూర్చి యధికవిమర్శము గోరువారు నాచే వివరింపఁబడిన బ్రహ్మగీత అ. ౨, ౧౬-శ్లోకము మొదలు ౨౭ వరకు చూచునది.

కావచ్చును. అప్పుడు "ఆనందమయము బ్రహ్మము" అనుసిద్ధాంతము
నకు భంగము వచ్చును కదా ?

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట కవకాశము లేదు. బ్రహ్మము శుద్ధము
కావున నవిద్యచే దానియందు భేదము కలిగెను. జీవుఁడు అట్టివాఁడు
కాఁడు. అజ్ఞానము లనేకములు కలవనుట విరుద్ధము కదా. లోకమున
జ్ఞాన-జ్ఞానవ్యక్తులు రెండే కలవు కాని మూఁడవది లేదనుట స్పష్టము.
ఇట్లగుటచేత నజ్ఞాని యగుజీవునకు నెన్నియోయుపాధు లున్నను భేదము
కలుగదు.

## అ ౧. పా ౧. ౧౭ సూ. ఆరంభము.

అవతారిక:—"అగుఁగాక. ఆనందమయుఁడు జీవుఁడు కాకపోయినను
సాంఖ్యులు చెప్పుప్రధానము కావచ్చును. ఆప్రధానమునందును సత్వగుణ
మధికముగ నుండుటచే నానందము కలదు. సత్వగుణము జ్ఞానానంద
రూప మగుట ప్రసిద్ధమే కదా?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు-

## ౧౭. కామాచ్చ నానుమానాపేక్షా. ౧. ౧. ౧౭.

తాత్పర్యము:—ఆనందమయశబ్దార్థము ప్రధాన మనుట బొత్తి
గనే సంభవింపదు. "సోఽకామయత" అని శ్రుతియందు ఆనంద
మయాత్మకు సృష్టివిషయకసంకల్పము కల దని చెప్పఁబడియున్నది.
సంకల్ప మనునది చేతనధర్మ మగుటచే నచేతన మగు ప్రధాన
మానందమయశబ్దార్థము కానేరదు. ఈవిషయము (అనఁగ: ప్రధానము
జగత్కారణము కా దనువిషయము) ఈక్షత్యధికరణమున స్పష్టముగ
నిరూపింపఁబడియున్నది. ఇట్లైనను "ఛాందోగ్యోపనిషత్తుయందు వలెనె
తైత్తిరీయోపనిషత్తునందుఁ గూడ చేతనకారణవాదము సమానము" అని
తెలుపుటకై ఈయధికరణమున నీసూత్రము మరల రచింపఁబడెను.
కావున †పౌనరుక్త్యము లేదు.

## ౧౮. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి. ౧. ౧. ౧౮.

తాత్పర్యము:—మఱియొకవిషయము. ఆతైత్తిరీయోపనిషత్తు
నందు—"యదా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే....అభయం ప్రతిష్ఠాం

†పౌనరుక్త్య మనఁగా నొక్కమాఱు చెప్పినదానినే మఱలఁ జెప్పుట.

విందతే అథ సోఽభయం గతో భవతి యదా హ్యేవైష ఏతస్మి
న్నుదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి" "ఏజీవుఁడు అదృశ్య
త్వము మొదలగు లక్షణములుగల యీయానందమయాత్మునియందు
నిర్భయ మగుస్థితిని (అభేదజ్ఞానమును) జెందునో అట్టివానికి నెన్నటికిని
భయము లేదు. ఎప్పుఁడీయానందమయునియందు కొంచెమైనను భేద
మును భావించునో (అనఁగ: ఆనందమయుఁడు వేఱు, నేను వేఱు అని
తలంచునో) అట్టివానికి సంసారభయము ఎప్పటికిని నివర్తింపదు" అను
వాక్యములచే "ఆనందమయునియందు అభేదజ్ఞానము కలజీవుఁడు ఐక్య
రూప మగుముక్తిని జెందును" అని చెప్పఁబడియున్నది. ఆనందమయ
శబ్దవాచ్య మగు పదార్థము, ప్రధానము గాని, జీవుఁడు కాని యగునేని
అప్పుడు ఇట్లు చెప్పుట విరుద్ధము కదా! అచేతన మగుటచే బ్రధానము
నందు జీవునకు నభేదజ్ఞానముగాని యైక్యముగాని సంభవింప దనియు,
చేతనుఁడైనను జీవుఁడు తానేయగుటచే తద్విషయమున భేదాభేద
జ్ఞానములలో నేదియు నుండుట సంభవింప దనియు నిదివఱకే నిరూ
పించియున్నాము. కావున నెట్లుచూచినను ఆనందమయపదమునకు
పరబ్రహ్మమే యర్థము.

---

## శంకర వ్యాఖ్యానము.

N. B. పయిన చేయబడినసిద్ధాంతము వృత్తికారుని యభిప్రా
యము ననుసరించినది. శంకరభగవత్పాద పూజ్యులమతముమాత్ర మిది
కాదు. ఆనందమయవాక్యమునందుఁ గల "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా"
"ఆయానందమయాత్మకు బ్రహ్మము పుచ్ఛమువలె నాధారమై యున్నది"
అనువాక్యమే యీయధికరణమున విచారింపఁబడుననియు, ఆనందమ
యాత్మ అన్నమయాదులవలెనే జీవుఁడే కాని బ్రహ్మము కాఁడనియు,
వారి యభిప్రాయము.

## వృత్తికారమతఖండనము.

పూర్వపక్షము (శంకరులు):— "స వా ఏష పురుషోఽన్నర
సమయః, తస్మా దన్యోఽంతర ఆత్మా ప్రాణమయః, తస్మా దన్యోఽంతర
ఆత్మా మనోమయః, తస్మాత్ .... అన్యోఽంతర ఆత్మా విజ్ఞానమయః"
"ఎదుటఁగానవచ్చుచున్న యీయాత్మ, అన్నవికారుఁడు. ప్రాణవికారుఁ

డగుమఱియొకయాత్మ యీతనికి లోపల నున్నాఁడు. మనోమయుఁ డగు వేఱొకయాత్మ యా ప్రాణమయునకుఁగూడ లోపల నున్నాఁడు....విజ్ఞాన మయుఁడు (విజ్ఞానవికారుఁడు) అంతకంటెను లోపల నున్నాఁడు'' అని యిట్లు వరుసగ వికారార్థమున మయట్ప్రత్యయమును ప్రయోగిం చుచు వచ్చినశ్రుతి యాకస్మికముగ నొక్కచోట మాత్రము దానిని మఱియొకయర్థమునఁ బ్రయోగించె ననుట యెట్లు? ఆనందమయ శబ్దము బ్రహ్మమును చెప్పుననుట యెట్లు?

సిద్ధాంతము (వృత్తికారుఁడు):— వేదపురుషుఁడు చేసినపదప్ర యోగమునకు నాక్షేపము చేయుటకు వీలు లేదు. ఇతరకారణముల వలన నర్థనిర్ణయము చేయ ప్రయత్నింపవలయును. అర్థనిర్ణయహేతు వులు బలిష్ఠములై యున్నప్పుడు పాఠక్రమమొక్కటి మాత్రము విప రీతముగఁ గానవచ్చినను లోపము లే దనుట మీకును మాకును కూడ సమ్మతమే కదా! ప్రకృతశ్రుతియందు మొట్టమొదట ''సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'' అని పరబ్రహ్మమును చెప్పుట కారంభింపఁ బడెను. అన్నమయాది వాక్యములయందు అముఖ్యము లగు దేహాదులే చెప్పఁ బడినను వానివానిమూలమున తత్తదుపాధులయందున్న బ్రహ్మమే వర్ణింపఁబడెను. ఈయానందమయవాక్య మంతము కావున దీనియందును పూర్వవాక్యములయందువలెనే ఉపాధి వర్ణింపఁబడినను, ఆయుపాధిని వివక్షింపక (ముఖ్యముగఁ జెప్పక) కేవలబ్రహ్మము మాత్రమే వర్ణింపఁ బడెను.

పూర్వపక్షము (శంకరులు):—ఇట్లైన నన్నమయాదులు కూడ ముఖ్యబ్రహ్మములే కావలసివచ్చును. అవియు నీయానందమయము వలెనే మాంత్రవర్ణికాధికారమునఁ ('సత్యంజ్ఞానం' అను మొదలగు * నుపక్రమమునకు సంబంధించి) జెప్పఁబడినవే కదా!

సిద్ధాంతము (వృత్తికారుఁడు):—ఇట్లు చెప్పుటకు వీలు లేదు. అన్నమయాదులను వర్ణించునప్పుడు ''అన్యోఽంతర ఆత్మా ప్రాణ మయః'' అను మొదలగు వాక్యములచే నాయాయాత్మలకు లోపల మఱి యొకయాత్మ యున్నట్లు చెప్పఁబడియున్నది. ఆనందమయాత్మను వర్ణించు నప్పు డట్లు చెప్పఁబడి యుండలేదు.

---

*ఉపక్రమము, (చూ. పుట. ౭౫)

పూర్వపక్షము (శంకరులు):—అగుఁగాక. ఆనందమయునికంటె లోపల మఱియొకయాత్మ లేకపోయినను ఇంతమాత్రమువలన నాతఁడు పరబ్రహ్మ మగుటకు వీలు లేదు. "తస్య ప్రియ మేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనంద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" "ఆయానందమయాత్మకు ప్రియము (ఇష్టవస్తువును చూచుటవలనఁ గలుగుసంతోషము) శిరస్సు; మోదము (ఇష్టవస్తువు దొరకుటవలనఁ గలిగినసంతసము) కుడి ప్రక్క; ప్రమోదము (దానియనుభవమువలనఁ గలుగు సంతోషము) ఎడమప్రక్క; ఆనందము (సామాన్యమగునానందము) శిరస్సునుండి పుచ్ఛమువరకుఁ గలసర్వదేహము; పరబ్రహ్మము ఆధార మగుపుచ్ఛము" అని యాయానందమయాత్మకు నవయవములు చెప్పఁబడియున్నవి. బ్రహ్మమునకు నవయవసంబంధ ముండుట తటస్థింపదు కదా! ఈశ్రుతియందే యుత్తరవాక్యమున "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" "మనస్సు వాక్కు అను నీరెండును ఎవ్వని సమీపింపనేరక మఱలునో" అని "పరబ్రహ్మము మనోవాక్కుల కందనిది" అని చెప్పఁబడియున్నది. ఇట్లు చెప్పుటచే నీశ్రుతియందు నిర్విశేషబ్రహ్మమే (ఉపాధులు లేని బ్రహ్మమే) నిరూపింపఁబడుచున్న దని తెలియవచ్చుచున్నది. "బ్రహ్మమునకు శరీరాదులు కలవు" అనుట ఈసిద్ధాంతమునకు విరుద్ధ మగును కదా?.

"కొన్నికొన్ని స్థలములయం దుపాధి వివక్షింపకుండిన నుండవచ్చును కదా?" అనియెదవేమో, అది సరికాదు. మొట్టమొదటినుండియు అన్నమయాదివర్ణనములయం దుపాధివివక్ష యుండ నిట నాకస్మికముగ నట్టివివక్ష లే దనుట స్వపక్షసాధనము కానేరదు. ఇదియు (ఆనందమయవాక్యమునం దుపాధివివక్ష కలదా? లేదా? యనుటయు) విచారణీయమే కాని సిద్ధాంతితము కాదు కదా?

"ఒకవేళ నానందమయాత్మకు నుపాధియున్నను*లక్షణావృత్తిచే నుపాధిస్థితుఁ డగుబ్రహ్మమును మాత్రమే యా వాక్యము చెప్పవచ్చును

*వాక్యములో ప్రయోగింపఁబడియున్న పదములను మాత్రమే యనుసరించి యర్థము చెప్పిన తాత్పర్యమునకు విరోధము వచ్చినచో నప్పుడు ఆపదముల ననుసరించియే తాత్పర్యానుకూలముగ నన్యపదార్థమును తెచ్చికొనుట లక్షణావృత్తి యనఁబడును.

ఇది తార్కికమతము ననుసరించి జహల్లక్షణ యనియు నజహల్లక్షణ యనియు

గదా ?" అనియెదవేమో, అదియునుయుక్తముకాదు. సర్వవేదాంత వాక్యములును బ్రహ్మము నుపాధిసహితముగానే చెప్పుచున్న వనుటయు వానికెల్ల నుపాధివివక్ష యున్నను లేకున్నను శుద్ధబ్రహ్మమునందే తాత్పర్య మనియు, సాధకుల సౌఖ్యము కొఱకై యొక్కొక సమయమున చిత్తశుద్ధిని గలిగింప నుపాధిని ప్రధానమునుగ భావించుట మాత్రమే కాని తదుపదేశమునందు (ఉపాధ్యుపదేశమునందు) శ్రుతికిఁ దాత్పర్యము లేదనియు (ఉత్తరగ్రంథావతారిక. చూడు. పుట, ౮౩-౮౬) వివరింపఁబడియున్నది. కావున నిది (ఉపాధిని చెప్పినను తద్గత బ్రహ్మమునే చెప్పుననుట) సర్వసాధారణము. అన్నమయాదుల విషయమునఁ గూడ నిట్లే చెప్పవచ్చును కదా !

సిద్ధాంతము (వృత్తికారుఁడు) :— "ఆనందమయాత్మకంటె నాంతరుఁ డగునాత్మ లేకపోవుటచే నాతఁడు పరబ్రహ్మమే" అనుట సంగీకరించితిరి కదా ? ఇఁక నాలింపుఁడు. మొదటిసూత్రమున (అధికరణారంభ మగు పండ్రెండవసూత్రమున)వివరింపఁబడినట్లు అభ్యాస ముండుటవలనఁ గూడ నానందమయాత్మ బ్రహ్మమే యగును. అప్పుడు మీ ఆక్షేపము లేశయు చెల్లవుకదా ! ఉపాధి యున్నను తద్వివక్ష

---

రెండువిధములు. అద్వైతులు జహదజహల్లక్షణ యను మూఁడవదాని నంగీకరించి యున్నారు.

జహల్లక్షణ:—వాక్యమునందుఁ జెప్పఁబడిన పదార్థమును విడచి తాత్పర్యపూర్త్తికై యన్యపదార్థమును గ్రహించుట; "గంగాయాం ఘోషః" = "గంగలో గొల్లపల్లె కలదు" అనిన, గంగాప్రవాహమున పల్లె యుండుట సంభవింపదు కావున, నాప్రవాహమును విడిచి తీరమును గ్రహించుట.

అజహల్లక్షణ: — వాక్యమునందలి పదార్థమును విడువక యే యన్యపదార్థమును కూడ గ్రహించుట; "ఛత్రిణో యాంతి" = "గొడుగులవారు పోవుచున్నారు" అనిన గొడుగులను పట్టుకొని యున్నవారిని విడువక యే, వారితోఁ గూడి యున్నగుంపును గ్రహించుట.

జహదజహల్లక్షణ:—వాక్యమునం దున్నపదార్థమును సంపూర్ణముగ విడువక సంపూర్ణముగ నంగీకరింపక తాత్పర్యపూర్త్తికై యన్యపదార్థమును గ్రహించుట. "సోఽయం దేవదత్తః"= "నాఁ డచ్చట చూచిన దేవదత్తుఁడే యీతఁడు" అను మొదలగువాక్యములయందు, అప్పటిదేశకాలములకు ఇప్పటిదేశకాలములకును భేద ముండుటచే వానిఁ బరిత్యజించి పురుషుని మాత్రము పరిగ్రహించుట.

లేదనియు, వేద మెట్లుచెప్పినను ఆనందమయాత్మనుగూర్చియే చెప్పు ననియు నిప్పుడు స్పష్ట మగుచున్నది కదా ?

పూర్వపక్షము. (శంకరులు):—ఇట్లు చెప్పుటయు సరి కాదు. "రసో వై సహ" అను మొదలగు నుదాహృతవాక్యములయందు (చూ. సూ.౧.౧౧౨) ఆనందశబ్దమున కభ్యాసము కలదు; కాని యానందమయ శబ్దమునకు లేదు. "విజ్ఞాన మానందం బ్రహ్మ"అను మొదలగు నితరశ్రుతు లయందు ఆనందశబ్దము బ్రహ్మపరముగమాత్రమే ప్రయోగింపఁబడి యున్నది. ఇచ్చట పాఠక్రమము ననుసరించి వికారార్థకమని చెప్పఁదగి యున్న మయట్ప్రత్యయ మొక్కటి యధికముగ నున్నది కదా ?

"ఆనందమయుఁ డనఁగ నానందప్రచురుండె, అధిక మగునానం దముకలవాఁడే యగుటచే, నానందమే యాతఁడని యర్థము చెప్ప వచ్చును" అనియెదవేమో, అప్పుడు ముఖ్య మగుప్రత్యయార్థమును విడిచి లక్షణావృత్తిని గ్రహించుటవలన దోషము వచ్చును. తగినంత యనుపపత్తి (తాత్పర్యము విపరీత మగుట) లేక ముఖ్యార్థమును బాధిం పరా దనుట స్పష్టము కదా !

మఱియు నాప్రాచుర్యార్థము నంగీకరించినను ఆనందమయుఁడు బ్రహ్మము కానేరదు. "బ్రాహ్మణప్రచురో గ్రామః" "ఈగ్రామమున బ్రాహ్మణు లధికముగ నున్నారు"అనిన నాగ్రామమునందే యితరజాతుల వా రల్పముగ నున్నా రనుట నిస్సంశయముగఁ దెలియవచ్చునట్లే, "ఆ నందప్రచురంబ్రహ్మ" యనిన నీపరబ్రహ్మమునందే దుఃఖ మల్పముగ నున్న దని తెలియవచ్చును. శ్రుతియందన్ననో;—"యత్ర నాన్య త్ప శ్యతి" "ఎచ్చట (బ్రహ్మమునందు, లేక, బ్రహ్మజ్ఞానస్థితియందు) స్వస్వ రూపమునకంటె నితర మగుపదార్థమును చూడఁడో" అను మొదలగు వాక్యములచే "పరబ్రహ్మమునందు స్వస్వరూపభూత మగునానందమున కంటె నన్య మించుక యైనను లేదు" అని చెప్పఁబడియున్నది.

"సూర్యునకు ప్రకాశ మధికము" అనునప్పుడు "సూర్యుని యందుఁ జీఁకటి కొంచెముగ నున్నది" యనుట సంభవింపదు. ఆయన యందు చీఁకటి యెప్పటికిని లేదు కదా ? ఇట్లే బ్రహ్మమునందును దుఃఖ మెప్పటికిని లేదు; కావున, మయట్ప్రత్యయమునకుఁ బ్రాచుర్యార్థము గ్రహించుటవలన నేలోపమును లేదు" అనియెదవేమో వినుము: లోక

 

మున మేఘావరణము మొదలగు కారణమువలన సూర్యునియందుఁ బ్రకా శాభావ మున్నట్లు తలంపఁబడుచుండుటచేత, అజ్ఞానులగువారు ఆవరణ రహితుఁ డగు సూర్యునిఁగూర్చి "ఇప్పుడు సూర్యప్రకాశ మధికముగ నున్నది" అని ప్రయోగించుచున్నారు. వారియభిప్రాయము ననుసరించి చూచిన, ఆసూర్యునియందు ప్రకాశాభావ మొక్కింత కల దనియే కదా తేలును! ఇట్లగుటచేత నీవన్నట్లు ప్రాచుర్యార్థము ప్రయోజనకారి కానేరదు. సర్వవాక్యార్థంబులును వక్తల యభిప్రాయముల ననుసరించి యే కదా నిర్ణయింపవలయును! జ్ఞానవంతు లెవ్వరును "నేఁడు సూర్య ప్రకాశ మధికము" అని ప్రయోగించుట యెందును లేదు కదా!

ఇట్లు చెప్పిన "దుఃఖము బ్రహ్మమునకు స్వాభావికము కాదు" అని మాత్రమే యేర్పడుచున్నది. ఇది మాకును సమ్మతమే. ఉపాధివశ మునలన సర్వమును కలదనుట మీమతమునకును విరుద్ధము కాదు" అనియెదవేమొ, అది సరి కాదు. "యతో వాచో" అను మొదలగు వాక్యము నుదాహరించి "ఈతైత్తిరీయశ్రుతి ఉపాధిరహితుఁ డగుశుద్ధ బ్రహ్మమును చెప్పునదియే కాని సవిశేష (ఉపాధిసహిత) బ్రహ్మమును చెప్పునది కా" దని యిదివరకే నిర్ణయించియున్నాము. మొట్టమొదట నుపాధి యొకటి యుండినఁ గదా ఔపాధికదుఃఖ ముండు నని చెప్పుట కను వగును.

"ఉపాధి యున్నను తద్వివక్ష లే దంటిమి కదా" యనియెద వేమొ, ఆవిషయము సిద్ధాంతము కానేరదని మున్నే చెప్పియున్నాము. "ఆనందమయాత్మ బ్రహ్మము" అనుట మొట్టమొదట స్థిర మైనఁ బిదపఁ దదుపాధికి వివక్ష లే దనుట సిద్ధాంతము చేయ ననువగును గాని తత్పూ ర్వమున నది సంభవింపదు కదా! కావున నెట్లు చూచినను ఆనంద మయాత్మ బ్రహ్మము కాదు. ఆతనియుపాధియు నవివక్షితము కాదు.

మఱియు లోకమున నానందమునకుఁ దారతమ్యము కానవచ్చు చున్నది కావునను, శ్రుతియందును "తే యే శతం మానుషా ఆనం దా స్స ఏకో మనుష్యగంధర్వాణా మానందః" "మనుష్యగంధర్వు లకుఁ గలయానందము మనుష్యులయానందమునకంటె నూఱుమడుంగు లధికము" అని యనేకవిధములుగ నానందపదము వక్కాణింపంబడి యుండుటచేతను, ఆనందమయాత్మ ప్రతిశరీరమునందును వేర్వేఱుగ

నున్నాఁ డని తెలియవచ్చుచున్నది. పరబ్రహ్మ మన్ననో—సర్వవ్యాప కము; ఏకరూపము. "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా" "స్వప్రకాశస్వరూపుఁ డగుపరమేశ్వరుఁడు ఏకరూ పుఁడు. సర్వభూతముల యందును నిలిచియున్నాఁడు. ఆయన సర్వవ్యాప కుఁడు. సర్వభూతములకు నంతరాత్మ" అని శ్వేతాశ్వతర శ్రుతి ఈవిషయ మును స్పష్టముచేయుచున్నది. కావున నెట్లును ఆనందమయాత్మ జీవుఁడే యగును కాని బ్రహ్మము కానేరఁడు.

సిద్ధాంతము(వృత్తికారుఁడు):— ఇట్లు చెప్పనేల ? "ఆనంద మయ మాత్మాన ముపసంక్రామతి" "ఆనందమయాత్మను ఆక్రమిం చును; పొందును" అని ప్రత్యక్షముగ నానందమయశబ్దమునకే యభ్యా సము కలదుకాదా ?

పూర్వపక్షము (శంకరులు):—ఆశ్రుతియందును ఆనందమయ శబ్దము బ్రహ్మమును చెప్పునది కాదు. వాస్తవస్థితిలో నానందమయ పదమునకు పరబ్రహ్మ మర్థ మగునా? కాదా? యని విచారించుచుండ "ఆనందమయపదమే దీనిని నిర్ధారణఁజేయుటకు నాధారము" అనిన నది యెట్లు యుక్తమగును?

శ్రుతియందు "స య ఏవంవిత్, అన్నమయ మాత్మానముపసం క్రామతి" "ఈతత్త్వము నెఱింగినవాఁడు అన్నమయాత్మను ఆక్రమిం చును" అని బ్రహ్మవిద్యా ఫలమును చెప్పుటకు నారంభింపఁబడెను.ఇప్పుడు ఆయానందమయాత్మను ఆక్రమించుటకూడ బ్రహ్మప్రాప్తి కాకుండు నేని యిఁక బ్రహ్మజ్ఞానమునకు ఫల మేది? అన్నమయాదులకు లోపల ప్రాణమయాద్యాత్మలు కలవు. కావున, వారు (అన్నమయాద్యా త్మలు) పరబ్రహ్మరూపులు కాకపోయినను కాకపోవచ్చును గాని ఆనంద మయాత్మ పరబ్రహ్మరూపుఁడు కాకపోవుటకు వీలు లేదు కదా? ఆనంద మయాత్మకంటె నితరుఁడు లేకపోవుటయు స్పష్టమే " అనియెదవేమొ, ఈపక్షము యుక్తము కాదు. 'ఉపసంక్రామతి'యనుశబ్దమునకు పరిత్యా గమే యర్థము కాని ఆక్రమణము కాదు. "బ్రహ్మవేత్తయగువాఁ డన్న మయాత్మను ఆక్రమించును (స్వస్వరూపముగ భావించి యాశ్రయిం చును)" అనుట హాస్యాస్పదము కదా ! కావున నానందమయాత్మవిష యమున వినవచ్చు నుపసంక్రమణముకూడ (ఉపసంక్రామతి యనుపద

ముచే దెల్పఁబడిన కార్యము కూడ) పరిత్యాగమే కావలయును కాని యంగీకారము కానేరదు. ఈయానందమయాత్మ జీవుఁడే యైనను తత్పరిత్యాగముచే తదాధారభూతుఁ డగు పరబ్రహ్మమును అప్రయత్నముగనే చెందుట తేటపడింపనచ్చును. సాధకునకును బ్రహ్మమునకును కల యభేదము స్వాభావికమే కదా! కావున దీని నూహించి శ్రుతి యిట్లు చెప్పియున్నది. కావున మీరు చెప్పినట్లు దోషమేమియు కలుగదు.

సిద్ధాంతము. (వృత్తికారుఁడు):—ఇంత విచార మేల? భృగువల్లి యందు అన్నాదుల నాల్గింటిని చెప్పిన పిదప నైదవమాఱు "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" "ఆనందమును బ్రహ్మమని తెలిసికొనెను" అని చెప్పఁబడియున్నది. అచ్చట నాయానందమును బ్రహ్మ మని యంగీకరింపవలయును కదా! ఇట్లే ఇచ్చటకూడ నైదవమాఱు ఆనందమయునిఁగూర్చి చెప్పఁబడియున్నది. కావున నీతఁడుకూడ బ్రహ్మమే యనవలయును.

పూర్వపక్షము(శంకరులు):— ఇట్లనుటయు సరికాదు. అచ్చట ఆనందశబ్దముమాత్రమే కలదు గాని సర్వసంశయకారణ మగుమయట్ప్రత్యయము లేదు గదా!

## —— శంకరాభిప్రాయము. ——

సిద్ధాంతము:—కావున మీపక్ష మెట్లును నిలువదు. మీకును ఈ ఉపనిషత్తును బ్రహ్మపరముగ సమన్వయింపవలయు ననుటయే సంకల్ప మయినను మీపక్షము పయినఁ జూపినట్లు దోషయుక్తమై యున్నది. కావున నీయానందమయవాక్యము కోశపరమే కాని బ్రహ్మపరము కా దనుట యుక్తము. శ్రుతియందు మొట్టమొదట పరబ్రహ్మమును చెప్పుట కుపక్రమించి "యో వేద నిహితం గుహాయాం" "గుహాయందు ఉన్న బ్రహ్మమును ఏసాధకుఁడు స్వస్వరూపభూతునిఁగా నెఱుంగునో" అనువాక్యముచే "బ్రహ్మము హృదయగుహాలోపలనున్నది" అని ప్రతిజ్ఞ చేయఁబడియున్నది; గుహాస్వరూపము నెఱింగి దానిఁ బరిత్యజించి తన్మధ్యమున లీనుఁడై యున్న పరమేశ్వరుని దెలిసికొనుటయే కర్తవ్య మని సూచింపఁబడినది. అట్లు చేయుటకై గుహాస్వరూపంబును పంచకోశవర్ణనముచే వివరింపఁబడియున్నది. కావున నీయానందమయము కూడ జీవావరణభూతము లగుచున్నమయాదికోశములలో నొక్కటియే కాని స్వతంత్రబ్రహ్మము కాదు. ఇదియే సిద్ధాంతము.

—— శంకరాభిప్రాయానుసారముగ నధికరణవ్యాఖ్యానము. ——

## ౬. ఆనందమయాధికరణము.

సంగతి:—"పై అధికరణమునందు ముఖ్యేక్షణకర్త (ప్రపంచసృష్టికై ముఖ్యముగ సంకల్పించువాఁడు) పరమేశ్వరుఁడు, అని నిశ్చయించి "కేవల పాఠక్రమము ఎచ్చటను అర్థనిర్ణయసాధనము కాదు" అని నిశ్చయించియున్నారు. దానికి నీయధికరణమున భంగము వచ్చుచున్నది. "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" "పరబ్రహ్మము ఆనందమయాత్మకు పుచ్ఛము (అవయవము) ఆధారము" అని తైత్తిరీయోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. ఇచ్చట పుచ్ఛశబ్దము అన్నమయాదివాక్యములయందు అవయవమును మాత్రమే చెప్పు నని నిర్ణయింపవలయును. ఇట్లగుటచే నిచ్చట పాఠక్రమమే యర్థనిర్ణయసాధన మగును. కావున నిది దానికి (పూర్వాధికరణసిద్ధాంతమునకుఁ) బ్రత్యుదాహరణస్థానము.(చూ. సూ. ౧.౧.౧౨)" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁ బడుచున్నది.

విషయము:—ఈయధికరణమున "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అనువాక్యము విచారింపఁబడును.

సందేహము:—ఈవాక్యమున బ్రహ్మపదము ప్రయోగింపఁబడియున్నది. అది స్వతంత్రబ్రహ్మవాచకము. పిదప పుచ్ఛపదము ప్రయోగింపఁబడియున్నది. అది యవయవవాచకము.

ఇందు ఈపదద్వయప్రయోగమువలన "బ్రహ్మ మానందమయాత్మకు నవయవము, స్వతంత్రము" అనుపూర్వపక్షసిద్ధాంతములు క్రమముగ నేర్పడును. బ్రహ్మోపాసనము, స్వతంత్రబ్రహ్మజ్ఞానంబును క్రమముగ పూర్వపక్ష సిద్ధాంతఫలములు.

ఈరెండుపక్షములపై నిట్లు సంశయ ముదయించును.

బ్రహ్మము నానందమయాత్మకు నవయవమనియే చెప్పితీరవలయును. అన్నమయాద్యాత్మలను వర్ణించునప్పుడు అవయవార్థముగా మాత్రమే ప్రయోగింపఁబడియున్న పుచ్ఛశబ్దము ఇచ్చటమాత్ర మన్యార్థమున ప్రయోగింపఁబడె ననుట యెట్లు యుక్తమగును?

అవతారిక:—ఈసందేహమును నివారించుటకై యిట్లు చెప్పుచున్నాఁడు.

## ౧౨. ఆనందమయోఽభ్యాసాత్. ౧. ౧. ౧౨.

తాత్పర్యము:—ఈసూత్రమున నానందమయశబ్దమునకు ఆనంద మయవాక్యమునందలి (బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి) బ్రహ్మపదమే లక్ష ణావృత్తిచే నర్థముగ గ్రహింపఁబడవలయును. అట్లు చేయకుండిన వేదా ర్థమునకును సూత్రమునకును వచ్చినవిరోధము నివారితము కాదు. పైన వివరింపఁబడిన రీతిగ వేదార్థము "ఆనందమయాత్మయే బ్రహ్మము" అనుట కాదు కదా? సూత్రములు మాత్ర మానందమయాత్మను బ్రహ్మ మునుగా నిర్ణయించు ననుట యెట్లు? ఈకారణమువలన వేదానుసార ముగ నధ్యాహారములు (అన్వయము సరిగా కాకపోయినప్పుడు సంద ర్భానుసారముగఁ గ్రొత్తపదమును తెచ్చికొనుట) మొదలగువానిఁ జేసి కొని యెట్లైన నన్వయింపవలయును కాని తద్విరుద్ధముగ నన్వయిం చుట యుక్తము కాదు కదా!

కావున పుచ్ఛవాక్యమునందు బ్రహ్మము స్వతంత్రముగనే చెప్పఁబడియున్నది. ఆవాక్యమునకుఁ బిదప "తద ప్యేష శ్లోకో భవతి, అస న్నేవ స భవతి,అస ద్బ్రహ్మేతి వేద చేత్,అ స్తి బ్రహ్మేతి చే ద్వేద, సంత మేనం తతో విదుః" "ఆబ్రహ్మమునుగూర్చి ఈశ్లోకము కూడఁ గలదు. ఆబ్రహ్మము కలదానినిగా నెఱింగినవాఁడు ఉన్నవాఁ డగును; లేనిదానినిఁగా భావించినవాఁడు లేనివాఁడే యగును." అని బ్రహ్మప దము పలుమాఱు ప్రయోగింపఁబడి యున్నది. ఈయభ్యాసమునలన నానందమయాత్మ బ్రహ్మము కాదని స్పష్టమగుచున్నది.

పూర్వపక్షము(వృత్తికారుఁడు):— ఇట్లు చెప్పనేల? మీరు ఉదాహరించినవాక్యము ఆనందమయవాక్యమునకు సమీపమున నున్న దియే కావున తదభ్యాసముగానే యుండవచ్చును.

"అం దానందమయపదము లేదు కదా"? అందు రేమొ, ఇంత మాత్రమువలన నది యానందమయాభ్యాసము కాకపోదు. మేము నిరూపించినవిధముగ నానందమయుని బ్రహ్మమునుగ నిర్ణయించుకొని వేదము ఉత్తరవాక్యమున బ్రహ్మాభ్యాసముఁ జేసె ననవచ్చును కదా?

సిద్ధాంతము (శంకరులు):—ఇట్లు చెప్పుటకు వీలు లేదు. "అస న్నేవ" అనువాక్యమునకు ఆనందమయవాక్యమునకంటె బ్రహ్మపుచ్ఛ

వాక్యమే మిగుల సమీపమునందున్నది. మఱియు—ఆవాక్యమునందు "బ్రహ్మము కలదా? లేదా?" అనుసంశయము కలదని వేదముచేఁ జెప్పఁబడియున్నది. సర్వలోకప్రసిద్ధుఁడగు నానందమయాత్ముని విషయమున నిట్టిసంశయమే కలుగుట కవకాశము లేదు కదా? కావున నాయానందమయాత్మనుగూర్చియే వేదము చెప్పుననుట కవకాశము లేదు. కావున పుచ్ఛవాక్యమునందలి బ్రహ్మము నిస్సంశయముగ స్వతంత్రమే.

## అ ౧. పా ౧. ౧౩ సూ. ఆరంభము.

పూర్వపక్షము (వృత్తికారుఁడు):—ఇట్లైన వేదము అస్వతంత్ర బ్రహ్మమును ఆనందమయాత్మకు నవయవముగ నేల చెప్పవలయును?

అవతారిక:—ఈసంశయము ననువాదపూర్వకముగ క్రిందిసూత్రమున నివారించుచున్నాఁడు—

౧౩.

## వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్ ౧.౧.౧౩.

తాత్పర్యము (శంకరసిద్ధాంతము):— "అవయవవాచిక మగు పుచ్ఛశబ్ద ముండుటచే దానితో సంబంధించిన బ్రహ్మశబ్దము గూడ ఆనందమయావయవభూత మగు బ్రహ్మమును చెప్పవలయునే కాని స్వతంత్రబ్రహ్మమును చెప్పకూడదు. అట్లు చెప్పు ననుట యుక్తము" అని యెదవేమో, సరి కాదు. అన్నమయాత్మను వర్ణించుట కారంభించినది మొద లింతవరకును వేదము అవయవములను చెప్పుచు వచ్చినది. ఆనందమయాత్మకుఁ గూడ నవయవములను చెప్పినది. ఇట్లగుటచే బ్రహ్మపుచ్ఛవాక్యమునందును, స్వతంత్రపరబ్రహ్మము అవయవము కాకపోయినను దానికి అవయవత్వమును కల్పించి ఉపక్రమమును పూర్తి చేసినది. కావున నింతమాత్రమువలన నందలి బ్రహ్మము అస్వతంత్రము కానక్కఱ లేదు.

ఇంత యేల? బాగుగ విచారించి చూచిన మొట్టమొదట మీకుఁ గూడ నీపూర్వపక్షము చేయుట కవకాశము లేదు. మీరు ఆనందమయాత్మను బ్రహ్మ మనుచున్నారు కదా? వేదము అట్టిబ్రహ్మమునే ఆనందమయాత్మ కవయవమునుగ చెప్పుననుటకు నవకాశ మెట్లు కలుగును? అవయవి యగు బ్రహ్మమే యవయవముగఁ గూడ నున్న దనుట విరుద్ధము కదా?

మాపక్షమున నన్ననో "పుచ్ఛశబ్దమున కాధారమనుటయే యభిప్రాయము" అని చెప్పుటకు వీలు కలదు. ఆపుచ్ఛశబ్దమునకు తర్వాతనే యున్నప్రతిష్ఠాశబ్ద మీవిషయమును స్పష్టము చేయుచున్నది. లోకమునందును సర్వానందములకును బ్రహ్మానందమే యాధార మనుట విద్వదనుభవసిద్ధమై యున్నది. వీనినిబట్టి మేము పుచ్ఛశబ్దమును లక్షణావృత్తిచే నాధారపరముగ నన్వయించుకొనవచ్చును. మీకు మాత్ర మదియు సంభవింపదు. "బ్రహ్మము తానే యాధారముగాను ఆధేయముగాను (ఆధారమునందుండునది గాను) కూడ నున్నది" అనుటయు పూర్వమునలెనే విరుద్ధము కదా ? కావున ఆనందమయవాక్యమే బ్రహ్మప్రతిపాదక మనినచో బ్రహ్మపుచ్ఛవాక్యమునకు సమన్వయమే కుదురదు.

## అ ౧. పా ౧. ౧౪ సూ. ఆరంభము.

అవతారిక:—ఇంతమాత్రమే కాదు. "బ్రహ్మము ఇతరపదార్థమున కవయవ మగుటకు వీలులేదు" అనుటకు మఱియొకకారణముకూడ కల దని నిరూపించుచున్నాఁడు:—

## ౧౪. తద్ధేతువ్యపదేశాచ్చ. ౧. ౧. ౧౪.

తాత్పర్యము :—ఇదియునుంగాక "ఇదం సర్వ మసృజత" "ఆ బ్రహ్మము ఈసర్వమును సృష్టించెను" అని చెప్పఁబడి యుండుటచే నాయానందమయాత్మ పరబ్రహ్మకార్యభూతుఁడు కావలసివచ్చును. ఇట్టి వానికి నాబ్రహ్మ మవయవ మగు ననుటకు వీలు లేదు కదా? కావున పుచ్ఛశబ్దము అవయవమును చెప్పు ననుట సంభవింపదు. పుచ్ఛపదప్రయోగముమాత్రము కలదు. కావున దానియర్థమును ప్రకారాంతరముగ సాధింపవలయు ననుటయే యుక్తియుక్తము. మా యర్థనిర్ణయమును లోకవేదసిద్ధ మని పైసూత్రముననే నిరూపించియున్నాము.

## అ ౧. పా ౧. సూ ౧౫. ఆరంభము.

అవతారిక. ఈవిషయమును నిర్ణయించుటకు మఱియొకసాధనముకూడ కలదని చెప్పుచున్నాఁడు—

## ౧౫.* మాంత్రవర్ణిక మేవ చ గీయతే.౧.౧.౧౫.

తాత్పర్యము:— మఱియొకవిశేషము. ఆయానందవల్లియందు మొట్టమొదట "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని బ్రహ్మస్వరూపము నెఱింగించి, పిదప "యో వేద నిహితం గుహాయాం" "పంచకోశ రూప మయినగుహయం దున్నయాబ్రహ్మము నెవ్వఁ డెఱుంగును?"అను వాక్యముచే గుహ యొక్కటి కల దనియు, దానియందు పరమేశ్వరు డున్నాఁడనియు, ఆయనను తెలిసికొనవలెననియుఁ జెప్పఁబడియున్నది. ఇట్లు చెప్పిన వేదము అంతమునకు వచ్చునప్పటికి ఆనందమయోపాసనము గాని ఆనందమయావయవబ్రహ్మోపాసనము గాని చెప్పునా? ముగింపు ఉపక్రమమున కనుగుణముగనుండి తీరవలయుననుటయు అట్లు లేకున్న గ్రంథ మప్రమాణ మగుననుటయు నిర్వివాదాంశము. కావున "సత్యం జ్ఞానం" అను మంత్రమునందు ఏబ్రహ్మము ప్రశంసింపఁబడెనో ఆబ్రహ్మమే బ్రహ్మపుచ్ఛవాక్యమునందును వర్ణింపఁబడె ననవలయును. పయిన వివరించినవిధముగ ఆనందమయాత్మవికారమే యగుటచేత నాతఁ డానందమయకోశమే యగును గాని స్వతంత్రుఁడు కానేరఁడు. మీామతముననుసరించి చూచిన నాతనికంటె నన్యుఁ డెవ్వఁడును లేక పోవుటచేఁ బూర్వోత్తరవిరోధము సంభవించును. మామతమున నట్టి దోషములేదు. బ్రహ్మపద ముండుటచే "బ్రహ్మపుచ్ఛవాక్యమున, 'సత్యంజ్ఞానం' అనుస్థలమున నుద్దేశింపఁబడిన బ్రహ్మమే వర్ణింపఁబడెను." అని నిరూపించుట మిగుల యుక్తియుక్తము కదా! ఈబ్రహ్మపుచ్ఛ వాక్యము,—ఇది మాత్రమే యన నేల? "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" "ఈయాత్మనుండియే ఆకాశము జనించుచున్నది" అను మొదలగు వాక్యము లన్నియు బ్రాహ్మణములు; * కావున మంత్రమునందు ("సత్యం జ్ఞానం" అను వాక్యమునందు)

---

* వేదవాక్యములను సంక్షేపముగ రెండువిధముల విభాగింపవచ్చును. అందు విశేషాంశములఁ జెప్పక "దీని నిట్లు చేయవలయును" అనిమాత్రమే చెప్పువాక్యములు కొన్ని కలవు ; వానివిషయములను (కర్త, దేవత, ఫలము అను మొదలగు విషయములను) బోధించువాక్యములు కొన్నియుఁ గలవు. ఇందు మొదట వర్ణింపఁబడినవి మంత్రము లనియు, రెండవమాఱు వర్ణింపఁబడినవి బ్రాహ్మణము లనియుఁ జెప్పఁబడును.

చెప్పఁబడిన విషయము నే విమర్శింపవలయును; కాని అచ్చట బ్రహ్మజ్ఞాన మును చెప్పిన నిచ్చట బ్రహ్మోపాసనమును చెప్పుచు తద్భిన్నార్థమును(మంత్రమునందుఁ జెప్పఁబడిన యర్థమునకంటె భిన్నమగు నర్థమును) ప్రతిపాదించుటకువీలు లేదనుట సర్వవాది సమ్మతము. కావున నెట్లు చూచినను పుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదముచే బ్రహ్మము స్వతంత్రము జ్ఞేయము (తెలిసికొనవలయు) అని మాత్రమే చెప్పఁబడినది; కాని యుపాసనము చేయవలయునను నుద్దేశముతోఁ జెప్పఁబడినది కాదు.

## ౧౬. నేతరోఽనుపపత్తేః. ౧. ౧. ౧౬.

తాత్పర్యము:—ఈవిధముగ బ్రహ్మపుచ్ఛవాక్యమునందలి బ్రహ్మపదము స్వతంత్ర బ్రహ్మమును మాత్రమే చెప్పునది యనుట సిద్ధాంతమైనది. ఉత్తరవాక్యములయందు "సోఽకామయత" అని సృష్టి చెప్పఁబడి యుండుటచేతఁ గూడ నీవిషయమే స్పష్టమగుచున్నది. ఒక పదార్థమునకు అవయవమైయున్నవాఁడు సృష్టికర్త కాఁగలఁడా? ఇఁక "ఆనందమయుఁడే సృష్టికర్త" యని పలికిన నది యతివిరుద్ధము. మయట్ప్రత్యయమునకు ప్రాచుర్యార్థము తగ దని యిదివఱకే చెప్పియున్నాము కదా! కావున నానందమయుఁడు వికారమే యగుటచే సృష్టికర్త కానేరఁడు. ఈకారణమునలన పుచ్ఛవాక్యమునందలి బ్రహ్మము స్వతంత్రమే.

## ౧౭. భేదవ్యపదేశాచ్చ. ౧. ౧. ౧౭.

తాత్పర్యము:—మఱియు "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవతి" "ఆనందరూపుఁడగు నీబ్రహ్మమును చెంది(అనఁగా: బ్రహ్మప్రతిబింబమును కలిగి) యీ యానందమయాత్మ యానందముగలవాఁ డగును." అని చెప్పఁబడియుండుటచే బ్రహ్మమునకు నానందమయునకును భేదము కూడ ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నది. (ఇందు భేదమును గూర్చినవిచారము చూ, వృత్తికారవ్యాఖ్యానము. సూ. ౧౭.) బ్రహ్మము పొందఁబడునది; ఆనందమయుఁడు పొందువాఁడు ; ఇట్లగుటచే నీయిరువురకు నైక్యము సంభవింపదు. కావున పుచ్ఛవాక్యమునందలి బ్రహ్మము స్వతంత్రమే.

"అవయవమునకును అవయవికిని కూడ భేదము కానవచ్చుచునే యున్నది. అవయవము లన్నియును కలసియే యవయవి యగుచున్నాఁ

డనుట యథార్థమే యైనను "వీఁడు మనుష్యుఁడు. ఇది చేయి" అని ప్రత్యేకవ్యవహారము కూడ కలదు. కావున నవయవావయవులకు భేద ము కల దనుట సిద్ధాంత మగుచున్నది. కావున బ్రహ్మ మవయవ మను పక్షమునఁ గూడ శ్రుతి యిట్లు చెప్పవచ్చును" అనియెద వేమో, అది సరికాదు. "వికారశబ్దాత్" అనుసూత్రమును వ్యాఖ్యానము చేయు నపుడే "బ్రహ్మ మానందమయావయవము కానేరదు" అనువిషయము సయుక్తికముగ నిర్ణయించియున్నాము.

## అ ౧. పా ౧. సూ ౧౮. ఆరంభము.

అవతారిక:—"ఆనందమయం బ్రహ్మ; పంచమత్వాత్, ఆనంద త్వాచ్చ. భృగువల్లిస్థితానందవత్" "ఆనందమయము బ్రహ్మమే; అయిదవస్థానమందు చెప్పఁబడియుండుటయు, నానందరూపుఁ డగుటయు నిందులకుఁ గారణములు, భృగువల్లియందు అయిదవస్థానమునఁ జెప్పఁ బడిన యానందము బ్రహ్మమగుట యిందులకు దృష్టాంతము" అను నను మానము (చూడు ౩౯ పుట.) వలనఁ గూడఁ బ్రయోజనము లే దని చెప్పుచున్నాఁడు.—

## ౧౮. కామాచ్చ నానుమానాపేక్షా. ౧. ౧. ౧౮.

తాత్పర్యము.—సర్వజనులచేతను కోరఁబడునది యానందమే ; కావున కామశబ్దమునకు నానంద మని యర్థము. "విజ్ఞాన మానందం బ్రహ్మ"(చూడు.సూ.౧.౧.౧౨)అను మొదలగు వాక్యములవలన నానంద పదము బ్రహ్మవాచక మగుట స్పష్టమగుచున్నది; కావున పైయనుమా నము కార్యసాధకము కానేరదు. భృగువల్లియందు కేవల మగునానంద పదము మాత్రమే కలదు; కావున నీదృష్టాంతము బ్రహ్మ మానందమయ మని సాధించుటకుఁ బనికిరాదు. అచ్చటను ఇచ్చటను (భృగువల్లియం దును-ఆనందవల్లియందును) కూడ నైదవస్థానమందే చెప్పఁబడియున్నను ప్రత్యక్షముగ శబ్దభేదము కానవచ్చుచుండుటచే కేవలస్థానసామ్యము మాత్రమే యిష్టసాధనము (ఆనందమయమే బ్రహ్మము అని సాధింపఁ గలది) కానేరదు. మయట్ ప్రత్యయమునకు వికారార్థమే చెప్పవలయు నని యిదివఱకే సిద్ధాంతము చేయఁబడియుండుటచేత, ఆనందరూపుఁ

డానందమయుఁడు కానేరఁడు. కావున పై యనుమానమున దృష్టాంతము కాని, హేతువులు కాని సరికాకపోవుటచే నది చెల్లదు.

## ౧౯. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి. ౧.౧.౧౯.

తాత్పర్యము:—ఇంతియకాక శ్రుతియందు "యదా హ్యేవైష" (మూ. వృత్తికారవ్యాఖ్యానము. సూ. ౧. ౧.౧౯.) అను మొదలగువాక్యములచే శ్రుతి "ఆపుచ్ఛవాక్యబ్రహ్మమును బాగుగ నెఱింగినవాఁడు ఆబ్రహ్మమునందుఁ గలయును (అనఁగా: కైవల్యమును చెందును" అనిచెప్పియున్నది. పైన వర్ణించినవిధముగా ఆనందమయుఁడు జీవుఁడేయై తీరవలయును. కావున "బ్రహ్మమును చెందును" అని చెప్పుటయానందమయుని గూర్చియే యైనట్లు విశద మగుచున్నది. ఆరంభమునుండియు (గ్రంథారంభమునుండియు) వివరించుచు వచ్చినవిధంబున, భ్రాంతికల్పిత మగుబంధము జ్ఞానమువలనఁ గాని తొలఁగదు. కావున, నీ తైత్తిరీయశ్రుతియందు బంధనాశారూప మగు ముక్తి చెప్పఁబడియుండుటచే తద్ధేతు వగుబ్రహ్మజ్ఞానమే (ముక్తికి హేతు వగుబ్రహ్మజ్ఞానమే) యుద్దేశింపఁబడి యుండును గాని బ్రహ్మోపాసన యుద్దేశింపఁబడియుండదు. కావున నెట్లుచూచినను పుచ్ఛవాక్యమునందుఁ గల బ్రహ్మశబ్దము స్వతంత్రంబును జ్ఞేయంబు నగుబ్రహ్మమును చెప్పుననుటయే సిద్ధాంతము. *

---

* ఈయానందమయాధికరణమున శంకరమతానుసారముగఁ చేయఁబడినసిద్ధాంతము పక్షపాతభూయిష్ఠమని కొంద ఱభిప్రాయపడుచున్నారు. అందలిగుణదోషము లిట్లు తెలిసికొనవలయును.

"బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అనువాక్యమునందలి పుచ్ఛశబ్దమునకు నైజ మగు "తోఁక" యనునర్థమును వృత్తికారశంకరు లిరువురును విడిచియే యున్నారు. ఇదియు దోషమే యైనను, రెండుమతములయందును సమానముగ నున్నది. మఱియు శంకరమతమున గ్రహింపఁబడినలాక్షణికార్థము ప్రతిష్ఠాశబ్దము ననుసరించి కల్పింపఁబడెను. కావున సముక్తిక మనక తీరదు. వృత్తికారునియర్థ మన్ననో ప్రతిష్ఠాపదవిరుద్ధ మగుటచే శ్రుతిసమ్మతము కాదనుటకు సంశయము లేదు. అవయవము అవయవికి సాధారము

# ౭. అంతరధికరణము.

సంగతి:—"పైయధికరణమునందు బ్రహ్మపదము ఆనందమయపదము ఆనందపదాభ్యాసము మొదలగు ననేక కారణములనుబట్టి 'బ్రహ్మపదము స్వతంత్రబ్రహ్మమునే చెప్పును' అని నిర్ణయించియున్నారు. ఆన్యాయము ననుసరించి ఛాందోగ్యోపనిషత్తునందు ఆదిత్యాక్షులమధ్యమున నున్నాఁడని చెప్పఁబడినపురుషుఁడు జీవుఁడుగానే నిర్ణయింపఁబడవలసియున్నాఁడు. అచ్చట కూడ రూపము మొదలగు ననేకప్రమాణములు జీవత్వమును నిర్ణయింపఁగలిగినవి కలవు కదా?" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. ఇందు పైన్యాయము ననుసరించియే దృష్టాంతము చూపఁబడి యుండుటచే, దీనికి పైయధికరణముతోఁ గలసంబంధము దృష్టాంతరూప మని తెలిసికొనవలయును.

---

కానేరదు కదా! ఇదియును గాక వృత్తికారమతమున శంకరమతమున లేనిదోషములు కొన్ని కలవు.

౧. ప్రాయఃపాఠపరిత్యాగము—క్రమముగ నాదినుండియు వచ్చుచున్నపాఠమును విడుచుట. వృత్తికారుఁడు శ్రుతియందు మొట్టమొదటినుండియు నన్నమయాదిశబ్దములు ఒకయర్థమున (వికారార్థమునఁ) బ్రయోగింపంబడుచు వచ్చుచుండ నొక్క యానందమయ శబ్దము మాత్ర మన్యార్థమునఁ బ్రయోగింపంబడెనని చెప్పియున్నాఁడు కదా?

౨. ముఖ్యశ్రుతియాలంఘనము—శ్రుతియందుఁ జెప్పఁబడిన మూఁడుశబ్దములను స్వార్థపరిత్యాగము చేయుట. ఎట్లనిన:—

1. ఆనందమయశబ్దము:—దీనియందు మయట్ప్రత్యయమునకు స్వాభావిక మగు వికారార్థమును పరిత్యజించి గౌణ మగు ప్రాచుర్యార్థమును గ్రహించెను.

2. ఆనందపదము:—దీనియందు స్వాభావిక మగు నానందరూపార్థమును విడిచి "ప్రచురానందము" అను క్రొత్తయర్థమును గ్రహించెను.

3 బ్రహ్మపదము:—దీనికి శుద్ధపరబ్రహ్మము స్వాభావికార్థ మైయుండ, దానిని పరిత్యజించి, పుచ్ఛశబ్దసాన్నిధ్యము కల దనునల్పకారణమున, "అవయవబ్రహ్మము" అనునర్థమును స్వీకరించెను.

ఇట్లు ప్రతిశబ్దమునను నిష్టానుసారముగ కల్పించుచు చేసినసిద్ధాంతము నిష్పక్షపాతంబును, నిర్దోషముగఁ జేయఁబడినసిద్ధాంతము పక్షపాతిభూయిష్ఠంబు ననుట యెంత వెఱ్ఱితనము!.

విషయము :— ఈయధికరణమునందు "అథ య ఏషోఽంత రాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వ ఏవ సువర్ణ స్తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ త స్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హా వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద; య ఏషోఽంత రక్షిణి పురుషో దృశ్యతే" "సూర్యునియందుఁ గానవచ్చు నీపురుషుఁడు సువర్ణమయము (జ్యోతిర్మయము)లగుమీసములును వెండ్రుకలును కలవాఁడు. కాలిగోరు మొదలు తలవెండ్రుకవఱకు సర్వశరీరంబును ఆయనకు సువర్ణమయమే. ఆతనికన్ను కోతిపిఱ్ఱవంటి యెఱ్ఱనికమలమును బోలియుండును. *(జ్యోతిర్మయమే.)'ఉత్' అని యాయనకు నామధేయము. సర్వపాపములనుండియు నుత్తీర్ణుఁ డగుటచే నాయన కీపేరు కలిగినది. లోకమున నీపురుషు నెఱింగి యెవ్వఁ డుపాసించునో వాఁడు సర్వపాపవినిర్ముక్తుఁ డగును. ఈకంటియందు నేపురుషుఁడు కానవచ్చుచున్నాఁడో" అను నిట్టిజాతి కలవాక్యములు విచారింపఁబడును.

సందేహము.—"ఉత్" అను పదమున కర్థనిర్ణయము లేకుండుట యిచ్చట సంశయకారణము "పై వాక్యములయందుఁ జెప్పఁబడిన

---

*"యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"="కోతి పిఱ్ఱలవలె నెఱ్ఱ నగుకమలమువలె నాపరమేశ్వరునికన్ను లున్నవి" అనుశ్రుతికిఁ జెప్పఁబడినయర్థమున నశ్లీలదోషము (అనుచితమును జుగుప్సాకరము నైనదానిని చెప్పుట యనుదోషము) కలదని కొందఱు చెప్పుచున్నారు. "ఇచ్చట కప్యాసపదము కమలమునకు మాత్రమే యుపమాన మగుటచే నాదోషము లేదు" అని యద్వైతవాదులు సమాధానము చెప్పుచున్నారు.

"పుండరీకపదము తెల్లదామరను మాత్రమె చెప్పును; కావున నీయుపమానము యుక్తము కాదు కదా?" అనియెదవేమో, వినుము. ఆపుండరీకశబ్ద మట్టిదే యైనను సర్వవిధములగు కమలములను చెప్పుటకై సామాన్యముగ నుపయోగింపఁబడుచున్నది.

"ఇంతశ్రమ యేల? ఆకప్యాసపదమునకు వేఱొకవిధముగా నర్థము చెప్పి యీయశ్లీలదోషమును తొలఁగింపరాదా?" అనియెదవేమో, వినుము. ఎట్లు చెప్పినను ఆదోషము పోదు. ఆదోషము పదశ్రవణమాత్రమువలననే కలుఁగునది కదా!

కావున నెట్లుచూచినను ఆపదమునకు నట్లే యర్థము చెప్పవచ్చును. పదమునకుఁ గలస్వాభావికార్థమును పరిత్యజించుట యనుదోషమునకు పాల్పడి క్లిష్టకల్పనము నాచరింప సాహసించినను ఆదోషమూమాత్రము పోఁబోవదు కదా?

పురుషుఁడు జీవుఁడు,పరమేశ్వరుఁడు" అనునవి యీయధికరణమునఁ గ్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఈయధికరణము మొదలుపాదము ముగియు నంతవఱకు సగుణబ్రహ్మవిచారము ప్రవర్తించును. కావున పూర్వపక్షసిద్ధాంతములకు రెంటికిని ఉపాసనయే ఫలము (అనఁగా: పూర్వపక్షమునకు జీవాద్యుపాసనయు, సిద్ధాంతమునకు బ్రహ్మోపాసనయు ఫలము) అని తెలిసికొనవలయును.

ఈరెండుపక్షముల నవలంబించి యీక్రిందివిధముగ సంశయముదయించును:—

పైవాక్యములయందుఁ జెప్పఁబడిన పురుషులు పరమేశ్వరు లనుటకు వీలు లేదు. వారు *విద్యాతిశయమున (ఉపాసనాతిశయమున)ఁ గాని కర్మాతిశయమునఁ గాని అత్యంత మగునున్నతస్థానమును జెందిన జీవులే కావలయును. వారికి "హిరణ్యశ్మశ్రుః" అను మొదలగువాక్యములచే రూపంబును, "అంతరాదిత్యే అంతరక్షిణి" అను మొదలగు పదములచే నాధారంబును, "స ఏష యే చాముష్మాత్పరాఞ్చో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చ స ఏష యే చైతస్మాదర్వాంచో లోకాస్తేషాం చేష్టే మనుష్యకామానాం చ." "ఆదిత్యమధ్యమునం దున్నపురుషుఁడు ఆయాదిత్యునికంటె నూర్ధ్వమున నున్నలోకములకును దేవభోగ్యము లగు సర్వపదార్థములకును ప్రభువు. అక్షిమధ్యముననున్న పురుషుఁడు కంటికి క్రిందనున్న సర్వలోకములకును మనుష్యభోగ్యము లగుసర్వపదార్థములకును ప్రభువు" అని ప్రభుత్వపరిమాణంబును కల దని చెప్పఁబడియున్నది. పరమేశ్వరునకన్ననో యిట్టి వేవియును లేవు. "అశబ్ద మస్పర్శ మరూపం" "ఆబ్రహ్మమునందు శబ్దస్పర్శరూపములు లేవు"అనియు, "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః" "ఆబ్రహ్మము ఆకాశమువలె సర్వప్రపంచమునందును నిండియున్నది" అనియు, "ఏష సర్వేశ్వరః" "ఈ పరమేశ్వరుఁడు సర్వమునకును ప్రభువు" అనియు, శ్రుతిచే స్వయముగనే "బ్రహ్మమునకురూపాదులు లేవు" అని స్పష్టముగ చెప్పఁబడియున్నది కదా!

---

*వేదాంతశాస్త్రమున విద్య యనఁగా నుపాసన. విద్యాశబ్దమునకు జ్ఞానమే యర్థమైనను, బ్రహ్మజ్ఞానసాధనము లగుటచే నుపాసనల కీపేరు కలిగెను. మనశ్శుద్ధిని కలిగించి తిన్మాలమున నీయుపాసనలు బ్రహ్మజ్ఞానమును కలిగించును కదా?

అవతారిక:—ఈసందేహమును క్రిందిసూత్రముచే నివారించుచున్నాఁడు.—

## ౨౦. అంతస్తద్ధర్మోపదేశాత్. ౧. ౧. ౨౦.

తాత్పర్యము:—పై వాక్యమునందు "అక్ష్యాదిత్యులమధ్యమున నున్నాఁడు" అని చెప్పఁబడినపురుషుఁడు పరమేశ్వరుఁడే. "ఏష ఆత్మాఽపహతపాప్మా" "బ్రహ్మాభిన్నుఁడగుటచే నీజీవుఁడు సర్వపాపవినిర్ముక్తుఁడు" అను మొదలగు వాక్యములచే సర్వపాపరాహిత్య మనుధర్మము పరమేశ్వరున కొక్కనికి మాత్రమే యున్నట్లు శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. ప్రస్తుతవాక్యమునందుఁగూడ "సర్వపాపవినిర్ముక్తుఁడగుటచే నా పురుషునకు 'ఉత్' అనిపేరు" అని చెప్పుటచే ఆసర్వపాపరాహిత్యరూపధర్మము ఆదిత్యాక్షిపురుషులకుఁ గూడ నున్నట్లు చెప్పఁబడియున్నది. ఈకారణమువలన పై వాక్యములయందుఁ జెప్పఁబడిన పురుషుఁడు బ్రహ్మమే యై తీరవలయును.

భక్తానుగ్రహార్థమై పరమేశ్వరుఁడు నానావిధరూపములఁదాల్చుట స్వాభావికమే గావున (అనఁగా: భక్తులు ఉపాసనార్థమై తమ యిచ్చవచ్చినరూపమును కల్పింపవచ్చును గావునను, అట్టికల్పనవలన స్వస్వరూపమునకు హాని గలుగదు కావునను)రూపమును చెప్పినంతమాత్రమువలననే ఆయక్ష్యాదిత్యపురుషులను జీవులనుగా నిర్ణయింప శక్యము కాదు. "యన్నామ తన్నామ" "ఆదిత్యపురుషునకు నామధేయ మెద్దియో యక్షిపురుషునకుఁ గూడ నామధేయ మద్దియే" అని చెప్పుటచే "ఆదిత్యపురుషునివలె నక్షిపురుషుఁడు కూడ సర్వపాపవినిర్ముక్తుఁడే" అని చెప్పినట్లే యయ్యెను కదా! మఱియు నుపాసకులకు సుఖముగా నుండుటకై యాదిత్యాక్షిస్థానంబులు పరమేశ్వరునకు నాధారభూతంబులుగా నిర్దేశింపఁబడినవి కాని "పరమేశ్వరునకు సర్వవ్యాపకత్వము లేదు"అను నుద్దేశమునఁ గాదు. సర్వవ్యాపకునకు నాదిత్యాక్షిమండలనివాసము విరుద్ధము కాదు గదా! ఇట్లే ప్రభుత్వపరిమాణము (సూర్యపురుషుఁ డూర్ధ్వలోకములకును అక్షిపురుషుఁ డధోలోకములకును ప్రభువని చెప్పుట) కూడ సర్వేశ్వరునకు విరుద్ధము కానేరదు. ఉపాసకులకుఁ గ్రొత్తక్రొత్తరుచులఁ గలిగించుటకై యట్టిభేదమును కరుణామయులగు

బోధకులు (వేదము) కల్పింపవచ్చును. కావున నెట్లు చూచినను అక్ష్యాదిత్యపురుషులు జీవులు కారు.

## ౧. ౧. ౨౧. సూత్రము ఆరంభము.

అవతారిక:—ఇట్లు కాక ఆయాదిత్యాక్షిపురుషులు జీవులే య నిన నప్పుడొక ప్రశ్న యంకురించును:—

"ఆయాదిత్యపురుషుఁడు ఆదిత్యదేహాభిమానియగు జీవుఁడా? లేక, తద్భిన్నుఁడా?"

అందు "ఆపురుషుఁడు ఆదిత్యదేహాభిమాని యగు జీవుఁడే" యను మొదటి పక్షము శ్రుతి విరుద్ధ మని చెప్పుచున్నాఁడు:—

## ౨౧. భేదవ్యపదేశా చ్చాన్యః. ౧-౧-౨౧.

తాత్పర్యము:—మఱియు అంతర్యామి బ్రాహ్మణమునందు (ఈ బ్రాహ్మణము బృహదారణ్యకోపనిషత్తులోనిది.) "య ఆదిత్యే తిష్ఠన్నా దిత్యా దంతరో ఽయ మాదిత్యో న వేద యస్యాదిత్య శ్శరీరం య ఆదిత్య మంతరో యమయ త్యేష త ఆత్మాంతర్యా మ్యమృతః" "ఏపురుషుఁడు సూర్యునియం దుండి సూర్యునికంటె లోపల నై యున్నాఁడో, ఇట్లున్నను ఆసూర్యుఁ డెవ్వని నెఱుంగజాలఁడో, ఎవ్వని కాసూర్యుఁడు శరీరముగ నున్నాఁడో, ఎవ్వఁడు సూర్యుని సర్వకార్యములయందును ప్రేరేపించుచున్నాఁడో, ఆతఁడే నీయాత్మ, అంతర్యామి, నాశరహితుఁడు" అనువాక్యముచే సూర్యునికంటె భిన్నుఁ డగు నొకపురుషుఁడు సూర్యునిలోపల నున్నట్లు చెప్పఁబడియున్నది. సూర్యుఁ డనఁగా: సూర్య దేహాభిమాని యగుజీవుఁడే, కావున ఛాందోగ్యోపనిషద్వాక్యమునందు వర్ణింపఁబడినపురుషుఁడు సూర్యభిన్నుఁడే యని స్పష్ట మగుచున్నది. ఇది యును గాక రెండువాక్యములయందును (ఛాందోగ్యోపనిషద్వాక్యము నందును, బృహదారణ్యకోపనిషద్వాక్యమునందును) "అంత శ్శాదిత్యే, ఆదిత్యా దంతరః" అని యంతరశబ్దంబును తత్సమానార్థక మగునంత శ్శబ్దంబు నుండుట పైసిద్ధాంతమునకు నిర్ధారక మగుచున్నది.

"ఇట్లు చెప్పిన రెండవపక్షము ("ఆదిత్యమధ్యగతుఁ డగుపురుషుఁ డాదిత్యజీవునకంటె భిన్నుఁడు" అనుపక్షము) నవలంబింపవచ్చును కదా";

 

అనియెదవేమో, అదియు పై నుదాహరింపఁబడిన శ్రుతివలననే ఖండింపఁబడినట్లైనది. ఎట్లనిన:—

సూర్యదేహాభిమాని జీవభిన్నుఁడని చెప్పఁబడిన యాదిత్యపురుషుఁడు జీవుఁడా? లేక, పరమేశ్వరుఁడా?

జీవుఁడే యనిన:—ఒక్కజీవుఁ డభిమానించి యున్న దేహమును మఱియొక జీవుఁ డాశ్రయించి యున్నాఁ డనుట శాస్త్రలోకానుభవములకు విరుద్ధము.

పరమేశ్వరుఁడే యనిన:—మాసిద్ధాంతముకూడ నదియే; కావున నెట్లు చూచినను ఆదిత్యమండలమధ్యవర్తి యగుపురుషుఁడు పరమేశ్వరుఁడే కాని జీవుఁడు కానేరఁడు. నామరూపాదు లన్నియు సమానమే యగుటచే నక్షిపురుషుఁడు కూడ నట్టివాఁడే యగుననుటయే సిద్ధాంతము.

---

## ౭. ఆకాశాధికరణము.

సంగతి:—"పై యధికరణమున సర్వపాపరాహిత్యము పరబ్రహ్మమునకంటె నన్యునకు సంభవింప దనుకారణమునుబట్టి (లింగము * ననుసరించి) సూర్యాక్షిపురుషులను గూర్చినవాక్యములను పరబ్రహ్మపరములనుగా సమన్వయించియున్నారు. ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్గీథోపాసననుగూర్చి (ఓంకారోపాసననుగూర్చి) చెప్పుసందర్భమున నాకాశమునుగూర్చి చెప్పువాక్య మొకటి కలదు. దానియందును బ్రహ్మలింగములు కొన్నియున్నవి; కాని, శ్రుతిలింగసూత్రానుసారముగ లింగమునకంటె శ్రుతి బలవత్తరము కావున నచ్చట నాకాశశబ్దమునకు పరబ్రహ్మము నర్థమునుగాఁ జెప్పుటకు వీలు లేదు. ఆదిత్యపురుషవాక్యమున కేవల పురుషపదప్రయోగము మాత్రమె యుండుటచేతను, 'ఉత్' అను పేరు కల్పితమై యర్థనిర్ణయము నపేక్షించుచుండుటచేతను, పై యధికరణమున కేవలలింగములనుమాత్రమె యాధారముగాఁ జేసికొని యర్థనిర్ణయము చేయవలసివచ్చినది. ప్రస్తుత మగునాకాశవాక్యమున సర్వలోకప్రసిద్ధమగునాకాశపదము ప్రయోగింపఁబడియుండుటచే నట్టియవసర మేమియు

---

* లింగస్వరూపము (చూడు. ౯౩. పుట.)

నుండదు. కావున పైయధికరణమునందు సిద్ధాంతము చేయఁబడిననియమమునకు నిది (ఈ యాకాశవాక్యము) ప్రత్యుదాహరణ * స్థానము" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. కావున దీనికిఁ బైయధికరణముతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణరూపమైనది.

విషయము:—ఈయధికరణమున "అస్య లోకస్య కా గతి రిత్యాకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశాదేవ సముత్పద్యంత ఆకాశం ప్ర త్య స్తం యం త్యాకాశో హ్యే వైభ్యో జ్యాయా నాకాశః పరాయణం" "ఈలోకమునకు నాధారమెయ్యది? (అని శాలావత్యుఁ డనునొకముని ప్రశ్నింపఁగా, జైవలి యను నొకరాజిట్లని సమాధానము చెప్పెను.) "ఆకాశమే యీలోకమునకు నాధారము. ఈసమస్తభూతములును ఆకాశమునుండియే పుట్టుచున్నవి. దానియందే లయము నొందుచున్నవి. అది అన్నిటికంటె నధికమైనది; సర్వమునకు నాశ్రయ మైనది." అనువాక్యముయొక్క యర్థ మిందు విచారింపఁబడును.

సందేహము:—ఆకాశ శబ్దమునకుఁగల ప్రసిద్ధార్థమే యిచ్చట సంశయకారణము. "ఆకాశశబ్దము భూతాకాశమును చెప్పును, బ్రహ్మమునే చెప్పును." అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. రెండుపక్షములకును పాదాంతమువరకు నుపాస్తియే ఫల మని యిదివరకే చెప్పియున్నాము.

ఈరెండుపక్షముల నవలంబించి ఈక్రిందివిధముగ సంశయ మంకురించును.

పైవాక్యమునందలి యాకాశశబ్దము సామాన్యముగ బ్రహ్మమును చెప్పునదిగాఁ గానవచ్చుట లేదు. "ఆకాశము" అనుపదమును వినినతోడనే పంచభూతములలోని యాకాశమే స్ఫురించును. ఆకాశశబ్దమునకు పంచభూతములలోని యాకాశ మర్థ మనుట లోకవేదములకు సమ్మతమే. "ఆకాశా ద్వాయుః" "ఆకాశమునుండి వాయువు జనించెను" అనుమొదలగువాక్యములచే వేదము స్వయముగ ఆకాశమునుండియే భూతోత్పత్తిని జెప్పుచున్నది. కారణమునందు కార్యములు లయ

---

ప్రత్యుదాహరణరూపము (చూడు ౮౭ పుట.)

మగుట యుక్తమే. కావున నీభూతములు ఆకాశమునందు లయము కూడ నొందవచ్చును. తననుండి జనించినపదార్థములకంటెఁ దాను పెద్దది గాను, వానికిఁ దా నాశ్రయముగాను ఉండుటయు విరుద్ధము కాదు. కావున "ఆకాశము అన్నిటికంటె పెద్దది; సర్వభూతాశ్రయము" అని చెప్పుటయు యుక్తమే.

ఇఁక విశేషాంశమును బట్టి చూచినను ఆకాశపదము బ్రహ్మప్రతిపాదక మనుటకు వీలులేదు. కొన్నికొన్నిస్థలములయందు "యదేష ఆకాశ ఆనందో న స్యాత్" అను మొదలగు వాక్యములచే నాకాశశబ్దమునకు పరబ్రహ్మపరముగఁ బ్రయోగము కానవచ్చుచున్నను, అంతమాత్రమువలన ప్రస్తుతవాక్యమునందలి యాకాశశబ్దముకూడ నట్టిదియే యన ననువుపడదు. పైన వివరించినవిధముగ నాకాశపదమునకు ముఖ్యార్థము చెప్పుటకే వీలు కలిగియుండ గౌణార్థము నేల చెప్పికొనవలయును? సర్వవ్యాపకత్వము మొదలగుగుణములుండుటవలన ఆకాశపదము ఆకాశవాచకమే యయ్యును గౌణముగా బ్రహ్మమును చెప్పునంతమాత్రమున సర్వస్థలములయందు నట్లే యుండి తీరవలయు ననునియమము కలదా?.

"ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితా" "ఆకాశమే నామరూపముల నిర్వహించునది" అని వాక్యశేష ముండుటవలనఁ గూడ "ఆకాశపదము బ్రహ్మపరమే కావలయును" అని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. ఈవాక్యశేషమునందుఁ జెప్పఁబడిన యర్థమునకు నెట్లు చెప్పినను (అనఁగా: ఆకాశపదము బ్రహ్మవాచక మనినను భూతాకాశవాచక మనినను) బాధ కలుగదు. "బ్రహ్మవాచక మనినచో బాధ లేదు" అనుట మీకు సమ్మతమే; ఇఁక "భూతాకాశవాచకము" అనినను ఆయాకాశము వాయ్వాదులకుఁ గారణ మగుటచే నావాయ్వాది నామరూపములకు నిర్వాహము కావున నించుక యైనను పైఁ జూపఁబడినవాక్యశేషమునకు బాధ లేదు.

కావున నెట్లు చూచినను ఆకాశశబ్దము భూతాకాశపరమే కావలయు నని తోఁచుచున్నది.

అవతారిక:—అను నీ సంశయమును ఈక్రిందిసూత్రమున నివారించుచున్నాఁడు—

## ౨౨. ఆకాశ స్తల్లింగాత్ ౧. ౧. ౨౨.

పై యుద్గీథవాక్యమునందలి యాకాశపదము పరబ్రహ్మపరమే కాని భూతాకాశపరము కాదు. సర్వభూతముల సృజించుట మొదలగు ధర్మములు పరమేశ్వరున కొక్కనికే యుండును గాని భూతాకాశమున కుండనేరవు కదా!

"సమస్తభూతములును ఆకాశమునుండియే పుట్టుచున్నవి. అందే లయ మగుచున్నవి." అనుటచే "వేదము వాయువు మొదలగుభూతములయొక్క సృష్టిమాత్రమే యుద్దేశింపలేదు. ఆకాశముకూడ పంచభూతముల నొక్కటియే కావున దానిసృష్టిని గూడ నుద్దేశించెను" అనువిషయము స్పష్ట మగుచున్నది. "ఆకాశమే సర్వభూతసృష్టికర్త" యని చెప్పి పరమేశ్వరు నంగీకరింపనిచో దోషము వచ్చును. భూతాకాశమే భూతాకాశమునకు (తనకుఁ దానే) కారణము కావలసివచ్చును. ఇది సంభవింపదు కదా! ఇట్లు సర్వభూతసృష్టికర్త యగుట సంభవింపక పోవుటచేతనే, సర్వభూతలయస్థాన మగుటయు, సర్వమునకంటె నధికమైన దగుటయు (శ్రేష్ఠమయినది, లేక, పెద్దది యగుటయు,) సర్వాధార మగుటయు, సర్వనామరూపనిర్వాహక మగుటయును సంభవింపనేరవు. తనకంటె నుత్తమ మగు పదార్థ ముండ నీభూతాకాశమే సర్వోత్తమ మెట్లగును? "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను మొదలగువాక్యములచే బ్రహ్మమే ప్రపంచసృష్టిస్థితిలయకారణ మనియు "జ్యాయా నృథివ్యా జ్జ్యాయా నంతరిక్షా జ్జ్యాయాం దివో జ్జ్యాయా నేభ్యో లోకేభ్యః" "ఈబ్రహ్మము భూమికంటెను ఆకాశమునకంటెను ద్యులోకమునకంటెను మఱియుఁ గలసర్వలోకములకంటెను జ్యేష్ఠము (శ్రేష్ఠము)" అనువాక్యముచే, పరబ్రహ్మమే సర్వాధికమనియు "రాతే ర్దాతుః పరాయణం" "ఈబ్రహ్మము ధనమునకును దాని నొసంగుదాతకును (అనఁగ:-*త్రిపుటిరూపమైన సర్వప్రపంచమునకును) పరమాశ్ర

* లోకమున నేకార్యముజరుగవలసియున్నను, కర్త,కర్మ, కరణము,(చేయువాఁడు, చేయఁబడునది, సాధనము) అనుమూఁడుపదార్థములు నుండవలయు ననుట నియమము. ఇవి మాత్రమే కాక ఆధారము మొదలగునవి కూడ నుండవలయు ననుట యథార్థమే యైనను, అవి కర్త్రాదిత్రయమునకంటె ప్రధానములు కావు. కావున నీకర్త్రాదిత్రయమే సర్వశాస్త్రములయందును ముఖ్యముగా వర్ణింపఁబడును. దీనికే త్రిపుటి యని పేరు.

యము" అనువాక్యముచే, బ్రహ్మమే సర్వాధార మనియు శ్రుతి స్వయ ముగఁ జెప్పుచున్నది. అర్థనిర్ణయమునందు సంశయము కలిగినప్పుడు వాక్యశేషమునుబట్టి కూడ సిద్ధాంతము చేయుట సయుక్తికమే. కావున "ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితం" అను వాక్యశేషము కూడ పరబ్రహ్మపరముగానే సమన్వయ మగుచుండుటచే నీకారణము వలనఁ గూడ నాకాశశబ్దము పరబ్రహ్మపరమే యని నిర్ణయింపవలసి యున్నది. ఇదియును గాక నాయుద్గీథప్రకరణమునందు దాల్భ్యశాలావత్య జైవలు లనుమువ్వురును "ఉద్గీథమునకు (ఓంకారమునకు) పర మాశ్రయ మెద్ది?" అను విషయమునుగూర్చి సంభాషించి రనియు, అందు దాల్భ్యుఁడు "స్వర్గమే యుద్గీథమున కాశ్రయము" అనఁగ, దానిని నిరాకరించి శాలావత్యుఁడు "భూలోకమే యాయుద్గీథమున కాశ్రయము" అనియె ననియు, పిదప, భూలోకమునకుఁ గూడ నంత ముండుటచే దానిఁ గూడ నిరాకరించి జైవలి "అనంత మగునాకాశమే యుద్గీథాశ్రయము" అని సిద్ధాంతము చేసె ననియుఁ జెప్పఁబడియున్నది. అనంత మనఁగ: సర్వదేశ సర్వకాల సర్వవస్తువులయం దేకరూపముగ నుండుపదార్థము భూతాకాశ మిట్టిది కానేరదు కదా! ఈవిధముగ బ్రహ్మనిర్ధారణ ననుకూలములగు గుఱుతు లనేకము లుండుటవలన నాకాశపదము భూతాకాశపరము కానేర దనుట సిద్ధాంత మగుచున్నది.

"ఇట్లైన నాకాశశ్రుతికి విరోధము వచ్చును కదా" అందువేమో, వినుము. "త్యజే దేకం కులస్యార్థే" "ఒక్క సమూహమును గాపాడుటకై యొక *పురుషుని త్యజింపవచ్చును" అను న్యాయము ననుసరించి, అనేక బ్రహ్మలింగములకుఁ గలుగుబాధను పరిహరించుటకై యొక్కశ్రుతిని పరిత్యజించుట దోషము కానేరదు. కావున నెట్లు చూచినను ఆకాశపదము బ్రహ్మపరమే.

---

## ౯. ప్రాణాధికరణము.

సంగతి:—ఈయధికరణమునఁ గూడ బ్రహ్మలింగములనుబట్టియే సిద్ధాంతము చేయఁబడును. కావున దీనికి ప్రత్యేకముగ సంగతి (పూర్వాధికరణసంబంధము) యుండ నవసరము లేదు.

మఱియొకపక్షమున:— "పై అధికరణమున, పరబ్రహ్మమునకు మాత్రమే సంబంధించినగుఱుతు లుండుటవలన; నాకాశవాక్యము నందలి యాకాశపదమునకుఁ గలభూతాకాశపరార్థమును బాధించితిరి. ఆఛాందోగ్యోపనిషత్తునందే మఱియొకస్థలమున ప్రాణమునుగూర్చిన వాక్యమొక్కటి కలదు. దానియందు చెప్పఁబడినగుర్తులు ముఖ్యప్రాణమునకుఁ గూడ (ప్రాణవాయువునకుఁ గూడ) సంబంధించినవి యగుటచే నచ్చటి ప్రాణశబ్దార్థమును బాధించుటకు నవకాశము లేదు" అను నాక్షేపము వచ్చుటచేఁ బూర్వమునవలెనే ఇచ్చటఁ గూడఁ బ్రత్యుదాహరణసంగతి కల దనియును జెప్పవచ్చును.

విషయము:— ఈయధికరణమునందు "ప్రస్తోత ర్యా దేవతా ప్రస్తావ మన్వాయత్తా తాం చే దవిద్వాన్ ప్రస్తోష్యసి మూర్ధా తే విపతిష్యతీతి స భీతః పప్రచ్ఛ కతమా సా దేవ తేతి ప్రాణ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణ మేవాభి సంవిశంతి ప్రాణ మభ్యుజ్జిహతే సైషా దేవతా ప్రస్తావ మన్వాయత్తా" (చాక్రాయణుఁ డనునొకమహర్షి ధనార్థియై ఒకప్రభువు యజ్ఞము చేయుచున్న స్థలమునకుఁ బోయి తనపాండిత్యమును వెల్లడింపఁదలంచి ప్రస్తోతతో (యజ్ఞమునందు సామవేదమును చెప్పుచు దేవతల స్తోత్రము చేయువాఁడు ప్రస్తోత.) నిట్లనియె. "ఓయీ! ప్రస్తావమునందు (ఇది సామవేదములోని యొకవిభాగము) స్తోత్రము చేయఁదగినదేవత యేది? దాని నెఱుంగుదువేని సరియే! అట్లెఱుంగక నాయెదుట నీ వాదేవతను స్తోత్రము చేయుదువేని నీశిరము నేలపైఁబడును. అని ఇట్లు పలికిన నాప్రస్తోత భయముఁ జెంది యామునిని నిట్లని ప్రశ్నించెను. 'ఓమహాత్మా, ఆదేవత ఏది?' అనిన నాముని యిట్లనియె. 'ప్రస్తావమున ధ్యానింపఁదగినదేవత ప్రాణము. ఈసర్వభూతములును ప్రళయావస్థయందు ఆప్రాణములనే లీనము లగును. ఉత్పత్త్యవస్థయందు దాని నుండియే మరలజనించును" అనుఛాందోగ్యోపనిషద్వాక్యము విచారింపఁబడును.

ఇందు ప్రాణశబ్దమునకు "ప్రాణవాయువు" అనుప్రసిద్ధార్థ ముండుటయు, "ప్రాణబంధనం హి సౌమ్య మనః" "ఓశాంతుఁడా! మనస్సు (అనఁగా: జీవుఁడు) పరబ్రహ్మముచే నిలుపఁబడి యున్నాఁడు." "ప్రాణస్య

ప్రాణః" "(బ్రహ్మము) ప్రాణమునకు ప్రాణము (ప్రేరకము)" అను మొదలగు వాక్యములయందు ప్రాణపదము బ్రహ్మవాచకముగ ప్రయోగింపఁబడియుండుటయు నిట సంశయకారణములు. "ఈశ్రుతియందలి ప్రాణశబ్దము ప్రాణవాయువునే చెప్పును, బ్రహ్మమునే చెప్పును." అను రెండుపక్షములును క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. ఫలమును గూర్చి ముందే వివరించియున్నాము.

ఈరెండుపక్షముల నాశ్రయించి ఈసంశయ ముదయించును.

పూర్వపక్షము:— పైవాక్యమునఁ బ్రాణశబ్దమునకు ప్రసిద్ధార్థమును వదలి పరబ్రహ్మపరముగ నర్థము చెప్ప నవసరము లేదు. ఆవాక్యమునఁ జెప్పఁబడిన భూతోత్పత్తిలయములు ప్రాణవాయువునందును కలుగుట సంభవించుచున్నది. "యదా వై పురుష స్స్వపితి ప్రాణం తర్హి వాగప్యేతి ప్రాణం చక్షుః ప్రాణం మనః ప్రాణం శ్రోత్రం స యదా ప్రబుధ్యతే ప్రాణా దేవ అభి పున ర్జాయతే" "పురుషుఁడు నిదురించునప్పుడు వాక్కు మొదలగు కర్మేంద్రియములును, శ్రోత్రము నేత్రము మొదలగు జ్ఞానేంద్రియములును, మనంబును గూడ ప్రాణమునందు లీనము లగును. మరల వాఁడు మేల్కొనఁగానే ఆవాగాదు లన్నియు ఆప్రాణమునుండి జనించును." అని శ్రుతి స్వయముగనే ప్రాణమునందు సర్వభూతలయము నుత్పత్తియు కలుగు నని చెప్పుచున్నది. ఇంద్రియములు పంచభూతసారము లగుటచే వానియుత్పత్తిలయములే భూతముల యుత్పత్తిలయములు కదా! లోకమునందును ఈవిషయము అనుభవసిద్ధమైయే యున్నది. సుషుప్త్యవస్థయందు ప్రాణవృత్తి (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) యొక్కటి మాత్రమే యుండుటయు, ఇంద్రియవృత్తులు లేకుండుటయు, జాగ్రదవస్థయందు మరల నన్నియుఁ బ్రాణవృత్తి నాశ్రయించి జనించుటయు ప్రత్యక్షసిద్ధము లైయే యున్నవికదా! కావున నిచ్చట ప్రాణశబ్దము ప్రాణవాయువును చెప్పునదియే యనవలయును.

అవతారిక:—అనిన నట్లు కా దని పూర్వాధికరణన్యాయమునే (బ్రహ్మలింగములనుబట్టి ప్రసిద్ధార్థమును బాధించుట యను న్యాయమునే) యనుసరించి సిద్ధాంతము చేయుచున్నాఁడు:—

## ౨౩. అత ఏవ ప్రాణః. ౧. ౧. ౨౩.

తాత్పర్యము :—పై యధికరణమునందువలెనే ఇచ్చటను ప్రాణ శబ్దమునకు పరబ్రహ్మమే యర్థ మని చెప్పవలయును. ఆయాకాశవాక్యమునందువలెనే ఈప్రాణవాక్యమునందుఁ గూడ బ్రహ్మలింగములు కానవచ్చుచున్నవి. మీరుదాహరించిన శ్రుతియు ననుభవంబును, "ప్రాణవాయువునందు ఇంద్రియములు లయము నొందును" అని మాత్రమే తెలియఁ జేయుచున్నవి; కాని "ప్రాణవాయువునందు భూతములు లయము నొందును" అని తెలియంజేయుట లేదు. ఇంద్రియములు మీ రన్నట్లు భూతసారములే యైనను, పంచభూతములుమాత్రము ప్రాణవాయువున లీనములు కానేరవు. ఈప్రాణవాయువు రెండవభూతమగు వాయువుయొక్క వికారమే; కాని సర్వకారణ మగుపదార్థము కాదు కదా! ఈవిధముగ విచారించి చూచిన భూతలయమువలెనే భూతోత్పత్తియు ప్రాణమునుండి (వాయువికార మగుప్రాణవాయువునుండి) సంభవింపనేరదు. "వాస్తవస్థితిలో 'ఇంద్రియములు ప్రాణమున లీనము లగును' అనుసిద్ధాంతము కూడ దోషయుక్తమే. బాగుగ విచారించిన పాంచభౌతికము లగుసర్వేంద్రియములును ఒక్కవాయువికారమునందే లీనము లగు ననుట యసంభవము కదా! కార్యములు కారణమునందు లీనములు కావలయును కాని యన్యస్థలములయందు లీనము లగుటకు వీలు లేదు. వాయువికార మగునీప్రాణము సర్వకారణ మగుటకును వీలు లేదు. ఈకారణమునలన వాస్తవస్థితిలో నింద్రియములుఁ కూడ సుషుప్త్యవస్థయందు సర్వకారణ మగుబ్రహ్మమునందే లీనము లగుచున్నవి; జాగ్రదవస్థయందు ప్రారబ్ధబలమునలన నాబ్రహ్మమునుండియే మరల జనించుచున్నవి. కావున మీ రుదాహరించినశ్రుతియందలి ప్రాణశబ్దమునకుఁ గూడ పరబ్రహ్మమే యర్థము; అనుభవము మాత్రము భ్రాంతిసిద్ధము. "యదా సుప్తః స్వప్నం న కంచన ధాపశ్య త్యథాస్మిన్ ప్రాణ ఏ వైకధా భవతి త థైనం వా క్సర్వై ర్నామభిః స్స హాప్యేతి" = "ఈజీవుఁడు స్వప్నమునను గాంచక గాఢసుషుప్తి నొందినప్పుడు ప్రాణమునందు లయము నొందును. అప్పుడు సర్వశబ్దములతోనుగూడి వాగింద్రియము (ఇది సర్వేంద్రియములకు

 

* నుపలక్షణము) ఆప్రాణమునందు లయము నొందును" అని కౌషీతకీ బ్రాహ్మణశ్రుతి యీవిషయమును స్పష్టము చేయుచున్నది. ఇచ్చట "ప్రాణము చేతనలయస్థానము" అని చెప్పఁబడియుండుటచే, ప్రాణశబ్ద వాచ్యము బ్రహ్మమే యనుటయు, ఆప్రాణమునందే జీవునితోఁ గూడ నింద్రియములకును లయము చెప్పఁబడియుండుటచే "ఇంద్రియములు కూడ వాయువికార మగు ప్రాణమున లయము నొందవు" అనుటయు స్పష్టములగుచున్నవి కదా! కావున నెట్లు చూచినను ప్రస్తుతప్రాణవాక్యమునందలి ప్రాణపదము బ్రహ్మవాచక మనుటలో సంశయము లేదు. ప్రాణశబ్దమునకు వాయువికారమునందు (ప్రాణవాయువునందు) ముఖ్యప్రసిద్ధి యున్నను బ్రహ్మలింగబలముచే నన్యార్థము చెప్పవలయును. పై యధికరణమునందు ఆకాశపదముయొక్క ప్రసిద్ధార్థమును బాధించినట్లే యిటను ప్రసిద్ధార్థమును బాధింపవలయును. ఎట్లు చూచినను ప్రాణశబ్దము బ్రహ్మవాచకమనుటయే సిద్ధాంతము.

విశేషాంశము:—వృత్తికారుఁడు ఈయధికరణమున "ప్రాణబంధనం, ప్రాణస్య" అను వాక్యములను విచారించుటకై ఈయధికరణ మారంభింపఁబడె నని చెప్పియున్నాఁడు. అది సరికాదు. ఏవాక్యమునందు సంశయ ముండునో అదియే విచారణీయ మనుట సర్వానుభవసిద్ధము. పైనుదాహరించిన వాక్యములయందు "ప్రాణబంధనం" అనువాక్యము బ్రహ్మప్రకరణము (బ్రహ్మమును గూర్చి చెప్పువాక్యపరంపర) లోనిది. ఒక ప్రకరణమున నున్నవాక్యము లన్నియు నొక్కవిషయమునే చెప్పి తీరవలయును. కావున నీవాక్యము ప్రాణశబ్దముతో నుపక్రమింపఁబడియున్నను బ్రహ్మభిన్నార్థమును చెప్పనేరదు. ఈకారణమువలన నీవాక్యమునందలి ప్రాణశబ్దము బ్రహ్మవాచక మనుట స్పష్టమే.

ఇఁక రెండవవాక్య మింతకంటెను స్పష్టము. అందు "ప్రాణస్య ప్రాణం" "ప్రాణమునకు ప్రాణము" అని ప్రాణవాయు భిన్నపదార్థమే యుద్దేశింపఁబడినట్లు స్పష్ట మగుచున్నది.

ఈవిధముగ పై రెండువాక్యములయందును "ప్రాణశబ్దార్థము పరబ్రహ్మమే" యని స్పష్ట మగుచుండ వానిఁగూర్చి విచారించుటకై

* ఉపలక్షణ మనఁగా: సమానజాతి కలిగిన పదార్థముల గ్రహింపఁదగు నను నుద్దేశముతోఁ బ్రయోగింపఁబడినపదము.

యొకయధికరణ మారంభింపఁబడె ననిన సూత్రకారుల సర్వజ్ఞత్వమునకు హాని కలిగించినట్లగు ననుటలో సంశయ మేమి?

---

## ౧౦. జ్యోతిరధికరణము.

సంగతి:—"పై అధికరణమున ప్రాణవాక్యమునందు బ్రహ్మలింగములు కానవచ్చుటచే, ప్రాణశబ్దమునకు బ్రహ్మార్థమును సాధించితిరి. ఛాందోగ్యోపనిషత్తునందే మఱియొకచోట జ్యోతినిగూర్చి చెప్పువాక్య మొక్కటి కలదు. అందు జ్యోతిశ్శబ్దమునకు బ్రహ్మ మర్థముగఁ జెప్పుట సంభవింపదు. అచ్చట బ్రహ్మలింగములు లేవు." అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. పై అధికరణములవలెనే దీనికిని పూర్వాధికరణముతోఁ బ్రత్యుదాహరణసంబంధ మని తెలిసికొనవలయును.

విషయము:— ఈయధికరణమునందు "య దతః పరో దివో జ్యోతి ర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠే ష్వనుత్తమే షూత్తమేషు లోకేష్విదం వావ త ద్య దిద మస్మిన్నంతః పురుషే జ్యోతిః" "ఈద్యులోకమునకు మీఁద సర్వప్రపంచమునకును సర్వోత్తమము లగు లోకములకంటెను పైన నే జ్యోతి ప్రకాశించుచున్నదో, అదియే పురుషునిలోపల జఠరాగ్నిరూపముతో నుండుజ్యోతి" అనువాక్యము విచారింపఁబడును.

సందేహము:—ఇందు జ్యోతిశ్శబ్దమునకు సూర్యాదిపర మగు నర్థము ప్రసిద్ధ మగుటయు, వేదమునందు ఈశబ్దము కొన్నికొన్నిస్థలములయందు బ్రహ్మపరముగఁ బ్రయోగింపఁబడుటయు, సంశయకారణము. "ఈజ్యోతిశ్శబ్దము సూర్యునిఁ గాని అగ్నిని గాని జఠరాగ్నిని కాని తెలుపునా?, లేక, పరబ్రహ్మమును తెలుపునా?" అని సంశయస్వరూపము. "ఈజ్యోతిశ్శబ్ద మాదిత్యాదులనే తెలుపును, బ్రహ్మమును తెలుపును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. పూర్వపక్షమున నాదిత్యాద్యుపాసనలును, సిద్ధాంతమున బ్రహ్మోపాసనయు ఫలములు. ఈపక్షములల నాశ్రయించి ఈపూర్వపక్ష ముదయించును.

పూర్వపక్షము:—పై వాక్యమునందలి జ్యోతిశ్శబ్దము సూర్యాదులలో నొక్కనిఁ జెప్పు ననవలయునే కాని పరబ్రహ్మమును చెప్పు ననుటకు

వీలు లేదు. బ్రహ్మమునకు నాకారము లేదు. ఆయననుగూర్చి "దీప్యతే" "ప్రకాశించుచున్నాఁడు" అని చెప్పుట సంభవింపదు. సర్వప్రపంచ కారణభూతుఁడును సర్వమయుఁడు నగుటచే నాయననుగూర్చి "పరో దివః" "ద్యులోకమునకు మీఁద నున్నాఁడు" అని ఒకయెల్లను చెప్పుటకు నవకాశము లేదు; "అందఱి శిరములమీఁద నున్నాఁడు" అని నివాసస్థానముల (ఆధారముల)ఁ జెప్పుటయు సంభవింపదు. కావున నొక పక్షమున సూర్యుఁడు గాని మఱియొకపక్షమున (అనఁగ: ఇచ్చట నాధారము లనేకములు చెప్పఁబడియుండుటచేతను, సూర్యునకు నట్లనేకాధారములు లేక పోవుటచేతను పై జ్యోతిర్వాక్యము సూర్యునిగూర్చి చెప్పదు. అను పక్షమున) అగ్ని కాని జ్యోతిశ్శబ్దార్థము కావలయును. ఇది యంతయు నిట్లుండ స్పష్టముగనే "అంతః పురుషే. జ్యోతిః" "పురుషునిలోపల నున్నజ్యోతిస్సు" అని శ్రుతి "ఈవాక్యము జఠరాగ్నివిషయము" అని తెలుపుచున్నది. కావున నెట్లును జ్యోతిశ్శబ్దము బ్రహ్మవాచకము కాదు.

అవతారిక:—అనిన నీసంశయమును నీక్రిందిసూత్రమున నివారించుచున్నాఁడు.—

## ౨౪. జ్యోతిశ్చరణాభిధానాత్ ౧. ౧. ౨౪.

తాత్పర్యము (సిద్ధాంతము)—ఈ వాక్యమునందలి జ్యోతిశ్శబ్దము బ్రహ్మవాచకమే. ఇది జఠరాగ్నినిగూర్చి చెప్పుచున్న దనుట నిశ్చయమే. ఆజఠరాగ్నిరూపముతో బ్రహ్మము నుపాసింపవలయు నని చెప్పుచున్నది. దీనికి పూర్వవాక్యమునందే "పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" "బ్రహ్మమునకు నాలుగు పాదములు. అందు ఈ ప్రపంచమునందలి సర్వభూతములు నొక్కపాదము. తక్కిన మూఁడు పాదములును ద్యులోకమున నున్నవి" అని చెప్పఁబడియున్నది. ప్రకృతవాక్యమునందును మరల నాద్యులోకమునే ప్రస్తావించి "ద్యులోకమునకు మీఁద వెలుఁగు జ్యోతి" యని చెప్పఁబడియున్నది. ఇదియునుఁగాక పూర్వవాక్యమునందుఁ జెప్పఁబడిన బ్రహ్మము సర్వనామ మగు యచ్ఛబ్దముచే నిచ్చట ప్రస్తావింపఁబడినది. కావున నీహేతువువలన (అనఁగ: పూర్వవాక్యమున పరబ్రహ్మపాదములను గూర్చి చెప్పుచు

ద్యులోకప్రస్తావము చేయఁబడియున్న దను హేతువువలన) జ్యోతిశ్శబ్దము బ్రహ్మవాచకమే యగును.

ఏపదార్థము కాంతిమంతమై యుండునో దానియం దెల్ల జ్యోతిశ్శబ్దము ప్రవర్తించుట లోకానుభవసిద్ధము. ప్రస్తుతబ్రహ్మము సర్వలోకప్రకాశకము. "త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" "ఆబ్రహ్మము ప్రకాశించుచుండ సర్వలోకములును దాని ననుసరించి ప్రకాశించును. ఈలోకమునందు సర్వపదార్థములయందును గానవచ్చుప్రకాశము పరబ్రహ్మసంబంధమైనదియే" అని శ్రుతి యీ విషయమును స్పష్టము చేయుచున్నది. "తం దేవా జ్యోతిషాం జ్యోతి రాయు రుపాస తేఽమృతం" "సర్వజ్యోతులలోను జ్యోతి యగుబ్రహ్మమును దేవత లుపాసింతురు" అని జ్యోతిశ్శబ్దమును బ్రహ్మమునందు శ్రుతి యుపయోగించియున్నది. స్మృతియు "జ్యోతిషా మపి తజ్జ్యోతిః" "ఆబ్రహ్మము సూర్యాదిజ్యోతిస్సులకు జ్యోతిస్సు" అని యాశబ్దమును బ్రహ్మవాచకముగఁ బ్రయోగించియున్నది. ఇట్లగుటచే జ్యోతిశ్శబ్దమునకు సూర్యాదులు మాత్రమే ప్రసిద్ధార్థము లనునది యొక యాక్షేపము కాదు.

మఱియు బ్రహ్మము నిరాకారమైనను "ప్రకాశించుచున్నది" అని చెప్పుటవలన దోషము లేదు. ఆయనకు ప్రకాశ మనునది స్వస్వరూపస్థితియే; కాని యాగంతుకము (ఆకస్మికముగ వచ్చునది, లేక, ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకపోవునది) కాదు. ఇదియును గాక యుపాధి నాశ్రయించిన నేది యెట్లు చెప్పినను దోషమే లేదు. "జ్ఞానా దేవ తు కైవల్యం" "బ్రహ్మము నెఱుంగఁగానే మోక్షము దొరకును" అను మొదలగు శ్రుతులు కూడ నుపాధిసహితబ్రహ్మమును కూర్చియే ప్రవర్తించుచున్నవి. వాస్తవస్థితిలో బ్రహ్మ మేకరూప మైయుండ నుపాధ్యాశ్రయము లేకున్నచో "తెలిసికొనువాఁడు, తెలియఁబడునది" అను భేదమే సంభవింపదు కదా! ఇంత ఏల? ఇచ్చట జ్యోతిశ్శబ్దార్థమున సంశయ ముండుటచే "బ్రహ్మము ప్రకాశించుచున్నది" అనరా దంటిరి; కాని యిట్టిప్రయోగములు నిస్సంశయము లగు స్థలములయందే యున్నవి. "తేజ సేద్ధః" "బ్రహ్మము దివ్యతేజస్సుచేఁ బ్రకాశించుచున్నది" అని తైత్తిరీయోపనిషత్తునందుఁ బ్రయోగింపఁబడియున్నది. కావున నీవిష

యమున ('బ్రహ్మము ప్రకాశించుచున్నది.' అని చెప్పుటవలన దోషము వచ్చును అనువిషయమున) మీయాక్షేపము చెల్లదు.

ఇఁక సర్వవ్యాపకునిగూర్చి యొక యెల్లనుచెప్పి రనుటయు దోషము కాదు. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడే యైనను ఉపాసనకు సులభముగ నుండుటకై యొకయెల్లను చెప్పవచ్చును. ఆధారమునను కూడ చెప్పవచ్చును. ఉపాధివశమున నాయన కన్నియు నర్హములే యగును. ఇతరశ్రుతులయందును ఉపాసనార్థమై, సూర్యుఁడు నేత్రము హృదయము మొదలగు స్థానములు పరమేశ్వరున కాధారములుగాఁ జెప్పఁబడియే యున్నవి కదా! ఇట్లగుటచే నెటుచూచినను జ్యోతిశ్శబ్దమునకు పరమేశ్వరుఁడే యర్థము.

ఇదియంతయుఁ గాక యీజ్యోతిః ప్రకరణమునకు వెంబడి నున్న శాండిల్యవిద్యయందు "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" = "ఈప్రపంచ మంతయు బ్రహ్మమే" 'అని పరబ్రహ్మమునుగూర్చి చెప్పఁబడియున్నది. పూర్వవాక్యము బ్రహ్మపరమని యిదివఱకే చెప్పియున్నాము. ఇట్లు పూర్వోత్తరవాక్యములు బ్రహ్మపరములుగ నుండ నడుమఁ గలజ్యోతిర్వాక్యము బ్రహ్మపరము కాదనుట సంభవింపదు. అట్లు చెప్పినచో శాండిల్యవిద్యకును ప్రస్తుత జ్యోతిర్విద్యకునుగూడ దోషము వచ్చును. ఒకవిషయమును జెప్పుచు వచ్చి యాకస్మికముగ దానిని వదలి క్రొత్తవిషయమును స్వీకరించిన ట్లగును. ఇది యుక్తము కాదు కదా! కావున నెట్లు చూచినను జ్యోతిశ్శబ్దమునకు పరబ్రహ్మమే యర్థము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ఈజ్యోతిరుపాసనకు ఫల మల్పముగఁ జెప్పఁబడియున్నది. జ్యోతిశ్శబ్దమునకు పరబ్రహ్మమే యర్థ మైన నిట్లు చెప్పుట కవకాశ ముండదు కదా!

సిద్ధాంతము:—ఇది యొకదోషము కాదు. "బ్రహ్మోపాసన కింతఫల ముండవలయును" అనునియమ మెప్పటికిని లేదు. సర్వోపాధివినిర్ముక్తుఁడై యున్నపరమేశ్వరు నాత్మగ నెఱింగినచో నత్యుత్తమ మగు మోక్షరూపఫలము కలుగును. అట్లు కాక నేది యైన నొకయుపాధి నవలంబించిన నుత్తమ మధ్యమాధమభేదములు గలఫలము తారతమ్యములతోఁ గలుగుచున్నది. కావున నల్పఫలమును చెప్పినంతమాత్రమున జ్యోతిశ్శబ్దమునకు పరబ్రహ్మభిన్నము నర్థమునుగఁ జెప్ప నక్కఱ లేదు.

## అ ౧. పా ౧. సూ ౨౫. ఆరంభము.

పూర్వపక్షము:— ఇదియు సరి కానేరదు. పూర్వవాక్యము నందు చెప్పియున్నది బ్రహ్మమునుగూర్చి కాదు. "గాయత్రీ వా ఇదం సర్వం" "ఈసర్వప్రపంచంబును గాయత్రియే" అని గాయత్రీఛందస్సునుగూర్చియే అచ్చట చెప్పఁబడియున్నది. గాయత్రీఛందస్సును గూర్చి చెప్పుట కారంభించి "గాయత్రికి భూతములు, లేక, జీవుఁడు, భూమి, శరీరము, హృదయము, వాక్కు, ప్రాణము అని యాఱుభేదములు కలవు" అని వర్ణింపఁబడియున్నది. పిదప "యద్వై తద్బ్రహ్మ" "ఈ గాయత్రీయే బ్రహ్మము" అని, ఉత్తరవాక్యమున బ్రహ్మశబ్ద మున్నను, ఆశబ్దము వేదపరము కూడ నగుటచే గాయత్రీఛందమునే చెప్పును. కావున పూర్వవాక్యమున చతుష్పాద్బ్రహ్మప్రస్తావమే (పరబ్రహ్మము నాలుగుపాదములు గలదానిగా వర్ణించుటయు) లేదు. ఇట్లుండ నా పూర్వవాక్యము జ్యోతిశ్శబ్దార్థమును నిర్ణయింప సాధన మెట్లగును? "పాదోఽస్య" అనువాక్యమున నాలుగుపాదములనుగూర్చి చెప్పఁబడినను, అవి గాయత్రీపాదములు కాని బ్రహ్మపాదములు కావు కదా!

అవతారిక:—అను నీపూర్వపక్షము నీక్రిందిసూత్రమున నను వాదపూర్వకముగా ఖండించుచున్నాఁడు—

## ౨౫. ఛందోభిధానాన్నేతి చేన్నతథా చేతోఽర్పణ నిగదాత్తథాహి దర్శనమ్. ౧. ౧. ౨౫.

తాత్పర్యము(సిద్ధాంతము):—పూర్వవాక్యమున గాయత్రీప్రస్తావమున్ననుదోషము లేదు. పరబ్రహ్మమును నాలుగుపాదములు గలదానిని గాఁజెప్ప నుద్దేశించి గాయత్రీఛందస్సుకూడ నట్టిదియే కావునఁ దద్రూపముతో బ్రహ్మోపాసన చేయవలయు నని శ్రుతి చెప్పుచున్నది. కావున "ఏతం హ్యేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసంతే ఏత మగ్నావధ్వర్యవ ఏతం మహావ్రతే ఛందోగాః" "ఋగ్వేదులు రాక్షసుల సంహారార్థమై శస్త్రప్రయోగము నొనర్చునప్పుడు (సూర్యున కర్ఘ్యము నిచ్చునప్పుడు) ఈబ్రహ్మమును శస్త్రరూపముతో నుపాసించుచున్నారు. యజుర్వేదులు ఆబ్రహ్మమునే అగ్నిహోత్రమునందును, సామవేదులు

దానినే మహావ్రత మనుక్రతువునందును, ఆయాయుపాధులతో నుపాసించుచున్నారు." అనువాక్యములయందు వలె నిచ్చటను గాయత్ర్యుపాధితో బ్రహ్మోపాసనము చెప్పఁబడియున్నది కాని వేఱు కాదు. పై శ్రుతి ('ఏతం' అను మొదలగు శ్రుతి) "ఉపాధిసహిత బ్రహ్మోపాసన కలదు." అను విషయమును చక్కగా నిరూపించియున్నదికదా! ఈ కారణమువలన జ్యోతిశ్శబ్దమునకు బ్రహ్మ మర్థమగు ననుటలో సంశయ మింతయైనను లేదు.

విశేషాంశము:—కొంద ఱీసూత్రమునకు మఱియొకవిధముగ నర్థము చెప్పుదురు. "పూర్వవాక్యమున చెప్పఁబడినది గాయత్రిని గూర్చి కాదు. బ్రహ్మమునకును గాయత్రికిని గూడ నాలుగుపాదములే యుండుటచే నాపోలికను బట్టి యచ్చట బ్రహ్మమే చెప్పఁబడెను. "తేవా ఏతే పంచాన్యే పంచాన్యే....దశసంత స్తత్కృతమ్" "వాయువు అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు జలము అను దేవతు లైదుగురును ప్రాణము వాక్కు నేత్రము మనస్సు అను నవయవము లైదును గలసి కృత మనఁబడును" అని యారంభించి ఛాందోగ్యశ్రుతియందుఁ బ్రకరణాంతమున. "సైషా విరాట్" "ఆకృతము విరాట్ఛ్చందము" అని చెప్పఁబడియున్నది. ఇచ్చట కృతము పదిపదార్థములతోఁ గూడి యున్నది. విరాట్ఛందంబును పదియక్షరములతోఁ గూడి యున్నది. కావున నిచ్చట "కృతము విరాట్టు" అని యున్నది. ఇట్లే ప్రకృతవాక్యమునందును "చతుష్పదములు కలవు" అను పోలికచే "బ్రహ్మము గాయత్రి" యని చెప్పఁబడియున్నది. కావున గాయత్రీశబ్దము ప్రత్యక్షముగనే బ్రహ్మమును చెప్పును" అని వారు వాదించుచున్నారు. అయినను ఈవాదమున గాయత్రీపదమునకు స్వార్థము చెప్పఁబడలేదు. కావున నిది శంకరాచార్యులకు సమ్మతము కాదు. శబ్దార్థము నట్లే యంగీకరించి తదుపాధితో బ్రహ్మోపాసనను చెప్పుట యుక్త మగుచుండ నిరర్థకముగ పదార్థపరిత్యాగముఁ జేయుట యుక్తియుక్తము కాదని వారియాశయము.

## అ ౧. పా ౧. సూ ౨౬. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కానేరదు. పూర్వవాక్యమున గాయత్రీశబ్దము ప్రత్యక్షముగ నుండ దానిస్వార్థమును వదలి

వేఱొకయర్థమును (పరబ్రహ్మ మను నర్థమును) *అజహల్లక్షణచే గ్రహిం చుట యుక్తము కానేరదు కదా !

అవతారిక:—అను నీ సంశయమును నివారించుచున్నాఁడు.—

## ౨౬. భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్.

## ౧. ౧. ౨౬.

తాత్పర్యము. (సిద్ధాంతము):—గాయత్రీశబ్దమువలన తదుపాధిక బ్రహ్మమును గ్రహించుట మిగుల యుక్తియుక్తము. ఆగాయత్రీ వాక్య మునందు, ౧ భూతసమూహము, ౨ వేదాదిరూపమగువాక్కు, 3 భూమి, ౪ పంచభూతమయ మగుశరీరము, ౫ హృదయము, ౬ ప్రాణము అను నీయాఱును గాయత్రీవిభాగము లనియు, దానికి నాలుగు పాద ములు కలవనియు, ఒకపాదము ప్రపంచ మనియు, తక్కినమూఁడును మోక్షరూపము లనియుఁ జెప్పఁబడియున్నది. "సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ" "ఆగాయత్రి నాల్గు పాదములుకలది. ఆఱు విభాగ ములుకలది"అను వాక్యముచే నీవిషయము స్పష్టముచేయఁబడియున్నది. గాయత్రీపదమున ఛందముమాత్రమే యుద్దేశింపఁబడి యుండునేని ఇట్టి పాదములును ఇట్టివిభాగములును ఉండుట తటస్థింపదు. "గాయత్రీ ఛందమునకు సర్వప్రపంచము నొకపాదము" అని చెప్పుటకంటె హాస్యా స్పద మేది కలదు?. కావున నిచ్చట నిర్దేశింపఁబడినది బ్రహ్మమే."పాదోఽ స్య విశ్వా భూతాని" "ఈ బ్రహ్మమునకు సర్వభూతములు నొక్కపా దము" అను పురుషసూక్తవాక్యంబును, "విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" "ఓయర్జునా! నే నొకపాదముచే నీ సర్వప్ర పంచము ననలంబించి యున్నాను"అను గీతావాక్యంబును, "ఈప్రపంచ మంతయు పరబ్రహ్మముయొక్క పాదము" అని నిరూపించుచున్నవి.

"ఏకరూపుఁ డగుపరబ్రహ్మమునకు పాదవిభాగ మెట్లు యుక్తి యుక్తమగును?" అందువేమొ; ఉపాధివశమువలన బ్రహ్మమునందు సర్వ కల్పనలును యుక్తములే యని యిదివఱకే నిరూపించియున్నాము. ఇది యునుగాక యుపాసకులయొక్కయు జిజ్ఞాసువులయొక్కయు (బ్రహ్మము

* అజహల్లక్షణ (చూడు. ౧౧౨. పుట)

నెఱుంగఁ దలంచువారియొక్కయు) ననుగ్రహార్థమై వేద మెట్లెట్లు చెప్పిన బ్రహ్మస్వరూపము గోచర మగునో, అట్లెల్లఁ జెప్పవచ్చును. శిష్యులకు నెట్లయినను విషయగ్రహణము కలిగించుటయే కదా బోధకుల కార్యము !

మఱియు "యద్వై తద్బ్రహ్మ" అను నుత్తరవాక్యమునందలి బ్రహ్మశబ్దంబును (గాయత్రీవాక్యమున కుత్తరవాక్యమునఁ గల బ్రహ్మ శబ్దము) పరబ్రహ్మపరమే కాని వేదపరము కానేరదు. దానికిఁ బిదపఁగల "బ్రహ్మపురుషాః" అను వాక్యమునందలి బ్రహ్మపదము పరబ్రహ్మవాచక మనుట సర్వవాది సమ్మతమై యుండఁగా, తత్పూర్వవాక్యమున నున్న బ్రహ్మపదము మాత్రము వేదపరమెట్లు కాఁగలదు? "అట్లే యగు ననిన దోష మేమి?" అందువేమొ; అప్పుడు ప్రస్తావమును వదలి యాకస్మిక ముగఁ గ్రొత్తవిషయమును ఉపక్రమించిన ట్లగును కదా! కావున నెట్లు చూచినను గాయత్రీపదమునకు ఆయుపాధితోఁ గూడిన బ్రహ్మమే యర్థ మై తీరవలయును.

## అ ౧. పా ౧. సూ ౨౫. ఆరంభము.

పూర్వపక్షము :—ఇప్పటికిని జ్యోతిశ్శబ్దార్థము బ్రహ్మమనుట తగదు. "పూర్వవాక్యమందును ఉత్తరవాక్యమునందును ద్యుశబ్దమే యుండుటచే నీరెండువాక్యములందును బ్రహ్మమే వర్ణింపఁబడెను" అంటిరి. అది సరికాదు. పూర్వవాక్యమున "దివి" అని ద్యుశబ్దము సప్తమీవిభక్తితోఁ బ్రయోగింపఁబడియున్నది. ఉత్తరవాక్యమున "దివః" అని యాశబ్దమే పంచమీవిభక్తితోఁ బ్రయోగింపఁబడియున్నది. ఇట్లు చెప్పుటచే, నావాక్యములయందు బోధింపఁ బడినవస్తువులు పరస్పర భిన్నములు కావలయును. ఏలయనిన:—సప్తమీవిభక్తి ఆధారమును తెలుపును. కావున "త్రిపాదస్యామృతం దివి" అను పూర్వవాక్యమునఁ జెప్పఁబడిన పదార్థము ద్యులోకమున నుండునది యగును. పంచమీ విభక్తి యన్ననో ఆధారమును తెలుపదు; అవధిని తెలుపును; (అనఁగ: "ఈపదార్థము దీనికంటె మీఁద, లేక, క్రింద నున్నది" అని యెల్లను తెలుపును.) ఇట్లగుటచే "య దతః పరో దివో జ్యోతిః" అను నుత్తరవాక్యమునఁ జెప్పఁబడినపదార్థము ద్యులోకమునకంటెఁ బైన నున్నది

యగును. ఇట్లైన నీరెండుపదార్థములకు నేకత్వము ఘటింపదు. ఒకపదార్థములోపల నున్నదియే దానికంటె పైగఁ గూడ నుండ నేరదుకదా !

అవతారిక:—అను పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు:—

## ౨౭. ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్. ౧. ౧. ౨౭.

తాత్పర్యము. (సిద్ధాంతము).—ఒకచోట సప్తమీవిభక్తియు మఱియొకచోటపంచమీవిభక్తియు నుండుటవలన నావాక్యములలోఁ జెప్పఁబడిన విషయములు పరస్పరభిన్నములు కావలయు నని చెప్పుట యుక్తియుక్తము కాదు. ఎట్లు చెప్పినను విరోధము గలుగదు. ఆధారముగ నున్నపదార్థమునే యెల్లగాఁ గూడఁ జెప్పుట వ్యవహారసిద్ధమైయే యున్నది. ఎట్లనిన :—

ఒకడేగ చెట్టుకొమ్మమీఁద నున్నప్పుడు దానినిగూర్చి రెండు విధము లగువ్యవహారములు లోకమున ప్రసిద్ధములు. "౧. డేగ చెట్టుకొమ్మయందున్నది. ౨. డేగ చెట్టుకొమ్మకు పైగ నున్నది." అను రెండు వ్యవహారములను మనము ప్రత్యక్షముగనే చూచుచున్నాము. కావున నాధారమైన పదార్థమునే యెల్లగాఁ గూడఁ జెప్పుట నిర్వివాదాంశము.

మఱికొందఱు మఱియొకవిధముగాఁ గూడ నభిప్రాయపడుచున్నారు. "త్రిపాదస్యామృతం దివి" అనుపూర్వవాక్యమునందుఁ గూడ ద్యుశబ్దము ఎల్లనే చెప్పు ననుచున్నారు. సప్తమీవిభక్తికి "సమీపమునందు" అనునర్థము కూడఁ గలదు. కావున నీపూర్వవాక్యమునందలి ద్యుశబ్దము "ద్యులోక మెల్లగాఁ గలిగి ద్యులోకసమీపమున నున్నబ్రహ్మమును గూర్చియే చెప్పుచున్నది" యనుచున్నారు. ఈరెండుపక్షములలో దేని నంగీకరించినను మాసిద్ధాంతమునకు భంగము కలుగదు, ద్యుశబ్దము పూర్వవాక్యప్రతిపాదితమగు బ్రహ్మము నుత్తరవాక్యమునందు ప్రత్యభిజ్ఞాతము (గుఱుతింపఁబడిన దానిని) చేయ లేకపోదు. కావున జ్యోతిశ్శబ్దమునకు పరబ్రహ్మమే యర్థమనుట నిర్వివాదాంశము.

# ౧౧. ఇంద్ర ప్రాణాధికరణము.

(ప్రతర్దనాధికరణము.)

సంగతి :— "పై యధికరణమున 'యచ్ఛబ్దము సర్వనామము. సర్వనామములకు సామాన్యముగ ప్రసిద్ధియే యర్థము. కావున నాయచ్ఛబ్దము పూర్వవాక్యమునఁ బ్రసిద్ధుఁడై యున్నపరమేశ్వరునే తెలుపును' అని చెప్పి, దానిబలమువలన సామాన్య తేజఃపరముగ నున్నలింగముల బాధించిరి. కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునఁ గలప్రాణవాక్యమును విచారింపఁబోయిన నచ్చట కాననచ్చుజీవప్రాణలింగములను బాధించుటకు వీలు లేదు. కావున నీప్రాణవాక్యము పూర్వాధికరణమునకు ప్రత్యుదాహరణస్థానము." అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణమారంభింపఁబడుచున్నది. కావున దీనికి పై యధికరణముతోఁ గల సంబంధము ప్రత్యుదాహరణ రూపమైనది యని తెలిసికొనునది.

మఱికొందఱు ఈసంబంధమును దృష్టాంతరూపముగ వర్ణించుచున్నారు. "పై యధికరణమున ద్యుశబ్దబలము నాశ్రయించి తేజఃపరముగ నగుచున్న వాక్యార్థమును బాధించియున్నారు. ఇట్లే ప్రస్తుత ప్రాణవాక్యమునందును జీవాదిపరముగ నున్నపదార్థములయొక్క బలము నాశ్రయించి బ్రహ్మపరముగఁ దోఁచుచున్న వాక్యార్థమును బాధించుట యుక్తము" అని పూర్వాధికరణన్యాయము ననుసరించియే యచట పూర్వపక్షము వచ్చె ననుచున్నారు. "వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానమే ముఖ్యము కావున, నాపదార్థము (శబ్దములపైఁ దోఁచునర్థము) నాశ్రయించి యప్రధాన మగు వాక్యార్థమును త్రోసివేయుట దోషము కాదు" అనుట పూర్వపక్షులయభిప్రాయ మనుచున్నారు.

విషయము:—ఈ యధికరణమున కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునందలి ఈ క్రిందివాక్యము విచారింపఁబడును. ఆ యుపనిషత్తునందు ఇంద్రప్రతర్దనసంవాదరూప మగునొకకథ కలదు. అందు "ప్రతర్దనో హ వై దైవోదాసి రింద్రస్య ప్రియం ధా మోపజగామ యుద్ధేన పౌరుషేణ చ" "దివోదాసుని కుమారుఁ డగు ప్రతర్దనుఁడు తానొనర్చిన యుద్ధములచేతను తాఁ జూపిన పరాక్రమములచేతను ఇంద్రునకు మిగులఁ బ్రియమగు స్వర్గలోకమును జెందెను" అని యారంభింపఁబడి క్రమ

క్రమముగ నీక్రిందివిషయములు వర్ణింపంబడినవి. "తం హేంద్ర ఉవాచ ప్రతర్దన వరం తే దదా నీతి స హోవాచ ప్రతర్దన స్త్వమేవ వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే....ఇంద్రస్సహోవాచ మా మేవ విజానీ హ్యేత దే వాహం మనుష్యాయ హితతమం మన్యే....ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మిత్యుపాస్వ ....అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి.... న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" "అట్లు స్వర్గమునకు వచ్చిన ప్రతర్దనుని జూచి యింద్రుఁడు 'ఓ ప్రతర్దనా! నీకు వరము నిచ్చెదను. వలసినదానిని వేఁడుము' అనిన నాప్రతర్దనుఁడును 'మనుష్యులకు పరమ పురుషార్థసాధన మగునది యేదియో దానిని నీవే విచారించి నా కను గ్రహింపుము' అని ప్రత్యుత్తరము చెప్పెను. పిదప నింద్రుఁ డిట్లనియె. 'ఓ ప్రతర్దనుఁడా! నాయథార్థస్వరూపము నే తెలిసికొనుము. ఇదియే మను ష్యులకు పరమపురుషార్థసాధనమని నాయభిప్రాయము. నేను జ్ఞానరూప మగుప్రాణమే స్వరూపముగాఁగలవాఁడను.అట్టి నన్ను ఆయుస్స్వరూపుని గాను మోక్షస్వరూపునిగాను ఉపాసింపుము. మఱియు వాక్కు మొద లగు నేయింద్రియములును ఈశరీరమును స్వవ్యాపారములయందు ప్రవ ర్తింపఁజేయఁజాల వనుటయు, నీజ్ఞానరూప మగు ప్రాణ మొక్కటియే ఈ శరీరమును గ్రహించి నడపుచున్నదనుటయు ప్రత్యక్షమే కదా! ఈప్రా ణమే వక్త కావున నెప్పటికిని వక్తను తెలిసికొనుటకే ప్రయత్నింపవల యును గాని వాక్కును గూర్చి తెలిసికొనఁ బ్రయత్నింప నక్కఱలేదు" అని చెప్పఁబడుచు వచ్చి తుద కిట్లు ముగింపఁబడియున్నది. "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః" "పయిన వర్ణింపఁబడు జ్ఞాన రూపమగుప్రాణమే ఆనందరూపమయినది జరామరణములు లేనిది."

ఈయంశములనుగూర్చి ఈయధికరణమున విచారింపఁబడును.

సందేహము:—ఇచ్చట ప్రాణశబ్దమునకు ననేకార్థము లున్నట్లు కానవచ్చుట సంశయకారణము. "ప్రాణశబ్దము ఇంద్రాదులనుగూర్చి చెప్పును, పరబ్రహ్మమునే చెప్పును" అనుట క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఈ రెండుపక్షములకు నుపాసనయే (అనఁగ: పూర్వపక్ష మునకు నింద్రాద్యుపాసనయు, సిద్ధాంతమునకు బ్రహ్మోపాసనయు) ఫలము.

ఈరెండుపక్షముల నాశ్రయించి ఈక్రిందిపూర్వపక్షము జనించును.

పూర్వపక్షము :—పై యింద్రప్రతర్దనసంవాదమునందుఁ గానవచ్చు ప్రాణశబ్దము ఇంద్రాదులను చెప్పునా?, లేక, బ్రహ్మమును చెప్పునా? ఆకథను విమర్శించిన, ఇంద్రుఁడు "నేనే ప్రాణమును" అని చెప్పియుండుటచే నాప్రాణశబ్దమున కింద్రుఁడే యర్థమని తోఁచుచున్నది. మఱియు నాప్రాణశబ్దమునకు ప్రాణవాయువునందు ప్రసిద్ధార్థము కలదు; శ్రుతియందును "ఆప్రాణము శరీరమును గదలించుచున్నది" అని చెప్పఁబడియుండుటచే నాయర్థమే దృఢము చేయఁబడియున్నది. ఇదియును గాక "ఆప్రాణమే వక్త (మాటలాడువాఁడు). దానినే తెలిసికొనవలయును." అని చెప్పఁబడియుండుటచే నాప్రాణశబ్దము జీవుని చెప్పుచున్నట్లు తోఁచుచున్నది. ఇదియంతయు కాక "ఆప్రాణమే యానందరూపము" అనుటచే "ప్రాణశబ్దార్థము బ్రహ్మమే యగునేమో" యని తోఁచుచున్నది. ఇందు నిర్ణయ మెట్లు? ఈప్రాణశబ్దమునకు ప్రత్యేకపదార్థముల ననుసరించి చూచిన నింద్రాదులలో నొక్కటియే యర్థ మగుట స్పష్టమగుచున్నది. కావున దానిబలమువలన బ్రహ్మరూపవాక్యార్థమును (తాత్పర్యార్థమును) బాధించుట యుక్తమని తోఁచుచున్నది.

అవతారిక:—అను పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు :—

## ౨౮. ప్రాణ స్తథాఽనుగమాత్. ౧. ౧. ౨౮.

తాత్పర్యము (సిద్ధాంతము):—పై వాక్యమునందలి ప్రాణపదము బ్రహ్మవాచకమే యనవలయును. పూర్వాపరముల బాగుగ విమర్శించిన నట్లే తెలియవచ్చును. ఎట్లనిన :—

ప్రతర్దనుఁడు ఇంద్రుని "మనుష్యులకు పరమపురుషార్థ మగుదాని నిశ్చయించి నాకొసంగుము." అని యడిగెను. దానికి సమాధానము నింద్రుఁడు ప్రాణోపాసనమును చెప్పెను. ఇచ్చట ప్రాణశబ్దమునకు బ్రహ్మభిన్నమగుపదార్థ మేదియైన నర్థ మగునేని యప్పుడు తదుపాసనవలన పరమపురుషార్థ మెట్లు కలుగును? అజ్ఞానజనిత మయినభ్రాంతిరూపసంసారబంధము ఆత్మజ్ఞానమాత్రమువలెనే కదా నివర్తించును. "త మేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాన్యః పంథా విద్యతేఽయ

నాయ" "ఆ బ్రహ్మము నెఱుంగుటవలన మాత్రమే ముక్తి దొరకును. పరమపురుషార్థమును సంపాదించుటకు వేఱొకమార్గము లేదు." అని వేదవాక్యములు ఘోషించుచున్నవి.

మఱియు నాయింద్రుఁ డాతనితో నుపదేశమధ్యమున "స యో మాం వేద స హ వై తస్య కేన చ న కర్మణా లోకో మీయతే న స్తేయేన న భ్రూణహత్యయా" "నాయథార్థస్వరూపము నెవ్వఁ డెఱుంగునో అట్టివానిమోక్షగతికి నేకర్మలును విఘ్నకారులు కానేరవు. చౌర్యము కాని శిశుహత్య కాని మఱి యేదియైనను గాని దానికి భంగమును కలిగింపనేరదు.(అనఁగ: జ్ఞానప్రభావముచేఁ గర్మలు నశించుననుట)" అని చెప్పియున్నారు. ఈసర్వకర్మనాశము బ్రహ్మేతరపదార్థజ్ఞానమునఁ గలుగనేరదు. శ్రుతియందు "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" "కార్యములకంటెను కారణములకంటెను అతీతుఁడై యున్నపరమేశ్వరుని తెలిసికొనఁగానే సర్వకర్మములును నశించును"అని "బ్రహ్మజ్ఞానమువలన మాత్రమే సర్వకర్మనాశము కలుగును" అని స్పష్టముగ చెప్పఁబడియున్నది. కావున నీకారణమువలనఁ గూడఁ ప్రాణశబ్దవాచ్య మగుపదార్థము పరబ్రహ్మమే కావలయును.

"ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" అనుటచేఁ బ్రాణము జ్ఞానరూపముగఁ జెప్పఁబడియున్నది. ఈజ్ఞానరూపము పరబ్రహ్మమునకు మాత్రమే కాని యన్యపదార్థమునకు సంభవింపదనుట నిర్వివాదాంశము.

"జీవునకు కూడ జ్ఞానరూపము కలదు" అనియెదవేమొ; ఆవిషయమును గూర్చి ౧. ౧. ౩౧ సూత్రమున వివరించెదము. మఱియు మామతమున జీవబ్రహ్మలకు భేదము లేదు. కావున "ఇది జీవపర మగు వాక్యము"అని సాధించినను ఒకపక్షమున బ్రహ్మపరమే యగు ననుటలో సంశయముండదు.

ఇదియంతయుఁ గాక "స న సాధునా కర్మణా భూయాన్భవతి నో ఏ వాసాధునా కర్మణా కనీయా నేష హ్యేవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష ఉ ఏ వాసాధుకర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్యోఽ ధో నినీషతే ఏష లోకాధిపతి రేష లోకేశః." "ఈప్రాణశబ్దవాచ్యపదార్థము సత్కర్మల నాచరించుటచే నభివృద్ధి నొందునదియుఁ గాదు. దుష్కర్మల నాచరించుటచే హీనమగు

నతియుఁ గాదు. ఈపదార్థమే ఉత్తమలోకములఁ బొందింపఁబడినవానిచే (కర్మానుగుణముగ నట్టిస్థితికి వచ్చినవానిచే) శుభకర్మలఁ జేయించును. (పరమేశ్వరుని కర్తృత్వము అ. ౧. ౨. పా. ౧౨ అధి. నందు వివ రింపఁబడును;) అధోలోకమును బొందింపఁ దలంపఁబడినవానిచే నశుభ కర్మములఁ జేయించును. ఈపదార్థమే సర్వమునకు నియామకము. సర్వ లోకములకు ప్రభువు" అని పైయితిహాసమునందే ప్రాణశబ్దవాచ్యమగు పదార్థమునకు పుణ్యపాపసంస్పర్శము లేకుండుటయు సర్వకర్మల నాచ రింపఁజేయుసామర్థ్యంబును సర్వలోకప్రభుత్వంబును అనునవి వర్ణింపం బడినవి. ఇవి బ్రహ్మమునకుఁ గాక యన్యపదార్థమునకుఁ గలుగునా ? కావున నీకారణమువలనఁ గూడ ప్రాణశబ్దవాచ్యము పరబ్రహ్మమే.

ఇఁక నుపసంహారవాక్యమున "ప్రాణమే యానందరూపము. జరా మరణములు లేనిది" అని చెప్పఁబడియుండుటను జూడ "నిస్సంశయ ముగ ప్రాణము బ్రహ్మమే" యని స్పష్టమగుచున్నది. ఈవిధముగ పూ ర్వాపరముల బాగుగ విమర్శించిన నాయింద్రప్రతర్దనసంవాదమున ముచ్చటింపఁబడినపదార్థము బ్రహ్మమే యనుటకు సంశయము లేదు.

## అ ౧. పా ౧. సూ ౨౯. ఆరంభము.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము సరి కానేరదు. ప్రతర్దనునితో నింద్రుఁడు "నేనే ప్రాణమును" అని చెప్పియున్నాఁడు. "త్రిశీర్షాణం త్వాష్ట్ర మహనం, అరున్ముఖా న్యతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్." "మూఁడు శిరములు గలిగి త్వష్టకుఁ బుత్త్రుఁడు నగువిశ్వరూపుని వధించి తిని. వేదాంతవిముఖులై యున్నయతుల నడవికుక్కలకుఁ దిననిచ్చితిని" అని బ్రహ్మమునకు నించుకయైనను సంబంధింపని విషయములఁ జెప్పుచు నాత్మను నుతించెను. ఇట్లగుటచే నచ్చట ప్రాణశబ్దముచేఁ జెప్పఁబడిన పదార్థము ఇంద్రదేహమే కాని బ్రహ్మము కానేరదు.

"ప్రాణపద మింద్రవాచకము కాదు కదా !" అనియెదవేమొ; వినుము. ప్రత్యక్షముగ నాపద మింద్రవాచకము కాకున్నను పరంపరగఁ గావచ్చును. "ప్రాణో వై బలం" "ప్రాణమే బలము" అను శ్రుతి యందు ప్రాణశబ్దము బలవాచకముగ, లేక, బలసూచకముగ చెప్పఁబడి యున్నది. ఇంద్రుఁడు బలమున కధిష్ఠానదేవత యనుట లోకప్రసిద్ధము.

ఈకారణమువలన బలమును చెప్పునది యగుటచే ప్రాణశబ్దము తదధిష్ఠాన దేవత యగునింద్రుని పరంపరగ చెప్పనచ్చును.

ఆయింద్రుఁడు శరీరము గల యొక దేవత. ఇట్లగుటచేత నాతనిని చెప్పు ప్రాణశబ్దము నిరాకార మగు బ్రహ్మమును చెప్పదు. "ప్రాణశబ్దనింద్రుని చెప్పును" అనువిషయము సప్రమాణముగ నిప్పుడే స్థిరము చేయఁబడియున్నది కదా!

"పై యితిహాసమునందు 'ప్రాణము జ్ఞానరూపము'అని యున్నది. ఇది యింద్రునియందు సంభవింపదు" అనియెదవేమో; అది సరి కాదు. "దేవతులజ్ఞానమునకు కొఱఁత లేదు" అను విషయము, సర్వ లోకప్రసిద్ధము.

ఇట్లగుటచే బ్రహ్మపరములుగఁ గానవచ్చుగుఱుతుల నన్నిటిని తగినరీతి నింద్రపరములుగ సమన్వయింపవలయును. ఇంద్రదేవతాస్వరూప జ్ఞానము కూడ పరమపురుషార్థ మగుటలో సంశయ ముండదు కదా!

అవతారిక:—అనుసీపూర్వపక్షము ననువాదపూర్వముగ ఖండించుచున్నాఁడు.—

## ౨౯. న వక్తు రాత్మోపదేశా దితి చే దధ్యాత్మ సంబద్ధభూమా హ్యస్మిన్. ౧. ౧. ౨౯.

తాత్పర్యము (సిద్ధాంతము):— "ఉపదేశకుఁ డగునింద్రుఁడు 'నేనే ప్రాణము'అని చెప్పుటవలన బ్రహ్మము ప్రాణశబ్దవాచ్యము కానేరదు" అనుట తగదు. ప్రస్తుతప్రకరణమున (అనఁగ: ఇంద్రప్రతర్దన సంవాదమున) అధ్యాత్మసంబంధము (అధ్యాత్మ యనఁగ: శరీరము ననుసరించి తెలిసికొనఁదగిన ప్రత్యగాత్మ) అనంతముగఁ గలదు. ప్రాణ శబ్దమునకు నాప్రత్యగాత్మనే యర్థముగ చెప్పకుండిన ప్రకరణార్థమే చెడి పోవును. ఎట్లనిన:—

"యావ దస్మిన్ శరీరే ప్రాణో వసతి తావ దాయుః" "ఈదేహమున ప్రాణ మెంతకాల ముండునో అంతవరకే ప్రాణవాయుసంచార ముండును" అని పై ప్రకరణమునఁ జెప్పఁబడియున్నది. ఇచ్చట ప్రాణ శబ్దార్థ మింద్రదేహమే యనిన నీవాక్య మెట్లు పొసంగును? ఇంద్ర

దేహము అన్యభూతముల ప్రాణములకు ప్రవర్తకమై తత్తచ్ఛరీరముల యందున్నదా? కావున నిందుఁ జెప్పఁబడినప్రాణము జ్ఞానరూపమై ప్రాణ వాయువున కాధారమై యున్న ప్రత్యగాత్మయే యై తీరవలయును.

మఱియు "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" "ఈప్రాణమే జ్ఞానరూపము. ఇదియే శరీరమును పట్టి లేవ నెత్తుచున్నది" అను మఱియొక వాక్యము "దేహేంద్రియవ్యాపారములు జ్ఞానరూపమగుప్రాణమునకే స్వాధీనములు" అని తెలియఁజేయుచున్నది. ఇంద్రశరీర మిట్టిది యని నిరూపింప శక్య మగునా?

ఇదియునుంగాక "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్; తద్యథా రథ స్యారేషు నేమి రర్పితా నాభా వరా అర్పితా ఏవ మేవై తా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణే ఽర్పితా స్స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఽఽనందో ఽజరో ఽమృతః" "వాక్కును తెలిసికొనఁ బ్రయత్నింపక తత్ప్రేరకుని దెలిసికొనుము. ఆతఁడే ప్రాణశబ్దవాచ్యుఁడు. రథచక్రమునకుఁ గలయాకులయందు కడకమ్మియు (పట్టా), కుండయందు ఆయాకులును నెలకొల్పఁబడి యున్నట్లు *జ్ఞానేంద్రియము లైదును, వానియందు జనించు దర్శనాదిజ్ఞానము లయిదును గలిసి ఈపదింటియందును, పంచభూతములును శబ్దస్పర్శాదులును గలిసి ఈపదియు నెలకొల్పఁబడియున్నవి. ఆ జ్ఞానేంద్రియములును వానిజ్ఞానములయిదును గలిసి ప్రాణశబ్దవాచ్య మగుపదార్థమున నెలకొల్పఁబడి యున్నవి. ఆప్రాణమే జ్ఞానరూపము, ఆనందము, జరామరణములు లేనిది" అని పై ప్రకరణమునందు కలదు. దీనిచే ప్రాణశబ్దవాచ్య మగు పదార్థమే సర్వాధార మనియు సర్వసాక్షి యనియు (సర్వజ్ఞ మనియు) నిరూపింపఁబడినది; వక్త (అనఁగ: మాటలాడునది. ఈ యుపలక్షణము వలన సర్వకర్మేంద్రియములను ప్రేరేపించునది.) యనియుఁ దెల్పఁబడి యున్నది. ఇంద్రశరీరమే ప్రాణశబ్దార్థ మగునేని యిట్లు చెప్పుటకు వీలు కలుగునా?

"ఇట్లననేల? దేవతలు సర్వశక్తులు. అమృతపానము చేయుటచే వారలకు జరామరణములు లేవు. స్వర్గమానందరూపము కావున వారలకు దుఃఖస్పర్శము లేదు. ముఖ్యముగ నింద్రుఁడు లోకపాలకుఁ డగుటచే,

* జ్ఞానేంద్రియములు (చూడు ౯౫ పుట.)

'ఏష సర్వేశ్వరః' అను మొదలగువాక్యములు కూడ నింద్రవిషయములు గనే సమన్వయ మగును. ఇట్లుండ 'ప్రాణశబ్దవాచ్యము ప్రత్యగాత్మ' యన నేటికి ?" అనియెదవేమో, వినుము. ప్రకరణాంతమున "స మ ఆత్మా" "ఆప్రాణమే నాయంతరాత్మ" అని యాయింద్రుఁడే స్పష్టముగ చెప్పియున్నాఁడు. సామాన్యముగ లోకమున నహంకారవాదము (నేను అనువాదము) దేహమునుగూర్చియే ప్రవర్తించుచున్నది. కావున నాయాత్మ యనఁగ : నాయంతరాత్మ యనియే యర్థము చెప్పవలయును. దీనిని పట్టి చూచిన "నేనే ప్రాణమును" అని చెప్పినవాక్యము కూడ ప్రత్యగాత్మపరమే (జీవపరమే) యని తోఁచుచున్నది.

"ఈయూహాలతో మాకుఁ బని లేదు. ఉపదేశించువాఁడు 'నేనే ప్రాణమును' అని చెప్పియున్నాఁడు. 'అవా గమనాః = బ్రహ్మమునకు వాక్కు లేదు మనస్సు లేదు" అని శ్రుతియందు చెప్పఁబడియుండుటచే పరమేశ్వరుఁడు ఉపదేశకుఁడు కానేరఁడు. కావున నింద్రుఁడు మాత్రమే ప్రాణశబ్దవాచ్యుఁడు కానలయును. అన్యుఁడైనను వాగాదింద్రియములు కలవాఁడే ప్రాణశబ్దవాచ్యుఁడు కావలయును" అనియెదవేమో, వినుము. బ్రహ్మమునకు సర్వమును అవిద్యాప్రభావమునలన సంభవింపనచ్చును. అస్మచ్ఛబ్దమునకు ముఖ్యార్థము ప్రత్యగాత్మయే కావున "నేనే ప్రాణము" అనిన "నాప్రత్యగాత్మయే ప్రాణము" అని యర్థము కావచ్చును.

కావున నెట్లు చూచినను ఈప్రకరణమునఁ జెప్పఁబడినవాఁడు ప్రత్యగాత్మయే. "అయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః" "సర్వసాక్షియై తనజ్ఞానశక్తిచే సమస్తమును అనుభవించుచున్న యీప్రత్యగాత్మ పరబ్రహ్మమే" అని బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పఁబడియుండుటచే నీప్రకరణమునందు ప్రతిపాదింపఁబడిన పదార్థము ప్రత్యగభిన్నపరబ్రహ్మమే.

## అ ౧. పా ౧. సూ ౩౦. ఆరంభము.

పూర్వపక్షము :—ఇట్లు చెప్పిన "నన్నే ప్రాణముగ తెలిసికొనుము" అని యింద్రుఁ డుపదేశించెనుగదా. అది యెట్లు యుక్తమగును ?

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు :—

## ౩౦. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్.

### ౧. ౧. ౩౦.

తాత్పర్యము (సిద్ధాంతము):—ఇంద్రుఁడు చేసిన యుపదేశము వలన బాధయేమియు లేదు. శాస్త్రమున "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "బ్రహ్మము నెఱింగినవాఁడు బ్రహ్మమే యగును" అని చెప్పియుండుటచే, నాయింద్రుఁడు పూర్వజన్మసంస్కారమువలన బ్రహ్మజ్ఞానముకలవాఁడగుటచే నట్లు చెప్పెను. "తానే పరబ్రహ్మ"మను నుద్దేశముతో నట్లుపదేశించెను. ఒక్కయింద్రుఁడే కాక బ్రహ్మవేత్త యగు వామదేవమహామునియు, తానే సర్వాత్మకుఁడనుతలంపుతో "అహం మను రభవం సూర్యశ్చ" "నేనే మనువు నైతిని. సూర్యుఁడ నైతిని" అని చెప్పినట్లు వేదమునందే దృష్టాంతము కలదు. కావున నింద్రుఁడు నిట్టి యభిప్రాయముతోనే యుపదేశించి యుండవచ్చును.

## అ ౧. పా ౧. సూ ౩౧. ఆరంభము.

పూర్వపక్షము:—౨౮-వ సూత్రమున చేసిననిరూపణ ననుసరించి ప్రాణశబ్దమునకు నింద్రదేహపర మగునర్థము లేకపోయినను జీవముఖ్యప్రాణపరము (ముఖ్యప్రాణ మనఁగా: ప్రాణవాయువు) లగునర్థము లవశ్యముగ కలవని యంగీకరింపవలయును.

"న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" అనువాక్యమున "ప్రాణమే వాగింద్రియమునకు ప్రేరకము" అని చెప్పఁబడియున్నది. "వాగింద్రియప్రేరకుఁడు జీవుఁడు" అనుట సర్వలోకప్రసిద్ధము. కావున నచ్చట ప్రాణశబ్దము జీవుని చెప్పు ననియే సిద్ధాంతము చేయవలయును. మఱియు "ఇదం శరీరం" అనుమొదలగువాక్యమునందు "ప్రాణము శరీరమును లేవ నెత్తును" అని చెప్పఁబడియుండుటచే ప్రాణశబ్దమునకు ప్రాణమే యర్థమై తీరవలయును. శరీరధారణము ప్రాణవాయుకార్యమే యగుట లోకప్రసిద్ధము.

"ఇది యెట్లు ? శరీరధారణము సర్వేశ్వరుఁడగు పరమాత్ముని యొక్క కార్యము కావచ్చు కదా!" అనియెదవేమో; యది సరి కాదు.

"తా న్వరిష్ఠః ప్రాణ ఉవాచ. మా మోహ మాపద్య థాహ మే వై తత్పంచథాత్మానం ప్రవిభ జ్యైతద్బాణ మవష్టభ్య విధారయామి" "ఓయింద్రియములారా! మీకంటె నేనే శ్రేష్ఠుఁడను. నాశరీరమును ప్రాణాదిభేదములచే నైదువిధములుగ విభాగించి యీశరీరమును పట్టి నిలుపుచున్నాను' అని ప్రాణవాయువు ఇంద్రియములతోఁ జెప్పెను." అని ప్రశ్నోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. కావున నాశ్రుతిబలము ననుసరించి శరీరధారణవ్యాపారము ప్రాణమునకు సంబంధించినదియే.

ఈ రెండుచిహ్నములవలన "ప్రాణశబ్దార్థ మీరెంటిలో నేదియైన నొక్కటి" యని కాని, "ఈరెండును కలసి ప్రాణశబ్దార్థము" అని కాని యొప్పుకొనవలయును. జీవుఁడు చేతనుఁడు కావునను, ప్రాణము సర్వేంద్రియములకు, లేక, సర్వేంద్రియవృత్తులకు నాధారము కావునను, ప్రజ్ఞాత్వము (జ్ఞానరూపత్వము) ఈరెంటికిని నిస్సంశయముగ సంభవించును. "యో వై ప్రాణ స్సా ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణః సహ హ్యేతా వస్మిన్ శరీరే వసత స్సహోత్క్రామతః" "ప్రాణమే ప్రజ్ఞ; ప్రజ్ఞయే ప్రాణము. ఈరెండును దేహమున సమముగనే (ఒక్కమాత్రే) నివసించును. ఒక్కమాత్రే వెడలిపోవును" అని శ్రుతియందు చెప్పఁబడియుండుటచే ప్రాణమే ప్రజ్ఞాత్మ యగును. ఇంద్రియవృత్తులు జ్ఞానరూపములే యగుటచే వానికి నాధార మగుటవలనఁ గూడ ప్రాణవాయువు ప్రజ్ఞారూపము కలది యగు ననుట యింతకు ముందే స్పష్టము చేయఁబడియున్నది. మఱియొకవిశేషము. పై శ్రుతియందు ("యో వై ప్రాణః" అను మొదలుగుశ్రుతియందు) ప్రాణప్రజ్ఞలకు భేదము అభేదము కూడఁ జెప్పఁబడియున్నవి. ఈవిషయంబును, ప్రజ్ఞాశబ్దముచే జీవుని గ్రహించిననే కాని సరిపడదు. జీవుఁడు * పరిచ్ఛిన్నుఁడు కావున జీవప్రాణములకు స్వాభావికభేదంబును, కలసియుండుటచే నభేదంబును కూడ నుండ వచ్చును. ఇట్లు కాక "ప్రజ్ఞాశబ్దము బ్రహ్మమునందేకాని సమన్వయింపదు." అని పట్టుపట్టిన, ఆబ్రహ్మ మేకరూపమే యగుటచే నందు భేదాభేదము లుండుటకు వీలులేదు కదా! కావున నెట్లు చూచినను ఈప్రకరణమున జీవప్రాణవాయువులే చెప్పఁబడినవి.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు:—

---

* పరిచ్ఛిన్నుఁడు=పరిచ్ఛేదములు కలవాఁడు. (పరిచ్ఛేదములు చూడు ౧౦౪ పుట.)

# ౩౧. జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేన్నోపాసా త్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్.

## ౧. ౧. ౩౧.

తాత్పర్యము (సిద్ధాంతము) :— ఇట్లు చెప్పుట సరి కాదు. అప్పుడు ఏకప్రకరణమునందే భిన్నభిన్నము లగునుపాసనలు మూఁడు చెప్పఁబడినట్లగును. ఇట్లైన వాక్యభేదము వచ్చును. ఇది దోషము. ఉపక్రమమున "ప్రాణోఽస్మి" అని యారంభించి, ఈప్రకరణము "స ఏవ ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః." అని ముగింపఁబడి యున్నది. ఇచ్చట నుపక్రమ వాక్యమువలన నంతగా తేటపడకున్నను, ప్రాణశబ్దార్థము, ఉపసంహారవాక్యమున స్పష్టమగుచున్నది. ఆనందత్వాదులు బ్రహ్మమునకుకాక నితరపదార్థములకు నుండవుకదా! మఱియు "తద్యథా రథస్య" (చూడు. సూ. ౨౯) అనుమొదలగు శ్రుతియందు వర్ణింపఁబడిన సర్వాధారత్వంబును బ్రహ్మమునకుఁ గాక మఱి దేనికి నుండదు.

మఱియు "న వాచం" అనుమొదలగు వాక్యమువలన "ప్రాణమే వక్త" యని నిరూపింపఁబడిన దనియు, వక్త జీవుఁడే కావున నాతఁడే ప్రాణశబ్దార్థ మనియుఁ జెప్పితిరి. ఇది యుక్తముకాదు; దీనివలన, ప్రకరణమును బ్రహ్మపరముగ సమన్వయించుటకు విరోధంబును లేదు. "యద్వాచోఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే" (చూడు. సూ ౪. తాత్ప.) అను శ్రుతి "బ్రహ్మమే వక్త" యనుచున్నది. ఒకవేళ ప్రస్తుతప్రకరణమునఁ జెప్పఁబడినది. జీవుఁడే యనినను దోషము కలుగదు. ప్రకరణము తదుపాసనార్థకమును కానేరదు. ఆజీవుని బ్రహ్మాభిన్నునిగా నెఱుంగుటకై యుపదేశించి యుండవచ్చును కదా! ఇట్లు కాక "ఈ ప్రకరణము జీవునిఁ గూర్చి మాత్రమే చెప్పును" అని పట్టు పట్టుటకును వీలు లేదు. జీవుఁడు సర్వలోకప్రసిద్ధుఁడు కావున వానిని చెప్పుటకై శాస్త్రము ప్రవర్తింపనక్కఱ లేదు. శాస్త్ర మనునది తెలియనివిషయములఁ జెప్పునదియే కదా!

"అథ ఖలు" అను మొదలగు వాక్యమువలనఁ బ్రాణపదము ప్రాణవాయుపర మయినట్లు నిశ్చయించుటయు దోషమే. ఉపక్రమోప సంహారములు బ్రహ్మపరములై యుండ నడుమ నుండువాక్యము లన్యార్థ ములం దెల్పు ననుట యయుక్తము. శ్రుతియు "న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ఇతరేణ తు జీవతి యస్మి న్నేతా వు శ్రితౌ"= "పురుషుఁడు ప్రాణముచేతఁ గాని యపానముచేతఁ గాని జీవించుట లేదు. వీనికి రెంటికిని యాశ్రయ మగునితరపదార్థముచే (బ్రహ్మ ముచే) జీవించుచున్నాఁడు" అను మొదలగు వాక్యములచే, దేహ ధారణవ్యాపారము బ్రహ్మము నాశ్రయించినదియే యనుటచే, నావా క్యమునందలివిషయముల ('అథ ఖలు' అను మొదలగు వాక్యమునందలి ప్రాణలింగముల) బ్రహ్మపరములనుగా సమన్వయించుటవలన విరోధ ముండదు. ప్రాణవాయువు సర్వేంద్రియములకంటె శ్రేష్ఠమైనను, శరీర ధారణవ్యాపారము దానిదేయనుట స్పష్టమే యైనను, బ్రహ్మము దానికిఁ గూడ నియామకుఁడు ఆధారభూతుఁడు శక్తినిగలిగించువాఁడు నగుటచే, నాప్రాణవాక్యము బ్రహ్మపరమే కావచ్చును. "యః ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ప్రాణస్య ప్రాణః" "ఎవ్వఁడు ప్రాణముచే జీవింపఁడో, ప్రాణమునకు ప్రాణశక్తిని (శరీరధారణసామర్థ్యమును) కలి గించుచున్నాఁడో, ఆతఁడే బ్రహ్మము. ఆబ్రహ్మము ప్రాణమునకుఁ బ్రా ణము" అని శ్రుతి స్వయముగనే "బ్రహ్మము ప్రాణప్రేరకము. ప్రాణ మునకు శరీరధారణసామర్థ్యము బ్రహ్మమువలననే కలిగినది" అని చెప్పుచున్నది కదా! కావున నీప్రకరణము బ్రహ్మపరమే.

ఇదియును గాక "అత ఏవ ప్రాణః (౧.౧ ౨౨. సూ.)" అను స్థల మున, "అన్యశ్రుతియందుఁ గూడ ప్రాణశబ్దమునకు పరబ్రహ్మపరముగఁ బ్రయోగము కలదు" అను విషయము సయుక్తికముగ సాధింపఁబడి యున్నది. కావున నీప్రకరణమునందును ప్రాణశబ్దము నట్లే యన్వ యించుటవలన దోష ముండదు.

"ప్రాణప్రజ్ఞాత్మలకు సహనివాసము చెప్పఁబడెను" అను కారణ మును బట్టి యొనర్పఁబడిన పూర్వపక్షము కూడ సరి కాదు. శరీరమున నివసించియున్నప్రత్యగాత్మ బ్రహ్మభిన్నుఁడు. జ్ఞానశక్తియు క్రియా శక్తియు నాతనియుపాధులు. జ్ఞానశక్త్యుపాధి బుద్ధి. దానిచే నావరింపఁ

బడి యాతఁడే 'ప్రజ్ఞాత్మ' యని వ్యవహరింపఁ బడుచున్నాఁడు. క్రియా శక్త్యుపాధి ప్రాణము. దానిచే నావరింపఁబడి యాతఁడే 'ప్రాణము' అని పిలువఁబడుచున్నాఁడు. ప్రత్యగాత్మసంబంధము లేక యచేతనము లగుప్రాణబుద్ధులు ప్రవర్తింపనేరవు కదా! ఇట్లగుటచే నౌపాధికభేద మువలన నాబ్రహ్మమే ప్రాణప్రజ్ఞాత్మలుగ నున్నది. ఈ కారణమువలన, ప్రాణశబ్దముచే బ్రహ్మమునే గ్రహించినను, ప్రాణప్రజ్ఞాత్మలసహనివాస మును జెప్పుశ్రుతికి విరోధము గాదు. పదునాలుగవసూత్రమునఁ జెప్పఁ బడినప్రకారము ఈ ప్రాణప్రజ్ఞాత్మలకు గూడఁ బారమార్థికభేదము లేకున్నను వ్యావహారికభేదము కలదు కదా! మఱియు పరమార్థ స్థితిలో వా రిరువురు నొక్కటియే కావున "యో వై ప్రాణ స్సా ప్రజ్ఞా" అని యభేదము చెప్పుటవలనను విరోధ ముండదు. కావున నెట్లు చూచినను ఈప్రకరణము బ్రహ్మప్రతిపాదకమే. ఉపక్రమోప సంహారము లేకముగ నుండఁగ మధ్యవాక్యములవలన నర్థవికల్పము చేయుట యుక్తము కాదు కదా!

విశేషాంశము:—పయిన వివరింపఁబడినది శంకరమతము. వృత్తి కారుఁడు మాత్రము దీనికి మఱియొకవిధముగ నర్థము చెప్పెను. "ఒక్కవాక్యమున మూఁ డుపాసనలు చెప్పఁబడిన ట్లగును" అను విషయమును, పూర్వపక్షఖండనార్థ మగు హేతువునుగా నంగీకరించెను. "మా మాయు రమృత ముపాస్వ" "నన్ను (జీవుని), ఆయువును (ప్రాణ మును) బ్రహ్మమును గా నుపాసింపుము" అను శ్రుతి జీవప్రాణబ్రహ్మ పరము లగునుపాసనలఁ జెప్పునని పలుకుచు మొదట చూపఁబడియున్న పూర్వపక్షమును ఖండించెను. "ఈప్రకరణమున జీవగుణములతోను ప్రాణగుణములతోను స్వాభావికగుణములతోను మూఁడువిధములుగ పరబ్రహ్మము నుపాసింపవలయునని చెప్పఁబడియుండుటచే నీప్రకరణము జీవప్రాణపరము కాదు" అని సిద్ధాంతము చేసెను. "మనోమయః ప్రాణశరీర ఆత్మా" "ఈపరమాత్మ మనోరూపుఁడు; ప్రాణము శరీరముగాఁ గలవాఁడు" అనుమొదలగు ననేకశ్రుతులయందుఁ గూడ నొక్కమాత్రే బహువిధోపాసనలు చెప్పఁబడియున్నవి; కావున నిచ్చటఁగూడ నట్లే చెప్పె ననుటవలన విరోధము లే దనియెను.

ఈమతము శంకరునకు సమ్మతము కాదు. ఏకవాక్యమున విషయ

త్రయము చెప్పఁబడుట దోషమని వారియభిప్రాయము. వాస్తవ స్థితిలో "మనోమయః" అను మొదలగు శ్రుతులయందుఁ జెప్పఁబడి నదియు నేకోపాసనయే కాని యుపాసనాద్వయము కాదు. అచ్చట "బ్రహ్మమునకు మనస్సే స్వరూపము ప్రాణమే శరీరము" అని మాత్రమే చెప్పఁబడియున్నది కాని, "మనోధర్మములతో నైనను ప్రాణధర్మములతో నైనను బ్రహ్మము నుపాసింపుము" అని చెప్పఁబడియుండలేదు. కదా? కావున వృత్తికారమతము సరికాదు.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు

ప్రథమాధ్యాయస్య ప్రథమః పాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ప్రథమాధ్యాయమునఁ

బ్రథమపాదము.

---

 



# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము, ద్వితీయపాదము.

---

అవతారిక:— ప్రథమపాదమున "జన్మాద్యస్యయతః" అను సూత్రము మొదలు "పరబ్రహ్మము సర్వశక్తి, సర్వవ్యాపకము, నిత్యము, సర్వరూపము" అను విషయములు ప్రకటింపఁబడినవి. ఆకాశము మొదలగు సర్వభూతములకును కారణ మని చెప్పఁబడినపదార్థము సర్వశక్తిత్వము మొదలగు ధర్మములుకలదిగా నుండి తీరవలయుననుట ప్రత్యక్షసిద్ధము. బహుభేదములతోఁ బ్రకాశించుచున్న యీ ప్రపంచమును నిర్వహించువస్తువు ఎట్టిదిగా నుండవలయునో కొంచె మూహింపుఁడు. కారణకార్యములకు భేదము లేదనుట సర్వవాదిసమ్మతము. కావున ప్రపంచకారణము ప్రపంచరూపమై యుండి తీరవలయును. కార్యముయొక్కయుత్పత్తికిని లయమునకునుగూడ నాధారమై యుండుటచేఁ గారణవస్తువు అనిత్యమగుటకు వీలులేదు. కార్యమునకంటెఁ బూర్వమునను (అనఁగా: కార్యము జనింపక ముందును), పరమునను (అనఁగా: కార్యము నశించినతర్వాతను) కూడ నది యుండవలయును కదా! ఘటమునకుఁ గారణమగు మృత్తిక యాఘటోత్పత్తికిఁ బూర్వమునను, తన్నాశమునకుఁ బరమునను కూడ కల దనుట ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నది. మఱియు కార్యములను వ్యవహారార్థమై కారణభిన్నములనుగాఁ జూచు సమయమున చూపుమాత్రమే భేదవిషయక మగును గాని, పదార్థము భిన్నము కానేరదు. "ఇది ఘటము. ఇది మృత్తిక." అను చూపునందు భేదము వ్యవహారమునకై మాత్రమే పనికివచ్చును గాని పరమార్థమునకుఁ బనికిరాదనుట యెల్లరకును విశదమగు విషయమే. ఇట్లగుటచే "మృత్తిక సర్వఘటములయందును వ్యాపించి యేకరూపముతో నున్నది" అని వ్యావహారికభేదమును పారమార్థికాభేదమును కూడ నవలంబించి సర్వవ్యాపకత్వవ్యవహారము ("కారణము తన కార్యములయందు వ్యాపించి యుండును" అను వ్యవహారము) కలుగవచ్చును. ఈకారణమువలన

జన్మాదిసూత్రమునఁ బరబ్రహ్మమునకు జగత్కారణత్వము మాత్రమే చెప్పఁ బడియున్నను సర్వశక్తిత్వాదిగుణములు కూడ చెప్పఁబడినవి యగును. ఇంతమాత్రమే కాదు. సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము మొదలగు ననంతగుణములు కూడ ప్రకటింపఁ బడినవియే యగును.

ఈవిధముగాఁ బ్రథమపాదమున పరబ్రహ్మగుణము లనేకములు వర్ణింపఁబడియున్నవి. వాని నాధారముచేసికొని మిగిలినయధ్యాయమంతయుఁ బ్రవర్తించును. అందలి సిద్ధాంతమునకు ప్రథమపాదోక్తములగుగుణములే హేతువు లగుచుండును. కావున నీరెండవపాదమునకును ప్రథమపాదమునకును గలసంబంధము హేతుహేతుమద్భావసంబంధము. అనఁగా: "ప్రథమపాదము కారణమును నిరూపించును. ద్వితీయపాదము వాని నాశ్రయించి విషయనిర్ణయమును కావించును" అను సంబంధము.

మఱియుఁ బ్రథమపాదమున బ్రహ్మభిన్నపదార్థవాచకములగు ప్రాణాదిశబ్దములకుఁ గూడ బ్రహ్మపర మగునర్థమే కలదని నిరూపింపఁబడినది. బ్రహ్మలింగములు (బ్రహ్మమును గుఱుతించుటకు సాధనములగు సర్వవ్యాపకత్వాదులు) ఆవాక్యములయందు స్పష్టముగఁ గానవచ్చుచున్నవి. అయినను శబ్దభేదములవలన బ్రహ్మవాచకములగు పదములు లేకుండుటవలన నెప్పుడు సంశయము కలుగునో, అట్టివాక్యములు విచారింపఁబడినవి.

ఇఁక నీ ద్వితీయతృతీయపాదములయందు నస్పష్టబ్రహ్మలింగములగువాక్యములు(వేనియందు బ్రహ్మలింగములు స్పష్టములుగా గానరావో, యట్టివాక్యములు) విచారింపఁబడును. సామాన్యముగా సగుణబ్రహ్మమును తెలుపు నుపాసనావాక్యములు రెండవపాదమునందును నిర్గుణబ్రహ్మమును తెలుపువాక్యములు మూఁడవపాదమునందును విమర్శింపఁబడును. *యోగముచే నర్థనిర్ణయము చేయవలసినవాక్యములు రెండవ

---

* పదములనుండి యర్థమును గ్రహించుటకు రెండుమార్గములు కలవు. మొదటిది రూఢి రెండవది యోగము.

రూఢి:—వ్యవహారబాహుళ్యమువలన "ఈపదమున కిదియే యర్థము." అని దృఢమై కలిగి యున్ననియతి. "చంద్రశబ్దమునకు రాత్రికాలమునం దుదయించుచు కలువల వికసింపఁజేయుచు చల్లనై యుండుబింబమే యర్థము. భూశబ్దమునకు మృణ్మ

పాదమునను * రూఢిచే నట్టినిర్ణయము చేయవలసినవి మూఁడవపాదము నందును విచారింపఁబడును. అన్నియు బ్రహ్మమును చెప్పునవియే యని నిర్ణయింపఁబడును.

# ౧. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము.

సంగతి:—ఇది ద్వితీయపాదమునకు నారంభము కావున మొదటి యధికరణమునకు పూర్వపాదాంతమునందలి యధికరణముతోఁ బ్రత్యేక సంబంధ మక్కఱ లేదు.

మఱికొందఱు "పూర్వాధికరణముతో దీనికిఁ బ్రత్యుదాహరణ సంబంధము కలదు. పాదములు భిన్నములైనను అధికరణములకుఁ బ్రత్యేకసంబంధ ముండియే తీరవలయును." అనుచున్నారు. పూర్వమగు ప్రతర్దనాధికరణమున బ్రహ్మలింగములు గానవచ్చుటచే నన్యలింగముల (జీవుని ముఖ్యప్రాణములను ఇంద్రదేహమును తెలియఁజేయు గుఱుతులను) బాధించియున్నారు. ప్రస్తుతాధికరణమున విచారింపఁబడు శాండిల్యవిద్యయందు అట్లు చేయుటకు తగినయవకాశము లేనట్లు కానవచ్చు

---

యమై సర్వజంతునివాసయోగ్యమై యుండు నాకానాకగోళమే యర్థము" అను మొదలగునవి దీని కుదాహరణములు.

యోగము:—వ్యవహారసిద్ధ మగునర్థము లేకుండునప్పుడు కాని, ఆయర్థము నిర్ణీత తాత్పర్యమునకు విరుద్ధ మగునప్పుడు కాని యర్థాంతరమును సంపాదించుటకై సమాసాదుల నాశ్రయించుట; "వీఁడు చల్లఁగ నున్నట్లు తోఁచినను నిశాచరుండే కదా" అనునిట్టిస్థలములయందు నిశాచరశబ్దమునకు రాక్షసునియందు రూఢి యున్నను ఇచ్చటి తాత్పర్యమునకు విరుద్ధ మగుటచే సమాసము నాశ్రయించి "రాత్రియందు చరించువాఁడు" అనునర్థముచే నాపదమును చంద్రునియందు సమన్వయించుట. "గృహస్థునకు సత్పుత్త్రుఁడే భూషణము" అను నిట్టిస్థలములయందు భూషణశబ్దమునకు నాభరణమునందుఁ గలరూఢిని విడిచి తాత్పర్యము సరిపడుటకై ధాతువు నాశ్రయించి "అలంకరించువాఁడు" అని యర్థము చెప్పుట. "రాజునకు చారులే దర్శనములు" అనునిట్టిస్థలములయందు 'దర్శన' శబ్దమునకు నేత్రమునందుఁ గలరూఢిని వదలి యలంకారము నాశ్రయించి "నేత్రమువంటివారు అని యర్థము చెప్పుట." అనుమొదలగునవి యూహ్యములు.

* రూఢిస్వరూపము (చూ. ౧౬౩.)

చున్నది. దీనివలన పై యధికరణమునఁ జేయఁబడిన సిద్ధాంతము ననుసరించి పూర్వపక్షము రావచ్చు ననుచున్నారు.

విషయము:— ఛాందోగ్యోపనిషత్తునందు మూఁడవప్రపాఠకమునఁ బదునాల్గవఖండమందు శాండిల్యవిద్య యనునొకయుపాసనాప్రకరణము కలదు. అందు "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలా నితి శాంత ఉపాసీత,అథ ఖలు క్రతుమయః పురుషో యథాక్రతు రస్మిఁల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి స క్రతుం కుర్వీత, మనోమయః ప్రాణశరీరో భారూప స్సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధ స్సర్వరస స్సర్వ మిద మభ్యాత్తో ఽవాక్యనాదరః" "నామరూపాత్మకమై నానాభేదములతోఁ గానవచ్చు నీప్రపంచమంతయు పరబ్రహ్మమునుండియే జనించినది. దానియందే నిలిచి సర్వవ్యవహారముల నాచరించుచున్నది. అందే యంతమున లయము నొందుచున్నది. ఈ కారణమువలన నీప్రపంచమంతయును బ్రహ్మమాత్రమే. ఈవిషయము నెఱింగి యుపాసకుఁడు రాగద్వేషాదుల విడువవలయును. తనకంటె భిన్న మగు పదార్థ మేదియును లేదు కదా! కావున నుపాసకుఁడు శాంతుఁడై యుపాసన నాచరింపనలయును. జీవుఁడు ఇహలోకమున నెట్టినిశ్చయముతో నుండునో నట్టిరూపముతోనే పరలోకమున నిలుచును. కావున దుస్సంకల్పముల విడిచి దుష్టనిశ్చయముల పరిత్యజించి యాక్రిందఁ జెప్పఁబోవుధ్యానము నాచరింపవలయును. పరబ్రహ్మమునకు మనస్సే స్వరూపము. జ్ఞానశక్తి (జ్ఞానము), క్రియాశక్తి (ప్రాణము) అనువానితోఁ గూడినసూక్ష్మశరీరమే శరీరముగాఁగలవాఁడు. శుద్ధవిజ్ఞానమే మైనవాఁడు. సంకల్పించినంతమాత్రముననే సర్వసిద్ధుల నొందు ప్రభావము కలవాఁడు. ఆకాశమువలె సర్వగతుఁడై రూపాదివర్జితుఁడై సూక్ష్మరూపుఁడై యుండువాఁడు. సర్వప్రపంచమును నిర్మించువాఁడు. ధర్మమునకు విరుద్ధము గానికామము గలవాఁడు. పవిత్రములగు వాసనలును రుచులును గలవాఁడు. (అపవిత్రములగునవి యన్నియు పాపసంబంధమువలన కలిగినవియే కాని స్వభావసిద్ధములు కావు. ఇట్లగుటచేత పరబ్రహ్మమునకు దుర్గంధాదులు లేవని చెప్పఁబడియున్నది.) లేక, సర్వము నెఱుంగువాఁడు ఈసర్వప్రపంచమును వ్యాపించియుండువాఁడు. వాగాదీంద్రియములు లేనివాఁడు. దేనియందును అభిమానము లేని

వాఁడు అట్టియాత్మ నుపాసింపవలయును. (మనోమయత్వాదిగుణ ములతో బ్రహ్మము నుపాసింపవలయుననుట)" అనువాక్యము కలదు. ఇది యీయధికరణమున విచారింపఁబడును.

సందేహము:— ఇచ్చట మనోమయత్వాదిగుణములు ముఖ్యముగ జీవునకు సంబంధించుటయు,ఇదిమాత్రము బ్రహ్మప్రకరణమైయుండుటయు సంశయకారణములు. ఇందు "పై వాక్యము జీవుని చెప్పును. బ్రహ్మమునే చెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. విచారింపఁబడునది యుపాసనాప్రకరణము కావున నిచ్చట రెండు పక్షములకు నుపాసనయే (పూర్వపక్షమున జీవోపాసనయు, సిద్ధాంతమున బ్రహ్మోపాసనయు) ఫలము. సగుణబ్రహ్మవిచారమునం దెల్లెడ నిట్లే యూహించుకొనవలయును. నిర్గుణబ్రహ్మమును విచారించుచోట్ల మాత్రము, పూర్వపక్షమునకు జీవాద్యుపాసనయు, సిద్ధాంతమునకు బ్రహ్మజ్ఞానంబును ఫలమగుచుండును. ఈరెండుపక్షముల నాశ్రయించి యీక్రింది విధముగా సంశయ ముదయించును.

పై వాక్యమున నుపాసనార్థమై మనోమయత్వాదిగుణములతోఁ జెప్పఁబడిన పురుషుండు జీవుఁడే కావలయును గాని యీశ్వరుఁడు కానేరఁడు. కార్యకారణసంఘాతరూపము లగు దేహాదులకు నధిపతియగుటచే మనఃప్రాణములతో జీవునకు మాత్రమే సంబంధము కలుగవచ్చునుగాని నిర్మలుఁడు నిరంజనుఁడు నగుపరమేశ్వరునకు నట్టి సంబంధముండుటకు వీలులేదు. "అప్రాణోఽమనాః శుభ్రః" "ఆపరమేశ్వరునకు సూక్ష్మశరీరము లేదు. మనస్సు లేదు.ఆయన నిర్మలుఁడు"అనుమొదలగు శ్రుతివాక్యము లీవిషయమును దృఢము చేయుచున్నది."శాండిల్యవిద్యకు నారంభమున 'సర్వం ఖల్విదం బ్రహ్మ'అని సర్వలోకప్రసిద్ధమగు బ్రహ్మపదము ప్రయోగింపఁబడియుండ నీసంశయమేల ?"అని తలంచెదమన్న నదియు సరికాదు. "సర్వం" అను మొదలగు వాక్యము బ్రహ్మోపాసనను చెప్పుటకై ప్రయోగింపఁబడినది కాదనియు, "ఉపాసకుఁడు శాంతి నొందవలయును" అనువిషయమును సకారణముగ నిరూపించుటకై మాత్రమే ప్రయోగింపఁబడిన దనియు, నచ్చటి వ్యాఖ్యానముచేతనే స్పష్టమగుచున్నది. ఈవిషయమున నేవాదికిని భిన్నాభిప్రాయము లేదు. ఇఁక నుపాసనావిధివాక్య మేది యనినః "స క్రతుం కుర్వీత" అనునదియే. దానికి

తరువాత నుపాస్యపదార్థమును (ఉపాసింపఁదగిన దానిని) తెలుపుటకై "మనోమయః" అను మొదలగు వాక్యము ప్రయోగింపఁబడియున్నది. ఆమనోమయత్వాదులు పరమేశ్వరునకు కలుగ వనుట నిస్సంశయముగనే తెలియవచ్చుచున్నది. తర్వాత వినవచ్చుచున్న సత్యసంకల్పత్వాదిగుణములు జీవునకు కలుగవని తోఁచుచున్నను, అది యొకదోషము కాదు. వాస్తవస్థితిలో జీవబ్రహ్మలకు నభేదము కావున నాగుణము లన్నియు జీవునకు నుండవచ్చును. కావున నెట్లు చూచినను ఈశాండిల్యవిద్యయందు నుపాస్యుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు జీవుఁడే యనుటలో సంశయ మింతయైనను లేదని తోఁచుచున్నది.

అవతారిక:—ఈసంశయమును క్రిందిసూత్రముచే సయుక్తికముగ నివారించుచున్నాఁడు:—

## ౩౨. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్. ౧. ౨. ౧.

తాత్పర్యము:—పై శాండిల్యవిద్యయం దుపాస్యుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే కాని జీవుఁడు కాఁడు. ఆపరమేశ్వరుఁడు సర్వప్రపంచమునకును కారణభూతుఁ డగుటచేతను, మనస్సు ప్రాణము మొదలగువికారము లన్నియు నాయనకంటె భిన్నములు కాకపోవుటచేతను, ఆయనకే మనోమయత్వాదిధర్మము లుండవచ్చును. మఱియు జీవవాచకమగు పద మేదియు నామనోమయాదివాక్యమునందు లేదు. ఈకారణమువలన మనోమయాదివిశేషణముల నాశ్రయించి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను బ్రహ్మపదమునే యాకర్షించుకొనవలసి వచ్చుచున్నది. ఆ వాక్యము స్వతంత్రము కాకపోయినను శాంతిని నిరూపించుటకై మాత్రమే చెప్పఁబడియున్నను అందలి బ్రహ్మపదము మాత్రము మిగుల సమీపమున నున్నది యగుటచే మనోమయాదివిశేషణములచేత గ్రహింపఁబడును. సామాన్యముగా సర్వనామము తన చెంతనున్న దానిని మాత్రమే యాకర్షించును. ఇచ్చట "ప్రాణశరీరః" "ఎవ్వనికి ప్రాణము శరీరమో వాఁడు"అను సమాసమున సర్వనామార్థము కలదు. కావున నాసమాసమునకు సమీపముననున్న మఱియొక్కటి విశేష్యమై సంబంధింపక తీరదు. "జీవధర్మమును చెప్పు మనోమయపదము బ్రహ్మపదమునకంటె నతిసమీపమున నున్నదికదా" అనియెదవేమొ వినుము.

మనోమయపదము ప్రత్యక్షజీవవాచకము కాకపోవుట యటుండ నిస్సంశయముగా నర్థము నిచ్చునదిగాఁ గూడనుండ లేదు. ఇచ్చట మయట్ ప్రత్యయమునకు వికార మర్థమో, లేక, ప్రాచుర్య మర్థమో యను విషయము నిర్ణయించుట కే శక్యము కాకున్నది. ఇది యంతయుఁ గాక "ఈ మనోమయపదము కూడ విశేషణమే" యనుటలో సందియము లేదు. కదా! కావున నీమనోమయాదివాక్యమున గ్రహింపదగినది బ్రహ్మపదమే యనుటలో సంశయము లేదు. సత్యసంకల్పత్వము మొదలగు తక్కిన గుణము లన్నియును జీవునియందు బొత్తిగనే సంభవింప వనుట మిగుల విశదము. కావున నెట్లు చూచినను ఈవిద్యయం దుపాస్యుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. ఇట్లుకాకుండిన ఉన్నదాని విడిచి లేనిదానిఁ గైకొనుట యగును.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరికాదు. ప్రమాణములు బలవంతములై యుండు జీవపదము లేకపోయినంత మాత్రమున వాస్తవార్థమును విడువవచ్చునా? దీనియందు (శాండిల్యవిద్యయందు) చెప్పఁబడినవాఁడు నిస్సంశయముగ జీవుఁడే. మనోమయత్వాదిధర్మములు జీవునకు స్వాభావికములు. ఆతనికిని బ్రహ్మమునకును గలయభేదమువలన ఆతని మూలమున బ్రహ్మమునకు వచ్చుచున్నవి. ఇట్లగుటచే మనోమయాది శబ్దముల వినినతోడనే జీవుఁడు బుద్ధియందు స్ఫురించును. పిదపఁ గాని బ్రహ్మము స్ఫురింపదు. కావున బ్రహ్మపదము ఎంతసమీపమున నున్నను ప్రయోజనము లేదు. జీవపదము బొత్తిగనే లేకున్నను హాని లేదు. జీవబ్రహ్మములకు భేదము లేదు కావున సత్యసంకల్పత్వాదిగుణములు కూడ జీవునకుఁ గలుగవచ్చును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుటకు వీలు లేదు. విచారించి నిశ్చయింపుము. ఇందు నీయభిప్రాయ మేమి? "జీవబ్రహ్మములకు భేదము లేదు. కావున బ్రహ్మగుణము లగుసత్యసంకల్పత్వాదులు జీవునకు నున్నవి. ఇట్టి జీవుని స్వాభావికము లగుమనోమయత్వాదిగుణములతో నుపాసింపవలయును" అనియా?, లేక, "జీవుఁడు బ్రహ్మమునకంటె పారమార్థికముగ భిన్నుఁడు కాకపోయినను కల్పితభేదము కలవాఁ డగుటచే బ్రహ్మగుణములతో జీవునకు సంబంధ ముండదు. జీవగుణములతో మాత్రము బ్రహ్మమునకు నెప్పటికిని సంబంధముండును. కావున నెట్టి

బ్రహ్మమును జీవగుణములతో జీవుఁడుగ నుపాసింపవలయును" అనియా?

ఇందు మొదటిపక్షము అనుభవవిరుద్ధము. లోకమున నొకపదార్థముపై మఱియొకపదార్థము నారోపించిన నప్పుడు ఆరోపింపఁబడిన పదార్థమునకుఁ గలధర్మములతో నాధారమగుపదార్థమునకు సంబంధముండును ; కాని ఆధార మగుపదార్థముయొక్క గుణములతో నారోపితపదార్థమునకు సంబంధ ముండదు. ఒకత్రాటియందు పామునారోపించిన నప్పుడు పామునకుఁ గలభయంకరత్వాదిగుణములతో త్రాడు సంబంధపడును. అచ్చట పురుషుఁడు చూచుచున్నది త్రాటినే కదా! ఇంతయే కాని త్రాటికి సంబంధించినవి యగు పురినారతో చేయఁబడుట మొదలగుగుణములతో నందుఁ గానవచ్చిన సర్పమునకు సంబంధముండదు. ఇదియు స్పష్టమగువిషయమే. త్రాటిని చూచుకాలమున పామే లేదు కదా !

ఇట్లే ప్రస్తుతమునందును భ్రాంతికల్పితుఁ డగుజీవునిగుణములు ఆధారభూతుఁడగు బ్రహ్మమునకు నుండవచ్చును; కాని బ్రహ్మగుణములు మాత్రము జీవునకు నుండవు

ఇఁక రెండవపక్షము నాశ్రయించుట మాకు సమ్మతమే ; కాని యచ్చట బ్రహ్మమును గానే వ్యవహరించుటకు వీలుండ క్రొత్తగా జీవత్వవ్యవహార మేటికి?'సర్వం'అను మొదలగువాక్యము ఈవిషయమును స్పష్టముగా చెప్పుచుండ నున్నదానిని విడిచి లేనిదానిని క్రొత్తగ తెచ్చికొననేటికి? కావున నెట్లుచూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౧. సూ ౨. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమున మఱియొకకారణమును చెప్పుచున్నాఁడు.—

## 33.* వివక్షితగుణోపపత్తేశ్చ. ౧. ౨. ౨.

తాత్పర్యము:—మఱియు సత్యసంకల్పత్వాదిగుణములు జీవునకుఁ గలుగవు. సత్యసంకల్పత్వము మొదలగునవి విషయవాక్యార్థమును

* "వక్తు మిష్టం వివక్షితం" "చెప్పుటకు నిశ్చయింపఁబడినది వివక్షితము" అను వ్యుత్పత్తిచే వివక్షితశబ్దము ప్రయోగింపఁబడఁగానే "చెప్పువాఁ డొక్కఁ డున్నాఁడు" అనువిషయము స్పష్ట మగును. వేదము చెప్పునర్థములు అనాదినుండియు నేకరూపముగ

వర్ణించునప్పుడే నిరూపింపఁబడినవి. ఎవ్వనిసంకల్పము ఎప్పటికిని నిరర్థక ము కాక కార్యముల సాధించునో వాఁడే సత్యసంకల్పుఁడు. ఇట్లే సర్వ కర్మత్వము (సర్వమును నిర్మించుట)మొదలగునవియును సర్వశక్తియగు నొకానొకపదార్థమునకు మాత్రమే సంబధించునవి యని స్పష్టముగ తెలియవచ్చుచున్నది. జీవుఁ డట్టివాఁడు కాఁడు కదా! కావున పరమే శ్వరుఁడే ప్రస్తుతవిద్యయం దుద్దేశింపఁబడినవాఁడు. మఱియు నచ్చటనే "జ్యాయాన్ పృథివ్యాః" "ఈయుపాస్యదేవత భూమికంటె పెద్దది" అని చెప్పఁబడి యున్నది. ఇది జీవునియందు బొత్తిగనే సంభవింప దనుటలో సంశయ మింతయైన లేదుకదా!

మనోమయత్వాదిగుణములు కూడఁ బరమేశ్వరునకు సంభవించు ననుటను ఇదివఱకే నిరూపించి యున్నాము. "అప్రాణో హ్యమనాః" అనుశ్రుతి నిర్గుణబ్రహ్మమును గూర్చిచెప్పునది. ప్రస్తుతశ్రుతి యుపాస నార్థమై సగుణబ్రహ్మమును చెప్పుచున్నది. కావున నీరెంటికిని విరోధము లేదు. మఱియు నిట్టిసగుణబ్రహ్మమును చెప్పు శ్రుతి స్మృతు లనేకములు కలవు. "త్వం స్త్రీ త్వం పుమా నసి త్వం కుమార ఉత వా కుమారీ" "ఓపరమేశ్వరుఁడా! నీవే స్త్రీవి, నీవే పురుషుఁడవు, నీవే బాలుఁడవు, నీవే బాలికవు." అను మొదలగు శ్వేతాశ్వతరశ్రుతియు "సర్వతః పాణి పాదంత త్సర్వతోఽక్షిశిరోముఖం." "ఆబ్రహ్మమునకు చేతులు కాళ్లు కండ్లు శిరములు ముఖములు అనునవి యనంతములుగ నున్నవి" అను గీతావాక్యంబును పైవిషయమును నిర్ణయించుచున్నవి.

## అ ౧. పా ౨. సూ ౩. ఆరంభము.

అవతారిక:—"అగును గాక. జీవబ్రహ్మముల యభేదమువలన వారిగుణములు పరస్పరము సంబంధింపవచ్చును" అనిన నట్లుకా దని చెప్పుచున్నాఁడు :—

---

వచ్చుచున్నవి యగుటచే వానికి ఐక్య లేఁడు. సూత్రమున వివక్షితపదము ప్రయోగిం పఁబడి యున్నది.

అయినను ఇందు విరోధము కలుగదు. లోకమున నీవివక్షితపదమునకు "గ్రహిం పఁదగినది" అనునర్థమునఁ బ్రయోగము మెండుగఁ గలదు. ఈసూత్రమునందుఁ గూడ నట్లే కావచ్చునుకదా?

## ౩౪. అనుపపత్తేస్తు న శారీరః. ౧. ౨. ౩.

తాత్పర్యము:—పైన నిరూపించిన కారణములవలన నిచ్చటి యుపాస్య దేవత బ్రహ్మమే ; జీవుఁడు కానేరఁడు. బ్రహ్మగుణములు జీవునకు సంభవింపవు. ఆరోపింపఁబడినవాఁడగుటచే జీవుఁడు తన గుణముల బ్రహ్మమునందు సంక్రమింపఁజేయఁగలఁడు ; కాని బ్రహ్మ గుణములఁ జెందనేరఁడు. ఈవిషయము అధికరణారంభసూత్రమునందే వివరించియున్నాము.

పూర్వపక్షము:—మామతమునందును విరోధము లేదు. పరమేశ్వరుఁడుకూడ శరీరమున నున్నవాఁడే ఈసూత్రమున శారీరశబ్దము మాత్రమే కలదు; కాని జీవశబ్దము లేదు కదా ! ఇంతమాత్రమువలన "ఈసూత్రమున జీవుఁడే నిషేధింపఁబడెను" అని యెట్లు సిద్ధాంతము చేయవచ్చును ?

సిద్ధాంతము:—ఇట్లు చెప్ప నక్కఱలేదు. ఇచ్చట శారీరశబ్దమునకు "శరీరమునందుమాత్రమే యుండువాఁడు" అని యర్థము. ఇట్టివాడు జీవుఁడే కాని పరమేశ్వరుఁడుకాఁడు కదా! జీవుఁడు ఒక్క దేహమునందే యుండువాఁడు; పరమేశ్వరుఁడు సర్వమునందును వ్యాపించియున్నవాఁడు. "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః" "పరమేశ్వరుఁడు ఆకాశమువలె నతిసూక్ష్మరూపుఁడై సర్వమును వ్యాపించి నిత్యుఁడై యున్నాఁడు" అను శ్రుతి పైవిషయమును స్పష్టము చేయుచున్నది.

## ౩౫. కర్మకర్తృవ్యపదేశాచ్చ. ౧. ౨. ౪.

తాత్పర్యము:—మఱియొకవిశేషము. "ఏష మ ఆత్మాఽన్తర్హృదయ ఏత ద్బ్రహ్మైత మితః ప్రే త్యాభిసంభవితాస్మి" "ఈతఁడె నా యాత్మ. ఇదియే బ్రహ్మము. ఈలోకమును విడిచి ధ్యానబలమువలన నాయాత్మనే చెందుదును" అని యాశాండిల్యవిద్యయందు నాల్గవ మంత్రము కలదు. దానియందు ఉపాస్య దేవతయు నుపాసకుఁడును ప్రత్యేకముగా వర్ణింపఁబడియున్నారు. ఆత్మ యుపాస్య దేవత; జీవుఁడు ఉపాసకుఁడు. ఆత్మ పొందఁబడువాఁడు; జీవుఁడు పొందువాఁడు. ఈ విధముగ నుపాస్య దేవతకును జీవునకును భేదము చెప్పఁబడియుండుటచే

నీవిద్యయందు చెప్పఁబడినది పరమేశ్వరుని గూర్చియే యనుట నిస్సంశయము.

## ౩౬. శబ్దవిశేషాత్. ౧. ౨. ౫.

తాత్పర్యము:—మఱియు "ఈప్రకరణమున నుపాస్యదేవతగాఁ జెప్పఁబడినవానికిని జీవునకును భేదము కలదు" అనువిషయమున మఱియొకశ్రుతి కూడఁ బ్రమాణమైయున్నది. శతపథబ్రాహ్మణమున నిట్టియుపాసనను (మనోమయత్వాదిగుణములతోఁ జేయఁబడు బ్రహ్మోపాసనను) చెప్పుప్రకరణ మొక్కటి కలదు. దానియందు "యథావ్రీహిర్వా యవో వా శ్యామాకో వా శ్యామాకతండులో వైవ మయ మంతరాత్మన్పురుషో హిరణ్మయః" "వడ్లగింజవలెను యవబీజమువలెను చామగింజవలెను అందలిబియ్యమువలెను అతిసూక్ష్మరూపుఁడై తేజోమయుఁడగునొకపురుషుఁడు నాజీవునియం దున్నాఁడు" అని చెప్పఁబడియున్నది. ఇట్లు చెప్పుటచే "ఉపాస్యదేవత యగుపురుషుఁడు ఉపాసకుఁ డగు జీవునకంటె భిన్నుఁడు" అని స్పష్టముగ తెలియవచ్చుచున్నది. ప్రస్తుత శాండిల్యవిద్య కూడ నచ్చటిప్రకరణమువంటిదే; కావున నిచ్చటకూడ భేదమే యుద్దేశింపఁబడెనని నిర్ణయింపవలయును. ఇచ్చట కొంచెము సంశయాస్పదముగ నున్నను,పై శతపథబ్రాహ్మణవాక్యమున, సప్తమ్యంత పదముచే జీవునిగూర్చియుఁ బ్రథమాంతపదముచే నుపాస్యదేవతను గూర్చియుఁ జెప్పఁబడియుండుటచే భేదము (జీవునకు నుపాస్యదేవతకుఁ గలభేదము) స్పష్టముగనే తెలియవచ్చుచున్నది కదా !

## ౩౭. *స్మృతేశ్చ. ౧. ౨. ౬.

తాత్పర్యము:—"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" "ఓయర్జునుఁడా! పరమేశ్వరుఁడు సర్వజీవులయొక్కయు హృదయ

*స్మృతి యనఁగా నిత్యసిద్ధమగువిషయమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుట. అట్టివిషయము వేదమే. కావుననే ప్రస్తుతము కానవచ్చుచున్న వేదములందు లేని విషయము సహితము స్మృతులయందుఁ గానవచ్చెనేని, తద్విషయకవేదవాక్యము ననుమానముచే (వేదము నిత్యసిద్ధవిషయముల సముదాయము. కావున స్మృతియందు కానవచ్చుచున్న యీవిషయము ఇప్పటివేదమున లేకున్నను పూర్వమున నున్నదియే. ఏకారణమువలననో నశించి యుండును. అనునూహచే) సాధింపుదురు. భ్రమప్రమాదాదిదోషములు లేని

మున నున్నాఁడు" అను స్మృతివాక్యము "జీవేశ్వరులకు భేదము కలదు" అనువిషయమును స్పష్టము చేయుచున్నది. దీని నాశ్రయించి చూచిన "పరమేశ్వరుని జీవునికంటె భిన్నునిఁగాఁ జెప్పవచ్చును" అనువిషయము సిద్ధాంతమగుచున్నది. కావున నట్లుచూచినను ఈశాండిల్యవిద్యయం దుపాస్యదేవతగాఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యనుటలో సంశయము లేదు.

పూర్వపక్షము:— ఈసిద్ధాంతము మిగుల విరుద్ధముగ నున్నది. "అనుపపత్తేః" అనుసూత్రము మొదలింతవఱకు "ఈప్రకరణమున చెప్పఁబడినవాఁడు జీవుఁడు కాఁడు" అని నిషేధించుచున్నారు. శ్రుతిస్మృతులయం దన్ననో "నాన్యోఽతోఽస్తి ద్రష్టా. నాన్యోఽతోఽస్తి శ్రోతా. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" "ఈపరమాత్మునికంటె నితరుఁడగు ద్రష్ట (చూచువాఁడు)కాని శ్రోత (వినువాఁడు) కాని లేఁడు. నేనే జీవుఁడను" అని జీవబ్రహ్మములకు నభేదము చెప్పఁబడియున్నది.

"ద్వా సుపర్ణా" "జీవేశ్వరులిరువురు గరుడపక్షులవలెనున్నారు. అను మొదలగు శ్రుతు లనేకములు జీవేశ్వరభేదమును కూడఁ జెప్పు

---

యెల్లసిద్ధాంతమును నీజాతిలోఁ జేర్పఁబడును. వాస్తవస్థితిలో నిప్పుడు చాలభాగము వేదము నశించియే యున్నది. ఋగ్వేదమునకు నిరువదియొక్కశాఖలు. అందు తెలిసినంత వఱకు నాశ్వలాయనశాఖ యొక్కటియే మిగిలియున్నది. యజుర్వేదమునకు నూట తొమ్మిది శాఖలు. అందు రెండుశాఖలుమాత్రమే కానవచ్చుచున్నవి. వానిలోను కృష్ణయజుశ్శాఖ యసంపూర్ణమైనది. సామవేదమునకు వేయిశాఖలు. అందొకటిరెండు మాత్రమే మిగిలి యున్నవని వినుచున్నాము. అథర్వవేదమునకు నేఁబదిశాఖలు. అవి సంపూర్ణముగనే నశించి పోయినవి.

ప్రకృతము స్మృతిశబ్దార్థము ననుసరించి చూచినఁ గొన్ని మన్వాదిస్మృతులే గాక తక్కిన పురాణాదులును, వానివానిలక్షణముల ననుసరించి నామభేదముల నొందినను స్మృతు లగును. కావున నందఱును ముఖ్యముగ వ్యాసమతము నవలంబించినవేదాంతులు, భారతము, పాంచరాత్రాగమము, శైవాగమము, మన్వాదివేదోక్తస్మృతులు, (వేదమునందు మనుస్మృతి మొదలగువాని నంగీకార్యములనుగాఁ జెప్పియున్నారు.) అనువానిని ప్రత్యక్షప్రమాణములుగాను, తక్కినవాని నుపబృంహణములుగాను గ్రహింతురు. భారతము వ్యాసకృతమే యైనను అందలివిషయము ప్రత్యక్షముగఁ జూచియే వ్రాయఁబడినది యగుటచే, నాగ్రంథము వ్యాసకృతములే యగునన్యగ్రంథములకుఁ గూడఁ బ్రమాణము కావచ్చును. ఈవిషయము (చూ. ౧౭ పుట.)

చున్నవి కదా!" అనియెదవేమొ; యది సరికాదు. ఒక్క వేదమునందే కొన్నిచోట్ల భేదము అంగీకరింపఁబడియున్నది. మఱికొన్నిచోట్ల నిషేధింపఁబడియున్నది. ఇట్లగుటచే నీవిషయములు రెండును యథార్థములే యగుటకు వీలు లేదు. వీనిలో నేదియైన నొక్కటి యథార్థమై రెండవది యయథార్థమై యుండి తీరవలయును.

"భేదమే యథార్థము కారాదా?" యనిన, పూర్వాపరముల బాగుగ విమర్శించి చూచిన వేదతాత్పర్య మట్టిదిగాఁ దోఁపలేదు. భేదమునే ప్రధానముఁ జేసికొనిన నప్పుడు అభేదశ్రుతులకు యుక్త మగు నర్థముండదు.

మఱియు "భేదము యథార్థము" అని నిరూపించుటకు తగిన ప్రమాణములు కూడ లేవు. సర్వప్రమాణములకును ప్రత్యక్షప్రమాణ మొక్కటియే యాధారమైనది. అదియు నెదుట నున్నవారిని గ్రహించు నంతియె కాని వానియథార్థతత్త్వము నెఱుంగనేరదు. కావున ప్రమాణము లెవ్వియు యథార్థమును నిర్ణయింప సాధనములు కానేరవు. శ్రుతియు "యథా సో మ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం....ఏవం....స ఆదేశో భవతి" "ఓశాంతుఁడా! మట్టిని తెలిసికొనిన మట్టిపాత్రముల నన్నిటిని ఎట్లు తెలిసికొనినట్లగునో అట్లే తత్త్వరూపము (బ్రహ్మము) నెఱింగిన సర్వప్రపంచము నెఱింగిన ట్లగును. కార్యకారణములకు భేదము లేదు" అని ప్రత్యక్షాదులచే తెలిసికొనఁబడుచున్న భేదమును యుక్తియుక్తముగ నిరాకరించుచున్నది. కావున నెట్లుచూచినను అభేదమే పరమార్థము. ఇట్లగుటచే భేదము నాశ్రయించి చెప్పుసూత్రములును ఇతరశాస్త్రములును తుదకుశ్రుతులునుకూడ నప్రమాణములే.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరి కాదు నీ వన్నట్లు అభేదము పరమార్థ మగుట నిశ్చయమే; కాని, భేదమును గూర్చి చెప్పుశాస్త్రాదులు మాత్ర మప్రమాణములు కావు. అవి యౌపాధికభేదము (ఆవరణముల వలన వచ్చినభేదము) నాశ్రయించి ప్రవర్తించును. ఆకాశ మొక్కటియే యయ్యును, అనేకపదార్థములయందు నిలిచియుండును. కావున, ప్రత్యేకముగ "ఘటాకాశము, గృహాకాశము" అనువిధములతో నజ్ఞానులచే వ్యవహరింపఁబడుచున్నట్లు, పరమేశ్వరుండును పరమార్థస్థితిలో నేకరూపుఁడే యయ్యును, అనేకదేహములయందుండువాఁడు

కావున, దేహభేదముల నాశ్రయించి "వీఁడు జీవుఁడు" అని వ్యవహరింపఁబడుచున్నాఁడు; యథార్థస్వరూపముతో "ఈతఁడు పరమేశ్వరుఁడు" అనియు వ్యవహరింపఁబడుచున్నాఁడు. కావున నీసూత్రములు కూడ నిట్టికల్పితభేదము నాశ్రయించియే ప్రవర్తించుచున్నవి. కావున నివి నిరర్థకములు కాని విరుద్ధములు కాని కా నక్కఱ లేదు.

"ఇట్లైన నిత్యశుద్ధుఁ డనఁబడుపరమేశ్వరునకుఁ గూడ నజ్ఞానముతో సంబంధ ముండవలసి వచ్చును." అనియెదవేమొ; వినుము. ఆయజ్ఞానము జీవునకే సంబంధించును; కాని యెట్లును పరమేశ్వరునకు సంబంధింపదు. ఏకరూపుఁడగు పరమేశ్వరుని నానారూపునిగా భావించువారు జీవులే కదా!

"ఇట్లయిన మఱియొకదోషము వచ్చును. మొట్టమొదట నవిద్య (అజ్ఞానము) యుండిననే కాని జీవేశ్వరభేద ముండదు; ఆభేద ముండిననే కాని యవిద్య యుండదు. ఈయవిద్య జీవుని మాత్రమే యాశ్రయించును; కావున, మొట్టమొదట జీవుఁడు మఱియొకదాని సహాయముచే పరమేశ్వరు నుండి విభక్తుఁడు కావలయును గదా! అట్టిపదార్థాంతరమును మీ రంగీకరించుట లేదు; అవిద్యవలననే జీవుఁడు పరమేశ్వరునుండి విభక్తుఁడు అయ్యె ననుచున్నారు. ఇట్లు చెప్పిన నన్యోన్యాశ్రయదోషము రాక తప్పదు" అనియెదవేమొ; కొంచెము విచారించి చూడుము. ఇతరస్థలములయందు ఇట్టి సందర్భములు కలిగెనేని యప్పుడు అన్యోన్యాశ్రయదోషము వచ్చు ననుట నిశ్చయము; కాని యిచ్చట మాత్రము రాదు. ఈజీవుఁడును అవిద్యయు ననాదులు. "దీనినుండి యాపదార్థము జనించెను. దీనివలన నీపదార్థము తెలియవచ్చుచున్నది." అనునిర్ణయమును చేయుటకు నాటంక మగుటచే, అన్యోన్యాశ్రయము (ఇది యుండిననే కాని యది యుండదు; అది యుండిననే కాని యిది యుండదు; అని చెప్పుట) దోషమును కలిగించును. ఇది సర్వవాదిసమ్మతము. ప్రస్తుతవిషయమున నీవు చూపిన యన్యోన్యాశ్రయము,పుట్టుకకుఁ గాని జ్ఞానమునకుఁ గాని యాటంకము కానేరదు. అనాదు లగుటచే నాజీవావిద్యలకు మొట్టమొదట నుత్పత్తియే లేదు; ప్రకాశ మన్ననో, జీవునకు స్వాభావికము. అవిద్యకు నాజీవుని ప్రభావమువలన వచ్చునది. (జీవుఁడు పరమేశ్వరుఁడే కావున

స్వ*ప్రకాశస్వరూపుఁడు. అవిద్య యాతనిసాన్నిధ్యమువలన ప్రకాశించునది.) కావున నిచ్చట నన్యోన్యాశ్రయము దోషము కానేరదు. బీజాంకురాది దృష్టాంతములయందు వలె (విత్తనము ముందా? చెట్టు ముందా? అనునిట్టి స్థలములయందు వలె)సిద్ధాంతభంగమును కలిగింపఁ జాలదు. బీజాంకురములకు నుత్పత్తి కలదు కావుననే కదా, అచ్చట నీయన్యోన్యాశ్రయము దోషమును కలిగింపఁగలిగినది!

"ఇట్లు చెప్పినను దోషము సంపూర్ణముగ నశింపదు. ఏది యైనను స్వాతంత్ర్యము లేనివానిని బంధింపఁగలుగును; కాని స్వతంత్రుని బంధింపనేర దనుట స్పష్టమగువిషయము. ఇట్లుండ నాయవిద్య జీవు నెట్లుబంధించును? ఆతఁడు స్వతంత్రబ్రహ్మమే కదా!" అనియెద వేమొ; మొట్టమొదట నీప్రశ్నమునకే యవకాశము లేదు. ఏల యనిన:— ఈజీవత్వము నేఁడు వచ్చినది కాదు. నేఁడు క్రొత్తగా వచ్చియుండునేని యప్పుడు "ఇది యెట్లు కలిగినది?" అని యడుగవచ్చును. ఇట్లుకాక యనాదినుండియు నేకరూపముతో నున్నదానిని గూర్చి

* ప్రకాశశబ్దమునకు జ్ఞానమే యర్థము. ఏపదార్థము ఇంద్రియములకుఁ గాని మనస్సునకుఁ గాని గోచరమగునో అదియే "ప్రకాశించుచున్నది" యని లోకమునఁ జెప్పఁబడుచున్నది యనుట నిర్వివాదాంశము. "సర్వపదార్థములను ప్రకాశింపఁ జేయునది వెలుతురు కదా? కావున దానికే ప్రకాశ మనుపేరు కలుగవలయును." అని యెదవేమొ; యది సరి కాదు. ఆవెలుతురు కూడ నేత్రములకు గోచర మైనప్పుడే కదా "ప్రకాశించుచున్నది, ఇచ్చటప్రకాశము కలదు" అనువ్యవహారము కలుగుచున్నది. కావున జ్ఞానమే ప్రకాశము. అదియే సర్వేంద్రియముల మూలమున సర్వపదార్థములఁ బ్రకాశింపఁ జేయుచున్నది.

ఇఁక దానిని ప్రకాశింపఁజేయుటకుమఱియొకటి లేదు. అట్లుండుటకును వీలు లేదు. ఒకజ్ఞానమును ప్రకాశింపఁజేయుటకు మఱియొకజ్ఞాన ముండునేని దానిని ప్రకాశింపఁజేయుటకు వేఱొకటి యుండవలయును, దానిని బ్రకాశింపఁజేయుటకు వెండియు నొక్కటి యుండవలయును. ఇట్లయిన నెన్నిటికిని అంతె ముండదు. ఇది యనవస్థా దోషము. ఇట్లు కాక కొన్నిటివఱకు నంగీకరించి యటనుండి "దీనికి మఱియొకసాక్షి లేదు" అనుట సంభవింపదు కదా! అన్నిజ్ఞానములకును సాక్షి యుండ నొక్కదానికి మాత్రము లేకపోవు ననుట యెట్లు? కావున మొట్టమొదట జ్ఞానమునకే సాక్ష్యాంతరము లే దనవలయును. ఇదియే స్వప్రకాశత్వము. స్వప్రకాశత్వ మనఁగా తనంతఁదానే ప్రకాశించుట; తన్ను తానే తెలిసికొనుట.

ప్రశ్నించుట కెట్లవకాశము కలుగును? కావున నీప్రపంచమువలెనే దీనికిని ఆది లేదు. పూర్వకల్పమునందు జీవులచే నొనర్పఁబడి సుఖ దుఃఖముల కలిగింప సిద్ధముగా నున్నకర్మలయొక్క సాహాయ్యముచే నుత్తరకల్పమునందలిసృష్టి కలుగునట్లు పూర్వజన్మమునందలి భ్రాంతిచే నుత్తరజన్మమునందలి జీవత్వము కలుగుచుండును.

ఇంతమాత్రముచేఁ బరమేశ్వరునకు వికారములుఁ లేక పరతంత్ర త్వము సంభవింపదు. ఆయన సర్వకర్త యగుటచే నీయవిద్య కూడ నొకసాధనమే యగును. సాధనములు కర్తలయొక్క స్వాతంత్ర్యమును భంగము చేయలేవు. ఒక గొడ్డలిని చేతఁబూని వృక్షములఁ నఱుకు పురు షునియొక్క స్వాతంత్ర్యము నాగొడ్డలి చెఱుపఁగలుగునా? ఆపురుషుని యిచ్ఛ నాశ్రయించి యాగొడ్డలి ప్రవర్తించును కాని, యాగొడ్డలి యిచ్ఛ నాశ్రయించి పురుషుఁడు ప్రవర్తింపఁడు కదా! కావున నేది యెట్లయినను పరమేశ్వరుఁడు స్వతంత్రుఁడే.

కావున నీకల్పితభేదము నాశ్రయించి సర్వవ్యవహారములును ప్రవర్తింపవచ్చును. ఎవ్వ రెట్లన్నను ఆకాశమునకు వాస్తవవిభాగము లేనట్లు పరమేశ్వరునకుఁ గూడ నెవ్వ రెట్లు వ్యవహరించినను పారమా ర్థికముగ భేదము కలుగదు. ఈవిషయము నెఱింగి "అహం బ్రహ్మాస్మి" అనుజ్ఞానము దృఢ మగునంతవఱకు భేదవ్యవహారము లన్నియు నుండ వచ్చును. పిదప నన్నియు తమంతనే యడఁగిపోవును.

## అ ౧. పా ౨. సూ ౭. ఆరంభము.

అవతారిక:—"ఎంత చెప్పినను ఈప్రకరణమున వర్ణింపఁబడిన వాఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు. ఆశాండిల్యవిద్యయందు "ఏషమ ఆత్మాంత ర్హృదయే ఽ ణీయాన్ వ్రీహే ర్వా యవా ద్వా సర్షపా ద్వా" "ఈనాయాత్మ హృదయమున నున్నాఁడు. వడ్లగింజకంటెను యవబీజమునకంటెను ఆవగింజకంటెను సూక్ష్మముగా నున్నాఁడు." అని చెప్పఁబడి యున్నది. ఇట్టియల్ప మగుస్థానంబును రూపంబును జీవునకు తగియుండును; కాని సర్వవ్యాపకుఁ డగు పరమేశ్వరునకు తగియుండదు.

" 'జ్యాయాన్ పృథివ్యాః' అని కూడ నున్నది కదా అనియెద వేమో; అదియు సరి కానేరదు. మొట్టమొదట నున్నది యగుటచే సూక్ష్మరూపమే యిందు వర్ణింపఁబడినయుపాస్యదేవతకు చెప్పఁబడె

వనియు, వెనుక నున్న మహద్రూపము ఔపచారికముగాఁ జెప్పఁబడిన దనియు సుఖముగ నిర్ణయింపవచ్చును. ఇచ్చటి యుపాస్య దేవత జీవుఁడే. ఆతనికి సూక్ష్మరూపము స్వాభావికము. మహద్రూపము పరబ్రహ్మైక్యము వలన సంభవించినది" అనిన నది సరికాదని నిరాకరించుచున్నాఁడు—

## ౭. అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ ౧. ౨. ౭.

తాత్పర్యము:— ఉపాస్య దేవత యత్యల్పమైన హృదయస్థాన మందు కల దనియు, అది యణుస్వరూపమైనది యనియు చెప్పఁబడినంత మాత్రమున దోష మేమియు రాదు. "జ్యాయాన్ పృథివ్యాః" అను నుత్తరవాక్యము ఆయుపాస్య దేవతకే మహద్రూపము చెప్పుచున్నది. అణురూపమే స్వాభావిక మైనయెడల నెట్లును మహద్రూపమును చెప్పుటకు వీలు లేదు. జీవుఁడు భ్రాంతికల్పితుఁ డగుటచే నాజీవధర్మము నధిష్ఠాన మగుబ్రహ్మమునకు కలుగునుగాని బ్రహ్మధర్మములు మాత్రము ఆరోపితుఁ డగుజీవునకు కలుగనేర వని నిర్ణయించి యున్నాము. కావున బ్రహ్మమునకు కల మహద్రూపముతో జీవుఁడు రూపవంతుఁడు (మహద్రూపముకలవాఁడు) కానేరఁడు. ఇఁక పరమేశ్వరునిగూర్చి యన్ననో యీయన సర్వవ్యాపకుఁ డగుటచే నెట్లయినను జెప్పవచ్చును. సర్వభూమికి నధిపతి యగుశ్రీరామునిగూర్చి "ఈయన కోసలాధిపతి, అయోధ్యాతిపతి" యని చెప్పుట యనుభవసిద్ధము. రాము నొక్కనిఁగూర్చియే యన నేల? ప్రతిప్రభువునుగూర్చియు సందర్భానుసారముగా నిట్లు చెప్పవచ్చును. ప్రకృతము పరమేశ్వరుని గూర్చియు నిట్లే చెప్పఁబడెను.

"వైకుంఠవాసుఁ డగుహరిని సాలగ్రామమునందు భావించి యుపాసనచేయు" మనువిధంబున నిచ్చటఁగూడఁ "బరమేశ్వరుని అణురూపము మొదలగుధర్మములు కలవానినిగాను హృదయస్థానమున నున్నవానినిగాను భావించి యుపాసింపవలయు" నని చెప్పఁబడియున్నది. సర్వవ్యాపకుఁ డగువాఁడు హృదయమున మాత్రము లేకపోవునా? మఱియు విష్ణుభావనచేఁ చేయఁబడుసాలగ్రామోపాసన ఫలము నొసంగినట్లే యీయుపాసనయు ఫలము నొసంగఁగలదు.

ఆకాశ మనఁగా నితరభూతములకు నాశ్రయము నొసంగు స్థలము. మనము "సందు, రంధ్రము, ఎడము" అని వ్యవహరించుట ఆయాకాశమునుగూర్చియే. అది సర్వవ్యాపక మనుట నిస్సంశయము. ఇట్లున్నను "సూదిరంధ్రము = సూదిలో నున్న యాకాశము, మిగుల చిన్నది. ఘటరంధ్రము = ఘటములో నున్నయాకాశము, దానికంటెఁ బెద్దది" అను వ్యవహారములు పెక్కులు కలవు. వానివలన నాకాశమునకు నెట్టిస్వరూపహానియు లేదు. ఇట్లే యుపాసనార్థమై సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరుని "హృదయమున నున్నాఁడు" అని చెప్పినంతమాత్రమున నమ్మహాత్మునియథార్థస్వరూపమున కెట్టిహానియు కలుగదు.

పూర్వపక్షము:—ఇట్లయిన మఱియొక దోషము వచ్చును. ప్రతిశరీరమునకును ప్రత్యేకముగా నొక్కొక్కహృదయము కలదు. కావున దాని నాశ్రయించి యున్న పరమేశ్వరుండును ప్రత్యేకముగ నుండవలయును. ఏకరూపుఁడై యుండుటకు వీలు లేదు. ఇట్లయిన నాశరీరముతో కూడ నాయనకును నాశము సంభవించును. ఇది యిష్టము కాదుకదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్పరాదు. పైవ్యాఖ్యానము వలననే దీనికిని సమాధానము వచ్చినది. కొంచెము విచారింపుము. ఎన్నిఘటముల నాశ్రయించి "ఈఘటాకాశము ఈఘటాకాశమునకంటె వేఱు" అని వ్యవహరించినను, ఆకాశము పరస్పరభిన్న మగునా? తనయేకరూపమును విడచునా? ఘటనాశముతోఁ గూడ నాశము నొందునా? ఇట్లే పరమేశ్వరుఁడును దేహభేదము నాశ్రయించి యట్లు వ్యవహరింపఁబడినను తన యేకరూపమును విడువఁడు; వినాశమును కూడ నొందఁడు.

## అ ౧. పా ౨. సూ ౨. ఆరంభము.

అవతారిక:— "ఇప్పటికిని దోషము సంపూర్ణముగ పోలేదు. పరమేశ్వరుఁడు ఏకరూపుఁడే యైనను సర్వజంతువుల హృదయములతో సంబంధించి యున్నాఁడు. ఆయనకంటె నితరుఁడై జీవుఁడనునొక్కఁడు బొత్తిగనే లేఁడు. ఒక్కొకనికిని సుఖదుఃఖానుభవముకల దనుటయు ప్రత్యక్షసిద్ధమే. ఇట్లగుటచే నీసుఖదుఃఖానుభవము పరమేశ్వరునకే కలుగవలయును" అనిన నట్లు కాదని చెప్పుచున్నాఁడు—

## ౩౯. సంభోగప్రాప్తి రితి చేన్న *వైశేష్యాత్.

౧. ౨. ౮

తాత్పర్యము:— పరమేశ్వరునకు సుఖదుఃఖభోగములతో సంబంధ మెట్లును కలుగదు. శరీరమునందుమాత్రమే యుండువాఁడు జీవుఁడు; సర్వశరీరవ్యాపి పరమేశ్వరుఁడు. సర్వకార్యముల నాచరించువాఁడుకావున దాని ఫలముల ననుభవించు వాఁడును జీవుఁడే కాని పరమేశ్వరుఁడు కానేరఁడు. ఆయన సర్వపాపరహితుఁడు, నిష్కలుఁడు, నిరంజనుఁడు, నిత్యముక్తుఁడు కదా! ఈభేదమువలన జీవునకు గలసుఖదుఃఖసంబంధము పరమేశ్వరునకు లేదు.

పూర్వపక్షము:— ఇట్లుచెప్పుట సరికాదు. ఒకపక్షమున నప్పరమేశ్వరుఁడు జీవునితోఁ గలసియే యున్నాఁడు; రెండవపక్షమున నాయనకంటె భిన్నుడగుజీవుఁడే లేఁడు. "తత్త్వమసి" "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను మొదలగుశ్రుతులీవిషయమును స్పష్టము చేయుచున్నవి. ఇట్లగుటచే ప్రపంచమున ననుభవమున నున్నసుఖదుఃఖములు ఎట్లయినను పరమేశ్వరునకే కలిగి తీరవలయును.

సిద్ధాంతము:— ఈపక్షము లెవ్వియు సరికావు. పరమేశ్వరుఁడు ఆకాశముతో సమానుఁడు; ఆకారము లేనివాఁడు. ఇట్టివానికి జీవునితో సంబంధ మున్నంతమాత్రమున వాని సుఖదుఃఖములతో సంస్పర్శము కలుగ నక్కఱలేదు. ఆకాశము సర్వపదార్థములతోను కలసియేయున్నను వానియందు కలుగుమంట చల్లదనము మొదలగునవి దానితో సంబంధపడ వనుట ప్రత్యక్షసిద్ధము కదా! ఒకవస్తువును కాల్చినను దాని నంటియున్న యాకాశము కాలదు. తడిపినను తడియదు కదా!

---

*ఇచ్చట 'విశేషాత్' అని యుండినఁ జాలును. "జీవబ్రహ్మములకు భేదముండుటచే నవిద్యాకల్పితము లగు సుఖాదిభోగములు పరమేశ్వరు నంటవు" అను నర్థమంతమాత్రమువలనను వచ్చును. అయినను అత్యంతభేదమును చూపుటకై సూత్రకారుఁడు వైశేష్యపదమును ప్రయోగించి యున్నాఁడు. "జీవుఁడును భోగములును అవిద్యాకల్పితములే. ఇట్లుండు నా యవిద్యతోఁ గాని తత్సంస్కారముతోఁ గాని యించుకయైనను సంబంధము లేని పరమాత్మను నాభోగము లెట్లు కలుగును? బొత్తిగను కలుగవు. అట్టి సంశయమునకే యవకాశము లేదు" అని యీ మహాత్ముని యభిప్రాయమును.

ఇఁక రెండవపక్షము కూడ యుక్తము కాదు. నీవు వేదమును మాత్రమే యనుసరింతువా ? లేక, యుక్తి నాశ్రయింతువా ? లేక, రెంటినిఁ గూడ నవలంబింతువా? మొట్టమొదట చెప్పుము.

వేదమును మాత్రమే యాశ్రయింతువేని, యప్పుడు ఈయాక్షేపమును చేయుటకే యవకాశము లేదు. వేదము "తత్త్వమసి" అను మొదలగువాక్యములచే "జీవునకుఁ గూడ సుఖదుఃఖభోగములు లేవు. ఆతఁడునుపరమేశ్వరుఁడే" అని చెప్పుచున్నది. ఇట్లుండ కేవలవేదప్రామాణ్యము నాశ్రయించిన "జీవునకుఁ గలసుఖదుఃఖభోగములు తదభిన్నుఁడగు పరమేశ్వరునకుఁ గలవు" అనుసిద్ధాంత మెటనుండివచ్చును?

"జీవబ్రహ్మము లొక్కటియే"యని వేదము చెప్పుచున్నది. కావున "సుఖదుఃఖభోగములుఁకూడ పరమేశ్వరునకుఁ గలవు" అని కూడ చెప్పినదియే యగుచున్నది. కావున సర్వవాక్యములకుఁ దదనుగుణముగానే యర్థము చెప్పవలయును" అనియెదవేమో; అది సరి కాదు. "తత్త్వమసి" అనుమొదలగువాక్యములయర్థము ఉపక్రమాదిలింగముల ననుసరించి సిద్ధాంతము చేయఁబడియున్నది. దాని మఱియొకవిధముగాఁ ద్రిప్పుటకు నవకాశము లేదు. భేదమును గూర్చి చెప్పుశ్రుతులుఁను వ్యవహారము ననుసరించునవియేకాని పరమార్థమును చెప్పునవి కావు. ఇట్లుండ భ్రాంతివశమున జీవునకుతోఁచుసుఖదుఃఖములు పరమార్థరూపుఁడగుపరమేశ్వరునకు నెట్లు కలుగును ? వేదము ఇట్టిదాని నేలచెప్పవలయును ? కావున కేవలవేదము ననుసరింతువేని వేదతాత్పర్య నిర్ణయానుసారముగ సర్వము నంగీకరింపవలయును. నడుమ క్రొత్తవిషయమును చేర్చుటకు నవకాశము కలుగదు.

ఇట్లు కాక యుక్తి నాశ్రయింతువేని, జీవపరమేశ్వరులఁ బరస్పరభిన్నులుగ నైనను కల్పితభేదము కలవారిగ నైనను చెప్పుదువేని, యప్పుడు నీపక్షము నిలువదు. ఏవిధముగ నైనను సరియే; భేద మనునది కలుగునేని యొకదాని ధర్మముతో రెండవది సంబంధింపదు. త్రాటినిచూచి భ్రాంతిచే సర్ప మని తలంచిన నప్పు డారజ్జుసర్పములకుఁ గలది కల్పితభేదమే. అయినను "ఇదిసర్పము" అనుతలంపు ఉన్నంతవఱకు మాత్రమే దానికి భయంకరత్వ మనుగుణ ముండును గాని పిదప నుండదు. ఇచ్చట సర్పమునకుఁ గలభయంకరత్వగుణముతో త్రాటికి

సంబంధము లేదు కదా! ఇట్లే జీవునకుఁ గలసుఖదుఃఖభోగములతోఁ బరమేశ్వరునకు సంబంధ ముండ నక్కఱ లేదు.

"ఇంతకు ముం దొకమాఱు ఆరోపితపదార్థముయొక్క గుణములు అధిష్ఠానమునకు కలుగును అని చెప్పియుంటిరి కదా!" అందు వేమొ, వినుము. దానికిని దీనికిని విరోధము లేదు. అచ్చట వ్యవహారము ననుసరించి యట్లు చెప్పఁబడెను. వ్యవహారసిద్ధమగు భేదమును భ్రాంతికల్పితమునుగా నెఱుంగక "భేదము బొత్తిగనే లేదు" అని ప్రత్యక్షవిరుద్ధముగ వాదించువానిని గూర్చి యట్లు చెప్పఁబడెను. "లోకమున తెలియఁబడుచున్నవాఁడు పరమేశ్వరుఁడు కాఁడు; జీవుఁడే" అనువిషయమును నిరూపించుటకై యట్లు చెప్పఁబడెను. "భ్రాంతిచే జీవునకుఁ గలధర్మముల పరమేశ్వరునియందు ఆరోపించి లోకులు జీవభిన్నము (అనఁగా: జీవధర్మ సంస్పర్శము లేనిది) అగుపరమార్థరూపమును చూడ లేకున్నారు" అనునభిప్రాయమున నట్లు చెప్పఁబడినది. వ్యావహారిక భేదము ననువాదము చేయుశాస్త్రములకును వేదవాక్యములకును సార్థకత్వము కల్పింపఁబడినది. ప్రస్తుతస్థల మట్టిది కాదు. ఇచ్చటవాది పరమార్థవిషయమై ప్రశ్న చేయుచున్నాఁడు. "వ్యావహారిక భేదమువలన వచ్చినసుఖదుఃఖములు పారమార్థికాభేదము కలపరమేశ్వరునకుఁ గూడఁ గలుగవలయును" అని విషయనిర్ణయము చేయ లేక సంశయించుచున్నాఁడు. "అజ్ఞానదృష్టిచే భేదము కలుగుచున్నది. భేద మున్నప్పుడే సుఖదుఃఖములు జీవునకు వచ్చుచున్నవి. జీవబ్రహ్మైక్యజ్ఞానము అజ్ఞాననాశమువలనఁ గాని కలుగదు. అప్పుడు జీవేశ్వరభేదము కాని సుఖదుఃఖములు కాని బొత్తిగనే లేవు. ఇఁక పరమేశ్వరునకు సుఖదుఃఖసంబంధ మెట్లు వచ్చును?" అనుయథార్థవిషయము నెఱుంగ లేకున్నాఁడు. ఇట్టివానిని గూర్చి పరమార్థ ముపదేశింపఁబడినది. "జీవత్వము భ్రాంతికల్పితమే కావున నప్పుడు కలధర్మము లెవ్వియుఁ బరమేశ్వరునకు సంభవింపవు" అనుపరమార్థవిషయము నిరూపింపఁబడినది. కావున పూర్వము చెప్పఁబడినది వ్యావహారికవిషయము. ఇప్పటిది పారమార్థికవిషయము. కావున నిందు విరోధము లేదు. మూఁడవపక్షము నాశ్రయించినను సిద్ధాంత మిదియే; కావున నెట్లు చూచినను శాండిల్యవిద్యయందు చెప్పఁబడినవాఁడు జీవుఁడు కా నేరఁడు.

## ౨. అత్త్రధికరణము.

సంగతి :—పై యధికరణమున నంతమునందు పరమాత్మకు ననుభవము (సుఖదుఃఖానుభవము) లే దని చెప్పఁబడి యున్నది. ఆసిద్ధాంతము ననుసరించి "పరమాత్మకు ఏవిషయమునందును కర్తృత్వము కూడ లేదు" అను పూర్వపక్షముతో ఈయధికరణమారంభింపంబడినది. ఇందలి పూర్వపక్షము పైసిద్ధాంతమునకు దృష్టాంతముగ వచ్చెను. కావున నీరెం డధికరణములకును కలసంబంధము దృష్టాంతసంబంధము.

విషయము:—కఠోపనిషత్తున రెండవవల్లియందు "యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః, మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః" "ఎవ్వనికి సర్వలోకస్థితికారణము లగు బ్రహ్మ క్షత్రియకులములు ఆహారపదార్థమో, సర్వలోకముల సంహరింపఁగల మృత్యుదేవత ఊరుగాయయో అట్టివాని స్వరూపము నెవ్వఁ డెఱుంగఁగలఁడు" అను వాక్యమొక్కటి కలదు. దానియర్థమీయధికరణమున పరిష్కరింపఁబడును.

సందేహము:—పై వాక్యమున "అన్నము ఊరుగాయ" అని చెప్పఁబడి యుండుటవలన భుజించువాఁడొక డుద్దేశింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. వీఁడు అగ్నియా?, జీవుఁడా?, లేక, పరమాత్మయా? యని సంశయము. ఆయుపనిషత్తునందు అగ్ని జీవపరమేశ్వరులను గూర్చినప్రశ్న ముండుటయు పై వాక్యమున నెవ్వనిగూర్చి చెప్పఁబడినదియు తెలియకుండుటయు నిచ్చట సంశయకారణములు.

ఇందు "పై వాక్యము అగ్నినిగూర్చి కాని జీవునిగూర్చి కాని చెప్పును. బ్రహ్మమును గూర్చియే చెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఇది యుపాసనాప్రకరణము కాదు. కావున బూర్వపక్షమునకు నుపాసనయు సిద్ధాంతమునకు జ్ఞానంబును ఫలములు.

ఈపక్షముల నాశ్రయించి యిట్లు సంశయ ముదయించును:—

పై వాక్యమున "అత్తా = భుజించువాఁడు" అని చెప్పఁబడియున్నది. భుజించుట యనఁగా అనుభవించుట కాని సంహరించుట కాని యగును. ఇందు పరమాత్మునికి సుఖదుఃఖానుభవము లేదు. ఈ విషయము పైయధికరణమున నిర్ణయింపఁ బడియున్నది. శ్రుతియందును

"అనశ్న న్ననో్య అభిచాకశీతి" "రెండవవాఁడు (పరమేశ్వరుఁడు) దేనిని భుజింపక యూరకుండును" అను వాక్యముచేఁ బై విషయమే దృఢపఱుపం బడియున్నది. మఱియు బ్రహ్మక్షత్రియకులములు జీవునకు భోగస్థానములు (వానియందు నివసించి జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించును) గాని, భోగసాధనములు (వానిమూలమున జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించు ననుట) కాని యగుచున్నవి. కావున "బ్రహ్మక్షత్రియకులముల జీవుఁ డనుభవించుచున్నాఁడు" అని నిర్వివాదముగఁ జెప్పవచ్చును. "ఏక స్తయోః పిప్పలం స్వా ద్వత్తి" "ఆజీవేశ్వరులలో నొక్కఁడగు జీవుఁడు మధురమగు నాసంసారవృక్షముయొక్క ఫలమును భక్షించుచున్నాఁడు" అని శ్రుతియు జీవునకు ఫలభోగమును నిర్ణయించుచున్నది.

ఇఁక ఆ 'అత్తృ' శబ్దమునకు సంహారకత్వమే యర్థ మైనను అది పరమాత్మునికి సంభవింపదు. పరమాత్ముఁడు స్వయముగ నేకార్యము నాచరించువాఁడు కాఁడు. "అగ్ని రన్నాదః" "అగ్నిహోత్రుఁడే సర్వభక్షకుఁడును" అని శ్రుతియు సర్వసంహారకత్వము నగ్నికే కల దనుచున్నది. కావున నెట్లు చూచినను ప్రస్తుతవాక్యమున చెప్పఁబడినవాఁడు జీవుఁడో, అగ్నియో కానలయును గాని పరమేశ్వరుఁడు మాత్రము కానేరఁడు. ఆయుపనిషత్తునందు ఈముప్పురినిగూర్చియుఁ బ్రశ్నము కలదు కదా?

అవతారిక:—అను నీ సంశయమును నిరాకరించుచున్నాఁడు.—

## ౪౦. అత్తా చరాచరగ్రహణాత్. ౧. ౨. ౯

తాత్పర్యము:—పై వాక్యమున వర్ణింపఁబడిన పురుషుఁడు పరమేశ్వరుఁడే. ఈవాక్యమున వర్ణింపఁబడినది సర్వసంహారమే; కాని సర్వానుభవము కాదు. ఇచ్చట ఓదనశబ్దము ప్రత్యక్షముగా భోగ్యపదార్థమును చెప్పుటలేదు. ఇఁక నట్టియర్థమును తెచ్చికొనుటకు * లక్షణావృత్తినంగీకరింపవలయును. అప్పటికిని మృత్యుదేవతను కూర్చి చెప్పినది సరిపడదు. కావున నిచ్చటి యర్థము సంహారకత్వమే. లక్షణావృత్తి నాశ్రయించి స్వేచ్ఛానుసారముగఁ గల్పింపఁబడిన యర్థము నాశ్రయించి వేదమంత్రార్థమునకు నిరర్థకముగ సంకోచమును కల్పించుట యుక్తము కాదు.

---

* లక్షణావృత్తి. (చూ పుట ౧౧౧.)

ఈమంత్రము కేవలము బ్రహ్మక్షత్రియులను కూర్చి మాత్రమే చెప్పునది కాదు. "మృత్యుర్యస్యోపసేచనం" అనుటవలన "సర్వప్రపంచము ఆహారపదార్థమే" అని చెప్పునదియే. ఇట్లగుటచే సర్వసంహారకత్వము పరమేశ్వరునికే సంభవించునుగాని అగ్నికైనను జీవునకైనను సంభవింపదు. మఱియు "అనశ్నన్" అనుశ్రుతి పరమాత్మునకు సుఖదుఃఖభోగము లేదనుచున్నది; గాని సంహారకత్వము లేదనుట లేదు. ఉపనిషత్తులయందంతటను "పరమేశ్వరుఁడే ప్రపంచసృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడు" అనువిషయము ఉద్ఘోషింపఁబడుచునే యున్నది కదా! కావున నెట్లు చూచినను ఈవాక్యమున చెప్పఁబడినవాఁడు సంహారకుఁడే; పరమేశ్వరుఁడే.

బ్రహ్మక్షత్రియకులములు,—ఇవియే యననేల? సర్వప్రపంచంబును జీవునకు భోగస్థానముగాను భోగసాధనముగాను ఉన్నదనుట సత్యమే యగును;గాని అంతమాత్రము వలననే అది భోగ్య మనుటకు వీలులేదు. భోగస్థాన మనఁగా: సుఖదుఃఖముల ననుభవించు నప్పుడు ఆశ్రయింపఁబడు స్థలమే; భోగసాధన మనఁగా: ఆసుఖదుఃఖముల సంపాదించు నుపాయమే. కావున నివి రెండును భోగ్యములు (అనుభవింపఁదగినవి) కానేరవు. ఔపచారికముగ నొక్కొకచో నట్లు చెప్పినను ప్రయోజనము లేదు గదా! ఇఁక సర్వసంహారకత్వ మనిన నది జీవునకు బొత్తిగనే సంభవింపదు. ఏవియో యొక కొన్ని వ్యాఘ్రాదిజంతువులు మాత్రము కొన్నిజంతువుల హింసించును, భక్షించును.ఇంతమాత్రమువలన "జీవునకు ప్రపంచము భక్ష్యము" అని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. "ఒక్కొకఁడును తనకు తగినంతవఱకు హింస (సంహారము) నాచరించుచునేయున్నాఁడు కదా!" అనియెదవేమొ, యట్లు చెప్పినను సర్వసంహారకుఁడు, విశేషించి మృత్యుసంహారకుఁడు కానేరఁడు కదా! కావున నెట్లు చూచినను ఈవాక్యమున చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

పూర్వపక్షము.—అయినను ఈయధికరణమున విచారింపఁబడు వాక్యమిదియే యని నిర్ణయించుటకు వీలు లేదు. ఇందు బ్రహ్మక్షత్రియకులములను గూర్చి మాత్రమే చెప్పఁబడియుండ "చరాచరాత్మకమగుప్రపంచమే చెప్పఁబడెను" అని నిర్ణయించి యుదాహరింపఁబడుట

దోషము కదా ! విచారమువలన సిద్ధాంతము కావలసిన యర్థమును ముందుగనే నుపన్యసించుట సరి కాదు కదా ?

సిద్ధాంతము:—ఇది యొకదోషము కాదు. మృత్యు ర్య స్యోప సేచనం"అని సర్వనాశక మగుమృత్యువు నూరుఁగాయఁగాఁ జెప్పుటవలనఁ బ్రపంచ మంతయు బ్రహ్మక్షత్రపదప్రయోగముచే నుద్దేశింపఁబడె నని స్పష్ట మగుచునే యున్నది. కావున నీయధికరణమున విచారింపఁబడు వాక్య మిదియే;ఇఁక బ్రహ్మక్షత్రియులు సర్వప్రపంచమునకును ప్రధానులు కావున, నారెండు పదములు మాత్రమే ప్రయోగింపఁబడినవి యని తెలిసికొన వలయును.

పైఁ జూపిన హేతువులే కాక "క ఇద్ధా వేద యత్ర సః" అను వాక్యభాగముచే అగమ్యత్వము (తెలియఁబడకుండుట) అను మఱియొక హేతువుకూడ చెప్పఁబడియున్నది. ఇదియు సర్వప్రసిద్ధుఁ డగుటచే జీవుని యందు సంభవింపదు. కావున నెట్లు చూచినను ఇచ్చటను వర్ణింపఁబడిన వాఁడు పరమేశ్వరుఁడే.

## ౪౧. ప్రకరణాచ్చ. ౧. ౨. ౧౦.

తాత్పర్యము:—మఱియు నిది బ్రహ్మమును వర్ణించుప్రకరణముగాఁ గూడ నున్నది. మొట్టమొదట నాచికేతుఁడు యమునిగూర్చి "అన్యత్ర ధర్మా దన్యత్రా ధర్మాత్ యత్తత్పశ్యసి తద్వద" "ధర్మాధర్మాదులకంటె నావలనున్నతత్వమును చెప్పుము." అని యడుగ నాతఁడు "సర్వే వేదా యత్పద మామనంతి.... ఏత ద్ధ్యే వాక్షరం బ్రహ్మ" "వేదముల న్నియు నేస్థానమును గూర్చి చెప్పును (దేనినుపదేశించును?)" [అనియా రంభించి]"ఇదియే నాశరహిత మగుబ్రహ్మము" అని స్పష్టముగ ప్రకరణ మారంభింపఁబడియున్నది. కావున నిందుఁ జెప్పఁబడినవాఁడు పరమే శ్వరుఁడే.

## ౩. గుహాధికరణము.

సంగతి:—పై యధికరణమున "సర్వంసంహారక మగుమృత్యు వును గూర్చి చెప్పఁబడియుండుటచే,సర్వభూతములను గూర్చియు చెప్పఁ బడెను." అని సిద్ధాంతముచేసియున్నారు. అట్లే కఠవల్లియందలి మఱి యొకవాక్యమునందు కూడ సిద్ధాంతము చేయవలసియున్నది. "ఋతం

పిబంతౌ" "అవశ్యభోక్తవ్యమగుకర్మఫలము ననుభవించుచు" అని యారంభించి, "వారు గుహాయందున్నారు" అనుమొదలగు విషయములు చెప్పఁబడియున్నవి. ఇచ్చట కూడ సాన్నిధ్యబలమువలన (గుహాప్రవేశము మొదలగునవి చెప్పఁబడియుండుటవలన) వారు (కర్మఫలము ననుభవించువారు) బుద్ధిజీవులే యని నిర్ణయింపవలసియున్నది" అనునాక్షేపము నవలంబించి యీయధికరణ మారంభింపఁ బడుచున్నది. ఈయాక్షేపమునకు దృష్టాంతమే మూలము కావున నీప్రస్తుతాధికరణమునకుఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము దృష్టాంతరూప మైనది యని తెలిసికొనవలయును.

విషయము:—కఠోపనిషత్తున "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే,ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః" "అవశ్యభోక్తవ్య మగుకర్మఫలము ననుభవించుచు సర్వోత్తమంబును పరతత్త్వమునకు నివాసంబు నగు హృదయమున నాకాశమనుగుహాయందు నిలిచి, నీడయు నెండయును వలె పరస్పరభిన్నస్వభావముతో నిరువురు కర్మగోచరులై యున్నారు. ఈవిషయమును బ్రహ్మవేత్తలును కర్మపరాయణులును నాచికేతాగ్నిని వేల్చినవారును కూడఁ జెప్పుదురు" అనువాక్య మొక్కటి కలదు. అది యీయధికరణమున విచారింపఁబడును.

సందేహము:—ఈయుపనిషత్తునకు నారంభమున "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతి చైకే, ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం వరాణా మేష వర స్తృతీయః" "మనుష్యుఁడు మృతిఁ జెందిన తర్వాత కొంతసంశయము సర్వలోకసాధారణమై యున్నది. కొందఱు దేహేంద్రియమనోబుద్ధులకంటె భిన్నుఁ డగునాత్మ యీదేహమును విడిచి రెండవదేహము నాశ్రయించు నని చెప్పుచున్నారు. మఱికొందఱు అట్టియాత్మయే లేఁ డనుచున్నారు. ఇందలి నిశ్చయమును నీయనుగ్రహమువలన తెలిసికొనఁ గోరుచున్నాను. ఇదియే * మూఁడవవరము" అని ప్రశ్నము కలదు. దానికి

* నాచికేతునివరములు:—నాచికేతుఁ డను మునిపుత్త్రుఁడు సంతతదానశీలుఁ డగుతనతండ్రిని జూచి యొకనాఁడు "అందఱకును కోరిన పదార్థముల నిచ్చుచున్నావు కదా! న న్నెవ్వనికి నీయఁదలంచితివి ?" అని యడిగెను. దానికిఁ బ్రత్యుత్తర మీయక

సమాధానముగ యముఁడు బుద్ధిజీవులను ప్రత్యేకముగ విభజింపవలసి యున్నది. మఱియు "అన్యత్ర ధర్మాత్" (చూ. సూ. ౧. ౨. ౧౦) అను ప్రశ్నమునకు సమాధానముగ జీవపరమేశ్వరులను గూడ విభజించి నిరూపింప వలసియున్నాఁడు. ఈప్రశ్నలే యిచ్చట సంశయ కారణములు.

"ఈవాక్యము బుద్ధిజీవులను కూర్చియే చెప్పును, జీవపరమాత్మ లను కూర్చియే చెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంత ములు. పూర్వపక్షమునకు బుద్ధిభిన్నజీవజ్ఞానము ఫలము. సిద్ధాంతమునకు నిర్గుణబ్రహ్మజ్ఞానము ఫలము.

ఈరెండుపక్షముల నాశ్రయించి యీక్రిందివిధముగఁ బూర్వ పక్ష ముదయించును:—

పూర్వపక్షము:—ఈవాక్యమున చెప్పఁబడినవారు బుద్ధిజీవులే యనవలయును. ఇచ్చట "కర్మఫలము ననుభవించువారు" అని చెప్పఁ బడియున్నది. పరమాత్మునకు నది సంభవింపదు. "అనశ్న న్నన్యో అభి చాకశీతి" (చూ. సూ. ౧. ౨. ౮) అని శ్రుతి ఈవిషయమును స్పష్టము చేయుచున్నది. ఇఁక బుద్ధి కన్ననో, అది కర్మఫలముల ననుభవించుటకు సాధనము. దానియందు ఔపచారికముగ కర్మఫలానుభవము కలదన వచ్చును. "నేఁడు నుంచి యెండుకట్టెయలు శీఘ్రముగ వంట చేసినవి. ఈగొడ్డలి, పదును గలది యగుటచే వృక్షమును బాగుగ నఱకును" అని యిట్టి వ్యవహారములు (సాధనమునందుఁ గర్తృత్వమును చెప్పు వ్యవహారములు)ఁ బెక్కులు లోకమునఁ గానవచ్చుచున్నవి. ఇట్లే భేద మునఁ గూడ సాధన మగుబుద్ధికి నౌపచారికముగఁ గర్తృత్వమును చెప్పవచ్చు ననుటలో సంశయము లేదు.

---

కొంతికాలము ఆముని గడపెను; కాని పుత్త్రుఁడు మఱింత నిర్బంధించుచు వచ్చుటచే తుదకు కోపించి "నిన్ను యమధర్మరాజున కిచ్చెదను" అనియెను. తపోవంతుఁ డగుటచే నాతని నోటనుండి యావాక్యము వెలువడఁగానే నాచికేతుఁడు మృతుఁడై యమపురముఁ జేరి పుణ్యాత్ముఁ డగుటచే యమునిచే మిగుల గౌరవింపఁబడెను. "నీకు వలసినవరముల నడుగు ము. ఇచ్చెదను" అని యభినందింపఁబడెను. "మూఁడువరములఁ గోరుకొనవచ్చును" అని చెప్పఁబడెను. అప్పుడు ఆనాచికేతుఁడును, తండ్రిమనస్సు రోషరహితమై శాంతి నొందవలయు ననియు, అగ్నివిద్యను తన కుపదేశింపవలయు ననియు, ఆత్మవిద్య నెఱిం గింపవలయు ననియు, మూఁడువరములఁ గోరుకొనియెను. ఆట్లే యమునిచే సర్వము ననుగ్రహింపఁబడెను. ఇదియే కఠోపనిషత్తునందలి కథాంశము.

మఱియు "వా రిరువురు పుణ్యలోకమున నున్నారు" అని చెప్పఁబడియున్నది. ఇది పరమాత్మకు సంభవింపదు. పరమాత్మ పుణ్యమునకుఁ గాని పాపమునకుఁ గాని లోఁబడువాఁడు కాఁడు "న కర్మణా వర్ధతే నో కనీయాన్" "ఆ పరమేశ్వరుఁడు పుణ్యకర్మలవలన నభివృద్ధి నొందఁడు. పాపకర్మలవలన క్షీణింపఁడు" అని శ్రుతి యీవిషయమును స్పష్టము చేయుచున్నది. బుద్ధి కన్ననో యిది ప్రత్యక్షసిద్ధము.

ఇదియును గాక, "గుహను ప్రవేశించి యున్నారు" అని చెప్పఁబడియున్నది. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డగుటచే నాగుహయందుఁ గూడ నుండును; గాని, క్రొత్తగా ప్రవేశించినవాఁడు కానేరఁడు. గుహాశబ్దమునకు శరీరమే యర్థ మనినను, హృదయమే యర్థ మనినను బుద్ధి కర్మానుసారముగ నందు ప్రవేశింపవచ్చును. జీవుఁ డట్లే ప్రవేశించె ననుట నిర్వివాదాంశమే కదా !

ఇది యంతయుఁ గాక, ఇచ్చట "వారిరువురు నీడవలెను ఎండవలెను ఉన్నారు" అని చెప్పఁబడియున్నది. ఇదియు పరమాత్మవిషయమున సంభవింపదు. ఇచ్చట నీడతోఁ బోల్పఁదగిన పదార్థ మేది కలదు? చీఁకటివలె జ్ఞానశూన్యమై యుండుపదార్థమే నీడతోఁ బోల్పఁదగి యుండును. జీవేశ్వరులలో నెవ్వఁడు నిట్టివాఁడు లేఁడు కదా! మఱియు నీప్రకరణమున జీవుని గూర్చి చెప్పఁబడినట్లు నిర్వివాదముగ స్పష్ట మగుచున్నది. వానిని ఎండతో మాత్రమే పోల్పవలయు ననుటయు విశదమైనది. కావున నిఁక నీడతోఁ బోల్పఁదగినది బుద్ధియే కావలయును. అది జడము కావున తమోరూప మయినది కదా ?

ఈకారణమువలన నెట్లు చూచినను ఈవాక్యమున వర్ణింపఁబడినవారు బుద్ధిజీవులే కాని జీవపరమాత్మలు కారు.

అవతారిక:—ఈసంశయమును క్రిందిసూత్రముతో నిరాకరించుచున్నాఁడు.

## ౪౨. గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్. ౧. ౨. ౧౧.

**తాత్పర్యము (సిద్ధాంతము).**—పై వాక్యమున వర్ణింపఁబడినవారు జీవపరమాత్మలే కాని బుద్ధిజీవులు కారు. పరమాత్మకు గుహాప్రవేశము

అనేకశ్రుతులయందు చెప్పఁబడియున్నది. "గుహాహితం" "గుహాయం దున్నవానిని" (కఠోపనిషత్తు) "యో వేద నిహితం గుహాయాం" (తైత్తిరీయోపనిషత్తు) "గుహాయం దున్నవాని నెవ్వఁ డెఱుంగునో" అను మొదలగు శ్రుతులు ఆవిషయమునే చెప్పుచున్నవి. ఆయన సర్వవ్యాపకుఁడే యైనను సుఖముగ తెలిసికొనుటకై యిట్లు చెప్పఁబడినది. బుద్ధికి గుహయందు ప్రత్యక్షప్రవేశము సంభవించినను దానిని గ్రహింప నవసరము లేదు. ఇతరకారణము లన్నియు నీవిషయమును నిషేధించుచుండ నిదియొక్కటి మాత్రము దీనిని సిద్ధాంతము చేయు ననుట యెట్లు సంభవించును? "ప్రసిద్ధార్థము సంభవించుచుండ లక్షణావృత్తి నేల యంగీకరింపవలయును? అది దోషము కదా!" అందు వేమొ వినుము. నిరర్థకముగ లక్షణావృత్తిని గ్రహించిన నట్లే యగును; కాని బహుప్రమాణములకు సార్థకత్వము కలిగించుటకై శిష్యోపయోగమునకై గ్రహింపఁబడిన నప్పుడు దోషము కానేరదు.

ఇఁక మానిర్ణయమునకుఁ బ్రమాణముల పరికింపుము:—

ఈవాక్యమున కర్మఫలభోగమునుగూర్చి చెప్పఁబడి యుండుటచే "జీవుని గూర్చి చెప్పఁబడెను" అనువిషయము స్పష్ట మగుచున్నది. భోక్త జీవుఁడే కదా! ఆతనితోఁ గూడ రెండవపదార్థ మొక్కటి వర్ణింపఁబడినది. అది చేతనమా? లేక, యచేతనమా? యని కొంచెము విచారింపవలసియున్నది. లోకమున సంఖ్యలఁ జెప్పునప్పుడు (అనఁగా: "అచ్చట రెండు పదార్థములు కలవు" అని చెప్పునపుడు), సామాన్యముగ నావ్యవహారము సమానజాతి కలపదార్థములఁ గూర్చియే ప్రవర్తించుచున్నది. "ఈయెద్దునకు జతను సంపాదింపవలయును" అనిన, "రెండవయెద్దును సంపాదింపవలయును" అనియే యర్థము కాని "రెండవదానిని దేనినైనను (అనఁగా: గుఱ్ఱము నైనను మనుష్యు నైనను) సంపాదింపవలయును" అనుట యర్థము కాదని స్పష్టముగ నెఱుంగుచున్నాము. ఈ న్యాయము ననుసరించి విచారించిన నిచ్చట చేతనుఁ డగుజీవునిఁగూర్చి చెప్పఁబడి యుండుట నిర్వివాద మగుటచే రెండవవాఁడు కూడ చేతనుఁడే కావలయు ననుట స్పష్ట మగుచున్నది. బుద్ధి యట్టిది కాదు కదా! ఈకారణమువలన రెండవవాఁడు స్వప్రకాశరూపుఁ డగుపరమాత్మయే యని సిద్ధాంత మేర్పడుచున్నది. "మఱి పరమాత్మకు కర్మాను

భవము మొదలగునవి లేవు కదా!" అనియెదవేమొ, అదియు నీసిద్ధాంతమునకు ప్రతిబంధకము కానేరదు * ఛత్త్రిన్యాయముచేఁ గర్మఫలానుభవము లేనిపరమేశ్వరుని గూడ నాయనుభవము కలజీవునితోఁ గలిపి చెప్పవచ్చును. కర్మలకు లోఁబడని పరమేశ్వరునిఁ గూడ వానికి లోఁబడుజీవునితోఁ గలిపి చెప్పవచ్చును. ఇంతమాత్రమువలన నీశ్వరరూపమునకు హాని యేమియు రాదు.

మఱియు ఛాయాతప దృష్టాంతములు కూడ నీవన్నట్లు ఈసిద్ధాంతమునకు హానిని కలిగింపలేవు. మొట్టమొదట నుపమానోపమేయములకు సంపూర్ణమగుపోలిక యవసరము లేదు. అట్లు సంభవింపను కూడ సంభవింపదు. "ఆకన్య చిలుకవలె నున్నది" యనిన చిలుకకును కన్యకును పరిపూర్ణముగ పోలిక కలుగునా? మనుష్యసన్నివేశమునకును పక్షిసన్నివేశమునకును కలభేదము తొలఁగిపోవునా? సామాన్యముగ మనోహరత్వ మనునొక్కధర్మమునందు మాత్రమే పోలిక యుండును. ఇట్లే ప్రస్తుతఛాయాతపదృష్టాంతములకును జీవపరమాత్మలకును గూడ సర్వధర్మములయందును పోలిక యక్కఱ లేదు. నీ వాశ్రయించిన ధర్మమును (తమోరూపధర్మమును) మాత్రమే మేము కూడ నాశ్రయింపవలయు ననునియమము కూడ లేదు. ఒకవేళ దానినే యాశ్రయించినను, జీవుఁడు అవిద్యాసహితుఁ డగుటచే నానీడతోఁ బోల్పఁ దగియే యున్నాఁడు. వాస్తవస్థితిలో మే మాధర్మము నాశ్రయింపము. "నీడ

---

* మార్గమున నడచుచున్న మనుష్యసమూహమును చూచినప్పుడు, అం దెక్కువసంఖ్య గలవారు ఏవస్తువును ధరించియుందురో ఆవస్తువు నవలంబించియే యాసమూహము నంతయును పేర్కొనట లోకమున నలవాటు. ఎక్కువసంఖ్య గలవారు గొడుగులను ధరించి యుందురేని "గొడుగులవారు పోవుచున్నారు" అని చెప్పుదురు; కఱ్ఱలను ధరించి యుందురేని "కఱ్ఱలవారు వచ్చుచున్నారు" అని పలుకుదురు. ఇట్లు తాము పేర్కొనుచున్న పదార్థములు కొందఱియొద్ద మాత్రమే యున్నను అందఱును (ఆపదార్థములు లేనివారిని గూడ) కలిపి చెప్పుటకే ఛత్త్రిన్యాయ మని పేరు. మఱియుఁ బేర్కొనఁబడు పదార్థములు సమూహములో నధికసంఖ్య గలవారియొద్ద నుండవలయు ననుటకాని, ఏవిధముగ నైనఁ బ్రాధాన్యము నొందవలయు ననుట గాని, తక్కినవారియొద్ద నితరపదార్థము లుండఁ గూడదనుట గాని నియమము కాదు. ఏది యెట్లయినను సంకల్పమే (దేనిని ప్రధానముగ నుద్దేశించిన నదియే) ప్రధానము.

కును ఎండకును సహవాస మున్నను పరస్పర భేద మెట్లున్నదో, అట్లే గుహానివాసు లగుజీవపరమాత్మలకుఁ గూడ సహవాస మున్నను పరస్పర భేదము కలదు" అని చెప్పుదుము. సహజభేద మనఃధర్మము నే యాశ్ర యింతుము. ఇందు యుక్తిహీన మగువాద మేది కలదు? కావున నెట్లు చూచినను ఈవాక్యమున చెప్పఁబడినవారు జీవపరమాత్మలే.

## ౪౩. విశేషణాచ్చ. ౧. ౨. ౧౨.

తాత్పర్యము:—ఇంతయేకాక మఱియొక హేతువు కూడఁ గలదు. ఉత్తరగ్రంథమునను పూర్వగ్రంథమునను జీవపరమాత్మలను గూర్చిన విశేషణములే కలవు కాని, జీవబుద్ధులను గూర్చినవి లేవు. "యేయం ప్రేతే...." అను మొదలగు శ్రుతియందు "దేహాదిభిన్నుఁడగుజీవుఁడు కలఁడా? లేఁడా?" అను ప్రశ్న మున్నను దానికి జీవబ్రహ్మాభేద ప్రతి పాదనముతోనే యుత్తరము వచ్చును కావున దానికై ప్రత్యేకప్రయత్న మక్కఱ లేదు.

ఆవిశేషణము లెవ్వి యనిన:—

"తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పురాణం, అధ్యాత్మయోగాభిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" "తెలిసికొనుటకు నశక్యుఁడైనట్టియు ప్రపంచమును ప్రవే శించినట్టియు బుద్ధియం దున్నట్టియు మిగుల సంకటమున (విషయము లను నిఱుకున) నున్నట్టియు అనాదియైనట్టియు స్వప్రకాశస్వరూపుని వేదాంతజ్ఞానముచే నెఱింగిన ధైర్యశాలి హర్షశోకముల నొందఁడు" అని పూర్వగ్రంథమునఁ జెప్పఁబడియున్నది. దీనిచే జీవపరమాత్మలను గూర్చి క్రమముగ తెలిసికొనువాఁడు, తెలిసికొనఁదగినవాఁడు అని చెప్పఁ బడియున్నది కదా! ఇఁక నుత్తరగ్రంథమునందును "ఆత్మానం రథినం విద్ధి" "జీవుఁడు రథికుఁడు" అని చెప్పి క్రమముగ నాతనికి మోక్షసం సారములను గూర్చి ప్రయాణమును చెప్పి, యంతమున "సో ఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదం" "ఆజీవుఁడు ఇంద్రియాదుల నిగ్రహించునేని పరబ్రహ్మరూప మగుస్థానమును చెందును." అని పర బ్రహ్మమును గంతవ్యప్రదేశమునుగా శ్రుతి చెప్పుచున్నది. ఇట్లుండ నివి బుద్ధికి నెట్లు సంబంధపడును? కావున నిచ్చట చెప్పఁబడినవారు జీవ

పరమాత్మలే. "అన్యత్ర ధర్మాత్" అనుమంత్రము మొదలు గ్రంథ మంతయు బ్రహ్మప్రకరణమే యనియుఁ బూర్వాధికరణమున నే నిరూపించియున్నాము కదా! మఱియు "బ్రహ్మవిదో వదంతి" (చూ. సూ. ౧. ౨. ౧౧) అని వక్తలను ప్రత్యేకముగా వీరు మాత్రమే ఈవిషయమును చెప్పఁగలరు అని కొందఱిని గూర్చి (బ్రహ్మవేత్తలను మాత్రమే యుద్దేశించి) మాత్రమే ప్రత్యేకముగాఁ జెప్పి యుండుటచేతఁ గూడఁ బై సిద్ధాంతమే దృఢ మగుచున్నది. బుద్ధి జీవులనుగూర్చి చెప్పుటకు బ్రహ్మవేత్త లక్కఱ లేదు. మీఁదుమిక్కిలి బ్రహ్మవేత్తలకు నాబుద్ధిజీవులు తోఁపనైనఁదోఁపవు కదా!

ఈన్యాయము ననుసరించియే మఱికొన్నిచోట్ల కూడ సిద్ధాంతము చేయవలయును. ముండకోపనిషత్తున "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్న న్నన్యో అభిచాకశీతి" "సమానస్వభావము కలిగి జతఁ బాయక యుండు గరుడపక్షులు ఒక్కవృక్షమునే యాశ్రయించియున్నవి. ఆపక్షులలో నొక్కటిమాత్రమే మధురమగు దానిఫలమును భుజించును. రెండవది యేమియుఁ దినక యూరక ప్రకాశించుచుండును." అను నొక వాక్యము కలదు. ఇచ్చట కూడ "ఈవాక్యమునఁ జెప్పఁబడినవి గరుడ పక్షులా? లేక, జీవబ్రహ్మములా?" అనుసంశయ ముదయించును. ఆయుపనిషత్తునందును, పూర్వాపరములయందు పరబ్రహ్మమును గూర్చియే చెప్పఁబడియున్నది. ముఖ్యముగ నుత్తరమంత్రమున "సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః, జుష్టం యదా పశ్య త్యన్య మీశ మస్య మహిమాన మితి వీతశోకః" "ఈవిధముగ సర్వకర్మ ఫలముల ననుభవించు జీవుఁడు పరమేశ్వరునితోఁ గూడి యొక వృక్షముననే (దేహముననే) యున్నను, దేహాత్మభావనచే సంసారమున మునిఁగి దీనుఁడై మాటిమాటికి భ్రాంతి నొందుచు దుఃఖించుచుండును. ఆతఁడు అనేకజన్మార్జితసుకృతపరిపాకమువలన వివేకము నార్జించి తన కంటె నుత్తముఁడగునీశ్వరుని తెలిసికొనునేని యప్పుడు దుఃఖరహితుఁ డగును." అని పరమేశ్వరుఁడు చూడఁదగినవాఁడు గాను, జీవుఁడు చూచువాఁడుగాను చెప్పఁబడియున్నది. ఈవిశేషణములను బట్టి చూచిన "ద్వాసుపర్ణా" అనుమంత్రమున చెప్పఁబడినవారు జీవపరమాత్మలే.

ప్రత్యక్షముగనే ఫలభోగము నాచరించువానిని గూర్చియు అట్టి యను భవము లేక కేవల స్వప్రకాశరూపుఁడై యున్నవానిని గూర్చియు ఆ మంత్రమున చెప్పఁబడియే యున్నది కదా! ఈరెండు గుఱుతులును ''ఇచ్చట చెప్పఁబడినవారు జీవపరమాత్మలే''యనువిషయమును సిద్ధాం తమును చేయుటకు చాలియున్నవి. కావున నీయధికరణమున నిర్ణయింపఁ బడిన న్యాయముచేతనే ప్రస్తుతముండకోపనిషద్వాక్యార్థమును గూడ నిర్ణయింపవచ్చును.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ''ద్వా సుపర్ణా'' అనువాక్యమునకు నర్థనిర్ధారణము చేయవలసిన పైన్యాయము సరి పడదు. పైంగిరహస్యబ్రాహ్మణమున మఱియొకవిధముగా వ్యాఖ్యానము చేయఁబడియున్నది. కర్మఫలము ననుభవించునది బుద్ధి యనియు అను భవింపక స్వప్రకాశుఁడై యుండువాఁడు జీవుఁ డనియుఁ జెప్పఁబడి యున్నది. మఱియు ''ఇచ్చట చెప్పఁబడినవారు జీవపరమాత్మలా?, లేక, గరుత్మంతులా?'' అను సంశయమునకుఁ గూడ నవకాశము లేదు. పై వ్యాఖ్యానము ననుసరించి చూచిన ఈమంత్రమున జీవభిన్నుఁ డగుపర మాత్మ మొట్టమొదట చెప్పఁబడియే యుండలేదు. జీవుఁడే స్వాభా వికము లగు పరమాత్మధర్మములతోఁ జెప్పఁబడెను. ''తత్త్వమసి'' ''క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి''అను మొదలగు శ్రుతిస్మృతులచే''జీవబ్రహ్మ ములకు భేదము లేదు'' అని స్పష్టము చేయఁబడియే యున్నది కదా! ఇది యునుగాక''ఈతత్త్వమును(''బుద్ధియే కర్మఫలముల ననుభవించును. నే ననుభవింపను'' అనుతత్త్వమును) తెలిసికొనిన జీవుఁడు మరల నజ్ఞానము నొందఁడు''అనియు నచ్చట చెప్పఁబడియున్నది. ''పిప్పలం స్వాద్వత్తి'' అనువాక్యభాగముచేతనే, మీాపక్షమున జీవుఁడు చెప్పఁబడియున్నాఁడు. మాపక్షమున బుద్ధి చెప్పఁబడియున్నది.ఇందు మీాపక్షము నే యాశ్రయిం చిన''నేను కర్మఫలముల ననుభవించువాఁడను. పరమేశ్వరుఁ డట్టివాఁడు కాఁడు'' అనుజ్ఞానమువలననే జీవునకు నవిద్యానాశము కలుగవలసి వచ్చును. ఇది సంభవింపదు కదా! కావున నెట్లు చూచినను ''ద్వా సుపర్ణా '' అనుమంత్రమున చెప్పఁబడినవారు బుద్ధిజీవులే యని సిద్ధాంత మగుచున్నది. ఇది యంతయు నట్లుండ ''బుద్ధియే సుఖదుఃఖానుభవము చేయును'' అనిన నచేతనమునకు నట్టిసామర్థ్య మెటనుండి వచ్చు నను

సంశయము మాత్రము నివర్తింపకున్నది. ఎట్లయినను ఈసిద్ధాంతము మీసిద్ధాంతమునకంటె మేలే యని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

సిద్ధాంతము.—ఇట్లు చెప్పుట సరి కాదు. వినుము. నీవు చూచిన వ్యాఖ్యానమునకును మాసిద్ధాంతమునకును విరోధమే లేదు. "అచేతన మగు బుద్ధి సర్వకర్మఫలముల ననుభవించును" అని చెప్పుట లోకశాస్త్రములకు విరుద్ధము; కావున దానియందు (దానిని చెప్పుటయందు) శ్రుతికి తాత్పర్య ముండు ననుట సంభవింపదు. ఇఁక నిందలిరహస్య మేది యనిన:—జీవునకుఁ గాని పరమాత్మునికిఁ గాని వాస్తవముగ కర్మ ఫలభోగము లేదు. జీవబ్రహ్మము లొక్కటియే కదా! బ్రహ్మము భోగము లతో సంబంధము లేనిదై యుండ, జీవునకు మాత్ర మట్టిసంబంధ మెటనుండి వచ్చును? "యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్ తత్కేన కం పశ్యేత్?" "సర్వము బ్రహ్మమే యై యుండ నెవ్వఁ డేసాధనముచే దేనిని చూచును?" అని శ్రుతి యీవిషయమునే స్పష్టము చేయుచున్నది. కావున కర్మఫలానుభవము నొనర్చునది యాత్మప్రతిబింబసహిత యగుబుద్ధియే. అవిద్యాప్రభావమువలన నాబుద్ధి చేతనప్రతిబింబముతో కూడి స్వయముగ చేతనయైనట్లు ప్రవర్తించుచున్నది. "ద్వా సుపర్ణా" అనువాక్యంబును ఇట్టిబుద్ధిని గూర్చియే చెప్పుచు, "జీవునకు పరమార్థ స్థితిలో నెట్టిభోగములతో కూడ సంబంధము లేదు" అనువిషయ మును నిరూపించుచున్నది. పైంగిరహస్యబ్రాహ్మణముకూడ నీవిషయ మునే చెప్పుచున్నది. బుద్ధియందు భోక్తృత్వము నారోపించుచు న్నది. శ్రుతియు "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" "రెండుగా నున్నట్లు తోఁచుసమయమున నొక్కఁడు మఱియొక్కని చూచును" అని చెప్పుచు నీవిషయమునే దృఢము చేయుచున్నది. "రెండవది యున్నట్లు" అనుటచే "రెండవపదార్థము కానవచ్చుట యెల్ల భ్రాంతియే" అని స్పష్ట మగుచున్నది కదా! కావున పైంగిరహస్య బ్రాహ్మణమున చెప్పఁబడినబుద్ధికిని మాజీవునకును భేదమే లేదు.

పూర్వపక్షము:—సరియే! మొట్టమొదట నీగుహాధికరణము నిలిచిన కదా ఇది యంతయు సంభవించుట! ఆయధికరణమునఁ జూపఁ బడినసంశయమే యుక్తము కాదు. "ఋతం పిబంతౌ" అనుమంత్రమున చెప్పఁబడినవారు బుద్ధిజీవులా? లేక, జీవపరమాత్మలా?" అని కదా సంశ

యించితిరి. ఈ రెండుపక్షములును సరి కావు. ఆమంత్రమున కర్మఫలానుభవము చెప్పఁబడియున్నది. అది యొక్క జీవునకు మాత్రమే సంభవించును కాని యన్యులకు సంభవింపదు. బుద్ధి యచేతనము; పరమేశ్వరుఁడు చేతనుఁడైనను అసంగుఁడు కదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్ప నక్కఱ లేదు. నీవు ఛత్రిన్యాయము నవలంబింపక పోవుటచే నిట్లు సంశయించుచున్నావు. మఱియు బుద్ధిజీవపక్షమున బుద్ధి స్వయముగ ననుభవింపకున్నను అనుభవమునకు సాధనమగుటచేఁ గర్తగా చెప్పఁబడుటకుఁ దగి యున్నది. జీవపరమాత్మపక్షమున నన్ననో ఒకయంశమున ఛత్రిన్యాయము నిస్సంశయముగ వచ్చును; రెండవయంశమున జీవుఁడు అనుభవించువాఁడు, పరమాత్మ యనుభవింపఁజేయువాఁడు నగుటచే పరమాత్మునికిఁ గూడ కర్మఫలానుభవమును చెప్పవచ్చును. పదుగురు మనుష్యులచే వంటఁ జేయించుచుఁ దా నూరక యే కూర్చుండి యధికారము చేయుచున్నను, అట్టిపురుషుని గూర్చి కూడ "వీఁడు వంటవాఁడు" అనువ్యవహారము కలదు కావున పైఁ జూపినపక్షములలో ననుపపత్తి యేదియు లేదు. ఆత్మవిచారము కావించుప్రకరణమున తత్సంబంధు లగుపదార్థములు కాక క్రొత్తవి యెచ్చటనుండివచ్చును? కావున నీగుహాధికరణము నిలుచుటలో సంశయము లేదు. "ద్వా సుపర్ణా" అనునిట్టిజాతిగలసందర్భములు కూడ నీ న్యాయమునకే లోఁబడు ననుటలోను ఆక్షేపము లేదు.

---

## ౪. అంతరాధికరణము.

సంగతి:—"పూర్వాధికరణమున 'ఋతం పిబంతౌ' అనువాక్యభాగముచే మొట్టమొదటజీవపరమాత్మలు గుఱుతింపఁబడిరి. కావున తర్వాత చెప్పఁబడినగుహాప్రవేశాదిధర్మము లన్నియుఁ దదనుకూలముగ వ్యాఖ్యానము చేయఁబడినవి. ఇచ్చట కూడ నట్లే 'దృశ్యతే' అనుపదముయొక్క సాహాయ్యముచే మొట్టమొదట ఛాయాపురుషుఁడు (కంటియందు ప్రతిబింబించు దృశ్యప్రతిబింబ మనుపురుషుఁడు) తెలియఁబడుచున్నాఁడు. వాని కనుకూలముగనే యితరధర్మముల సమన్వయింపవలయును" అనుపూర్వపక్షమునకు సమాధానముగ నీయధికరణ మారం

భింపఁబడుచున్నది. ఈపూర్వపక్షము పై యధికరణమునందలి సిద్ధాంతమును ఉదాహరణముగాఁ గైకొని వచ్చినది. కావున నీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతసంబంధము.

విషయము:—"య ఏ షోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి హోవా చైత దమృత మభయమేత ద్బ్రహ్మేతి" "కంటియందు సర్వలోకప్రసిద్ధుఁడై కానవచ్చుపురుషుఁ డెవ్వఁడు కలఁడో ఆతఁడే ఆత్మ; మరణరహితుఁడు. ఆతఁడే నాశశూన్యుఁ డగుటచే భయరహితుఁడు. ఆతఁడే బ్రహ్మము" అని గురువు ఉపకోసలుఁ డనురాజునకు చెప్పెను." అని యారంభింపఁబడిన ప్రకరణ మొక్కటి ఛాందోగ్యోపనిషత్తునందు కలదు. అది యీయధికరణమున విచారింపఁబడును.

సందేహము:—పై వాక్యమున "దృశ్యతే" అనుపదము కలదు. దానికి శాస్త్రదృష్టి యనియు లౌకికదృష్టి యనియు రెం డర్థములు కలవు. ఇదియే ఇచ్చట సంశయకారణము. "ఈప్రకరణమున ఛాయాపురుషుఁడు వర్ణింపఁబడెను. పరబ్రహ్మమే వర్ణింపఁబడెను."అనునవి క్రమముగ సిద్ధాంత పూర్వపక్షములు. ఈరెంటికిని ఉపాసనయే ఫలము.

ఈపక్షముల నాశ్రయించి యిట్లు పూర్వపక్ష ముదయించును.-

పూర్వపక్షము:—ఈప్రకరణమున అమృతత్వము అభయత్వము మొదలగుధర్మము లున్నను ఇందు వర్ణింపఁబడినవాఁడు మాత్రము పరమేశ్వరుఁడు కానేరఁడు. ఏదియైన నొకపదార్థము ఎదుట నున్నప్పుడు నేత్రమును దానివైపునకుఁ ద్రిప్పితిమేని యది నల్లగ్రుడ్డునందు ప్రతిబింబించును.ఇది సర్వలోకప్రసిద్ధముగఁ గానవచ్చునది.శ్రుతియందును "మనము నేత్రమున నెవ్వనిఁ జూచుచున్నామో" అనుటచే ప్రత్యక్షసిద్ధ మగు పదార్థమును గూర్చియే చెప్పఁబడియున్నది. తక్కినగుణములును ఎట్లయిన నిందే సమన్వితములు కావలయును. ఆప్రతిబింబము కూడ నొక్కొక్కమాఱు మనుష్యాకారముతో నుండును. కావున పురుషుఁ డగును.కనుగ్రుడ్డునందే యుండుటచే నాత్మ యగును. ఆత్మీయపదార్థమునందుఁ గూడ నాత్మశబ్దప్రయోగము కలదు కదా! మఱియు తానున్నంత కాలము శాశ్వతముగ నుండును గావునను, పిదప నైనను బింబరూపముగ (తన కాధార మగుపురుషునిరూపముతో) శాశ్వతమై యుండును

కావునను,అమృత మగును. అచేతన మగుటచే భయమే సంభవింపదు. కావున నభయ మగును. ఇట్లే తక్కిన గుణములను ఇందే సమన్వయింపవచ్చును. ఇట్లు కాకున్నను, ఇచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడని నచ్చును. అప్పుడు నిర్వివాదముగ పైధర్మము లన్నియు నాతనికి సంభవించును. ఆతనికిని బ్రహ్మమునకును భేదమే లేదు. ఆతఁడును నేత్రమూలమున సర్వమును కాంచుచు నాయింద్రియమునందుఁగూడ నిలిచియుండును కదా! మఱియు నిటఁ జెప్పంబడినవాఁడు నేత్రాధిదేవత యగు సూర్యుఁడైనను కానచ్చును. "రశ్మిభి రేషోఽస్మి న్ప్రతిష్ఠితః" "ఈ సూర్యుఁడు కిరణముల మూలమున నీనేత్రమున నున్నాఁడు" అని శ్రుతియందు స్పష్టముగఁ చెప్పఁబడియున్నది. ఆయన దేవత యగుటచే నమృతత్వాదులతో నిస్సంశయముగ సంబంధముండవచ్చును. ఇట్లు విచారించిన సామాన్యదృష్టిచే ప్రతిబింబంబును, విశేషదృష్టిచే జీవుఁడును, శాస్త్రదృష్టిచే సూర్యుండును, ప్రస్తుతప్రకరణమునకు విషయము లగుచున్నారు; గాని యెట్లుచూచినను పరమేశ్వరుఁడు మాత్రమ ట్లగుట లేదు. సర్వవ్యాపకుఁ డగునాయునకు అత్యంతమగు నేత్రమును స్థానముగఁ జెప్పుట యుక్తముకానేరదు కదా!.

అవతారిక :—అనుసీపూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౩. అంతర ఉపపత్తేః. ౧. ౨. ౧౩.

తాత్పర్యము. (సిద్ధాంతము)—ఇట నీసంశయముతోఁ బనిలేదు. ఈప్రకరణమున నమృతత్వాదులు మాత్రమే కాక సంయద్వామత్వము (కర్మలకు నుచితఫలములఁ బుట్టించుట), వామనీత్వము (ఆఫలములను జీవునకుఁ గలుగఁ జేయుట), భామనీత్వము (సర్వలోకములయందును ప్రకాశించుట, లేక, సర్వలోకములకు ప్రకాశము నొసంగుట) అను మఱికొన్నిగుణములు కూడ చెప్పఁబడి యున్నవి. ఇవియన్నియు పరబ్రహ్మమునకేకాని యితరునకు సంభవింపవు. కావున నిచ్చట వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

ఈప్రకరణమునకు నారంభమున "యః, ఏషః" అను రెండు

సర్వనామపదములు కలవు. సర్వనామమునకు స్వయముగ నేయర్థము కాని లేదనియుఁ, జెంత నున్నవిశేష్యములయర్థమే వాని కర్థ మనియు సర్వలోకవిదితము. ఇచ్చట నాసర్వనామములకు నాత్మపురుషపదములే సమీపమున నున్నవి. ఆశబ్దములకు ముఖ్యార్థము పరబ్రహ్మమే యనుటయు నిస్సంశయ మగువిషయము. మఱియు సర్వనామములకు స్వాతంత్ర్యము లేదు కాని పురుషాదిపదములకు నది కలదు. ఇదియును గాక యాపరబ్రహ్మము నేత్రములకు గోచరము కాదనుటయు సర్వేంద్రియనియామకమగుటచే నేత్రమునందుఁ కూడ నున్నదనియు, విశదమే. ఇట్లుండ "దృశ్యతే" అనుపదమునకు "ప్రత్యక్షముగ కానఁబడుచున్నదో" అనునర్థ మెట్లు చెప్పవచ్చును. సర్వనామములుకూడ పురుషాదిపదములయర్థమునే చెప్పును. కాని మఱియొకదానిని చెప్పదు. కదా! "పూర్వాధికరణమునందువలె మొట్టమొదటఁ గానవచ్చుచున్న పదమును ("దృశ్యతే" అనుపదమును) ఆశ్రయించియే వెనుకనున్నవాని సమన్వయింపవలయును. అంతియే కాని మొట్టమొదటనే వెనుకటివాని విచార మేల?" అనియెద వేమొ, యది సరి కాదు. మఱియొకవిధముగ సమన్వయించుటకు శక్యములై స్వల్పములై విశేషముగ విరోధము చేయనివియై యున్నవాని నెట్లన్న నట్లు త్రిప్పుకొనఁగలము కాని, ప్రస్తుత ప్రకరణమునందువలె నత్యధికములై సమన్వయించుకొనుటకు నశక్యములై యున్నవానిని సవరింపఁగలమా? ఇచ్చట కేవలము బ్రహ్మగుణములను చెప్పుటమాత్రమే కాదు. ప్రత్యక్షము బ్రహ్మశబ్దముకూడఁ బ్రయోగింపఁబడియున్నది. దాని నెట్లు మార్చికొనఁగలము?. కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. "దృశ్యతే" అనుపదమును తదనుగుణముగానే వ్యాఖ్యానము చేయవలయును. "శాస్త్రదృష్టిచే విజ్ఞానులకు నేత్రమధ్యమున నేపరబ్రహ్మము గానవచ్చుచున్నదో" అని యర్థము చెప్పవలయును.

## అ ౧. పా ౨. సూ ౧౪. ఆరంభము.

అవతారిక:—"య ఏ షోఽక్షిణి" అనుటచే బ్రహ్మమునకు నేత్రమే స్థానమని చెప్పఁబడినది. ఇది యయుక్తము కదా! "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః" "ఆపరమాత్మ ఆకాశమువలె సర్వమున వ్యాపించియున్నాఁడు. నిత్యుఁడై యున్నాఁడు" అని యొక్క శ్రుతి చెప్పు

చుండ మఱియొక శ్రుతి యాయనకు స్థాననిర్ణయము చేయు ననుట యేటిమాట ?

అవతారిక :—అను నాక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౪. స్థానాదివ్యపదేశాచ్చ. ౧. ౨. ౧౪.

తాత్పర్యము:— "పరమాత్ముఁడు నేత్రస్థానమున నున్నాఁడు." అని చెప్పుటవలనఁ గూడ విరోధము లేదు. మఱి యెచ్చటను స్థానభేదము చెప్పఁబడక నిచ్చట మాత్రమే యట్లు చెప్పఁబడి యుండునేని యది నిస్సంశయముగ దోషమే యగును; కాని, వేదమున నెన్నియోచోట్ల నిట్లు చెప్పఁబడియే యున్నది. ఒక్క స్థానవిశేషము మాత్రమే కాదు. అనేకనామములు రూపములు కూడఁ జెప్పఁబడియున్నవి. వాస్తవస్థితిలో నివి యన్నియుఁ గూడ విరుద్ధములే కదా !

అయినను నిర్గుణబ్రహ్మము నట్లే ధ్యానించుటకు వీలు కాకపోవుటచే శ్రుతి యెప్పటికి నేదియో యొకయుపాధి నాశ్రయించియే చెప్పుచుండు నని యిదివఱకే వివరించియున్నాము. ఉపాసనార్థమై చెప్పఁబడును. కావున నట్టియుపాధులతో నాయనకు సంబంధము లేదనియు, "సాలగ్రామమునందు విష్ణువును భావింపవలయును" అని చెప్పుటయందు వలె "పరమేశ్వరుఁడు సూర్యునిలోపల నున్నాఁడు. ఇంటిలోపల నున్నాఁడు" అని చెప్పుటయందుఁ గూడ విరోధము లేదనియు నిరూపించియున్నాము. "త స్యోదితి నామ, హిరణ్యశ్మశ్రు" (చూ. సూ. ౧. ౧. ౨౦.) అని మొదలగుస్థలములయందు, పరమేశ్వరునకు నామరూపములు చెప్పఁబడియున్నవి.

మఱియు నీప్రకరణమం దైనను బ్రహ్మమునకు నుచితస్థానము చెప్పఁబడినది; కాని మఱికొన్నిస్థలములయం దట్లుకూడ చెప్పఁబడియుండ లేదు. ప్రస్తుతప్రకరణమున నసంగుఁ డగుపరమేశ్వరునకు నట్టిస్థానమే (దేనితోను సంబంధింపనిస్థానమే) చెప్పఁబడియున్నది. "త ద్య ద్య ప్యస్మిన్ సర్పి ర్వోదకం వా సిఞ్చతి వర్త్మనీ ఏవ గచ్ఛతి" "ఆపరమేశ్వరుని స్థానమున నేతినిఁ గాని నీటినిఁ గాని పోసిన నది రెప్పలతో మాత్రమే సంబంధపడును కాని కంటితో సంబంధపడదు" అని నేత్రస్థానము

యొక్క ప్రభావము విస్పష్టముగనే వర్ణింపఁబడియున్నది. ఇతరస్థలములయందు కొన్నిచోట్ల నిచ్చవచ్చినట్లే వర్ణింపఁబడి యున్న దని క్రమక్రమముగ తెలిసి కొనఁగలరు. ఉపాసనార్థమై యెట్లు చెప్పినను దోష మింతయైన నుండదు కావున నిచ్చట వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. "య శ్చక్షుషి తిష్ఠన్" అనువాక్యముచే నీవిషయమును శ్రుతియే స్వయముగఁ జెప్పుచున్నది.

## అ ౧. పా ౨. సూ ౧౫. ఆరంభము.

అవ:—ఈవిషయమును సిద్ధాంతము చేయుటకై మఱిరెండుకారణములను గూడ చెప్పుచున్నాఁడు.—

## ౪౫. సుఖవిశిష్టాభిధానా దేవ చ. ౧. ౨. ౧౫.

తాత్పర్యము:—మఱియు "ఈప్రకరణమున పరమేశ్వరుండు చెప్పఁబడెనా? లేక, ఇతరుఁడు చెప్పఁబడెనా?" అనుసంశయముతోనే మొట్టమొదట పని లేదు. ఏల యనిన—ఈప్రకరణమునకు "య ఏష" అనునదియే ప్రారంభము కాదు. నాల్గవప్రపాఠకమున పదియవఖండముననే యీప్రకరణ మారంభ మయినది. అగ్నులు తమకు సపర్య చేయుచున్న యుపకోసలుని యెడలఁ గరుణించి "ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ." "సర్వలోకములను ప్రాణరూపమై సుఖరూపమై యాకాశరూపమై యుండునదియే బ్రహ్మము" అనువాక్యముచే బ్రహ్మోపదేశమును చేయ నారంభించినవి. పిదప గార్హపత్యంబును దక్షిణాగ్నియు నాహవనీయంబును క్రమముగ మూఁడుఖండములలో తమప్రభావములను బ్రహ్మోపాసనలను గూడ చెప్పి పదునాల్గవఖండమున తమయుపదేశము నుపసంహరించుచు "ఓయుపకోసలుఁడా! నీకు నీయుపాసనవలన కలుగఁబోవుస్థానమును మీగురువు వివరింపఁగలఁడు" అని చెప్పినవి. పిదప నాతఁడు గురువును చేరఁబోఁగా నాయాచార్యుండును "నీరు తామరయాకు నంటనట్లు ఉపాసకుని పాపము లంటవు"అని యుపాసనాప్రభావమును వర్ణించి పదునైదవఖండమున నక్షిపురుష ప్రస్తావపూర్వక

ముగా * నర్చిరాదిమార్గము నుపదేశించెను. ఇదియే పదునైదవఖండ
మున “అథ యది చైవాస్మిన్” “అట్టియుపాసకునకు నిహలోకమున”
అనుమొదలగువాక్యములచే నామార్గమే వివరింపఁబడెను. ఇట్లుండ
“ఇచ్చట చెప్పఁబడినది బ్రహ్మమా ? యితరుఁడా?” యనుసంశయ
మేల? మఱియు గురువు“పాపము లంటవు” అని చెప్పిన వాక్యము కూడ
బ్రహ్మమును గ్రహించిన సరిపడును కాని, యితరుని గ్రహించిన సరి

---

* అర్చిరాదిమార్గము:—ఉపాసనల నొనర్చినవారు మృతిఁ జెందినపిదప కార్య
బ్రహ్మలోకమును (చతుర్ముఖునిలోకమును) పొంది యచ్చట పరిపూర్ణ బ్రహ్మజ్ఞానమును
జెంది యాబ్రహ్మతోకూడ కల్పాంతమున ముక్తు లగుదురు. “వేదాంతవిజ్ఞానసునిశ్చి
తార్థాః సన్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్వాః, తే బ్రహ్మలోకేతు పరాంతకాలే పరా
మృతా త్పరిముచ్యంతి సర్వే” అను శ్రుతి పైవిషయమును స్పష్టము చేయుచున్నది.
ఆయుపాసకులు బ్రహ్మలోకమునకు పోవుమార్గ మర్చిరాదిమార్గము. “అథ య దు చై
వాస్మిఞ్ఛవ్యం కుర్వంతి యది చ నార్చిష మేవాభిసంభవం త్యర్చిషో ఽహ రహ్న
ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్ షడుద ఙ్ఞేతి మాసాగ్ స్తా న్మాసేభ్య
స్సంవత్సరగ్ం సంవత్సరా దాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం
త త్పురుషో ఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయ త్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన
ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే నావర్తంతే” “ఇప్పుడు ఉపా
సకునిమార్గమును గూర్చి చెప్పెదను. బ్రహ్మోపాసనఁ గావించినవానికి నీలోకమున
బంధువులు పరలోకక్రియలఁ జేసినను చేయకున్నను లోప మేమియు లేదు. వాఁడు
మృతిఁ జెందినవెంటనే తేజోభిమాని దేవతను జెందును. అటనుండి పగటి నభిమా
నించు దేవతకడకుఁ జేరును. అచ్చటనుండి శుక్లపక్షాభిమానిదేవత నాశ్రయించును.
అక్కడనుండి యుత్తరాయణాభిమానిదేవతనొందును. పిదప సంవత్సరాభిమానిదేవతను,
సూర్యుని, చంద్రుని, మెఱుపును చెందును. అచ్చట నుండఁగా బ్రహ్మలోకమునుండి
యొకదేవపురుషుఁడు వచ్చి వారి నాలోకమునకుఁ గొనిపోవును. ఇదియే దేవమార్గము.
ఇదియే బ్రహ్మమార్గము. ఈమార్గమున బ్రహ్మలోకమును జెందినవారు మరల నీప్రపంచ
మునకు రారు. నిశ్చయముగ రారు. (ఆచతుర్ముఖునితోఁగూడ విదేహముక్తి నొందుదు
రనుట)” అనుశ్రుతి యామార్గమును స్పష్టముగ వివరించినది. ఇందు చెప్పఁబడిన తేజో
ఽభిమానిదేవత మొదలగువారు తనసమీపమునకు వచ్చినయుపాసకుని రెండవవారి
యొద్దకుఁ గొనిపోవువారే యని తెలిసికొనవలయును. వీరికి సూర్యరశ్మియే మార్గ
మందురు. ఈవిషయము సూత్రకారునిచేతనే వివరింపఁబడియున్నది. (అ ౪. పా 3).

పడదు; కావున ప్రస్తుతసందర్భానుసారముగ నిచ్చట బ్రహ్మమునే గ్రహింపవలయును.

పూర్వపక్షము:—అదియెట్లు? "ప్రాణో బ్రహ్మ" అనుమొదలగు వాక్యమున సుఖవిశిష్టమగు బ్రహ్మమే చెప్పఁబడినట్లు తోఁపలేదు. ఇట్లుండ దాని నొకకారణముగా చేసి సిద్ధాంతము చేయ ననువుపడునా? అచ్చట నాకాశాదులు బ్రహ్మరూపములుగఁ గాని బ్రహ్మ మాకాశాది రూపముగఁ గాని యుపాసింపఁబడవలయునని యర్థము తేలుచున్నది. కదా!

సిద్ధాంతము:—ఇట్లు కాదు. మొట్టమొదట నగ్నులు "ప్రాణో బ్రహ్మ" అను మొదలగువాక్యమును పల్కిన నుపకోసలుఁడు "ప్రాణము బ్రహ్మ మని యెఱుంగుదును; కాని కం ఖం శబ్దములకు నర్థ మేదియో తెలియలేదు" అని ప్రశ్నించెను. దానికి నుత్తరముగా వారలును "య ద్వావ కం త దేవ ఖం య దేవ ఖం త దేవ కం" "కంఖంశబ్దార్థములు రెండు నొక్కటియే" అని బదులుచెప్పిరి. దీనివలన "ఆనందమయుఁ డగుబ్రహ్మము నుపాసింపవలయును" అని యేర్పడుచున్నది. కంశబ్దము కాని ఖంశబ్దముకాని ప్రత్యేకముగఁ జెప్పఁబడి యుండునేని యప్పుడు సాంసారికసుఖము కాని భూతాకాశము కాని బ్రహ్మరూపముగ నుపాసింప వలసినది యగును. ఆరెండు శబ్దములును పరస్పర విశేషణము లగుటచే వాని ముఖ్యార్థములు పరస్పరము బాధించుకొనును. "భూతాకాశభిన్న మగు నాకాశమును సాంసారికసుఖభిన్నమగు సుఖమును కూడ నుపాసింపవలయును (ఆకాశకల్పుఁడై సుఖరూపుఁడై, లేక, సుఖమయుఁడై యున్నబ్రహ్మము నుపాసింపవలయును)." అను సిద్ధాంతము నేర్పఱుచును. కావున నెట్లు చూచినను ఈప్రకరణమున చెప్పఁబడిన వాఁడు పరమేశ్వరుఁడే.

## ౪౬. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ. ౧. ౨. ౧౬.

తాత్పర్యము:—మఱియు "అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా ఽఽత్మాన మన్విష్యాదిత్య మభిజయంతే" "తపస్సుచేతను బ్రహ్మచర్యముచేతను శ్రద్ధచేతను తనస్వరూపమును వెదకి యుపాసించువారు సూర్యుని చెందుదురు" అను మొదలగు శ్రుతులచేతను,

"అగ్ని ర్జ్యోతి రహః శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణం, తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" "బ్రహ్మవేత్తలు దేహమును విడువఁగానే తేజోభిమానదేవత నుండి పగటి నభిమానించు దేవతకడకును (సూర్యునికడకును), అటనుండి శుక్లపక్షాభిమాని దేవతకడకును, అటనుండి ఉత్తరాయణాభిమాని దేవతయొద్దకును బోవుదురు" అను మొదలగు స్మృతులచేతను, "బ్రహ్మోపాసకులకు కలుగునది" యని చెప్పఁబడిన దేవయానమార్గము ప్రస్తుతప్రకరణమున "తే ఽర్చిష మభిసంభవంతి" "అయక్షిపురుషు నుపాసించినవారు తేజోభిమాని దేవతను చెందుదురు" అని యక్షిపురుషోపాసకులకుఁ గూడఁ గలదని చెప్పఁబడియున్నది. ఈకారణమువలన నక్షిపురుషోపాసకులు కూడ బ్రహ్మోపాసకులే కావలయును. కావున నీప్రకరణమున చెప్పఁబడిన పురుషుఁడు బ్రహ్మమే యని సిద్ధాంతమగుచున్నది.

## అ ౧. పా ౨. సూ ౧౭. ఆరంభము.

అవతారిక.—"ఎట్లయినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు. పూర్వపక్షమున (అధికరణపూర్వపక్షమున) నీవిషయమును చక్కఁగా నిరూపించియే యున్నాము కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు:—

## ౪౭. అనవస్థితేర సంభవా చ్చ నేతరః.౧.౨.౧౭.

తాత్పర్యము:—ఇఁక పూర్వపక్షమునఁ జూపఁబడినట్లు ప్రతిబింబముకాని, జీవుఁడుకాని, సూర్యుఁడుకాని, ప్రస్తుతప్రకరణమునకు విషయభూతులు కారు. ఎట్లు చూచినను వానికి మొట్టమొదట నేత్రస్థానస్థితియే సంభవింపదు. గుణములు బొత్తిగనే తటస్థింపవు.

ఎట్లనిన:—

మొట్టమొదట ప్రతిబింబమును గూర్చి వినుము. అది నేత్రమున శాశ్వతముగ నుండదు. "య ఏ షోఽక్షిణి పురుషః" అనువాక్యముచే, శ్రుతి సర్వకాలములయందును సన్నిహితుఁడై యుండువానిని గూర్చియే చెప్పుచున్నది; గాని వచ్చుచుఁ బోవుచు నుండువానిని గూర్చి కాదు. ఎవ్వఁడైన నొక్కఁడు సమీపమునకు వచ్చినప్పుడు మాత్రమే కంటి

యందు నీడ కానవచ్చును గాని లేనప్పుడు లేదు కదా! ఇట్టినీడ యుపా స్య మని నిర్ణయించుటకు నెట్లు వీలు కలుగును?. "ఒకపురుషుని సమీా పమున నుంచుకొని, కంటియందు నిలిచినవానిప్రతిబింబము నుపాసింప వలయును" అనుటయే శ్రుతికి నభిప్రాయ మని వర్ణించుట హాస్యా స్పదము కదా!

మఱియు నీప్రతిబింబమునే గ్రహించితిమేని యిట వర్ణింపఁబడిన గుణము లెవ్వియు సరిపడవు. "అస్యైవ శరీరస్య నాశ మ న్వేష నశ్య తి" "ఈప్రతిబింబము శరీరము నశించినవెంటనే నశించును" అని చెప్పఁబడియున్నది. కావున నమృతత్వము సంభవింపదు. "ఉన్నంత కాలము శాశ్వతముగ నుండుటయు నశించినను తనకు బింబ మగుపదా ర్థమునందే కలసి యుండుటయు నమృతత్వమునకుఁ గారణము లగును" అని చెప్పితివి; కాని యది సరి కాదు. అట్లయిన నీఁక నమృతత్వము లేని పదార్థమేది? నీవు చెప్పినధర్మములు రెండును సర్వపదార్థములయందును కలవియే కదా! కావున ప్రతిబింబమునకు నమృతత్వ మెట్లును కలుగదు. అమృతత్వ మనఁగా నించుక యైనను మాఁర్పు నొందక సర్వకాలముల యందు నేకరూపముతో నుండుటయే. ఇది పరబ్రహ్మమునకు మాత్రమే సంభవించు ననుట స్పష్టము. అభయత్వరూపధర్మము కూడ నిట్లే (ప్రతిబింబమునందు) సంభవింపదు. పదార్థము చేతన మయ్యేనేని యప్పుడు "దీనికి భయము కలదు, లేదు" అని చెప్పుటకు వీలుండును. అట్లు కానప్పు డావార్తకైన నవకాశ ముండదు కదా! "అచేతన మగు టచే ప్రతిబింబమునకు నెప్పటికిని భయసంస్పర్శము కలుగదు. కావున నది యభయరూపమే" యని చెప్పితివి కాని యది సరి కాదు. అప్పుడు "ఇది యభయరూప మయినది" యనుటకుఁ గూడ వీలు లేదు కదా! కావున ప్రతిబింబమునకు నిటచెప్పినగుణము లెవ్వియు సంబంధింపవు. సంయద్వామత్వాదిగుణములను గూర్చి ప్రత్యేకముగ ప్రస్తవింప నక్క ఱయే లేదు.

ఇట్లే జీవునిఁ గూర్చి విమర్శించిన నాతఁడును ప్రస్తుతప్రకరణము నకు విషయము కానేరఁడు. ఆతఁడును సర్వశరీరమునందు నుండువాఁడు. కావున "కంటియందు మాత్రమే యున్నాఁడు" అని చెప్పుటకు వీలు లేదు. జీవుని గూర్చి మ తెచ్చుటను అట్లు చెప్పఁబడి యుండ లేదు. పర

మాత్మనుగూర్చి యన్ననో, ఆయన సర్వవ్యాపకుఁ డయినను, వేదమున పెక్కుచోట్ల నుపాసనార్థమై యాయనకు స్థానభేదములు కల్పింపఁబడి యున్నవి. అట్లే యిచ్చటఁ గూడఁ గల్పింపఁబడి యుండవచ్చును.

మఱియుఁ బూర్వమునందువలెనే యిచ్చటను అమృతత్వాది గుణములు సంభవింపనేరవు. ఈజీవుఁడు పరమాత్మునికంటె నభిన్నుఁడే యైనను, అవిద్యవలన నతనికి మరణము (సంసారము), భయము మొదలగునవి కలవు. కావున నమృతత్వాదులు ఇచ్చట సంభవింపవు. సర్వశక్తుఁడు కాకపోవుటచే సంయద్వామత్వాదిగుణములు నుండవు.

యీవిధముగనే సూర్యుండు నిచ్చట నుపాస్యుఁడు కానేరఁడు. "రశ్మిభిః" అను మొదలగు శ్రుతి ననుసరించి యాయన నేత్రమున సర్వకాలములయందు నుండువాఁడే యైనను ఆత్మరూపుఁడు కానేరఁడు. పురుషుఁడు చూచువాఁడు, సూర్యుఁడు చూడఁబడువాఁడు కదా! మఱియు నమృతత్వాదిగుణములు నాతనికి సంభవింపవు. "దేవతలు మృత్యువు లేనివారు" అనుటకు, "మనుష్యాదులకంటె విశేషకాల ముండువారు" అనియే యర్థము కాని "ఎప్పటికి నుండువారు" అని యర్థము కాదు. కల్పాంతమున నింద్రాదులకుఁ గూడ మార్పు కల దనుట ప్రసిద్ధమే కదా! ఇదియును గాక వారు సర్వకర్మఫలముల నొసంగుచు నున్నను వారికి సంయద్వామత్వాదిగుణములు కలుగవు. వారు దానికి నిమిత్తమాత్రులే కాని స్వతంత్రులు కారు. ఈవిషయము సర్వశాస్త్రములయందును ప్రసిద్ధమే. కావున నిట్లు చూచినను ఈప్రకరణమునఁ బరమేశ్వరభిన్నమగువిషయ మెద్దియుఁ జెప్పఁబడలే దనుట స్పష్టము.

"దృశ్యతే' అనుపదము లోకదృష్టిని చెప్పును. ఈసిద్ధాంతము దానికి విరుద్ధము. బ్రహ్మము సర్వలోకప్రసిద్ధము కాదు కదా!" అని యెదవేమొ, వినుము. ఆపదమునకు "విద్వాంసులదృష్టికి నెవ్వఁడు గోచరుఁ డగుచున్నాఁడో" అని వ్యాఖ్యానము చేయవలయును. ఇన్నిప్రబల ప్రమాణము లుండ నొక్కపదమునకై వాని కర్థాంతరమును కల్పించుట యుక్తము కాదు కదా!

పూర్వపక్షము:—మొట్టమొదట నీయధికరణమే నిలువదు. "అంత స్తద్ధర్మోపదేశాత్" (౧. ౧. ౨౦.) అనునధికరణమునందే ఈవి

షయము సిద్ధాంతము చేయఁబడియున్నది. అచ్చటవలెనే యిచ్చటఁ గూడ,అమృతత్వము మొదలగు బ్రహ్మధర్మములు కలవు. ప్రత్యక్షముగ బ్రహ్మపదంబును ప్రయోగింపఁబడి యున్నది. ఇఁక సంశయ మెట్లు కలుగును? విచారమున కవకాశ మెటనుండివచ్చును?

సిద్ధాంతము:—ఆకర్ణింపుము. దీనికిఁ బూర్వమున నున్నగుహాధి కరణమున "ఋతం పిబంతౌ" అనుప్రారంభము నాశ్రయించి మిగిలిన వాక్య మంతయు సమన్వయింపఁబడెను.ఇచ్చట మొట్టమొదట "ఏష.... దృశ్యతే" అని ప్రత్యక్షసిద్ధుఁ డగుపురుషునిగూర్చి చెప్పఁబడియున్నది. పరమేశ్వరుఁడు ప్రత్యక్షసిద్ధుండు కాఁడు కదా! కావున నిచ్చట సంశ యమునకు నెడము కలదు. "పూర్వాధికరణమునందువలెనే యిచ్చటఁ గూడ వాక్యారంభము ననుసరించి ప్రతిబింబాదులలో దేనియందైనను ఉత్తరవాక్యమును యథాసంభవముగ సమన్వయింతు రేమో" యని యభిప్రాయము కలుగ వచ్చును కదా! కావున నీయధికరణము నిలు చుటలో సంశయము లేదు.

పూర్వపక్షము :—అగును గాక! ఈయధికరణమున "నేత్ర మధ్యమున నున్నవాఁడు జీవుఁడైనను దేవత యైనను కావచ్చును. "రశ్మిభిః....''అనుమొదలగుశ్రుతి దేవతావిషయమునఁ బ్రమాణము" అని చెప్పియున్నారు.ఇట్లు చెప్పుటకు నవకాశమే లేదు."ఏష దృశ్యతే" అని ప్రత్యక్షముగఁ గానవచ్చువానిని కూర్చి చెప్పుటయే కదా యిచ్చట సంశయకారణము. ఈజీవదేవత లట్టివారు (అనఁగా: ప్రత్యక్షముగఁ గానవచ్చువారు) కాగు కదా! ఇట్లుండ వీరిని గూర్చి సంశయ మట్లు జనించును ?

సిద్ధాంతము:—ఇట్లు తలంప నక్కఱ లేదు. "దృష్టి లౌకికదృ ష్టియు శాస్త్రీయదృష్టియు నని రెండువిధములు" అనియు, అట్లగుట చేతనే యిచ్చట సంశయము కలిగెననియు మొట్టమొదటనే వివరించి యుంటిమి. జీవదేవతలు కంటికిఁ గానరాకున్నను శాస్త్రమువలన నట్లు నిరూపించుటకు శక్యు లగుచున్నారు. "ఎట్లయిన నేమి ఏదృష్టియైన నొక్కటియే కదా !" అనియెదవేమొ వినుము. అట్లయినను వీరిని సంది గ్ధకోటిలోఁ జేర్చుట యయుక్తము కాదు. వీరికిఁ గూడనేత్రస్థితి సంభ వించుటచే స్థూలదృష్టి కలవారు కొంద ఱిట్లును సంశయింపవచ్చును.

కదా! మఱియు నధికరణసిద్ధాంతమువలన "దృశ్యతే" అనుపదమునకుఁ గేవలశాస్త్రదృష్టియే యర్థ మని తెలినపిదపఁ గూడ వీరు (జీవదేవతలు) సందిగ్ధకోటిలోఁ జేరవచ్చును. శాస్త్రదృష్టివలన వీరికిని నేత్రస్థానస్థితి సంభవించును కదా!. కావున వీరిని సందిగ్ధకోటిలోఁ జేర్చుటవలనఁ బ్రయోజనము లేకపోలేదు.

---

## ౫. అంతర్యామ్యధికరణము.

విషయము :—బృహదారణ్యకోపనిషత్తునందు అంతర్యామి బ్రాహ్మణమున, "య ఇదం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతాని యో ఽంతరో యమయతి" "ఎవ్వఁడు ఈలోకమును పరలోకమును సమస్తభూతములను వానిలోపల నుండి నియమించుచున్నాఁడో" అని యారంభించి "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో ఽయం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయ త్యేష త ఆత్మా ఽంతర్యా మ్యమృతః" "ఎవ్వఁడు భూమియం దున్నాఁడో, భూమికి లోపల నున్నాఁడో, ఇట్లున్నను ఆభూదేవి యెవ్వని నెఱుంగలేదో, ఎవ్వనికి నాభూమియే శరీరమో, ఎవ్వఁ డాభూమిని లోపల నుండి నియమించుచున్నాఁడో, వాఁడే నీకును నాకును కూడ నాత్మ. ఆతఁడే యంతర్యామి. ఆతఁడే జరామరణశూన్యుఁడు" అనునిట్టి స్వరూపములు గలవాక్యము లనేకము లున్నవి. అందు పైనుదాహరింపఁబడిన పృథివీవాక్యము మొదలు * "యః స్తనయిత్నౌ తిష్ఠన్" "ఎవ్వఁడు మేఘమునం దున్నాఁడో" అనువాక్యమువఱకు నున్నవాక్యములు అధిదైవవాక్యములు. "యః సర్వేషు లోకేషు, యః సర్వేషు వేదేషు, యః సర్వేషు యజ్ఞేషు, యః సర్వేషు భూతేషు" "ఎవ్వఁడు సర్వలోకములయం దున్నాఁడో, ఎవ్వఁడు సర్వవేదములయం దున్నాఁడో, ఎవ్వఁడు సర్వయజ్ఞములయం దున్నాఁడో, ఎవ్వఁడు సర్వభూతములయం

---

* యః స్తనయిత్నౌ తిష్ఠన్" అనువాక్యము మాధ్యందినశాఖయందలి బృహదారణ్యకోపనిషత్తున నున్నది. ఈబృహదారణ్యకోపనిషత్తు కాణ్వశాఖయందుఁ గూడఁ గలదు.

దున్నాఁడో'' అని యారంభింపఁబడిన వాక్యములు క్రమముగ అధిలోక అధివేద అధియజ్ఞ అధిభూత వాక్యము లనఁబడును. మఱియు "యః ప్రాణే తిష్ఠన్" "ఎవ్వఁడు ప్రాణమున నున్నాఁడో" అనువాక్యము మొదలు "య ఆత్మని తిష్ఠన్" "ఎవ్వఁడు జీవునియం దున్నాఁడో"* అనువాక్యమువఱకు నున్నవి యధ్యాత్మవాక్యములు. ఈవాక్యము లన్నియు నీయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"పై యధికరణమున 'య శ్చక్షుషి తిష్ఠన్' 'ఎవ్వఁడు కంటియం దున్నాఁడో' అనువాక్యమును ప్రమాణముగ నుదాహరించిరి; కాని, యందలియర్థమేదియో యిప్పటికిని నిర్ణయము కాలేదు" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడినది. కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధ మాక్షేప సంబంధము.

సందేహము:—ఇచ్చట నంతర్యామిపదమునకు నర్థము స్పష్టము కాకుండుటయు, శరీరసహితుఁ డగువాఁడే కాని యితరుని ప్రేరేపింపనేరఁ డనుటయు సంశయకారణములు. "ఈయంతర్యామిపదమునకు పృథివీ దేవతాదులర్థము, పరమాత్ముఁడే యర్థము" అనునవి క్రమముగఁ బూర్వ పక్షసిద్ధాంతములు. ఈ రెండుపక్షములయందును ఉపాసనయే ఫలము.

ఈపక్షముల నాశ్రయించి యీపూర్వపక్ష ముదయించును:—

పూర్వపక్షము:— ఈయధిదైవాదివాక్యములయందు చెప్పఁబడినపురుషుఁ డెవ్వఁడు? పరమేశ్వరుఁడా? అట్లు చెప్పుటకు వీలు కలుగకున్నది. లోకమున నెవ్వఁడైనను తనకు దేహ ముండినచోఁ మఱియొక్కని ప్రేరేపించుచున్నాఁడు. ఒకవడ్రంగి తాను దేహము గలవాఁడై దానిసాహాయ్యముచే ఉలి మొదలగుసాధనములఁ బ్రేరేపించుచున్నాఁడు కదా ! ఇట్లు విమర్శించిన పరమాత్మునికి శరీరమే లేదు. అట్టివాఁడు పరుల నెట్లు ప్రేరేపింపఁగలఁడు. మఱియు నంతర్యామిపదము క్రొత్తగా నున్నది. దానిచేఁ జెప్పఁబడినవాఁడును క్రొత్తగానే యుండు

---

* "య ఆత్మని తిష్ఠన్..." అనువాక్యము మాధ్యందినశాఖయందలి బృహదారణ్యకోపనిషత్తున నున్నది. కాణ్వశాఖయం దీస్థలమున "యో విజ్ఞానే తిష్ఠన్" అను వాక్యమున్నది. విజ్ఞాన మనఁగా బుద్ధి. అదియే జీవునకు నుపాధి కావున విజ్ఞానశబ్దముచే జీవుఁడే చెప్పఁబడు నని తెలిసికొనవలయును.

నేమో! ఇట్లు తలంచుటయు నంత యుక్తముగ లేదు. అంతర్యామి యనఁగా: లోపల నుండి ప్రేరేపించువాఁడు అని యర్థ మగుచున్నది. ఇట్టివాఁ డొకఁ డుండుటయుఁ బ్రత్యక్షముగనే యున్నది; కాని వాని స్వరూపము మాత్రము తెలియనచ్చుట లేదు. "పృథివ్యేవ యస్యాయతనం" "ఈభూమి యెవ్వనికి స్థానమో" అను మొదలగు శ్రుతివాక్యముల ననుసరించి చూచిన, పృథివ్యాద్యభిమానిదేవతయే యంతర్యామి యని తోఁచుచున్నది. ఇట్లు కాకున్నను యోగసిద్ధుఁ డగుమహాత్ముఁ డైనను అట్టివాఁడు కావచ్చును కాని, శరీరశూన్యుఁ డగుటచే పరమేశ్వరుఁడు మాత్ర మట్టివాఁడు కానేరఁడు. "ప్రపంచకారణ మగుటచే నాతఁడు కూడ నట్టివాఁడు కావచ్చును" అందురేమొ కాని, విచారించిన నదియు యుక్తము కాదు.

అవతారిక:—ఈపూర్వపక్షమును ఖండించుచు వాక్యార్థమును నిర్ణయించుచున్నాఁడు.—

## ౧౮. అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్. ౧. ౨. ౧౮.

తాత్పర్యము (సిద్ధాంతము):— అధిదైవాదివాక్యములయందు "అంతర్యామి" అని చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే; ఆవాక్యముల యందు ఆపరమేశ్వరునిధర్మములే చెప్పఁబడియున్నవి.

ఆయన సర్వప్రపంచమునకును ఉపాదానకారణభూతుఁడును నిమిత్తకారణభూతుఁడును కూడ నగుటచే సర్వనియామకుఁడు కావచ్చును. అధిదైవాదిభేదములతో శ్రుతి ప్రపంచమునే కదా వర్ణించుచున్నది! సర్వకారణమగుటచే నాయన సర్వశక్తుఁ డగును. కావున నాయనకు నేదియు విరుద్ధము కానేరదు. శక్తిహీనుఁ డైన నిట్టివిచిత్రసృష్టి నెట్లు కావింపఁగలుగును? మఱియు "ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృతః" అను వాక్యముచే విస్పష్టముగ "అంతర్యామియే యాత్మ. జరామరణములు లేనివాఁడు" అని శ్రుతి చెప్పుచున్నది. ఈధర్మములు పరమాత్మునకుఁ గాక నితరునకు సంభవించునా?. కావున నెట్లు చూచినను ఇచ్చట వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. "అదృష్టో ద్రష్టా" "తాను పరులచేఁ

జూడఁబడకయే సర్వమును చూచువాఁడు" అని శ్రుతియం దున్నది. ఇదియు పరబ్రహ్మమునకే కాని యన్యములకు సంభవింపదు. రూపాదులు లేనివాఁడే కదా యదృష్టుఁడు కావలయును. ఇట్టివాఁడు పరమేశ్వరుఁడే యనుటలో సంశయము లేదు.

"యం పృథివీ న వేద" అని చెప్పుటచే "ఆయంతర్యామి పృథివ్యాదుల నభిమానించు దేవతలకు గోచరుఁడు కాఁడు"అని స్పష్టమైనది. ఈవాక్యములచే పృథివ్యాదిదేవతలే అంతర్యాములుగాఁ జెప్పఁబడియుండు నేని,యప్పు డిట్టిభేదము సంభవింపదు. ఆదేవతలు "నేనే అంతర్యామిని"అని తమ్ముఁ దాము తెలిసికొనవలయు ననుట నిస్సంశయము; ఈవాక్యములం దన్ననో యది నిషేధింపఁబడెను. కావున దేవత లంతర్యాములు కారు. యోగులకు నట్టిసామర్థ్యము కలుగుటకు వీలున్నను వారు ప్రపంచమును మాత్రము నియమింపలేరు. (ఈవిషయము "జగద్వ్యాపారవర్జం ప్రకరణాత్" బ్ర. సూ. ౪. ౪. ౧౭. అను స్థలమున వివరింపఁబడును) కావున నెట్లు చూచినను అంతర్యామి పరమేశ్వరుఁడే.

## అ. ౧. పా ౨. సూ ౧౯. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లయిన సాంఖ్యులు కల్పించినప్రధానమే యంతర్యామి కానచ్చును. శరీరము లేదు; కావున పరమేశ్వరుఁ డెట్లు చెప్పినను అంతర్యామి కానేరఁడు. ఆప్రధాన మన్ననో, దానికి సత్త్వరజ స్తమోగుణము లనునవయవములు కలవు. దానికి "అప్రతర్క్య మవిజ్ఞేయం" "ప్రధానమును విచారించుటకుఁ గాని తెలిసికొనుటకుఁ గాని వీలు లేదు" అనుమొదలగు స్మృతివాక్యముల ననుసరించి చూచిన రూపాదులు లేవు. కావున అదృష్టత్వము మొదలగు ధర్మము లచ్చట కూడ నుండవచ్చును. పురుషునకు భోగమోక్షముల నొసంగుచు స్వీయమైన దగుటచే, దానియందును ఆత్మశబ్దము గౌణముగ వర్తింపవచ్చునని యిదివఱ కొకమాఱు చెప్పియున్నాము. కావున నీవాక్యముల యందు వర్ణింపఁబడినది ప్రధానమే.

అవతారిక:—అని ఇట్లు, "ఈక్షతేః (౧. ౧. ౫.)" అనునధికరణమున సంపూర్ణముగ నిషేధింపఁబడియే యున్నను, అదృశ్యత్వాది

ధర్మములయొక్క సంబంధముచే మరల వచ్చినప్రధానవాదమును ఖండించుచున్నాఁడు.—

## ౪౯. న చ స్మార్త మతద్ధర్మాభిలాపాత్. ౧. ౨. ౧౯.

తాత్పర్యము (సిద్ధాంతము):—ప్రధానము అంతర్యామి కానేరదు. దాని ధర్మము లెవ్వియు నీవాక్యములయందు చెప్పఁబడ లేదు.

అదృశ్యత్వాదిధర్మములు మీ రన్నట్లు దానికి నుండినను మఱి కొన్నిధర్మములు లేవు. ప్రస్తుతవాక్యములకు శేషములుగ "అదృష్టో ద్రష్టా అశ్రుతః శ్రోతా అమతో మంతా అవిజ్ఞాతో విజ్ఞాతా" "అయం తర్యామి పరులచేఁ జూడఁబడక సర్వమును చూచువాఁడు. వినఁబడక సర్వమును వినువాఁడు. సంకల్పింపఁబడక సంకల్పించువాఁడు. తెలిసికొనఁబడక తెలిసికొనువాఁడు" అని ద్రష్టృత్వాదిధర్మములు చెప్పఁబడి యున్నవి. ఇవి ప్రధానమునకు సంభవింప వనుటలో సంశయ మేమి? అది యచేతనమే యనుట మీకును సమ్మతమే కదా? కావున నిది యంతర్యామి కాదు.ఇది యాత్మ కానేర దనియు మున్నే విసరించి యున్నాము.

## అ ౧. పా ౨. సూ ౨౦. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లయిన నిస్సంశయముగ జీవుఁడే యంతర్యామి. ఆతఁ డాత్మ యనుటలో సంశయము లేదు. "న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః" "చూపును చూచువానిని చూడ లేవు" అను మొదలగు శ్రుతులు జీవునకు అదృష్టత్వము మొదలగు ధర్మముల నుపదేశించుచున్నవి. మఱియు నాతఁడు బ్రహ్మాభిన్నుఁ డగుటచే అమృతత్వాదిధర్మములును సరిపడును. ఇదియంతియుఁగాక "బ్రహ్మమునకు సంభవింపవు" అని మొట్టమొదట నుండియు నాక్షేపింపఁ బడుచున్న దేహాదులు సహితే మీాతనికిఁ గలవు. కావున జీవుఁడే యంతర్యామి కావచ్చును.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.—

## ౫౦. శారీర శ్చోభయే௨పి హి భేదే నైన మధీయతే. ౧. ౨. ౨౦.

తాత్పర్యము (సిద్ధాంతము):— పూర్వసూత్రమునుండి 'న'

అను పద మనువర్తించును. జీవుఁడు కూడ నీ వన్నట్లు అంతర్యామి కానేరఁడు. అతనికి అదృష్టత్వము, ద్రష్టృత్వము మొదలగుధర్మము లన్నియు నుండుట నిశ్చయమే యైనను, ఆతఁడు ఘటాకాశమువలె నుపాధుల యందు ప్రత్యేకముగ నుండువాఁ డగుటచే సర్వలోకములఁ బ్రవేశించి నియమింపఁజాలఁడు. మఱియు నీబృహదారణ్యకోపనిషత్తు కాణ్వశాఖ, మాధ్యందినశాఖ యనురెండుశాఖలయందును కలదు. ఆరెండు శాఖలయందును కూడ "పృథివ్యాదులవలెనే జీవుఁడు కూడ నంతర్యామికి నాధారము అంతర్యామిచేఁ బ్రేరేపింపఁబడుచున్నాఁడు" అని యున్నది. "యో విజ్ఞానే తిష్ఠన్" అని కాణ్వశాఖయందును, "య ఆత్మని తిష్ఠన్" అని మాధ్యందినశాఖయందు నున్నది. ఇచ్చట నాత్మశబ్దమునకు జీవుఁడే యర్థమనుట స్పష్టమే కదా! ఇఁక విజ్ఞానపదమునకును అదియే యర్థము. జీవునియుపాధి విజ్ఞానమే(బుద్ధియే) కదా! (బుద్ధియందు ప్రతిబింబించి సంకల్పమూలమున నింద్రియములతో సంబంధపడి తన్మూలమున బాహ్యవస్తువులఁ బ్రకాశింపఁజేయు బ్రహ్మప్రకాశమే జీవుం డనుట). కావున నెట్లు చూచినను జీవుఁ డంతర్యామి కానేరఁడు.

పూర్వపక్షము:—"పరమేశ్వరునకు శరీరేంద్రియాదులు లేవు. అట్టివాఁడు పరుల నియమింపలేఁడు. జీవునకు నవి కలవు. కావున నన్యులఁ బ్రేరింపఁగలఁడు" అని ప్రబలకారణము నొక్కదానిని చెప్పియుంటిమి కదా! దాని కేమి చెప్పెదరు?

సిద్ధాంతము:—ఇది యొకదోషము కాదు. శ్రుతిస్మృతులయందంతటను "పరమేశ్వరునుండి ప్రపంచము జనించెను" అని చెప్పఁబడియున్నది. ఇట్లగుటచే నీప్రపంచ మంతయు నవ్విభునకు శరీరమే. ఆయన దేనియందు ప్రవేశించి దేనిని ప్రేరించునో దానిశరీరాదులే ఆయీశ్వరునిశరీరాదు లగును. "వాస్తవసంబంధము లేదు కదా" యని యెదవేమొ? జీవునకుఁ గూడ నట్టిసంబంధము లే దని తెలిసికొనుము. ఆతనికిని దేహాదిసంబంధము కేవల మవిద్యాకల్పితమే కదా! కావున నింతమాత్రమువలన సిద్ధాంతమునకు భంగము రాదు.

పూర్వపక్షము:—అగును గాక! ఇప్పటికిని సిద్ధాంతము స్థిరము కాలేదు. ఒక్కశరీరమునందే ద్రష్ట లిరువురు కల రనుట విరుద్ధము.

సందేహము:—ఈ వాక్యమున నర్థనిర్ణయము లేని యక్షరమను పదము ప్రయోగింపఁబడి యుండుటయే సంశయకారణము. "అక్షర శబ్దముచేఁ జెప్పఁబడువారు ప్రధాన జీవులే, బ్రహ్మమే" అనునవి క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఇది యుపాసనాప్రకరణము కాదు. కావున పూర్వపక్షమున కుపాసనయు సిద్ధాంతమునకు బ్రహ్మజ్ఞానంబును ఫలములు.

ఈ రెండుపక్షముల నాశ్రయించి యీక్రింది పూర్వపక్ష ముదయించును:—

పూర్వపక్షము:—ఇచ్చట నక్షరపదముచేఁ జెప్పంబడువారు ప్రధానజీవులే యై తీరవలయును. యీప్రపంచ మచేతనము. దీనికిఁ గారణము గూడ నచేతనమే కావలయును. పై వాక్యమునందును "భూతయోనిం" అనుటచే "అక్షరశబ్దము జగత్కారణమును చెప్పును" అను విషయము స్పష్టమగుచున్నది. కావున నచేతనమగు ప్రధానమే యక్షరశబ్దార్థము కావలయును.

లోకమున ఆరంభము, పరిణామము, వివర్తము అను మూఁడును పదార్థోత్పత్తికిఁ గారణములు. అందు ఈప్రపంచము పరిణామమువలనఁ బుట్టినను వివర్తమువలనఁ బుట్టినను దీని కచేతనమే కారణము కావలయును. కార్యకారణములకు పరస్పరసమానరూపత్వ ముండవలయు ననుట నిస్సంశయ మగువిషయము. ఎవ్వఁడైనను త్రాటినిఁ జూచిన పాము గానే తలంచును; గాని యేనుఁగుగాఁ దలంపఁడు. సువర్ణముచే నేర్పఱుపఁబడినదాని సువర్ణముగాఁ జూచును గాని మృత్తికగాఁ జూడఁడు కదా! కావున నిచ్చట నక్షరశబ్దముచేఁ బరమాత్మయే చెప్పఁబడు ననిన, నాయన చేతనుఁడును ప్రపంచ మచేతనంబు నగుటచే విరోధము తప్పక వచ్చును.

మఱియు "భూతయోనిం" అనుపదమునకు "ప్రపంచ*నిమిత్త కారణమును" అని యర్థము చెప్పినను, అక్షరశబ్దార్థము పరమేశ్వరుఁడు

* ఆరంభము, పరిణామము. వివర్తము (పుట. ౭౭ చూడుము).

*కారణత్రయనిరూపణము:—సమవాయికారణము, అసమవాయికారణము, నిమిత్తకారణము అని కారణములు మూఁడు. ఇవి ప్రతిపదార్థములయొక్క జన్మమునకు నావశ్యకములు.

కానేరఁడు. "జీవుఁడే యక్షరశబ్దమున కర్థ మేల కాకూడదు?" అనిన సమాధానము లేదు కదా! జీవుఁడును అనాదికర్మబలమున సర్వభూతములఁ గల్పించుచుండును, లేక సంపాదించుచుండును కదా! "పూర్వ

---

౧. సమవాయికారణము:—తనసముదాయముచేఁ గార్యరూపము నొందుకారణము. నూలుపోగులు తా మొండొంటితోఁ గూడి వస్త్రమును కలిగించుచున్నవి. ఇప్పుడు ఆనూలు వస్త్రమునకు సమవాయికారణము.

౨. అసమవాయికారణము:— తాను ప్రత్యక్షముగ సంబంధింపకున్నను, తన కార్యముతోఁ గాని, ఆకార్యముయొక్క సమవాయికారణముతోఁగాని సంబంధము గలయన్యపదార్థముతోఁ జేరియుండుకారణము. ఎట్లనిన: తంతుసంయోగము (దారములచేరిక) వస్త్రమునకుఁ గారణము. ఇచ్చట చేరికయనునది దారములయొక్క గుణము. దారములతోనే సంబంధించియుండును. మఱియు దారములు వస్త్రముతో ప్రత్యక్షసంబంధము కలిగియుండును గాని వానిచేరిక యట్టిసంబంధమును కలిగియుండదు. చేరిక దారముల గుణము కాని ప్రత్యేకముగ నుండుపదార్థము కాదు కదా! కావున నీచేరిక వస్త్రమునకుఁ గారణమైనను సమవాయికారణము కానేరదు తనకు కార్యము వస్త్రము. దానికి దారములతో సంబంధము కలదు. అట్టిదారములతో తనకును సంబంధము కలదు. ఇట్లు కార్యముతోఁ గూడ నన్యపదార్థమునకు (దారములకు)సంబంధపడియున్నది యగుటచే నిది యసమవాయికారణము. ఇట్లే దారముల గుణ మగురూపము వస్త్రగుణ మగురూపమునకుఁ గారణ మని చెప్పఁబడునప్పుడు, ఆతంతురూపమునకు మఱింతదూర మగుసంబంధము కలిగియుండును. వస్త్రరూపము కార్యము. అది తనకు సమవాయికారణ మగువస్త్రముతో సంబంధపడియుండును. ఆవస్త్రంబును తనకు సమవాయికారణ మగుదారములతో సంబంధించును. ఆతంతురూపంబును తంతువులగుణమే యగుటచే వానితో (దారములతో) సంబంధపడును. ఇది లక్షణమునఁ గలరెండవభాగమునకు ('తన కార్యముయొక్క సమవాయికారణముతో సంబంధము గలయన్యపదార్థముతోఁ గూడిన సమవాయికారణమునకు సంబంధ ముండవచ్చును.' అనుభాగమునకు) నుదాహరణము.

3. నిమిత్తకారణము:—పైరెండు లక్షణములును లేనికారణము నిమిత్తకారణము. నాఁడె పలక మగ్గము మొదలగునవి వస్త్రములకును కారణములే. పైలక్షణములు వీనికి లేవు కావున నిమిత్తకారణములు.

మఱియు నీకారణములను ఉపాదాన-నిమిత్తము లనుభేదములతో విభజింపవచ్చును. ఏవిధముగఁ గాని కార్యరూపముతోఁ బరిణమించుకారణ ముపాదానకారణము. ఈజాతిలో మొట్టమొదటిరెండును చేరును. అట్లు పరిణమింపనికారణము నిమిత్తకారణము. ఇదియే మూఁడవది. దీనియందు ఆయాకార్యముల నాచరించుచేతనుఁడు (సాలెవాఁడు మొదలగువారు) కూడఁ జేరుదురు.

"నాన్యో ఽతో ఽస్తి ద్రష్టా" అను మొదలగు వాక్యములచే శ్రుతి "జీవభిన్నుఁ డగు ద్రష్ట లేఁడు" అని చెప్పుచున్నది. ఇట్లుండ జీవుఁ డొక్కఁడును, అంతకంటె భిన్నుఁడై సర్వనియామకుఁడై యుండు నీశ్వరుఁ డొక్కఁడును కలఁ డనుట శ్రుతివిరుద్ధము.

'నాన్యో' అను మొదలగు శ్రుతి 'పరమేశ్వరునికంటె భిన్నుఁ డగు నియామకుఁడు లేఁడు' అని చెప్పుచున్నది గాని వేఱేమియుఁ జెప్పుట లేదు" అని యెదవేమొ, కాని యట్టిగుఱుతు లెవ్వియుఁ గానవచ్చుట లేదు. కావున నెట్లు చూచినను ఆశ్రుతికి నభేదమే యభిప్రాయము.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరి కాదు. పరమేశ్వరుఁ డొక్కఁడే యుపాధిభేదమున జీవుఁడుగ నున్నాఁడనియు, ఆభేదము నాశ్రయించియే సర్వవేదములును శాస్త్రములును పురాణేతిహాసాదులును లోకవ్యవహారములును ప్రవర్తించుచున్నవనియు నిదివఱకే నిరూపించియున్నాము. "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" అను మొదలగు వాక్యములచే శ్రుతియుఁ బ్రత్యక్షముగ "భేదము నాశ్రయించియే సర్వవ్యవహారములును బ్రవర్తించుచున్నవి" అని చెప్పుచున్నది; "ఇవ" అను శబ్దముచే, "ఆభేదము కూడ, కేవల మున్నట్లు తోఁచునదియే కాని వాస్తవముగ నుండునది కాదు" అని కూడ నిరూపించుచున్నది. మఱియు "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" "ఏస్థితియందు (జ్ఞానస్థితియందు) పురుషునకు సర్వము నాత్మమాత్రమే యగునో, ఆస్థితియందు ఎవ్వఁడు ఎవ్వనిని చూచును?" అను మొదలగు వాక్యములచే "జ్ఞానదృష్టిచేఁ గనువిచ్చి చూచిన సర్వవ్యవహారములు నడఁగిపోవును" అనియుఁ జెప్పుచున్నవి. ఇట్లగుటచే, వ్యవహార మనునది యెంతవఱకు నుండునో అంతవఱకు కల్పితభేద మాశ్రయింపఁబడుచునే యుండును. కావున ప్రస్తుత వ్యవహారము ('అంతర్యామి వేఱు జీవుండు' అను వ్యవహారము) గూడ నట్టిదియే. ఇంతమాత్రమువలన భేదము వాస్తవము కానక్కఱలేదు. వాస్తవస్థితిలో నిచ్చట జీవుఁ డనఁబడువానికంటె భిన్నుఁడై సర్వమును నియమించుచు నీశ్వరుఁ డను పేరుతో నొక్కఁడు లేఁడు. ఆజీవేశ్వరు లిరువురు నొక్కటియే. అయినను లోకుల భ్రాంతి ననుసరించి, వారికి జీవుని యథార్థస్వరూప మీ విధముగ (ఈశ్వరుఁ డను పేరుతో) వర్ణింపఁబడుచుండును.

ఈ కారణమువలననే యిచ్చట ననవస్థాదోషము(నిలుపు లేకపోవుట యనుదోషము) రాదు. జీవేశ్వరులకు భేదము వాస్తవమై, అందు జీవుఁడు దేహాదుల నియమించువాఁడై వాని నీశ్వరుండు నియమించుట యనునది కల్గునేని, యప్పుడు ఆదోషము వచ్చును. దేహాది నియామకుఁడగు చేతనుని మఱియొకచేతనుఁడు నియమించు ననుటయే సిద్ధాంతమగునేని, "ఆచేతనునిఁగూడ నియమించు చేతనుఁడు మఱియొకఁ డుండవలయును. ఆతని నియమించుటకును మఱియొకఁడు కావలయును" అని యనవస్థ వచ్చును గాని, లేకున్న నట్లు రాదుకదా! కావున నెట్లు చూచినను ఈ సిద్ధాంతమున దోష మింత యైనను లేదు.

---

## ౬. అదృశ్యత్వాద్యధికరణము.

విషయము:—ముండకోపనిషత్తునందు "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" "జ్ఞానకర్మేంద్రియముల కగోచరంబును, నామరహితంబును, జాతిశూన్యంబును,జ్ఞానేంద్రియ కర్మేంద్రియ రహితంబును, శాశ్వతంబును, సర్వశక్తియు, సర్వవ్యాపకంబును, అతిసూక్ష్మంబును, సర్వప్రపంచకారణంబును అగునేయక్షరంబును వివేకవంతులెఱుంగుచున్నారో, అట్టి తత్త్వమును తెలుపువిద్య పరావిద్య,"అను వాక్యము కలదు. వానియర్థ మీయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున అదృష్టత్వాదిగుణము లున్నను ద్రష్టృత్వాదులు లేవని ప్రధానమును నిరాకరించితిరి. పైవాక్యమును విచారింపఁదలఁచిన నట్లు నిరాకరించుటకు వీలు లేదు. ఇచ్చట ప్రధానమునకు సంభవింపని ధర్మము లెవ్వియుఁ జెప్పఁబడి యుండలేదు" అను నాక్షేపమునకు సమాధానముగ నీ యధికరణ మారంభింపఁ బడెను. పూర్వాధికరణసిద్ధాంతమునకుఁ బ్రత్యుదాహరణముగ పైవాక్యము చూపఁబడెను. కావున నీ రెండధికరణములకును గల సంబంధము ప్రత్యుదాహరణ సంబంధము.

---

* ప్రత్యుదాహరణ స్వరూపము (పుట. ౭౩ చూడుము).

సందేహము:—ఈ వాక్యమున నర్థనిర్ణయము లేని యక్షరమను పదము ప్రయోగింపఁబడి యుండుటయే సంశయకారణము. "అక్షర శబ్దముచేఁ జెప్పఁబడువారు ప్రధాన జీవులే, బ్రహ్మమే" అనునవి క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఇది యుపాసనాప్రకరణము కాదు. కావున పూర్వపక్షమున కుపాసనయు సిద్ధాంతమునకు బ్రహ్మజ్ఞానంబును ఫలములు.

ఈ రెండుపక్షముల నాశ్రయించి యీక్రింది పూర్వపక్ష ముదయించును:—

పూర్వపక్షము:—ఇచ్చట నక్షరపదముచేఁ జెప్పంబడువారు ప్రధానజీవులే యై తీరవలయును. యీప్రపంచ మచేతనము. దీనికిఁ గారణము గూడ నచేతనమే కావలయును. పై వాక్యమునందును "భూతయోనిం" అనుటచే "అక్షరశబ్దము జగత్కారణమును చెప్పును" అను విషయము స్పష్టమగుచున్నది. కావున నచేతనమగు ప్రధానమే యక్షర శబ్దార్థము కావలయును.

లోకమున ఆరంభము, పరిణామము, వివర్తము అను మూఁడును పదార్థోత్పత్తికిఁ గారణములు. అందు ఈప్రపంచము పరిణామమువలనఁ బుట్టినను వివర్తమువలనఁ బుట్టినను దీని కచేతనమే కారణము కావలయును. కార్యకారణములకు పరస్పరసమానరూపత్వ ముండవలయు ననుట నిస్సంశయ మగువిషయము. ఎవ్వఁడైనను త్రాటినిఁ జూచిన పాముగానే తలంచును; గాని యేనుఁగుగాఁ దలంపఁడు. సువర్ణముచే నేర్పఱుపఁబడినదాని సువర్ణముగాఁ జూచును గాని మృత్తికగాఁ జూడఁడు కదా! కావున నిచ్చట నక్షరశబ్దముచేఁ బరమాత్మయే చెప్పఁబడు ననిన, నాయన చేతనుఁడును ప్రపంచ మచేతనంబు నగుటచే విరోధము తప్పక వచ్చును.

మఱియు "భూతయోనిం" అనుపదమునకు "ప్రపంచ*నిమిత్త కారణమును" అని యర్థము చెప్పినను, అక్షరశబ్దార్థము పరమేశ్వరుఁడు

---

* ఆరంభము, పరిణామము, వివర్తము (పుట. ౭౭ చూడుము).

*కారణత్రయనిరూపణము:—సమవాయికారణము, అసమవాయికారణము, నిమిత్త కారణము అని కారణములు మూఁడు. ఇవి ప్రతిపదార్థములయొక్క జన్మమునకు నావశ్యకములు.

కానేరఁడు. "జీవుఁడే యక్షరశబ్దమున కర్థ మేల కాకూడదు?" అనిన సమాధానము లేదు కదా! జీవుఁడును అనాదికర్మబలమున సర్వభూతములఁ గల్పించుచుండును, లేక సంపాదించుచుండును కదా! 'పూర్వ

---

౧. సమవాయికారణము:—తనసముదాయముచేఁ గార్యరూపము నొందుకారణము నూలుపోగులు తా మొండొంటితోఁ గూడి వస్త్రమును కలిగించుచున్నవి. ఇప్పుడు ఆనూలు వస్త్రమునకు సమవాయికారణము.

౨. అసమవాయికారణము:— తాను ప్రత్యక్షముగ సంబంధింపకున్నను, తన కార్యముతోఁ గాని, ఆకార్యముయొక్క సమవాయికారణముతోఁగాని సంబంధము గలయన్యపదార్థముతోఁ జేరియుండుకారణము. ఎట్లనిన: తంతుసంయోగము (దారముల చేరిక) వస్త్రమునకుఁ గారణము. ఇచ్చట చేరికయనునది దారములయొక్క గుణము. దారములతోనే సంబంధించి యుండును. మఱియు దారములు వస్త్రముతో ప్రత్యక్షసంబంధము కలిగియుండును గాని వానిచేరిక యట్టిసంబంధమును కలిగి యుండదు. చేరిక దారముల గుణము కాని ప్రత్యేకముగ నుండుపదార్థము కాదు కదా! కావున నీచేరిక వస్త్రమునకుఁ గారణమైనను సమవాయికారణము కానేరదు తనకు కార్యము వస్త్రము. దానికి దారములతో సంబంధము కలదు. అట్టిదారములతో తనకును సంబంధము కలదు. ఇట్లు కార్యములోఁ గూడ నన్యపదార్థమునకు (దారములకు)సంబంధపడియున్నది యగుటచే నిది యసమవాయికారణము. ఇట్లే దారముల గుణ మగురూపము వస్త్రగుణ మగురూపమునకుఁ గారణ మని చెప్పఁబడునప్పుడు, ఆతంతురూపమునకు మఱింతదూర మగుసంబంధము కలిగియుండును. వస్త్రరూపము కార్యము. అది తనకు సమవాయికారణ మగువస్త్రముతో సంబంధపడి యుండును. ఆవస్త్రంబును తనకు సమవాయికారణ మగుదారములతో సంబంధించును. ఆతంతురూపంబును తంతువులగుణమే యగుటచే వానితో (దారములతో) సంబంధపడును. ఇది లక్షణమునఁ గలరెండవభాగమునకు ('తన కార్యముయొక్క సమవాయికారణముతో సంబంధము గలయన్యపదార్థముతోఁ గూడిన సమవాయికారణమునకు సంబంధ ముండవచ్చును.' అనుభాగమునకు) నుదాహరణము.

3. నిమిత్తకారణము:—పైరెండు లక్షణములును లేనికారణము నిమిత్తకారణము. నాఁడె పలక మగ్గము మొదలగునవి వస్త్రములకును కారణములే. పైలక్షణములు వీనికి లేవు కావున నిమిత్తకారణములు.

మఱియు నీకారణములను ఉపాదాన-నిమిత్తము లనుభేదములతో విభజింపవచ్చును. ఏవిధముగఁ గాని కార్యరూపముతోఁ బరిణమించుకారణ ముపాదానకారణము. ఈజాతిలో మొట్టమొదటిరెండును చేరును. అట్లు పరిణమింపనికారణము నిమిత్తకారణము. ఇదియే మూఁడవది. దీనియందు ఆయాకార్యముల నాచరించుచేతనుఁడు (సాలెవాఁడు మొదలగువారు) కూడఁ జేరుదురు.

 

కల్పకర్మానుసారముగ నుత్తరసృష్టిని పరమేశ్వరుఁ డాచరించును. " అని యర్థ మిచ్చు "స తపో ఽతప్యత" అను మొదలగు శ్రుతు లీవిషయమునఁ బ్రమాణములు. కావున నెట్లు చూచినను అక్షరశబ్దార్థము ప్రధానమో, కాక జీవుఁడో కావలయును కాని పరమేశ్వరుఁడు కానేరఁడు. ప్రధాన మొకవేళ వేదోక్తము కా దనినను, ప్రపంచబీజభూత మగు అవ్యాకృతము* అక్షరశబ్దార్థ మగును గాని, పరమేశ్వరుఁడు మాత్ర మెప్పటికిని అట్టివాఁడు కానేరఁడు.

"సృష్టిని చెప్పు శ్రుతులు 'సర్వమునకు పరమేశ్వరుఁడే కారణము' అని చెప్పుచున్నవి. ఇట్లుండ నీనూతనకల్పన యెట్లు సరిపడును?" అని యెదవేమొ, అందు దోష మేమియు లేదు. ఎప్పటికి సృష్టిని చేయునది యా యవ్యాకృతమే యైనను, దాని కాశ్రయుఁ డగుటచేఁ బరమేశ్వరునే కర్త యని కొన్ని శ్రుతులు చెప్పవచ్చును. మఱికొన్ని యవ్యాకృతమునుమాత్రమే యంగీకరింపవచ్చును. కావున నెట్లు చూచినను అక్షరశబ్దార్థము జీవప్రధానములలో నేదియైన నొక్కటి కావలయునే కాని పరమేశ్వరుఁడుమాత్రము కాఁడు.

అవతారిక:—అను నీ పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.—

## ౫౧. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః. ౧. ౨. ౨౧.

తాత్పర్యము (సిద్ధాంతము):— పై వాక్యమున అదృశ్యత్వము మొదలగు ధర్మములచేఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. ఆపరమేశ్వరునకుఁ దప్ప నితరులకు సంభవింపనిధర్మము లిచ్చట చెప్పఁబడియున్నవి.

---

* అవ్యాకృతము:—వ్యాకృతమనఁగాఁ బ్రకటింపఁబడినది. అవ్యాకృతమనఁగా అట్లు కానిది. ఈపదము వేదాంతశాస్త్రమున మాత్రమే ప్రసిద్ధము. ఈప్రపంచమంతయు నామరూపాత్మకము. సృష్టియు నామరూపప్రకాశమే. లోకమున నేపదార్థమునుండి యైనను బుద్ధిశక్తివలన నామరూపముల విభాగించినచో నిఁక నేమియు నుండదు కదా! కావున నేసమయమున నామరూపంబులు (ప్రపంచము) ప్రకటము (సృష్టి) లగునో, ఆసమయమున నవి వ్యాకృతము లగును. అట్లు లేనప్పుడు (సృష్టికిఁ బూర్వమున ప్రకాశముగ, లేక సూక్ష్మరూపమున నున్నప్పుడు) అవ్యాకృతము లగును. ఈనామరూపములను సామాన్యముగ ప్రపంచశబ్దముతో గ్రహింతురు. కావున నవ్యాకృతశబ్దమునందు కూడ నేకవచనము ప్రయోగింపఁబడినది.

ఎట్లనిన:—

ఈమంత్రమునకు సమీపముననే "యః సర్వజ్ఞ స్సర్వవి ద్యస్య జ్ఞానమయం తపః, తస్మా దేత ద్బ్రహ్మ నామ రూప మన్నం చ జాయతే" "ఎవ్వఁడు సామాన్యముగ విశేషముగఁ గూడ సర్వము నెఱుంగునో, ఎవ్వని తపస్సు జ్ఞానరూప మైనదియో, అట్టివానినుండి సూక్ష్మభూతములును నామరూపములును పృథివ్యాదిస్థూలభూతములును సర్వభోగ్యపదార్థములును కలుగుచున్నవి." అనుమంత్రము కలదు. ఇందును జగత్కారణమే ప్రస్తావింపఁబడి, దానికి సర్వజ్ఞత్వాదిగుణములు చెప్పఁబడియున్నవి. ఈగుణములు అచేతన మగుప్రధానమునకుఁ గాని, పరిచ్ఛిన్నుఁ డగుజీవునకుఁ గాని సంభవించునవి కావు కదా! కావున ప్రస్తావానుసారముగ (అనఁగా: "యత్త దద్రేశ్యం" అను మొదలగు వాక్యమున చెప్పఁబడినట్లే యిచ్చట కూడ చెప్పఁబడి యుండుటచే) విచారించిన నీసర్వజ్ఞాదిమంత్రముచేఁ జెప్పఁబడినదియు జగత్కారణమే యని గుఱుతింప నను వగుచున్నది.

మఱియు నీయుపనిషత్తునందు మొట్టమొదట "పరాపరవిద్యలు రెండు కలవు." అని చెప్పఁబడి' యందు ఋగ్వేదాదిరూప మగు 'అపరావిద్య' తొలుదొల్త నిరూపింపఁబడెను. 'పరావిద్య' యారంభింపఁబడెను. జగత్కారణ మగునక్షరమే దానికి విషయముగ వర్ణింపఁబడెను. "ఇహపరలోకములయం దభివృద్ధి నొసంగునది యపరవిద్య; మోక్షము నొసంగునది పరవిద్య" అని విద్యలకు విభాగ మేర్పడెననుట సుప్రసిద్ధము. ఇప్పుడు విచారింపుము. పరవిద్య దేని నుపదేశింపవలయును? పరమేశ్వరునే కదా! పరమేశ్వరజ్ఞానమువలననే కాని ముక్తిదొరక దనుట సిద్ధాంతము. ప్రధానాదిజ్ఞానమువలన మోక్షము కలుగదనుట మీకును సమ్మతమే కదా! కావున నక్షరశబ్దార్థము పరమేశ్వరుఁడే కావలయును. "ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం" "యథార్థముగ బ్రహ్మవిద్య నంతయును వివరింప నారంభించెను" అని మొట్టమొదట నుపక్రమింపఁబడి యున్నది. పిదప పరాపరవిభాగము చేయఁబడి అందును "ప్లవా హ్యేతే...." "ఈ కర్మలన్నియు ఓటితెప్పవంటివి" అను మొదలగువాక్యముచే నపరవిద్యానిందాపూర్వకముగ పరవిద్య ప్రశంసింపఁబడినది. "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్" "బ్రహ్మ

జ్ఞానియగువాఁడు కర్మచే సంపాదింపఁబడిన దగుటచే నీలోక మసత్యమని యెఱింగి వైరాగ్యమును చెందవలయును." అను మొదలగు వాక్యములచే "బ్రహ్మవిద్యయే యాశ్రయణీయ మనియుఁ జెప్పఁబడియున్నది. కావున 'పరావిద్య'బోధించు నక్షరము పరమేశ్వరుఁడు కాకపోయినచో, బ్రహ్మవిద్యాశబ్దార్థము భగ్నము కావలసి వచ్చును. అప్పుడు పైన చూపినసర్వ ప్రమాణములకును విరోధము వచ్చునుకదా!

ఇదియును గాక "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం" "ఓభగవంతుఁడా! ఏపదార్థము నెఱింగిన సర్వ ప్రపంచము నెఱుంగఁబడును" అని యుపనిషదారంభమున శౌనకప్రశ్న వర్ణింపఁబడి యున్నది; మిగిలిన యుపనిషత్తు దానికి నుత్తరముగా నిర్ణయింపఁబడినది. అందును పరవిద్యయే మొదటనుండియు కడవఱకు వివరింపఁబడు చున్నట్లు పైననే నిరూపించి యున్నాము. కావున పరావిద్య బోధించు నక్షరము ప్రధానాదులలో నేదియైనను పైప్రశ్నమునకు నుత్తరమునకును తప్పక విరోధము వచ్చును. ప్రధాన మచేతన మగుటచే దాని నెఱింగిన కార్యకారణా భేదమువలన నచేతనప్రపంచము మాత్రమే గోచర మగును; కాని చేతనప్రపంచము గోచరము కాదు; ఇఁక జీవు నాశ్రయించినను, ఆతఁడు ప్రపంచవ్యతిరిక్తుఁడగుటచేఁ, దజ్జ్ఞానమువలన నచేతనప్రపంచ జ్ఞానము కలుగదు. కావున సర్వాత్మకుఁ డగుపరమేశ్వరుఁడే యక్షరశబ్దార్థ మనవలయును.

పూర్వపక్షము:—ఇదియు సరి కాదు. "య థోర్ణనాభిః సృజతే గృహ్ణాతే చ" "సాలెపురుగు తనదేహమునుండి తానే దారమును సృజించి మరల తనయందే యడంచుకొనునట్లు"అను మొదలగుదృష్టాంతములచే, అక్షరమునుండి సృష్టి ప్రవర్తించిన విధ ముపనిషత్తునందు నిరూపింపఁబడినది. ఈదృష్టాంతములయందు అచేతనపదార్థమే వర్ణింపఁబడెను. దారమునకు నచేతన మగుసాలెపురుగుయొక్క దేహమే కదా కారణము ? కావున నీదృష్టాంతమును పట్టి చూచిన * దార్ష్టాంతిక మగు నక్షరము కూడ నచేతనమే కావలయు నని తోఁచుచున్నది.

* దార్ష్టాంతికము:—శాస్త్రప్రసిద్ధములై లోకమునందును కావ్యములయందును గూడ వ్యవహరింపఁబడుచు నుండునలంకారము లన్నియు సామాన్యముగ నుపమాలం

సిద్ధాంతము:—ఇట్లు చెప్పఁగూడదు. దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణమగుపోలిక యుండవలయునను నియమము లేదు. లోకమున నట్లుండుటయు నెన్నటికిని తటస్థింపదు. "ముఖము చంద్రునివలె నున్నది" యనిన, "ముఖము చంద్రునియట్లు నున్ననై కనుముక్కులు లేక యున్నది" యని యర్థము కాదు కదా! కావున, మన మేవిషయమున పోలిక నభిలషించి దృష్టాంతదార్ష్టాంతికముల నుపయోగింతుమో, ఆవిషయము నందు మాత్రమే వానికి పోలిక కల దని తెలిసికొని తృప్తి నొందవలయును. ప్రస్తుతమున సాలెపురుగును పోల్చుటచే, "సాలెపురుగునుండియే జనించుచు దానిచేతనే యనేకరూపములతో అల్లఁబడుచు నున్నదారమువలె నీప్రపంచముకూడ పరమేశ్వరు నుండియే జనించుచు నాయనచేతనే బహురూపములతో విస్తరింపఁజేయఁబడుచున్నది" అనువిషయము (అనఁగా: ఈప్రపంచమునకు నుపాదానకారణంబును నిమిత్తకారణంబునుకూడ పరమేశ్వరుఁడే యనువిషయము) స్పష్టమగును. కావున నెట్లు చూచినను అక్షరశబ్దార్థము పరమేశ్వరుఁడే యనుటలో సంశయము లేదు.

---

కారములే యనవచ్చును. కొంచె మించుమించు సర్వాలంకారములు నుపమాభేదములే. పోల్పఁబడుపదార్థము, ఉద్దేశింపఁబడుపదార్థము, ఈరెంటికిని గలపోలిక, అనునవి సామాన్యముగ నన్ని యలంకారములయందు నుండును.

ముఖ్యముగ దృష్టాంతాలంకారమునకు నుపమాలంకారమునకును మిగులఁ జేరువ. ఉపమాలంకారమున నేకవాక్యమునందే 'పోల్పఁబడుపదార్థము, ఉపమానము' మొదలగునవి చెప్పఁబడి యుండును. దృష్టాంతాలంకారమునందు విషయ మొకవాక్యమునందును, విషయి మఱియొకవాక్యమునందును వర్ణింపఁబడును. ఈరెండలంకారములకు నింతమాత్రమే భేదము. కావుననే వ్యాఖ్యానమున "ముఖము చంద్రునివలె నున్నది" యని యుదాహరింపఁబడెను. విషయవిషయులు క్రమముగ నుపమానోపమేయములు. అవియే దృష్టాంతదార్ష్టాంతికములు. పైనిరూపించినకారణమువలన (ఈదృష్టాంతాలంకారము ఉపమాలంకారముతో సమాన మగుటచే) దృష్టాంతాలంకారమునందును అన్నియు నుపమాధర్మములే యుండును. ఉపమాలంకారమునందు ఉపమానోపమేయములకు నెట్లు సంపూర్ణసాదృశ్య ముక్కఱ లేదో అట్లే యిచ్చటఁ గూడ సంపూర్ణ సాదృశ్య ముక్కఱ లేదు.

# అ ౧. పా ౨. సూ ౨౨. ఆరంభము.

పూర్వపక్షము:—ఈ సిద్ధాంతము సరి కానేరదు. "యః సర్వజ్ఞః" అనుమొదలగు శ్రుతి జగత్కారణమును గూర్చి చెప్పునది కాదు. "అక్షరా త్పరతః పరః" "అక్షరమునకంటె పరుఁడు" అని చెప్పఁబడిన పరమేశ్వరునిగూర్చి మాత్రమే చెప్పును. "తథాక్షరా త్సంభవ తీహ విశ్వం' 'ఆయక్షరమునుండియే ప్రపంచము పుట్టును' అని యుండి, పిదప 'తస్మా దేతత్....జాయతే' 'ఆసర్వజ్ఞునుండి ప్రపంచము జనించెను' అని యుండుటచే నాయక్షరమే సర్వజ్ఞమని తేలుచున్నది. మఱియు 'యే నాక్షరం పురుషం వేద' 'దేనిచేత నక్షరరూపుఁడగు పురుషుని తెలిసికొనెనో' అని చెప్పుటచే 'అక్షరశబ్దవాచ్యుఁడు పురుషుఁడే' అని తేలుచున్నది. ఇట్లుండ నీయాక్షేపమునకు నవకాశ మెక్కడిది" అని యెదవేమొ, అదియు సరికాదు. "అక్షరా త్పరతః పరః" అని స్పష్టముగ నక్షరమునకంటె పురుషుని భిన్నునిగఁ జెప్పియుండ నీసిద్ధాంతమునకు నిలుకడ యెట్లు కలుగును?

అవతారిక:—అను పూర్వపక్షమును క్రిందిసూత్రముచే ఖండించుచున్నాఁడు.

## ౫౨. విశేషణభేదవ్యపదేశాభ్యాం నేతరౌ. ౧. ౨. ౨౨.

తాత్పర్యము (సిద్ధాంతము):—ఈవాక్యమునందు చెప్పఁబడినవారు ప్రధాన-జీవులలో నెవ్వరును కానేరరు. ఉత్తరగ్రంథమున నట్టివిశేషణంబులు కలవు. ప్రత్యక్షముగ భేదంబును చెప్పఁబడియున్నది.

"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః" "ఆజగత్కారణ మగుపురుషుఁడు స్వప్రకాశరూపుఁడు; నిరాకారుఁడు; లోపల వెలుపల నేకరూపముతో వ్యాపించి యుండువాఁడు; జన్మమరణములు లేనివాఁడు" అనువాక్యము ఉత్తరగ్రంథమున కలదు. ఇందలివిశేషణములు, అవిద్యావశమునఁ బరిచ్ఛిన్నుఁడై జన్మమరణాదుల నభిమానించుజీవునకు సంభవింపవు. అచేతనమగుప్రధానమునకుఁ గూడ సరిపడవుకదా!

"అక్షరాత్పరతః పరః" అనియు ప్రత్యక్షముగనే ప్రధాన-పురుషులకుఁ గూడ భేదము చెప్పఁబడియున్నది. వాస్తవస్థితిలో ప్రధాన మనఁబడుచు సాంఖ్యోక్త మగురీతి స్వాతంత్ర్య మగు నీచేతనపదార్థ మొక్కటి ప్రత్యేకముగ లేదు. అట్లుండుటను శ్రుతి యంగీకరింపదు. ఇఁక నిచ్చటి యక్షరశబ్దార్థము ('అక్షరాత్పరతః' అను వాక్యమునందలి యక్షరశబ్దమున కర్థము) ఏది యనిన, అవ్యాకృత మను పేరు గలిగి సర్వవికారములకు నాశ్రయమై పరమేశ్వరుని యవలంబించి యాయన కే యావరణమై యున్నభూతసూక్ష్మమే(ఉత్పత్తికిఁ బూర్వము బీజములం దంకురమువలె పరమేశ్వరునియం దడంగి యున్నపంచభూతములే); "శ్రుతిసమ్మత మగునీయవ్యాకృతమే ప్రధానము" అనియెదవేమో, యప్పుడు మామతము నవలంబించినవాఁడవే యగుదువు. కావునఁ బైఁజూపినవిశేషణములవలనను భేదమువలనను ప్రధాన-జీవులు అక్షరశబ్దార్థములు ("అథ పరా యయా త దక్షర మధిగమ్యతే" అనువాక్యమునందలి యక్షరశబ్దమున కర్థములు) కానేరవు. తదర్థము పరమేశ్వరుఁడే.

నీ వింతకు ముందు అక్షరశబ్దమునకు ("అథ యయా" అను వాక్యమునందలియక్షరశబ్దమునకు) ప్రధానమే యర్థ మనియు, అదియే జగత్కారణ మనియు, "అక్షరాత్ ...." అను మొదలగు వాక్యము మాత్రమే పురుషుని చెప్పు ననియుఁ దలంచి యాక్షేపించియున్నావు. అది యయుక్త మని పైవ్యాఖ్యానముచే నిరూపింపఁబడెను. అనేక ప్రమాణములకు విరోధముగ 'అథ యయా....' అనువాక్యమునందలియక్షరశబ్దమునకు నర్థాంతరమును కల్పించుట యయుక్త మని పైన నిరూపింపఁబడినది. కావున "అక్షరాత్పరతః" అని వర్ణింపఁబడినది కూడ, "అథ యయా" అను వాక్యమునందలి యక్షరశబ్దముయొక్క యర్థమే; పరమేశ్వరుఁడే.

## ౫౩. రూపోపన్యాసాచ్చ. ౧. ౨. ౨౩.

తాత్పర్యము:— మఱియు "అగ్ని ర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ" "ద్యులోకము శిరస్సు; చంద్రసూర్యులు కన్నులు" అని శ్రుతియందు రూపము వర్ణింపఁబడియున్నది. ఆరూపము జగత్కారణమునకే కల దనియు చెప్పఁబడి యున్నది. అది పరమేశ్వరునకే తప్ప మఱియొక్కనికి సంభవింపదు కదా! కావున నిచ్చటఁ జెప్పఁబడిన జగ

త్కారణము పరమేశ్వరుఁడే. పరిచ్ఛిన్నుఁ డగుటచే జీవునకును సర్వ భూతాంతర్యామి (చేతనాంతర్యామి) కాకపోవుటచే ప్రధానంబునకును ఈరూపము సంభవింపదు.

"ఇచ్చట చెప్పఁబడినరూపము పరమేశ్వరునిదే" అనువిషయ మిచ్చటిసందర్భమువలననే తేటపడినది. మొట్టమొదట "ఏతస్మా జ్జాయతే ప్రాణో" "ఈజగత్కారణమునుండియే హిరణ్యగర్భుఁడు (సమష్టిసూక్ష్మ శరీరాభిమాని) జనించుచున్నాఁడు" అని యారంభించి, పిదప, "అగ్నిః ....ఏష భూతాంతరాత్మా" "ద్యులోకము.... మొదలగునవి యవయవ ములుగఁ గలయీతఁడే సర్వభూతములకు నంతర్యామి" అని యుప దేశింపఁబడియున్నది. కావున నీరూపము జగత్కారణపదార్థమునకు సంబంధించునదియే.

"పరమేశ్వరుఁడు నామరూపాదులు లేనివాఁడు కదా" యని యెదవేమొ వినుము. ఇచ్చట "పరమేశ్వరునకు రూపము చెప్పవల యును" అనునుద్దేశముతో శ్రుతి వచింపలేదు. ఆయన సర్వమయుఁడు కావున నావిషయము ఆకారవర్ణనావ్యాజముచే నిరూపింపఁబడినది. ఇట్ల గుటచే నిందు దోష మేమియు లేదు.

విశేషాంశము:—— ఈవాఖ్యానము శంకరాచార్యులకు సమ్మతము కాదు. ఇది వృత్తికారుని మతము. "అగ్ని ర్మూర్ధా" యనుమంత్రము సృష్టివాక్యములకు నడుమ నున్నది. "ఏతస్మా జ్జాయతే ప్రాణో" అను నది పూర్వవాక్యము ; "తస్మా దగ్నిః" "ఆహిరణ్యగర్భునుండి ద్యులో కము జనించును, లేక పరమేశ్వరునుండి ద్యులోకము జనించును" అను మొదలగునవి యుత్తరవాక్యములు. ఇట్లుండ నడుమ నాకస్మికముగ రూపోపన్యాస మెక్కడినుండి వచ్చును? "సాన్నిధ్యమునకంటె (సమీ పమున నున్నవాక్యములకంటె) ప్రకరణము * బలవంతము కదా! దాని ననుసరించి యీరూపోపన్యాసము జగత్కారణముననే సంభవించు నని నిర్ణయింపవచ్చును" అనియెదవేమొ, అది సరి కాదు. జగత్కారణము నకు రూపము మొట్టమొదట బొత్తిగనే సంభవింప దనిన నీప్రమాణము లెట్లు పనికి వచ్చును ? ఇది యంతయుఁ గాక సృష్టినిరూపణము ముగి సినపిదప "పురుష ఏ వేదం విశ్వం" "పరమేశ్వరునుండి జనించినది

---

* ప్రకరణము. (పుట. ౧౦౨ చూడుము)

యగుటచే పరమేశ్వరుఁడే" అని,పరమేశ్వరుని యథార్థరూపము చెప్పఁబడి యున్నది కావున "అగ్నిః...." అను మొదలగు మంత్రమునందు చెప్పఁబడినరూపము పరమేశ్వరునకు సంబంధించినది యగుటకు వీలులేదు. సృష్టివాక్యమధ్యగత మగుటచే నారూపంబును మొట్టమొదట జనించిన యొకానొకపదార్థమునకు సంబంధించినదియే కావలయును. అట్టిపదార్థమే హిరణ్యగర్భుఁడు;"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" 'స వై శరీరీ ప్రథమః" హిరణ్యగర్భుఁడు మొట్టమొదట జనించెను. ఆహిరణ్యగర్భుఁడే దేహధారులలో ప్రథముఁడు"అని శ్రుతిస్మృతులీవిషయమును స్పష్టము చేయుచున్నవి.

"ఇట్లయిన నీసూత్రము వ్యర్థమే యగును కదా?" అనియెదవేమో వినుము. "పురుష ఏవేదం విశ్వం"అని పరమేశ్వరునిరూపమును చెప్పుశ్రుతికూడఁ గలదు. కావున దాని నవలంబించి యీసూత్రమునకు వ్యాఖ్యానము చేయ వచ్చును.

"అప్పటికిని'అదృశ్యత్వాదిగుణములు కలవానికి జగద్రూప మెట్లు సంభవించును?' అను నాక్షేపము తొలఁగిపోదు" అనియెద వేమొ, వినుము. ఇచ్చట ("పురుషఏవేదం" అను వాక్యమున) పరమేశ్వరునకు నవయవములు చెప్పఁబడలేదు. "కారణకార్యములకు భేదము లేదు కావున పరమేశ్వరప్రపంచములకును భేదము లేదు" అని మాత్రమే చెప్పఁబడి యున్నది. "కస్మిన్ను" అను ప్రశ్నమునకు నుత్తరముగ, "కారణభూతుఁడగుపరమేశ్వరు నెఱింగినఁ దత్కార్య మగుచేతనాచేతనప్రపంచ మంతయు నెఱుంగఁబడును" అని చెప్పఁబడినది. కావున నిది యథార్థకథనమేకాని స్వరూపకల్పనముకాదు. ఈకారణమున, "రూపహీనునకు నవయవములఁజెప్పు 'అగ్నిః' అనువాక్యముమాత్రమే, నీపక్షము నాశ్రయించిన ప్రకరణవిరుద్ధ మగును. 'పురుషః....' అను వాక్యముమాత్ర మేపక్షమునను విరుద్ధముకాదు. 'అగ్నిః' అను వాక్యము పరమేశ్వరుని సర్వమయత్వము నావిధముగ వర్ణించు నంటిమి కదా?" అనియెదవేమొ, అదియు సరికాదు. వాక్యమునకు స్వార్థమే సంభవించుచుండ నిరర్థకముగ లాక్షణికార్థమును కల్పించుట యుక్తము కాదుకదా! కావున నెట్లు చూచినను శంకరమతమే ("పురుషః" అను

మొదలగువాక్యము ననుసరించియే వ్యాఖ్యానము చేయవలయును" అనుసుత మే) యుక్తియుక్త మైనది.

---

## ౭. వైశ్వానరాధికరణము.

విషయము:—ఛాందోగ్యోపనిషత్తునందు అయిదవప్రపాఠకమునఁ బదునొకండవఖండమున నొకకథ యారంభ మగుచున్నది. ప్రాచీనశాలుఁడు, సత్యయజ్ఞుఁడు, ఇంద్రద్యుమ్నుఁడు, జనుఁడు, బుడిలుఁడు అనునైదుగురు గూడి వైశ్వానరస్వరూపమును గూర్చి విచారించి నిర్ణయింపలేక నుద్దాలకమహామునికడకుఁ బోయిరి. ఆతఁడును వారిఁ జూచి వైశ్వానరవిద్య తనకు బాగుగఁ దెలియ దనియు, కేకయదేశపురాజు దీనియందు ప్రవీణుఁ డనియుఁ జెప్పి తానును వారలతోఁగూడి యా రాజునొద్దకుఁ బోయెను. ఆప్రభువును వీరల నాదరించి గౌరవించి తదభిప్రాయము నెఱింగి యావిద్య నుపదేశింప నిశ్చయించి యిట్లనియె. "ఓ మహాత్ములారా! మీరిదివఱకు నీయుపాసనను చేయుచుంటిరా లేదా? చేయకుండిన క్రొత్తగ వైశ్వానరునిగూర్చిన విచారము మీ కేలసంభవించును? కావున నీవైశ్వానరరూపమునుగూర్చి మీమీ యభిప్రాయములఁ దెల్పుఁడు". అనిన వారును క్రమముగ ద్యులోకము, సూర్యుఁడు, వాయువు, ఆకాశము, జలము, భూమి అను నాఱింటిని వైశ్వానరుఁడుగ నుపాసించుచున్నట్లు తెల్పిరి. ఆప్రభువును వారివాక్యముల విని, ఆద్యులోకాదులు వైశ్వానరునకు నవయవములే యనియు, వానియందుఁ బ్రత్యేకముగ వైశ్వానరబుద్ధి నుంచుట దోషమనియుఁ జెప్పి, తెలిసికొనలేక యట్టియుపాసనలను గావించినవారలకు ఆయాయవయవములయందు(ఆద్యులోకాదులలో నుపాసనార్థమై గ్రహింపఁబడినది వైశ్వానరునకు నేయవయవ మగునో యాయవయవమునందు)లోపము కలుగు నని వివరించెను. పిదప ద్యులోకాదుల నన్నిటి నవయవములుగఁ గలిగియున్న మహారూపమునే వైశ్వానరునిగ నుపాసింపవలయు నని నిశ్చయము చేసెను. "తస్య హ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షు ర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో బస్తి

శేవ రయిః పృథి వ్యేవ పాదౌ....." "ఆత్మరూపుఁ డగునావైశ్వానరునకు ద్యులోకము శిరస్సు. సూర్యుఁడు కన్నులు. వాయుదేవుఁడు ప్రాణము.ఆకాశమే శిరస్సు మొదలు నడుము వఱకుఁ గల దేహము.జలము నాభ్యధోభాగము.భూమి పాదములు...."అనువాక్యముచే శ్రుతియం దీనిర్ణయము వర్ణింపఁబడెను. ఈవాక్య మీయధికరణమున విచా రింపఁబడును.

సంగతి:—పై యధికరణమున నంతమునందు "రూపోపన్యాసాచ్చ" అనుసూత్రముచే, ప్రపంచాత్మక మగుబ్రహ్మము వర్ణింపఁబడెను. దానివలనఁ ద్రిలోకశరీరుఁ డగువైశ్వానరుఁడు స్మరణకు రాఁగా, నాతని విషయమును విచారించుటకై యీయధికరణ మారంభింపఁబడుచున్నది. కావున నీయధికరణమునకును పూర్వాధికరణమునకును కలసంబంధము ప్రాస్తావికసంబంధము (కేవలప్రస్తావమువలన వచ్చిన సంబంధము).

మఱికొందఱు ఈరెండధికరణములకును దృష్టాంతసంబంధము కల దందురు.పై యధికరణమున* నుపక్రమమునందుఁ గానవచ్చునదృశ్యత్వాది ధర్మములు ప్రధాన-జీవ-పరమేశ్వరులకు సాధారణములై యుండ, "యః సర్వజ్ఞః" అనువాక్యశేషము ననుసరించి సిద్ధాంతము చేయఁబడినది. అట్లే ఇచ్చటను ఉపక్రమమునందు అగ్ని జీవ పరమేశ్వరాదులకుఁ సాధారణ మగువైశ్వానరశబ్దము కలదు. వాక్యశేషమున "ఉరో వేదిః" "హృదయము వేదిక"అనుమొదలగు వాక్యములు"ఇచ్చట చెప్పఁబడిన వాఁడు అగ్నియే" అని నిర్ణయించుచు నున్నవి. కావున నీయధికరణము నందు శ్రుతిప్రతిపాదితవైశ్వానరుఁ డగ్నియే యని నిర్ణయింపవలసియున్నది కదా!

సంశయము:—ఇచ్చట వైశ్వానరశబ్దము, ఆత్మశబ్దము కూడ కలవు.అందుచే ఈశబ్దమునకు నర్థనిర్ణయము చేయుటకు వీలు లేదు.వైశ్వానరశబ్దము తేజోభూతమును,జఠరాగ్నిని, అగ్న్యభిమాని దేవతను గూడఁ జెప్పును. ఆత్మపదము జీవాత్మ పరమాత్మలను గూర్చి చెప్పును. వీనిలో సిద్ధాంతార్థ మెద్ది? పదములకు ననేకార్థము లుండుటయే ఇచ్చట సంశయకారణము. "ఈప్రకరణమున నగ్న్యాదులే నిరూపింపఁబడెను, పరబ్ర

* ఉపక్రమము (పుట ౧౭౫ చూడు.)

ష్మామే నిరూపింపఁబడెను" అనునవి పూర్వపక్షసిద్ధాంతములు. ఉపాసనా ప్రకరణము కావున సిద్ధాంతమునకుఁగూడ నుపాసనయే ఫలము.

పూర్వపక్షము:—ఈప్రకరణమునఁ బరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁ బడు ననుటకు వీలులేదు. "య స్త్వేత మేనం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపా స్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వే ష్వాత్మ స్వన్న మత్తి" "ద్యులోకాదులచేఁ గల్పింపఁబడిన పరిమితిఁ గలిగినట్టియు ప్రత్యగాత్మరూపముతో నెఱుంగఁబడుచున్నట్టియు స్వస్వరూపభూతుఁ డైనట్టియు సర్వజీవులచేతను అజ్ఞానవశమున విభాగింపఁబడుచున్నట్టియు ఆవైశ్వానరు నెవ్వఁడుపాసించునో, వాఁడు ద్యులోకాదిసర్వలోకములయందును స్థావరజంగములయందును శరీరేంద్రియాదులయందును యథేచ్ఛముగ ఫలముల ననుభవించును" అని చెప్పఁబడి యుండుటచే వైశ్వానరుఁడు భోక్త (కర్మఫలముల ననుభవించువాఁడు) కావలసి వచ్చుచున్నాడు. "ఆతఁడు ఉపాసకునకు నాత్మయే" యని చెప్పఁబడి యున్నది కదా! పరమేశ్వరుఁ డిట్టివాఁడు కాఁడు. కావున నిచ్చట నాత్మశబ్దము ననుసరించి వాక్యము నన్వయించినను, ప్రకరణార్థము (ఛాందోగ్యోపనిషత్తునందలి ప్రకరణమున చెప్పఁబడినవిషయము జీవుఁడే కావలయును. 'ప్రాదేశ'మాత్రశబ్దమునకుఁ గూడ 'లొడితెఁడు' అని యర్థము. కావున నిట్టియల్పాకారము పరిచ్ఛిన్నుఁ డగుజీవునకు సంభవించును కాని సర్వవ్యాపకుఁ డగుపరమేశ్వరునకు సంభవింపదుకదా! ఇఁక నధ్యాత్మశబ్దము ననువర్తింపక కేవలవైశ్వానరశబ్దములు మాత్రమే గ్రహించి సమన్వయము కావింపఁ దలంతుమేని యప్పుడు అగ్న్యాదులలో నొక్కటియే ప్రకరణార్థ మగును. "ఉరో వేదిః" అను మొదలగువాక్యశేషము కూడ నీవిషయమునఁ దోడ్పడును. కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడు కాఁడు.

అవతారిక:—అనునీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.—

## ౨౪. వైశ్వానరః సాధారణశబ్ద విశేషాత్. ౧. ౨. ౨౪.

తాత్పర్యము:—ఈప్రకరణమున వర్ణింపఁబడిన వైశ్వానరుఁడు

పరమేశ్వరుఁడే. ఆత్మవైశ్వానరపదములకు ననేకార్థములు కల వనుట నిస్సంశయమే యైనను తదర్థమును నిర్ణయించుటకు తగినగుఱుతు లున్నవి.

సిద్ధాంతము:—జాబాలశ్రుతియందు "వైశ్వానరుఁడు శిరము మొదలు గడ్డమునఱకు నున్నప్రదేశములో నున్నాఁడు. ఆప్రదేశము లోడితేఁడు కావున నాయనయు లోడితేఁడే" అని చెప్పఁబడి యున్నది; కాని యిచ్చట మాత్ర మాయర్థమును గ్రహించుటకు వీలు లేదు. ద్యులోకము మొదలగుసర్వప్రపంచంబును ఆవైశ్వానరునకు రూపముగఁ జెప్పఁబడి యున్నది కదా! ఇట్టివాఁడు లోడితేఁడుప్రదేశమున నిము డుట యెట్లు? కావున నిచ్చట చెప్పఁబడిన వైశ్వానరరూపము పరమే శ్వరునకే సంభవించును. కావున నిందుఁ జెప్పఁబడినవాఁడు పరమే శ్వరుఁడే. ఆయన స్వభావముగ రూపరహితుఁడే యైనను సర్వప్రపంచ కారణభూతుఁ డగుటచే సర్వప్రపంచరూపుఁడు కావచ్చును. ప్రపంచ మేయేస్థితిని చెందుచుండునో ఆయాస్థితిని కూడఁ జెందవచ్చును. ఘట కారణ మగుమృత్తిక ఘటరూపముతో నుండు ననుటయు ఘటముతోఁ బాటు సర్వవికారములఁ జెందుచుండు ననుటయు సర్వలోకప్రసిద్ధమే కదా!

"సర్వేషు భూతేషు....అన్న మత్తి" అను మొదలగువాక్య ముచే సర్వఫలభోగము చెప్పఁబడి యున్నది. ఇదియు పరిచ్ఛిన్నుఁ డగు జీవుని కాని యగ్న్యాదులను కాని యుపాసించువారలకు సంభవింపదు. కావున నిచ్చట సర్వాత్మకుఁడే యుపాస్యదేవతగఁ జెప్పఁబడియుండ వలయును.

మఱియు "కో న ఆత్మా కిం బ్రహ్మ" అని కథారంభమున నున్నది. ఈవాక్యమునకు పరమేశ్వరుఁడే యర్థ మనుట స్పష్టము. ఆత్మశబ్దప్రయో గమువలన "దీనియర్థము జీవుఁడే" యని చెప్పద మనిన, బ్రహ్మశబ్దము దానికి నాటంకమును గల్గించుచున్నది. కావున బ్రహ్మశబ్దము ప్రయో గింపఁబడి యుండుటవలన ఈవాక్యమునకు పరబ్రహ్మమే యర్థ మనియు, ఆత్మశబ్దప్రయోగమువలన నాబ్రహ్మము స్వస్వరూపాభిన్న మనియు, వైశ్వానరంవిద్యాధికార మగుటచే నాబ్రహ్మమే యిచ్చట వైశ్వానరశబ్ద ముచేఁ జెప్పఁబడుచున్నది యనియు సిద్ధాంతము చేయవలసి యున్నది.

"ఈవాక్యమునకు నీయర్థమును చెప్పకూడదు. శ్రుతికి నిదియే యభిప్రాయ మగునేని రెండువాక్యములఁ జెప్పనేల? 'కో న ఆత్మా బ్రహ్మ' అనియే చెప్పి యుండవచ్చును కదా?" అనియెదవేమొ అది సరికాదు. అట్లు చెప్పిన నాత్మశబ్దము బ్రహ్మశబ్దమునకు విశేషణమై స్వాతంత్ర్యమును వదలును. అప్పుడు "సర్వాత్మక మగు బ్రహ్మము నుపాసింపవలయును" అని యేదియో యొకయర్థము వచ్చును కాని పైన నిర్ణయింపఁబడినయర్థము రాదు కదా!

ఇదియునుగాక "ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" "ఇట్లు వైశ్వానరు నుపాసించినవానికి సర్వపాపములు నశించును." అని యుపసంహారమునఁ జెప్పఁబడి యున్నది. ఇదియు పరబ్రహ్మోపాసన వలనఁగాని కలుగునది కాదు. కావున నెట్లు చూచినను ఈ ప్రకరణమున వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౨. సూ ౨౫. ఆరంభము.

అవః—ఈవిషయమున మఱియొక కారణమును చెప్పుచున్నాఁడు—

## ౨౫. స్మర్యమాణ మనుమానం స్యా దితి. ౧. ౨. ౨౫.

తాత్పర్యముః—మఱియు వేదము లనంతములు. కొన్ని కొన్ని స్థలములయందు, వేదమునఁ గానరానివిషయములు కూడ స్మృతు లలో వర్ణింపఁబడియున్నవి. వాని నాశ్రయించి "వీనికి మూలప్రమా ణములగు శ్రుతులు ఉండి తీరవలయును" అని నిర్ణయింపఁబడుచుం డుట సర్వశాస్త్రప్రసిద్ధము.

ప్రస్తుతప్రకరణమున వర్ణింపఁబడిన ద్యులోకాద్యవయవము లతోఁ గూడినపరమేశ్వరుఁడు మఱి యేశ్రుతిసందర్భమునందును వర్ణింపఁ బడియుండలేదు. అయినను "య స్యాగ్ని రాస్యం ద్యౌ ర్మూర్ధా ఖం నాభి శ్చరణౌ క్షితిః సూర్య శ్చక్షు ర్దిశ శ్శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః" "ఎవ్వనికి నగ్ని ముఖమో, ద్యులోకము శిరస్సో, ఆకాశము

నాభియో, భూమి: పాదములో, సూర్యుఁడు నేత్రములో, దిక్కులు శ్రోత్రములో, అట్టి లోకాత్మునకు నమస్కారము" "ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి ఖం వై నాభిం చంద్రసూర్యౌ చ నేత్రే, దిశః శ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సోఽచింత్యాత్మా సర్వభూత ప్రణేతా" "బ్రహ్మవేత్తలు ఎవ్వనికి ద్యులోకమును శిరముగాను, ఆకాశమును నాభినిగాను, చంద్రసూర్యులను నేత్రములనుగాను, దిక్కులను శ్రోత్రములనుగాను, భూమిని పాదములనుగాను చెప్పుదురో ఆయనిర్వాచ్యుఁడే సర్వభూతనియామకుఁ డని యెఱుంగుము" అని మఱియు ననేకవిధములుగఁ గూడ స్మృతులయం దున్నది. వీనిని పట్టి చూచిన నీస్మృతులకు ప్రమాణభూత మగుశ్రుతి యుండవలయు నని నిర్ణయ మగుచున్నది. ఈస్మృతులతో సమాన మగునవయవవర్ణనము చేయునది యగుటచేఁ బ్రస్తుతప్రకరణమే పైస్మృతులకు మూలభూత మనియు నిర్ణయింప ననువై యున్నది. కావున నిటఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౨. సూ. ౨౬. ఆరంభము.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము సరి కాదు. వేనియర్థమును మఱియొకవిధముగ మార్చిన బాధ యుండదో వానినే మార్పవచ్చును; గాని ప్రతిదానిని అట్లు చేయుటకు వీలు కలుగదు. ఇచ్చట వైశ్వానర శబ్దంబును, "ఏషో ఽగ్నిః" అని ప్రత్యక్షముగ నగ్నిశబ్దంబును గూడఁ గలదు. ఈరెండుశబ్దములను ఏవిధముగానైనను మార్చుటకు వీలు కలదా ? ఇవి యగ్నిహోత్రమునందు * రూఢములు.

"ద్యులోకము మొదలగువాని నవయవములుగఁ జెప్పియుండుటచే సర్వాత్మకుఁ డగుపరమేశ్వరుని మాత్రమే గ్రహింపవలయును" అని చెప్పియుంటిమి కదా ?" అనియెదవేమొ, వినుము. ఈప్రకరణమున పైనఁ జూపినవిధముగ నగ్నికిని గూడ సంబంధించినగుఱుతులు కానవచ్చుచున్నవి. ఇట్లుండ "పరమేశ్వరునకు సంబంధించిన గుఱుతులు మాత్రమే గ్రహింపవలసినవి" అనియు, "అగ్నికి సంబంధించినవి పరిత్యజింపవలసినవి" యనియు నియమ మెటనుండి వచ్చెను ?

---

* రూఢములు=రూఢికలిగినవి (పుట ౧౬౩ చూడు.)

మఱియు "హృదయం గార్హపత్యః" "వక్షస్థలము, లేక, హృదయ కమలము గార్హపత్యాగ్ని" అను మొదలగు వాక్యములచే వాక్యశేష మున త్రేతాగ్నులు కల్పింపఁబడి యున్నవి. "త ద్యద్భక్తం ప్రథమ మాగచ్ఛే త్తద్ధోమీయం" "మొట్టమొదట లోనికి పోవునన్నము జఠ రాగ్నియందు హోమ మగును."అని "యావై శ్వానరుఁడే ప్రాణాహుతికి నాధారభూతుఁడు" అను విషయము నిర్ణయింపఁబడినది. కావున "ఈ ప్రకరణమున జఠరాగ్ని చెప్పఁబడెను" అని నిశ్చయించుటకు సంశయ మేమి?. ప్రత్యక్షముగ "అంతః ప్రతిష్ఠితం వేద" "లోపల నున్న యీ వైశ్వానరు నెఱింగినవాఁడు" అనియుఁ జెప్పఁబడి యున్నది. ఇది సర్వ వ్యాపకుఁ డగు పరమేశ్వరుని విషయమున సంభవింపదు కదా!

ఒకవిధముగఁ జూచిన ద్యులోకాద్యవయవములుకూడ సరిపడును. పంచభూతములలో నొక్కటి యగుసగ్నిభూతమును ప్రకరణార్థముగా నంగీకరింతు మేని యప్పుడు దానికి ద్యులోకాదులతో సంబంధము కలుగును. శ్రుతియందును "యో భానునా పృథివీం ద్యాము తేమా మాతతాన రోదసీ అంతరిక్షం" "ఎవ్వఁడు తనకాంతిచే భూమిని ద్యు లోకమును ఆకాశమును దిక్కులమధ్యభాగమును గూడ వ్యాపించి యున్నాఁడో" అని యీవిషయము స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. పంచభూతములును సర్వవ్యాపకము లే కదా! ఇట్లగుటచే నీభూతాగ్ని కూడ పురుషునిలోపల నున్నదియు కావచ్చును.

ఇట్లు కాక నగ్న్యభిమానిని యగుదేవతను గ్రహింతుమేని, యది సర్వశక్తి కలది కావున దానియందు సర్వధర్మములును సమన్వ యము కావచ్చును. మఱియు "ప్రాదేశమాత్రం" అనుపదమునకు ముఖ్యార్థమే సంభవించుచుండ గౌణార్థమును స్వీకరించుట యుక్త మము కాదు. కావున నుపక్రమవాక్యమున నున్నను ఆత్మబ్రహ్మశబ్దముల నగ్న్యాదుల కనుగుణముగానే సమన్వయింపవలయును. జీవుని గ్రహించు టకుఁగూడ నిచ్చట చాలినంతయవకాశము లేదు. ఇఁకఁ బరమేశ్వరునకు నెట్లు కలుగును?

అవతారిక:—అనుపూర్వపక్షమును అనువాదపూర్వకముగ ఖం డించుచున్నాఁడు.

## ౨౬. శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న తథాదృష్ట్యుపదేశా దసంభవా* త్పురుష మపి చైన మధీయతే. ౧. ౨. ౨౬.

తాత్పర్యము:—పై పూర్వపక్షము సరి కాదు. వాక్యశేషము †

---

* ఈసూత్రమున "పురుష మపి చైన మధీయతే" అనుభాగమునకు మాఱుగ "పురుషవిధ మపి..." అని కొందఱు పఠింతురు. వారిపక్షము నవలంబించిన నీక్రింది విధముగ నావాక్యభాగమున కర్థము చెప్పవలయును.

ఈవాక్యమున జఠరాగ్నియే వర్ణింపఁబడె ననుట సంభవింపదు. "పురుషవిధం పురుషే ప్రతిష్ఠితం వేద" "పురుషాకారుఁడై పురుషునియందే నిలిచియున్న వైశ్వానరు నెవ్వఁడెఱుంగునో" అని వాజసనేయశాఖయందు వైశ్వానరునకు పురుషాకారము కూడఁ జెప్పఁబడెను. జఠరాగ్నికి నిది సంభవింపదు కదా! కావున నిచ్చటఁ జెప్పఁబడిన వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడే.

ఇచ్చట పురుషవిధత్వ మనఁగా, పురుషాకారము కలిగియుండుట; ఇది పరమేశ్వరునకు స్వాభావికముగ సంభవింపకున్నను ఉపాసనార్థమై శ్రుతిచేఁ గల్పింపఁబడెను. అందును వాజసనేయశాఖ యధిదైవాధ్యాత్మికభేదము లను రెండాకారములఁ గల్పించినది. దేవతకు సంబంధించినది (తనకంటె భిన్నముగ వైశ్వానరశబ్దవాచ్యుఁడగు దేవుడున్నాఁడని తలంచుట కుపయోగించునది) యగుటచే "ద్యులోకము శిరస్సు" అను మొదలగు నాకార మధిదైవాకారము. ఆత్మకు (తనశరీరమునకు) సంబంధించినది యగుటచే ("ఆవైశ్వానరుఁడు నాయందే యున్నాఁడు" అని తలంచుటకు వీలగునది యగుటచే) "ఉపాసకునిశిరస్సే వైశ్వానరునిశిరస్సు" అను మొదలగునది యధ్యాత్మాకారము.

† వాక్యశేషము:— "పదసముదాయము సంపూర్ణార్థవంతమైయుండునది వాక్యము" అనుట శాస్త్రసిద్ధము. అయినను పెక్కు చిన్నచిన్న వాక్యములు కలసి యొకయర్థమును బోధించునేని యాసముదాయమునకుఁ గూడ వాక్యమని యుపచారము కలదు.

ఏవిధములగు వాక్యములందైనను చెప్పవలసినవిషయము చెప్పఁబడిన పిదప దాని నే దృఢముచేయుటకై యుపయోగింపఁబడువాక్యము, లేక, వాక్యములు వాక్యశేష మనఁ

 

కాని ఉపక్రమము కాని యన్యథాసిద్ధి * లేక యేవిషయమును బోధిం
చునో దాని కనుగుణముగ తక్కినభాగమును సమన్వయింపవలయును.
ఇది సర్వవాది సమ్మతము. ఇచ్చట నన్ననో, వాక్యశేషము "హృదయం
గార్హపత్యః" అను మొదలగు భాగములచే నగ్నిని చెప్పుచున్నట్లున్నది;
గాని దానికి నన్యథాసిద్ధియు కలదు. పరమేశ్వరుని, జాతరాగ్నిరూప

---

బడును. వాక్యము తెలుపునర్థమునఁ గొంతకొఱఁత యుండిన దాని పూర్తిచేయును; కావున
నీపేరు కలిగినది. "య ఏష ఆకాశ ఆనన్దో న స్యాత్" "ఈయాకాశ మానందము
కాకపోవునేని" అను నీవాక్యమునందు "ఆనందో న స్యాత్" అనునది శేషము. ఆకాశ
శబ్దముచే నర్థనిర్ణయము కాకున్న నీవాక్యశేషము నిర్ణయము నాచరించును. ఆనంద
రూపత్వము బ్రహ్మమునకే తప్ప మఱియొక్కనికి ధర్మము కాకపోవుటచే "ఇచ్చటి
యాకాశపదమునకు బ్రహ్మమే యర్థము" అను విషయమును స్పష్టము చేయును. ఇది
యేకవాక్యగతశేషమున కుదాహరణము. ఈవాక్యశేషముకూడ నేకవాక్యరూపమే. ఇఁక
రెండవదానికి (బహువాక్యగతంబును బహువాక్యరూపంబు నగు వాక్యశేషమునకు)
ప్రకృతసందర్భమే యుదాహరణము. ఇందు పదునొకండవఖండము మొదలింతవఱకు
(పదునెనిమిదవఖండమువఱకు) చెప్పఁబడుచు వచ్చిన వైశ్వానరస్వరూపము అగ్నిరూప
ముతో నుపాసింపఁబడవలసినదిగా "ఉరో వేదిః..." అను మొదలగు వాక్యశేషముచే నిర్ణ
యింపఁబడినది; ఆవాక్యశేషమునందును అనేకవాక్యములు కలవు.

* అన్యథాసిద్ధి:— అన్యథాసిద్ధి యనఁగా మఱియొకవిధముగఁ గూడ నుద్దేశము
ఫలించుట. ఒకకారణమును చూపి "దీనివలననే కాని మనయుద్దేశము ఫలింపదు"
అని నిరూపించిన, కేవలము దానివలననే కాక మఱియొక దానివలనఁ గూడ నాయుద్దేశము
ఫలించునట్లు తటస్థించుట. "బాగుగ మాటాడఁగలిగినఁ గార్యములు చక్కపడును"
అనిన "కేవలము మాటాడఁగలిగినంతమాత్రముననే చక్కపడవు. మాటాడ నేరకున్నను
చక్కని బుద్ధియుండినచోఁ జక్కపడును" అని చెప్పవచ్చును. ఇప్పుడు మొట్టమొదట
చెప్పఁబడిన కారణమువలనమాత్రమే కార్యసిద్ధి కావలయు ననునియమము లేదు కదా!
కావున నా హేతువునకు (మాటలాడఁగలుగుట యను హేతువునకు) నన్యథాసిద్ధి వచ్చెను.
ఇట్టి హేతువునకు నన్యథాసిద్ధ మని పేరు.

ప్రకృతమున వాక్యశేషమునందు "ఉరో వేదిః" అను మొదలగు నీవాక్యముల
యందు అగ్నిలక్షణములు చెప్పఁబడియున్నవి. అయినను వానియం దన్యథాసిద్ధిలేక
పోలేదు. అగ్నిలక్షణములు కేవల మగ్న్యుపాసనకొఱకే కాక యగ్న్యాధారమగు
పరమేశ్వరోపాసనకొఱకుఁ గూడఁ జెప్పఁబడియుండవచ్చును కదా! ఇట్టి యన్యథా
సిద్ధిలేని హేతువు లనన్యథాసిద్ధములు (నియతములనుట).

ముతోఁ గాని జాఠరాగ్నియం దున్నట్లు కాని యుపాసింపవలయు నని చెప్పునప్పుడు కూడ నిట్లే యగ్ని ధర్మములు చెప్పఁబడవలయును కదా. "మనోబ్రహ్మేత్యుపాసీత" "మనస్సును పరబ్రహ్మమునుగ నుపాసింపవలయును" అని చెప్పినస్థలమున, "త దేత చ్చతుష్పా ద్బ్రహ్మ వాక్పాదః ప్రాణః పాద శ్చక్షుః పాద శ్శ్రోత్రం పాదః" "ఆమనోరూప బ్రహ్మమునకు వాక్కు ఘ్రాణము నేత్రము శ్రోత్రము అనునవి పాదములు" అని మనోధర్మములు మాత్రమే చెప్పఁబడినవి. ఈవాగాదీంద్రియములు అవయవములుగ నుండుట మనస్సునకే కాని బ్రహ్మమునకు కాదు కదా! మఱియు "మనోమయః" అని బ్రహ్మోపాసనమును చెప్పినస్థలము నందును తదనుగుణముగ మనోధర్మము లగు నల్పత్వాదులె చెప్పఁబడి యున్నవి కదా! కావున "ఉరో వేదిః" అని యారంభింపఁబడిన వాక్య శేషము అగ్నిని మాత్రమే చెప్పవలయును కాని పరమేశ్వరుని చెప్పదు అని నిర్ణయించుటకు వీలు లేదు.

మఱియు నీప్రకరణమున నగ్ని మాత్రమే చెప్పఁబడి పరమేశ్వరుఁడు చెప్పఁబడఁడేని యప్పుడు ద్యులోకాదిసంబంధము సంభవింప నే సంభవింపదు. జఠరాగ్నికి నిట్టిసంబంధము లే దనుట మీకును సమ్మతమే కదా!

మఱియు నాజఠరాగ్ని పురుషునిలో నుండుట సంభవించినను పురుషుఁడుగాఁ గూడ నుండుట సంభవింపదు. వాజసనేయశాఖయందు "స ఏ షోఽగ్ని ర్వై శ్వానరో య త్పురుషః" "ఈయగ్నియే వైశ్వానరుఁడే పురుషుఁడు" అని స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. కావున నీప్రకరణముసందు వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే; ఆయన సర్వవ్యాపకుఁడు కావున పురుషునిలో నుండవచ్చును; సర్వాత్మకుండు కావున పురుషుఁడుగఁ గూడ నుండవచ్చును కదా!

## అ ౧. పా ౨. సూ ౨౭. ఆరంభము.

అవతారిక:—"ఇప్పుడు మీరు 'జఠరాగ్నికి ద్యులోకాదులతో సంబంధము లేదు' అనువిషయము నాధారము చేసికొనియే సిద్ధాంతము చేసితిరి. ఇది యుక్తము కాదు. జఠరాగ్నికి నట్టిసంబంధము లేకున్నను అగ్నిభూతమునకుఁ గాని తదభిమానిదేవతకుఁ గాని యాసంబంధ ముండవచ్చును కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.—

## ౫౭. అత ఏవ న దేవతా భూతం చ. ౧. ౨. ౨౭.

తాత్పర్యము:—అగ్నిభూతము కాని తదభిమానదేవత కాని ప్రకరణార్థము కానేరదు. ప్రకరణారంభమునుండియుఁ జూపుచుండిన హేతువు లీవిషయమును నిర్ణయించుటకుఁ జాలును.

వాస్తవస్థితిలో భూతాగ్నికి ద్యులోకాదిసంబంధము కలుగుటకు వీలు లేదు. అదియు సర్వకారణ మగుపరబ్రహ్మముయొక్క వికారమే. దానికి ద్యులోకాదిమయత్వము సంభవింపదు. ఒకవికారము వికారాంతరరూపములతో నుండు ననునది యసంభవము కదా! కారణమునకు మాత్రమే సర్వవికారసంబంధ ముండును కాని యితరమునకు నుండదనుట నిస్సంశయము. మట్టి మృణ్మయపాత్రము లెన్నిటితో నైనను సంబంధించి తత్తద్రూపములతో నుండును కాని, తద్వికార మగుకుండ యట్లుండదు కదా!

"ఈప్రకరణమున ద్యులోకాదులతో సంబంధము మాత్రమే చెప్పఁబడెను; కాని తన్మయత్వము కాదు." అనియెదవేమొ, యట్లు తలంపకుము. పరమేశ్వరునకు స్వరూపము లేదు. రూపము కలపదార్థమే గాని యన్యపదార్థములతో సంసర్గము (అన్యపదార్థముల నంటి యుండుట) నొందనేరదు. అవధిని ('ఇచ్చటనుండి యింతవఱకు నున్నది' యనుపరిమితిని) చెందనేరదు. మఱియు "పరమేశ్వరుఁ డపరిచ్ఛిన్నుఁడు" అనువిషయము కూడ శ్రుతులయందు స్పష్టము చేయఁబడియే యున్నది. ఇదియును గాక "ద్యులోకము బ్రహ్మమునకు శిరస్సు; ఆకాశము దేహము" అని చెప్పిన "బ్రహ్మము ద్యులోకము నంటు చున్నది. ఆకాశము బ్రహ్మము నావరించియున్నది" అని యర్థముచెప్పుట కెట్లును వీలు లేదు. అవయవావయవు లభిన్నులుగ నుండవలయు ననుట నిర్వివాదాంశము. అవయవికి నవయవములే యాకారము కదా! కావున నెట్లు చూచినను ఈప్రకరణమున చెప్పఁబడినది ద్యులోకాదిమయత్వమే కాని కేవల సంబంధము కాదు.

మఱియు నగ్నిదేవత కూడఁ బ్రకరణార్థము కానేరదు. దానిని గూర్చి ద్యుమూర్ధత్వాదుల (ద్యులోకము శిరముగా నుండుట మొదలగు ధర్మముల)ఁ జెప్పుట సంభవింపదు. అది సర్వమయ మగుటకు

సర్వకారణము కాదు ; ఐశ్వర్యము కూడఁ బరమేశ్వరునకు నున్నదాని కంటె నెన్నియో మడుంగులు హీనమైనది. కావున నిది ప్రకరణార్థ మగుటకు వీలు లేదు. ఇవి యన్నియు నట్లుండ నుపక్రమమునందుఁ గానవచ్చు నాత్మబ్రహ్మశబ్దము లీయన్నిపక్షములయందును వ్యర్థములు (ఉపపత్తి లేనివి) అగు ననుట నిర్వివాదాంశము. కావున మీ రుదహరించిన "యో భానునా" అను మొదలగు వాక్యములు కూడ, పరమాత్మవికారమును నుద్దేశముచే నగ్నిని నుతించెనే కాని వేఱు కాదు. కావున నీప్రకరణమునఁ జెప్పఁబడినది పరమేశ్వరుని గూర్చియే.

## అ ౧. పా. ౨. సూ ౨౮. ఆరంభము.

అవతారిక:—కొందఱు మునులమతముల ననువాదము చేసి యీ విషయమునే నిర్ణయించుచున్నాఁడు—

## ౪౮. సాక్షాదప్యవిరోధం జైమినిః. ౧. ౨. ౨౮.

తాత్పర్యము:—పూర్వసూత్రములయందు "జఠరాగ్నినే బ్రహ్మమని కాని జఠరాగ్నియందు బ్రహ్మ మున్నది యని కాని యుపాసన చేయవలయును" అని చెప్పఁబడియున్నది. "అంతః ప్రతిష్ఠితం" అను మొదలగు వాక్యములు సమన్వయింపఁబడినవి. జైమినిముని మాత్ర మిట్లు తలంచుట లేదు. పరమేశ్వరుఁడు ప్రత్యక్షముగనే వైశ్వానరశబ్దముచేఁ జెప్పఁబడుచున్నాఁడనియు, ఆయన నట్లే (స్వస్వరూపముతోనే) యుపాసింపవలయు ననియే యీప్రకరణమున కభిప్రాయ మనియుఁ గూడఁ జెప్పుచున్నాఁడు. దీనిని పట్టి చూచిన మీపూర్వపక్షములకు బొత్తిగనే యవకాశము లేదు.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పిన ౨౬-వ సూత్రమున చెప్పఁబడిన దోషము లన్నియు ననివార్యములై వచ్చును.

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు, వినుము. శతపథబ్రాహ్మణమున "పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద" "పురుషరూపుఁడై పురుషునిలోపల నున్నయాత్మ నెవ్వఁ డెఱుంగునో" అని అంతర్వర్తిత్వము (లోపల నుండుట) వైశ్వానరునకు చెప్పఁబడియున్నది. ఇది ప్రస్తుతసిద్ధాంతమునకు విరుద్ధము కానేరదు. ఈబ్రాహ్మణమున మొట్టమొదట జఠరాగ్నిని గూర్చినప్రస్తావమే లేదు. దానిని చెప్పుశబ్దమైనను

ప్రయోగింపఁబడి యుండలేదు. ఇట్లుండ పైవాక్యము దానినిగూర్చి నని యగుట యెట్లు? చెప్పుటకు వీలున్నఁ బరమేశ్వరునిఁ గూర్చియే చెప్పవలయును. లేకున్నను ఏదియో యొకవిధముగ నాయనను గూర్చియే యుపచరింపవలయును.

ఆప్రకరణమున నుపాసకుఁడు తన శిరస్సుమొదలు గడ్డమువఱకుఁ గలయవయవములలో వైశ్వానరావయవము లగుద్యులోకాదు లున్నట్లు భావించి యుపాసింపవలయు నని చెప్పఁబడియున్నది. ఆయభిప్రాయము తోనే (అనఁగా: ఆవైశ్వానరుఁడు పురుషునియందే యున్నాఁడు కావున) "పురుషే ఽన్తః ప్రతిష్ఠితం" అని చెప్పఁబడియున్నది; కాని "జఠరాగ్ని, లోపల నున్నది" అను నభిప్రాయముతోఁ గాదు. లోకమున "కొమ్మ చెట్టునందు కలదు" అని చెప్పునలవాటు ప్రత్యక్షముగనే యున్నది. వృక్షములకంటె కొమ్మ వేఱు కాకపోయినను అట్లు చెప్పు చున్నారు. ఈవిధముగనే శ్రుతియు వైశ్వానరుని ఉపాసకునిదేహ మున నొకభాగముగ వర్ణించుచుండియు "వైశ్వానరుఁడు పురుషునిలో నున్నాఁడు" అని చెప్పుచున్నది. కావున నిట్లు చెప్పుటవలన విరోధ మింత యైనను లేదు. ఇట్లు కాక "వైశ్వానరుఁడు పురుషునికంటె వేఱు. పురుషునియం దున్నాఁడు' అను నభిప్రాయముతోనే యట్లు చెప్పఁబడి నది" అనినను విరోధము రాదు. ఆపరమేశ్వరుఁడు సర్వసాక్షి; సర్వ వ్యాపకుఁడు; పురుషునిలోపల కూడ నుండవచ్చును. ఆయభిప్రాయ ముతో శ్రుతి కూడ నట్లు చెప్పవచ్చును.

ఇట్లు ప్రకరణము పరమాత్మపర మని నిశ్చయ మయ్యెనేని య ప్పుడు * వైశ్వానరాగ్నిశబ్దము లేదో యొకయుత్పత్తిచే బ్రహ్మపరములు

---

* వైశ్వానరాగ్నిశబ్దములు.—ప్రకరణతాత్పర్యభూతుఁడు పరమేశ్వరుఁ డని స్పష్ట మయ్యెనేని యప్పుడు వైశ్వానరాగ్నిశబ్దములకు తదనుకూలముగ నేదియో యొక యౌగికార్థము నీక్రిందివిధముగఁ గల్పింపవచ్చును :—

"విశ్వ శ్చాయం నర శ్చ విశ్వానరః" "సర్వవ్యాపకుఁ డగుటచే, లేక, సర్వా త్మకుఁ డగుటచే నీతఁడు విశ్వరూపుఁడు. విశ్వుఁడగునరుఁడు కావున విశ్వానరుఁడు" అని కాని, "విశ్వేషాం నరః విశ్వానరః" "ప్రత్యగాత్మరూపుఁ డగుటచే విశ్వులకు (సమస్తభూతములకు) నరుఁడు (పురుషుఁడు) కావున విశ్వానరుఁడు" అనికాని, "విశ్వే నరాః యస్య సః విశ్వానరః" "సర్వజీవులును తాదాత్మ్యసంబంధముచే నెవ్వనికిఁ గలరో

కాఁగలవు. అగ్నిత్రయకల్పనము ప్రాణాహుతికి నాధార మనుట మొద లగునవి సర్వాత్మకుఁడగుపరమేశ్వరునకు విరుద్ధములు కానేరవు.

## అ ౧. పా ౨. సూ ౨౯. ఆరంభము.

అవతారిక:—"అగును గాక! ప్రాదేశమాత్రశ్రుతి యీపక్షమున నెట్లు సమన్వయ మగును?" అనిన చెప్పుచున్నాఁడు—

## ౪౯. అభివ్యక్తే రిత్యాశ్మరథ్యః. ౧. ౨. ౨౯.

తాత్పర్యము:—మఱియు పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడే యైనను ఈశతపథబ్రాహ్మణమున శిరము మొదలు గడ్డమువఱకు నున్నట్లు చెప్పఁబడి యున్నాఁడు. ఆస్థానము లోఁడిలేఁడు ప్రమాణము గలది కావున ప్రాదేశ మాత్రశ్రుతియందు సమన్వయ మగును. ఇట్లు కాకున్నను ఉపాసకుల సౌకర్యమునకై హృదయాదిస్థానములఁ గైకొని వర్ణింపఁబడుచుండుట చేతఁ గూడ నాశ్రుతి సమన్వయము కావచ్చును. ఇది యాశ్మరథ్యాచా ర్యునిమతానుసారముగఁ జేయఁబడినసిద్ధాంతము.

## అ ౧. పా ౨. సూ ౩౦. ఆరంభము.

అవతారిక:—మఱియొకమునిమతము నాశ్రయించి పై పూర్వ పక్షమునకే సమాధానమును చెప్పుచున్నాఁడు—

---

వాఁడు విశ్వానరుఁడు (తాదాత్మ్యమనఁగా అభేదము)" అని కాని విశ్వానరశబ్దమును సాధించి, పిదప "విశ్వానర ఏవ వైశ్వానరః" "విశ్వానరుఁడే వైశ్వానరుఁడు" అని చెప్పవచ్చును. తద్ధితములయందు అణ్ ప్రత్యయముకలదు. అది శబ్దములకు పర మైన నిట్టిరూపము వచ్చును. ఆప్రత్యయమునకు విశేషార్థ మేదియు లేదు. పదమునకు నే యర్థము సహజమో యాప్రత్యయము పరమైనపిదపఁ గూడ నాయర్థమే యుండును.

అగ్నిశబ్దమునకుఁ గూడ నిట్లే వ్యుత్పత్తి చెప్పవచ్చును. "అగ్రం నయ తీ త్యగ్నిః" "అగ్రమును (అన్నిటికిని తుద యగుముక్తిని) పొందించువాఁడు కావున నగ్ని" అని యైనను, "అగి గతౌ" "అగి యనుధాతువుకు గమనమర్థము" అను ధాతువువలన నగ్ని శబ్ద మేర్పడుటచే దానికి "జ్ఞానరూపుఁడు" అనునర్థము వచ్చు నని యైనను నిర్ణయింప వచ్చును. గమనార్థము కలధాతువులకు నన్నింటిని జ్ఞానార్థము కల దనుట వ్యాకరణ సంప్రదాయము.

## ౬౦. అనుస్మృతే ర్బాదరిః. ౧. ౨. ౩౦.

తాత్పర్యము:—ఇట్లు కాకున్నను హృదయము ప్రాదేశమాత్రము. అందుఁ గలమనస్సు కూడ నట్టిదియే. దానిచే ధ్యానింపఁబడువాఁడు కావున పరమేశ్వరుఁడు కూడ నట్టివాఁడే యగును. ఇది బాదరిమతాను సారముగ నొనర్పఁబడిన సిద్ధాంతము.

లోకమున ధాన్యమును కుంచముతో కొలిచిన "ఇది కుంచెఁడు" అని చెప్పునలవాటు కలదు కదా! ఇట్లే ప్రాదేశమాత్ర మగుమనస్సుతో ధ్యానింపఁబడిన పరమేశ్వరుఁడును ప్రాదేశమాత్రుఁ డని వ్యవహరింపఁబడ వచ్చును. "ధాన్యమునకు పరిమాణము కలదు. కావున నది కొలపాత్ర లచే ప్రకటింపఁబడును (అనఁగా: ఆధాన్యము కొలుచుటకు వీ లగునది కావున కొలువఁబడును); కాని బ్రహ్మ మట్టిదా? కాదు కదా" అనియెద వేమొ, అది యథార్థమే. అయినను శ్రుతి నిరర్థకము కాకుండుటకై యట్లు చెప్పవచ్చును. పరిమాణము లేకున్నను కల్పించి యౌపచారికముగ చెప్పవచ్చును.

## అ ౧. పా ౨. సూ ౩౧. ఆరంభము.

అవ:—ఈవిధమున ప్రాదేశమాత్రశ్రుతి సమన్వితమగుటలో నితరుల యభిప్రాయమును తెలిపి యిప్పుడు జైమినిమతమును వివ రించుచున్నాఁడు.—

## ౬౧. సంపత్తే రితి జైమిని స్తథాహి దర్శయతి. ౧. ౨. ౩౧.

తాత్పర్యము:—జైమినిమునిమతము మాత్ర మిది యేదియు కాదు. శ్రుతిచే నాపరమేశ్వరుఁడు సర్వాత్మకుఁడైనను ప్రాదేశమా త్రుఁడుగాఁ గల్పింపఁబడెను. కావున ప్రాదేశమాత్రశ్రుతియందు సమ న్వయ మగు నని యాయన చెప్పుచున్నాఁడు. శ్రుతియందు నట్లే చెప్పఁ బడియున్నది. వాజసనేయశాఖయందలి శతపథబ్రాహ్మణమున ప్రస్తుత ప్రకరణముతో (వైశ్వానరవిద్యతో) సమాన మగుప్రకరణము కలదు (అనఁగా:అందును వైశ్వానరవిద్య కల దనుట).అం దిట్లున్నది—"తథా

ను వ ఏతా న్వక్ష్యామి యథా ప్రాదేశమాత్ర మే వాభిసంపాదయిష్యా మీతి స హోవాచ మూర్ధాన ముపదిశ న్నువా చైష వా ప్రతిష్ఠా వైశ్వానర ఇతి....చుబుక ముపదిశ న్నువా చైష వై ప్రతిష్ఠా వైశ్వా నర ఇతి "త్రిలోకశరీరుఁ డగువైశ్వానరుఁడు ప్రాదేశమాత్రుఁ డగు నట్లుగ నమ్మహాత్ముని యవయవములఁ మీకు వర్ణించి చెప్పెదను. ఉపాస కుని శిరస్సే వైశ్వానరుని శిరస్సు. సర్వలోకాతీత మగుద్యులోకము.... ఉపాసకునిగడ్డమే వైశ్వానరునిపాదము లగుభూమి". ఇట్లు శిరము మొదలు గడ్డమువఱకు కలభాగమునే వైశ్వానరాత్మకముగ వర్ణించుట వలన, లేక, కల్పించుటవలన నద్దేవుండు ప్రాదేశమాత్రుఁడయ్యెను. ఛాందోగ్యవాక్యమున విమర్శ లేకున్నను ప్రాదేశమాత్రపదముండుటచే నీవిషయమే యచ్చట కూడ నుద్దేశింపఁబడినట్లు నిర్ణయింపవలసియున్నది. ఇదియే సూత్రకారసమ్మతమగు సిద్ధాంతము. *

## అ ౧. పా ౨. సూ ౩౨. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమున మఱియొక శ్రుతిని కూడఁ బ్రమాణముగఁ జూపుచున్నాఁడు—

## ౬౨. ఆమనన్తి చైన మస్మిన్. ౧. ౨. ౩౨.

తాత్పర్యము:—మఱియు "పరమేశ్వరుఁడు శిరము మొదలు గడ్డ

* ఆశ్మరథ్యమతమును వర్ణించునప్పుడు కూడ "శిరము మొదలు గడ్డమువఱకు నున్నాఁడని తెలియుటచే వైశ్వానరుఁడు ప్రాదేశమాత్రుండగును" అని చెప్పఁబడి యున్నది. ప్రస్తుతసూత్రమునందు నట్లే చెప్పఁబడియున్నది. అచ్చట భావనమాత్రమే వర్ణింపఁబడెను; ఇచ్చట నది (భావన) విధిపూర్వకముగ నియమింపఁబడెను. అచ్చటి యభిప్రాయము నాశ్రయించిన, నుపాసకుఁడు ఆవైశ్వానరుని మూర్ధాదిచుబుకపర్యంత ప్రదేశస్థితునిఁగ భావించినను భావింపవచ్చును, లేకున్నను లేకపోవచ్చును. ఇచ్చటి మతము నాశ్రయించిన నియతముగ భావించియే తీరవలయును. అచ్చట వికల్పము. ఇచ్చట నట్లులేదు. ఈభేదముచేత నే యాశ్మరథ్యమతము పూర్వపక్షముగ వివరింపఁబడెను.

ములోపల నున్న దేహభాగమున నున్నాఁడు" అని జాబాలశాఖవారు చెప్పుచున్నారు. వారియుపనిషత్తునం దిట్లున్నది. "య ఏషో ఽనన్తో ఽవ్యక్త ఆత్మా సో ఽవిముక్తే ప్రతిష్ఠిత ఇతి సో ఽవిముక్తః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి వరణాయాం నాస్యాం చ మధ్యే ప్రతిష్ఠిత ఇతి కా వై వరణా కా చ నాసీతి" "అనంతుఁడై స్పష్టముగ నెఱుంగరానివాఁడై యుండు పరమేశ్వరుఁ డవిముక్తమున *(బద్ధుఁడగు జీవునియందు)నున్నాఁడు. ఆయ విముక్త మెచ్చట నున్నది? వరణకును నాసికిని మధ్య నున్నది. (ఇదియే యంతరవారణాసి యని పౌరాణికులు చెప్పుదురు.) వరణ యనఁగా నేది? నాసి యేది?" అని యారంభించి † కనుబొమలను వరణ యనియు నాసికను నాసి యనియుఁ జెప్పి, సర్వపాపముల నివారించునది కావున వరణ యనియు సర్వేంద్రియవ్యాపారముల, లేక, దోషముల నశింపఁ జేయునది కావున నాసి యనియు నాపదముల వ్యుత్పత్తిని దెలిపి, మఱియు నిట్లని చెప్పఁబడియున్నది. "కతమ చ్చాస్య స్థానం భవ తీతి భ్రువో ర్ఘ్రాణస్య చ యః సంధిః స ఏష ద్యులోకస్య పరస్య చ సంధి ర్భవతీతి" "ఆయవిముక్తమునకు నిర్ధారితస్థాన మెద్ది? కనుబొమలును నాసికయుఁ గలయునట్టిచోటు. అదియే ద్యులోకమునకును దానికిమీఁద నుండుబ్రహ్మలోకమునకును సంధి". ఇట్లు చెప్పుటవలన పరమేశ్వరుఁడు శిరము మొదలు గడ్డమువఱకు నున్న భాగములో కలఁ డని స్పష్టమయ్యెను కదా! కావున ప్రాదేశమాత్రశ్రుతి పరమేశ్వరునియందు సమన్వయ మగుటలో సంశయము లేదు. మఱియు ఛాందోగ్యవాక్యమున "అభి

---

* "పరమేశ్వరుఁడు జీవునియం దున్నాఁడు" అని చెప్పుట జీవపరమేశ్వరులకు గలకల్పితభేదము నాశ్రయించియే యని తెలిసికొనవలయును. మఱియు నిచ్చట చెప్పఁబడినభ్రూమధ్యస్థానము జీవునకు నివాస మగుటచే జీవునియం దున్న పరమేశ్వరునకుఁ గూడ నివాస మని చెప్పఁబడె నని గ్రహింపవలయును.

† కనుబొమ్మలకును నాసికకును సర్వపాపహరత్వ మనుసామర్థ్యము గలుగుటకు పరమాత్మస్థానము లగుటయే కారణము. వానిసంధియందే పరమేశ్వరుఁడు కలఁడని చెప్పఁబడి యున్నది కదా!

విమానం" * అనువిశేషణము కూడ కలదు. అదియు వ్యుత్పత్తి ననుసరించి పరమాత్మయందే సమన్వయ మగును ; కావున వైశ్వానరుఁడు పరమేశ్వరుఁడే.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు ప్రథమాధ్యాయస్య ద్వితీయః పాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ప్రథమాధ్యాయమునఁ ద్వితీయపాదము.

---

* అభివిమానశబ్దవ్యుత్పత్తి:—పైవాక్యమున (వైశ్వానరవాక్యమునఁ) గల "అభివిమానం" అనుపదము యోగబలముచేఁ బ్రత్యగాత్మను బోధించును. "అభివిమీయతే ఇత్యభివిమానః" "భావింపఁబడువాఁడు కావున నభివిమానుఁడు (ప్రత్యగాత్మ యగుటచే నీతని నందఱును భావించుచున్నారు. తెలిసికొనలేనివారు సహితము అస్మచ్ఛబ్దముచే వ్యవహరించుచున్నారు, లేక, సర్వవ్యాపకుఁ డైనను తనశరీరమునందుమాత్రమే యున్నట్లు భావించుచు పరిచ్ఛిన్నునిఁ జేయుచున్నారు అనుట)" అని కాని, "అభిగతశ్చ విమానశ్చ=అభివిమానః" "సర్వలోకప్రసిద్ధుఁడును పరిమాణము లేనివాఁడును కావున నభివిమానుఁడు (జీవరూపుఁడే యగుటచే జ్ఞానులకు నజ్ఞానులకుఁ గూడ తెలియఁబడుచున్నాఁడనుట. సర్వవ్యాపకుఁ డనుట)" అని కాని, "అభివిమిమీతే సర్వ మిత్యభివిమానః" "సర్వమును సృజించువాఁడు కావున నభివిమానుఁడు (సృష్టికర్త యనుట)" అని కాని చెప్పనచ్చును.



# ⊰ బ్రహ్మసూత్రములు. ⊱

## ప్రథమాధ్యాయము, తృతీయపాదము.



అవతారిక:—ద్వితీయపాదమున యౌగికము లగువాక్యములు విచారింపఁబడినవి. తఱచుగా నుపాస్యబ్రహ్మము నిరూపింపఁబడినది. ఈపాదమున రూఢి గలవాక్యములు విమర్శింపఁబడును. నిర్గుణబ్రహ్మము ప్రతిపాదింపఁబడును. ఒకానొకచోట సగుణబ్రహ్మముకూడ చెప్పఁబడినను సామాన్యముగ ననేకస్థలములయందు నిర్గుణబ్రహ్మమే— జ్ఞేయమగు బ్రహ్మమే—నిరూపింపఁబడియుండుటవలన దీనికి "జ్ఞేయపాదము" అని పేరు. పూర్వపాదమునందును ఇట్లే యొకానొకచోట నిర్గుణబ్రహ్మము చెప్పఁబడియున్నను, తఱచుగ నుపాసనాయోగ్య మగుసగుణబ్రహ్మమే నిరూపింపఁబడి యుండుటచేతనే దానికి "ఉపాస్యపాదము" అనుపేరు పెట్టవచ్చును. మఱియు బ్రహ్మమును యోగమూలమున నిరూపించుపదములు విమర్శింపఁబడియుండుటచేఁ బూర్వపాదము యోగపాదము; రూఢిమూలముననే బ్రహ్మమును తెలియఁజేయుపదములు గలవాక్యములయర్థము విమర్శింపఁబడఁబోవుటచే నీపాదము రూఢిపాదము.

## ౧. ద్యుభ్వాద్యధికరణము.

విషయము:—"యస్మిన్ద్యౌః పృథివీ చాన్తరిక్ష మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః త మేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః" "ఏయక్షరపురుషునియందు ద్యులోకము, భూమి, ఆకాశము, మనస్సు, ప్రాణములు, సర్వేంద్రియములు నను నవి ప్రతిష్ఠింపఁబడి యున్నవో, ఆతఁడే యాత్మ. ఆతఁడే యేకస్వరూపుఁడు. ఈవిషయము నెఱుంగుఁడు. పిదప నపరవిద్యను (ముండకోపనిషత్తున బ్రహ్మవిద్య పరవిద్య యనియు, తక్కినవి యపరవిద్య లనియు సంకేతింపఁబడి యున్నది) విడువుఁడు. ఈయాత్మజ్ఞానమే సంసారసముద్రమును

తరింపఁజేసి మోక్షరూప మగుపారమును జేర్చునట్టిసేతువు" అని ముండకోపనిషత్తున నొకవాక్యము గలదు. అది యిచ్చట విమర్శింపఁబడుచున్నది.

సంగతి:—ఒకపక్షమున నిది మొట్టమొదటియధికరణము కావున దీనికి పూర్వపాదాంతాధికరణముతోఁ బ్రత్యేకసంగతి యక్కఱ లేదు.

కాకున్నను పూర్వాధికరణమున (వైశ్వానరాధికరణమున) "బ్రహ్మము ప్రపంచరూపము. ద్యులోకాదు లాయనకు నవయవములు" అని చెప్పఁబడి యున్నది. ఉదాహృతవాక్యమున నాద్యులోకాదులకు నాధార మగుపదార్థము వర్ణింపఁబడి యున్నది. ఈరెండు నేకపదార్థమే యగుటకు వీలు లేదు. ఆధారాధేయములకు నవశ్యముగ భేద ముండి తీరవలయును కదా! కావున "ప్రస్తుతవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడు కాఁగూడదు"అని పూర్వాధికరణసిద్ధాంతముపై నాక్షేపము వచ్చును. ఈయాక్షేపమే యీరెండధికరణములకును పరస్పరము గల సంబంధము.

మఱియుఁ బూర్వాధికరణమున విమర్శింపఁబడినవాక్యములో నర్థనిర్ణయము చేయవలసినవైశ్వానరపదము నాక్యారంభమున నున్నది. † వాక్యశేషమున నున్నయగ్నిమూర్ధత్వాదుల నాశ్రయించి యర్థనిర్ణయము చేయఁబడినది. అట్లే యిచ్చట కూడ వాక్యారంభమునసామాన్యముగ "భూమ్యాదులకు నాధారము" అని మాత్రమే చెప్పఁబడి యున్నది. కావున వాక్యశేషము నాశ్రయించియే యర్థనిర్ణయమును గావింపవలయు ననుట యుక్తము. ఇచ్చట నన్ననో వాక్యశేషమున సేతుపదము కలదు. సేతువునకు నాద్యంతములు కలవు; కావున నాభూమ్యాద్యాధారమునకుఁ గూడ నాద్యంతములు కల వని చెప్పి తీరవలయును, కావున పైసిద్ధాంతమునకు (పూర్వాధికరణసిద్ధాంతమునకు) నీయధికరణము దృష్టాంత మగును. ఇదియే దీనికిఁబూర్వాధికరణముతోఁ గలసంబంధము.

సందేహము:— పైవాక్యమున మొట్టమొదట నాత్మశబ్దము ప్రయోగింపఁబడి యున్నది. వాక్యాంతమున "ఆత్మయే మోక్షమునకు

† వాక్యశేషము. (పుట ౨౩౩ చూడుము.)

సేతువు" అని భేదమును తెలుపుషష్ఠీవిభక్తియు, ఆద్యంతములు గల పదార్థమును తెలుపుసేతుశబ్దంబును ప్రయోగింపఁబడి యున్నవి. ఇట్లుండుటయే సంశయమునకుఁ గారణము. ఆత్మశబ్దము బ్రహ్మమును చెప్పననుట నిర్వివాదమే యైనను అది యాద్యంతము కలదియు మోక్షమునకంటె నన్య మైనదియుఁ గాదు కదా.

ఇట్లగుటచే "ఇచ్చట చెప్పఁబడినభూమ్యాద్యాధారము బ్రహ్మము కానేరదు; బ్రహ్మమే;" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. అందుఁ బూర్వపక్షమునకు బ్రహ్మభిన్నపదార్థముల యుపాసనయు సిద్ధాంతమునకు నిర్విశేషబ్రహ్మజ్ఞానంబును ఫలములు.

పూర్వపక్షము:—పై వాక్యమునఁ జెప్పఁబడినపదార్థము బ్రహ్మము కానేరదు. దానినిగూర్చియే చెప్పఁబడి యుండునేని, యప్పుడు "అమృతస్య సేతుః" అని చెప్పుటకు వీలు కలుగదు. బ్రహ్మము అమృతరూపమే కదా. మఱియు నేదియో యొకతీఱుగ నావష్ఠీవిభక్తి నన్వయించినను సేతుశబ్దము బ్రహ్మమునందు సమన్వయింపదు. లోకమున సేతువు నదిగట్టులకు రెంటికిని నడుమ నుండును. కావున దానికి నాద్యంతములును ఏదియో యొకపరిమాణమును కలిగియుండును. బ్రహ్మ మిట్టిది కాదు కదా! "ఇట్లు చెప్ప నేల? సేతువు జలమును బంధించును. బ్రహ్మము లోకస్థితిని బంధించును. ఈపోలికచేతనే బ్రహ్మమును సేతుశబ్దముచేఁ జెప్పవచ్చును" అనియెదవేమొ, అది సరి కాదు. సేతుశబ్దమునకు నిట్టి ప్రయోగ మెందును లేదు. లోకమున జలపాత్ర జలమును బంధించును. సంకెల పాదములను బంధించును. వానియందు సేతుశబ్దప్రయోగము లేదు కదా! కావున సేతుశబ్ద మున్నచోట "ఆద్యంతములు కలిగి యుండుట" యనువిశేషణమును గూడ నంగీకరించియే తీరవలయును. ఇట్లయిన నిస్సంశయముగ ప్రస్తుతవాక్యమునకు బ్రహ్మము విషయము కానేరదు.

అవతారిక:—"ఇఁక నిచ్చటివిషయము ప్రధానాదులలో నేదియైన నొక్కటి యై తీరవలయును" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౬౩. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్. ౧.౩.౧.

తాత్పర్యము (సిద్ధాంతము):—పై వాక్యమున ద్యులోకాదులకు

నాధారముగఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యనుటలో నించుక యైనను సంశయము లేదు. ఈవాక్యమున ప్రత్యక్షముగ పరమేశ్వర వాచక మగునాత్మశబ్దము కలదు. ఇతరశ్రుతులయందును "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" "ఓ శాంతుఁడా! ఈసర్వప్రపంచమునకును సద్వస్తువే మూలము. సద్వస్తువే యాధారము. సద్వస్తువే నిలుకడ." అను మొదలగువాక్యములచే "సర్వప్రపంచమునకును బ్రహ్మమే యాధారము" అని యసందిగ్ధములగు బ్రహ్మవాచకపదములచే నిరూపింపఁబడియున్నది. ముండకోపనిషత్తునందుకూడ "బ్రహ్మైవేద మమృతం పురస్తాత్" "ఈబ్రహ్మమే ముందును (అన్నివైపుల) నున్నది" అని కూడ నుత్తరగ్రంథమునఁ జెప్పఁబడియున్నది. ఇట్లగుటచే నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

సేతుశబ్దమును గూర్చి విచారించిన నదియు నిచ్చటిసిద్ధాంతమునకు భంగము కలిగింపనేరదు. పూర్వపక్షమునందును సేతుశబ్దమునకు ముఖ్యార్థము గ్రహింపఁబడలేదు. నీవన్నట్లు బ్రహ్మభిన్న మగు నేపదార్థము భూమ్యాద్యాధార మైనను, దానికిని సేతువునకును భేద మెంతో యుండవలయును. సేతువు కట్టెతోఁ గాని మట్టితోఁగాని నిర్మింపఁబడును. ప్రధానాదులలో నేదియు నట్టిది కానేరదు కదా! ఇట్లుండ మేము మాత్రము ప్రసిద్ధార్థమును వదలిన తప్పేమి? మీరు "ఆద్యంతములు గలిగియుండుట" అనుగుణమును కూడ గ్రహించి యున్నారు. మేము దానిని గూడ విడిచి "ధరించుట, లేక, నిర్బంధించుట" అనుదానిని మాత్రమే గ్రహించియున్నాము. ఒకపక్షమున విచారించిన మేము గ్రహించిన యర్థము * ధాతుసంబంధము కలది యగుటచే రూఢిని విడి

---

* ధాతు వనఁగా వర్తమానకాలము మొదలగునర్థములను ప్రకటించు ప్రత్యయములు పరమగుటకు పూర్వ ముండునట్టి క్రియారూపము. "హర + తి" అనుపదమున వర్తమానకాలమును ప్రకటించు "తి" అను ప్రత్యయము పరమై యున్నది. ఆప్రత్యయము పరముగాకపూర్వము ఆక్రియ "హృ" అనురూపముతో నుండెను. ఇదియే ధాతువు. తిప్రత్యయము పరమైనపిదప కొన్నికారణములచే దానికి నారూపము పోయి "హర" అనురూపము వచ్చెను. ఇట్లే "సృ, మృ, స్పర్ధ్, ముద్" అను మొదలగునవి ధాతువులు, "సరతి మ్రియతే స్పర్ధతే మోదతే" అనుమొదలగునవి ప్రత్యయము పరములగుటచే నేర్పడిన క్రియారూపములు,

చినను కొంతబలవంతమై యున్నది. మీయర్థ మన్ననో లక్షణావృత్తి నాశ్రయించినదైనను, బలహీనమై ఏవిధముగా నైన నావిధముగ మార్చుకొనుటకు వీలైనదై యున్నది. "షిఞ్ బంధనే" "షిఞ్ ధాతువునకు కట్టుట యని యర్థము" అనుధాతువునుండి సేతుశబ్దము జనించి యుండుటచే దానికి ప్రధాన మగునర్థము "కట్టునది" యనియే కాని, "ఆద్యంతములు కలది" యని కూడఁ గాదు కదా! కావున సేతుశబ్దము బ్రహ్మమునందు ప్రవర్తింపవచ్చును.

మఱియు "అమృతస్య" అనుస్థలమున నుపయోగింపఁబడినషష్ఠీ విభక్తియు సిద్ధాంతభంగమును కలిగింపఁజాలదు. షష్ఠీవిభక్తి భేద మున్నప్పుడే కాని ప్రయోగింపఁబడ దనుటయు, దానిని పట్టి చూచిన నిచ్చట నమృతసేతువులకు భేద ముండి తీరవలయు ననుటయు, సేతు శబ్దము ఏదియో యొకవిధముగ బ్రహ్మమునందు సమన్వయము నొంది నను భేదము తప్ప దనుటయు, అమృతరూప మగుబ్రహ్మ మాయ మృతమునకంటె భిన్న మగుట విరుద్ధ మనుటయు సత్యమే; అయినను అమృతశబ్దము అమృతవాచకముగఁ బ్రయోగింపఁబడి యుండునేని యివి యన్నియు దోషములే యగును గాని యిచ్చట నట్టిప్రయోగము లేదు. అది యమృతత్వ మనుధర్మమును తెలుపుటకై యిచ్చట నుపయోగింపఁ బడియున్నది. లోకములో నిట్టిప్రయోగము లనేకములు గలవు వ్యాక రణశాస్త్రమున "ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే" "ద్విత్వమును చెప్పు నప్పుడు ద్వివచనప్రత్యయము పర మగును. ఏకత్వము చెప్పునప్పు డేక వచనప్రత్యయము వచ్చును." అనుసూత్రము కలదు. ఇందు "ద్వ్యేక యోః" అనుపదము సప్తమీద్వివచనమున నున్నది. ఇచ్చట ద్విశబ్ద ముచే రెండును ఏకశబ్దముచే నొకటియు నుద్దేశింపఁబడి యుండునేని యప్పుడు "ద్వ్యేకేషు" అని బహువచన ముండవలసి వచ్చును. అట్లు లేదు కావున "ద్విశబ్దము ద్విత్వమును తెల్పుటకును, ఏకశబ్ద మేకత్వ మును జూపుటకును ప్రయోగింపఁబడి యున్నవి" యనియే సిద్ధాంతము చేయవలయును కదా! ఇట్లే ప్రస్తుతవాక్యమునందుఁ గూడ నమృత శబ్దము అమృతత్వమును తెల్పుటకై ప్రయోగింపఁబడిన దని నిర్ణయింప వచ్చును. ఈనిర్ణయమువలన "అమృతస్యైష సేతుః" అనువాక్యమునకు "మోక్ష ప్రాప్తిసాధనము" అని యర్థ మేర్పడును. బ్రహ్మజ్ఞాన మట్టిది

కావున బ్రహ్మమునుగూర్చి యట్లు ఔపచారికముగఁ జెప్పవచ్చును కదా! కావున నెట్లును ఈవాక్యమున వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

పూర్వపక్షము:—అయినను దోషము తప్పదు. ఈవాక్యమున "పరబ్రహ్మము ప్రపంచమున కాధారము. ప్రపంచము పరబ్రహ్మమున కాధేయము" అని చెప్పఁబడి యున్నది. ఇతరశ్రుతులయందు "సర్వం బ్రహ్మ" ఈసమస్తము బ్రహ్మమే" అని బ్రహ్మప్రపంచములకు నైక్యము చెప్పఁబడి యున్నది. ఈరెండును పరస్పరవిరుద్ధములు కదా ! కావున నిచ్చట చెప్పఁబడిన పదార్థము నానారూపమై ప్రపంచాకారమై యుండ వలయునుకాని శుద్ధమై నిరంజనమై యుండరాదు. వృక్ష మొక్కటయ్యును దానియందు కొమ్మలు పువ్వులు మొదలగుభేదము లనేకము లుండునట్లు ఈభూమ్యాద్యాధారమునందును భేదము లుండవలయును. ఇట్టిస్థితి హిరణ్యగర్భునకుఁ *గూడ సంభవించును. ఇట్లు చెప్ప నేల? ముఖ్యముగ

---

* హిరణ్యగర్భుఁడు:—ప్రతిపదార్థంబును ప్రపంచమున వ్యష్టిసమష్టు లను రెండురూపములతో నున్నది. "ఒక్కమనుష్యుఁడు, ఒక్కపశువు, ఒక్కవృక్షము." అని యేకపదార్థమును మాత్రమే సజాతీయవిజాతీయపదార్థములనుండి వేఱు చేసి దానిని గూర్చియే ప్రశంసించుట వ్యష్టిప్రశంస. అట్లు గ్రహింపఁబడినయేకపదార్థమే వ్యష్టి యనఁబడును. ఇట్లు కాక సజాతీయపదార్థముల నెల్ల నేకముగ గ్రహించి చేయు వ్యవహారము సమష్టివ్యవహారము; అట్లు గ్రహింపఁబడిన పదార్థముల మొత్తమే సమష్టి. అనేకవృక్షముల నొక్కచోటఁ జూచినప్పుడు వాని నొకమొత్తముగానే గ్రహించి "ఇది వనము" అని మనము వ్యవహరించుచున్నాము కదా !

మఱియు నీవ్యష్టిసమష్టులకే విశేషసామాన్యము లనియు, వ్యక్తిజాతు లనియుఁ బేర్లు. "రాముఁడు ధనము నార్జించుచున్నాఁడు" అనునది యొక్కరామునిగూర్చియే చేయఁబడినవ్యవహారము గావున విశేషవ్యవహారము—వ్యక్తివ్యవహారము—; "రెప్ప వేయుట,నిదురించుట మొదలగువానివలన మనుష్యుఁడు దేవతకంటె భిన్నుఁడగుచున్నాఁడు." అనుమొదలగునది సామాన్యవ్యవహారము—జాతివ్యవహారము—; ఈవాక్యమున "మనుష్యులందఱును దేవత లందఱి కంటె భిన్నులు" అనియే కదా యుద్దేశింపఁబడి యున్నది.

ప్రకృతము సూక్ష్మశరీరోపాధియం దున్నపరమేశ్వరుని మనము జీవునిఁగా సుఖదుఃఖవంతునిఁగఁ దలంచుచున్నాము. ఎన్నిఘటములయం దున్నను ఆకాశమునకు పరస్పరభేదము రానట్లు వాస్తవస్థితిని నెన్నిదేహములయం దున్నను ఈజీవునికి పరస్పరభేదము కలుగదు. అయినను విచిత్రము లగుకర్మసంస్కారములచేఁ గూడిన యంతఃకరణోపాధులు అతివిచిత్రము లగుటచే, బహువిధము లగుటచే, వానిధర్మముల నెల్ల నందుఁ

హిరణ్యగర్భునకే సంభవించును. బ్రహ్మము నిరంజనముకదా. కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు హిరణ్యగర్భుఁడనుట యుక్తము.

సిద్ధాంతము:—ఇట్లు తలంప నక్కఱ లేదు. ప్రస్తుతవాక్యమున "త మేవైకం జానథ ఆత్మానం" అని చెప్పఁబడియుండుటచే "భూమ్యాదులకు నేపదార్థమాధారమో (అనఁగా: అవిద్యాకల్పితము లగుభూమ్యాదులకు నేది యాధారమో, అనఁగా: భ్రాంతినివిడిచి 'ఇది సర్పము' అను తలంపును పరిత్యజించినపిదప తోఁచుత్రాటివలె నీప్రపంచభ్రాంతి తొలఁగినపిదప నేయధిష్ఠానము గానవచ్చునో) దాని నొక్కదానినే తెలిసికొనుఁడు" అని మాత్రమే నిరూపింపఁబడెను; గాని "ఈప్రపంచమును దీని కాధార మగుబ్రహ్మమును గూడఁ దెలిసికొనవలయును" అని కాని, "ఈప్రపంచము సత్యము. దీని కాధారము పరబ్రహ్మము. ఈరెండు పదార్థములును కలవు" అని కాని నిరూపింపఁబడలేదు. లోకసిద్ధ మగు భ్రాంతిదృష్టి నాశ్రయించి హీనస్థితియం దున్నవారిని క్రమక్రమముగ నుద్ధరించుటకై యిట్లు చెప్పఁబడెను. సామాన్యముగ విచారించినను "పృథివ్యాదుల కాధార మగు దానిఁ దెలిసికొనుము" అనిన "పృథివ్యాదులను, దాని కాధార మగుదానిని గూడ తెలిసికొనుము" అని యర్థ మగుట యెట్లు? "దేవదత్తుఁడు ఎందు కూర్చుండి యుండెనో దాని నిటకుఁ దెమ్ము" అనిన దేవదత్తునిపీఠమునే తెత్తురు గాని దేవదత్తునిఁ గూడ నాపీఠముతోఁ దోడ్కొని రారు కదా!

మఱియు భేదమును చెప్పుటయందు శ్రుతికి నుద్దేశమే లేదు.

---

ప్రతిబింబించి యున్నపరమేశ్వరునియం దారోపించుచు, అంతఃకరణభేదములవలనఁ జీవభేదముల నెంచుచున్నాము. ఈదేహమునం దుండుజీవునికంటె నాదేహమున నున్న జీవుఁడు భిన్నుఁ డనుచున్నాము.

ఈవిధముగ జీవునియందు కూడ భ్రాంతిసిద్ధ మగుభేదము కలదు కావున, ఇతర పదార్థములయందువలెనే వ్యష్టిసమష్టివ్యవహార మేర్పడినది. అందు "నేను వేఱు, నీవు వేఱు" అనునది వ్యష్టివ్యవహారము—సర్వప్రపంచము నేకశరీరముగఁ గైకొని, సర్వజీవుల నేకముగ గ్రహించి చేయఁబడువ్యవహారము—; "జీవబ్రహ్మములకు భేదము లేదు" అను మొదలగువ్యవహారము—సమష్టివ్యవహారము. ఇందు వ్యష్టివ్యవహారమునకు నాధార మగువాని జీవుఁ డనియు, సమష్టివ్యవహారమున కాధారభూత మగుసామాన్యమును హిరణ్యగర్భుఁడనియుఁ జెప్పుచున్నారు.

మోక్షము కలుగుటకును అభేదజ్ఞానము సాధనంబును కాదు. ఇట్లు కాదని పట్టు పట్టిన శ్రుతులకే పరస్పరవిరోధము వచ్చును. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి" "ఎవ్వఁడు భేదము కలదని చూచుచున్నాఁడో వాఁడు మరల మరల సంసారమును జెందుచుండును. జననమరణదుఃఖముల ననుభవించుచుండును" అని భేదదృష్టిని శ్రుతి స్వయముగనే నిందించుచున్నది. కావున ప్రస్తుతవాక్యమొక్కటియే యననేల ? భేదము చెప్పునట్లు తోఁచుసర్వశ్రుతులకును గూడ భేదనిరూపణమునందుఁ దాత్పర్యము లేదు. అన్నియును శిష్యోద్ధరణమునకై వారిప్రథమస్థితి నవలంబించునవియే.

ఇట్లగుటచేతనే "సర్వం బ్రహ్మ" అను మొదలగువాక్యములు ప్రస్తుతవాక్యమునకు విరుద్ధములు కానేరవు. అందును"ఈప్రపంచ మంతయును భ్రాంతికల్పితము. దీనిపరమార్థరూపము ఏకమగు బ్రహ్మమే." అని నిరూపింపఁబడెను గాని, "బ్రహ్మమునకు నానాభేదములు గలయీప్రపంచమే రూపము" అని నిరూపింపఁబడలేదు. అట్లు నిరూపింపఁబడుటకును వీలు లేదు. "స యథా సైంధవఘనో ఽనన్తరో ఽబాహ్యః కృత్స్నోరసఘన ఏవం వా అరే ఽయ మాత్మాఽనంతరో ఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" "లోకమున ఉప్పుకల్లు లోపల వెలుపల యనునది లేక సర్వమును లవణరసముగామాత్రమే యున్నట్లు ఈపరబ్రహ్మంబును లోపల వెలుపల యనునది లేక సర్వమును జ్ఞానమాత్రముగానే యున్నది" అని శ్రుతి బ్రహ్మమునకు నానాకారత్వమును స్వయముగనే నిషేధించుచున్నది. కావున నేదియైన నొకశ్రుతివాక్యము యథార్థాభిప్రాయముతోనే పరమేశ్వరునకు ప్రపంచాకారమును చెప్పి యుండునేని యప్పుడు పరస్పరవిరోధము వచ్చును. కావున నెట్లు చూచినను "సర్వం బ్రహ్మ" ఇత్యాదివాక్యములకు భేదవాక్యములతో విరోధమెన్నటికిని లేదు. భేదవాక్యములకు భేదనిరూపణమున నుద్దేశ ముండునేని యప్పుడు నిస్సంశయముగ విరోధము వచ్చును గాని యది వేదాభిప్రాయము కాదు. అట్లు చెప్పుటకును వీలు లేదు. అప్పుడు అభేదశ్రుతులకు సమన్వయమే కుదురదు. వేదములకును, కొంతభాగము సమన్వయము నొందకుండినచోఁ దనలోనే పూర్వోత్తరవాక్యవిరోధము సంభవించిన

చో ప్రామాణ్యము సంఘటింపదు. ఇది యెవ్వరికిని సమ్మతము కాదు కదా !

కావున ప్రస్తుతవాక్యమున హిరణ్యగర్భుఁడు చెప్పఁబడె నన నవసరము లేదు; ప్రపంచాధార మగుపదార్థము నానారూపములు గలదై యుండవలయు నని చెప్ప నవసరము లేదు. ప్రస్తుతవాక్యమునకు "సర్వం బ్రహ్మ" అనుమొదలగువానికి విరోధంబును రాదు. ఇది యంతయును గాక, ప్రస్తుతవాక్యమున చెప్పఁబడినవాఁడు హిరణ్యగర్భుఁడే యగునేని, వానియందుఁ, బరమేశ్వరునియందుఁ బ్రవర్తించినంత బాగుగ నాత్మశబ్దము ప్రవర్తింపనేరదనుట నిర్వివాదాంశము. ముఖ్యార్థముచేతనే కార్యనిర్వాహము కలుగుచుండ నిరర్థకముగ నప్రధానార్థము నంగీకరింపనేటికి? మఱియు సేతుత్వము మొదలగువానినలన కలుగువిరోధములు మున్నే పరిహరింపఁబడియుండుటచే,వాని నాధారముగఁ గైకొని యీహిరణ్యగర్భుని సంస్థాపించుటకును వీలు లేదు. ఈయన కార్యభూతుఁ డగుటచే నాద్యంతములు కల వనియు దానిచే సేతుశబ్దము సరిపడు ననియు,పరబ్రహ్మమునకంటె భిన్నుఁడు కావున "అమృతస్య సేతుః" అనుభేదనిర్దేశము సరిపడు ననియు, ఈయన నెఱుంగుటచేత, లేక, ఉపాసనాబలమున నీయనయొక్క లోకమును జెందుటచేత, మోక్షప్రాప్తి కలుగును కావున, ఈయనయే బ్రహ్మప్రాప్తిసాధన మగుటచే, అమృతసేతు వనఁ దగియుండు ననియు, సర్వప్రపంచమునందును వ్యాపించి యుండుటచే సర్వాధారుఁ డగునని యు చేయఁబడునిర్ణయము లెల్ల సరిపడవు. కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు నిర్వివాదముగఁ బరమేశ్వరుఁడే.

విశేషాంశము:—శంకరాభిప్రాయమునఁ గొంతవిశేషము కలదు. ఇదివఱకు "అమృతస్యైష సేతుః" అనువాక్యభాగము బ్రహ్మపర మని తలంపఁబడి విరోధనిరసనపూర్వకముగ సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇది యొకనిమతము. శంకరమతమున నన్ననో యీవాక్యభాగము, "తమేవైకం జానథ, అన్యా వాచో విముంచథ" అని యుద్దేశింపఁబడిన బ్రహ్మజ్ఞానము నవలంబించియు, అపర విద్యాపరిత్యాగము నవలంబించియు వ్యాఖ్యానము చేయఁబడియున్నది. "ఆత్మజ్ఞానము, అన్యపరిత్యాగము అనునివిరెండు మోక్షమునకు సేతువులు" అని యర్థము చెప్పఁబడి

యున్నది. ఈయర్థము నాశ్రయించిన సేతుశబ్దమువలన కలుగు నాక్షేపము లేమియు కలుగవు కదా! ఇచ్చట చెప్పఁబడిన జ్ఞానమునకును అపరవిద్యా పరిత్యాగమునకును గూడ నాద్యంతములు గలవు కావున పూర్వపక్షు లకు నాక్షేపణీయాంశమే యుండదు కదా!

"ఇచ్చట "ఏషః" అనుపదము సర్వనామము. అది ప్రధానమునే చెప్పవలయును కాని యన్యమును చెప్పరాదు. కావున నిచ్చట నీశబ్దము ప్రధాన మగు బ్రహ్మమునే చెప్పును గాని తజ్జ్ఞానమును చెప్పదు. అది యప్రధానము కదా!" అనియెదవేమొ వినుము. లోకమున నేది విధింపఁ బడునో అదియే ప్రధానము. ఎప్పటికిని విధింపఁబడునది యేదియో యొక కార్యముగనే యుండవలయును గాని యితరముగ నుండదు. కావున నిచ్చట బ్రహ్మజ్ఞానంబును, అపరవిద్యాపరిత్యాగంబు ననునవియే కార్య ములు; అవియే విధింపఁబడిన వగుటచేఁ బ్రధానములు. బ్రహ్మము విషయ మగుటచే నట్టిది కాదు. కావున నీసర్వనామము జ్ఞానాదులనే చెప్పు ననుటలో సంశయము లేదు. మఱియు "సర్వనామము ప్రధాన మునే చెప్పవలయును" అనునియమము కూడ లేదు. అది * పరామర్శ యోగ్య మగు దేనినైనను పరామర్శింపవచ్చును. గుణములు మొదలగు వానిని గూడఁ బరామర్శించుట లోకమున ననుభవసిద్ధమైయే యున్నది.

---

* పరామర్శ మనఁగా : నేవిధముగా నైనను వెనుక చెప్పియున్న విషయమును మరలఁ జెప్పుట. సామాన్యముగ సర్వనామములే ఈపనిని చేయును. "రాముఁడు వన మున నున్నాఁడు. వాని నిటకుఁ బిలువుము" అనుస్థలమున వాఁడు అనుసర్వనామము రాముని పరామర్శించుచున్నది. సర్వనామములు తమకు సమీపమున నున్నదానిని మాత్ర మే పరామర్శించును.

మఱియు కొన్నికొన్నిస్థలములయందు గుణవాచకము లగువిశేషణములు కూడ నీపనిని చేయుచున్నవి; కాని యావిశేషణములయందు పరామర్శింపవలసినవస్తువునందు మాత్రమే యున్నట్టియు నితరస్థలములయందు లేనట్టియు గుణము వర్ణింపఁబడి యుండ వలయును. "దేవతలకుఁ గలసుఖ మొరులకు లేదు. సర్వకాలములయందును పురుషులచే తెరిపి లేకుండ నెన్నిశ్రమల కైనను పాల్పఱచి పనులఁ జేయించుక్షుద్బాధ లేనివారలకు సుఖమున కేమి కొఱఁత?" అను మొదలగునవి దీని కుదాహరణములు. ఇందు క్షుద్బాధ లేకపోవుట యనునది దేవతలకు మాత్రమే యుండుధర్మము; కావున నది దేవతలనే పరా మర్శించును. ఇట్లే తగినంతబల మున్న నేది యైనను ఈపనిని చేయవచ్చును.

"వాఁడు సద్గుణములు కలిగియుండుటచే నెల్లరకును గౌరవింపఁదగిన వాఁడై యున్నాఁడు. అవి యెవ్వని నౌన్నత్యమును జెందింపనేరవు;" అను మొదలగువాక్యములయం దీవిషయము స్పష్టమగుచున్నది కదా! కావున నీవ్యాఖ్యానమునందు లోప మేమియు లేదు.

## అ ౧. పా ౩. సూ ౨. ఆరంభము.

అవతారిక:—ఈసిద్ధాంతమును నిర్ణయించుటకై మఱిరెండుహేతువులఁ జెప్పుచున్నాఁడు.—

## ౬౪. ముక్తోపసృప్యవ్యపదేశాత్. ౧. ౩. ౨.

తాత్పర్యము:—మఱియు "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" "హిరణ్యగర్భునికంటె నుత్తముఁడై వెలుగునాపరమేశ్వరుని చూచిన యెడల అవిద్యాదిరూప మగుహృదయగ్రంథి * తెగిపోవును. సందేహము లన్నియు వీడిపోవును. పునర్జన్మమును కలిగించుకర్మ లన్నియు క్షీణించిపోవును" అను మొదలగువాక్యములచే ప్రస్తుతప్రకరణమునందే "ద్యులోకా ద్యాధార మగుపదార్థము నెఱింగినవారు ముక్తు లగుదురు (అవిద్యాదిదుఃఖములనుండి విముక్తు లగుదురు)" అని చెప్పఁబడియున్నది.

---

* అవిద్య (అజ్ఞానము), రాగము (కామము—ఇష్టపదార్థములయందలి యనురాగము), ద్వేషము (క్రోధము—అనిష్టపదార్థములయందలి యసూయ), భయము, మోహము (దుఃఖము) అనునీయైదును గలసి హృదయగ్రంథి యగును.

అవిద్యాదులస్వరూపము:—

౧. ఆత్మభిన్నము లగుదేహాదుల నాత్మఁగా భావించుట యవిద్య.

౨. ఆదేహాదులకుఁ గలుగుమర్యాదలు మొదలగువానివలన జనించునభిమానము, లేక, యాశ రాగము.

౩. వానికి కలుగునవమానము మొదలగువానివలన జనించునసూయ ద్వేషము.

౪. దానికి బాధను కలిగించుపదార్థమును చూచునప్పుడు కలుగుమనోవృత్తి భయము.

౫. వానికి పరులచేఁ గలిగినయవమానమును తప్పించుకొనలేనప్పుడు గలుగువృత్తి దుఃఖము, అని తెలిసికొనవలయును.

కొంత గడచినపిదప "యథా నద్యః స్యందమానా స్సముద్రే, అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ, తథా విద్వా న్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం." "ప్రవహించుచున్ననదు లన్నియు సముద్రమునఁ బడి తమనామరూపముల విడచి యైక్యమును జెందుచున్నవో అట్లే జ్ఞానవంతుఁ డగువాఁడు నామరూపముల (నామరూపములు అవిద్యాకల్పితము లగుటచే నిచ్చట నాశబ్దములచే హృదయగ్రంథి యగునవిద్యాదులే చెప్పఁబడినవి. నామరూపాభిమానమే కదా సర్వమునకుఁ గారణము !) విడిచి పరాత్పరుఁడును సర్వోత్తముఁడును అగుపురుషుని జెంది యైక్యము నొందును" అనువాక్యముచే, ముక్తులకు ద్యులోకాద్యాధార మగుపదార్థమునం దైక్యము చెప్పఁబడియున్నది. ఇది పరబ్రహ్మభిన్న మగుపదార్థము నుద్దేశించి యుండినచో సంభవింపనేర దనుట నిస్సంశయము కదా ! కావున నీవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

ఈహేతువులు మాత్రమే కాదు. ఇచ్చట "తమేవైకం........ విముంచథ" అనువాక్యభాగముచే "ద్యులోకాద్యాధార మగు పదార్థమును ఇతరవాక్కుల విడిచి తెలిసికొనవలయును" అని చెప్పఁబడియున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః, నానుధ్యాయా ద్బహూం శ్ఛబ్దా న్వాచోవిగ్లాపనం హి తత్" "ధైర్యవంతుఁడై యున్నజ్ఞాని ఆబ్రహ్మమునే తెలిసికొని బుద్ధిని స్థిరము గావించుకొనవలయును. ఇతరశబ్దముల (శాస్త్రముల)ఁ దలంపరాదు. అది యూరక వాక్కును వ్యయము చేసికొనుటయే కదా" అనువాక్యముచే నీవిషయము బ్రహ్మమును గూర్చియే చెప్పఁబడియున్నది. "యదా సర్వే ప్రముచ్యంతే కామా యే ఽస్య హృది స్థితాః, అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" "ఎన్నడు పురుషునిచిత్తమున నుండునవిద్యాదులు తొలఁగిపోవునో నాఁడు వాఁడు జన్మమరణప్రవాహమునుండి తొలఁగి ముక్తుఁ డగును. పరబ్రహ్మమును జెందును." అనువాక్యముచే, బ్రహ్మజ్ఞానికి అవిద్యానాశంబును, బ్రహ్మప్రాప్తియుఁ గూడఁ జెప్పఁబడి యున్నవి. ఇట్లగుటచే నిచ్చటఁ గూడఁ బరమేశ్వరునిఁ గూర్చియే చెప్పఁబడి యుండి తీరవలయును. ఒకప్రకరణమున నర్థము సందిగ్ధమైన సమానప్రకరణమునందలి నిర్ణీతార్థమును

గ్రహించి యర్థనిర్ణయము చేయుట సయుక్తికము కదా! కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా 3. సూ 3. ఆరంభము.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము నిలువదు. ఇచ్చట ద్యులోకాదులకు నాధార మని చెప్పఁబడినపదార్థము ప్రధానమే యనినచో మిగుల యుక్తియుక్తముగ నుండును. అది సర్వప్రపంచకారణ మగుటచే సర్వాధార మగును. త్రిగుణములే సర్వప్రపంచస్వభావ మగుటచేతను అవియే ప్రధాన మగుటచేతను దానియందు ఆత్మశబ్దము గూడఁ బ్రవర్తించును.

మఱియు వేదప్రసిద్ధమై యుండునవ్యాకృతము *గూడ నట్టిదియే.

ఇదియును గాక వాయువు సర్వాధార మని శ్రుతియందు ప్రత్యక్షముగనే "వాయునా వై గౌతమసూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సంద్భృధాని భవంతి" "ఓగౌతముఁడా! వాయువు గొప్పత్రాడు. దానిచే నీలోకము పరలోకము సర్వభూతములును చేర్చి కట్టఁబడి యున్నవి" అనువాక్యముచేఁ జెప్పఁబడియున్నది. కావున వీనిలో నేదైనను సర్వాధార మనుట యుక్తియుక్తమై యుండ సేతుశబ్దమునకు నర్థాంతరమును కల్పించుట మొదలగు ప్రయాసములతోఁ బనియేమి? ఈచెప్పినవానిలో నేది యైనను ఆద్యంతములు కలదియే కావున సేతుశబ్దము నిర్వివాదముగ వీనియందు స్వార్థముతోనే ప్రవర్తించును కదా!

అవతారిక:—అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు—

## ౬౫. నానుమాన మతచ్ఛబ్దాత్. ౧. 3. 3.

తాత్పర్యము (సిద్ధాంతము):—సాంఖ్యులు కల్పించినప్రధానము కాని వేదప్రసిద్ధ మగునవ్యాకృతము గాని వాయువుకాని ద్యులోకాద్యాధారము కానేరదు. వానిని బోధించుశబ్ద మిం దేదియు లేదు. అవి యన్నియు నచేతనములు. ఇచ్చట నన్ననో:—ప్రస్తుతవాక్యమునకు (అధికరణమున విచారింపఁబడువాక్యమునకు) ప్రక్కవాక్యమునం దే—

* అవ్యాకృతము—(పుట. 218 చూడుము.)

"యః సర్వజ్ఞః" "ఎవ్వఁడు సర్వము నెఱింగినవాఁడో" అని చేతనుఁడు పర్ణింపఁబడియున్నాఁడు. కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే; నిస్సంశయము.

ప్రధానము వేదప్రసిద్ధము కాదనుట స్పష్టము. అట్టిదైనను అవ్యాకృతము అచేతన మనుట నిర్వివాదము. వాయువు కూడ నట్లే యగుట యొకవంక నుండ, ఆత్మశబ్దము కూడ నందు ప్రవర్తింపనేరదను దోషము రెండవవంకనుండి వచ్చును. విషయవాక్యమున * నాత్మశబ్దము ప్రత్యక్షముగనే కలదు కదా! కావున నిందేదియు ద్యులోకాద్యాధారము కానేరదు.

## అ ౧. పా ౩. సూ ౪. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లైన చేతనుఁడగుజీవుఁడే ద్యులోకాదుల కాధారము కావచ్చును. అనుభవించువాఁడు అనుభవింపఁబడువానికి నాధార మగుట సుప్రసిద్ధమే. వీనియందు నిస్సంశయముగ నాత్మశబ్దము మొదలగునవి యన్నియు ప్రవర్తింపవచ్చును. వీనిరూపమే బ్రహ్మరూపమగుటచే వీని నెఱుంగుటవలన మోక్షము కూడ సిద్ధింపవచ్చును.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు—

## ౬౬. ప్రాణభృచ్చ. ౧. ౩. ౪.

తాత్పర్యము (సిద్ధాంతము):—పైన చూపినకారణమువలననే జీవుఁడు కూడ ద్యులోకాదుల కాధారము కానేరఁడు. ఆతఁడు చేతనుఁడే యైనను సర్వజ్ఞుఁడు కానేరఁడు కదా! కావున నాత్మ శబ్దాదులందు ప్రవర్తించినను ప్రయోజనము లేదు.

పూర్వపక్షము:—ఇట్లైన నీవిషయము పూర్వసూత్రములోనే చెప్పినట్లైనది. దీనికై ప్రత్యేకసూత్ర మేల?

---

* విషయవాక్య మనఁగా నధికరణమున నర్థనిర్ణయమునకై విచారింపఁబడు శ్రుతి వాక్యము.

సిద్ధాంతము:— ఈవిషయము పూర్వసూత్రముననే సిద్ధాంతమైన దనుట నిశ్చయము. అయినను ఉత్తరసూత్రమున జీవుఁడు మాత్రమే యనువర్తించుటకై రెండవసూత్రము కల్పింపఁబడెను.

## అ ౧. పా 3. సూ ౫. ఆరంభము.

అవతారిక:— ఈవిషయమున మఱియొక ప్రమాణమును చూపుచున్నాఁడు.—

## ౬౭. భేదవ్యపదేశాత్. ౧. 3. ౫.

తాత్పర్యము:— మఱియు జీవబ్రహ్మములకు పైవాక్యమునందు ప్రత్యక్షముగ భేదము వర్ణింపఁబడి యున్నది. "త మేవైకం జానథ ఆత్మానం" అనువాక్యభాగమున "తెలిసికొనువారు జీవులు; తెలిసికొనఁబడువాఁడు పరమేశ్వరుఁడు" అనువిషయము స్పష్టపఱుపఁబడియే యున్నది కదా! అచ్చట నాత్మశబ్దముచే ద్యులోకాద్యాధారము వర్ణింపఁబడి యున్నది. "జానథ" అనుపదముచే దానిని తెలిసికొనువారు వర్ణింపఁబడియున్నారు కదా! కావున జీవుఁడు ఎట్లును ద్యులోకాద్యాధారము కానేరఁడు.

## అ ౧. పా 3. సూ ౬. ఆరంభము.

అవతారిక :— దీనికి మఱియొక హేతువును చెప్పుచున్నాఁడు.—

## ౬౮. ప్రకరణాత్. ౧. 3. ౬.

తాత్పర్యము: — ఇంత యేల? ఈప్రకరణము పరమాత్మను బోధించునదియే కాని యన్యమును బోధించునది కాదు. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి"*అని సర్వవిజ్ఞానప్రశ్నతోఁ బ్రకరణ మారంభింపఁబడెను. పరబ్రహ్మము సర్వాత్మకము సర్వకారణము గావున దాని నెఱింగినచో సర్వము నెఱింగిన ట్లగును; గాని ప్రధానాదులలో దేని నెఱింగినను అట్లు కానేరదు కదా! కావున నీప్రకరణ

---

*'కస్మిన్ను' అను శ్రుతికి అర్థము అదృశ్యత్వాద్యధికరణము, పుట ౨౨౦ చూడుము.

మున నేవాక్యమునందు చెప్పఁబడినను పరమేశ్వరుఁడే చెప్పఁబడియుండ వలయును.

## అ ౧. పా ౩. సూ ౭. ఆరంభము.

అవతారిక:—ఈసిద్ధాంతమునే మఱియొకహేతువుచే కూడ నిర్ణ యించుచున్నాఁడు.—

## ౬౫. స్థిత్యదనాభ్యాంచ. ౧. ౩. ౭.

తాత్పర్యము:—మఱియొకవిశేషము. ద్యులోకాదుల కాధార మగువిషయమును వర్ణించుచు వచ్చి "ద్వా సుపర్ణా"* అనువాక్యముచే, "ఏక స్తయోః పిప్పలం స్వా ద్వత్తి" అని జీవునకు కర్మఫలభోగంబును, "అనశ్న న్నన్యో అభిచాకశీతి" అని పరమేశ్వరునకు నుదాసీనత్వంబునః శ్రుతి చెప్పియున్నది. ఇచ్చట జీవుఁడే ద్యులోకాదులకు నాధార మగు నేని యప్పుడు పరమేశ్వరునిగూర్చి చెప్పుటకు నవకాశ ముండదు. జీవుని గూర్చి చెప్పుట కారంభించి నడుమ నాకస్మికముగఁ బరమేశ్వరునిగూర్చి యేల చెప్పవలసియుండును? పరమప్రమాణభూత యగుశ్రుతి య ట్లేల యసంబద్ధార్థమును చెప్పును? కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమే శ్వరుఁడే యైతీరవలయును.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరికాదు. జీవేశ్వరులనుగూర్చి చెప్పఁబడి యున్నదనుట నిస్సంశయమే; కాని "ద్యులోకాద్యాధారుఁ డీశ్వరుఁ" డని చెప్పకపోయిన, "ఈశ్వరునిగూర్చి చెప్పినవాక్యభాగము నిరర్థకము కావలయును" అనుసిద్ధాంతము మాత్రము సరిపడదు. అప్పటి కిని జీవునిగూర్చి చెప్పునంశము నిరర్థకము కావలసివచ్చును కదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్పకూడదు. లోకప్రసిద్ధము కాని క్రొత్త విషయమును సయుక్తికముగ నిరూపించుటయే శాస్త్రమునకు ప్రయో జనము. అట్లు నిరూపించునదియే శాస్త్రము; తక్కినది కథయే. కావున నీన్యాయము ననుసరించి వేదాంతశాస్త్ర మగునుపనిషత్తులకుఁ గూడ నేదియో యొక యప్రసిద్ధార్థమే తాత్పర్యముగ నుండవలయును. ప్రకృ

* 'ద్వాసుపర్ణా' అనుశ్రుతికర్థము గుహాధికరణము, పుట. ౧౮౭ చూడుము.

తమున, జీవుఁడు సర్వలోకప్రసిద్ధుఁడు; ఉపాధిరహితుఁ డగుపరమేశ్వరుఁ డప్రసిద్ధుఁడు. కావున "ద్వా సుపర్ణా" అనుశ్రుతి పరమేశ్వరునిఁగూర్చి చెప్పునదియే కాని జీవునిగూర్చి చెప్పునది (తాత్పర్యముగా చెప్పునది) కాదు. కావున నారంభమున నుద్దేశింపక నడుమ నాకస్మికముగఁ దనకు దాత్పర్యభూత మగుపరమేశ్వరురూపమును చెప్పునేని యది యసంబద్ధ ప్రలాప మగును గాని జీవునిగూర్చి చెప్పినట్లు కానేరదు. పరమేశ్వర స్వరూపము బాగుగ మనసున నాటుటకై లోకప్రసిద్ధి ననుసరించి జీవ రూపము నెట్టిస్థలమందైన నుపన్యసింపవచ్చును; "ప్రతిశరీరమునందును చేతనుఁడు కలఁ డనుట లోకప్రసిద్ధమై యున్నది కదా! ఆ చేతనస్వరూ పునే శరీరోపాధుల విడిచి యేకముగ గ్రహించిన నాతఁడే పరమేశ్వ రుఁడు, అని తత్త్వార్థమును నిర్ణయింపవచ్చును. ఇందు అసంబంధ మేము న్నది? అనేకఘటములయందు నిలిచియున్న యాకాశము ప్రత్యేకముగ గ్రహింపఁబడునేని యప్పుడు "ఘటాకాశము" అనునూతననామముతో వ్యవహరింపఁబడుచుండుటయు,ఏకరూపముగ గ్రహింపఁబడెనేని యదియే యాకాశమాత్రమగుటయు విమర్శశీలునకు విదితమే కదా! కావున నీసిద్ధాంతమున దోష మింతయైనను లేదు. ఈవిషయము గుహాధి కరణమున (పుట. ౧౮౭) స్పష్టము చేయఁబడియే యున్నది.

"పైఙ్గిరహస్యబ్రాహ్మణోపనిషత్తునందు చేయఁబడిన వ్యాఖ్యా నమువలన దీనికి విరోధము వచ్చును" అనియెదవేమో,అట్లు సంశయింప నక్కఱలేదు. అచ్చట, కర్మఫలము ననుభవించునది బుద్ధి యనియు, అనుభవింపకుండువాఁడు జీవుఁ డనియుఁ జెప్పఁబడియున్నను, అచేతన పదార్థమునకు కర్మానుభవము సంభవింపదు కావున, బుద్ధిశబ్దముచే నా యుపాధితోఁ గూడిన జీవచైతన్యము చెప్పఁబడెనని సిద్ధాంతము చేయ వలయు ననియు, ఆకారణముచే జీవశబ్దముచేఁ జెప్పఁబడినది శుద్ధచైత న్యము కావలయు ననియు నిదివఱకే (గుహాధికరణమందే) సిద్ధాంతము చేసి యున్నాము. శుద్ధచైతన్య మనిన పరమేశ్వరుఁడే కదా! కావున బాగుగ విచారించిన నీరెండువ్యాఖ్యానములకును భేదమే లేదు. ఇట్ల గుటచే నిందలివిషయవాక్యమున వర్ణింపఁబడినవాఁడు నిస్సంశయముగఁ బరమేశ్వరుఁడే.

విశేషము:—ఇచ్చట విషయవాక్యము "అథ పరా యయా" * అనువాక్యమును విచారించినప్పుడే విచారింపఁబడినట్లయ్యెను. ఈ రెండు వాక్యములు ముండకోపనిషత్తున నున్నవియే కావున వీనికిఁ బ్రకరణ మొక్కటియె అయినను దీని నొకక్రొత్తవాక్యముగాఁ దలంచి సుఖబోధకై యిందు మరల విచారించి రని తెలిసికొనవలయును.

---

## ౨. భూమాధికరణము.

విషయము:—నారదమహాముని సర్వశాస్త్రముల నెఱింగియు నాత్మ నెఱుంగకపోవుటచే నుపదేశమును బొందుటకై బ్రహ్మమానస పుత్త్రుండును బ్రహ్మవేత్తలలో నుత్తముఁడు నగుసనత్కుమారునికడకుఁ బోయెను. అమ్మునియు నారదునిపాండిత్యము నెఱింగి క్రమక్రమముగ నామము, వాక్కు, మనస్సు, సంకల్పము (ఉచితానుచితముల నెఱుంగు వివేకము), చిత్తము (పూర్వాపరవిచారణ), ధ్యానము, విజ్ఞానము (నిశ్చయరూపిణి యగుబుద్ధి), బలము, అన్నము, జలము, వాయుసహితుఁ డగునగ్ని, ఆకాశము, స్మృతి (గడచినదానిని జ్ఞప్తియం దుంచుకొనుట), ఆశ, ప్రాణములు అనునవి యాత్మరూపములుగ నుపాసింపఁబడతగినవి యని చెప్పెను. ఇంతవఱకు నొక్కొకవిషయమును బోధించినపిదప నారదుఁడు "ఇంతకంటె నధిక మైనది కలదా?" అని యడుగుచు వచ్చెను. "ప్రాణమును బ్రహ్మమునుగా నుపాసింపవలయును" అనిన పిదప నట్టిప్రశ్నఁ జేయుటను మానెను. అప్పటికి నానారదునకు "ఇదియే యాత్మ" అనుతృప్తి కలిగెను. దాని నెఱింగి యాసనత్కుమారుఁడు తనశిష్యునకు ననాత్మయం దాత్మబుద్ధి స్థిరము కాకుండుటకై స్వయము గనే బ్రహ్మోపదేశము నారంభించెను. "ఏష తు వా అతివదతి యః సత్యే నాతివదతి" "ఎవ్వఁడు సత్యపదార్థము నాత్మగా నెఱింగి 'ఇది సర్వాతీత మైనది' అని చెప్పునో వాఁడే యథార్థముగ నతివాది (సర్వాతీతము నెఱింగి పలుకువాఁడు)" అని "ప్రాణమునకంటె భిన్న మగుసత్యపదార్థ మొక్కటి కలదు" అని యారంభించి, దానిని గురూపదేశాదులచే

---

* 'అథ...' అను శ్రుతికి నర్థము అదృశ్యత్వాద్యధికరణము, పుట. ౨౧౫ చూడుము.

మొట్టమొదట నెఱుంగవలయుననియు, అట్లెఱింగి యుక్తులచే నిర్ణయించుకొనవలయు ననియు,తత్త్వజిజ్ఞాసువు లగుసహాధ్యాయులతో వాదించి దానియందు బుద్ధిని సమాధానపఱుపవలయు ననియు, అట్లు స్థిరమగు బుద్ధితో నితరపదార్థములఁ బరిత్యజించి వైరాగ్యవంతుఁడై బ్రహ్మాధ్యానాభ్యాసమును గావింపవలయు ననియు, ఆయభ్యాసముచే బ్రహ్మనిష్ఠ దృఢ మగుననియు, ఇది యంతయు సుఖము గానరాకపోయిన నెవ్వఁడు నాచరింపఁడనియు, కావున మొట్టమొదట సుఖస్వరూపము నెఱుంగవలయుననియు చెప్పెను. "అసుఖ మెయ్యది?" అని నారదుఁడు ప్రశ్నింపఁగా, "యో వై భూమా తత్సుఖం" "భూమ యేదికలదో యదియే సుఖము" అని సమాధానము చెప్పెను. "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా" "ఏస్థితియందు రెండవ దానిని చూడఁడో వినఁడో తెలిసికొనఁడో అదియే భూమ యనఁబడును" అని భూమలక్షణమును చెప్పెను. ఈవాక్యము ఈయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున నాత్మశబ్దము నాశ్రయించి, అది యచేతనములయందు ప్రవర్తింప దనునొకనిశ్చయమును పెట్టుకొని సిద్ధాంతము చేసియున్నారు. అది సరి కాదు. పైఛాందోగ్యప్రకరణమున నాత్మశబ్దము ప్రాణవాయువులయందును ప్రయోగింపఁబడి యున్నది. ఆప్రకరణమున "శ్రుతం హ్యేవ భగవద్దృశేభ్య స్తరతి శోక మాత్మవి దితి సోఽయం శోచామి భగవ స్తం మా భగవా ఞ్ఛోకస్య పారం తారయత్" 'ఆత్మవేత్త యగువాఁడు దుఃఖము నొందఁడు అని మిమ్ము బోంట్లు చెప్పుచుండ వింటిని. నాకు దుఃఖ మధికముగ నున్నది. ఓభగవంతుఁడా! సనత్కుమారా! ఆయాత్మ నుపదేశించి నన్ను దుఃఖసముద్రమునుండి ఈవలకుఁ దీయుఁడు' అని నారదుఁడు ప్రశ్నింపఁగా సనత్కుమారుఁడు ప్రాణోపదేశమును మాత్రమే చేసి ముగించియున్నాఁడు కదా! అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది.

సందేహము:—ఇచ్చట భూమశబ్దమునకు "బహుత్వము" అని యర్థ మగుచుండుటయు, ఈకారణమువలన సమీపమున నున్నప్రాణముల యొక్క బహుత్వమే యుద్దేశింపఁబడె నని తోఁచుచుండుటయు, ఉపక్ర

మమున "తరతి శోక మాత్మవిత్" అనువాక్యభాగమునందు పరమేశ్వర వాచక మగునాత్మశబ్ద ముండుటయు సంశయకారణములు. "ఇచ్చటి భూమశబ్దము ప్రాణమునే చెప్పును; పరమేశ్వరునే చెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. పూర్వపక్షమునకు ప్రాణోపాసనయు, సిద్ధాంతమునకు బ్రహ్మజ్ఞానంబును ఫలములు. నిర్గుణబ్రహ్మప్రకరణముల నెందైనను పూర్వపక్షమునకు నేదియోయొకదాని యుపాసనయు, సిద్ధాంతమునకు బ్రహ్మజ్ఞానంబును ఫలము లగు నని తెలిసికొనవలయును.

పూర్వపక్షము:—విషయవాక్యమునందలి భూమశబ్దము ప్రాణమునే చెప్పు ననితీరవలయును. నారదసనత్కుమారసంవాదమున నేవిషయము చెప్పఁబడినను ప్రశ్నప్రవచనరూపముగనే చెప్పఁబడి యున్నది. ప్రాణోపదేశానంతరమున నట్టిప్రశ్న కానరాలేదు. కావున పిదప చెప్పఁబడియున్నభూమ ప్రాణమే కావలయును.

మఱియు "బహోర్లోపో భూ చ బహోః" * అనువ్యాకరణసూత్రము ననుసరించి చూచిన భూమశబ్దమునకు "బహుత్వము" అని యర్థ మేర్పడుచున్నది. కావున నాబహుత్వము గలపదార్థ మేదియో యొకటి యుండవలయును కదా! అట్టిదానిని విచారింపఁబోయిన సమీపమునం దున్నప్రాణమే యట్టిది యగును. బుద్ధియందు అదియేకదా స్ఫురించుచున్నది!

ఇదియును గాక ప్రాణోపదేశము చేసినపిదప నారదుఁడు మఱి యొకప్రశ్నను చేయలేదు. సనత్కుమారుఁడైనను "ప్రాణమునకంటె భూమ యుత్తమమైనది" అని విస్పష్టముగ చెప్ప లేదు. కావున నెట్లు చూచినను భూమ ప్రాణమే కావలయును.

---

* 'బహోః...' అనుసూత్రమునకు నర్థము:—భావమును (ఉనికిని), లేక, స్వభావమును చెప్పుటకై విశేషణవాచకములమీఁద "ఇమన్-ఇయస్" అను ప్రత్యయములు ప్రయోగింపఁబడును. వీనికి "ఇమా ఇయాన్" అని రూపములు. ఈ ప్రత్యయములు బహుశబ్దముమీఁద వచ్చినప్పుడు తమమొదట నున్న యికారములను పోఁగొట్టుకొనును; "మా-యాన్" అని మాత్రమే యేర్పడును. మఱియు బహుశబ్దమునకు మాఱుగా భూశబ్దము వచ్చును. అప్పుడు "భూమా భూయాన్" అనురూపము లేర్పడును. ఈ ప్రత్యయములు భావార్థమును చెప్పునవి కావున నాపదములకు "బహుత్వము" అని యర్థ మేర్పడును.

"తరతి శోక మాత్మవిత్" అని యారంభమున నాత్మశబ్దముండుట వలన నిది యాత్మవిషయక మగు ప్రకరణము. నారదుండును ప్రశ్న పరంపరలచే నాత్మరూపమును తెలిసికొనుటకే ప్రయత్నించెను. కావున నిందంతమున నుపదేశింపఁబడిన భూమ యాత్మయే యై తీరవలయును" అనియెదవేమొ యదికాదు. ఇచ్చట సనత్కుమారుని యుత్తరము "నామ బ్రహ్మేత్యుపాస్వ" "నామమును పరబ్రహ్మ మని తలంచియుపాసనచేయుము" అని ప్రతీకోపాసనాసూచకమై * యున్నది. శుద్ధబ్రహ్మ బోధకమై యుండలేదు. కావున నారదుని ప్రశ్నయు నట్లే ప్రతీకమాత్ర విషయమై యుండవలయును కాని శుద్ధబ్రహ్మ విషయమై యుండుటకు వీలు లేదు. ఇట్లు కాదనిన ప్రశ్నోత్తరములకు పరస్పరవిరోధము సంభవించును. అప్పుడు ఆకథను తెల్పు వేదమే యప్రమాణము కావలసివచ్చును. ఒకవిషయము నడిగిన నెవఁడైనను మఱియొకవిషయమును జెప్పునా ?

మఱియు ప్రాణోపదేశానంతరమున నారదుఁడు ప్రశ్నను మానుటచే నాయనకు శుద్ధబ్రహ్మవిజ్ఞానమున నుద్దేశమే లేదని స్పష్ట మగుచున్నది. కావున నిది బ్రహ్మప్రకరణము కానేరదు.

"ఇట్లు కాదు. సనత్కుమారుఁడు ప్రతీకోపాసనను చెప్పలేదు. నామాదుల నాశ్రయించి యచ్చట నున్నపరబ్రహ్మమునే తెలిసికొనవలయు నని యుద్దేశించియే యట్లు చెప్పెను" అనియెదవేమొ, అదియు సరికాదు. అట్లయిన ప్రాణోపాసనమును చెప్పఁగనే ప్రశ్నమును మానుట సంభవింపదు. "ఇట్లు చెప్పెద వేల? ప్రాణము వాయురూపము. శాస్త్రములయందు బ్రహ్మము నిర్వికారమని చెప్పఁబడి యున్నది కదా! కావున

---

ప్రతీకోపాసనాస్వరూపము:—కన్నులకు గోచరము గానిపదార్థమును ధ్యానించుటకై ఏర్పఱుచుకొనఁబడినగుఱుతు ప్రతీక మనఁబడును. విష్ణువు కన్నులకుఁ గానరాకపోవుటచే నాయనను సాలగ్రామమునందుఁ గాని విగ్రహమునందుఁ గాని ధ్యానించుచున్నాము; పూజించుచున్నాము. ఇట్లే కన్నులకుఁ గానరానిశివుని లింగమునందు ధ్యానించుచున్నాము, పూజించుచున్నాము. ఇప్పుడు సాలగ్రామవిగ్రహములు విష్ణుప్రతీకము లనియు, లింగము శివప్రతీక మనియుఁ జెప్పఁబడును. ఇట్లే అవాఙ్మానసగోచర మగుబ్రహ్మము నుపాసించుటకు ననేక ప్రతీకములు కల్పింపఁబడి యున్నవి. ఇట్టి ప్రతీకముల నాశ్రయించి చేయఁబడునుపాసన ప్రతీకోపాసన యనఁబడును.

దీనికంటెఁ గూడ నధిక మగుపదార్థ మేదైన కలదా?" అని యడుగవలసి యుండును. అట్టి ప్రశ్న యేదియు లేదు. కావున నాయనకు ప్రతీకోపాసనాజ్ఞానమునందే యిచ్ఛ కల దని తోఁచుచున్నది. కావున నిది నిస్సంశయముగ బ్రహ్మప్రకరణము కాదు. ఈకారణమువలన నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినభూమ ప్రాణమే.

అవతారిక:— అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.—

## ౬౯. భూమా * సంప్రసాదా దధ్యుప దేశాత్. ౧. ౩. ౮.

తాత్పర్యము.—ఇచ్చట చెప్పఁబడినభూమ పరమాత్మయే. ఈ భూమ ప్రాణోపదేశానంతరమున నుపదేశింపఁబడియున్నది. ఒకదాని వెనుక నుపదేశింపఁబడినది దానికంటె భిన్నము కావలయును కాని యదియే యై యుండుటకు వీలు లేదు. నామము నుపదేశించినపిదప దానికంటె భిన్న మగు వాగింద్రియ ముపదేశింపఁబడెను గాని మరల నానామమే యుపదేశింపఁబడ లేదు. వాగుపదేశము మొదలు ప్రాణము వఱకు కలవి యన్నియు నట్లే యుపదేశింపఁబడినవి. కావున నుపదేశభేదముచే భూమ ప్రాణభిన్న మగుపదార్థమే కావలయును.

సిద్ధాంతము:—భూమాశబ్దము భావప్రత్యయాంత * మనియు,

---

సంప్రసాదశబ్దార్థము:— "సంప్రసీద త్యస్మి న్నితి సంప్రసాదః"="దీని యందు జీవుఁడు సంపూర్ణముగ శాంతి నొందును కావున సంప్రసాదము" అను వ్యుత్పత్తిచే సంప్రసాదశబ్దము సుషుప్త్యవస్థను చెప్పును. బృహదారణ్యకోపనిషత్తునందు జాగ్రత్స్వప్నావస్థల వర్ణించిన పిదప సుషుప్త్యవస్థ సంప్రసాదశబ్దముచేత నే వ్యవహరింపఁబడి యున్నది.

కావున నాశబ్దముచే ప్రస్తుతసూత్రమునందుఁ బ్రాణము చెప్పఁబడి యున్నది. సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియములును మనస్సహితముగ లయమునొందినను ప్రాణము మాత్ర మట్లే యుండును కదా? మఱియు కొన్నికొన్నిచోట్ల నీశబ్దముచే జీవుఁడు కూడఁ జెప్పఁబడును. అతఁడును సర్వేంద్రియములు లయము నొందినను తదభావసాక్షియై పరబ్రహ్మముతో నైక్యము నొంది యాయవస్థయం దుండును కదా!

* భావప్రత్యయ మనఁగా: ఉనికిని గాని స్వభావమును గాని జాతిని గాని చెప్పుప్రత్యయము. "త్వం తా" అను మొదలగునవి యనేకము జాతిలో చేరుచున్నవి.

దానికి నేదియోయొకటి యాధారముగ నుండవలయు ననియు చెప్పుట నిశ్చయమే కాని యీప్రకరణ మాత్మప్రకరణమే కావునను, "ఏష తు వా అతివదతి యస్సత్యే నాతివదతి" "ఎవ్వఁడు సత్యమును గైకొని యతివాదము చేయునో (ఇదియే సర్వాధిక మని చెప్పునో) వాఁడే యథార్థ మగునతివాదమును చేసినవాఁడు" అని ప్రాణోపదేశానంతర మున బ్రహ్మవాచక మగుసత్యశబ్దముచే శ్రుతి యుపదేశము నుపక్రమిం చుటచేతను, ఈభూమశబ్దార్థ మగుబహుత్వమునకు నాత్మయే యాధార మగును. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని తైత్తిరీయశ్రుతియందు సత్యపదము బ్రహ్మవాచకముగాఁ బ్రయోగింపఁబడి యున్నది కదా!

"ఇది యాత్మప్రకరణము కాదు" అనుటకు వీలు లేదు. "తరతి శోక మాత్మవిత్" అనుటచే సర్వశోకనివారణకారణ మాత్మ యని నిరూపింపఁబడినది. అట్టియాత్మనుగూర్చియే ప్రశ్నప్రతివచనములు జరిగి యుండవలయును. ప్రతీకోపాసనలఁ జెప్పుటవలన కలుగువిరోధ మేదియు లేదు. నారదుఁడు ఆత్మరూపమును బొత్తిగ నెఱుంగనివాఁడు కావున మొట్టమొదటనే యతిసూక్ష్మ మగు నారూపమును గ్రహింపలేఁడని మెట్లెక్కించురీతి నొకదానివెనుక నొకదాని స్థూలోపాధి వెనుక సూక్ష్మోపాధి నుపదేశించుచు రావచ్చును; ప్రాణోపదేశము వెనుక, "అదియే పర మార్థము" అని తృప్తిఁజెందఁగ నాపల స్వయముగనే తత్త్వము నుప దేశించి యామిథ్యానిశ్చయమును తొలగింపను వచ్చును. కావున నిది ప్రాణప్రకరణము కానేరదు.

ఒకవేళ అట్లైనను "ఏష తు ...."అనుమొదలగువాక్యమున నున్నబ్రహ్మవాచకసత్యశబ్దముయొక్క శ్రుతిని * బాధింపనేరదు. ప్రకర ణము శ్రుతికంటె ననేకభాగములు బలహీనము కదా! మఱియు "ఏష తు" అనుస్థలమున నున్న తుశబ్దము నిరర్థక మగును. "ఏషతు వా అతివదతి" "వీఁడే యతివాదము చేయువాఁడు" అనుటచే "ఇంతకు ముందు చెప్పఁ బడినవాఁడు అతివాది కాఁడు. ఇప్పుడు చెప్పఁబడినవాఁడే అతివాది" అని చెప్పిన ట్లగుచున్నది. మఱియు నావాక్యమునకుఁ బిదప "సత్యం

"ఘనః=ఘనుఁడు, ఘనత్వం, లేక, ఘనతా=ఘనుఁడుగా నుండుట" అను మొదలగునవి దీనికి నుదాహరణములు.

* శ్రుతిస్వరూపము, పుట 102 చూడుఁడు.

త్వేవ విజిజ్ఞాసితవ్యం" "సత్యపదార్థమునే తెలిసికొన నిచ్ఛయింపవల యును" అని చెప్పఁబడి యున్నది. ఈవాక్యముచేతఁ గూడ "ఇదివఱకు చెప్పఁబడినవానిని తెలిసికొనుటచేఁ బ్రయోజనము లేదు. సత్యపదార్థము నొక్కదానినే తెలిసికొనవలయును" అని యర్థ మేర్పడుచున్నది. ఈరెండుతుశబ్దముల చేతను ప్రాణమువఱకుఁ గలసర్వపదార్థములును నిషేధింపఁబడిన వనియు, చెప్పఁబడఁబోవుభూమయే సత్యశబ్దముచే నిర్దేశింపఁబడి ప్రధానముగ నుద్దేశింపఁబడిన దనియు స్పష్ట మగుచున్నది. ఇది ప్రాణప్రకరణమే యనినచో నీరెండుతుశబ్దములును నిరర్థకములు కావలసి వచ్చును.

"ఇట్లు చెప్పనేల? అతివాదిత్వము ప్రాణవేత్తకే విశేషణము కావచ్చును. 'వీఁడే, అనఁగా: ప్రాణవేత్త యొక్కఁడే యతివాది. వాగాదివేత్తలు అట్టివారు కారు' అనియర్థము చెప్పవచ్చును. అప్పుడు తుశబ్దము నిరర్థకము కాదు" అనియెదవేమొ, అది యుక్తము కాదు. సత్యపదము బ్రహ్మవాచక మగుట ప్రసిద్ధమై యుండ దానిని తొలఁగించుటకు వీలు లేదు. "సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యం" అనువాక్యమునకును అప్పుడు చక్కనియర్థము రాదు. అతివాదిత్వము ప్రాణోపదేశమునకు పిదపనే చెప్పఁబడి యున్నది; కాని యంతకుఁ బూర్వము చెప్పఁబడి యుండలేదు. అంతకుఁ బూర్వము చెప్పఁబడి యుండిననే కదా దానిని నిరాకరించి దీనిని ప్రశంసింపవలసియుండును! మఱియు నారదుఁడు ప్రాణోపదేశము కాఁగానే దానినే సర్వాధికమునుగా తలంచి యూరకుండెను. కావున నాయనకు యథార్థ మగునతివాదిత్వమునుగూర్చి చెప్పుట యావశ్యకమై యుండెను. ప్రాణమే సర్వాధికము కానేరదు కదా! ఇట్లగుటచే నతివాదిత్వహేతువుగాఁ జెప్పఁబడినసత్యము బ్రహ్మమే యై తీరవలయును ; ప్రాణోపదేశసమయమునఁ జెప్పఁబడినయతివాదిత్వము సాపేక్షికమే (నారదునిబుద్ధిస్థితి ననుసరించి చెప్పఁబడినదే) యై తీరవలయును. "నాన్యః పంథా విద్యతే ఽయనాయ" "సర్వదుఃఖనివృత్తి రూప మగుమోక్షమునకు నాత్మజ్ఞానముకంటె భిన్నమగునుపాయము లేదు" అను మొదలగు నితరశ్రుతుల ననుసరించిన "ఆత్మజ్ఞాన మొక్కటియే సర్వదుఃఖనివారకము" అని తేలుచున్నది. ఈప్రకరణమునందును "తరతి శోక మాత్మవిత్" ఇత్యాద్యుపక్రమోపసంహారములచే ప్రశ్నో

త్తరములు సర్వదుఃఖనివృత్తివిషయము లేయని స్పష్టమగుచున్నది. కావున నిచ్చట చెప్పఁబడిన విషయము పరమేశ్వరుఁడే యైయుండవలయును.

కావున నెట్లు సంశయించుటకును ఇచ్చట వీలే లేదు. ఒకవేదము చదివినవానిని గూర్చి చెప్పునప్పుడు "నాలుగు వేదముల చదివినవాఁడు మహాబ్రాహ్మణుఁడు" అనిన నది నాలుగు వేదములను గూర్చి యారంభింపబడిన ప్రసంగమే యగునట్లు, ఇచ్చటను "ఏషతు...." అను మొదలగు వాక్యము బ్రహ్మమునుగూర్చిన ప్రసంగమే యగును కాని ప్రాణమునుగూర్చిన ప్రసంగము కానేరదు. మఱియు ప్రకరణాంతమున "భూమ దేని నాశ్రయించియున్నది?" అని నారదుఁ డడుగఁగా "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" "తనమహిమయందే యాభూమ నిలిచియున్నది" అని సనత్కుమారుఁ డుత్తర మిచ్చెను. ఇదియు ప్రాణమును గ్రహించిన సంభవింపనేరదు కదా! కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా. ౩. సూ ౯. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తముగా నుండలేదు. "ప్రాణః పితా" "ప్రాణమే తండ్రి" అను మొదలగు వాక్యములచే శ్రుతి "ప్రాణమే సర్వాత్మకము" అని చెప్పుచున్నది. కావున నాత్మశబ్దము దానియందే ప్రవర్తింపవచ్చును. మఱియు "యత్ర నాన్యత్ పశ్యతి" అను మొదలగు భూమలక్షణములు కూడ నాప్రాణమునకే సరిపడుచున్నవి. సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియములు లయమైనను ప్రాణము నిలిచియున్నది. అప్పుడు ఆఇంద్రియములు ప్రాణమునందే లయము నొందిన వనవచ్చును. అప్పుడు చూపు మొదలగునవి యేవియు లేవనుట స్పష్టము కదా!. "న శృణోతి న పశ్యతి" "చూడఁడు వినఁడు" అని సుషుప్త్యవస్థను వర్ణింప నారంభించి "ప్రాణాగ్నయ ఏ వాస్మి న్పురే జాగ్రతి" "ఈయవస్థయందు సర్వేంద్రియముల మ్రింగిన ప్రాణము లనునగ్నులే మేల్కొని యుండును" అని శ్రుతి యీవిషయమును స్పష్టము చేయుచున్నది.

మఱియు "యో వై భూమా తత్సుఖం" అని చెప్పఁబడినసుఖరూపము సుషుప్త్యవస్థయందుండునది యగుటచే ప్రాణమునకే సంభవించును. "అత్రైష దేవః స్వప్నా న్న పశ్య త్యథ య దేతస్మి ఞ్ఛరీరే

సుఖం భవతి" "ఈజీవుఁడు ఏసమయమున కల గాంచఁడో,యట్టి సుషు ప్త్యవస్థయందు సుఖము కలుగును." అని శ్రుతియే "సుషుప్త్యవస్థ (అనఁగా: అందున్నప్రాణము) సుఖస్వరూప మైనది" అని చెప్పియున్నది. "యోవై భూమా తత్ దమృతం"అని చెప్పఁబడినయమృతత్వము కూడ "ప్రాణో వా అమృతం"అను శ్రుతిచే ప్రాణమునకే చెప్పఁబడి యున్నది. ఇట్లు సర్వవిధముల భూమలక్షణము ప్రాణమునకు సరిపోవుచుండ దాని కొఱకై యంతప్రయాస మేటికి ?

అనతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.—

## ౭౦. ధర్మోపపత్తేశ్చ. ౧. ౩. ౯.

తాత్పర్యము:—మఱియు నిచ్చట భూమను గూర్చి చెప్పఁబడిన ధర్మము లన్నియు పరమాత్మయందే సమన్వితము లగునుగాని ప్రాణమునందు కావు. ఈకారణమువలనఁ గూడ నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

సిద్ధాంతము:—"యత్ర నాన్యత్ పశ్యతి"అనుమొదలగు వాక్యములచేఁ జెప్పఁబడినవ్యవహారాభావము ఆత్మయందే కాని తటస్థింపదు. ఇతరశ్రుతియందు స్పష్టముగ నట్లే చెప్పఁబడి యున్నది. "యత్ర త్వస్య సర్వ మా త్మై వాభూ త్త త్కేన కం పశ్యేత్?" "ఎచ్చట సాధకునకు సర్వము నాత్మయే యయ్యెనో అప్పుడు ఎవనిని దేనితో చూచును?" అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. సుషుప్త్యవస్థయందు ఇంద్రియములు లయమగుటచే సర్వవ్యవహారాభావము కలుగుట నిశ్చయమే కాని యది నిత్యమైనదియు దుఃఖనాశనకర మైనదియుఁ గాదు కదా! ఇట్టివ్యవహారాభావమును సనత్కుమారుఁడు సర్వదుఃఖనాశార్థి యగు నారదునకు నెట్లు చెప్పఁగలఁడు ?

ఇట్లే భూమకు చెప్పఁబడినసుఖత్వామృతత్వములు కూడఁ బ్రాణమునకు సంభవింపవు. "సుషుప్త్యవస్థయందు సుఖము కలదు" అని చెప్పిన శ్రుతివాక్యము పరబ్రహ్మప్రకరణములోనిది. అందు పరమాత్మానందము చెప్పఁబడెనే కాని ఇతర మేదియు చెప్పఁబడలేదు. బృహదారణ్యకోపనిషత్తున నాల్గవయధ్యాయమున తృతీయబ్రాహ్మణమునందు ఈవిషయము మఱింత స్పష్టము చేయఁబడియున్నది. అచ్చట

జాగ్రదాద్యవస్థలను చెప్పి సుషుప్త్యవస్థను వర్ణించినపిదప దానినే సుఖరూపముగ చెప్పి యందు ఆత్మకుఁ గలసర్వసంబంధరాహిత్యమును అద్వితీయత్వమును నిరూపించి కల్పితభేదానుసారముగ "ఏషోఽస్య పరమ ఆనందః, ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" "ఇదియే యీబ్రహ్మమునకుఁ గల యానందరూపము. ఈయానందములోని యంశము నాశ్రయించియే తక్కినభూతము లన్నియు జీవించుచున్నవి" అని చెప్పఁబడి యున్నది. కావున పైస్థలము ("అత్రైష దేవః స్వప్నా న్న పశ్యతి" అనుస్థలము) కూడ నాత్మప్రక రణమే యగుటచే నచ్చటను ఇదియే విషయము చెప్పఁబడియున్నదని తీరవలయును. ఇఁక నమృతత్వ మనిన నది పరమాత్మాతిరిక్తములగు పదార్థములకు ముఖ్యమై యుండనేర దనుట నిర్వివాదము. అమృతత్వ మనఁగా నాశము లేకుండుట. ఇది యేపదార్థమునందైనఁ గలదా ?

ఇదియునుగాక నాత్మత్వమునది ప్రాణమునకు బొత్తిగనే సంభవింపదు. "ప్రాణము తండ్రి" అని చెప్పు శ్రుతులు ఔపచారిక ముగ చెప్పునవియే కాని ముఖ్యములు కావు. అట్లగుటకును వీలు లేదు. అది వాయురూపమే. వాయువు అచేతనము. పురుషునియందు చైత న్యము కానవచ్చు చున్నది. ఇట్లుండ ప్రాణమే తా నచేతనమై చేతనుఁ డగుతండ్రి యెట్లు కాఁగలదు? కావున నీధర్మము లేవియుఁ బ్రాణ మునకు సంభవింపవు. మఱియు సర్వవ్యాపకత్వము సర్వరూపత్వము మొదలగుధర్మము లనంతములుగ నాభూమాప్రకరణమునఁ జెప్పఁబడి యున్నవి. అవియుఁ బ్రాణమునకు సంబంధించునవి కా వనుట స్పష్టమే. కావున నిర్వివాదముగ నిందుఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

---

## ౩. అక్షరాధికరణము.

విషయము:—ఒకసమయమున జనకమహారాజు యజ్ఞమును గావించుచుండ నచటికి కురుపాంచాలదేశములయందలి బ్రాహ్మణు లంద ఱును దక్షిణకై వచ్చిరి. అప్పుడు ఆజనకుండు వారలలో బ్రహ్మవేత్త యగు వాని నధికముగ సంభావింపఁదలంచి సువర్ణశృంగములతోను తగినదక్షిణ

తోను గూడిన వేయిగోవుల నొకమొత్తముగా నుంచి "ఓబ్రాహ్మణు
లారా! మీలో బ్రహ్మవేత్త యగువాఁడు ఈబహుమానమును గైకొన
వలయును" అని చెప్పెను. అందఱును సంశయావిష్టులై యూరకుండిరి.
యాజ్ఞవల్క్యమహాముని వానిని గ్రహించెను. అప్పుడు కుపితులై యా
యాజ్ఞవల్క్యు నవమానింపఁదలంచి మిగిలినబ్రాహ్మణులలో జ్ఞానవంతుఁ
డని ప్రసిద్ధిఁ గాంచినప్రతిమనుజుఁడును బ్రహ్మవిషయకము లగుప్రశ్నల
నడిగి పరీక్షించుచుండిరి. వారిసమూహములో బ్రహ్మవేత్తలలో నుత్తమ
యనఁదగిన గార్గియనుస్త్రీకూడ నుండెను. ఆమెయు యాజ్ఞవల్క్యుని
బహువిధములఁ బరీక్షించెను. ఆమె వేయుప్రశ్నములు మిగుల యుక్తి
యుక్తములే యైనను పరబ్రహ్మమును గూర్చినప్రశ్నలు గురుశిష్యన్యా
యము నతిక్రమించి యుండరా దనుతలంపున, నాయాజ్ఞవల్క్యుఁ
డామెను క్రోధముతో "నీవడుగువిషయ మిట్లు వాదపూర్వకముగ నడుగ
వలసినది కాదు. ఇఁక నూరకుండుము" అని ధిక్కరించి పలికెను. మరల
నాసభ తన కపజయము కలిగె నని భావించునేమో యనుతలంపున
నాగార్గిని ప్రశ్నింప నంగీకరించి సదుత్తరముల నిచ్చి తృప్తి పఱచెను.
తక్కినవార లొనర్చినప్రశ్నము లంతసూక్ష్మములు కాకపోవుటచే నట్లు
జరుగలేదు; వారిని ధిక్కరింపక యెప్పటి కప్పుడే సమాధానము చెప్పెను.

గార్గికి రెండవమాఱు ఉత్తరముల నిచ్చుస్థలమున "కస్మిన్ను ఖ
ల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి" * "అవ్యాకృతరూప మగునాకాశ
మేపదార్థమున నోతప్రోతభావమును * జెంది యున్నది?" అను గార్గిప్ర
శ్నంబును, "ఏతద్వై త దక్షరం గార్గి బ్రాహ్మణా అభివదం త్యస్థూల
మనణు" "ఓగార్గీ! ఆసర్వాధార మగునాకాశమునకు నాధార మైనది
యక్షర మనియు,అది స్థూలత్వము కృశత్వము మొదలగుధర్మములు లేని
దనియు బ్రహ్మవేత్తలు చెప్పుదురు" అనుయాజ్ఞవల్క్యుని యుత్తరంబును
కలదు. ఇందలియక్షరశబ్దార్థ మీయధికరణమున విచారింపఁబడును.

సందేహము:—ఈయక్షరశబ్దము వర్ణవాచకముగ ప్రసిద్ధిఁ జెంది

---

* అవ్యాకృతము, (పుట. ౨౧౭ చూడుము.)

* ఓతప్రోతభావము.—ఓత మనఁగా పడుగు; ప్రోత మనఁగా పేఁక. కావున నేవియైన కొన్ని పదార్థములు పడుగుపేకలవలె కలసి యుండునేని యాస్థితికి ఓతప్రోతభావ మని వ్యవహారము.

యుండుటయు, పరమాత్మయందు యౌగికార్థము మాత్రమే కలిగియుండుటయు నిచ్చట సంశయకారణములు. "ఈవిషయవాక్యమునఁ జెప్పఁబడినది యోంకారరూప మగునక్షరమే; బ్రహ్మమే" యనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. పూర్వపక్షమున నుపాసనయు సిద్ధాంతమున జ్ఞానంబును ఫలములు.

సంగతి:—పై యధికరణమున సత్యశబ్దము పరబ్రహ్మమున రూఢ మగుటచే "భూమ పరబ్రహ్మము" అని సిద్ధాంతము చేయఁబడి యున్నది. అట్లే యిచ్చట కూడ నక్షరశబ్దము వర్ణమున రూఢ మగుటచే నీవిషయ వాక్యమును, వర్ణపరముగానే సమన్వయింపవలయును. కావున పై దానికి నిది దృష్టాంతము. ఇట్లగుటచే నీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతసంబంధము (ఇది పూర్వపక్షాభిప్రాయ మని తెలిసికొనవలయును).

పూర్వపక్షము:—అక్షరశబ్దము కొన్నికొన్ని స్థలములలో బ్రహ్మవాచకముగఁ బ్రయోగింపఁబడి యుండుట నిశ్చయమే కాని యచ్చటఁ గ్రహింపఁబడినది యోగమే కాని రూఢికాదు. యోగముకంటె రూఢి బలవంతమైనది కావున నిరర్థకముగ రూఢిని బరిత్యజింపఁగూడదు. కావున నక్షరశబ్దమునకు నిచ్చట నోంకారమే యర్థమునుగాఁ జెప్పవలయును. "త ద్యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణా న్యేవ మోంకారేణ సర్వా వాక్" ఈయనచే ఆకుయొక్క యవయవములు సంధింపఁబడి ధరింపఁబడి యున్నట్లు ఓంకారముచే వాక్కు లన్నియు సంధింపఁబడియు ధరింపఁబడియు నున్నవి" అను శ్రుతిచే సర్వశబ్దములకు సర్వాక్షరములకు నోంకారమే యాధార మని చెప్పఁబడి యున్నది. కావున నోంకారోపాసనయే సర్వాక్షరోపాసన యగును. మఱియు ఛాందోగ్యమున "ఓ మి త్యేత దక్షరం ...." "ఓం అనునక్షరము" అను మొదలగువాక్యముచే ప్రత్యక్షముగ నోంకారోపాసన చెప్పఁబడియు నున్నది.

"ఇట్లు చెప్పకూడదు. వ్యాకరణభాష్యమున వర్ణవాచక మగు నక్షరశబ్దమునకుఁ గూడ యౌగికార్థమే చెప్పఁబడి యున్నది. కావున నిచ్చట సంశయమే లేదు. రెండును యౌగికార్థములే యగునప్పుడు రూఢి పరిత్యాగదోషము రానేరదు కదా!" అనియెద వేమొ, అట్లు సంశయింపఁ బనిలేదు. వర్ణములను గూర్చి నిత్యము లని యొకమతమును

అనిత్యములని యొకమతమును కలదు. అందు నిత్యము లనుపక్షమున రూఢియు ననిత్యము లనుపక్షమున యోగంబును అక్షరశబ్దమునకు గ్రహింపఁబడుచున్నవి. నేను చెప్పినది నిత్యపక్షము; భాష్యకారుని వ్యాఖ్యాన మనిత్యపక్షము నాశ్రయించినది. కావున విరోధము లేదు.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు—

## ౭౧. అక్షర మమ్బరాన్తధృతేః. ౧. ౩. ౧౦.

తాత్పర్యము:—ఇచ్చట చెప్పఁబడిన యక్షరము పరబ్రహ్మమే. ఆకాశమః (అవ్యాకృతము) సర్వాధార మనియు, అక్షరము దానికిఁ గూడ నాధార మనియుఁ జెప్పఁబడి యున్నది. ఒకవర్ణము ఇట్టిసామర్థ్య ము కలది యగుట యసంభవము కదా! ఛాందోగ్యమున నోంకారోపాసన చెప్పఁబడె ననుట యథార్థమే యైనను అది పరమాత్మోపాసనయే కాని యన్యము కానేరదు. ఆపరమాత్మును ఓంకారరూపముతో ధ్యానించి యుపాసింపు మని యందు చెప్పఁబడి యున్నది. ఈవిషయ మచ్చటిసందర్భమును పరికించిన స్పష్ట మగును. కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యై తీరవలయును. ఆయనయే యీప్రపంచమునకుఁ గారణ మగుటచే నీప్రపంచ మంతయు నాయనయొక్క రూపభేదమే. కావున నాయన సర్వాధార మగుటలో నింతయైన సంశయ ముండదు.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరి కాదు. లోకమున సర్వరూపములును శబ్దమాత్రములు గానే కానవచ్చుచున్నవి. శబ్దములును అక్షరమాత్రములే. కావున సర్వము నక్షర మాత్రమే యగును.

"పదములమూలమున పదార్థములు తెలియఁబడుచున్నవి. దీనివలన పదపదార్థము లొక్కటి యనునసుభవము కలుగుచున్నది. కావున నిది భ్రాంతియే" అనియెదవేమొ, అది సరి కాదు. లోకమున మనము పొగనుచూచి దానిచే నగ్ని నూహించుచున్నాము. ఇప్పుడు పొగచే నగ్ని తెలియఁబడినది. ఎప్పఁడైనను ఆపొగకును దానిచేఁ దెలియఁబడిన యగ్నికిని అభేదమును భావింపుచున్నాఁడా? లేదుకదా! ఇట్లే శబ్దమునకును దానిచే తెలియఁబడు పదార్థమునకును అభేదము నెవ్వఁడును భావిం

 

పఁడు. శబ్దమే పదార్థ మగుటచేతనే యట్టి యభేదమును భావించు చున్నారు; కాని వేఱు కా దని నిశ్చయముగ చెప్పవచ్చును. కావున పైన చూపినరీతిగ నీప్రపంచమంతయు శబ్దాత్మకమే; వర్ణాత్మకమే. పైనచూపిన యుక్తిచేతనే "శబ్దము ప్రపంచమును గ్రహించుట కుపాయము (సాధనము)" అనుపక్షముకూడ నిరాకరింపఁబడినట్లయ్యెను. కావున నామమే సర్వప్రపంచరూపము కావున సర్వప్రపంచము నుద్ధరింపవచ్చును. సర్వ నామములును "త ద్యథా శంకునా" అను మొదలగుశ్రుతిమూలమున నోంకారాత్మకములే కావున నీప్రపంచంబు నోంకారాత్మకమే. ప్రస్తుత విషయవాక్యమున చెప్పఁబడినది నిస్సంశయముగ నోంకారమే.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కానేరదు. శబ్దమే ప్రపంచ మనుట చెల్లదు. శబ్దమునకును పదార్థమునకును అవశ్యముగ భేద ముండి తీరవలయును. ఆరెంటికిని రూపమునందును సంబంధము లందును కార్యములయందును కూడ భేదము కలదు. శబ్దములు శబ్దత్వము మొదలగుజాతులు కలవి. పదార్థములు ఘటత్వము, పటత్వము మొదలగుజాతులు కలవి. మఱియు శబ్దములకు చెవితో సంబంధము కలదు. పదార్థములకు దృష్టితో సంబంధము కలదు. ఇదియును గాక శబ్దములు ఒకపదార్థమును వ్యవహరించుటయందు ఉపయోగింపఁబడును. పదార్థములు జలము తెచ్చుట, కప్పుకొనుట మొదలగుకార్యములయం దుపయోగింపఁబడును. ఇట్లు సర్వవిషయములయందును పరస్పరభేదము కలవి యేకరూపము లెట్లగును ?

"వీఁడు రాముఁడు" అను మొదలగుస్థలములయందును "వీఁడు రామశబ్దరూపుఁడు" అని యర్థము కాదు. "వీఁడు నాఁడు చూడఁబడిన వాఁడే" అని మాత్రమే యర్థము. ఎదుట రూపమునకు రామశబ్ద మొక సంజ్ఞయే కాని యంతకంటె నధిక మేమియు లేదు. "ఇట్లయిన శబ్దోచ్చారణము చేసినంతమాత్రముననే వానిరూప మెట్లు జ్ఞప్తికి వచ్చును," అనియెదవేమొ, యది యభ్యాసబలము. అశబ్దముచే నాపదార్థమును చెప్పుట మిగుల నలవాటగుటచే నట్లు జ్ఞప్తికి వచ్చును. ఈకారణముననే మహాత్ములు "సంజ్ఞ పదార్థమును తెలుపుటకుఁ గాని, యాసంజ్ఞను జ్ఞప్తికి వచ్చునట్లు చేయుటకుఁగాని పదార్థమే కారణము. నామపదార్థములయభే

దము కాదు" అని మహాత్ములు చెప్పియున్నారు. కావున శబ్దప్రపంచ ములకు నభేద మెప్పటికిని లేదు. ఇట్లగుటచే చెప్పఁబడినవాఁడు పర మేశ్వరుఁడే.

## అ ౧. పా ౨. సూ ౧౧. ఆరంభము.

పూర్వపక్షము :—ఇట్లయిన ప్రధానమే యీయక్షరశబ్దమున కర్థము కావచ్చును. కారణకార్యములకుఁ గలభేదమే కదా ప్రపంచధా రణ మనుచున్నారు. ప్రధానము గూడ ప్రపంచకారణమే. ప్రపంచ మునకంటె నభిన్నమే.

మఱియు "అస్థూలం అనణు" అను మొదలగువాక్యములచే చెప్పఁ బడినలక్షణములు వర్ణములకు సంభవింపనే సంభవింపవు. కావున బాగుగ విచారించిన నీయధికరణమున ప్రధానమునే పూర్వపక్షస్థాన మునఁ గైకొనవలసియుండును.

అవతారిక :—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౭౨. సా చ ప్రశాసనాత్. ౧. ౩. ౧౧.

తాత్పర్యము:—ఆకాశాదిసర్వభూతముల ధరించుటయు కేవల కార్యకారణాభేదమువలన కలిగినదియే కాదు. సర్వపదార్థముల నాపర మేశ్వరుఁ డాజ్ఞాపించుచు నున్నాఁడు. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" "ఓగార్గీ సూర్యచంద్రులు ఈయక్షరముయొక్క యాజ్ఞచే ధరింపఁబడి యున్నారు," అను మొద లగు వాక్యములచే నీవిషయము స్పష్టముగఁ బ్రకటింపఁబడి యున్నది. కావున నిచ్చట చెప్పఁబడియున్నప్రపంచధారణ మాజ్ఞారూపమే. లోక మున రాజ్యమునందలి ప్రజలఁ దనయాజ్ఞయందు నడుపుప్రభువునకుఁ గూడ "క్ష్మాభృత్" "భూమిని ధరించినవాఁడు" అను వ్యవహారము కలదు కదా!

ఇట్లగుటచే నచేతన మగుప్రధానము లోకమును ధరించునది కానేరదు. ఆజ్ఞాపించుట యనునది యచేతనములపని కాదు కదా!

పూర్వపక్షస్థానమున నీప్రధానము నచ్చుటకును వీలు లేదు. అప్పుడు కేవలసర్వాధారత్వ మాపత్తమును ఖండించుటకు చాలకపోవు టచే ప్రస్తుతసూత్రమున చెప్పఁబడిన ప్రశాసనరూపహేతువే మొట్ట మొదట నుండవలసినచ్చును. అప్పుడు ద్వితీయసూత్రారంభమే సంభవిం పదు. "అంబరాంతధృతేః" అను హేతువు కూడ నిరర్థకము కావలసి వచ్చును.

"అస్థూల మనణు" అను మొదలగుధర్మములు ప్రధానమునం దైనను కొంచెము సంభవించును గాని వర్ణములయందు బొత్తిగనే సంభవింప దనుట యథార్థమే కాని, పూర్వపక్షమునకు (అనఁగా: పూర్వపక్షస్థానమునఁ గైకొనఁబడువిషయమునకు) సిద్ధాంతవిషయ తుల్యత్వము పరిపూర్ణముగ నుండవలయు నను నియమము లేదు. ఎంత వఱకు నట్టిసామ్య ముండిన నుండవచ్చును. కావున నింతమాత్రమున పూర్వపక్షస్థానమున నన్యవిషయమును జేర్చికొనవలసినపని లేదు. వేదమునందు అగ్నులను చేర్చుటనుగూర్చి చెప్పుసమయమున "నాన్త రిక్షే న దివి" "అంతరిక్షమునఁ గాని దానికిమీఁద నుండుద్యులోకమునఁ గాని ఎవ్వరును అగ్నులఁ జేర్పరు, లేక, యట్లు చేర్పరాదు" అని చెప్పఁ బడియున్నది. ఇచ్చట నాకాశాదులయందు అగ్నులఁ జేర్చి హోమముఁ జేయుట బొత్తిగనే సంభవింపకుండఁగా దానిని * అనువాదపూర్వక ముగ ఖండింపనేటికి? కావున సిద్ధాంతవిషయసామ్య మెంతమాత్ర మున్నను తుదకు భ్రాంతిచే నట్టిసామ్యమును కల్పించినను కూడఁ బూర్వ పక్షస్థానమున నాపదార్థమును పూర్వపక్షస్థానమున చేర్పవచ్చును.

## అ ౧. పా 3. సూ ౧౨. ఆరంభము.

అవతారిక:—ఈసిద్ధాంతమును నిరూపించుటకు మఱియొకకారణ మును చెప్పుచున్నాఁడు—

## ౭౩. అన్యభావవ్యావృత్తేశ్చ. ౧. ౩. ౧౨.

తాత్పర్యము:—మఱియు నాయుపనిషత్తునందే తర్వాతవాక్య ములయందు "ఈయక్షరము పరబ్రహ్మాభిన్న మగుపదార్థము కానేరదు"

---

* అనువాద మనఁగా లోకప్రసిద్ధమై కాని, యితరప్రమాణములవలన దృఢమై కాని,యిదివఱ కొకరు తనచేతఁ జెప్పఁబడి కాని యుండువిషయమును చెప్పుట

అని స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. "అదృష్టం ద్రష్టృ" "ఆయక్షరము పరునిచేఁ జూడఁబడదు. తాను చూచును" అను మొదలగు వాక్యము లచ్చట స్పష్టముగనే యున్నవి. మఱియు "నాన్య దతో ఽస్తి ద్రష్టృ" "ఈయక్షరమునకంటె నన్యుఁ డగు ద్రష్ట లేఁడు" అనియును స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. ఇట్లు చెప్పఁబడిన స్వతంత్రత్వ చేతనత్వైకరూపత్వ ములు ప్రధానమునందు సంభవింపవు. జీవుఁ డిట్టివాఁడే యైనను అతఁడు పరిచ్ఛిన్నుఁడు కావున నిచ్చటియక్షరశబ్దమున కర్థము కానేరఁడు. "అవాగమనాః" "ఆయక్షరమునకు వాక్కుగాని మనస్సుగాని లేదు" అని శ్రుతి యక్షరస్వరూపమును నిరుపాధికమునుగ స్పష్టము చేసి యున్నది. ఇట్టిరూపము జీవునకు కల దని చెప్పుట సంభవింపదు కదా! జీవప్రధానములను గూర్చి విచారించినప్పుడే యిట్లుండ నిఁక శబ్దమాత్ర మగు వర్ణము అక్షరశబ్దార్థ మగు ననుట యేటిమాట? కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడిన యక్షరము పరమేశ్వరుఁడే.



## ౪. ఈక్షతికర్మాధికరణము.

విషయము:—కొందఱు బ్రహ్మజ్ఞానార్థులై పిప్పలాదమహాముని కడకు వచ్చిరి. అందు సత్యకాముఁ డనువాఁడు "ఓంకారోపాసనకు ఫలమేమి? ఓంకారము నాత్మగ నుపాసించువాఁడు ఏలోకమునకుఁ బోవును?" అని ప్రశ్నఁ జేసెను. దానికిఁ బిప్పలాదమునియు "పరాపర బ్రహ్మములు రెండును ఓంకారమే. కావున నోంకారోపాసకుఁడు వారిలో నెవ్వనినైనఁ జెందఁగలఁడు," అని యారంభించి యందలి విభాగముల (ఏకమాత్రద్విమాత్రోపాసకుల ఫలములను) * గూర్చి

*అకారము ఉకారము మకారము అను నీమూఁడును ఓంకారమునకు మాత్రలు. ఈమూఁటికంటె భిన్నముగ ఆయోంకారోచ్చారణమువలన కలుగునాదము మఱియొకమాత్రగా గ్రహింపఁబడును. దానియందు ఇతర స్వరములయొక్క (అచ్చులయొక్క) సంయోగము లేదు కావున వానికి నర్ధమాత్ర యనియే పేరు. ప్రపంచమునందలి త్రిపుటు లన్నియు (త్రిపుటి. చూ. పుట. ౧౨౫. చూడు) ఈయకారాదిమాత్రాత్రయమునందే యారోపింపఁబడును. మూఁడుసంఖ్యలు గలపదార్థములన్నియు క్రమానుసారముగ వీని యందే యారోపింపఁబడును, వానికన్నిటికిని నాల్గవమాత్రయందు లయము చెప్పఁబడును.

చెప్పి తుదకు "యః పున రేతన్త్రిమాత్రే ణో మి త్యే తే నై వాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నః యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం పురిశయనం పురుష మీక్షంతే" "ఏపురుషుఁడు త్రిమాత్రలతోఁ గూడిన పరిపూర్ణోంకారము నాలంబనముగఁ*గైకొని పరమేశ్వరు నుపాసించునో యట్టివాఁడు సూర్యునియందుఁ జేరును. సర్పము కుబుసముచే విడువఁబడు నట్లు పాపముచే విడువఁబడును. తృతీయమాత్రారూపము లగుసామ మంత్రములచే బ్రహ్మలోకమునకు (సత్యలోకమునకు)ఁ గొని పోఁబడును. (మంత్రములకు రూపము కల దని మీమాంసకులయభిప్రాయము.) ఆ హిరణ్యగర్భుఁడు సర్వజీవులకు నంతరాత్మ; సర్వజీవమయుఁడు. ఇట్లగుటచే నుపాసకుఁ డాతనిలోకమును చెందఁగానే యటనుండి పరాత్పరుఁడును, సర్వశరీరములయందు నున్నవాఁడు నగుపరమపురుషుని చూచును (తెలిసికొనును.)" అని చెప్పియున్నాఁడు. ఈవాక్య మీయధికరణమున విచారింపఁబడుచున్నది.

సంగతి:—పూర్వాధికరణమున నోంకారము పూర్వపక్షస్థానము నందు చెప్పఁబడి యున్నది· దాని ననుసరించి యోంకారోపాసనావిషయము జ్ఞప్తికి రాఁగా దానిని విచారించుటకై ప్రస్తుతాధికరణ మారంభింపఁబడెను. కావున నీరెంటికిని బుద్ధిసాన్నిధ్యమే సంబంధము.

"మఱియుఁ బూర్వాధికరణమున నక్షరశబ్దము ప్రత్యక్షవర్ణవాచకమై యుండ, జగద్ధరణ మనుగుణముచే దానిని బాధించి బ్రహ్మపరము నుగ వ్యాఖ్యానము చేసియున్నారు. ఇచ్చటను "ఓంకారోపాసకుఁడు సత్యలోకమును చెందును" అని యుండుటచే ఉపాస్యదేవత జీవసమష్టిరూపుఁ డగుహిరణ్యగర్భుఁడే యని వ్యాఖ్యానము చేయవలయును" అని పై విషయవాక్యమును దృష్టాంతముగఁ గైకొని చేయఁబడినయాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. కావున నీరెండధికరణములకును దృష్టాంతత్వమే సంబంధము.

---

* ఆలంబన మనఁగా నుపాసనకుఁ గాని ధ్యానాదులకుఁ గాని యాధారముగఁ గైకొనఁబడు ప్రతీకము.

సందేహము;—సత్యలోకప్రాప్తిని ఫలముగఁ జెప్పి యుండుటయు, ప్రశ్నానుగుణముగ మోక్షఫలమును చెప్పవలసియుండుటయు సంశయ కారణములు. "ఇచ్చటి యుపాస్యదేవత హిరణ్యగర్భుఁడు; పరబ్రహ్మము" అనునవి క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. రెంటికిని ఉపాసనయే ఫలము.

పూర్వపక్షము:—ఇచ్చట చెప్పఁబడిన యుపాస్య దేవత నిర్వివాదముగ హిరణ్యగర్భుఁడే యనవలయును. అట్లు లేకున్న సత్యలోకరూపమగు పరిచ్ఛిన్నఫల ముపాసకులకుఁ జెప్పఁబడి యుండదు. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "బ్రహ్మము నెఱింగినవాఁడు బ్రహ్మమే యగును" అని చెప్పఁబడియుండుటచే బ్రహ్మజ్ఞానికి నిట్టిపరిచ్ఛిన్నఫలము కలుగ కూడదు. జ్ఞాన మనునది యుపాసనాసాధ్య మగుటచే నేది యన్న నొక్కటియే కదా! కావున జ్ఞానమువలన ననంతఫలంబును ఉపాసనవలన నల్ప ఫలంబును కలుగు నని సాధించుటకు వీలు లేదు.

"పురి శయం పురుష మీక్షతే" అనువాక్య శేషమున జ్ఞానమును గూర్చి కూడ చెప్పఁబడియున్న దనియు, ఉపాసనయు నదియు మీరన్న ట్లొకటియే యగు ననియు, లోకమున జ్ఞానమనఁగా యథార్థజ్ఞానమే కావున జ్ఞేయము (జ్ఞానముచే తెలియఁబడఁనగినది) పరమార్థరూప మగు బ్రహ్మమే కావలయు ననియు, దీనిచే ప్రకృతవాక్యమున చెప్పఁబడిన యుపాస్యదేవత కూడ నాబ్రహ్మమే యగు ననియుఁ జెప్పుట తగదు. జ్ఞానమును గూర్చి చెప్పినస్థలమున "పరాత్పరం" అనువిశేషణ మొక్కటి కలదు. ఉపాసనను గూర్చి చెప్పునప్పు డన్ననో "పరం" అనువిశేషణము కలదు. ఈయిరువురుపురుషులు నొక్కటి యగుట యెట్లు? ఉపాస్యపురుషుఁడు పరుఁడు (దేహాదులకంటె నుత్తముఁడు); జ్ఞేయపురుషుఁడు పరాత్పరుఁడు (పరునికంటెఁ బరుఁడు); సర్వాధికుఁడు (నిత్యత్వనిరంజనత్వ నిర్వికారత్వాదిగుణములు గలపరమేశ్వరుఁడు); కావున నవశ్యముగ వీరికి భేద ముండవలయును. మఱియు జ్ఞాన మనునది యెప్పటికిని యథార్థ విషయములను గూర్చినదియే యై యుండవలయు నని నియమము లేదు. అయథార్థజ్ఞానము కూడ కలదు కదా!

"ఇట్లు కాదు. యుక్తులతో విచారించి సర్వప్రమాణానుకూలమున చూచుచూపు ఏది కలదో అదియే చూపు. అదియే జ్ఞానము.

ఇట్లుండ నది పరమార్థ మగువిషయమును గూర్చియే యుండి తీరవల యును. కావున నీసిద్ధాంతము నిలువదు" అని యెదవేమొ, అది సరి కాదు. ఇందు నీయభిప్రాయ మేమి ? విచారణయు చూపును (జ్ఞానంబు), ఒక్క టియే యనియా? లేక, ఇచ్చట చెప్పఁబడినది విచారణయే కాని చూపు కాదు అనియా ?

ఇందు మొదటిపక్షము యుక్తము కాదు. విచారణకును చూపు నకును (జ్ఞానమునకును) మిగుల భేదము కలదు. లోకమున నాపదములు భిన్నములుగనే ప్రయోగింపఁబడుచున్నవి. బాగుగ విచారించిన, విచా రణ యనునది జ్ఞానమునకు సాధనమై యుండ, రెంటికి నభేద మెటనుండి వచ్చును? పొగకును దానిచే సాధింపఁబడువహ్నికి నెప్పుడైన నభేదము కలదా ?

ఇఁక రెండవపక్షము కూడ సరిపడదు. విచారణయంతయు యథా ర్థవిషయమునే బోధింపవలయు నను నియమము లేదు. పురుషులకు భ్రమప్రమాదాదు లుండుట సహజము; కావున విచారణకు నిలుక డయే యుండదు. "తర్కాప్రతిష్ఠానాత్" (బ్ర. సూ. ౨. ౧. ౧౧) అను సూత్రముచే సూత్రకారు లీవిషయమును స్పష్టము చేసియే యున్నారు. కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు హిరణ్యగర్భుఁడే యని తోఁచుచున్నది.

అవతారిక:—ఈసంశయమును నివారించుచున్నాఁడు.—

## ౭౪. ఈక్షతికర్మవ్యపదేశాత్సః. ౧. ౩. ౧౩.

తాత్పర్యము.—ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే; "పరా త్పరం పురిశయం పురుష మీక్షతే" అని యాయుపాస్యదేవతను తెలిసి కొనవలసినదానిఁగా శ్రుతి చెప్పియున్నది. తెలిసికొనుట యనిన నది యథార్థవిషయమును గూర్చినదియే యై యుండవలయును. యథార్థవిష యము పరమేశ్వరుఁడే కదా ! కావున నిచ్చట వర్ణింపఁబడినవాఁడు నిస్సం శయముగఁ బరమేశ్వరుఁడే.

సిద్ధాంతము:— "అయథార్థజ్ఞానము కూడ ననుభవసిద్ధ మై యున్నది కావున, 'జ్ఞానము యథార్థవిషయమునకు సంబంధించినదిగానే యుండవలయును' అనునియమము సంభవింపదు" అని చెప్పియుంటిని

కదా యని యనియెదవేమొ, వినుము. లోకమున సామాన్యముగ వ్యవహారములో నుండునర్థము లే తగినంతయాటంకము లేనప్పుడు గ్రహింపఁబడుచుండవలయును. నిరర్థకముగ నొకయర్థమును బాధింపఁజూచిన నెచ్చటను విశ్వాస ముంచుటకు వీలు కలుగదు. ప్రస్తుతవాక్యమున "ఈక్షతి=చూపు, (అనఁగా జ్ఞానము)" అనుశబ్దమునకు ముఖ్యార్థమును బాధింపవలసినంత యాటంకము లెవ్వియును లేవు. "ఈక్షతిక్రియకుఁ బరమేశ్వరుఁడే కర్మ (తెలిసికొనవలసినవాఁడు పరమేశ్వరుఁడే)" అను విషయము మీకును సమ్మతమే కదా! ఇఁక నాలోచింపుఁడు. ఆజ్ఞానమునకు ధ్యానమే సాధనము. వానికి రెంటికిని విషయములు (కర్మ లగు విషయములు, అనఁగా: ధ్యానించుటకును దానిమూలమున తెలిసికొనుటకును తగినవిషయములు) భిన్నములుగ నుండుట యెట్లు సంభవించును?. "వీఁడు రాముని ధ్యానించి కృష్ణుని ప్రత్యక్షమునఁ గాంచెను" అనుట యెన్నటికైన యుక్తియుక్తము కానేర్చునా? కావున జ్ఞానమునకు విషయముగాఁ జెప్పఁబడినపరమేశ్వరుఁడే ధ్యానమునకుఁ గూడ విషయముగాఁ జెప్పఁబడె ననుట నిస్సంశయము. లోకన్యాయము ననుసరించి చూచిన నొకానొకప్పుడు ధ్యానమున కైనను భ్రాంతిసిద్ధములగుపదార్థములు విషయములు కావచ్చును గాని జ్ఞానమునకు మాత్ర మెప్పటికిని కాదు. అపరమార్థపదార్థములఁ గూర్చినజ్ఞాన మజ్ఞానముగనే లోకమునఁ బరిగణింపఁ బడుచున్నది.

మఱియు ఓంకారోపాసకుని వర్ణించి "స ఈక్షతే" "వాఁడే పరమార్థవస్తువును చూచుచున్నాఁడు" అని చెప్పఁబడి యున్నది. పరశబ్దంబును పురుషశబ్దంబును గూడ హిరణ్యగర్భపరమేశ్వరులయందు సమానములు, వాక్యశేషమున నున్నజీవఘనశబ్దము హిరణ్యగర్భవాచకమైనను, అర్థవిమర్శ నొనర్చినచో నది యుపాస్యదేవతగాఁ జెప్పఁబడిన పరపురుషునిఁ బరామర్శించుట లేదని స్పష్టముగఁ గానవచ్చుచున్నది. "ఓంకారమును పరపురుషునిగ నుపాసించువాఁడు బ్రహ్మలోకమును జెంది యచ్చట *జీవఘనము నుండి పరపురుషుని తెలిసికొనును" అని వర్ణింపఁబడియుండ నిచ్చటిజీవఘనపదము ఉపాస్యదేవతాపర మెట్లగును? ఇట్లు సర్వమును విమర్శించిన ఈక్షతిక్రియను వర్ణించినవాక్యం

*జీవఘన మనఁగా: జీవులచే నేర్పఱుపఁబడిన ముద్ద. జీవసమష్టి. హిరణ్యగర్భుఁడు.

బును ధ్యానమును చెప్పినవాక్యంబు నొక్కటియే యనియు నందు చెప్పఁబడినపురుషులు కూడ నొక్కటియే యనియు తేలుచున్నది. కావున నీక్షతిక్రియకుఁ గర్మ యగు పరమేశ్వరుఁడే ధ్యానక్రియకుఁ గూడ కర్మ యని స్పష్టమగుచున్నది.

"యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః" అని సర్వపాపనాశము వర్ణింపఁబడి యున్నది కదా! అది పరమేశ్వరుని గ్రహించిననే కాని సరిపడదు. "క్షీయంతే చాస్య కర్మాణి" అని పరబ్రహ్మజ్ఞానమువలన మాత్రమే సర్వకర్మనాశనము చెప్పఁబడి యున్నది. ఇదియును గాక "సా కాష్ఠా సా పరా గతిః" "ఆ బ్రహ్మమే సర్వమునకు నంతము. అదియే పరమమైన స్థానము. అదియే సర్వమునకంటె శ్రేష్ఠము" అనువాక్యము ననుసరించి చూచిన పరశబ్దము కూడ పరమేశ్వరునియందే బాగుగ సమన్వయింపఁబడును. విచారించిన పురుషశబ్దము కూడ నట్టిదియే. పరాత్పరశబ్ద మొక్కటి మాత్రము కలదని యిన్నిప్రమాణములకు విరుద్ధముగఁ బ్రవర్తించుట కంటె దానినే యనుకూలముగ సమన్వయించుట మేలు కదా! కావున నాశబ్దమునకు "జీవఘనమునకంటె పరుఁడు" అని యర్థము చెప్పుకొని ప్రమాణవిరోధమును పరిహరింపవలయును. ఇచ్చటి యుపాస్య దేవత పరమేశ్వరుఁడే యని సిద్ధాంతము చేయవలయును.

---

## ౫. దహరాధికరణము.

విషయము:— ఛాందోగ్యోపనిషత్తున నెనిమిదవప్రపాఠకము నందు "అథ య దిద మస్మి న్బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరో ఽస్మి న్నన్తరాకాశ స్తస్మి న్య దన్త స్త దన్వేష్టవ్యం త ద్వావ విజ్ఞాసితవ్యం" ప్రత్యక్షముగఁ గానవచ్చుశరీర మేది కలదో అదియే బ్రహ్మపురము. దానియందు అల్ప మగుహృదయకమల మనుగృహము కలదు. అందు దానికంటె నల్పమగు నాకాశ మున్నది. ఆహృదయకమలమునఁ గలయాకాశమునే తెలిసికొనవలయును. దానినే *శ్రవణమన

---

* శ్రవణమననములు.— శ్రవణమనఁగా వేదాంతివాక్యముల వినుట. మనన మనఁగా తావినినయర్థమును యుక్తులచె సిద్ధాంతము చేసికొనుట. ఈరెంటికిని తర్వాత పదా

నములచే వెదకనలయును.'' అనువాక్యము కలదు.ఇది ఈయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—''పూర్వాధికరణమున పరపురుషశబ్దములు పరబ్రహ్మమునందు రూఢములు కావున ''అచట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే'' యని సిద్ధాంతము చేయఁబడి యున్నది.ఇచ్చటను ఆకాశశబ్దము భూతాకాశమున రూఢము కావున ''ఇచ్చట చెప్పఁబడినది భూతాకాశమే'' యని సిద్ధాంతము చేయవలసివచ్చుచున్నది.'' అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. కావున నీరెండధికరణములకును కలసంబంధము దృష్టాంతరూప మైనదియే.

సందేహము:—ఇచ్చట భూతాకాశవాచక మగు నాకాశశబ్దంబును పరబ్రహ్మద్యోతక మగు బ్రహ్మపురపదంబు నుండుట సంశయకారణము. ''ఈవాక్యంబున నాకాశములో నున్నమఱియొకపదార్థము తెలిసికొనఁబడవలయు నని చెప్పఁబడినదా? లేక, యాయాకాశమే తెలిసికొనఁబడవలయు నని చెప్పఁబడి యున్నదా? అందును ఆకాశ మనునది భూతాకాశమా? లేక, జీవుఁడా? బ్రహ్మమా?'' అని సంశయస్వరూపము. ''ఇచ్చట చెప్పఁబడినది భూతాకాశాదులే; బ్రహ్మమే'' యనునవి క్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు. ఉపాసనాప్రకరణము కావున రెండుపక్షములకు నుపాసనయే ఫలము. ''ఆభూతాకాశమున నున్న పదార్థమునే తెలిసికొనవలయును. ఆకాశవాచ్య మగు నాపదార్థమునే తెలిసికొనవలయును'' అనునవియుఁ గ్రమముగఁ బూర్వపక్ష సిద్ధాంతములు.

పూర్వపక్షము:—నిర్వివాదముగ నిచ్చట చెప్పఁబడినది భూతాకాశమే కావలయును. అది హృదయపుండరీకమున నున్నది యని చెప్పఁబడి యుండుటచే దహర మని (అల్ప మని) వర్ణింపఁబడి యున్నది. బాగుగ విచారించిన దానికి నుపాధిభేదములు సంభవింపవు కావున నది యెప్పటికి నేకరూపమే. ఇట్లగుటచేతనే ''యావా న్వా అయమాకాశ స్తావా నాకాశ ఆంతరః'' ''ఈవెలుపలియాకాశ మెంతదియో

---

ర్థాంతరములపై బుద్ధిని పోనీక తానెఱుంగినవిషయమునందే స్థిరము చేసి ధ్యానించుటయే స్వరూపముగ గలనిది ధ్యాసన మనునొక్కటి యుండఁ గలదు. ఈమూటివలన బ్రహ్మజ్ఞాని పరబ్రహ్మములో నైక్యము నొందఁగలఁడు.

లోపలియాకాశము కూడ నంతదియే" అనిచెప్పఁబడియున్నయుప మానము సరిపడును.

ఇట్లు కాకున్నను బ్రహ్మపురశబ్దమునుబట్టి చూచిన నిచ్చట చెప్పఁబడినయాకాశము జీవుండే కావలయును. బ్రహ్మపుర మనుటచే బ్రహ్మము యొక్క పుర మని తేలుచున్నది. మొట్టమొదట నిర్వికారబ్రహ్మమునకు *పుర మనునదియే సంభవింపదు.అది సర్వవికారకారణ మైనను పురము మాత్రము దానిది కానేరదు. లోకమున నేపదార్థ మైనను ఉత్పత్తి నొందునేని దానికి ననేకపదార్థములయొక్క సంయోగము కారణముగ నుండును. అయినను ఏపదార్థము ముఖ్యకారణ మగునో దాని ననుసరించి మాత్రమే యాపదార్థము వ్యవహరింపఁబడును. భూమి, నీరు, గాలి, మొదలగునవి యన్నియును వరిమొలక పుట్టుటకు గారణము లై యే యున్నవి ; వడ్లగింజయు నట్లే కారణ మై యున్నది. అయినను వడ్లగింజ మాత్రము ప్రధానకారణము ; తక్కినవి ప్రతిమొలకకును కావలసిన వియే కావున నప్రధానకారణములు. కావుననే భూమ్యాదులవలనఁ గూడ జనించినదియే యైనను వరిమొలక "వరిమొలక"(అనఁగా:వడ్లగింజ నుండి పుట్టినమొలక) యని చెప్పఁబడుచున్నది. ఇట్లే ప్రస్తుత దేహమునకుఁ గూడఁ బరమేశ్వరుఁడే కారణ మైనను, ఆయన సర్వమునకును కారణభూతుఁడే యగుటచే,నాయన ననుసరించి దేహమునకు పేరుపెట్టఁ గూడదు. ఇఁక నేమి యనిన:—జీవు డాచరించుధర్మాధర్మములు ప్రత్యేకముగ (అనఁగా: ప్రధానముగ) శరీరకారణము లగుటచే, దాని ననుసరించియే దేహమును వ్యవహరింపవలయును. "జీవపురము" అని చెప్పవలయును. కావున నిచ్చటి బ్రహ్మశబ్దమునకు జీవపరముగ యోగమును కల్పింపవలయును. శరీరపోషకుఁ డగుటచేతను బ్రహ్మాభిన్నుఁ డగుటచేతను, ఆయాగికార్థము కూడ ననాయాసముగనే కుదురును. "యావా న్వా" అనునుపమానంబును బ్రహ్మాభిన్నుఁ డగుటచే నాతనియందు సరిపడును. శ్రుతికిని జీవుని బ్రహ్మాభిన్నునిఁగఁ జెప్పుటయందుఁ దాత్పర్య ముండవచ్చును కదా! మఱియు నాతనికి దేహ మంతయు నివాసస్థానమే యైనను "హృదయమునందు మాత్రమే యున్నాఁడు" అని చెప్పుటలో దోషము

* పురము నివాసస్థానము.

లేదు. ఆతనియుపాధి యగుమనస్సు ఆస్థానమునందే యున్నది యనుట సర్వలోకప్రసిద్ధము కదా ?

"ఇట్లయిన మాత్ర మేమి ? బ్రహ్మపుర మనఁగా: పరమేశ్వరుని యొక్క పుర మనియు, వత్సరాజపట్టణమునందు దేవదత్తుఁ డున్నట్లు బ్రహ్మపురమునందు జీవుఁ డుండవచ్చు ననియు, లేక, నీదేహము జీవపురమే యైనను అందు పరమేశ్వరు డుండవచ్చు ననియుఁ జెప్పుటకు వీలున్నది." అనియెదవేమొ వినుము. ఈదేహము జీవుని పుణ్యపాపములచే నార్జింపఁబడినది కావున జీవునకు స్వంతము. మఱియు నాధారము మాత్రము చెప్పఁబడి యుండ "దీనియం దెవ్వ రున్నారు" అని యాధేయమును గూర్చినప్రశ్న యవశ్యముగ వచ్చును. అప్పుడు సమీపమున నున్నదియే దానికి నుత్తరముగ గ్రహింపఁబడుచుండుట సహజము. ఉన్నదానిని విడిచి క్రొత్తదానిని కల్పించుట యుక్తియుక్తము కానేరదు కదా! కావున ప్రకృతమునందును, పురమునకు నాధేయ మెయ్యది" అని సంశయము కలుగఁగా, దానికి నుత్తరముగ పార్శ్వమున నున్న బ్రహ్మశబ్దమే గ్రహింపఁబడవలసి వచ్చును. దానికి పరమేశ్వరుఁ డని కాని జీవుఁ డని కాని యేవిధముగ నర్థము చెప్పినను ఆతఁడే పురమున నున్నాఁడని చెప్పవలసి వచ్చును. బ్రహ్మపురశబ్దమునకు "బ్రహ్మముచే నిర్మింపఁబడి దానికే నివాసభూతమై యుండుపురము" అని యర్థము చెప్పవలసి వచ్చును.

మఱియు "తస్మిన్యదంత స్తదన్వేష్టవ్యం" "హృదయపుండరీకమధ్యమున నున్నయాకాశమున నేది కలదో దానినే వెదుకవలయును" అని చెప్పఁబడి యుండుటచే, నిచ్చట నాకాశమును గూర్చి విచారించుటయే యనావశ్యక మని తోఁచుచున్నది.

అవతారిక:—అనిన నుత్తరము చెప్పుచున్నాఁడు.

## ౧౪. దహర ఉత్తరేభ్యః. ౧. ౩. ౧౪.

తాత్పర్యము:—ఇచ్చట చెప్పఁబడినదహరాకాశము పరబ్రహ్మమే. ఈవిషయము పిదప (వాక్యశేషమునందును అధ్యాయశేషమునందును) గానవచ్చు కారణములవలన సిద్ధాంత మగుచున్నది.

సిద్ధాంతము :—ఎట్లు చూచినను భూతాకాశముగాని జీవుఁడు కాని దహరాకాశము కానేరదు. వాక్యశేషమున "యావా న్వా"

అను మొదలగువాక్యభాగము కానవచ్చుచున్నది. ఇందు భూతాకాశ ముపమానముగఁ జెప్పఁబడి యున్నది. దహరాకాశ ముపమేయ మై యున్నది. ఎవ్వఁడైనను ఏవస్తువున కావస్తువునే యుపమానముగఁ జెప్పునా? కావున నీయుక్తివలన నిచ్చట భూతాకాశము చెప్పఁబడలే దనియు తద్భిన్న మగుపదార్థమే చెప్పఁబడె ననియుఁ దోఁచుచున్నది.

"దహరాకాశము హృదయకమలోపాధియం దున్నది. భూతాకాశము బాహ్యమునఁ గూడ నున్నది. ఈరెండు నొక్కటియే యైనను ఉపాధిభేదముచే పరస్పరము పోల్పఁబడవచ్చును." అనియెదవేమొ అది యుక్తియుక్తము కానేరదు. కల్పితభేదమును మాత్రమే యాశ్రయించి వ్యవహరించుట యనునది గతి లేకపోయినప్పుడు తొలగించుటకు (తగిన యుక్తి లేక, ప్రమాణవిరోధము మాత్రము దుర్నివారమై తటస్థించు నప్పుడు) ఆశ్రయింపవలసినదియే కాని సర్వకాలములయందు నవలంబింపవలసినది కాదు; వాదమునకు నిలుచుటకు బ్రబలమైనదియుఁ గాదు. అట్టికల్పితభేదము నాశ్రయించినను, హృదయకమలముల నుండు నల్పాకాశము మహాకాశసమము కానేర్చునా? సర్వదిగంతములయందును వ్యాపించియున్నయీమహాకాశ మెక్కడ? అత్యల్పమగుహృదయకమలమున నంతకంటె నల్పతరమై యున్నదహరాకాశ మెక్కడ?

కావున నిచ్చట దహరాకాశశబ్దముచేఁ బరమేశ్వరుని గ్రహింపవలయును. పైఁ జూపినయుక్తులే కాక వాక్యశేషమునందే యీదహరాకాశమునుగూర్చి "ఏష ఆత్మా ఽపహత పాప్మా...." "ఈదహరాకాశమే సర్వకర్మసంబంధము లేనియాత్మ" అని చెప్పఁబడి యున్నది. దీని నాశ్రయించి చూచిన "దహరాకాశము భూతాకాశము" అనుశంకయే జనించుటకు నవకాశము లేదు. "యావా న్వా" అను మొదలగువాక్యమునందు చెప్పఁబడియున్నభూతాకాశోపమానము, పరమేశ్వరు నంగీకరించిన బాగుగఁ గుదురును. ప్రస్తుతవాక్యమున నాయనకు హృదయకమలోపాధి చెప్పఁబడి యున్నది కావున, నాయనకు నల్పత్వము సంభవించినది; దానిని ఆయుపమానము తొలఁగింపఁగలదు కదా!

జీవునియందుఁ గూడ నాత్మశబ్దము సమన్వయము నొందునుగాని పైఁజూపిన యుపమానోద్దేశము నెఱవేరుటకు వీలు లేదు. కావున నీపక్ష మంగీకరింపఁదగదు.

"ఆయుపమానమునకు నదియే యుద్దేశము అని నిర్ణయ మిట్లు" అనియెద వేమొ వినుము. దాని కాయుద్దేశము లేకుండిన నేయుద్దేశ ముండును? పరమేశ్వరుని మహాకాశసమానునిఁగాఁ జెప్పుటయే కదా! అప్పుడు విరోధము లనేకములు వచ్చును. ఒకపక్షమున పరమేశ్వరునకు మహాకాశముతో పోలిక సంభవింపదు. "జ్యాయా స్పృథివ్యా జ్యాయా నంతరిక్షాత్" "ఈపరమేశ్వరుఁడు భూమికంటెను ఆకాశమునకంటెను పెద్దవాఁడు" అని శ్రుతి ప్రత్యక్షముగఁ జెప్పుచున్నది. మఱియొకపక్ష మున వాక్యభేదము సంభవించును. ఒకచోట నల్ప మని చెప్పి, ప్రక్కనే మఱియొకచోట (ఏకవాక్యమునందే) అధిక మని చెప్పుట విరుద్ధము కదా! "ఇందు సూక్ష్మత్వము సర్వవ్యాపకత్వము మొదలగు ధర్మముల యందు పోలిక యుండుటవలనను, ఇంతకంటె నధికమై చక్కగ సరిపోవు నది యై యుండు నుపమానము వేఱొకటి లేదు కావునను, బ్రహ్మ మునకు నాకాశమే యుపమానముగ చెప్పఁదగినపదార్థము; కావుననే యట్లు చెప్పఁబడెను" అని చెప్పి మొట్టమొదట చూపఁబడినదోషమును తొలగించుకొనినను, రెండవమాఱు చూపఁబడినదోషమును తొలఁ గించుకొనుటకు నవకాశము లేదు. కావున నెట్లుచూచినను ఆకాశోప మానమునకు, నుపాధివలన వచ్చినయల్పత్వమును తొలఁగించుటయే యుద్దేశమని తీరవలయును.

బ్రహ్మపురశబ్దమునకును జీవపుర మనునర్థము కల్పింపవలసిన పని లేదు; సంశయింపవలసినపనియు లేదు. "బ్రహ్మము సర్వవికారకారణము. ఈశరీరమునకుఁ గూడఁ గారణము" అనునుద్దేశముతో నీసిద్ధాంతము (బ్రహ్మపుర మనఁగా:పరబ్రహ్మపురమే యనుసిద్ధాంతము)చేయఁబడలేదు. దీని నాచరించుటకు, దేహము బ్రహ్మజ్ఞానమునకు ననుకూలము లగుస్థా నములలో నుత్తమ మగుటయే హేతువు. సాలగ్రామమున హరినిఁ బ్రధా నముగఁ జూచునట్లు (విష్ణువు సాలగ్రామమునను, ఈశ్వరుఁడు లింగము నను సాన్నిధ్యము చేసినట్లు మఱియొకచోట చేయ రనుట లోకమునం దును శాస్త్రములయందును కూడ ప్రసిద్ధమై యున్నది.) దేహమునఁ బరమేశ్వరునిఁ బ్రధానముగఁ జూడవచ్చును. వివేకులకు నాత్మ దేహము నాశ్రయించి విచారించినఁ బ్రత్యక్ష మగునంతశీఘ్రముగ నన్యము నాశ్రయించిన ప్రత్యక్షము నొందఁడు కదా! ఈకారణమువలన

"దేహము బ్రహ్మపురము" అని చెప్పఁబడెను.* "అసాధారణత్వ ముండి ననే కాని యేదియు నిర్ణయింప ననువు కాదు" అని నీవు చెప్పితివి. బ్రహ్మమునకును దేహమునకును గలయసాధారణసంబంధము పైన నిరూపింపఁబడెను. ఈయసాధారణత్వమువలన నీదేహము బ్రహ్మపురమే కావచ్చుననుటలో సంశయమే లేదు.

ఇట్లు కాక "ఈదేహము జీవపురమే" అని సాధించినను మా సిద్ధాంతమునకు భంగము కలుగదు. ఈశరీరమున జీవుఁడే యుండవలయు ననియు, దహరాకాశము జీవుఁడే కావలయు ననియు నియమము లేదు ఒకప్రభువుయొక్క పురమున నుఱియొక్కఁ డున్నట్లు జీవపురమునఁ బర బ్రహ్మ ముండవచ్చును. దానికి నిది ప్రకాశస్థాన మని యిదివఱకే నిరూపించి యుంటిని కదా! కావున నెట్లు చూచినను జీవుఁడు దహరాకాశము కానేరఁడు. బ్రహ్మశబ్దమునకు రూఢిని పరిత్యజించి యోగమును గ్రహింప నవసరము లేదు.

"జీవుఁడు వాస్తవముగ బ్రహ్మమునకంటె భిన్నుఁడు కాఁడు. కావున బ్రహ్మమునకు చెప్పఁబడిన వన్నియు జీవునకు యుక్తములే యగును." అనియెదవేమొ సరియే. అప్పుడు జీవుని ప్రధానునిఁ జేసి కొని, యాతనియందు పరమేశ్వరు ననుసరించి సర్వధర్మముల సమన్వయించుటకంటె ప్రత్యక్షపరమేశ్వరునియందే ధర్మముల సమన్వయించుట యుక్తియుక్తము కాదా?

జీవునివిషయమే యిట్లుండ నిఁక భూతాకాశ మెంతలోనిది. "ద్యావాపృథివీ అన్త రేవ సమాహితే" "ఈదహరాకాశమున భూమియు ద్యులోకంబు నున్నవి" అనియు "అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజం త్యేతాంశ్చ సత్యా న్కామాం స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" "ఎవ్వరు ఈదహరాకాశరూపుఁడగు నాత్మ నెఱింగి దేహమును విడుతురో పృథివ్యాదులను కూడ నతిక్రమించి పోవుదురో యట్టివారు సర్వలోకములయందును స్వేచ్ఛగా సంచరింతురు." అనియును జెప్పఁబడి యుండుటను చూడ నిచ్చటిదహరాకాశము నిస్సంశయముగఁ బరమేశ్వరుఁడే యని తేలుచున్నది. హృదయకమలమున నున్న

---

* అసాధారణత్వ మనఁగా: నితరపదార్థములయం దిచ్చట నుండక మనము ఱఱింగించుచున్నయొకపదార్థమునందుమాత్రమే యుండుట.

పరిచ్ఛిన్నాకాశమున భూమ్యాదు లుండుటయు, జీవునిఁ గాని యాకాశ మును కాని తెలిసికొనిన ననంతఫలము కలుగుటయు నసంభవము కదా! కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమే శ్వరుఁడే.

"ఇట్లు చెప్పుట యుక్తము కాదు. మొట్టమొదట నీవాక్యమున "దహరాకాశమును తెలిసికొనవలయును" అని చెప్పినఁ గదా ఈవిచా రము! అచ్చట చెప్పఁబడినది దహరాకాశములోనిపదార్థమే కాని యాకాశము కాదు. 'తస్మిన్యదంత స్తదన్వేష్టవ్యం' అని గురువు చెప్పఁగా నట్లే "ఆహృదయాకాశమున నేమి యున్నది? దేనిని తెలిసి కొనవలయును?" అని శిష్యుఁ డడిగెను.ఇట్లుండ "దహరాకాశ ముపాస్య మెట్లగును? ఈవిచార మెట్లు చెల్లును?" అనియెదవేమొ వినుము.

ఇట్లు చెప్పిన, "యావా న్వా" అను మొదలగునుపమానమునకు విరోధము వచ్చును. ఆకాశమధ్యమున నున్నదానిని చెప్పవలసినగురువు మరల నాయాకాశమునే యేల వర్ణింపవలయును. "అవియు నాకాశమధ్య మున నున్నదానిఁ బ్రతిపాదించుటకే" యని యనియెదవేమొ అప్పటికిని విరోధము తప్పదు. అప్పుడు ఆకాశమధ్యమున కల వని చెప్పఁబడిన పృథి వ్యాదులే యుపాస్యములు కావలయును; వానియుపాసనవలననే పైఁ జెప్పఁబడిన యనంతఫలము కలుగవలయును కదా! ఇది యెన్నటికిని సంభవింపదు. భూమ్యాదు లాత్మ కాఁగలవా? మఱియు "ఏష ఆత్మా" అనువాక్యశేషమున నేకవచనము ప్రయోగింపఁబడి యున్నది. ఇది భూమ్యాకాశాదులఁ బరామర్శింపఁగలదా? "య ఆత్మాన మనువిద్య; ఏతాంశ్చ కామాన్" అనుటచే నాత్మ సర్వకామములకు నాధారభూతుఁ డనియు, వానిని కామములతోఁ గూడ నెఱుంగవలయు ననియు స్పష్ట మగుచున్నది. పృథివ్యాదులు కామాధారములు కాఁగలవా? కావున నెట్లు చూచినను ఈసర్వమునకు దహరాకాశమే యాధార మనవల యును. అదియే యుపాస్యముగ చెప్పఁబడె ననవలయును. పైన నిరూ పించినకారణములను బట్టి చూచిన నాయాకాశము పరమేశ్వరుఁడే యనవలయును. "తస్మిన్యదంతః" అనువాక్యమునందు తచ్ఛబ్దముచేఁ బరమేశ్వరునకు నాధార మని చెప్పఁబడియున్న హృదయకమలమే పరా మర్శింపఁబడె ననవలయును.

# అ ౧. పా ౩. సూ ౧౫. ఆరంభము.

అవతారిక:—ఈదహరవిద్య ఛాందోగ్యోపనిషత్తునందు ఎనిమిదవయధ్యాయమున నున్నది. పైసూత్రమున "వాక్యశేషమునందును అధ్యాయశేషమునందును గలహేతువులచే నిచ్చట చెప్పఁబడిన దహరాకాశము బ్రహ్మ మగును" అని చెప్పియున్నాము. ఈయధికరణశేషమున నాహేతువులనే సూత్రకారుఁడు నిరూపించుచున్నాఁడు.

## ౭౮. గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లింగం చ. ౧. ౩. ౧౫.

తాత్పర్యము:—దహరాకాశము బ్రహ్మ మని నిరూపించుటకు నధ్యాయశేషమున(మూఁడవఖండమునందు) ననేక హేతువులు కలవు:—

అచ్చట "ఇమాః స్సర్వాః ప్రజా అహరహ ర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందంతి" "ఈజీవు లందఱును ప్రతిదినమును దహరాకాశరూప మగుబ్రహ్మలోకమునకుఁ బోవుచున్నను దానిని తెలిసికొననేరకున్నారు" అనువాక్యము కలదు. దానియర్థమును విమర్శించిన దహరాకాశము పరబ్రహ్మమే కావలసి వచ్చును.

మఱియొకశ్రుతియందు "సతా సోమ్య తదా సంపన్నో భవతి" "జీవులు సుషుప్త్యవస్థయందు బ్రహ్మమును జెందుచున్నారు" అని చెప్పఁబడియుండుటచే "జీవులు ప్రతిదినమును పోవునది పరబ్రహ్మము కడకే" యనుట స్పష్ట మగుచున్నది. లోకమునందును గాఢనిద్రఁ జెందువానిని గూర్చి "వీఁడు బ్రహ్మములో నైక్య మైనాఁడు. బ్రహ్మానుసంధానమును చేయుచున్నాఁడు" అని వ్యవహరించుట కలదు కదా! ఈలోకవేదప్రసిద్ధుల ననుసరించి చూచిన "ఇమాః" అనుమొదలగుశ్రుతివాక్యమునందలి బ్రహ్మలోకపదమునకు పరబ్రహ్మమే యర్థ మై తీరవలయును; ఆబ్రహ్మలోకపదముచే ప్రస్తుతదహరాకాశము వర్ణింపఁబడెను. కావున నాదహరాకాశము కూడ నిర్వివాదముగఁ బరమేశ్వరుఁడే కావలయును.

"బ్రహ్మలోకపదమునకు 'చతుర్ముఖునియొక్క లోకము' అని కూడ నర్థ మగును కదా?" అనియెద వేమొ? అది సరియే కాని యీస్థలమునందు మాత్ర మాయర్థము చెప్పకూడదు. "బ్రహ్మయే లోకము (లోక

మనఁగా చూడఁబడునది విచారింపఁబడునది. హృదయకమలమధ్యమున విచారింపఁబడునది యగుటచేఁ బరబ్రహ్మమే లోకము)" అని మాత్రమే యర్థమును నిర్ణయించి చెప్పవలయును. "జీవులు ప్రతిదినమును సత్య లోకమునకు పోవుదురు" అని చెప్పుట సంభవింపదు కదా!

కావున నెట్లు చూచినను "ఇమాః" అనువాక్యమున చెప్పఁబడినగమనము పరబ్రహ్మమును గూర్చినదియే. బ్రహ్మలోకపదంబును పరబ్రహ్మవాచకమే. దహరాకాశమును బ్రహ్మముగ నుపదేశించినపిదప, ఆబ్రహ్మము ఆత్మరూపమే యగుటచేఁ దనకు మిగుల స్వాధీనముఁ ననే యున్నదనియు, అట్లున్నను అజ్ఞానులై జీవులు దానిని తెలిసికొనలేకున్నారనియు, ప్రతిదినమును దానియొద్దకుఁ బోవుచునే యుండియు దానియథార్థరూపము నెఱుంగలేకున్నారనియుఁ, ఈస్థితి మిగుల శోచనీయము కదా యనియు శ్రుతి బోధించుచున్నది. చిరకాలమునుండియు మట్టి పట్టుటచే వర్ణహీనములై రాళ్లని భ్రాంతిని కలిగించుచు నేలపై సువర్ణశకలములు పడియుండ, వానిమీఁదుగనే నడచుచుండియు వాని నుపయోగించుకొనలేక వివిధబాధల ననుభవించుదరిద్రులవలె పాప మీజీవులు నిత్యసుఖరూప మగుబ్రహ్మమును ప్రతిదినమును జెందుచునే యుండియు అజ్ఞానావృత మగుదృష్టి కలవారలగుటచే నాబ్రహ్మము నాత్మఁగా తెలిసికొని సుఖింపలేక బహువిధము లగు సాంసారికదుఃఖముల ననుభవించుచున్నారని చెప్పుచున్నది. "ఇమాః" అనువాక్య మీసందర్భములోనిది యని తెలిసికొనవలయును.

## ౨౯. ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మి న్నుపలబ్ధేః. ౧. ౩. ౧౬.

తాత్పర్యము:—మఱియు నధ్యాయశేషమున (నాల్గవఖండమందు) "అథ య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానా మసంభేదాయ" "ఆత్మ యని చెప్పఁబడినయీదహరాకాశమే సర్వలోకములను క్రమముగ నడపునట్టిసేతువు; ధరించునట్టిపదార్థము" అని చెప్పఁబడియున్నది. ఈకారణమువలనఁ గూడ దహరాకాశము పరబ్రహ్మమే కావలయును.

నిర్ణీతార్థము లగుశ్రుతివాక్యముల ననుసరించి చూచిన నీసర్వ ధారణసామర్థ్యము పరమేశ్వరునకు తప్ప మఱియొక్కనికి లేదనుట స్పష్ట మగును. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః (౧. 3. ౧౦. చూడు) అని బృహదారణ్యకోపనిషత్తు నందును "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష భూతపాల ఏష సేతు ర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ" "ఈపరమేశ్వరుఁడే సర్వని యామకుండు. సర్వభూతములకు నధిపతి. సర్వభూతములను పరిపాలించు వాఁడు. సర్వలోకములను క్రమముగ నడపునట్టి సేతువు. సర్వమును ధరిం చువాఁడు" అని మఱియొకచోటను కూడఁ జెప్పఁబడియున్నది. కావున సర్వలోకధరణసామర్థ్యము వర్ణింపఁబడి యుండుటచే నీదహరాకాశము పరమేశ్వరుఁడే.

## ౧౭. ప్రసిద్ధేశ్చ. ౧. 3. ౧౭.

తాత్పర్యము:—ఇదియును గాక నాకాశశబ్దము బ్రహ్మయందు ప్రసిద్ధమై యున్నది. "ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితా (౧. ౧. ౨౨. చూడు)" అనియు "సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశా దేవ సముత్పద్యంతే (౧. ౧. ౨౨ చూడు.)" అనియు ననేక శ్రుతులయందు ఆకాశపదము బ్రహ్మపరముగఁ బ్రయోగింపఁబడి యున్నది. జీవపరముగ నెచ్చటను ప్రయోగము లేదు. భూతాకాశపరము లుగ ననేకప్రయోగములు గానవచ్చినను, "అది ప్రస్తుతదహరాకాశము కాదు" అని మొట్టమొదటిసూత్రమునందే సయుక్తికముగ నిరూపింపఁ బడి యున్నది. కావున నెట్లు చూచినను విషయవాక్యమున వర్ణింపఁ బడినవాఁడు పరమేశ్వరుఁడే; జీవుఁడు కాని భూతాకాశము కాని కాదు.

## అ ౧. పా 3. సూ ౧౮. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరికాదు. దహరాకాశము బ్రహ్మ మని సిద్ధాంతము చేసినట్లే జీవుఁడని కూడ సిద్ధాంతము చేయుటకు వీలు కలదు. బ్రహ్మపరము లగు గుఱుతులు వాక్యశేషమున నెట్లున్నవో జీవ పరము లగు గుఱుతులు కూడ నట్లే యున్నవి. "అథ య ఏష సంప్ర సాదో ఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచ" "స్వప్నావస్థకు పిదప

నీజీవుఁడు ఈశరీరాభిమానమును వదలి పరమజ్యోతిని పొంది స్వస్వరూప ముతో నిలుచును. ఇతఁడే యాత్మ యని చెప్పెను" అనువాక్యము కూడ దహరవిద్యలోనిదే. దానియందు జీవుఁడు బాగుగ పరామర్శింపఁబడి యున్నాఁడు. సంప్రసాదశబ్దమునకు సుషుప్తి యర్థము. ఆసుషుప్తి జీవునికే కాని బ్రహ్మమునకు సంభవింపదు. శరీరాభిమాన పరిత్యాగ మనునది కూడ శరీరాభిమానము గలజీవునకు మాత్రమే సంభవించును గాని యితరునకు సంభవింపనేరదు. కావున నీవాక్యమునందు చెప్పఁబడిన యాత్మ జీవుఁడే. "బ్రహ్మము మాత్రము కాఁగూడదా" అని యాక్షే పించుటకైనను అవకాశము లేదు. కావున నెట్లు చూచినను ఇచ్చటఁ జెప్పఁబడినదహరాకాశము జీవుఁడే యనవచ్చును.

అవతారిక:—ఈపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౨౧. ఇతరపరామర్శాత్స ఇతి చేన్నా సంభవాత్. ౧. ౩. ౧౮.

తాత్పర్యము. సిద్ధాంతము:—జీవుని తెలియఁజేయునట్టిగుఱుతు లధ్యాయ శేషమునను న్నను దహరాకాశము జీవుఁడు కానేరదు. ఆకాశము సర్వవ్యాపకము. సర్వపదార్థములయందు వ్యాపించియున్నను వానితో నించుకయైన సంబంధము కలిగియుండునది కాదు. ఇట్టిపదార్థము, సర్వ వ్యాపకుఁడును నిర్లేపుఁడు నగుపరమేశ్వరునకు నుపమానము కాఁదగును కాని, దేహాభిమానయుక్తుఁడై పరిచ్ఛిన్నుఁడై యుండుజీవునకు నుపమా నము కాఁదగునా?

*"పరామర్శ జీవు ననుసరించి యుండుటచే 'దహరాకాశము జీవుఁడే' యనునర్థము తేలుచున్నది. ఇట్లుండ 'ఆకాశసామ్యము జీవునకు లేదు' అనుట యొకదోషము కానేరదు." అని యనియెదవేమొ? అది సరికానేరదు. "దహరాకాశము జీవుఁడే" అనిచెప్పిన వచ్చుదోషము లన్నియు మొకటిసూత్రముననే నిరూపింపఁబడియున్నవి. "ఆకాశ ముతో జీవునకు పోలిక ఘటింపదు" అనువిషయ మిప్పుడు నిరూపింపఁ బడినది. కావున పరామర్శ యనుహేతువు నొక్కదాని నాధారము చేసి

---

* పరామర్శము, (పుట. ౨౫౩ చూడుము.)

కాని తక్కినప్రమాణముల నన్నిటిని నిరాకరించుట తగదు. ఆకాశముతోఁ బోలఁదగి యుండును కావున దహరాకాశము పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౩. సూ ౧౯. ఆరంభము.

పూర్వపక్షసందర్భము:— ఛాందోగ్యోపనిషత్తునందు దహరవిద్యను వర్ణించు నీయష్టమాధ్యాయమున నాదహరాకాశము నాశ్రయించియే యొక్క కథ వర్ణింపఁబడి యున్నది.

అపహతపాప్మత్వము (సర్వకర్మలతో సంబంధము లేక పోవుట) అనుమొదలగుధర్మములు గలయీయాత్మయే దహరాకాశము. దాని నెఱింగినవాఁడు సర్వలోకములయందును స్వేచ్ఛాసంచారము కలవాఁడగుచు; సర్వకామముల సంకల్పమాత్రముననే యనుభవించును.

ఈవిషయము నెఱింగి దేవాసురులు ఆత్మవిజ్ఞానము నపేక్షించిరి. అప్పుడు దేవతలకై వారలలో నన్నివిధముల శ్రేష్ఠుఁ డగునింద్రుఁడును, రాక్షసులకై వారిలో నన్నివిధముల నుత్తముఁ డగువిలోచనుఁడును శాస్త్రోక్తవిధానమున సమిధల చేఁబూని ప్రజాపతికడకు నాత్మజ్ఞానార్థులై పోయిరి. మనస్సు నిర్మల మగుటకై ముప్పదిరెండుసంవత్సరములు బ్రహ్మచర్యవ్రతము నాచరించి పిదప నాయనకు తమయుద్దేశమును దెలిపిరి. ఆయనయు "ఎవ్వఁడు జాగ్రదవస్థయందు సర్వపదార్థములఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడే యాత్మ, వాఁడే భయరహితుఁడు. జరామరణములు లేనివాఁడు (బ్రహ్మ మనుట)" అని యుపదేశించెను. "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి హోవా చైత దమృత మభయ మేత ద్బ్రహ్మేతి" అనువాక్యముచే శ్రుతియం దీయుపదేశము స్పష్టము చేయఁబడి యున్నది.

ఇట్లుపదేశించిన విని యందలియథార్థతత్త్వమును తెలిసికొనలేక, "దేహాదిభిన్నుఁడై తనప్రకాశముచే సర్వమును ప్రకాశింపఁజేయు చైతన్యరూపుఁడే యాత్మ" యని గ్రహింపలేక, తమనీడనే యాత్మఁగా భావించిరి. "నీటియందుఁగాని అద్దమునందుఁ గాని కానవచ్చు ప్రతిబింబములలో నాత్మ యెయ్యది? లేక యీరెంటియందుఁ గానవచ్చునది యొక్కటియే యగునా?" అని ప్రజాపతిని ప్రశ్నఁజేసిరి "జాగ్రదవస్థయందు కానవచ్చుపురుషుఁడు లేక కంటియందు తోఁచుపురుషుఁడు

"అక్షిణి" అనుశబ్దము శ్రుతివాక్యమున నున్నది. దానివలన శ్రుతిచే జాగ్రదవస్థయే యుద్దేశింపఁబడినను, శబ్దార్థము ననుసరించి 'కంటి యందు' అని చెప్పఁబడెను." అనుటచే "కంటిలోఁ గాని కంటితోఁ జూచిన వెలుపలఁగాని గానవచ్చుచు పురుషాకారమై యున్ననీడ" అని భ్రాంతు లైరి. ఈవిధముగా చిత్తపరిపాక మింత యైనను లేకపోవుటచే మిగుల భ్రాంతిలోఁ బడియున్న యాయింద్రవిరోచనులఁ జూచి యా ప్రజాపతి యిట్లు తలంచెను. వీరిచిత్తము మిగుల మాలిన్యముచే నావ రింపఁబడి యున్నది. వీరిని ధిక్కరించి పలుకుటకు వీలు లేదు. సర్వజ్ఞుల మని యభిమానము కలవా రగుటచే, "నాయుపదేశము మీకర్థము కాలేదు" అనిన వీరికి కోపము వచ్చును. దానివలనఁ బ్రయోజన మేమి? కానిమ్ము. వీరు తమ యభిప్రాయమునందలి గుణదోషముల తామే యెఱుంగునట్లు చేసెదను.

అని తలంచి వారలచే నొకజలపూర్ణఘటమును తెప్పించి దాని యందు ప్రతిబింబములఁ జూచున ట్లాజ్ఞాపించెను. వారును చూచి "మాకు నాత్మ ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నాఁడు. గోళ్లు, వెండ్రు కలు, మొదలగువానితోఁ గూడఁ గానవచ్చుచున్నాఁడు" అని చెప్పిరి. మఱల నాప్రజాపతి వారలకు, వస్త్రాలంకారాదిసహితులై యట్లే చూచు టకు నాజ్ఞాపించెను. ఇట్లు చూచిన నానీడయందు శరీరసంస్థానానుసార ముగ గలుగుభేదములఁ గాంచి, "ఆత్మనిర్వికారుఁడు" అని విని యున్న వారు కావున, నాయభిప్రాయమును మాన్పుకొందురేమొ యని యా యన తలంచెను. వారుమాత్ర మట్లు చూచి తమకుఁ గానవచ్చిన నీడను మాత్రమే వర్ణించిరి కాని యభిప్రాయభేదము నొందలేదు. ఇట్టిస్థితిని చూచి చేయునది లేక నాప్రజాపతియు "వీరియభిప్రాయమునే యాశ్ర యించుచు గాక. క్రమముగ కాలము గడచుకొలఁది దానియందలిగుణ దోషములను స్వయముగనే యెఱుంగనిమ్ము" అని తలంచి "ఏష ఆత్మా" "ఈతఁడే యాత్మ" అనియెను.

అంత వారిరువురును తృప్తి నొంది నిజనివాసములకు మఱలిరి. అందు రాక్షసరాజగు విరోచనుఁడు ఆయుపదేశమున సంపూర్ణతృప్తిని వహించి, నీడ దేహము నాశ్రయించి వచ్చును. కావున దేహమే యాత్మ యని సిద్ధాంతము కుదుర్చుకొని దానిని తనప్రజ లగురాక్షసుల కుపదే

శించెను. తనదేహమును శుభ్రముగ నుంచి యుపచరించుచుండినచో నిహపరలోకసుఖములు కలుగు నని చెప్పెను. నాఁటినుండియు రాక్షసు లట్టియభిప్రాయమునే కలిగి యున్నారు. మృతిఁ జెందినవాని దేహమును కూడ బాగుగ నలంకరించుచు నాయలంకారముచే పరలోకసుఖము సిద్ధించు ననుకొనుచున్నారు.

ఇంద్రుఁడు మాత్ర మిట్లు సంపూర్ణతృప్తి నొందలేదు. మొట్ట మొదట "నీడయే యాత్మ" అనుసిద్ధాంతము యుక్తముగానే యున్నట్లు కానవచ్చినను కొంత విచారించినపిదప నది కృప్తికరము కాలేదు. తన లోకమును చేరకముందే యాతనికి నావిచార మీవిధముగ నుద యించెను.

నీడయే యాత్మ యనుట యంతయుక్తముగ తోఁచలేదు. శరీర మునకు నలంకారాదులు లేనప్పు డానీడయు నలంకారాదులు లేనిదై యుండెను. అలంకారాదు లున్నప్పు డదియు నట్లే యుండెను. ఇఁక విచారించిన నిట్లే శరీరము గ్రుడ్డిదైన నాత్మయు గ్రుడ్డివాఁడగు ననియు చెవిటిదైన చెవిటి యగు ననియు, నుత్పత్తి యైన నుత్పత్తి యగు ననియు, నశించిన నశించు ననియుఁ జెప్పవలసి వచ్చును. ఇట్లయిన నీతని నెఱుం గుటవలన సర్వలోకసుఖములు కలుగుట యెట్లు ?

అని విచారించి సంశయముతో మరలఁ బ్రజాపతికడకు వచ్చి తన యభిప్రాయము నెఱింగించి ప్రార్థించెను. అప్పుడు ఆయన మఱిముప్పది రెండుసంవత్సరములు బ్రహ్మచర్యవ్రతము నాచరింపవలయు ననియు, అప్పుడు తత్త్వార్థము నెఱుంగవచ్చు ననియు నాజ్ఞాపించెను. ఇంద్రుఁ డును అట్లు కావించి వచ్చుటయు నాతఁడు "ఎవ్వఁడు స్వప్నావస్థయందు సర్వపదార్థములఁ గ్రహించుచున్నాఁడో సర్వభోగముల ననుభవించు చున్నాఁడో ఆతఁడే యాత్మ" అని యుపదేశించెను. "య ఏష స్వప్నే మహీయమాన శ్చర త్యేష ఆత్మా" అనుశ్రుతియం దీవిషయము స్పష్టమై యున్నది.

అప్పుడును మునుపటివలెనే తృప్తినొంది యాయింద్రుండు కొంత దూరము స్వపురాభిముఖుఁడై చనుచు మధ్యమున నిట్లు విచారించెను. "ఈయాత్మకు దేహముతో సంబంధము లేకున్నను సుఖదుఃఖములతో సంబంధము కలదు. సుఖము కలిగినప్పు డాయాత్మ యభివృద్ధి నొందును;

దుఃఖము వచ్చినప్పుడు క్షీణించును. ఇవియు పరమాత్మునికి ధర్మములు కానేరవు. వేదమున నాత్మ మఱియొకవిధముగఁ వర్ణింపఁబడి యున్నది కదా!"

ఇట్లు విచారించి మఱలఁ బ్రజాపతికడకు వచ్చెను. ఆతఁడును "మఱిముప్పదిరెండువత్సరములు తపము నాచరించిన నీకు నాయాత్మను మరల వివరించుదును" అనుచు నట్లు గావించెను. "ఎవ్వఁడు సుషుప్త్యవస్థయందు ఏపదార్థములు గాని చూడక ఏకలను గాని గాంచక స్వప్రకాశుఁడై యుండునో అట్టివాఁడే యాత్మ" అని యుపదేశించెను. "తద్యత్రైతత్సుప్తస్సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాత్యేష ఆత్మా" అనుశ్రుతియం దీవిషయము స్పష్టమైయున్నది.

దీనికిని తృప్తుఁడై యాయింద్రుఁడు మఱలెను గాని మార్గమధ్యమున మఱల నిట్లు సంశయించెను. ఇది యేమి? సుషుప్త్యవస్థయందు గలవాఁడే యాత్మ యగునేని వానియందు ఆత్మలక్షణములు కుదురవు. ఆస్థితియందు పరుండనియు తా ననియు వివేకమే లేదు కదా! ఇట్టి మూఢుఁడాత్మ యగునా ?

అని సంశయించి మఱలఁ బ్రజాపతికడకు రాగా నాయన యీమాఱు ఐదుసంవత్సరములు మాత్రమే బ్రహ్మచర్యదీక్షను విధించెను. దీక్షానంతరమున "ఏతం త్వేవ తే భూయో ఽను వ్యాఖ్యాస్యామి" "ఈయాత్మనే నీకు మఱల వివరింతును" అని యారంభించి "ఆత్మకు దేహాదిసంబంధములు లేవు. ఆయన సర్వసాక్షి. ఆయనయే బ్రహ్మము సర్వపాపవిరహితుఁడు" అని బోధించెను. ఇఁకపై నింద్రునకు సంశయము కలుగలేదు. సర్వసాక్షి యగునాత్మ నాతఁడు గ్రహించెను; తనప్రజ లగు దేవతలకు నాయథార్థతత్త్వము నుపదేశించెను. వారు నిప్పటికి నట్లే యుపాసించుచున్నారు.

ఈకథ నాశ్రయించి యీ క్రిందివిధముగఁ బూర్వపక్షము వచ్చును:—

పూర్వపక్షము:—మీరు పై సూత్రమున జీవపరామర్శమును "బ్రహ్మధర్మములు జీవునియందు దటస్థింపవు" అనుకారణము నాధారము చేసికొని ఖండించియున్నారు. అది యుక్తము కానేరదు. ప్రజాపతి యింద్రునకు నొనర్చిన యుపదేశము నాశ్రయించి చూచిన జీవు

నకే బ్రహ్మధర్మము లున్నట్లు తోఁచుచున్నది. "ప్రజాపతి బ్రహ్మమును గూర్చియే చెప్పెను" అనుటకు నవకాశము లేదు. అచ్చట నవస్థలను గూర్చి చెప్పఁబడియున్నది. అక్షిస్థానము కూడ నిర్దేశింపఁబడి యున్నది. ఇవి పరబ్రహ్మమునకు సంభవింపనేరవు కదా! మఱియు "ఏష సంప్రసాదో ఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసం పద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే" (౧. ౩. ౧౮ చూడు.) అని శరీర మునుండి వెడలుట లేక యభిమానమును పరిత్యజించుటయను ధర్మము కూడఁ జెప్పఁబడినది. ఇదియుఁ బరమేశ్వరునకు సంభవింప దనుట నిర్వి వాదమే కదా. కావున శ్రుతిబలమువలన పరమేశ్వరధర్మము లన్ని యును జీవునకు సంభవించును. కావున దహరాకాశము జీవుఁడే కావలసి వచ్చును. ప్రస్తుతకథ దహరవిద్యను గూర్చినదియే కదా!

"ఇట్లు చెప్పుట సరి కాదు జీవునియందు పరమాత్మధర్మములు కల వనుట సర్వప్రమాణవిరుద్ధ మగుటచే శ్రుతి యట్లు చెప్పదు. అర్థ గ్రహణమునందే ప్రమాద ముండి తీరవలయును." అనియెదవేని యది సరి కాదు. జీవునకు కర్మసంబంధము సుఖదుఃఖసంబంధము మొద లగునవి స్వాభావికములు కావు; దేహేంద్రియాదిసంబంధమువలన వచ్చినవియే. అగ్ని లేనప్పుడు పొగ లేనట్లు దేహాదులు లేనప్పుడు కర్మ సంబంధాదులు లేవు. కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడిన దహరాకాశము జీవుఁడే.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౧౯. ఉత్తరా చ్చే దావిర్భూత స్వరూపస్తు.

## ౧. ౩. ౧౯.

తాత్పర్యము:—ఇంద్రప్రజాపతిసంవాదరూప మగునుత్తరగ్రం థమువలన, జీవుఁడే దహరాకాశ మనుట చెల్లదు. ఆసంవాదమున పర మేశ్వరరూపము నొంది పరమేశ్వరాభిన్నుఁడై తత్త్వరూపుఁడై యున్న జీవుఁడే వర్ణింపఁబడెను కాని, జీవత్వయుక్తుఁ డగుజీవుఁడు(సంసారి యగు వాఁడు) వర్ణింపఁబడ లేదు. వాఁడు అవిద్యాసంబంధము కలవాఁ డగుటచే వానియందు సంసారసంబంధరాహిత్య ముండుట తటస్థింపదు కదా!

సిద్ధాంతము:——ఆకథను బాగుగ విమర్శించిన నీవిషయము నిర్వివాదముగ విస్పష్ట మగును. మొట్టమొదట యాత్మరూపమును బోధింపదలఁచి ప్రజాపతి జాగ్రదవస్థాసాక్షిని బోధించెను. నీటికుండయందు చూడుఁ డని చెప్పుటచే "ఆసాక్షికి వృద్ధిక్షయశీలము లగు దేహేంద్రియాదులతో సంబంధము లేదు" అని నిరూపించెను. దేహముతోఁ బాటు వృద్ధిక్షయాదుల నొందునీడ యాత్మ కా దనిన, దేహసంబంధము లేనివాఁ డాత్మ యని చెప్పినట్లే యగు ననుటలో సంశయము లేదు కదా! జాగ్రదవస్థోపదేశమునకుఁ బిదప జరిగిన సంవాదమును (ఇంద్రప్రశ్నమును ప్రజాపతియుత్తరమును) విమర్శించిన నీవిషయము తేటపడును. ఇట్లు మొట్టమొదటనే జీవుని సర్వసంబంధవర్జితునిఁ గావించుటచే నాకథయం దుపదేశింపఁబడినవాఁడు స్వరూపావస్థితిని జెందిన జీవుఁడే యని తెలియవచ్చుచున్నది. ఇట్లయిన నచ్చట చెప్పఁబడిన ధర్మములు పరమేశ్వరునివే యగును గాని జీవునివి కానేర వనుట నిస్సంశయము.

మఱియు నీవు చేసినపూర్వపక్షమున నీయభిప్రాయ మేమి? ఆకథయందు పరమేశ్వరునిగూర్చియే చెప్పఁబడె ననియా? పరమేశ్వరుఁడే జీవుఁడుగా చెప్పంబడె ననియా? లేక పరమేశ్వరుఁడే జీవుఁడు, అయినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడే కాని పరమేశ్వరుఁడు కాఁ డనియా?

ఇందు మొదటిపక్షము నంగీకరించుట నీ కనుకూలము కానేరదు. స్వరూపస్థితిలో జీవుఁ డీశ్వరుఁడే యగుటచే మే మవలంబించినపక్షము కూడ నదియే యగును.

రెండవపక్షంబును మాసిద్ధాంతమును స్థాపింపనేరదు. త్రాటియందు పామువలె నీసర్వప్రపంచము పరమేశ్వరునియందు అవిద్యాప్రభావముచేఁ గల్పింపఁబడియున్న దని శ్రుతి నొక్కి చెప్పుచున్నది. కావున జీవుఁడుకూడ నట్టివాఁడే కావలయును. ఇట్లయిన త్రాటికిని పామునకును పరస్పరభేదము వాస్తవస్థితిలో లేనట్లు పరమేశ్వరజీవులకును వాస్తవస్థితిలో భేద ముండకూడదు. అందును ఆధార మగుపరమేశ్వరునకే నేవిషయమునం దైనను ప్రాధాన్య ముండవలయును కాని కల్పితుఁ డగుజీవునకు నది సంభవింపదు. ఈకారణమువలన అపహత

పాప్మత్వాదిగుణములు బ్రహ్మమునకే యుండవలయును కాని జీవున కుండవు.

పరమార్థస్థితిలో నెంతవఱకు దేహాభిమానము తొలఁగదో, త్రాటియందు సర్పబుద్ధివలె కల్పితభేదము నవలోకించునవివేక మెంత వఱకు నడంగదో, ఎంతవఱకు "అహం బ్రహ్మాస్మి" యని నిర్వికార పరమేశ్వరు నాత్మగా భావించఁడో? యంతవఱకు జీవునిరూపము అవిద్యాసహితమై సంసారయుక్తమై సుఖదుఃఖానుభవసమన్వితమై బ్రహ్మ మునకంటె భిన్నమై కానవచ్చును. ఇట్లు కాక గురువుచేతఁగాని వేదాం తవాక్యములచేతఁగాని "నీవు సంసారివి కావు. నీకు సుఖదుఃఖాదులతో సంబంధము లేదు. నీవు నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపుఁడవు. భ్రాంతిచే స్వస్వరూపము నెఱుంగలేకున్నావు" అని యుపదేశింపఁబడి, తత్ప్రతిభా వముచే నేక్షణమున నవిద్యాధ్వంసమును గావించునో, యాక్షణము నుండియు జీవునిరూపము పరమేశ్వరరూపమే. "స యో హ వై త త్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "ఎవ్వఁడు బ్రహ్మము నెఱుం గునో వాఁడు బ్రహ్మమే యగును" అని శ్రుతి యీవిషయమును విస్ప ష్టముగాఁ జెప్పుచున్నది. జీవుఁడు వాస్తవముగ పరమేశ్వరభిన్నుఁ డయ్యె నేని యప్పు డిది సంభవించునా? ఎన్నియుక్తులఁ జెప్పినను గోడ స్తంభ మగునా? కావున పరమేశ్వరజీవులకు పారమార్థికభేద ముండుట సంభ వింపదు. ఎట్లు చూచినను జీవుఁడు పారమార్థికుఁడు (బ్రహ్మమునకంటె భిన్నుఁడై యుండువాఁడు) కానేరఁడు. అవిద్యాకల్పిత మగురూపమే బ్రహ్మభిన్నముకాని పరమార్థస్థితిలో నిరువురు నొక్కటియే. ఇట్లుండ "ఈశ్వరుని జీవునిఁగా శ్రుతి చెప్పుచున్నది"యనుట యెట్లు సంభవింపఁ గలదు.

"వారిరువురకును పారమార్థికభేదము లేకున్నను కల్పితభేదము కలదు కదా! దానినాశ్రయించి శ్రుతి యట్లు చెప్పవచ్చును." అనియెద వేమొ? అప్పుడు జీవునకు నవిద్యావరణంబును సుఖదుఃఖాదిసంబం ధంబును కూడ కలదు. ఇట్టివానికి సర్వసంబంధరాహిత్య మెటనుండి వచ్చును?.

"పారమార్థికభేదము కూడఁ గల దనిన దోషమేమి?" అనియెద వేమొ? అది మిగుల విరుద్ధము. భేదాభేదములు పరస్పరవిరుద్ధము

లనుట స్పష్టమై యుండ నవి రెండు నొక్కస్థలమున నుండు ననుట యెట్లు సంభవించును? యథార్థభేద ముండిన యథార్థాభేద ముండదు. వ్యావహారికభేద ముండిన నట్టియభేద ముండదు. లోకమున నెవ్వఁడైనను పరస్పరభిన్నములనుగాఁ జూచినపదార్థముల నేకముగాఁ జూచుచున్నాఁడా?. నిప్పు, నీరు అనునవి రెండు నేకి మగుట గూడ నెన్నఁడైన సంభవించునా? కావున నెట్లు చూచినను జీవుఁడు బ్రహ్మాభిన్న మగు ప్రత్యేకపదార్థము కానేరఁడు. తద్రూపముతో బ్రహ్మమును నిర్దేశించుటయు సంభవింపదు.

ఇఁక మూఁడవపక్షము నాశ్రయించినను ప్రయోజనము లేదు. కల్పితభేదము కలిగి యవిద్యావృతుఁడై యున్నజీవుని మాత్రమే వర్ణించిన నాతనికి సర్వకర్మరాహిత్యము మొదలగుగుణము లుండుట సంభవింప దని వేఱొకమారు చెప్ప నక్కఱ లేదు కదా! కావున నెట్లు చూచినను ఈకథ జీవునియథార్థస్వరూపము నాశ్రయించి చెప్పఁబడినదే కాని వేఱు కాదు.

"ఇట్లయిన 'ఆవిర్భూతస్వరూపః = పరమార్థరూపము నొందిన జీవుఁడు' అని చెప్పుట యెట్లు? పరమార్థరూపమున జీవుఁడు జీవుఁడే కాదు కదా!" అనియెదవేమొ?ఇది యొకదోషము కాదు. జ్ఞానము కలిగినపిదప జీవత్వము లేకున్నను పూర్వక్షణమువరకు నది కలదు కదా! కావున పూర్వము నందున్నజీవత్వము నాశ్రయించి యట్లు చెప్పవచ్చును. జ్ఞానవంతుఁడై కాని, దేహాభిమానము విడిచినపిదప యేమియు నెఱుంగక గాఢనిద్రఁ జెందువాఁడై కాని,జీవుఁడు యేపరంజ్యోతి నాశ్రయించి స్వస్వరూపముతో నేకీభవించునో స్వస్వరూపము నే చెందునో యా పరంజ్యోతియే యాతనికి యథార్థరూపము.

పూర్వపక్షము:—ఇది యెట్లు సరిపడును. జీవుఁడు పరమార్థస్థితిలో నిర్వికారుఁ డనియు నిత్యుఁ డనియు చెప్పితిరి. ఇట్టివానికి స్వస్వరూపముతో నేర్పడుట యనఁగా నెట్టిది? దేహమునుండి వెడలుట (అనఁగా: నభిమానమును పరిత్యజించుట) యనఁగా నెట్టిది? జీవుఁడు సర్వకాలములయందును స్వస్వరూపముతోఁ బ్రకాశించుచునే యున్నాఁడు.

"ప్రతిపదార్థంబును ఎప్పటికిని స్వస్వరూపముతో నే యున్నను ఇతరపదార్థములయొక్కసంబంధము చే స్వరూపహాని(స్వరూపము ప్రకా

శింపకుండుటను,) నొందును. అట్లు హాని కలిగించిన రెండవపదార్థము సంస్కారాంతరములచేతఁ గాని యితరకారణములవలనఁ గాని తొలఁగి పోయినప్పుడు మఱల స్వస్వరూపముతో నేర్పడును. ఇట్లే జీవుఁడును సర్వకాలమును స్వస్వరూపముతోనే యున్నను నేదియో యొకకారణముచేత స్వరూపతిరస్కారము నొంది మఱల స్వస్వరూపస్థితి నొందవచ్చును కదా!" అనియెదవేమొ? అది యుక్తము కానేరదు. సువర్ణాదులు మట్టి పట్టుట మొదలగు కారణములవలన మాసిపోయిన, నామట్టిని కడుగఁగానే మఱల స్వస్వరూపమును జెందును; నక్షత్రంబులును పగలు సూర్యప్రకాశముచే కాంతిహీనములై యుండి రాత్రివేళ నాప్రకాశము లేకిపోవఁగానే స్వరూపప్రకాశము నొందును. ఈవిధముగఁ జీవుఁడు కూడ నున్నాఁడనుట మాత్రము సంభవింపనేరదు. ఆతనికి చూపు, వినికి, సంకల్పము, తెలివి, యనునవియే స్వరూపములు. అవి సంసారకాలమునందును ప్రకాశించుచునే యున్నవి. ప్రతిపురుషుఁడును చూచుచును వినుచును తలంచుచును తెలిసికొనుచునే యున్నాఁడు కదా! మఱియు నాతనిరూపమును తిరస్కరించుటకు నన్యపదార్థము కూడ లేదు. కావున జీవునకు స్వస్వరూపముతో నేర్పడుట యనునది మీమతము నాశ్రయించిన సంభవింపనేరదు. ఇఁక మామతమునందన్ననో జీవుఁ డనఁగా బ్రహ్మాభిన్న మగుక్రొత్తపదార్థము. ఇట్లగుటచే నాతఁడు ఒకానొకయవస్థయందు బ్రహ్మమునఁ గలయవచ్చును; మఱి యొకసమయమున వెలుపలికి రావచ్చును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరి కానేరదు. మాసిద్ధాంతము యొక్క స్వరూపమును బాగుగ నెఱుంగకపోవుటచే నిట్లు భ్రాంతి నొందుచున్నావు. మామతమున జీవుఁడు ఎన్నటికిని శరీరాదులతో పారమార్థికసంబంధము కలవాఁడు కాఁడు. స్వరూపప్రకాశము లేనివాఁడును గాఁడు. "అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం" "స్వాభావికముగ శరీరసంబంధము లేకుండియు పరమార్థస్థితిలో నసత్యములే యైన శరీరములయందుఁ గల్పితసంబంధముతో నుండువాఁడు" అని శ్రుతియు "శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే" "ఓయర్జునా! ఆయాత్మ శరీరమునందే యున్నను, ఏమియు నాచరింపఁడు; ఇంచుకయైనను దానిధర్మములతో సంబంధము నొందఁడు" అని స్మృతియు నీవిషయము నను

వాదము చేయుచున్నవి. మఱియు జీవునకు జ్ఞానమే స్వరూప మని సర్వ లోకప్రసిద్ధమై యున్నది. పరమాత్ముఁడు నట్టివాఁడే యనుటయు నంద అకుఁ దెలిసినవిషయమే. ఏయుక్తి నాశ్రయించినను రెండుజ్ఞానములు సమానములుగాఁగాని అల్పాధికములుగాఁగాని యుండుటకు వీలు లేదు. సమానముగ నున్న ననిన రెండు నొక్కటియే యగుకార్యము నాచరించినవి కావున "రెండు నొక్కటియే" యనవలసి వచ్చును. అట్లు కా దనిన రెంటికిని గలభేదమును నిరూపింపవలయును. సర్వవిధముల సమానములై యుండువానిలో భేద మెందుండి వచ్చును. శ్రమపడి సాధించినను, మొట్ట మొదట భేద మనుదానికే స్వరూపము సిద్ధింపదు. (౧. ౧.౧౫. చూడుఁ.) శ్రుతియుక్త్యనుభవముల నాశ్రయించి విచారించిన ఘటపటాదిజడ పదార్థములకే భేదము లేదనిన నిఁక ప్రకాశరూప మగుచైతన్యమునకు నది యెందుండి కలుగును? ఇట్లగుటచే "చైతన్యములయం దల్పాధిక భావ ముండును" అనుటకును వీలు లేదు. మఱియు నొకచేతనమున కంటెను నధిక మగు మఱియొకచేతనము కల దనిన నంతకంటె నధిక ముగ మఱియొకటియు దానికంటె మఱియొకటియు నుండవలయు నని యాక్షేపపరంపరలు వచ్చును; అనవస్థాదోషము (ఎప్పటికిని ముగింపు లేకుండుట యనుదోషము) వచ్చును. కావున నెట్లు చూచినను "చైతన్య మొక్కటియే; జీవుఁ డన్నను పరమేశ్వరుఁ డన్నను ఒక్కటియే" అనియే చెప్పి తీరవలయును.

"ఇట్లయిన 'జీవుఁడు శరీరమునుండి బయలువెడలును, పరమేశ్వరుని జెందును. స్వస్వరూపముతో నేర్పడును.' అనుట కర్థ మేమి" అనియెదవేమొ వినుము. ఆజీవునకు నొకప్పుడు శరీరముతో సంబంధం బును లేదు; మఱియొకప్పుడు పోవుటయు లేదు. ఇక నేమి యనిన:ఆత్మ స్వరూపజ్ఞానము కలుగకమునుపు ఆజీవునకు తనస్వరూప మగుజ్ఞానము దేహాదులతో సంబంధపడియున్నట్లు తోఁచును. దాసానిపువ్వు మొద లగుపదార్థసంబంధమువలన స్వచ్ఛ మగుస్ఫటికరత్నము ఎఱుపు మొద లగువర్ణములు కలదిగా తోఁచునట్లు తనరూపము అవిద్యాకల్పితదేహా దిసంబంధముచే మలినమైనది గాను సుఖదుఃఖాదిరూపము లగువృత్తు లతోఁ జేరినదిగాను తోఁచును. ఇట్లు దేనితోను సంబంధింపక నాకాశ తుల్యమై యుండుస్వభావము గల తనరూపము సర్వముతోను సంబంధిం

చునట్లు తోఁచుటయే సర్వానర్థకారణము (శాస్త్రావతారిక చూడు.) అదియే దేహసంబంధశబ్దముచే నుద్దేశింపఁబడినది. అట్టిభ్రాంతి కలిగి నప్పుడే జీవుఁడు జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. కావున నీయవివేకము తొలఁగుటయే శరీరమునుండి వెడలుట. అప్పుడు స్వస్వరూపముతో నిలుచు ననునది స్వాభావికమే. పరంజ్యోతి నాశ్రయించు ననునదియు స్వాభావికమే. ఇట్లు విచారించిన "అజ్ఞానమే శరీరసంబంధము; జ్ఞానమే తద్భావము" అని సిద్ధాంత మేర్పడును. ఇప్పుడు దోష మేమి కలదు.

పూర్వపక్షము:—ఇప్పటికిని మీమతము సరి కాదు. జీవుఁడు బ్రహ్మరూపుఁడే యగునేని శరీరాదులతో నెప్పటికిని ఎట్లును సంబంధము నొందుటకు వీలు లేదు. బ్రహ్మము ఆకాశమువలె దేనితోను సంబంధము నొందునది కాదు. జీవుఁడు నట్లే యుండవలయును. ఇఁక మీరు స్ఫటికదృష్టాంతమును చెప్పితిరి. ఆస్ఫటికము స్వచ్ఛమగుటయు దాసాని పువ్వు మొదలగువానితో యథార్థసంబంధము నొందకుండుటయు, భ్రాంతిచేఁ బరులకు వర్ణభేదముతోఁ దోఁచుటయు యథార్థమే యగును; కాని, యది మాత్రము జీవునివంటిది కానేరదు. స్ఫటికమునకు తన సమీపమున నున్నప్రతిపదార్థముతోను సంబంధించుస్వభావము కలదు. కావున "స్ఫటికమునకువలె జీవునకు దేహాదిసంబంధము కలదు." అనుట యుక్తియుక్తము కానేరదు.

మఱియు జీవుఁడు స్వస్వరూపజ్ఞానముచే శరీరాభిమానమును వదలినపిదప, తనజీవత్వమును పరిత్యజించినయనంతరమునఁ గాని పరమాత్మరూప మగుపరంజ్యోతిని చెందలేఁడు. ఇట్లుండ "పరంజ్యోతిని చెంది స్వస్వరూపము నొందును" అనుట యెట్లు సంభవించును ?

సిద్ధాంతము:—వినుము దృష్టాంత*దార్ష్టాంతికములకు సంపూర్ణ సామ్య ముండ నక్కఱ లేదనియు, అట్లుండ దనియు, ఉండుటకును వీలు లేదనియు నిదివరకే (౨౧౧. చూడు). నిరూపించి యున్నాము. కావున నిచ్చట కూడ దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణసామ్య మక్కఱ లేదు. స్ఫటికమువలె జీవుఁడు కూడ నితరపదార్థములతో సంబంధించుస్వభావము కలవాఁడు కానక్కఱ లేదు. ఏవిధముగ స్ఫటికము

* దార్ష్టాంతికము (పుట. ౨౨౦. చూడుము.)

వాస్తవస్థితిలో రక్తవర్ణము కాకున్నను సమీపమున దాసానిపువ్వు ఉన్నంతమాత్రమున లోకులచే భ్రాంతివశమున రక్తవర్ణముగఁ జూడఁబడుచున్నదో, అట్లే జీవుఁడును స్వాభావికముగ ప్రకాశహీనుఁడు కాకున్నను దేహాదిసంబంధము కలవాఁడు కాకున్నను అవిద్యావశమున నా దేహాదులు తనసమీపమున నున్నంతమాత్రమునఁ దనకు వానితో సంబంధ మున్నట్లు తనకుఁ దానే భ్రాంతి నొందుచున్నాఁడు. ఇంతమాత్రము సంబంధమే యిచ్చట నుద్దేశింపఁబడెను.

మఱియు స్వస్వరూపస్థితి నొందినపిదపనే పరమాత్మప్రాప్తి కలుగుననుట నిశ్చయమే. అయినను దానిని పూర్వముననే చెప్పుట విరుద్ధము కాదు. లోకమున "నోరు తెఱచుకొని నిద్ర పోవుచున్నాఁడు" అను వ్యవహారము కలదు. ఎవ్వఁడైనను నిదురించినపిదప నోరు తెఱచునుగాని ముందుగనే తెఱవఁడు కదా! అయినను నోరు తెఱచుటనుగూర్చి ముందుగనే చెప్పఁబడి యున్నది. ఇట్లే ప్రస్తుత "పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అనువాక్యమునందును చెప్పఁబడియున్నది. ఇంతమాత్రమున విరోధము రాదు.

కావున శరీరమునుండి వెడలుట యనఁగా మరణము నొందినవానివలె శరీరమును పరిత్యజించి పరలోకమునకు పోవుట కాదు "నేను శరీరముతో సంబంధముకలవాఁడను కాను" అని తెలిసికొనుటయే అట్లు తెలిసికొనకపూర్వము "జీవుఁడు స్వరూపముతో నేర్పడలేదు" అనియు, తెలిసికొనినపిదప "జీవుఁడు స్వరూపమును చెందెను" అనియుఁ జెప్పఁబడును. జీవునకు పరమేశ్వరరూపము స్వస్వరూపమే కావున, పైన చెప్పిన స్వరూపములతోనే *యావిర్భావతిరోభావము లేర్పడవలయును గాని మఱియొకవిధముగ నేర్పడుటకు వీలు లేదు. స్వస్వరూపము ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకపోవుట సంభవింపదు కదా!

జీవపరమేశ్వరులకు కలదని చెప్పఁబడుభేదము కేవల మజ్ఞానకృతమే కాని వాస్తవము కాదు. ఇరువురు నాకాశతుల్యులే యైయుండ పరస్పరభేదము సంభవించుట యెట్లు?

కావున నిర్వివాదముగ జీవపరమేశ్వరులకు నభేదమే. "స యో హ వై" అను మొదలగుశ్రుతులవలననే కాక ప్రస్తుతకథవలన కూడ

---

* ఆవిర్భావతిరోభావము లనఁగా ప్రకాశించుటయు మఱుగుపడుటయు.

నీవిషయము స్పష్టమే యగుచున్నది. ప్రజాపతి సర్వకర్మసంబంధరహితుఁ డగునాత్మనుగూర్చి ప్రశ్నింపంబడి యక్షిస్థానస్థితుఁ డగుద్రష్ట నుపదేశించెను. ఆతఁడు జీవుఁడే యైనను ఆతనినే పరమాత్మనుగాఁ జెప్పెను. పైన నిరూపించిన యుక్తులవలన నిది విరుద్ధము కాదని స్పష్టమగుచున్నది కదా. మఱియు జీవపరమేశ్వరులకు వాస్తవభేదమే యుండునేని యట్లు చెప్పుటయు సంభవింపనేర దనుట నిర్వివాదాంశము. "ఆతఁడు ఛాయాపురుషునిగూర్చి చెప్పియున్నాఁడు. ఛాయాపురుషబ్రహ్మములకు భేదము కలఁ దనుట నిర్వివాదము. ఇట్లే జీవబ్రహ్మలకుకూడ భేద ముండ నచ్చును; ఛాయాపురుషుని బ్రహ్మ మన్నట్లే జీవునిఁగూడ బ్రహ్మ మన నచ్చును" అనియెదవేమొ? అది సరి కాదు. అప్పుడు ప్రజాపతి యసత్యవాది కావలసి వచ్చును. ఒకమాఱు ఛాయాపురుషుని జెప్పి పిదప నన్యుని జెప్పుట యెట్లు? ఛాయాపురుషుని దోషయుక్తునిఁగా భావించిన దానిని విని సమ్మతించుట యెట్లు? ఇదియును గాక ఛాయాపురుషుఁ డనిత్యుఁడనుట సర్వలోకప్రసిద్ధము. ఇట్టివాని నమృతరూపునిఁగా వర్ణించుట యెట్లు? కావున ప్రజాపతి వానిని గూర్చి యెప్పుడును చెప్పియే యుండలేదు.

మఱియు రెండవమాఱు "ఏతం త్వేవ తే భూయో ఽనువ్యాఖ్యాస్యామి" "పైనఁ జెప్పినవానినే నీకు మరల వివరింతును" అని యారంభించి స్వప్నావస్థయందు సర్వస్వప్నములఁ జూచునాత్మను వర్ణించెను. ఈజాగ్రత్స్వప్నావస్థలయందుఁ గలయాత్మ యొక్కఁడే యనుటయు నిస్సంశయ మగుచున్నది. లోకమునందును, "రాత్రి కలలో నొకయేనుఁగును చూచితిని. అది యిప్పుడు కానరాలేదు" అని ప్రతిపురుషుఁడును స్వప్నావస్థయం దున్నవాఁడే జాగ్రదవస్థయందును సర్వపదార్థద్రష్టయై యున్నట్లు చెప్పుచున్నాఁడు. ఛాయాపురుషుఁ డిట్టివాఁడు కానేరఁడు కదా!

ఇదియును గాక మూఁడవమాఱును ఆప్రజాపతి సుషుప్త్యవస్థయందు అప్పటిసర్వాభావమును చూచువాని నాత్మగా నిర్ణయించి చెప్పెను. లోకమునందును గాఢనిద్రనుండి మేల్కాంచినవాఁడు "నేను శేయి సుఖనిద్రఁ జెందితిని. అప్పుడు నాకు ఏమియు దెలియకుండెను. తిన్నగా నిప్పటికి మెలఁకువ వచ్చెను" అని, యాసుషుప్త్యవస్థయందును

తానున్నట్లు చెప్పుచున్నాఁడు. తాను లేకుండిన తనకు నప్పటియజ్ఞానము సర్వభూతాభావము ననునవి తెలియుట యెట్లు? ద్రష్ట యొక్కఁడుండిన గదా "తెలిసికొనుచున్నాను తెలిసికొనుటలేదు" అనువ్యవహారములు జనించుట! కావున నిర్వివాదముగ సుషుప్తియందు చిత్తము మొదలగువానియభావమును వీక్షింపుచు ద్రష్ట యొక్కఁడుండియే తీరవలయును. చూచువాఁడు లేకుండిన "ఇది కలదు. లేదు" అనువ్యవహారములే సంభవింపనేరవు కదా!

"ఇట్లు కాదు. మేల్కనినపురుషుఁడు "నిదురయందు నన్ను నేనే యెఱుఁగలేకుంటిని" అని కూడఁ జెప్పుచున్నాఁడు. కావున నాయవస్థయందు ఆత్మ లేఁడు. శ్రుతియు "వినాశ మే వాపీతో భవతి" "సుషుప్త్యవస్థయందు ఆత్మ వినాశము నొందును" అని చెప్పుచున్నది. ఇట్లు కాక యప్పుడు కూడ నాత్ముఁడు కలఁడేని తనకుఁ దాను తెలిసికొనలేకుండునా" అనియెదవేమొ వినుము. ఆత్ముఁడు సుషుప్త్యవస్థయందు కూడ నుండి తీరవలయు ననుటకుఁ దగినంత ప్రమాణబలము నిదివరకే చూపియున్నాము. లోకవ్యవహారము ననుసరించి చూచినను, సుషుప్తి నొందినయాత్మయే జాగ్రదవస్థనుఁ గూడ నొందినట్లు తోఁచుచున్నది. "నేను నిన్న గాఢముగ నిదురించితిని. ఇప్పుడే మేల్కనుచున్నాను అనువ్యవహారమును ప్రత్యక్షముగనే చూచుచున్నాము కదా. ఇఁక "నన్ను నే నెఱుంగకుంటిని" అను లోకానుభవమునకును శ్రుతికిని అభిప్రాయ మేమి యనిన:—

మనము సామాన్యముగ నహంకారమునే యస్మచ్ఛబ్దార్థమునుగా తలంచుచున్నాము. తద్భిన్నుఁడగునాత్మయే దానికి (అస్మచ్ఛబ్దమునకు) ముఖ్యార్థ మని తెలిసికొనలేకున్నాము. జాగ్రత్స్వప్నావస్థలయందు ఆయహంకారము కారణమునందు లయము నొందదు కావున నప్పుడు భ్రాంతిచే దానినే యాత్మఁగా భావించి "జాగ్రత్స్వప్నావస్థలయందు ఆత్మ కలఁడు" అనిన సంగీకరించుచున్నాము. వాస్తవస్థితిని అహంకారభిన్నుఁడగునాత్మ సర్వావస్థలయందు నాయహంకారమును తదభావమును కూడఁ బ్రకాశింపఁజేయుచు నున్నాఁ డనుటను గ్రహింపలేకున్నాము. ఇట్టిస్థితియే "సుషుప్త్యవస్థయందు ఆత్మఁ కలఁడా లేఁడా" యనుసంశయమునకుఁ గారణ మగుచున్నది. సుషుప్తియందు

ఆయహంకారము తనవ్యాపారము నంతయును వదలి తనకు గారణ మగు నవిద్యయందు లీన మగును. ఈకారణమువలన ఆయహంకారమునే యాత్మగా భావించుచున్నవార మగుటచే "ఇప్పుడు ఆత్మ లేఁడు" అని తలంచుచున్నాము.' ఈతలంపే పైన చూపినలోకవ్యవహారమునకుఁ గారణము. శ్రుతియు దీనినే యాశ్రయించి యింద్రసంశయము నభివర్ణించి నది. కావున నెట్లు చూచినను సుషుప్త్యవస్థయందుఁ గూడ సాక్షి సర్వాభావమును జూచువాఁడై యుండవలయును. మెలఁకువ వచ్చినపిదప సుషుప్తియందలిసర్వాభావమును స్మరించుట లోకప్రసిద్ధమై యున్నది. కావునను, ఒకమాఱు చూడక యట్టిస్మృతి సంభవింపదు కావునను, ఈవిషయము సిద్ధాంత మగుచున్నది. ఇట్లు సర్వమును విమర్శించిన నాత్మ యొక్కఁడే సర్వసాక్షి యగుచు జాగ్రత్త మొదలగుమూడవస్థలయందు నున్నాఁడని స్పష్టమగుచున్నది. ఛాయాపురుషుఁ డిట్టివాఁడు కాఁడు కదా!

కావున ప్రజాపతి యొనర్చినయుపదేశమును విమర్శించినచో నాయన ఛాయాపురుషునిగూర్చి చెప్పనే లేదు. సర్వజనులచేతను భ్రాంతిచే నెవ్వఁడు బ్రహ్మాభిన్నుఁడుగాఁ జూడఁబడుచు జీవశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నాఁడో, ఎవ్వఁడు పరమార్థస్థితిలో శుద్ధచైతన్యస్వరూపుఁడై సర్వసంబంధరహితుఁడై యున్నాఁడో, అట్టిప్రత్యగాత్మయే బ్రహ్మాభిన్నరూపముతో నాయనచే వర్ణింపఁబడియున్నాఁడు. ఈయాత్మకును పరమాత్మకును భేద మింత యైనను లేదు. కావున ప్రస్తుతకథయందు గూడ వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. ఇట్లు కాకున్న జీవునకు పరమాత్మ ధర్మము లగునమృతత్వాదులు చెప్పఁబడుట యెట్లు సంభవించును? అవిద్యాకల్పితుఁ డగుచు దానిచే నావరింపఁబడి సుఖదుఃఖభోగముల ననుభవించుచు నుండువానికి, భయరాహిత్యంబును, అమృతత్వంబును సర్వసంబంధరాహిత్యంబు ననుమొదలగు బ్రహ్మగుణములు సంభవించుట యెట్లు?

మఱియు నీవిషయ మంతయు నాల్గవమాఱు ప్రజాపతి చేసిన యుపదేశమున స్పష్టముగనే కానవచ్చుచున్నది. అచ్చట నాత్మకు దేహాది సంబంధ మున్నట్లు తోఁచుటయే కాని వాస్తవస్థితిలో లేదనియు, జాగ్రదవస్థయందు సర్వేంద్రియములమూలమున వ్యవహరించుచున్నట్లు తోచినను ఆయన చేయునది యేమియు లేదనియు, మనస్సు బహువిధ

ములగు స్వప్నములఁ గాంచుచున్నను ఆయన వానిని నిర్వికారుఁడై చూచుచునేకాని యచ్చటి హర్షశోకాదులతో సంబంధింపడనియు, సుషుప్త్యవస్థయందు సర్వమును తనంతదానే నశింప స్వస్వరూపముతో నిలిచియుండు ననియు, చెప్పఁబడి యున్నది. పైసిద్ధాంతమును దృఢపర చుట కింతకంటెను ప్రబలప్రమాణ మేది కావలయును ? కావున నెట్లు చూచినను ఈ వాక్యమున వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. ప్రస్తుత దహరాకాశ మాయనయే.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. జీవుఁడు అవశ్య ముగ పరమాత్మునికంటె వేఱైనవాఁడై యుండవలయును. సర్వకర్మల నాచరిం చువాఁడుగాను వానిఫలముల ననుభవించువాఁడు గాను ఉండవలయును. ఇట్లు కాకున్న సర్వశాస్త్రములును విరుద్ధము లగును. ఇంత యేల ? "అ సంభవాత్ (౧-౩-౧౮ చూడు)" అనుసూత్రము కూడ వ్యర్థ మగును. అప్పుడు (అనఁగా : జీవబ్రహ్మము లేకరూపములైన) బ్రహ్మధర్మములు జీవునకుఁ గలుగ వనుట సంభవింపదు కదా !

సిద్ధాంతము:— అద్వైతము తప్ప తక్కినమతస్థులందఱును అద్వైతులలోఁ గూడ గొందఱును పైయభిప్రాయమును కలిగియే యున్నారు. అది యజ్ఞానమువలన కలిగినయభిప్రాయము. దీనిని తొలఁ గించుటకే యీభాష్య ముత్పన్న మైనది. పరమాత్మ యొక్కఁడే కలఁ డనియు, తద్భిన్న మగునితరపదార్థము బొత్తిగనే లే దనియు నిరూపించు టకై యీభాష్య ముత్పన్నమైనది. వ్యాసమహాముని యభిప్రాయమును నిర్ణయించుటకై యీభాష్య ముత్పన్నమైనది. యథార్థతత్త్వ మేమి యనిన:—

ఉన్నవాఁడు నిత్యశుద్ధముక్తస్వరూపుఁడగు పరమేశ్వరుఁ డొక్కఁడే. అవిద్యావశమువలన నాయనయే బహురూపములతోఁ దోచుచున్నాఁడు. సర్వశాస్త్రములును సర్వవిధులును తుదకు సర్వవాక్యములును గూడ నీ యవిద్యాకల్పితభేదము నాశ్రయించియే ప్రవర్తించుచున్నవి. (శాస్త్రావ తారిక చూడు.) వేదము కూడ నిట్లే బోధించుచున్నది. లోకులు ఈ భేదమునే యాశ్రయించి యున్నారు కావున మొట్టమొదట దానినే దృఢము చేసి క్రమక్రమముగ యుక్తులమూలమున యథార్థతత్త్వము నుపదేశించుట యుపదేశకులపని యైయున్నది. ఇట్లు కాక నాకస్మికముగ

సూక్ష్మతత్త్వముల నుపదేశించిన సామాన్యులు అధికులైనను చిత్త పరిపాకము లేనివారు చిత్తస్థైర్యము నొందనేరరు కదా! ప్రస్తుతము మనము విచారించుచున్నకథయే యిందులకు ప్రబలప్రమాణ మై యున్నది. ఇంద్రునంతటివానికే యాత్మోపదేశము ఛాయాపురుషోప దేశ మయ్యె ననిన నిఁక నన్యు లెంతవారు! కావుననే శ్రుతి యారం భమున బ్రహ్మమునుండి జీవునిసూత్రము వేఱు చేసి చెప్పుచున్నది. ఈ యభిప్రాయముతోనే సూత్రకారుఁడును "బ్రహ్మధర్మములు జీవునకు కలుగవు" అనియున్నాఁడు. త్రాటియందు భ్రాంతిచే సర్పమును కల్పించి చూచుచుండ, నాసర్పమునకు త్రాటిధర్మము లుండ నేరవు కదా! ఆ సర్పము వాస్తవస్థితిలో త్రాటికంటె భిన్నము కాకున్నను, సర్పరూప ముతో నున్నంతసేపు సర్పమే యగును గాని త్రాడు కానేరదు. ఇట్లే జీవుఁడును వాస్తవస్థితిలో బ్రహ్మాభిన్నుఁడే యైనను జీవరూపముతోఁ జూడఁబడుచున్నంతవరకు జీవుఁడే యగును. బ్రహ్మము కానేరదు! బ్రహ్మ ధర్మములను పొందనేరఁడు. కావున లోకోపకారార్థము లగుటచే భేద శ్రుతులను వాక్యములును సూత్రములును గూడ విరుద్ధములు కానే రవు. వీనికి పరమాభిప్రాయము భేదనిరూపణము కాదు కదా!

ఇట్లని వేదమునకు నభేదమున తాత్పర్యము లే దనుటకుఁ గాని యభేదశ్రుతులు నిరర్థకము లనుటకుఁ గాని యవకాశము లేదు. లోక స్థితి ననుసరించి పరమేశ్వరుని జీవభిన్నునిఁగా నిర్దేశించుచున్నను వేద మునకు జీవబ్రహ్మాభేదమును ప్రతిపాదించుటయం దుద్దేశము లేదు. అట్టి యుద్దేశమే యున్నయెడల "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఎవ్వఁడు భేదమును చూచునో వాఁడు మరణమునుండి మరణము నొందును" అని భేదదర్శననిందయు, "యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూ త్తత్కేన కం పశ్యేత్" "సర్వము నాత్మయే యై యుండ నెవ్వఁ డెవ్వనిని దేనితోఁ జూచును" అని ఏకరూపత్వనిర్ణయంబును "ఒకపదార్థము నెఱింగిన సర్వపదార్థముల నెఱుంగవచ్చును"అను మొద లగు ప్రతిజ్ఞలును సంభవింపనేరవు. భేదశ్రుతిని ప్రధానముగ చేసిన నభేద శ్రుతి సమన్వయింపదు. అభేదశ్రుతిని ప్రధానముగఁ గైకొనిన భేదశ్రుతిని లోకానువాదరూపమున సమన్వయింపవచ్చును. ఒక గ్రంథమునందలి తాత్పర్యమును నిర్ణయింపజూచువాఁడు పూర్వోత్తరవిరోధమును

గాంచునేని యీరెండుభాగములకును నిరర్థకత్వము కలుగకుండ సమన్వ యింపవలయును కాని తనకు నిష్టమైనదానిని గైకొని రెండవదానిని పరిత్యజించుట న్యాయము కాదు కదా! కావున సర్వార్థమును చక్కఁగా విమర్శించిన భేదశ్రుతియనువాదమాత్రమే కాని యభేదనిరాకరణార్థము కాదు. వ్యావహారికభేదము నవలంబించుటవలన కర్మబోధకము లగు శాస్త్రములకును నిరర్థకత్వము లేదు. సర్వమును పరమార్థమే యైయుండ వలయు ననునియమము లేదు. యథార్థానుభవముతోఁ గూడ నయ థార్థానుభవంబును కలదు; అదియు కొంత కార్యకారియే. కావున నెట్లు చూచినను బ్రహ్మాభిన్నముగ జీవరూపముండవలసినంత యావశ్య కము లేదు.

విశేషాంశము:—మఱికొందఱి ట్లనుచున్నారు:—

మీకు నీకథయందు పరమేశ్వరుఁడే చెప్పఁబడె ననునుద్దేశము కలదేని యప్పుడు "ఏతం త్వేవ తే భూయో ఽనువ్యాఖ్యాస్యామి" అనువాక్యమున జీవుఁడే చెప్పఁబడె ననుట సరి కానేరదు. పరమేశ్వరుని చెప్పఁదలఁచినవాఁడు జీవుని వివరింప నేల నుద్యమించును? కావున "య ఆత్మా ఽపహత పాప్మా" అని యుద్దేశింపఁబడిన పరమేశ్వరుఁడే "ఏతం" అనువాక్యమునఁగూడఁ జెప్పఁబడె ననుట మంచిది.

ఈపక్షము ఆదరింపఁదగదు. ఏతచ్ఛబ్దము సామాన్యముగ సమీ పమున నున్నదానినే చెప్పును కాని దూరమునకు పోదు. జీవుఁడు సమీ పమున వర్ణింపఁబడి యుండ నెచ్చటనో చెప్పఁబడియున్నయాత్మను చెప్పునా? మఱియు "భూయః=మఱల (చెప్పెదను)" అనుపదంబును నిరర్థకము కావలయును. నాల్గుపర్యాయములయందును వేఱువేఱువిష యములఁ గూర్చి చెప్పఁబడి యున్నది; కాని సమానవిషయమునుగూర్చి కాదు కదా! ఇది యంతయు నిట్లుండ నాప్రజాపతియు మోసగాడు కావలసి వచ్చును. ఒకపదార్థమునే వర్ణింతు నని చెప్పి నాల్గుమాఱులు నాల్గుభిన్నపదార్థముల వర్ణించుటకంటె నధికమగుమోస మెందున్నది?

కావున మేము చెప్పినదియే యర్థము. రజ్జు సర్పభ్రాంతి కలవానిని గూర్చి సర్పనిరాకరణపూర్వముగ రజ్జువును స్థాపించునట్లు జీవనిరాకరణ పూర్వకముగఁ బరమేశ్వరుని ప్రజాపతి యిందు స్థాపించి యున్నాఁడు. జీవస్వరూపమునే వర్ణించియున్నాఁడు. కావున నెట్లు చూచినను జీవా

భిన్నుఁ డగుపరమేశ్వరుఁడే దహరాకాశము; ఆవరణయుక్తుఁ డగుజీవుఁడు దహరాకాశము కాఁడు.

## అ ౧. పా 3. సూ ౨౦. ఆరంభము.

అవతారిక:—"ఇట్లయిన "య ఏష సంప్రసాదః" అని పందొమ్మిదవసూత్రమునఁ జూపఁబడిన జీవపరామర్శ నిరర్థక మగును. అది జీవునిగూర్చి చెప్పఁబడినవాక్య మనుటలో సంశయ మింత యైనను లేదు కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౭3. అన్యార్థశ్చ పరామర్శః. ౧. 3. ౨౦.

తాత్పర్యము:—ఇంతమాత్రమువలన జీవపరామర్శ నిరర్థకము కానక్కఱలేదు. అది పరమేశ్వరబోధనార్థమై చేయఁబడినదియే యగుటచే మాకుఁగూడ సమ్మతమే.

"య ఏష సంప్రసాదః" అనువాక్యమున చెప్పఁబడిన విషయము బాగుగ విమర్శించిన నిట్లు తేలుచున్నది.

జీవుఁడు జాగ్రదవస్థయందు సర్వేంద్రియముల నభిమానించుచు వ్యవహరించును. స్వప్నావస్థయందు సర్వనాడులయందును సంచరించుచు మనోభిమానముచే జాగ్ర*ద్వాసనల బహుప్రకారముల ననుభవించును. పిదప నలుపుఁ జెంది విశ్రాంతి నభిలషింపుచు దేహాభిమానమును పరిత్యజించును. వెంటనే సర్వేంద్రియములును మనోహంకారములతోఁ గూడి కారణమున లీనము లగును. బ్రహ్మమునకును తనకును గలభేద మాయింద్రియాదులవలన నచ్చినదియే యగుటచే, నప్పుడు జీవుఁడు బ్రహ్మరూపముతోనే నిలచును. ఘటోపాధి నశించినప్పుడు ఘటాకాశము మహాకాశరూపమే యగునట్లు యింద్రియాద్యుపాధి లయమునొందఁగానే జీవుఁడును బ్రహ్మమే యగును. ఈవిధముగ నేజీవుఁడు పరంజ్యోతిని పొంది స్వస్వరూపముతో నిలుచునో వాఁడే (అనఁగా: బ్రహ్మముతో నైక్యమైనయాజీవుఁడే, అనఁగా, జీవునియథార్థస్వరూప మగుపరమేశ్వరుఁడే) యాత్మ "ఏష సంప్రసాదః" అనుశ్రుతికి నిదియే తాత్పర్యము. ఇట్లగు

* వాసన యనఁగా:—ఎట్టిపనుల నాచరించువానిచిత్త మట్టిపనులయందే తిరుగుచుగ ప్రవేశించుచుండుట యూ చూచుచున్నాము కదా! మనస్సునను నట్టిస్వభావమును లేక పరవశత్వమును కలిగించుగుణము వాసన యనఁబడును.

టచే నిచ్చట కూడ చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యగుచున్నాఁడు; ఆతఁడే దహరాకాశము. కావున నీజీవపరామర్శవలన వచ్చుహాని యేదియు లేదు.

## ౨౪. అల్పశ్రుతే రితి చేత్తదుక్తం. ౧. ౩. ౨౧.

తాత్పర్యము:—మఱియు "దహరో ఽస్మి న్నంతర ఆకాశః" అని చెప్పుట పరమేశ్వరవిషయమున విరుద్ధ మగు నని సంశయింపవలదు. ఈవిషయమును గూర్చి యింతకుముందే వివరించియున్నాము. ఉపాసనార్థమై పరమేశ్వరునకుఁ గూడ నుపాధి ననుసరించి యల్పత్వమును చెప్పవచ్చునని నిరూపించియున్నాము. సర్వగత మగునాకాశమునకు నుపాధిభేదము నాశ్రయించి "ఘటాకాశము సూదిలోనియాకాశము (ఆకాశ మనఁగా: సందు ఎడము స్థలము అవకాశము" అను మొదలగు వ్యవహారములు విరుద్ధములు కానట్లు, సర్వగతుఁ డగుపరమేశ్వరునకుఁ గూడ "హృదయమునందలి పరమేశ్వరుఁడు" అను మొదలగువ్యవహారములు విరుద్ధములు కానేరవని తెల్పియున్నాము. ఈవిషయము లిదివరకే "అర్భకౌకస్త్వాత్ (౧. ౨. ౭. చూడు.)" అనుసూత్రమున వివరింపఁబడియున్నవి.

మఱియు ప్రస్తుతదహరవిద్యయందు చెప్పఁబడియున్న యల్పత్వ మట్లే స్థిరపరుపఁబడి కూడ నుండలేదు. "యావా నాన్వా అయ మాకాశః" అని యాదహరాకాశము భూతాకాశముతోఁ బోల్పఁబడి యున్నది. దీనిచే "దహరాకాశమునకు చెప్పఁబడినయల్పత్వము కార్యార్థమై చెప్పఁబడినదే కాని స్వాభావిక మనునభిప్రాయముతోఁ జెప్పఁబడినది కాదు" అనువిషయము స్పష్టము చేయఁబడియే యున్నది కదా! కావున నెట్లు చూచినను ఈదహరవిద్యయందు చెప్పఁబడిన దహరాకాశము పరమేశ్వరుఁడే.

---

# ౬. అనుకృత్యధికరణము.

విషయము:—"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో ఽయ మగ్నిః, త మేవ భాంత మనుభాతి సర్వం

తస్య భాసా సర్వ మిదం విభాతి" "అచ్చట సూర్యుఁడు కాని, చంద్రుఁడు కాని, నక్షత్రములు కాని, మెఱుపులు కాని, అగ్ని కాని, ప్రకాశింపదు. ఆతఁడు ప్రకాశించుచుండ నతనితోఁ గూడియే సర్వపదార్థములును ప్రకాశించును. ఆతని ప్రకాశముచేతనే యీకానవచ్చుసమస్తంబును ప్రకాశించును" అనువాక్య మొక్కటి ముండకోపనిషత్తున నున్నది. అది యీ యధికరణమున విమర్శింపఁబడును.

పై యధికరణమున "పరంజ్యోతి రుపసంపద్య" అనువాక్యము ప్రస్తావానుసారముగ విచారింపఁబడెను. దానిచే "త చ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః" "ఏది నిర్మలమై తేజస్సులకెల్ల తేజస్సై యున్నదో" అను వాక్యము జ్ఞప్తికి రాఁగా దానిఁ గూర్చి ప్రవర్తించు పైవిషయవాక్యము ప్రస్తుతాధికరణమున విచారింపఁబడుచున్నది. కావున నీరెండధికరణములకును గలసంబంధము ప్రాస్తావికసంబంధము.

మఱియుఁ బై యధికరణమున నాత్మశబ్దము మొదలగులింగములచే నాకాశపదమునకు భూతాకాశపరముగ నున్నశంక బాధింపఁబడెను. ప్రస్తుతవిషయవాక్యమునందును "న భాతి" అనులింగము కలదు. సామాన్యముగ తేజస్సును మఱియొకతేజస్సుమాత్రమే తిరస్కరింపఁగలుగుట లోకప్రసిద్ధమై యున్నది. కావున "తత్ర" అను మొదలగుశబ్దములచే పరామర్శింపఁబడిన బ్రహ్మమును పరిత్యజించి యేదియో యొక తేజోరూపమును పరిగ్రహింపవలయు నని తోఁచుచున్నది. ఇదియే (ఈ దృష్టాంతసంబంధమే) యిచ్చట పూర్వపక్షమునకుఁ గారణము. కావున నీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతరూపసంబంధము అని కూడ చెప్పనచ్చును.

ఇదియును గాక "ఏతం త్వేవ తే భూయో ఽనువ్యాఖ్యాస్యామి" అనువాక్యమును విచారించునప్పుడు పై యధికరణమున "సర్వనామము సమీపమున నున్నదానిని మాత్రమే పరామర్శించును" అనునియమము నాశ్రయించి "ఏతచ్ఛబ్దము జీవునిమాత్రము చెప్పుచున్నది" యని సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇది యుక్తము కాదు. సర్వనామములు సమీపస్థితమునే చెప్పు ననునియమము కాని, తమకంటె పూర్వమున నున్నవారినే చెప్పు ననునియమము కాని లేదనవలయును. "త స్యాపత్యం" "వానిపుత్త్రుఁడు" అనునర్థమున బిత్రువాచకపదమునకు అణ్ ప్ర

త్యయము వచ్చును" అనువ్యాకరణసూత్రమున నున్నతచ్ఛబ్దమునకు పూర్వమున నేపదము లేదు కదా! అట్టినియమమునే యాశ్రయింప వలయు ననిన ప్రస్తుతవిషయవాక్యమున విరోధము వచ్చును" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడినది. కావున దీనికి రెంటికిని గలసంబంధ మాక్షేపసంబంధము గాని, ప్రత్యుదాహరణసంబంధము గాని యగును.

సందేహము:—ఇచ్చట "తత్ర" అనుపదము సప్తమీవిభక్తిని సూచించు "త్రల్" ప్రత్యయము కలిగియున్నది. ఆసప్తమీవిభక్తికిని * విషయమునందును "ఉండగా (సతి)" అనునర్థమునందును సమాన ప్రయోగములు కలవు.ఇదియే యిచ్చట సంశయకారణము. "పై విషయ వాక్యమునఁ జెప్పఁబడినది లోకాతీత మగు నేదియోయొక తేజస్సు. పరమేశ్వరుఁడు" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. ఈరెండు పక్షములకును తేజఉపాసనయు బ్రహ్మజ్ఞానంబును క్రమముగ ఫలములు.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమున వర్ణింపఁబడినది యొకానొకయపూర్వ మగు తేజస్సే కాని పరమేశ్వరుఁడు కాఁడు. లోకమున అధికమగు తేజస్సుచే అల్పము లగు తేజస్సులు తిరస్కరింపఁబడుటను చూచుచున్నాము. సూర్యకాంతియెదుట నక్షత్రములు ప్రకాశింప వనుట యెల్లరకును తెలిసినవిషయమే. గోడలు, కుండ, మొదలగుపదార్థములుకూడ తమలోపల నున్నదీపకాంతిని వెలికిఁ బ్రసరింపఁజేయ వనుటయు, నీకారణమువలన తేజోభిన్నపదార్థములు కూడఁ దేజస్సును తిరస్కరింపవచ్చు ననుటయు, నంతయుక్తియుక్తము కాదు. గోడమొద

---

*వైషయికసప్తమీస్వరూపము:—సంస్కృతభాషయందుసప్తమీవిభక్తి అనేకార్థములయందు ప్రయోగింపఁబడును. అందు సచ్ఛబ్దముతో గూడఁ బ్రయోగింపఁబడినప్పుడు దానినే సతిసప్తమి యందురు. అప్పుడు ఆసప్తమికి ఉండఁగా అనునర్థము వచ్చును. "తస్మిన్ సతి" వాఁడు ఉండఁగా "త్వయి సతి" నీవు ఉండఁగా అనుమొదలగునవి దాని కుదాహరణములు.

ఇట్లు కాక "తస్మిన్" "వానివిషయములో (వానినిగూర్చి యనుట)" అను నర్థమునఁ గూడ నాసప్తమీ ప్రయోగింపఁబడును. ఇదియే వైషయికసప్తమీ యనఁబడును.

లగునాపదార్థములకును తేజస్సునకును భేదము అనంతముగఁ గలదు. తేజస్సు తాను సర్వమును ప్రకాశింపఁ జేయఁగలదియై తనకంటె నల్పము లగు తేజస్సులఁ దిరస్కరించును; ఇతరము లట్లు కాదు కదా!

మఱియు "తమేవ భాంత మనుభాతి సర్వం" అనుటచే సర్వ తేజస్సులు నీశ్రుత్యుక్తవస్తువు ననుసరించి ప్రకాశించుచున్నవి యని తేలుచున్నది. ఇదియు పరమేశ్వరునివిషయమున సంభవింపదు. ఆయన తేజస్సు కాఁడు; సూర్యాదులును తేజోభిన్నపదార్థము ననుకరింపరు (అనుసరించి పని చేయరు.) లోకమున సమానజాతి గలపదార్థములే పరస్పరము ననుకరించుచుండుట ప్రత్యక్షమై యున్నది. గోవు సూకరము ననుసరించుట యెందైనం గలదా!

కావున శ్రుతియందు చెప్పఁబడినవిషయములు "తేజస్సులను తిరస్కరించుట, యితర తేజస్సులు అనుకరించుట" అనునవి రెండును పరబ్రహ్మవిషయమున సమన్వయ మగుట లేదు.

"ఇట్లు చెప్పరాదు. సర్వశబ్దము ప్రపంచ వాచకము. 'తత్ర' అను మొదలగు శబ్దములును బ్రహ్మమును పరామర్శించునవి. అందును తత్వశబ్దము సప్తమీవిభక్తిచే "బ్రహ్మవిషయమున సూర్యుఁడు బ్రకాశింపఁడు" అనువిషయమును బోధించుచున్నది" అనియెదవేమొ వినుము. సూర్యాదు లనేకులు శ్రుతియందుఁ జేర్కొనఁబడియుండుటచే నీసర్వపదము వారినే చెప్పవచ్చును. మఱియు తత్రశబ్దమును గూర్చి చెప్పిన విషయము యుక్తము కాదు. అది పరబ్రహ్మమును బోధించునేని యప్పుడు "సూర్యాదులు పరమేశ్వరునిఁ బ్రకాశింపఁజేయఁజాలరు" అనునర్థము కావలసివచ్చును. "భాతి=ప్రకాశించుచున్నాఁడు" అను పదము స్పష్టముగఁ గానవచ్చుచుండ, అంతమాత్ర మర్థము చెప్పిననే కార్యము నిర్వాహ మగుచుండ, నూతనార్థమును కల్పింపనేల? మఱియుఁ దక్కిన సర్వనామములును పూర్వవిషయములనే పరామర్శింపవలయు ననునిర్బంధముకూడ లేదు."

"లోకమున నధికమగు తేజస్సు అల్పమగు తేజస్సును తిరస్కరించుచునే యున్నది; కాని ప్రకాశింపఁ జేయుట లేదు. కావున మీపక్షము సరి కాదు" అనియెదరేమొ వినుము. వేదవాక్యప్రభావమువలన నిట్టి తేజస్సు కూడ నొక్కటి కలదని గ్రహింపవచ్చును. ఇందు దోషమేమి?

"ఇదియు సరి కాదు. లోకమున సూర్యాదులను కన్ను చూచు చున్నది. కావున కన్నే వానిని ప్రకాశింపఁజేయుచున్నది యనవచ్చును. కంటియందు సాక్షి సర్వకాలములయందు నున్నాఁడు కావున సాక్షియే సర్వతేజస్సుల ప్రకాశింపఁజేయువాఁడు తిరస్కరించువాఁడును గావచ్చును. సాక్షియే పరమేశ్వరుడు కావున నాతఁడే విషయవాక్యమునఁ జెప్పఁబడి యుండవచ్చును" అనియెదవేమొ అదియు యుక్తము కాదు. శ్రుతి దేని నెట్లు చెప్పునో దాని నట్లే యంగీకరింపవలయు ననుట విధి.

"ఇట్లయిన ప్రకరణానుసారముగ బ్రహ్మమునే గ్రహింపరాదా" అనియెదవేమొ? అది సరిపడదు. నీవు చెప్పునది ప్రకరణము. మేము చెప్పునది లింగము. ప్రస్తుతవిషయవాక్యమునఁ గలగుశ్రుతులు తేజస్సునందు బాగుగ సమన్వితము లగుచున్న వని యిదివఱకే నిరూపించియున్నాము. కావున లింగముచేఁ బ్రకరణమును బాధింపవలసి వచ్చును. కావున నీవిషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు. సర్వవిషయములును తేజస్సునకు గుదిరియుండ, తేజోభిన్నుఁ డగుపరమేశ్వరు నంగీకరించి, యాయనయందు, నీసర్వమును కేవలశ్రుతిమాత్రమునే లేక ప్రకరణమాత్రమునే యాధారము చేసి సమన్వయించుట యయుక్తము. సర్వలోకప్రసిద్ధమై యొక తేజస్సు ఉండఁగా మఱియొకదాని నంగీకరించి దానియందు తేజోధర్మముల నారోపించుట *గౌరవము కూడ నగును. కావున నెట్లు చూచినను ప్రస్తుతవిషయవాక్యమునఁ జెప్పఁబడినది లోకాతీత మగునొకానొక తేజస్సే కాని పరమేశ్వరుఁడు కాఁడు.

అవతారిక:—అనునీసంశయమును నిరాకరించుచున్నాఁడు.

## ౭౫. అనుకృతే స్తస్య చ. ౧. ౩. ౨౨.

తాత్పర్యము:—ప్రస్తుతవిషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే. "భారూపః" (౧-౨-౧౧ చూడు.) అనుశ్రుతియందుఁ బ్రత్యక్షముగనే "పరమేశ్వరుఁడు ప్రకాశరూపుఁడు" అని చెప్పఁబడి

* గౌరవ మనఁగా: నొకటి రెండుపదార్థముల తెగినంతికారణము లేకయే యధికముగ నంగీకరించుట.

యున్నది. కావున నాపరమేశ్వరప్రకాశమునే యనుసరించి యీసూర్యా దులు ప్రకాశింపవచ్చును; ఆయనప్రకాశముచేతనే యెందఱును తెలి యఁబడవచ్చును. అట్లు కాకున్న సర్వమును విరుద్ధమే యగును.

సిద్ధాంతము :—అనుకరించుటకు సమానజాతియే కావలయు ననుట నియమము కాదు. లోకమున విరుద్ధజాతి గలవి కూడ నొకదాని నొక్కటి యనుకరించుచున్నవి. కాలినయినుము తనయందున్నయగ్ని తోఁ గూడి పదార్థములఁ గాల్చుచున్నది. ధూళి వాయువుతోఁ గూడి అది (వాయువు) యేదిక్కునకుఁ బోయిన నాదిక్కునకుఁ బోవుచున్నది. ఇట్లే బ్రహ్మము తేజస్సు కాకపోయినను అన్యతేజస్సులు ఆయన నను సరింపవచ్చును. సమానస్వరూపము కాని సమానజాతి కాని లేకపోవుట యనుకరణమునకు ప్రతిబంధకము కాదని యింతకుముందే నిరూపించి యున్నాము.

ఇచ్చట పరమేశ్వరు నంగీకరింపక, సూర్యాదిభిన్న మగు తేజస్సు కల దనుట యుక్తియుక్తము కానేరదు. అట్టితేజస్సు కల దనుప్రసిద్ధి యెచ్చటను లేదు. ఇఁక దానిని క్రొత్తయుక్తులతో సాధింపవలయును. మీరు తలంచినసర్వప్రమాణవిరుద్ధ మగుతలంపే శ్రుతికిఁ గూడ నున్న దని యెట్లు నిర్ణయింప నగును. లోకమున నొక తేజస్సును మఱియొక తేజస్సు ప్రకాశింపఁజేయు ననిన నది మొదటితేజస్సునకంటె నధికమై యుండవలయును కదా! అట్లున్న నది తనకంటె నల్ప మగు తేజస్సును తిరస్కరించును; కాని యనుగ్రహింపదు. ఇదియు మీరు చెప్పినదియే. ఇఁక రెండు తేజస్సులును సమానములే యగునేని యప్పుడు దేనికదియే ప్రకాశించును కాని యొకదాని నొక్కటి ప్రకాశింపఁజేయ లేదు. ఒక దీపము మఱియొకదీపమును ప్రకాశింపఁజేయుట నెచ్చట నైన జూచి తిమా? కావున నొక తేజస్సును మఱియొక తేజస్సు అనుకరించు ననుట యుక్తియుక్తము కాదు.

"ఇట్లు కాదు. లోకమున కన్ను సూర్యుని జూచును. సూర్య ప్రకాశముచేఁ బ్రకాశింపఁజేయఁబడినపదార్థములను గ్రహించును. గ్రుడ్డివాఁ డీపనిని చేయఁజాలఁడు కదా! కావున కన్ను సూర్యకాంతి నపేక్షించును; ఇట్లే సూర్యుఁడును కంటి నపేక్షించును (అనఁగా: కంటికే కనఁబడును). కావున నొక తేజస్సునకు మఱియొక తేజస్సుయొక్క సాహా

య్యము కావలసియే యున్నది.'' అనియెదవేమొ వినుము. మేము అట్టిసాహాయ్య మక్కఱలేదని చెప్పలేదు. ఇఁక నేమియనిన ''ఒక తేజస్సు మఱియొక తేజస్సును ప్రకాశింపఁజేయదు'' అని మాత్రమే చెప్పియున్నాము. ప్రస్తుతదృష్టాంతమునందును సూర్యుఁడు నేత్ర తేజస్సును కాని నేత్ర తేజస్సు సూర్యుని కాని యనుకరించుట లేదు. ఈ రెండును తమకుఁ దామే స్వతంత్రములై ప్రకాశించుచున్నవి. పదార్థములను ప్రకాశింపఁజేయుటయందు రెంటికిని సామర్థ్యము కలదు. కావున నిట నొకదానిసహాయమును మఱియొకటి యపేక్షించు నంతియె కాని యన్య మేమియు లేదు.

''ఇది సరి కాదు. సూర్యుఁ డున్నప్పుడే కాని దృష్టికి ప్రకాశము లేదు. దృష్టి యున్నప్పుడే కాని సూర్యునకును ప్రకాశము (''వీఁడు సూర్యుఁడు'' అనుజ్ఞానము) లేదు. రాత్రియందు (గాఢాంధకారము నందు) దృష్టి లేదు; కన్నులు లేనివానికి సూర్యుఁడును లేఁడు. కావున నీతేజస్సు లొకదాని నొకటి ప్రకాశింపఁజేయుచుఁ గూడ నున్నవి'' అని యెదవేమొ వినుము. ఈదృష్టిసూర్యు లిరువురును స్వతంత్రులు; స్వయముగనే ప్రకాశించువారు. సూర్యుఁడు లేనప్పుడు కూడ కన్ను తద భావమును (సూర్యుఁడు లేకపోవుటవలన కలిగిన చీఁకటికిని) చూచు చున్నది. సూర్యుఁడే దృష్టికి ప్రకాశకుఁ డగునేని (అనఁగా: సూర్యుఁడు లేనిది దృష్టి ప్రకాశింపకుండు నేని) యిది సంభవింపదు కదా! ''అప్పుడు పదార్థములను ఆదృష్టి గ్రహింపలేదు కదా!'' అనియెద వేమొ? అది తేజస్సహాయము లేకపోవుటవలన కలిగినదియె. తేజస్సుచే ప్రతిబంధకము (పదార్థములు తేటఁగ గానవచ్చుటకు నభ్యంతరము కలిగించుచున్నచీఁకటి) నశింపకపోవుటవలన జనించినదియే. ఇంతమాత్రము వలన సూర్యుఁడు నేత్ర తేజస్సును ప్రకాశింపఁజేయువాఁడు కా నేరఁడు. ఇట్లే నేత్ర తేజస్సును సూర్యుని ప్రకాశింపఁజేయునది కానేరదు. అప్పుడు కన్నుమూయఁగానే సూర్యుఁ డస్తమింపఁవలసి వచ్చును. ఇది సంభవింపదు కదా! కావున ''ఒక తేజస్సును మఱియొక తేజస్సు ప్రకాశింపఁ జేయును'' అనుట యెన్నటికిని సరిపడదు.

''నీవే యింతకుముందు నేత్ర తేజస్సు సూర్యుని జూచుచున్నది. కావున నాయనను ప్రకాశింపఁజేయుచున్నది. అదియే సాక్షిచైతన్య

ప్రకాశమగుటచే బ్రహ్మమే సూర్యుని ప్రకాశింపఁజేయునది యగును. (పుట.౨౧౭. చూడుడు.) అని చెప్పియుంటిరి. అచ్చటమాత్ర మీదోషము రాదా? " అనియెదవేమొ వినుము. సాక్షిచైతన్యము కేవలము కంటి నుండిమాత్రమే సూర్యుని ప్రకాశింపఁజేయుట లేదు. అది స్వయం ప్రకాశమై మనోవృత్తులమూలమునను, సర్వేంద్రియములమూలము లను వెలికి వచ్చుచు "తెలియును" అది కొన్నిటిని "తెలియదు" అని మఱికొన్నిటిని గూడఁ బ్రకాశింపజేయుచున్నది. అది కన్ను మూసినంత మాత్రమున పోవునది కాదు కదా! నీవును దాని నుద్దేశించియే చెప్పి యుందువేని యప్పుడు మామతమునే ప్రవేశించినవాఁడ వగుదువు.

కావున నెట్లుచూచినను ఒక తేజస్సు మఱియొక తేజస్సును నపే క్షించుట విరుద్ధము. కావున సూర్యాదులు సమానజాతీయ మగునన్య తేజస్సుచేఁ బ్రకాశింపఁజేయఁబడవు. పరబ్రహ్మము చైతన్యప్రకాశరూప మైనను తేజోజాతిలో చేరినది కాదు కావున నిది దాని ననుకరింప వచ్చును. ఇన్నివిరోధములు గానవచ్చుచుండ మీరనుకొన్నట్లు లింగము ప్రకరణమును బాధింపనేరదు. బాగుగ విచారించిన పైనిరూపించిన యుక్తుల ననుసరించి చూచిన నిచ్చటఁ గానవచ్చునది కూడ బ్రహ్మ లింగమే యగును కాని తేజోలింగము కానేరదు.

సర్వనామములు అప్రస్తుతవిషయమును పరామర్శింప వనుట నిశ్చిత మగునియమమే. "తస్యాపత్యం" అను సూత్రమునందును తచ్ఛ బ్దము అణ్ప్రత్యయమునకు నాశ్రయభూత మని మనస్సునఁ దలంపఁ బడినపితృవాచకశబ్దమును పరామర్శించు నని జెప్పవలయును కావున నిచ్చట నుండుతత్ర మొదలగుశబ్దములు కూడ "*తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః" అనుస్థలమున వర్ణింపఁబడియున్నబ్రహ్మమునే పరామర్శించును.

విషయసప్తమి నుపయోగించినంతమాత్రమున క్రొత్తయర్థమును కల్పించుప్రయాసము లేదు. "పరమేశ్వరునివిషయమున సూర్యుఁడు ప్రకాశింపఁడు. పరమేశ్వరుని సూర్యుఁడు ప్రకాశింపఁజేయ లేఁడు" అను

---

* తచ్ఛుభ్రవాక్యము:—తత్=ప్రసిద్ధమైనదియును, శుభ్రం=నిర్మలమైనదియును, జ్యోతిషాం=ప్రకాశములకెల్ల, జ్యోతిః=ప్రకాశమైనదియు, ఆయుః=ఆయుస్స్వరూపమైనదియు, అమృతం=మోక్షరూపమైనదియు నగు బ్రహ్మమును ఉపాసతే=ఉపాసించుచున్నారు. ఈవాక్యము "సతత్ర" అనువిషయవాక్యమునకంటె పూర్వమున నున్నది.

రెండును సమానార్థకములే. ఇందు రెండవది మొదటిదానియొక్క తాత్పర్యమును వివరించువాక్యమే. "వాఁడు నావిషయమున చెడ్డవాడు" అనిన "వాఁడు నన్ను చెరుపును" అనియే తాత్పర్యము కదా!

మఱియు విషయవాక్యమున "తస్య భాసా సర్వ మిదం విభాతి" అని చెప్పఁబడియుండుటచే నిది పరమేశ్వరునిగూర్చియే చెప్పుచున్నది యని స్పష్ట మగుచున్నది. ఒక తేజస్సు మఱియొక తేజస్సును తిరస్కరించును కాని ప్రకాశింపఁజేయదనియు, పరమేశ్వరుఁడు మాత్ర మట్లు కాదనియు నిదివరకే నిరూపించియున్నాము. "తస్య" అను మొదలగు వాక్యభాగమునకు "పరమేశ్వరుని తేజస్సు సర్వపదార్థములయందు నున్నది" అని యర్థము. ఇదియు పరమేశ్వరునకే సంభవించునుగాని సామాన్య తేజస్సునకు సంభవింపదు. ఇదియు ముందే వివరింపఁబడి యున్నది. ఈయనను ప్రకాశింపఁజేయువాఁడు మఱియొక్కఁడు లేఁడు. సర్వసాక్షి నెవ్వఁడు చూడఁగలఁడు? (ఈవిషయమును చూడుడు ౧-౩-౧౮.) ఇదియు "అగృహ్యో న హి గృహ్యతే" "సర్వము నెఱుంగువాఁడు దేనికిని గోచరుఁడు కానేరఁడు. ఇట్టివాని నెవ్వఁడు గ్రహించును" అను వాక్యమున శ్రుతిచే వర్ణింపఁబడినది. ఇదియునుఁ గాక సత్త (కలిమి) యనునది యాత్మకు స్వరూపము. ఆకలిమిచేతనే యన్నియుఁ బ్రకాశించుచున్నవి యనుట నిస్సంశయము. శ్రుతియందుఁ గలసర్వశబ్దము సూర్యాదివాచకమునూత్రమే యగుననుటయు నీకారణమువలన యుక్తము కానేరదు. వాస్తవస్థితిలోఁ గూడ దానికి నిరర్థకముగ * సంకోచము తగదు కదా! కావున నెట్లు చూచినను ఈవిషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## ౨౬. అపి చ స్మర్యతే. ౧. ౩. ౨౩.

తాత్పర్యము:—ఈవిషయము స్మృతియందుఁగూడ స్పష్టముగ నున్నది.

"న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" "ఓయర్జునా నాదివ్య తేజమును, లేక, స్థానమును సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపఁజేయఁజాలరు. దాని

---

* సంకోచ మనఁగా: ఉన్నదానిలో కొంచెము తగ్గిపోవుట.

 

నాశ్రయించినవారు మఱలి రారు" అనియు, "య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽఖిలం, య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకం" "సూర్యచంద్రాగ్నులయందు నిలిచి యేతేజస్సు సర్వ ప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నదో అది నా తేజస్సే యని తెలిసికొనుము" అనియు శ్రీకృష్ణుఁ డర్జునున కుపదేశించియున్నాఁడు. ఈ వాక్యములయందు "నేను" అనుశబ్దముచే నాత్మయే వర్ణింపఁబడెను. యథార్థస్థితిలో సర్వము నాత్మయే కావున నందఱు నిట్లుపదేశింపవచ్చును. ఇంతమాత్రమున "శ్రీకృష్ణుఁడే పరమాత్ముఁడు. ఆయన తన దేహమును గూర్చి కాని, తనకు మూలభూతుఁ డగు విష్ణువునుగూర్చి కాని,యాపద మును ('నేను' అనుపదమును) ప్రయోగించియున్నాఁడు" అని వాదింప నక్కఱ లేదు. ఈవిషయము "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్ (౧. ౧. 3౦.చూడు)" అనుసూత్రమున వివరింపఁబడియున్నది.

---

## ౭. ప్రమితాధికరణము.

విషయము:—"అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతి రి వాధూమకః ఈశానో భూతభవ్యస్య ఏ వాద్య స ఉ శ్వ ఏత ద్వై తత్" "అంగుష్ఠమాత్రుఁ డగుపురుషుఁ డాత్మమధ్యమున నున్నాఁడు అంగుష్ఠమాత్రుఁ డగుపురుషుఁడు పొగ లేనిమంటవలె ప్రకాశించుచున్నాఁడు. ఆతఁడే గడచినదానికిని రాఁబోవు దానికిని గూడ నధిపతియై యిప్పటికిని రేపటికిని (అనఁగా: సర్వకాలము నందు) ఏకరూపముతోనే యున్నాఁడు ఈతఁడే నీవు ప్రశ్నించినవాఁడు" అనువాక్యములు కఠోపనిషత్తున నున్నవి. అవియే ప్రస్తుతాధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"పైయధికరణమున స్మృత్యాదులబలము నాశ్ర యించి తత్రశబ్దమునం దున్నది విషయసప్తమియే యనియు, ఆవిషయ సప్తమి నాశ్రయించి, యచ్చట చెప్పఁబడినది బ్రహ్మమే యనియు సిద్ధాం తము చేయఁబడియున్నది. ఇచ్చటకూడ అంగుష్ఠమాత్రశ్రుతి కలదు. పరమేశ్వరునకు, పరిమాణము చెప్పుట సంభవింపదు. కావున నీయం

గుష్ఠశ్రుతి నాశ్రయించి ఈవిషయవాక్యమున జీవుఁడే చెప్పఁబడె నని సిద్ధాంతము చేయవలయును." అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడినది. ఈయాక్షేపము దృష్టాంతము నాశ్రయించి వచ్చెను కావున నీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతరూప మైనదియే.

సందేహము:—ఇచ్చట పరిమాణమును చెప్పునంగుష్ఠమాత్రశ్రుతియు సర్వలోకప్రభుత్వమును చెప్పునీశానశ్రుతియు నుండుట సంశయకారణము. "ఇచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడు. బ్రహ్మము." అనునవి పూర్వపక్షసిద్ధాంతములు. పూర్వపక్షమునకు జీవోపాసనయు, సిద్ధాంతమునకు జీవబ్రహ్మాభేదజ్ఞానంబును ఫలములు.

పూర్వపక్షము:— ఇచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడనియే చెప్పుట యుక్తము. బ్రహ్మమే చెప్పఁబడె ననిన నంగుష్ఠమాత్రశ్రుతి విరుద్ధ మగును. "జీవుఁడే చెప్పఁబడెను. అనిన నీశానశ్రుతి విరుద్ధ మగును కదా!" అనియెదవేమొ? అది సత్యమే. రెండుపక్షములయందును ఒకశ్రుతిని ప్రధానము చేసి మఱియొకశ్రుతిని అప్రధానము గావించుట యావశ్యకమైయే యున్నది. అయినను మీపక్షమునకంటె మా పక్షము యుక్త మగును. అంగుష్ఠమాత్రశ్రుతి మొదటి దగుటచే దాని నాశ్రయించి రెండవదానిని యథాసంభవముగ సమన్వయించుట యుక్తము కదా! నిష్కారణముగ మొదటిదాని నేల యతిక్రమింప వలయును? జీవుఁడును వానికి తగినంతవరకు లోకములకు నధీశ్వరుఁడే.

మఱియు నంగుష్ఠపరిమాణము పరమేశ్వరునకు సంభవింపదనుటలో వివాదము లేదు. జీవునకు నది కల దనుటయు నట్టిదియే. "అథ సత్యవతః కాయాత్పాశబద్ధం వశం గతం, అంగుష్ఠమాత్రం పురుషం నిశ్చకర్ష యమో బలాత్" "పిదప యమధర్మరాజు అంగుష్ఠమాత్రుఁడును కాలపాశముచే బంధింపఁబడి స్వాధీన మైనవాఁడు నగుజీవుని సత్యవంతునిశరీరమునుండి వెలికి నీడ్చెను." అనుస్మృతియు నీవిషయమును స్పష్టము చేయుచున్నది. యముఁడు పరమేశ్వరు నీడ్వనేరఁడు కదా!

మఱియు మనుష్యుల హృదయకమలము అంగుష్ఠమాత్రము. మనస్సు సామాన్యముగ నచ్చటనే యున్నది. అదియే జీవోపాధి.

కావున నాప్రదేశము ననుసరించి జీవునకు నాప్రమాణము కలుగ వచ్చును.

"బ్రహ్మమునకుకూడ నిట్లు అంగుష్ఠప్రమాణము కలుగుటలో సంశయము లేదు. 'మధ్య ఆత్మని తిష్ఠతి' అని శ్రుతియు నీవిషయమును స్పష్టము చేయుచున్నది" అనియెదవేమొ? అది యుక్తము కాదు. ఉపాసనార్థమై యాపరమేశ్వరునిహృదయమున నున్నట్లు చెప్పినచో నట్టిపరిమాణము సంభవింపవచ్చును; కాని యిచ్చట నట్లు చెప్పఁబడ లేదు. ఆత్మశబ్దమునకు స్వభావంబును జీవపరమేశ్వరులును అర్థము. ఇందు జీవపరమేశ్వరులకు మధ్య మనునదియే లేదుకదా! ఇఁక స్వభావమునకు మధ్యము కలదేమో యనిన నది సంభవింపదు. స్వభావము గుణము: కావున నెవ్వనినైన నాశ్రయించియే యుండవలయును. అట్టివానికి మధ్య ముండుట తటస్థించినను ఇచ్చట వాఁడు నిర్దేశింపఁబడ లేదు కదా!

"ఏత ద్వై తత్" అనువాక్యభాగము పూర్వ మొనర్పఁబడి యున్న పరమేశ్వరప్రశ్నమునకు నుత్తర మగుచున్నది. కావున నిచ్చట వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే కావలయును" అనియెదవేమొ? ఇంతమాత్రమునకు నీసిద్ధాంతము నిలువదు. ఆవాక్యభాగము ప్రస్తుతము వర్ణింపఁబడియున్నజీవునే పరామర్శింపవచ్చునుకదా! కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడే.

అవతారిక:—అనుపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౨౪. శబ్దాదేవ ప్రమితః. ౧. ౩. ౨౪.

తాత్పర్యము:—ఈవిషయవాక్యమున చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యని ఈశానశ్రుతివలన నిర్ణయింపవలయును.

సిద్ధాంతము:—ఆశ్రుతియందుఁ గలభూతభవ్యశబ్దములు గడచిపోయినట్టియు, రాఁబోవునట్టియు, తాత్పర్యప్రభావమువలన వర్తమానకాలమున నున్న సర్వప్రపంచమును చెప్పుచున్నవి. "ఇట్లు చెప్పుట లేదు" అనుటకుఁ బ్రమాణ మెద్దియుఁ గానరాదు. "అంగుష్ఠమాత్రశ్రుతి జీవుని చెప్పుచున్నది యనుటయే దానికిఁ బ్రమాణము" అనిన నది సరిపడదు. ఆవిషయము ఇప్పటికిని విచారణీయముగనే యున్నది కదా!

అట్టిదానిని మఱియొకదానికిఁ గారణముగఁ జెప్పుటకు వీలు యెట్లు కలుగును? కావున భూతభవ్యశబ్దములయర్థమును సంకోచించుటకు నవకాశము లేదు; "జీవుఁడే సర్వలోకనాయకుఁడు" అనుటకును వీలు లేదు. కావున నిచ్చట చెప్పఁబడిన యంగుష్ఠమాత్రుఁడు పరమేశ్వరుఁడే.

మఱియు నీయుపనిషత్తునందు ఆరంభమునుండియు ప్రశ్నోత్తరములు నడచుచున్నవి. దీనికిఁ గూడ పూర్వమున "అన్యత్ర ధర్మాత్ (౧. ౨. ౧౦. చూడు.)" అనుప్రశ్న కలదు. కావున ప్రస్తుతవిషయవాక్యమునందలి "ఏతద్వై తత్" అనువాక్యభాగము ఆప్రశ్నమునకే యుత్తరమును చెప్పునది కావలయును; "ఈయంగుష్ఠమాత్రుఁడే సర్వేశ్వరుఁడు. ఈతఁడే బ్రహ్మము" అనునర్థమును చెప్పునదియే కావలయును. పూర్వోత్తరసందర్భమంతయు నట్టిదియే యైయుండ, ప్రశ్నంబును బ్రహ్మవిషయముగానే యుండ నడుమ జీవపరామర్శ వచ్చె ననుట యెట్లు? కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౩. సూ ౨౫. ఆరంభము.

అవతారిక:—"అయినను అంగుష్ఠమాత్రశ్రుతిని సమన్వయించుటకు నెట్లును వీలు లేదు. సర్వగతుఁడగుపరమేశ్వరునకు పరిమాణమును చెప్పుట సంభవింప దని యిదివరకే వివరించియున్నాము" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౫. హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్. ౧. ౩. ౨౫.

తాత్పర్యము:—శాస్త్రము సర్వసామాన్యముగ సర్వవిషయముల బోధించుచున్నను, దానికి మనుష్యుఁడే యధికారి, శాస్త్రోక్తమగు ఫలము నభిలషించుటకును, శాస్త్రోక్తకార్యముల నాచరించుటకును వానికే కదా సామర్థ్యము కలదు! అందును ఉపనయనాదిసంస్కారములు కలవార లగుటచే బ్రహ్మక్షత్రియవైశ్యులే యధికారు లని పూర్వమీమాంసశాస్త్రకారుఁడు నిరూపించియున్నాఁడు.

అది యట్లుండె. ప్రకృతము వేదాంతశాస్త్రమునందుఁగూడ మనుష్యులకే యధికారము కావున వారిహృదయకమలము నాశ్రయించి పర

మేశ్వరునకు నంగుష్ఠపరిమాణము చెప్పఁబడినది మనుష్యశరీరము తొంబదియాఱంగుళములప్రమాణము కలది యనియు నందు హృదయకమలము అంగుళప్రమాణము కలది యనియు ప్రసిద్ధము. అందు నిలచి యుండుటచేఁ బరమేశ్వరుఁడు కూడ నంగుళప్రమాణము కలవాఁడగును. ఆకాశము సర్వగతమైనను ఉపాధిసంబంధమువలన "జానెడు, మూరెడు" అను భేదములు (పరిమాణములు) దానికి వచ్చునట్లు బ్రహ్మమునకుఁ గూడ రావచ్చును. "ఇది జానెడుసందు మూరెడుసందు" అను మొదలగువ్యవహారములు ఆకాశపరిమాణవాచకములై ప్రవర్తించుచున్నవి కదా! కావున పరమేశ్వరునకు పరిమాణము చెప్పుట దోషము కానేరదు.

"మధ్య ఆత్మని తిష్ఠతి" అనుశ్రుతిభాగ మీవిషయమును స్పష్టము చేయుచున్నది. "ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని" "ఆత్మన్శబ్దము జీవునియందును, ధైర్యమునందును, దేహమునందును, స్వభావమునందును, పరమాత్మునియందును వర్తించును." అను కోశమువలన నాత్మన్శబ్దమునకు దేహమనికూడ నర్థము కలదు. కావున "మధ్య ఆత్మని" అనఁగా "దేహమధ్యమగుహృదయమున" నని యర్థము చెప్పవచ్చును కదా! కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

మఱియొకవిశేషము. ఇచ్చట "స ఆత్మా తత్త్వమసి" అనుమొదలగుశ్రుతులయందువలె జీవబ్రహ్మలకు నభేదము చెప్పఁబడియున్నది. * నాచికేతుఁడు "బ్రహ్మ మెట్టిది" అని యముని ప్రశ్నింపఁగా నాతఁడు "జీవుఁడే బ్రహ్మము" అని నిరూపించెను. ఈవిషయము "అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వాచ్ఛరీరాత్ప్రవృహే న్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్రమమృతం" "అంగుష్ఠమాత్రుఁడగుజీవుఁడు సర్వభూతములయొక్కయు హృదయమున నున్నాఁడు. వివేకవంతుఁడగుపురుషుఁడు తనశరీరము నుండి యాజీవుని వివేకదృష్టిచే నుద్ధరింపవలయును. ముంజగడ్డినుండి పొరల తొలఁగించి లోపలనున్న పుడకను వెలుపలికి తీయునట్లు దేహేంద్రియాదులనుండి జీవుని విభాగింపవలయును. ఇట్లు విభాగింపఁబడిన

---

* నాచికేతుఁడు. (పుట. ౧౪౭, చూడుము.)

జీవునే పరమేశ్వరునిగా నెఱుంగవలయును" అనువాక్యముచే శ్రుతియందు స్పష్టము చేయఁబడి యున్నది. ఈకారణమువలన నంగుష్ఠమాత్రశ్రుతి జీవునిఁ జెప్పుటవలన విరోధము లేదు. ఆశ్రుతి జీవుని చెప్పినను పరమేశ్వరుని చెప్పినదియే. జీవుని ప్రస్తావింపక జీవబ్రహ్మైక్యము నుపదేశించుటకు నవకాశమే లేదు కదా! కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

వేదాంతవాక్యములు సాధారణముగ రెండువిధములై యున్నవి. కొన్ని బ్రహ్మస్వరూపమును మాత్రమే బోధించును. మఱికొన్ని జీవస్వరూపమును చెప్పి, వానిపరమార్థస్వరూపమును పరబ్రహ్మమునుగా వివరించును. అందు మొదటివి జీవుని వ్యావహారికస్వరూపమునుగూర్చి చెప్పుచు లోకోద్ధరణమునకై ప్రసిద్ధమగు జీవబ్రహ్మాభేదము ననువాదము చేయును; తక్కినవి జీవునిపరమార్థస్వరూపమును వర్ణింపుచు జీవబ్రహ్మైక్యము నుపదేశించును. ఇందు ప్రస్తుతవిషయవాక్యము రెండవతరగతియందు జేరినది యని తెలిసికొనవలయును.



## ౮. దేవతాధికరణము.

విషయము:—"త ద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ త దభవత్" "దేవతలలో నెవ్వఁడెవ్వఁడు బ్రహ్మము నెఱింగెనో వాఁడు బ్రహ్మమే యయ్యెను" అని బృహదారణ్యకమున నొకవాక్యము కలదు. దీని నాశ్రయించి "దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారము కలదా లేదా?" యనువిషయ మిందు విచారింపఁబడును. ఇచ్చట ప్రత్యక్షదేవతలకు బ్రహ్మవిద్యాధికారము చెప్పఁబడుట లేదనియు, ఉపాసనల నొనర్చి దేవత్వమును చెందినవారలకుమాత్రమే బ్రహ్మవిద్యాధికారము చెప్పఁబడుచున్నదనియు తెలిసికొనవలయును.

సంగతి:—పూర్వాధికరణమున "హృద్యపేక్షయా." అనుసూత్రమున "శాస్త్రము" మనుష్యులను గూర్చియే చెప్పును. శాస్త్రోక్తవిషయములయందు మనుష్యులకుమాత్రమే యధికారము కలదు." అని చెప్పఁబడియున్నది. ఆప్రస్తావమువలన నిప్పుడు "దేవతలకు అధి

కారము కలదా లేదా" అనువిషయము విచారింపఁబడుచున్నది. కావున నీరెండధికరణములకును ప్రస్తావమే సంబంధము.

మఱియు పూర్వము మనుష్యులకు తప్ప మఱి యెవ్వరికిని పురుషార్థసాధనమున నధికారము లేదని చెప్పఁబడియున్నది. కావున నుపాసనల నొనర్చి దేవత్వము నొందినవారలు ముక్తిని జెందుటకు వీలు లేదు" అని యాక్షేపము రాఁగా దానిని నివారించుటకై ఈయధికరణ మారంభింపఁబడినది. కావున నీరెంటికిని ఆక్షేపమే సంబంధము.

ఇచ్చట, * మంత్రములు * అర్థవాదములు మొదలగునవి ప్రమాణములే యనియు వానియర్థమును గ్రహించుటవలన విరోధము రాదనియు నిరూపింపఁబడును. పూర్వమీమాంసశాస్త్రమున నీమంత్రాదులు ప్రమాణములు కావని నిరూపింపఁబడియున్నది. అది యిచ్చట సయుక్తికముగ ఖండింపఁబడును. వానియర్థము దేవతాదులయందు సమన్వయింపఁబడును. అవి దేవతలకుఁ గలరూపమును గూర్చి చెప్పునని నిర్ణయింపఁబడును. కావున నీయధికరణమును సమన్వయాధ్యాయమునఁ జేర్చిరి. మంత్రాదులును శ్రుతులే కావున నీయధికరణమునకు శ్రుతిసంబంధము కూడఁ గలదు. దేవాదులకు పురుషార్థాధికారమును నిరూపించుటచే, నుపాసనాబలమున దేవభావము నొందినవారలకుఁ గూడ మోక్షమున నధికార మేర్పడును కదా! దీనివలన నుపాసనాధికారులను గూర్చి చెప్పు శ్రుతివాక్యములును జీవబ్రహ్మైక్యమును బోధించుమహావాక్యములును కూడ సార్థకము లగును. ఇట్లగుటచే నీయధికరణమునఁ బరంపరగా నిర్గుణబ్రహ్మము బోధించినట్లే యగును. కావున దీని నీమూఁడవపాదమునందుఁ జేర్చియున్నారు. ఇట్లు ఈయధికరణమునకును శాస్త్రమునకును గలసంబంధము నెఱుంగవలయును.

సందేహము:—ఇచ్చట జైమినిమతానుసారముగఁ బూర్వాధికరణాంతమున "మనుష్యులకు మాత్రమే పురుషార్థసాధనమున నధికారము కలదు" అని యంగీకరించియుండుటయు, దేవతలకు నట్టియధికారము లేకుండిన నుపాసకులకు తగినగతి (క్రమముక్తి) లేకపోవలసి

* మంత్రములనఁగా విధింపబడినకర్మలను చేయుటయందు ఉపయోగింపఁబడునవి. అవి క్రియలఁ జేయవలసినతెఱంగును ప్రకటించును.

* అర్థవాదములు (పు. ౧౨౫. చూడు.)

వచ్చుటయు, అది వేదాంతమతమునకు విరుద్ధ మగుటయు, సంశయ కారణములు. "దేవతలకు పురుషార్థాధికారము లేదు. కలదు" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. అందు బూర్వపక్షమునకు "దేవతలకుఁ బురుషార్థాధికారము లేకున్న జైమినిమతానుసారముగ మంత్రాదులప్రమాణములే యగును. అప్పుడు "తత్త్వమసి" అనుమొదలగు మహావాక్యములుకూడ వారిమతమున నర్థవాదములే యగుటచే నప్రమాణములే యగును. కావున జీవబ్రహ్మైక్యము లేదు" అనుట ఫలము. సిద్ధాంతమునకు "దేవతలకుఁ గూడ నధికారము కలదు కావున మంత్రాదులును "తత్త్వమసి" అనుమొదలగు మహావాక్యములునుగూడఁ బ్రమాణములే; జీవబ్రహ్మైక్యము కూడ నిస్సంశయముగఁ గలదు.అనునది ఫలము.

పూర్వపక్షము :—పురుషార్థము లగుధర్మార్థకామమోక్షముల సాధించుటయందు దేవతలకు నధికారము లేదు. ఈవిషయమును మీరే పూర్వాధికరణాంతమున నంగీకరించియున్నారు కదా! ఇట్లగుటచే మీరు జైమినిమతమునే యంగీకరించినట్లైనది.

అవతారిక:—అనిన నట్లు కాదని నిరూపించుచున్నాఁడు.

## ౨౬. తదుపర్యపి బాదరాయణః సంభవాత్. ౧. ౩. ౨౬.

తాత్పర్యము:—జైమినిమతమున దేవతలకు పురుషార్థాధికారము లేదనుట నిశ్చయమే కాని వ్యాసమతమునమాత్ర మట్టి యధికారము కలదు. జైమినిమతమున నది సంభవించుటకును వీలు లేదు; కాని వ్యాసమతమున నది (దేవతలకుఁ బురుషార్థాధికారము) సంభవింపవచ్చును.

సిద్ధాంతము:—జైమిని స్వర్గరూపమగు నాకానాకసుఖమునే పరమపురుషార్థముగ నుపన్యసించియున్నాఁడు. దేవతలు అతివిచిత్రములగుసుఖముల ననుభవించుచునే యున్నవారు కావున వారలకు నాస్వర్గరూపసుఖముపై నభిలాష జనించుటకు నవకాశము లేదు. తన కున్నదానికంటె నధికమగు సుఖమునే కాని పురుషుఁ డపేక్షింపఁడు కదా!

ఈకారణమువలన నామతమునందు దేవతలకుఁ బురుషార్థాధికారము సంభవింపదు.

వ్యాసమహాముని యన్ననో:—నిత్యంబును, నిర్వికల్పంబును, నిరతిశయానందస్వరూపంబు నగుబ్రహ్మమును చెంది తద్రూపముతో నిలుచుటయే పరమపురుషార్థమని చెప్పియున్నాఁడు. ఇది సర్వసంసార దుఃఖనివారక మగుటచేఁ బరమసుఖకరమని వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదుకదా! ఈకారణమువలన దేవతలుకూడ దీనిని కోరవచ్చును. వారు ఎంతసుఖము ననుభవించుచున్నను అది యనిత్యము. స్వర్గాదిలోకములయందును తారతమ్యములు కల వనుట సుప్రసిద్ధమైయున్నది. పునరావృత్తియు కల దనుట స్పష్టమైయున్నది. ఇట్లగుటచేఁ దమస్థితిని విచారించి వైరాగ్యము నొంది దేవతలుకూడ శాశ్వతానందమగు మోక్షమును కోరుదు రనుటలో సంశయ మేమి? మఱియు వా రనుభవించుచున్నయానందము పదార్థములనుండి కలిగినది యగుటచేఁ బరిచ్ఛిన్నము; ఆత్మానందము సర్వపరిపూర్ణ మగుటచే నపరిచ్ఛిన్నము అనంతము. ఇట్టిది సాంసారికభోగములను మనుష్యాదులకంటె కొంత యధికముగ ననుభవించుచున్నా రనునింతమాత్రమువలన, దేవతలకు నభ్యర్థనీయము కాకపోవునా? కావున నీదేవతలకు జైమినిమతరీతిగా "అర్థిత్వము=ఫలము నభిలషించుట"అను *నధికారలక్షణము సంభవింపకున్నను వ్యాసమతానుసారముగ సంభవించు ననుటలో సంశయము లేదు

మఱియు జైమినిమంత్రములు, అర్థవాదములు, ఇతిహాసపురాణాదులు లోకప్రసిద్ధి యనునన్నియుఁగూడ "దేవతలకు రూపము కలదు" అని చెప్పుచున్నను వాని నన్నిటి నప్రమాణములని తలంచియున్నాఁడు. "దేవతలకు రూప ముండిన ననేకస్థలములయందు జరుగుచున్న యజ్ఞాదులయొద్దకు నొక్క మాఱే వచ్చుట సంభవింపదు. కావున వారికి రూపము లేదు" అని సిద్ధాంతము చేసియున్నాఁడు. కారణమువలన దేవతలకు జ్ఞానమే లేకపోవును. ఇంద్రియాదులు కల

---

*అధికారిలక్షణము:—ఫలమును అత్యాసక్తితో కోరుట, ఆఫలమును సాధించుటకుఁ దగినసామర్థ్య ముండుట, ఉపనయనాదిసంస్కారములు కలిగియుండుట, నిషేధింపఁబడకుండుట యనునవి యధికారిలక్షణములు.

వారలే కదా *ప్రత్యక్షానుమానాదులచేఁ బదార్థములఁ గ్రహింపఁ గలుగుదురు! ఈదేవతలు శూన్యప్రాయులే కావున వారికి జ్ఞానాజ్ఞానములలో నేదియు సంభవింపనేరదు. ఇట్లగుటచే ఆమతమున దేవతలకు శక్తి యుండుటకు వీలు లేదు.మఱియు నామతమున"కేవలకర్మాచరణమే సర్వపురుషార్థసాధనము"అని సిద్ధాంత మగుటచే, నావిషయమున దేవతలకు బొత్తిగనే ప్రచారము సంభవింపదు.

వ్యాసమతమున నన్ననో మంత్రాదులన్నియుఁ బ్రమాణములే. కావున దేవతలకు దేహేంద్రియాదులు కలవు. దేహాదులు కలవారు మనుష్యులవలెనే సర్వకార్యముల నాచరింపవచ్చును. సర్వసంకల్పములఁ జేయవచ్చును కదా! ఈకారణమువలన వారికి "శక్తత్వము= సామర్థ్యము" అనునధికారిలక్షణము కూడ సంభవించును. మఱియు కర్మాధికారము లేకపోయినంతమాత్రమున మోక్షాధికారము లేకపోవలయు ననునియమముకూడ లేదు. ఒకకల్పమున నున్నయింద్రాదులు తమయధికారము ముగిసిపోవఁగానే మఱియొకస్థలమును చేరుదురు. భృగువు మొదలగు దేవర్షులును తమయధికారము చెల్లఁగనే మఱియొకస్థలమును చేరుచుందురు. కావున నింద్రునకు మఱియొకయింద్రుఁడు లేఁడు. ఇట్లగుటచే నాయింద్రునకు కర్మ నాచరించుటకు వీలు లేదు. తానే యింద్రుఁడై యుండ నెవ్వనిని గూర్చి యజ్ఞాదుల నాచరించును? బ్రహ్మవిద్యయం దన్ననో ఇట్టివిరోధము లేదు. బ్రహ్మము ఇంద్రాదులకంటె భిన్నుఁడే కదా! ఈకారణమువలన కర్మలయం దధికారము లేకున్నను మోక్షమునందుమాత్ర మధికార ముండవచ్చును.

ఇదియునుగాక జైమిని ఉపనయనాదిసంస్కారములు గలవారికే కర్మలయం దధికార మని చెప్పియున్నాఁడు. ఈకారణమువలననే శూద్రులకు కర్మాధికారమును నిరాకరించి యున్నాఁడు. వేదముల నభ్యసించుటకే యుపనయనసంస్కారము ఆచరింపఁబడుచున్నది యని యంగీకరించుచున్నాఁడు. వేదమును గురుముఖముగ నభ్యసించిననే కాని ప్రయోజనము లేదనుచున్నాఁడు.స్వయముగ వేదార్థము నెఱుంగఁగలసామర్థ్యమున్నను గురూపదేశము నొందకున్న నర్థజ్ఞానము కూడ నిష్ఫలమే యను

*ప్రత్యక్షాదిప్రమాణములు. (పు. ౩౯. చూడు.)

చున్నాఁడు. దేవలకు నిట్టివేదాధ్యయనము సంభవింపదు కావున వార లకు నధికారిత్వము ఆమతమున సంభవింపదు.

వ్యాసమతమునం దన్ననో ఇట్లు కాదు. ఆమతమునఁ గూడ నుపనయనాదిసంస్కారము లంగీకరింపఁబడినను అవి వేదాభ్యాసము నకై మాత్రమే యాచరింపఁబడుచుండుటవలన నంతప్రధానములు కావు. అవి యున్నవారికి మాత్రమే మోక్షాధికారము కలుగవలయు ననునియమము లేదు. మఱియు వేదార్థజ్ఞానము మాత్రమే కావల యును; కాని యది గురుముఖమునుండి మాత్రమే రావలయు నను నియ మము లేదు. ఎట్లయినను సమగ్రముగ వేదార్థము నెఱింగిన నంతియె చాలును. బ్రహ్మస్వరూపము నెఱింగిన నంతియె చాలును. కావున నిట్టి వేదార్థజ్ఞానము దేవతలకుఁ గూడఁ గలదు. వారు గురుముఖముగ నధ్య యనమును చేసినను చేయకున్నను, సత్త్వాధికుఁ డగుటచే జన్మాంతరా భ్యస్తవేదమును స్మరింపఁగలుగుదురు. ఇట్లగుటచేతనే వారు పుట్టినప్ప టినుండియే సర్వజ్ఞు లగుచున్నారు. ఇట్లగుటచే వారికి బ్రహ్మస్వరూప జ్ఞానంబును దానిమూలమున మోక్షాధికారంబును గలుగును. మఱియు "ఏకశతం హవై మఘవా ప్రజాపతౌ బ్రహ్మచర్య మువాస" "ఇంద్రుఁడు బ్రహ్మవిద్యార్థియై ప్రజాపతికడ నూటొక్క సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతముతో నుండెను" అనియు "భృగు ర్వై వారుణిః వరుణం పితర ముపససార అధీహి భగవో బ్రహ్మేతి" "వరుణునిపుత్త్రుఁ డగుభృగువు 'ఓభగవంతుఁడా! నాకు బ్రహ్మము నుపదేశింపుము. వేదార్థమును దెల్పుము' అనుచు తండ్రి యగువరుణునికడకుఁ బోయెను." అనియును, శ్రుతులు దేవతలకుఁ గూడ వేదాధ్యయనమును గురుసేవను చెప్పు చున్నవి. కావున నెట్లు చూచినను వ్యాసమతమున దేవతలకుఁ గూడ మోక్షపురుషార్థమును సాధించుటయం దధికారము సంభవించును. ఈకారణమువలననే వ్యాసాచార్యుఁడు మనుష్యులకంటె పైవారికిఁ గూడ నధికారము కల దనుచున్నాఁడు. దేవశరీరప్రమాణమునకు మితి లేకున్నను, వారిహృదయకమలము కూడ వారియంగుష్ఠమంతప్రమా ణము కలది యగుటచే నిప్పుడు కూడ "అంగుష్ఠమాత్రః" అనుశ్రుతి పరమేశ్వరునియందు సమన్వయము కావచ్చును.

# అ ౧. పా ౩. సూ ౨౭. ఆరంభము.

పూర్వపక్షము:—ఇది సరి కాదు. మంత్రార్థవాదాదుల * నుప చారమాత్రములనుగాఁ జెప్పవలయును ; కాని యథార్థవాదములనుగా నంగీకరింపఁగూడదు. అట్లంగీకరించిన నితరప్రమాణములకు విరోధము వచ్చును. దేవతలకు దేహాదు లుండుటచే బ్రహ్మవిద్యయం దధికారము. కలుగవచ్చు ననిన యజ్ఞాదికర్మలయందుఁ గూడ వారు తమస్వరూపము లతో సాన్నిధ్యము చేయవలసివచ్చును. ఇది ప్రత్యక్షమున నెచ్చటను లేదు. అట్లుండుటకును వీలు లేదు. అప్పుడు అనేకస్థలములయందు ఒక్కమాఱే యారంభింపఁబడిన యజ్ఞములయందు పిలువఁబడిన దేవత యెన్నిచోట్లకు నొక్కమాఱే పోవలసివచ్చును. ఇది ప్రత్యక్షవిరుద్ధము కదా! కావున జైమినిమతానుసారముగ "మంత్రాదులు ఔపచారిక ములు. ఇంద్రాదిశబ్దములచే తెలుపఁబడినయర్థము కాని నియతార్థము కలయింద్రాదిశబ్దస్వరూపము గాని దేవత" అని యంగీకరింపవలయును. అప్పుడు దేవత యచేతనరూపిణి యగుటచే దానికి నెట్టియధికారమును సంభవింపదు. ఇది వ్యాసమతమునకు విరుద్ధము కదా!

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౬౦. విరోధః కర్మణీతి చేన్నానేకప్రతిపత్తే ర్దర్శనాత్. ౧. ౩. ౨౭.

తాత్పర్యము. సిద్ధాంతము:—మాసిద్ధాంతమువలన యజ్ఞాది క్రియలయందు వచ్చువిరోధ మేమియు లేదు. ఒక్కఁడే అనేకరూప ములఁ జెందవచ్చు ననియు, కాకున్నను యాగ మనునది దేవతార్థముగ ద్రవ్యములఁ బరిత్యజించుటయే యగుటచేత, నొక్కనిగూర్చియే యనే కులు తమద్రవ్యములను పరిత్యజింపవచ్చుననియు, లోకవేదములు స్పష్టము చేయుచునే యున్నవి. ఇట్లగుటచే నొకపక్షమున దేవతలు రూపము కలవారే యైనను నిత్యసిద్ధు లగుటచే యోగులవలెఁ దమ దేహముల నొక్కమాఱే యనేకరూపములఁ గావించి యనేకస్థలము

*ఉపచార మనఁగా: వాస్తవముగ సంభవింపనిధర్మమును ఏదియో యొకక్లిష్టకార ణము నాశ్రయించి యొకదానిపై నారోపించుట.

లకుఁ బోవచ్చును; రెండవపక్షమున వారు తమస్థానమునందే కదల కున్నను యజ్ఞకర్తలు వారి నుద్దేశించి తమతమద్రవ్యములఁ బరిత్యజింప వచ్చును.

బృహదారణ్యకోపనిషత్తునందు మూఁడవయధ్యాయమున తొమ్మి దవబ్రాహ్మణమున శాకల్యమహాముని యాజ్ఞవల్క్యుని "కతి దేవాః= దేవత లెందఱు" అని ప్రశ్నఁ జేయఁగా నాతఁడు మొట్టమొదట "వారు ముప్పదిమూఁడునూర్లు ముప్పదిమూఁడువేలు" అని చెప్పి, పిదప ప్ర శ్నానుసారముగ "వీరందఱును ముప్పదిముగ్గురు దేవతలయొక్క యా కారభేదములే" అని వివరించెను. మఱియు, ఆముప్పదిముగ్గురును ఆర్గురి యొక్కయు, వారు మువ్వురియొక్కయు, వారిరువురియొక్కయు, వారొ క్కనియొక్కయు, నాకారభేదములే యని క్రమక్రమముగ వర్ణించెను. ఆశ్రుతి ననుసరించి చూచిన దేవతలకు నొక్కమాత్రే తనశరీరము ననేక రూపములఁ బరిణమింపఁజేయుసామర్థ్యము కల దని తోఁచుచున్నది. మఱియు "ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభా, యోగీ కుర్యా ద్బలం ప్రాప్య తైశ్చ సర్వై ర్మహీం చరేత్. ప్రాప్నుయా ద్విషయా న్కైశ్చి త్కైశ్చి దుగ్రం తప శ్చరేత్, సంక్షిపే చ్చ పున స్తాని సూర్యో రశ్మిగణా నివ" "ఓభరతకులశ్రేష్ఠా! యోగబలము నొంది *యష్టసిద్ధులఁ గలిగినయోగి తనదేహము ననేకములుగ నాచరింపఁ గలఁడు. వానిచే భిన్నభిన్నదేశములయందు సంచరింపఁగలఁడు. అందు కొన్నిటితో విషయభోగంబును మఱికొన్నిటితో ఘోరతపంబును కూడ నాచరింపఁగలఁడు సంకల్ప ముదయించినప్పుడు సూర్యుఁడు తనకిరణముల నుపసంహరించినట్లు వాని నన్నిటి నుపసంహరింపఁగలఁడు." అను మొద లగుస్మృతులుకూడ నీవిషయమునే స్పష్టము చేయుచున్నది. సామాన్య

---

*అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి యష్టసిద్ధులు. అందు అణిమ యనఁగా: తనశరీరమును యథేచ్ఛముగ నల్పపరిమా ణము చేయుట. మహిమ యనఁగా: దానినే స్వేచ్ఛానుసారముగ నధికపరిమాణముగఁ గావించుట. అట్లే భారముగ నాచరించుట గరిమ; తేలికగా నాచరించుట లఘిమ. సంకల్పితపదార్థముల తనయెదుటనే చూడఁగలుగుట ప్రాప్తి; ఆపదార్థము లున్న స్థలమునకు స్వయముగనే పోఁగలుగుట ప్రాకామ్యము. సర్వమును నియమించుసామ ర్థ్యము నొందుట ఈశిత్వము. ప్రపంచమంతయు లోఁబఱుచుకొనుట వశిత్వము.

లగువారికే యోగబలమువలన నిట్టిసామర్థ్యము కలుగుచుండ జన్మించి నప్పటినుండియు స్వభావముగనే సిద్ధులై యున్న దేవతలకు నీసామర్థ్య ముండు ననుటలో సంశయ మేమి? కావున దేవతలకు దేహ మున్నను కర్మాచరణమునందు విరోధము రాదు. ఇదియును గాక నొక్క దేవతను గూర్చియే యనేకు లనేకస్థలములయందు తమతమద్రవ్యములను పరిత్య జింపవచ్చు ననియు నిదివరకే నిరూపించియున్నాము. లోకమున నొక్క బ్రాహ్మణుని గూర్చియే యనేకు లనేకస్థలములనుండి నమస్కారముల నర్పించుచుండుటయు, ఒక్క ప్రభువును గూర్చియే తగినసమయముల యం దనేకు లనేకస్థలములనుండి జయశబ్దాదుల నుచ్చరించుటయు లోకానుభవసిద్ధమై యున్నది. కావున నెట్లు చూచినను దేవతలకు విగ్ర హముకల దని యంగీకరింపవచ్చును. మంత్రాదులఁ బ్రమాణములనుగాఁ గైకొనవచ్చును.

పూర్వపక్షము:—సామాన్యముగ మాతృపితృసంయోగము లేక దేహము జనింపదు. అట్లు జనించునేని నిప్పు లేకయే పొగ జనింపవల యును. దేవతలకు నట్టిసంయోగము లేదు కావున దేహ ముత్పన్నము కాఁగూడదు. సంకల్పమాత్రముననే దేహము జనించు ననుటకు వీలు లేదు. అట్టిది లోకమున నెందును లేదుకదా! ఒకవేళ వారు సిద్ధు లగుటచే పంచభూతములును స్వాధీనము లగుట సంభవించినను వారు వానిసాహాయ్యముచే దేహమును కల్పింప నేరరు. లోకమున నెవ్వఁడై నను ఎంతసామర్థ్యము గలవాఁడైనను తాను చూచికాని యేపదార్థ మునుగాని కదల్ప నేరఁడు. సంకల్పశక్తిచేఁ గాని హస్తాదులచేఁ గాని ఏపదార్థమును చలింపఁజేసినను ప్రత్యక్షముగ చూచియే చలింపఁజేయ వలయును. దేవతలు బహుదూరమున నున్నవార లగుటచేతను భూత ములు పర్వతాదులచే నాటంకపఱుపఁబడి యున్నవియగుటచేతను, వారికి నీభూతములు కానరావు కదా! కావున నెట్లును దేవతలకు దేహము నంగీకరించుట యుక్తియుక్తము కానేరదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరి కాదు. లోకమునందుఁ గూడ పేను, నల్లి మొదలగు ననేకజంతువులు మాతృపితృసంయోగము లేకయే జనించుచున్నవి. వృక్షములు కూడ నట్లే పుట్టుచున్నవి. కావున దేవ తలకుఁ గూడ నట్లే యుత్పత్తి కలుగవచ్చును. వారిశరీరములు స్వేచ్ఛవల

ననే జనించును. వారికి పంచభూతములును స్వాధీనము లగుటచే "దేహము జనింపవలయును" అనుసంకల్పము కలుగఁగానే యాభూతములు చలించి యొకదానితో నొకటి గూడి దేహము నుత్పత్తి చేయును. దేహోత్పత్తికి భూతములే *యుపాదానకారణము లనుట నిస్సంశయము కదా! లోకమునందును స్వాధీనము లగుపదార్థములు అధికారియొక్క సంకల్పమును మాత్రమే యాశ్రయించి ప్రవర్తించుట ప్రసిద్ధమై యున్నది. అచేతనము లగువిషఖండాదులును, శిలాదులును తమకు సంబంధించినవిద్య నెఱింగిన వానిసంకల్పము నాశ్రయించి ప్రవర్తించుచున్నవి. అవి వానిసంకల్పము నాశ్రయించి యెచటికి పొమ్మనిన నచటికి పోవుచుండును. శిలాప్రయోగాదులయందు ఈవిషయమును స్పష్టముగ దెలియవచ్చుచున్నది కదా! ఇట్లే నిత్యసిద్ధు లగు దేవతలసంకల్పమువలన కూడ నాపంచభూతములు చలించి యభిమతకార్యము నాచరింపవచ్చును. మఱియు "వారికి భూతములు కానరావు కదా!" యన నక్కఱ లేదు. ఒకపక్షమున భూతములు సర్వవ్యాపకములు. రెండవపక్షమున అద్దము మొదలగునవి వేయుటవలన మన దృష్టికి నాటంకి మెట్లు లేదో అట్లే దేవతలదృష్టికిని పర్వతాదులవలన నాటంకము లేదు. అది యోగమయ దృష్టి యగుటచే ప్రతిపదార్థమును నిరభ్యంతరముగ ప్రవేశింపఁగలదు. సామాన్యమనుష్యుఁడైనను ప్రయత్నము నొనర్చి యోగసిద్ధిని సంపాదించిన నిట్టివాఁడే యగును. ఇఁక పుట్టుకతోడనే యష్టసిద్ధుల నొందు ప్రభావముగల దేవతలనుగూర్చి యింతగాఁ బ్రస్తాపింపవలయునా? కావున నెట్లు చూచినను దేవతలకు శరీరము కలదనుటవలన నెందును విరోధము రాదు.

## అ ౧. పా ౩. సూ ౨౭. ఆరంభము.

పూర్వపక్షము:—ఇప్పటికిని విరోధము నశింపలేదు. ఒకవేళ దేవతలకు మీరు చెప్పినట్లు యోగసిద్ధి యుండుటచే ననేకశరీరములఁ దాల్చి యొక్కమాఱే యనేకస్థలములయందు యజ్ఞభాగముల భుజించుట సంభవించినను, కర్మానుష్ఠానవిషయమున విరోధము రాకున్నను

---

*ఉపాదానకారణములు. (పు. ౨౧౭. చూడు.)

మఱియొకవిరోధము వచ్చును. వేదమునకుఁ గలప్రామాణ్యమునకే భంగము వచ్చును. ఎట్లనిన:—

లోకమున నొకపురుషునికి శిశువు జనించు నని తలంపుఁడు. వానికి మొట్టమొదట పేరేద్దియును లేదు. పుట్టినపిదప నేదియో యొక పేరు పెట్టుచున్నారు. ఈయనుభవమునుఁ బట్టి చూచినఁ బదార్థోత్పత్తికిఁ బిదపఁ గాని, పదము ప్రవర్తింపదు. మొట్టమొదట నొకవస్తువు కలిగిన పిదప నాయర్థమును తెలుపుచు శబ్దము ప్రవర్తించును. కావ్యాదుల రచియించువారును మొట్టమొదట తాము వ్రాయవలసినయభిప్రాయమును మనస్సున నూహించి పిదపనేకదా తదనుకూలములగుశబ్దములఁ బ్రయోగింతురు! కావున శబ్దమునకును శబ్దార్థమునకును గలసంబంధ మిట్టిది.

ఇట్లగుటచే సామాన్యశబ్దమువలెనె వేదముకూడ తనకంటెఁ బూర్వమునజనించిన యొకానొకపదార్థమును గూర్చియే చెప్పునది కావలసివచ్చును. అప్పుడు సామాన్యులవాక్యములవలెనే యాశ్రుతియు నప్రమాణము కావలసివచ్చెను. మొదట నర్థమును నిర్ణయించి యందు శబ్దప్రయోగము నాచరించుట పురుషబుద్ధికి స్వాధీనమైనదియే యగుటచే అందు కలసత్యత్వాసత్యత్వముల నిర్ణయించుటకును, పురుషుని భ్రమప్రమాదాదులవలన గలిగినదోషములను నివారించుటకును, ప్రత్యక్షాదులగు నితరప్రమాణములయొక్క సాహాయ్యము కావలయును. ఇట్లే వేదమునందుఁ జెప్పఁబడినయంశములను నిర్ణయించుటకుఁ గూడ నితరప్రమాణములసాహాయ్యము కావలసి వచ్చెను. ఇట్లు వేదము బొత్తిగనే యప్రమాణ మయ్యెను.

ఇది * యాస్తికమతస్థులకందఱకు ననిష్టమే యగుటచే జైమిని మహాముని యీదోషము నిట్లునివారించెను:—

* ఆస్తికమతి మనఁగా; దేవుఁడు కలఁడని యంగీకరించు మతము. సామాన్యముగ దీనిని మూఁడువిధముల విభాగింపవచ్చును. జీవునకును దేవునకును భేదము లేదని చెప్పువా రద్వైతులు. జీవులు కరచరణాద్యవయవములవలె దేవునితోఁ జేరి యుందురని చెప్పువారు విశిష్టాద్వైతులు. జీవునకును దేవునకును సర్వకాలములయందును భేదమే అని చెప్పువారు ద్వైతులు. వీరును నవాంతరభేదములు వేనవేలుగఁ గలవు. వాని వివరించుటవలన నిచ్చట నంతగాఁ బ్రయోజనము లేదు గావున నింతతో విరమించుచున్నాను.

శబ్దార్థములకుఁ గలసంబంధ ముత్పత్తినిబట్టి వచ్చినదియే యైనను వేదశబ్దములుమాత్ర మట్టివి కావు. అవియు వానియర్థములునుగూడ నిత్యములే. వేదశబ్దములచేఁ జెప్పఁబడు దేవతాదు లందఱును సర్వకాలములయందు నేకరూపముతో నుండువారే. వారికి దేహాదులు లేవు కావున నుత్పత్తివినాశములు లేవు. మంత్రాదులలో వారికిఁగూడ నాకారము చెప్పఁబడినను అది * యౌపచారికమే కాని యథార్థము కాదు. పైనచూపఁబడిన దోషములవలన నట్లగుటకును వీలు లేదు కదా! కావున వేదము స్వభావసిద్ధముగనే ప్రమాణము.

ఈవిధముగ "దేవతలునిత్యులు" అనుపక్షము నవలంబించి "వేదము స్వాభావికముగనే ప్రమాణము" అని సిద్ధాంతము చేయఁబడియున్నది. మీరు యిప్పుడు ఆదేవతలకు దేహము నంగీకరించినచో నీ సిద్ధాంతమునకు భంగముచేసినవార లగుదురు. వారికిని దేహ మున్నచో మనకువలెనే యుత్పత్తివినాశము లుండవలసివచ్చును. అప్పుడు నిత్యత్వము లేకపోవును; అర్థములు నిత్యములుకాకపోయిన వేదశబ్దములును నిత్యములు కాకపోవును. ఇది మీకును సమ్మతము కాదుకదా!

"ఇట్లు చెప్పనేల? ఒకపేరు కలదేవతలు కల్పానుసారముగ నెందఱో యుండవచ్చును. వారిని చెప్పుశబ్దము వారి*జాతిని చెప్పవచ్చును. మఱియు నింద్రాదిశబ్దములు సేనాపతి మొదలగుశబ్దములవలె నధికారవాచకములు కావచ్చును. ఆయధికారమునకు వచ్చినవా రందఱు నా శబ్దములచేఁ బిలువఁబడవచ్చును. అధికారము నిత్యము కావున శబ్దములును నిత్యములు కావచ్చును." అనియెదవేమొ వినుము. ఇట్లు చెప్పుట సంభవింపదు. ఏల యనిన:—

"అదియే ఇది దానివలెనే ఇదికూడ గోవే. నిన్న చూచినదియు నేఁడుచూచినదియుఁ గూడ గోవే" అని వెనుక నొక్కమాఱు చూచిన దానిని రెండవమాఱు (అనఁగా: దానితో సమాన మగునాకారాదులు గలవానిని చూచినప్పుడు) జ్ఞప్తికిఁ దెచ్చికొనుట యేదికలదో దానిని ప్రత్యభిజ్ఞానమని పేరు. ఇట్టిప్రత్యభిజ్ఞాన మేపదార్థములయందుఁ గాన వచ్చునో ఆపదార్థములయొక్క * భావమునకుఁ గాని * సామాన్యము

* ఔపచారికము, (పుట. 333 చూడు.) * జాతి, (పుట. ౨౮౯ చూడు.)
* భావము (పు. ౨౬౪. చూడు.) * సామాన్యము. (పు. ౨౮౯. చూడు.)

నకుఁగాని జాతియని పేరు. ఒకజాతియం దున్నపదార్థములు ప్రత్యభి జ్ఞానమును కలిగి, యెదుటనున్నదానిని చూచినఁ గాలాంతరమున జూడం బడినపదార్థమును (సజాతీయపదార్థమును) జ్ఞప్తికిఁ దేవలయును. ఇట్టి ప్రత్యభిజ్ఞానము దేవతలయందు సంభవింపదు. వారి నిప్పుడుకూడ నెవ్వ రును చూచుట లేదు. ఒకవేళ నొకానొకఁడు చూచినను, వానికి పూర్వ కల్పమునందలి దేవతలు దృగ్గోచరు లగుట సంభవింపదు. కావున ప్రత్య భిజ్ఞానము కలుగుననుటకు వీలు లేదు. ఈకారణమువలన దేవతలకు జాతి యనునది లేదు.

ఇఁక దేవవాచికపదము లాయాయధికారములనుగూర్చి మా త్రమే చెప్పుననినను సరిపడదు. పైఁ జూపినన్యాయము ననుసరించి ఆయధికారములకుఁ గూడఁ బ్రత్యభిజ్ఞాన ముండవలసివచ్చునుకదా! "ఇప్పుడు ఇంద్రశబ్దముచే నేయధికారము చెప్పఁబడుచున్నదో, పూర్వ కల్పమునఁగూడ నింద్రశబ్దముచే నాయధికారమే చెప్పఁబడెను" అను టకు నిదర్శన మేమియుండును. ప్రత్యభిజ్ఞానమే యీనిర్ణయమునకు సాధనముగ నుండి తీరవలసివచ్చును. అదియు పూర్వోక్తన్యాయము వలన సంభవింపనేరదు కదా! కావున నెట్లు చూచినను దేవతలకు జాతి యుండుటకు వీలు లేదు. ఆశబ్దములు అధికారవాచకశబ్దము లగుటకును వీలు లేదు. ''సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్'' "బ్రహ్మదేవుఁడు సూర్యచంద్రులను పూర్వకల్పమునందువలెనె ప్రస్తుత కల్పమునందును సృజించెను" అనుమొదలగుమంత్రములు కొన్ని ''దేవ తలకు జాతికలదు'' అని బోధించుచున్నను అవి ప్రమాణములగుటకు వీలు లేకపోటచే వాని నాశ్రయించి సిద్ధాంతముచేయుటకు వీలు కలు గదు. కావున దేవవాచకశబ్దములు వారి * వ్యక్తినిమాత్రమే చెప్పి తీర వలయును. ఆవ్యక్తియు నిత్యము కావలయును. నిత్యము కాకున్న వేదము ప్రమాణము కాకపోవలసివచ్చుననుట యిదివరకే నిరూపింపఁ బడెను. ఇట్లుండ వారికి దేహములుకల వని చెప్పుట యెట్లు సంభ వించును ? దేహములున్న నవయవములు సంభవించుటచే నవశ్యముగ నాశము కలుగును ; అవయవయుక్తము లగుపదార్థములకు నాశము నియత మనుట సర్వశాస్త్రసమ్మతము కదా !

---

* వ్యక్తి. (పుట. ౨౪౯. చూడు.)

అన. అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౯౧. శబ్ద యితి చే న్నాతః ప్రభవా * త్ప్రత్య క్షానుమానాభ్యాం. ౧. ౩. ౨౮.

తాత్పర్యము:—దేవతలకు విగ్రహము కల దని యంగీకరించుట వలన వేదప్రామాణ్యమునకు హాని యించుకయైనను రానేరదు. దేవతలే కాక యీసర్వప్రపంచంబును వేదశబ్దమునుండియే జనించినది. ఈ విషయమును శ్రుతిస్మృతులు బోధించుచున్నవి.

"ఏత ఇతి వై ప్రజాపతి ర్దేవా నసృజ తాసృగ్ర మితి మనుష్యా నిన్దవ ఇతి పితౄగ్ం స్తిరఃపవిత్ర మితి గ్రహా నాశవ ఇతి స్తోత్రం విశ్వా నితి శస్త్ర మభిసౌభ గే త్యన్యాః ప్రజాః "స మనసా వాచం మిథునం సమభవత్" స భూ రితి వ్యాహర త్స భూమి మసృజత" "ఏతే అసృగ్రం ఇందవః తిరఃపవిత్రం ఆశవః విశ్వాన్ అభిసౌభగ"అనుపదముల నుచ్చరించుచుఁ బ్రహ్మదేవుఁడు క్రమముగ దేవతలను మనుష్యులను పితరులను గ్రహములను స్తోత్రవాక్యములను శస్త్రములను సర్వప్రజలను సృజించెను. * (ఈశబ్దములు దేవాదులను జ్ఞప్తికిఁ దేఁగలవు) ఆయన మనస్సుతో శబ్దమును జత చేసెను. (సర్వప్రపంచమును తెలియజేయుఁనట్టి వేదశబ్దముల ముందుగా స్మరించి,వానిచేఁ దెలుపఁబడు నాకారముల

---

* ప్రత్యక్షానుమానములు.ఇతరప్రమాణములయొక్క సాహాయ్య మక్కఱ లేకయే తాను చెప్పిన యర్థమును సత్యము చేయునది. కావున నీసూత్రమున శ్రుతికిఁ బ్రత్యక్ష శబ్ద ముపయోగింపఁబడినది. వేదముయొక్క యాధారము లేక స్వయముగ నిలువలేదు. కావున స్మృతిని అనుమానశబ్దముచే నిచ్చట చెప్పినారు.

* ఏతే మొదలగుశబ్దములు దేవాదులను జ్ఞప్తికి దేఁగలవు. ఏతే అనుపదమునకు వీరు అని యర్థము. ఇట్లగుటచే ప్రత్యక్షము లైయున్నయింద్రియముల జూపి యాశబ్దము వానిమూలమునఁ దధిష్ఠానదేవతల జ్ఞప్తికిఁ దెచ్చును. అసృక్ఛబ్దమునకు రక్తమునందు రమించువారు అని యర్థము. ఇట్లగుటచే రక్తమే ప్రాణాధారముగాఁ గలమనుష్యుల నాశబ్దము జ్ఞప్తికిఁ దెచ్చును. పవిత్రుఁ డనఁగాఁ జంద్రుఁడు. వానిని నడుమ నుంచుకొని యున్నవారు తిరఃపవిత్రులు. కావున నాశబ్దము చంద్రసహితము లగుగ్రహముల జ్ఞప్తికిఁ దెచ్చును. పితృదేవతలు చంద్రలోకమున నుండువారు కావున చంద్రవా

మనసునకుఁ దెచ్చుకొని యాయాకారముతో నుత్తరకల్పమున నాయా దేవతాదుల సృజించె ననుట) 'భూః' అనుశబ్దము నుచ్చరించి భూమిని సృష్టించెను." అను మొదలగు శ్రుతులును, "అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా, ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః" * నామ రూపం చ భూతానాం కర్మణాంచ ప్రవర్తనం వేదశబ్దేభ్య ఏ వాదౌ నిర్మమే స మహేశ్వరః సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథ క్పృథక్ వేదశబ్దేభ్య ఏ వాదౌ పృథ క్సంస్థా శ్చ నిర్మమే" "ఆచతుర్ముఖుఁడు సర్వభూతములకును పేర్లను రూపములను బహువిధకర్మలను బహువిధస్థితులను వేదశబ్దములనుండియే నిర్మించెను. (రెంటికి నిదియే యర్థము)" అను మొదలగు స్మృతులును ఈవిషయమును స్పష్టము చేయుచున్నవి.

పూర్వపక్షము:—ఇంతమాత్రమువలన నిచ్చట పోయినదోషమేది కలదు. "వేదశబ్దములనుండియే ప్రపంచము జనించెను" అనువిషయము నంగీకరించినను వేదమునకు ననిత్యత్వము తప్పక కలుగును. ప్రత్యభిజ్ఞానము లేకపోవుటచే నింద్రాదిశబ్దములు జాతివాచకములు కానేరవనియు, అధికారవాచకము లగుటకుఁ గూడ వీలు లేదనియుఁ బూర్వమునసే నిరూపించియున్నాము. ఇఁక నింద్రాదివ్యక్తులకు నాశము లేదనుట యెట్లును నిరూపించుటకు సాధ్యము కాదు కదా! ఈవిధముగ అర్థములకు నాశ ముండిన వానిని చెప్పుశబ్దములు నిత్యము లగుట యెట్లు? ఒకపక్షమున నవి స్వయముగనే నశించిపోవలయును; రెండవ

---

చక మైనయిందుశబ్దము వానల జ్ఞప్తికిఁ దెచ్చును. మతియు సామగానము బుగ్వేదమంత్రములతోఁ గూడి యున్నది. కావున "ఋగ్వేదమంత్రములతోఁ గూడినది". అని యర్థ మిచ్చునాయాశవశబ్దము సామగానముల స్మరింపఁజేయును. విశ్వేదేవతలు వైద్యు లగుటచే శస్త్రములతో పనిఁ జేయువారు కాని వ్యాధులకు శస్త్రములవలె నౌషధముల నొసంగువారు కాని యగుటచే వారిని దెల్పువిశ్వశబ్దము శస్త్రములను జ్ఞప్తికి దెచ్చును. సౌభాగ్యము చెప్పునది యగుటచే నభిసౌభగశబ్దము సౌభాగ్యమునందు మిగుల నభిలాష గల్గి కాని, సౌభాగ్య వంతులై కాని సౌభాగ్యమునందు కొఱత యందుటచే సర్వకాలములయందును దాని యభివృద్ధికై దేవాదుల నుపాసించుచుఁ గాని యున్న సకలప్రజల జ్ఞప్తికిఁ దెచ్చును.

* దీనియర్థమును, (పుట. ౧, ౧, ౩ చూడుము.)

పక్షమున "శబ్దము నిత్యము" అని సాధించినచో, నర్థశూన్యము లగుటచే నప్రయోజనము లైనను కావలయును.

ఇది యంతయు నట్లుండ "జన్మాద్యస్య యతః (౧.౧.౨.చూడు.) అనుసూత్రమున "ప్రపంచమునకుఁ బ్రహ్మమే యు*పాదాననిమిత్త కారణములు" అని మీరే సిద్ధాంతము చేసియున్నారు. దానికి విరుద్ధముగ నిచ్చట "ప్రపంచమునకు శబ్దము కారణము" అని యెట్లు చెప్ప గలరు ? మఱియు మీరుదహరించిన "అనాదినిధనా" అనుస్మృతి యందును బ్రహ్మదేవుఁడు వేదమును రచించెను" అని యున్నది. దీనిచే వేదము అనిత్య మనుట దృఢ మగును. ఉత్పత్తి గలవానికి నాశము నియతము కదా! కావున నెట్లును దేవతలకు విగ్రహము కలదనిన వేద మప్రమాణ మగును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుటకు వీలు లేదు. శబ్దమునకు నెప్పటికిని జాతులతోను దానికి నియత మైయున్నయాకారముతోను సంబంధముండు ననవలయునే కాని వ్యక్తులతో సంబంధ ముండు ననుటకు వీలు లేదు. ఒక్కొక్కజాతియందు లెక్కకు మిక్కిలి యగువ్యక్తు లుండును కదా! శబ్దమునకు వానితోనే సంబంధ ముండు ననుటకు వీలు ఎట్లు కలుగును? ఆవ్యక్తులే యాపదమున కర్థము లగునెడల మీరన్నట్లు ఆ శబ్దము నశించికాని నిష్ప్రయోజన మై కాని పోవలసివచ్చును. లోకమున నిట్టిది విరుద్ధము. గోజాతియందు అనేకగోవులు కలవు. తద్వాచక మగుగోశబ్దము జాతితోఁ గాక వ్యక్తితో సంబంధపడి యుండునేని యప్పుడు, ఒక్కొక్కగోవు మృతినొందగానే (గోశబ్దము) నశించి పోవలసివచ్చును ; బ్రతికియున్నగోవునకు వాచక మగుశబ్దము లేకపోవలసి వచ్చును; క్రొత్తగా నైనను సంభవింపవలసివచ్చును. ఇది యసంభవము కదా! కావున నెట్లును "శబ్దము జాతిని చెప్పునదియే. * జాతి

---

* ఉపాదాననిమిత్తకారణములు. (౨౧౭. చూడు)

* జాతి యన నియతి మగు నొకయాకారమే. జాతిస్వరూపమును గూర్చి ౨33వ పుటయందు వివరించియున్నాము. సర్వపదార్థములను ఏకరూపముగ గ్రహించుటయే జాతియగు నని చెప్పియున్నాము. వ్యక్తులకు పరస్పరభేదము లనేకము లుండుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. గోవులనుచూచిన నవి యేకజాతియందు చేరినవే యైనను వర్ణములు అవయవసన్నివేశములు మొదలగువానిలో ననేకభేదములు కలవు. ఇట్టి పర

యనఁగా నియత మగునొకయాకారమే కావున నాయాకారమును చెప్పునదియే" అని యంగీకరించి తీరవలయును.

కావున దేవవాచకము లగు వేదశబ్దములు దేవజాతిని చెప్పునవియే కాని దేవవ్యక్తులఁ జెప్పునవి కావు. ఆబ్రహ్మదేవుఁడు సృష్టికాలమున వేదశబ్దమును స్మరించి దానిచే పూర్వకల్పమున దేవతల కున్నరూప మును మనస్సున నిలిపికొని యుత్తరకల్పమున యారూపముతోనే దేవ తలసృజించును. కుండను చేయదలంచువాఁడు మొట్టమొదట నాశబ్దమును స్మరించి దానిచేఁ జెప్పఁబడునాకారమును జ్ఞప్తికిఁ దెచ్చికొనియే కదా యాకుండను చేయుచున్నాఁడు! ప్రపంచ మనాది యగుటచే నీరూప ములును అనాదులే. ఇవియే వేదశబ్దములకు నర్థములు. కావున వేద శబ్దములును అనాదులే. అర్థములు నిత్యము లైనశబ్దములు నిత్యము లగు ననుట మీకును సమ్మతమేకదా! ఈకారణమువలన వ్యక్తులు నశించినను బాధ లేదు. గోవ్యక్తు లెన్ని నశించినను గోజాతి నశింప నట్లు దేవవ్యక్తు లెన్ని నశించినను తజ్జాతి నశింపదు; అట్లు నశించుట

---

స్వరభిన్నపదార్థము లనేకముగ గ్రహించుటకు నెట్లు వీలు కలుగును. అట్లు గ్రహింప వలయు ననిన నొకజాతి. గలవ్యక్తులయం దంతటను సమాన మగు నేదియో యొకధర్మ ముండి తీరవలయును. అధర్మము అజాతికే తప్ప నితరజాతికి నుండకూడదు.

అట్టిధర్మ మెద్ది? యది యేయాకారము. ఒకజాతికి గలయాకారము మఱియొక జాతికి లే దనుట స్పష్టముగ జూచుచున్నాము. ప్రతిజాతికిని ఒక్కొక్కయాకారము నియతమైయుండు ననియు వర్ణాదులలో నెన్నిభేదము లున్నను ఆయాకారమునకు మాత్రము భేదము రా దనియు స్పష్టముగఁ దెలిసికొనుచున్నాము.

కావున సర్వవ్యక్తుల నేకముగ గ్రహించుటకు సాధన మగునాకారము జాతికి కల దని కాని ఆయాకారమే జాతి యని కాని చెప్పవలసివచ్చును. ఇందు మొట్టమొదటి పక్షము యుక్తము కాదు. అనేకవ్యక్తులయందు గ్రహింపఁబడునైక్యమే జాతి కావున నది గుణ మగును; కాని ద్రవ్యము కానేరదు. గుణమునకు మఱియొకగుణ మున్న దనుట విరుద్ధము కావున సర్వవ్యక్తులయందు నేకరూపముగ ననుభవింపఁబడుచు నుండుధర్మ మేది కలదో అదియే జాతి యని చెప్పి తీరవలయును కావున జాతి యనఁగా: నియత మగునొకయాకారమే. అది నిత్యము ఎన్ని ప్రళయములు గడచినను నశించునది కాదు. అదియే శబ్దమునకు నర్థము.

కును వీలు లేదు. ఆయాకారములును మంత్రార్థవాదాదులయందు వర్ణింపఁబడి యున్నవి.

మఱియు నా వేదశబ్దములు "సేనాపతి మొదలగుశబ్దములవలె నధికారమునుమాత్రమే చెప్పునవి యనినను విరోధము లేదు. అధికారముకూడ జాతివంటిదే. ఆస్థానమున కెందఱువచ్చినను అటనుండి యందఱు తొలఁగిపోయినను అదిమాత్ర మెప్పటికి నిత్యమైయే యుండును. అట్లే యుండనలయును. రాజ్యాంగమున సేనాపతిపదవి యెవ్వని చేతనైన నొకనిచే నాశ్రయింపఁబడుచు నెట్లు నియతమై యుండునో యట్లే స్వర్గాదులయందును లేక ప్రపంచమునందు ఇంద్రాదిపదవులు నిత్యములై యుండును. ఇట్టివానిని చెప్పు వేదశబ్దములును నిత్యములే యగు ననుటలో సంశయ మేమి? కావున నెట్లుచూచినను దేవతలకు శరీర మున్నంతమాత్రమున వారివ్యక్తులకు వినాశము సంభవించినంత మాత్రమున వేదశబ్దము లనిత్యములు కానక్కఱ లేదు.

"ప్రత్యభిజ్ఞానము కలదు; కావున గోవు మొదలగువానియందు జాతి కలదు; తద్వాచకశబ్దములును జాతివాచకములు కావచ్చును. దేవతలవిషయములో నట్టిప్రత్యభిజ్ఞానము సంభవింపదని యిదివరకే చెప్పియున్నాను. కావున సర్వవిషయములయందును శబ్దము జాతివాచకము కావచ్చును కాని దేవతలవిషయమునందుమాత్ర మట్లు కానేరదు. వారికి జాతియే లేదు కదా?" అనియెద వేమొ వినుము.

"ధాతా యథాపూర్వ మకల్పయత్" అను మొదలగుమంత్రములు "సృష్టి సర్వకాలములయందు నేకరూపముగనే యుండును" అను విషయమును స్పష్టము చేయుచున్నవి. దీని నంగీకరింపకపోయిన ప్రపంచ మాకస్మికము కావలసి వచ్చును. పూర్వకల్పముతో సంబంధ మింతయైన లేకపోవలసి వచ్చును. సర్వమును భిన్నమే యగుటచే పూర్వకల్పాంతమున * వాసనారూపములై ఫలమును కల్గింపనున్నకర్మలు ఫలము నియ్యలేకపోవలసివచ్చును; క్రొత్తఫలము లాకస్మికముగనే కలుగవలసి వచ్చును. ఇది యంతయు ననర్థమే కదా! మఱియు "ప్రపంచ మంతయు పూర్వకల్పానుసారముగనే యుండును; గాని దేవతలుమాత్ర మట్టివారై యుండరు" అనుట మిగుల హాస్యాస్పదము ప్రపంచ మంతయు

* వాసనారూపము (పుట. 3౧౨. చూడుము.)

నొకవిధముగ నుండ నందొకభాగము మాత్రము మఱియొకవిధముగ నుండుటకుఁ గారణ మేమి యుండును? "స్వర్గము నిత్యము కావున నందలిదేవతలును నిత్యులే కావలయును" అనుటయు నంత యుక్తి యుక్తము కాదు. స్వర్గమనుస్థానముమాత్రము నిత్యమే కావచ్చును; అందలిదేవతలుమాత్రము వచ్చుచు బోవుచు నుండవచ్చును. మఱియు నిత్యమై యుండుట యనఁగా సర్వకల్పములయందు నేకరూపముతో నుండుటయే కావచ్చును కదా! ఇప్పుడు దేవతలకును స్వర్గమునకును గూడ నిత్యత్వము వచ్చినది. "ప్రపంచమునకు నంతయును గూడ నిత్యత్వము వచ్చినది. "త ద్యథేహ కర్మజితో లోకః క్షీయత ఏవ మే వాము త్రపుణ్యచితో లోకః క్షీయ తే"="కర్మచే సంపాదింపఁబడిన యిహలోక మెట్లు క్షీణించునో పుణ్యముచే సంపాదింపఁబడిన పరలోకముకూడ నట్లే క్షీణించును అని యుభయలోకములకును అనిత్యత్వమును చెప్పు చున్నశ్రుతి నిష్ఫలముకూడ నైనది" అనియెదవేమొ యది సరి కాదు. ఆశ్రుతి చెప్పువిషయమునకును ఇప్పుడు నేను చెప్పుచున్నవిషయమున కును భేదము కలదు. ఆశ్రుతి పరమార్థస్థితినిఁ గూర్చి చెప్పుచున్నది. ప్రపంచ మంతయు భ్రాంతిచే జనించినది. కావున బొత్తిగనే శూన్య మైనది యని చెప్పుచున్నది. అం దనుభవింపఁబడు ఫలములు శాశ్వత ములు కావు. కావున వానియందలి యిచ్ఛను వదలు మనుచున్నది. శా శ్వతఫల మగుమోక్షమునకై ప్రయత్నింపు మనుచున్నది. ఏకస్వరూప మగుబ్రహ్మము నాత్మఁగా గ్రహింపు మనుచున్నది. మేము చెప్పువిషయ మట్టిదికాదు. ఇది వ్యావహారికము. వ్యవహారమున నన్నియు నిత్యములే యనుచున్నాము. కర్మలచే నిహపరలోకభాగముల సాధింపవచ్చు నను చున్నాము. ప్రతికల్పమునందును ఇదియంతయు నిట్లే యుండు ననుచు న్నాము. దీనికి నాద్యంతములు లే దనుచున్నాము. కావున ప్రపంచ మంతయు నిత్యము కావలసి వచ్చినను మాకు విరోధము లేదు. మా యద్వైతసిద్ధాంతమునకును భంగము రాదు. "భ్రాంతి యున్నంతకాల మంతయు నున్నదియే; అది తొలఁగిన నేదియు నెప్పటికిని లేనిదియే" అనియే కదా మాసిద్ధాంతము! ఇఁక మీసిద్ధాంతమును * (పూర్వ

---

* పూర్వమీమాంసాసిద్ధాంతము.— జీవేశ్వరులకు భేదము శాశ్వతముగాఁగాని భేదాభేదములు రెండును శాశ్వతములుగా కాని యున్నవి. ప్రపంచము నిత్యము. స్వర్గ

మీమాంసాసిద్ధాంతమును) పట్టి చూచినను సర్వప్రపంచము నిత్యమే యగును. భ్రాంతి లేనప్పుడు భేదదృష్టి కలుగకున్నప్పుడు, ఏకరూప మగు బ్రహ్మ మాత్మ మైనప్పుడు, కర్మకే యవకాశము లేకుండుటచే మీమాంసా తము, ఇట్లననేల? సర్వశాస్త్రంబులును బొత్తిగనే ప్రవర్తింపఁ జాలవు కదా! కావున నెట్లు చూచినను "ప్రపంచము సర్వకల్పముల యందు నేకరూపముతోనే యున్నది" అని తీరవలయును. మంత్రము చెప్పునర్థములఁ బ్రమాణములుగఁ గైకొనవలయును. వాస్తవస్థితిలో వేదములయందు విధివాక్యములకంటె మంత్రార్థవాదములే యధికము లుగ నున్నవి. వాని నన్నిటి నప్రమాణములఁ గాఁపించి, యల్పసంఖ్య గల * విధివాక్యముల బ్రధానములఁ జేయుటయు, వానికి గూడ * స్వేచ్ఛాను సారముగ నర్థము చెప్పుటయు మిగుల నయుక్తము. సర్వవిషయముల

---

మనునది నాశరహిత మగునొకానొక లోకోత్తరసుఖము. దానిని బొందుటయే పురుషార్థము. అది కర్మలచేఁ బొందఁబడును. కర్మలు అస్వర్గీఫలము కలుగునంతవరకు నుండక పోయినను ఒక యపూర్వరూపమగు సంస్కారమును పుట్టించును. అది ఫలము దొరకునంతవరకు నుండును. కావున కర్మల నాచరించుటయే యావశ్యకకృత్యము. కర్మ లేక కేవల జ్ఞాన మేమియు చేయనేరదు. వేదాంతము లన్నియు కర్మకర్త యగుజీవుని నుతించును. అనునది పూర్వమీమాంసాసిద్ధాంతస్వరూపము.

* విధివాక్య మనఁగా "నీవు దీనిని చేయవలయును" అని చెప్పు వేదవాక్యము "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" "స్వర్గమును కోరువాఁడు జ్యోతిష్టోమయాగమును చేయవలయును" అను మొదలగు వాక్యములు దీని కుదాహరణములు. సంస్కృతభాషయందు విధిని తెలియఁజేయుటకై యుపయోగింపఁబడు "లిఙ్ లోట్ తవ్య" అను ప్రత్యయములు గలక్రియారూపము లావాక్యములయం దుండును.

* విధివాక్యములకు చెప్పఁబడిన స్వేచ్ఛానుసార మగునర్థము. పూర్వమీమాంసామతస్థులు విధివాక్యములకుఁ గూడ తమయుద్దేశమునకు ననుగుణముగానే యర్థమును కల్పింతురు. తమ యభిప్రాయమునకు విరుద్ధముగ నున్నవాని నెల్ల నప్రమాణము లందురు. చూడుఁడు. "జ్యోతిష్టోమేన" అనువాక్యమునందు స్వర్గపదము కలదు. దానికి పూర్వమీమాంసకులు ఏదియో యొకసుఖము అని యర్థము చెప్పుదురు. తమమనస్సులయందు, దేవతలకు నాకారము కలిగియున్న వారు పరస్థలములయందు ఒక్కమారే యారంభింపఁబడిన యజ్ఞములకు బోవుట సంభవింప దనియు, అవయవములు కలవి నశించి తీరవలయును కావున దేవతలకుఁ గూడ దేహము కల దనినచో నాశ ముండవలయు ననియు, దేహము లేనివారలకు లోక మొక్కటి యుండు ననుట విరుద్ధ మనియు, దలంచి యిట్లు

యందును యుక్తినే యాశ్రయించి వేదమును యథేచ్ఛముగా వ్యాఖ్యానము చేయువానికంటె "వేద మప్రమాణము!" అనువాఁడు మఱియెవ్వఁడు? కావున మంత్రార్థవాదాదులు ప్రమాణములే. వానియందు వర్ణింపఁబడి యున్నయాకారములు దేవతలకు నున్నవియే. అవి నిత్యములగుటచే వానినిగూర్చి చెప్పు వేదశబ్దములును నిత్యములే. ఈవిధముగ దేవతలు వేదశబ్దములనుండియే పుట్టినవా రగుటచే వారికి శరీరాదులున్నను వినాశమున్నను వేద మప్రమాణము కా నక్కఱ లేదు. నిత్యములగునాకారములే వేదశబ్దములకు నర్థములై యుండుటయు, ఆశబ్దముల నుచ్చరించినతోడనే ఆయాకారములు జ్ఞప్తికి వచ్చుటయు, దాని చేతనే ప్రపంచము నిర్మింపఁబడుటయు, అనునదియే "దేవతలు లేక ప్రపంచము శబ్దమువలన పుట్టెను" అనుటకు నభిప్రాయము కదా!

ఇట్లగుటచేతనే "జన్మా ద్యస్య యతః ౧. ౧. ౨." అనుసూత్రమున చేయఁబడినసిద్ధాంతమునకును విరోధము లేదు. ఆదేవతలకుఁగూడ పరబ్రహ్మమే యుపాదాననిమిత్తకారణము కావచ్చును. దీనికిఁగలకారణత్వము ఔపచారికముగా వర్ణింపఁబడునదియే కదా! ఔపచారికముగ వర్ణింపఁబడినంతమాత్రమునఁ గారణత్వము నిలుపనేర దని పట్టు పట్టినచో దీనిని (శబ్దమును) కూడ నొకవిధ మగునిమిత్తకారణముగ నంగీకరింపవచ్చును.

చతుర్ముఖుఁడు వేదమును నిర్మించె ననుట నిశ్చయమే; కాని యంతమాత్రమున నది యనిత్యము కా నక్కఱ లేదు. ఆనిర్మాణమునందు విశేషము కలదు. కాళిదాసుఁడు మొదలగువారు రఘువంశాది కావ్యముల నిర్మించునప్పుడు స్వతంత్రులై యున్నట్లు చతుర్ముఖుఁడు వేదమును నిర్మించునప్పుడు స్వతంత్రుఁడు కాఁడు. పూర్వకల్పమున నున్న వేదమునే తపోబలముననో, లేక, "నారాయణం పద్మభవం వసిష్ఠం" అనువాక్యము ననుసరించి నారాయణుని యుపదేశమువలననో స్మరిం

చెప్పుచున్నారు. పురాణాదులు అనంతములుగ స్వర్గలోకాదులను వర్ణించుచున్నవి కదా! యనిన "అవి యప్రమాణములు" అనుచున్నారు. వేదములయందును కూడ నిట్టివర్ణనములు కలవే యనిన నావాక్యములకు స్వార్థమునందు తాత్పర్యము లే దనుచున్నారు. కావున తమయభిప్రాయమునకు ననుకూలముగ వేదము నీడ్వ ప్రయత్నించుచున్నారు; కాని వేదమునకు ననుకూలముగఁ దాము పోఁదలంచుట లేదు.

చును. ఇంతమాత్రమువలన వేదమునకు ననిత్యత్వము వచ్చుటయెట్లు ? కావున నెట్లు చూచినను వేద మనిత్యము కాదు. దాని నుండియే దేవాదిలోకము జనించుటచే దానికి నప్రామాణ్యము రాదు.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కానేరదు. శబ్దముల నుండి పదార్థము లెట్లును జనింపలేవు. మొట్టమొదట శబ్దము లోక పదార్థమును గూర్చి చెప్పుననుటయే సంభవింపదు. ఎట్లనిన:—

౧ శబ్దములకు అక్షరములే స్వరూపమా ? లేక, కొందఱిమతము ననుసరించి యక్షరములకంటె నన్య మని చెప్పఁబడు స్ఫోటమే స్వరూపమా ? ఇందు ఏపక్షంబును సరికాదు.

౨ వర్ణములే పద మనినచో వానినుండి యర్థజ్ఞానము కలుగుటకు వీలులేదు. అవి యుచ్చరించునప్పుడెల్ల క్రొత్తవి యగుచుండును. ఒకమా రుచ్చరించినయకారమునే మఱియొకమాఱుకూడ నుచ్చరించె నను టలో గుఱు తేమికలదు? కావున నెప్పటి కప్పు డక్షరములు క్రొత్తవే యనవలయును. ఇట్లయిన నిందు పూర్వోత్తరసంబంధము కలుగదు. ఇట్టివి నిత్యమగునర్థము నెట్లు తెలుపఁగలవు? ఈకారణమువలన నింద్రాదిశబ్దములయం దున్నయికారాదులు ఇంద్రాదిరూప మగునర్థమును తెలుపలేవు. ఇట్లుండ నాయింద్రాదులు శబ్దమునుండి యెట్లు పుట్టుదురు?

3 మఱియు నీయక్షరములే యర్థమును తెలుపుననిన నవి ప్రత్యేకముగనే తెలుపునా? లేక, అన్నియును కలిసి తెలుపునా ? ఈరెంటి కంటె నన్యమగురీతి యేదియు లేదుకదా! ఇందుఁ జూడబోయిన నే పక్షంబును సరికాదు.

౪ ప్రత్యేకముగనే తెలుపు నన్నచో నది ప్రత్యక్షవిరుద్ధము. "రుద్ర"అని చెప్పునప్పుడు కేవల రువర్ణము నుచ్చరించినంతమాత్రమున నర్థజ్ఞానము కలుగుటలే దని యందఱు నెఱుంగుదురు.

౫ రెండవపక్షంబును సరికాదు. "రుద్ర" యనునప్పుడు ద్రవర్ణము నుచ్చరించుకాలమున రువర్ణము లేదు. ఇట్లుండ వీనికి కలయిక యెట్లు కలుగును?

౬ "రువర్ణము లేకున్నను దానివలన కలిగినసంస్కారము మాత్రము ద్రవర్ణము నుచ్చరించుకాలమునందుఁ గూడఁ గలదు" అనియెద

వేమో యదియు సరికాదు. ఈపక్షము వాదములకు నిలువదు. లోకమున సంస్కారములు రెండువిధములుగ నున్నవి. పూర్వమీమాంసామతస్థులు అపూర్వమను పేరు గలయొకసంస్కారము నంగీకరించి యున్నారు. యజ్ఞాదికర్మలకు వేదము స్వర్గాదిరూపఫలమును చెప్పియున్నది. ఆఫలమును పరలోకమున ననుభవింపవలయును. యజ్ఞాదులు చేసినప్పుడే నశించిపోవును. ఈకారణమువలన యజ్ఞములకును వానిఫలములకును సంబంధము లేకపోయెను. ఆసంబంధమును కలిగించుటకై వారు, యజ్ఞాదులనుండి యపూర్వమను పేరుగల యొకసంస్కారము జనించు ననియు దానిచే స్వర్గరూపఫలము దొరకుననియుఁ జెప్పిరి. ఇది కాక స్మృతిని (జ్ఞప్తిని) కలిగించుచు నుండుభావనయనుసంస్కార మొక్కటి కూడ లోకప్రసిద్ధమై యున్నది. ఇందు వర్ణసంబంధమును కలిగించుసంస్కారమేది ?

౭ ఇందు మొదటిపక్షము యుక్తము కానేరదు. వర్ణములకు పరస్పరసంబంధమును కలిగించునది యపూర్వసంస్కారము కానేరదు. దానికిఁ జెప్పఁబడియున్నలక్షణములు శబ్దార్థసంబంధవిషయమున సంభవింపనేరవు. ఎట్లనిన:—

లోకమున శబ్దమునుండి యర్థమును గ్రహించుట సర్వానుభవసిద్ధమై యున్నది. అది ప్రత్యక్షజ్ఞానమా, లేక, యనుమానజ్ఞానమా ? యని విచారించిన నీవిధముగ నేర్పడును:—

లోకమునఁ బ్రత్యక్షజ్ఞానము ఇంద్రియములవలన కలుగును. ప్రత్యక్షముగ నొకయర్థమును తెలిసికొనఁదలచినపురుషుఁడు తత్సాధనములగునింద్రియములయొక్క గాని అంగభూతము లగువెలుతురు మొదలగువానియొక్క గాని స్వరూపమును తెలిసికొనియుండ నక్కఱ లేదు. వానికిని వానిచే తెలియఁజేయఁబడుపదార్థములకును గలపరస్పరసంబంధమునుకూడఁ దెలిసికొనన క్కఱలేదు. ఇంద్రియములు పదార్థములపైఁ బ్రసరించినంతమాత్రముననే యాప్రత్యక్షజ్ఞానము కలుగును. ఇచ్చట పూర్వోత్తరసందర్భములను విమర్శింపవలయు ననుటయు బొత్తిగనే యవసరము లేదు. భ్రాంతి కలిగినసమయములందు అట్టివిచార మావశ్యకము కదా? యనిన నదియు యుక్తముకాదు. భ్రాంతి నొందినవాఁడు స్వయముగ విచారింపఁ నేరఁడు; ఇతరుఁడు విచారింపవలసినపనియే లేదు.

కావున నెట్లును ప్రత్యక్షజ్ఞానమున బూర్వాపరవిమర్శముతోఁ బని యింత యైనను లేదు.

శబ్ద మన్ననో యీయింద్రియములవలె నర్థజ్ఞానమును పుట్టింప లేదు. శబ్దమును వినినంతమాత్రముననే దానిచేఁ దెలుపఁబడుపదార్థము నెవ్వఁడును పూర్వోత్తరవిమర్శ లేక గ్రహింపనేరఁడు. బలశబ్దమును వినినంతమాత్రముననే దానిచేఁ దెలుపఁబడినయర్థము "దేహబలమే" యనికాని "సైన్యమే" యనికాని యెవ్వఁడు నిర్ణయింపఁగలఁడు? కావున శబ్దమునుండి యర్థమును గ్రహింపవలయు ననిన, దానిరూపంబును * (ప్రాతిపదికస్వరూపము) అంగంబులును (విభక్తివచనాదులు) పూర్వోత్తరసందర్భంబును అవశ్యముగ తెలియఁబడవలయును. పిదప నాశబ్దములకును అర్థమునకును గలసంబంధము తేటపడును. దానిచే నర్థజ్ఞానము కలుగును. ఇది సర్వానుభవసిద్ధము.

ఈకారణమునవలన శబ్దము అర్థజ్ఞానమును కలుగఁజేయుట యను మానప్రమాణమువలననే యని చెప్పవలసి వచ్చుచున్నది. పొగను చూచి దానివలన నగ్నిని ఊహించువాఁడు మొట్టమొదట పొగ యిట్టిది యనియు, దానికి నగ్నికిని గలసంబంధ మిట్టిదియనియుఁ దెలిసికొని యుండవలయు ననుట నిర్వివాదాంశము కదా! ఇఁక వర్ణములే శబ్దమై వానికిఁ గలయపూర్వసంస్కారమే అర్థజ్ఞానమును కలిగించునేని బహు దోషములు వచ్చుననుటలో సంశయ మేమి?

యజ్ఞాదులు స్వర్గాదిరూపఫలము నిచ్చుటకు ముందుగనే య పూర్వము జనించుచున్నది యని స్పష్టముగ తెలియుచున్నది. యజ్ఞాదులకు ఫలమును కలిగించువిషయములో నపూర్వసంస్కారముకూడ నొకయంగము. ఇట్లే శబ్దమునకుఁ గూడ నర్థజ్ఞానంబును కలిగించువిషయమున నిది యంగమే కావలసివచ్చును. అప్పుడు "ఇది విభక్తి ఇది వచనము" అనునట్లు "ఇది అపూర్వరూపసంస్కారము" అని తెలియఁబడవలయును. ఇది యెవ్వనికైన ప్రత్యక్షముగ నున్నదా?

---

* ప్రాతిపదికమనఁగా: ప్రత్యయములు పరము కాకపూర్వము అర్థవంతమై ధాతుభిన్నమై యుండు పదస్వరూపము. పదమునకు స్వయముగనే సర్వార్థముల నిచ్చు సామర్థ్య మున్నదనియు ప్రత్యయములు దానిని ప్రకటించునవియే గాని కలిగించునవి కావనియు వ్యాకరణసిద్ధాంతము.

"వర్ణములకు నర్థజ్ఞానమును కలిగించుటయందు పైన వివరింపఁబడినరీతిగా సామర్థ్యము లేదు; కావున, అర్థజ్ఞానమునుబట్టి 'అర్థము నిచ్చు సామర్థ్యము శబ్దమునందు లేదు. అర్థజ్ఞానముమాత్రము కలుగుచున్నది. కావున శబ్దార్థములకు నేదియో యొకసంబంధ మవశ్యముగ నుండవలయును' అని *యర్థాపత్తిప్రమాణముచే నిర్ణయింపవచ్చును" అనియెదవేమొ యప్పుడు *అన్యోన్యాశ్రయదోషము వచ్చును. అర్థము తెలిసిననేకాని అపూర్వము కల దనుమాట నిశ్చయము కాదు? అపూర్వము కల దనుమాట నిశ్చయ మైననేకాని యర్థజ్ఞానము.(అనఁగా: "శబ్ద మర్థము నిచ్చును" అనుజ్ఞానము )కలుగదు. దీనికి నుత్తరము చెప్పువాఁ డెవ్వఁడు? కావున నెట్లు చూచినను "అపూర్వసంస్కారము వర్ణములకు పరస్పర సంబంధమును కలిగించి యర్థము నిచ్చుసామర్థ్యము నొసంగును" అను పక్షము నిలువదు.

౮ ఇట్లే భావనారూపసంస్కారము కూడ నట్టిసంబంధమును కలిగింపఁజాలదు. ఏల యనిన:—

భావనాసంస్కారము వెనుక ననుభవింపఁబడిన వాని నవసరము కలిగినప్పుడు స్మరణకు తెచ్చును. ఇంతకంటె నందు విశేష మేమియు లేదు. ఒకవేళ వర్ణములయందు ఈసంస్కార మున్నను, రెండవవర్ణము నుచ్చరించునప్పుడు మొదటివర్ణమును జ్ఞప్తికిఁ దెచ్చినఁ దేవచ్చును. ఇంత మాత్రమున నది యావర్ణములనుండి యర్థజ్ఞానము నెట్లు కలిగింపగలదు? ప్రత్యేకవర్ణములయందు (అనఁగా: నొక్కొక్కవర్ణమునందే) అర్థము నిచ్చుసామర్థ్యము లేదు కదా! కల దనిన నితరవర్ణముల నుచ్చరించుటయే నిరర్థక మగును కదా!

---

* అర్థాపత్తి. (పు. 3౯. చూడు.)

* అన్యోన్యాశ్రయదోషమనఁగా: ఒకదాని నొక్కటి యాశ్రయించుట యను దోషము. కామవేగమువలన నస్వస్థస్థితికి వచ్చినవానిని గూర్చి "పిచ్చి కుదిరిననే కాని పెండ్లికాదు. పెండ్లిఅయిననే కాని పిచ్చికుదురదు" అని యొనర్పఁబడు వ్యవహారములు మొదలగునవి ఈవిషయమున దృష్టాంతములు. దీనికి "వీనికి పెండ్లియే కాదు" అనుటయే యభిప్రాయము. ఇట్టి యన్యోన్యాశ్రయములు వచ్చినప్పు డట్లే యభిప్రాయముల నూహించునది.

"ఆభావనాసంస్కారమే యర్థజ్ఞానమును కలిగించుసామర్థ్యము కూడ నగును" అనియెదవేమొ అది లోకవిరుద్ధ మగుటచే సరి కాదు. అగ్ని ప్రకాశించుచున్నది; ఇతరపదార్థములఁ గాల్చుచున్నది. ఈరెండు సామర్థ్యములు నొక్కటియే యనుట ప్రత్యక్షవిరుద్ధము. మణిమంత్రౌషధాదులబలమున దాహశక్తిని నిరోధించినను అగ్ని ప్రకాశింపకుండుట లేదు కదా! ఇట్లే భిన్నకార్యముల నాచరించుసామర్థ్యములు భిన్నములే కావలయునుగాని యేకమై యుండుటకు వీలు లేదు.

"ఇట్లు కాకున్న భావనాసంస్కారమునుండి యర్థమును దెలుపు సామర్థ్యము జనింపవచ్చును కదా!" అనియెదవేమొ అదియు సరి కాదు. భిన్నకార్యమునఁ జేయుసామర్థ్యములు దేని కది స్వతంత్రములే యై తీరవలయును. కా నక్కఱలే దనుటకుఁ బ్రమాణములు లేవు. మఱియు కార్యకారణభావవిరోధము కూడ వచ్చును. ఒకగుణమునుండి మఱియొకగుణము పుట్టుట లోకమున లేదు కదా!

ఇది యంతయుఁ గాక భావనాసంస్కార మర్థజ్ఞానమును కలిగించు ననిన వేఱొకవిరోధము కూడ వచ్చును. "జరా, రాజ" అని సమాన వర్ణములు గల రెండుశబ్దముల నుచ్చరించునప్పుడు అంతిమవర్ణము లొక్కటియే యగుటచే భావనాసంస్కారము కూడ నొక్కటియే యగును. అప్పుడు వానియర్థములు కూడ నొక్కటియే కావలసి వచ్చును; జరా శబ్దమునకు ముదిమి యనియు రాజశబ్దమునకు ప్రభు వనియు నర్థము కాకపోవలసి వచ్చును. ఇది విరుద్ధము కదా!

కావున నెట్లు చూచినను "వర్ణములే పదము. అదియే యర్థము నిచ్చును" అనుట సరిపడదు.

౯ మఱియు "వర్ణములకంటె భిన్నమై అర్థజ్ఞానములకుఁ గారణ మగుచు స్ఫోట మనునొక్కటి ప్రత్యేకముగఁ గలదు. దానినుండియే అర్థజ్ఞానము సంభవించుచున్నది" అనుపక్షంబును సరి కానేరదు. అట్టి పదార్థ మనుభవమున లేదు. అర్థజ్ఞానముచేతనే దాని నూహింతు మనినఁ బూర్వమువలెనే అన్యోన్యాశ్రయము వచ్చును. అర్థజ్ఞానము కలుగక పూర్వము స్ఫోటము కల దనుట నిశ్చయము కాదు; స్ఫోటము కల దనుట నిశ్చయము కాకపూర్వ మర్థజ్ఞానము కల దనుట నిశ్చయము కాదు కదా!

"ఇట్లు కాదు. స్ఫోటము నిత్యము" అనియెదవేమొ యెప్పుడు సర్వకాలములయందు నూరకయే వర్ణోచ్చారముతో నవసరము లేకయే యర్థజ్ఞానము కలుగుచుండవలయును కదా! ఇట్టిది లోకమున నున్నదా! స్వతంత్రము లగువానికి సర్వకాలములయందును స్వేచ్ఛాప్రవృత్తి యుండవలయు ననుట నిర్వివాదాంశము.

కావున నెట్లు చూచినను, "శబ్దమునుండియే అర్థము జనించు ననుట యసంభవము. ఇట్లయిన శబ్దములనుండి ప్రపంచము పుట్టె ననుట యెట్లు యుక్తమగును? వర్ణములు ఉత్పత్తివినాశములు కలవి యగుటచేతను స్ఫోటము అప్రామాణిక మగుటచేతను శబ్దములు నిత్యములు కానేరవు. అట్టివానినుండి నిత్యమగు ప్రపంచ మెట్లు సంభవింపఁ గలదు? కావున శబ్దమునుండి ప్రపంచోత్పత్తి నంగీకరింపఁ జనదు.

౧౦ దీనికి గొందఱియుత్తరము:—వర్ణములు అర్థమును కలిగింప నేర వనుట నిస్సంశయమే; కాని స్ఫోటము మాత్ర మట్టిది కాదు. స్ఫోటము ప్రత్యక్షానుభవసిద్ధమయ్యే యున్నది. ప్రతిపురుషుఁడును "రుద్ర" అని యుచ్చరించునప్పుడు అందలి రెండువర్ణములకంటె భిన్నముగ "ఇది యొకపదము" అనుజ్ఞానమును చెందుచున్నాఁడు. "హరిర్విజయతే" అని రెండుపదము లుచ్చరింపఁబడినను. వానికంటె భిన్నముగ "ఇది యొకవాక్యము" అనుజ్ఞానము నొందుచున్నాఁడు. ఇంతియే కాని, ఎవ్వఁడును "ఇవి రెండువర్ణములు ఇవి రెండుపదములు" అని చెప్పుట లేదు. మఱియు పదుగురు కలసి వేదాధ్యయనము నొనర్చుచున్నప్పుడు ఆధ్వనిని వినినవాఁడు "దేవదత్తుఁడు చదువుచున్నాఁడు. యజ్ఞదత్తుఁడు చదువుచున్నాఁడు" అని చెప్పుచుండుట యనుభవసిద్ధమై యున్నది. వారిపాఠములయందు అక్షరములలో భేద మేమియు లేదు కదా! దేవదత్తుఁడుచ్చరించినయక్షరములనే యజ్ఞదత్తుఁడు కూడ నుచ్చరించెను. ఇట్లుండ నందు భేద మెటనుండి వచ్చెను? కావున వర్ణములకంటె నన్యమై యేదియో యొక్కటి అర్థజ్ఞానమును కలిగించినదిగా నుండవలయును. అదియే స్ఫోటము. దానినే శబ్ద మనవలయును. ఆస్ఫోటము, ప్రతివర్ణము వలనను గలుగుచున్న భావనారూపసంస్కారములతోఁ గూడిన యంత్యవర్ణమువలన కలుగును. "శ్రీకృష్ణ" అని యుచ్చరించునప్పుడు సంస్కారము ప్రథమవర్ణమునుండియు జనించుచు వచ్చి కడపటనున్న "ష్ణ"

అనువర్ణము నుచ్చరింపఁగానే పరిపాకము నొందును. దానివలన స్ఫోట మనునొకపదార్థము జనించును. పిదప నర్థజ్ఞానము కలుగును. ఇది సర్వా నుభవసిద్ధ మగువిషయమే. అనేకవర్ణముల నేకపదముగాను అనేకపద ముల నేకవాక్యముగాను గ్రహించుచున్నా రను ననుభవమును భ్రాంతి యని యెవ్వఁడు సాధింపఁగలఁడు.

౧౧ "ఒకశబ్దమున గలవర్ణము లన్నియు నొక్కమాఱే బుద్ధియందు స్ఫురించుటవలన నట్లు తోఁచుచున్నది. మఱియు నావర్ణము లన్నియు నొక్కయర్థమునే తెల్పుటవలన నట్లు తోఁచుచున్నవి. ఇంతయే కాని వర్ణములకంటె వేఱుగా స్ఫోట మనునది యొక్కటిలేదు." అనియెద వేమొ యది సరికాదు. అనేకపదార్థము లొక్కమాఱు బుద్ధికి గోచ రము లైనంతమాత్రమున నేకపదార్థము కానేరదు. "హస్త్యశ్వరథ పదాదులు" అనుపదము నుచ్చరించునప్పుడు, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బలము, అనునాల్గుపదార్థములును ఒక్కమాఱే బుద్ధి యందు స్ఫురించును; ఇంతమాత్రమున నీనాల్గు నొక్కటి యగునా? అట్టియనుభవ మెందైనఁ గలదా? కావున పదివర్ణము లొక్కమాఱు బుద్ధియందు తోఁచె ననునంతమాత్రమున నవి యేకము కానేరవు.

ఇఁక రెండవపక్షము "ఒక్కయర్థమును చెప్పును కావున నన్నియు నొక్కటిగ తోఁచును" (అనుపక్షము) కూడ సరి కాదు. "వర్ణములు ఎట్లను అర్థము తెలుపనేరవు. అనువిషయమును నీవే నిరూపించి యు న్నావు కదా! వానికి చేరికయు నెట్లను సంభవింప దనియు సంస్కా రము మొదలగునవి కూడ వానిని చేర్పలే వనియు సయుక్తికముగ నింతకుముందే చెప్పి యున్నావు కదా! అట్ల కాక నిప్పుడు క్రొత్తమార్గ మును త్రొక్కి, "శబ్దమువలన నర్థము తెలియవచ్చుట ప్రత్యక్షమై యున్నది. వర్ణములకంటె వేఱుగా నేదియుఁ గానరాలేదు. కావున ఎట్లయినను వర్ణములే యర్థమును చెప్పనలయును. ఈకారణమువలననే యవశ్యకముగ వానికి పరస్పరసంబంధ ముండవలయును" అనిన నదియు విరుద్ధమే యగును. సంబంధ ముండిననే కాని వర్ణములు అర్థమును దెలుపఁజాలవు; అర్థమును తెలుపుసామర్థ్య ముండిననేకాని సంబంధ ముండదు. లేక "వర్ణములు పరస్పరసంబంధము కలవి" అని తెలిసిననే లేక నిర్ణయ మైననే కాని, "వర్ణములు అర్థజ్ఞానమును కలిగించును"

అనువిషయము నిర్ణయము కాదు. ఇట్లే "వర్ణములు అర్థనిర్ణయము చేయఁగలవు" అనుట నిర్ణయమైననే కాని. "వర్ణములు పరస్పరసంబంధము కలవి" అనువిషయము నిర్ణయము కాదు. ఈఅన్యోన్యాశ్రయ దోషమువలన నీపక్షము నిలువదు కదా!

కావున నెట్లు చూచినను వర్ణములకంటె నతిరిక్తమగు నన్యపదార్థ ముండియే తీరవలయును. అదియే స్ఫోటము.

౧౨ "ఇట్లు చెప్పనేల? 'ఇవి వర్ణములు' అని బాగుగ తెలిసిననే కాని పదము, వాక్యము, అనునవి జనింపవు. స్ఫోటము కూడ నట్టిదియే కదా! ఇట్లుండ 'వర్ణములే పదములు' అనిన చాలును; ఇఁక క్రొత్తగా స్ఫోట మనుదాని నంగీకరింపనేల?" అనియెదవేమొ వినుము. స్ఫోట మనునది యొకదానివలనఁ బుట్టినది కాదు. అది నిత్యము. వర్ణములు లేకధ్వనులు దానిని బ్రకాశింపఁజేయు నంతియకాని పుట్టింపనేరవు. అవియు పరస్పరము సంబంధము నొంది దానిని ప్రకాశింపఁజేయ నక్కఱలేదు. ప్రత్యేకముగఁ గూడ కొంచెముకొంచెము ప్రకాశింపఁజేయుచు తమవలనఁ గలిగినసంస్కారములతోఁగూడిన చిత్తమున దానిని స్పష్టము చేయవచ్చును. లోకమున నొకపదార్థము బాగుగ నెఱుంగవలయు ననిన దాని నొకటిరెండుమాఱులు విమర్శింపగా విమర్శింపఁగా నంతమునకుఁ గదా దానియథార్థరూపము బయలుపడును? మొట్టమొదట చూచినప్పుడు అల్పముగను రెండవమాఱు చూచినప్పుడు మఱికొంత స్పష్టముగను తెలియుచు వచ్చి యంతమునకు బాగుగ నాపదార్థము యొక్క తత్త్వము తేటపడును. ఇట్లే యీస్ఫోటంబును ప్రథమవర్ణము వలనఁ గలిగినసంస్కారమువలన కొంతయు రెండవవర్ణమువలన మఱి కొంతయు నిట్లు క్రమక్రమముగ స్పష్ట మగుచు వచ్చి యంతమునకు బాగుగ తేటపడును.

ఈకారణమువలన వర్ణము లన్నియు నుండవలసినవియే. ఒకవర్ణమువలననే శబ్ద మంతయు స్ఫురించుట లేదు కదా! మొదటివర్ణములు లేకుండిన వానివలనఁ గలిగినసంస్కారములు లేకపోవుటచే మనస్సున స్ఫోటము విశదము కాదు; వెనుకటివి లేకుండినచో నాస్ఫోటము సంపూర్ణముగ వెలివడదు.

౧౩ "ఇట్లయిన నావర్ణములనుండియే లేక ధ్వనులనుండియే,

యర్థము పైన వర్ణించినరీతిగనే సంస్కారబలమున క్రమక్రమముగ విశదము కావచ్చును కదా" యనియెదవేమొ అది సరి కాదు. అర్థమనునది స్ఫోటమువంటిది కాదు. అది యొక్కమాఱు వెలిబడిన నీక దాఁగియుండునది కాదు; స్ఫోట మన్ననో అది యర్థమును కలిగించుటకు కారణమే కావున నెంతకాలమున కైన నుత్పత్తి కావచ్చును. పిదప నర్థమును దెలుపవచ్చును. సామాన్యముగ ప్రత్యక్షజ్ఞానము లన్నియు మొదట నస్పష్టములుగ నుండి పిదప స్పష్టములు కావచ్చును. అర్థజ్ఞానమన్ననో ప్రత్యక్షజ్ఞానము కాదని నీవే చెప్పియున్నావు కదా ! కావున నది తెలిసిన స్పష్టముగ తెలియవలయును లేకున్న బొత్తిగనే తెలియక పోవలయును. ఇంతియేకాని మధ్యపక్షము లేవియు నుండవు. ఈకారణమువలన నర్థమునకును స్ఫోటమునకును పోలిక లేదు. వర్ణములు తమ సంస్కారములచే వెలిపఱిచిననేకాని స్పష్టము కాకపోవుటచే నీస్ఫోటము నిత్యమైనను సర్వకాలములయందు నర్థజ్ఞానము కలుగవలసినపని లేదు.

కావున నెట్లు చూచినను వర్ణములకంటె భిన్న మగుస్ఫోటమే పదము. అదియే యర్థము నొసంగునది. కావున దానినుండియే సర్వప్రపంచ ముద్భవించెను.

సిద్ధాంతము:—"వర్ణములే శబ్దములు" అని యుపవర్షుఁడు చెప్పియున్నాఁడు. ఆశబ్దములనుండియే సర్వప్రపంచ ముద్భవింపవచ్చును. ఆవర్ణములనుండియే యర్థజ్ఞానము కలుగుచున్నది.

౧. ఇట్లగుటచే నాయుపవర్షునిమతమే మాకును సమ్మతము. స్ఫోట మనుపదార్థ ముండుటకే వీలు లేదు.

౨. "వర్ణములు ఎప్పటి కప్పుడు క్రొత్తవి యగుచుండును" అనుట సంభవింపదు. వానివిషయమున ప్రత్యభిజ్ఞానము కలదు. "వాఁడు ఉచ్చరించిన రామశబ్దమునే వీఁడు కూడ నుచ్చరించెను" అను ననుభవము లోకమున కలదు కదా !

"వర్ణము లన్నియు సమానములుగానే యుండుటచే నట్టి ప్రత్యభిజ్ఞానము కలుగుచున్నది. ఇంతమాత్రమునవలన "ఎన్నిమాఱు లుచ్చరింపఁబడినను వర్ణ మొక్కటియే అనుటకు వీలు లేదు. వెండ్రుకలు మొదలగునవి వేరువేరు స్థలములయందు వేరువేరుగ నున్నను వానికిఁ బరస్పరసాదృశ్య ముండుటచే 'ఇదియు నెండ్రుకయే ఇదియు నెండ్రు

కయే" అని లోకమున ప్రత్యభిజ్ఞానము కలుగుచున్నది కదా! అనియెద వేమొ! యది సరిపడదు. వర్ణములవిషయమున నుండు ప్రత్యభిజ్ఞానము నకు నెట్లును బాధ వచ్చుట లేదు. "ఆవర్ణమే యీవర్ణము. అదియు నిదియు నొక్కటియే" అనిన దానిని ఖండించుటకు సమర్థమగుయుక్తి యెద్దియును లేదు. వెంట్రుకలు మొదలగువానివిషయములయం దన్ననో యట్టియుక్తు లనేకములు కలవు. "రామునివెండ్రుకలే కృష్ణునివెండ్రు కలు" అనుట ప్రత్యక్షవిరుద్ధము కదా? ఈకారణమువలన నాస్థలముల యందుఁ గలప్రత్యభిజ్ఞానము కేవలసాదృశ్యమును మాత్రమే యాశ్ర యించినది కావచ్చును గాని వర్ణవిషయమున మాత్ర మట్లు కా నక్కఱ లేదు.

"ఇట్లు కాకున్నను ఆకారము నాశ్రయించి యాప్రత్యభిజ్ఞానము కలుగవచ్చును. ఇంతమాత్రమున వర్ణము ఉత్పత్తివినాశనంతము కాక పోవలయునా?" అనియెదవేమొ యదియు యుక్తము కాదు. రెండు మారులు యకారము నుచ్చరించినది "మొట్టమొదట నుచ్చరించినదియు యకారమే. ఇప్పు డుచ్చరించినదియు యకారమే" అని యకారవ్యక్తియే గుఱుతింపఁ బడుచుండుట యనుభవసిద్ధమై యున్నది. వ్యక్తులయందు పరస్పరభేద ముండినచో నప్పుడు అట్టివ్యక్తులను గూర్చి జనించు ప్రత్య భిజ్ఞాన మాకారమును మాత్రమే యాశ్రయించినదై యుండును. బహు విధము లగువర్ణములు మచ్చలు మొదలగునవి కలిగి పరస్పరభిన్నములై గానవచ్చు గోవ్యక్తులఁ జూచినప్పుడు "ఇదియును గోవే ఇదియును గోవే" అని కలుగు ప్రత్యభిజ్ఞానము ఆకారమును గూర్చినదియై యుండును. అట్లే యున్నదనుటయుఁ బ్రత్యక్షానుభవసిద్ధము. వర్ణములు మచ్చలు మొదలగునవి యంత భిన్నములుగ నున్నను గోవుల కన్నిటికి నాకారముమాత్ర మొక్కటియే యగును కదా! ప్రస్తుతవర్ణవిషయము మాత్ర మిట్టిది కాదు. వర్ణవ్యక్తులయందు పరస్పరభేద మింత యైనను లేదు. "గోశబ్దము రెండుమాఱు లుచ్చరింపఁ బడినది" అని మాత్రమే లోకమున వ్యవహారము కలదు; కాని, "రెండుగోశబ్దము లుచ్చరింపఁ బడినవి" అనువ్యవహారము లేదు కదా!

"ఇప్పటికిని వర్ణ మొక్కటియే పలుమాఱు ఉచ్చరింపఁబడును" అనుట నిలువనేరదు. ఉచ్చారణభేదమువలన వర్ణభేదము కలుగుచు

న్నట్లు తెలియవచ్చుచున్నది. అనేకులు అధ్యయనము చేయుచున్నపుడు "దేవదత్తుఁడు చదువుచున్నాఁడు, యజ్ఞదత్తుఁడు చదువుచున్నాఁడు" అనుజ్ఞాన ముచ్చారణభేదమువలన కలిగిన వర్ణభేదమువలననే కదా జనించుచున్నది!" అనియెదవేమొ యట్లు కాదు. వర్ణములకు స్వరూపమున నెప్పటికిని భేదము రానేరదు. వానిని పరస్పరము చేర్చుట విడఁదీయుట మొదలగువాని నాశ్రయించియే యట్టిభేదము తోఁచుచున్నది. సంయోగవిభాగాదులవలననే కదా వర్ణములు స్పష్టములు కావలయును. "రామోఽస్తి=రామః అస్తి" అనుమొదలగునవి క్రమముగ సంయోగ విభాగము లని తెలిసికొనవలయును. వీని నుచ్చరించుటలోఁ గలభేదములనే అక్షరములపై నారోపించి వానిని భిన్నములుగా నున్నట్లు భ్రాంతిచే దలంచుచున్నాము. ఇంతయే కాని వర్ణరూపములలో భేదమే లేదు. కావున వర్ణములు ఉత్పత్తి వినాశములు కలవి కా వనుట నిశ్చయ మైనది.

మీమతమునందును ఇట్లు చెప్పకపోయిన మఱియొకవిధముగ దోషము వచ్చును. వర్ణవ్యక్తులు ఉచ్చరింపఁబడు సమయములయందెల్లను భిన్నములే యని కదా మీమతము! అప్పుడు లోకానుభవసిద్ధ మగు ప్రత్యభిజ్ఞానము నెట్లు సమర్థింపఁగలరు? ప్రత్యభిజ్ఞానమును సమర్థించుటకై యప్పుడు నిత్యమగు నాకారము నొక్కదాని నంగీకరించితీరవలయును. అప్పుడు "అనేకులు అధ్యయనము చేయుచున్నప్పుడు వర్ణములయందు పరస్పరభేద మున్నట్లు స్పష్టముగఁ దెలియుచున్నది. ఇది రామునియుచ్చారణము కృష్ణునియుచ్చారణము అను విషయము సర్వవ్యవహారసిద్ధమై యున్నది కదా!" అనునాక్షేపము వచ్చినచో నేమి సేయుదురు? ఏదియో యొకవిధముగ ఆయాకారములను గూర్చియే భ్రాంతిచే భేదజ్ఞానము కలుగుచున్నది. అదియు వారివారియుచ్చారణములయందుఁ గలసంయోగాదిభేదములచేఁ గానవచ్చునది" అనియే చెప్పవలయును కదా! కావున నిట్లు చేయుటకంటె ఆవ్యక్తులనే నిత్యములుగ నంగీకరించి వానినిగూర్చియే సర్వము నుఁ జెప్పుట * లాఘవము కదా! కావున నెట్లు చూచినను వర్ణముల

* లాఘవ మనఁగా చులకఁదనము, నిరర్థకముగ నధిక మగువిషయమును లేక, పదార్థమును అంగీకరింపకుండుట ప్రకృతమున వర్ణసమూహామే పద మనియును నటనుం

యందు ప్రత్యభిజ్ఞానము లోకప్రసిద్ధమై యున్నది; కావున నవి యుత్పత్తి వినాశముకలవి కానేరవు. "వర్ణములు నాశవంతములైనవి యగుట చేతను, ప్రత్యేకముగఁ గాని, పరస్పరసంబంధము కలిగి కాని యర్థజ్ఞాన సాధనములై యుండుటకు వీలు లేకపోవుటచేతను, అవిశబ్దము కానేరవు." అనియే కదా మీయాక్షేపము. అందు మొదటిపక్ష మింతతో ఖండింపఁబడినది.

"లేదు. ఇప్పటికిని వర్ణవ్యక్తులు నిత్యము లనుట స్థిరము కాలేదు. అధ్యయనవిషయమున మీరిచ్చినయుత్తరము చాలదు. సంయోగవిభాగాదు లెట్లయిన నుండును గాక. ఒక్కవర్ణమే పదిమంది యుచ్చరించిన నంతమాత్రమున పదిరూపములు కలది యెట్లగును?" అనియెదవేమో వినుము. * ఉదాత్తాదిస్వరభేదముల నాశ్రయించియు అను*నాసికత్వము మొదలగుధర్మముల నాశ్రయించియు నట్టిభేదము స్ఫురింపవచ్చును.

---

డియే యర్థజ్ఞానము కలుగు నని రుఁ జెప్పిన సరిపడుచుండు నధికముగ స్ఫోటము నంగీకరింపకుండుట.

* ఉదాత్తాదిస్వరభేదములు.—అకారము కవర్గము హకారము విసర్గము అనునవి కంఠమునుండిపుట్టును. ఇకారము చవర్గము యకారము శకారము అనునవి దవుడలనుండి జనించును. ఉకారము పవర్గము ఉపధ్మానీయములు (ప ఫ) పెదవులనుండిపుట్టును, ఋకారము టవర్గము రకారము షకారము అనునవి శిరస్సునుండి పుట్టును. ఌకారము తవర్గము లకారము సకారము అనునవి దంతములనుండి పుట్టును వర్గములయందలి యంత్యాక్షరములును అనుస్వారంబును నాసికనుండి జనించును. ఏకారము ఐకారము కంఠమునుండియుఁ దవుడలనుండియుఁ గూడ జనించును. సంస్కృతభాషయందు ఎకారము లేదు. ఓకారంబును ఔకారంబును కంఠమునుండియు పెదవులనుండియు గూడ జనించును. సంస్కృతమున ఒకారము లేదు. వకారము దంతములనుండియు పెదవులనుండియు గూడ జనించును. జనించుట యనఁగా: దేహమునం దున్న యగ్నిచేఁ బ్రేరేపింపఁబడి శబ్దమును బుట్టించుటకై పైకి వెడలినవాయువు ఆయాస్థలములను స్పృశించుటవలన ప్రకటము లగుటయే.

అందు ఆస్థానములను ఊర్ధ్వాధోభాగములనుగా విభజించినచో నందు నూర్ధ్వభాగమున జనించుస్వర ముదాత్తస్వరము. అధోభాగమున జనించునది యనుదాత్తము. మధ్యభాగమున స్వరితము. ఈమూఁడును అచ్చులకే కాని హల్లుల కుండవు. వానికి నేదియో యొకయచ్చుయొక్క సాహాయ్యము లేక స్వతంత్రముగ పలుకఁబడియే లేను కదా!

* నాసికతోను ముఖముతోను కలిసి యుచ్చరింపఁబడుట యనునాసికత్వము.

ఇంతమాత్రమువలన వర్ణవ్యక్తులకు భేదము రా నక్కఱ లేదు. భేద ములు ఉదాత్తాదులయందే కలవు; గాని వర్ణములయందు ఎట్లుచూచి నను గానరావు. అందఱును గకారమునే యుచ్చరించుచున్నారు. ఒకఁడు దాని నుదాత్తస్వరముతో నుచ్చరించెను. మఱియొక్క డనుదాత్తస్వర ముతో పలికెను. ఇంతకు వర్ణ మొక్కటియే కదా! కావున వర్ణవ్యక్తుల యందు భేద మెప్పటికిని లేదు. ఒకదానికి నున్నభేదమును మఱియొక దానిపై నారోపించుటయు సయుక్తికము కానేరదు.

ఇట్లు కాకున్నను ఆభేదభ్రాంతి కంఠధ్వనిభేదమును బట్టి కలిగి యుండవచ్చును. వర్ణములకంటె భిన్నముగ ప్రతిపురుషునియందును కంఠ ధ్వని యొక్కటికల దనుట ప్రత్యక్షసిద్ధము. బహుదూరమున నుండి వర్ణవిభాగమును తెలిసికొనలేనప్పుడు కూడ మనము ధ్వనిని గ్రహించు చున్నాము. సమీపమునకు వచ్చుకొలఁది వర్ణవిభాగమును గ్రహించి నను "వీఁడు చదువుట మృదువుగ నుండును. వీఁడు అట్లు చదువలేఁడు" అని యావర్ణములయందు ధ్వనిప్రభావముచేతనే మృదుత్వపరుషత్వాది ధర్మముల నారోపించుచున్నాము. ఇట్టియారోపనే వర్ణరూపభేదభ్రాం తికిఁ గారణము.

మఱియు పైనఁ జెప్పఁబడిన యుదాత్తాదిస్వరములు కూడ నాధ్వ నుల నాశ్రయించినవియే; కాని వర్ణస్వరూపము నాశ్రయించినవి కావు; వర్ణస్వరూపములే యైనవియు కావు. ఉచ్చరించినప్పు డెల్ల ఉదాత్తాది స్వరము లెంతభిన్నములుగ నుండినను అక్షరవ్యక్తిమాత్ర మొక్కటియే యని గుఱుతింపఁబడుచుండుట సర్వానుభవసిద్ధము. "ఈసంయోగ మున కకార ముదాత్తస్వరముతో నుచ్చరింపఁబడవలయును. రాముఁ డట్లే యుచ్చరించుచున్నాఁడు" అనుమొదలగు వ్యవహారములు లోక మున ప్రసిద్ధములై యున్నవి. కొన్నికొన్నిమాఱులు "వీఁడు స్వరమును పాటించుట లేదు" అను వ్యవహారమును గూడ చూచుచున్నాము. దీనిచే స్వరములకును వర్ణములకును ఏదియో యొకసంబంధముమాత్రమే యుండవలయు నంతియె కాని అభేద ముండుటకు వీలు లేదు. అభేదమే యున్నయెడల భేదానుభవము సంభవింపనేరదు కదా! కావున ధ్వని యన్నను ఉదాత్తాదిస్వరములన్న నొక్కటియే. వానిభేదములచేతనే వర్ణములకుఁ గూడఁ బరస్పరభేదము తోఁచుచున్నది. ఇంతయే కాని

వాస్తవస్థితిలో వర్ణవ్యక్తులు ఎన్నిమాఱు లుచ్చరింపఁబడిన నొక్కటియే; ఏకరూపములే. కావున నవి యథార్థజ్ఞానమును కలిగింపవచ్చును.

"ఇట్లు చెప్పనేల ఆయుదాత్తాదులు వర్ణములనే యాశ్రయించి వానికి భేదమును కలిగించు ననరాదా" అనియెదవేమొ వినుము. వర్ణవ్యక్తులకు ప్రత్యభిజ్ఞానము కలదు కావున నవి యేకరూపములే యని యిదివరకే స్పష్టము చేసియున్నాము. ఉదాత్తాదిభేదములవలన వానికి భేదము కలుగఁ బోదు వ్యక్తులు భిన్నములైనంతమాత్రమున వాని కాశ్రయభూత మగుజాతిని భిన్నముగ భావింప నగునా?

ఈవిధముగ విచారించినఁ బరస్పరభేదములు గలయుదాత్తాది స్వరములు ఏకరూపము లగువర్ణముల నాశ్రయించుట సంభవింపదు. గుణములు తమయాశ్రయము నెప్పటికిని విడచిపో వనుట సర్వప్రమాణసిద్ధము. స్వరములు మార్పునొందుచున్నవి యనుటయు నట్టిదియే. ఇట్లుండ నుత్పత్తి వినాశములు కలస్వరములు నిత్యములగువర్ణముల నెట్లాశ్రయింపఁగలవు?

ఈదోషమును నివారించుటకై "వర్ణసంయోగమును గాని విభాగమును గాని యుదాత్తాదిస్వరము లాశ్రయించి యుండును" అన వలసి వచ్చును. ఇప్పుడు సంయోగవిభాగములు ప్రత్యక్షములు కావు. అవి గుణములు కదా! రెండువస్తువులకు పరస్పరసంయోగముగాని విభాగముగాని కలిగినచో దానిని నేత్రేంద్రియముచేతను, త్వగింద్రియముచేతను తెలిసికొనుటకు వీలు కలుగును. వర్ణ సంయోగవిభాగము లట్టివి కావు. పూర్వవర్ణము నుచ్చరించినంతమాత్రముననే అపర వర్ణము గోచరము కాదుకదా! అప్పుడు వానిసంయోగ మెట్లు ప్రత్యక్షమగును? ఈవిధముగ సంయోగవిభాగములు ప్రత్యక్షములు కాక పోవుటచే వాని నాశ్రయించియున్న యుదాత్తాదులు వర్ణముల నాశ్రయించినవియే యని చెప్పుటకు నవకాశ ముండదు. ఆశ్రయమే యప్రత్యక్షమై యుండ, నిఁక దానాశ్రయించినవానిని గూర్చి విమర్శించుటకు నవకాశ మెటనుండి వచ్చును; నిర్ణయించుటకు నవకాశ మెట్లు కలుగును? కావున నుదాత్తాదులు వర్ణముల నాశ్రయించియున్నవని చెప్పినచో నవి నిరాధారములే కావలసివచ్చును. ఈకారణమువలన "ఉదాత్తాదులు ధ్వని నాశ్రయించినవియే, లేక, ధ్వనిరూపములే" యని తీర

 

వలయును. అప్పుడు వానికి చక్కనియాధారము దొరకును. ధ్వనికిని వర్ణమునకును సంబంధము కలదు కావున దానిమూలముగ వర్ణములతో సంబంధించుటయు, తటస్థించును. కావున వర్ణభిన్నముగ ధ్వని కల దనుటయు, దానిచే వర్ణములయందు భేదభ్రాంతి కలుగుచున్నది యనుటయు, వాస్తవస్థితిలో వర్ణవ్యక్తులకు (అనఁగా: రెండుమాఱు లుచ్చరింపఁబడినకకారాదులకు) భేదము లే దనుటయు, స్పష్టమైనది.

ఇట్లు వర్ణము నిత్య మగుటచే దానివలననే యర్థజ్ఞానము కలుగ వచ్చును. కావున వర్ణములకంటె భిన్నముగా స్ఫోట మనునొకదానిఁ గల్పింపవలసిన యక్కఱ లేదు. వర్ణములకు నర్థజ్ఞానము నొసంగుసామ ర్థ్యము లేకుండిన కదా యాస్ఫోటము నంగీకరింపవలసి వచ్చును! ఇచ్చట నిట్టినిర్బంధ మేదియు లేదు.

3. ౪. మఱియు వర్ణములు ప్రత్యేకముగ నర్థమును తెల్పునని యేమూర్ఖుఁడును చెప్పఁడు. అవి యన్నియు నొకదానితో నొకటి సంబంధపడియే యర్థజ్ఞానమును కలిగించును.

౫. "రెండవవర్ణము నుచ్చరించునప్పుడు మొదటివర్ణ ముండదు కదా" అని యెదవేమొ యది యొకదోషము కానేరదు.

౬. అప్పుడు మొదటివర్ణము లేకున్నను దానివలనఁ గలిగిన సంస్కారము బుద్ధియందు నిలిచియుండును. ఆసంస్కారంబును రెండవ వర్ణంబును, ఇట్లే కడపటివర్ణంబును పూర్వవర్ణమువలనఁ గలిగినసంస్కా రములును గలసి బుద్ధియందే సముదాయముగ నేర్పడును. దానివలననే యర్థజ్ఞానము కలుగును అదియే పదము.

౭. "వర్ణములకు పరస్పరసంబంధమును కలిగించుసంస్కారము పూర్వమీమాంసామతస్థు లేర్పఱచినయపూర్వసంస్కారమే" అనుట మాకు సమ్మతము కాదు. అది స్మృతిని కలిగించునట్టి భావనాసంస్కారమే.

౮. ఈసంస్కారము అర్థజ్ఞానమును కలిగించు ననుటలో విరో ధము లేదు. ఇది వర్ణములకు పరస్పరసంబంధము కలిగించు ననుట యందఱకును సమ్మతమే; మీకును సమ్మతమే. లోకమునందును "రా, మ" అను రెండువర్ణము లుచ్చరింపఁబడినపిదప నావర్ణములే బుద్ధియందు స్ఫురించుచున్నవి; కాని, వానికంటె నన్య మగుస్ఫోటము కాని మరి యేదికాని స్ఫురించుట లేదనుటయుఁ బ్రత్యక్షానుభవసిద్ధము. వర్ణసము

దాయరూప మగునారామపదముచేతనే "దశరథపుత్రుఁడు" అను నర్థము వచ్చుచున్న దనుటయు నట్టిదియే. ఆవర్ణములవలన స్ఫోటము జనించె ననినను, ఆవర్ణములే పద మనినను, అర్థముమాత్రము దాని నుండియే (బుద్ధియందు స్ఫురించుచున్నదానినుండియే) జనించుచున్నది యనుట నిస్సంశయము.

కావున నాభావనాసంస్కారము వర్ణములనుమాత్రమే స్మరింపఁజేసినఁ జాలును. అంతకంటె క్రొత్తగా నర్థమును తెలుప నక్కఱ లేదు. పూర్వోత్తరవర్ణములు స్మృతికి వచ్చి ఏకపదమై నిలిచిన * సంకేతానుసారముగ నర్థము తనంతనే స్పష్టమగును.

మఱియు "జరా, రాజ" అనుమొదలగు స్థలములయందు వర్ణము లొక్కటియే యైనను స్మృతిక్రమానుసారముగనే కలుగును గావున దోష మేమియు నుండదు. స్మృతి వర్ణము లెట్లుండునో అట్లే యుండిన నిఁక నర్థవిపర్యాస మేల కలుగవలయును?

౯ కావున నెట్లు చూచినను వర్ణసముదాయమే పదము. దాని నుండియే యర్థజ్ఞానము కలుగును. భావనాసంస్కారమువలన నర్ణము లన్నియు నంత్యవర్ణముతోఁ గూడి బుద్ధియందు నిలచి పదమై సంకేతానుసారముగ నర్థమును కలిగించును.

ఒకవేళ నీవర్ణములు నిత్యము లని యంగీకరింపకపోయినను మామతమున విరోధము రాదు. ప్రత్యభిజ్ఞాన మొక్కటి దృఢముగ నున్నదికావున నది సిద్ధించుటకై వర్ణజాతి నొక్కదానిని మీరును అంగీకరింపవలసియే యుండును. అప్పుడు పైనఁ జెప్పఁబడిన భావనాసంస్కారంబును, వర్ణములన్నియు నేకముగ బుద్ధియందు స్ఫురించుటయు, దానివలన నర్థజ్ఞానము కలుగుటయు మొదలగునవి యన్నియు నాజాతులయందే కల్పింపవచ్చును. కావున నెట్లు చూచినను వర్ణములే శబ్దము. స్ఫోట మనుదానిఁ గల్పింప నక్కఱలేదు.

౧౦ "స్ఫోటము ప్రత్యక్షమైయ్యే యున్నది కదా! దానిని క్రొత్తగాఁ గల్పించితిమా!" అనియెదవేమొ వినుము. మేము పదము నుగూర్చి యెట్లు చెప్పితిమో నీవు స్ఫోటమునుగూర్చి కూడ నట్లే చెప్పి

---

* సంకేత మనఁగా: శాస్త్రము. దీనివలన నీయర్థమును తెలిసికొనవలయును అను నియమము.

యున్నావు. పదమువలెనే యదియు భావనారూపసంస్కారముచేఁ బర స్పరసంబంధము నొందినవర్ణములవలననే కలుగు ననుచున్నావు. ఇఁక నీకును మాకును భేద మేమి యనినః నీవు "స్ఫోటము వర్ణసముదాయ మునకంటె భిన్నము" అనుచున్నావు; నేను "పదము వర్ణసముదాయ రూప మైనదియే" యనుచున్నాను. బుద్ధియందును రామశబ్దము నుచ్చ రించినప్పుడు రకార ఆకార మకార అకారములే బుద్ధియందు స్ఫురిం చుట యనుభవసిద్ధమై యున్నదికాని, వానికంటె భిన్నము లగుయకార షకారాదులు స్ఫురించుట యనుభవమున లేదు. నీవు చెప్పినట్లు వర్ణ భిన్న మగుస్ఫోటమే వర్ణోచ్చారణమునకుఁ బిదప బుద్ధియందు స్ఫురించు నేని, యకార షకారాదులవలెనే రకారాదులును బుద్ధినుండి తొలఁగి పోవలయును. ఇది యనుభవమున లేదు కదా! కావున వర్ణసముదా యమే పదము. వర్ణాతిరిక్త మగుపదార్థ మెద్దియు నర్థజ్ఞానమును కలి గించుటకై బుద్ధియందు స్ఫురించుట లేదు.

౧౧. "వర్ణము లనేకము లై యుండ 'ఇదియొక పదము' అని బుద్ధియందు స్ఫురించుట విరుద్ధము కదా" అనియెదవేమొ వినుము. ఇందు విరోధ మింతయును లేదు. లోకమున, ననేకవృక్షములఁ జూచి నప్పుడు "ఇది యొక యరణ్యము" అనియు, అనేకమనుష్యులఁ జూచి నప్పుడు "ఇది యొక సైన్యము" అనియు సామాన్యముగ వ్యవహరించు చున్నాము. మఱియు ననేకపదార్థములఁ గలిపి "పది, నూఱు, వెయ్యి" అని యేకముగ వ్యవహరించుచున్నాము. ఇట్లే యనేకవర్ణముల "ఇది యొక పదము" అని వ్యవహరింపవచ్చును. ఇందు విరోధ మేమి?

౧౨. మఱియు మీరు స్ఫోటమును వర్ణములనుండి గాని ధ్వనుల నుండి కాని ప్రకాశిత్వము నొందుదానినిగాఁ జెప్పుచున్నారు. పదము కూడ నిట్టిదియే కావచ్చు నని నిరూపించియున్నాము. మాకు నెందును దోషము రాదు. వర్ణసముదాయ ముండిననే కాని దానివలన పదబుద్ధి కలుగదు. మీమతమునం దన్ననో స్ఫోటము క్రొత్తది. ఇట్లగుటచే నున్నదానిని విడిచి లేనిదానిని కల్పించుట యనుదోషము దుర్నివారమై వచ్చును.

౧౩. "స్ఫోటము వర్ణసంస్కారములవలన కొంచెముకొంచెముగ జనించును అర్థము ఇట్లు జనించుటకు వీలు లేదు. కావున నర్థమునకును

వర్ణసముదాయమునకును నడుమ నేదియో యొకపదార్థ ముండవల యును" అని యున్నావు; కాని యదియు యుక్తము కాదు. ఇట్లు అను భవవిరుద్ధ మగుపదార్థమును కల్పింపఁజూచుటకంటె, ప్రత్యేకవర్ణసం స్కారములవలన వర్ణసముదాయ మేర్పడును. అదియే పదము. దాని నుండి యర్థము జనించును" అనుట తేలిక యగుమార్గము కదా!

కావున నెట్లు చూచినను స్ఫోట మనునది యుండుటకే వీలు లేదు. వర్ణసముదాయమే పదము. వర్ణములు నిత్యము లగుటచే నదియు నిత్యమే. మొట్టమొదట వివరింపఁబడినరీతిగ నర్థములును జాతినాశ్ర యించునవియే యగుటచే నిత్యములే. ఇట్లు శబ్దార్థసంబంధము నిత్యము కావున నాయర్థముచేఁ దెలుపఁబడుప్రపంచము శబ్దమునుండి జనించు ననుటలో విరోధ మేమియును లేదు. శబ్దార్థములకుఁ గలసంబంధము నిత్యసంబంధమే యగును కదా!

## ౯౨. అత ఏవ చ నిత్యత్వం. ౧. ౩. ౨౯.

తాత్పర్యము:—మఱియు పైనఁ జూపినకారణమువలనఁ గూడ వేదమునకు గలనిత్యత్వము దృఢ మగును. ఈప్రపంచము అనిత్య మగు పదార్థమునుండి జనించుటకు వీలు లేదు. కారణమునకుఁ గూడ మఱి యొకకారణ ముండవలసివచ్చుచుండిన ననవస్థాదోషము దుర్నివారమై సంభవించును కదా! ఈకారణమువలన పరమేశ్వరునివలె వేదము కూడ నిత్యమే యని చెప్పి తీరవలయును.

"ప్రతికల్పమునందును వేదము ఆయామునులచే నేర్పరుపఁబడు చున్నది. ఇట్లుండ దానికి నిత్యత్వ మెట్లు వచ్చును" అనియెద వేని విను. మునులు ఆవేదమును తమతపోబలముచే బ్రకాశింపఁజేయు వారే కాని పుట్టించువారు కారు. తపోబలమువలన అనాదిసిద్ధము లగు వేదము లట్లే వారిమనస్సునందు ప్రతిఫలించును. "యుగాంతే ఽన్త ర్హితా న్వేదా న్సేతిహాసా న్మహర్షయః లేభిరే తపసా పూర్వ మను జ్ఞాతా స్స్వయంభువా" "యుగాంతమున నంతర్ధానమును జెందియున్న వేదములను చతుర్ముఖునియనుగ్రహమువలన మహర్షులు తమతపో బలముచే సంపాదించిరి" అనుస్మృతి ఈవిషయమునే స్పష్టము చేయు

చున్నది. నిత్యత్వమనఁగా * అవాంతరప్రళయములయందు నశింపకుం డుటయే యని తెలిసికొనవలయును.

"ఈవిషయము పూర్వమీమాంసశాస్త్రమునందే దృఢము చేయఁబడియున్నది. వేదము నిత్యమని యచ్చటనే తగినయుక్తులతో నిరూపించి యున్నారు. ఇట్లుండ మఱల నిచ్చట దానిప్రస్తావ మేల" అనియెదవేమొ వినుము. అచ్చట వేదనిత్యత్వము స్థాపింపఁబడె ననుట నిశ్చయమే కాని యందు కొంతదోషము కలదు. జైమిని వ్యక్తులను నిత్యములుగా నంగీకరించి, దానిమూలమున వేదార్థమును నిత్యముగ స్థిరపరచెను. అది కొంతవిరుద్ధముగ నుండుటచే తగినయుక్తుల నిరూపించి యీవ్యాసమతమున "జాతియే నిత్యము. దానినే శబ్దము చెప్పును" అనువిషయము సిద్ధాంతము చేయఁబడి యున్నది. లోకమునను నామము, జాతిని గూర్చియే చెప్పును కాని వ్యక్తిని చెప్పదు కదా! మనము కల్పించుకొనిన రామకృష్ణాదినామములు వ్యక్తులను చెప్పుచున్నను అవి వ్యక్తిసంజ్ఞామాత్రములై వ్యక్తినాశముతోఁ గూడ నశించిపోవుచున్నవి. కావున వేదము కూడ వ్యక్తులను గూర్చి చెప్పునదియే యగునేని కల్పితనామములవలెనే నశించి పోవలసి వచ్చును. ఈదోషమును నివారించుటకై వ్యాసమహామునిచే నట్టిసిద్ధాంతము చేయఁబడెను. * ద్రవ్యగుణకర్మలయొక్క వ్యక్తులుమాత్రమే జనించును; కాని యాకారము లెన్న

* పంచప్రళయములు:—నిత్యము నైమిత్తికము దైనందినము కల్పాంతము. మహాప్రళయము అని ప్రళయము లైదు. అందు ప్రతిదినంబును సుషుప్త్యవస్థయందు కలుగు నింద్రియాదులవిలయము నిత్యప్రళయము' యుగాంతములందును మన్వంతరాంతములందును లెక్కకు మిక్కిలి యగుభూతములు నశించిపోవుట నైమిత్తికప్రళయము. బ్రహ్మదేవుఁడు నిదురించునప్పుడు పంచభూతావశేషముగా కలుగు సర్వజంతునాశము నందినప్రళయము. బ్రహ్మదేవునకు నూఱుసంవత్సరములు నిండినపిదప పంచభూతసహితముగ మూలప్రకృతి మాత్రావశేషముగఁ గలుగుప్రళయము కల్పాంతప్రళయము. ఇదియే బ్రహ్మప్రళయము. దీనినే మహాప్రళయశబ్దముతో సూత్రవ్యాఖ్యానమునందు వర్ణించియున్నాను. వాస్తవస్థితిలో బ్రహ్మజ్ఞానప్రభావమువలనఁ గలుగు నవిద్యానాశము మహాప్రళయము (వివరము నాచే వివరింపఁబడిన సీతారామాంజనేయము. పు. ౪౨౦.)

* ద్రవ్యగుణకర్మలు:—పంచభూతములు కాలము దిక్కు ఆత్మ మనస్సు అనునవి తర్కమతానుసారముగ ద్రవ్యములు. వేదాంతమతమున నాత్మమాత్రము ద్రవ్యము కాదు.

టికిని జనింపననుట నిర్వివాదాంశము. కావున నీసిద్ధాంతము ననుస రించి చూచిన కేవలము జైమినిమతమునుమాత్రమే పట్టిచూచిన వేద ప్రామాణ్యము నిలువదు. మఱియు "మంత్రాదులు వ్యాసమతమునఁ బ్రమాణము లగుటచే 'ఇది విశ్వామిత్రసూక్తము. ఇది శాండిల్యవిద్య' అను మొదలగుమంత్రాదుల ననుసరించి వేదమునకు పౌరుషేయత్వము నంగీకరింపవలయును" అనుపూర్వపక్షముకూడ వచ్చును. దానిని నిరా కరించుటకై యీసూత్ర మారంభమైనది. వేదమునుండి జనించిన వారు ఆవేదమునకుఁ గర్త లెట్లగుదురు? కావున నిందేమియు విరో ధము లేదు.

## అ ౧. పా ౩. సూ ౩౦. ఆరంభము.

అనవతారిక:—"ఇప్పటికిని దోషము పోలేదు. మహాప్రళయ మున నాయాకారములుగూడ నశించును. అప్పటికైనను వేదశబ్దము లకు నర్థసంబంధము పోవును గదా! ఈకారణమునలన నప్పటికైనను వేదము లనిత్యములు కావలయును. కదా! మాపుతమున నన్ననో యట్టిప్రళయమే లేదు కావునను ప్రపంచము పరమార్థసత్యమే కావు నను దోషము కలుగదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౯౩. సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ.

## ౧. ౩. ౩౦.

తాత్పర్యము:— మహాప్రళయమున నాకారములుగూడ నుండ వనుట నిశ్చయమే. అయినను వేదమునకు నింతమాత్రమున నప్రా

---

శబ్దాదులైదును సంఖ్య పరిమితి పృథక్త్వము (దీనికంటె నది వేఱు అనుటకుఁ గారణమైనగుణము.) సంయోగవిభాగములు పరత్వాపరత్వములు (ఎక్కువ తక్కువలు దూరసమీపములు) పలుచఁదనము కూడిక (ముద్దయగునట్టిస్వభావము) బుద్ధి యిచ్ఛా ద్వేషములు ప్రయత్నము ధర్మాధర్మములు సంస్కారము బరువుగా నుండుట అను నీయిరువదినాల్గును తర్కమతానుసారముగ గుణములు. వేదాంతులును సామాన్యముగ వీని నంగీకరించియే యున్నారు.

ఎత్తుట విసరుట చాచుట ముడుచుట కదలుట యనునైదే కర్మలు.

మాణ్యము రానక్కఱ లేదు. ఎన్నిమాఱులు తిరిగినను ఈప్రపంచము ఒక్కవిధముగనే తిరుగుచుండును. దీనినామరూపములు ఎప్పటికి నేక రూపములే యైయుండును. సంసార మనాది. ఈవిషయమును సూత్ర కర్తయు "ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ ౨. ౧. ౩౬." అను స్థలమున నిరూపింపఁ బోవుచున్నాఁడు. కావున నిదురించి మేల్కనినవానికి వలె మహాప్రళయానంతరమున మరల జనించినవానికిఁగూడ పూర్వాను భూతము లగునామరూపములే వ్యవహారములోనికి రానచ్చును. అట్లే రావలయును. లేకున్నఁ బ్రపంచమునకు నాకస్మికత్వంబును చేసినకర్మలు ఫలము నొసంగక నశించిపోవుటయు ఆకస్మికముగ క్రొత్తఫలము లను భవమునకు వచ్చుటయు నను మొదలగు పెక్కుదోషములు వచ్చును. కావున సృష్టులన్నియు సమానములే కావలయును. ఇట్లయిన నెన్ని మాఱులు తిరిగినమాత్ర మేమివిరోధము కలదు?

సుషుప్తియు పిదపఁ గలుగుమెలకువయుఁ గ్రమముగఁ బ్రళయ సృష్టు లని శ్రుతి వర్ణించుచున్నది. "య త్రైతత్పురుషః సుప్తః స్వప్నం న కం చన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏ వై కధా భవతి తదైనం వాక్సర్వై ర్నామభిః స హాప్యేతి చక్షుః సర్వై రూపైః స హాప్యేతి శ్రోత్రం సర్వైః శబ్దైః స హాప్యేతి మనః సర్వై ర్ధ్యానైః స హాప్యేతి స యదా ప్రతిబుధ్యతే య థాగ్నే ర్జ్వలతో విస్ఫులింగా విప్రతిష్ఠే రన్నేవ మే వై తస్మా దాత్మనః ప్రాణా యథాయతనం విప్ర తిష్ఠం తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః"="పురుషుఁడు గాఢని ద్రఁజెందునప్పుడు పరబ్రహ్మమున నేకీభవించును. అప్పుడు సర్వనామ ములతోను గూడి వాగింద్రియంబును, సర్వరూపములతోఁ గూడ నేత్రేంద్రియంబును, సర్వశబ్దములతోఁ గూడ శ్రోత్రంబును, సర్వసంక ల్పములతోఁగూడ మనస్సును ఆబ్రహ్మమునందే లీనములగును. మఱియు ప్రజ్వలించుచున్నయగ్నినుండి మిడుగురులు లేచినట్లు మెలకువ వచ్చిన తోడనే మఱల నాయింద్రియము లన్నియు నాబ్రహ్మమునుండి వెలికి వచ్చును. వానినుండి యాయాజ్ఞానములు జనించును. అజ్ఞానములనుండి విషయములు పుట్టును (ప్రకాశించు ననుట)" అని శ్రుతి ప్రత్యక్షముగఁ జెప్పుచున్నది. ప్రళయ మనినను మూలప్రకృతిమాత్రము శేషించు నట్లు సర్వప్రపంచములును బ్రహ్మమున నైక్య మొందుటయే కదా!

కావున సుషుప్తిప్రళయములును ప్రబోధసృష్టులు నొక్కటియే. మేల్కనిన పురుషునివలెనే ఉత్తరకల్పమునందలి జీవులును పూర్వానుభవసిద్ధములగు నామరూపములతోనే వ్యవహరింతు రనుట నిస్సంశయము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. సుషుప్త్యవస్థయందు వ్యవహార మంతయు నశించిపోదు. ఒకపురుషునికి సుషుప్తి యున్నప్పుడు మఱియొక్కనికి మెలకువ కూడ నుండవచ్చును. అప్పుడు మెలఁకువతోనున్నవాఁడు పూర్వవ్యవహారముల స్మరించుచుండుటచే నిదురించుచున్నవాఁడు కూడ మెలఁకువ వచ్చినపిదప దాని స్మరింపవచ్చును. మఱియు అప్పుడు కాల మత్యల్పమగుటచే సంస్కారములు నశింపనేరవు. ఈకారణమునలన పురుషుఁడు సుషుప్త్యవస్థయందుఁ గొంతసేపు వ్యవహారాభావముతో నున్నను మెలఁకువ రాఁగానే వెనుకటివ్యవహారముల స్మరించుటకు తగినవీలు కలదు. మహాప్రళయ మిట్టిది కాదు కదా! ఇదియును గాక సుషుప్త్యవస్థయందు ప్రాణము లుండును; మహాప్రళయమున నవియు నశించిపోవును. ఇట్లుండ నీరెంటికిని పోలికయెటనుండి సంభవించును? కావున మనకు పూర్వజన్మస్మృతి లేనట్లు ఉత్తరసృష్టియందలివారికి పూర్వసృష్టిస్మరణ యుండుటకు వీలు లేదు.

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱలేదు. నీవు చూపినది యొకగొప్పదోషము కాదు. మహాప్రళయము సర్వవ్యవహారముల నశింపఁజేయు ననుట నిశ్చయమే కాని సర్వసంస్కారముల మాత్రము నశింపఁజేయనేరదు. సంస్కారములు ఎంతయధికకాలమునకైనను నశించు ననుటకు వీలు లేదు. జీవుఁడు తా నొనర్చుచున్న విచిత్రకర్మములప్రభావమున ననేకవిధములగు జన్మముల లెక్కకు మిక్కిలిగా నిచ్చుచున్నాఁడు. ఒకమాఱు మనుష్యుఁడై పుట్టినవాఁడు రెండవజన్మమునందుఁ గూడ మనుష్యుఁడే యగు ననుట నిశ్చయము కాదు. ఒకానొకఁడు అట్లే యైనను అనేకులు అట్లు కాకుండు రనుట నిస్సంశయము. ఒకానొకఁడు ప్రస్తుతజన్మమున మనుష్యుఁడై మఱల నెన్నియోకోట్లజన్మములు గడచినపిదప మఱల మనుష్యుఁ డగుటయు సంభవింపవచ్చును. ఇందు విరోధ మేమియు నుండదు. ఇఁక చూడుఁడు. లోకమున మనుష్యవ్యవహారముల నెఱుంగనిమనుష్యుఁ డెందైనఁ గానవచ్చుచున్నాఁడా? అందఱకును మనుష్యవ్యవహారము తెలిసియే యున్నది. అందు కోటి

జన్మములకు నంతకంటె యధికసంఖ్య గలజన్మములకుఁ బూర్వమున మనుష్యుఁడై యుండినవాఁడుకూడ నుండవచ్చును కదా! వానికి చిర కాలమునాఁడు అనుభవింపఁబడిన మనుష్యవ్యవహార మెట్లు స్మరణకు వచ్చెను? ఆసంస్కార మప్పటినుండియు లోన నడంగి యుండి మనుష్య జన్మమును కలిగింపఁగలకర్మలు పరిపాకము నొందఁగనే వెలికి వచ్చినది యనవలయును. సంస్కారము నశించిపోవునదియే యగునేని యిట్లు చిర కాలమునకుఁ గూడ ప్రకాశమును జెందుట సంభవింపదు కదా! కావున నీయనుభవమును పట్టి చూచిన సంస్కార మెంతకాలమునకైనను నశిం చునది కాదని స్పష్ట మగుచున్నది.

సామాన్యులవిషయమే యిట్లుండ నిఁక పరమేశ్వరానుగ్రహసం పన్ను లగుహిరణ్యగర్భాదులఁ గూర్చి యేమి చెప్పవలయును! వారు పూర్వకల్పమునందలివిషయముల స్మరింపఁగల రనుటలో సంశయ మేమి? అనుగ్రహప్రభావముచే నిదురనుండి మేల్కాంచినవారివలె వారు సర్వవ్యవహారముల స్మరింపవచ్చును. మనకు పూర్వజన్మవిషయములు తెలియ వనునంతమాత్రమున దివ్యజ్ఞానసంపన్ను లగువారికిఁగూడఁ దెలియకుండవలయు నను నియమము కలదా!

ప్రాణ ముండుటయు లేకుండుటయు సుషుప్తిమహాప్రళయము నకుఁ గలభేద మనుట నిశ్చయమే. అయినను సర్వవ్యవహారములు నశించి తత్కారణ మగునవిద్య మాత్రమే మిగిలియుండుట యీరెంటికిని పోలిక యని తెలిసికొనవలయును. ఉపమానోపమేయములకు నన్నివిష యములయందును పోలిక యుండ నక్కఱ లే దని యిదివరకే పలు మాఱు నిరూపించియున్నాము.

అది యట్లుండె ప్రకృతము హిరణ్యగర్భాదులకు పూర్వకల్పము నందలివ్యవహారములు స్మరణకు వచ్చు ననుటలో నింత యైన సంశ యము వలదు. వారికిఁ గలజ్ఞాన మపరిమితము. లోకమున మనుష్యులు మొదలు క్రిందఁ గలతిర్యగాదుల కన్నిటికిని క్రమక్రమముగ జ్ఞానము తక్కువ యగుచుండు ననియు, పైనఁ గలదేవాదులకుఁ గ్రమక్రమముగ నధిక మగుచుండు ననియుఁ బ్రత్యక్షముగ ననుభవించుచున్నాము. శ్రుతిస్మృతులును ఈవిషయమును నొక్కివక్కాణించుచున్నవి. ఇట్టి దానిని మనము నిరాకరింపలేము కదా! మఱియు నాద్దేవతలయందు

చతుర్ముఖుఁడు సర్వాధికుఁడు. పరమేశ్వరునివెనుక నాయనయే సర్వోత్తముఁడు కదా! ఇట్టివానికిఁ గలజ్ఞానసమృద్ధియు పైయుక్తి ననుసరించి చూచిన సర్వాధికము కావలయును. ఇట్టివాఁడు ఉత్తరకల్పమున క్రొత్తఁగా జనించినను పూర్వవ్యవహారముల స్మరించు ననుటలో సంశయమేమి?

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" = "ఎవ్వఁడు కల్పాదియందు బ్రహ్మదేవుని నిర్మించి ఆతనికి సర్వవిజ్ఞాననిధాన మగు వేదము నొసంగునో, యట్టి బుద్ధిసాక్షి యగుపరమేశ్వరుని మోక్షార్థినై నేను శరణుఁ జొచ్చెదను" అనుశ్రుతిచే నీసర్వవిషయంబును స్పష్టము చేయఁబడి యున్నది బ్రహ్మాదులయందుఁ బరమేశ్వరునకుఁ బూర్ణానుగ్రహము కల దనియు, పరమేశ్వరానుగ్రహాలబ్ధ మగు వేదముచే వారు పూర్వకల్పవ్యవహారముల స్మరింపఁ గలుగుదు రనియు, దానిచే నుత్తరకల్పమును నిర్మింతురనియు స్పష్టము చేయఁబడి యున్నది.

మఱియు వేఱొకవిధముగఁ గూడ శ్రుతిస్మృతులు ఈవిషయమును స్పష్టము చేయుచున్నవి. ప్రతిమంత్రమునకును ఉపద్రష్ట (తపోబలమున సంపాదించినవాఁడు) యగుముని యొక్కఁ డుండును. మఱియు దాని నిబంధనమునకు ననుకూల మగుఛందస్సు కూడ నుండును. వాని నన్నిటి నెఱుంగవలయు ననియు, అట్లు తెలిసికొనక నామంత్రమును జపించినఁ బ్రయోజనము లేదనియు శ్రుతి చెప్పుచున్నది. స్మృతియును చెప్పుచున్నది. "యో హ వా అవిదితార్షేయచ్ఛందోదైవతబ్రాహ్మణేన మంత్రేణ యాజయతి వాధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి గర్తం వా ప్రతిపద్యతే"="ఏపురుషుఁడు ఋషిని, ఛందస్సును, దేవతను, బ్రాహ్మణమును గుఱు తెఱుంగక మంత్రానుష్ఠానమును జేయునో ఆమంత్రముచే పరులకుఁ గర్మకలాపమును నడపునో కాక నామంత్రమును పరుల కుపదేశించునో యట్టివాఁడు స్తంభమగును. గోతిలో నైన పడినవాఁ డగును (అనఁగా: వారితో సమానుడగు ననుట)" అని యారంభించి వేదము పైవిషయమును స్పష్టము చేసియున్నది. వేదము ప్రతికల్పమునందు నేకరూపమే యగుటచే

నీఋషులు నట్టివారే కావలయును. "వేదమును గూర్చి యింకను నిర్ణయము కాలేదు కదా!" యనియెదవేమొ, అయినను, వేదము ఋషులచేఁ గల్పింపఁబడినది కాదనియు, స్మరింపఁబడుచు మాత్రమే యున్నదనియు నిదివరకే స్పష్టము చేసి యున్నాము. కావున "ఋషుల నెఱుంగవలయును" అనిన "పూర్వకల్పమునందలిఋషుల స్మరింపవలయును" అనియే యర్థమగును. ఆమునులు మనకు ప్రాచీనులే యైనను సృష్ట్యాదియం దుత్పన్నుఁ డైనహిరణ్యగర్భునకు ప్రాచీనులు కారు కదా! కావున నాహిరణ్యగర్భుఁడు పూర్వకల్పమునందలివారి నే తప్పక స్మరింపవలసినవాఁ డగు ననుటలో సంశయము లేదు. మఱియు ప్రాణులకు సుఖము కలుగుటకై ధర్మంబును దుఃఖము తొలంగుటకై యధర్మనిషేధంబును శ్రుతియందుఁ జేయఁబడి యున్నవి. వాని ననుసరించియే క్రమముగ సుఖదుఃఖములయందు సర్వజనులకును రాగద్వేషములు కలుగుచున్నవి. ప్రతివాఁడును తనకు తోఁచినకొలఁది, శక్తియున్నంత కొలఁది అవకాశము దొరకినకొలఁది ధర్మాధర్మముల నాచరించుచున్నాఁడు. ఉత్తరజన్మమునందును ఉత్తరకల్పమునందుఁ గూడ తత్ఫలములనే యనుభవించుచున్నాఁడు. ఇట్లే చెప్పి తీరవలయును లేకున్న నాకస్మికత్వాదిదోషములు వచ్చు నని యిదివరకే చెప్పి యున్నాము కదా! ఈకారణమువలన నుత్తరకల్పము అవశ్యముగ పూర్వకల్పసమానమై యుండి తీరవలయు ననుట నిస్సంశయము.

సృష్టి యనునది నశించిపోయినపదార్థముల మఱల పుట్టింపఁగలుగు నంతియె కాని వానిస్వభావముల మార్పఁగలదా? అట్లు మార్చుట కింత యైనను వీలు కలదా? ఎప్పటి కైనను "మంటినుండి వస్త్రము జనించెను. దారములనుండి కుండ జనించెను" అనిన నీవు విశ్వసింతువా? అట్లయిన పదార్థభేదముతో నావశ్యకము లేక జనులు ప్రవర్తింపవలయును. దాహము గొనినవాఁడు పాత్రములో నగ్నిని వైచి కొని త్రాగవలయును. చలిచే బాధపడువాఁడు నీటిలో మునుఁగవలయును. ఇది సంభవించునా? కావున నెన్నిసృష్టు లైనను పదార్థస్వభావములకు మార్పు కలుగకూడదు. ఇంద్రియములకును శబ్దాదివిషయములకును గలసంబంధ మొకప్పుడు మఱియొకవిధముగ నుండె ననుటకు వీలు కలదా? అది శ్రుతికిని అనుమానాదిప్రమాణములకును

గూడ విరుద్ధ మగును. కావున నెట్లు చూచినను సర్వకల్పములు నేక రూపము లై యుండి తీరవలయును. సర్వప్రపంచము కారణభూత మగునవిద్యాశక్తిమాత్రము మిగులునట్లుగా నశించును; దానినుండియే పూర్వానుగుణముగ మఱల జనించును.

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" "సూర్యచంద్రులు మొదలగు నీప్రపంచము నంతయును బ్రహ్మదేవుఁడు పూర్వకల్పమునందువలెనే సృజించెను" అను మొదలగుశ్రుతులును "య థర్తు ష్వృతులింగాని నానారూపాణి పర్యయే, దృశ్యంతే తాని తా న్యేవ తథా భావాని పర్యయే" "ఈసంవత్సరమునఁ గానవచ్చిన ఋతుధర్మములే మరుచటిసంవత్సరమునఁ గూడ గానవచ్చినట్లు ఈకల్పమున నున్నవ్యవహారములే యుత్తరకల్పమునఁ గూడ నుండును" అనుమొదలగుస్మృతులును ఈవిషయమును స్పష్టము చేయుచున్నవి. కావున నెట్లు చూచినను సర్వకల్పములును సమానములే; వేదశబ్దార్థములు గూడ సమానములే. కావున మహాప్రళయము నంగీకరించినను వేదమునకు నప్రామాణ్యము లేదు.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము నిలువదు. సృష్టిప్రళయముల నంగీకరించుటకే తగినవీలు లేదు. మీరు సంసార మనాది యనియు, కర్మఫలము లేకరూపము లనియు ని ట్లగుటచే నుత్పత్తిప్రళయముల నంగీకరించినను ప్రతికల్పమునందును ప్రపంచమునకు సమాననామరూపములే యుండవలసివచ్చును గావున విరోధ మేమియు లేదనియుఁ జెప్పియున్నారు. మొట్టమొదట మీమతమున సంసార మనుపదార్థ మొకటి యెటనుండి వచ్చును. అది బ్రహ్మభిన్న మనిన బ్రహ్మమునకు సద్వితీయత్వము వచ్చి మీయద్వైతసిద్ధాంతమును ధ్వంసము చేయును; అభిన్న మనిన బ్రహ్మమునకు సగుణత్వము సంభవించును.

మఱియు ప్రపంచము కారణ మగునవిద్య మిగులునట్లుగా లయము నొంది మరల నందుండియే జనించు నంటిరి. ఆయవిద్యయు భావరూపయా (కలదియా) అభావరూపయా (లేనిదియా) మొదటిపక్షమున పూర్వమునవలెనే బ్రహ్మమునకు సద్వితీయత్వము వచ్చును. రెండవ పక్షమున ప్రపంచమే లేకపోవలసి వచ్చును. కారణమే యభావరూపమైనచోఁ గార్యము సత్యరూప మగునా? ఇదియు ననుభవవిరుద్ధము.

కావున మీసిద్ధాంతము నిలువదు. ప్రపంచమునకు నుత్పత్తివినాశములే లేవనుట యుక్తియుక్తము.

సిద్ధాంతము:—ఇట్లు సంశయింపవలదు. సంసారము పరబ్రహ్మము యొక్క * వివర్తము. సంసార మన్న ప్రపంచ మన్న నొక్కటియే. వివర్తమే యగుటచే నాప్రపంచము బ్రహ్మమునకంటె భిన్నంబును కాదు; అభిన్నంబును కాదు. త్రాటియందు భ్రాంతిచేఁ జూడఁబడినపాము ఆత్రాటికంటె భిన్నమా? అభిన్నమా? భిన్న మనిన త్రాటినుండి దానిని వేఱు చేయఁగలమా? అభిన్న మనిన త్రాటి నెఱుఁగనప్పుడు గలభిన్నానుభవమునకు గతి యేమి? ఇట్లు విమర్శించిన "ఆపాము త్రాటికంటె భిన్నముగఁ గానవచ్చుచున్నది; కాని భిన్నము కాదు. వాస్తవస్థితిలో నది యెప్పటికినిఁ ద్రాటికంటె భిన్నముగ జనించియే యుండలేదు" అనియే చెప్పవలసి యున్నది. సంసారము గూడ నిట్టిదియే. కావున దానియునికి నంగీకరించుటవలన దోష మేదియు రాదు. కావున అది యనాది యగుట మొదలగునవి సిద్ధాంతములే యగుటచే పైనిరూపించినవిషయ మంతయు నిర్దుష్టమే యగును.

మఱియు ప్రపంచకారణ మగునవిద్యను గూర్చి నీవుచేసినయాక్షేపము సరికాదు. అది యభావరూప కాదు. భావరూపయే. అట్లు కాకున్న బహుదోషములు వచ్చును. బ్రహ్మము స్వయంప్రకాశస్వరూప మగుటచే నభావపదార్థము దాని నావరింప నేరదు. "అది స్వయంప్రకాశమైనచో నందఱకును నాత్మజ్ఞానము కలుగవలసినదియే కదా!" అనియెద వేమొ వినుము. ఆత్మవిషయ మగుప్రకాశము లేకున్నను ఏదియో యొక విధముగఁ బ్రకాశము కల దనుట నిస్సంశయము. బ్రహ్మము సాక్షి చేతన రూపుఁడు. ఇట్టివాఁ డొక్కఁడు సర్వానుభవసిద్ధుఁడై యున్నాఁ డనుట నిర్వివాదము కదా! బాగుగ విచారించిన స్వప్రకాశస్వరూపము లేనివానికి నింతమాత్రపుప్రకాశ మైన నుండుటకు వీలు లేదు. మఱియు సర్వసాక్షి యగుచేతనుఁడు స్వప్రకాశరూపుఁ డనుటలో సంశయ మేమి? కావున నిట్టివాని నభావ మావరింప నేరదు. ఆవరింపకున్న లోకానుభవసిద్ధ మగునాత్మవిషయకాజ్ఞానము సంభవింప నేరదు. ఈకారణమువలన "అవిద్య భావరూప మైనదియే" యనవలయును. అది పరబ్రహ్మమునందు

* వివర్తము (పుట. ౭౭. చూడుము.)

దానివిషయములతోఁ గూడఁ (అనఁగా: "ఇది నాకు తెలియలేదు" అనివ్యవహరింపఁబడువిషయములతోఁ గూడ) నారోపింపఁబడి యున్నది. ఇట్లగుటచేతనే మనము ఆపరమేశ్వరునియొక్క యథార్థస్వరూపమును ఎఱుంగలేకున్నాము.

ఇట్లు కాకున్న "నీవు చెప్పినవిషయము నాకు తెలియలేదు" అనుమొదలగువ్యవహారములు సంభవింపనేరవు. ఆవ్యవహారముల యందుఁ బురుషుఁడు తనయజ్ఞానమును తాను తెలిసికొనుచున్నాఁడు. తనయజ్ఞానమునకు విషయ మగువాక్యమును గూడ తెలిసికొనుచునే యున్నాఁడు. ఆవ్యవహారమునకు "నీవు నా కేదియో యొకవిషయమును చెప్పుచున్నావు. దాని కేదియో యొకయభిప్రాయ ముండవలయును. అది నాకు గోచరము కాలేదు" అనియే కదా! యభిప్రాయము. ఇప్పుడు చూడుడు. ఆయవిద్య అభావరూప మగునేని దానికి విషయ మెటనుండి సంభవించును. * "సామాన్యజ్ఞానము కలదు * విశేషజ్ఞానము లేదు. కావున నట్టివ్యవహారము వచ్చినది" అనియెదవేమొ అదియు సరి కాదు. అట్లుండిన "నేను చెప్పినవిషయ మేది" యనిన దానిని చెప్పవలసి యుండును. అది లేదు కదా! కావున నవిద్య భావరూపమే ఇట్టివ్యవహారము లన్నియు దానివిషయముల నాశ్రయించియే కలుగుచున్నవి.

ఇట్లయినను ఈయవిద్యవలన బ్రహ్మమునకు సద్వితీయత్వము రాదు. ఒకపక్షమున నిదియు సంసారమువలెనే * యనిర్వచనీయము

---

*సామాన్యవిశేషజ్ఞానము లనఁగా: నొకవస్తువును గూర్చి "ఇది కలదు. దీనితత్త్వ మిట్టిది" అని తెలిసికొనుట

* అనిర్వచనీయత్వలక్షణము.—నిర్వచన మనఁగా: నిర్ణయము. నిర్వచించుటకు అనఁగా: ఇట్టిది యని నిరూపించుటకు వీలగునది నిర్వచనీయము. అట్టిది కానిది యనిర్వచనీయము.

మాయను ఎట్లు నిర్వచించుటకును వీలు లేదు. అది బ్రహ్మజ్ఞానము కలిగినప్పుడు కానరాదు. శుద్ధబ్రహ్మమున నది యెప్పుడుకాని యుండెననుటకే వీలు లేదుకదా! ఇఁక నెప్పటికిని లేదనిన నీప్రపంచమే కానరాకూడదు. కారణమే శూన్య మైనఁ గార్య మెటనుండి వచ్చును.

"ఈప్రపంచము మాయికము కాదనిచెప్పరాదా?" అనియెదవేని అది సరి కాదు. విచారదృష్టికి నట్లు కానవచ్చుట లేదు. ఈప్రపంచము నానాభేదములతోఁ గానవచ్చుచున్నది. భేద మనునది శ్రుతిస్మృత్యనుభవములను పట్టి చూచిన బొత్తిగనే

(ఉన్న దని కాని లేదని కాని నిరూపించుటకు వీలు లేనిది). రెండవ పక్షమున జ్ఞానము కలుగఁగానే నశించిపోవునది యగుటచే ననిత్యము. అనిత్యములగు భావములతో నిత్యభావములకు సద్వితీయత్వము సంభవింపదు. ఒకయెడారిలో నొకగృహము కల దనుకొనుఁడు. దానిపార్శ్వమున కార్యార్థమై యొకగుడారము వేయఁబడిన దానికి సద్వితీయత్వము వచ్చునా? ఎన్నటికైనను "ఆయెడారిలో రెండుగృహము లున్నవి" అనువ్యవహార మేర్పడునా? తత్త్వము నెఱుంగనివారు అట్లు తలంచిన తలంతురు గాక ప్రాజ్ఞు లట్లు చేయుదురా? కావున ప్రపంచభ్రాంతిలో మునిఁగియున్నవారు ఒకవేళ బ్రహ్మమును సద్వితీయమునుగా భావించినను వివేకు లట్లు చేయరు. వివేకులయనుభవమే ప్రమాణ మగుటచే దానికి సద్వితీయత్వమే లేదు. ఇదియే మూలావిద్య యనఁబడును. దీని నుండియే ప్రపంచసృష్ట్యాదులు కలుగుచున్నవి. మనకు రజ్జుసర్పాదిభ్రాంతులను కలిగించునది తూలావిద్య. కావున సిద్ధాంతమున విరోధము లే దని తెలిసికొనవలయును.

## అ ౧. పా ౩. సూ ౩౧. ఆరంభము.

అవతారిక:—ఇట్లు వేదప్రామాణ్యములను స్థిరపఱచి దేవతలకుఁ గల దని చెప్పఁబడినయధికారమును గూర్చినపూర్వపక్షముల రెండు సూత్రములచే ననువాదము చేయుచున్నాఁడు.

## ౯౪. మధ్వాది ష్వసంభవాదనధికారం

## జైమినిః. ౧. ౩. ౩౧.

తాత్పర్యము:—మధువిద్య మొదలగువానియందు దేవతలకు నధికారము సంభవించుటకు వీలు లే దనియు, ఈకారణమువలన బ్రహ్మ

---

యుండుటకు వీలు లేదు. (ఈవిషయము పుట. ౧ ౧ ౫. చూడు.) ఇట్లుండ నిది సత్య మెట్లగును? కావున నెట్లును దీని యునికికి మాయయే కారణ మనవలయును. అజ్ఞానమువలన లేనిదానిని సహిత మున్నట్లు తలంపవచ్చును గదా!

కావున నెట్లు చూచినను మాయను కలదని కాని, లే దని కాని నిర్ణయించుటకు వీలు లేదు కలిగియుండు లే దనఁబడుపదార్థము ప్రపంచమున నుండదు కదా! కావున యుక్తులతో విచారించిన మాయ యనిర్వచనీయము.

విద్యయందుఁ గూడ వారికి నధికారము కలుగుటకు వీలు లేదనియు జైమినిముని యభిప్రాయపడుచున్నాఁడు.

దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారమును కల దనిన నన్నివిద్యలయందును అట్టియధికారము నంగీకరింపవలసినచ్చును. ఇది సంభవింపదు. ఛాందోగ్యోపనిషత్తునందు "అసౌ ఆ ఆదిత్యో దేవమధు" "ఈసూర్యుఁడే దేవతలకు నమృతము" అను మొదలగు వాక్యములచే మధువిద్య చెప్పఁబడియున్నది. అందు సూర్యుని అమృతరూపముతో నుపాసింపవలయు ననుట విధి. దీని నాచరించుటకు మనుష్యులకు వీలు కలదు. దేవతలకు నవకాశ మెట్లు కలుగును? ఒకవేళ సూర్యుఁడే యావిద్య ననుష్ఠింపఁ దలంచినచో తాను తనకంటె నన్యుఁ డగు నేసూర్యు నమృతముగ నుపాసించును?

మఱియు నావిద్యయందే సూర్యునకుఁ గలయెఱుపు మొదలగు రూపములే యమృతము లనియు, వసురుద్రాది దేవగణములు ఆయమృతమును పానము చేయుదురనియుఁ జెప్పఁబడియున్నది "ఈవిద్య నుపాసించువాఁడు అంతమున వసువులతో సాటియగు ప్రభావమును పొంది ఆయమృతము నగ్ని యనుముఖముచే నాస్వాదించి తృప్తి నొందును" అని ఫలము వర్ణింపఁబడియున్నది. ఇదియు మనుష్యులకు సంభవించును; కాని దేవతలకును నెట్లు సంభవించును? వసువులు ఆవిద్యను అనుష్ఠింపఁదలంచిన నప్పుడు వారలు తమకంటె నన్యు లగు నేవసువులయొక్క ప్రభావమును పొందఁగలరు? తామే వసువులై యుండ నన్యవసువులను గూర్చినజ్ఞానము నెట్లు పొందఁగలరు. (అచ్చట "వసువులు అమృతపానమును చేయుచున్నారు" అని చెప్పఁబడియున్నది.)

మఱియు "వాయు ర్వావ సంవర్గః" "వాయువే సంవర్గము" అను మొదలగునుపాసనములు అనేకము లచ్చటచ్చట చెప్పఁబడియున్నవి. వానియందు ఆయాదేవతలకు నధికారము కలుగదు. ఋషిసంబంధము లైనయుపాసనలు కూడఁ గొన్ని కలవు. వానియందు ఋషుల కధికారము కలుగదు. ఇట్లుండ బ్రహ్మవిద్యయందుమాత్రము వారల కధికారము కల దనుట యెట్లు? విద్యయం దధికార మున్న దనిన నన్ని విద్యలయందు నధికార ముండవలసినదే కదా! కావున దేవతలకు విగ్రహ మున్నను అధికార ముండదు.

(ఉన్న దని కాని లేదని కాని నిరూపించుటకు వీలు లేనిది). రెండవ పక్షమున జ్ఞానము కలుగఁగానే నశించిపోవునది యగుటచే ననిత్యము. అనిత్యములగు భావములతో నిత్యభావములకు సద్వితీయత్వము సంభవింపదు. ఒకయెడారిలో నొకగృహము కల దనుకొనుఁడు. దానిపార్శ్వమున కార్యార్థమై యొకగుడారము వేయఁబడిన దానికి సద్వితీయత్వము వచ్చునా? ఎన్నటికైనను "ఆయెడారిలో రెండుగృహము లున్నవి" అనువ్యవహార మేర్పడునా? తత్త్వము నెఱుంగనివారు అట్లు తలంచిన తలంతురు గాక ప్రాజ్ఞు లట్లు చేయుదురా? కావున ప్రపంచభ్రాంతిలో మునిఁగియున్నవారు ఒకవేళ బ్రహ్మమును సద్వితీయమునుగా భావించినను వివేకు లట్లు చేయరు. వివేకులయనుభవమే ప్రమాణ మగుటచే దానికి సద్వితీయత్వమే లేదు. ఇదియే మూలావిద్య యనఁబడును. దీని నుండియే ప్రపంచసృష్ట్యాదులు కలుగుచున్నవి. మనకు రజ్జుసర్పాదిభ్రాంతులను కలిగించునది తూలావిద్య. కావున సిద్ధాంతమున విరోధము లేదని తెలిసికొనవలయును.

## అ ౧. పా ౩. సూ ౩౧. ఆరంభము.

అవతారిక:—ఇట్లు వేదప్రామాణ్యములను స్థిరపఱచి దేవతలకుఁ గల దని చెప్పఁబడినయధికారమును గూర్చినపూర్వపక్షముల రెండు సూత్రములచే ననువాదము చేయుచున్నాఁడు.

## ౯౪. మధ్వాది ష్వసంభవాదనధికారం

## జైమినిః. ౧. ౩. ౩౧.

తాత్పర్యము:—మధువిద్య మొదలగువానియందు దేవతలకు నధికారము సంభవించుటకు వీలు లేదనియు, ఈకారణమువలన బ్రహ్మ

యొండుటకు వీలు లేదు. (ఈవిషయము పుట. ౧ ౧ ౫ చూడు.) ఇట్లుండ నిది సత్య మెట్లగును? కావున నెట్లును దీని యునికికి మాయయే కారణ మనవలయును. అజ్ఞానమువలన లేనిదానిని సహిత మున్నట్లు తలంపవచ్చును గదా!

కావున నెట్లు చూచినను మాయను కలదని కాని, లే దని కాని నిర్ణయించుటకు వీలు లేదు కలిగియుం లే దనఁబడుపదార్థము ప్రపంచమున నుండదు కదా! కావున యుక్తులతో విచారించిన మాయ యనిర్వచనీయము.

విద్యయందుఁ గూడ వారికి నధికారము కలుగుటకు వీలు లేదనియు జైమినిముని యభిప్రాయపడుచున్నాఁడు.

దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారమును కల దనిన నన్నివిద్యలయందును అట్టియధికారము నంగీకరింపవలసివచ్చును. ఇది సంభవింపదు. ఛాందోగ్యోపనిషత్తునందు "అసౌ ఆ ఆదిత్యో దేవమధు" "ఈసూర్యుఁడే దేవతలకు నమృతము" అను మొదలగు వాక్యములచే మధువిద్య చెప్పఁబడియున్నది. అందు సూర్యుని అమృతరూపముతో నుపాసింపవలయు ననుట విధి. దీని నాచరించుటకు మనుష్యులకు వీలు కలదు. దేవతలకు నవకాశ మెట్లు కలుగును? ఒకవేళ సూర్యుఁడే యావిద్య ననుష్ఠింపఁ దలంచినచో తాను తనకంటె నన్యుఁ డగు నేసూర్యు నమృతముగ నుపాసించును?

మఱియు నావిద్యయందే సూర్యునకుఁ గలయెఱుపు మొదలగు రూపములే యమృతము లనియు, వసురుద్రాది దేవగణములు ఆయమృతమును పానము చేయుదురనియుఁ జెప్పఁబడియున్నది "ఈవిద్య నుపాసించువాఁడు అంతమున వసువులతో సాటియగుప్రభావమును పొంది ఆయమృతము నగ్ని యనుముఖముచే నాస్వాదించి తృప్తి నొందును" అని ఫలము వర్ణింపఁబడియున్నది. ఇదియు మనుష్యులకు సంభవించును; కాని దేవతలకును నెట్లు సంభవించును? వసువులు ఆవిద్యను అనుష్ఠింపఁదలంచిన నప్పుడు వారలు తమకంటె నన్యు లగు నేవసువులయొక్క ప్రభావమును పొందఁగలరు? తామే వసువులై యుండ నన్యవసువులను గూర్చినజ్ఞానము నెట్లు పొందఁగలరు. (అచ్చట "వసువులు అమృతపానము చేయుచున్నారు" అని చెప్పఁబడియున్నది.)

మఱియు "వాయు ర్వావ సంవర్గః" "వాయువే సంవర్గము" అను మొదలగునుపాసనములు అనేకము లచ్చటచ్చట చెప్పఁబడియున్నవి. వానియందు ఆయాదేవతలకు నధికారము కలుగదు. ఋషిసంబంధము లైనయుపాసనలు కూడఁ గొన్ని కలవు. వానియందు ఋషుల కధికారము కలుగదు. ఇట్లుండ బ్రహ్మవిద్యయందుమాత్రము వారల కధికారము కల దనుట యెట్లు? విద్యయం దధికార మున్న దనిన నన్నివిద్యలయందు నధికార ముండవలసినదే కదా! కావున దేవతలకు విగ్రహ మున్నను అధికార ముండదు.

# అ ౧. పా 3. సూ 3౨. ఆరంభము.

అవతారిక:— "ఇట్లు చెప్ప నేల ? అధికారము కల దనిన నన్నిటియందు నుండవలయునా ? ఎవ్వనికి నెచ్చట నధికార ముండఁదగునో యచ్చటనే యుండును. ఇందు విరోధ మేమి ?" అనిన "ఇట్లు చెప్పినను మీసిద్ధాంతము (వ్యాససిద్ధాంతము) నిలువదు." అని యాక్షేపించుచున్నాఁడు.

## ౯౫. జ్యోతిషి భావాచ్చ. ౧. 3. 3౨.

తాత్పర్యము:—లోకమునను వేదమునను దేవవాచకము లగు శబ్దము లన్నియు తేజోమండలమునందే (సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని నక్షత్రములు మెఱుపులు గ్రహములు మొదలగు తేజస్సులసమూహమునందే) ప్రయోగింపఁబడుచున్నవి యనుట స్పష్టము. అవి యచేతనము లనుటయు నిస్సంశయము. ఇట్లుండ వారలకు దేహాదు లెట్లు వచ్చును? అచేతనపదార్థ మేదియు చేతనులవలె వ్యవహారమును చేయఁజాల దనుటలో సందేహ మేమి కలదు ? కావున జ్యోతిర్మండలరూపు లగుటచే దేవతలకు * దేహాదు లుండుటకు వీలు లేదు.

"మంత్రార్థవాదాదులను లోకంబును ప్రమాణము లని చెప్పియున్నాము. వానియాధారముచే దేవతలకు దేహాదులు కల వని నిశ్చయింపవచ్చుననియుఁ జెప్పియున్నాము కదా!" అనియెదవేమొ వినుము. ప్రత్యక్షాదిప్రమాణములకంటె భిన్నముగ లోక మనునొక ప్రమాణము కలదా! అట్టిది యుండునేని యది యంధపరంపరయే కావలయును. ప్రమాణవిరుద్ధమగు ప్రతీతిని ఎవ్వఁడు విశ్వసించును? మఱియు ఇతిహాసపురాణములు పురుషనిర్మితములు. కావున వానికి మూలభూతముగఁ బ్రామాణికగ్రంథ మొకటి యుండవలయును. అట్లు లేకున్న వానియందుఁ జెప్పఁబడినయర్థము ప్రమాణముగ గ్రహింపఁబడదు. ఇదియునుగాక అర్థవాదములు స్తోత్రరూపములై * విధివాక్య

---

* దేహము, భోజనము, నివాసస్థానము, తన్నుపాసించువారి ననుగ్రహించుట, వారికి నుపాసనానుసారముగ ఫలము నిచ్చుట అను నీయైదును దేహాదిపంచకము

* విధివాక్యము. (పుట. 3౮౭ చూడుము.)

మునందు చెప్పఁబడినవిషయమును ప్రశంసించును. కావున వానికి స్వార్థమునందుఁ దాత్పర్యము లేదు. కల దనిన నొక్కవాక్యమే రెండు విషయముల బోధించున దని కావలసినచ్చుటచే వాక్యభేదము కలుగును. ఇది యయుక్తము కదా! ఇట్లే మంత్రములును విధివాక్యముచే బోధింపఁబడినవిధులయందు తత్కాలోచితకృత్యములఁ దెలుపుటకై ప్రయోగింపఁబడును. ఇట్లగుటచే నవి స్వతంత్రార్థము నెఱిఁగింపలేవు కావున "దేవతలకు దేహాదులు కలవు" అనుట యెట్లును సిద్ధాంతము కానేరదు. ప్రత్యక్షాదు లెవ్వియు నీవిషయమును నిరూపించుటలో తోడ్పడవు. పురాణేతిహాసములు మూలగ్రంథము నపేక్షించునవి యగుటచేతను, వేదమునకంటె నన్య మగుమూలగ్రంథము లేకుండుటచేతను, ఆవేదమున దేవతలకు శరీరాదు లెటను చెప్పఁబడియుండకపోవుటచేతను, ఈసిద్ధాంతమునకు వానివలన (పురాణేతిహాసములవలన) తోడ్పాటు కలుగదు. మంత్రార్థవాదములు వేదవాక్యములే యైనను, అందు దేవతలకు శరీరాదులు చెప్పఁబడియే యున్నను, పైన వర్ణించినవిధముగ వానికి స్వార్థమునందు ప్రామాణ్యము లేకపోవుటచే నీసిద్ధాంతమునకు సహాయకారులు కానేరవు. కావున నెట్లును మీసిద్ధాంత మప్రమాణికమే.

## అ ౧. పా ౩. సూ ౩౩. ఆరంభము.

అవతారిక:—ఇట్లు రెండుసూత్రములచేఁ జేయఁబడిన పూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

## ౬౬. భావం తు బాదరాయణో ఽస్తి హి.

## ౧. ౩. ౩౩.

తాత్పర్యము:—వ్యాసమహామునిమాత్రము దేవతల కధికారము కలదనియే భావించుచున్నాఁడు. వారికిని అర్థిత్వము సామర్థ్యము మొదలగునవి యుండుటకు వీలు కలదని యధికరణారంభసూత్రమునందే నిరూపింపఁబడియున్నది.

శ్రుతియందును "త ద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణాం తే హోచు రంతత తమా

త్మాన మన్విచ్ఛామో య మాత్మాన మన్విష్య సర్వాగ్ంశ్చ లోకా నాప్నోతి సర్వాగ్ంశ్చ కామాన్ ఇతి. ఇంద్రో హైవ దేవానా మభి ప్రవవ్రాజ విరోచ నోఽసురాణాం." "దేవతలలోఁ గాని మనుష్యులలోఁ గాని ఋషులలోఁ గాని యెవ్వఁడు పరమేశ్వరు నెఱింగి విజ్ఞానవంతుఁ డగునో వాఁడు పరమేశ్వరుఁడే యగును. దేవతలును రాక్షసులును తమలో నిట్లు తలంచిరి. ఏయాత్మ నెఱుంగుటవలన సర్వలోకములయందును స్వేచ్ఛాసంచారము కలుగునో సర్వకామములు నేకకాలమునందే సంభవించునో అట్టియాత్మను తెలిసికొనఁగోరుచున్నాము. ఇట్లు తమవారియుద్దేశముల నెఱింగి దేవతలకు ప్రభువగునింద్రుఁడును రాక్షసులకు ప్రభువగువిరోచనుండును బ్రహ్మవిద్యార్థమై ప్రజాపతికడకుఁ బోయిరి" అనుమొదలగుశ్రుతులు పైయభిప్రాయమును దృఢపఱుచుచున్నవి. స్మృతులయందును ఈవిషయము దృఢముచేయుచు గంధర్వయాజ్ఞవల్క్యసంవాదాదిరూపము లగుననేకకథలు కలవు.

సిద్ధాంతము:—ఒకవేళ వీరికి మధువిద్య మొదలగు దేవతోపాసనారూపము లగువిద్యలయందు అధికారము లేకపోయినను, ఋషులకును ఋష్యుపాసనారూపము లగువిద్యలయం దధికారము సంభవింపకున్నను, శుద్ధబ్రహ్మవిద్యలయందు నిరాటంకముగ నధికార ముండవచ్చును. ఒకవిద్యయందు అధికారులు కానంతమాత్రమున నన్నివిద్యలయందుఁ గూడ నధికారులు కాకూడ దనునియమము కలదా? మనుష్యులకు సంచిత మన్నియజ్ఞములయందు నధికార మున్నదా? క్షత్రియులు చేయవలసిన రాజసూయాదిక్రతువులయందు బ్రాహ్మణుల కధికారము కలదా? కావున నిట్టిస్థలములయం దేన్యాయ మంగీకరింపఁబడుచున్నదో, ప్రస్తుతవిషయమునందుఁ గూడ నాన్యాయమే యవలంబింపఁబడవచ్చును. కర్మకాండ సర్వమనుష్యులనుగూర్చి చెప్పునది యైనను, ఒక్కొక్కసంఘమునకు కొన్నికొన్నిటియందుమాత్రమే యధికారము నుద్దేశించి చెప్పినట్లు జ్ఞానకాండముకూడ సర్వప్రపంచమునుగూర్చి చెప్పునదియే యైనను ఒక్కొక్కసంఘమునకు కొన్నికొన్నివిద్యలయందు మాత్రమే యధికారము నుద్దేశించి చెప్పుచున్నది. ఇందు విరోధ మేమి?

మఱియు సూర్యాదిజ్యోతిర్మండలములే ఆదిత్యాదిశబ్దార్థములనియు, ఈకారణమువలన దేవత లచేతనులనియుఁ జెప్పుట యొప్పదు.

తేజోమండలము లచేతనము లగుట నిస్సంశయమే; కాని వానికి నియామకులై చేతను లగు దేవత లున్నారు. ఆయాదిత్యాదిశబ్దములు మండలములతోఁబాటు వారినిఁగూడఁ జెప్పును. వారికి యోగశక్తి కలదు; కావున ఇచ్ఛ కలిగినప్పుడు ఏరూపమునైనను స్వీకరించుటకును లేనప్పుడు మండలాదిరూపములతోనే యుండుటకును స్వాతంత్ర్యము కలదు. ఈవిషయము మంత్రార్థవాదములయందును వాని ననుసరించి ప్రవర్తించిన స్మృతిపురాణేతిహాసములయందును స్పష్టమై యున్నది.

"మేధాతిథింహ కాణ్వాయన మింద్రో మేషో భూత్వా జహార" "కణ్వగోత్రమున జనించిన మేధాతిథియనువానిని ఇంద్రుఁడు మేకయై యెత్తికొనిపోయెను" అను మొదలగుశ్రుతివాక్యములను "ఆదిత్యః పురుషో భూత్వా కుంతీ ముపజగామ హ" "సూర్యుఁడు పురుషరూపమును దాల్చి కుంతికడకు వచ్చెను." అను మొదలగుస్మృతులును ఈ విషయమున ప్రమాణములై యున్నవి. ఇంత యేల? "మృ దబ్రవీత్. ఆపో ఽబ్రువన్" "మృత్తిక యిట్లు చెప్పెను. నీరు మాటలాడెను" "అను మొదలగుశ్రుతు లనేకములు గానవచ్చుచున్నవి. వానియర్థములను విమర్శించిన నామృదాద్యచేతనపదార్థములకు నధిపతులై చేతను లగు దేవత లున్నారని యంగీకరింపవలయును కదా! ఇట్లుండ నిఁక జ్యోతిర్మండలములనుగూర్చి యేమి చెప్పవలయును? అవి దేవతావాచకశబ్దములచేతనే పిలువఁబడుచున్నవి; మృదాదు లట్లును లేవు కదా!

"మంత్రార్థవాదములకు విధివాక్యములయందలి తాత్పర్యమును నిరూపించుటయే పని యనియు, ఈకారణమువలన వానికి స్వార్థమునందుఁ దాత్పర్యము లేదనియు, ఇట్లగుటచేఁ బురాణేతిహాసాదులు కూడ నప్రమాణములే యనియుఁ జెప్పియున్నాము కదా!" అనియెదవేమొ వినుము.

దీనికిఁ గొందరిమతము ననుసరించి సమాధానమును చెప్పుచున్నాఁడు.—"కలదు లేదు" అని తెలిసికొనుటకు పదార్థజ్ఞానమే(అనఁగా: ఈపదములయందు మనకుఁ గావలసినయర్థము కలదా లేదా యనువిషయమును గ్రహించుటయే) చాలినంత సాధన మగును. ఇంతయే కాని ఆపదములు దేనికొఱకై ప్రయోగింపఁబడినను ఆవిషయమునుగూర్చి

విచారణ యక్కఱలేదు. లోకమునఁ బదములు తమతమయర్థము నెట్లును చెప్పక విడువవు. దేనికొఱకై ప్రయోగింపఁబడినను దేనియర్థమును దృఢము చేయుచున్నను తమయర్థమును చెప్పక మానవు. ఒకస్థలమునకు పోవలయు ననునుద్దేశముతో నడచుచున్నను పురుషుఁడు ఆత్రోవలో నడుమఁ బడియున్న గడ్డి, యాకు, మొదలగువానిని గ్రహించుచునే (ఇవి యున్నవి యని తెలిసికొనుచునే) యున్నాఁడు కదా! ఇట్లే మంత్రార్థవాదాదు లొకవేళ విధివాక్యములయర్థమును దృఢము చేయుటకై యే ప్రయోగింపఁబడియున్నను స్వార్థమును చెప్పవచ్చును. ఇట్లగుటచే నవి యవశ్యముగఁ బ్రమాణములే యగును.

పూర్వపక్షము:—ఈయుపన్యాసము మిగుల విరుద్ధము. శబ్దముల నాశ్రయించి యున్ననియమములకును ప్రత్యక్షాదుల నాశ్రయించి యున్ననియమములకును చాల భేదము కలదు. శబ్దము ఎప్పటికిని తాత్పర్యమునుమాత్రమే యనుసరించి పోవుచుండును. ప్రత్యక్ష మన్ననో, తనయెదుట నున్నవాని నన్నిటిని సర్వసాధారణముగ గ్రహించును. ఈ భేదమువలన శబ్దము తాత్పర్యార్థమునందుమాత్రమే ప్రమాణముకాని తద్భిన్న మగుస్వార్థమునందుఁ బ్రమాణము కాదు. ప్రత్యక్షాదులు తమకు గోచరము లైనసర్వవిషయములయందును ప్రమాణము లే.

కావున మీరు చెప్పినవిషయము సరికాదు. త్రోవ నున్న గడ్డి, యాకులు మొదలగునవి ప్రత్యక్షప్రమాణముచే గ్రహింపఁబడినవి. శబ్దార్థ మన్ననో తాత్పర్యానుసారముగ గ్రహింపవలసినది. ఈరెంటికిని సామ్య మెట్లు కుదురును? జలమును తేవలయు నను నుద్దేశముతో పాత్రకై చూచువాఁడు అచ్చట నున్నసర్వపదార్థముల జూచుటయు "ఇవి కలవు" అని నిర్ణయించుటయు ప్రత్యక్షముగ నున్నది; కాని శబ్దవిషయమున నిట్లు చేయుటయందును లేదు. "శ్వైత్రో ధావతి" అను వాక్యము "శ్విత్రరోగము (బొల్లి) కలవాఁడు తెల్లఁగా నుండును కావున శ్వైత్రుఁ డనఁబడును. వాఁడు వస్త్రము నుదుకుచున్నాఁడు" అనునర్థమును ద్దేశించి ప్రయోగింపఁబడినది. అప్పుడు దానినుండి "శ్వా ఇతో ధావతి" "కుక్క ఈస్థలమునుండి పరుగిడుచున్నది" అనునర్థమును గ్రహించుటకు వీలు కలదా? ఆవాక్యమున నీపదములుకూడఁ గలవు కదా! మఱియు "న సురాం పిబేత్" అను వాక్యమున "సురాం

పిబేత్" అను పదములు కలవనుకారణము నాశ్రయించి, "మద్యపానమును చేయరాదు" అను తాత్పర్యమునకు విరుద్ధముగ "మద్యపానమును చేయవలయును" అనునర్థమును గ్రహించుట సంభవించునా ?

కావున నెట్లుచూచినను పదములు తాత్పర్యార్థమునందే ప్రమాణము లగునుకాని స్వార్థమునందు ప్రమాణములు కానేరవు. పదములవలెనే * మహావాక్యార్థమును తెలుపువాక్యములుకూడఁ దాత్పర్యమునందే ప్రమాణము లగును కాని స్వార్థమునందుఁ బ్రమాణములు కానేరవు. కావున నెట్లుచూచినను విధివాక్యముతోఁ గూడ నేకవాక్యములై యున్నమంత్రార్థవాదములు స్వార్థమునందుఁ బ్రమాణములు కానేరవు. కావున నందుఁ జెప్పఁబడిన దేవతావిగ్రహములు ప్రామాణికములు కానేరవు.

సిద్ధాంతము:—ఇది శంకరమతము. ఇది యుక్తమగునుపన్యాసము కాదు. లోకమునఁ బదములుకాని వాక్యములుకాని వాక్యార్థమును నిర్ణయించుటకై మాత్రమే యుపయోగింపఁబడుచున్నవి యనుటయు, అందు స్వార్థమును ప్రతిపాదించుట యుద్దేశింపఁబడియుండ దనుటయు నిస్సంశయమే. అయినను అవి స్వార్థమును బొత్తుగనే చెప్పవని కాని అందుఁ బ్రమాణములు కానేరవనికాని చెప్పుట సంభవింపదు. స్వార్థమును బొత్తిగనే చెప్పకున్న ఆయర్థము వాస్తవము కాకున్న, తాత్పర్యార్థము నిర్ణయ మగుట యెట్లు? శ్వేతశబ్దార్థంబును, ధావతిశబ్దార్థంబును తెలియకున్న "శ్వేతో ధావతి" అనువాక్యమునకు నర్థమును గ్రహించుట యెట్లు? "న సురాం పిబేత్" అనువాక్యమునందలి తాత్పర్యమును నిర్ణయించుట యెట్లు ?

"ఆవాక్యములయందు 'శ్వా ఇతః' అనుమొదలగుపదములు కూడఁ గలవు. కావున వానికి విపరీతార్థముకూడ వచ్చును. అని చెప్పితిమి కదా!" అని యెదవేమొ వినుము. అర్థమును సందర్భానుసారముగ గ్రహించుటయే నియమము కావున "శ్వేతో ధావతి" అనువాక్యమున సందర్భవిరుద్ధముగ నర్థము గ్రహింపఁబడదు; అట్లు నేయుటకును వీలులేదు. ఒకసందర్భమున మఱియొకయర్థమును గ్రహించుటకంటె

* మహావాక్యార్థ మనఁగా : ప్రకరణమునందు నిరూపింపఁబడవలసిన యంశము. అది యనేకవాక్యములచే నిరూపింపఁబడును (చూడు. ప్రకరణము, పు. ౯3).

మూర్ఖత లేదని మఱియొకమూఱు చెప్పవలయునా? మఱియు "న సురాం పిబేత్" అనుమొదలగునిషేధవాక్యములయందు విధివాచక మగుభాగము కలదు కదా యని యేయవివేకియు విధ్యర్థమును గ్రహింపఁనేరఁడు. అప్పుడు "న" అనుపదము నిరర్థకము కావలసివచ్చును కదా! కావున నెట్లు చూచినను, పదములుకాని వాక్యములుకాని తాత్పర్యార్థమునే చెప్పునవియైనను స్వార్థమునుకూడఁ జెప్పు ననుటకు సంశయము లేదు.

"ఇట్లయిన నవి స్వార్థమునందే ముగింపు నొందవలసివచ్చును (అనఁగా: స్వార్థమునుమాత్రమే చెప్పి యూరకుండవలసివచ్చును) ఒకపదమునకుఁ గాని వాక్యమునకుఁ గాని రెం డర్థము లుండుట సంభవింపదు కదా! ఈకారణమువలన మీపక్షమున పదవాక్యములు తాత్పర్యమును చెప్పునవి కాకూడదు" అనియెదవేమొ యీయాక్షేపము సరియైనది కాదు. దీనిని దేనికొఱకై ప్రయోగించియున్నారో అది దానియందే ముగింపు నొందవలయునుకాని అన్యపదార్థమునందు ముగింపు నొందకూడదు. ఇది ప్రధాన మగునియమము. లోకమున నెవ్వరైనను ఒకవాక్యార్థమును నిర్ణయించుటకై య్యే పదములనుగాని చిన్నచిన్నవాక్యములనుగాని ప్రయోగించుచున్నారు; కేవలస్వార్థమును తెలుపుటకై యట్లుచేయుట లేదు. ఈవిషయము సర్వప్రత్యక్షము. కావున పదములుకాని వాక్యములుకాని ఎప్పటికైనను వాక్యార్థమునందే ముగింపు నొంది తీరవలయును. "సాక్షా ద్యద్యపి కుర్వంతి పదార్థ ప్రతిపాదనం, వర్ణా స్తథాపి నైతస్మి న్పర్యవస్యంతి నిష్ఫలే" "వాక్యార్థమితయే తేషాం ప్రవృత్తౌ నాంతరీయకం, పాకే జ్వాలేవ కాష్ఠానాం పదార్థప్రతిపాదనం" "అక్షరములు పదములై ప్రత్యక్షముగ తమయర్థమును చెప్పినను దానియందే పర్యవసానము నొందవు (అనఁగా: అంతమాత్రముతో నిలువవు) వానికి నది నిష్ఫలము; కేవలము తమయర్థమునుమాత్రమే చెప్పి ముగించుటవలనఁ బ్రయోజన మేమియు లేదు కదా! మఱియు వంటఁజేయుటకు సాధనము లగుకట్టెలకు నగ్నిజ్వాల యాటంకము కానట్లు వాక్యార్థమును తెలుపుపదములకు స్వార్థప్రతిపాదన మాటంకము కానేరదు" అని మహాత్ము లీవిషయమును స్పష్టముగ వివరించియున్నారు.

మఱియు నొకదానికి రెండర్థము లుండఁగూడ దనుట యొక దోషము కాదు. శ్లేషఁ గలపదములు వేనవేలుగ నుండుటయు వాని యర్థములు సందర్భానుసారముగ గ్రహింపఁబడుచుండుటయుఁ బ్రత్యక్షసిద్ధము. ఇదియును గాక పదములుకాని వాక్యములుకాని ప్రత్యేకముగ స్వార్థమును వివరించును. సముదాయరూపములై వాక్యార్థమును వివరించును. ఇందు విరోధ మేమి? ప్రతివాక్యమును పదంబును గూడ తమయర్థమును చెప్పి పిదప నానుకూల్యము ననుసరించి వాక్యార్థమును బోధింపవచ్చును కదా!

ఈవిధముగనే వేదమునందలిమంత్రములును అర్థవాదములును విధిని ప్రవర్తింపఁజేయునవియు స్తుతించునవియు నైయున్నను వానికి స్వార్థమునందుఁ బ్రామాణ్యము లేకపోలేదు. అవి మొట్టమొదట స్వార్థమును చెప్పి పిదప "ఈవాక్యమువలన నిటఁ బ్రయోజన మేమి" అని ప్రశ్న రాఁగా, దాని కుత్తరముగ "ఇవి విధిని నుతించుచున్నవి" అను విషయము వచ్చును. ఇంతయే కాని వానికి నెప్పటికిని స్వార్థమునందుఁ బ్రామాణ్యము లేకపోలేదు. "వాయవ్యగ్ం శ్వేత మాలభేత భూతికామః" "ఐశ్వర్యమును కోరువాఁడు వాయువుయొక్క తృప్తికై శ్వేత పశువును పట్టవలయును" అనువిధికి శేషముగ "వాయు ర్వై క్షేపిష్ఠా దేవతా" "అన్ని దేవతలకంటెను శీఘ్రముగ వాంఛితార్థము నొసంగు దేవత వాయువే కదా!" అనునర్థవాదము కలదు. ఇచ్చట నీయర్థవాదవాక్యము స్వార్థమును చెప్పక విధివాక్యముతో నెట్లు ఏకీభవించును * పరిపూర్ణక్రియతోఁ గూడియున్న * కారకములును వానివిశేషణములును మొదలగునవి కలసి యొకవాక్య మగును. అట్టివాక్యమే

---

* పరిపూర్ణక్రియ లనఁగా: చేసి, కొట్టి అను మొదలగువానివలె కాక సంపూర్ణార్థము నొసంగుక్రియలు చేసెను చేయుచున్నాఁడు చేయఁబోవుచున్నాఁడు కొట్టెను కొట్టఁబోవుచున్నాఁడు వచ్చెను వచ్చుచున్నాఁడు మొదలగునవి.

* కారకము లనఁగా క్రియచేఁ జెప్పఁబడినపనిని నిర్వహించునవి. ఆపనిని చేయువాఁడు పనియొక్కఫలము ననుభవించునది, ఆపనికి సాధనము, దానియందుద్దేశము (అనఁగా: దానిని చేయుటకుఁ గలప్రయోజనము), హేతువు, ఆధారము, అను నీయారును కారకములు. వీనికి కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము, అనునవి క్రమముగఁ బేర్లు.

మఱియొక్కటి స్వార్థమును తెలుపక, నేదియో యొకసంబంధాంతరము వలనఁ గాక దానితో (వాక్యముతో) నెట్లు సంబంధపడును? ప్రస్తుతము అర్థవాదవాక్యమున నున్న "వాయుః" అను మొదలగుపదములలో దేనికిని "ఆలభేత" అనువిధివాక్యమునందలి క్రియతో సంబంధము లేదనుట స్పష్టమే కదా! కావున నర్థవాదవాక్యము విధివాక్యమునకంటె నెప్పటికిని భిన్నమే. మొట్టమొదట తనస్వార్థమును చెప్పి పిదప విధిని నుతించుటకు నుపయోగపడును. ప్రస్తుతార్థవాదవాక్యము వాయుదేవతాస్వభావమును వర్ణించి, "పైన 'వాయుస్యగ్ం' అనువాక్యముచేఁ జెప్పఁబడినకర్మచే నుపాస్యుఁ డగుదేవత మిగుల గొప్పవాఁడు" అను విషయమును తెలియఁ జేయుచున్నది.

ఆయర్థవాదములును మంత్రములును ఇతరప్రమాణసిద్ధము లగు విషయముల బోధించునప్పుడు * అనువాదములగును; ఇతరప్రమాణములకు విరుద్ధము లగువిషయములఁ జెప్పునప్పుడు * గుణవాదములగును. ఈవిషయము మీకును సమ్మతమే యిఁక నాలోచింపుఁడు. ఇతరప్రమాణములచే నెఱుంగఁబడనట్టియు, ఇతరప్రమాణములకు విరుద్ధము కానట్టియు, విషయమును చెప్పునప్పు డవి యేమి కావలయును? ప్రమాణములు లేకపోవుటచే గుణవాదములు కావలయునా? లేక ప్రమాణములకు విరుద్ధములు కాకపోవుటచే యథార్థవాదములు కావలయునా? ఈవిషయమును విచారించిన వేదప్రామాణ్యము నంగీకరించువారలందఱును అట్టివానిని యథార్థవాదములనుగానే యంగీకరించి తీరవలయును. యేప్రమాణమునకును గోచరము కానివిషయముల వేదము నిరూపించు ననుట మీకును సమ్మతమే కదా! కావున మంత్రార్థవాదములు తమయందలివిషయముల నిస్సంశయముగఁ బ్రామాణికముగ నిరూపింపఁగలవు. వాని ననుసరించి దేవతలకు శరీరాదిపంచకము కలదని నిర్వివాదముగ నంగీకరింపవచ్చును.

మఱియు విధివాక్యముల యర్థమునుమాత్రమే ప్రమాణముగ

---

* అనువాదములు అనువాదమును చేయునవి (అనువాదము (పుట. ౨౭౭ చూడు.)

* గుణవాద మనఁగా: "ఆదిత్యో వై యూపః" "సూర్యుఁడే యూపస్తంభము" అను మొదలగువాక్యములవలె నొకపదార్థమునందు మఱియొకపదార్థము నారోపించి యతిశయోక్తిపూర్వకముగ స్తోత్రమును గావించువాక్యము.

గ్రహించి చూచినను దేవతలకు శరీర ముండియే తీరవలయును. రూపము లేనివారిని ధ్యానించుటకు వీలు లేదనుట నిర్వివాదము. విధివాక్యము లును ఇంద్రాది దేవతలను గూర్చి హవిస్సును హోమము చేయవలయు ననుచున్నవి. హోమము చేయునప్పుడా దేవతను మనస్సున ధ్యానిం చియే హవిస్సు నగ్నియందు విడువవలయు నని యున్నది. "యస్యై దేవతాయై హవి గ్గృహీతం స్యా త్తాం ధ్యాయే ద్వషట్ కరిష్యన్" "పురుషుఁడు ఏ దేవతకై హవిస్సును గ్రహించునో ఆ దేవతను మొదట ధ్యానించి పిదప హోమము చేయవలయును" అను శ్రుతి యీవిషయ మును స్పష్టము చేయుచున్నది. "మంత్రపదములే దేవతలకు స్వరూప ములు" అనుట యెన్నటికిని సంభవింపదు. పదములు తమచే వివరింపఁ బడినయర్థము లగుట యెట్లు? పదములకును వానియర్థములకును భేదము కల దనుట నిర్వివాదము కదా! పదములు అర్థమును తెలియఁ జేయునవి; అర్థములు ఆపదములచే తెలియఁ జేయఁబడునవి. ఈరెండు నొక్కటి యెట్లగును? కావున నిస్సంశయముగ నీపక్ష మయుక్తమే.

ఈవిధముగ మంత్రార్థవాదములు ప్రమాణము లగుటచే వాని నాశ్రయించి వచ్చిన యితిహాసపురాణాదులుకూడఁ బ్రమాణములే యగును. మూలగ్రంథము లేదనుటయే కదా వానివిషయమున నాక్షే పము. కావున వేదమును ప్రమాణముగ నంగీకరించుమనము ఈవిషయ మును నిరాకరింపఁగూడదు.

ఇదియును గాక నీవిషయమునఁ గలలోకప్రసిద్ధినిగూర్చి యిది వఱకు కొంతదోషమును చెప్పియున్నావు. ప్రత్యక్షాదిప్రమాణములే లోక మనియు, దేవతలకు శరీరము కల దనువిషయమున నట్టిప్రమాణ ములు లేవనియుఁ జెప్పియున్నావు. ఇదియు విరుద్ధమే. మనము దేవత లతో మాటలాడకున్నను వ్యాసాదు లట్లుకావించి రని యనేకస్మృతి పురాణేతిహాసములు చెప్పుచున్నవి. దానిని విశ్వసింపక, "మనకువలెనే పూర్వులకుఁగూడ దేవదర్శనము లేదనువాఁడు ప్రపంచముయొక్క ప్రభావమునే నిషేధించినవాఁ డగును. ఇప్పటివలెనే పూర్వకాలము నను సర్వభూమికి నధిపతి యగుక్షత్రియుఁడు లేకుండె ననువాఁ డగును. అప్పుడు వేదమునందుఁ జెప్పఁబడినకర్మవిధులు నిరర్థకములు కావలసి వచ్చును. సర్వప్రపంచమును గెలిచినవాఁడు కాని రాజసూయమునకు

నధికారి కానేరఁడు కదా! అట్టివాఁడే యెన్నఁడును లేకుండిన వేద మాయాగము నెవ్వని నుద్దేశించి చెప్పియుండును. మఱియు నిప్పటి వలెనే యెప్పటికిని వర్ణాశ్రమములు సంకరప్రాయములై యుండునేని వానినిఁ గూర్చి విధించుశాస్త్రములకు నర్థ మేమై యుండును! కావున నిప్పటిస్థితి ననుసరించి పూర్వస్థితి ననుమానము చేయుట యనుచితము. అధికముగ పుణ్యము చేసినవా రగుటచేఁ బూర్వులకును మనకు నెంతో భేదము కలదు.

మఱియు యోగశాస్త్రమునందు "స్వాధ్యాయా దిష్టదేవతా సంప్రయోగః" "వేదాధ్యయనమువలన (అనఁగా: వేదమును పరిపూర్ణ ముగ నభ్యసించి యుపాసించుటవలన) నిష్టదేవత ప్రత్యక్ష మగును" అని చెప్పఁబడియున్నది. స్వరూపము లేకున్న నిది యెట్లు సంభవిం చును? ఈయోగవిషయము శ్రుతియందును ప్రశంసింపఁబడియున్నది. "న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం" "ఎవ్వఁడు యోగాగ్నిమయ మగుశరీరమును సంపాదించుకొ నునో అట్టివానికి రోగము రాదు. ముసలితనము కలుగదు. చావు లేదు" అని శ్రుతియం దున్నది. ఇట్టిదానిని కేవలసాహసముచే నప్రమాణ మగుటకు వీలు కలదా? ఆయోగమువలన * అణిమాదిసిద్ధులు కలు గుట శాస్త్రమునందును లోకమునందును గూడ ప్రత్యక్షమై యున్నది. మఱియు శాస్త్రాదుల కని పెట్టినమహామునులసామర్థ్యమునకును మనసామ ర్థ్యమునకుఁ గలయంతర మెంత?

కావున నెట్లుచూచినను ఇతిహాసపురాణాదులకు మూలగ్రం థము కల దనుటయు, ప్రత్యక్షాదిప్రమాణరూప మగులోకప్రసిద్ధియు నిరాకరింపఁదగ దనుటయు యుక్తియుక్తము. మంత్రార్థవాదాదులవలన దేవతలకు దేహాదిపంచకము కలదని నిర్ణయించుటయు తన్మూలమున * నర్థిత్వము మొదలైనవి సంభవించుటచే వారికి బ్రహ్మవిద్యయం దధి కారము కలదనుటయు యుక్తియుక్తమే. ఇట్లు చెప్పిననేకాని * క్రమ ముక్తిని గూర్చి చెప్పువేదభాగము సార్థకముకాదు. ఉపాసకులు మృతి

* అణిమాదిసిద్ధులు (అష్టసిద్ధులు. పుట. 33౮ చూడు.)

* అర్థిత్వము మొదలగునవి (అధికారిలక్షణము. పు. 3౩౦ చూడు.)

* క్రమముక్తి (పు. ౯౧. చూడు)

నొందినపిదప దేవత లగుదురు; అటనుండి పరిపూర్ణబ్రహ్మజ్ఞానసంతులై మోక్షము నొందుదురు. ఇది వేదోక్తసిద్ధాంతము. దేవతలను బ్రహ్మవిద్యయం దధికారము లేకున్న నిట్లగుటకు వీలు లేదు కదా! కావున నవశ్యముగ దేవతల కట్టియధికార ముండియే తీరవలయును.

---

# ౯. అపశూద్రాధికరణము.

విషయము:—"జనశ్రుతుఁ డనువానిపుత్త్రుఁ డగునొక రాజు మిగుల దానశీలుఁడై యుండెను. ప్రతిగ్రామమునందును పట్టణమునందును గృహముల నేర్పఱిచి యచ్చట నతిశ్రద్ధతో వచ్చినవారికెల్ల నన్నమును పెట్టించుచుండెను. ఇట్లు సకలసద్గుణవంతుఁడై ప్రకాశించుచు నాప్రభువు సర్వలోకములకును గౌరవనీయుఁడై రాజ్యపాలనము నొనర్చుచుండి యొక్కనాఁడు గ్రీష్మఋతువునందుఁ దనమేడపై పరుండియుండెను. అప్పుడు ఆతనిసద్గుణములకు మెచ్చి దేవతలో లేక మునులో హంసరూపములఁ దాల్చి యాతనిఁ జూచుటకై యటకు వచ్చిరి. అందు ముందుగఁ బోవుచున్నహంసను జూచి వెనుకటిహంస యిట్లనియె. "ఓభల్లాక్షుఁడా! ఈ ప్రభువునకుఁ గలకీర్తితో సమాన మగుకీర్తి యెవ్వనికిని లేదు. ఈతని ధర్మముతో సమాన మగుధర్మ మెందును లేదు. నీ వీతని నలక్ష్యము చేయవలదు. అట్లు చేయుదువేని ధర్మాగ్ని నిన్ను దహించి వేయును." ఇట్లు చెప్పిన యాహంసయొక్క వాక్యముల విని భల్లాక్షుఁ డిట్లనియె. "ఇట్లు పలికెద వేల? ఈరా జెంత? ఈతనిధర్మ మెంత? నీవు చేసిన స్తోత్రమునకు రైక్వమహాముని తగునుగాక నీతఁడు తగునా? లోకమున సర్వజనులును చేసినధర్మములును ఫలములునుకూడ వానిధర్మములందును ఫలములందు నేకీభవించును. ఆయన తెలిసికొనవలసినవిషయమును తెలిసికొనినమహానుభావుఁడు ఆతనితో నితరు లెవ్వరు సాటి?" అని యిట్లాహంసలకు జరిగినసంభాషణమును విని యాప్రభువు తనకు తగినంతగుణసమృద్ధి లేమికి మిగుల దుఃఖించెను. ఎట్లెట్లో రాత్రిని గడపి మఱునాఁ డుదయమునఁ దనరథసారథిని పిలిచి రైక్వమహాముని యున్నస్థలమును వెదకుమని యాజ్ఞాపించెను. వాఁడును సమస్తస్థలంబుల

వెదకి యొకానొకవిజనప్రదేశమున నొక బండిక్రిందఁ గూర్చుండియున్న యమ్మునిని గాంచెను. ఆమునికి ఎప్పటికిని తనశకటమునొద్దనే యుండుట వాడుక. ఆసారథి యివ్విధముగ నున్నయమ్మహాత్ముని చూచి విచారించి యావృత్తాంతమును ప్రభువున కెఱిఁగింప నాతఁడును ఆఱునూఱుగోవులను రత్నహారములను రెండుగుఱ్ఱములుఈడ్చుబండి మోయునంతటి ధనంబును గైకొని బ్రహ్మవిద్యార్థియై యాతనికడకుఁ బోయెను. ఆముని యు ఆధన మల్ప మనుతలంపుచే నాప్రభువును నిరాకరించెను. మఱల నాతఁడు మఱి వేయిగోవులను మఱికొన్ని రత్నహారములను మఱియొక బండిధనమును కన్యాదానము నొనర్చుటకై తనపుత్రికనుఁ గూడ గైకొని వచ్చెను. అప్పు డాముని సంతసించి యాతనికి బ్రహ్మవిద్య నుపదేశించెను."

ఛాందోగ్యోపనిషత్తునందు నాల్గవయధ్యాయమున నీకథ యున్నది. అందు రైక్యముని ప్రభువు తెచ్చినధనమును నిరాకరించు నప్పుడు నంగీకరించునప్పుడుకూడ నాతనిని "శూద్ర"యని సంబోధించి యున్నాఁడు. ఆశూద్రపదమునుగూర్చియే యీయధికరణమున విచారము జరుగును. అది జాతిశూద్రపరము కాదని నిర్ణయింపఁబడును.

సంగతి:—పూర్వాధికరణమున "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత" అను మొదలగుశ్రుతి ననుసరించి "మనుష్యులకు మాత్రమే సర్వవిషయములయందు నధికారము కలదు" అనునియమము విడిచి "దేవతలకుఁగూడ బ్రహ్మవిద్యయం దధికారము కలదు" అనువిషయము సిద్ధాంతము చేయఁబడియున్నది. అట్లే "బ్రాహ్మణాది వర్ణములకు మాత్రమే బ్రహ్మవిద్యయం దధికారము కలదు" అనునియమమును విడచి "శూద్రులకుఁ గూడ నధికారము కలదు" అనువిషయమును కూడ సిద్ధాంతము చేయవచ్చునుకదా! యనునాక్షేపము రాఁగా దానికి సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. ఈయధికరణమున వచ్చినయాక్షేపము పూర్వాధికరణన్యాయమును దృష్టాంతముగఁ గైకొని వచ్చిన దగుటచే నీరెండధికరణములకును గల సంబంధము దృష్టాంతరూపమైనది యని తెలిసికొనవలయును.

ఇచ్చట విషయవాక్యమునం దున్నశూద్రశబ్దము క్షత్రియపరముగ సమన్వయింపఁబడును. కావున నీయధికరణము సమన్వయాధ్యా

యమునఁ జేర్పఁబడినది. ఇందును శ్రుతివాక్యమే విచారింపఁబడును. కావున దీనికి శ్రుతితో సంబంధము కలదు; అధికారినిర్ణయము చేయఁబడును కావున దీనికి శాస్త్రసంబంధముకూడఁ గలదు.

సందేహము:—శూద్రశబ్దము జాతిశూద్రుని చెప్పుట ప్రసిద్ధమగుటయు వానికి నెందును అధికారము సంభవింపకుండుటయు నిచ్చట సంశయకారణములు. "బ్రాహ్మణాదులకువలెనే శూద్రజాతివానికిఁగూడ బ్రహ్మవిద్యయం దధికారము కలదు. లేదు" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. "శూద్రుఁడును బ్రాహ్మణాదులతో సమానుఁడే కాఁడు" అనునవి వానిఫలములు.

పూర్వపక్షము:— బ్రహ్మవిద్యయందు శూద్రునకుఁగూడ నధికారము కలదని నిస్సంశయముగ చెప్పవచ్చును. అర్థిత్వము సామర్థ్యము అనునధికారిలక్షణములు శూద్రునకుఁ గూడ నుండవచ్చును. అర్థిత్వమనఁగా నిచ్ఛ. శాశ్వతమై సర్వదుఃఖరహితమై యుండుమోక్షరూపమగునానందము ననుభవింపవలయు ననుకోరిక యెవ్వని కుండదు? మఱియు నామోక్షమును సాధించుటకు తగినసామర్థ్యము శూద్రునకుఁ గూడ నుండవచ్చును. వారును పరబ్రహ్మము నేదియో యొకరూపముతో మనస్సున ధ్యానింపనేరరా?

మఱియు "తస్మాచ్ఛూద్రో యజ్ఞే ఽనవక్లృప్తః" "ఆకారణము వలన శూద్రుఁడు యజ్ఞమున నధికారి కానేరఁడు" అనిమాత్రమే శ్రుతియందు నిషేధము కలదు కాని "బ్రహ్మవిద్యయం దధికారి కాఁడు" అనునిషేధము లేదు. మఱియు యజ్ఞమునకు అగ్నిహోత్రము ప్రధానసాధన మగుటచేతను శూద్రునకు నది యుండుటకు వీలు లేక పోవుటచేతను, దానియందు వాని కధికారము లేకపోవచ్చును; కాని బ్రహ్మవిద్యయం దేల లేకపోవలయును? అందు అగ్నివలె శూద్రునకు నసాధ్య మగునుపాయ మెద్దియు లేదు కదా!

ఇదియును గాక "బ్రహ్మవిద్యయం దాతనికి నధికారము లేదు" అని పట్టు పట్టినను, సంవర్గవిద్యయం దైనను ఆయధికారము రాక తీరదు. ఆవిద్యయందు రైక్యమహాముని తనయొద్దకు నచ్చినశిష్యుని "అహహ రే శూద్ర"అని శూద్రశబ్దముచే సంబోధించిన ట్లున్నది. అప్పుడు వాఁడు శూద్రుఁడే కావలయును కదా! నిరర్థకము సాధ్యార్థ

మును విడచుట యయుక్తము కదా! కావున నీగుఱుతును పట్టి "శూద్రులకును బ్రహ్మవిద్యలయందధికారము కలదు" అనియే చెప్పి తీరవలయును.

అవతారిక :—అనునీయాక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౯౭. శుగస్య తదనాదరశ్రవణా త్తదాద్రవణాత్సూచ్యతే హి ౧. ౩. ౩౪.

తాత్పర్యము:—ఛాందోగ్యోపనిషత్తునందలి నాల్గవయధ్యాయమున జనశ్రుతునిపుత్రునిగూర్చి చెప్పఁబడినచరిత్రయందు ఉపయోగింపఁబడినశూద్రశబ్దము జాతిశూద్రపరము కానేరదు. అతఁడు హంసల వాక్యములను వినుటయు ఆహంసలచే ప్రశంసింపఁబడిన రైక్వునిఁ జూడఁబోవుటయు నాచరితమున వర్ణింపఁబడియున్నవి. దీనిచే నాతనికి హంసవాక్యశ్రవణమువలన నపరిమిత మగుశోకము కలిగినట్లు తెలియవచ్చుచున్నది. కావున నచ్చట నున్నశూద్రశబ్దము ఏదియో యొక * వ్యుత్పత్తిచే "శోకముచే పరుగిడినవాఁడు" అనునర్థమును చెప్పునది

---

* శూద్రశబ్దవ్యుత్పత్తులు:—"శుచం అభిదుద్రావ ఇతి శూద్రః" "దుఃఖమును పొందినవాఁడు కావున శూద్రుఁడు" "శుచా దుద్రావ ఇతి శూద్రః" "దుఃఖముచే రైక్వునిఁడకుఁ బోయెను కావున శూద్రుఁడు" అను మొదలగునవి శూద్రశబ్దముయొక్క వ్యుత్పత్తులు.

ఇట్లు సూత్రకారులతో భాష్యకారు లేకీభవించి యుండ "సంవర్గవిద్యయందు శూద్రులకు నధికారము కలదు" అనువిషయము భాష్యకారులయభిప్రాయ మైనట్లును, విధిలేక సూత్రకారులమతము ననువాదము చేసినట్లును కొందఱు చెప్పుచున్నారు. "పూర్వసంస్కారబలమువలన శూద్రజన్మమునం దైనను స్వయముగనే జ్ఞానము కలుగవచ్చును అట్లు కలిగిన నెవ్వరికైనను ఫలము కలుగక మానదు. సూతవిదురాదు లిట్టి తెగలోనివారే" అని భాష్యకారులు వ్రాసియున్న నంతమాత్రమున వారికి "శూద్రజాతికిఁ బరిపూర్ణాధికారము కలదు" అనునభిప్రాయ మున్నట్లు తలంచుచున్నారు. పురాణేతిహాసాదుల వినుటయం దందఱను నధికార మంగీకరింపఁబడినను, అది కేవలము వేదమంత్రశాస్త్రము లను వ్రతముల నాచరించుటయందుమాత్రమే శూద్రజాతివారికి నుపయో

యగు ననవలయును. శూద్రజాతిగలవారికి బ్రహ్మవిద్యయం దధికార మెట్లును సంభవింపదు.

సిద్ధాంతము:—వారికి అర్థిత్వ మున్నను సామర్థ్యము లేదు. సామర్థ్యము లేనప్పుడు కేవల మగునర్థిత్వ మధికారమును కలిగింప నేరదు. శక్తిలేనివాఁడు ఉపాయము నెఱుంగనివాఁడు నట్టియాశ కలిగి నంతమాత్రమున నేమి చేయఁగలఁడు? ఈకారణమువలన "తస్మాచ్ఛూద్రో యజ్ఞే ఽనవక్లృప్తః" అనుశ్రుతి యజ్ఞమునందువలెనే బ్రహ్మవిద్యయందును శూద్రజాతివానికి నధికారమును నిషేధించుచునే యున్న దనవలయును. అందలియజ్ఞశబ్దము విద్యాదుల * కుపలక్షణము.

"శూద్రులును దేవతాధ్యానమును చేయఁగలరే" అనియెద వేమొ యిది లౌకికసామర్థ్యము ఫలవంతమై సంపూర్ణాభివృద్ధికాని మోక్షముకాని కలిగింపవలయు ననినఁ గర్మకుఁగాని బ్రహ్మవిద్యకుఁగాని శాస్త్రీయసామర్థ్యము తోడుకావలయును. శాస్త్రీయసామర్థ్య మనఁగా: వేదాధ్యయనమును గావించి దానిమూలమున వేదోక్తార్థముల నెల్ల నెఱుంగుట. ఈసామర్థ్యము శూద్రుల కుండదనుట నిర్వివాదాంశము. ఉపనయనము లేనివారలకు వేదాధ్యయనము లేదనుట నియమ మగుటచే శూద్రులకు వేదాధ్యయనము కానిదానివలనఁ గలుగవలసి యర్థజ్ఞానముకాని లేదు. ఇట్లగుటచేతనే వారికి బ్రహ్మవిద్యయం దధికారము లేదు.

---

గించుననియు, జన్మాంతరసంస్కారము చక్కగా నుండెనేని శ్రవణమాత్రముననే జ్ఞానముకలిగినను కలుగవచ్చు ననియు, అట్లు కలుగుటచే శూద్రులకుఁగూడ ముక్తి దొరకునని యు పరిశీలకారుఁడు తనయభిప్రాయమును భాష్యార్థసర్ణి [illegible] పూర్వకముగ కనుపరచియున్నాఁడు.

కావున వేదమంత్రములఁ బఠించి తన్మూలమున నేదయైన నొకవిద్య నభ్యాసముచేసి సాధన చేయవలయు ననిన శూద్రులకు దం దధికారము లేదు. [illegible] అట్టిసాధనను వేదమంత్రరహితములను వ్రతాదులమూలమున చేయవలసినదయే ఒకవేళ పురాణాదిశ్రవణమువలన పూర్వసంస్కారశుద్ధమగుమనస్సు వసంతకాలమునందలిపుష్పమువలె వికసించునేని దానికి నెవ్వరు నాటంకము చేయువారు లేరు గదా సర్వసమ్మతము. ఇట్లుండ సూత్రకార భాష్యకారమతములకు నిష్కారణభేదమును కల్పించుట యనుచితము కదా!

ఉపలక్షణము (గు. [illegible])

"సంసర్గవిద్యయందుమాత్ర మట్టియధికారము శ్రుతిబలమున కలుగవచ్చును కదా! "యనియెదవేమొ అదియు సంభవింపనేరదు. అచ్చటిశూద్రశబ్దము జాతి శూద్రపరముకాదని యిదివరకే చెప్పి యున్నాము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. సామర్థ్యము రెండువిధము లనుటయు అందు శాస్త్రీయసామర్థ్యము శూద్రునకు కలుగదనుటయు సత్యమే,అయినను అంతమాత్రమువలన వానికి బ్రహ్మ విద్యయం దధికారము లేకపోదు. యజ్ఞకర్మలయందుఁ జెప్పఁబడిన యగ్నిమొదలగునవి లోకసిద్ధములు కాకుండుటచే వానిని తెలిసికొనుటకు వేదాధ్యయనమే యవశ్యముగ నుండి తీరవలయును. బ్రహ్మ విద్యయం దట్టిపదార్థము లెవ్వియు లేవు కదా!

"వేదాధ్యయన మనునది నియమము." అనియెదవేమొ అది వాదమునకు నిలుచునది కాదు. "స్వాధ్యాయో ఽధ్యేతవ్యః" "స్వశాఖ నధ్యయనము చేయవలయును" అనునది యజ్ఞాదివిధులకొఱకై నియమింపఁబడెనా, లేక కేవలపురుషప్రయత్నమునకై (ఇష్టసాధ్యమునకై) నియమింపఁబడెనా?

ఇందు మొదటిపక్షము సరికానేరదు. ఆవాక్యము ("స్వాధ్యాయో "అనువాక్యము) ఎట్టియజ్ఞమునుగాని చెప్పుసందర్భమున లేదు. పరంపరగానైనను ఎట్టియజ్ఞమునుకాని చెప్పుట లేదు. ఇక నది కర్మార్థమైన నియమ మెట్లగును?

రెండవపక్షమును విచారింపఁబోయిన నదియు సరి కానేరదు. పురుషప్రయత్న మనునది సామాన్యముగ పురుషాధీనమే.ఏదియైన నొక విధిని నిర్వహింపవలయు నన్నను "దీని నిట్లు చేయవలయును" అను నాజ్ఞకు ముందుగనే సామాన్యముగా పురుషుఁడు తత్సాధనోపాయ మును నిర్ణయించుచునే యుండును. అట్టియాజ్ఞ కలిగినపిదప సర్వమును దాని ననుసరించియే యుండును. ఇట్లుండ నడుమ వేదాధ్యయన మొకటియేల? "బ్రహ్మము నీవిధముగ నుపాసింపవలయును" అని చెప్పిన నెవ్వఁడైన నామార్గము నవలంబించి నడువవచ్చును కదా "ఈవిషయ మంతయు "ఈయుపాసన నిట్లు చేయవలయును" అని నిర్ణయించు వేదవాక్యముయొక్క యర్థము నెఱుంగుటచేతనే కదా ప్రత్యక్షము

లగును." అనియెదవేమొ వినుము. ఇదియు నియమము కానేరదు. కేవలము వేదమువలనమాత్రమే యర్థజ్ఞానము కలుగివలయు నను నియమము కలదా! అట్లే కలదనినచో తక్కిన ప్రమాణము లన్నియు నిష్ప్రయోజనము లగును. ఇది మీకుమాత్రము సమ్మత మగునా?

కావున వేదాధ్యయనము నియమము కానేరదు. ఇట్లగుటచే శూద్రులకుఁగూడ బ్రహ్మవిద్యయం దధికార ముండవచ్చును. వారు ఉపనయనము లేకపోవుటచే వేదాధ్యయనమును చేయకున్నను తదర్థప్రతిపాదకము లగునితరగ్రంథముల చదువుటచే బ్రహ్మవిద్యాప్రకారము నంతయును గ్రహింపవచ్చును; అట్లే యాచరింపవచ్చును. కావున నెట్లుచూచినను శూద్రులకుఁగూడ శాస్త్రీయసామర్థ్య ముండవచ్చును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరికాదు. అధ్యయనవిధి కర్మార్థంబును పురుషప్రయత్నార్థంబును కాకపోయినను కర్మకుఁగాని బ్రహ్మోపాసనకుఁగాని కావలసిన యొకానొకయుపాయ మనువిషయము మాత్రము నిర్వివాదమై యున్నది. మనము శ్రుత్యనుసారముగఁ బ్రవర్తించువారము. కావున అర్థజ్ఞానము కలిగినను కలుగకున్నను దాని వలన ప్రయోజన మున్నను లేకున్నను అధ్యయనమునుమాత్రము చేసి తీరవలయును. యజ్ఞాదివిధులు హింసాత్మకము లైనను శ్రుతిమాత్రబలమువలన నేవిధముగ నంగీకరించుచున్నామో అట్లే యీవిధినికూడ నంగీకరింపవలయును. సమర్థులు అధ్యయనమును చేసినపిదప దానినుండియే యైనను తదర్థమును ప్రతిపాదించుస్మృతిపురాణాదులనుండి యైనను అర్థమును గ్రహింపవచ్చును; కాని యధ్యయనమునుమాత్రము చేయక తప్పదు.

అధ్యయన మనఁగా: వేదమునందలి యక్షరముల గ్రహించుటయే (అనఁగా: వేదమును ముఖస్థమును గావించుటయే) కాని తదర్థగ్రహణము కూడ కాదు. "స్వాధ్యాయః" అనుశ్రుతి దీనినే విధించుచున్నది; కాని యర్థగ్రహణమునుకూడ విధించుట లేదు. ఇంతమాత్రమువలన వేదార్థగ్రహణమునందు శ్రుతికిఁ దాత్పర్యము లేదని సంశయింపవలదు. ఆవిధికి "అర్థము నెఱుంగలేనివాఁ రైనను వేదాక్షరముల గ్రహింపవచ్చును" అనియే యభిప్రాయము కావున నట్టివేదపాఠమువలన నొకానొకవిశేషఫల ముండి తీరవలయు నని సిద్ధాంతము చేయవలసియున్నది.

అర్థజ్ఞానశూన్యము లగుమంత్రజపాదులకువలె దీనికిని ఒకానొక యదృష్టఫల ముండుననుటలో విరోధ మేమి? మఱియు నర్థజ్ఞానమువలన కలుగుఫలము ప్రత్యక్షమే యగుటవలన దానిని గూర్చి వేద మంతగాఁ జెప్పనక్కఱలేదు. శాస్త్ర మనఁగా లోకప్రసిద్ధము కానియర్థమును తెలుపునదియే కదా! కావున నర్థజ్ఞానమువలనను, విధివలన దానియుపాయముల గ్రహింపవచ్చు ననుననుభవమువలనను ప్రత్యక్షసిద్ధ మగుఫలము సంభవించుచుండ శ్రుతివలన నదృష్టఫల మొక్కటి యుండవలయు ననువిషయము స్ఫురించుచుండ ప్రత్యక్షఫలమును విడిచి శ్రుత్యనుసారముగ నదృష్టఫలమును కల్పించుటయే యుక్తమైనపని మనము వేదమునే స్వతంత్రప్రమాణమునుగా నంగీకరించువారము; ప్రత్యక్షసిద్ధవిషయమునుగూర్చియు నంతగాఁ గ్రొత్తప్రయత్నము చేయ నక్కఱలేదు.

కావున కర్మయందుఁగాని బ్రహ్మవిద్యయందుఁగాని ప్రవేశింపఁ దలంచువాఁడు వానివలన సంపూర్ణఫలము నొందఁగోరువాఁడు అవశ్యముగ వేదాధ్యయనము నాచరింపవలయును. అర్థము నెట్లయిన గ్రహించుఁగాక; గాయత్రీమంత్రాదులవలె వేదాక్షరములఁగూడఁ గ్రహించి తీరవలయును. ఇది యుపనయనసంస్కారము లేనివానికి సంభవింపదు. శూద్రులకు నక్లే యుపనయనము లేదనుకారణమువలన సంభవింప నేరదు.

"అర్థమును అన్యగ్రంథములవలన గ్రహించిన నాయుపాసనల చేయుట కభ్యంతర మేమి?" అనియెదవేమొ వినుము. అట్లు చేసిన చేయువచ్చును; కాని ప్రయోజన మేమి? సంపూర్ణఫలము కలుగుటకు వేదాక్షరపఠనము; వేదాక్షరజప మనవచ్చును; అత్యావశ్యకము కదా! కావున నెట్లును శూద్రునకు వేదచోదితము లగు నేవిషయమునందును అధికారము లేదు.

## అ ౧. పా. ౩. సూ ౩౮. ఆరంభము.

అవతారిక:—"ఇట్లు చెప్ప నేటికి? శూద్రశబ్దము జాతిశూద్రవాచకమై యుండ రూఢిని పరిత్యజించి యోగము నాశ్రయింపనేల? ఆప్రభువు శూద్రుఁడే యేల కారాదు?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

# ౯౨. క్షత్రియత్వగతే శ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్. ౧. ౩. ౩౫.

తాత్పర్యము :—పైకథయందు ఆప్రభువు రైక్వునియొద్దకు సారథి నంపెననియు అపరిమితమగుధనమును దక్షిణఁగా నిచ్చె ననియుఁ జెప్పఁబడియున్నది. ఇట్టి యైశ్వర్యము భూపతికిఁ గాక నితరుల కుండుట సామాన్యముగ సంభవింపదు కదా? కావున పైకథయందు వర్ణింపఁబడినవాఁడు క్షత్రియుఁడే కావలయును.

మఱియు నీవిషయము ఉత్తరసందర్భమువలనఁ గూడ స్పష్ట మగుచున్నది. ఎట్లనిన:—

సంవర్గవిద్య నుపదేశించినపిదప దానిమాహాత్మ్యమును నుతించుటకై మఱియొకకథ యారంభింపఁబడియున్నది. అందును సంవర్గవిద్యోపాసకులే వర్ణింపఁబడియున్నారు. వారు క్షత్రియులు. "అథ హ శౌనకం చ కాపేయ మభిప్రతారిణం చ కాక్షసేనిం పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే" "ఒకసమయమున శౌనకుండును కపిగోత్రమున జనించినకక్షసేనుఁ డనువానిపుత్త్రుఁడైన అభిప్రతారి యనువాఁడును భుజింపఁబోవుచుండఁగా నొక బ్రహ్మచారి భిక్షము నడిగెను." అని యీ కథ యారంభ మగుచున్నది. ఇందు శౌనకుఁడు బ్రాహ్మణుఁడైనను క్షత్రియుఁడైనను శూద్రుఁడుమాత్రము కాఁడు. వానివిషయ మట్లుండనిండు. అభిప్రతారి యనువాఁడుమాత్రము క్షత్రియుఁ డని కపిగోత్రసంబంధముచేఁ దెలియవచ్చుచున్నది. సామాన్యముగ సమాన వంశజులే పరస్పరము యాజనము చేయించుకొనవలయు ననుట పూర్వమీమాంసాసిద్ధాంతము. ప్రకృతకపివంశజులనుగూర్చి వేదమున "ఏతేన వై చిత్రరథం కాపేయా అయాజయన్" "ఈకారణమువలన (సమాన వంశజు లగుటవలన) కాపేయులు (కపివంశజులు) చిత్రరథునిచే యజ్ఞము చేయించిరి" అని చెప్పఁబడియున్నది; ఆచిత్రరథుని గూర్చియు "తస్మా చ్చైత్రరథి ర్నామైకః క్షత్రపతి రజాయత" "ఆకులమునుండి లేక ఆచిత్రరథునివలన చైత్రరథి యను పేరుగల యొకక్షత్రియశ్రేష్ఠుఁడు జనించెను" అని చెప్పఁబడియున్నది. ఈసందర్భములను విచారించిన చిత్రరథుం డనువానికి యాజకు లగుటచేఁ గపివంశజులును, కపివంశమునందే జనిం

చినకథ సేనునికిఁ బుత్త్రుఁ డగుటచే అభిప్రతారియు క్షత్త్రియులే యగుచున్నారు; ఆతనితో సహవాసి యగుటచే శౌనకుఁడు నట్టివాఁడే యగుచున్నాఁడు. దీనిచే సంవర్గవిద్యయందు వర్ణింపఁబడిన జానశ్రుతియు(జనశ్రుతునిపుత్త్రుఁ డగుప్రభువును) క్షత్త్రియుఁడే యని తేలుచున్నది. ఆ యభిప్రతారియు సంవర్గవిద్యోపాసకుఁడే; ఈజానశ్రుతియు నట్టివాఁడే. సాధారణముగ నొక్కస్థలమున నధికారులుగ వర్ణింపఁబడినవారు సమానజాతీయులే కావలయు ననుట నిర్వివాదసిద్ధ మగునంశమే కదా! ఈ కారణమునవలన శూద్రశబ్దమునకుఁ గలరూఢిని పరిత్యజించియే తీరవలయును. న్యాయానుసారముగ నొకయర్థము దృఢ మగుచుండ రూఢి యనుచు తద్విరుద్ధార్థమును గ్రహింపఁజూచుట యవివేకమే కదా!

## అ ౧. పా 3. సూ 3౬. ఆరంభము.

అవతారిక:—ఇట్లు జానశ్రుతి శూద్రుఁడు కాడని నిర్ణయించి "శూద్రునకు కర్మలయందువలెనే బ్రహ్మవిద్యయందుఁ గూడ నధికారము లేదు" అనువిషయము సిద్ధాంతము చేయుటకై కొన్ని హేతువులను చూపుచున్నాఁడు.

## ౬౬. సంస్కారపరామర్శా త్తదభావా భిలాపాచ్చ. ౧. 3. 3౬.

తాత్పర్యము:—మఱియు బ్రహ్మవిద్యల(బ్రహ్మోపాసనల)విధించు స్థలములయందుఁ దఱుచుగ నుపనయనసంస్కారము పరామర్శింపఁబడియున్నది. శూద్రులకు నాయుపనయనము లేదనియు ననేకశ్రుతిస్మృతులయందుఁ బ్రకటింపఁబడియున్నది. ఈకారణమువలన శూద్రులకుఁ గర్మలయందువలెనే బ్రహ్మవిద్యలయందుఁగూడ నధికారము లేదనుటయే సిద్ధాంత మగుచున్నది.

ఉపనయన మనఁగా: గురువు నాశ్రయించుటయే "ఉప=సమీపమునకు,నయనం= తెచ్చుకొనుట(అనఁగా: గురువు శిష్యుని తనయొద్దకుఁ జేర్చుకొనుట)" అనువ్యుత్పత్తిచే నుపనయనశబ్ద మేర్పడుచున్నది. అట్టి సమయమున చేయఁబడుసంస్కారముకూడ నుపనయనమే యగును. కావున నిది శ్రుతులయందు బ్రహ్మవిద్యాప్రస్తావములలోఁ దఱుచుగ

వర్ణింపఁబడియేయున్నది. "భృగు ర్వై వారుణిః, వరుణం పితర ముప ససార తం హోపనిన్యే అధీహి భగవ ఇతి హోపససాద" "వరుణుని పుత్రుఁడగుభృగువు బ్రహ్మవిద్యార్థియై తనతండ్రికడకుఁ జేరెను.(తండ్రి భృగువునకు నుపనయనమును గావించెను) ఆశిష్యునకు గురువు ఉపన యనమును చేసెను. ఆశిష్యుఁడు నాకు బ్రహ్మవిద్య నొసంగు మనుచు గురువుకడకుఁ బోయెను. అని చెప్పఁబడియున్నది. "న చ సంస్కార మర్హతి" "శూద్రులకు సంస్కారము లేదు" అని మనుస్మృతి మొద లగు సర్వస్మృతులును శూద్రునకు నుపనయనాభావమును బోధించు చున్నవి. ఇట్లుండ వానికి నధికార మెట్లు కలుగును?

"తా న్హానుపనీ య్యైవ, 'ఆయశ్వపతి మహాశాలాదులకు నుప నయనమును గావింపకయే వైశ్వానరవిద్యను బోధించెను. (౧-౨-౨౮ చూడుఁ)' అని యున్నది దీనిచే నుపనయనము లేనివారలకుఁగూడ నధి కారము కలదని తోఁచుచున్నది." అనియెదవేమొ యిది యుక్తము కాదు. లోకమున ఉన్నదానిని నిషేధించుట యనుభవమున నున్నది కాని లేనిదానిని నిషేధించుట యెందును లేదు. బొత్తిగనే లేకున్న నట్టి దానిని మఱల నిషేధింపనేటికి? ఈకారణమువలన శ్రుతియందు నిషే ధము గానవచ్చుచున్నను "ముందే వారికి నుపనయనాధికారము కలదు" అనియే నిర్ణయింపవలసియున్నది. ప్రస్తుతము ఉపనయనసంస్కారము జరుపఁబడకుండుటకు నెన్నియో కారణము లుండవచ్చును. ఏదియు లే కున్నను కేవల శ్రుతిబలమునుమాత్రమే యాశ్రయించి "ఉపనయనాధి కారము కలబ్రాహ్మణాదివర్ణత్రయమునకు నట్టిసంస్కారము నాచరించి కాని యాచరింపక కాని బ్రహ్మవిద్య నుపదేశింపవచ్చును" అనియైనను సిద్ధాంతము చేయవచ్చును; కాని యెట్లు చూచినను ఆసంస్కారమునకు బొత్తిగనే యర్హుఁడు కానిశూద్రునకుమాత్ర మెప్పటికిని యధికారము కలుగనేరదు.

## ౧౦౦. తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః.

## ౧. ౩. ౩౭.

తాత్పర్యము:—ఇదియును గాక "వీఁడు శూద్రుఁడు కాఁడు" అనువిషయమును నిర్ణయించి పిదపఁగాని బ్రహ్మవిద్య నుపదేశింపఁ

గూడదు" అనువిషయము శ్రుతియే స్పష్టము చేసియున్నది. ఈకారణమువలనఁగూడ శూద్రునకు నధికారము లేదు.

ఆశ్రుతినిర్ణయ మెట్టి దనిన:—సత్యకాముఁ డనునొక బాలుఁడు బ్రహ్మచర్యవ్రతమును సలిపి వేదము నభ్యసించి బ్రహ్మజ్ఞానమును సంపాదింపవలయు నని తలంచెను. వానికి తనజాతి యిది యని తెలియదు. ఆకారణమున జబాలయను పేరుగల తనతల్లియొద్దకుఁబోయి యడిగెను. ఆమె పరిచారికావృత్తిచే జీవించునది. యౌవనకాలమున ననేకుల యిండ్లయందు పనులు సేయుచు సంచరించుచుండ నెవ్వరివలననో యీ పుత్రుఁ డుదయించెను. ఏజాతివానివలన నీతఁడు కలిగెనో యామెకు జ్ఞప్తి లేకుండెను కావున "నాజాతి యెయ్యది? నే నెవ్వనివీర్యము వలన నుద్భవించితిని" అని పుత్రుఁడు త న్నడుగుటయు "నా కేదియు జ్ఞప్తియందు లేదు" అని యుత్తర మిచ్చెను. పిదప నాబాలుఁడు గౌతమ మహామునికడకుఁ జని "నాకు వేదము నొసంగుఁడు" అని ప్రార్థించిన నమ్మునియు నాతనిజాతినిగూర్చి ప్రశ్నించి సర్వవృత్తాంతము నెఱింగి యిట్లనియె. బ్రాహ్మణుఁడు కాకిపోయిన నింత నిష్కపటముగ సత్యము వచింపఁడు. ముఖ్యముగ నిది మఱుఁగుపఱుపవలసినవిషయము కదా! కావున నీవు నిశ్చయముగ బ్రాహ్మణుఁడవే. బ్రాహ్మణవీర్యమున నుద్భవించినవాఁడవే యని పలికి తనయోగ్యదృష్టిచేతఁగూడ యథార్థస్థితి నెఱింగి యాతని కుపనయనము గావించెను (అనఁగా: బ్రహ్మవిద్యోపదేశమునకై దగ్గరఁ జేర్చెను).

అనునీకథ ఛాందోగ్యోపనిషత్తున నున్నది. ఇందు "సత్యకాముఁడు శూద్రుఁడు కాఁడు" అను నిర్ణయ మగునంతవఱకు గౌతముఁడు ఆతనికి బ్రహ్మవిద్యోపదేశమును చేయలే దనువిషయము స్పష్టముగ నున్నది కదా! శూద్రునకుఁగూడ బ్రహ్మవిద్యయం దధికార ముండునేని యట్లేల సేయకుండును? కావున బ్రహ్మవిద్యయందుఁగూడ శూద్రులకు నధికారము లేదు.

## ౧౦౧. శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చ. ౧. ౩. ౩౮.

తాత్పర్యము:—ఇది యంతయు గాక స్మృతియందు శూద్రులను

గూర్చి చెప్పునప్పుడు "వేదములు వినుట చదువుట దానియర్థమును విచారించుట యనునవి శూద్రునికి తగవు" అని స్పష్టము చేయఁబడి యున్నది.

"అథ హాస్య వేద ముపశృణ్వత స్త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతి పూరణం" "శూద్రుఁడు వేదమును వినునేని ప్రభువు వానిని చెవుల యందు సీసమునుగాని లక్కనుగాని కరిగిపోయించి శిక్షింపవలయును" అని వేదశ్రవణనిషేధంబును, "ఉచ్చారణే జిహ్వాచ్ఛేదః" "శూద్రుఁడు వేదమంత్రముల నుచ్చరించునేని నాలుకను చ్ఛేదింపవలయును" అని యధ్యయననిషేధంబును కలదు. మఱియు వినికియే నిషేధింపఁబడిన నిక నధ్యయనమును ప్రత్యేకముగ నిషేధింపవలయునా? వినకున్న నధ్యయనము నెట్లు చేయఁగలఁడు? మఱియు "న శూద్రాయ మతిం దద్యాత్,....న చాస్య వ్రత మాదిశేత్, యో హ్యస్య ధర్మ మాచ ష్టే....సో ఽసంవృతం నామ తమః సహ తేనైవ గచ్ఛతి" "శూద్రు నకు వేదార్థమునుగాని వేదోక్తవ్రతములను గాని వేదోక్తధర్మవిశేష ములను గాని చెప్పఁగూడదు. అట్లు చెప్పినగురువు శిష్యునితోఁ గూడ అసంవృత మనుపేరు గల గాండాధకారరూపమైన నరకమునఁ బడును" అనువాక్యముచే శూద్రులకు వేదార్థమును విచారించుటయందుగాని యందు చెప్పఁబడినవ్రతముల ననుష్ఠించుటయందుఁగాని యధికారము లేదు" అనువిషయము స్పష్టము చేయఁబడియున్నది. ఈకారణమువలన శూద్రునకు బ్రహ్మవిద్యయం దధికారము లేదు.

"స్త్రీలకుఁ గూడ వేదాధ్యయనాధికారము లేకున్నను వారు సర్వార్థములను పరులవలన విని గ్రహించి యాచరించుచున్నారు. ఇట్లే శూద్రులుకూడ నాచరింపరాదా?" అనియెదవేమొ వినుము. శూద్రు నకు నుపదేశించుటవలన గురువునకుఁగూడ నరకపాతము చెప్పఁబడి యుండుటచే, వారు (శూద్రులు,) వేదార్థమును వినుటయే మొట్టమొ దట సంభవింపదు. ఇట్లుండ తదనుసారముగ ననుష్ఠించుట యనిన నెట్లు? కావున నుపదేశకుఁడు శూద్రులకు నుపదేశింపవలసివచ్చినప్పుడు వారి జాతికిఁ జెప్పఁబడియున్న సామాన్యవిశేషధర్మములనే యుపదేశింపవల యును కాని యన్యమును చెప్పరాదు. "శ్రావయే చ్చతురో వర్ణాన్" "స్మృతులను ఇతిహాసములను పురాణములను వీని నన్నింటిని నాలుగు

వర్ణములవారికిఁ గూడఁ జెప్పవచ్చును" అనికూడ స్మృతులు చెప్పుచున్నవి. ఈప్రమాణము ననుసరించి చూచిన "వేదమునందుమాత్రమే శూద్రునకు నధికారము లేదు; కాని యితరములయందు కలదు" అను విషయము తేలుచున్నది. దీని నాశ్రయించి చూచిన ఏయేవ్రతముల యందు వేదమంత్రోచ్చారణతో నావశ్యకము లేకయే దీక్షలను గైకొనుటకు వీలు కలదో ఆయావ్రతముల నెల్ల శూద్రుఁడు నిరాటంకముగ నాచరింపవచ్చు నని యేర్పడుచున్నది. శైవవైష్ణవాద్యాగమముల యందుఁ గాని మఱియెచ్చటఁ గాని చెప్పఁబడినయుపాసనలలో నేవియైన వేదమంత్రరహితములై యుండునేని వానినిగూడ శూద్రుఁ డవశ్యముగ నాచరింపవచ్చు నని యేర్పడుచున్నది. స్మృతిపురాణాదులవలన వేదతాత్పర్య మంతయు గోచరమైనను, అది వేదాక్షరవిచారము కాదు కావున నందు దోషము లేదు. వేదాక్షరముల నోటితో నుచ్చరించికాని కంటితో చూచికాని దానియర్థమును విచారించిన దోషమగును కాని, గురువుకూడ నట్లే యుపదేశించిన దోష మగునుకాని యన్యము లగుపురాణాదులమూలమున నట్టియుపదేశముఁ జరిగినను దోషము లేదు. అప్పటికిని వేదమంత్రసహితము లగుక్రియలయందు శూద్రునకు నధికారము లేదనువిషయము స్థిరముగనే యుండుటచే, వానిజ్ఞానము వేదమంత్రరహితోపాసనాదిమాత్రవిషయముగానే (వేదమంత్రసంబంధము లేనియుపాసనాదులఁ నాశ్రయించినదిగా, వాని యాధిక్యమును తెలుసుకొనుటకై యుపయోగించునదిగా మాత్రమే) పరిణమించును. కదా! బుద్ధిమంతుఁ డగువాఁడు తనయధికారము నెఱింగియే ప్రవర్తించును; కాని సర్వము నెఱింగితిమి కదా యని స్వేచ్ఛగా విజృంభింపఁడు. అట్లు విజృంభించిన ప్రభువుచే శిక్షితుఁ డగును. గురువులుకూడ విచారించియే యథోచితముగ చెప్పవలసినవారలె కాని యందఱికును దమకు తెలిసినదానినెల్లఁ బ్రకటింపవలసినవారు కారు కదా! సర్వవిధులయందును దేశకాలాద్యనుసరణము యోగ్యాయోగ్యవిచారణయు నావశ్యకములే కావున దానినిగూర్చి యంతగాఁ జెప్పనక్కఱ లేదు.

ఒకవేళ విదురధర్మవ్యాధాదులకువలె శ్రవణమాత్రముననే యొకానొకశూద్రునకు జ్ఞానోదయమై బ్రహ్మనిష దొరకునేని దాని

నాక్షేపించువార లెవ్వరును లేరు. వానికి నవశ్యముగ నాజన్మమున నే ముక్తి దొరకును. పూర్వసంస్కారబలమును నియమించుట యెవ్వరి తరము. అది జాత్యాదుల నపేక్షింపదు కదా! కావున శూద్రులకు వేదాక్షరపఠనమునందుమాత్రమే యధికారము లేదు. * కేవల వేదోక్తవిషయములందుమాత్రమే యధికారము లేదు.

---

## ౧౦. కంపనాధికరణము.

విషయము :—ఇంతకుముందు ప్రస్తావానుసారముగ రెండధికరణములయందు బ్రహ్మవిద్యాధికారులనుగూర్చి విచారింపఁబడెను. ఇప్పుడు ఆవిచారమును ముగించి మఱల వేదాంతవాక్యవిచారము నారంభించుచున్నాఁడు.

కఠోపనిషత్తునందు "యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతం మహద్భయం వజ్ర ముద్యతం య ఏత ద్విదు రమృతా స్తే భవంతి" "ప్రాణ మున్నప్పుడే యీసర్వప్రపంచంబును చలించును. ఆప్రాణమునుండియే యీసర్వంబును జనించినది. కావున ఆప్రాణమే జగత్కారణము. అదియే సర్వప్రపంచమును తమతమవృత్తులయందు నిలుపుటకై యెత్తఁబడిన మహాభయంకరమగు వజ్రము" అనువాక్య మొక్కటి కలదు. దానియర్థ మిందు విచారింపఁబడును.

సంగతి:—పూర్వాధికరణము అధికారవిచార మగుటచే దానికిని దీనికిని సందర్భ మేమియు సంఘటింపదు. కావున ప్రమితాధికరణమునకును దీనికిని సంబంధము కలుగవలయును.

అచ్చట బ్రహ్మమును వర్ణించువాక్యమున జీవశబ్ద మున్నను, "అది జీవబ్రహ్మైక్యమును బోధించును" అని చెప్పఁబడెను. ఇచ్చట నట్లు లేదు. ప్రాణబ్రహ్మలకు నైక్యము సంభవింపదు కావున బ్రహ్మవాక్యమధ్యమున ప్రాణమును చెప్పవలసినయావశ్యకత యుండదు. కావున నిచ్చట చెప్పఁబడినది ప్రాణోపాసనమో వాయూపాసనమో

---

* కేవలవేదోక్త మనఁగా: వేదమంత్రములసహాయముచే నాచరింపఁబడవలసి రెండవమార్గముచే [illegible]

లేక యుభయోపాసనయో కావలయు నని పూర్వపక్షము వచ్చును. దానికి సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. కావున వీనికి రెంటికిని గలసంబంధము * ప్రత్యుదాహరణరూపము.

సందేహము:—ఇచ్చట పూర్వోత్తరసందర్భములు స్పష్టము కాకుండుటచే "బ్రహ్మప్రకరణమా? కాదా" యని సంశయముగ నుండుటయు, వజ్రశబ్దము బ్రహ్మవాచకముగా నుండుటకు వీలు లేక పోవుటయు, ప్రాణశబ్దమునకు వాయువందు రూఢార్థ ముండుటయు సంశయకారణములు "విషయవాక్యమునఁ జెప్పఁబడినది ప్రాణాద్యుపాసన నిర్విశేషపరబ్రహ్మము" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. పూర్వపక్షమునకు నుపాసనయు సిద్ధాంతమునకు జ్ఞానంబును ఫలములు.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమున పరబ్రహ్మము చెప్పఁబడెననుటకు వీలు లేదు. ప్రాణశబ్దము పరబ్రహ్మవాచకము కాదు. వజ్రశబ్దంబును అట్టిది కాదు. పూర్వోత్తరసందర్భ మొకవేళ బ్రహ్మపరమై గాన వచ్చుచున్నను ప్రాణవజ్ర * శ్రుతిబలము నాశ్రయించి యీవిషయవాక్యమును భినవాక్యమునుగా వ్యాఖ్యానము చేయవలయును. ప్రాణశ్రుతి బలముచేఁ బ్రాణవాయువును గూర్చి చెప్పుచున్న దనియు వజ్రశ్రుతి బలముచే బాహ్యవాయువును గూర్చి చెప్పుచున్న దనియు నిర్ణయింపవలయును. ఈబాహ్యవాయువే పొగ కాంతి నీరు అనువానితోఁ గూడి మేఘరూపమునఁ బరిణమించి మరల మెరుపు గాను పిడుగుగాను వర్షముగాను విజృంభించుచుండును. పిడుగే వజ్రము కావున వజ్రశబ్దముచే బాహ్యవాయువు నూహింపవచ్చును.

౨ "ఇట్లయిన సర్వశ్రుతికి బాధ వచ్చును." 'సర్వప్రపంచము' అనుటచే వాయుసహిత మగుప్రపంచ మంతయు వర్ణింపఁబడెను. వాయువు వాయువునే కదలింపఁగలదా?" అని యెనవేమొ వినుము. ఇచ్చట సర్వశబ్దమునకు "వాయుభిన్న మగుసర్వప్రపంచము" అని యర్థము చెప్పవచ్చును. ఇట్లు సేయుటవలన సర్వపదముయొక్క యర్థము కొంచెము సంకోచము నొందునేకాని సంపూర్ణముగ నశింపదు. ఇంత

* ప్రత్యుదాహరణస్వరూపము (పు. ౭౭. చూడు).

* శ్రుతి (పు. ౧౦౨. చూడు.)

మాత్రము సంకోచము నంగీకరింపక ప్రాణవజ్రశబ్దములకే బ్రహ్మపర ముగ నర్థము చెప్పఁజూచిన నప్పుడు వానికి సంపూర్ణముగ నర్థాంతర మునే చెప్పిన ట్లగును; స్వకీయ మగునర్థమును సంపూర్ణముగనే విడచిన ట్లగును. దీనికంటె నర్థసంకోచము నంగీకరించుటయె కొంచెము మేలు కదా!

3 "ఆ ప్రాణమును వజ్రమును గూడ నెఱింగినవారు మరణము నొందరు అని యున్నది. బ్రహ్మజ్ఞానమువలన నిట్టిమోక్షము సంభ వించును కాని వాయుజ్ఞానమువలన లేదు కదా!" అనియెద వేమొ సత్యమే. అయినను అమృతశబ్దము శాశ్వత మగుమరణాభావమును (ఎప్పటికిని నశింపక నేకరూపముతో నుండుటను) జెప్పునది కా నక్కఱ లేదు. "అమృతాః దేవాః" అని ప్రళయకాలమున నశించుస్వభావము గలదేవతలను గూర్చి కూడ నాశబ్దము ప్రయోగింపఁబడియున్నది. ఇంతమాత్రపు టమృతత్వము వాయూపాసనవలనఁ గూడఁ గలుగు నని శ్రుతియే చెప్పుచున్నది. "వాయు రేవ వ్యష్టిః వాయుః సమష్టిః అప పున ర్మృత్యుం జయతి య ఏవం వేద" "ప్రపంచమునఁ గల * సామా న్యవిశేషము లన్నియు వాయువే. ఈవిషయము నెఱింగినవాఁడు అప మృత్యువుల జయించును." అను మొదలగు వాక్యములు శ్రుతులయందు పెల్లుగఁ గానవచ్చుచున్నవి.

4 "ఇట్లయిన నొకవాక్యమునందే రెండుపాసనలు చెప్పఁ బడిన వనవలయును. అది విరుద్ధము కదా!" అనియెద వేమొ యట్లు చెప్ప నక్కఱ లేదు. సంవర్గవిద్య ఇట్టిదియే అందు దేవతారూపమున బాహ్యవాయువు దేహరూపమున నాభ్యంతరవాయువు కూడ వర్ణింపఁ బడియున్నది. ఇట్లే యిచ్చటకూడ వర్ణింపఁబడియుండవచ్చును కదా! కావున నెట్లు చూచినను విషయవాక్యమునఁ జెప్పఁబడినది వాయూ పాసనయే.

అవతారిక:—అనిన నీసంశయమును నివారించుచున్నాఁడు.

## ౧౦౨. కంపనాత్. ౧. ౩. ౩౯.

తాత్పర్యము:—ఇచ్చట "సర్వప్రపంచమునకును ఆశ్రయమై

---

* సామాన్యవిశేషములు (బృ. ౩-౩-౨. చూడుము.)

సర్వప్రపంచమును కదలించుచు ప్రాణ మున్నది" అనుటచే నాప్రాణము బ్రహ్మమే కావలయు నని సిద్ధాంత మగుచున్నది. అమృతశ్రుతికిని నిరర్థకముగ నర్థాంతరమును కల్పించుట యయుక్తమే. ప్రస్తుతప్రకరణమును "అన్యత్ర ధర్మాత్ (౧-౨-౧౦ చూడు.)" అని బ్రహ్మప్రశ్నతో నారంభింపఁబడియున్నది. కావున నెట్లును ఇచ్చట చెప్పఁబడినది బ్రహ్మమే కావలయును.

౧ సిద్ధాంతము:—మఱియు ప్రాణశబ్దమునకు పరబ్రహ్మమునందుఁ బ్రయోగము కలదు. "ప్రాణస్య ప్రాణం (౧-౧-౨౩ చూడు.)" అను మొదలగుస్థలము లనేకములు కలవు. ప్రాణాధికరణమునందును (౧.౧ ౨౩ చూడు.) ప్రతర్దనాధికరణమునందును (౧-౧-౨౮ చూడు.) ఈవిషయము స్పష్టము చేయఁబడియున్నది.

సర్వప్రపంచమును కదలించుట యనుకార్యమునందును ఈప్రాణవాయువు సమర్థము కాదు. "న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ఇతరేణ తు జీవంతి యస్మి న్నేతా వుపాశ్రితౌ" "మనుష్యుఁడు ప్రాణముచేతఁగాని అపానముచేతఁగాని జీవించుట లేదు. దీనికి నాధారమగుమఱియొకపదార్థములచేతనే జీవింపుచున్నాఁడు" అని శ్రుతి చెప్పుచున్నది. కదలుట యనఁగా: జీవించుటయే కదా!

మఱియు సర్వకారణము బ్రహ్మమే యగును కాని వాయువు కానేరదు. ప్రకృతవిషయవాక్యమున సర్వకారణత్వము చెప్పఁబడియున్నది.

ఇదియును గాక "త దేవ శుక్రం త ద్బ్రహ్మం....తస్మిన్ లోకాః శ్రితాః సర్వే" "అదియే తేజోరూప మగుబ్రహ్మము....దానియందే సర్వలోకములు నున్నవి" అనునది పూర్వవాక్యము. ప్రస్తుతవిషయవాక్యమునఁ గూడఁ బ్రాణమునకు సర్వలోకాధారత్వము చెప్పఁబడియున్నది. సర్వలోకమును జీవింపఁజేయునది సర్వలోకాధార మగుటలో సంశయమేమి? ఈకారణమునలనఁ "బూర్వవాక్యమున జెప్పఁబడిన సర్వాధారత్వమే యిచ్చటను జెప్పఁబడియుండుటచే, అచ్చట చెప్పఁబడినబ్రహ్మమే యిచ్చటను చెప్పఁబడెను" అనియే సిద్ధాంతము చేయవలసియున్నది. రెండువాక్యములయం దొకటేవిషయము చెప్పఁబడుట పరస్పరసంబంధమును తెలుపుటకు ప్రబలప్రమాణము కదా! కావున నిచ్చట ప్రాణశబ్దముచేఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

మఱియు నిచ్చటి వజ్రశబ్దము "మహాభయము" అనునర్థమునందు మాత్రమే ప్రయోగింపఁబడియున్నది కాని పిడుగును చెప్పవలయు ననునుద్దేశముతో కాదు. లోకమున "నేను వీనియాజ్ఞను నిర్వర్తింప కుండిన నానెత్తిపై వజ్రాయుధము పడును" అను నిట్టిప్రయోగము లనేకములు కలవు. కావున విచారించినచో నిచ్చటఁగూడ "బ్రహ్మము సర్వప్రపంచమునకును భయంకరము. దానియాజ్ఞచేతనే అన్నియు తమ తమవ్యాపారములయందు ప్రవర్తించుచున్నవి" అనువిషయమును తెలుపుటకై లక్షణావృత్తితో వజ్రశబ్దము ప్రయోగింపఁబడె ననుటయు సిద్ధాంత మగుచున్నది.

"భయాదస్యాగ్ని స్తపతి....భయా దింద్రశ్చ వాయుశ్చ...." "ఈతనియొక్క భయముచేతనే అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. ఇంద్రుఁడును వాయుదేవుఁడును సంచరించుచున్నాఁడు" అని యుత్తరవాక్యమున నున్నది. ఇచ్చట వాయువునుగూర్చి కూడఁ జెప్పఁబడియుండుటచే సర్వభయకారణ మగుపదార్థము బ్రహ్మమే యనుట స్పష్ట మగుచున్నది. ప్రస్తుతవిషయవాక్యమునందును అట్లే సర్వభయకారణ మగుపదార్థము వర్ణింపఁబడియుండుటచే నది బ్రహ్మమే కావలయును. "భీషా స్మా ద్వాతః పవతే" "ఈతనిభయమువలన వాయువు చలించుచున్నది" అని బ్రహ్మప్రకరణముగ ఆనందమయాధికరణమున నిర్ణయింపఁబడిన తైత్తిరీయశ్రుతియందుఁ గూడ నున్నది. కావున నిస్సంశయముగ నిచ్చట ప్రాణవజ్రశబ్దములచే వర్ణింపఁబడినది పరమేశ్వరుఁడే.

౨ ఈకారణమువలన సర్వశ్రుతికి సంకోచమును కలిగింపవలసిన పని యించుకైనను లేదు. మీరన్నట్లు ప్రాణవజ్రశబ్దములు ప్రకరణాదులకు విరుద్ధము నన్యాయముగ బ్రహ్మపరములు చేయఁబడెనేని, దానికంటె సర్వశ్రుతిని సంకోచించుటయే యుక్తమగును కాని, ప్రస్తుత నిరూపణమున నట్టి దేదియు లేదు కదా!

3 మఱియు విషయవాక్యమునఁ జెప్పఁబడుచున్న యమృతత్వమును మఱియొకవిధముగ వ్యాఖ్యానము చేయవలసినప్రయాసము కూడ లేదు. "త మేవ విది త్వాతిమృత్యు మేతి, నాన్యః పంథా విద్యతే ఒయనాయ" "ఆబ్రహ్మము నెఱింగినవాఁడే శాశ్వత మగు మరణాభావమును (మోక్షమును) జెందును. దానికి మఱియొకమార్గము లేదు"

అనుమొదలగుప్రసిద్ధశ్రుతుల ననుసరించియే సిద్ధాంతము చేయవచ్చును. వాస్తవస్థితిలో వాయువునుగూర్చి చెప్పఁబడినది యపమృత్యుజయమే కాని కాలమృత్యుజయము కాదు. మఱియు "వాయు రేవ వ్యష్టిః "అనువాక్యమునకుఁ బూర్వప్రకరణమునఁ బరమేశ్వరుఁడు వర్ణింపఁ బడియున్నాఁడు. "అతో ఽన్య దార్తం సకలం" "ఈబ్రహ్మమునకంటె నితరమైన దంతయు దుఃఖరూపము" అని చెప్పఁబడియున్నది. ఇట్లుండ దుఃఖరూప మగుదాని నుపాసించువాఁడు సంపూర్ణసుఖము నొందు నని యెట్లు చెప్పఁబడియుండును? కావున నెట్లుచూచినను అమృతత్వమునకు సంకోచము చేయుట యుక్తము కాదు.

౮. ఈకారణమువలన ప్రస్తుతవిషయవాక్యమును సంవర్గవిద్యతో బోల్చుట కూడ యుక్తియుక్తము కాదు. ప్రకరణారంభమున నాచికేతుఁడు బ్రహ్మమును ప్రశ్నించెను; యముఁడు దాని కుత్తర మిచ్చెను. ఇట్లుండ నడుమ వాయుప్రస్తావ మేల వచ్చును? కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

విశేషాంశము:—"ఇట్లయిన క్రొత్తగా నీయధికరణమే యారంభింపవలసినపని లేదు. ప్రాణాధికరణమునందుఁ గాని ప్రతర్దనాధికరణమునందుఁ గాని యిది యేకీభవింపవచ్చును" అనియెదవేమొ అట్లు కాదు. ప్రాణాధికరణమున సమానవాక్యమునందే పరబ్రహ్మమును తెలియఁజేయుగుఱుతు (సర్వభూతలయ మనుగుఱుతు) కలదు; ప్రతర్దనాధికరణమున పూర్వోత్తరసందర్భము బ్రహ్మమును స్పష్టము చేయుచున్నది. ప్రథమపాదమున పరబ్రహ్మముయొక్కగుఱుతులు స్పష్టముగ నేవాక్యములయందుఁ గానవచ్చుచుండునో, యట్టివానినే కదా విచారించితిమి. ఇచ్చట నట్టిగుఱుతు లెవ్వియుఁ గానరాకుండుటవలన నిది వానిలో నేకీభవింపలేదు.

---

# ౧౧. జ్యోతిరధికరణము.

విషయము:—"య ఏష సంప్రసాదోఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే

(౧.౩.౧౮. ౧౯ చూడు.)" అనువాక్యము ప్రజాపతివిద్యయందు (పూర్వపక్షావతారిక. ౧. ౩. ౧౯ చూడు.) కలదు. అది యీయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున ప్రకరణబలము నాశ్రయించి ప్రాణశబ్దము బ్రహ్మపర మని సిద్ధాంతము చేయఁబడినది. ఇచ్చట నట్టి ప్రకరణ మున్నను దానిని బాధించునట్టి * శ్రుతులు అనేకములు కలవు. వాని నాశ్రయించి జ్యోతిశ్శబ్దమునకు సూర్యపరముగ నర్థము చెప్పవలయును." అను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. ఈయాక్షేపము ప్రత్యుదాహరణము నాశ్రయించి వచ్చెను. కావున నీరెంటికినిఁ గలసంబంధము ప్రత్యుదాహరణసంబంధము.

సందేహము :— పై విషయవాక్యమున తేజస్సునందు రూఢిగల జ్యోతిశ్శబ్దంబును పరబ్రహ్మమునందు రూఢిగలపరశబ్దంబు నుండుటయే సంశయకారణము. "ఈవిషయవాక్యమున వర్ణింపఁబడినవాఁడు సూర్యుఁడు. పరమేశ్వరుఁడు" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. ఉపాసనయు జ్ఞానంబును క్రమముగ వానిఫలములు.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమునఁ బరమేశ్వరుఁడు చెప్పఁబడె ననుటకు వీలు లేదు. జ్యోతిశ్శబ్దము సూర్యునియందు లేక సర్వతేజస్సులయందు రూఢమై యున్నది. "సముత్థాయ" అనుపదము ఎచ్చటికో జీవుఁడు ప్రయాణము చేసె నని చెప్పుచున్నది. జ్యోతిశ్శబ్దార్థము బ్రహ్మమే యైనయెడల నిది యెట్లు సంభవించును? అది స్వస్వరూపమే యగుటచేతఁ దత్ప్రాప్తికై యెటకును బోవ నక్కఱ లేదు కదా! మఱియు "ఉపసంపద్య" అనుమఱియొకపదంబును మాసిద్ధాంతమును దృఢము చేయుచున్నది. జ్యోతిశ్శబ్దము సూర్యాదులలో దేనినైనఁ జెప్పునేని యప్పుడు, జీవుఁడు ఆస్థలమునకుఁ బోయి అది *యర్చిరాదిమార్గ మగుటచే బ్రహ్మలోకమునుఁ జెంది యటనుండి విజ్ఞానవంతుఁడై స్వస్వరూప మగుమోక్షమును జెందవచ్చును; గాని, అది(జ్యోతిశ్శబ్దము) బ్రహ్మమునే చెప్పునేని యిదియంతయు నెట్లు సంభవించును? సంభవింప

---

* శ్రుతులు (పు. ౧౦౭. చూడు.)

* యర్చిరాదిమార్గము (పు. ౨౦౭ చూడు.)

కున్న "ఉపసంపద్య" యను నాయసమాపకక్రియ తెల్పు*భూతార్థము నిరర్థకము కావలసివచ్చును. "సాక్షాత్కారమే స్వరూపస్థితి" అనియెద వేమొ అట్లయిన నది బ్రహ్మప్రాప్తికంటె పూర్వమందే కలుగవలయు. ఎవ్వఁడైనను తనకు కానరానిపదార్థమును సమీపించు ననుట సంభవింపదు కదా! "ఆయుపసంపద్యపదమునకుఁ గూడ సాక్షాత్కారమే యర్థము" అనియెదవేమొ యట్లు చెప్పుటకు వీలు లేదు. రూఢియే సర్వసమ్మతమై యుండ నిరర్థకముగ యోగము నేలయాశ్రయింపవలయును. "అథ యత్రైత దస్మా చ్ఛరీరా దుత్క్రామ త్యథైతై రేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే" "ఈజీవుఁడు శరీరమును విడువఁగనే యీ సూర్యకిరణములగుండ పైకిఁ బోవును" అని శ్రుతియందు మోక్షేచ్ఛగలవారికి సూర్యప్రాప్తి చెప్పఁబడియున్నది. కావున జ్యోతిశ్శబ్దము సముత్థాయశబ్దము ఉపసంపద్యశబ్దము అనునీమూఁటిచేతను ఇచ్చటి ప్రకరణము బాధింపఁబడును. దహరాధికరణమునందు సముత్థాయశబ్దమునకు వివేకమని యర్థము చెప్పియున్నారు ; కాని అది యప్రసిద్ధ మగుటచే నంగీకార్యము కాదు. మఱియు నిచ్చట గానవచ్చుచున్నపరశబ్దము పరాత్పరుఁ డగుపరమేశ్వరునే చెప్పు ననుటకును వీలు లేదు. అది శ్రేష్ఠవాచకము కూడఁ గావచ్చును కదా! కావున నెట్లు చూచినను ఈవిషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు సూర్యుఁడే కావలయును.

అనుపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

## ౧౦౩. జ్యోతిర్దర్శనాత్. ౧. ౩. ౪౦.

తాత్పర్యము:—ఇచ్చట చెప్పఁబడిన జ్యోతి పరమేశ్వరుఁడే యని ప్రకరణమువలన స్పష్ట మగుచున్నది.

సిద్ధాంతము:—ప్రజాపతివిద్య యింద్రవిరోచనులకును ప్రజాపతికిని జరిగిన సంవాదము. అది "ఉత్తరాత్ (౧. ౩. ౧౯)" అను సూత్రమునందు వివరింపఁబడియున్నది. దానిని ముందువెనుక విమర్శించినచోఁ బైవిషయము (జ్యోతి బ్రహ్మమే యనువిషయము) స్పష్ట

* భూతార్థమనఁగా : భూతికాలమును తెలియఁజేయు నర్థము. ఉపసంపద్య=పొంది అనునర్థము.

మగును. ప్రజాపతిని ఇంద్రవిరోచనులు బ్రహ్మరూపమును గూర్చి ప్రశ్నించిరి. ఇట్లుండ దానికి విరుద్ధముగ నాయన సూర్యునిఁ గూర్చి యేల చెప్పును.?

శ్రుతులు ప్రకరణమును బాధించు ననుట యథార్థమే; గాని దానికిని సమయము కలదు. ఉపక్రమముననే విరుద్ధముగ ప్రకరణబాధ సంభవించునా? మఱియు అర్చిరాదిమార్గముగుండ బ్రహ్మలోకప్రాప్తియే యిచ్చట చెప్పఁబడు నేని సూర్యునిమాత్రమే వర్ణించి యూరకుండుట సంభవించునా? "అశరీరం" "శరీరము లేనప్పుడు" అను మొదలగు శ్రుతి వాక్యముల నాశ్రయించిన నిచ్చటిజ్యోతిశ్శబ్దము బ్రహ్మమునే చెప్పు నని తెలుచున్నది. తత్ప్రాప్తివలనఁ గాని శరీరాభావము కలుగదు కదా! ఈకారణమువలననే సముత్థాయపదమునకుఁ గూడ వివేకమే (శరీరము నుండి యాత్మను విభాగించు జ్ఞానమే) యర్థ మని తెలుచున్నది. శరీరాభావ మనఁగా శరీరమునుండి యాత్మను విభాగించుటయే యగును కాని మరణము కానేరదు. మరణము నొందినను * సూక్ష్మశరీర మెటకును పోవదు కదా! కావుననే ఆదిత్యప్రాప్తియు నిట్టివానినిఁ గూర్చి చెప్పఁ బడినది కాదు. మోక్షమునకు * గతియే లేదని నీవే చెప్పితివి కదా. కావున నెట్లును పై సిద్ధాంతమునకు విరోధము రాదు.

---

* సూక్ష్మశరీరము.—ప్రతిజంతువునకును స్థూలసూక్ష్మకారణము లని మూఁడు దేహములు కలవు. అందు కరచరణాదియుక్తమై స్తంభమువలెఁ గానవచ్చుదేహము స్థూలదేహము. ప్రాణములు ఇంద్రియములు మనోబుద్ధులు అనువానికి నాధారమై స్థూల దేహమును ఆయావ్యాపారములయందుఁ బ్రవర్తింపఁజేయునది సూక్ష్మశరీరము. మనకు పైకి గానవచ్చుచున్న కన్నులు చెవులు మొదలగునవి గోళములే యనియు వానియందు సూక్ష్మాకారములు గలయింద్రియములు ఉన్నవి యనియు వానివలననే సర్వజ్ఞానము లును కలుగుచున్నవి యనియుఁ దెలిసికొనవలయును. మృతిఁజెందినవానికి గోళకము లట్లే యున్నను జ్ఞానములు జనింపకుండుటయే ఈవిషయమునఁ బ్రమాణము. ఈస్థూలసూక్ష్మ దేహములకుఁ గారణము లగుపంచభూతములే కారణశరీరము.

* గతి యనఁ గా [illegible]

# ౧౨. అర్థాంతరత్వాధికరణము.

విషయము:—"ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితా తే యదంతరా త ద్బ్రహ్మ" "ఆకాశము నామరూపముల నిర్వహించు చున్నది ఆనామరూపములు దేనియందున్నవో అదియే బ్రహ్మము అమృతము, ఆత్మ" అను వాక్యము ఛాందోగ్యోపనిషత్తునఁ గలదు. అది యిందు విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున *నుపక్రమము నాశ్రయించి జ్యోతిశ్శబ్దముయొక్క రూఢిని పోఁగొట్టితిరి." అట్లే యిచ్చటఁ గూడ ఆకాశశబ్దోపక్రమము నాశ్రయించి వాక్యశేషమున నున్నబ్రహ్మాదిపదముల రూఢిని పరిత్యజింపుఁడు "అను దృష్టాంతము నాశ్రయించి వచ్చిన యాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను."

సందేహము:—ఇచ్చట భూతాకాశపరమేశ్వరులయందు రూఢి గల యాకాశబ్రహ్మశబ్దము లుండుటయే సంశయకారణము. "ఆకాశమే ఇచ్చట విషయము. పరమేశ్వరుఁడే విషయము" అనునవి. క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. ఆకాశోపాసనయు బ్రహ్మజ్ఞానంబును వాని ఫలములు.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమున చెప్పఁబడినయాకాశము భూతాకాశమే. ఆకాశపదమునకు రూఢ్యర్థ మదియే కదా! నామరూపములను నిర్వహించుట యనుకార్యమునుఁ గూడ నదియే చేయఁగలదు. సర్వమునకు నవకాశ మిచ్చునది యదియే కదా! మఱియు "తే యదంతరా" అనువాక్యభాగముచే నామరూపాధార మైయున్నపదార్థము బ్రహ్మముగఁ జెప్పఁబడి యున్నది. కావున నామరూపనిర్వాహక మగునది బ్రహ్మభిన్నపదార్థమే కావచ్చును. కావున నెట్లుచూచినను ఇచ్చటి యాకాశశబ్దము భూతాకాశమునే చెప్పును.

అవతారిక:—అను నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

*ఉపక్రమము (ప్ర. పా. సూ.)

# ౧౦౪. ఆకాశోఽర్థాంతరత్వాది వ్యపదేశాత్. ౧. ౩. ౪౧.

తాత్పర్యము:—ఇచ్చటయాకాశశబ్దార్థము నిస్సంశయముగ పరమేశ్వరుఁడే. బ్రహ్మవాచకము లగునమృతాదిశబ్దములు వాక్యశేషమున పెల్లుగఁ గలవు. మఱియు "తే యదంతరా" అనువాక్యభాగముచే నామరూపభిన్న మగుమఱియొకపదార్థము వర్ణింపఁబడియున్నది. ప్రపంచమంతయు నామరూపాత్మకమే యగుటచేత భూతాకాశముగూడ నట్టిదియే. ఇట్టిది నామరూపభిన్న మగుట యెట్లు? కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు నిస్సంశయముగఁ బరమేశ్వరుఁడే యని చెప్పి తీరవలయును.

సిద్ధాంతము:—"అనేన జీవే నాత్మనా నుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" "నేను ఈజీవరూపముతో ప్రపంచమునఁ బ్రవేశించి నామరూపముల నిర్వహించెదను" అనుఛాందోగ్యశ్రుతిని పట్టిచూచిన పరమేశ్వరుఁడే ప్రపంచమధ్యమున నున్నట్లును, ఆతఁడే నామరూపముల నిర్వహించుచున్నట్లును తేలుచున్నది. ఇట్లగుటచే "నామరూపములకాధారమై వానికి లోపల నున్నవాఁ డొక్కఁడు వానిని నిర్వహించువాఁడు మఱియొక్కఁడు" అని కల్పించుట యావశ్యకము కానేరదు. మఱియు నామరూపనిర్వహణసామర్థ్యము కూడఁ బరమేశ్వరునకే చక్కఁగా సంభవించు నని పైశ్రుతివలననే స్పష్ట మగుచున్నది. ఇట్లుండ నతిక్లిష్టముగ భూతాకాశమునం దాసామర్థ్యమును కల్పించుట అయుక్తము. అదియు నామరూపాత్మకమై యుండ తన నామరూపములఁ దానే యెట్లు నిర్వహించుకొనగలుగును? ఎంతనేర్పరియైనను తనబుజముపై తానే యెక్కి కూర్చుండఁగలఁడా? "ఆకాశభిన్న మగుప్రపంచముయొక్క నామరూపములను మాత్రమే యది(భూతాకాశము) నిర్వహించును." అనుటకు వీ లెట్లు కలుగును? సంపూర్ణప్రపంచముయొక్క నామరూపనిర్వహణమే వర్ణింపఁబడె ననుటకు చక్కనియవకాశ ముండ నిట్టికల్పనలఁ జేయనేల? కావున నెట్లుచూచినను ఇచ్చటియాకాశము పరమేశ్వరుఁడే. మఱియు "అనేన" అనుశ్రుతియొక్క యర్థమును బాగుగ విమర్శించిన "లోపల నున్నవాఁడే నామరూపముల నిర్వహించుచున్నాఁడు" అని తెలియును. దీనిచే బ్రహ్మాదిపదములుకూడ మాపక్ష

మున విరుద్ధములు కావలసివచ్చును. "ఆకాశమే బ్రహ్మము అమృతము ఆత్మ" అనుటకు వీలు లేదు కదా! కావున నెట్లును ఇచ్చటి యాకాశము పరమేశ్వరుఁడే యనవలయును.

విశేషాంశము:— "ఆకాశ స్తల్లింగాత్ (౧. ౧. ౨౨ చూడు.) అనుస్థలములందును ఈవిషయమే ("ఆకాశమే బ్రహ్మ" అనువిషయము) నిరూపింపఁబడియున్నది. అయినను అచ్చట ప్రపంచోత్పత్తిలయములు మొదలగు * బ్రహ్మలింగములు స్పష్టముగఁ గానవచ్చుచుండినవి. ఇచ్చట నట్టిగుఱుతులు లేవు నామరూపనిర్వహణము బ్రహ్మాదిపదములు మొదలగునవి భూతాకాశపక్షమునకు ననుకూలముగఁ జేయఁబడియే ననుట పూర్వపక్షమున విశదమైయే యున్నది కదా! కావున నిది ప్రత్యేకాధికరణముగ వర్ణింపఁబడెను.

---

## ౧3. సుషుప్త్యుత్క్రాంత్యధికరణము.

విషయము:—"బృహదారణ్యకోపనిషత్తునందు నాల్గవయధ్యాయమున తృతీయ చతుర్థ బ్రాహ్మణములలో జనకయాజ్ఞవల్క్యసంవాదము కలదు. అందు యాజ్ఞవల్క్యమహాముని జనకునకు జీవబ్రహ్మైక్యము నుపదేశించెను. అయినను "యో ఽయం విజ్ఞానమయః" "విజ్ఞానస్వరూపుఁ డగు నాత్మ యెవ్వఁడు కలఁడో" అని యాయాజ్ఞవల్క్యోపన్యాస మారంభమైనది. ఇది జీవవర్ణనమే! బ్రహ్మాభేదమును తెల్పుటకై జీవుఁ డనువాదము చేయఁబడియున్నాఁడు. అయినను సంశయమునకు హేతువు కలదు కావున నాయుపన్యాస మీయధికరణమున విచారింపఁబడుచున్నది.

సంగతి:—"పూర్వాధికరణమున నామరూపభిన్న మగుపదార్థము వర్ణింపఁబడె ననుకారణము నాశ్రయించి ఆకాశపదము బ్రహ్మపరముగా నిర్ణయింపఁబడెను. ఈయాజ్ఞ్యవల్క్యోపన్యాసమున నట్లు సేయు

---

* బ్రహ్మలింగములు బ్రహ్మమును తెలుపు గుఱుతులు. సర్వప్రపంచకర్తృత్వము మొదలగునవి.

టకు వీలు లేదు. సుషుప్తిమరణములయందు జీవబ్రహ్మలకు భేదము చెప్పఁబడినట్లు తోఁచినను దానిని మఱియొకవిధముగ నన్వయించుటకు వీలు కలదు కదా" అని ప్రత్యుదాహరణరూపముగ వచ్చినయాక్షేప మునకు సమాధానము చెప్పుటకై ప్రత్యుదాహరణసంబంధముతో నీయధికరణ మారంభింపఁబడుచున్నది.

సందేహము:—ఇచ్చట *నుపక్రమోపసంహారములయందు జీవ వాచక మగు విజ్ఞానమయపద ముండుటయు అచ్చటచ్చట పరబ్రహ్మ మును వర్ణించినశ్రుతులు కానవచ్చుచుండుటయు సంశయకారణ ములు. "ఇచ్చట వర్ణింపఁబడినవాఁడు జీవుఁడు, పరమేశ్వరుఁడు" అను నవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. "కర్మలఁ జేయువాఁ డగు జీవుని పైబ్రాహ్మణములు నుతించుచున్నవి.జీవబ్రహ్మైక్యమును బోధించు చున్నవి" అనునవి క్రమముగ వానికి ఫలములు.

పూర్వపక్షము:—పైబ్రాహ్మణములయందు వర్ణింపఁబడినవాఁడు జీవుఁడే, ఉపక్రమోపసంహారములయందు జీవలింగమగు విజ్ఞానమయ పదము కలదు. నడుమకూడ జాగ్రదాద్యవస్థలు వర్ణింపఁబడియున్నవి. అది జీవునివిషయమునందే కాని సరిపడవు కదా!

"సుషుప్తిమరణములనుగూర్చి చెప్పునప్పుడు "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తః" "జ్ఞానరూపుఁ డగుపరమేశ్వరునిచే నాలింగితుఁ డగును" అని చెప్పఁబడియున్నది. దీనిచే జీవునికంటె భిన్నుఁ డగుపరమేశ్వరుఁడు వర్ణింపఁబడె నని తెలియుచున్నది. ఆలింగితుఁడును ఆలింగనము చేసి కొనువాఁడు నొక్కఁడు కానేరఁడు కదా!" అనియెదవేమొ దీనివలనఁ బ్రమాదము లేదు. ఆత్మశబ్దమునకు స్వభావము నర్థముగాఁ జెప్ప వచ్చును. ప్రాజ్ఞశబ్దమునకు "జ్ఞానసముదాయము" అని యర్థము చెప్ప వచ్చును. జీవుఁడు కూడ జ్ఞానరూపుఁడే కావున "ఆతఁడు సుషుప్త్యవస్థ యందు జ్ఞానరూప మగుతనస్వభావముచే నావరింపఁబడును"అని యర్థము చెప్పవచ్చును. "ఏష భూతాధిపతిః" "ఈతఁడే సర్వభూతములకు నధి పతి" అను మొదలగువాక్యములఁ గూడ సుఖముగనే జీవపరములుగ సమన్వయింపవచ్చును. ఈయనకును భోగ్యము లగుటచే సర్వభూతముల

* ఉపక్రమోపసంహారములు (పు. ౭౫. చూడుము).

మీఁద నధికారము కలదు కదా! కావున నీయాజ్ఞవల్క్యోపన్యాసమున వర్ణింపఁబడినవాఁడు జీవుఁడే.

అను నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౦౫. సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన.

### ౧. ౩. ౪౨

తాత్పర్యము:—పై యుపన్యాసమున జీవానువాదపూర్వకముగ జీవబ్రహ్మైక్య ముపదేశింపఁబడెను. జీవునకంటె భిన్నముగ మొట్టమొదట నిరూపింపఁబడి పిదప నభిన్నముగ వర్ణింపఁబడుటకై బ్రహ్మము సుషుప్తి మరణముల నిరూపించునప్పుడు భేదముతో నిరూపింపఁబడి యున్నది.

సిద్ధాంతము:—ప్రాజ్ఞశబ్దము సర్వజ్ఞుఁడగువానియందు రూఢము. ఇట్లుండ నిష్కారణముగ కించిజ్జ్ఞుఁడగుజీవునియం దేల క్లిష్టముగ సమన్వయింపవలయును? అనేకశ్రుతులు జీవభిన్నబ్రహ్మమును బోధించుచునే యున్నవి. ప్రస్తుతప్రకరణమునందును "అతః పరం విమోక్షాయైవ బ్రూహి" "ఇఁక మీఁద మోక్షమును గూర్చియే వివరింపుము" అను ప్రశ్నములను, అప్పుడు "జీవుఁడు సాక్షియై సర్వావస్థలయందును సర్వపదార్థములను గ్రహించుచున్నాఁడు. వానితో నాతనికి సంబంధ మింతయైనను లేదు. గ్రహించితివి కదా" అని జీవబ్రహ్మాభేదప్రతిపాదకము లగునుత్తరములను అనేకము లున్నవి. ఇట్లగుటచే నిందు జీవబ్రహ్మాభేదమే వర్ణింప నుద్దేశింపఁబడె ననియు, దానికై జీవానువాదము చేయఁబడుచున్న దనియు స్పష్ట మగుచున్నది.

మఱియు జాగ్రదాద్యవస్థలను వర్ణించినంతమాత్రముననే కేవల జీవునిఁ గూర్చిమాత్రమే చెప్పియుండవలసిన పనిలేదు. జీవునియొక్క సాక్షిత్వము నిరూపించుటకై కూడ నట్లు చెప్పియుండవచ్చును కదా! కావున నీస్వల్పకారణమును మాత్రమే యాశ్రయించి యొకవిషయమును చెప్పునుపన్యాసమును మఱియొకవిధముగ సమన్వయింపఁ జూచువాఁడు తూర్పుదిశకుఁ బ్రయాణమై పశ్చిమదిశకుఁ బోవువాఁ డగును. కావున నెట్లు చూచినను ఈప్రకరణమున వర్ణింపఁబడినది. జీవబ్రహ్మైక్యమే యనుటలో నింత యైనను సంశయము లేదు.

## ౧౦౬. పత్యాదిశబ్దేభ్యః. ౧. ౩. ౪౩.

తాత్పర్యము:—మఱియు నీయుపన్యాసమున * జీవధర్మము లగు వృద్ధిక్షయాదులను నిషేధించునట్టియు పరమేశ్వరధర్మము లగు ప్రభుత్వాదులను నిరూపించునట్టియు వాక్యములు అనంతములుగఁ గలవు. వానిని పట్టి చూచినను ఇందు జీవుఁడు చెప్పఁబడలే దనుట స్పష్ట మగును.

"సర్వస్య వశీ సర్వ స్యేశానః" "ఈతఁడు సర్వమునకును నియామకుఁడు. సర్వమును తనహస్తమున నుంచుకొనినవాఁడు." అనుమొదలగు వాక్యములచేఁ బరమేశ్వరధర్మములు వర్ణింపఁబడి యున్నవి. జీవునకు సర్వేశ్వరత్వము సంభవింప దనుటలో వివాద మింత యైనను లేదు. ఉపక్రమోపసంహారములయందుఁ గలజీవవాచకపదములు జీవబ్రహ్మాభేదమును వర్ణించుటకై చేయఁబడినయనువాదములే కాని వేఱు కావని యిదివఱకే నిరూపించియున్నాము. వాస్తవస్థితిలో సర్వలోకప్రసిద్ధ మగువిషయమును చెప్పునది శాస్త్రమే కాదు; ముఖ్యముగ వేదమునకు నట్టిస్థితి సంభవించిన నప్రమాణమే కావలసి వచ్చును. సర్వప్రమాణసిద్ధ

---

* జీవబ్రహ్మధర్మ భేదనిరూపణము —అద్వైతమతమున జీవబ్రహ్మలకు భేదము లేదు. అయినను లోకదృష్టి ననుసరించి యీభేదము కల్పింపఁబడుచున్నది. ఏయుపాధితోను సంబంధము లేక కేవలుఁడై యుండువాఁడు బ్రహ్మ మనియు దేహసంబంధము నొందినవాఁడు జీవుఁ డనియుఁ జెప్పఁబడును. కావున వాస్తవస్థితిలో నభిన్నులే యైనను కల్పితభేదము కలవారు కావున వారిధర్మములయందు అనంతముగ భేదము కలదు. జీవుఁడు తనమనస్సునకు గాని దేహమునకుఁ గాని కలుగుసుఖదుఃఖాదులఁ దనకే కలిగినవానినిగా భావించుచున్నాఁడు. దేహము నశించిన దానితోఁ గూడ దానును నశించినట్లు భావించుచున్నాఁడు. ఉత్పత్తి యైనప్పు డుత్పత్తి నొందినవానిని గాను జాగ్రదాద్యవస్థలు నొందినప్పు డాయాయవస్థల నొందినవానినిగాను తలంచుచున్నాఁడు. తనకు గలపరిపూర్ణజ్ఞానమును మఱచి మనస్సునకు గలయల్పసామర్థ్యము నాశ్రయించి తనసామర్థ్యము గూడ నంతమాత్రమే యని భ్రమించుచున్నాఁడు. పరమేశ్వరునకు నిట్టిభ్రాంతులు కలవనుటకే మొట్టమొదట నవకాశము లేదు. ఇదియే (భ్రాంతి యుండుట లేకుండుట యనునదియే) జీవపరులకు గలభేదము. దానివలననే వారికి ధర్మభేదము గూడ గలిగెను. జీవుఁడు దుఃఖ సుఖ జన్మమరణాదివికారములు కలవాఁడు కించిజ్జ్ఞుఁడు సంసారి. ఈశ్వరుఁడు సర్వసంసారధర్మరహితుఁడు సర్వజ్ఞుఁడు.

మగువిషయమును శబ్దముకూడ చెప్పు ననిన దానికిఁ బ్రత్యేకముగఁ బ్రామాణ్య మెందులకు ? కావున ప్రత్యక్షసిద్ధుఁ డగుజీవుని తాత్పర్యముతో వివరించుటవలన వేదమునకు బ్రయోజనము లేదు. అనువాదము చేయుటవలన మాత్రము దోష మేమియు రాదు. లోకస్థితి నుపదేశకులు మొట్టమొదట నాశ్రయించియే తీరవలయును కదా !

మఱియు "స న సాధునా కర్మణా భూయా న్నో ఏ వాసాధునా కనీయాన్" "ఆయాత్మ పుణ్యకర్మచేత నభివృద్ధి నొందఁడు. పాపకర్మచే క్షీణింపఁడు" అను మొదలగువాక్యములు పైయుపన్యాసమున జీవధర్మములను నిషేధించుచున్నవి. ఈ కారణములవలన వర్ణింపఁబడినది జీవబ్రహ్మైక్యమే ? జీవాభిన్నబ్రహ్మమే కాని కేవలజీవుఁడు కాఁడు.

ఇట్లు వెన్నెలకంటిసుందరరామశర్మచే రచియింపఁబడిన బ్రహ్మసూత్రార్థచంద్రికయందుఁ బ్రథమాధ్యాయమునఁ దృతీయపాదము.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు
ప్రథమాధ్యాయస్య దృతీయః పాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ప్రథమాధ్యాయమునఁ
దృతీయపాదము.

---



# బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము, చతుర్థపాదము.



అవతారిక:—ఈశాస్త్రమున మొట్టమొదట బ్రహ్మజ్ఞాన మావశ్యక మని చెప్పి "జన్మాద్యస్య యతః (సూ. ౧ ౧. ౨.) అని జగత్కారణత్వము బ్రహ్మలక్షణముగ వర్ణింపఁబడి యున్నది. "ఈక్షతే ర్నాశబ్దం" (సూ. ౧. ౧. ౫.) "అనుస్థలమున సహేతుకముగఁ, బైఁజెప్పఁబడిన లక్షణము సాంఖ్యాదికల్పితము లగు ప్రధానాదులకు సంభవింపదనియు నిరూపింపఁబడి యున్నది. అచ్చటినుండియు తృతీయపాదాంతము వఱకు "వేదవాక్యము లన్నియును జగత్కారణత్వమును ముఖ్యహేతువుగాఁగైకొని పరబ్రహ్మమునే వర్ణించుచున్నవి. కావున 'బ్రహ్మమే జగత్కారణము' అనుపక్షము నంగీకరించిననే యవియన్నియు బాగుగ సమన్వితము లగును కాని మఱియొకవిధముగఁ గానేరవు." అనువిషయము విస్పష్టము చేయఁబడి యున్నది. కావున శాస్త్రార్థ మింతటితో ముగిసినట్లే యయ్యెను.

అయినను "ఈక్షతేః (సూ. ౧. ౧. ౫.)" అనుస్థలమున "ప్రధానాదులు వేదోక్తములు కాకపోవుటచే జగత్కారణములు కానేరవు" అని మాత్రమే చెప్పఁబడియున్నది. కొన్నికొన్నిశాఖలయందు కొన్నికొన్నివాక్యములు పూర్వాపరవిమర్శఁ జేయలేనివారలకు ప్రధానాదిపరములుగఁ దోఁచుచున్నవి. కావున వానియర్థమును విమర్శించి నిర్ణయించునంతవఱకు సంశయనివృత్తి కానేరదు. బ్రహ్మలక్షణము దృఢము కానేరదు. కావున నట్టివాక్యములను విచారించి బ్రహ్మమునందు సమన్వయించుటకై యీపాద మారంభింపఁబడుచున్నది. ఇందుఁ జేయఁబడుకార్యమును సమన్వయమే కావున నీపాదముకూడ సమన్వయాధ్యాయమునందుఁ జేర్పఁబడెను.

"ఇది యేల కొన్నికొన్నిశాఖలయందు ప్రధానాదిపరములుగఁ గానవచ్చువాక్యము లుండుఁగాక" అవి సత్యమువలె ప్రధానాదిపరము లైన నగుఁగాక! బ్రహ్మలక్షణమునకు హాని యేల కలుగవలయును? అవి ప్రధానాదులయునికినిగూర్చి మాత్రమే చెప్పును గాని 'అవియే జగత్కారణములు' అని చెప్పవు కదా!" అనియెదవేమో యట్లు కాదు. "అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజా జనయంతీం" "తెలుపు, నలుపు, ఎఱుపు, అనుమూఁడువర్ణములును గలిగి (ఇవి సత్వతమోరజోగుణములవర్ణములు) బహుసంఖ్యగల ప్రజలను పుట్టించుచున్న జన్మశూన్య మగునొకానొకపదార్థము" అనుమొదలగుకొన్నివాక్యములయందు త్రిగుణాత్మక మగునొకపదార్థము ప్రపంచకారణమని స్పష్టముగనే చెప్పఁబడి యున్నట్లున్నది. "మహతః పర మవ్యక్తం" "మహత్తత్త్వమునకంటె అవ్యక్తము పరమై యున్నది" అనుమొదలగుకొన్ని వాక్యములయందు అంత స్పష్టముగ నున్నట్లు గానరాకపోయినను, పరశబ్దప్రభావముచే నావిషయ మూహింపఁబడుచున్నది. పరమనఁగా పూర్వమున నున్నపదార్థము; అధికారియై యున్నపదార్థము. ఇట్లగుటచే నది ప్రకృతపదార్థమునకుఁ గారణమే కావలయును, లోకమున కార్యము మాత్రమే కారణమునకు నియతముగ నధీనమై యున్నది కాని యితరమట్లు లేదు. కార్యమునకుఁ గారణమును విడచి స్వరూపస్థితియే లేదు కదా! ఇక స్వతంత్రముగ బ్రవర్తించుట యెట్లు? ఇక నితరములవిషయమునం దన్ననో:—ఒకపురుషుఁడు మఱియొక్కనికి సేవకుఁ డయ్యేనేని, వాఁడు యజమానునకు స్వాధీనుండై ప్రవర్తించుచు నున్నను ఆపరాధీనత నిత్య మైనది కాదు. ఇచ్చవచ్చినన్నిదినము లక్లే లోఁబడి యుండవచ్చును లేనప్పుడు స్వతంత్రులు కావచ్చును. ఈకారణమునలన అస్వతంత్ర మని నిర్ణయ మైనపదార్థమును ప్రేరేపించుచు నేదియైన నొకపదార్థ ముండునేని యాపదార్థము దానికి (తనచేఁ బ్రేరేపింపఁబడు పదార్థమునకు) గారణమే యై తీరవలయును. ఈనియమము నాశ్రయించి చూచిన "మహతః పర మవ్యక్తం" అనుస్థలమునందు మహత్తత్వమును ప్రేరేపించునదిగాఁ జెప్పఁబడినయవ్యక్తము ఆమహత్తత్వమునకుఁ గారణమే యై తీరవలయును. ఈవిధముగఁ గొన్నిచోట్ల స్పష్టముగాను మఱికొన్నిచోట్ల అస్పష్టముగాను కొన్నికొన్ని వేదవాక్యములయందు

ప్రధానాదులను జగత్కారణములనుగఁ జెప్పియున్నట్లు తోఁచుచున్నది. కావున నాసంశయములను దీర్చుటకై పాదారంభ మావశ్యకమే.

---

## ౧. ఆనుమానికాధికరణము.

విషయము:—"మహతః పర మవ్యక్తం" అనువాక్యభాగము యొక్క యర్థ మీయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—"తృతీయపాదాంతమువఱకు బ్రహ్మమే జగత్కారణ మనియు వేదముచే నదిమాత్రమే చెప్పఁబడుచున్నదనియు వర్ణించి యున్నారు. ఇది యుక్తము కాదు. వేదమునందు ప్రధానముకూడ జగత్కారణముగఁ నచ్చటచ్చట చెప్పఁబడుచున్నది. ప్రతిపదార్థమునకును ఉపాదాననిమిత్తములని కారణములు రెండు ఉండుట ప్రత్యక్షసిద్ధమై యున్నది కావున ప్రపంచమునకుఁ గూడ రెండుకారణము లుండ వచ్చును. కావున బ్రహ్మప్రధానములు రెండును ప్రపంచకారణము లే" అని బ్రహ్మకారణత్వము నంగీకరించియే యాక్షేపము వచ్చుచున్నది. దానికి సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. ఇదియే దీని కిని పూర్వగ్రంథమునకును గలసంబంధము.

ఇది యీపాదమునకు మొదటియధికరణమే యగుటచే పూర్వాధికరణసంబంధమునుగూర్చి విచారింప నక్కఱ లేదు. అట్లు విచారించినను అది దృష్టాంతసంబంధ మగును.

"పైయధికరణమున (అనఁగా: మూఁడవపాదమునకు నంతమున నున్నసుషుప్త్యుత్క్రాంత్యధికరణమున) సందర్భమంతయు జీవపరముగ నున్నను కొన్నికారణములచే నాప్రసిద్ధమగుబ్రహ్మమే విషయవాక్యార్థ మని వర్ణింపఁబడి యున్నది. ఈయధికరణమునందును అట్లే విషయ వాక్యమునందలి యవ్యక్తశబ్దమునకు ప్రకరణార్థమునువదలి అప్రసిద్ధ మగుప్రధానమునే యర్థముగాఁ జెప్పవలయును" అనునాక్షేపము వచ్చుచున్నది. ఇది దృష్టాంతసంబంధమైన యాక్షేపమేకదా!

సందేహము:—ఇచ్చట అవ్యక్తపదమునకు నర్థము స్పష్టము కాకుండుటయు మహత్పదము సాంఖ్యకల్పిత మగు మహత్తత్త్వమును

దెల్పునది యగుటయు సంశయకారణములు. "ఈవిషయవాక్యమున చెప్పఁబడినది ప్రధానమే. అవ్యక్తశబ్దముచేఁ జెప్పఁబడినది దేహమే" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. "వేదాంతవాక్యములు బ్రహ్మమునందుమాత్రమే సమన్వితము లగుననియు మఱియొకచోట కావనియు నియమము లేదు." అనునది పూర్వపక్షమునకు ఫలము. "అట్టి నియమము కలదు" అనునది సిద్ధాంతమునకుఫలము.

పూర్వపక్షము :—ఈ విషయవాక్యభాగమున వర్ణింపఁబడినది ప్రధానమే కావలయును.అవ్యక్తశబ్దము సాంఖ్యస్మృతియందు ప్రధానవాచకమై ప్రయోగింపఁబడి యున్నది రూఢిని జెందియున్నది. మఱియు 'న వ్యక్తం=అవ్యక్తం' వ్యక్తము అనఁగా: స్పష్టము కానిది అవ్యక్తము' అనువ్యుత్పత్తిచేత కూడఁ బ్రధానము అవ్యక్తశబ్దవాచ్య మగుచున్నది.

మీామతమునఁ బ్రధానమే ప్రపంచకారణ మని చెప్పఁబడి యున్నది. అది వ్యక్తముకాని దైనచో ప్రపంచమే యట్టిది కావలసి వచ్చును కదా! అని యెదవేమొ యట్లు కాదు. మామతమునఁ బ్రధానము ప్రపంచరూపముతోఁ బరిణమించు ననుట సిద్ధాంతము. కార్యకారణములకుఁ గలసంబంధము * సమవాయసంబంధ మనుట మా సిద్ధాంతము ఇట్లగుటచే బ్రపంచరూపముగఁ బరిణమించినపిదప ప్రధానముగాని ప్రధానముగ నున్నప్పుడు ప్రపంచము గాని ప్రత్యేకముగ లేదు * పరిణామికారణములస్వభావ మిట్టిదియే. అవి కార్యరూపముల

---

*సమవాయసంబంధ మనఁగా నెప్పటికిని విడుదల లేనిచేరిక. అది సంయోగసంబంధము లేకయే పరస్పరము కూడి యున్నపదార్థములయం దుండును. ఏరెండుపదార్థములలో నొక్కటి ప్రత్యేకముగ నశించునది కాక మఱియొక్కదానిని సర్వకాలములయందు విడువక నాశ్రయించియే యుండునో, ఆరెండుపదార్థములకును గలసంబంధము నే సమవాయసంబంధ మందురు. అవయవములు అవయవి? గుణములు కలవాఁడు కార్యము (పని) అపని నాచరించువాఁడు పరమాణువులు వానియం దున్నవిశేషములు జాతి వ్యక్తి అనునీజతలే స్వాభావికముగ సమవాయసంబంధము కలవి. ఉపాదానకారణము కార్యరూపముగఁ బరిణమించినపిదప వానిసంబంధము కూడ నిట్టిదియే యగును కావున "కార్యకారణములకుఁ గూడ సమవాయసంబంధమే" యని చెప్పఁబడి యున్నది.

పరిణామికారణ మనఁగా కార్యరూపమునఁ బరిణామమును చెందుకారణము. (పరిణామస్వరూపము, ౭౭. చూడు.)

నొందినపిదపఁ బ్రత్యేకముగ నిలువవు.ఇట్లగుటచే ప్రపంచమునఁ గాన వచ్చుచున్నశబ్దాదు లన్నియు నప్పుడు ప్రధానమునందు లేవు. పరిణా మము లేనిసమయమున నవి ప్రధానమునందు సూక్ష్మరూపముతో నున్నను గానరావు. ఈకారణమునలన ప్రధానమెప్పటికిని వ్యక్తము కాదు. గుణములు ప్రకాశింపకుండునపుడు గుణివ్యక్తుఁడగుట యెట్లు?

కావున సాంఖ్యస్మృతియందలిప్రసిద్ధి ననుసరించియు అచ్చటి యుక్తుల ననుసరించియు అవ్యక్తమనునది యొక్కటి జగత్కారణముగ నున్నది యని తేలుచున్నది. మఱియు నాయవ్యక్తమునుండి మహత్తత్త్వ ము జనించెననియు దానినుండి పంచభూతాదు లుత్పన్నములయ్యె ననియు,ఆయవ్యక్తమునకంటె నధికుఁడై పురుషుఁ డొక్కఁడు కలఁడనియు మామతమున (సాంఖ్యమతమున) నున్నది. ప్రస్తుతశ్రుతి యందును "మహతః పర మవ్యక్త, మవ్యక్తా త్పురుషః పరః"అని ఆనామముల తోనే (మామతమునందు, చెప్పఁబడినపేర్లతోనే,) మహత్తత్వావ్యక్త పురుషులు ప్రశంసింపఁబడి యున్నారు. ఈకారణమువలన మామతము నందు ప్రసిద్ధులైనవారిని గూర్చియే యీశ్రుతి చెప్పుచున్నది.

"ప్రకరణసందర్భము ననుసరించి చూచిన నిచ్చటి యవ్యక్త శబ్దము దేహమునుమాత్రమే చెప్పునదిగా గానవచ్చుచున్నది". అని యెదవేమొ అది సరికాదు. దేహము స్పష్టముగఁ గానవచ్చుచున్నది. దాని నాశ్రయించి యున్నసత్వాదిగుణములును శబ్దాదులును స్పష్ట ముగనే ప్రకాశించుచున్నవి. ఇట్టుండ నిది యవ్యక్త మెట్లగును? ఎంతైనను అవ్యక్తశబ్దమునకు దేహమునందు రూఢి కలదా ? కావున నెట్లు చూచినను ఇచ్చట చెప్పఁబడినది ప్రధానమే.

అనునీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౦౭. ఆనుమానిక మప్యేకషా మితి చే న్న, శరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతి చ. ౧. ౪. ౧.

తాత్పర్యము:— "కొన్నిశాఖలయందు ప్రధానాదులుకూడ జగత్కారణములుగఁ జెప్పఁబడి యున్నవి"అనుట చెల్లదు. "మహతః

పరమవ్యక్తం" అనుకారకవాక్యమున ప్రధానము చెప్పఁబడి యుండ లేదు. ఆప్రకరణమునందు పూర్వభాగమున శరీరాదులను రూపకాలంకారముచే రథాదులనుగా చెప్పి, జీవుని రథికునిఁగా నిరూపించి, అతనికి నింద్రియజయము కలుగునేని ముక్తిద్వారకుననియు లేకున్న సంసార ప్రాప్తి కలుగుననియుఁ జెప్పి, యామోక్షమును వర్ణించుటకై రూప కాలంకారముచే వర్ణింపఁబడినపదార్థములనే మరల శ్రేష్ఠహీనభావము లతో వర్ణించుచు వచ్చి యంతమున పరమేశ్వరుని మోక్షరూపుని గాను సర్వశ్రేష్ఠునిగాను శ్రుతి వర్ణించి యున్నది. ప్రస్తుతవిషయవాక్య భాగ మీవాక్యములోనిదే.(రూపకాలంకారముచే వర్ణింపఁబడినపదార్థ ములనే శ్రేష్ఠహీనభావములతో వర్ణించుచు నుండువాక్యముల లోని దే.) "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ చ, బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ,ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్....సో ఽధ్వనః పార మాప్నోతి త ద్విష్ణోః పరమం పదం" "జీవుఁడు రథికుఁడు. శరీరము రథము. బుద్ధి సారథి. మనస్సు పగ్గములు. ఇంద్రియములు గుఱ్ఱములు. శబ్దస్పర్శరూపరసగంధములు మార్గములు. ఏరథికుండు గుఱ్ఱములను స్వాధీనములను చేసికొనఁగల సారథిని కలిగియున్నాఁడో అట్టివాఁడు సుఖముగ నామార్గము నతిక్ర మించి దాని కంతమున నున్నవిష్ణురూపమోక్షపదమును జెందును" అనువాక్యము రూపకాలంకారమున వర్ణించినవాక్యము. కావున నిందుఁ జెప్పఁబడినయాత్మాదులే ప్రస్తుతవిషయవాక్యమునందుఁ గూడ జెప్పఁ బడి యున్నారు. ఈకారణమువలన ప్రధాన మనునది క్రొత్తగా ప్రస్తుత విషయవాక్యమునందు వర్ణింపఁబడె ననుటకు వీలు లేదు; ఇందుఁ గల మహచ్ఛబ్దాదులును మహత్తత్వాదు లను చెప్పునవి యనుటకును వీలు లేదు.

"ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, మనస స్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః. మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" "* ఇంద్రియములకంటె శబ్దాదివిషయంబులును వానికంటె

---

*ఇంద్రియములకంటె శబ్దాది విషయము లధికములు. ఈయింద్రియములు, విష యములు లేకున్నఁ బ్రవర్తింపనేరవు కావున విషయములను శ్రేష్ఠత్వము కలిగినది. శ్రుతి

మనంబును దానికంటె బుద్ధియు నంతకంటె జీవుఁడును లేక హిరణ్యగర్భబుద్ధియు దానికంటె నవ్యక్తంబును అంతకంటె సర్వవ్యాపకుఁ డగు పరమేశ్వరుండును శ్రేష్ఠులు ఆయనకంటె శ్రేష్ఠులు లేరు. ఆయనయే సర్వమునకు నంతము ఆయనయే పరమగతి" అనునది ప్రస్తుతవిషయ వాక్యము. ఇందు రూపకాలంకారవాక్యమున వర్ణింపఁబడినపదార్థములే క్రమముగఁ జెప్పఁబడియున్నవి. అచ్చట రథముగాఁ జెప్పఁబడిన దేహ మొక్కటిమాత్రమే యున్నది. ఇచ్చట నవ్యక్తశబ్ద మొక్కటి యర్థ నిర్ణయము లేక నిలచియున్నది. ఆత్మపద ముండుటచే మహచ్ఛబ్దమునకు రథికుఁడుగా వర్ణింపఁబడినజీవుఁడే యర్థ మనియు, పరమగతి యని చెప్పఁబడియుండుటచే పురుషశబ్దమునకు స్వస్వరూపభూతుఁ డగుపరమేశ్వరుఁడే యర్థ మనియు నిర్వివాదముగ నిర్ణయించుటకు వీలగుచున్నది. "బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ" "దేవాదిరూప మగుప్రపంచమునకు నంతకును చతుర్ముఖుఁడు మొట్టమొదట జన్మించెను." "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" "హిరణ్యగర్భుఁడు ప్రపంచమునకు మొట్టమొదట జనించెను" అనుమొదలగుశ్రుతుల నాశ్రయించి యామహచ్ఛబ్దమునకు నందఱిబుద్ధులకంటె మొట్టమొదట జనించినహిరణ్యగర్భబుద్ధి నర్థముగాఁ జెప్పినను, అది మీమహత్తత్త్వము కానేరదు. జీవబ్రహ్మములకు పరమార్థస్థితిలో భేదము లేదు కావున నీపక్షమునఁ బరమేశ్వరవాచక మగు

---

యుందును మఱియొకచోట "విషయములను గ్రహించునవి యగుటచేత నింద్రియములు గ్రహములు. వానిని తమవైపునకు త్రిప్పునవి యగుటచేత విషయము లతిగ్రహములు" అని చెప్పఁబడియున్నది. ఆవిషయములను గూడ మొట్టమొదట మనస్సే గ్రహింపవలయును కావున వానికంటె మనస్సు శ్రేష్ఠము. నిశ్చయము లేక కేవలసంకల్ప మేమియుఁ జేయనేరదు కావున నామనస్సునకంటె బుద్ధి యుత్తమము. జీవశక్తియే సర్వాధారము. కావున నాబుద్ధికంటె జీవుఁడు శ్రేష్ఠుఁడు. ఆమహచ్ఛబ్దమునకు హిరణ్యగర్భబుద్ధియే యర్థ మని గ్రహింపఁబడినను సర్వబుద్ధులును దానివికారములే కావున నది బుద్ధికంటె (వ్యష్టిబుద్ధికంటె [వ్యష్టి ౨౩౩. చూ.]). శ్రేష్ఠము. జీవాధారము కావున జీవునికంటెను బుధ్యాధారము కావున బుద్ధికంటెను శరీర ముత్తమము. జీవుఁడు అవిద్యావృతుఁడు కావునను శరీరము కారణరూపముతో వర్ణింపఁబడుటచేతను జీవునికంటె నది యుత్తము మని యెఱుంగునది. దానికంటె సర్వోత్తము డగుపురుషుఁ డధికుం డనుటలో వివాదమే లేదు.

పురుషశబ్దముతోనే జీవునిఁ గూడఁ జెప్పియున్నా రనవచ్చును. ప్రకృతము రూపకవాక్యమున దేహ మొక్కటియే విశేషించి యుండుటచేతను ప్రస్తుతవిషయవాక్యమున నవ్యక్తశబ్దము మాత్రమే శేషించి యుండుట చేతను ఈశబ్దమునకు నాదేహమే యర్థ మగుట మిగుల యుక్తియుక్తమై ప్రకరణానుకూలమై యున్నది.

సిద్ధాంతము:—"ఆయవ్యక్తశబ్దమునకు ప్రధానమునందు రూఢియు యోగంబునుఁ గూడఁ గలదని చెప్పియుంటిని కదా! అనియెదవేమొ యది సరి కాదు. "య ఏవ లౌకికాః శబ్దాః త ఏవ వైదికాః త ఏవ చైషా మర్థాః" "లోకమున నున్నశబ్దములే వేదమున నున్నవి. లోకమున వాని కేయర్థములు కలవో వేదమునందును వాని కవియే యర్థములు" అనున్యాయము ననుసరించి లోకమునందుఁ గలరూఢి నాశ్రయించియే వేదార్థమును చేయవలయును కాని మఱియొకవిధముగఁ జేయుటకు వీలు లేదు. ఈఅవ్యక్తశబ్దమునకు లోకమున నేపదార్థమునందును రూఢి లేదు. మీస్మృతియందు * పారిభాషికముగఁ గల్పించిన రూఢి యెవ్వనికిఁ బ్రమాణము? ఈకారణమువలన నవ్యక్తశబ్దమునకుఁ గల దని చెప్పఁబడినరూఢి పోయినది. యోగ మన్ననో అది యన్నిటి యందును సమానమే. ఏయేపదార్థము కనిపెట్టుటకు కష్టసాధ్యమై యుండునో దానినెల్ల నవ్యక్తశబ్దముచే చెప్పవచ్చును. "దేహము ప్రత్యక్షమైయే యున్నది కదా!" అనియెదవేమొ సత్యమే కాని దానికారణము పరమేశ్వరుఁ డైనను అవ్యాకృతమైనను ప్రత్యక్షముగఁ దెలిసికొనఁబడుటకు వీలు లేనిదగుటచేఁ దదభిన్న మగునీదేహము కూడ నవ్యక్తమే కావచ్చును కదా! మఱియు మామతమునఁ గానవచ్చు పదార్థములన్నియు భ్రాంతిమాత్రకల్పితములే యగుటచే నూరకఁ దోచునవియే కాని సత్యములు కావు కావున నేదోషంబును రాదు.

---

* పరిభాషయనఁగా: ఒకఁడు తనకుఁ దనకై యేర్పఱుచుకొనినయేర్పాటు. "నేను ఇట్టిలక్షణములు గలపదార్థము నీపదముతోఁ జెప్పెదను" అను మొదలగు నిబంధనములు. అట్టినిబంధనములయందు సాధనములుగ నిర్ణయింపబడినపదములు మొదలగునవి పారిభాషికము లనఁబడును. ప్రకృతము సాంఖ్యులు స్వతంత్రమనియు జడమనియు త్రిగుణాత్మకమనియు జగత్కారణమునకు లక్షణమును చెప్పి దానికి ప్రధానము అవ్యక్తము అనుపేరులఁ బెట్టిరి.

కావున నెట్లు చూచినను ఇచ్చట ప్రకరణానురూపముగ నవ్యక్తశబ్దము నకు దేహమే యర్థముగాఁ జెప్పుట యుక్తియుక్తము * రూఢశ్రుతి యున్నను అది ప్రకరణమునకు విరుద్ధమైనచో ప్రకరణము శ్రుతికంటె బలహీనమే యైనను బహువాక్యవిరోధపరిహారార్థమై యాశ్రుతి కే యౌగికార్థమునైనను * గౌణార్థమునైనను ఔపచారికార్థము నైనను గ్రహించుట యుక్తముగు ననిన నిఁక నిచ్చట నేమి చెప్పవలయును? ఇచ్చట శ్రుతికి రూఢియే శూన్యమై పోయెను కదా! కావున నిచ్చట నవ్యక్తశబ్దముచేఁ జెప్పఁబడినది నిర్వివాదముగ రూపకవాక్యములో రథముగ వర్ణింపఁబడియున్న దేహమే.

మఱియు "అవ్యక్తపద ముండుటచే నిచ్చట ప్రధానమే గుఱుతింపఁబడుచున్నది" యనుటకు వీలు లేదు. ఒకపదార్థము గుఱుతింపఁబడవలయు ననిన దానిలక్షణములన్నియును గానరావలయును కాని యూరక శబ్దమొక్కటి మాత్రమే యుండినఁ జాలదు కదా! ప్రకృతమున మీరు ప్రధానమునకు కల వని చెప్పుచున్నలక్షణము లేవియు నీశ్రుతియందుఁ గానవచ్చుటలేదు. ఆశబ్దములకైనను ప్రధానమునందు రూఢి లేదు. ఇట్లుండ నిఁక నిచ్చట సాంఖ్యకల్పితప్రధానమే వర్ణింపఁబడెనని యెట్లు చెప్పఁగలవు? గుఱ్ఱ ముండవలసినచోట యావునిలువఁబడియుండిన లక్షణములఁ బరిశీలింపక నెట్టిమూఢుఁ డైనను "అచ్చట నున్నది గుఱ్ఱమే" యనునా? కావున నెట్లు చూచినను విషయవాక్య భాగమునఁ జెప్పఁబడినది దేహమే.

## అ ౧. పా ౪. సూ ౨. ఆరంభము.

అవతారిక:—"దేహము స్పష్టముగఁ గానవచ్చుచున్నది కావున దీనియం దెట్లును అవ్యక్తశబ్దము ప్రవర్తింప నేరదు" అనుపూర్వపక్షమును సూత్రకారుఁడు ఖండించుచున్నాఁడు.

---

* రూఢార్థము గలశ్రుతి రూఢశ్రుతి (రూఢి చూ. ౧౬౩పు. శ్రుతి. ౧౦౨పు. చూ.)

* గౌణార్థ మనఁగా గుణములయందలిపోలికచే నొకపదార్థమునందు మఱియొక పదార్థము నారోపించి చెప్పుట. "ఈ బ్రహ్మచారి యగ్నిహోత్రుఁడు. ఈక్షత్రియుఁడు సింహము" అను మొదలగునవి. ఇట్టి వాక్యములయందు అగ్నిహోత్రసింహపదములకు "అగ్నిహోత్రమువంటివాఁడు, సింహమువంటివాఁడు" అని చెప్పఁబడునర్థము గౌణార్థము.

## ౧౦౨. సూక్ష్మం తు తదర్హత్వాత్. ౧. ౪. ౨.

తాత్పర్యము:—మఱియు నిచ్చట నవ్యక్తశబ్దముచేఁ జెప్పబడినది సృష్టికి పూర్వకాలమున నస్పష్టరూపముతోఁ గారణమాత్రముగ నున్నదేహమే గాని తద్భిన్నమై యున్నస్థూలదేహము కాదు. ఆయవ్యక్తశబ్దముచేఁ జెప్పఁబడుటకు సర్వేంద్రియగోచర మగునీస్థూలదేహము తగదు కదా!

"ఇట్లు చెప్పకూడదు. ఆరూపకవాక్యమున చెప్పఁబడిన యింద్రియాదులు ప్రత్యక్షములే యై యున్నవి. అట్లు కాకున్న 'నీవీయింద్రియముల వశపఱచుకొనవలయును' అని చెప్పుటయే సంభవింపదు కదా! ఇట్లుండ అన్నిఁటిని ప్రత్యక్షముగ నున్నవానినే చెప్పి ఒక్క దేహమును మాత్రమే అగోచర మగు కారణావస్థతోఁ జెప్పె ననుట విరుద్ధమగును" అనియెదవేమొ వినుము. "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" "ఈప్రపంచమంతయు నొకసమయమున నవ్యాకృతముగ (నామరూపప్రకాశము లేనిదిగా) నుండెను" అను మొదలగుశ్రుతివాక్యముల నాశ్రయించిచూచిన నీప్రపంచమునకు సూక్ష్మావస్థ కలదని నిస్సంశయముగ సిద్ధాంత మగుచున్నది. ఆసూక్ష్మావస్థయే దీని యుత్పత్తికిఁ గారణము. ఆకారణము నామరూపవిహీన మగుటచే నవ్యక్తశబ్దముచేఁ జెప్పఁ దగి యున్నది యనుటయు నిర్వివాదమే. కార్యకారణములకు భేదము లేదనుటయు సుప్రసిద్ధమే. కావున నెట్లయినను చెప్పనచ్చును. ఈదేహము ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నను కారణవాచక మగుశబ్దముతోఁ జెప్పవచ్చును. "గోభిః శ్రీణీత" "గోవులను కలపవలయును (గోవికారము లగుపాలు, పెరుఁగు, మొదలగువానిని కలుపవలయు ననుట)" అనుమొదలగు వాక్యములయందు కార్యములగుపదార్థములను జెప్పవలసినప్పుడు కారణవాచకశబ్దమునే ప్రయోగించుట గానవచ్చుచున్నది. ఇచ్చట "పాలు, పెరుఁగు," అని ప్రయోగించుటకు బదులు కారణవాచక మగుగోశబ్దమే ప్రయోగింపఁబడి యున్నది కదా! కావున కార్యకారణములవిషయములో నెట్లు చెప్పినను విరోధము కలుగదు. ఇంద్రియాదులు ప్రత్యక్షరూపముతోనే చెప్పఁబడినను దేహవిషయమునం దాపోలిక యవసరము లేదు. కార్యకారణములకు

నభేదము సిద్ధమై యేయుండ నా దేహమే యొకస్థలమున కార్యరూపము గాను మఱియొకస్థలమునఁ గారణరూపముగాను చెప్పఁబడియుండ వచ్చును. ఇట్లుండ నీకు దీనికి పరులతో పోలిక యేల? ఒకపక్షమున నాయింద్రియాదిశబ్దములచేతఁ గూడ తత్కారణ మగుసూక్ష్మావస్థయే చెప్పఁబడియుండవచ్చును. మఱియొకపక్షమునఁ గారణద్యోతకమగు నవ్యక్తశబ్దముచేతఁ గూడఁ బ్రత్యక్ష మగుస్థూలదేహమే చెప్పఁబడి యుండవచ్చును కదా!

## అ ౧. పా ౪. సూ ౩. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లయిన మీరును మామార్గమునకే వచ్చి నట్లగును. మీరును మావలెనే "ఈప్రపంచమునకు సృష్టికి పూర్వమున నొకసూక్ష్మావస్థ కలదు" అని చెప్పియున్నారు. దాని నాశ్రయించియే "కార్యకారణములకు నభేదము స్వతస్సిద్ధము కావున కారణవాచక (సూక్ష్మావస్థను దెలుపు)మగునవ్యక్తశబ్దముచేఁ గార్య మగు దేహముకూడ చెప్పఁబడి యున్నది" యని సిద్ధాంతము చేసి యున్నారు. విచారించిన నెట్లు చెప్పినను (ప్రపంచమునకు సృష్టికి బూర్వకాలమున నున్నసూక్ష్మా వస్థయే యవ్యక్తశబ్దముచే నిచ్చట చెప్పఁబడె ననినను, ఆసూక్ష్మావస్థతో నభిన్నముగ దేహమే నిచ్చట చెప్పఁబడె ననినను) ఒకటియే. సూక్ష్మావస్థ యైననేమి? దానితో నభిన్న మగు దేహ మైన నేమి? ఇందేది చెప్పఁ బడినను ఒక్కటియే కదా! మామతమునందు ఆప్రపంచసూక్ష్మావస్థనే ప్రధాన మనుచున్నాము కావున అవ్యక్తశబ్దము ప్రధానమును చెప్పు నదియే యనవచ్చును.

అవతారిక:—అనునీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౦౯. తదధీనత్వా దర్థవత్. ౧. ౪. ౩.

తాత్పర్యము:—మావాదమునకును మీవాదమునకును సంబంధము లేదు. మామతమునఁ జెప్పఁబడిన ప్రపంచపూర్వావస్థ పరమేశ్వ రాధీన మైనది. మీరుచెప్పు ప్రధాన మట్టిది కాదు కదా! మీరు దానిని జీవపరమేశ్వరభిన్న మనియు స్వతంత్రమనియుఁ జెప్పుచున్నారు.

సిద్ధాంతము:—"ఇట్లయినఁ బరమేశ్వరుఁడే సర్వకాలముల నాచరింపవచ్చును. ఇఁక ప్రపంచపూర్వావస్థ యొక్కటి కూడ నేల?" అని

యెదవేమొ అది సరి కాదు. నిర్వికారుఁ డగుపరమేశ్వరుఁడు అట్టి దేది యు లేకున్నఁగార్యకారి కానేరఁడు. ఆప్రపంచపూర్వావస్థనే మేము అక్షర మనియు అవ్యాకృత మనియు మాయ యనియుఁ జెప్పుచున్నాము. శ్రుతి యు నట్లే చెప్పుచున్నది. "అక్షరా త్పరతః పరః"(ము.౧.౨.౨౧.), మా యాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం" "ఈప్రపంచము యొక్క సూక్ష్మావస్థయే మాయ అదియే ప్రపంచోపాదానకారణము. అది కలవాఁ డగుటచేఁ బరమేశ్వరుఁడు మాయికుఁడు." అనుమొదలగు శ్రుతివాక్యములయం దీవిషయము స్పష్టముగ నున్నది. ఈమాయను మేము స్వతంత్రమని యంగీకరింపము.

మఱియు మీమతము ననుసరించి చూచిన ప్రధాన మవ్య క్తము కానేరదు. ఇంద్రియములకు గోచరము కాదనుట యొక్కటియే కాని యది మనోనేత్రమునకుఁ గోచర మగుచునే యున్నది. ఏయేపదార్థ ములు యుక్తులచే "దీనిస్వరూప మిట్టిది" అని నిర్ణయింపఁబడగలవో అవి మనోనేత్రమునకు గోచరము లగునవియే యనుట నిస్సంశయము. ప్రకృతము మీప్రధానము స్వతంత్ర మగుటచే బ్రహ్మభిన్నముగను జీవ భిన్నముగను కూడ నిరూపించుటకు సాధ్యమై యున్నది. మామాయ యన్ననో యట్టిది కాదు."ఉన్నది. బ్రహ్మరూపముతోనే యున్నది."యని కాని "లేదు. బ్రహ్మరూపముతో లేదు" అని కాని నిరూపించుటకు, శక్య మైనది కాదు. బ్రహ్మమే యనిన నాయన నిర్వికారుఁ డని చెప్పు శ్రుతులకు విరోధము వచ్చును. ఆయనకు నిట్టివికారము లుండవు కదా! బ్రహ్మము కాదనిన దీనికి నునికియే సంభవింపదు. పరబ్రహ్మమొక్కఁడే సత్తాస్వరూపము. రెండవసత్తు యుండుటకును ఎట్లు చూచినను వీలు కలుగదు. (ఈవిషయము నాచే వివరింపఁబడిన బ్రహ్మగీతలు అ. ౫. శ్లో. ౧-3౦. చూడుు.) ఈకారణమువలన నీమాయయొక్కస్వరూపము మనస్సునకుఁ గూడ గోచరము కాదు. ఈకారణమువలన నవ్యక్తశబ్ద ముతోఁ జెప్పిన దీనినే చెప్పవలయును. కావున నెట్లు చూచినను మా వాదమునకును మీవాదమునకును భేద మనంతముగఁ గలదు.

పూర్వపక్షము:—ఊరక యేదియో ఒకభేదమును మాత్రము కల్పించి చెప్పినఁ బ్రయోజన మేమి? చెప్పినవిషయము యుక్తియుక్త ముగ ననుభవానుకూలముగ నుండవలయును కదా! ఇప్పుడు మీరు

చెప్పిన సిద్ధాంతము మిగుల విరుద్ధముగ నున్నది. అవిద్య యొక్కటి బ్రహ్మము నాశ్రయించి యున్న దనిన నది యెన్నటికైన నశించునం దురా? లేదందురా? నశించుననిన జీవుల కందఱకు నొక్కమాఱే ముక్తి రావలయును. లేదనిన నొక్కమాఱు ముక్తిని జెందినవారలకుఁ గూడ బంధము రావలయును. ఇహలోకమున దేహధారులై యున్నప్పుడు''ఇది మాయామయము అని తెలిసినను బ్రహ్మమునఁ జేరిన పిదప నామాయ మఱల నాక్రమించియే తీరును కదా! ఇంతకంటె వేఱేమివిరోధము రావలయును? మఱియు మీమతమున పరబ్రహ్మ మేకరూపము. ఆయన కంటె భిన్నముగ నవిద్య కలదనిన సిద్ధాంతమునకే మొట్టమొదట భంగమువచ్చును. కావున మామతము నే యవశ్యముగ మీరును అంగీక రించి తీరవలయును.

మామతమునందు ప్రపంచకారణ మగుప్రధానము వేఱు. దాని సంబంధముచే జీవునకు నవివేకము కలిగెను. అదియే వానికి సంసార కారణము. కావున శాస్త్రాభ్యాసాదులచే నాయవివేకము నశింపగానే జీవుఁడు మోక్షమును జెందును. అవివేక మనునది ప్రతిజీవునకును ప్రత్యేకముగ నుండునదియే కావున నెవనియవివేకము నశించునో వాఁడుమాత్రమే ముక్తి నొందును. తక్కినవాఁడు బంధముతోనే యుండును. ప్రధానమునకును జీవులకును సంబంధ మెప్పుఁటికిని లేదు కావున ముక్తులకు పునరావృత్తి గలుగదు. కావున మీరుకూడ నెప్ప టికిని మామతము నే యాశ్రయించి తీరవలయును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరికాదు. మీరు చూపినదోషము మీసిద్ధాంతమునందే కలదు కాని మాసిద్ధాంతమునందు లేదు. మా సిద్ధాంతముయొక్క స్వరూపమును తెలిసికొనలేక యిట్లు చెప్పితివి.

మీసిద్ధాంతమునందువలె మాసిద్ధాంతమునందు ప్రపంచకారణ భూత యగునవిద్య, యొక్కటి కాదు. అనేకములు. ప్రతిజీవునకును ఆ యవిద్య ప్రత్యేకముగఁ గలదు. నాకు గల యవిద్యచే నేను ఏకరూప మగుపరబ్రహ్మమును బహుభేదములు గల ప్రపంచమునుగాఁ జూచుచు న్నాను. అనేకజంతువు లున్నట్లును వారికిని నాకును శత్రుమిత్రత్వాదిరూ పములగుసంబంధము లనేకము లున్నట్లును చూచుచున్నాను. దేహమునే యాత్మగాఁ దలంచుచు దేహభేదములవలన నాత్మభేదముల వీక్షించుచు

లేని సుఖదుఃఖముల నున్నట్లు చూచుచున్నాను. నీవును నీయవిద్యవలన నిట్లే చూచుచున్నావు. మఱియొక్కఁడును వాని యవిద్యవలన నట్లే చూచుచున్నాఁడు. వాస్తవస్థితిలో నూరక యెవరికి వారు అనేకజీవులున్నట్లు చూచుచుండుటయే కాని, ఉన్నది యొక్కఁడే. నేనును సర్వరూపుఁడనే! నీవును సర్వరూపుఁడవే. మఱియొక్కఁడును సర్వరూపుఁడే కావున జీవబ్రహ్మము లొక్కటియే యైనను పైజెప్పిన యవిద్యోపాధివలన వారికిఁ బరస్పరభేదము కలిగెను. ఇంతయే కాని జీవులుకూడ మొట్టమొదటనే పరస్పరభిన్నులై యెట్లో యుదయించి రనుటకుఁ బ్రమాణములు లేవు. ఈ పక్షము నాశ్రయించిన యథార్థజీవుఁడొక్కండే యగుటచేతను తక్కిన వారలు కల్పితులే యగుటచేతను, ఒకఁడు ముక్తినొందిన నందఱును ముక్తి నొందవలయు ననునిర్బంధంబును, ఒకఁడు బంధంబుననున్న నందఱును బంధముననే యుండవలయు నను నిర్బంధంబును కలుగ నేరదు. కల్పితులు పరమార్థస్థితిలో శూన్యరూపులే. కదా! మఱియు బద్ధుని దృష్టికి నందఱును బద్ధులే; ముక్తుని దృష్టికి నందఱును ముక్తులే యగుదురు. బంధమాగంతుకము; ముక్తి స్వతస్సిద్ధము. బంధము కల్పితము; ముక్తిపరమార్థము. ఇట్లుండ బంధశూన్యులకు మఱల బంధమెట్లు కానవచ్చును? కావున నిట్లు విచారించినచో నొకపక్షమున సర్వజీవముక్తి వచ్చుననినను దోషము లేదు. ముక్తి లేదని తలంపఁబడుచుండుటయే కాని యెప్పటికిని వచ్చియే యున్నదికదా. అది యట్లుండె. ప్రకృతము పైనఁ జూపినయుక్తి నాశ్రయించి చూచిన మనము చూచుచున్న జీవులలో నొక్కఁడొక్కఁడును వేఱువేఱే ఒక్కఁడొకఁడును ఉపాధివశమున తమస్వస్వరూపమును మఱచి ఏకరూపమును భావింపలేక పరబ్రహ్మమునే నానారూపములతో జూచువాఁడే. కావున వారి యవిద్య లొక్కటి కానేరవు; ఒక్కటి కాకున్న నొకని బంధమోక్షములతో మఱియొకనిబంధమోక్షములు సంబంధపడి యుండవు. ఎవనియవిద్య నశించిన వాఁడే ముక్తుఁడగును; ఇతరులు బద్ధులైయే యుందురు. "ఇట్లయిన నొక్కజీవునియందే యథార్థత్వ కల్పితత్వరూపధర్మములు రెండు నుండవలసి వచ్చునుకదా!" అనియెదవేమొ యది మాకు సమ్మతమే జీవులు అనేకులుగాఁ గానవచ్చుచున్నను వారందఱు నొక్కటియే యనియు అట్లయినను వారియుపాధులు పరస్పరభిన్న

ములనియు నట్లు కావున నొక్కనిబంధమోక్షములతో తక్కినవారి బంధమోక్షములకు సంబంధము లేదనియు నిరూపించుటకై యట్లు చెప్పితిమి కాని (''యథార్థజీవుఁ డొక్కఁడే వానిదృష్టికి, [త్రాటియందు సర్పమువలె] ననేకజీవులు కానవచ్చుచున్నారు.'' అని చెప్పితిమి కాని) ''జీవుఁడు పరమార్థస్థితిలో సత్యరూపుఁడై యున్నాఁడు'' అని చెప్పుటకుఁ గాదు. మీమతమునందువలె మామతమునందు జీవబ్రహ్మాభేదము పారమార్థికము కాదు. త్రాటియందుసర్పమువలె జీవుఁడు తననాశ్రయించి యున్న ప్రపంచసూక్ష్మావస్థారూపిణియగునవిద్యచేఁ గల్పింపఁబడుచున్నాఁడనుటయే మాసిద్ధాంతము. కావున వ్యవహారదృష్టిచే యథార్థత్వంబును పారమార్థికదృష్టిచేఁ కల్పితత్వంబును ప్రతిజీవునియందును కలదు. ఒక్కొక్కఁడును తన స్వరూపమును మఱచియున్నప్పుడు బ్రహ్మమునే మఱచి సర్వమును తనయట్టిదానినిగానే చూచు ననుటలో వివాద మేమి? పుట్టంధునికి ప్రచండసూర్యుఁడుకూడ నంధకారమే కదా! కావున మేము చూపినయుక్తిలో విరోధ మేమియు లేదు

ఇట్లు కాక మాలో కొందఱు సర్వజీవులును ప్రత్యేకముగ నొక్కమాత్రే భిన్నరూపములతో జనించిరందురు. వారిపక్షము నాశ్రయించినను వారియుపాధులు పరస్పరభిన్నములే. పైజూపినయుక్తి ననుసరించి చూచిన నెట్లయినను సిద్ధాంతము చేయవచ్చును. ఏజీవుని కాజీవుఁడొక్కఁడే జనించి తక్కినవారిని తనయవిద్యచేఁ జూచుచున్నాఁడనినను, అందఱు నొక్కమాత్రే జనించి తమతమయవిద్యలచే ప్రపంచమును బ్రహ్మభిన్నముగఁ జూచుచున్నారనినను ఒక్కటియే కదా! కావున నెట్లు చూచినను మామతమునందు మీ రనిన దోషములకు నవకాశమే లేదు.

ఆదోషములు మీమతమునందే కలవు. చూడుఁడు. మీరు ప్రపంచపూర్వావస్థను ప్రధానమనియు నది యేకరూప మనియుఁ జెప్పుచున్నారు. అదియే బంధమోక్షకారణ మనుచున్నారు. మీలో కొందఱు (* నిరీశ్వరసాంఖ్యులు) కేవలప్రధానస్వరూపజ్ఞానమువలననే మోక్షము కలుగు ననియు, దానిస్వరూపమును తెలిసికొనకపోవుటచే

* ప్రస్తుతము సాంఖ్యమత మని వ్యవహరింపఁబడు కపిలసిద్ధాంతము నాశ్రయించినవారు నిరీశ్వరసాంఖ్యులు. వారిమతమున నీశ్వరుఁడులేఁడు.

బంధము కలిగె ననియుఁ జెప్పుచున్నారు. మఱికొందఱు *(సేశ్వరసాంఖ్యులు) ప్రధానపురుషస్వరూపజ్ఞానతదభావములవలన మోక్షబంధములు కలుగు ననుచున్నారు. ఇట్లయిన నొక్కజీవుఁడు ప్రధానస్వరూపము నెఱింగెనేని యందఱును ముక్తులు కావలయును. అందఱికును బంధహేతువగుప్రధాన మొక్కటియే కదా! "ప్రధాన మొక్కటియే యైనను దానివలన ప్రత్యేకముగ నవివేకము జీవులకు జనించినది. అది యేకరూపము కాదు. ప్రతిజీవులయందును పరస్పరభిన్నము. దానినాశమువలనకాని మోక్షము కలుగదు. అంటిమిగదా" యనియెదరేమొ అప్పుడు మీమతమునకే మూలధ్వంసము కలిగినది. అప్పుడు నిష్ప్రయోజక మగు ప్రధానకల్పనతోఁ బని యేమి? అవివేకమే అభివృద్ధికాలమున బంధంబును వినాశకాలమున మోక్షమును కలిగించుచుండ నిఁక నిరర్థకముగఁ బ్రధాన మేల? "అది ప్రపంచకారణము. అవివేకము బంధకారణము" అనియెదరేమొ అదియు సరి కాదు. ఎవ్వరిమతమునందును ప్రపంచబంధములకు భేదమే లేదు. ఇదియునుఁ గాక మీరు ప్రధానస్వరూపజ్ఞానమువలనఁగాని మోక్షము రాదని యన్నారు కదా! అది బంధహేతువు కాకుండిన మోక్షమునకుఁ దత్స్వరూపవిజ్ఞానముతోఁ బని యేమి? "పృష్ఠతాడనా ద్దంతభంగః" అనున్యాయమున నొకదాని జ్ఞానమువలన మఱియొకటి సిద్ధించు ననుట హాస్యాస్పదము కదా! కావున నెట్లు చూచినను మీరు చెప్పినదోషము మీసిద్ధాంతమునందే కలదు గాని మాసిద్ధాంతమునందు లేదు.

మఱియు నీయవిద్యవలనఁ బరమేశ్వరునకు ద్వైతము సంభవింపదు. పరమార్థస్థితిలో నీప్రపంచమే లేదు. దీనికిఁ గారణభూత మగు నవిద్యయు లేదు. మఱియు విద్యచే (జ్ఞానముచే)నవిద్య నశించు ననుట సర్వమతసమ్మతము. లోకమున జ్ఞానముచే నేపదార్థములును నశింపవు; సత్యము లగుపదార్థములు నశింపవు. ఏపదార్థములు రజ్జుసర్పము మొదలగువానివలె కేవలభ్రాంతికల్పితములై పరమార్థస్థితిలో సత్యములు కాక వ్యవహారదశయందు మాత్ర మున్నట్లు తోఁచుచుండునో అవి

---

* పతంజలిమతము యోగమతము. దాని నాశ్రయించినవారు సేశ్వరసాంఖ్యులు. వీరు పరమేశ్వరు నంగీకరింతురు. తక్కిన యంశములయందు వీరిమతము కూడఁ గపిలమతమే.

మాత్రమే జ్ఞానముచే నశించును. తెలిసికొనినపిదప వాస్తవస్వరూపము తెలియఁబడుటచేఁ బ్రస్తుతము తోఁచుచుండినస్వరూపము కానరాదు. ఇది సర్వానుభవసిద్ధము. త్రాఁటిని చూచి సర్పమని భ్రమించినవాఁడు యథార్థమగురజ్జురూపమును తెలిసికొనఁగానే మఱల నాసర్పమును జూచుట లేదు ? భయము నొందుట లేదు కదా! ఇట్లే జ్ఞానముచే నశించునది యగుటచే నీయవిద్యకూడ పరమార్థస్థితిలో శూన్యరూపమే కావలయును ? వ్యవహారస్థితిలో మాత్ర మూరక తోఁచునదిగా నుండ వలయును. ఇట్టిదానితో పరమార్థసత్యరూపుఁ డగుపరమేశ్వరునకు ద్వైత మెట్లు వచ్చును ? ఎండమావులనీటితో పరమార్థజలమునకు ద్వైతము సంభవించునా ? రజ్జుసర్పముతో యథార్థసర్పమునకు జాతి భేదము కలుగునా? కావున నెట్లు చూచినను మామతమునందు దోష మేదియును లేదు.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతమునందును పెక్కుదోషములు కలవు.

౧. అవిద్యయే ప్రపంచకారణమైనచోఁ బ్రత్యేకముగనీశ్వరుఁ డేల? సర్వకార్యములును ఆ యవిద్యవలననే జరుగును కదా!

౨. అవిద్యోపాధు లనేకము లనియు జీవు లనేకు లగుటచే నా యుపాధులకు ననేకత్వము వచ్చె ననియుఁ జెప్పియున్నారు. ఇప్పుడు *అన్యోన్యాశ్రయదోషము వచ్చును. మొట్టమొదట జీవులు భిన్నులై యుండిననే కాని అవిద్యకు భేదము కలుగదు. అవిద్యకు మొట్ట మొదట భేదము సంభవించిననే కాని జీవులకు భేదము కలుగదు. ఈదోషము పోవుట యెట్లు? పోకుండిన నీరెండును సిద్ధింపవు.

3....౧. ఇట్లే యవిద్య లేకున్న జీవకల్పన లేదు ? జీవుఁడు లేకున్న నవిద్యయు లేదు. అవిద్య జీవునకే గాని బ్రహ్మమునకు లే దనియే కదా మీరు చెప్పవలయును!

౨. మఱియు నవిద్య బ్రహ్మమునకు లేదనిన మీరు చెప్పెడిజీవ బ్రహ్మైక్యమునకు హాని వచ్చును. జీవుఁడును బ్రహ్మంబు నొక్కటియే యైన జీవునకు నున్నయవిద్య బ్రహ్మమునకు లేకపోవుట యెట్లు ?

౪. ఇదియునుఁగాక అవిద్యకును పరమేశ్వరునకు నేదియో యొక సంబంధ ముండిననే కాని పరమేశ్వరుఁడు ప్రపంచసృష్టికర్త కానేరఁడు.

* అన్యోన్యాశ్రయదోషము (పు. ౩౬౦ చూడుము)

శక్తి యనిన నదియే కదా! ఏపదార్థము జనింపవలయు ననినను కారణమునకు దానిని జనింపఁజేయు సామర్థ్య ముండవలయును. సామర్థ్యమనఁగా సూక్ష్మావస్థయం దున్నకార్యమే (కార్య మనగాఁ గారణము నుండి జనింపవలసినపదార్థము) కాని వేఱు కాదు. ఇది మీకును సమ్మతమే. ప్రపంచకారణ మగునవిద్య ప్రపంచసూక్ష్మావస్థయే కాని యన్యము కా దని మీరు చెప్పుచున్నారు కదా! ఇఁక నాలోచించి చూచిన లోకమున శక్తికిని పదార్థమునకును * ఆధారాధేయభావసంబంధ మొక్కటియే కానవచ్చుచున్నది. దీనిని మీరును అంగీకరించియే తీరవలయును. అట్లంగీకరించినఁ బరమేశ్వరునకు మీరు చెప్పు నిర్గుణత్వమును ఏకరూపత్వంబును సిద్ధింపదు. ఈదోషమునకు పరిహార మేమి? నానాభేదములు గలప్రపంచముయొక్క సూక్ష్మావస్థకుఁ నాధార మగువాఁడు ఏకరూపుఁడు అద్వితీయుండును కాఁగలఁడా?

౫. మఱియు మీరు చెప్పినట్లు అవిద్య లనేకము లగునేని "మహాతః పర మవ్యక్తం" అని యవ్యక్తపదము శ్రుతియం దేకవచనముగా నేల ప్రయోగింపఁబడి యున్నది?

౬. మఱియు మహచ్ఛబ్దమునకు హిరణ్యగర్భునిబుద్ధి యనియు జీవుఁ డనియు రెండర్థములు చెప్పియున్నారు. ఇందు హిరణ్యగర్భుని బుద్ధి యవిద్యవలన జనించినదియే యగుటచేత దానికంటె నాయవిద్య శ్రేష్ఠము కావచ్చును కాని జీవునికంటె నది శ్రేష్ఠ మగుట యెట్లు? ఆతఁడు చేతనుఁడు కదా!

కావున "జగత్కారణ మగు నవిద్య యనేకరూపములతో నున్నది. అది స్వతంత్రము కాదు" అను మీసిద్ధాంత మెట్లును యుక్తియుక్తము కానేరదు.

సిద్ధాంతము :—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. నీవు చూపిన దోషము లెవ్వియును మాసిద్ధాంతమునఁ గలుగనేరవు.

౧. అవిద్య ప్రపంచమునకుఁ గారణ మగుట నిస్సంశయమే. అయినను పరమేశ్వరునియునికి యత్యంతావశ్యకము. అవిద్య జడస్వరూపిణి యనుట సర్వలోకప్రసిద్ధము సర్వప్రమాణసిద్ధము. "ఇది యు

* ఆధారాధేయభావసంబంధము. ఆధారాధేయములకు గలసంబంధ మాధారాధేయభావసంబంధము.

విద్య" యని ప్రతిపురుషుఁడును తెలిసికొనుచున్నాఁడు కదా! పరునిచేఁ బ్రకాశింపఁజేయఁబడునది స్వప్రకాశరూప మెట్లగును? స్వప్రకాశము కాకున్నచో జ్ఞానరూప మెట్లగును? జ్ఞాన మొక్కటి మాత్రమే స్వయం ప్రకాశ మనియు తక్కినవి కావనియు నందఱు నెఱుంగుదురు. జడములను జ్ఞానము ప్రకాశింపఁజేయుచుండుటయు జ్ఞానమును ప్రకాశింపఁజేయుపదార్థము మఱియొక్కటి యుండుటకు వీలు లేకపోవుటయు యుక్తిదృష్టికి ప్రత్యక్షము. జడము జ్ఞానమును ప్రకాశింపఁజేయలేదనుటయు, మఱియొకజ్ఞానమే దానినిఁ బ్రకాశింపఁజేయు ననిన * ననవస్థాదోషము వచ్చు ననుటయు సర్వానుభవసిద్ధము. కావున నీయవిద్య జ్ఞానముచేఁ బ్రకాశింపఁజేయఁబడునది కావున జడము అచేతనము. ఈ కారణమువలన దీనికి చేతనసహాయ మావశ్యకముగ నుండవలయును. అది లేకున్న నీయవిద్య దేనినిఁ గూడ చేయనేరదు. కావున నీశ్వరుఁడు అవశ్యముగ నుండవలసినవాఁడే. పైఁజూపిన దోషము వచ్చు నను భయముచేతనే కదా మీలోఁ గూడఁ గొందఱు (సేశ్వరసాంఖ్యులు) పరమేశ్వరు నంగీకరించి యున్నారు? కావున "జడ మయ్యును ప్రధానము స్వతంత్రమై యున్నది" అని చెప్పు మీమతమునందే యీదోషము కలదు కాని మామతమునందు లేదు. జడపదార్థమునకు మొట్టమొదట స్వాతంత్ర్యమే లేదు; అట్టిదియే యున్నయెడల నీశ్వరుఁడే యక్కఱ లేదు. మఱియు జడము స్వతంత్రమై ప్రపంచరూపముగఁ బరిణమించు ననిన నది జీవరూపముగఁ గూడఁ బరిణమింపవలసివచ్చును. ఇది యచేతనమునకు సంభవింపదు. కావున నెట్లు చూచినను మీమతమే దోషయుక్తము కాని మామతము కాదు.

"ఇది యేమి? లోకమున నేపదార్థము జనింపవలయు నన్నను ఉపాదాననిమిత్తకారణములు రెండు మాత్రమే యుండును కదా! మీమతమున నీప్రపంచమునకు ఉపాదానకారణ మేది? నిమిత్తకారణ మేది? చేతనుండగుటచేఁ బరమేశ్వరుఁడు అవిద్యను ప్రేరేపించువాఁడుగా మాత్రమే యుండవలయును. ఇట్టిపదార్థములు నిమిత్తకారణము లని లోకవ్యవహారము. కావున నాయవిద్య యుపాదానకారణమే కావలయును. ఇప్పుడు మామతముపైఁ జూపినదోషము మీమతమునందు

---

* అనవస్థాదోషము [illegible]

కూడ నచ్చినది. అవిద్యయే ప్రపంచరూపముగఁ బరిణమించిన జీవరూపముగఁగూడఁ బరిణమించె ననవలసినదియే జీవుఁడును ప్రపంచమునందుఁ జేరినవాఁడే కదా! ప్రపంచసూక్ష్మావస్థ యగునవిద్యయు జీవజడసూక్ష్మావస్థయే కావలయును కదా! కావున నన్నివిషయములయందును మన మతములు రెండు నొక్కటియే యైనవి. మఱియు నవిద్యచేతనే యిట్లు సర్వకార్యంబును నిర్వహింపఁబడుచుండ దానికి స్వాతంత్ర్యము నంగీకరించిన దోషమేమి? ఇట్లు కాకున్నను జీవుఁడు బ్రహ్మమునకంటెను అవిద్యకంటెను కూడ భిన్న మగుతత్త్వమైనను గావచ్చును. అప్పుడు బ్రహ్మము నొక్కదాని నధికముగ నంగీకరించుట నిరర్థకమే యగును. జీవభిన్నబ్రహ్మము ప్రత్యేకముగ లోకమున గానవచ్చుటయే లేదు కదా! కావున నెట్లు చూచినను ఈశ్వరునితోఁ బని లేదు" అనియెదవేమొ? వినుము:—

పైనఁ జూపినయుక్తి నాశ్రయించి చూచిన నవిద్య జడరూపిణి యని స్పష్టమైనది. అది జీవునిచే తెలిసికొనఁబడుచున్నది యనుట యనుభవసిద్ధము కదా! తెలిసికొనువాఁ డగుటచే జీవుఁడు చేతనుఁడు. కావుననే ఆజీవుఁడు జడపదార్థములకంటె భిన్నుఁడు. నీవును "జీవుఁడు బ్రహ్మవిద్యలకంటె భిన్నుఁడుగా నుండిన నుండవచ్చును." అని యంగీకరించితివి. ప్రపంచశబ్దము జీవజడసమూహమునందు వర్తించునదియే యైనను జడసమూహమునందు మాత్రమే ముఖ్యముగా వర్తించును. ఇట్లు కాకున్న జీవజడములకు రెంటికి నభేదము కలుగవలసివచ్చును. రెంటికిని సమానస్వరూప ముండవలసివచ్చును. ఇది సంభవింపనేరదు. కావున జడరూపిణి యగునవిద్య చేతనరూపముతోఁ బరిణమించు ననుట సంభవింపనేరదు. అది ప్రపంచమున కుపాదానకారణ మగుట నిస్సంశయమే. కాని చేతను లగుజీవులకు మాత్రము పైజెప్పినయుక్తివలన నుపాదానకారణము గానేరదు. పరమేశ్వరుఁడు నిమిత్తకారణ మని నీవే యంగీకరించియున్నావు కావున నాయనచే ప్రేరేపింపఁబడు నవిద్యకు ఎట్లును స్వాతంత్ర్యము సంభవింపనేరదు. మా యవిద్యకు వలెనే మీ ప్రధానమునకును స్వాతంత్ర్యము సంభవింప దని తెలిసికొనుము.

మామతమునందు మఱియొకవిశేషము కూడఁ గలదు. పరమేశ్వరుఁడు కేవలము నిమిత్తకారణము మాత్రమే కాఁడు. ఉపాదానకార

ణము కూడ నై యున్నాఁడు. "అప్పటికి మాత్రము ఆయన జడరూప
ముతోఁ బరిణమించుటకు వీలు కలదా!" యనియెదవేమొ వినుము.
మేము మీావలె నంతటను * బరిణామము నొక్కదానినే పదార్థోత్పత్తి
కారణముగఁ జెప్పువారము కాము.?*ఆరంభమును మాత్రమే పదార్థో
త్పత్తికారణమునుగాఁ జెప్పువారమును కాము. మాది*వివర్తవాదము.
లోకమునఁ బురుషుఁడు త్రాటియందు దానితో నేమియు సంబంధము
లేనిసర్పమును జూచుచున్నాఁడు? స్తంభమునందును ప్రత్యక్షవిరుద్ధ
ధర్మములుగలపురుషుని జూచుచున్నాఁడు. వాస్తవస్థితిలో నాత్రాటికి
కాని స్తంభమునకుఁ గాని మార్పేమియుఁ గలుగలేదు. ఇట్లే స్వయ
ముగ మార్పునొందక యన్యాకారముతోఁ దోఁచుటయే వివర్తము.
ఈవివర్తమునందు కారణమై యుండుపదార్థము వివర్తోపాదానకారణ
మనఁబడును.కల్పితపదార్థమునకు నాధార మగుటచే నధిష్ఠాన మనియుఁ
జెప్పఁబడును. మఱియు నారజ్జుసర్పాదులు రజ్జ్వాదిస్వరూపాజ్ఞానముచే
మాత్రమే కలిగినవి. అజ్ఞాననాశముచే నశించినవి. కావున వానికి నాయ
జ్ఞానమే స్వరూపము. జ్ఞానము (మనోవృత్తి) ఒకపదార్థమును ప్రకాశిం
పఁజేయవలయు ననినఁ దద్రూపముతోనే (ప్రకాశింపఁజేయఁబడవలసిన
పదార్థముయొక్క రూపముతోనేఁ) బరిణమించు ననుట సర్వవాది
సమ్మతము. ఇట్లే యజ్ఞానము కూడ మనోవృత్తియే కావున నదియు
దనకు గోచరమగుపదార్థముయొక్క రూపముతోనే పరిణమించును.
కావున నారజ్జుసర్పాదులకు నజ్ఞానమే పరిణామోపాదానకారణము. పరి
ణామమున నుపాదానకారణమగునది పరిణామోపాదానకారణ మనఁ
బడును. ఇట్లే ఈప్రపంచమునకు నవిద్య పరిణామోపాదానకారణము;
పరమేశ్వరుఁడు వివర్తోపాదానకారణము. జీవులు అవిద్యచే రజ్జువునందు
సర్పమునువలె పరమేశ్వరునియందుఁ బ్రపంచమును చూచుచున్నారు.
ఈకారణమువలననే ప్రపంచబ్రహ్మములకు భేదము లేదు. నీవును "లోక
మున జీవభిన్నుఁడై పరమేశ్వరుఁ డొక్కఁడు గానవచ్చుట లేదు" అని
చెప్పియున్నావు. ఇది యథార్థమే. ఉపాదానకారణమునకును కార్యము

---

* పరిణామము. (పు. ౭౭. చూడు.)

* ఆరంభము. (పు. ౭౭. చూడు.)

* వివర్తము. (పు. ౭౭. చూడు.)

నకును భేద మెందును లేదు కదా! కావున నాకు నవిద్యయు కావల యును? దానికిఁ బ్రేరకుఁడుఁగా నుండుటకును, ప్రపంచమునకు నధిష్ఠాన మగుటకును పరమేశ్వరుఁడును కావలయును. పరమేశ్వరుని యంశభూతు లగుజీవులు లేక ప్రపంచము పూర్ణము కాదు కదా!

"ఇట్లు చెప్ప నేటికి? ప్రపంచము సత్యమే యనరాదా?" అనియెద వేమొ వినుము. అది యనేకశ్రుతులకును యుక్తులకును విద్వాంసుల యనుభవమునకును గూడ విరుద్ధమే. మొట్టమొదట భేద మనునదియే ఉండుటకు వీలు లేదని శ్రుతియుక్త్యనుభవములు ఘోషించుచున్నవి. (ఈవిషయమును గూర్చి చూడు ౧.౧.౪) ఇట్లు గాక యొకవేళ నిది సత్యమే యైనను జీవులు జడులు కానేరరు; అవిద్యయుఁ చేతనము కానే రదు. అప్పుడు మాత్ర మవిద్య జీవరూపముతోఁ బరిణామము నొందు ననుట యెట్లు? కావున నప్పటికిని జీవరూపముతోఁ బరిణామము నొంది సృష్టికాలమున సర్వప్రపంచంబును తెలిసికొనుచుండునదియుఁ బ్రళయ మున నాజీవులకు మూలభూతమై యుండునదియు నగు నొకభిన్నపదార్థ ముండియే తీరవలయును. జీవులు చేతనులు కావున నదియుఁ జేతనము గనే యుండవలయును. వాఁడే పరమేశ్వరుఁ డనవచ్చును. జీవులు ఎవ్వరికి వారే జనించిరనుట గౌరవము. ఒకవేళ నట్లే సాధించినను వారిసము దాయమే పరమేశ్వరుఁడనవచ్చును. వా రందఱు జ్ఞానమాత్రరూపులే కావున వారలకు నైక్యము చెప్పవచ్చును. ఉపాధులు వారిచేఁ దెలియఁ బడునవియే! కావున వారికి నాయుపాధులతో నెప్పటికి నేకత్వము లేదు. కావున నెట్లు చెప్పినను అవిద్యానియామకుఁ డగుపరమేశ్వరుఁ డొక్కఁ డుండుట యత్యావశ్యకము.

"ఈప్రపంచ మవిద్యావివర్తమే కారాదా?" అనియెదవేమొ యప్పుడు మనవాదము నామమాత్రములోనికి వచ్చును. నీవు దేని నవిద్య యనుచున్నావో అదియే నాకు పరమేశ్వరుఁడు. అప్పుడు అవి ద్యాశబ్దముచేఁ జెప్పఁబడునది ప్రపంచసూక్ష్మావస్థ కానేరదు. ఆసూక్ష్మా వస్థ జడ మగుటచే చేతనరూపముతోఁ బరిణామమును జెందనేరదు; వివర్తమును జెందవచ్చుననిన నదియు విరుద్ధమే. ఈప్రపంచమునకు నధి ష్ఠానము అచేతనమే యగునేని తత్ప్రాప్తియే ముక్తి కావలసివచ్చుటచే నీసిద్ధాంతము మిగుల విరుద్ధ మగును. "చేతనులై యుండుట బంధము

అచేతను లగుట మోక్షము" అనిన నింతకంటె హాస్యాస్పదము వే తేమి కలదు. కావున నెట్లు చూచినను ప్రపంచాధిష్ఠానము చేతనమే కావల యును. అప్పుడు జీవులు చేతనులే యైనను తమకుఁ గలపరమానంద రూపమును మఱచి యున్నారు కావున, నా భ్రాంతిని విడచుటచే స్వస్వ రూపానందమును జెందవచ్చును. ఇది పూర్వపుస్థితికంటె నుత్తమస్థితియే కదా! కావున నెట్లు చూచినను బరమేశ్వరుఁ డొక్కఁ డుండవలసిన వాఁడే.

౨. పైన వర్ణించినవిధముగా మొట్టమొదటిదోషము తొలఁగి పోయినది. ఇక రెండవది అగునన్యోన్యాశ్రయదోషముకూడ మా సిద్ధాంతమునకు హానిని కలిగింపనేరదు. ఈసృష్టికి నాద్యంతములు లేవు. చక్రమువలె నెప్పుడును ఇది తిరుగుచునే యుండును. ఎప్పుడును తిరుగు చక్రమున నేయాకు మొట్టమొదట తిరిగెనో చెప్పఁగలమా? ఈవిధము గనే ప్రపంచమును గూర్చియు ఆరంభమిదియని నిర్ణయింపలేము. కావున నీజీవావిద్యలసంబంధంబును ఇట్టిదియే! అనాది యగుటచే బీజాంకుర ములవలె నీజీవావిద్యలు పరస్పరకారణములై తిరుగుచున్నారు. కావున నిది యన్యోన్యాశ్రయదోషము కానేరదు; మతమునకును భంగము రానేరదు.

"ఇట్లు చెప్పకూడదు. ఇది యొకప్రబలహేతువు కానేరదు. ఎట్లును నిర్ణయించుటకు వీలు లేనప్పుడు దీని నొకదాని నాధారముగఁ జేసికొనుచుందురు" అనియెదవేమొ అది సరియే. కాని ఇందు నీయభి ప్రాయ మేమి? అనాదిత్వ మనుహేతువుచే పరమార్థవిషయమును నిర్ణ యింపకూడ దందువా? లేక ఏవిషయమును గూడ నిర్ణయింపఁగూడ దందువా? ఇందు మొదటిపక్షము మాకు సమ్మతమే! జీవుఁడు, అవిద్య, సంసారము, ప్రపంచము, బంధము మోక్షము, అనుమొదలగునవి యన్నియు మామతమునఁ బారమార్థికములు కావు. ఒక్కపరమేశ్వ రుఁడే సత్యరూపుఁడు. అచ్చట ననాదిత్వము మొదలగుహేతువులేయక్కఱ లేదు. మీమతమున నన్ననో జీవాదు లన్నియుఁ బారమార్థికములు కావున నయ్యనాదిత్వాదిహేతువులచే నిర్ణయ మావశ్యకము. అవి (ఆహేతువులు)అగతికాశ్రయములు కావున వానిచే మీసిద్ధాంతమునకు బాధయు నియతము. ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నందు లోప

మేమి! వ్యావహారికవిషయముల నిర్ణయించుటకు నాయనాదిత్వమును హేతువుగా నుపయోగించిన దోష మేమి? మామతమున వ్యావహారిక పదార్థము లన్నియు నసత్యములే హేతువులును అసత్యములే. మామత మున వానినిఁ గూర్చి చేయఁబడిన నిర్ణయ మంతయు భ్రాంతియుక్తు లగు లోకులకై చేయఁబడినదియే కాని పరమార్థవిషయమును నిర్ణయించు టకై చేయఁబడినది కాదు. ఉపదేశకులు మొట్టమొదట శిష్యు లున్న స్థితినే యవలంబించి యప్పటప్పటికి ననుకూలము లగు హేతువులచే విషయనిర్ణయమును గావింపుచు క్రమక్రమముగఁ బరమార్థమును బోధించుటయే కర్తవ్య మగును గాని యొక్కమాత్రే యతిసూక్ష్మా ర్థమును బోధించుట యుక్తము కాదు కదా! కావున మామత మున జీవావిద్యాదివ్యావహారికవిషయముల నిర్ణయించునప్పుడు అనాది త్వహేతువు ఉపయోగింపఁబడినను సిద్ధాంతభంగమును కలిగింపనేరదు. * అంధపరంపర యనుదూషణకును పాత్రము కానేరదు. వర్ణింపఁబడు చున్న జీవావిద్యాభేదంబును అంధపరంపరయే కదా! కావున నెట్లు చూచినను ఈదోషము మామతమునకు హానిని కలిగింపనేరదు. కావున నవిద్యాభేదము జీవభేదము నాశ్రయింపవచ్చును; జీవభేద మవిద్యా భేదమును కూడ నాశ్రయింపవచ్చును.

3\. ౧. ఈకారణమువలననే నీవు చూపినమూఁడవదోషము కూడ మామతమున లేదు. దానినిఁ గూడ అనాదిత్వహేతువుచే నివ ర్తింపఁజేయవచ్చును. జీవోత్పత్తియు నవిద్యయు బీజాంకురములవలె ననాదులై యున్నవి యనవచ్చును.

౨. మఱియు "జీవునకు నవిద్య కలదు. బ్రహ్మమునకు లేదు." అనుటవలన విరోధ మేమియు లేదు. జీవబ్రహ్మైక్యమునకును హాని రాదు. జీవబ్రహ్మైక్యము స్వతస్సిద్ధమే కాని క్రియలవలనఁ గలుగునది కాదు.

---

* అంధపరంపర యనఁగా: గ్రుడ్డివారివరుస. జ్ఞానములేనివారిసముదాయ మని యభిప్రాయము. ఒకఁడు జ్ఞానహీనుఁడై పూర్వాపరవిమర్శఁ జేయక చెప్పినమాటను మరి యొకఁడు ప్రమాణముగ గ్రహించుటయు దానినే మఱియొకనిచేఁ బ్రమాణముగ గ్రహింపఁజేయుటయు నంధపరంపరాపదతాత్పర్యార్థ మని తెలిసికొనవలయును. కార్య కారణములకు నభేద మాపచారికముగఁ జెప్పఁబడి సూత్రవివరణమునందు "అనాదిత్వ హేతువును చెప్పుట యంధపరంపర" యని వర్ణింపఁబడి యున్నది.

ఇఁక నీయవిద్య యన్ననో శూన్యరూపయే యనియు, ఉన్నట్లు తోఁచు చుండుటవలన దానిని గూర్చి కొంత చెప్పవలసె ననియు నిదివఱకే నిరూపించి యున్నాము. కావున జీవున కున్న దని చెప్పఁబడునవిద్య పరమేశ్వరున కుండ నక్కఱ లేదు. వారిభేదము కల్పితము గాని పార మార్థికము కాదు. అవిద్యయుఁ గల్పితయే. ఇట్లుండ కల్పితభేదము నాశ్రయించి యుపజీవించునవిద్య పరమార్థస్వరూపము నెట్లాశ్రయింపఁ గలదు. ఎండమావులనీటిచే నేల తడియునా! కావున నెట్లయినను మా సిద్ధాంతమునకు లోపము లేదు.

"ఇట్లు చెప్పితి వేమి? బీజాంకురములవలె ననాదు లగువానికి నొకటి ముందు, మఱియొక్కటి వెనుక నను నియమ మెక్కడిది? నీవు జీవు నాశ్రయించి యవిద్య యున్నదని యెట్లు చెప్పితివి? కల్పితభేదము నాశ్రయించుట యనఁగాఁ గల్పితభేదభిన్నుఁ డగుజీవు నాశ్రయించు టయే కదా!" అనియెద వేమొ వినుము. నియమము లేదు కావుననే యందు దేనినైన మొట్టమొదటిదానినిగా గ్రహించి వ్యవహరింప వచ్చును. కావుననే అవిద్యకంటె జీవుని మొదటివానినిగాఁ జెప్పితిమి. మఱియొక్కచో జీవునికంటె నవిద్యనే మొట్టమొదటిదానినిగాఁ గూడ జెప్పవచ్చును. ఎట్లు చెప్పినను నియమము లేకపోవుటచే విరోధ మేమియు రాదు. ఏవియైన రెండువర్ణముల నెడతెగక నుచ్చరించుచున్నప్పుడు మధ్యకాలమున వచ్చి వినినవాఁడు, అం దేవర్ణమును మొదటిదానినిఁగా గ్రహింపఁగలఁడు? తన కిచ్చవచ్చినదానినే మొదటిదానినిఁగా కల్పింప వలయును కదా! ఒకఁ డొకవర్ణమును మఱియొక్కఁడు మఱియొక్కవర్ణ మునుఁ గూడ మొట్టమొదటిదానినిఁగాఁ గల్పింపవచ్చునుగదా! అర్థా నుసారముగ నొక్కఁడైనను ఒకవర్ణము నొక్కమాఱును మఱియొక వర్ణము మఱియొక్కమాఱును మొట్టమొదటిదానినిఁగాఁ గల్పింప వచ్చును కదా! నియమము లేకపోవుటచే నెట్లు చేసినను విరోధము రాదు. కావున అవిద్య జీవునకుమాత్రమే కలదు. ఈశ్వరునకు లేదు; జీవావిద్య లనాదులు.

౪. ఇఁక నాల్గవదోషమునుగూర్చి విచారించిన నదియు మామత మున లేదు. లోకమున సంబంధము లనేకవిధములుగ నున్నవి. గురు

శిష్యులకు గలసంబంధము * బోధ్యబోధకభావసంబంధము శాస్త్రమున కును అందలివిషయమునకును గలసంబంధము ప్రతిపా * ద్యప్రతిపాదక భావసంబంధము. తెలిసికొనువానికిని తెలియఁబడువానికిని గలసంబం ధము * జ్ఞాతృజ్ఞేయభావసంబంధము. ఇట్లే అవిద్యకు నాత్మకును గూడ నేదియో యొకసంబంధము కలుగవలయు ననుటమాత్రమే నియమము కాని; ఆధారాధేయభావసంబంధమే యుండవలయు ననుట నియమము కాదు. ఇఁక నాకర్ణింపుఁడు. అవిద్య యనఁగా నజ్ఞానము. అది ఏదియో యొకపదార్థము నాశ్రయించియే యుండు ననుట ప్రత్యక్షసిద్ధము "నాకు తెలియదు" అని యేపురుషుఁ డైనను తనయజ్ఞానమును ప్రకటించిన నప్పుడు పార్శ్వమున నున్నవాఁడు "నీకు తెలియని దేది?" అని యజ్ఞాన విషయమును (వానికిఁ గలయజ్ఞాన మేపదార్థమునకు సంబంధించినదియో దానిని) ప్రశ్నఁ జేయుచుండుట యనుభవములో నున్నది కదా! ఇట్లే ఈయవిద్యనుగూర్చి ప్రశ్నించినచో "బ్రహ్మమును గూర్చి నాకుఁ దెలి యదు" అని యుత్తరము చెప్పవలసి యుండును. ఈజీవు లందఱును స్వస్వరూపము నెఱుంగ లేకపోవుటచేతనే కదా యనాత్మపదార్థముల నన్నిఁటి నాత్మఁగ భావించి సంసారమగ్నులై యున్నారు! కావున నీయవిద్యకు బ్రహ్మ * విషయము బ్రహ్మమునకు అవిద్య * విషయి

---

* గురువు బోధించువాఁడు కావున బోధకుఁడు; శిష్యుఁడు ఆవిషయమును గ్రహించువాఁడు కావున బోధ్యుఁడు వీరిరువురికిఁ గలసంబంధము బోధ్యబోధకభావ సంబంధ మనఁబడును.

* నిరూపింపఁబడునది శాస్త్రార్థము నిరూపించువాఁడు గురువు. కావున నారెం టికిఁ గలసంబంధము ప్రతిపాద్యప్రతిపాదకభావ మనఁ బడును.

* తెలిసికొనువాఁడు జ్ఞాత తెలిసికొనఁబడునది జ్ఞేయము. ఈరెంటికినిఁ గలసంబం ధము జ్ఞాతృజ్ఞేయభావము.

* ఒకపదార్థము దేనినిఁ గూర్చి ప్రవర్తించునో అది దానికి విషయము. ఇంద్రి యములకు శబ్దాదులు విషయములు.

* అట్లు ఒకదానినిగూర్చి ప్రవర్తించుపదార్థము విషయి. శబ్దాదులకు నింద్రియ ములు విషయులు. ఇట్లే అలంకారాదులయందును మన మేపదార్థమును వర్ణింపవలయునో యది విషయి; దానియందలియాధిక్యమును కాని న్యూనతను కాని తెలుపుటకై తేఁబడిన రెండవపదార్థము విషయము.

కావున నీబ్రహ్మావిద్యలకుఁ గలసంబంధము * విషయవిషయీభావసంబంధమే కాని మఱియొక్కటి కాదు.

"శక్తికిని ఆశక్తిచే నేదియో యొక కార్యము నాచరించుపదార్థమునకును గలసంబంధ మాధారాధేయభావసంబంధమే కాని మఱియొక్కటి కాదని చెప్పియుంటిని కదా" అనియెదవేమొ అది సత్యమే. లోకానుభవ మట్లే యున్నది. అయినను పరమేశ్వరావిద్యలకు గలసంబంధ మట్టిదియే యనిన నిర్గుణశ్రుతులకు విరోధము వచ్చును. నిర్గుణసగుణశ్రుతులు రెండును సమానములుగానే యున్నను నిర్గుణశ్రుతులనే ప్రధానములనుగాఁ గైకొనవలయును. అప్పుడు సగుణశ్రుతులు చిత్తశుద్ధిసాధనకర్మోపాసనాదిపరములుగా సమన్వయింపఁబడుటకు శక్యములై యుండును. వానినే (ఆసగుణశ్రుతులనే) ప్రధానములనుగాఁ గైకొనిన నిర్గుణశ్రుతులకు గతియే యుండదు. ఈకారణమువలన నిర్గుణశ్రుతులు ప్రధానములు. వానికి బాధ వచ్చుటచేఁ బరమేశ్వరావిద్యలకు నాధారాధేయభావసంబంధము నంగీకరింపఁగూడదు. అట్లంగీకరించిన వచ్చుదోషమును నీవే చెప్పియుంటివి కదా!

మఱియు నీయవిద్య బ్రహ్మమును తనకు విషయమునుగాఁ జేసికొనును. తాను అచేతనరూపిణి యగుటచే నాబ్రహ్మముచేతనే ప్రేరేపింపఁబడును. తనప్రభావముచేఁ (అనఁగా: తనకుఁ గలమోహనశక్తిచే) దనకు నాధారభూతులై యున్నజీవులను భ్రమింపఁజేయును. ఆబ్రహ్మమునే ప్రపంచరూపముతోఁ దోఁచునట్లు చేయును. అది జీవులయందు మాత్ర మాధారాధేయభావసంబంధముతోనే యున్నది. ఇదియే సృష్టిక్రమము. ఇచ్చట అవిద్య లేక స్వతంత్రబ్రహ్మ మేమియుఁ జేయఁజాలదు. కావున "అవిద్యయే పరమేశ్వరశక్తి" అని చెప్పఁబడినది. పరబ్రహ్మప్రేరణము లేక యవిద్య యేమియుఁ జేయఁజాలదు. కావున "అవిద్య పరమేశ్వరు నాశ్రయించి యున్నది" యని చెప్పఁబడియున్నది. కావున నవిద్యాపరమేశ్వరులకు నాధారాధేయభావసంబంధ మెట్లు చూచినను ఉండ నక్కఱలేదు. అగ్నియందుఁ గలదాహశక్తివలెఁ బరమేశ్వరునియం దిది యుండలే దని పైనిరూపణవలన స్పష్టమైనది కదా!

---

* ఇట్లు ఒకదానికి మఱియొక్కటి విషయ మగుటయు దానికి మొట్టమొదటిది విషయి యగుటయు...

ఇదియునుఁగాక "ఇది శక్తియా? కాదా?" అని విచారింపవలసి నప్పుడు "దీనియందు శక్తిలక్షణము లున్నవా? లేవా?" అని మాత్రమే విచారించుట యావశ్యక మగును. ప్రకృతమునందును అట్లు విచారించిన నవిద్యకు శక్తిత్వ మేర్పడుచున్నది. శక్తి యనఁగా: తా నాశ్రయించియున్నపదార్థముచే నొకకార్యమును చేయింపగలుగునది. ఈయవిద్యకూడ నట్టిదియే; ఇది తా నాశ్రయించి యున్నపరమేశ్వరునిచేఁ బ్రపంచసృష్టిని చేయించుచున్నది. దీనివలననే కదా పరమేశ్వరుఁడు సృష్టికర్త యయ్యెను. ఈవిధముగా శక్తిలక్షణము కుదిరియుండ నిఁక సంబంధ మేది యైన నేమి? అన్నిపదార్థములు నొక్కతీరుననే యుండవలయు ననుట నియమమా? మఱియొకవిధముగాఁ జూచిన నిది శూన్యరూపిణి. మామతమునందు బ్రహ్మభిన్నము లగుపదార్థము లన్నియు నూఱక తోఁచునవియే కాని సత్యములు కావు కదా! ఈపక్షము నాశ్రయించిన సర్వసంబంధములును శూన్యములే యగును.

"ఇట్లయిన నాధారాధేయభావసంబంధమునే యేల యంగీకరింపరాదు?" అనియెదవేమొ దానివలన నీవాదమునకుఁ బ్రయోజన మేమి? పరబ్రహ్మముయొక్క నిర్గుణత్వమునను నప్పుడును హాని రాదు కదా! మఱియు సంసారులకు బోధించునప్పుడు ఆధారాధేయభావసంబంధము నంగీకరించి చెప్పుటకంటె విషయవిషయీభావసంబంధము నంగీకరించి చెప్పిన సుబోధముగ నుండును. ఆధారాధేయభావసంబంధము నంగీకరించినచో, పరమాత్మస్వరూపమును బొత్తిగనే యెఱుంగని యాయజ్ఞానులకు మఱింత భ్రాంతిని కలిగించినవారల మగుదుము. అప్పుడు వారికి "సర్వప్రపంచమునకు నాధార మగువాఁడు నిర్గుణుఁడై యుండుట యెట్లు?" అనుసంశయము తోఁచును. దానిని నివారించుటకు పరమేశ్వరునియథార్థరూపమునే విశదముగా వర్ణింపవలసి యుండును. దానిని గ్రహింపుసామర్థ్య మప్పటికి వారికి నుండదు కదా! ఇఁక విషయవిషయీభావసంబంధము నంగీకరించిన నీబాధ కొంతవఱకు తగ్గిపోవును. చూచువానికిని చూడఁబడువానికిని సంసర్గము కొంచెమైన నుండదనుట లోకప్రసిద్ధము; కావున నవిద్యయందుండు దోషములు పరమేశ్వరునకు కలుగవలసిననిర్బంధ ముండదు. సామాన్యజ్ఞానము కలవారికిఁగూడ నట్టి సంశయము తోఁపదు. కావున నప్పుడు

పరమేశ్వరతత్వమును బోధించుట కొంచెము సుకరమై యుండును. ఈ కారణమువలన మేము ఆధారాధేయభావసంబంధము నంగీకరింపలేదు.

"ఇప్పటికిని ఈదోషము తొలఁగిపోలేదు. ఎప్పటికైనను మీరు ఆధారాధేయ భావసంబంధమునే యంగీకరింపవలయును. లోకమున భ్రాంతులు కూడ సమానపదార్థముల నాశ్రయించియే కలుగుచున్నవి. ఎవ్వఁడైనను త్రాటిని జూచినప్పుడే సర్పమని భ్రాంతి నొందుచున్నాఁడు గాని నిలువుఁగ నున్న స్తంభమును జూచి యట్టి భ్రాంతినిఁ జెందుటలేదు. కావున నాత్రాటియందు సర్పావయవములవంటి యవయవములు కలిగి యుండవలయును. ఆయవయవములకును త్రాటికిని ఆధారాధేయభావ సంబంధమే. సర్పభ్రాంతికి నాయవయవములే కదా కారణము! ఇట్లే ప్రపంచభ్రాంతికిఁ గారణము సూక్ష్మావస్థ యగునవిద్య; అది పరమేశ్వరు నాశ్రయించి యున్నది. ఇట్లగుటచేఁ ద్రాటికిని అవయవములకును ఆధారాధేయభావసంబంధ మున్నట్లు పరబ్రహ్మావిద్యలకుఁ గూడ నుండవలయు" ననియెదవేమొ వినుము:—

నీవు "త్రాటియందు పాముయొక్క యవయవములే కలవు" అనియెదవా? లేక "సర్పావయవములవంటియవయవములు కలవు" అనియెదవా? ఇందు మొదటిపక్షము నాశ్రయించిన నప్పుడుకలుగు సర్పజ్ఞానము భ్రాంతియే కానేరదు. అవయవములను జూచి యవయవిని గ్రహించుట భ్రాంతి యగునా? అప్పుడు ఈసిద్ధాంతము లోకానుభవ విరుద్ధము. లోకమున నెందును త్రాటిని సర్పమునుగా గ్రహించుట యథార్థజ్ఞాన మనుట లేదు కదా!

ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు సాదృశ్యముచే త్రాటియం దున్నయవయవములయందే సర్పావయవభ్రాంతి కలుగవచ్చును. దానివలన రజ్జుసర్పభ్రాంతి జనింపవచ్చును. ఇంతమాత్రమునకు నాధారాధేయభావసంబంధకల్పన యధికముగఁ జేయనేటికి? కావున నెట్లు చూచినను అవయవము లుండిననే కాని ఆధారాధేయ భావసంబంధ ముండిననే కాని భ్రాంతి కలుగఁగూడదను నియమము లేదు. భ్రాంతికలుగుటకు మొట్టమొదట నవయవము లుండవలసినపని కూడ లేదు. దేనియందైనను ఏవిధముగానైనను భ్రాంతికలుగవచ్చును. నేత్రరోగము కలవాఁడు చంద్రుని రెండుబింబములుగాఁ జూచును.

ఇచ్చట వాస్తవచంద్రునియందు ఎన్వనియవయవము లుండి ఎట్టి భ్రాంతి కలిగినది ? మఱియొకవిధ మగురోగమున స్థావరములగు వృక్షాదులు తిరుగుచున్నట్లు గానఁబడును. ఇచ్చట నావృక్షాదులలో నేజంగమావయవములున్నవి ? కావున భ్రాంతి కలుగుటకు మొట్టమొదట నవయవములతోనే పని లేదు ; ఇఁక నాధారాధేయభావముతోఁ బని యేమి ?

మఱియు ప్రస్తుతావిద్య అవయవస్థానములోఁ జేరదు. "ప్రపంచమంతయు నజ్ఞానమాత్రము" అని నిరూపించుటకై మాత్రమే "ప్రపంచసూక్ష్మావస్థ యవిద్య" యని చెప్పఁబడి యున్నది; కాని, "ప్రపంచము సృష్టికిఁ బూర్వమున నతిసూక్ష్మాకారము లగుస్థావరజంగమాదులతోఁ గూడి యున్నది. అదియే యవిద్యాశబ్దముచేఁ జెప్పఁబడును" అని నిరూపించుటకుఁ గాదు. అట్లయిన ననేకావయవములతో గూడిన యాస్థితికిని అజ్ఞానమునకును ఐక్య మెట్లు కలుగును ? అజ్ఞానము గుణరూప మైనది కదా ! కావున నీయవిద్య కేవలము భ్రాంతిజ్ఞానమే. ఇది ప్రపంచమునకుఁ బరిణామోపాదానకారణ మని యిదివఱకే చెప్పియున్నాము. ఒకదానియవయవములను జూచి సాదృశ్యముచే మఱియొకదానియవయవములనుగా భ్రాంతి నొందవచ్చును గాని, ఆపదార్థమే మఱియొకవిధముగాఁ బరిణమించినప్పుడు అచ్చట భ్రాంతికి యవకాశము లేదు కదా ! పాలు పెరుగుగా మాఱినపిదప నాపెరుగును చూచి "ఇది పెరుగు" అనినచో నావాక్యము అసత్యవాక్య మనుట లోకమున నెందైనఁ గలదా ? కావున సూక్ష్మావస్థారూపిణి యగునవిద్యను జూచి "ఇది ప్రపంచము" అని కలిగినజ్ఞానము భ్రాంతి కానేరదు. అట్లయిననే కదా అవయవస్థానమునందు అవిద్యను జేర్చుటవలన మీకుఁ బ్రయోజన ముండును ! బ్రహ్మావిద్యలకు నాధారాధేయభావసంబంధము వచ్చును; కావున నెట్లు చూచినను బ్రహ్మావిద్యలకు నాధారాధేయభావసంబంధము లేదు.

౫. ఈవిధముగ మాసిద్ధాంతము నిర్దోషమైనది ఇఁక శ్రుతియందుఁ బ్రయోగింపఁబడిన యేకవచనము ఒకపక్షమున (*ఏకజీవపక్షమున)

* "ఉన్నది యొకజీవుఁడే వాఁడు భ్రాంతివలనఁ బరమేశ్వరునియందు తనయట్టివారి ననేకులఁ జూచుచున్నాఁడు" అనుపక్ష మేకజీవపక్షము.

* ఔపాధికభేదపరిత్యాగాభిప్రాయము కావచ్చును; రెండవపక్షమున జాతిపరము కావచ్చును. దీనివలన మామతమునకు వచ్చువిరోధము సుంతైనను లేదు.

౬. మఱియు జీవునికంటె నవిద్య శ్రేష్ఠ మగుటలో సంశయము లేదు. ఆతఁడు అవిద్యకు లోబడినవాఁడు కదా! ఆతఁడు చేతనుఁడే యైనను అచేతనునివలె ప్రపంచమాత్రుఁడై యున్నాఁడు కదా! కావున నవిద్య యాతనికంటె శ్రేష్ఠమే. అవిద్యాసంబంధము లేకుండిన నాతఁడు బ్రహ్మమే కదా! మఱియు వారిసంబంధ మనాది యగుటచే "జీవుఁ డవిద్యకు నధీనుఁడు" అని చెప్పుటవలన లోప ముండదు. శ్రుత్యనుసారముగ నెట్లయిననుఁ జెప్పవచ్చునని సోదాహరణముగ నిదివఱకే నిరూపించి యున్నాము.

కావున మామతమున దోష మింతయును లేదు. ఇవియన్నియు మీమతమునందే కలవు. ప్రధానము స్వతంత్రమనియు నదియే ప్రపంచ రూపముగఁ బరిణమించుననియుఁ జెప్పుచున్నారు. కావున మీకే యీశ్వరునితోఁ బని లేదు. కలదనిన మామతమునకే వచ్చినవార లగుదురు. సర్వనియామకుఁ డగునీశ్వరుఁ డుండఁ బ్రధానము స్వతంత్రము కావలసినపని లేదు; అట్లగుటకును వీలు లేదు. అదియే స్వతంత్రించి పరిణమించునేని ఈశ్వరప్రేరణ మెందులకు? నిరీశ్వరసాంఖ్యమతము నవలంబించి "ఈశ్వరుఁడే లేఁడు" అనినను దోషము తప్పదు. ప్రపంచ మునఁ జేతనులై కానవచ్చుచున్నజీవులు ప్రధానమునకంటె భిన్నులా?

---

* ఔపాధికభేదపరిత్యాగాభిప్రాయము = ఉపాధులవలన కలిగినభేదమును విడచి చూడవలయు ననునభిప్రాయము కలది (అనఁగా: నట్టియభిప్రాయముతోఁ బ్రయోగింపఁ బడినది). ఏకజీవపక్షమునఁ బ్రపంచమునఁ గానవచ్చుజీవు లెవ్వరికి వా రొక్కఁడే యగుటచే నుపాధిభేద మంగీకరింపఁబడవలసివచ్చును. ప్రతిజీవునియందును "ఈతఁడు యథార్థభూతుఁడు. ఈతఁడు యథార్థభూతుఁడు" అనువ్యవహారము కలుగును. అప్పుడు వారియందు వ్యవహరింపఁబడు యథార్థకల్పితభేదము అవిద్యోపాధివలనఁ గలిగినదియే కదా! ఆపక్షమున "జీవుఁడును అవిద్యయు నొక్కటియే" యని మాత్రమే కదా సిద్ధాంతము! కావున పైనఁ జూపినయౌపాధికభేదమును విడిచి సిద్ధాంతము నాశ్రయింపవలయు ననునభిప్రాయముతో శ్రుతియం దేకవచనము ప్రయోగింపఁబడియున్నది; అవిద్య యొక్కటియే యని చెప్పఁబడియున్నది.

కారా ? ప్రధానము జడము కావునను మీామతమునందును ప్రధాన జ్ఞానమువలన ముక్తి చెప్పఁబడియుండుటచేతను, ఒకపదార్థమును తెలిసికొనవలయు ననిన తెలిసికొనువాఁడు ఆపదార్థమునకంటె భిన్నుఁడై యే యుండవలసివచ్చుట నియమ మగుటచేతను జీవులు ప్రధానాభిన్నులు కానేరరు. ఇఁక భిన్నులైనవారిసముదాయమే మామతమున శుద్ధ చైతన్య మగుపరమేశ్వరుఁడు. కావున మీారును పరమేశ్వరు నిష్టము లేకున్నను అంగీకరించియే తీరవలయును. సేశ్వరసాంఖ్యులమతమునం దన్ననో చేతనస్వరూపు లగుజీవేశ్వరులకు పరస్పరభేదము నెట్లు నిరూపింపఁగలరు? మఱియు ప్రధానజీవులకు గలసంబంధము కూడ అవిద్యాజీవులకుఁ గలసంబంధమువంటి దే. కొన్నికొన్నియుక్తులచే నన్యోన్యాశ్రయదోషమును మీారు తొలఁగించుకొనఁ బ్రయత్నించుచున్నారు కాని ఆదోషముమాత్రము పోదు. జీవులు లేకుండిన భోగమోక్షముల ననుభవించువారు లేకుండుటచేఁ బ్రధానమునకు పనిలేదు. అప్పు డది లేదనియే చెప్పవలయును. ప్రధానము లేకున్న భోగమోక్షములే లేకుండుటచే జీవులకు జీవత్వమే కలుగదు. ఇట్లు అన్యోన్యాశ్రయ దోషము మీామతమునందును అవశ్యముగ వచ్చును. దీనిని పోఁగొట్టుకొనుటకై మీారు అనాదిత్వహేతువు నుపయోగించిన నది చెల్లదని యిదివఱకే నిరూపించియున్నాము.

కావున నెట్లుచూచినను మామతమున నించుకయైనను దోషము లేదు. మేము చెప్పునవిద్య పరమేశ్వరాధీన మగుటచే మావాదము ఎప్పటికిని మీావాదముతో నేకీభవింపదు. ప్రస్తుతవిషయవాక్యమున అవ్యక్తశబ్దముచేఁ జెప్పఁబడినది దేహమే కాని మీారు చెప్పుప్రధానము కాదు. విషయవాక్యమున నింద్రియాదులుకూడ ప్రశంసింపఁబడియున్నను దేహముమాత్రమే కారణవాచకపదముతో జెప్పఁబడెను. ఎట్లు చెప్పినను విరోధము లే దని పైసూత్రమునందే (రెండవ సూత్రమునందే) నిరూపించియున్నాము. రూపకాలంకారవాక్యమున దేహముమాత్రమే మిగిలి యుండెను; ఇచ్చట అవ్యక్తపదముమాత్రమే మిగిలియుండెను కదా! కావున మాసిద్ధాంతమున లోపము లేదు.

విశేషాంశము :—ఇచ్చట రెండు మూఁడు సూత్రములకు మఱి కొందఱు మఱియొకవిధముగ నర్థము చెప్పుదురు.

"సూక్ష్మం తు తదర్హత్వాత్ ౧. ౪. ౨." అనుసూత్రము సూక్ష్మ శరీరమును గూర్చి చెప్పుచున్నది. స్థూల మనియు సూక్ష్మ మనియు దేహములు రెండువిధములు. అవి రెండును రూపకవాక్యమున రథముగా వర్ణింపఁబడియున్నవి. అయినను సూక్ష్మశరీరము వ్యక్తము కాకపోవుటచే నవ్యక్తశబ్దముచేఁ జెప్పఁదగియుండును కావున ప్రస్తుతవిషయవాక్యమున నట్లు చెప్పఁబడినది.

"తదధీనత్వా దర్థవత్ ౧. ౪. 3." అనుసూత్రముకూడ సూక్ష్మ శరీరవిషయ మైనదియే. బంధమోక్షాదివ్యవహారములు ఆసూక్ష్మశరీరమునకు సంబంధించినవియే యగుటచేత నా దేహము జీవునికంటె శ్రేష్ఠము. "ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః" అనుస్థలమున నింద్రియములకంటె శబ్దాదివిషయములు శ్రేష్ఠము లని యెట్లు చెప్పఁబడెను? ఇంద్రియ వ్యాపారము విషయాధీనమై యుండుటచేతనే కదా! ఇట్లే సూక్ష్మ శరీరము కూడ జీవునికంటె శ్రేష్ఠము కావచ్చును కదా!

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఒకచోట సూక్ష్మస్థూలశరీరములు రెండును వర్ణింపఁబడియుండ దానికి సంబంధించిన మఱియొకచోట నొక్కసూక్ష్మశరీరముమాత్రమే వర్ణింపఁబడె ననుట యొప్పదు. పూర్వవాక్యమునందు గమ్యస్థానముగ చెప్పఁబడిన మోక్షముయొక్క స్వరూపమును గూర్చి ప్రశ్న రాఁగా దానికి సమాధానముగ నుత్తర వాక్య మారంభ మైనది. అందును పూర్వవాక్యమునందలి విషయములన్నియును వేర్కొనఁబడినపిదప శరీరావ్యక్తశబ్దములుమాత్రమే మిగిలియుండెను. ఇట్లుండ నవ్యక్తశబ్దముచే కేవలసూక్ష్మశరీరము మాత్రమే చెప్పఁబడె ననుట యెట్లు?

"కేవలము శ్రుతి నాశ్రయించిమాత్రమే యర్థము చెప్పవలయును. అవ్యక్తశబ్దము స్థూలదేహమును చెప్పదు. ఆదేహము వ్యక్తమైయే యున్నది కదా!" అనిన నదియు యుక్తము కాదు. పూర్వోత్తరవాక్యములు రెండును పరస్పరసంబంధము కలవియైననే కాని యేతాత్పర్యము నైనను ప్రకటింపఁజాలవు. పైన వర్ణించినవిధముగ నీరెండు వాక్యములకును * ఆకాంక్ష కలదు. ఇట్లుండ నొకదానియందు చెప్పఁ

---

* ఆకాంక్ష యనఁగా: పదములకు పదములతోఁ గలసంబంధము.. కొఱఁత యున్న దాని నపేక్షించుట. "[illegible]" అనిన [illegible] [illegible] గూర్చియు

బడినవిషయ మొక్కటియు మఱియొకదానియందుఁ జెప్పఁబడినది మఱి యొక్కటియు నైన నీరెంటికిని సంబంధ మెట్లు కుదురును ?

"ఇట్లు కాదు. స్థూలశరీరము ప్రత్యక్షముగ గానవచ్చునది యగుటచే దానిని వదలి విచారార్హమగుసూక్ష్మశరీరమునే శ్రుతి చెప్పి యుండ కూడదా !" అనియెదవేమొ. దానికి తగిన గుఱుతు లెవ్వియు నిందుఁ గానరాలేదు. ఇంద్రియాదులనుగూర్చి విచారింపవలయు నని యిందొక్కింతయైనను చెప్పఁబడి యుండలేదు.

"పరమేశ్వరసాక్షాత్కారము చెప్పఁబడియుండుటచేతను అది యింద్రియాదుల విమర్శమువలనఁ గాని కలుగునది కాకపోవుటచేతను, ప్రస్తుతవిషయవాక్యమునందు చెప్పఁబడినది ఇంద్రియాదులవిమర్శయే" అనియెదవేమొ. సరియే నీపక్షముకూడ సిద్ధాంతమే యగును గాక! ఎట్లయినను అవ్యక్తశబ్దార్థము ప్రధానము కాదుకదా! మాసిద్ధాంతము నవలంబించినను మాకు రాఁబోవు హాని యేమియు లేదు.

## అ ౧. పా ౪. సూ ౪. ఆరంభము.

అవతారిక:—శ్రుతియందుఁ బ్రధానము చెప్పఁబడియుండలేదనువిషయమున మఱియొక హేతువును జెప్పుచున్నాఁడు.

## ౧౧౦. జ్ఞేయత్వావచనాచ్చ. ౧. ౪. ౪.

తాత్పర్యము:—మఱియు సాంఖ్యులు ప్రధానమును జ్ఞేయమునుగాఁ జెప్పుచున్నారు. ప్రధానమును తెలిసికొనకపోయిన పురుషుని యథార్థతత్త్వము గోచరము కాదు. కావున ప్రధానజ్ఞానముకూడ నావశ్యక మనుచున్నారు. మఱియు ప్రధానస్వరూపమును గుఱుతెఱింగిన నణిమాదిసిద్ధులు కలుగు ననుచున్నారు.

ప్రస్తుతవిషయవాక్యమునందన్నన్నో అవ్యక్తము జ్ఞేయముగఁ జెప్పఁబడియుండలేదు. "సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం

---

విడిచి వచ్చినస్థలమును గూర్చి నుం నేమి నుఁ జెప్పఁబడలేదు. కావున నావాక్యమున నీ విషయములు రెండును కొఱతే. ఇప్పుడు ఆవాక్యమునకును ఈవిషయమునకును అపేక్షయనుసంబంధము కలదు. ఆవాక్యము తనయర్థమును ముగించుటకై యీవిషయములఁ గోరుచున్నది కదా ! ఇదియే యాకాంక్ష.

పదం" అని యుద్దేశింపఁబడిన పరపురుషుఁడే. "పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" అను నీవాక్యముచే జ్ఞేయుండుగాఁ జెప్పఁ బడెను. ఈవిషయవాక్యమునందు అవ్యక్తపద మొక్కటియే కలదు; కాని, ఆయవ్యక్తము నెఱుంగవలయు నని కాని యుపాసింపవలయు నని కాని లేదు కదా! కావున నిందలి యవ్యక్తశబ్దముచే సాంఖ్యకల్పిత ప్రధానము నిస్సంశయముగఁ జెప్పఁబడ లేదు.

## అ ౧. పా ౪. సూ ౫. ఆరంభము.

పూర్వపక్షము:—ఈహేతువు సరియైనది కాదు. శ్రుతియందును అవ్యక్తశబ్దముచేఁ బ్రధానమే చెప్పఁబడి యున్నది. ఉత్తరవాక్యమునందు అవ్యక్తశబ్దనిర్దిష్ట మగుపదార్థము జ్ఞేయముగఁ గూడఁ జెప్పఁబడియున్నది. "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథా ఽరసం నిత్య మగంధవ చ్చ యత్ అనా ద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే" "ఏపదార్థము శబ్దస్పర్శరూపరసగంధములు లేనిదై ఆద్యంతశూన్యమై నిత్యమై యున్నదో అట్టిదానిని మహత్తునకంటె పరమగుదానిని వెదకి తెలిసికొనిన మరణరూప మగు సంసారమునుండి ముక్తుఁడగును." అనువాక్య మీవిషయమునఁ బ్రమాణము. ప్రధానమనునది ప్రపంచసూక్ష్మావస్థ కావున నందు శబ్దస్పర్శాదులభివ్యక్తములుగా లేవని మేము చెప్పుచున్నాము. పరిణమించిన పిదపనే కాని యవి రా వనుచున్నాము. ఈవాక్యమునందును ఇట్లే చెప్పఁబడియున్నది. మేము ఆప్రధానమునకు నాద్యంతములు లేవనియు అది నిత్యమనియుఁ జెప్పుచున్నాము. ఈవాక్యమునందును అట్లే చెప్పఁబడియున్నది. మేము ఆప్రధానమును మహత్తత్త్వమునకంటె శ్రేష్ఠమునుగాఁ జెప్పుచున్నాము. ఈవాక్యమునందుఁ గూడ నట్లే చెప్పఁబడి యున్నది. "మహతః పరం" అనుదానికి నిదియే యర్థము కావచ్చును కదా! కావున విషయవాక్యమున "మహతః పర మవ్యక్తం" అనుస్థలమున నవ్యక్తశబ్దముచేఁ జెప్పఁబడినది ప్రధానమే యనుటలో సంశయము లేదు.

అవతారిక:—అనినఁ గ్రిందిసూత్రముచే నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౧౧౧. వద తీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్. ౧. ౪. ౫.

తాత్పర్యము:—శ్రుతియందు అవ్యక్తశబ్దనిర్దిష్ట మగుపదార్థము జ్ఞేయముగా వర్ణింపంబడె ననుట చెల్లదు. ఇచ్చట పరమేశ్వరుఁడే వర్ణింపఁబడె ననవలయును. మహచ్ఛబ్దమునకు జీవుఁ డర్థము కావునను, పరమేశ్వరుఁ డాతనికంటెఁ బరుఁడనుట నిస్సంశయ మగుటచేతను, "మహతః పరం" అను నుదాహృతవాక్యభాగముచే "అశబ్దం" అనువాక్యము యొక్క భాగముచే) పరమేశ్వరుఁడే చెప్పఁబడె నని నిర్ణయింపవలసి యున్నది. మహచ్ఛబ్దమునకు బుద్ధియే యర్థ మైనను పరమేశ్వరుఁడు దానికంటె పరుఁడు కాకపోఁడు. మఱియు వేదాంతవాక్యములయందు శబ్దస్పర్శాదిసంబంధరాహిత్యము పరమేశ్వరునకే చెప్పఁబడియుండుట చేత నింతమాత్రమువలన నది ప్రధానము కా నక్కఱ లేదు. అవ్యక్త శబ్దనిర్దిష్ట మగుపదార్థ మిచ్చట పరామర్శింపఁబడియే యుండ నక్కఱ లేదు. అది "పురుషా న్న పరం కించిత్." అని పరమాత్మరూపమును ప్రకటించుటకై యే కదా విషయవాక్యమునం దైనను ప్రశంసింపఁబడి యుండుట!

మఱియు నీకఠోపనిషత్తునందు పరబ్రహ్మమునుగూర్చియే యన్ని స్థలములయందును చెప్పఁబడియున్నది. "పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" "త ద్విష్ణోః పరమం పదం" అనుమొదలగు వాక్యములయం దీవిషయము స్పష్ట మై యున్నది. ఈవిధముగ పరమేశ్వరరూపమునుగూర్చి చెప్పి "ఏష సర్వేషు భూతేషు గూఢో౽౽త్మా న ప్రకాశతే" "ఈయాత్మ సర్వభూతములయందును దాఁగియుండుటచే స్పష్టముగఁ బ్రకాశింపఁడు" అని యాయనను దెలిసికొనుట యసాధ్య మనువిషయమును దెలిపి "యచ్ఛే ద్వా జ్మనసి ప్రాజ్ఞః" "బుద్ధిమంతుఁ డగువాఁడు వాక్కును మనస్సునందుఁ జేర్పవలయును (వాగింద్రియ వ్యాపారముల మనోనిగ్రహముచే జయింపవలయు ననుట)" అని తజ్జ్ఞానమునకై యోగమును వివరించి, "నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే" అని తజ్జ్ఞానమువలనఁ గలుగుఫలము చెప్పఁబడియున్నది.

ఇట్లు ప్రకరణమంతయు బ్రహ్మపరమై యుండ నడుమ ప్రధాన మేల చెప్పఁబడియుండవలయును ? అట్లు చెప్పఁబడియుండుట యెట్లు సంభవించును ? సాంఖ్యమతమునం దైనను కేవల ప్రధానజ్ఞానమువలన మోక్షము లేదు కదా! కావున నెట్లు చూచినను "అశబ్దం" అను మొదలగు వాక్యములయందు ప్రధానప్రస్తావమే లేదు. ప్రధానము అవ్యక్తశబ్దముచే నిర్దేశింపఁబడె ననుటకును వీలు లేదు. ఇచ్చట నది జ్ఞేయముగఁ జెప్పఁబడె ననుటయు సంభవింపనేరదు.

## అ ౧. పా ౪. సూ ౬. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమును (ప్రధానము జ్ఞేయముగఁ జెప్పఁబడి యుండలే దనువిషయమును) నిరూపించుటకై మఱియొక హేతువును జూపుచున్నాఁడు.

## ౧౧౨. త్రయాణా మేవ చైవ ముపన్యాసః ప్రశ్న శ్చ. ౧. ౪. ౬.

తాత్పర్యము:—మఱియు నీకఠోపనిషత్తునందు "స త్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో ప్రబ్రూహి తం శ్రద్ధధానాయ మహ్యం" "ఓయమధర్మరాజా నీవు స్వర్గలోకమును కలిగింపఁగలుగునగ్నిని తెలిసికొనియున్నావు. శ్రద్ధాయుక్తుఁడ నగునాకు దాని నుపదేశింపుము" అని యగ్నియు "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీ త్యేకే నాయ మస్తీతి చైకే" "మనుష్యుఁడు మృతి జెందినపిదప వానినిఁగూర్చి సంశయము మెండుగఁ గలదు. అప్పుడు జీవుఁడు కలఁడని కొందఱును, లేఁడని కొందఱును చెప్పుచున్నారు" అని జీవుఁడును "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" "ధర్మాధర్మములకు నతీతుఁ డై యెవ్వఁ డున్నాఁడో" అని పరబ్రహ్మంబును, ఈమువ్వురును ప్రశ్నింపఁబడియున్నారు. వానికి నుత్తరములును చెప్పఁబడియున్నవి. "లోకాది మగ్నిం" "లోకమునకు మొదటివాఁ డైనయగ్ని నుపదేశించెను" అను మొదలగువాక్యములచే నగ్నిప్రశ్నమునకు నుత్తరము వర్ణింపఁబడియున్నది. "యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ, యోని మన్యే ప్రపద్యంతే శరీర

త్వాయ దేహినః" "ఈజీవుఁడు మృతిఁజెందినపిదప నేవిధముగ నుండు నదియుఁ దెల్పెదను.కొందఱు జీవులు మఱల దేహధారులగుటకై కర్మానురూప మగుయోనినిఁ బ్రవేశింతురు" అనుమొదలగువాక్యములచే బ్రహ్మస్వరూపనిరూపణానంతరమున మరణవిషయము తెలుపఁబడి యున్నది;జీవవిషయ మగునుత్తర మొసంగఁబడి యున్నది. ఇఁక పరబ్రహ్మవిషయమగునుత్తరమన్ననో సమగ్రముగనే కలదు. ప్రథమవల్లియు ద్వితీయాధ్యాయమునందలి పంచమవల్లిలోని కొన్నివాక్యములను దప్పఁ దక్కినగ్రంథమంతయు బ్రహ్మస్వరూపనిరూపణమునే కావించుచున్నది. దర్కిఁది. ఇట్లుండ నట్టనడుమ ప్రధానమునుగూర్చి యీయుపనిషత్తు చెప్పు ననుట యెట్లు? దానిని గూర్చినప్రశ్నయే లేదు కదా! కావున నిస్సంశయముగ నీయుపనిషత్తునందు ప్రధానప్రస్తానమే లేదు.

పూర్వపక్షము:—ఇచ్చట "యేయం ప్రేతే" అనువాక్యముచేఁ జేయఁబడినజీవవిషయప్రశ్నయు. "అన్యత్ర ధర్మాత్" అనువాక్యముచేఁ జేయఁబడిన పరమేశ్వరవిషయకప్రశ్నయు నొక్కటియా?, లేక, రెండా? "యేయం ప్రేతే" అనువాక్యమునఁ బ్రశ్నింపఁబడినవాఁడు జీవుఁడు; ధర్మాధర్మగోచరుఁడు. "అన్యత్ర ధర్మాత్" అనువాక్యమునఁ బ్రశ్నింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడు; ధర్మాధర్మాదులకు నతీతుఁడు. మఱియు జీవవిషయప్రశ్నము ఆజీవునికలిమిలేములను గూర్చినదియై యున్నది; రెండవప్రశ్న ధర్మాధర్మాద్యతిక్రమవిషయమై యున్నది. ఇట్లుండ నీ రెండుప్రశ్నములు నొక్కటి యెట్లగును? "అదియే యిది"యని గుఱుతించుటకు సాధన మేదియును లేదు కదా! కావున నీరెండుప్రశ్నములును ప్రత్యేకములే కావలయును. "ఈరెండును ఒక్కటియే" అని పట్టుఁ బట్టిన నప్పుడు, అగ్నివిషయప్రశ్న యొక్కటియు నాత్మవిషయప్రశ్న యొక్కటియు నని ప్రశ్నములు రెండుమాత్రమే యేర్పడుచుండుటచే "త్రయాణాం" అనుసూత్రావయవము నిరర్థక మగును; అప్రమాణ మగును. ఇట్లు కాక "ఆప్రశ్నములు ప్రత్యేకములే" యనినచో నప్పుడు మఱియొకవిరోధము వచ్చును. యమధర్మరాజు నాచికేతునకు నిచ్చెద నని చెప్పినవి * మూఁడువరములే. ఇట్లు చెప్పిన నాల్గవప్రశ్నయొకటి యధికముగ వచ్చుటచేఁ బూర్వోత్తరవిరోధము వచ్చును.

* నాచికేతువివరములు (పు. ౧౧౪. చూడుఁ.)

యముఁడు మూఁడువరము లిచ్చిన నాచికేతుఁడు నాల్గుప్రశ్నముల నెట్లు చేయఁగలఁడు ? ఏదియైన నొకకారణమును జూపి "ఈనాల్గవప్రశ్నమును కల్పించుటవలన దోషము లేదు" అనియెదవేని యప్పుడు "ప్రశ్న లేకయే యముఁడు ప్రధానమునుగూర్చి చెప్పెను" అనినమాత్రము దోష మేమి రాఁగలదు? ఈకారణమువలన నీయుపనిషత్తునందు ఎట్లును ప్రధానము వర్ణింపఁబడియే యున్నది.

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. మామతమున నీవు చెప్పుదోషము లెవ్వియును రావు. యముఁడు నాచికేతునకు నిచ్చెద నని చెప్పినవియు నిచ్చినవియు కూడ మూఁడువరములే; నాచికేతుఁడు ప్రశ్నించినవియును మూఁడుప్రశ్నలే. జీవబ్రహ్మవిషయము లని చెప్పఁబడినప్రశ్నములు రెండును పరస్పరభిన్నములు కావు. "తత్త్వ మసి" అనుమొదలగు ననేకశ్రుతులచే జీవబ్రహ్మాభేదము వర్ణింపఁబడియున్నది. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా మేవ పశ్యతి" "ఎవ్వఁడు ఈప్రపంచమును భేదయుక్తముగఁ జూచునో వాఁడు మరణమునుండి మరణము నొందుచుండును. (అనఁగా: పలుమాఱు సంసారమున మునుఁగుచుండు ననుట)" అనుమొదలగువాక్యములచే జీవబ్రహ్మభేదదర్శనము నిందింపఁబడియున్నది. ఇంత యేల? ప్రస్తుతోపనిషత్తునందునునాచికేతుఁడు మూఁడవప్రశ్నమును చేసినపిదప యముఁడు అనేకభోగములను చూపి వాని చిత్తస్థైర్యమును బరీక్షించెను. ఆతఁడు వానియం దభిలాష లేకుండుట నెఱింగి మిగుల సంతసించి బహువిధముల యముఁడు వానిని స్తోత్రము చేసెను. వానిప్రశ్నమును గూర్చియు ప్రశంస యొనర్చెను. "తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం .... దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి" "ఇంద్రియములకు నగోచరుఁడును మాయచే నావరింపఁబడినవాఁడును సర్వశరీరములయందును ప్రవేశించి యున్నవాఁడును .... స్వప్రకాశస్వరూపుని తెలిసికొని విద్వాంసుఁడు హర్ష శోకముల విడుచును" అని వానిచేఁ బ్రశ్నింపఁబడినపదార్థమును నుతించెను. "ఇట్టిదానిని తెలిసికొనఁగోరితివి. కావున నీవు కృతార్థుఁడవు" అని యనేకవిధముల మరలమరల సంతోషాతిశయముచే ప్రశంస యొనర్చెను. ఇచ్చట "తం దుర్దర్శం" అనుమొదలగువాక్యమునందు వర్ణింపఁబడినవి పరమేశ్వరలక్షణములు; ప్రశ్నింపఁబడినవాఁడు జీవుఁడు.

ఈయుపనిషత్తునకు జీవబ్రహ్మైక్యమునందు తాత్పర్యము లేకుండునేని యిది యెట్లు సంభవించును ? సంభవింపకున్న ప్రశ్నయొక్కటియు ప్రశంస మఱియొక దానినిగూర్చియుఁ గానలసివచ్చుటచే శ్రుతికే యప్రామాణ్యము సంభవించును. ప్రకృతము ఈప్రశంస ముగిసినపిదప "అన్యత్ర ధర్మాత్" అనుప్రశ్న యున్నది. నాచికేతుఁడు మొట్టమొదట సామాన్యముగ జీవవిషయమై ప్రశ్న నొనర్చినను, యముఁ డొనర్చిన ప్రశంసను విని మరణవిషయజ్ఞానమునకంటెఁ బూర్వమున నాజీవుని యొక్క విశేషరూపము నెఱుంగఁగోరి యట్లు ప్రశ్నించి యుండవచ్చును. ఇందు విరోధ మేమి? యముఁడు ప్రశంసాకాలమున జీవునకు సంభవింపని ధర్మములఁ బెల్లుగ వర్ణించియుండెను కదా ! మఱియు "అన్యత్ర ధర్మాత్" అనుప్రశ్నమునకు నుత్తర మిచ్చునప్పుడు ఆయముఁడు "నజాయతే మ్రియతే" అని జననమరణముల నిషేధించియున్నాఁడు. ఇది దేనినిగూర్చి చెప్పఁబడినవాక్యముగ నుండును? బ్రహ్మమునకు జననమరణము లే లేవు. లేనివానినే నిషేధించె ననుట విరుద్ధము కదా! కావున నది ఎవ్వనికి పరమార్థముగాఁగాని భ్రాంతివలనఁగాని కలవో వానినిగూర్చియే యీనిషేధము ప్రవర్తింపవలయును. అందును పరమార్థముగ నున్నవి నశించుట యసంభవము. కావున నందు నిషేధము నిరర్థక మగును. అగ్నియం దున్నయుష్ణశక్తి లేదనినంతమాత్రమున పోవునా? అట్లు పోకున్న లేదని ప్రయోజన మేమి? శ్రుతి యట్టి నిరర్థకనిషేధమును చేసెననిన నప్పుడు దానికి నప్రామాణ్యము వచ్చును. కావున నాజననమరణములు వాస్తవస్థితిలో లేకున్నను భ్రాంతివలన నెవ్వనియం దున్నట్లు తోచుచున్నవో అట్టివానినిగూర్చియే యీనిషేధము ప్రవర్తించితీరవలయు. అట్టివాఁడు మాసిద్ధాంతమునందు జీవుఁడు. ఆతనికిని బ్రహ్మమునకును భేదము లేకపోవుటచే వాస్తవస్థితిలో జననమరణములతో నాతనికి సంబంధము లేదు; భ్రాంతివలనమాత్రమే యట్టి సంబంధ మున్నట్లు కానవచ్చుచున్నది కదా! ఇట్లగుటచే "నీ వడిగిన జీవుఁడు వాస్తవస్థితిలోఁ బరమేశ్వరుఁడే. పుట్టువాఁడును మృతిఁజెందు వాఁడును కాఁడు. లోకమునఁ గానవచ్చు జననమరణములు భ్రాంతిసిద్ధములే. ఆజీవుఁడు సర్వకాలములయందు నేకరూపముతోనే యున్నాఁడు. భ్రాంతిసిద్ధ మగు మరణమునవలన నాతనికి నాశము కలదని తలంచుట

పొరపాటు" అని నిరూపించుటకై మాత్రమే యముఁడు జననమరణ నిషేధమును గావించియుండవలయు ననుట సిద్ధాంత మగుచున్నది. కావున జీవబ్రహ్మ లొక్కటియే యగుటచే వారిని గూర్చినప్రశ్నలు నొక్కటియే యగును. ఈకారణమునవలన వరములకంటె నధికముగ నాల్గవప్రశ్నమును కల్పింపవలసినపని లేదు; దానిని పోలికగా బెట్టుకొని "ప్రశ్న లేకయే ప్రధానము వర్ణింపఁబడెను". అనుటయు చెల్లదు. ఇక సూత్రావయవమునుగూర్చి విచారించిన నది జీవబ్రహ్మములకల్పిత భేదము నాశ్రయించి చెప్పుచున్నది యనిన విరోధమేమియు నుండదు. సర్వశాస్త్రములును భేదము నాశ్రయించియే కదా ప్రవర్తింపవలయును. అట్లాశ్రయించుటవలన లోపముకూడ నేమియు రాదు. కావున నెట్లు చూచినను ఈయుపనిషత్తునందు ప్రధానప్రస్తావమే లేదు.

## అ ౧. పా ౪. సూ ౭. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమును మఱియొకదృష్టాంతముచే నిరూపించుచున్నాఁడు.

## ౧౧౩. మహద్వచ్చ. ౧. ౪. ౭.

తాత్పర్యము:—ఇది యంతయును గాక శ్రుతియందు ప్రయోగింపఁబడు నవ్యక్తశబ్దమునకు సాంఖ్యస్మృతియం దున్నయవ్యక్తశబ్దము యొక్కయర్థమునే చెప్పవలయు నను నియమము లేదు. సాంఖ్యస్మృతి యందు గలప్రసిద్ధులకును వేదమునందు గలప్రసిద్ధులకును బహుభేదము కలదు. మహచ్ఛబ్దము సాంఖ్యస్మృతియందు ప్రధానముయొక్క ప్రథమ పరిణామ మగు బుద్ధియందుఁ బ్రయోగింపఁబడియున్నది. శ్రుతియం దన్ననో అది యాత్మయందే బ్రయోగింపఁబడియున్నది. దీని వలెనే అవ్యక్తశబ్దముగూడ సాంఖ్యస్మృతియందు ప్రధానవాచకముగఁ బ్రయోగింపఁబడియున్నను, వేదమునం దట్లు ప్రయోగింపఁబడి యుండదు. కావున నీయుపనిషత్తునందు ప్రధానప్రస్తావమే లేదనుట నిస్సంశయము.

"ఆత్మా మహా న్పరః (౧. ౪. ౧ చూడు). మహాంతం విభు మాత్మానం, వే దాహ మేతం పురుషం మహాంతం" "సర్వవ్యాపకుఁ డును, మహచ్ఛబ్దవాచ్యుఁడును అగునాత్మను మహచ్ఛబ్దవాచ్యుఁ డగు

నాపురుషుని తెలిసికొనినవాఁడు" అనుమొదలగు శ్రుతులయందు మహచ్ఛబ్దము పరమేశ్వరపరముగాఁ బ్రయోగింపఁబడియున్నది.

"ఆత్మా మహాన్' అనుప్రస్తుతవిషయవాక్యమున జెప్పఁబడిన మహచ్ఛబ్దము బుద్ధివాచక మని చెప్పితిరిగదా!" అనియెదవేమొ వినుము. అచ్చట కొన్నిశ్రుతుల నాశ్రయించి "ఈమహచ్ఛబ్దము బుద్ధివాచకము కూడఁ గావచ్చును" అని మాత్రమే చెప్పియున్నాము కాని "బుద్ధివాచకము మాత్రమే యగును." అని చెప్పియుండలేదు. మీ మతము ననుసరించి చూచిన నాశబ్దము బుద్ధిని తప్ప రెండవదానిని బొత్తిగనే చెప్పదు కదా! పైనుదహరింపఁబడియున్న తక్కినశ్రుతులయందున్నవో ఆత్మపురుషశబ్దము లుండుటచేతను అచ్చటిప్రకరణముల ననుసరించియును మహచ్ఛబ్దమునకు బుద్ధి యనునర్థము బొత్తిగనే రాదు.

కావున నెట్లు చూచినను మీస్మృతియం దున్నప్రసిద్ధికిని వేదమునం దున్నదానికిని సంబంధ మింత యైనను లేదు. వేదమునం దున్న పదములకు మీమతము ననుసరించి యర్థము చెప్పుటకే వీలు లేదు. * శ్రుతిలింగాదుల నాశ్రయించిమాత్రమే వాని యర్థమును నిర్ణయింపవలయును. కావున నెట్లు చూచినను మీసిద్ధాంతమునకును శ్రుతిసిద్ధాంతమునకును సంబంధమే లేదు. ఈవిషయవాక్యమునందు అవ్యక్తశబ్దముచేఁ బ్రధానము చెప్పఁబడియుండలేదు.

---

## ౨. చమసాధికరణము.

విషయము:— శ్వేతాశ్వతరోపనిషత్తునందు నాల్గవయధ్యాయమున "అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః, అజో హ్యేకో జుషమాణో ఽను శేతే జహా త్యేనాం భుక్తభోగా మజో ఽన్యః" "తెలుపు, యెఱుపు, నలుపు, అనువర్ణములు కలిగి తనతో సమానము లగుజంతుసమూహముల బుట్టించుచు నొక్కయజ యున్నది. దానిపై మిగుల ననురాగము కలిగి యొకయజుఁడు

---

* శ్రుతిలింగాదులు (పు ౧౦౨. చూడు.)

సేవించుచుండును. మఱియొక్కఁడు దానివలని సుఖముల ననుభవించి విరక్తుఁడై దానిని వదలును" అనువాక్యము కలదు. దానియర్థ మీయధి కరణమున విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున విషయవాక్యమునందు అవ్య క్తశబ్ద మొక్కటిమాత్రమే యుండెను. ఈకారణమువలన ప్రధాన మును గ్రహించుటకు తగినన్నిగుఱుతులు లేకుండెను. మీరును ఇ ట్లగుటచేతనే యచ్చటియవ్యక్తశబ్దము ప్రధానమును చెప్పునది కాదని సిద్ధాంతము చేసితిరి. ప్రస్తుతవిషయవాక్యమును విచారించిన నట్టిసిద్ధాం తమునకు నవకాశము కలుగదు. ఇచ్చట తెలుపు మొదలగువర్ణములు భోగమోక్షముల నొసంగుట మొదలగు ప్రధానవిశేషములు వర్ణింపఁ బడియున్నవి కదా! కావున నిచ్చటియజాశబ్దము ప్రధానవాచకమే" అనుపూర్వపక్షము ప్రత్యుదాహరణసంబంధముతో వచ్చును. ఇదియే దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము.

సందేహము:—ఇచ్చట అజాశబ్దమునకు మేఁకయందు రూఢార్థ మున్నను అది ప్రస్తుతప్రకరణమునకు సంబంధించునది కాకపోవుట యును, యౌగికార్థము స్పష్టము కాకపోవుటయును సంశయకారణ ములు. "అజాశబ్దము ప్రధానవాచకము. ఛాందోగ్యోపనిషత్తు నందు చెప్పఁబడిన తేజోజలపృథ్వీరూపప్రకృతినే యిచ్చటియజాశబ్దము చెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. వీనిఫల ములు పూర్వాధికరణమునందువలెనే యని తెలిసికొననలయును.

పూర్వపక్షము:—ఇచ్చట అజాశబ్దము నియతముగ మాప్రధా నమునే చెప్పననవలయును. మేఁకయందు ఆపదమునకు రూఢి యున్నను దాని నిచ్చట గ్రహించుటకు వీలు లేదు. ఇది పరమాత్మప్రకరణము కదా!

మఱి యేమనిన: యోగమునే యిచ్చట యాశ్రయింపవలయును. అది మాకు ననుకూలముగ నున్నది. మేము మూలప్రకృతిని ఉత్పత్తి వినాశశూన్యఁగాఁ జెప్పుచున్నాము. ఇచ్చట అజాశబ్దముగూడ ఉత్పత్తి రహిత మగుపదార్థమును చెప్పుచు మాసిద్ధాంతము ననువాదము చేయుచున్నది. ఉత్పత్తి లేనిది ... మఱియు

మేము ఆప్రధానము నేకరూప మైనదానిఁగాఁ జెప్పుచున్నాము ; ఇచ్చట కూడ నావిషయమును స్పష్టము చేయుచు నేకపద మున్నది మేము ఆప్రధానమునకు త్రిగుణాకారమును చెప్పుచున్నాము. ఇచ్చట కూడ లోహిత శుక్ల కృష్ణాశబ్దము ఆవిషయము నే స్పష్టము చేయుచున్నది. లోకమున నెఱ్ఱనివర్ణములకు రంజింపఁజేయుట స్వభావము; ఇట్లే రజోగుణమునకుఁగూడ చిత్తమును కామక్రోధాదులచే రంజింపఁజేయుట స్వభావము. లోకమున తెలుపునకు ప్రసన్నత్వము స్వభావము; సత్వగుణమునకును, అదియే స్వభావము. నలుపునకు తేజస్సు నావరించుట స్వభావము ; తమోగుణమునకును అదియే స్వభావము. కావున లోహితశుక్లకృష్ణవర్ణములచే గుణత్రయమేచెప్పఁబడెననవలయును. మీరైనను ప్రపంచసూక్ష్మావస్థారూప మగుచవ్యాకృతమునకు నీవర్ణములు కలవనుటకు వీలు లేదు. దానివలన జనించిన తేజోజలపృథువులకు నీవర్ణము లుండుటచేఁ "గారణపదార్థమునందును ఆవర్ణములు కలవు" అని యౌపచారికముగ నైనను, కార్యకారణాభేదము నంగీకరించి యైనను చెప్పవలయును. మేము చెప్పినదియు నట్లే కదా! మాకును మీకును కొంతభేద మున్నను కల్పనమాత్ర మిరువురకు నావశ్యకమే. ఇఁక సృష్టినిగూర్చి యే మతమునందును విరోధము లేదు. మీరు "సర్వసృష్టియు తేజోజలపృథివీమయము" అనుచున్నారు; మేము "సర్వసృష్టియుఁ ద్రిగుణమయము" అనుచున్నాము. సర్వప్రజలును సుఖదుఃఖమోహమయులై యే యున్నారు కదా! ఎవ్వనిబుద్ధియందు సత్వమభివృద్ధి యగునో వాఁడు సుఖించుచున్నాఁడు. రజస్తమోగుణములభివృద్ధియైనఁ గ్రమముగ దుఃఖమోహముల నొందుచున్నాఁడు. ఈవిషయము మీకును సమ్మతమే.

మఱియు "అజో హ్యేకః" అనుమొదలగు వాక్యభాగముచేఁ బై విషయవాక్యమునందు జీవభేదము వర్ణింపఁబడియున్నది. బుద్ధియందుఁ గలుగుసత్వాదివిజృంభణములఁ దనయందే కలిగినవానినిఁగా నజ్ఞానమువలనఁ దలంచుచుఁ జేతనుఁ డగుజీవుఁడు సంసారసముద్రమున మునిఁగియున్నాఁ డనియు, అది తనది కాదని యెన్నఁ డెఱుంగునో నాఁడు ముక్తుఁ డగుననియు మేము చెప్పుచున్నాము. మామతమున జీవులు అనేకులు; పరమేశ్వరుఁడు నిత్యముక్తుఁడు. ఇచ్చట కూడ నట్లే

చెప్పఁబడియున్నది. కావున నెట్లు చూచినను ఈమంత్రమున సాంఖ్య స్మృతిసిద్ధమగు ప్రధానమే యననేల సాంఖ్యస్మృతిసిద్ధమగువిషయమంత యును నిరూపింపఁబడియున్నది. కావున మామతము కూడ వేదోక్తమే.

అవతారిక :— అనిన నీపూర్వపక్షమును క్రిందిసూత్రముచే ఖండించుచున్నాఁడు.

## ౧౧౪. చమసవ దవిశేషాత్. ౧. ౪. ౮.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. కర్మకాండయందు "అర్వాగ్బిల శ్చమస ఊర్ధ్వబుధ్నః" "పైన కాఁడ గలిగి క్రింద రంధ్రము గలయజ్ఞపాత్ర చమస మనఁబడును" అని యొకపాత్ర వర్ణింపఁబడియు న్నది. ఈపాత్ర యేదియో సిద్ధాంతము చేయుటకు నెట్లును వీలు కలు గదు. ప్రతిపాత్రమునకును కాఁడయు రంధ్రంబు నుండును; దేనియం దైనను ఏదియో యొకవిధముగ పైఁ జెప్పినచమసలక్షణమును సమన్వ యింపవచ్చును కదా! కావున నర్థనిర్ధారణము లేనిలక్షణమువలన విషయ మెట్లు నిర్ణీతము కాకున్నదో, అట్లే యజాశబ్దమువలనఁగూడ విషయనిర్ణయము కాదు. ఈశబ్దమును ఏదియో యొకకల్పనచే నేమత మునం దైనను సమన్వయింపవచ్చును. ఇట్లుండ నీమంత్రమునందు సాంఖ్యమతముమాత్రమే చెప్పఁబడె ననుటకు గుఱు తేమి కలదు? మామత మైనను చెప్పఁబడియుండవచ్చును కదా! మామతమునందును ఈమంత్రముయొక్కయర్థము సరిపడునని మీరే చెప్పియున్నారు కదా! కావున మీమతము ఇంతమాత్రమువలన వేదసమ్మత మనఁ జెల్లదు.

## అ ౧. పా ౪. సూ ౯. ఆరంభము.

అవతారిక:—"ఇదం తచ్ఛిర ఏష హ్యర్వాగ్బిల శ్చమస ఊర్ధ్వ బుధ్నః" "ఇదియే దాని శిరస్సు. ఇదియే పైభాగమున కాఁడ గలిగి క్రింద రంధ్రము కలిగియుండు చమస మనుపాత్రము" అను*వాక్యశేష ముచే నాచమసవాక్యమునందు అర్థనిర్ణయము చేయుటకు నవకాశము కలదు. ఇచ్చట నట్టియవకాశ మేది కలదు ? ఈమంత్రమునకు నెప్పటికి

* వాక్యశేషము (పు. ౨౩౩. చూడు)

నర్థనిర్ణయము లేకుండవలసిన దేనా ? మామత మప్రామాణిక మైన నీామతమైనను సిద్ధాంతము కానక్కఱ లేదా ? ఇచ్చట నజాశబ్దమున కర్థ మేది?''అనిన నీక్రిందిసూత్రముచే సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౧౧౫. జ్యోతిరుపక్రమా త్తు తథా హ్యధీయత ఏకే. ౧. ౪. ౯.

తాత్పర్యము:—ఇచ్చట తేజోజలపృథివీరూప మగునవ్యాకృతమే అజాశబ్దముచే చెప్పఁబడె నని నిర్ణయింపవలయును. ఏల యనిన: వేదాంతములన్నియు నొక్క విషయమును చెప్పునవియే కావున నేకవాక్యమే యగును. అందు వలసినవిషయము మేశ్రుతియందు చెప్పఁబడి యుండినను గైకొనవచ్చును. ప్రకృతము ఛాందోగ్యశ్రుతియందు "య దగ్నే రోహితం రూపం తేజస స్త ద్రూపం య చ్ఛుక్లం త దపాం య త్కృష్ణం త దన్నస్య" "లోకమునఁ గానవచ్చురక్తవర్ణ మేది కలదో అది తేజస్సుయొక్క రక్తవర్ణమే. తెలుపు జలముయొక్క తెలుపే. నలుపు భూమియొక్క నలుపే" అని తేజోజలపృథువుల వర్ణములును అవి పరమేశ్వరునుండి జనించిన వనియును చెప్పఁబడియున్నది. కావున దీని నాశ్రయించి యిచ్చట తేజోజలపృథ్వీరూప మగునవ్యాకృతమే వర్ణింపఁబడె ననవలయును.

ఇదియును గాక ప్రకృతశ్వేతాశ్వేతరోపనిషత్తునందును * ఉపక్రమమున "తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" "ఆమహామునులు తేజోజల పృథివీరూపము లైనట్టియు తద్వికారరూపము లైనట్టియు ప్రాపంచికపదార్థములచే మఱుఁగుపడియున్నబ్రహ్మశక్తిని ధ్యానయోగముచేఁ గాంచిరి" అని యవ్యాకృతము పేర్కొనఁబడియున్నది. వాక్యశేషమునందును "మాయాంతు ప్రకృతిం వింద్యా న్మాయినం తు మహేశ్వరం" అని పరమేశ్వరాధీన మగుమాయయే పేర్కొనఁబడియున్నది. ఇట్లుండ నడుమ స్వతంత్రప్రధానము చెప్పఁబడె ననుట యెట్లు ?

కావున నుపక్రమమున నర్ణింపఁబడిన పరమేశ్వరాధీనశక్తియే

* ఉపక్రమము. (పు. ౪౫, చూడు.)

(మామతమునందు సిద్ధాంతము చేయఁబడిన యవ్యాకృతమే!) ఈయజా మంత్రమునందును ప్రశంసింపఁబడె ననుటయే సిద్ధాంతము. దానివికారము లగు తేజోజలపృథువులకుఁ గ్రమముగ యెఱుపు మొదలగునర్ణములు కలవు కావున కార్యకారణాభేదముచే నాయవ్యాకృతమునందును ఆవర్ణములు కలవని చెప్పఁబడెను. ఇంతియేకాని నీప్రధానము ఇచ్చట చెప్పఁబడలేదు. అట్లే చెప్పఁబడె నని కల్పింపఁబోయిన నున్నదానిని విడిచి యన్యాయముగ లేనిదానిని స్వీకరించినట్లగును. ఇది దోషము కదా!

"మీరును కార్యకారణాభేదము నాశ్రయించి కార్యగుణములఁ గారణమునకుఁ జెప్పితిరి. మేమును సత్వాదులకుఁ గలగుణములఁ దదభిన్న మగుప్రధానమునకుఁ జెప్పితిమి. ఇందు విశేష మేమి కలదు?" అనియెదవేమొ వినుము. మామతము ననుసరించి చూచినఁ దేజోజలపృథువులకుఁ బ్రత్యక్షముగ నెఱుపు తెలుపు నలుపు వర్ణము లున్నవి. మీ రన్ననో సత్వాదిగుణములకు స్వభావసాదృశ్యమును బట్టి యావర్ణములను కల్పించితిరి. కావున మీకల్పనకంటె మాయధార్థస్థితి బలవంతము. మీరు ఎఱుపు మొదలగువర్ణములు గలపదార్థములకుఁ జెప్పిన స్వభావములు అన్నిటికి నుండవచ్చును. ప్రతివర్ణంబును తనతో సంబంధము గలపదార్థమును రంజించును. మాలిన్యము లేకపోయినచో ప్రతివర్ణంబును ప్రసన్నమైయే యుండును. ప్రతివర్ణంబును తనకంటె నల్పకాంతి గలయన్యవర్ణమును ఆవరించుచునే యుండును. ఇట్లు అనేక సంశయయుక్త మగుమీకల్పనకంటె మాకల్పన శ్రేష్ఠమైనది యనుటలో సంశయము లేదు. ముఖ్యార్థము సంభవించుచుండఁ గల్పితార్థము నెవ్వఁడు స్వీకరించును? సంశయరహితంబును సంశయయుక్తంబును అగు రెండువిషయములు పరస్పరవిరుద్ధములై వచ్చెనేని యప్పుడు సంశయయుక్త మగుదానిని విడిచి సంశయరహితమగుదానినే స్వీకరింపవలయు నని కదా పెద్దలు చెప్పుదురు! లోకానుభవము కూడ నీవిషయమునే స్పష్టము చేయుచున్నది కదా! కావున మీపూర్వపక్ష మెట్లును నిలువదు.

## అ ౧. పా ౪. సూ ౧౦. ఆరంభము.

అవతారిక: మాసిద్ధాంతమునకు నిలువదు. తేజోజలపృథు

వులు అజాశబ్దవాచ్యములు కానేరవు. అజ యనఁగా: మేఁక. తేజోజల పృథువులు మేఁకలు కావు కదా! ఇప్పుడు దూషి పోయినది. ఇఁక యోగము నాశ్రయింపఁబోయిన నదియు సరిపడదు. అజ యనఁగా: పుట్టుక లేనిది. తేజోజలపృథువు లట్టివి కావు కదా! కావున మీ సిద్ధాంత మెట్లు నిలుచును? అజ యనఁగా నెద్ది?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౧౧౬. కల్పనోపదేశాచ్చ మధ్వాదివ దవిరోధః. ౧. ౪. ౧౦.

తాత్పర్యము. సిద్ధాంతము:—ఈసంశయముతోఁ బని లేదు. ఇచ్చట మేఁకజాతిని గూర్చి కాని, "పుట్టుక లేనిది యజ" యనునుత్ప త్తిని గూర్చి కాని చెప్పఁబడి యుండలేదు. తేజోజలపృథివీరూపిణి యగు మాయ మేఁకగా రూపింపఁబడి మాత్రమే యున్నది. "లోకమున నెఱుపు తెలుపు నలుపు వర్ణములు కలిగి తనతో సమానరూపము కల యనేకపిల్లలను వేయుచు నుండునొకానొక మేఁకపైఁ బ్రేమఁ గలిగి యొకానొక మేఁకపోఁతు సంచరించునట్లును మఱియొక మేఁక యంతకుఁ బూర్వమే దానివలన సుఖము ననుభవించి దానిని వదలివేయునట్లును, ఈప్రకృతినిఁ గూడ నజ్ఞాని యగుజీవుఁ డనుసరించి యున్నాఁడు; జ్ఞాని యగు మఱియొకజీవుఁడు వైరాగ్యవంతుఁడై దానిని విడుచుచున్నాఁడు" అను నీవిషయమును బోధించుటకై ఈవాక్యమారంభింపఁబడి యున్నది. ఇట్లు చెప్పుటయు విరుద్ధము కాదు. "అసౌ వా ఆదిత్యో దేవమధు" "ఈసూర్యుఁడు దేవతలకు మధు" వని ఛాందోగ్యోపనిషత్తునందు మధువు కానిసూర్యునకు మధుత్వము చెప్పఁబడి యున్నది. ఇట్లే "వాచం ధేను ముపాసీత" "వాక్కును ధేనువుఁగా నుపాసింపవలయును" అని బృహదారణ్యకోపనిషత్తునందు గోవు కానివాక్కునకు గోత్వము కల్పిం పఁబడినది. కావున నిచ్చటకూడ మేఁక కానిప్రకృతిని మేఁకగాఁ జెప్ప వచ్చును. దీనివలన విరోధము లేదు.

దీనివలన "అజాశబ్దముయొక్క యౌగికార్థము నాశ్రయించినఁ బ్రధానము. తేజోత్తమమగు ... అనుభవించుచు ... ంపఁబడెను. ఆయ

వ్యాకృతములు మామతమునం దనేకములే యైనను ఏకజీవవాదము నాశ్రయించుటవలనఁ గాని, జాతి నాశ్రయించుటవలనఁ గాని యేక రూపమగు నని యిదివఱకే నిరూపించితిమి. ఈకారణమువలన ఏకా శబ్దము కూడ మామతమునం దే సమన్వయ మైనది. లోహితశుక్లకృష్ణా శబ్దమును పైసూత్రమునందే సయుక్తికముగ మామతమునందే సమన్వ యించితిమి. సృష్టి రెండుమతములయందు నొక్కటియే. మీమతము నందు సృష్టి గుణత్రయాత్మక మైనచో మామతమునందుఁ దేజోజల పృథి వ్యాత్మకము. "ఇట్లయినను జీవభేద మొక్కటి మామతమును దృఢ పఱచుచు నున్నది" అనియెదవే మొ యదియు నిలువదు. "ఏకో దేవః సర్వభూతేషు గూఢః, యోనిం యోని మధితిష్ఠ త్యేకః" "ఒక్కపరమే శ్వరుఁడే సర్వభూతములయందును జీవరూపమున దాఁగి యున్నాఁడు. ఒక్కపరమేశ్వరుఁడే అవిద్యారూపము లగుయోనులయం దెల్ల నున్నాఁ డు." అనుమొదలగుశ్రుతులకు నట్లు భేదమును చెప్పిన విరోధము వచ్చును. మీమతమునందు జీవపరమేశ్వరభేదంబును జీవులలోఁ గూడ నన్యోన్యభేదంబును పరమార్థములు. ఇది శ్రుతివిరుద్ధ మని యిప్పుడే చూపి యున్నాము. మామతమున నది కల్పితము. అనేకజీవవాదము నందుఁగూడ నాకు జీవభేదము లేదు. * "పరమార్థజీవుఁ డొక్కఁడే తక్కినవారు కల్పితులు" అని గ్రహించుటకంటె 'అందఱును సమా నులే" అని గ్రహించుట కొంచెము యుక్తముగ నుండు నని యనేక జీవవాద మేర్పడినది కాని జీవభేదమును చెప్పుటకుఁ గాదు. కావున అజామంత్రమున వర్ణింపఁబడిన భేదము కల్పితమే. కల్పితములను కూడ పారమార్థికములనుగా లోకులు తలంచుచున్నా రనుట మీకును సమ్మ తమే. ఆమంత్ర మీకల్పితభేదము ననువాదము చేసి బంధమోక్షవ్య వస్థను కల్పించినది. కావున నెట్లుచూచినను మీసిద్ధాంతము వేదోక్తము కాదు.

---

* పరమార్థజీవుఁ డనఁగా నేకజీవపక్షము నాశ్రయించినవాఁడు. బ్రహ్మమునుండి జనించె నని చెప్పు జీవుఁడు. ఇంతియే కాని జీవునకు పారమార్థికసత్యస్వరూప మేపక్ష మునందును లేదు.

# 3. సంఖ్యోపసంగ్రహాధికరణము.

విషయము:—“యస్మిన్ పంచ పంచజనా ఆకాశ శ్చ ప్రతిష్ఠితః త మేవ మన్య ఆత్మానం” “ఎవ్వనియందు సూర్యునితోఁగాని అన్నముతో గాని గూడిన మనుష్యావయవము లైదును ఆకాశంబును ప్రతిష్ఠింపఁబడి యున్నవో వానినే యాత్మగాఁ దలంచుచున్నాను” అను వాక్య మొక్కటి బృహదారణ్యకోపనిషత్తునఁ గలదు. ఇది ఈయధికరణమున విచారింపఁబడును.

సంగతి:—“పూర్వాధికరణమున అజాశబ్దమునకు రూఢార్థమును గ్రహించుటకు వీలు లేకపోయెను కావున * గౌణార్థము నాశ్రయించి మీసిద్ధాంతమును నిలిపికొంటిరి. ఇచ్చటకూడ పంచజనశబ్దమునకు రూఢిని గ్రహించుటకు వీలు లేదు. “ఆత్మయందు అయిదుగురు మనుష్యులును ఆకాశంబును కలదు” అనుట సంభవింపదు కదా! కావున మామతము ననుసరించి యిరువదియైదుతత్త్వములను గూర్చియే యీమంత్రము చెప్పుచున్నది యనవలయును. పంచపంచ యనఁగా ఐదైదులు ఇరువదియైదు అగును కదా” అను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. ఈయాక్షేపము పైయధికరణమునందు నెలకొల్పఁబడిన న్యాయమును దృష్టాంతముగఁ గైకొనివచ్చినది యగుటచేఁ బ్రస్తుతాధికరణమునకుఁ బూర్వాధికరణముతోఁ గల సంబంధము దృష్టాంతసంబంధము.

సందేహము:— ఇచ్చట పంచజనశబ్దమునకు రూఢార్థమును గ్రహించుటకు వీలు లేకపోవుటయు యౌగికార్థ మిదియని స్పష్టము చేయుటకు వీలుగాకుండుటయు జలశబ్దమునకు సాంఖ్యకల్పిత తత్వములయందు రూఢి లేకపోవుటయు సంశయకారణములు. “పంచపంచ జనశబ్దము సాంఖ్యస్మృతిప్రసిద్ధతత్త్వములనే చెప్పును. ప్రాణాదులనే చెప్పును” అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. వీనిఫలములను పూర్వమువలెనే యెఱుంగునది.

పూర్వపక్షము. “మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త, షోడశకస్తు వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః”

---

* గౌణార్థము (పు. ౪౭౭. చూడు.)

"మూలప్రకృతి యనఁగా ప్రధానము. అది సర్వకారణమే కాని మఱి యొకదానియొక్క వికారము కాదు. మహత్తత్త్వము అహంకారము శబ్దస్పర్శరూపరసగంధము లను పంచతన్మాత్రలు అనునీయేడును నొక దానివలన నొకటిఁ పుట్టినవి యగుటచే వికృతులు. మఱికొన్నిపదార్థ ములఁ గలిగించునవి యగుటచేఁ బ్రకృతులు. పంచమహాభూతములు జ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు అంతఃకరణ మొక్కటి అనునీపదునాఱును వికారములు. ఈయిరువదినాల్గుతత్త్వములకంటెఁ బరుఁడై పురుషుఁ డున్నాఁడు. అతఁడే యిరువదియైదవతత్త్వము. ఆతండు ఒకదానికి కారణభూతుఁడును కాఁడు. వికారభూతుఁడును కాఁడు." అని మామతమున నిరువదియైదుతత్త్వములను చెప్పుచున్నాము. ఈమంత్రము నందు పంచపంచజనశబ్దముచే నిరువదియైదు జనములే చెప్పఁబడి యున్నవి. ఇరువదియైదుసంఖ్యలను గ్రహించుటచే మాస్మృతియందలి తత్త్వములే యిచ్చట గుఱుతింపఁబడుచున్నవి. జనశబ్దమునకు నేదియో యొకవ్యుత్పత్తి నాశ్రయించి తత్త్వపర మగునర్థమును చెప్పవచ్చును. మీమతమునందును రూఢి పోయినది; పంచజనశబ్దము నేకముగ గ్రహించి యర్థము చెప్పుటకు వీలు లేకపోయినది కదా! కావున మేము చెప్పుప్రధానాదులు వేదోక్తము లైనవే.

అవతారిక:—అనునీసంశయమును నివారించుచున్నాఁడు.

## ౧౧౭. న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావా దతిరేకాచ్చ. ౧. ౪. ౧౧.

తాత్పర్యము:—ఇచ్చట ఇరువదియైదు అనుసంఖ్య యున్నట్లు తోఁచినను మీమతమునందుఁ జెప్పఁబడినతత్త్వములు ఇచ్చట చెప్పఁ బడి యుండలేదు. ఏల యనిన: లోకమున నేపదార్థములు రెండుగాఁ గాని మూఁడుగాఁ గాని మఱి యెన్నిగాఁ గాని సమానధర్మములు కలిగి యుండునో వానినిఁ గూర్చియే "ఇవి రెండు జతలు. ఇవి మూఁడు చతుష్కములు" నను మొదలగు వ్యవహారములు కలుగుచున్నవి. మీతత్త్వము లన్ననో ఐదైదుగ సమానధర్మములు కలవి యై యుండునేని అట్లే "ఇవి యైదు పంచకములు" అని చెప్పఁబడి యుండవచ్చును. అయిన మీతత్త్వము లట్లు లేవు. ప్రధానగుణములు మూఁడును మహ

త్తత్త్వాహంకారములు రెండునుగాని మూలప్రకృతి యొక్కటి మహత్తత్త్వాహంకారములు రెండు, పంచతన్మాత్రలలోనిశబ్దస్పర్శములు రెండును కలసికొని మొదటిపంచకము. ఇట్లే తక్కినపంచకములును ఏర్పడును. వీనియందు సమానధర్మ మెచ్చట కలదు? ఈకారణము వలన మీతత్త్వము లైదుపంచకములుగాఁ గ్రహింపఁబడె ననుటకు వీలులేదు.

మఱియు నిచ్చట నాత్మ యాధారభూతుఁడుగా సప్తమీవిభక్తిచేఁ జెప్పఁబడి యున్నాఁడు. ఆధేయములలోఁ గూడ నాకాశము పంచపంచజనులకంటె భిన్నముగఁ జెప్పఁబడి యున్నది. మీమతమున నీయాత్మాకాశములు రెండును ఇరువదియైదుతత్త్వములలోఁ జేరినవియే కదా! అవి మరల ప్రత్యేకముగఁ జెప్పఁబడి యుండిన నిఁక మీసంఖ్య యెట్లు నిలుచును? ఇంతకును జనశబ్దమునకు తత్త్వములయందు రూఢి లేదు. సంఖ్యయు పైన వర్ణించినవిధముగ నిరువదియైదుగా నిలుచుట లేదు. ఇట్లుండ మీసిద్ధాంతము శ్రుత్యుక్త మెట్లగును? మాసిద్ధాంతమునం దన్ననో ఈదోషము లెవ్వియును లేవు. మేము పంచజనశబ్దమునకు రూఢినే గ్రహించి యున్నాము. తదనుకూలముగ నర్థమును కల్పించి యున్నాము. "దిక్సంఖ్యే సంజ్ఞాయాం" "దిగ్వాచకములును సంఖ్యావాచకములు నగుపదములు ఒకపదార్థముయొక్క నామమును చెప్పనప్పుడుమాత్రమే యన్యపదముతో సమసించును" అనువ్యాకరణసిద్ధాంతము ననుసరించి యిచ్చటిపంచశబ్దము రూఢార్థమును చెప్పనప్పుడు గాని జనశబ్దముతో సమసించి యుండదు. కావున పంచజనశబ్దమునకు మనుష్యునియందుఁ గలరూఢి నిచ్చటఁ బరిత్యజింపఁగూడదు. ఏస్థలములయందు రూఢిచేతనే కార్యనిర్వాహ మగునో, రూఢిని విడుచుటకు వీలు లేకుండునో, ఆస్థలములయందు ప్రత్యక్షరూఢిచేతనైనను, రూఢిని పరిత్యజింపకయే యేదియో యొకవృత్తిచే కల్పింపఁబడునర్థము చేతనైనను కార్యనిర్వాహమును చేయవలయును; కాని రూఢిని సంపూర్ణముగఁ బరిత్యజింపరాదు. ఇచ్చట వ్యాకరణసిద్ధాంతము ననుసరించి రూఢినిఁ బరిత్యజించుటకు వీలు లేకున్నది కదా! కావున నిచ్చటి పంచజనశబ్దముచే నేదియో యొకరూఢార్థమునే మేముచెప్పుచున్నాము. "ఆపంచజనశబ్దవాచ్యము లెన్ని?" అని ప్రశ్న రాఁగా, దానికి శ్రుతి

"ఆపంచజనము లైదు" అని సమాధానము చెప్పుచున్నది. ఇదియే మాసిద్ధాంతము.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. మాతత్వములయందు ఐదైదింటికి నొక్కొక్క సమానధర్మము లేకుండుట వాస్తవమే. అయినను అవయవములను (అనఁగా: ఐదుఐదులు కలవు కావున ప్రత్యేకముగా నిరువదియైదు పదార్థములను) * లక్షణావృత్తిచే గ్రహింపవచ్చును. "పంచ సప్త చ వర్షాణి న వవర్ష శతక్రతుః" "ఇంద్రుఁడు ఐదు ఏడు వత్సరములు (అనఁగా: పంద్రెండు వత్సరములు) వర్షింపలేదు" అను మొదలగు వాక్యములయందు అసంబంధముగ సంఖ్యలు వినవచ్చుచున్నప్పుడు లక్షణావృత్తిచే వానియవయవములను గ్రహించుచున్నారు కదా!

ఇట్లు కాకున్నను మఱియొకవిధముగాఁ గూడఁ జెప్పవచ్చును. పంచజనశబ్దము మొట్టమొదట నైదుసంఖ్య గలతత్వములను చెప్పును. పిదప దానికిఁ బూర్వమున నున్నపంచశబ్దము "ఆపంచజనము లైదు" అని చెప్పును. ఇందు విరోధ మేమి? "పంచ పూల్యః" "ఐదుమోపులను కలిపి కట్టినమొత్తము లైదు" అనుమొదలగు వ్యవహారములు లోకమునఁ గలవు కదా!

ఇదియునుఁ గాక యీశ్రుతియందు ఇరువదియైదింటికంటె నధికసంఖ్య విషయవాక్యమునఁ గల దని చెప్పి యున్నారు కదా! అదియు దోషము కాదు. ఇందు పురుషాకాశములు రెండును పంచవింశతితత్వములకంటె భిన్నములుగాఁ జెప్పఁబడి యున్న వనుట నిస్సంశయమే కాని, ప్రధానమునకు మూఁడుగుణములు కలవు. కావున వానిని ప్రత్యేకముగ గ్రహించినచో నీకొఱఁత తీరును. కావున నెట్లు చూచినను ఈమంత్రమునఁ జెప్పఁబడినది మాసిద్ధాంతమే.

సిద్ధాంతము:—ఇందు మొదటిపక్షము సరి కాదు. ఆపక్షము నాశ్రయించిన నిరర్థకముగ లక్షణావృత్తి నాశ్రయింపవలసి వచ్చును. ఇచ్చట రెండవపంచశబ్దము జనశబ్దముతో సమసించి యున్నది; కాని ప్రత్యేకముగ లేదు. * స్వరప్రభావముచే నది యేకపదముగ నిర్ణయిం

* లక్షణావృత్తి (పు. ౧౧౧. చూడు.)

* స్వరప్రభావము :—స్వరములనుగూర్చి (పు. ౩౪౯. చూడు.) వ్యాకరణ.

పఁబడి యున్నది. "పంచా * నాం త్వా పంచజనానాం" అనునితరశ్రుతి వాక్యమునుబట్టి విమర్శించినఁ బంచజనశబ్దము ఏకపద మగుట నిర్ణయ మగుచున్నది. "పంచజనానాం" అనునది సమాసపద మనుట ప్రసిద్ధ విషయము కదా! మఱియు "పంచ సప్త" అనుస్థలమున పండ్రెండు పదార్థములను గ్రహించినట్లు మీరును "పంచ పంచ" అనుపదముల వలన పదిపదార్థముల గ్రహింపఁ దలఁచుచున్నారా? ఇదియునుఁ గాక పంచపంచశబ్దము సమాసము కానేరదు. "ప్రథమానిర్దిష్టం సమాస ముపసర్జనం" "సమాసమునుగూర్చి చెప్పునప్పుడు ప్రథమావిభక్తితోఁ జెప్పఁబడినపదము ఉపసర్జన మనఁబడును. అది సమాసమున ప్రధానము కానేరదు"అనువ్యాకరణసిద్ధాంతమునను సరించి"దిక్సంఖ్యే సంజ్ఞాయాం" అనుసమాసవిధిసూత్రమున చెప్పఁబడిన దిగ్వాచకసంఖ్యావాచకపద ములు ఉపసర్జనములు; అవి ప్రథమావిభక్తిచేఁ జెప్పఁబడి యున్నవి కదా! మఱియు ఏపదముతో వానికి సమాసము వచ్చిన నొకపదార్థము నకు సంజ్ఞ ఏర్పడునో అది ప్రధానపదము. ప్రకృతము పంచజనపదము

---

సిద్ధాంతము ననుసరించి వేదములకు మాత్రమే కాక భాషకును స్వరము కలదు. ఆంగ్లేయ భాష మొదలగు వానియం దిప్పటికిని అట్టిస్వరము వాడుకలోనే యున్నది. సంస్కృత భాషయందు మాత్రము దానిప్రచారము నశించిపోవుటచే నాస్వరము కూడ నశించి పోయినది. వేదముమాత్రము గురుశిష్యపరంపరావశమునఁ గొంత జాగ్రత్తగాఁ గాపాడఁ బడుచుండుటచే దానిస్వరము నిలిచియున్నది.

ఇది సమాసము క్రియ ప్రత్యయము అవ్యయము అను మొదలగుభేదములఁ దెలు పుచు నర్థనిర్ణయమును గావించుటకు సహాయపడును. "ఇది తత్పురుషసమాసమా? లేక బహువ్రీహిసమాసమా?"అను మొదలగుసంశయములు కలిగినప్పుడు ఈస్వరమే దానినిఁ నివారించును. ప్రతిసమాసమునకును స్వరభేదము కలదు. ఇట్లే స్వరసంశయమును నివారించుటయందు ఈస్వర మొకప్రబలసాధనముగ నున్నది.

* "పంచానాం త్వా పంచజనానాం" అనువాక్యమున పంచజనశబ్దము అంత మున నున్నషష్ఠీవిభక్తిచే సమాస మని స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. "పంచజనాః" "అని ప్రథమాంతముగా నున్నప్పుడు "పంచ, జనాః" అని ప్రత్యేకపదములుగఁ గూడ నుండవచ్చు నని తోఁచును. ఇచ్చట నట్లు తోఁచుటకు నవకాశము లేదు. మొట్ట మొదటనే "పంచానాం" అని ప్రత్యేకముగ షష్ఠీవిభక్తియందు పంచజనశబ్దమునకు విశేషణముగఁ బ్రయోగింపఁబడి యీసంశయమును దీర్చినది? రెండవపంచశబ్దమునకు జనశబ్దముతో సమాసము కల దనువిషయము స్పష్టము చేసినది.

నందు సంఖ్యావాచక మగుటచే పంచపద ముపసర్జనము. జనపదము ప్రధానము. ఇట్లుండ ఉపసర్జనముతో మఱియొకపదమునకు సమాస మెట్లు వచ్చును? అది యప్రధానము కదా! కావున నెట్లు చూచినను లక్షణావృత్తిని గ్రహించుటకే మొట్టమొదట నవకాశము లేదు. "పంచ పంచ" యని ద్విరుక్తి మొట్టమొదట స్థిరపడినఁ గదా "రెండైదులు పది" యని యైనను "ఐదైదులు ఇరువదియైదు" అని యైనను, లక్షణావృత్తిని గ్రహించుటకుఁ వీలు కలుగుట.

ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నది బొత్తిగనే సరిపడదు. రూఢిచేతఁ గాని తదనుకూల మగుకల్పనచేతఁ గాని కార్యనిర్వాహ మగు చుండ యోగమును గ్రహించుట యుక్తముకా దని యిది వరకే చెప్పి యున్నాము. జనశబ్దమునకు తత్వములయందు రూఢిలేకపోవుటవలనఁ గూడ మీమతము నిలువ దని యున్నాము. ఆరెండుదోషముల నటు నిలిపి, జనశబ్దమునకు నేదియో యొకవిధముగ తత్త్వపరముగ నర్థము చెప్పి, పంచజనశబ్దమునకు యోగము నంగీకరించి, చూత మన్నను మీసిద్ధాంతము నిలువదు. "పంచ పంచపూల్యః" అనుస్థలమున పంచ పూలీశబ్దము ఐదుమోపులు కలసముదాయమునందు వర్తించుచున్నది. కావున "ఆసముదాయము లెన్ని కలవు" అని ప్రశ్న వచ్చుటకును "అట్టి వైదు కలవు" అని యుత్తరము చెప్పుటకును వీలు కలదు. ఇచ్చట నట్లు లేదు. "పంచజనాః" అనునప్పుడే "ఐదుగురు జనులు" అని విభాగముగానే యర్థ మేర్పడుచున్నది. ఇఁక మఱల ప్రశ్నము కాని యుత్తరము కాని యెటనుండి వచ్చును? ఒకవేళ నట్టిప్రశ్నోత్తరములే సంభవించు నేని యప్పుడును మొదటిపంచశబ్దము రెండవపంచశబ్దమునకే విశేషణము కావలసి వచ్చును. సముదాయమును చెప్పునప్పుడు సంఖ్యావాచకశబ్దమునకు స్వార్థము లేకపోవును; కాని విభాగమును చెప్పునప్పుడట్లు లేకపోదు కదా! ఈవిధముగ రెండుపంచశబ్దములు నొకదాని కొకటి విశేష్య * విశేషణములు కావలసివచ్చినచో నప్పుడు కలుగు దోషము ముందే వివరింపఁబడి యున్నది. ఉపసర్జనమునకు పదాంతరము

---

* విశేషమునుగూర్చి ౨౪౯. పుటలో చెప్పియున్నాము. తానాశ్రయించిన పదార్థమునకు నేదియో యొకవిశేషమును సమకూర్చునది విశేషణము. దానిచే నాశ్రయింపఁబడి యేదియో యొకవిశేషముచేఁ బ్రకటింపఁబడునది విశేష్యము.

విశేషణము కా దని యిదినరకే చెప్పియున్నాము. కావున నీరెండవపక్షముకూడ యుక్తము కానేరదు.

మఱియు గుణములను ప్రత్యేకముగాఁ జేసినను ఒకటిగనే చేర్చినను గూడ నీవిషయవాక్యమున నిరువదియైదుతత్త్వము లేర్పడవు. ప్రత్యేకముగఁ జేసిన నప్పుడు ఇరువదియేడుతత్త్వము లగుటచేఁ బురుషాకాశములఁ బ్రత్యేకముగ గ్రహించినను దోషము లే దనుట యథార్థమే; కాని యప్పుడు మఱియొకదోషము వచ్చును. ఈవిషయవాక్యమునందుఁ బురుషుఁడు సర్వాధారముగను తక్కినవి యాధేయములుగను చెప్పఁబడియున్నవి. ఇప్పుడు చూడుము. పురుషుని నాధారభూతముగ గ్రహించినపిదప నాధేయములలోఁ జేరినయీ కాశమును ప్రత్యేకముగఁ జెప్పుటవలన నేమి ప్రయోజన ముండును? తక్కినవాటితోఁ జేర్చియే జెప్పవచ్చును కదా! ఇట్లు కాక నాగుణము లనేకములుగనే గ్రహించినచో వచ్చువిరోధము స్పష్టమే. కావున నెట్లు చూచినను మీసిద్ధాంతమీమంత్రమునఁ జెప్పఁబడి యుండలేదు. ఈమంత్రమునఁ జెప్పఁబడినది పంచజనశబ్దముయొక్క రూఢార్థమును ననుసరించి కల్పింపఁబడు నైదు పదార్థములే.

## అ ౧. పా ౪. సూ ౧౨. ఆరంభము.

అవతారిక:—ఆపంచజనము లేవియో యనిన వానిని వివరించుచున్నాఁడు.

## ౧౧౪. ప్రాణాదయో వాక్యశేషాత్. ౧. ౪. ౧౨.

తాత్పర్యము :—ఆయుపనిషత్తునందు ప్రస్తుతవిషయవాక్యమునకుఁ బిదపఁ బ్రాణాదు లైదు బ్రహ్మస్వరూపనిరూపణార్థమై వివరింపఁబడియున్నవి. "ప్రాణ స్య ప్రాణముత చక్షుష శ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత్ర మన్నస్యాన్నం మనసో యేమనో విదుః" "ప్రాణమునకు ప్రాణంబును నేత్రమునకు నేత్రంబును శ్రోత్రమునకు శ్రోత్రంబును అన్నమున కన్నంబును మనస్సునకు మనస్సును అగుపరబ్రహ్మము నెవ్వ రెఱుంగుదురో" అను వాక్యమునఁ బ్రాణాదు లైదు వర్ణింపఁబడి యున్నవి. ఇవియే "యస్మిన్ పంచ పంచజనాః" అనువిషయవాక్యమున పంచజనశబ్దముచే వర్ణింపఁ

బడియున్నవి. పంచజనశబ్దము మనుష్యవాచక మైనను వానికి సంబంధించినవి కావున నీప్రాణాదులను చెప్పును. 'తేవా ఏ తే పంచ బ్రహ్మపురుషాః' "ఈప్రాణాదులైదును బ్రహ్మపురుషులు" అని ప్రాణాదులయందు మనుష్యవాచక మగుపురుషశబ్దము ప్రత్యక్షముగనే ప్రయోగింపఁబడియున్నది. సమాసబలమువలనఁ బంచజనశబ్దమునకు రూఢి కలదనియు యోగము నాశ్రయించుటకు వీలు లేదనియు నిదివరకే నిరూపించియున్నాము. ఆరూఢి నాశ్రయించియే యిప్పుడు దానియర్థమును తత్సంబంధము లగుప్రాణాదులయందు సంబంధపడు నని చెప్పియున్నాము. కావున నెట్లు చూచినను ప్రాణాదులే పంచజనాశబ్దార్థములు.

పూర్వపక్షము:—ఇది సరి కాదు. పంచజనసమాసమునందు జనపదము ప్రధానము. అది ప్రాణాదులయందు రూఢము కాదు. పంచజనశబ్దము మనుష్యునియందు రూఢ మైనను ప్రాణాదులను చెప్పు ననుట సంభవింపదు. ప్రాణాదులు మనుష్యులు కారు గదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్ప కూడదు. మాసిద్ధాంతమునకును మీరు చూపిన దోషములు కలవు. జనశబ్దమునకు మీతత్త్వములయందును రూఢి లేదు. మనయిరువురిమతములయందును రూఢి లేకుండుట సమానమే యగుటచే సమీపమున నున్నప్రాణాదులను గ్రహించుటయే యుక్త మగు ననుటలో సంశయ ముండదు. మీతత్త్వములను గూర్చిన ప్రస్తావమే యందు లేదు కదా! మఱియు అప్రసిద్ధార్థ మగుపదము స్వయముగ దేనియందో యొకదానియందు రూఢి కలిగి ప్రసిద్ధార్థము లగుపదములచెంతఁ బ్రయోగింపఁబడి యుండినచో నిది (అప్రసిద్ధార్థ మగు రూఢపదము) యాప్రసిద్ధపదములయర్థము నే చెప్పు ననుట నియమము "అగ్నికుమారము వానిగృహమున నున్నది. ఈకాలమున నౌషధము నింట నుంచుకొననివా రెవ్వరు?" అనునీవాక్యసందర్భమున అగ్నికుమారపదమునకు నర్థము తెలియుట లేదు; దానికి ప్రయోగబలమువలన నేదియో యొకపదార్థమునందు రూఢి యుండవలయుననుట స్పష్టమై యున్నది. కావున సమీపవాక్యమున నున్నప్రసిద్ధార్థమగునౌషధపదముచేఁ జెప్పఁబడుచున్నయర్థము నే యాయగ్నికుమారపదము కూడ చెప్పుచున్నది (అనఁగా: అగ్నికుమార మనునది యొకయౌషధము పేరు) అని సిద్ధాంతము చేయవలసియున్నది. ఇట్లు చేయుట లోకవ్యవహార

సిద్ధమే కదా! ఈవిధముగనే ప్రస్తుతవాక్యమునందున సిద్ధాంతము చేయవలయును. జనశబ్దము అప్రసిద్ధార్థము; అది ప్రధాన మగుటచేఁ బంచజనసమాసార్థముకూడ నప్రసిద్ధమే. దానికి వ్యాకరణసిద్ధాంతబలమున రూఢిమాత్రము కల దనుట స్పష్టము. మనుష్యులయందు రూఢియున్నను ప్రస్తుతప్రయోగమున నాయర్థము వచ్చుటకు వీలు లేదు. శ్రుతికల్పిత మగుప్రత్యేకరూఢియే యుండవలయును. వాక్యశేషమునందు ప్రసిద్ధార్థము లగుప్రాణాదు లైదు చెప్పఁబడియున్నవి. కావున నాపంచజనశబ్దము వీనినే చెప్పు నవి తీరవలయును. ఇవి మనుష్యసంబంధు లనియు వీనియందుఁ బ్రత్యక్షముగ కూడ మనుష్యవాచకశబ్దప్రయోగము కల దనియుఁ గూడ మఱిరెండుహేతువులను పూర్వమునందే చూపియున్నాము. కావున నెట్లు చూచినను విషయవాక్యమునందలిపంచజనశబ్దార్థము ప్రాణాదులే.

విశేషాంశము:—ఇట్లు గాక కొందఱు దేవతలు, పితృదేవతలు, గంధర్వులు, * అసురులు, * రాక్షసులు, అనునీయైదుగురును ఐదుగురు పంచజనులు. అని వ్యాఖ్యానము చేసియున్నారు. మఱికొందఱు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు నలుగురును * నిషాదులును కలిసి పంచపంచజను లని చెప్పియున్నారు. వేదమున కొన్నిచోట్ల "పాంచజన్యయా" "ప్రజాసంబంధ మైన" అని పంచజనశబ్దము కేవలమనుష్యవాచకముగానే ప్రయోగింపఁబడియున్నది. ఈపక్షములలో దేని నంగీకరించినను మాకు సమ్మతమే. ఎప్పటికిని మీపంచవింశతితత్త్వములు మాత్రము వేదోక్తములు కానేరవు.

---

* దేవతలకు శత్రువులై వారిని బాధించుచు నుండువా రసురులు. వీరికి రాక్షసు లనియుఁ బేరు కలదు.

* అయినను దేవతలలోఁ గూడ రాక్షసు లనునొకజాతి కలదు. నిరృతి వరుణుఁడు మొదలగువారందఱు మీజాతిలోనివారే. రాక్షసశబ్దమునకు సామాన్యముగ నీజాతియందే రూఢి కలదు. కుబేరనివృత్తాంతమును బట్టి చూచిన నీవిషయము స్పష్టమగును. కైకసి యసురస్త్రీ యగుటచే నామెకు జనించినరావణాదు లసురులు. కుబేరుని తల్లి యట్టిదికాకపోవుటచే నాతఁడు అసురుఁడుకాలేదు. యక్షజాతికిని దీనికినిఁ గూడ నంతగా భేదము లేనట్లు కొన్నికొన్నిదృష్టాంతములచే గానవచ్చుచున్నది.

* మృగ పక్షివధచే జీవించుబోయలు నిషాదులు.

## అ ౧. పా ౪. సూ ౧౩. ఆరంభము.

అవతారిక:—"ఇప్పటికిని దోషము పోలేదు. ఒకశాఖయందు మాత్రమే ప్రాణాదు లైదు చెప్పఁబడియున్నవి. మఱియొకశాఖయం దట్లు లేవు కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౧౧౯. జ్యోతి షైకేషా మస త్యన్నే. ౧. ౪. ౧౩.

తాత్పర్యము:—కాణ్వశాఖయందు అన్నమునుగూర్చి చెప్పఁబడి యుండలే దనుట నిశ్చయమే. అయినను వారు "యస్మిన్ పంచ పంచజనాః" అనువాక్యమునకుఁ బూర్వవాక్యమున "త ద్దేవా జ్యోతిషాం జ్యోతి రాయు ర్హో పాసతే ఽమృతం" "తేజస్సులకు తేజస్సయిన యాబ్రహ్మము నే ఆయుస్సునుగాను మోక్షమునుగాను దేవత లుపాసింతురు." అని చెప్పి యున్నారు. ఇచ్చట గ్రహింపఁబడిన జ్యోతిస్సుల నేకముగా గ్రహించి యాసముదాయము నే ప్రాణాదులలోఁ జేర్చికొని పంచసంఖ్యను పూరింపవలయును. మాధ్యందినశాఖయందును ఈజ్యోతిర్వాక్యము కలదు గాని యచ్చట నిది లేకయే పంచసంఖ్య పూర్తి యయ్యెను కావున నచ్చట దీనినిఁ జేర్చికొనవలసినపని లేదు.

మఱియు నిచ్చట చేయఁబడినది వస్తుస్వరూపకథనము కాదు. "మన సై వానుద్రష్టవ్యం" "మనస్సుచేతనే యాత్మతత్త్వమును విచారించి కనుఁగొనవలయును" అని యిచ్చట జీవపరభేదనిర్దేశపూర్వకముగ విధి కలదు. కావున పైఁ జెప్పినవిధముగ నావిధికి * వికల్పము సంభవించును. "అన్నముతోఁగాని జ్యోతితోఁ గాని ఐ దైనపంచజనములును ఆకాశంబును ఎవ్వనియం దున్నవో వాఁడే యాత్మ యని మనస్సుచే గ్రహింపవలయును" అనునదియే సిద్ధాంత మగును. కావున నెట్లు చూచినను మీామతమున నంగీకరింపఁబడినప్రధానాదులు వేదమునఁ జెప్పఁబడి యుండలేదు. మీాస్మృతియందుఁ గలప్రసిద్ధినిఁ గూర్చియును యుక్తులను గూర్చియును వెనుక విచారింపఁబడును.

---

* "ఈవిధముగఁ గాని లేక నీమార్గముగఁ గాని యీకార్యము చేయవచ్చును" అని యొకపనికి రెండుమార్గములను జూపుట వికల్పము.

# ౪. కారణత్వాధికరణము.

సంగతి:—"అధ్యాయారంభమునుండి యింతవరకు వేదాంత వాక్యము లన్నియు జగత్కారణభూతుఁ డగుపరమేశ్వరునిఁ గూర్చియే చెప్పు ననియు సర్వవేదాంతములను ఆయనయొక్క స్వరూపమునే ఏకవాక్యముగఁ జెప్పు ననియు, అనుమానముచే స్థాపింపఁబడిన ప్రధానము మొదలగునవి వేదోక్తములు కాకపోవుటచే జగత్కారణములు కానేర వనియు నిప్పటికి నిరూపించితిరి. కాని యది సరి కాదు. పరబ్రహ్మము జగత్కారణ మనువిషయమున వేదము లేకవాక్యముగ లేవు. కొన్ని సత్స్వరూపము జగత్కారణ మనియు మఱికొన్ని యసత్స్వరూపమే జగత్కారణ మనియు జెప్పుచున్నవి. సృష్టినిఁ గూర్చియు నొక్కొక్క వాక్య మొక్కొక్కవిధముగఁ జెప్పుచున్నది. కావున వేదాంతవాక్యము లన్నియు నొక్కపరమేశ్వరునే జగత్కారణముగఁ జెప్పుననుటకుఁ గాని ప్రధానాదు లప్రామాణికము లగు ననుటకుఁ గాని వేదముః పరమేశ్వరునే యేకవాక్యముగ నిరూపించుచున్నది యనుటకుఁ గాని వీలు లేదు. ఒకవేళ వేదమునందు ప్రధానాదులవృత్తాంతము లే దని పట్టు పట్టి నను దానిని (ప్రధానమును) అనుమానముచేత నైననూ సిద్ధాంతము చేసి కారణవాక్యముల నన్నిటి నేదియో యొకవిధముగ దానియందే సమన్వయించి తీరవలయును. పరమేశ్వరునియందే యట్టిసమన్వయమును చేయరాదా యనిన నది సంభవింపదు. ఆయనయొక్కస్వరూపమునకు వేద మొక్కటియే ప్రమాణము కావున నందలివైపరీత్యములు (ఆవేదమునందలి భేదములు) ఆయనయందు సమన్వితము లగుటకు వీలు లేదు. ప్రధానాదు లన్ననో అవి యనుభవానుసారముగ మనచేఁ గల్పింపఁబడునవి. కావున వానియందు వేదమునఁ గానవచ్చు భేదముల నేదియో యొకవృత్తిచే సమన్వయింపవచ్చును. కావున వేదవాక్యము నందలి విరోధమువలన మీసిద్ధాంతము నిలుపదు "అనునాక్షేపమునకు నుత్తరముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. దీనికిఁ బూర్వ గ్రంథములతోఁ గలసంబంధ మీసంబంధమే.

"మఱియుఁ బూర్వాధికరణమున జ్యోతితోఁగాని అన్నముతోఁ గాని కూడినప్రాణాదులు పంచజనములు" అని సిద్ధాంతము చేయఁబడి

యున్నది. అచ్చట *వికల్పము నాదరించుటవలన విరోధ మేమియును లేదు. అయినను "బ్రహ్మమే జగత్కారణము" అనువిషయమున మాత్ర మావిరోధము వచ్చి తీరును. వేదమునఁ గొన్నివాక్యములు సత్తే జగత్కారణ మనియు మఱికొన్ని యసత్తే జగత్కారణ మనియుఁ జెప్పుచున్నవి. ఇదియు వికల్పముగ నంగీకరింపఁబడునేని యప్పుడు పరమేశ్వరునకు ప్రత్యక్షవిరుద్ధము లగుసదసద్రూపము లుండవలసి వచ్చును. ఇది సంభవింపదు కదా. కావున పైన స్థాపింపఁబడిన న్యాయమునకు నిచ్చట భంగము వచ్చినది. ఒక్కనికే రెండువిరుద్ధరూపములను చెప్పునేని వేద మప్రమాణము కావలసివచ్చును కదా!" అని పూర్వాధికరణన్యాయముపై ప్రత్యుదాహరణసంబంధముతో వచ్చిన యాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణసంబంధము.

"ఈయధికరణమున వేదవాక్యములందలి విరోధములు కదా పరిహరింపఁబడవలయును. ఇట్లయిన నిది రెండవయధ్యాయమునందుఁ జేరవలసినయధికరణము. దానియందే కదా విరోధము లన్నియుఁ బరిహరింపఁబడును. ఇట్టి ఈయధికరణము మొదటియధ్యాయమున నేల చేర్పఁబడెను? అందును నాల్గవపాదమునందే యేల చేర్పఁబడెను" అని యెదవేమొ వినుము.

"బ్రహ్మమునందే వేదాంతవాక్యము లన్నియు సమన్వితము లగును. బ్రహ్మమే ప్రపంచమునకు నుపాదాననిమిత్తకారణములు" అని సిద్ధాంత మైనపిదప దానికి శబ్దభిన్నము లగుప్రత్యక్షాదులవలన కలుగు బాధను తొలఁగించుటయే యవిరోధాధ్యాయమునకుఁ బ్రయోజనము. అందును తృతీయచతుర్థపాదములయందు వేదవాక్యములలోని పరస్పరవిరోధములు కొన్ని నివారింపఁబడె ననుట యథార్థమే కాని అవి సమన్వయము కొఱకై నివారింపఁబడినవి కావు కదా! కావున కారణవాక్యములను గూర్చినవిరోధమును నివారించునీయధికరణ మీయధ్యాయమునందే చేర్పఁబడవలయును. ఈవిరోధము నివారింపఁబడకున్న మొట్టమొదట సమన్వయమే స్థిరము కాదు; ప్రధానాదులు వేదోక్తములు

---

* వికల్పము (పు. ౪౭౭. చూడుఁ)

కా వనువిషయమే నిలువదు. ఇట్లు నిలువకున్న మొదట సిద్ధాంతము నకే దార్ఢ్యము కలుగదు. దార్ఢ్యము కలిగినపిదపనే కదా "ప్రమాణాంతరములవలన నైనను దీనికి విరోధము కలదా ? లేదా ?" యని విచారించుటకు నవకాశము కలుగుట. కావున సమన్వయమును స్థిరపఱుచునది యగుటచే నీయధికరణము సమన్వయాధ్యాయమునఁ జేర్పఁబడెను.

మఱియు ఈయధికరణమునందు అసత్పదముయొక్క యర్థమును నిర్ణయించుటయే ప్రధానకార్యము. సత్పదము బ్రహ్మపర మనుట యిదివరకే ప్రథమపాద పంచమాధికరణమునందే నిరూపింపఁబడియున్నది. కావున నిది ఈపాదమునందుఁ జేర్పఁబడెను. ప్రథమపాదము స్ఫుటములగు బ్రహ్మలింగములు గలవాక్యములను మాత్రమే విచారించెను. ఈయసత్పద విచారమందుఁ జేరదు. ఇచ్చట బ్రహ్మలింగము లేవియు లేవు కదా! ఇఁక ద్వితీయపాదములు బ్రహ్మలింగములు స్ఫుటముగ లేనివాక్యముల విచారించినవి. ఉపాసనాపరములును జ్ఞానపరములు నగువాక్యములను విచారించినవి. ఈయసత్పదవిచార మందును జేరదు. ఇచ్చట బ్రహ్మలింగములు లేకుండుటయే కాక నుపాసనగాని జ్ఞానము కాని చెప్పఁబడి యుండ లేదు. కావున నీవిచారము నాల్గవపాదమునందే చేర్పఁబడియున్నది. ఇచ్చట బ్రహ్మసంబంధ మింత యైనను లేని సామాన్యశబ్దములుమాత్రమే కదా విచారింపఁబడుచున్నవి! కావున నిందు దోష మేమియు లేదు.

సందేహము:—ఇచ్చట జగత్కారణవాక్యములలోఁ గొన్ని సత్పరములుగాను మఱికొన్ని యసత్పరములుగాను మఱికొన్ని స్వభావపరములుగాను ఉండుటయే సంశయకారణము. "జగత్కారణవాక్యములు ఏకవాక్యములు బ్రహ్మమును చెప్పుట లేదు" అనుట పూర్వపక్షము. దీనికి "పరబ్రహ్మమునందు చేయఁబడినసమన్వయము నిలువనేరదు. అది సిద్ధించుటకై ప్రధానవిషయమున చేయఁబడినదూషణయు యుక్తము కానేరదు" అనుట ఫలము. "వేదమునందలికారణవాక్యములు బ్రహ్మమునే చెప్పును." అనుట సిద్ధాంతము. దానికి సర్వవేదవాక్యములును బ్రహ్మమునందే సమన్వితము లగును" అనుటఫలము.

పూర్వపక్షము:— వేదాంతవాక్యము లన్నియును పరమేశ్వరు నొక్కనినే కారణముగఁ జెప్పు ననుటకు నవకాశము లేకున్నది. వేద

మున నన్నిశాఖలయందును సృష్టి యొకటేవిధముగఁ జెప్పఁబడి యుండ లేదు.

కొన్నిశాఖలయందు "సృష్టికర్త యొక్కఁడున్నాఁడు. వాఁడు సద్రూపుఁడు" అని చెప్పఁబడియున్నది. "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (౧. ౧. ౫ చూడు) "ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్" "సృష్టికిఁ బూర్వమున నీప్రపంచ మంతయు * నాత్మగానే యుండెను" అను మొదలగువాక్యములయం దీవిషయము స్పష్టమై యున్నది.

మఱికొన్నివాక్యములయందు "ప్రపంచకారణము శూన్యము" అని చెప్పఁబడియున్నది. "అస ద్వా ఇద మగ్ర ఆసీత్, తతో వై స దజాయత, అస దే వేద మగ్ర ఆసీ త్తత్స దాసీత్, ఈప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వమున శూన్యరూప మైయ్యే యుండి పిదప సద్రూప మయ్యెను" అను మొదలగువాక్యములయం దీవిషయము స్పష్ట మైనది.

---

* కార్యకారణస్థితి:—కార్యములు ఉత్పత్తికిఁ బూర్వమున తమకారణముల యందే యుండును; కారణములుగానే యుండును. లోకమున ఘటము జనింపకపూర్వ మెటనైన నున్నదా ? లేదా ? యని విచారింపవలసివచ్చిన దానికి నేసమాధానము చెప్పఁ బడుచున్నది? "ఘటము తనకారణమునందు శక్తిరూపముతో నున్నది" యనియే కదా! ఉత్పత్తికిఁ బూర్వమున నది లే దనుటకు వీలు లేదు. లేనిది యొకప్పుడు జనించె ననుట యెట్లు సంభవించును ? లేమి యనఁగా : శూన్యరూపమే కదా ! "ఉత్పత్తికి బూర్వ మున లేదు; తర్వాత కలదు" అనియెద వేమో, అది విరుద్ధము. శూన్యరూప మగులేమికి కాలవిశేషముతో సంబంధ ముండుట యెట్లు ?

ఈకారణములవలన "కార్యము సర్వకాలములయందును కలదు.ఉత్పత్తికిఁ బూర్వ మునను లయానంతరమునను మనకుఁ గానరాదు"అని మాత్రమే చెప్పవలయును. కావున "కార్యములు తమకారణములయందు శక్తిరూపముతో నుండు"ననుట నిర్వివాదాంశము.

ఇఁక నాశక్తికినిఁ గారణమునకును భేదము కలదా? లేదా? యని విచారింపఁ బోయిన నది యట్లును నిర్ణయము కాదు. భేదము కల దనిన శక్తిభిన్నముగ పదార్థస్థితిఁ గానవచ్చుట లేదు ; లే దనిన వ్యవహారభేదము నిరర్థకము కావలసి వచ్చును. కావున శక్తి కిని పదార్థమునకును గలసంబంధ మనిర్వచనీయము. కావున శక్తిరూపముతో నున్న కార్యము గూడ నిట్టిసంబంధముతో నేకారణమున నున్నది. ఇట్లగుటచే సృష్టికిఁ బూర్వమున కార్యముఁ గారణమాత్రముగనే యున్న దని చెప్పవచ్చును.

ఇట్లు చెప్పుచుండియు మఱికొన్ని వాక్యములయందు అసద్వాద మును నిరాకరించి సద్వాద మంగీకరింపఁబడియున్నది. "త ద్ధైక ఆహు రస దే వేద మగ్ర ఆసీత్" "కొందఱు ఈప్రపంచము సృష్టికిఁ బూర్వ మున శూన్యరూపముగనే యుండె నందురు" అని యారంభించి "కుత స్తు ఖలు సో మ్యైవం స్యా దితి హోవాచ కథ మసత స్సజాయే తేతి స త్త్వేవ సో మ్యేద మగ్ర ఆసీత్" "ఓ శాంతుఁడా! ఇది యెచ్చటనైనఁ గలదా? శూన్యమునుండి సత్పదార్థ మెట్లు జనించును? ఇది విరుద్ధము. కావున మొట్టమొదట నీప్రపంచము సద్రూపముతోనే యుండి తీర వలయును." అని శ్వేతకేతునకు నాతనితండ్రి యుపదేశించెను" అను వాక్యముచే ఛాందోగ్యోపనిషత్తునందు అసద్వాద నిరాకరణపూర్వక ముగా సద్వాదము స్థాపింపఁబడినది.

మఱికొన్నిచోట్ల "త ద్ధేదం త ర్హ్యవ్యాకృత మాసీ త్త న్నామ రూపాభ్యా మేవ వ్యాక్రియత" "ఈప్రపంచమంతయు మొట్టమొదట నామరూపప్రకాశము లేనిదిగా నుండి కాలాంతరమున స్వయముగనే నామరూపములచే విజృంభించెను" అని స్వభావమునే ప్రపంచకారణ మునుఁగా శ్రుతి వర్ణించుచున్నది.

మఱియు సృష్టినిఁ గూడ ననేకవిధములుగఁ జెప్పుచున్నది. ఒక చోట "ఆత్మన ఆకాశ స్సంభూతః" "ఆత్మనుండి యాకాశము జనిం చెను" అని యాకాశాదిగాను, మఱికొన్నిచోట్ల "త త్తేజో ఽసృజత" "ఆబ్రహ్మము మొట్టమొదట తేజస్సును సృజించెను" అని యగ్న్యాది గాను వేఱొకచోట "స ప్రాణ మసృజత ప్రాణా చ్ఛ్రద్ధాం" "ఆపరమే శ్వరుఁడు మొట్టమొదట ప్రాణమును సృజించెను దానినుండి శ్రద్ధను సృజించెను" అని ప్రాణాదిగాను సృష్టి చెప్పఁబడియున్నది. కొన్నిచోట్ల క్రమమే లేకుండ "స ఇమా ల్లోకా నసృజత అంభో మరీచి ర్మర మాపః" "ఆపరమేశ్వరుఁడు జలమయదేహములు గలస్వర్గలోకమును కిరణ ప్రధాన మగునంతరిక్షలోకమును మరణశీల మగుమనుష్యలోకమును జలముతో నధికముగ నిండియున్నపాతాళలోకమును మఱియు నన్ని లోకములను సృజించెను" అని సృష్టి చెప్పఁబడియున్నది. ఇన్నివిధము లుగ నొక్కఁడే సృజించె ననుట సంభవింపదు కదా!

పైన వర్ణించినవిధముగ కార్యము లనేకవిధము లగుటచేఁ గారణములు గూడ ననేకవిధములే యని తోఁచుచున్నది. కారణవిషయమునందును ప్రత్యక్షముగఁ గూడ పరస్పరవిరుద్ధవాక్యములు కానఁబడుచునే యున్నవి యని మొట్టమొదటనే నిరూపించి యుంటిమి. ఈవిధముగ పరస్పరవిరోధములు గానవచ్చుచుండిన "ఏకరూపుఁడగుపరమేశ్వరుఁడే జగత్కారణము" అనువిషయ మెట్లు నిర్ణయ మగును? "వేదాంతములన్నియును బరమేశ్వరునందే యేకవాక్యముగ సమన్వయము నొందును" అనువిషయ మెట్లు సిద్ధాంత మగును? బ్రహ్మవిషయ మగుసమన్వయమును సిద్ధాంతము చేసికొనుటకై మీరు చేసినప్రధానదూషణ మెట్లు నిలుచును? "ప్రధానము వేదోక్తము కాదు." అనువిషయ మెట్లు నిర్ణయ మగును? కావున నెట్లు చూచినను మీసిద్ధాంతము నిలువదు. అనుమానాదులచే వేఱొకకారణము నూహించుటయే యుక్తము.

విషయము:—అనునీపూర్వపక్షమును నిరాకరించుటకై పై నుదహరింపఁబడిన వాక్యములయర్థ మీయధికరణమున విచారింపఁబడును. ముఖ్యముగ అసద్వాదరూపములుగఁ గానవచ్చుచున్న వాక్యములయర్థమే యిందు నిర్ణయింపఁబడును. అవియే కదా సర్వసంశయములకును మూల కారణములు.

అవతారిక:—అందు మొదట నీక్రిందిసూత్రముచే "సృష్టిని గూర్చి కానవచ్చుచున్నవిరోధములవలన బ్రహ్మమునకుఁ గలకారణత్వమునకు బాధ రాదు" అనువిషయమును నిర్ణయించుచున్నాఁడు.

## ౧౨౦. కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః. ౧. ౪. ౧౪.

తాత్పర్యము:—ఇట్టిసంశయముతో పని లేదు. సృష్టివిషయమైయున్నిభేదములు గానవచ్చుచున్నను వానివలన పరమేశ్వరునియందు భేదము సంభవింపదు. ఒకశాఖయందు ఏవిధముగ వర్ణింపఁబడి యున్నాఁడో ఆవిధముగనే మఱియొకశాఖయందుఁ గూడఁ బరమేశ్వరుఁడు వర్ణింపఁబడియున్నాఁడు. ఎట్లనిన:—

తైత్తిరీయోపనిషత్తునందు మొట్టమొదట "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (౧. ౧. ౨. చూడు) అనువాక్యముచేతను, సృష్టిని వర్ణించు

నప్పుడు చెప్పఁబడిన "సో ఽకామయత" "ఆపరమేశ్వరుఁడు సృష్టిని చేయవలయు నని సంకల్పించెను" అనువాక్యముచేతను, "పరమేశ్వరుఁడు చేతనుఁడు" అని నిర్ణయింపఁబడినది. పిదప అన్నమయాది*పంచకోశములను నిరూపించుటచేతను బ్రహ్మవిషయ మగు నాత్మశబ్దము నచ్చటచ్చట ప్రయోగించుటచేతను, "జీవబ్రహ్మములకు భేదము లేదు" అనువిషయము నిరూపింపఁబడినది. (ఈవిషయము చూ. ఆనందమయాధికరణము. ౧. ౧. ౧౨ ౧౯. డు). తర్వాత "బహు స్యాం ప్రజాయేయేతి" "నేను సర్వరూపుఁడ నయ్యెదను అని సృష్టికర్త నిశ్చయించెను." అనువాక్యముచే "ఈసర్వప్రపంచంబును బ్రహ్మమునకంటె వేఱు కాదు" అనువిషయము నిర్ధారణ చేయఁబడెను. పిమ్మట "ఇదం సర్వమసృజత" "ఈప్రపంచము నంతయును పరమేశ్వరుఁడు కల్పించెను" అనువాక్యముచే "సృష్టికిఁ బూర్వమునఁ బరమేశ్వరుఁ డద్వితీయుఁడై యుండెను." అనువిషయము స్పష్టము చేయఁబడియున్నది. ఇట్లే సర్వశ్రుతులయందునుఁ గూడ చేతనుండును జీవాభిన్నుండును అద్వితీయుండు నగుపరమేశ్వరుఁడే జగత్కారణ మనియు, ఈప్రపంచమునకు నాతనికిని భేదము లే దనియు వర్ణింపఁబడియున్నది. ఎట్లనిన:—

ఛాందోగ్యోపనిషత్తునందు "స దేవ సో మ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయం. త దైక్షత బహు స్యాం ప్రజాయే యేతి. త త్తేజో సృజత సేయం దేవ తైక్షత హం తాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవా ణీతి" (అర్థముకాని వాక్యభాగమునకు నర్థము) "జీవరూపముతోఁ బ్రవేశించి యీ తేజోజలపృథువులనామరూపములను ప్రకటించెదనని యాపరమేశ్వరుఁడు తలంచెను" అని యున్నది. ఇచ్చట "తలంచెను" అనునది చేతనునిపని యగుటచేతను, ఆత్మశబ్దముచేఁ వర్ణింపఁబడినజీవుఁడు పరమేశ్వరునిస్వరూపముగఁ జెప్పఁబడి యుండుటచేతను, "పరమేశ్వరుఁడు చేతనుఁడు" అను విషయము స్పష్ట మగుచున్నది. ఐతరేయోపనిషత్తునందు "ఆత్మావా ఇద మేక ఏ వాగ్ర ఆసీ న్నాన్య త్కించన మిషత్ స ఐక్షత లోకా న్ను సృజా ఇతి" ఆపరమేశ్వరుఁడు సృష్టికిఁ బూర్వమున నొక్కఁడే యుండి పిదప తానే ప్రపంచరూపముగ నగుటకు సంకల్పించెను." అని యున్నది.

* అన్నమయాదిపంచకోశములు. (పు. ౯౫౨ చూడు.)

కావున నెట్లు చూచినను అన్నిస్థలములయందును జగత్కారణభూతుఁ డగుపరమేశ్వరుఁ డొక్కవిధముగనే వర్ణింపఁబడియుండుటచే సృష్టు లెన్ని విధములుగఁ జెప్పఁబడినను ఆయనయందు భేదము కలుగదు.

సిద్ధాంతము:— ఒకదానియందు గానవచ్చుచున్నభేదము మఱి యొకదానిపై నారోపించుటకంటె ననౌచిత్య మేది కలదు? "కార్యకారణ విషయ మట్టిది కాదు" అనియెద వేమొ సత్యమే. మీరు చేయునట్లు మేమును కార్యమునుఁ బట్టి కారణమును సాధింప నెంతుమేని యప్పుడు కార్య భేదమువలన కారణభేదము తటస్థించు ననుట సత్యమే. అయినను మామత మట్టిది కాదు కదా! ఇఁకఁ బరమేశ్వరునకుఁ గార్యభేదమువలన భేద మెట్లు రాఁగలదు? శ్రుతియందు సర్వజ్ఞత్వము సర్వవ్యాపకత్వము. అద్వితీయత్వము మొదలగులక్షణములచేఁ బరమేశ్వరస్వరూపము ప్రత్యే కముగ నిరూపింపఁబడియున్న దని యిదివరకే నిరూపించియున్నాము. ఇట్లుండ నాయనకుఁ జెప్పఁబడినప్రపంచకారణత్వము తత్స్వరూప పరి జ్ఞానార్థమై కల్పింపఁబడినయుక్తియే యగును గాని మఱేమియుఁ గానే రదు. "అన్నేన సౌమ్య శుంగే నాపో, మూల మన్విచ్ఛాద్భిః సోమ్య శుంగేన తేజో మూల మన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన స న్మూల మన్విచ్ఛ" "ఓశాంతుఁడా! సృష్టి యీవిధముగ నయ్యెను. కావున కార్య మగుభూమి నాశ్రయించి దానిమూలమున కారణ మగుజలమును గ్రహింపఁ బ్రయత్నింపుము. (అనఁగా: భూమిని జలమాత్రముగాఁ గాంచు ననుట) ఆజలరూపకార్యమును గైకొని దానిమూల మగు తేజస్సును గ్రహింపఁ బ్రత్నింపుము (జలమును తేజోమాత్రముగాఁ జూడు మనుట) ఆ తేజస్సు కూడఁ గార్యమే కావున దాని నాశ్రయించి సర్వకారణ మగు సత్పదార్థమును గ్రహింపుము. (అనఁగా: ఆ తేజస్సును బ్రహ్మమా త్రముగాఁ జూడు మనుట)" అనువాక్యముచే శ్రుతి ఈవిషయమును స్పష్టముఁ జేయుచున్నది. మఱియు "మృల్లోహవిస్ఫులింగాద్యైః సృష్టి ర్యా చోదితా న్యథా ఉపాయః స్సోఽవతారాయ నాస్తి భేదః కథం చ న" "మట్టి, ఇనుము, మిడుగురులు, అనుమొదలగువానిని దృష్టాం తములనుగాఁ జెప్పి యనేకవిధములుగ సృష్టిని వర్ణించుట యెల్ల ప్రపంచ బ్రహ్మభేదమును గ్రహించుటకు నుపాయముమాత్రమే. భేద మను నది యన్నిటికిని లేనేలేదు." అని తత్త్వవేత్త లగుమహానుభావులును

చెప్పుచున్నారు. ఈకారణమునవలన సృష్టియందు ఎన్ని భేదము లున్నను మామతము ననుసరించి వానితో సృష్టికర్తకు సంబంధ మొక్కింతయైన నుండదు.

ఇదియునుగాక మామతమున సృష్టిని బ్రతిపాదించుటవలన బ్రహ్మప్రపంచాభేదజ్ఞానమునకంటె నితరప్రయోజనము లేదు. అట్టిప్రయోజనము కల దనుటకును వీలు లేదు. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి" అని శ్రుతి కేవలప్రపంచజ్ఞానమును నిషేధించుచున్నది. బ్రహ్మస్వరూపజ్ఞానమువలననే మోక్షము కలుగు నని స్పష్టముగఁ జెప్పుచున్నది. "జ్ఞానా దేవ తు కైవల్యం బ్రహ్మవి దాప్నోతి పరం, త మేవ విది త్వాఽతిమృత్యు మేతి నాన్యః పంథా విద్య తే ఽయనాయ" "జ్ఞానమునవలనమాత్రమే మోక్షము కలుగుచున్నది. బ్రహ్మవేత్త మోక్షమునుఁ జెందును. ఆబ్రహ్మమును తెలిసికొనుటచేత మాత్రమే మోక్షమును జెందును; కాని ఇంతకంటె దానికి రెండవ మార్గ మేదియును లేదు." అనుమొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఆబ్రహ్మంబును మనకుఁ బరోక్షము కాదు. "త త్త్వ మసి" అనువాక్యముచే శ్రుతి "మనము సంసారి యనియు సుఖదుఃఖముల నొందువాఁ డనియుఁ దలంచుచున్న జీవుఁడే వాస్తవస్థితిలో బ్రహ్మము" అని చెప్పుచున్నది. కావున సృష్టియం దెన్నిభేదము లున్నను దానితో మనకుఁ బని లేదు. సాధకుఁ డగువాఁడు తనబుద్ధికి నేది యనుకూలముగా నుండునో యామార్గమును గ్రహించి, "సృష్టి యట్లే జరిగెను." అని నిశ్చయించి దాని నుపాయముగఁ గైకొని కారణభూతుఁ డగుపరమేశ్వరుని గ్రహింపవలయును. ఇంతియే గాని సృష్టితో నిఁక నేమియుఁ బని లేదు. కావునఁ బ్రసంగవశమున జెప్పఁబడిన యీ సృష్టివాక్యములు అర్థవాదవాక్యములవంటివి. అర్థవాదములలోని భేదములు విషయమునకు వికారమును గలిగింపనట్లు ఇదియుఁ బరమేశ్వరునకు వికారము గలిగింపవు. ఎట్లనిన:—

వేదమునందు ఇంద్రియములకును ప్రాణములకును సంవాదము జరిగె ననియు, అందు ఇంద్రియములు ప్రాణమును తిరస్కరించి స్వయముగ తమవ్యాపారములను జరుపఁబోయి శక్తిహీనము లయ్యె ననియుఁ జెప్పఁబడి యున్నది. దీనికి "ప్రాణము శరీరమునందుఁ గలతక్కినవాని

కంటె శ్రేష్ఠము" అని చెప్పుటయే యుద్దేశము కాని యథార్థముగ నిట్టిసంవాదము జరిగె నని చెప్పుట కాదు. ఈసంవాదములు భిన్నభిన్న స్థలములయందు భిన్నభిన్నస్వరూపములతో నున్నవి. ఈసంవాదములు యథార్థముగనే జరిగి యుండునేని యట్టిభేద ముండుటకు వీలు లేదు కదా! ఇట్లే ప్రస్తుతసృష్టివాక్యములకును "బ్రహ్మమునకును ప్రపంచమునకును భేదము లేదు" అనువిషయమును నిరూపించుటయే యుద్దేశము గాని ప్రపంచసృష్టిని నిర్ణయించుట కాదు. వాస్తవస్థితిలో ప్రాణేంద్రియ సంవాదమువలెనే ఈప్రపంచంబును లేదు. కావున సృష్టివాక్యములయం దెన్నివిరోధము లున్నను పరమేశ్వరరూపమున విరోధము లేదు.

ఇట్లు చెప్పుటయు ననవసరమే. సృష్టివాక్యములయందు మాత్రము విరోధము నేల యంగీకరింపవలయును? అందును విరోధము బొత్తిగనే లేదు. కల్పభేదము నాశ్రయించి సృష్టిభేదము కలిగి యుండవచ్చును. ఒకకల్పమునఁ బ్రపంచ మాకాశాదిగాను మఱియొకకల్పమున నగ్న్యాదిగాను జనించి యుండవచ్చును. వేఱొకకల్పమునఁ గ్రమము లేకుండఁగ నొక్కమాఱే పుట్టియు నుండవచ్చును. ఇందు విరోధమేమి?

ఇట్లు కాకున్నను మఱియొకవిధముగఁ జెప్పవచ్చును. లోకమున నొకపురుషుఁడు మొట్టమొదట దండమును సంపాదించి పిదప చక్రమును నిర్మించి తర్వాత కుండనుఁ జేసి పిమ్మట దానితో నీరు దెచ్చి యనంతరమున నానీటిచే నాహారపదార్థమును సంస్కరించి యాపల వంట చేయవచ్చును. ఇప్పుడు వీని కన్నిటికిని ఆపురుషుఁడే కారణము. వీనియందును కార్యకారణభావము ననుసరించి క్రమము కలదు. ఇట్లున్నను "ఆపురుషుఁడు నీటినిఁ దెచ్చి వంట చేసెను. బియ్యము కడిగి వంట చేసెను. స్వయముగనే కుండను చేసి దానితో నీటినిఁ దెచ్చి వంటఁ జేసెను" అని చెప్పవచ్చును కదా! క్రమము ననుసరించియే యెన్నిస్థలములయందునుఁ జెప్పఁబడి యుండవలయు నను నియమము లోకమునందువలెనే వేదమునందును లేదు. పైనఁ జూపినవ్యవహారములు ప్రత్యక్షసిద్ధము లనుటలో సంశయము లేదు కదా! కావున నిట్లే శ్రుతియు నొకచోట నాకాశాదిరూపముగఁ గలక్రమము నంతయును వివరించినది; మఱియొకచోట నాకాశవాయువులను విడచి తేజస్సుమొదలుకొనియే చెప్పి

నది. తేజస్సునకుఁ గూడ నాపరమేశ్వరుఁడే కారణభూతుఁ డనుటలో సంశయము లేదు కదా! ఇట్లే మఱికొన్నింటిని గూడ విడిచి మఱి యొక్కచో మఱియొకవిధముగఁ జెప్పినది. ఇంతమాత్రమున సృష్టి క్రమము చెడిపోవునా? మఱియు సాధనముల నొక్కదాని నైన గ్రహింపక యే "ఆపురుషుఁడు వంట చేసెను" అనునట్లు, వేదము కూడఁ గొన్ని చోట్ల "బ్రహ్మము సర్వప్రపంచమును సృజించెను" అని క్రమము నపేక్షింపక యే చెప్పినది. ఆలోకవ్యవహారములయందును "వినువారలకు వంటఁ జేయుసాధనములనుఁగూర్చియు వారిసాధనములనుగూర్చియుఁ దెలిసియే యుండును" అని యభిప్రాయము; ఈ వేదవ్యవహారమునకును "వినువార లకు సృష్టినిఁగూర్చియు దానిక్రమమునుఁ గూర్చియుఁ దెలిసియే యుం డును" అని యభిప్రాయము. ఇందు విరోధ మేమి? కావున బాగుగ విచారించిన మొట్టమొదట సృష్టివాక్యములకుఁ గూడ పరస్పరవిరోధమే లేదు; ఉన్నను అది కారణభూతుఁ డగుపరమేశ్వరుని బాధింపనేరదు. కావున వేదాంతవాక్యము లన్నియు నొక్కబ్రహ్మమునుగూర్చి మాత్రమే చెప్పును; గాని యితరపదార్థమును గూర్చి చెప్పవు. మేము న్యాయాది ప్రసిద్ధి ననుసరించి మఱియొక కారణమును కల్పింప నక్కఱ లేదు? అట్లు కల్పించిన కారణమునందు వేదము సమన్వయింపదు.

## అ ౧. పా ౪. సూ ౧౫. ఆరంభము.

అవతారిక:—ఇట్లు సృష్టివాక్యములలోని విరోధమువలనఁ బర మేశ్వరునకు హాని లేదని నిరూపించి, యిప్పుడు కారణప్రతిపాదకము లగువాక్యములయందు విరోధమే లేదని నిరూపించుచున్నాఁడు.

## ౧౨౧. సమాకర్షాత్. ౧. ౪. ౧౫.

తాత్పర్యము:—మఱియు కారణవాక్యములయందును నీవన్నట్లు విరోధము రాదు. అచ్చట అసత్పరములుగాఁ గొన్నివాక్యములు గాన వచ్చుచున్నను ప్రస్తావవశమున బ్రహ్మము అనువర్తించుచుండుటచే వాని యర్థమును శూన్యపరముగఁ జెప్పఁగూడదు. స్వభావపరమువలెఁ గాన వచ్చుచున్న బృహదారణ్యవాక్యమునకును బ్రహ్మసంబంధము కలదు. కావునఁ గారణవాక్యములలో విరోధము లేదు.

ఆబ్రహ్మసంబంధ మెట్లనిన:—తైత్తిరీయోపనిషత్తునందు జీవబ్రహ్మైక్యమును నిరూపించి "అసన్నేవ స భవతి అస ద్బ్రహ్మేతి వేద చేత్ (౧. ౧. ౧౩. చూడుడు)" అను వాక్యముచే "పరమేశ్వరుఁడు సద్రూపుఁడు" అని నిరూపించి, యాయుననుండియే "సోఽకామయత" అను మొదలగు వాక్యములచే సర్వప్రపంచసృష్టినిఁ జెప్పి, పిదప "త ద ప్యేష శ్లోకో భవతి" "ఈచెప్పినవిషయము నీశ్లోకము కూడ వర్ణించుచున్నది" అని పైఁజెప్పినవిషయమును నిరూపించుటకై యొకశ్లోక ముదాహరింపఁబడియున్నది. "అస ద్వా ఇద మగ్ర ఆసీత్" అనునది యాశ్లోకమే. ఇట్లుండ నీశ్లోకార్థము శూన్యపర మగుట యెట్లు? మొట్టమొదటి నుండియు సద్రూప మగుబ్రహ్మమునుఁ జెప్పుచు వచ్చి "ఈవిషయమును నిర్ణయించుటకై యే శ్లోకము నుదహరించుచున్నాను" అని చెప్పి మఱియొకవిషయమునుఁ బ్రతిపాదించుశ్లోకము నసంబంధముగ నుదహరించునా? అట్లుదాహరించిన వేదము ప్రమాణ మగునా? కావున నావాక్యము ఎట్లును శూన్యపరము కానేరదు. "ఇట్లయిన నచ్చటి యసచ్ఛబ్దమునకు నర్థమేమి?" అనియెదవేమొ వినుము. సామాన్యముగ లోకమున నామరూపములు గలపదార్థములే కాని ప్రత్యక్షగోచరము లగుట లేదు; వానినిఁ గూర్చియే కాని సచ్ఛబ్దము (ఉన్నది యనుమాట) ప్రయోగింపఁబడుచుండుట లేదు. కావున అసచ్ఛబ్దమునకు "నామరూపములు లేనిదియగుటచే శూన్యరూపమువలె" అని యర్థము. కావున నీశ్రుతివలనఁ గారణవాక్యములకు విరోధము రాదు.

ఛాందోగ్యోపనిషత్తునందలివాక్యమునకును ఇట్లే యర్థముఁ జెప్పవలయును. అచ్చటఁ గూడ "అస దే వేద మగ్ర ఆసీత్" అనువాక్యమునకుఁ బిదప "త త్స దాసీత్" అని సచ్ఛబ్దము ప్రయోగింపఁబడియున్నది. పూర్వవాక్యమున కేవలశూన్యమే జగత్కారణముగ లేక * జగద్రూపముగ నంగీకరింపఁబడి యుండునని యుత్తరవాక్యమున సచ్ఛబ్దముచే దేనిని చెప్పియుండును? తచ్ఛబ్దముచే శూన్యమునే పరామర్శించియుండినయెడల నందు సచ్ఛబ్ద మెట్లు సమన్వయించును? శూన్యమునకును సత్తునకును గలవిరోధము దుర్నివారము కదా! కావున

---

* జగత్తుయొక్క సూక్ష్మరూపమే జగత్కారణ మనువిషయము ఆనుమానికాధికరణమున సూత్రవివరణమునందే వివరింపఁబడియున్నది (పు. ౧-౪-౨-౩. చూడు.)

నీవాక్యమువలనఁ గూడ కారణవాక్యమునకు విరోధము లేదు. ఇట్లు చెప్పుటచే నసత్పరములుగఁ గానవచ్చు వేదవాక్యములు సూక్ష్మావస్థయం దున్నప్రపంచమునుఁ జెప్పునవియే కాని శూన్యమును చెప్పునవి కా వని సిద్ధాంత మైనది; ఇఁక నిట్టివాక్యములచేఁ గారణవాక్యములకు విరోధము రా దనుట స్పష్ట మైనది.

ఇఁక "త ద్ధైక ఆహు రస దే వేద మగ్ర ఆసీత్" అనుమొద లగువాక్యములవలన నాకారణవాక్యములకు బొ త్తిగనే విరోధము కలుగనేరదు. ఇవి యసద్వాదమును ఖండించి సద్వాదమును బలపఱుచుచునే యున్నవి కదా: "ఇట్లు కాదు. అసచ్ఛబ్దమునకు నామరూపరహిత మగుప్రపంచమే యర్థ మగునేని దానిని నిరాకరించు నీవాక్యములకును ఆవాక్యములకును విరోధము వచ్చును కదా!" అనియెదవేమొ యిట్లు కాదు. ఈవాక్యములయందు ప్రపంచకారణము నెఱుంగలేని మందబుద్ధులు "ప్రపంచకారణము శూన్యమే" అని చేయువాదముమాత్రమే ఖండింపఁబడినది కాని శ్రుతిప్రసిద్ధ మగునసచ్ఛబ్దార్థము కాదు. శ్రుతియందు "సత్పదార్థమే జగత్కారణము" అని నిరూపింపఁబడినది యని యిదివఱకు సిద్ధాంతము చేసియున్నాము. ఇప్పుడు "అసత్పదార్థము జగత్కారణము" అని కొందఱు చెప్పుదురు" అని వేదమున గానవచ్చుచున్నది. ఇది పూర్వసిద్ధాంతమునకు విరుద్ధమే యైనచో వేదవాక్యము లన్నియు సమానబలములే కావున వికల్ప మేర్పడవలసియుండును. అది చెల్లదు. విధియందు వికల్పము కలుగవచ్చును గాని వస్తుస్వరూపమున వికల్పము గలుగదు కదా! కావున నవశ్యముగ నిది సద్వాదమును దృఢము చేయుటకై మందమతికల్పిత మగునసద్వాదమును నిరాకరించుటయే కాని శ్రుతిసమ్మత మగునసత్పదార్థమును నిరాకరించుట కా దనియే సిద్ధాంతము చేయవలసియుండును. కావున నిట్టివాక్యములవలనఁ గూడఁ గారణవాక్యములకు విరోధము రాదు.

మఱియు "త ద్ధేదం త ర్హ్యవ్యాకృత మాసీత్" అను బృహదారణ్యవాక్యము కూడ స్వభావపరము కాదు. లోకమున జడపదార్థ మేదియు చేతనసంబంధము లేక స్వయముగ నొకకార్యమునుఁ జేయుట ప్రత్యక్షమున లేదు. కావున ప్రథమసృష్టియందు నిట్లే యుండవలయును. ప్రపంచము జడము కావున నది తనకాధారముగ నున్న చేతనునిసహా

యము చేతనే నామరూపములతో విస్తరించి యుండవలయును. "పైరు, కోత పడుచున్నది" అనువాక్యమునకు పైరు తన్ను దానే కోసుకొనుచున్నది"అని యెవ్వఁడు నర్థము చెప్పుట లేదు కదా! మఱియు*కర్మకర్తరి ప్రయోగము చేతనుఁ డగుకర్త నాశ్రయించి కాని యుండదు. ఇట్లు కాకున్నను "వ్యాక్రియత" అను * యత్ప్రత్యయాంతక్రియను *కర్మణి ప్రయోగమున నున్నదానినిగానే గ్రహింపవచ్చును. అప్పుడు "పని చేయఁబడుచున్నది" అను మొదలగు వాక్యములయందువలె కర్త యొక్క డపశ్యముగ అర్థబలమువలన గ్రహింపఁబడును. అప్పుడు మీసందేహమునకే యవకాశము లేదు కదా!

ఇంత యేల. ఆబృహదారణ్యకోపనిషత్తునందును పై వాక్యమునకుఁ బిదప "స ఏష ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" "ఆసృష్టికర్తయే గోటికొనవరకుఁ గలసర్వదేహమునందునుఁ బ్రవేశించును" అనువాక్యము కలదు. ఇందు ఒకపురుషుఁడు సర్వప్రపంచమునందును (దేహ మన్నను ప్రపంచ మన్న నొక్కటియే. సర్వమును భూతవికారమే కదా!) ప్రవేశించియున్నాఁ డని చెప్పఁబడియున్నది. ఆపురుషుఁడును పూర్వమునం

---

* ఒకపదార్థమే కర్తయు కర్మయుగాఁ జెప్పఁబడెనేని యది కర్మకర్తరిప్రయోగము. "వాఁడు తన్ను దానే నిందించుకొనెను. తనయవివేకమున తననే చెఱుచుకొనెను" అను మొదలగునవి.

* "బడు" అనునర్థము కావలసినప్పుడును కర్మకర్తరిప్రయోగమునందునుఁ గూడ సంస్కృతభాషయందు క్రియలపై "యక్" ప్రత్యయము ప్రయోగింపఁబడును. ఈప్రత్యయమునకు "య" అనునదియే స్వరూపము ఈప్రత్యయ మంతమునఁ గలక్రియలు "భూయతే, లూయతే, స్విద్యతే" మొదలగునవి.

* కర్మాధీనముగఁ గ్రియ ప్రయోగింపఁబడెనేని యది కర్మణిప్రయోగము. అందు క్రియకు వచనంబును పురుషయు గర్మానుసారముగ వచ్చును. సంస్కృతభాషయందు ఈప్రయోగమునఁ గర్త తృతీయావిభక్తియం దుండును. ఇతరభాషలయందు కర్మయే కర్తగా గణింపఁబడును. కర్మణిప్రయోగమునఁ గర్మ ప్రథమావిభక్తియం దుండును. కావున నంతమాత్రముననే వారు దానినిఁ గర్తగా గణింతురు. ప్రథమావిభక్తియం దున్నపదమే కర్త యని వారిమతము. దీనికి నాంధ్రభాషయందు "పడు" అని క్రియపై వచ్చుప్రత్యయము గుఱుతు. "రామునిచే రావణుఁడు సంహరింపఁబడెను. కుమ్మరిచే కుండలు చేయఁబడినవి. రాజులచే యుద్ధము చేయఁబడుచున్నది." అను మొదలగునవి దీని కుదాహరణములు.

నీవాక్యమువలనఁ గూడ కారణవాక్యమునకు విరోధము లేదు. ఇట్లు చెప్పుటచే నసత్పరములుగఁ గానవచ్చు వేదవాక్యములు సూక్ష్మావస్థయం దున్నప్రపంచమునుఁ జెప్పునవియే కాని శూన్యమును చెప్పునవి కా వని సిద్ధాంత మైనది ; ఇఁక నిట్టివాక్యములచేఁ గారణవాక్యములకు విరోధము రా దనుట స్పష్ట మైనది.

ఇఁక "త ద్ధైక ఆహు రస దే వేద మగ్ర ఆసీత్" అనుమొదలగువాక్యములవలన నాకారణవాక్యములకు బొత్తిగనే విరోధము కలుగనేరదు. ఇవి యసద్వాదమును ఖండించి సద్వాదమును బలపఱుచుచునే యున్నవి కదా: "ఇట్లు కాదు. అసచ్ఛబ్దమునకు నామరూపరహితమగు ప్రపంచమే యర్థ మగునేని దానిని నిరాకరించు నీవాక్యములకును ఆవాక్యములకును విరోధము వచ్చును కదా!" అనియెదవేమొ యిట్లు కాదు. ఈవాక్యములయందు ప్రపంచకారణము నెఱుంగలేని మందబుద్ధులు "ప్రపంచకారణము శూన్యమే" అని చేయువాదముమాత్రమే ఖండింపఁబడినది కాని శ్రుతిప్రసిద్ధ మగునసచ్ఛబ్దార్థము కాదు. శ్రుతి యందు "సత్పదార్థమే జగత్కారణము" అని నిరూపింపఁబడినది యని యిదివఱకు సిద్ధాంతము చేసియున్నాము. ఇప్పుడు "అసత్పదార్థము జగత్కారణము" అని కొందఱు చెప్పుదురు" అని వేదమున గానవచ్చుచున్నది. ఇది పూర్వసిద్ధాంతమునకు విరుద్ధమే యైనచో వేదవాక్యములన్నియు సమానబలములే కావున వికల్ప మేర్పడవలసియుండును. అది చెల్లదు. విధియందు వికల్పము కలుగవచ్చును గాని వస్తుస్వరూపమున వికల్పము గలుగదు కదా! కావున నవశ్యముగ నిది సద్వాదమును దృఢము చేయుటకై మందమతికల్పిత మగునసద్వాదమును నిరాకరించుటయే కాని శ్రుతిసమ్మత మగునసత్పదార్థమును నిరాకరించుట కా దనియే సిద్ధాంతము చేయవలసియుండును. కావున నిట్టివాక్యములవలనఁ గూడఁ గారణవాక్యములకు విరోధము రాదు.

మఱియు "త ద్ధేదం త ర్హ్యవ్యాకృత మాసీత్" అను బృహదారణ్యవాక్యము కూడ స్వభావపరము కాదు. లోకమున జడపదార్థమేదియు చేతనసంబంధము లేక స్వయముగ నొకకార్యమునుఁ జేయుట ప్రత్యక్షమున లేదు. కావున ప్రథమసృష్టియందు నిట్లే యుండవలయును. ప్రపంచము జడము కావున నది తనకాధారముగ నున్న చేతనునిసహా

యము చేతనే నామరూపములతో విస్తరించి యుండవలయును. "పైరు, కోత పడుచున్నది" అను వాక్యమునకు పైరు తన్ను దానే కోసుకొనుచున్నది" అని యెవ్వఁడు నర్థము చెప్పుట లేదు కదా! మఱియు*కర్మకర్తరి ప్రయోగము చేతనుఁ డగుకర్త నాశ్రయించి కాని యుండదు. ఇట్లు కాకున్నను "వ్యాక్రియత" అను * యత్ప్రత్యయాంతక్రియను *కర్మణి ప్రయోగమున నున్నదానినిగానే గ్రహింపవచ్చును. అప్పుడు "పని చేయఁబడుచున్నది" అను మొదలగు వాక్యములయందువలె కర్త యొక్కడవశ్యముగ అర్థబలమువలన గ్రహింపఁబడును. అప్పుడు మీాసందేహమునకే యవకాశము లేదు కదా!

ఇంత యేల. ఆబృహదారణ్యకోపనిషత్తునందును పై వాక్యమునకుఁ బిదప "స ఏష ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" "ఆసృష్టికర్తయే గోటికొనవరకుఁ గలసర్వదేహమునందునుఁ బ్రవేశించును" అనువాక్యము కలదు. ఇందు ఒకపురుషుఁడు సర్వప్రపంచమునందును (దేహ మన్నను ప్రపంచ మన్న నొక్కటియే. సర్వమును భూతవికారమే కదా!) ప్రవేశించియున్నాఁ డని చెప్పఁబడియున్నది. ఆపురుషుఁడును పూర్వమునం

---

* ఒకపదార్థమే కర్తయును కర్మయునుగాఁ జెప్పఁబడెనేని యది కర్మకర్తరి ప్రయోగము. "వాఁడు తన్ను దానే నిందించుకొనెను. తనయవివేకమున తననే చెఱుచుకొనెను" అను మొదలగునవి.

* "బడు" అనునర్థము కావలసినప్పుడును కర్మకర్తరిప్రయోగమునందునుఁ గూడ సంస్కృతభాషయందు క్రియలపై "యక్" ప్రత్యయము ప్రయోగింపఁబడును. ఈప్రత్యయమునకు "య" అనునదియే స్వరూపము ఈప్రత్యయ మంతమునఁ గలక్రియలు "భూయతే, లూయతే, స్విద్యతే" మొదలగునవి.

* కర్మాధీనముగఁ గ్రియ ప్రయోగింపఁబడెనేని యది కర్మణిప్రయోగము. అందు క్రియకు వచనంబును పురుషయును గర్మానుసారముగ వచ్చును. సంస్కృతభాషయందు ఈప్రయోగమునఁ గర్త తృతీయావిభక్తియం దుండును. ఇతరభాషలయందు కర్మయే కర్తగా గణింపఁబడును. కర్మణిప్రయోగమునఁ గర్మ ప్రథమావిభక్తియం దుండును. కావున నంతమాత్రమున నే వారు దానినిఁ గర్తగా గణింతురు. ప్రథమావిభక్తియం దున్నపదమే కర్త యని వారిమతము. దీనికి నాంధ్రభాషయందు "పడు" అని క్రియపై వచ్చుప్రత్యయము గుఱుతు. "రామునిచే రావణుఁడు సంహరింపఁబడెను. కుమ్మరిచే కుండలు చేయఁబడినవి. రాజులచే యుద్ధము చేయఁబడుచున్నది." అను మొదలగునవి దీని కుదాహరణములు.

దొక్కమాటు వర్ణింపఁబడినవాఁడే యైనట్లు "సః" అనుతచ్ఛబ్దము సూచించుచున్నది. ఈవాక్యమునకుఁ బూర్వమున నున్నవాక్యము "తద్ధేదం" అనువాక్యమే. ఆయవ్యాకృతము చేతనపురుషసహాయము లేక స్వయముగనే ప్రకాశము నొంది యుండునేని యప్పుడు ప్రకృతవాక్యమున నున్నతచ్ఛబ్దముచే శ్రుతి యెవ్వని పరామర్శించును ? కావున చేతనసహాయముచేతనే యాయవ్యాకృతము వ్యాకృత మైనది. (అనఁగా నామరూపములతోఁ బ్రసిద్ధి నొందినది). మఱియు ప్రపంచమునఁ బ్రవేశించి యున్నయాపురుషుఁడు చేతనుఁడనియు నాబృహదారణ్యకశ్రుతియే యుత్తరవాక్యమునఁ జెప్పి యున్నది. "పశ్యం శ్చక్షుః శృణ్వం శ్రోత్రం మన్వానో మనః" "ప్రపంచమునందుఁ బ్రవేశించి యున్నయాపురుషుఁడే వినుచుండుటచే శ్రోత యయ్యెను. చూచుచుండుటచే ద్రష్ట యయ్యెను.తలంచుచుండుటచే మంత యయ్యెను.ఆయనయే సర్వకార్యముల నాచరించువాఁడు. ఆయనయొక్క ప్రకాశముచేతనే సర్వేంద్రియములును ప్రకాశించుచున్నవి." అను వాక్యము యుత్తరవాక్యము. ఇట్లు చెప్పనేల ? ప్రత్యక్షముగనే ఛాందోగ్యశ్రుతియందు "సేయం దేవ తైక్షత" అనుమొదలగువాక్యములచే "నామరూపములు ప్రకాశించుటకు చేతనసహాయ మున్నది" యని చెప్పుచున్నది. కావున నెట్లు చూచినను కారణవాక్యములకుఁ బరస్పరవిరోధము లేదు. మేము వేదమును విడిచి దుర్బలము లగున్యాయాదుల నవలంబింపవలసినపని లేదు. బ్రహ్మమే జగత్కారణము.

---

## ౫. బాలాక్యధికరణము.

విషయము:— కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునందు నాల్గవయధ్యాయమున నొకకథ కలదు. గర్గగోత్రసంజాతుఁ డగుబాలాకి యనుబ్రాహ్మణుఁడు కాశీదేశపురాజగు లేక, కాశ్యగోత్రమున జనించినవాఁడగు అజాతశత్రుఁ డనురాజుకడకుఁ బోయి "నీకు బ్రహ్మోపదేశమునుఁ గావించెదను" అని ప్రతిజ్ఞ చేసెను. ఆక్షత్రియుండును దానికి సంతసించి "అట్టి యుపదేశము గావించినఁ దగినదక్షిణ నొసంగి పూజించెను" అని యాదరముతోఁ బలికెను. అప్పుడాబ్రాహ్మణుఁడు సూర్యుఁడు, చంద్రుఁడు

మెఱుపు, మొదలగువానియందుఁ గలజీవులనే బ్రహ్మమునుగాఁ జెప్ప సాగెను. ఆయజాతశత్రుఁడును వారల బ్రహ్మము కాదని నిరాకరించుచు వచ్చుచుండెను. అంతమునకు నాబ్రాహ్మణుఁడు నేత్రస్థానమున నున్న యాత్మను బ్రహ్మమునుగాఁ జెప్పి యాపై నేమియుఁ జెప్పలేకపోయెను. అప్పుడు ఆయజాతశత్రుఁడు "నేత్రస్థానమునం దున్నవాఁడు పరమేశ్వరుఁడు కాఁడు" అని నిరాకరించి, పిదప నేమియుఁ జెప్పలేకున్నయాబ్రాహ్మణునిఁ జూచి యిట్లనియె. "నీకు బ్రహ్మరూపము బాగుగ తెలియదు. నీవు చెప్పినవారల కందఱ కెవ్వఁడు కర్తయో, ఈసర్వము నెవ్వనికర్మయో వానినే తెలిసికొనవలయును"అని చెప్పెను."యో వై బాలాక ఏ తేషాం పురుషాణాం కర్తా యస్య వై త త్కర్మ స వై వేదితవ్యః" అనువాక్య మున నీవిషయము చెప్పఁబడియున్నది.

అని యిట్లు చెప్పఁగానే యాబ్రాహ్మణుఁడును ఆయజాతశత్రుని కడనే యుపదేశము నొందవలయు ననునుద్దేశముతో సమిధలు మొద లగువానినిఁ గైకొని యాతనికడకు మఱునాఁడు వచ్చెను."క్షత్రియుఁడు బ్రాహ్మణున కుపదేశించుట తగదు. అయినను నీకు పరమేశ్వరవిషయ మగుజ్ఞానము స్వయముగనే యుత్పన్న మగునట్లు ఒకదృష్టాంతమునుఁ జూపెదను" అని చెప్పుచు నాయజాతశత్రు డాబ్రాహ్మణుని గైకొని నిదురించుచున్న యొకపురుషునికడకుఁ గొనిపోయెను. అచ్చట నానిదు రించువానిని పిలిచెను; కాని, వాఁడు పలుకలేదు. దండముతోఁ గొట్టెను; తక్షణమే వాఁడు లేచి కూర్చుండెను.దానినిఁ జూపి యాయజాతశత్రుఁడు బ్రాహ్మణున కిట్లనియె. ఓ బాలాకీ చూచితివికదా! ఈతఁడు నిదురించు చున్నను ప్రాణము కలదు; కాని మనము పిలచినపిలుపును అది గ్రహింప లేదు. కావున నాత్మ దానికంటెఁ భిన్నుఁడుగా నుండవలయును. ఇంద్రి యాదులు కూడ వెలుపలికిఁ గానవచ్చుచునే యున్నవి. అవియు మన పిలుపును విన లేదు. ఈగోళకములలో నుండి పనిచేయుచున్నసూక్ష్మేంద్రి యము లేవేవో యిప్పుడు చెప్పుము. ఈయాత్మ నిదురించుచున్నప్పు డెచ్చట నుండెను? ఎటనుండి యిప్పుడు వచ్చెను?" అని యిట్లు ప్రశ్నిం చిన నాబాలాకి యేమియుఁ జెప్పలేకుండెను. అప్పుడు అజాతశత్రుఁడే మరల నిట్లనియె. ఓ బాలాకీ వినుము. ఆయాత్మ నిద్రాసమయమున ప్రాణ మున నేకీభవించును. అప్పుడు సర్వేంద్రియములును తమతమవిషయ

ములతోఁగూడ నాయనలోఁ గలియును. జాగ్రదవస్థ రాఁగానే అగ్ని నుండి మిణుఁగురులు బయలువెడలునట్లు ఆయననుండియే సర్వేంద్రియ ములును బయలువెడలి తమతమస్థానములయందుఁ జేరి తమవ్యవహార ముల నాచరించుచుండును. కావున నాజీవాధార మగుపదార్థమే బ్రహ్మ మని తెలిసికొనుము. ఆబ్రహ్మము నెఱింగినవాఁడు శాశ్వత మగుమోక్ష సుఖమునుఁ జెందును. సర్వపాపవినిర్ముక్తుఁ డగును. సర్వభూతములకు ప్రభు వగును. "అథాస్మి న్ప్రాణ యే వై కథా భవతి" అను మొదలగు వాక్యములయం దీవిషయము స్పష్ట మై యున్నది. ఇట్లు ఆయజాతశత్రుఁ డుపదేశింపఁగానే బ్రాహ్మణుఁడును తత్త్వము నెఱింగి కృతార్థుఁ డయ్యెను. ఈకథయందు అజాతశత్రునియుపదేశారంభమునఁ గల "యో వై బాలాక ఏ తేషాం పురుషాణాం" అను మొదలగువాక్యములు ఈయధికరణ మున విచారింపఁబడెను.

సందేహము. పూర్వపక్షము:—ఈవిషయవాక్యమునందు విచా రింపవలసినది యేది కలదు ? ఈకథయందు మొట్టమొదట పరబ్రహ్మము నుపదేశింతు నని బాలాకి యుపక్రమించి తుదకు చెప్పలేక పోవఁగ అజాతశత్రుఁడే దాని నుపదేశించెను. అంతమునందును సర్వపాపములు నశించుననియు సర్వభూతములకును ప్రభు వగు ననియుఁ జెప్పఁబడి యున్నది. ఇదియుఁ బరమేశ్వరజ్ఞానమువలనఁ గాని సంభవింపదు కదా! మఱియు విషయవాక్యమున ఉపదేశింపఁబడుపదార్థమునకుఁ సూర్యాది కర్తృత్వము చెప్పఁబడియున్నది. "యస్య వై త త్కర్మ" అనుస్థలమున "ఇది" అనుసర్వనామము సామాన్యముగఁ బ్రయోగింపఁబడి యుండు టచే, సర్వనామములకు సామాన్యప్రయోగములందు ప్రత్యక్షాదిసిద్ధము లగుపదార్థములే యర్థము లగుచుండుట స్వభావ మగుటచే, ఆసర్వ నామమునకు ("ఇది" యనుసర్వనామమునకు) ఈప్రపంచమే యర్థ మగును. అప్పుడు సర్వకర్తృత్వము పరమేశ్వరునకు గాక మఱియొక్కనికి సంభవింపదు కావున నీవిషయవాక్యమునందుఁ జెప్పఁబడినవాఁడు పర మేశ్వరుఁడే యగును. ఇట్లుండ నిఁక విచారింపవలసిన దేమున్నది?

సిద్ధాంతము:—నీవు చెప్పినది నిశ్చయమే; అయినను ఈకథ యేకవాక్యముగ లేదు. "బ్రహ్మము నుపదేశించెదను" అని యారంభిం చినవాఁడు బాలాకి. ఉపదేశించినవాఁడు అజాతశత్రుఁడు. ఒక్కఁ డారం

భించినయారంభమును బట్టి రెండవవానివాక్యమును నియమించుట యెట్లు సంభవించును ? కావున ప్రస్తుతవిషయవాక్యమునొద్దనుండి కడ వరకు విచారించిన నేయర్థము తేలునో దానినే గ్రహింపవలసివచ్చును. కావున నీవాక్యముయొక్క యర్థ మవశ్యము విచారణీయమే.

కావున నిచ్చట నుపక్రమానుసారముగఁ జూచిన నజాతశత్రు వాక్యార్థము బ్రహ్మ మని స్ఫురించుటయు,సుషుప్త్యాద్యవస్థలనుఁ గూర్చి చెప్పుటచేతను సుఖదుఃఖాదిభోగములఁ జెప్పుటచేతను ఉపసంహారము ననుసరించి చూచిన నావాక్యార్థము జీవుఁ డని తోఁచుచుండుటయు, నడుమ "అథాస్మి న్ప్రాణ ఏ వైకధా భవతి" అని ప్రాణశబ్దము వినఁ బడుచుండుటయు, ఉపక్రమమున నున్నబ్రహ్మశబ్దము కూడఁ బ్రాణము హిరణ్యగర్భరూప మగుటచే దానియందు సమన్వయ మగుటయు, సంశ యకారణములు. "ఈవిషయవాక్యము హిరణ్యగర్భరూప మగుప్రాణ మునుఁ గాని జీవునిఁగాని చెప్పును. పరమేశ్వరునిఁ జెప్పును" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. వీనికి "హిరణ్యగర్భోపాసననే అజాతశత్రుఁడు చెప్పెను. కావున విషయవాక్యార్థము ననుసరించి హిరణ్య గర్భు నుపాసింపవలయును, పరమేశ్వరు నెఱుంగవలయును" అనునవి క్రమముగ ఫలములు.

సంగతి: —"పూర్వాధికరణమున సదసత్పదములు రెండు నేక వాక్యములో నున్నవి. కావున సచ్ఛబ్దమునకు ననుకూలముగ నసచ్ఛబ్ద మును సమన్వయించితిరి. ఇచ్చట నావిధముగ ఉపక్రమమునం దున్న బ్రహ్మశబ్దమునకు ననుకూలముగ విషయవాక్యమును సమన్వయించుటకు వీలు లేదు. ఇవి భిన్నవాక్యములు కావున నిచ్చటఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడు కాఁడు" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధి కరణ మారంభింపఁబడినది. ఈయాక్షేపము ప్రత్యుదాహరణసంబంధ ముచే వచ్చినది కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణసంబంధమే.

ఇట్లు కాక సిదియు నేకవాక్యమే. యనినను దీనికిఁ బూర్వాధి కరణముతో దృష్టాంతసంబంధము వచ్చును. "పైయధికరణమున ఛాం దోగ్యోపనిషద్వాక్యమును సమన్వయించునప్పుడు 'త త్స దాసీత్' అను నుత్తరవాక్యమున నున్నసచ్ఛబ్దము ననుసరించి దాని కనుకూలముగఁ

బూర్వవాక్యముననున్నయసచ్ఛబ్దమునుసమన్వయించితిరి.అట్లే యిచ్చటఁ గూడ నుత్తరవాక్యమున నున్నకర్మశబ్దమునకు ననుకూలముగ నుపక్రమమునఁ గలబ్రహ్మశబ్దమును సమన్వయింపవలయును. బ్రహ్మశబ్దమునకుఁ గూడ నితరశ్రుతియందుఁ బ్రాణపరముగఁ బ్రయోగము కలదు. కర్మశబ్దమునకు వ్యాపారమునందు రూఢి కలదు. పరమేశ్వరునకు * నావ్యాపారము సంభవింపదు. కావునఁ గర్మశబ్దానుగుణముగ బ్రహ్మశబ్దమును ప్రాణపరముగ నైనను జీవపరముగ నైనను సమన్వయింపవలయును" అనుదానికి సమాధానముగ నీయధికరణము వచ్చెను. ఈవాదము దృష్టాంతానుసారముగ వచ్చెను. కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము దృష్టాంతసంబంధము.

మఱియు ఈనాల్గవపాదమున సామాన్యముగ పరమతసిద్ధములగువిషయములు వేదోక్తములు కాకపోవుటచే నప్రమాణము లనియు, వేదము పరమేశ్వరు నొక్కని దప్ప నన్యుని జగత్కారణముగఁ జెప్పదనియు నిర్ణయింపఁబడినది; సమన్వయము దృఢము చేయఁబడినది. ఈయధికరణముమాత్రము కేవలము వాక్యసమన్వయపరమే యనినచో నది సంశయహేతువుగఁ నుండును. కావున దీనినిఁ గూర్చి కొంతవిషయముఁ జెప్పవలసియున్నది.

హిరణ్యగర్భోపాసనవలన సత్యలోకప్రాప్తియు అచ్చటినుండి క్రమముక్తియు కలుగు నని కొందఱిమతము. కొందఱు ఆహిరణ్యగర్భునికంటె నతిరిక్తుఁ డగుపరమేశ్వరుఁడే లేడనుచున్నారు. ఇందు మొదటిమతము సిద్ధాంతమునకుఁ గూడ సమ్మతమే. (అనఁగా: వేదాంతసిద్ధాంతులకుఁ గూడ సమ్మతమే). కావున రెండవమతమును దూషించుటకై ఈయధికరణము వచ్చినది.ప్రాణశబ్దమునందు బ్రహ్మపదముఁ బ్రయోగింపఁబడియుండుటచేతను, ప్రాణము హిరణ్యగర్భరూపమే యగుటచేతను *సమిష్టిజీవుఁడు హిరణ్యగర్భుఁడే కావున జీవపరముగఁ గానవచ్చుప్రక్రతోపసంహారంబును హిరణ్యగర్భపరమే యగుట సంభవించుటచేతను ప్రస్తుతాధికరణమునఁ బైమతము పూర్వపక్షముగ వచ్చినది. ఈకారణము

* వ్యాపార మనఁగాఁ దానే చలించుచు నాచరించు పని చక్రము తిరుగుట గాలి వీచుట మొదలగునవి.

* సమిష్టిజీవుఁడు (పు. ౨౫౦. చూడు.)

వలన దీనికి నీపాదమునందు సందర్భము కలిగినది.

"ఇట్లయిన నిది మతదూషణము నొనర్చు రెండవయధ్యాయములోఁ జేరవలయును కదా" అనియెదవేమొ యట్లు కాదు. ఇందు వాక్యసమన్వయము కలదు. ఈమతంబును వేదవాక్యములలోని సందర్భముల నాశ్రయించి కేవలము పూర్వపక్షమాత్రముగానే వచ్చినది. ద్వితీయాధ్యాయమున నన్ననో తర్కాదిమతములు శ్రుతివాక్యము నాశ్రయింపక కేవలము స్వయుక్తులనుమాత్రమే యాధారముగఁ జేసికొని వచ్చుచున్నవి. ఇదియే యీరెంటికినిఁ గలభేదము. కావున నీయధికరణము సమన్వయాధ్యాయముననే చేర్పఁబడెను.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమునఁ జెప్పఁబడినది జీవుఁడో, లేక, ప్రాణమో కావలయును గాని పరమేశ్వరుఁడు కానేరఁడు. ఇచ్చట కర్మశబ్దము కలదు. దానికి వ్యాపారమునందు రూఢి; *కార్యమునందు యోగము రూఢిచేఁ గాని దాని కనుకూల మగుకల్పనచేఁ గాని కార్యనిర్వాహ మగుచుండ యోగము నాశ్రయించుట యుక్తము కా దని మీరే చెప్పియున్నారు. ఇచ్చట నాకర్మశబ్దమునకు బ్రహ్మముతోనే సంబంధము కల దనిన నప్పుడు యోగమునే యాశ్రయింపవలసివచ్చును. బ్రహ్మము సర్వకారణ మగుటచే నీప్రపంచ మాయనకుఁ గార్యము కావచ్చును. కాని యాయనకు వ్యాపార మేదియును లేదు కదా! కావున నీవాక్యమున బ్రహ్మమును ప్రతిపాద్యముగ నంగీకరింపఁజనదు.

ప్రాణజీవులయం దన్ననో ఆశబ్దమును రూఢితోనే సమన్వయింపవచ్చును. ప్రాణమునకు చలనరూప మగువ్యాపారము కలదు; జీవునకు శరీరముతో కల్పితసంబంధము కలదు. కావున శరీరమునం దాత్మాభిమానము కలదు. కావున శరీరవ్యాపారమే జీవునివ్యాపార మగును.

---

* కార్య మనఁగా: తనకు చలనము లేకున్నను దాను నిమిత్తముగ నుండిన జరుగు పని. తననుండి యేవిధముగ నైనను (ఆరంభముచేత నైనను పరిణామముచేత నైనను వివర్తముచేత నైనను తాను నిమిత్తముగ నుండ మఱియొక నుపాదానముయొక్క పరిణామాదులచేత నైనను) జనించినపదార్థమునకుఁ గూడఁ గార్య మనియే పేరు. ఈరెండవ పక్షమునందే గ్రంథమున "కర్మశబ్దమునకు యోగము కలదు" అని చెప్పఁబడియున్నది. "క్రియతే ఇతి కర్మ" "చేయఁబడునది కావున కర్మ" అనునదియే యీకర్మశబ్దమునకుఁ గలయోగము. పదార్థములు కారణములచేఁ జేయఁబడునవియే కదా.

మఱియు జీవవ్యవహార మంతయు ధర్మాధర్మాధీనము కావున నాజీవునకు ధర్మాధర్మములే వ్యాపార మనవచ్చును.

మఱియు బృహదారణ్యకోపనిషత్తునందు వసురుద్రాదిత్యాది దేవతలను వర్ణించి వారి నందఱి నొక్కనియవతారభేదములుగాఁ జెప్పి "కతమ ఏకో దేవ ఇతి" "ఆయొక్క దేవత యెవ్వఁడు? ఈయాదిత్యాదు లందఱు నెవ్వనివికారములు" అని ప్రశ్న రాఁగా "ప్రాణ ఇతి" "ఆదేవత ప్రాణమే (అనఁగా హిరణ్యగర్భుఁడే)" అని సమాధానము చెప్పఁబడియున్నది. కావున ప్రాణము సూర్యాదులకుఁ గర్త కూడ కావచ్చును. వాక్యశేషమునందును "అథాస్మి న్ప్రాణ ఏ వైకధా భవతి" అని ప్రాణశబ్దము ప్రత్యక్షముగనే యున్నది. బృహదారణ్యక శ్రుతియందు పైఁ జెప్పినసమాధానమునకుఁ బిదప "స బ్రహ్మ" అని ప్రాణమునందు బ్రహ్మశబ్దముకూడఁ బ్రయోగింపఁబడియున్నది. కావున విషయవాక్యమునఁ జెప్పఁబడినది హిరణ్యగర్భరూప మగుప్రాణమే యని తేలుచున్నది.

ఇట్లే విషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు జీవుఁడే యనినను సర్వమును సరిపోవును. వాక్యశేషమునందు పలుమాఱు జీవప్రస్తావము వచ్చినది. ఆయజాతశత్రుఁడు తనసిద్ధాంతమును బోధించువాఁడై నిదురఁబోవుచున్నవానిని దండముతోఁ గొట్టి మేల్కొల్పెను కదా! దానిచే ప్రాణాదిభిన్నుఁ డగుజీవుఁడు బోధింపఁబడిన ట్లైనది. అప్పుడు మేల్కొనినవాఁడు జీవుఁడే కదా! మఱియు అంతమున "యథా శ్రేష్ఠీ స్వై ర్భుఙ్క్తే యథా వా స్వాః శ్రేష్ఠినం భుఞ్జ న్త్యేవ మే వైష ప్రజ్ఞాత్మైతై రాత్మభి ర్భుఙ్క్తే ఏవ మే వైత ఆత్మాన ఏత మాత్మానం భుఞ్జన్తి" "లోకమునఁ బ్రధానుఁ డగుపురుషుఁడు స్వజనులసహాయముచే నెట్లు భోగముల ననుభవించునో, ఆస్వజనులును తమకు వలసినవాని గ్రహించుచు నాప్రధానుని సాహాయ్యమున భోగముల ననుభవింతురో, అట్లే యీసూర్యాదిజీవుల నాశ్రయించి యీజీవుఁడు లేక సమష్టిజీవుఁ డగు హిరణ్యగర్భుఁడు సర్వసుఖభోగముల ననుభవించుచున్నాఁడు; ఈసూర్యాదులును ఈజీవు నాశ్రయించి సుఖభోగముల ననుభవించుచున్నారు. సూర్యాదులు మనకు సుఖసాధనము లగువెలుగుమొదలగువాని నొసంగుటయు, మనముకూడ హవిస్సు మొదలగువాని నొసంగుటచే

నానూర్యాదులను తృప్తి నొందించుటయు ప్రత్యక్షసిద్ధమే కదా!" అను వాక్య మొక్కటి కలదు. ఇది జీవపర మని ప్రత్యక్షముగఁ గానవచ్చు చున్నది కదా! ఈతఁడు సూర్యాదులకు నధిపతి కావునను సూర్యాదులు ఈతనికి భోగసాధనములు కావునను సూర్యాదులకు నీతఁడు కర్త గావచ్చును. లోకమున సాధకులు స్వయముగనే తమకు వలసిన సాధనములను నిర్మించుకొనుట కలదు కదా!

"అథాస్మిన్ ప్రాణ ఏ వైకథా భవతి" అనువాక్యమున జీవుఁడు ప్రాణశబ్దవాచ్యమునకంటె భిన్నముగ గ్రహింపఁబడియున్నాఁడు. కావున ప్రాణశబ్దవాచ్య మగుపదార్థమే ప్రకరణార్థము కావలయును" అనియెదవేమొ వినుము. అప్పుడును విరోధ మేమియు రాదు. ప్రాణశబ్దము హిరణ్యగర్భవాచకము. ఆయన సమష్టిజీవుఁ డగుటచే నాయనయందు సర్వజీవు లేకీభవింపవచ్చును. వాస్తవస్థితిలో జీవులకును ఆహిరణ్యగర్భునకును భేదమే లేకపోవుటవలన నేదియో యొకవిధముగ భిన్నముగ నున్నయా ప్రాణాశబ్దమును జీవపరముగఁ జెప్పవచ్చును. జీవుఁడును ప్రాణధారి యగుటచే నాశబ్దముచేఁ జెప్పఁదగియే యున్నాఁడు. మీమతము ననుసరించి జీవబ్రహ్మ లొక్కటియే కావున "జీవరూపముతో బ్రహ్మము నెఱుంగవలయు నని యజాతశత్రుఁడు చెప్పెను" అనియైనను చెప్పవచ్చును కదా! మఱియు సుషుప్తి స్వప్నావస్థలను వర్ణించి యుండుటచే పరబ్రహ్మ ముద్దేశింపఁబడి యుండె ననుటకు వీలు లేదు. పరబ్రహ్మమునకు నవస్థలు లేవు కదా! కావున నెట్లుచూచినను ఇచ్చట జీవుఁడో ప్రాణమో వర్ణింపఁబడె ననిమాత్రమే చెప్పవలసియున్నది; ఎట్లును నిర్విశేష బ్రహ్మము నీవాక్యమువలన గ్రహించుటకు వీలు లేదు.

అవతారిక:—అనునీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౭౨. జగద్వాచిత్వాత్. ౧. ౪. ౧౬.

తాత్పర్యము:—ఇట్లు సంశయింప నవసరము లేదు. కర్మశబ్దమునకు నిచ్చట వ్యాపారము నర్థముగఁ జెప్పుటకు వీలు లేదు. చలనము కాని ధర్మాధర్మములు కాని యిచ్చట నాశబ్దముచే గ్రహింపఁబడి యుండవు. అట్లు గ్రహింపఁబడుట యిచ్చట యావశ్యకము కాదు; వాక్యమునందును అవి ప్రత్యక్షముగఁ జెప్పఁబడియుండ లేదు. కావున

నిచ్చట యౌగికార్థమునే యాశ్రయింపవలయును ; కర్మపదమునకు "కార్యము" అనియే యర్థము చెప్పవలయును. వాక్యానుసారముగఁ గాక పదార్థమును మనయిచ్చ వచ్చినట్లు కల్పించుట యన్యాయము కదా! మఱియు నిచ్చటియేతచ్ఛబ్దము బాగుగ విచారించినచో ప్రత్యక్షసిద్ధ మగు ప్రపంచమును చెప్పునదియే యగుచున్నది. దీనికి సమీపమున పరామర్శార్హ మగునేపదమును గానవచ్చుట లేదు కదా! "పురుషులను పరామర్శించె నేమో" యనిన నాపదము పుంలింగమున బహువచనమున నున్నది; ఈయేతచ్ఛబ్దము నపుంసకలింగమున నేకవచనమున నున్నది. మఱియు "ఏతేషాం పురుషాణాం కర్తా" అనునప్పటికి పరిపూర్ణముగ నొక్క వాక్యము ముగిసినది. అచ్చటగూడ నొకయేతచ్ఛబ్దము ప్రయోగింపఁబడియున్నది. ఆపురుషులును దానిచేతనే పరామర్శింపఁబడి యున్నారు. ఇట్లు కాక "ఆపురుషులను సృష్టించుట" అనుపనియే యీయేతచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁబడె ననిన నదియు యుక్తముగా నుండలేదు; "కర్తా" అనుటచే నావాక్యముననే కృతి (సృజించుట యనుపని) వర్ణింపఁబడియున్నది. దానిని మరలఁ బరామర్శ చేయవలసినపనియు లేదు. కావున నెట్లు చూచినను ఏతచ్ఛబ్దము సాధారణముగాఁ బ్రపంచమును చెప్పునదియే కావలయును. దానికి విశేషణముగ నుండుటచేఁ గర్మశబ్దంబును యోగానుసారముగఁ గార్యపరమే కావలయును కాని చలనాదిపర మగుటకు వీలు లేదు. సర్వప్రపంచమును సృజింపఁగలవాఁడు పరమేశ్వరుఁడే యనుట సర్వశ్రుతిసిద్ధాంతము కావున నీవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు నిస్సంశయముగఁ బరమేశ్వరుఁడే.

సిద్ధాంతము :— బాలాకి కథను మున్నే వివరించియున్నాము కదా! ఆతఁడు బ్రహ్మను చెప్పెదు నని యారంభించి యాయనను స్పష్టముగఁ దెలుపలేకపోయిన నజాతశత్రువు తాను అంతకంటె విశేషమును చెప్పఁ బూనుకొనెను. ఆతఁడును శుద్ధబ్రహ్మమును చెప్పకున్న యెడల నది యెట్లు యుక్తమగును? లోకమున నొక్కని నాక్షేపించిన రెండవవాఁడైనను సరిగాఁ జెప్పవలయు ననుటయే కదా నియమము. కావున ఉపక్రమము నాశ్రయించి యిచ్చట చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యని సిద్ధాంతము చేయవలయును. మఱియు నిదురించువానిని మేల్కొల్పిన పిదప "ఈతఁ డింతవఱకు నిచ్చట నుండెను?" అని జీవాధారభూత

మగుస్థలము నజాతశత్రుఁడు ప్రశ్నించియున్నాఁడు. ఆస్థలము బ్రహ్మమే యనుట సర్వసిద్ధాంతసమ్మతము. హిరణ్యగర్భునియందు జీవుల కేకీభావ మెందునుఁ జెప్పఁబడి యుండలేదు. కావునఁ బ్రాణశబ్దముచేఁ బరబ్రహ్మమే చెప్పఁబడె ననవలసియున్నది. ఆబ్రహ్మము సర్వమయము కావున దాని నేశబ్దముతో నైననుఁ జెప్పవచ్చును. ఉపసంహారమునఁ గానవచ్చుచున్న సర్వపాపరాహిత్యము సర్వభూతాధిపత్యము మొదలగునవి పరబ్రహ్మ జ్ఞానమువలనఁ గాక నన్యమువలనఁ గలుగనేరవు. జీవుని గుఱుతించుటకు వీలగుగుఱుతులుః కూడ పరమేశ్వరునియందే సమన్వయింపఁబడును. బాగుగ విచారించిన సర్వకర్తృత్వము సర్వభోక్తృత్వము మొదలగునవి సర్వవ్యాపకుఁ డగుపరమేశ్వరునకే కాని కలుగనేరవు కదా! ఇట్లు బాలాక్యజాతశత్రులసంవాదమంతయు నేకవాక్యమై యుండ నిరర్థకముగ దానిలో భేదమును కల్పించుట యనుచితము.

"ఏతచ్ఛబ్దముచే సర్వప్రపంచంబును గ్రహింపఁబడె నేని సూర్యాదులఁ బ్రత్యేకముగఁ జెప్పనేల" అనియెదవేమొ యందు దోషము లేదు. బాలాకి బ్రహ్మరూపులుగాఁ జెప్పినది సూర్యాదులనే కావున "వీరు బ్రహ్మరూపులు కారు" అనుటకై మొట్టమొదట నజాతశత్రుఁడు పరమేశ్వరుని తత్కర్తఁగా నిరూపించియున్నాఁడు; పిదప "ఇంతమాత్రమే చెప్పనేల?" అనుచు నాపరమేశ్వరునకుఁ గలసర్వకర్తృత్వమును ప్రకటించినాఁడు. ఈవిషయమును "యస్య వా" అనుస్థలమున నున్న వాశబ్దము తెలుపుచున్నది. కావున "సర్వప్రపంచమునకును విశేషించి యాదిత్యాదిపురుషులకును కర్తయెవ్వఁడో వానినిఁ దెలిసికొనవలయును" అనుటయే విషయవాక్యార్థము. కావున నెట్లు చూచినను ఉపక్రమోపసంహారాదుల ననుసరించి యిచ్చటఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యగును కాని హిరణ్యగర్భాదులు కానేరరు. ఈవాక్యమున జీవప్రస్తావమున్నదనుట యథార్థమే కాని యది బ్రహ్మము నెఱుంగుటకై చేయఁబడినదియే కాని మఱియొక్కటి కాదు. జీవపదము బ్రహ్మద్యోతనార్థమై ప్రయోగింపఁబడవచ్చును కాని బ్రహ్మపదము జీవద్యోతనార్థమై ప్రయోగింపఁబడె ననుట యసంభవము. బ్రహ్మము అప్రసిద్ధము; జీవుఁడు ప్రసిద్ధుఁడు. ప్రసిద్ధసహాయముచే నప్రసిద్ధునిఁ దెలిసికొనఁ బ్రయత్నించుట కలదు కాని యప్రసిద్ధసహాయముచే ప్రసిద్ధుని తెలిసికొనఁ బ్రయత్నిం

చుట లేదు కదా! కావున నెట్లు చూచినను ఈవిషయవాక్యమున వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## ౧౭౩. జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతం. ౧. ౪. ౧౭.

తాత్పర్యము:— వాక్యశేషమున జీవుని ప్రాణమును తెలియఁ జేయుగుఱుతులు ఉన్నను వానివలన పైనఁ జేయఁబడినసమన్వయమునకు విరోధము రాదు. ఈవిషయము ప్రతర్దనాధికరణమునందు ౧. ౧. ౩౧. సూత్రమున వివరింపఁబడియున్నది. అచ్చటఁ గూడ జీవప్రాణలింగము లుండుటచే వచ్చినసంశయము నివారింపఁబడినది. అట్లే యిచ్చటఁ గూడ నిర్ణయించుకొనవలయును. ఉపక్రమోపసంహారములు పైన నిర్ణయించినరీతిగా బ్రహ్మపరములై యుండ నడుమ జీవముఖ్యప్రాణములను లేక, హిరణ్యగర్భుని తెచ్చి పెట్టి "ఒక్కవాక్యమునందే మూఁడుపాసనలు చెప్పఁబడినవి" అని గ్రహించుట దోషము కదా!

"ఇట్లనుటకు వీలు లేదు. ప్రతర్దనాధికరణమున దీనిని (ప్రస్తుతవిషయవాక్యమును) నిర్ణయింపలేదు. కావున జీవప్రాణలింగముల వలన సంశయము మఱల వచ్చినది. దీనిని వేఱొకహేతువుచే నివారింపవలయును" అనియెదవేమొ అప్పటికిని మాకు కొఱఁత లేదు. ప్రాణశబ్దము అనేకస్థలములయందు బ్రహ్మపరముగఁ బ్రయోగింపఁబడియున్నది. "ప్రాణబంధనం హి సౌమ్య మనః" "మనస్సునకు బ్రాణమే (ప్రాణశబ్దవాచ్య మగుబ్రహ్మమే) యాధారము" అని ఛాందోగ్యోపనిషత్తుననున్నది. ప్రాణాధికరణమునందును (౧. ౧. ౨౩. చూడు) ప్రతర్దనాధికరణమునందును ఇట్టివాక్యములే విచారింపఁబడినవి. కావున ప్రాణలింగమున్నంతమాత్రమునఁ బ్రకరణసిద్ధ మగుపరబ్రహ్మమును విడువ నక్కఱ లేదు. జీవలింగములును అభేదవశమున బరమాత్మయందే సమన్వయింపఁబడవచ్చును. కావున నెట్లును విషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ ౧. పా ౪. సూ ౧౮. ఆరంభము.

అవతారిక:— ఈవిషయమున మఱికొందఱిమతమునుఁ జెప్పి యంగీకరించుచున్నాఁడు.

## ౧౭౮. అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యా నాభ్యామపి చైవమేకే. ౧. ౪. ౧౮.

తాత్పర్యము:—జైమినిమహాముని యీవిషయమునుఁ గూర్చి మఱియొకవిధముగఁ జెప్పుచున్నాఁడు. ఈవిషయవాక్యము జీవపరమా? బ్రహ్మపరమా? యని వివాదముతో పని లేదనియు, జీవపరమే యైనను కావచ్చు ననియు, జీవు నాశ్రయించి బ్రహ్మమును గ్రహింపవచ్చు ననియుఁ జెప్పుచున్నాఁడు. ఇట్లు గ్రహించుటకే జీవుఁడు ఈవాక్యమునఁ జెప్పఁబడియె ననుచున్నాఁడు. ఇదియు యుక్తమే. మాకు సమ్మతమే. వాక్యశేషమునఁ గలప్రశ్నోత్తరము లీవిషయమును స్పష్టము చేయుచున్నవి. ఎట్లనిన:—

అజాతశత్రుఁడు బాలాకినిఁజూచి "ఈజీవుఁడు ఎచ్చట నింతదనుక నిదురించుచుండెను? ఇంతదనుక నేరూపముతో నుండెను? ఇప్పు డెటనుండి మరలి వచ్చెను" అని ప్రశ్నఁజేసెను. దానికి "ఈజీవుఁడు ప్రాణశబ్దవాచ్య మగుపరబ్రహ్మమున సుషుప్తికాలమందు నిదురించుచుండెను. పరబ్రహ్మరూపముతోనే యుండెను. పరబ్రహ్మమునుండియే మరల వచ్చెను" అని యుత్తర మీయఁబడియున్నది. వీనివలన జీవభిన్న మగు పరబ్రహ్మ మిచ్చట నుద్దేశింపఁబడినట్లును, అదియే జ్ఞేయముగఁ జెప్పఁబడినట్లును, తెలియవచ్చుచున్నది. సర్వవేదాంతములయందు నిదియే (అనఁగా: సుషుప్తికాలమున జీవుఁడు బ్రహ్మమున నైక్యము నొంది, తన యుపాధివలనఁ గలిగిన * విశేషజ్ఞానము లేక బ్రహ్మరూపముతోనే నిలిచి యుండును. జాగ్రదవస్థయందు మరల నందుండియే వెలికి వచ్చును. విశేషజ్ఞానము నొందును) సిద్ధాంతము చేయఁబడియున్నది.

మఱియు బృహదారణ్యకోపనిషత్తునందు ఈవిషయము స్పష్టముగనే చెప్పఁబడియున్నది. అందుఁ గూడ నీకథ గలదు; ఈప్రశ్నోత్తరములును కలవు. వానియందు నిరూఢ మగువిజ్ఞానమయశబ్దముచే జీవుఁడు వర్ణింపఁబడి యున్నాఁడు; ఆజీవుని యాధారమునుఁ గూర్చియు నుత్పత్తిస్థానమును గూర్చియు పైనవర్ణించినట్లే ప్రశ్నోత్తరములు జరిగినవి.

---

* (విశేషమునుఁ గూర్చి పు. ౨౮౯. చూడు.) ఆవిశేషము నెఱుంగుజ్ఞానము విశేషము.

కావున నెట్లు చూచినను ఈవిషయవాక్యమున వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యనుట నిస్సంశయము.

---

## ౬. వాక్యాన్వయాధికరణము.

విషయము :— బృహదారణ్యకోపనిషత్తున నాల్గవయధ్యాయమున నొకథ కలదు. యాజ్ఞవల్క్యమహాముని కాత్యాయనీమైత్రేయులనునిరువురుభార్యలు కలరు. అందు కాత్యాయని సామాన్యురాలై యుండెను. మైత్రేయిమాత్రము పూర్వజన్మసంస్కారమువలన చిత్తపరిపాకము కలిగి యుండెను. మోక్షమును కోరుచుండెను. ఇట్లుండఁ గొంతకాలమునకు నాయాజ్ఞవల్క్యమహాముని గృహస్థాశ్రమమును విడిచి సన్న్యాసాశ్రమమును నంగీకరింపఁదలంచెను. అప్పుడు తనభార్యలిరువురును నిర్వివాదముగ స్వతంత్రముగ జీవించుటకై తనకుఁ గలధనమును సమానభాగములుగ వారలకు పంప నుద్దేశించెను. ఈవిషయమును కాత్యాయనితోఁ జెప్ప నామె సమ్మతించెను. మైత్రేయిమాత్రము దానికి సమ్మతింపక యిట్లనియె. ఓనాథా! నాభాగమునకుఁ ధనము అధికముగ వచ్చును. కాని దానితో నేను ముక్తి నొందఁగలుగుదునా?" అనిన యాజ్ఞవల్క్యుఁ డిట్లనియె. "ధనముండిన సుఖజీవనము చేయవచ్చును. దానాదుల నాచరించి పుణ్యలోకముల సంపాదింపవచ్చును. అంతియ కాని దీనివలన ముక్తి దొరకదు. ముక్తి జ్ఞానసాధ్యము; ధనముచే జ్ఞానమును సంపాదించుటకు వీలు లేదు కదా!" అనిన మైత్రేయి యిట్లనియె. "ఓనాథా ఇట్లయిన ముక్తిఁ గలిగింపనిధనముతో నాకేమి పని? ఎయ్యది ముక్తిని సాధింపఁగలదో దానినే నాకు నుపదేశింపుఁడు." అనిన సరియే యనుచు యాజ్ఞవల్క్యుఁ డిట్లనియె.

"లోకమున సర్వపదార్థములును, తుదకు అతిప్రియ మని ప్రసిద్ధి నొందిన భార్యాపుత్త్రాదికుటుంబంబును కూడ తనకొఱకై యే ప్రియమగుచున్నది. ఇట్లుండ నెవ్వనిమాహాత్మ్యమువలన నన్యపదార్థములు కూడఁ బ్రియము లగుచున్నవో అట్టివానిని ప్రేమింపక, అట్టివాని

యందు మనస్సును నిలుపక, పదార్థాంతరములయందుఁ బ్రేమ నుంచి, అదియే సర్వ మని తలంచుట యెంత వెఱ్ఱితనము? ఈభ్రాంతి యాత్మ నెఱుంగలేకపోవుటచేఁ గలిగినది. కావున నాత్మస్వరూపముఁ దెలిసికొనవలయును. అదియే ముక్తికి సాధనము. ఆయాత్మజ్ఞానమునకు వేదాంతవాక్యశ్రవణము, వానిని యుక్తులచే విచారించుట విచారింపఁగా దృఢమైనయర్థమును ధ్యానించుట, యనునవి సాధనములు. సాధనములవలన నాత్మ నెఱింగినయెడల ప్రపంచతత్వ మంతయు నెఱుంగఁబడినట్లే యగును. త్రాటిని తెలిసికొనిన, దానియం దారోపింపఁబడిన సర్పముయొక్క యథార్థస్వరూపము తెలిసికొనఁబడును కదా!

వాస్తవస్థితిలో నీప్రపంచమునకును పరమేశ్వరునకును భేదము లేదు. ఎవ్వఁ డట్టిభేదమునుఁ జూచునో వాఁడు ముక్తి నొందనేరఁడు. బ్రహ్మక్షత్రియాదిజాతుల, వేదముల, దేవతుల నింతయేల? తనయెదుటఁ గానవచ్చు సర్వప్రపంచము ఆత్మభిన్నముగ నెవ్వఁడు చూచునో వానిని ఆబ్రహ్మక్షత్రియజాత్యాదు లన్నియు ముక్తికి దూరస్థునిగఁ జేయును. ఆత్మ భిన్నముగ చూడఁగానే యాప్రపంచమునందు ఒకవిధ మగునభిమానము కలుగును. బ్రాహ్మణజాతిని ఆత్మభిన్నముగఁ జూచిన "నేను బ్రహ్మమును" అను యథార్థజ్ఞానము నశించి "నేను బ్రాహ్మణుఁడను" అను దురభిమానము కలుగును. దానిచేఁ బురుషుఁడు ముక్తికి దూరస్థుఁ డగును. కావున వివేకి యగువాఁడు సర్వము నాత్మమాత్రముగనే భావింపవలయును. త్రాటిని గ్రహించుటవలన నందారోపింపఁబడిన సర్పమును యథార్థరూపముతో గ్రహించునట్లు ఏపదార్థమును గ్రహించిన నేపదార్థముయొక్క తత్వమును గ్రహింపఁగలుగుదుమో ఆ రెండు పదార్థములకును పరస్పరభేదము లే దనుట నియమము. లోకమున భేరీ వీణ, వేణువు, మొదలగువాద్యములను వాదించునప్పుడు కలుగువిశేష శబ్దములను సామాన్యశబ్దజ్ఞానము లేనివాఁడు గ్రహింపలేకున్నాఁడు. విచారించిన నావిశేషశబ్దము సామాన్యశబ్దమునకంటె భిన్నంబును కాకున్నది. శబ్దము లన్నియు నొక్కటియే కదా! ఇట్లే చైతన్యస్వరూపము నెఱుంగకుండినఁ బ్రపంచము తెలియఁబడుట లేదు. ప్రతివానికిని "జ్ఞానము కలదు లేక ఇది జ్ఞానము" అను తెలివి కలదు. దానివల

 

ననే సర్వము నెఱుంగుచున్నాఁడు. దానివలననే "ఘటజ్ఞానము పట జ్ఞానము" అనుమొదలగు వ్యవహారములు కలుగుచున్నవి. ప్రపంచ మంతయు నామరూపమయమే. ఇందు నామంబును జ్ఞానమే. రూపం బును జ్ఞానమే. జ్ఞానముయొక్క సామాన్యస్వరూపము నెఱుంగకున్న "ఇది దీనినామము. ఇది దీనిరూపము" అనువిశేషజ్ఞాన మెటనుండి వచ్చును? ఈవిధముగ జ్ఞానము నెఱుంగకున్న నామరూపముల నెఱుం గలేకపోవుటచే వానికి పరస్పరము భేదము లేదు. "నామరూపములు జ్ఞేయములు కదా" యనియెదవేమొ వినుము. జ్ఞానము సర్వవ్యాపకమై యేకరూపముతో నుండ దానియందు భేదభ్రాంతి కలిగినది. అవియే మనకుఁ గానవచ్చుచున్న భిన్నభిన్నపదార్థములు. జ్ఞానము వాని నన్నిఁటి సామాన్యముగ గ్రహించుచుండును. విశేషగ్రహణమునకై ఒక్కొ క్కపదార్థమునకు కొన్నికొన్ని యక్షరములు వాచకములుగా నేర్పడి నవి. ఇప్పుడు విచారించి చూడుము. మనము మాటలాడుపదము లన్నియు జ్ఞానమునకంటె భిన్నము లెట్లగును? విశేషజ్ఞానమే నామ మనవలయును. నామము జ్ఞానభిన్న మనిన దానికి జ్ఞేయత్వముచేతనే యట్టిభేదము వచ్చెననవలయును కదా! అది సామాన్యజ్ఞానమునకు జ్ఞేయ మగునా? విశేషజ్ఞానమునకు జ్ఞేయ మగునా? ఇం దేపక్షం బును యుక్తము కానేరదు. ఆనామము జ్ఞానగోచర మైనంతమాత్రముననే పదార్థభేదమును వ్యక్తీకరించు నంతియ కాని యాజ్ఞానము నందలిసామాన్యవిశేషభావముల నపేక్షింపదు. కావున మొదటిపక్షము నాశ్రయించిన విశేషజ్ఞానోత్పత్తియే లేకపోవలసి వచ్చుటచే ననుభవ విరోధము వచ్చును.లోకమున "ఘటజ్ఞానము పటజ్ఞానము" మొదలగు విశేషజ్ఞానములఁ జూచుచున్నాము కదా! ఇఁక రెండవపక్షము నాశ్ర యించిన విశేషజ్ఞానోత్పత్తికిఁ బూర్వమున నేదియో యొకవిశేష ముండ వలసివచ్చుటచే "ఆవిశేషము కూడ నామమేనా? లేక, తద్భిన్న మగు మఱియొకపదార్థమా?" యనుప్రశ్న వచ్చును. దీనికి సమాధాన మేమి? నామమే యావిశేష మనిన నది జ్ఞేయము కాకపోవలసినచ్చును; జ్ఞేయము జ్ఞానోత్పత్తికి ననంతరమునఁ గాని ప్రకాశింపదు కదా! నామ భిన్నపదార్థ మనిన నప్పుడును "అది సామాన్యజ్ఞానగోచర మై విశేష జ్ఞానమును కలిగించునా? లేదా?" యనుప్రశ్నము వచ్చును. జ్ఞానగోచ

రము కానిపదార్థ ముండుట సంభవింపదు. కావున "ఆపదార్థము జ్ఞాన గోచరమే" అని యంగీకరింపవలయును. అప్పుడు పూర్వము చెప్పఁబడిన దోషము లన్నియు వచ్చును. ఆపదార్థము కూడ విశేషమే. కావున దానికిని పదార్థభేదమును తెలుపుటయే పని కదా! కావున నెట్లుచూచి నను నామమే విశేషజ్ఞాన మనియు సామాన్యజ్ఞానమే యారూపముతోఁ బరిణమించుచుననియు చెప్పి తీరవలయును. రూపవిషయము కూడ నిట్టిదే కావున నీనామరూపములును ఏతద్విషయకము లగుజ్ఞానములును పర స్పరభిన్నములుగఁ గానవచ్చినను అది భ్రాంతియే కాని వాస్తవస్థితి కాదు. ఈవిధముగ విమర్శించిన స్థితికాలమునందును ఈప్రపంచము జ్ఞానభిన్నము కాదు.

మఱియు నుత్పత్తికాలమునందుఁ గూడ నిది పరమేశ్వరునుండియే జనించెను. ఉత్పత్తికిఁ బూర్వమున నందే యుండెను. తడికట్టెలు వేసిన నిప్పునుండి మిడుగురులు దుముకునట్లు ఆబ్రహ్మమునుండి యీప్రపంచ ముద్భవించుచున్నది. ఋగ్వేదాదులు జనించుచున్నవి. మిడుగురులను అగ్నికంటె భిన్నములనుగాఁ గాని యభిన్నములనుగాఁ గాని నిర్ణయించు టకు వీలు లేనట్లు ఈఋగ్వేదాదులనుఁ గూడ బ్రహ్మమునకంటె భిన్నము లనుగాఁ గాని యభిన్నములనుగాఁ గాని నిరూపించుటకు వీలు లేదు. కావున నుత్పత్తికిఁ బూర్వమున నామప్రపంచ మంతయు బ్రహ్మముననే యుండెను. ఇఁక రూపప్రపంచమునుఁ గూర్చి యేమి చెప్పవలయును? అది నామప్రపంచమునకు నధీనమైయే యుండును కదా!

ఇట్లు ఉత్పత్తికిఁ బూర్వమునను స్థితికాలమందును ప్రపంచము చేతనాభిన్నముగ నున్నది. ప్రళయకాలమునందును ఉప్పుకల్లు నీటియందు పడి నీరే యైనట్లు ఈప్రపంచముకూడ బ్రహ్మమున లీనమై బ్రహ్మమే యగుచున్నది. ఉప్పుకల్లు సముద్రోదకమునుండియే జనించినది. అదియు సముద్రజలమే; భూమి ఉష్ణము అనువానిసంబంధమువలన నట్లు రాయిగ మాఱినది. మఱల నీటిలోఁ గల్పిన నీరే యైనది. కావున వాక్కు శబ్దములకు నన్నిటికి నాధారమైనట్లును ఘ్రాణము సర్వగంధ ములకు నాధార మైనట్లును ఆచైతన్యము సర్వప్రంపచమునకు నాధార మై యున్నది. అన్నిటికిని లయస్థాన మై యున్నది.

ఈవిధముగ నీప్రపంచము త్రికాలములయందును ఆత్మమాత్రమే

మైయున్నను భ్రాంతిప్రభావమువలన జలమునందలి చంద్రప్రతిబింబమునందు జలగతచలనాదులు తోఁచుచున్నట్లు ఈజ్ఞానరూపునియందు ప్రపంచగతవికారములు తోఁచుచున్నవి. కావున గురుశాస్త్రాదులసాహాయ్యముచే భ్రాంతి యెన్నఁడు తొలంగునో నాఁడు ఈతఁడు భూతములను విడిచి వేఁగును. ఇదియే ముక్తి. సర్వభూతములును ఆతనిజ్ఞానదృష్టికి నశించినవియే. నాశానంతరమున నిఁక సంజ్ఞయే లేదు.

అనిన విని యామైత్రేయి యిట్లనియె. "సర్వమును సంజ్ఞామయము. సంజ్ఞ లేకపోయిన నాత్మయు లేకపోవలసివచ్చును. కావున నీవిషయమున నాకు భ్రాంతి కలుగుచున్నది."

అనిన యాజ్ఞవల్క్యుం డిట్లని యుత్తర మిచ్చెను. "ఆత్మ యెన్నఁటికి నశింపదు. నేనును సర్వసంజ్ఞలను నిషేధింపలేదు. కారణరూపముతో సామాన్యసంజ్ఞ యెప్పటికి నుండును. 'ఇది శబ్దము ఇది రూపము' అనుమొదలగువిశేషసంజ్ఞలుమాత్ర మప్పు డుండవు. భేద మున్నప్పుడేకదా రూపాదు లుండుట? ఒకఁడు మఱియొకనిఁ జూచుట వినుట. ముక్తియందు భేదమే లేదు. అప్పు డెవ్వనిఁ దెలిసికొనును? ఇంతయేల? సర్వజ్ఞుఁ డగువాని నెఱుంగుట యెట్లు సాధ్య మగును? ఆపరమేశ్వరుఁడు తన్నుఁ దానే తెలిసికొనవలయును గాని యన్యులకు గోచరుఁ డగువాఁడు కాఁడు. కావున నిట్టిస్వరూపము నెఱింగి ముక్తి నొందుము. నేను సన్యాసాశ్రమమును స్వీకరించెదను" అని చెప్పి యా యాజ్ఞవల్క్యుఁడు వెడలిపోయెను.

ఈకథయందు "*న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి" అనుమొదలగువాక్యములు వైరాగ్యప్రతిపాదకములు. *ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః ....* మైత్రే

---

*"ఓమైత్రేయీ భర్తకొఱకై భర్త ప్రేమింపఁబడుట లేదు; తనకొఱకైయే ప్రేమింపఁబడుచున్నాఁడు." అను మొదలగునవి వైరాగ్యప్రతిపాదకశ్రుతులకు నర్థములు.

*"ఓమైత్రేయీ ఆత్మను శ్రవణమనననిదిధ్యాసనములచేఁ దెలిసికొనవలయును" అనునది యుపదేశవాక్యార్థము.

*"ఓమైత్రేయీ ఆత్మను తెలిసికొనిన సర్వమును తెలిసికొనవచ్చును" అనునది ప్రతిజ్ఞావాక్యార్థము.

యాత్మనో దర్శనేన....ఇదం సర్వం విదితః" అనువాక్యములు క్రమ ముగా మోక్షసాధనమును ప్రపంచబ్రహ్మాభేదమునుఁ జెప్పుచున్నవి. "*విజ్ఞానఘన ఏ వై తేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యే వాను వినశ్యతి ....*విజ్ఞాతార మరే కేన విజానీయాత్" అనుశ్రుతులు క్రమ ముగ ముక్తిస్వరూపమును పరమేశ్వరునిస్వప్రకాశత్వమును జెప్పుచున్నవి. ఇందు ముక్తిసాధనమునుఁ జెప్పు ఆత్మావా రే యనువాక్యముయొక్క యర్థ మీయధికరణమున విచారింపఁబడును.

సందేహము:—వాస్తవస్థితిలోఁ బూర్వాపరముల విచారించిన నిందు సంశయమే లేదు. అయినను భేదవాదులు కర్తృత్వభోక్తృత్వ ములు కలవాఁ డొక్కఁడును తద్భిన్నుఁడును అకర్తయు నభోక్తయు నగువాఁడు మఱియొక్కఁడును పరమార్థస్థితిలోఁ గూడ భిన్నులై యే యున్నారనుచున్నారు. వారిమతమును నిరాకరించుటయే యీయధి కరణమున కుద్దేశము.

వారిమతము ననుసరించి యిచ్చటివిషయవాక్యమున గలయాత్మ శబ్దమే సంశయకారణము. "ఇచ్చట యాజ్ఞవల్క్యుఁడు జీవాత్మనే యుపదేశించెను. బ్రహ్మము నుపదేశించెను" అనునవి క్రమముగఁ బూర్వ పక్షసిద్ధాంతములు. "ఈవాక్యసందర్భము బ్రహ్మమున సమన్వయము నొందదు. ఒందును" అనునవి క్రమముగ వానిఫలములు.

సంగతి:—"పైయధికరణమున నుపక్రమము ననుసరించి విషయ వాక్యమును బ్రహ్మపరముగ సమన్వయించితిరి. ఇచ్చటఁగూడ విషయ వాక్యము నట్లే సమన్వయింపుఁడు. ఉపక్రమమునందు 'న వా అరే పత్యుః కామాయ' అనుమొదలగువాక్యములచే భార్యాపుత్రాదిభోగ్య పదార్థములను ప్రస్తావించి భోక్తను శ్రేష్ఠునిఁగాఁ జెప్పి యున్నాఁడు. కావున నీయుపదేశమంతయు జీవపరమే కావలయును" అనునాక్షేపము నకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. ఈయాక్షేపము దృష్టాంతానుసారము. కావున నిదియు దృష్టాంతసంబంధమే.

---

*"అనుమహాభూతమే జ్ఞానఘనుఁడే యీసర్వభూతములనుండియు వెలువడును" అనునది జీవపరముగఁ గానవచ్చువాక్యమునకు నర్థము.

* "తెలిసికొనువానిని మైత్రేయీ యెట్లు తెలిసికొననగును?" అనునది యుప సంహారవాక్యార్థము.

పూర్వపక్షము:—ఈవిషయవాక్యమున వర్ణింపఁబడినవాఁడు జీవుఁడే కాని పరమేశ్వరుఁడు కాఁడు. మొట్టమొదట భోక్తయే వర్ణింపఁబడెను. అంతమునందును "విజ్ఞాతార మరే" అనువాక్యముచే జ్ఞానకర్తయే యుద్దేశింపఁబడెను. మధ్యను "విజ్ఞానఘన ఏవ" అనువాక్యముచే సర్వభూతపరిత్యాగి యగుపురుషుఁడే చెప్పఁబడెను. కావున నిచ్చట చెప్పఁబడినవాఁడు జీవుఁడే. నడుమ నొకచోట ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము నిరూపింపఁబడినను అది జీవవిషయముగ నుపచరింపవచ్చును.

అవతారిక:—అనిన దీనికి సమాధానముగ మొట్టమొదట వాక్యమును సమన్వయించుచున్నాఁడు.

## ౧౨౫. వాక్యాన్వయాత్. ౧. ౪. ౧౯.

తాత్పర్యము:—ఇచ్చట వాక్యసందర్భమును బాగుగ సమన్వయించిన విషయవాక్యమునఁ జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యని స్పష్ట మగుచున్నది. మొట్టమొదట మైత్రేయి మోక్షముకొఱకై ప్రశ్నింపఁగా యాజ్ఞవల్క్యుఁడు తత్సాధనముగ నాత్మజ్ఞానము నుపదేశించెను. పరిచ్ఛిన్నుఁ డగుజీవు నెఱుంగుటవలన ముక్తి కలుగుట యెట్లు? శ్రుతిస్మృతులయం దంతటను పరమాత్మజ్ఞానమువలననే ముక్తి యను విషయము స్పష్టము చేయఁబడియున్నది.

మఱియు నాత్మవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన ముపదేశింపఁబడెను. ఇదియు జీవాత్మను గ్రహించినచో సంభవింపదు. జీవాత్మ సర్వోపాదానము కాఁడు కదా! ఆప్రతిజ్ఞను ఔపచారికముగ సమర్థించుటకు వీలు లేదు. శ్రుతియందు ఆప్రపంచబ్రహ్మాభేదము బహువిధముగ ననేక దృష్టాంతములతో నిరూపింపఁబడియున్నది.

మఱియు ఉపదేశాంతమున ప్రపంచబ్రహ్మాభేదమును పరిపూర్ణముగ నిరూపించి, యాయాత్మ జ్ఞానమాత్రస్వరూపుఁడే యనియు నాయనకు లోపల వెలుపల యనునది లేదనియు నిరూపింపఁబడియున్నది. ఇదియు జీవాత్మను గ్రహించిన సంభవింపనేరదు.

కావున పూర్వోత్తరసందర్భమును బాగుగ విమర్శించినచో నిచ్చట వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే యని తోఁచుచున్నది.

## అ ౧. పా ౪. సూ ౨౦. ఆరంభము.

అవతారిక:—"మీరు ఉపక్రమాదులను జీవపరము లని చెప్పి యున్నారు. దానికి సమాధానము చెప్పెదను" అనుచు మొట్టమొదట నొకమునియొక్క మతము నాశ్రయించి యుత్తరమును చెప్పుచున్నాఁడు.

## ౧౨౬. ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగ మాశ్మరథ్యః.

### ౧. ౪. ౨౦.

తాత్పర్యము:—"బ్రహ్మవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగు నని ప్రతిజ్ఞఁజేసి యాజ్ఞవల్క్యుఁడు దుందుభిధ్వనులు మొదలగుదృష్టాంతములచే దానిని స్థిరపరచియున్నాఁడు. ఆప్రతిజ్ఞ నిరాక్షేపముగ సిద్ధించుటకై జీవాత్మపరమాత్మల నభేదముగఁ జెప్పియున్నాఁడు. ఉపక్రమమునందు భోక్తను నడుమ బ్రహ్మమును అంతమునఁ గర్తనుఁ బ్రశంసించి యున్నాఁడు. ఇట్లు అనియతముగఁ జెప్పియుండుటచే నీప్రకరణమున జీవపరమాత్మలయభేదమే యుద్దేశింపఁబడె నని తెలియవచ్చుచున్నది. అభేదము లేకున్న బ్రహ్మజ్ఞానముచే జీవజ్ఞానము కలుగుట యెట్లు?" అని అశ్మరథ్యాచార్యుఁడు చెప్పుచున్నాఁడు.

విశేషాంశము:—"యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః తథాక్షరా ద్వివిధా స్సోమ్య భావాః ప్రజాయంతే తత్ర చైవాపి యంతి" "బాగుగఁ బ్రజ్వరిల్లుచున్న యగ్నినుండి సర్వవిధముల సమానలక్షణము లైనమిడుగురులు జనించియందే యెట్లడంగుచున్నవో అట్లే ఓశాంతుడా! ఈసర్వజీవులును పరమేశ్వరునుండియే జనించి యందే యడంగుచున్నారు" అని జీవోత్పత్తినిఁ గూర్చి శ్రుతులు చెప్పుచున్నవి. లోకమున యగ్నినుండిపుట్టిన మిడుగురులు అగ్నికంటె పరిపూర్ణముగ భిన్నములును గావు; పరిపూర్ణముగ నభిన్నములును కావు. భిన్నములే యైన నగ్నిలక్షణములు వానియం దుండుట సంభవింపదు; అభిన్నములే యైన రెండు నొక్కటియే యగుటచే "ఇది యగ్ని. ఇది దానినుండి పుట్టిన మిడుగురు" అని గుఱుతించుటకే వీలు కలుగదు. కావున 'నగ్నియు మిడుగురులును పరస్పరభిన్నము లయ్యు గాకున్నవి' అనియే యంగీకరించితీరవలయును,

జీవపరమాత్మలవిషయముకూడ నిట్టిదియే. వాఁడును పరస్పరభిన్నులే యైన జీవునకు చైతన్య ముండుటకు వీలు కలుగదు. అభిన్నులే యైన జీవపరమాత్మ లనువ్యవహారమే సంభవింపదు. కావున జీవబ్రహ్మలకు భేదాభేదము కలదు. శ్రుతియు నీపక్షము నాశ్రయించి యొకమాఱు భేదము నవలంబించియు రెండవమాఱు అభేదము నవలంబించియు చెప్పుచుండును." అనుటయే యాయాశ్మరథ్యుని యభిప్రాయము.

## అ ౧. పా ౪. సూ ౨౧. ఆరంభము.

అవతారిక:—ఇట్లు ఒకమునిమతముచే జీవపరానుగ్యమును సమన్వయించి మఱియొక్కనిమతముచే దానినే మఱల సమన్వయించుచున్నాఁడు.

## ౧౨౭. ఉత్క్రమిష్యత ఏవం భావా దిత్యౌడులోమిః. ౧. ౪. ౨౧.

తాత్పర్యము:—"జీవుఁడు ముక్తుఁ డగునంతవఱకు పరమేశ్వరుని కంటె భిన్నుం డై యే యుండును. జ్ఞానాదులచే శుద్ధుఁడై దేహాదుల పరిత్యజింపఁబోవునప్పుడు పరమేశ్వరుఁ డగును. ఇట్లగుటచే భేదకాలమునందుఁ గూడ నౌపచారికముగ నభేదమును చెప్పవచ్చును. కావుననే ప్రస్తుతశ్రుతియం దట్లు చెప్పఁబడియున్నది. 'బ్రహ్మమే శరీరమునుండి లేచి బ్రహ్మమునఁ గలియును" అని చెప్పియున్నది" అని ఔడులోమ్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

విశేషాంశము:—"భేదాభేదములు సర్వకాలములయందు సర్వావస్థలయందు నేకరూపముతో నున్నవి. అవి స్వాభావికములే" అనుట యుక్తము కాదు. అవి పరస్పరవిరుద్ధము లగుటచే వానికి నేకకాలమున స్థితి సంభవింపదు. "ఒకకాలమున నిరువురకును భేదమే. మఱియొక కాలమున నభేదమే." యని చెప్పి తీరవలయును. జీవుఁడు సంసారదశయం దున్నప్పుడు పరమేశ్వరునికంటె భిన్నుఁడే యై యుండును; ముక్తిదశయందు అభిన్నుఁ డగును. ఇట్లే శ్రుతియు నాగమంబునుఁ జెప్పుచున్నవి. "ఏష సంప్రసాదో ఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే (౧. ౩. ౧౯, ౧౯. చూడు.)

"యథా నద్యః స్యందమానాః సముద్రే ఽ స్తంగచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" "లోకమున నదులు తమయందున్న నామరూపముల విడిచి సముద్రమున నెట్లేకీభవించుచున్నవో అట్లే 'ఈజీవులును జ్ఞానవంతులైరేని తమకుఁ గలనామరూపముల విడిచి బ్రహ్మమును చెందుదురు' అనుమొదలగుశ్రుతు లిందుకుఁ బ్రమాణములు 'ఆయుక్తే శ్చైద ఏవ స్యాజ్జీవస్య చ పరస్య చ ముక్తస్య తు న భేదో ఽ స్తి భేదహేతో రభావతః' 'జీవబ్రహ్మములకు సంసారదశ యుండునంతవఱకు భేదమే. ఆదశ తొలఁగినపిదప నైక్యమే' అని పాంచరాత్రాగమము కూడ చెప్పుచున్నది. కావున సంసారదశయందు భేదంబును ముక్తిదశయం దభేదంబును జీవబ్రహ్మములకు స్వాభావికములే" అని ఔడులోమ్యాచార్యుఁడు అభిప్రాయపడుచున్నాఁడు.

## అ ౧. పా ౪. సూ ౨౨. ఆరంభము.

అవతారిక:—పైనఁ జూపినసమాధానములు సూత్రకర్తకు సమ్మతములు కాకపోవుటచే వానిని ఖండించుచు సూత్రకర్తయొక్క మతముచే మరల సమాధానమును చెప్పుచున్నాఁడు.—

## ౧౨౨. అవస్థితే రితి కాశకృత్స్నః. ౧. ౪. ౨౨.

తాత్పర్యము:—"పరమేశ్వరుఁడే బాగుగ విచారించిన జీవరూపముతోఁ గూడ నున్నాఁడు. ఇట్లగుటచే స్థూలదృష్టి గలలోకమునకు సుఖముగఁ దెలుపుటకై శ్రుతియందు పరమేశ్వరునకు మాఱుగ నన్నిస్థలములయందును జీవుఁడే చెప్పఁబడియున్నాఁడు. ఇందు విరోధ మేమియు లేదు." అని కాశకృత్స్నాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

విశేషాంశము:—"నిర్వికారుఁడును నిత్యశుద్ధుఁడును అగుపరమేశ్వరుఁడే జీవుఁడు. 'జీవుఁడు పరమేశ్వరభిన్నుఁడు. పరమేశ్వరుని కార్యము (అనఁగా: పరమేశ్వరునిచే సృష్టింపఁబడినవాఁడు)' అని చెప్పుటకు వీలు లేదు. శ్రుతియందు ఆకాశాదిభూతములయొక్క సృష్టి చెప్పఁబడినట్లు జీవసృష్టి చెప్పఁబడలేదు 'అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అను మొదలగువాక్యములచే జీవబ్రహ్మాభేదమే చెప్పఁబడి

యున్నది. కావున నొక్కయాకాశమే ఘటాదులయం దుండి 'ఘటాకాశము' మొదలగునామములతోఁ బిలువఁబడుచున్నట్లు భేదముగఁ జూడఁబడుచున్నట్లు, ఈజీవుఁడును బ్రహ్మమే యయ్యు తద్భిన్నుఁడుగా వ్యవహరింపఁబడుచు నున్నాఁడు. ఇది * యనిర్వచనీయ మగునవిద్యయొక్క ప్రభావముచేఁ గలిగినది." అనుటయే కాశకృత్స్నాచార్యుని యభిప్రాయము.

ఈమతమే శ్రుతిసమ్మత మనుట.

వేదమునకును ఈకాశకృత్స్నమతమే సమ్మతము. "తత్త్వమసి" అనుమొదలగు మహావాక్యములచే జేయఁబడిన యుపదేశము నీమతమే యనుసరించుచున్నది. ఎట్లనిన:—

రెండుపదార్థములకు అభేదము స్వాభావికమై యుండి యజ్ఞానమువలన నొకటి మఱియొకదానిరూపముతోఁ జూడఁబడుచుండెనేని, యప్పుడు జ్ఞానము కలిగినపిదప యథార్థతత్త్వము తేటపడుటచే వానికి నైక్యము సంభవింపవచ్చును. (అనఁగా: అజ్ఞానకాలమున నాయైక్యము లేదని తలంపఁబడుచుండెను కావున జ్ఞానకాలమున దానియథార్థస్థితి తెలియంబడఁగనే క్రొత్తగ వచ్చిన ట్లుండును.) ఇట్లు గాదేని భేదాభేదములు కాని, భేదము కాని, స్వాభావికమై యున్నపదార్థములకు జ్ఞానమాత్రమువలన, లేక, కారణజ్ఞానమాత్రమువలన నైక్యము సంభవింపదు భ్రాంతిచే త్రాటియందు సర్పమునుఁ జూచిన నాభ్రాంతి నశింపఁగానే వానికిఁ గలస్వాభావికైక్యము ప్రకాశించును గాని, మట్టికుండను చూచి "ఇది మట్టి. ఇది మట్టి" అని యెన్నిమాఱులు జపించినను, ఎంతదృఢముగఁ దెలిసికొనినను వానికి (కుండకును మట్టికిని) ఐక్యము సంభవింపదు కదా! ఎట్లు సంభవించును? అవి రెండును కార్యకారణము లగుటచే పరస్పరము భిన్నములు నభిన్నములు కూడ నై యున్నవి. ఇఁక స్వాభావికభేదమే కలపదార్థములఁగూర్చి చెప్పవలసిన దేమి? ఈయుక్తివలన ఆశ్మరథ్యౌడులోమిమతములు రెండును యుక్తములు కావు. శ్రుతియం దన్ననో "తత్త్వమసి" యని జీవపరమేశ్వరులకు నభేదము బోధింపఁబడెను. శ్రుతికి నదియే తాత్పర్యము. కాదనిన నభేదశ్రుతులు

* అనిర్వచనీయము (పుట ౩౭౪ చూడు)

నిరర్థకములు కావలసివచ్చు నని యిదివఱకే నిరూపించి యున్నాము. కాశకృత్స్నమతము దీని ననుసరించుచున్నది.

మఱియు జీవుఁడు పరమేశ్వరునకు నన్యుఁ డయ్యెనేని యాతని నెఱుంగుటచేఁ పరమేశ్వరకార్య మగుప్రపంచము నెఱుంగుట సంభవింపనేరదు;ఇట్లు కాక నాతఁడు పరమేశ్వరవికారమే యైనచో మాయా సంబంధమువలన నశించువాఁ డగుటచేఁ నాతని నెఱుంగుటవలన శాశ్వత మగుమోక్షము దొరకు ననునాశయే లేదు. శ్రుతియందు జీవుఁడే యుపక్రమింపఁబడియున్నాఁడు ; వాని నెఱుంగుటచే మోక్షము కలుగు ననియుఁ జెప్పఁబడియున్నది కదా! కావున జీవపరమేశ్వరులకు నభేద మనియే చెప్పి తీరవలయును. అప్పుడు జీవయథార్థస్వరూపజ్ఞానము పరమేశ్వరజ్ఞానమే యగుటచే దానివలన సర్వప్రపంచతత్త్వజ్ఞానము కలుగవచ్చును ; మోక్షము దొరకవచ్చును.

ఈవిధముగ విచారించి చూచిన కాశకృత్స్నమతమే శ్రుతిసమ్మతము ; జీవబ్రహ్మాభేదమే స్వాభావికము. పారమార్థికము. ఇట్లగుటచే జీవునకు స్వతంత్రముగ నామరూపములు లేవు. కావున నుపాధిగత నామరూపములే జీవునియందు ఆరోపింపఁబడుచున్నవి ; శ్రుతిస్మృతులు మొదలగువానియందును లోకమునందును గూడ జీవునకుఁ జెప్పఁబడు నుత్పత్త్యాదులు కూడ నిట్టివే.

మఱియు ఆశ్మరథ్యౌడులోమిమతముల నాశ్రయించిన "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" అనుమొదలగుజీవానువాదమును సమన్వయించుటకు నవకాశము లేదు. ఆయిరువురకును భేదము సమ్మతమే కావున నిచ్చట పరమేశ్వరుని జీవుఁడు తెలిసికొను ననవచ్చును కదా! ఈకాశకృత్స్నమతము నాశ్రయించిన నీదోషము రాదు. ఆయనమతము నందు జీవబ్రహ్మము లొక్కటియే యగుటచేఁ బరమేశ్వరుని తెలిసికొనుటకు దదన్యుఁ డెవ్వఁడును లేఁడు; జీవుని తెలిసికొనుటకును దదన్యుఁడు లేఁడుకదా! శ్రుతియు మొట్టమొదట "భేద మున్నప్పుడే కాని యొకని నొకఁడు చూడ నేరఁడు" అని యజ్ఞానకాలమున చూపు మొదలగు విశేషజ్ఞానములు కల వని చెప్పి యంతమున "అంతయు నాత్మయే యైనపిదప నెవ్వఁ డెవ్వనిఁ జూచును?" అని జ్ఞానదశయందు ఆవిశేష జ్ఞానములు లేవని చెప్పియున్నది. "అజరా ఉమరం" "జరామరణములు

లేనివాఁడు'' అనుమొదలగువాక్యములచేఁ బరమేశ్వరునకు సర్వవికారములును లేవనియుఁ జెప్పియున్నది. ''మృత్యోస్స మృత్యు మాప్నోతి'' అనుమొదలగువాక్యములచే భేదదృష్టి నిషేధించుచున్నది. ''ఏక మేవా ద్వితీయం'' ''ఆత్మై వే దం సర్వం'' ''బ్రహ్మై వేదం సర్వం'' అను మొదలగువాక్యములచే ప్రపంచబ్రహ్మాభేదమును చెప్పుచున్నది. స్మృతులును ''క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి'' ''వాసుదేవఃసర్వం'' ''ఓయర్జునా! నన్నే జీవునిఁగా నెఱుంగుము. వాసుదేవుఁడే ఈసర్వప్రపంచము'' అను మొదలగువాక్యములచే పైవిషయమున ననువాదము చేయుచున్నవి. కాశకృత్స్నమతము ననుసరింపక పరిణామపక్షము (జీవుఁడు పరమేశ్వరునికార్య మనునాశ్మరథ్యపక్షమును) నాశ్రయించినను, భేదపక్షము, (జీవుఁడు స్వాభావికముగనే పరమేశ్వరునికంటె భిన్నుఁడు) నాశ్రయించినను పైన జూపఁబడినవాని కన్నిఁటికిని విరోధము వచ్చును.

మఱియు జీవబ్రహ్మములకు స్వాభావికముగ భేదాభేదములు కలవనిన నం దేదియు నిశ్చితము కాకపోవుటచే నాత్మవిషయమున నెవ్వనికిని నిశ్చయజ్ఞానము కుదురదు; నిశ్చయజ్ఞానము లేకున్న మోక్షము దొరకదు. ''వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః'' ''వేదాంతవిషయ మగు నిశ్చయజ్ఞానము గలవారు'' అనుమొదలగువాక్యములచే శ్రుతి ''నిశ్చయజ్ఞానమువలననే మోక్షము'' అని చెప్పుచున్నది. భేదాభేదములు పరస్పరవిరుద్ధములును మతానుసారముగ ప్రబలములు నగుటచే తన్మతానలంబులు దేని నాశ్రయింతురు ? దేనిని పరిత్యజింతురు? కాశకృత్స్న మతమున నన్ననో యీదోషము లేదు. ఆయనమతమున భేదము భ్రాంతికల్పితమే కదా! శ్రుతియు ''తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః'' ''పరబ్రహ్మమునకుఁ గలయేకత్వము నెఱింగినవానికి భ్రాంతి యెక్కడిది? దుఃఖ మెక్కడిది?'' అని యభేదజ్ఞానమునే మోక్షసాధనముగాఁ జెప్పుచున్నది; కాని భేదజ్ఞానమును కాదు. కావున నెట్లు చూచినను కాశకృత్స్నమతమే శ్రుతిసమ్మతము.

పూర్వపక్షము:—ఇది సరి కాదు జీవబ్రహ్మములకు నభేదము కలదనినచో ''వీఁడు జీవుఁడు వీఁడు పరమేశ్వరుఁడు'' అనుభేదబుద్ధి కలుగుటకు హేతు వేమి? ''అవిద్యవలన నట్లు కలిగెను'' అనియెదవేమొ మొట్టమొదట నాయవిద్య యెవ్వనికిఁ గలదు ? జీవునకా ? పరమేశ్వరు

నకా? నిత్యశుద్ధబుద్ధస్వరూపుఁడగుపరమేశ్వరునకు నవిద్య యుండదు; ఆయనకంటె భిన్నుఁడు కాకపోవుటచే జీవులకుఁ గూడ నుండదు. కావున "సంసారిత్వము అది లేకపోవుట అవిద్య జ్ఞానము నామభేదము దాని వలనఁ గలిగినభేదవ్యవహారము" అను మొదలగు భేదములవలన జీవపరమేశ్వరులకు భేదముకూడ నవశ్యముగ నుండవలయును.

సిద్ధాంతము:—ఇట్లు లేదు. జీవపరమేశ్వరులఁ కభేదమే యుండి తీరవలయు ననువిషయము బహుయుక్తులతో నిరూపింపఁబడియున్నది. భేదాభేదములు రెండును పరస్పరవిరుద్ధము లగుటచే స్వాభావికములై యొక్కస్థలమున నుండ నేరవు. వేఁడిమియుఁ జల్లదనంబును నొక్కస్థలంబున నుండుటను కాంచుచున్నామా? కావున భేదాభేదములలో నేదియైన నొక్కటియే స్వాభావికముగ నుండు ననవలయును. అందు "భేదము స్వాభావికము" అనుటకు వీలు లేదు. జీవపరమేశ్వరు లిరువురును చేతనరూపులే యగుటచే వారిలో భేదము నెట్లును నిర్ణయించుటకు వీలు లేదు. ఆశ్మరథ్యాదులోములకును ఇది సమ్మతము కాదు; వారిమతమున నభేదపక్షము కూడఁ గలదు గదా? ఇఁక "అభేదమే స్వాభావికము" అని మాత్రమే సిద్ధాంతము చేయవలసియున్నది. అప్పుడు ప్రపంచమునఁ గానవచ్చు భేదము అజ్ఞానకల్పిత మనవచ్చును. *బింబభూతపదార్థములు నిర్మలములే యైయున్నను, వానిప్రతిబింబములకు మలినపదార్థము లాధారము లగునేని యప్పుడు "బింబము

---

* ఏపదార్థముయొక్క ఛాయ దర్పణాదులయందుఁ బడునో అది బింబము, ఆఛాయ ప్రతిబింబము. ఆలంకారాదులయందును మనము గ్రంథమున వర్ణించువిషయము బింబము; సర్వవిషయములందునుఁ దానితో సమానమై దృష్టాంతముగఁ దేఁబడినరెండవవిషయము ప్రతిబింబము. ఇట్టిబింబప్రతిబింబభావము గలయలంకారము దృష్టాంతాలంకారము. ఉపమానమునకుఁ గూడ ప్రతిబింబధర్మములే సంభవించినను వాక్యభేదము లేకపోవుటచే నది దృష్టాంత మనఁబడదు. దర్పణము మొదలగునన్యస్థానములయం దున్నఛాయమాత్రమే యెట్లు ప్రతిబింబ మనఁబడుచున్నదో యట్లే యితరవాక్యమున నున్నబింబవాక్యార్థచ్ఛాయయే ప్రతిబింబ మనఁబడును. ఏవాక్యమున నున్నఛాయ ప్రతిబింబము కాదనుట వారిపరిభాష కాకున్నను, బింబపదార్థము తనయందు తానే ప్రతిబింబించుట సంభవింపనట్లు యేకవాక్యమున దచ్ఛాయ యుండుననుటయు సంభవింప దనియు వారికి నభిప్రాయ ముండవచ్చును.

నిర్మలముగ నున్నది. ప్రతిబింబములు మలినములుగ నున్నవి. బింబము గుండ్రముగ నున్నది. ప్రతిబింబములు పొడవుగ నున్నవి'' అను మొదలగువ్యవహారములు కలుగుచుండుట లోకప్రసిద్ధము. బింబప్రతిబింబములకు వాస్తవస్థితిలో భేదమే లేదు కదా! కావున పరమేశ్వరుఁడు సిద్ధుఁడే నిర్వికారుఁడే యైనను ఆయనకు ప్రతిబింబమువలె నున్న యీజీవుఁడు అవిద్యోపాధి కలవాఁ డగుటచే నాయవిద్యాదోషముల నాశ్రయించి ''బ్రహ్మము నిత్యపరిశుద్ధము నిర్వికారము జీవుఁడు సంసారి సుఖదుఃఖాద్యుపద్రవములు కలవాఁడు'' అను మొదలగువ్యవహారములు కలుగుచున్నవి. ఇట్లగుటచే నావ్యవహారములనుమాత్రమే యవలంబించి భేదమును గ్రహింప నక్కఱ లేదు.

వాస్తవస్థితిలో అవిద్య నిత్యశుద్ధుఁ డగుపరమేశ్వరునియం దుండుటకు వీలు లేకున్నను, కల్పితభేదభిన్నుఁ డగుజీవునిమూలమున నాతనియం దుండును అనఁగా అవిద్య జీవునకే యున్నది కాని జీవబ్రహ్మములకుఁ గలభేదము కల్పితమే యగుటచే పరమేశ్వరునికే యున్న దని యుపచరింపఁబడును. ఘటాకాశమునకు నావరణ మగుఘటము, ఘటాకాశమహాకాశములకు భేదము లేకపోవుటచే మహాకాశమునకే లేక మహాకాశములోనిభాగమునకే యావరణ మని యుపచరింపవచ్చును కదా! ''ఇట్లయిన నవిద్యాజీవుల కన్యోన్యాశ్రయము వచ్చును కదా!'' అనియెడ వేమొ దానినిఁ గూర్చి (౧. ౪. 3.) సూత్రమున సవిమర్శముగా వివరించియే యున్నాను. ఆకారణమువలన (అయన్యోన్యాశ్రయము దోషము కాకపోవుటవలన) ''పరమేశ్వరుఁడు మాయ నెవ్వనిఁగూర్చి ప్రయోగించును? సృష్ట్యారంభమున జీవులు వేరు కదా! మఱియు సర్వానర్థకారిణి యగుమాయను తనపైఁ దానే వైచుకొను ననుట యెట్లు? జీవులకును తనకును భేదమే లేకపోవుటచే సృష్ట్యారంభమున నున్నవాఁడు తా నొక్కఁడే యగుటచే 'మాయను తనపైననే ప్రయోగించుకొనును'' అనియే చెప్పి తీరవలయును కదా!'' అను మొదలగుప్రశ్నలకు నవకాశ మింత యైనను లేదు. కావున కేవల భేదవ్యవహార మున్నంతమాత్రమున దాని నాశ్రయించి భేదసిద్ధాంతమును చేయ నక్కఱ లేదు. వ్యవహారము భ్రాంతివలనఁ గూడఁ గలుగవచ్చును కదా!

''ఒకచోట ప్రతిబింబదృష్టాంతమును మఱియొకచోట నాకాశ

దృష్టాంతమును చెప్పితిరి. ఒకదృష్టాంతముపై నిలువకభిన్నస్వభావ ములు గలదృష్టాంతముల నాశ్రయించి కార్యనిర్వాహము చేసికొనిన నది సిద్ధాంత మెట్లగును? ప్రతిబింబ మనునది బింబముయొక్క ఛాయయే కాని యంశము కాదు; ఘటాకాశము మహాకాశము యొక్క యంశము కదా" అనియెదవేమొ వినుము. "అభేదము గల పదార్థములయందు భ్రాంతిసిద్ధమగు స్వరూపభేదవ్యవహారము లోకమునఁ గలదా లేదా?" అనువిషయముమాత్రమే మాకు నిరూపణీయము. ఇది యేదృష్టాంతము నాశ్రయించినను నిరూపింపఁబడును. ఉపాధి ననుస రించి దానిగుణములు ఉపహితమునందు (ఉపాధి గలదానియందు) ఆరోపించుట ప్రతిబింబఘటాకాశములయందు సమానమే. ఇట్లుండ వానివానిస్వభావములయందుఁ గలవైషమ్యములతో మాకేమిపని? అవకాశమే యాకాశ మగుటచే ఘటాదిగతరంధ్రములయొక్క రూపభేద ముల నాశ్రయించి యాకాశమునకు రూపభేదములు వర్ణింపఁబడుచున్నవి యని తెలిసికొనవలయును. "ఈరంధ్రము వర్తులముగా నున్నది; అర్ధచం ద్రాకారముగ నున్నది చతుష్కోణముగ నున్నది" అను మొదలగు వ్యవ హారములు తత్తదుపాధులయం దున్నయాకాశమునుఁ గూర్చినవియే యని నిశ్చయింపవలయును. ఈవిషయము ప్రత్యక్షగోచరము లగుజలా దులయందు స్పష్టము. అవి బహువిధాకారములతో నిర్మింపఁబడినతటా కాదులయందు నిలిచియున్నప్పుడు తత్తదాకారములు కలవిగానే వర్ణిం పఁబడుచున్నవి. కావున నేదృష్టాంతమును చెప్పినను విరోధము లేదు. దృష్టాంతదార్ష్టాంతికములకు సర్వవిషయములందును పోలిక యుండవల సినపని లేదు కదా! మఱియు నీయవిద్య యనిర్వచనీయ యగుటచే "ప్రతిబింబమునకు దర్పణాదులవలె జీవులకు నాధారభూత" యనియు, "ఘటగత జలములయందు సర్వవ్యాపకమయ్యు నాకాశము మరల ప్రతిబింబించు నట్లు ఆబ్రహ్మము సర్వవ్యాపక మయ్యు నవిద్యయందు ప్రతిబింబించెను" అనియుఁ గూడఁ జెప్పవచ్చును. కావున మాసిద్ధాంత మున నేమియు దోషము లేదు.

"ఇట్లయిన జీవుఁడు స్పష్టముగఁ గానవచ్చుచుండుటచే పర మేశ్వరుఁడు కూడ నట్టివాఁడే కావలయును" అనియెదవేమొ యట్లు కానక్కఱ లేదు. లోకమున బింబాభిన్న మగుప్రతిబింబమునను మహా

కాశాభిన్న మగుఘటాకాశమునకు నెట్లు దర్పణాదులును ఘటాదులును ఆశ్రయభూతములో, అట్లే జీవాభిన్నుఁడగుపరమేశ్వరునకును అవిద్యలు గుహలు. కావున లోకమున ప్రతిబింబములు ప్రకాశించుచున్నను బింబము ప్రకాశింపకుండుట (అనఁగా: తెలియరాకుండుట) కూడ సంభవించునట్లు జీవుఁడు ప్రకాశించుచున్నను బ్రహ్మము ప్రకాశింపకుండవచ్చును. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" "ఆసృష్టికర్త ప్రపంచమును సృజించి దానియందే ప్రవేశించెను" అను మొదలగు వాక్యములచే శ్రుతి యీవిషయమునే స్పష్టము చేయుచున్నది; పరమేశ్వరుఁడే జీవరూపమున నవిద్యారూపగుహలయం దున్నాఁడని చెప్పుచున్నది.

కావున నెట్లు చూచినను కాశకృత్స్నమతమే శ్రుతిసమ్మతము. ఇట్టిసిద్ధాంతము నంగీకరింపక నెవ్వరు జీవపరమేశ్వరభేదము కలదందురో వారు వేదాంతతాత్పర్యార్థమునే బాధించినవా రగుదురు. ఆవేదాంతము భేదదృష్టిని నిషేధించుచు నిందించుచు నభేదదర్శనమును ప్రశంసించుచున్నది. మఱియు వారు మోక్షసాధన మగుతత్త్వజ్ఞానమునే నిరాకరించినవార లగుదురు; శాశ్వత మగుమోక్షమునకు కార్యత్వంబును దానిచే ననిత్యత్వంబును కల్పించినవార లగుదురు. జీవుఁడే మోక్షము నొందవలసినవాఁడు; వాఁడు ఆకాశాదులవలె కార్యమయ్యె నేని,నశించు నేని యప్పుడు వాని నాశ్రయించినమోక్షము కూడ నట్టిదే కావలసివచ్చును కదా! ఇదియునుఁ గాక వారిమతములు యుక్తివాదములకుఁగూడ నిలువవు.

ఆశ్మరథ్యమతము సయుక్తికముగ నిదివఱకే ఖండింపఁబడెను. "ఉత్పత్తిశ్రుతి యుపాధికోత్పత్తినిఁ గూర్చి చెప్పునదియే" అనుటచే నామతము పోయెను కదా! ఇఁక నౌడులోమిమతము కూడ నట్టిదియే. వారిమతమునకు నాధారముగ నుదాహరింపఁబడిన "ఏష సంప్రసాదః" అనుశ్రుతి సుషుప్త్యవస్థావిషయ మగుటచేతను భ్రాంతివినాశాభిప్రాయ మగుటచేతను స్వాభావికభేదపరమే యనుటకుఁ బ్రబలకారణములు లేక పోవుటచేతను వారిమతము నిలువదు. రెండవది యగు "యథా నద్యః" అనుశ్రుతియు వారిమతమున కనుకూలము కానేరదు. ఆశ్రుతికి వారు చెప్పినయర్థము సరిపడదు. వారు జలసామాన్యమునుఁ గలయేకత్వ

మును గాని ఉపాధికృతభేదమును కాని యుపాధికృతనామరూపములను గాని యంగీకరించియుండురేని యప్పుడు నదీసముద్రములకు నైక్యము సంభవించు ననినఁ జెల్లి యుండును; అది మామతమే యగును. అట్లు కాకున్నప్పుడు నదికి స్వతంత్రనామరూపములును నదీస్థితియందు స్వాభావిక మగుభేదమును కల దని చెప్పునప్పు డట్టియైక్య మెట్లు సంభవించును? "నది యనిన నదీజలపరమాణువులచే నేర్పఱుపఁబడినజలము; లేక ప్రవాహము" అని చెప్పిన నది సముద్రప్రవేశము కాఁగానే నశించును కావునను "నదీజలపరమాణువులే నది" అనిన నప్పు డాపరమాణువులకును సముద్రజలపరమాణువులకును భేదము నిత్యమే కావునను, "నది సముద్రమునఁ గలసి సముద్రమే యగును" అనుట సంభవింపదు. ఎన్నియుక్తులు చెప్పినను ఎప్పటికైనను స్తంభము గోడ కానేరదు కదా !

కావున కాశకృత్స్నమతము తప్పఁ దక్కిన వన్నియు నప్రామాణికములే. "జీవుఁడు పరమేశ్వరుని యంశము. ఆకాశము స్వరూపవ్యాపక మయ్యు నేకరూప మయ్యు ఘటాదిరంధ్రములయందు నిలచి ఘటాకాశాదిశబ్దములచే వ్యవహరింపఁబడుచున్నట్లు కర్ణరంధ్రమున నుండి * శ్రోత్రేంద్రియనామముచే వ్యవహరింపఁబడుచో శబ్దగ్రహణరూప మగువ్యాపారము చేయుచున్నట్లు, వాయువు శరీరమునఁ బ్రవేశించి * ప్రాణాదినామములతోఁ బిలువఁబడుచో ఆహారపచనాదిరూపకార్య

---

* శ్రోత్రమున నున్నయాకాశమే శ్రోత్రేంద్రియ మనియుఁ బ్రత్యేకముగ శబ్దగ్రహణము చేయుసూక్ష్మపదార్థము వేఱుగ లే దనియు సర్వవాదిసమ్మత మగు సిద్ధాంతము.

* ప్రాణవాయువు హృదయమున నుండి వెలికి వచ్చుచుఁ బోవుచు రక్తమున నుండు నపారిశుధ్యమును తొలఁగించి నరములకు బలము నిచ్చును. అపానవాయువు గుదస్థానమున నుండి మలమూత్రాదుల వెడలించును. వ్యానవాయువు సర్వశరీరమునందు వ్యాపించి వెలుపలిశీతోష్ణముల లోనికిని లోపలిశీతోష్ణముల వెలుపలికి నిచ్చుచుండును. ఉదానవాయువు కంఠమున నుండి సంచియాహారములను లోనికిఁ గైకొనుచు దక్కినవానిని వాంతిమూలకముగ వెలుపలికి వెడలించును. సమానవాయువు నాభియందుండి జఠరాగ్నిని ప్రజ్వలింపఁజేసి యాహారమును పచనముఁ గావించి రక్తమును సర్వనాడులకును బంచి యిచ్చును.

ములఁ జేయుచున్నట్లు, ఈపరమేశ్వరుఁడును అవిద్యోపాధులయందు నిలిచి జీవనామముచే వ్యవహరింపఁబడుచు, అకర్తయయ్యు సర్వకార్యముల నాచరించుచు నున్నాఁడు" అనుటయే సిద్ధాంతము.

"ఈసిద్ధాంతమునందు కూడ శ్రుతివిరోధము కలదు "నిష్కలం నిష్క్రియం శాంతం" అనుశ్రుతికి మీామతము విరుద్ధము" అనియెదవేమొ యట్లు కాదు. ఆశ్రుతి నిష్కలపదముచే "పరమేశ్వరునకు అవయవములు లేవు" అని మాత్రమే చెప్పుచున్నది కాని అంశము లేదని చెప్పుట లేదు. ఘటాకాశము ఆకాశమునకు నవయవము కానేరదు కదా !

"ఇది యుక్తముగ నుండలేదు. బ్రహ్మము యేకరూపుఁడై యున్నప్పుడు ఈజీవత్వ మెట్లును కలుగు ననుటకు వీలు లేదు. మీరు చేసిన సిద్ధాంతము నాశ్రయించి చూచిన అంశమునకును అంశికిని (అంశము కలవానికిని) భేదమే యుండదు. లోకమున అవయవములు లేనిపదార్థమొకదాని నాశ్రయించి దానిచే కొంతభేదము నొందు ననుట సంభవింపదు. పరిచ్ఛిన్నమైన భిన్నముయ్యే యుండవలయును ; కాకున్న బొత్తుగనే లేకపోవలయును. ఈవిషయమున సిద్ధాంత మెట్లు" అనియెదవేమొ వినుము. ఈవిషయమును సిద్ధాంతము చేయవలసినపని మాకు లేదు. ఇది యిట్లే యుండనిమ్ము. జీవుఁ డనువాఁ డొక్కఁడుమాత్రము కలఁడు ; వ్యాపారములఁ జేయుచున్నాఁడు. ఇది లోకప్రసిద్ధము. ఆకాశము కర్ణరంధ్రమున నుండి శబ్దమును గ్రహించుచున్నది యనుట యిందుకు దృష్టాంతము. కర్ణరంధ్రమున నున్నయాకాశము మహాకాశమునకంటె భిన్న మని యెట్లు నిరూపింపఁగలము ? ఆకాశమునకు నవయవములు లేవనుట సర్వవాదిసమ్మతము కదా ! కావున శ్రోత్రేంద్రియము ఆకాశాంశమే యని తీరవలయును. ఆవిషయమున నీవు చేసిన సిద్ధాంతమే (అంశ మనునది యుండుటకే వీలు లేదనుసిద్ధాంతము) స్థిరమగునేని, అట్లే యంగీకరింపవలసియుండునేని, యప్పుడు ఆకాశము సర్వగతము కావున గోడలు స్తంభములు మొదలగునవి యన్నియు మనము మాటలాడువాక్యముల విననలసివచ్చును. ఇది సంభవింపదు కదా ! కావున అంశ యవయవములు లేనివాఁడే యైనను అనిర్వచనీయ మగునేదియో యొకకారణమునలన నంశమునకు భేదియో యొకవిశేష

ముండి తీరవలయును. మఱియు అంశము అంశికంటె భిన్న మని కాని కా దని కాని యెట్లును నిరూపించుటకు వీలులేదు. మాకుఁ గావలసిన దిదియే.

ఇదియునుఁ గాక జీవరూప మగునంశమునకుఁ గలవిశేష మవిద్యయే యని మేముచెప్పుచున్నాము. దానికి నెట్లును లక్షణమును చెప్పుటకు వీలు లే దనుచున్నాము. "అవిద్య యనఁగా నజ్ఞానము కదా! అదియే జీవునకు విశేష మైనయెడల నాయన ప్రకాశించుచు నుండఁగూడదు" అనియెదవేమొ యది సరి కాదు. ఆయవిద్యకు బ్రహ్మమే విషయము కాని జీవుఁడు కాఁడు. మఱియు లోకప్రసిద్ధిని యుక్తులచే నిరాకరింప లేము. జీవుఁడు తనకార్యమువలన స్పష్ట మగుచున్నాఁడు. "పూర్వమే స్పష్టమై యుండవలయును కదా! అనియెదవేమొ ఈప్రపంచ మనాది యగుటచే నిది దోషము కాదు. ఇట్లు కాక నొకవేళ నీవు చూపిన దోషము లన్నియు దుర్నివారములే కానిమ్ము. అప్పటికిని మామతము చెడదు. మాయకు నిది యంతయు భూషణమే. మామతమునఁ గార్య కారణము లన్నియు మాయామయములే కదా! మీరుమాత్రము యుక్తులచే నేదేదియో నిరూపింపఁబోయి చేసినఘనకార్య మేది కలదు? అందఱును మామతము సంగీకరించిననే కాని శ్రుతిని చక్కఁగా సమ న్వయింపలేరు. కావున కాశకృత్స్నసిద్ధాంతమే శ్రుతిసిద్ధాంతము.

---

# ౭. ప్రకృత్యధికరణము.

విషయము:— "ఉత మా దేశ మప్రాక్ష్యో యే నాశ్రుతం శ్రుతం భవతి....యథా సో మ్యై కేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం మృ త్తి కే త్యేవ సత్యం" "నీవు దేనిని తెలిసికొనిన నిదివర కెన్నడును వినఁబడనిది కూడ వినఁబడినట్లే యగునో అట్టిపదార్థమునుఁ గూర్చి గురువును ప్రశ్నించితివా? ఓశాంతుఁడా! మట్టి ముద్ద నొకదాని నెఱింగిన మృణ్మయపదార్థము లన్నియు నెట్లెఱుంగఁ బడునో, అమ్మృణ్మయపదార్థములు నామమాత్రములే కాని యందు

మృత్తికకంటె భిన్నమగు యథార్థతత్వ మెట్లు లేదో" అను నిట్టిజాతిగల వాక్యము లీయధికరణమున విమర్శింపఁబడును. బ్రహ్మము ప్రపంచమున కుపాదానకారణము కూడ నై యున్న దని నిరూపింపఁబడును.

సందేహము:—ఇచ్చట, వేదవాక్యములలోఁ గొన్ని "స ఐక్షత" అని సంకల్పపూర్వకసృష్టినిఁ జెప్పుచుండుటయు ప్రస్తుతవిషయవాక్యమును బోలు కొన్నివాక్యములు "ప్రపంచము పరమేశ్వరవికారము" అని చెప్పుచుండుటయు సంశయకారణములు "పరమేశ్వరుఁడు నిమిత్తకారణమా? లేక, యుపాదానకారణము కూడ నగుచున్నాఁడా?" అనునది సంశయస్వరూపము. "పరమేశ్వరుఁడు నిమిత్తకారణముమాత్రమే ఉపాదానకారణముఁ గూడ నగుచున్నాఁడు" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. "పరమేశ్వరుఁడు నిమిత్తకారణముమాత్రమే యగుటచే నింతవరకుఁ జేయఁబడిన సమన్వయ మంతయు ప్రధానపరముఁగూడ కావలసివచ్చును. ఉపాదానకారణము లేక కార్యోత్పత్తి కలుగదు కదా! ఉపాదానకారణమే లేదనిన నిమిత్తకారణము కూడ నుండదు. అది యప్పుడు దేనిని ప్రేరేపింపవలయును" అనునది పూర్వపక్షమునకు ఫలము. "పరమేశ్వరుఁడే యుపాదాననిమిత్తకారణములు కావున సాంఖ్యప్రధానముతో నిచ్చట పనియే లేదు" అనునది సిద్ధాంతఫలము.

సంగతి:—అభివృద్ధికొఱకై కర్మను విచారింపవలసినట్లు మోక్షము కొఱకై బ్రహ్మమును విచారింపవలయు ననుచు నీశాస్త్ర మారంభించినది. వేదము నంతయును పరమేశ్వరునియం దేకవాక్యముగ సమన్వయించుట కుపక్రమించి యారంభమున "జన్మాద్యస్య యతః ౧. ౧. ౨" అను సూత్రముచేఁ బరమేశ్వరునకు లక్షణమును చెప్పినది. "అచ్చట పరమేశ్వరుఁడు నిమిత్తకారణముగానే చెప్పఁబడెను." అను సంశయమును నివారించుటకై యీయధికరణము సమన్వయాధ్యాయాంతమున వ్రాయఁబడెను. ఇది జన్మాద్యధికరణమునకు తర్వాతనే యుండుట యావశ్యకమైనను విషయనిర్ణయ మైనపిదప నీవిచారము నారంభించిన సుబోధముగ నుండు నని యిట్లు చేయఁబడెను. జన్మాద్యధికరణము దీనియభిప్రాయమునుకూడ గ్రహించియే చెప్పఁబడె నని తెలిసికొనవలయును. ఉపాదానకారణత్వమునుఁ జెప్పు శ్రుతివాక్యములను

బ్రహ్మమునందు సమన్వయించుటయే యీయధికరణమునకు ఫలము కావున నిది సమన్వయాధ్యాయమునందుఁ జేరవలసినదియే.

ఇందును ప్రధానము జగదుపాదానము కాదని శ్రుతివాక్య సమన్వయముచే సిద్ధాంతము చేయఁబడును కావునను, "వేదవాక్యముల కన్నిఁటికిని బ్రహ్మమునందే తాత్పర్యము" అని నిర్ణయింపఁ బడును. కావునను దీనికిఁ నాల్గవపాదమునందు చేరిక కలిగినది.

"పూర్వాధికరణమున ఒకపదార్థము నెఱింగినచో సర్వపదార్థముల నెఱుంగవచ్చును" అను ప్రతిజ్ఞను ప్రధానము చేసి జీవపరము లగువాక్యముల బ్రహ్మపరములఁ జేసితిరి. ఇచ్చట నట్లు చేయుటకు వీలు లేదు. ప్రతిజ్ఞను ప్రధానముగఁ గైకొనిన సంకల్పపూర్వకసృష్టినిఁ జెప్పు శ్రుతులకు విరోధము వచ్చును. కావున నా ప్రతిజ్ఞ *"గౌణమే" అని ప్రత్యుదాహరణసందర్భముతోఁ పూర్వాధికరణముపై నాక్షేపము వచ్చును. దానిని నివారించుటకై యీయధికరణ మారంభమయ్యెను. కావున దీనికిఁ బైయధికరణములతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణ సంబంధము.

పూర్వపక్షము:—జన్మాద్యధికరణమున "పరమేశ్వరునకు జగత్కారణత్వమే లక్షణము" అని చెప్పఁబడియున్నది. జగత్కారణత్వ మనఁగా నర్థ మేమి? లోకమున కార్యోత్పత్తికి రెండుకారణము లుండుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. కుండకు మట్టియు కుమ్మరియు భూషణములకు సువర్ణంబును స్వర్ణకారుఁడును అని యిట్లు ప్రతిపదార్థమునకును రెండు కారణములు కానవచ్చుచున్నవి. ఇందు పరమేశ్వరుఁడు ప్రపంచమునకు నిమిత్తమా? యుపాదానమా? లక్షణముమాత్రము రెంటియందును సమానముగనే వర్తించును కదా! ప్రతిపదార్థంబును తన యుపాదాన నిమిత్తకారణములనుండియే జనించుచున్నది. అందే నిలుచుచున్నది; లయ మగుచున్నది. విచారింపఁబోయిన నేపదార్థము సంకల్పపూర్వకముగ నొక్కదాని నాచరించునో, ప్రభువై యొక్కదానిని నియమించునో, కార్యములతో సమానరూపము కలదియై యుండకున్నను ఆకార్యములకుఁ గారణ మగుచుండునో, అట్టివి నిమిత్తకారణము లనఁ బడుచున్నవి. కావున పరమేశ్వరుఁడు ప్రపంచమునకు నిమిత్తకారణమే

---

* గౌణము (పుట. 8-౨8. చూడు.)

యని తేలుచున్నది. "స ఐక్షత" అను మొదలగువాక్యములచే సంకల్ప పూర్వకకర్తృత్వంబును, "ఏష సర్వేశ్వరః" అను మొదలగువాక్యములచే ప్రభుత్వంబును, "నిష్కళం నిష్క్రియం" అను మొదలగువాక్యములచేఁ బ్రపంచవిరుద్ధ మగునిరవయవస్వరూపంబును పరమేశ్వరునకు కలవని శ్రుతి చెప్పుచున్నది. ఇఁక నీయన దానికి నుపాదానకారణ మెట్లగును?

ఉపాదానకారణ మనునది కార్యముతో సమానరూపము కలది యై యుండవలయును. ప్రపంచము అపరిశుద్ధము, సుఖదుఃఖమోహాత్మకము దీనికారణము కూడ నిట్టిదియే యై యుండవలయును. ఇట్టిది సాంఖ్యప్రసిద్ధప్రధానమే.

"ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగును" అను ప్రతిజ్ఞయును దాని కనుకూలము లగుమృదాదిదృష్టాంతములు బ్రహ్మపరములుగఁ గానవచ్చుచున్నను ఎట్లో ప్రధానపరములుగ సమన్వయింపవలయు ననుటయే కర్తవ్యము.

అవతారిక:—అనిన నట్లు కా దని సిద్ధాంతము చేయుచున్నాఁడు.

## ౧౨౩. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్. ౧. ౪. ౨౩.

తాత్పర్యము. సిద్ధాంతము:— ప్రపంచమునకుఁ బరమేశ్వరుఁడే యుపాదానకారణముఁ గూడ నై యున్నాఁడు. సర్వవిజ్ఞానప్రతిజ్ఞయు దృష్టాంతములును ఈవిషయమునే తెలుపుచున్నవి. ఉపాదానకారణ జ్ఞానమువలనఁ గాని కార్యవిజ్ఞానము కలుగదు కదా!

ఈప్రతిజ్ఞాదృష్టాంతములు సర్వశ్రుతులయందు నేకవిధముగనే యున్నవి. ప్రస్తుతవిషయవాక్యములు ఛాందోగ్యోపనిషత్తులోనివి. బృహదారణ్యకోపనిషత్తునందును ఇట్టి ప్రతిజ్ఞాదృష్టాంతములు కల వని పూర్వాధికరణమున నిరూపింపఁబడియున్నది. జన్మాద్యధికరణమునకు విషయవాక్యముగఁ జెప్పఁబడిన "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను తైత్తిరీయోపనిషద్వాక్యంబును ప్రతిజ్ఞాదృష్టాంత

ములఁ జెప్పుకున్నను పంచమీవిభక్తిచే * "జనికర్తుః ప్రకృతిః" అను వ్యాకరణసిద్ధాంతము ననుసరించి యుపాదానకారణమును గూడ చెప్పుచున్నవి. ఇట్లు సర్వవేదాంతములు నేకవాక్యముతోఁ బరమేశ్వరునకు నుపాదానకారణత్వమునుఁ జెప్పుచుండ, వేదోక్తము కాదని సిద్ధాంతము చేయఁబడియున్న ప్రధానమును మఱల నెట్లు గ్రహింతుము?

ముఖ్య మగునర్థముచేతనే కార్యనిర్వాహము గలుగుచుండ ప్రతిజ్ఞాదృష్టాంతములకు గౌణార్థమును కల్పింపవలసినపనియు లేదు. వేదము భేదమనుదానినే నిషేధించుటచే బ్రహ్మాభిన్నముగ ప్రపంచమును గ్రహించుటయే యసంభవమైయుండ నుపాదానకారణము నొకదానినిఁ గూడ నెట్లు గ్రహింపఁగలము? ఒకవేళ నీనిర్బంధమునవలన గ్రహించినను ఈప్రతిజ్ఞాదృష్టాంతములే యడ్డము వచ్చును. నిమిత్తకారణము కార్యమునకంటె బొత్తిగ భిన్నమే యగుటచే తజ్జ్ఞానమువలన కార్యజ్ఞానము కలుగదు; ఉపాదానకారణజ్ఞానమువలన కార్యజ్ఞానము కలిగినను తద్భిన్ననిమిత్తకారణజ్ఞానము కలుగదు. సర్వవిజ్ఞాన మనిన నిమిత్తకారణభిన్నపదార్థవిజ్ఞానము కానేరదు కదా! కావున నెట్లు చూచినను పరమేశ్వరుఁడే ప్రపంచమున కుపాదాననిమిత్తకారణములు. మట్టి సువర్ణము మొదలగునవి యచేతనపదార్థము లగుటచే చేతను లగుకుమ్మరి మొదలగునిమిత్తకారణముల నపేక్షించును; పరమేశ్వరుఁడు చేతనుఁడే యగుటచే నాయన కట్టియుపేక్ష లేదు. ఉపాదానకారణము కార్యసమానరూపమై యుండవలయు ననుట నియమమే యైనను మామతమునఁ బ్రపంచము * వివర్తజాత మగుటచే నానియమము లేకున్నను దోషము లేదు. భ్రాంతిచే గ్రహింపఁబడినసర్పమునకును దానికి వివర్తోపాదాన మగుత్రాటికిని సమానరూపము కొంచెమయినను లేదు కదా!

---

"జనికర్తుః ప్రకృతిః" (వ్యాకరణము ౧. ౪. ౩౦ చూడు.) ఉత్పత్తియైన పదార్థమునకు గారణ మగునది యుపాదాన మగును. దానిని పంచమీవిభక్తితోఁ జెప్పవలయును. ఇచ్చట ప్రకృతిశబ్దమునకుఁ గొందఱు నిమిత్తకారణముగమాత్రమే యర్థము చెప్పుదురు. వ్యాకరణభాష్యకారుఁ డగుపతంజలి దానికి నుపాదానకారణపరమున నర్థమును చెప్పెను.

* వివర్తజాత మనఁగా: వివర్తమువలనఁ బుట్టినది. వివర్తము (పుట. ౭౭ చూడు.)

# అ ౧. పా ౪. సూ ౨౪. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమును నిర్ణయించుటకై మఱికొన్ని హేతువులఁ జూపుచున్నాఁడు.

## ౧౩౦. అభిధ్యోపదేశాచ్చ. ౧. ౪. ౨౪.

తాత్పర్యము:—అభిధ్య యనఁగా లేనిపదార్థమునుఁ గూర్చిన సంకల్పము (అనఁగా క్రొత్తపదార్థంబును సృజింపవలయు ననుసంకల్పము) "సో ఽకామయత బహు స్యాం ప్రజాయే యేతి. స ఐక్షత బహుస్యాం ప్రజాయే యేతి" "నే నొక్కఁడనే ప్రపంచరూపము నొందుచు ననేకు లయ్యెదను అని పరమేశ్వరుఁడు సంకల్పించెను (రెండు వాక్యములకు నిదియే యర్థము)" అను మొదలగు వాక్యములచే శ్రుతి పరమేశ్వరునకు అభిధ్యను చెప్పియున్నది; అందును "స్వయముగనే ప్రపంచరూపము నొందవలయు నని" అనువాక్యభాగముచే ప్రపంచోపాదానత్వమును కూడ సూచించియున్నది. కావున ప్రపంచసృష్టివిషయమున స్వతంత్రసంకల్పము గావించినవాఁడు గావున నిమిత్తకారణంబును, స్వయముగనే ప్రపంచరూపము నొందినవాఁడు కావున నుపాదానకారణంబునుఁ గూడ నాపరమేశ్వరుఁడే.

## ౧౩౧. సాక్షాచ్చోభయామ్నానాత్.

### ౧. ౪. ౨౫.

తాత్పర్యము:—మఱియు శ్రుతి "పరమేశ్వరభిన్న మగునుపాదానకారణము ప్రపంచమునకు లేదు" అనువిషయమును సృష్టిలయకథనముచే నిరూపించుచున్నది; * అవధారణమునుఁ గూడ చేయుచున్నది. "సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశా దేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతి (౧. ౧. ౨౨. చూడు)" అను వాక్యమునం దీవిషయములు స్పష్టములై యున్నవి. లోకమున ప్రతిపదార్థమునకును ఉత్పత్తివినాశములు ఉపాదానకారణమునుండియే కలుగుచున్న ననుట స్పష్టము. ఘటము మృత్తికనుండి జనించుచున్నది.

---

* "ఇదియే. దీనికంటె నితరము లేదు" అని నిర్ధారణ చేయుటకు నవధారణ మని పేరు. ఇది "ఏవ" అనుశబ్దముచే తెలుపఁబడును.

లయ మైనప్పుడు మరల నామృత్తికలోనే కలియుచున్నది కదా! ఉత్పత్తికి నిమిత్తకారణము కూడ కావలసియే యున్నను లయమునకు దానితోఁ బని లేదు. కావున దానియందు పదార్థము లయము నొందదు. కావున, ఈశ్రుతియం దుత్పత్తిలయములు రెండును గ్రహింపఁబడుటచే నుపాదానకారణమే యుద్దేశింపఁబడె నని స్పష్ట మగుచున్నది. వాస్తవస్థితిలో నుత్పత్తివిషయమునఁగూడ నిమిత్తకారణ మంత ప్రధానము కాదు. కార్యము ఉపాదానకారణమునుండియే జనించును; అది లేకున్న జనింపదు; కాని నిమిత్తకారణవిషయ మట్టిది కాదు. ఉపాదాన * మనన్యథాసిద్ధ మగుకారణము; నిమిత్త మన్ననో యట్టిది కాదు. ఒకటి కాకున్న మఱియొకటి యాస్థానమునకు రావచ్చును. శ్రుతియందును "ఆకాశాత్" అను పంచమీవిభక్తిచే నుపాదానకారణమే వర్ణింపఁబడెను. ఈవిషయమున "జనికర్తుః ప్రకృతిః" అనువ్యాకరణసిద్ధాంత మాధార మని యిదివఱకే వర్ణింపఁబడెను. కావున పరమేశ్వరుఁడే ప్రపంచమున కుపాదానకారణము.

## ౧౩౨. ఆత్మకృతేః పరిణామాత్. ౧. ౪. ౨౬.

తాత్పర్యము:—ఇదియునుఁ గాక "త దాత్మానగ్ స్వయ మకురుత" "ఆపరమేశ్వరుఁడు తనంతఁ దానే తనయాత్మను ప్రపంచరూపముతోఁ బరిణమింపఁ జేసెను" అనువాక్యముచేతఁ గూడ శ్రుతి యీవిషయమును చెప్పుచున్నది. పై మంత్రముయొక్క యర్థమును విమర్శించిన నిమిత్తోపాదానకారణములు రెండును పరమేశ్వరుఁడే యనుట స్పష్ట మగుచున్నది. "తానే పరిణమింపఁజేసెను" అనుటచేఁ గర్తృత్వంబును "తననే పరిణమింపఁజేసెను" అనుటచే గర్మత్వంబును స్పష్ట మగుచున్నది కదా!

"లోకమున * సిద్ధ మగుపదార్థము సాధ్య మగుటకు వీలు లే దనుట నియమము. ఇట్లుండ కర్తయై సిద్ధుఁడై యున్నపరమేశ్వరుఁడు మరల ప్రపంచరూపముతో సాధ్యుఁ డగు ననుట యెట్లు సంభ

---

* అన్యథాసిద్ధి (పు. ౨౩౪. చూడుము). అది లేనిది అనన్యథాసిద్ధము.

* త్రికాలములయందు నేకరూపముతోఁ గాని యొకనిచే పదార్థాంతరమున నిర్మింపఁబడక గాని యుండునది సిద్ధము, నిర్మింపఁబడవలసినది సాధ్యము.

వించును ? అనియెదవేమొ వినుము. పరిణామమువలన నిట్టిస్థితి సంభ వింపవచ్చును. లోకమున మట్టి మొదలగునవి ఘటాదిరూపములతోఁ బరిణమించుచున్నవి. అచ్చట కూడ మట్టి స్వస్వరూపముతో సిద్ధ మైయే యున్నది కదా ! అయిన యామట్టి యచేతన మగుటచే దానిపరిణామ మునకు నిమిత్తకారణ మొక్కటి చేతనము కావలయును; ఇచ్చట చేతనబ్రహ్మమే యుపాదానము కావున నీయనకు చేతనాంతరసాహాయ్య మక్కఱ లేదు.

"పరిణామము నంగీకరించిన నీకు ననేకదోషములు వచ్చును" అనియెదవేమొ వినుము. మామతమునఁ బరమేశ్వరునకుఁ గలనిమిత్త త్వము ఉపాదానత్వము దానిచేఁ గలిగినప్రపంచరూపపరిణామము ప్రపం చము నను నివి యన్నియు * ననిర్వచనీయములే కదా ! శ్రుతియు "ఏక మే వా ద్వితీయం" అనుమొదలగు ననేకవాక్యములచే నీవిషయమునే నిరూపించుచున్నది యని కాశకృత్స్నమతవిమర్శమున (౧. ౪. ౨౨. చూడు.) బహువిధముల నిరూపించియున్నాము.

విశేషాంశము:—ఇచ్చట "పరిణామాత్" అనుభాగమును ప్రత్యేక సూత్రముగఁ గూడ గ్రహింపవచ్చును. అప్పుడు దానికి నర్థ మిట్లు:—

"త చ్చ త్య చ్చాభవత్" "ఆపరమేశ్వరుఁడే ప్రత్యక్షములు కాని యాకాశవాయువులుగాను ప్రత్యక్షము లగునగ్నిజలపృథువులు గాను కూడ నయ్యెను" అనువాక్యముచే శ్రుతి సర్వప్రపంచమును బ్రహ్మపరిణామమునుగాఁ జెప్పుచున్నది. ఈకారణమునలనఁ గూడఁ బర మేశ్వరుఁడే ప్రపంచమున కుపాదానకారణము. ఉపాదానకారణభిన్న మగుపదార్థము కార్యము కా నేరదు. (అనఁగా కార్యరూపముతో నుండ నేరదు) కదా !

## ౧౩౩. యోనిశ్చ హి గీయతే. ౧. ౪. ౨౭.

తాత్పర్యము:—ఇది యంతయునుఁ గాక శ్రుతులయందు పర మేశ్వరుఁడు ప్రపంచోపాదానముగ ప్రత్యక్షముగనే చెప్పఁబడి యు న్నాఁడు. "కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం, తద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" "సృష్టికర్తయు ప్రభువును పురుషుఁడును హిరణ్య

* అనిర్వచనీయము (పుట. ౩౭౫. చూడు.)

గర్భునకు యోనియు భూతములకు యోని యగునాపరబ్రహ్మమును జ్ఞానవంతులు తెలిసికొందురు" అనుమొదలగువాక్యములయందు శ్రుతిచే యోనిశబ్దము ప్రయోగింపఁబడియున్నది. యోనిశబ్దమునకు నుపాదానకారణమే యర్థ మనుట లోకవేదములయందు స్పష్టము. "పృథివీ యోని రోషధీనాం" "ఓషధులకు భూమి యోని" అను మొదలగువాక్యములయం దీవిషయము స్పష్టమై యున్నది. భూమి యోషధుల కుపాదానకారణ మనుట నిర్వివాదాంశము కదా! కావున పరమేశ్వరుఁడు ప్రపంచమున కుపాదానకారణ మనుట నిస్సంశయము.

"యోనిశబ్దమునకు నితరార్థములు కూడఁ గలవు" అందు వేమొ ముండకోపనిషత్తునందలి పూర్వాపరసందర్భముల విచారించిన నాశబ్దము నుపాదానకారణపరముగానే ప్రయోగించినట్లు స్పష్ట మగు చున్నది. వాక్యశేషమున "యథో ర్ణనాభిః సృజతే గృహ్ణతే చ" "సాలెపురుగు తనశరీరమునుండియే దారమునుకల్పించి మరల తనశరీరమునందే యేవిధముగ నడంచుకొనునో" అను మొదలగుదృష్టాంతములు గలవు. ఇవి యన్నియు నుపాదానకారణమునుఁ గూర్చి చెప్పునవియే కదా! నిమిత్తోపాదానకారణము నేకపదార్థముగఁ గూడ నుండ వచ్చు ననుటకును ఈసాలెపురుగుదృష్టాంతమే చాలును. "సాలెపురుగు యొక్క దేహము త్రాటికి నుపాదానకారణము; దేహాభిన్నుఁ డగునాత్మ నిమిత్తకారణము కదా!" అనియెదవేమొ ప్రపంచమున దేహాత్మ విభాగ మనునదియే సామాన్యదృష్టికి లేదు కదా! దృష్టాంతాదులును సామాన్యదృష్టి గలవారిని బోధించుటకై చెప్పఁబడినవియే కదా!

పూర్వపక్షము:— ఇట్లయినను అనుమానప్రమాణమునకు విరోధము వచ్చును. లోకమున సంకల్పపూర్వకముగ సృష్టి నాచరించుట మొదలగునవి నిమిత్తకారణములందే కానవచ్చుచున్నవి; కాని యుపాదానకారణమునందుఁ గానవచ్చుట లేదు కదా! ("ఈశ్వరః నిమిత్తమాత్రం, ఈక్షాపూర్వకకృతిమత్త్వాత్, కుంభకర్తృకులాలవత్" అనునది యనుమానవాక్యస్వరూపము).

సిద్ధాంతము:—ఇట్లు చెప్పకూడదు. లోకమునవలెనే యిచ్చటను కావలయు ననుట నియమము కాదు. ఇది యనుమానముచే నిర్ణయింపఁ

బడువిషయము కూడఁ గాదు. "నైషా తర్కేణ మతిః" "ఈజ్ఞానము తర్కమువలన కలుగదు" అను మొదలగు వాక్యములచే శ్రుతియే యీ విషయమును స్పష్టము చేయుచున్నది. వేదము తప్ప మఱియొక్కటి యీవిషయమును నిర్ణయింపఁజాల దని శాస్త్రయోనిత్వాధికరణమున (౧. ౧. ౩. చూడు) సవిస్తరముగ వివరించియున్నాము. ఇప్పుడును "వేదము ఈక్షణపూర్వకముగ సృష్టి నొనర్చువానినే యుపాదాన కారణముగఁ గూడఁ జెప్పుచున్నది" అనువిషయమును నిరూపించి యున్నాము.

మఱియు మీయనుమానమునందుఁ గూడ దోషము కలదు. మీరు ఈయనుమానమును వేదానుసారముగఁ జేసితిరా? స్వతంత్రముగఁ జేసితిరా? మొదటిపక్షము నాశ్రయించిన మీయనుమానమునకే యవకాశము లేదు. వేదమునందు ఒక్కపరమేశ్వరునకే నిమిత్తోపాదాన కారణత్వములు చెప్పఁబడియుండ దానికి విరుద్ధముగఁ నిమిత్తకారణత్వమాత్రమును సాధించుటకై చేయఁబడిన యీ యనుమానము వేదానుసారి యగుట యెట్లు? రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు పరమేశ్వరుని యునికియే మొట్టమొదట సంభవింపదు కావున మీయనుమానమునకు నిలుకడయే యుండదు. ఆశ్రయమే లేకున్న నిమిత్తకారణత్వమును దేనికి సాధింతురు? "అచ్చట (ఈశ్వరునియందు)ఁ గూడ ననుమానమే ప్రయోగింపఁబడును" అందురేమో యీవిషయమున ననేకవిరుద్ధానుమానములు (ఈశ్వరాభావమును సాధించు ననుమానములు) గూడ కలవు కదా! అందు నిలుకడ యెట్లు కలుగును? కావున వేదానుసారముగ సర్వము నంగీకరింపవలసినదియే. అనుమానములనుఁ గూర్చి ద్వితీయాధ్యాయమున విశేషముగఁ జర్చింపఁబోవుచున్నాము.

ఇట్లు విమర్శించిన ప్రపంచమునకుఁ బరమేశ్వరుఁడే నిమిత్తోపాదానకారణము లనుట సిద్ధాంత మగును. ఈక్షణపూర్వకకర్తృత్వము కల దనుకారణమువలనఁ బరమేశ్వరునకు కేవల నిమిత్తకారణత్వమే కలుగవలయు ననువాదము నిరాకరింపఁబడుటవలన "ప్రభుత్వము, కార్యముతో సమానరూపత్వము లేకుండుట మొదలగు నితర కారణములవలనఁ గూడఁ బరమేశ్వరునకు నిమిత్తకారణత్వముమాత్రమే కలుగవలయును" అనుపక్షములు కూడ ఖండింపఁబడిన ట్లయినవి.

మఱియు నిందు జెప్పఁబడిన యుపాదానకారణత్వము మట్టి మొదలగువానికిఁ గలయుపాదానకారణత్వమువంటిది కాదు. మట్టి మొదలగునవి సంపూర్ణముగఁ గాని కొంచెముకొంచెముగఁ గాని ఘటాదిరూపములతోఁ బరిణమించును. వానికి అవయవములు కలవు కావున నట్టి పరిణామమునకు నవకాశము కలదు. పరమేశ్వరుఁ డన్ననో నిరవయవుఁడు. కావున నాయనకుఁ బరిణామము సంభవింపదు. ఇక నెట్లు ఉపాదానకారణముఁ గాఁగలఁడనిన, త్రాడు స్వయముగ నేవిధ మగుపరిణామమును కూడఁ జెందకయే భ్రాంతివలన దోమసర్పమున కుపాదానకారణ మగునట్లు ఆయనయు ప్రపంచమున కుపాదానకారణ మగుచున్నాఁడు. రజ్జు సర్పములకు భేదాభేదములు లేనట్లు ప్రపంచబ్రహ్మములకును భేదాభేదములు లేవు. ఇదియే యనిర్వచనీయత్వము. "సూత్రకారుఁడు 'పరిణామాత్. ౧. ౪. ౨౬.' అని చెప్పనేల" అనియెదవేమొ అది లోకానుసారముగ సామాన్యదృష్టిచేఁ జెప్పఁబడెను. సాధారణముగ లోకులు పరిణామభిన్నముగ వివర్తమును గ్రహించుటయే లేదు కదా! శ్రుతికి పరిణామమునందే తాత్పర్యము కల దనుటకు వీలు లే దని యిదివఱకే నిరూపించియున్నాము. అప్పుడు "నిష్కళం" అనుమొదలగువాక్యములతో సృష్టిప్రతిపాదకవాక్యములకు దుర్నివార మగువిరోధము వచ్చును కదా! ఇట్లు కాకున్నను అవిద్యాగత మగుపరిణామత్వమును బ్రహ్మమునం దారోపించి యైనను సూత్రకారుఁ డట్లు చెప్పియుండవచ్చును.

అధ్యాయతాత్పర్యము:—కావున సర్వమును విమర్శించిన పరమేశ్వరునకంటె భిన్న మగుపదార్థ మేదియు లే దనుటయే శ్రుతిసిద్ధాంతమని తేలుచున్నది. ఉపాదానకారణత్వము కూడ నాయుద్దేశమును స్థిరపఱచుటకై యే చెప్పఁబడియున్నది. ఇట్లు కా దనిన సర్వవాక్యములు నొకపక్షమున నుండ నడుమ నొకవాక్యముమాత్రము అన్యపరమై యుండు ననవలసివచ్చును. ఇది విరుద్ధము కదా! దేనితాత్పర్యము నైనను నిర్ణయింపవలసిన నప్పుడు సంపూర్ణముగ గ్రంథము నంతయు విమర్శించి నిర్ణయింపవలయును గాని యొక్కొక్కవాక్యమునకే తాత్పర్యనిర్ణయము చేయ దగదు. అట్లు చేయుటకును వీలు లేదు కదా! ఇక వేదమును విమర్శించిన సర్వము నద్వితీయబ్రహ్మపరమే యగు

చున్నది. కొన్నిస్థలములయందు ప్రత్యక్షముగను మరికొన్నిచోట్ల భేద నిందాపూర్వకముగను వేదము అద్వైతమునే స్థాపించుచున్నది. వేఱొక కొన్నిచోట్ల యుత్పత్తిలయాదుల వర్ణించుటచేఁ గూడ ప్రపంచమునకు బ్రహ్మాభేదమును సాధించుచున్నది. కొన్నిస్థలములయందుమాత్రము భేదానువాదము కల దనుట యథార్థమే కాని, యది యనువాద మాత్రమే కాని, పరమార్థకథనము కానేరదు. అట్లయిన బహుశ్రుతు లకు విరుద్ధ మగును. మఱియు అద్వైతశ్రుతులఁ బ్రధానములుగఁ గైకొనకుండిన వేదములోనియధికభాగము నిరర్థక మగును. ద్వైతమే వేదాభిప్రాయమైన నద్వైతశ్రుతులకుఁ గార్య మేమియు నుండదు కదా! ఇట్లు కాక వానినే ప్రధానముగఁ గైకొనిన ద్వైతశ్రుతులు సిద్ధానువాదములు కావచ్చును. సామాన్యముగ నందఱకును భేద దర్శనమే యలవడియున్నది; గురువులును బోధించునప్పుడు శిష్యుల స్థితినే యవలంబింపవలయును కదా! అనువాదానంతరమున దానిని నిందించి యుత్పత్తివాక్యములచే నభేదమును ప్రతిపాదించి క్రమక్రమ మున దానినే సిద్ధాంతము చేయవచ్చును. కావున నెట్లు చూచినను వేదము అద్వితీయపరబ్రహ్మమునుమాత్రమే చెప్పును; కాని రెండవ దానినిఁ జెప్పదు.

---

## ౮. సర్వవ్యాఖ్యానాధికరణము.

విషయము:—ఈయధికరణమున "పరమాణువులు స్వభావము శూన్యము" అనుమొదలగువానిని కారణములుగాఁ జెప్పువారిమతములు విచారింపఁబడును.

సంగతి:—గ్రంథారంభమునఁ జూపఁబడి వేదవాక్యములచేఁ బ్రతిపాదితముగ నిరూపింపఁబడుచున్న బ్రహ్మకారణత్వముపై వచ్చిన యాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడినది. వేదసమన్వయముపై వచ్చినయాక్షేపమును నివారించునది కావున నిది సమన్వయాధ్యాయమునఁ జేర్పఁబడెను.

బ్రహ్మకారణత్వముపై వచ్చినయాక్షేపములను నిరాకరించు నదియే కావుననే నీపాదమునందునుఁ జేర్పఁబడెను. ఈపాదము కూడ నట్టిదే కదా !

"పైయధికరణమున 'బ్రహ్మమే ప్రపంచమున కుపాదానకారణము. ప్రధానము కాదు. ఈవిషయమున శ్రుతియే ప్రమాణము' అని సిద్ధాంతము చేసియున్నారు. ఇది తగదు. ప్రధాన మట్టిది కాక పోయినను పరమాణువాదులు కావచ్చును. పరమాణ్వాదివిషయము లందును శ్రుతి ప్రమాణముగనే యున్నది" అని వచ్చినయాక్షేప మీయధికరణమున నిరాకరింపఁబడుచున్నది. కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధ మాక్షేపసంబంధము.

సందేహము:—ఇచ్చట పరమాణ్వాదిపరముగఁ గూడ శ్రుతి యుండుటయు వేదము బ్రహ్మమునందే సమన్వయింపఁబడుటయు సంశయకారణములు. "బ్రహ్మ మొక్కటియే ప్రపంచోపాదానకారణ మనుట చెల్లదు. బ్రహ్మ మొక్కటియే యుపాదానకారణము" అనునవి క్రమముగఁ బూర్వపక్షసిద్ధాంతములు. "మీరు చేసినసమన్వయము సిద్ధింపదు, సిద్ధించును" అనునవి క్రమముగ వానిఫలములు.

పూర్వపక్షము:—ప్రధానము జగత్కారణము కాకున్నను పరమాణ్వాదులు కావచ్చును. ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగు నను ప్రతిజ్ఞయొక్క బలము నాశ్రయించి మృదాదిదృష్టాంతముల నవలంబించి పరమేశ్వరుని జగదుపాదానముగఁ జెప్పిన మఱ్ఱివిత్తనములు మొదలగువానిదృష్టాంతములచేఁ బరమాణువులను కూడ జగత్కారణములుగఁ జెప్పవచ్చును. "అణ్వ్య ఇమే ధానా ఇతి ఆసామంగైకాం భింధీతి భిన్నా భగవ ఇతి కిమత్ర పశ్యసీతి న కించన భగవ ఇతి....ఏషోఽణిమా" "ఈమఱ్ఱివిత్తనములు మిగుల సన్నములై కానవచ్చుచున్నవి యని శ్వేతకేతుఁ డనఁగా అందొకదాని పగులఁగొట్టుమని యుద్దాలకుం డనియెను.ఆతఁడును పగులఁగొట్టి యందేమియు లేదనఁగా ఇదియే సూక్ష్మరూపము. ఇందు మహావటవృక్షము అల్పాకారముతో డాగియున్నట్లు ప్రపంచ మంతయు సూక్ష్మపదార్థమునందు డాఁగియున్నది. యని యుద్దాలకుం డుపదేశించెను" అనుమొదలగు వాక్యములు ఈపక్షమునఁ బ్రమాణములై యున్నవి. ఇందు "ఏమియుఁ

గానరాలేదు" అనుటచే శూన్యంబును "ఈసూక్ష్మవస్తువు" అనుటచేఁ బరమాణువులును జగత్కారణములుగ నంగీకరింపఁబడినవి. కావున వేదము బ్రహ్మమునొక్కదానినే చెప్పు ననుసమన్వయము నిలువదు.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౩౪. ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః. ౧. ౪. ౨౮.

తాత్పర్యము. సిద్ధాంతము:—ఈపాదమునందును "ఈక్షతే ర్నాశబ్దం ౧. ౧. ౫" అనుమొదలింతవఱకును ప్రధానవాదము పలుమాఱు నిరాకరింపఁబడెను. ఆసమయములయందు ఏయేన్యాయములు చూపఁబడెనో అవియే పరమాణ్వాదిపక్షములను కూడ నిరాకరించుటకుఁ జాలును. ఆపరమాణ్వాదులును వేదోక్తములు కావు. చేతనములు కావు. చేతనములు కాకున్న వాని నెఱుంగుటచే సర్వము నెఱుంగఁబడుటకు వీలు లేదు; నిమిత్తకారణ మగుచేతన మొక్కటి యధికముగ నుండవలయునుకదా! పైనఁ జూపఁబడినశ్రుతియు పూర్వోత్తరవిరుద్ధముగఁ బరమాణువులను చెప్పదు. "ఏమియు లేదు" అనుటచే "ఏమియు దృష్టిగోచర మగుట లేదు" అనియు "సూక్ష్మవస్తువు" అనుటచే నామరూపములు లేని దనియుమాత్రమే శ్రుతి చెప్పుచున్నది. కావున పైయుక్తులచేతనే యీవాదము లన్నియు నిరాకరింపఁబడినట్లే యైనది. కావున నెట్లును మేము చేసినసమన్వయమునకు విరోధము రాదు. వేదము అద్వైతమునే యేకవాక్యముగ చెప్పుచున్నది. అధ్యాయము ముగిసె నని తెల్పుటకై వ్యాఖ్యాతపదము రెండుమాఱులు ప్రయోగింపఁబడెను.

అధ్యాయసంగ్రహము:—ఇట్లు ప్రథమసూత్రమున శాస్త్రప్రతిజ్ఞయు ద్వితీయసూత్రమున బ్రహ్మలక్షణంబును తృతీయసూత్రమున బ్రహ్మబోధకప్రమాణంబును చతుర్థసూత్రమున "సమన్వయముచే శబ్దప్రమాణము పరబ్రహ్మమునే చెప్పును" అనుటయును నిరూపింపఁబడియున్నది. అచ్చటినుండియుఁ దృతీయపాదాంతమునఱకు "వేదవాక్యము లన్నియు బ్రహ్మమునందే సమన్వితము లగును" అనువిషయము నిర్ణయింపఁబడెను. ఈ నాల్గవపాదమున "వేదవాక్యములు బ్రహ్మాభిన్నవిషయ

యమును బొత్తిగనే చెప్పవు" అని ప్రతిపాదింపఁబడెను. ఈవిధముగ నీయధ్యాయమున వేదవాక్యసమన్వయము స్థాపింపఁబడెను.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు

ప్రథమాధ్యాయస్య చతుర్థపాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ప్రథమాధ్యాయమునఁ

జతుర్థపాదము.

ప్రథమాధ్యాయము ముగిసెను.

---

 



# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము, ప్రథమపాదము.

---

# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## ద్వితీయాధ్యాయావతారిక.

---

మహాశిలాం యా మిహ వజ్రసారాం సాంఖ్యాదికన్యాయసితాసిధారాః, కుంఠీభవంతి ప్రతిహత్య గాఢం సమాశ్రయే తాం శరణం వరేణ్యాం.

పూర్వాధ్యాయమునందు సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నిత్యశుద్ధుఁడును సర్వేశ్వరుఁడు నగుపరమేశ్వరుఁడే ప్రపంచకారణ మని నిర్ణయింపఁబడినది. మృత్తిక స్వయముగ మార్పు నొందకయే ఘటాకారముగఁ గానవచ్చునట్లు, లేక, ఘటాకారముగఁ బరిణమించునట్లు ఆసర్వేశ్వరుఁడే మాయాసహితుఁడై ప్రపంచరూపముతో బరిణమించుచున్నాఁడనియు, ఇదియే సృష్టిప్రకార మనియు నిర్ణయింపఁబడెను. మఱియు మాయఁ గలవైంద్రజాలికుఁడు మొదలగువారు తనమాయను విస్తరింపఁజేయునట్లు పరమేశ్వరుఁడే యీప్రపంచమును స్థితికాలమునందు నియామకుఁడై విస్తరింపఁజేయుచున్నాఁడని ప్రకటింపఁబడినది. సంహారకాలమునందును భూమి తన కభిన్నరూపములై తనయందే జనించియున్న * చతుర్విధభూతముల తనయందే యడంచికొనునట్లు, ఈసర్వప్రపంచ

---

* చతుర్విధభూతములు:—జరాయుజములు (మావి వలనఁ బుట్టునవి). అండజములు (గ్రుడ్డునుండి పుట్టునవి). స్వేదజములు (చెమటనుండి పుట్టునవి). ఉద్భిజ్జములు (భూమిని పగులఁగొట్టుకొని జనించునవి). అని భూతములు (ప్రాణిసమూహములు) నాలుగువిధములు. అందు మనుష్యులు పశువులు మొదలగునవి జరాయుజములు. పక్షులు సర్పములు మొదలగునవి అండజములు. పేలు మొదలగునవి స్వేదజములు వృక్షము లుద్భిజ్జములు.

మును ఆపరమేశ్వరుఁడే తనయంం దడంచికొను ననియు దెల్పఁబడినది. ఈవిషయమంతయు చతుస్సూత్రియందే స్పష్టము చేయఁబడినది. తక్కిన యధ్యాయమునందును శ్రుతివాక్యసమన్వయవ్యాజమున నీవిషయమే దృఢపఱుపఁబడినది. మఱియు ప్రపంచబ్రహ్మముల కభేద మగుటచే "అబ్రహ్మమే మనయాత్మ, జీవుఁడు." అని స్పష్టము చేయఁబడినది.

ఈవిధముగ "చేతనమే ప్రపంచకారణము" అని నిరూపించుచు చేయఁబడిన శ్రుతిసమన్వయము యుక్తము కాదని యచ్చటనే సాంఖ్యాదులయాక్షేపము లనేకములు వచ్చినవి. అయినను అది (ప్రథమాధ్యాయము) శ్రుతివాక్యసమన్వయమును చేయునదిమాత్రమే కావున నచ్చట నావాదముల కన్నిఁటికిని "మీరు చెప్పుప్రధానాదులను వేదము సమ్మతింపదు. ఈకారణమువలన మేమును సమ్మతింపము" అనిమాత్రమే సమాధానము చెప్పఁబడియున్నది. వారు తమకు నాధారభూతములుగఁ గైకొనుశ్రుతులును వారిపక్షమునకు ననుకూలములు కావని నిరూపింపఁబడియున్నది; ఆశ్రుతులకు వారు చేసినవ్యాఖ్యానము దోషయుక్తమనియుఁ దెల్పఁబడియున్నది.

అయినను కొన్నికొన్నితర్కయుక్తులును, మహర్షిప్రణీతము లగుటచే విశ్వాసయోగ్యము లని తలంపఁబడుచున్న స్మృతులును వారిమతములకు నాధారములై యున్నవి. వాని ననుసరించి కొందఱు మహాజనులు వారిమతములను కూడ పురుషార్థసాధనములనుగా నంగీకరించి యున్నారు. కావున నాయభిప్రాయమును తొలఁగించుటకై ఈయధ్యాయ మారంభింపఁబడుచున్నది. ప్రసంగవశమున కొన్నిశ్రుతివిరోధములును పరిహరింపఁబడును.

## ప్రథమపాదావతారిక.

అందు ప్రథమపాదమున "పరమతస్థులచే కల్పింపఁబడినస్మృతులు మొదలగువానివలనను యుక్తులవలనను (అనఁగా: పరమతస్థులు అభిన్ననిమిత్తోపాదానకారణవాదమునకును చేతనకారణవాదమునకును భంజకములుగ కల్పించినయుక్తులచేతను) స్వపక్ష మగునద్వైతమునకు బాధ లేదు" అనువిషయము నిర్ణయింపఁబడినది. అందును మొదటి

రెండధికరణములయందును స్మృతివిరోధంబును తక్కినయధికరణముల యందు యుక్తివిరోధంబును పరిహరింపఁబడినది.

## ౧. స్మృత్యధికరణము.

విషయము:—ఈపాదమునందు వర్ణింపఁబడువిషయములు పాదావతారికయందే వ్రాయఁబడినవి. ప్రథమాధ్యాయమునందువలె నీయధ్యాయమున విషయవాక్యములు లేవు. ఇచ్చట శ్రుతిరహితము లగు కేవలయుక్తులతోనే యర్థనిర్ణయము చేయఁబడును. కావున నిచ్చట ముఖ్యముగ ప్రథమద్వితీయపాదములయందు విషయములు ప్రత్యేకముగ వ్రాయఁబడనక్కఱ లేదు. ఏయేయధికరణమున నేయేయుక్తి పూర్వపక్షముగ వర్ణింపఁబడునో ఆయాయధికరణమునకు నాయాయుక్తియే విషయ మగుచుండును. ఇట్లే ద్వితీయపాదమునందును ఏయే యధికరణమున నేయేమతము దూషింపఁబడునో ఆయాయధికరణమునకు నాయామతమే విషయ మగుచుండును.

సంగతి:—ఈస్మృత్యధికరణము ప్రథమాధికరణ మగుటచే దీనికి ప్రత్యేకసంగతి (పూర్వాధికరణసంబంధము) అక్కఱ లేదు. అధ్యాయావతారికయందుఁ జూపఁబడినసంబంధమే దీనికిని పూర్వాధ్యాయముతోఁ గలసంబంధము. మఱియు సర్వవ్యాఖ్యానాధికరణముగూడ నధ్యాయార్థమును సంగ్రహించునది యగుటచే, దానితో దీనికి నాక్షేపరూపసంబంధము. ("పైయధికరణమునందు సర్వమతములను ఒక్కపెట్ట నిరాకరించితిరి. అది యుక్తము కాదు. మహర్షిప్రణీతము లగుస్మృతులు నిరర్థకము లగుట యుక్తము కాదు" అనునాక్షేపముచేఁ గలిగినసంబంధము) కల దని సాధించినను, అదియు నధ్యాయముతోడి సంబంధమే యగునుగాని క్రొత్తది కానేరదు. కావున దీనికిని అధ్యాయమునకువలెనే పూర్వాధ్యాయముతోఁ గలసంబంధము విషయవిషయిభావసంబంధము. ఈయధ్యాయమునకుఁ బూర్వాధ్యాయసిద్ధాంతము విషయము; దాని నాశ్రయించియే కదా ఇది యాక్షేపసమాధానములచే నవిరోధమును ప్రతిపాదించుచున్నది. ఇట్లగుటచేతనే.యిది దానికి విషయి ఇట్లుండుటయే విషయవిషయిభావసంబంధ మని తెలిసికొనవలయును.

సందేహము:—ఇచ్చట "శ్రుతు లన్నియు * చేతనకారణవాదమును ఏకవాక్యముగ నంగీకరించుచున్నవి" యని పూర్వాధ్యాయమున సిద్ధాంతము చేయఁబడియుండుటయు, సర్వజ్ఞు లగుకపిలాదిమహామునులు అచేతనము లగుప్రధానాదులే జగత్కారణము లని సయుక్తికముగ నిరూపించియుండుటయు సంశయకారణములు. ఇట్లే ఈపాదమున నంతమువరకు ప్రతియధికరణమునందును సంశయకారణముల నూహించుకొనవలయును. ప్రత్యధికరణమునందును పూర్వాధ్యాయసిద్ధాంతమునకును తత్తదధికరణములయందు విచారణీయములుగ గ్రహింపఁబడినయుక్తులకును గలవిరోధమే సంశయకారణ మగుచుండును. "ఈస్మృతివలన లేక, యుక్తులనఁ బూర్వసమన్వయమునకు విరోధము కలదా? లేదా?" అనునదియే పాదాంతమువఱకు ప్రత్యధికరణమునందును సంశయస్వరూపము. "విరోధము కలదు, లేదు." అనునవియే యంతటను క్రమమునఁ బూర్వపక్షసిద్ధాంతములు. మతభంగంబును తదభావంబును క్రమముగ వానిఫలములు.

పూర్వపక్షము:—చేతన మగుపరబ్రహ్మమే యీప్రపంచమునకు కారణ మని పూర్వాధ్యాయమునఁ జేయఁబడినసిద్ధాంతము సరియైనది కాదు. ఏలయనిన మీసిద్ధాంతమే సత్య మైనచోఁ * దంత్రము లని చెప్పఁబడు సాంఖ్యాదిస్మృతులును వాని ననుసరించిన యితరస్మృతులును నిరర్థకములై పోవలసివచ్చును. అవియు సర్వజ్ఞు లగుకపిలాదిమహామునులచే నిర్మింపఁబడినవి; విద్వాంసులచే నంగీకరింపఁబడినవి.

వానియందు అచేతనమగుప్రధానమే జగత్కారణముగ వర్ణింపఁబడియున్నది. మోక్షవిషయముమాత్రమే వివరింపఁబడియున్నది. మనుస్మృతి మొదలగునవి మీసిద్ధాంతము ననుసరించినవియే యైనను వానిని గ్రహించి యీసాంఖ్యాదిస్మృతుల విడుచుటకు వీలులేదు.

---

* చేతనకారణవాద మనఁగా: జ్ఞానవంత మగుపదార్థమే యీప్రపంచమునకు కారణము. కాని జడము కాదు అనువాదము.

* తంత్రము లనఁగా బ్రహ్మస్వరూపమును లేక మోక్షస్వరూపమును ప్రతిపాదించునవి. ఇవి కపిలాదులచేఁ జేయఁబడెను. వీని కనుకూలముగఁ బంచశిఖుఁడు మొదలగుమహామునులు కొన్నిస్మృతులను రచించిరి.

మన్వాదిస్మృతులు ధర్మములనుగూర్చి కూడఁ జెప్పుచున్నవి. "ఈజాతి వానికి నీకాలమున నుపనయనము నాచరింపనలయును. దానిఁ జేయవలసిన విధి యిట్టిది. వివాహాదుల నిట్లు గావింపవలయును" అను మొదలగువిధులను బోధించుచున్నవి. సాంఖ్యాదిస్మృతు లన్ననో యట్లు కాక మోక్షవిషయమునుమాత్రమే బోధించుచున్నవి. ఇట్లగుటచే మన్వాదిస్మృతులకు మోక్షవిషయమునఁ బ్రామాణ్యము లేకపోయినను ధర్మవిషయమునఁ బ్రామాణ్య ముండుటచే నిరర్థకత్వము లేకపోవును గాని సాంఖ్యాదిస్మృతులకు నట్లు కాదు. అవి చెప్పువిషయ మొక్కటియే యగుటచే దానియందును బ్రామాణ్యము లేకపోయిన నిరర్థకత్వ మనివార్యమై వచ్చును కదా! కావున వీనికి నప్రామాణ్యము కలుగకుండ శ్రుతులనే యేదియో యొకవిధముగ ప్రధానపరముగ సమన్వయింపవలసియుండును.

"సంకల్పపూర్వకసృష్టి సృష్టికర్తృజీవాభేదము మొదలగుకారణములవలనఁ 'బ్రధానము, లేక, అచేతనపదార్థము జగత్కారణము కానేరదు' అని నిరూపింపఁబడినది.ఇప్పుడు ఆవిషయమును గూర్చి మరల నాక్షేప మేల?" అనియెదవేమొ, వినుము. వేదార్థమును నిర్ణయించుటయందు మాబోంట్లు సామాన్యులు సమర్థులు కానేరరు. మనము చేయు వ్యాఖ్యానములను విశ్వసించువారును లేరు. కావున మనముగాని లోకులుగాని వేదార్థనిర్ణయము నాచరించునప్పుడును దానిని విశ్వసించునప్పుడును మహాముని లొనర్చినస్మృతులనే యాధారములనుగాఁ గైకొనవలయును. అట్లే కైకొనఁబడుచుఁ గూడ నున్నవి. కపిలాదులును సర్వజ్ఞులు కాని సామాన్యులు కారు.

మీమతమునందు పరమేశ్వరుఁడు వేదమునకుఁ గారణ మని చెప్పఁబడియున్నది కదా. అప్పుడు బ్రహ్మమే వేదమును చేసె ననవలయును. బ్రహ్మము సర్వజ్ఞము కావున నందుండి జనించిన వేదము చెప్పువిషయము యథార్థ మనవలయును. ఇట్లుండుటచే ప్రస్తుతసాంఖ్యాదిస్మృతులును వేదములు నొక్కటియే యైనవి. కపిలాదులును సర్వజ్ఞులని వేదమునందే చెప్పఁబడియున్నది. ఇట్లుండ నిఁక దీనికిని వేదమునకును భేద మేమి? ఈకారణమువలన స్మృతుల కనుకూలముగ వేదమునే సమన్వయించి తీరవలయును. వేదార్థ మస్పష్టము; సాంఖ్యాదిస్మృతులయర్థము

విస్పష్టము. అస్పష్టార్థము నెట్లయినను త్రిప్పుటకు వీలు కలుగునుగాని విస్పష్టార్థము నట్లు చేయుటకు వీలు లేదు కదా!

కపిలునిఁ గూర్చి శ్రుతి "ఋషిం ప్రసూతం కపిలం య స్తమగ్రే జ్ఞానై ర్బిభ ర్తి జాయమానం చ పశ్యేత్" "ఏపరమేశ్వరుఁడు సృష్ట్యాదియందు జనించిన కపిలమహామునిని జ్ఞానపరిపూర్ణునిఁ గావించునో" అని యున్నది. ఇదియంతయుఁ గాక స్మృతిమతములు యుక్తుల నాధారము చేసికొని యున్నవి; తర్కమును పట్టుకొమ్మగా నవలంబించి యున్నవి. శ్రుతిమతము తర్కమునకు నిలువదు. కావున నెట్లును సాంఖ్యాదిస్మృతుల ననుసరించియే శ్రుతుల సమన్వయింపవలయును.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౩౫. స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్.

### ౨. ౧. ౧.

తాత్పర్యము:—స్మృతి బలమువలన చేతనకారణవాదమును ఖండింపఁదలంచుట యుక్తము కాదు. కొన్నిస్మృతులు ప్రధానమునుఁ గూర్చి చెప్పినను మఱికొన్ని పరమేశ్వరునిఁగూర్చికూడఁ జెప్పుచున్నవి. ఆయనయే సర్వరూపుఁ డనియు అభిన్ననిమిత్తోపాదానకారణ మనియుఁ జెప్పుచున్నవి. వానికి నిరర్థకత్వము రావలసివచ్చును. ధర్మవిషయమునందు వానికి సార్థక్యము కలదు కదా యనియెదవేమొ యొకగ్రంథమున కొంతభాగ మప్రమాణ మనియు మఱికొంత ప్రమాణమనియు సాధించుటకు వీలు కలుగునా? కావున సాంఖ్యాదిస్మృతుల గ్రహించినచో మన్వాదిస్మృతులు నిరర్థకములు కావలసివచ్చును. ఈదోషమును నివారించుట యెట్లు? కావున సాంఖ్యాదిస్మృతులు పరిగ్రహింపఁబడుటకు వీలు లేదు.

స్మృతులయందు:—"య త్తత్సూక్ష్మ మవిజ్ఞేయం" "ఏది సూక్ష్మమై జ్ఞానగోచరము కాకున్నదో" అని పరమేశ్వరరూపమును

వర్ణించుటకు నారంభించి, "స హ్యంతరాత్మా భూతానాం క్షేత్రజ్ఞ శ్చేతి కథ్యతే" "ఆపరమేశ్వరుఁడే అంతర్యామి యనియు, జీవుఁడనియు చెప్పఁబడుచున్నాఁడు" అని జీవపరమేశ్వరాభేదమునుకూడ నిర్ణయించి "తస్మాదవ్యక్త ముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ" "ఓబ్రాహ్మణోత్తమా! ఆపరమేశ్వరునుండియే సత్వాదిగుణయుక్త మగునవ్యక్తము జనించినది" అని చెప్పఁబడియున్నది. ఈవాక్యసందర్భమును విమర్శించిన చేతనుఁడే జగత్కారణ మనియు నాయనకు జీవునితో భేదము లేదనియు తేలుచున్నది. ఇట్లే పురాణమునందు "అతశ్చ సంక్షేప మిమం శృణుధ్వం నారాయణః సర్వ మిదం పురాణం" "ఇట్లగుటచే మీకు సర్వసంక్షేపమును చెప్పెదను వినుఁడు. ఈప్రపంచమంతయు నానారాయణుఁడే ఆయనకును దీనికిని కార్యకారణభావ ముండుటచే నభేదము" అని చెప్పఁబడియున్నది. ధర్మసూత్రమునందును "తస్మాత్కాయాః ప్రభవంతి సర్వే" "ఆపరమేశ్వరునుండియే బ్రహ్మాదులు జనించుచున్నారు" అని యున్నది. గీతాస్మృతియందును ఈవిషయమే ప్రతిపాదింపఁబడెననుట వేఱుగ చెప్పవలసినవిషయము కాదు.

ఇట్లు లెక్కలేని స్మృతులు ఘోషించుచుండ వాని కన్నిఁటికిని విరోధముగ సాంఖ్యాదిస్మృతుల నంగీకరించుటకు నవకాశ మెట్లు కలుగును ?

సిద్ధాంతము:—"ఇట్లయిన స్మృతులు బొత్తిగనే ప్రమాణములు కా వనవచ్చును కదా! పరస్పరవిరుద్ధవిషయములను చెప్పునవి ప్రమాణము లనుట యెట్లు?" అనియెదవేమొ వినుము. నీవు స్మృతిబలము ననుసరించి పూర్వపక్షము చేసితివి కావున మేమును స్మృతిబలముతోనే యుత్తరము నొసంగఁ దలంచి "మీరు చెప్పుసాంఖ్యాదిస్మృతు లప్రమాణములుగఁ గైకొనిన మన్వాదిస్మృతులకు విరోధము వచ్చును." అని చెప్పితిమి గాని మఱి యేమియు లేదు. శ్రుతు లన్నియు నేకవాక్యముగ చేతనకారణవాదమును బోధించుచున్నవి యనువిషయమును ప్రథమాధ్యాయమునందే సవిస్తరముగ నిరూపించియున్నాము. ఆశ్రుతి స్వయముగనే ప్రమాణ మగుటచే దానియందు చెప్పఁబడినయర్థమును స్మృత్యనుసారముగ మార్చుకొనవలసినపని లేదు. ఇదియే సాంఖ్యాదిస్మృతుల నిరాకరించుటకు మాచే నిర్ణయింపఁబడినకారణము.

నీ వన్నట్లు మనము స్వతంత్రముగ వేదార్థనిర్ణయము చేయలే మనుట నిశ్చయమే; కాని యెప్పటికిని స్మృతులయందు పక్షపాతము నుంచుట తగినపని కాదు. బాగుగ విచారించి దేని నంగీకరింపవలయునో దానినే యంగీకరింపవలయును. శ్రుతులవలె నీస్మృతు లేకవాక్యముగ బ్రహ్మమును చెప్పుట లేదు. కొన్ని యచేతనకారణవాదమును జేయుచున్నవి. మఱికొన్ని చేతనకారణవాదము నాచరించుచున్నవి. ఇట్లుండ నిందొకదానిని గ్రహింపవలయు ననుటయు మఱియొకదాని విడువవలయు ననుటయు సిద్ధాంత మగుచున్నది ఇట్లగుటచే స్వతంత్ర ప్రమాణ మగు వేదమునకు ననుకూలమైయున్న మన్వాదిస్మృతులనే గ్రహింపవలయును. తక్కినవానిని పరిత్యజింపవలయును. సూక్ష్మములై యింద్రియాగోచరములై యుండువిషయములను వేదము గాక మఱి యేదియు నిరూపింపలేదు. సామాన్యపురుషులకు నట్టిసామర్థ్యము కలదనుటకు వీలు లేదు. "కపిలాదులు సిద్ధులు కదా" యందువేమొ సత్యమే. వారిసిద్ధియు వేదమునకంటె నధికముగ సూక్ష్మార్థములను గ్రహింపఁగలిగినది కాదు. ఏలయనిన:—ఆసిద్ధి పూర్వజన్మమున నొనర్పఁబడిన ధర్మోత్కర్షచే కలుగును; ధర్మంబును వేదమాత్రప్రతిపాదితము. ఇట్లుండ అనాదిసిద్ధ మగు వేదార్థములకును ప్రకృతకాలమున సిద్ధినొందినవారి బుద్ధిచే కల్పింపఁబడిన స్మృతులకును విరోధము వచ్చిన స్మృతు లెట్లు ప్రమాణము లగును? "మన్వాదులసిద్ధికంటె కపిలునిసిద్ధి యధికముగ నుండరాదా?" అనియెదవేమొ ఆవిషయమున నిశ్చయ మెట్లు? అప్పుడును అనాదిసిద్ధ మగు వేదార్థము ననుసరించినవారిసిద్ధియే యితరులకంటె నధిక మనుట యుక్తము కదా! కావున నెట్లు చూచినను స్మృతులకు పరస్పరవిరోధము కలిగినప్పుడు వేదానుసారు లగుస్మృతులే గ్రహింపఁదగినవి. జైమినిమహామునియు పూర్వమీమాంసాశాస్త్రమున "*విరోధే త్వనపేక్షం స్యా దసతి హ్యనుమానం" అనుసూత్రముచే నీవిషయమునే నిర్ణయించియున్నాఁడు.

---

* విరోధే త్వనపేక్షం స్యా దసతి హ్యనుమానం.—ఇది స్మృతిప్రామాణ్యమును విచారించుస్థలమునఁ బూర్వమీమాంసయందు గలదు. విరోధే=శ్రుతితో విరోధము వచ్చినప్పుడు, అనపేక్షం=స్మృతి ప్రమాణము కానేరదు. అసతి + తు=అశ్రుతి విరోధము లేనప్పుడు [illegible] ('ఈయర్థ

"కపిలుఁడు సర్వజ్ఞుఁడని శ్రుతియే చెప్పుచున్నది. దాని నంగీకరింపక పోయిన శ్రుతినే యంగీకరింప నట్లగును" అనియెదవేమొ యట్లుకాదు. శ్రుతియందు కపిలశబ్దముమాత్రమే యున్నది కాని ఆకపిలుఁ డెవ్వఁ డైనదియు తెలియుటకు తగినంతగుఱుతు లేవియును లేవు. సగరపుత్రులను భస్మ మొనర్చినకపిలుఁడు నారాయణావతారభూతుఁ డొక్కఁడు కలఁడు కదా. ఆతనినిఁగూర్చియే శ్రుతి యేల చెప్పియుండకూడదు? భ్రాంతివలన నామసామాన్యము నాశ్రయించి "వాఁడే వీఁడు" అని భావించిన ప్రయోజన మేమి? ఇదియునుగాక "య ద్వై కించన మను రవద త ద్భేషజం" "మనువు దేనినిచెప్పునో అదియే సంసారరోగ మునకు నౌషధము" అనువాక్యముచే శ్రుతి మనుప్రభావమునుకూడ వర్ణించియున్నది. ఆమనువుఁ చెప్పినవాక్య మిది :—

"సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని, సంపశ్యన్" "సర్వభూతములయందును తాను కలఁడనియు సర్వభూతములును తన యం దున్నవనియు భావించి ముక్తిని జెందును." ఈవాక్యమును విమర్శించిన మనువు కపిలమతమును దూషించెనని తేలుచున్నది. కపిలుఁడు జీవభేదము నంగీకరించెను ; మనువు ఒక్కనికే సర్వాత్మకత్వ మును చెప్పెను కదా ! ఇట్లు ప్రత్యక్షవిరోధము గానవచ్చుచుండ కపిల మతము నంగీకరించుట యెట్లు ? ఈమనుమతమును ఇతరస్మృతు లనేక ములును వేదంబును గూడ ననువర్తించుచున్నవి. మహాభారతము నందు:—"బహవః పురుషా బ్రహ్మ న్నుతాహో ఏక ఏవ తు" "ఓ బ్రాహ్మణోత్తమా! జీవు లనేకులా? లేక, ఒక్కఁడా?" అని విచారణకు

ములఁ గూడ శ్రుతియుండవచ్చును.' అని యూహింపఁజేయుటకు) అస్మృతి సాధన మగుచుండును కదా ! (కొన్నికొన్ని విషయములు ప్రస్తుతకాలమున క్షీణింపఁగా మిగిలి యున్న వేదములలోఁ గానరానివి స్మృతులలోఁ గానవచ్చుచున్నవి. అయినను అవి విరుద్ధములు కాకపోవుటచేత, ఆయర్థములఁ బ్రతిపాదించుశ్రుతులు పూర్వమున నుండి నశించియుండునేమో యని యూహింపఁబడుచున్నవి. ఇది మహాత్ములసంప్ర దాయము.) అనునదియే యీసూత్రమున కర్థము. ప్రస్తుతమునఁ గూడ సాంఖ్యాది స్మృతులు ఉన్నవేదమునకుఁ గూఢ విరుద్ధములై యున్నవి. కావునఁ బూర్వము కూడ వీరు చెప్పువిషయములను బోధించుశ్రుతు లుండవు; వీరి స్మృతులఁ బ్రమాణ ములనుగాఁ గైకొనుటకు వీలులేదు.

నారంభించి "బహవః పురుషా రాజన్ సాంఖ్యయోగవిచారిణాం" "ఓరాజా! సాంఖ్యమతమును యోగమతము నవలంబించినవారలపక్షమున జీవులనేకులు" అని యనేకజీవపక్షమును పరపక్షముగ నుపన్యసించి నిరాకరించి "బహూనాం పురుషాణాం హి యథైకా యోనిరుచ్యతే,తథా తం పురుషం విశ్వ మాఖ్యాస్యామి గుణాధికం" "లోకమున సర్వశరీరములకును ఒక్కభూమియే యెట్లు కారణమో, అట్లే సర్వజీవులకును విశ్వరూపుఁ డగునొక్కపురుషుఁడే కారణభూతుఁడై యున్నాఁడు. ఆగుణాధికుని నీకు వివరించెదను." అని సర్వాత్మకుఁ డగు పురుషుని చెప్పుటకు ప్రతిజ్ఞ చేసి యట్లే చెప్పఁబడియున్నది. శ్రుతియు "యస్మిన్ సర్వాణిభూతా న్యాత్మై వాభూ ద్విజానతః" "యేస్థలమున (బ్రహ్మమున) సర్వభూతములు నాత్మయే యయ్యెనో" అను మొదలగు వాక్యములచే సర్వాత్మకత్వమునే యనువాదము చేయుచున్నది. ఇట్లు అన్నివిధముల బలవంతమై యున్నయనుస్మృతికి విరుద్ధముగ సాంఖ్యస్మృతి నె ట్లంగీకరింపవచ్చును.

"వేదముకూడ పరమేశ్వరునిచే బుద్ధిపూర్వకముగ నిర్మింపఁబడినది. సాంఖ్యస్మృతియు కపిలాచార్యునిచే నట్లే నిర్మింపఁబడినది. ఇట్లు రెండును పౌరుషేయములే యైయుండ నిందొకదానిపైమాత్రమే యభిమాన మేల?" అనియెదవేమొ యది సరికాదు. ఈశ్వరునకుఁ గలవేదకర్తృత్వమునుగూర్చి "శాస్త్రయోనిత్వాత్" (౧. ౧. 3)" అనునధికరణమున బాగుగ వివరింపఁబడియున్నది. ప్రపంచము అనాదియగుటచే వేదము కూడ ననాదియే యనియు, పరమేశ్వరుఁడు పూర్వకల్పసిద్ధ మగువేదమును స్మరించువాఁడే కాని "ఈయర్థమును ఈపదములచే చెప్పవలయును" అనుసంకల్పముతో దానిని రచించువాఁడు కాదనియు నిరూపించియున్నాము. కపిలాదులకుఁ గలకర్తృత్వ మట్టిది కాదు కదా! వారు మొట్టమొదట నొకవిషయమును నిర్ణయించుకొని పిదప గ్రంథమును రచింతురు. ఇట్టిగ్రంథములే పౌరుషేయము లగును; కాని వేద మిట్టిది కాదు. కావున పౌరుషేయము కానేరదు. ఈకారణమువలన వేదమునకుఁ గలప్రామాణ్యము స్వభావసిద్ధముగఁ గలిగినదియే.

"కపిలాదులుకూడ లోకోపకారార్థమై ప్రతికల్పమునందును జనించువారే కదా!" అనియెదవేమొ అట్లయినను వారు గ్రంథముల

క్రొత్తగా నాచరింతురేకాని స్మరింపరు. స్మరించుటయనఁగా ఏకపురుషుఁడే తా ననుభవించినవిషయమును సమయమువచ్చినప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చికొనుట. ఇది కపిలాదులకు సంభవింపదు. ఒక్కజీవుఁడే ప్రతికల్పమునందును కపిలాదిరూపములతో జనించుచుండఁడు. ధర్మాభివృద్ధివలన నేయేజీవుఁడు ఆయాస్థానములకు రాఁగలుగునో వాఁడే వచ్చుచుండును. పరమేశ్వరవిషయ మన్ననో యట్టిదికాదుకదా! కావున నెట్లు చూచినను కపిలమతము ప్రమాణము కాదు. తర్కబలము ఈపాదమునందే మూఁడవ యధికరణమునుండియు ధ్వంసము చేయఁబడును.

## అ ౨. పా ౧. సూ ౨. ఆరంభము.

అవతారిక:—ఈవిషయమున మఱియొక హేతువును చూపుచున్నాఁడు.

## ౧౩౬. ఇతరేషాం చానుపలబ్ధేః. ౨. ౧. ౨.

తాత్పర్యము:—మఱియు సాంఖ్యస్మృతియందు ప్రధానపరిణామము లనియు పంచభూతాదికారణము లనియు జెప్పఁబడిన మహత్తత్త్వాహంకారాదులు వేదమునందుగాని లోకమునందుఁగాని కానవచ్చుట లేదు. పంచభూతములును ఇంద్రియములునుమాత్ర మందఱకు నొక్కటియే. ప్రధానమునుగూర్చి చెప్పుచున్నట్లుగా కొన్నివేదవాక్యము లైనను * ఆభాసమాత్రముగాఁ గానవచ్చుచున్నని గాని మహదాదివిషయములయందు అట్లును గానవచ్చుట లేదు. ప్రథమాధ్యాయ చతుర్థపాదమున నాప్రధానపరవాక్యములుగూడ ప్రధానబోధకములు కావని నిర్ణయించియున్నాము. వేదమునందన్ననో "ఆత్మన ఆకాశస్సంభూతః" అని ఆకాశాదిసృష్టిమాత్రమే చెప్పఁబడెనుగాని మహదాదిసృష్టి చెప్పఁబడ లేదు. కదా! కావున కార్యముల ప్రతిపాదించువిషయమున నప్రమాణ మైనస్మృతి శ్రుతివిరుద్ధ మైనస్మృతి ప్రామాణికము గాని స్మృతి కారణవిషయమునమాత్ర మెట్లు ప్రమాణముగ నంగీకరింపఁదగియుండును? కావున సాంఖ్యస్మృతి నిరర్థకము కావలసివచ్చు ననునది

* ఆభాస మనఁగా యథార్థస్థితిలో లేకుండియు నున్నట్లు కానవచ్చుట.

యొకదోషము కాదు. దానిచే మాసమన్వయము భగ్నము కానక్కఱ
లేదు.

---

## ౨. యోగప్రత్యుక్త్యధికరణము.

విషయము:—ఇందు యోగస్మృతి నిరాకరింపఁబడును.

సంగతి:—ఇందును స్మృతినిరాకరణమే చేయుటచేతను, పూర్వా
ధికరణమునందుఁ జెప్పఁబడిన న్యాయములకంటె క్రొత్తన్యాయములు లేక
పోవుటచేతను ఈయధికరణమునకు క్రొత్తసంగతి యక్కఱలేదు.
పూర్వాధికరణమునకువలెనే దీనికిని అధ్యాయసంగతియే సంగతి.

సందేహము:—సాంఖ్యయోగస్మృతులకుఁ గలభేదమే యిచ్చట
సంశయకారణము. సంశయస్వరూపమును ఫలస్వరూపమును మున్నే
వివరింపఁబడియున్నవి.

పూర్వపక్షము:—సాంఖ్యస్మృతి మీ రన్నట్లు అప్రమాణమే
యైనను, యోగస్మృతిమాత్ర మట్టిది కానేరదు. "యోగము బ్రహ్మ
సాక్షాత్కారమునకు నుపాయము" అని వేదమునఁ గూడఁ జెప్పఁబడి
యున్నది. "త్రిరున్నతం స్థాప్య సమం శరీరం" "నడుము మెడ తల
అనునవయవముల చక్కఁగా నిక్కించి శరీరమును స్థిరము చేసి" అను
మొదలగు శ్వేతాశ్వతరవాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఇంత
మాత్రమే కాదు. అనేకస్థలములయందు కూడ యోగమును గూర్చిన
గుఱుతులు పెక్కులు గలవు. "తాం యోగ మితి మన్యంతే స్థిరా
మింద్రియధారణాం" 'స్థిరమగునింద్రియనిగ్రహమును యోగమందురు.'
అనియు "ఏతాం విద్యాం యోగవిధిం చ కృత్స్నం" "ఆ నాచి
కేతుఁడు యమునియనుగ్రహమువలన బ్రహ్మవిద్యను పరిపూర్ణమగు
యోగవిధానమునుఁ గూడ తెలిసికొనియెను" అనియు మఱియు ననేక
విధములుగ వేదవాక్యము లున్నవి. యోగశాస్త్రమునందును "అథ
తత్త్వజ్ఞానోపాయో యోగః" "యోగ మనునది తత్వజ్ఞానమునకు
నుపాయము." అని చెప్పఁబడియున్నది.

ఇట్లగుటచే యోగశాస్త్రము వేదసమ్మతము. దానియందు చేయఁబడినప్రధానవాదము కూడ నట్లే వేదసమ్మతము. ఒకగ్రంథము నందు కొంతభాగము ప్రామాణికమనియు మఱికొంతభాగ మప్రామాణికమనియుఁ జెప్పుట సంభవింపదుకదా! కావునఁ బ్రధానకల్పనము కూడ ప్రామాణికమే యనవలయును. ధర్మబోధకస్మృతులయందు వేదమునఁ గానరాని యష్టకాశ్రాద్ధాదులు గానవచ్చినను వాని నప్రామాణికము లని మీరు చెప్పుట లేదు. వేదోక్తము కానివిషయము స్మృతియం దుండదనియు ఇట్లగుటచే నావిషయములను బోధించువేదభాగ మిప్పుడు నశించిపోయి యుండవలయు ననియుమాత్రమే చెప్పుచున్నారు. ప్రస్తుతవిషయమునందును అట్లే చెప్పవలయును; ప్రధానాదులను చెప్పువేదభాగము నశించిపోయి యుండు ననవలయును. ఇంతయే కాని అది కొంతవఱకు నప్రామాణిక మనుట చెల్లదు. ఒకవృక్షము మీఁద నొకవైపునకు దుముకఁ గలిగినకోఁతి కొఱఁతభాగము నాక్రమింపక యుండనియట్లు అప్రామాణికత్వకల్పన యనునీమర్కటము ఒక ప్రదేశమున నించుక ప్రవేశించినచో సంపూర్ణముగ జెఱుచును గాని యంతట నిలువదు. కావున యోగస్మృతి ప్రామాణికమే.

అవతారిక:—అనునీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౩౭. ఏతేన యోగః ప్రత్యుక్తః. ౨. ౧. ౩.

తాత్పర్యము:—పైయధికరణమునందు చేయఁబడినఖండనము చేతనే యోగస్మృతియు ఖండింపఁబడిన దని తెలిసికొనవలయును. యోగులును సాంఖ్యులవలెనే ప్రధానాదులను చెప్పుదురు. ఈవిషయము నందుమాత్రము యోగశాస్త్ర మప్రమాణమే యగును.

సిద్ధాంతము:—"ఒకగ్రంథమునఁ గొంతభాగము ప్రామాణికమనియు మఱికొంతభాగ మప్రామాణిక మనియుఁ జెప్పుట యుక్తము కా దంటిరిఁ కదా!" అనియెదవేమొ వినుము. ఏగ్రంథమైనను తనకు తాత్పర్యభూత మగువిషయమున నప్రమాణ మగు నేని యప్పుడు సంపూర్ణముగ నప్రమాణ మగును కాని లేకున్న కానేరదు. ప్రస్తుతయోగశాస్త్రమునకుఁ గలముఖ్యతాత్పర్యము యోగస్వరూపనిరూపణమే కాని ప్రధానస్వరూపనిరూపణము కాదు. ఆశాస్త్రమునందు బోధింపఁబడిన

యపూర్వవిషయము యోగస్వరూపమేకదా! అయినను ఆయోగమును చెప్పుటకు దేనినైన నొకదానిని నవశ్యముగ నాశ్రయింపవలయును కావున లోకప్రసిద్ధ మగుప్రధానమును వా రాశ్రయించిరి. దానిని తత్పరతతో నిరూపించినవారు సాంఖ్యులే. కావున ప్రధానాదివిషయమునందు అప్రామాణిక మైనను ప్రామాణిక మైనను దానితోఁ బని యేమియు లేదు. "తాత్పర్యవిషయమున నది ప్రామాణికమా, కాదా ?" అను విషయ మొక్కటిమాత్రమే విచారింపవలసినది. ఇట్లగుటచే యోగ శాస్త్రము యోగస్వరూపనిరూపణవిషయమునఁ బ్రామాణికము; ప్రధా నాదివిషయమున నప్రమాణికము. ఇట్లు కాదనిన, ప్రధానాదివిషయము లందును గూడఁ బ్రామాణికమే కావలయు ననిన నది పైన్యాయముచే సంభవింపదు. ఆపక్షము శ్రుతికి విరుద్ధము కదా! అప్పుడు యోగ స్వరూపమునందును విశ్వాసము లేకపోవలసివచ్చును. ఇదియు విరుద్ధమే కదా! కావున నెట్లును "యోగము ఒకపక్షమునఁ బ్రమాణము; మఱి యొకయంశమునఁ గాదు" అనియే చెప్పి తీరవలయును.

సాంఖ్యమతమునందును వేదసమ్మతాంశము లేవియైన నున్నచో, నవియుఁ బ్రమాణములే. ఆశాస్త్రమునకు నవి దాత్పర్యభూతము లైనచో శాస్త్రము ప్రమాణ మగును. లేనిచో నాయంశముమాత్రమే ప్రమాణ మగును. "అసంగో హ్యాయం పురుషః" "ఈజీవుఁడు సర్వ సంబంధ రహితుఁడు" అని వేదమునఁ జెప్పఁబడియున్నప్రకారమే సాం ఖ్యులును పురుషస్వరూపమునుఁ జెప్పుదురు. కావున ఆభాగమునందు మాత్రము వారిమతము ప్రామాణికమే. మన్వాదిస్మృతు లన్ననో సర్వ విషయములను వేదోక్తములనే చెప్పుచున్నవి. కావున నవి సమగ్రముగఁ బ్రామాణికములే. అష్టకాశ్రాద్ధాదులు కొన్ని వేదమునఁ గానరాకున్నను వేదవిరుద్ధములుమాత్రము కాకపోవుటచే సంగీకరింపఁబడినవి. ప్రధా నాదు లన్ననో యట్టివి కావు. అవి ప్రస్తుత మున్న వేదమునందు ప్రశం సింపఁబడలే దనుటయే కాక ఈవేదార్థమునకుఁ బ్రత్యక్షవిరుద్ధములై కూడ నున్నవి కదా! కావున నెట్లు చూచినను తాత్పర్యభూతార్థము నందుఁ గలప్రామాణికత్వాప్రామాణికత్వములతోనే శాస్త్రములకు సంబంధము కాని తక్కినవానితోఁ గాదు. నేత్రేంద్రియము రూపమును గ్రహింపలే దని సాధింపఁగలిగిన నప్పుడుమాత్రమే దానివలనఁ గలుగు

జ్ఞాన మప్రామాణికమగును గాని రసమును గ్రహింపలే దని సాధించిన నట్లు కానేరదు కదా! "కంటితో చూచి గ్రహింపఁబడుపదార్థము లన్నియు నిశ్చయముగ నుండునవి కావు. కన్ను రుచిని గ్రహింపలేదు గనుక పదార్థమునుకూడ గ్రహింపలేదు" అనుటకంటె హాస్యాస్పద మగు విషయము వేఱేమి కలదు? ఈకారణమువలన ప్రతిగ్రంథమునందును కొంతభాగము ప్రామాణికము గావచ్చును. మఱికొంత యప్రామాణికము గూడ కావచ్చును. వేదముమాత్ర మపౌరుషేయ మగుటచే నట్లు కాదు.

మఱియు సాంఖ్యులును యోగులును ద్వైతులును వారిమతము లందు జీవేశ్వరభేదము కలదు. వేదమన్ననో ఏకాత్మత్వమును చెప్పుచున్నది. ఇట్లుండ నీరెంటికి నేకత్వ మెట్లు కలుగును. కావున శ్రుతిసమ్మతములగువిషయముల నంగీకరించి తక్కినవానిని పరిత్యజించుటయే కర్తవ్యము.

"ఈసాంఖ్యయోగస్మృతులే కాక నధ్యాత్మవిషయమును బోధించునవి మఱియు ననేకములు కలవు. వాని నన్నిఁటి నేల ఖండింపలేదు" అనియెదవేమొ వినుము. అవి యన్నియు నీసాంఖ్యయోగస్మృతులవలె శిష్టులచే నాదరింపఁబడలేదు; కొంచమైనను శ్రుతిమతము నవలంబింపలేదు. ఇవియన్ననో శ్రుతిమతము నొకయంశమునందైన నవలంబించి యున్నవి; శ్రుతియందును "తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" "సాంఖ్యయోగములవలన తేటపడునట్టి యాజగత్కారణము నెఱింగి సర్వపాశవిముక్తు లగుదురు" అనువాక్యమునందు సాంఖ్యయోగప్రశంస చేయఁబడినట్లు కూడఁ గానవచ్చుచున్నది. ఇట్లుండుటచే వీనినిమాత్రమే నిరాకరించితిమి. శ్రుత్యర్థము సాంఖ్యయోగపరము కాదు. జ్ఞానధ్యానపరము. సాంఖ్యమనఁగా జ్ఞానము; యోగము ధ్యానము. మాఖండనమునకును "వేదము నాశ్రయింపక కేవలసాంఖ్యయోగశాస్త్రములమాత్ర మెఱుంగుటవలన మోక్షము కలుగదు" అనిమాత్రమే యభిప్రాయము కాని "సాంఖ్యయోగములఁ బరిత్యజింపవలయును" అని యభిప్రాయము కాదు. "నావేదవిన్మనుతే తం బృహంతం" "వేదవేత్త కానివాఁడు ఆ పరమేశ్వరు నెఱుంగలేదు" "తమేవ విదిత్వాతిమృత్యుమేతి" "ఏక

స్వరూపుఁ డగునాయాత్మను తెలిసికొనిననేగాని మోక్షము దొరుకదు" అనుమొదలగు శ్రుతులచే "మోక్షమునకు వేదతాత్పర్యజ్ఞానమే ప్రధాన మని చెప్పఁబడియున్నది. కావున సాంఖ్యయోగమతములను వేద విరుద్ధాంశపరిత్యాగపూర్వకముగమాత్రమే గ్రహింపవలయును గాని వాని నాశ్రయించి వేదమును మార్చకూడదు. ఇట్లే వేదానలంబులై *వాక్యాభాసములచేఁ దమమతముల స్థాపించుకొనఁదలంచుచున్న వైశే షికన్యాయాదిమతస్థులును వేదవిరుద్ధాంశములయందే ప్రమాణభూతు లగుదురుకాని తక్కినవానియందు కానేరరు. తర్కము మొదలగువానిచే వారు సర్వశాస్త్రములకు నుపకారము గావించువారేయైననూ తత్త్వ జ్ఞానవిషయమునమాత్రము వారి నాశ్రయింపఁ జనదు. తత్త్వము తర్క గోచరము కాదనియు ప్రత్యక్షాదులకుఁ గూడఁ దెలియరాదనియు, శబ్ద ప్రమాణముమాత్రమే దానిని చెప్పఁగలుగు ననియు "శాస్త్రయోని త్వాత్ ౧. ౧. ౩" అనునధికరణమున స్పష్టముగ వివరించియున్నాము.

## ౩. నవిలక్షణత్వాధికరణము.

విషయము :—ఈ యధికరణము మొదలు పాదాంతమువఱకు ప్రత్యధికరణమునకును ఆయాస్థలములయందు సందేహముల ప్రకటించు నప్పుడు నిరూపింపఁబడుయుక్తులే విషయములు. కావున వానినిఁగూర్చి ప్రత్యేకముగ వ్రాయ నక్కఱ లేదు.

విషయముపై పూర్వపక్షము :—ప్రథమాధ్యాయమున వేదా

---

* వాస్తవస్థితిలో నొకవిషయమునుఁ గూర్చి చెప్పుచున్నను శబ్దాదులయందుఁ గలపోలికచే మఱియొకవిషయమునుఁ గూర్చి చెప్పునట్లు కానవచ్చువాక్యము వాక్యా భాసము: ఉ. మొదటియధ్యాయమున నాల్గవపాదమునందు మొదటి యానుమాని కాధికరణమున విచారింపఁబడినవాక్యము ('మహతః పర మవ్యక్తం' అనువాక్యము) తనయందలి యవ్యక్తపదసామ్యముచేఁ, బరమార్థస్థితిలో దేహమునుఁ గూర్చి చెప్పు నదియే యైనను ప్రధానమునుఁ గూర్చి చెప్పునట్లు కానవచ్చుచున్నది. ఇట్లే ఆపాదము నందే రెండవయధికరణమున విచారింపఁబడిన 'అజా మేకాం' అనువాక్యము కూడ సాంఖ్యులపక్షమున వాక్యాభాసమే. అదియుఁ బూర్వాపరముల విమర్శించిన నవి ద్యనుఁ గూర్చియే చెప్పునది యైనను సామాన్యదృష్టికి లోహితశుక్లకృష్ణాదిపదము లచేఁ బ్రధానమునుఁ గూర్చి చెప్పుచున్నట్లు గానవచ్చుచున్నది కదా!.

ర్థము బ్రహ్మపరముగ సిద్ధాంతము చేయఁబడియున్నది. అపౌరుషేయ మగుటచే వేదము స్వతంత్ర ప్రమాణము. దాని ప్రామాణ్యమును నిర్ణయించుటకు తర్కము లక్కఱలేదు. కేవల వేదాధారమునుమాత్రమే యాశ్రయించి మనము కర్మవిధుల నెట్లంగీకరించుచున్నామో అట్లే పరబ్రహ్మమునుకూడ నంగీకరింపవచ్చును. వేదము దేని నెట్లుచెప్పిన దాని నట్లే యంగీకరింపవలయునుగాని సంశయ మేల ?

సిద్ధాంతము:—ఇట్లు కాదు. ధర్మమునకును బ్రహ్మమునకును గలధర్మములు సమానములే యై యుండునేని మీ రనునది సిద్ధాంతమగును. వానిధర్మములుమాత్రము సమానములుకావు. ధర్మము కేవల పరోక్షము. దానిని వేదానుసారముగమాత్రమే తెలిసికొనవలయును గాని రెండవమార్గము లేదు. ప్రత్యక్షాది ప్రమాణములు దానిని గ్రహింపనేరవు. బ్రహ్మ మట్టిది కాదు. అది నిత్యసిద్ధము. కావున దానియందు సర్వప్రమాణములును ప్రవర్తింపవచ్చును. దృష్టాంతమునకును నీపృథివ్యాదులవిషయములనుఁ గూర్చి వేదముతోఁబాటు ప్రత్యక్షాదు లన్నియును గూడ ప్రవర్తించుచున్నవి కదా. ఈపృథివ్యాదులు నిత్యసిద్ధములు కాకున్నను మనజీవితకాలమునకంటె నెన్నియో రెట్లధికకాల ముండునవి కావున మనము వీనిని నిత్యసిద్ధములుగానే వ్యవహరింపవచ్చును.

మఱియు శ్రుతులయందు పరస్పరవిరోధము కానఁబడినచో సందర్భానుసారముగ నొక్కవాక్యమునకు ననుకూలముగ బహువాక్యము లెట్లు సమన్వయింపఁబడుచున్నవో అట్లే శ్రుతికిని తర్కమునకును పరస్పరవిరోధము వచ్చినచో నప్పుడును తర్కానుగుణముగ నధ్యాహారాదులచే శ్రుతి సమన్వయింపఁబడవచ్చును. ఇందు విరోధ మేమియు నుండదు. వాస్తవస్థితిలో నొకవిధముగ జూచిన సమానప్రచారము (అనఁగా రెంటికిని [శ్రుతితర్కములకు రెంటికిని] ఒకస్థలమునందే సంబంధము) కలిగినప్పుడు శ్రుతికంటె తర్కమే బలవంత మగును. తర్కము ప్రత్యక్షానుభవము ననుసరించి దానినే దృష్టాంతముగఁ జూపుచు విషయ నిర్ణయమును గావించును. శ్రుతియన్ననో ఇతిహాసమువలె నేదియో యొకయపూర్వవిషయమును బోధించును. కావున నెట్లు చూచినను బ్రహ్మనిర్ణయవిషయమునందు శ్రుతిసిద్ధాంతము తర్కమునకు ననుకూలమై యుండినసే కాని ప్రమాణము కానేరదు. ఈకారణమువలననే

సూత్రకారుఁడు ఈపాదమున తర్కయుక్తుల ననువాదము చేసి నిరాకరించుట కుపక్రమించెను.

ఇదియునుఁ గాక, "బ్రహ్మసాక్షాత్కారము అవిద్యను నివర్తింపఁ జేయును." అనుటయుఁ బ్రత్యక్షాదిగోచర మగువిషయమే కాని పరోక్షముకాదు. అవిద్య ప్రత్యక్షము కావున దాని నివృత్తియు ప్రత్యక్షమే కావలయును కదా! బ్రహ్మసాక్షాత్కారమనఁగా బ్రహ్మానుభవమే యనియు స్పష్టముగనే చెప్పఁబడియున్నది. కావున నెట్లును ఈబ్రహ్మవిషయము నందు ప్రత్యక్షాదులకు నవకాశము కలదు. ఇంతయేల శ్రుతియందును "శ్రోతవ్యో మంతవ్యః" అని వేదవాక్యశ్రవణమునకంటె బిదప మననము (యుక్తులచే వేదోక్త మగునర్థమును సిద్ధాంతము చేసికొనుట) కూడ విధింపఁబడియుండుటచే "శ్రుతి తర్కమునుఁగూడ నంగీకరించినది" అనువిషయము తేలుచున్నది. కావున నవశ్యముగ తర్కయుక్తులు కూడ విచారింపఁబడవలసినవియే.

సంగతి:—"పూర్వము వేదమూలములు కాకపోవుటచే స్మృతులు నిరాకరింపఁబడినవి. తర్కము లట్టివి కావు. వానికి * వ్యాప్తి మొదలగు ప్రత్యక్షసిద్ధము లగునాధారము లనేకములు గలవు. వానివలన మీా సిద్ధాంతమునకు విరోధ మవశ్యముగ వచ్చును" అను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. కావున దీనికిఁ బూర్వాధికరణములతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణసంబంధము.

సందేహము :—"ఈప్రపంచమునకుఁ బరమేశ్వరుఁడు నిమిత్తకారణము కావచ్చునుగాని ఉపాదానకారణ మగుటకు వీలులేదు. కార్యములు ఉపాదానకారణములును సమానరూపములయ్యే యుండవలయును. బ్రహ్మప్రపంచము లట్లు లేవు. (జగత్ చేతనోపాదానకం నభవతి అచేతనత్వాత్ ఘటవత్) అనుతర్కముచే సమన్వయభంగము కలుగునా? లేదా?" యనునదియే సంశయస్వరూపము తత్కారణంబును ఫలంబును పూర్వమువలెనే యూహించునది.

అవతారిక:—సూత్రకారుఁడు స్వయముగనే యాక్రింది రెండు సూత్రములచే పూర్వపక్షమున ననువాదము చేయుచు పైయుక్తిని స్థిరపరుచుచున్నాఁడు.

---

* వ్యాప్తి (పు. ౪౧. చూడు.)

పూర్వపక్షసూత్రము :—

## ౧౩౫. న విలక్షణత్వా దస్య తథాత్వంచ శబ్దాత్. ౨. ౧. ౪.

తాత్పర్యము:—లోకమున ఉపాదానకారణములును వానినుండి బుట్టినకార్యములును సమానములే యగుచున్నవి. మట్టినుండి పుట్టిన కుండ మట్టియే యైయున్నది. కాని సువర్ణమయము కాలేదు. కావున బ్రహ్మమునుండియే యీప్రపంచము జనించియుండునేని యిదియు బ్రహ్మమే కావలయును. పరమేశ్వరునితో సమానమే యై యుండవల యును. అట్లు లేదు. పరమేశ్వరుఁడు చేతనుఁడు, పరిశుద్ధుఁడు. ఈప్రపం చము అచేతనము అపరిశుద్ధము. ఈ ప్రపంచమునందు ప్రతిపదార్థము లును సుఖదుఃఖమోహరూపములై యున్నవి. ఒకపురుషుఁడు తన మిత్రులకు సుఖమును కలిగించుచున్నాఁడు (అనఁగా సుఖరూఁపుడై యున్నాఁడు.) వాడే శత్రువులకు దుఃఖరూపుఁడుగను మధ్యస్థులకు సము డుగ నున్నాఁడు. సుఖదుఃఖముల నొసంగకుండుటయే సమత్వమనియు మోహమనియుఁ జెప్పఁబడుచున్నది. ప్రకాశాభావమే మోహము. సుఖ దుఃఖప్రకాశము లేనిదికావున సమత్వముకూడ నట్టిదియే. మఱియు స్వర్గనరకాది బహువిధభేదములచేతకూడ ఉత్తమాధమరూపములై యీప్రపంచము మిగుల తుచ్ఛమైయున్నది. బ్రహ్మము నిర్వికారముకదా! ఆయనకును దీనికిని పోలిక యెట్లువచ్చును? పోలిక లేకున్న కార్యకారణ భావ మెట్లు కుదురును?

మఱియు ఈప్రపంచము పరమేశ్వరునకు భోగసాధనమై యుప కారమునుఁ గావించుచున్నది. లోకమున సమానజాతిగలవి (అనఁగా: రెండు చేతనములుగాని రెండచేతనములు గాని) యొకదాని కొకటి యుపకారము చేసికొననేరవు. రెండుదీపము లొకదాని నొకటి ప్రకా శింపఁజేయుట లేదు కదా! యజమానుండును సేవకుండును పరస్పరోప కారము నాచరించుట ప్రత్యక్షమైనను అందు యజమానుని యా త్మకు సేవకదేహంబును సేవకునియాత్మకు యజమానదేహంబును ఉప కారము నాచరించుచున్నదియేకాని ఆత్మలుకాదు. మఱియు ఆత్మ కర్త కాఁడు కావున బుద్ధ్యాదులమూలమున మఱియొకయాత్మకు నుపకారము

చేయవచ్చుననుటకును వీలు లేదు. ఆయన బుద్ధ్యాదులను ప్రేరేపించు ననుటయే మొట్టమొదట సంభవింపదు కదా! కావున నీకారణము వలనకూడ ప్రపంచము నిశ్చయముగ నచేతనమే కావలయును. బ్రహ్మము చేతన మనుటయు నిస్సంశయమే కావున వీనికిరెంటికిని కార్యకారణ భావము సంభవింపదు. బ్రహ్మము ప్రపంచమున కుపాదానకారణము కానేరదు.

"ఇట్లు చెప్పనేల శ్రుతి చేతనుఁడగు పరమేశ్వరుఁడే జగదుపాదాన మని చెప్పుచున్నది కదా! ఈ కారణమునుబట్టియే 'సర్వప్రపంచము చేతనము' అని సిద్ధాంతము చేయవచ్చును. ఇట్లయిన సర్వ పదార్థములును చేతనము లనియే యేల తలంపఁబడకున్నవి' అనియెద వేమొ పరిణామభేదములవలన నట్లగుటలో విరోధము లేదు. చేతనుఁడని ప్రత్యక్షముగ తలంపఁబడుచున్నపురుషుఁడు కూడ స్వప్నమూర్ఛాదులయందు చేతనరహితుండుగనే భావింపఁబడుచున్నాఁడు. కదా! కావున మట్టిపెళ్ల రాయి మొదలగువానియందు ఆత్మ యున్నను మూర్ఛాదిమగ్నులగుపురుషులయందువలెనే తెలియఁబడకుండవచ్చును. మఱియు అన్నియు పృథివినుండి జనించినవియే యైనను మాంసము సూపము అన్నము మొదలగునవి తమతమగుణములవలన నొకదాని కొకటి యుపకారము చేసికొనుచున్నట్లును పరస్పరభిన్నములుగ వ్యవహరింపఁబడుచున్నట్లును, ఒక్కచేతనమునుండి జనించినవియే యైనను ప్రాపంచికపదార్థములు పరస్పర ముపకారములఁ జేసికొనవచ్చును. భేదముగాఁగూడ వ్యవహరింపఁబడవచ్చును. కావున మొట్టమొదట 'ప్రపంచ మచేతనము' అనుటయే సంభవింపదు కదా! ఇఁక కార్యకారణభావమున విరోధమేమి కలదు" అనియెదవేమొ వినుము.

నీవాదము నంగీకరించినను చేతనాచేతనత్వములవలన కలిగిన భేదముమాత్రమే పోవునుగాని శుద్ధ్యశుద్ధులవలన కలిగినభేదము పోవదు కదా! వాస్తవస్థితిలో చైతన్యాచైతన్యములవలనఁ గలిగిన భేదముకూడ నశింపదు. శ్రుతియందు "బ్రహ్మము ప్రపంచమునకుపాదానకారణము" అని మాత్రమే చెప్పఁబడియుండ విశేష మేదియు చెప్పఁబడి యుండకపోయినచో నట్లే యగునుకాని ప్రకృత మట్లు లేదు. శ్రుతి స్వయముగనే "విజ్ఞానం చావిజ్ఞానం చ" అనువాక్యముచే అచేతనము

కూడ కొంత గల దనుచున్నది. కావున నెట్లును నీయభిప్రాయము నిలువదు. చేతన మగు బ్రహ్మము అచేతన మగు ప్రపంచమునకు నుపాదాన కారణము కానేరదు.

## అ ౨. పా ౧. సూ ౫. ఆరంభము.

పూర్వపక్షము:—ఇట్లును చెప్పుట యుక్తముకాదు. "విజ్ఞానంచ" అను శ్రుతి యొక్కటి యున్నను అనేక శ్రుతులు అచేతనములకుఁ గూడ చేతనత్వముఁ జెప్పుచున్నవి. సామాన్యపదార్థములఁ గూర్చి "మృ దబ్రవీత్. ఆపో౽ బ్రువన్" అను మొదలగు శ్రుతులు కలవు. భూతములనుఁ గూర్చి "తేజ ఐక్షత ఆ ఐక్షంత" అను మొదలగు శ్రుతులు కలవు. ఇంద్రియములను గూర్చి "తే హేమే ప్రాణా అహం శ్రేయసే వివదమానా బ్రహ్మ జగ్ముః" "ఈ ప్రాణములు ఇంద్రియములును 'మనలో నధికులెవ్వరు' అని వివాదము చేసికొనుచు పరమేశ్వరునికడకు పోయినవి" అను మొదలగు శ్రుతులు గలవు. ఇట్లు అనేక శ్రుతులు మనచే నచేతనములుగ భావింపఁబడుచున్న పదార్థములకుగూడఁ జేతనత్వమును చెప్పుచుండ నిక సంశయ మేల? చేతన మగుపరమేశ్వరుఁడే ప్రపంచమునకుపాదానకారణము కావచ్చును!

అవతారిక:—అని యిట్లు తనపూర్వపక్షముపై మరల నాక్షేపము రాఁగా పూర్వపక్షి దానికి సమాధానము చెప్పుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము:—

## ౧౩౬. అభిమానివ్యపదేశ స్తు విశేషానుగతిభ్యాం. ౨. ౧. ౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పకూడదు "మృ దబ్రవీత్" అను మొదలగు శ్రుతులు భూతేంద్రియాదులకు ప్రత్యక్షముగఁ జైతన్యము కలదని చెప్పలేదు. ప్రతిపదార్థమందును అభిమానిదేవత లున్నారని మంత్రార్థవాదపురాణేతిహాసాదులవలనఁ దెలియవచ్చుచున్నది. పై శ్రుతులు ఆదేవతలనుగూర్చియే చెప్పుచున్నవి. దేవతలు జీవులు చేతనులు కదా! ఇట్లుకాకున్న గొప్పవిరోధమువచ్చును. ప్రపంచమున గలచేతనాచేతనవ్యవహారములను పాలించును. ఇంతయే కాదు. సమానజాతి

గలపదార్థము లొకదానికొకటి యుపకారములఁ జేసికొనవని యిదివరకే నిరూపించియున్నాము. "గుణభేదములవలన మాంసాదులు సమాన జాతీయములే యైనను పరస్పరోపకారములఁ జేయుచున్నవి యని దృష్టాంతమును చూపితినికదా" అనియెదవేమొ యది సరికాదు. అవి యును ప్రత్యేకముగ తమకంటె భిన్నుఁడై చేతనుఁడై యున్న పురుషు నకు నుపకారము చేయుచున్నవే కాని పరస్పరోపకారమును జేసికొనుట లేదు. కేవల మగునన్నమునకు మాంససూపాదులవలన గలుగునుపకార మేమి? కావున చేతనాచేతనము లనురెండుపదార్థము లవశ్యముగ నుండియే తీరవలయును.జీవులు చేతను లనువిషయంబును ప్రత్యక్షముగ నున్నది. కావున ప్రపంచమే యచేతనము కావలయును. "శ్రుతి భూతేంద్రియాదులకు ప్రత్యక్షచైతన్యమునే చెప్పుచున్నది." అనిన నీయనుభవమునకుఁ గూడ విరోధము వచ్చును.

మఱియు కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తునందు ఈసంశయము (శ్రుతి ప్రాణాదులకు ప్రత్యక్షచేతనత్వమును చెప్పె ననుసంశయమును) నివా రించుటకై దేవతాశబ్దముకూడఁ బ్రయోగింపఁబడియే యున్నది. "తా వా ఏతాః సర్వా దేవతాః ప్రాణే నిఃశ్రేయసం విదిత్వా" "ఆదేవత లన్నియు తమలో ప్రాణమే శ్రేష్ఠ మనిగ్రహించి" అను మొదలగు వాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. కావున భూతేంద్రియాదు లకు చేతనవ్యవహారములఁ జెప్పుటయెల్ల వాని నధిష్ఠించి యున్న దేవ తలనుఁగూర్చియే యని తెలిసికొనవలయును. కావున నెట్లును ప్రపం చము చేతనము కానేరదు; పరమేశ్వరుఁడు దాని కుపాదానకారణము కానేరఁడు.

"పూర్వాధ్యాయమున 'త త్తేజ ఐక్షత' అనుమొదలగు శ్రుతు లను విచారించునప్పుడు వానియర్థము * గౌణముగ నిర్ణయింపఁబడెను. ఇప్పుడు ప్రధాన మైయర్థ్యే చెప్పఁబడెను. ఈ రెంటికిని విరోధము వచ్చును కదా! ప్రధానమైన ప్రథమాధ్యాయమున చేయఁబడినసమన్వయము కుదురకపోవునుకదా." అనియెదవేమొ ఇది యొకదోషముకాదు. ఎట్లు చెప్పినను సమన్వయమునకు విరోధము రాదు. అభిమానదేవతలు చేతను లగుటచే వారియందు చేతనవ్యాపార ముండవచ్చును. చేతనులు మా

* గౌణము. (ప్ర. [illegible])

మతమున (వేదాంతమతమున) బ్రహ్మాభిన్నులే యగుటచే నావశ్యకత కలిగినప్పుడు వారికార్యములు బ్రహ్మకార్యములే యనవచ్చును. ఇట్లగుటచే "చేతనవ్యాపారములు అచేతనములయందు గౌణముగ జెప్పఁబడుచున్నవి" అనినను "అచేతనముల నభిమానించు దేవతలకు ఆ వ్యాపారములు ముఖ్యముగఁ జెప్పఁబడియున్నవి" అనినను ఒక్కటియే యగును. కావున నెట్లును మాసమన్వయమునకు భంగము రాదు.

పూర్వపక్షసంగ్రహము:—అది యట్లుండె పైన చూపఁబడినది సాంఖ్యులచేఁ జేయఁబడుపూర్వపక్షము "ప్రపంచబ్రహ్మములకు కార్యకారణభావము కలుగుటకు వీలు లేకపోవుటచే ప్రపంచకారణము ప్రధానమే యైయుండవలయును. అట్లయిన నదియు నచేతనమే అపరిశుద్ధమే యగుటచేఁ బ్రపంచమునకు నుపాదానకారణము కావచ్చును" అని వారియభిప్రాయము.

## అ ౨. పా ౧. సూ ౬. ఆరంభము.

అవతారిక:—ఇట్లు రెండుసూత్రములచేఁ బూర్వపక్షము నను వాదముచేసి సూత్రకారుఁడు దానిని ఖండింపుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము:—

## ౧౪౦. దృశ్యతే తు. ౨. ౧. ౬.

తాత్పర్యము. సిద్ధాంతము:—పైన చేయఁబడిన సాంఖ్యపూర్వపక్షము సరి యైనది కాదు. సమానరూపత్వము లేకపోయినంతమాత్రమున * ప్రకృతివికారభావము హాని నొందనక్కఱలేదు. ప్రకృతివికారములు రెండును సమానములయ్యే యుండవలయు ననుట నియమము కాదు. చేతనుఁడని ప్రసిద్ధి నొందినపురుషునుండి గోళ్లు వెంట్రుకలు మొదలగునచేతనపదార్థంబులును, అచేతనము లగు పేడ మొదలగు

---

* ప్రకృతి యనఁగా: నుపాదానకారణము (ఉపాదానకారణము పు. ౨౧౪. చూడు.) వికార మనఁగా: ఆయుపాదానకారణమునుండి జనించినపదార్థము. ఈరెంటికిని గలసంబంధమే (అనఁగా='ఇది యుపాదానము ఇది దీనినుండి జనించినది' అనుసంబంధమే లేక, దీనినుండి యిదియే జనించును దీనికి నిదియే యుపాదానకారణము అనుసంబంధమే) ప్రకృతివికార

వానినుండి చేతనములగు వృశ్చికాదులును జనించుచుండుటను లోకమునఁ బ్రత్యక్షముగఁ జూచుచున్నాము. కావున ప్రపంచపరమేశ్వరులకు మీరన్నట్లు స్వరూపభేద మున్నను ఆయన జగత్తునకు నుపాదానకారణము కావచ్చును.

" మీదృష్టాంతము చెల్లదు. గోళ్లు వెండ్రుకలు మొదలగునవి అచేతన మగు దేహమునుండియే జనించుచున్నవి. పేడనుండి పుట్టునవియు నచేతనము లగువృశ్చికాది దేహములే కాని యాత్మలు కారు కదా! ఇప్పుడు మాయుక్తికి భంగ మేమి వచ్చినది? సమానరూపము గలవానికిమాత్రమే ప్రకృతివికారభావము వచ్చియున్నది " అనియెద వేమో వినుము. ఇప్పటికిని కార్యకారణములకు భేదము రానే వచ్చినది. ఒక యచేతనపదార్థము చేతనమునకు నాధార మగుచున్నది; మఱియొక్కటి య ట్లగుటలేదు. చేతనాధారమగు శరీరమునుండి జనించియు గోళ్లుమొదలగునవి సంపూర్ణముగ నచేతనము లగుచున్నవి; వృశ్చికాదిశరీరములును చేతనాధారముకాని పేడనుండి జనించియుఁ జేతనాధారము లగుచున్నవి. ఇదియు భేదమే కదా! ఇంతమాత్రమే కాక స్వరూపాదులనుఁ బట్టి చూచినను వానికి నెంతయో భేదము కలదు.

ఇదియునుఁగాక ప్రకృతివికారములకు సంపూర్ణ మగుపోలిక యుండవలయు ననిన నిప్పు డవి ప్రకృతివికారములే కానేరవు. " ఇది దీనికి నుపాదానకారణము. ఇది యీయుపాదానకారణమునకు కార్యము " అని భేదమును నిరూపించుటకు వానిలో (ప్రకృతివికారములలో) నేదియైన నొకభేద ముండక తప్పదు కదా! ఈ పక్షముననే (అనఁగా: "ప్రకృతివికారములకు సంపూర్ణ మగుపోలిక యక్కఱలేదు. కొంత పోలికమాత్రమే యుండినఁ జాలును" అనుపక్షమునే) యాశ్రయించిన నప్పుడు బ్రహ్మప్రపంచములకుకూడ నట్టిపోలిక కలదు. పృథివీభూతము నుండి జనించుట యనునది యెట్లు దేహనఖగోమయవృశ్చికాదులకు సమానధర్మమై యున్నదో అట్లే సత్త (ఉనికి) యనునది బ్రహ్మప్రపంచములకు సమానధర్మమై యున్నది. లోకమున " ఆకాశముకలదు. వాయువు కలదు" అనుమొదలగువ్యవహారములు పెల్లుగఁ గలవు. వీని వలన సర్వపదార్థములయందును కలిమి యేకరూపముతోనే యున్నది

యని తేలుచున్నది. "సత్యం జ్ఞానం" అనుమొదలగుశ్రుతులచే నాక లిమి పరమేశ్వరునకు స్వరూపమే యని చెప్పఁబడియున్నది. కావున ప్రపంచమునందు కూడ పరమేశ్వరరూపము కలదు. ఇప్పుడు ప్రకృతి వికారభావమునకు హాని యేలకలుగును? ప్రపంచము పరమేశ్వరుని కంటె సంపూర్ణముగ భిన్నస్వభావము కలదియై యున్నదా?

మఱియు "బ్రహ్మప్రపంచమునకు భేద ముండుటచే వానికి ప్రకృతివికారభావము కలుగదు" అనునప్పుడు మీయభిప్రాయ మేమి? "సంపూర్ణముగనే యభేద ముండినంగాని బ్రహ్మప్రపంచములకు ప్రకృతి వికారభావము కలుగదు" అనియా, లేక "కొంచమైనను అభేద ముండిన, జాలును" అనియా లేక ఎట్లును ప్రపంచబ్రహ్మములకు కార్యకారణభావము లేదు అనియా, ఇందు మొదటిపక్షము నాశ్ర యించిన ప్రకృతివికారము లనువ్యవహారమే కలుగదు; రెండవపక్షము నాశ్రయించిన మీమతమే నిలువదు. కలిమియనునది బ్రహ్మప్రపంచము లకుఁ గలసమానధర్మ మని యిదివఱకే నిరూపించియుంటిమి. ఇఁక మూఁడవపక్షము నాశ్రయించిన దానికి దృష్టాంత మేదియు లేదు. మేము సర్వమును పరమేశ్వరకార్యమునుఁ గానే చెప్పుచున్నాము.ఇట్లుండ మీరు దేనిని దృష్టాంతముగ జూపఁగలరు. "ఈ పదార్థము అచేతనము. దీనికిఁ బరమేశ్వరుఁడు ఉపాదానకారణముకాదు. ఈకారణమువలనఁ బ్రపంచమునకుఁగూడ పరమేశ్వరుఁ డుపాదానకారణము కానేరఁడు" అని ప్రపంచభిన్నమగు నేపదార్థము నాధారముగఁ జేసి వాదింపఁగలుగు దురు. కావున నెట్లు చూచినను ప్రపంచబ్రహ్మములకుఁ గల ప్రకృతి వికారభావమునకు హాని లేదు. "మీయనుమానము వేదమునకు విరుద్ధము" అనుటనుగూర్చి మఱియొక్కమాఱు చెప్ప నక్కఱలేదు. కావున నెట్లును మాసిద్ధాంతమే నిర్దోషమైనది. విచారించిన తర్కము శ్రుతిని ఖండింపనే లేదు.

"పరమేశ్వరుఁడు స్వతస్సిద్ధుఁ డగుటచే ఆయనయందు సర్వ ప్రమాణములును ప్రవర్తింపవచ్చు నంటిని కదా" అనియెదవేమొ యది సరికాదు. పృథివ్యాదిభూతములవలె నాయనయు సిద్ధుడేయైనను రూపాదులు లేనివాఁడగుటచే నాయనయందు ఇతరప్రమాణములు ప్రవర్తింపనేరవు. రూపరసాదులు లేకపోవుటచే ప్రత్యక్షంబును గుఱుతు

ఆధారము వ్యాప్తిమొదలగునవి లేకపోవుటచే అనుమానాదులును ఆయనయందు ప్రవర్తింపనేరవు. శబ్దమునకుమాత్రము రూపాదిసాహిత్యమక్కఱలేక పోవుటచే నది యొక్కటియే యమ్మహాత్ము నెఱిఁగింప గలుగును. ఈవిషయము ప్రథమాధ్యాయ ప్రథమపాదమున మూఁడవ యధికరణమున వివరించియున్నాము. ఇట్లగుటచే ధర్మమునకువలె నీబ్రహ్మమునకును వేద మొక్కటియే ప్రమాణము. అన్నియు సమాన ములే యైనను "ఆరోగ్యమునుఁ గోరువాఁడు పథ్యమును ఆశ్రయింప వలయును." అను వాక్యమునకువలె "స్వర్గమును కోరువాఁడు యజ్ఞము నాచరింపవలయును" అనువాక్యమునకు నితర ప్రమాణములతో బని యుండదుకదా !

"ఇట్లయిన శ్రుతి శ్రవణమునకు పిదప మననము నేలవిధించెను" అనియెదవేమొ దానికి నీశుష్కతర్కములు విషయములు కావు. వీని నాశ్రయింపవలయునని శ్రుతికి నుద్దేశము లేదు. ఇవి శుష్కతర్క ములు. తర్క మనునది యెప్పటికిని ఏదియో యొకప్రమాణముచే సిద్ధాంతిత మగువిషయమును విచారించును. ఇట్లుగాక స్వతంత్రమై ప్రవర్తించిన ఆశ్రయహీన మగుటచే నది శుష్కమే. శ్రుతియు ప్రత్య క్షముగనే "నైషా తర్కేణ మతి రపనేయా" "ఈబ్రహ్మజ్ఞానము తర్కమువలన కలుగదు" అని స్వతంత్రతర్కమును నిషేధించుచున్నది. మఱియు నీయుత్పత్తివిషయము నెవ్వరు నెఱుంగనేరరు. "కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ ఇయం విసృష్టి ర్యత ఆబభూవ" "ఈసృష్టి యెట నుండి కలిగెనో ప్రత్యక్షముగ నెవ్వఁ డెఱుంగును.దాని నెవ్వఁడు నిరూ పించును." అని ఈవిషయమును శ్రుతియే చెప్పుచున్నది. స్మృతియు "నమే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః" "ఓయర్జునా! నాయుత్పత్తి దేవతలకు తెలియదు. ఋషులకును తెలియదు." "అవ్య క్తోఽయ మచింత్యో ఽయం" "ఓయర్జునా! ఈయాత్మయొక్క స్వరూ పము నెవ్వఁడు చూడలేఁడు. భావింపలేఁడు" అని పరమాత్మవిషయము గోచరము కాదని చెప్పియున్నది. ఇట్లుండ నావిషయమున నీతర్కము లెట్లు పనికివచ్చును ? "అచింత్యాః ఖలు యే భావా న తాం స్తర్కేణ యోజయేత్" "ఏపదార్థములు మనస్సునకు గోచరములు కావో వానిని తర్కములోఁ జేర్పఁదగదు." అను న్యాయము నందఱు నంగీకరించియే

యున్నారు కదా! కావున మామతమునకు మీయుక్తి యింతయైనను విరోధము చేయఁజాలదు.

ఇది యంతయునుఁ గాక మఱియొకవిశేషము కలదు. మీరు మీపక్షమునకు నాధారముగ "విజ్ఞానం చావిజ్ఞానం చ" అనుశ్రుతి నుదాహరించి యున్నారుకదా! అదియు నీపక్షమునకు ననుకూలము కాదు. ప్రపంచమునకు చేతనమే కారణమని చెప్పు మామతమున నైన చో దాని నెట్లయినను సమర్థింపవచ్చును. "జగత్కారణము ఒక్కటియే చేతన జడరూపములతో నిలచెను" అనుటయే గదా! యాశ్రుతికి నర్థము చేతనమే ప్రపంచకారణ మైనచో నది మూర్చాద్యవస్థల నొందిన పురుషులయందువలె మనోగోచరముకాక సత్తారూపముతో నుండవచ్చును. చేతనములయందు ప్రకాశరూపముతో నుండవచ్చును. అది యచేతనమే యైనచో నిట్టిస్థితి సంభవింపదు. అచేతనపదార్థములుగామాత్రమే యది యుండును గాని చేతనపదార్థముగ నుండదు. అట్లుండకూడదని మీరే చెప్పితిరి కదా! కావున నెట్లుచూచినను చేతనకారణవాదమునే యాశ్రయింపవలయును.

వాస్తవస్థితిలో "కార్యకారణములకు రూపభేద మున్నచోఁ గార్యకారణభావము సంభవింపదు" అనువిషయము నంగీకరించి యీ దోషములనెల్లఁ జెప్పితిమి. కాని మొట్టమొదట బ్రహ్మప్రపంచములకు భేదము కలదనుట మాకు సమ్మతమేకాదు. ఈవిషయము మొదటనే నిరూపింపఁబడెను. కావున మీకు దీనిపై నాక్షేపము చేయుటకే వీలు లేదు.

## అ ౨. పా ౧. సూ ౭. ఆరంభము.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము సరికాదు. చేతనస్వరూపుఁడును నిత్యశుద్ధుఁడును శబ్దాదివిహీనుఁడు నగుపరమేశ్వరుఁడు విరుద్ధరూపమగుప్రపంచమునకుఁ గారణ మగునేని యుత్పత్తికిఁ బూర్వమున నీప్రపంచ ముండకూడదు. శబ్దాదిహీనునియందు శబ్దాదివంత మగు నీప్రపంచము సూక్ష్మరూపముతో నుండుట యెట్లు? "కార్యకారణములకు నభేదమే కదా!" అనియెద వేమొ యావాదము చెల్లదు. అప్పుడు "ఇది కారణము ఇది కార్యము" అనుభేదవ్యవహార మెట్లు కలుగును?

కావున నీసిద్ధాంతమువలన నీమతమే చెడిపోవును నీవును "ఉత్పత్తికిఁ బూర్వమునఁ గార్యము సూక్ష్మరూపముతో కారణమున నుండును" అనియే చెప్పుదువు కదా !

అవతారిక :—అనిన ఖండించుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము:—

# ౧౮౧. అసతి చేన్న ప్రతిషేధమాత్రత్వాత్.

## ౨. ౧. ౭.

తాత్పర్యము. సిద్ధాంతము:—పైన చూపఁబడిన "కార్యము ఉత్పత్తికిఁ బూర్వమున శూన్యరూపము కావలసివచ్చును" అనునది మామతమునకు భంగమును కలిగింపలేదు. మీరు చేసినపూర్వపక్షము వట్టిపూర్వపక్షమే కాని దానిచేత సాధింపఁబడుకార్య మింతయులేదు. ఏల యనిన:—

కార్యకారణములకు, భేద ముండినచో మీ రన్నట్లు కావచ్చును గాని అట్టిభేదము ఎప్పటికిని లేదు. ముఖ్యముగ వేదమార్గ మవలంబించిన మామతమునందు బొత్తిగనే లేదు. ఈవిషయము (౨. ౧. ౧౪. ౨౦. చూడుు.) ఆరంభణాధికరణమున సవిస్తరముగ నిరూపింతుము. ఇట్లగుటచే నీప్రపంచ మిప్పుడును కారణమాత్రరూపమే; సృష్టికిఁ బూర్వమునను కారణమాత్రరూపమే. ఇట్లుండ నిది యొకప్పుడసద్రూప మెట్లగును? "బ్రహ్మప్రపంచములకు భేదము కలదు కదా"! యని యెదవేమొ, ఆవిషయము సయుక్తికము కాదని పూర్వమే నిరూపింపఁబడినది. "సర్వం తం పరాద ద్యో ఽన్యత్రాత్మనః సర్వం వేద" "ఎవ్వఁడు ఆత్మకంటె (పరమేశ్వరునికంటె) సర్వప్రపంచమును భిన్నముగఁ జూచునో, వాని నాప్రపంచము ముక్తికి దూరస్థుని గావించును" అని శ్రుతిభేదనిందాపూర్వకముగ ప్రపంచబ్రహ్మాభేదమును చెప్పుచున్నది. ఇట్లగుటచే నిది యెప్పటికిని కారణరూపమే. పుట్టుటయు పుట్టకుండుటయు ననుస్థితులే కొంచెము విమర్శించిన నీప్రపంచమునకు లేవు. ఇఁక మీరు దేనిని నిషేధింతురు ? కావున నెట్లుచూచినను మామతము నిర్దోష మైనదియే.

## అ ౨. పా ౧. సూ ౮. ఆరంభము.

అవతారిక :—పైన వర్ణించినవిధముగ తన పూర్వపక్షము ఖండింపఁబడఁగానే సాంఖ్యులు మరల పూర్వపక్షమునుఁ జేయుచున్నారు.

పూర్వపక్షసూత్రము:—

## ౧౮౨. అపీతౌ తద్వత్ప్రసంగా దసమంజసమ్.

## ౨. ౧. ౮.

తాత్పర్యము :—౧. ఈప్రపంచమునకు పరమేశ్వరుఁడే కారణమని చెప్పిన మఱియొకదోషము వచ్చును. లయ మనఁగా ఒకవస్తువు మఱియొకవస్తువునందుఁ గలయుటయే కాని యన్యము కాదు. అట్లు విరుద్ధధర్మము లగువస్తువులు ఒకదానితో నొకటి కలిసినచో రెంటిగుణములును పరస్పరసాంకర్యము నొందుట ప్రత్యక్షమై యున్నది. మధురరసము గలనీటియందు లవణము కలిసినచో నానీరు ఉప్పగుచున్నది. కావున స్థూలత్వము అపారిశుధ్యము అచేతనత్వము మొదలగుగుణములు కలయీప్రపంచము ప్రళయకాలమున బ్రహ్మమునందు కలసి తద్రూపమును జెందునప్పుడు, ఆబ్రహ్మమునకు స్వాభావికములైయున్న చేతనత్వశుద్ధ్యాదులఁ జెఱుపవలయును. ఇది వేదమునకు నిష్టము కాదు. కావున నచేతనప్రపంచమునకు చేతనము కారణ మని చెప్పువేదాంతదర్శనము సరియైనది కాదు. కార్యములు కారణమునుండియే జనించును ; అందే లయమగును గదా !

౨. "ఈప్రపంచము భ్రాంతిసిద్ధ మైనది. ఇట్లగుటచే వాస్తవస్థితిలో దీనికి స్వరూపమే లేదు. కావున త్రాటిపై నారోపింపఁబడినసర్పమేస్వభావములుకలదైనను దానిస్వభావములు లయకాలమున త్రాటిలో కలయనట్లు ప్రపంచస్వభావములుకూడ బ్రహ్మమునఁ గలయవు. కేవలజలమయ మగుసముద్రమునందు తద్భిన్నములుగఁ దోఁచుతరంగాదులు లయకాలమున స్వధర్మములచే నాసముద్రరూపమునకు హాని కలిగింపనట్లు ఈప్రపంచము పరమేశ్వరరూపమునకు హాని కలిగింపదు" అని యెదవేమ్మె, అప్పటికిని దోషము పోవదు. ఈసృష్టి యెన్నిమాఱు

లైనను నియతముగ "అనుభవించువాఁడు అనుభవింపఁబడునది" అనుభేదము కలదియై మాత్రమే జనించుచున్నది. భ్రాంతులవిషయము నందన్ననో అట్టినియమము లేదు. సముద్రము ఒకప్పుడు నురుగు తరంగములు అను మొదలగు వానిరూపములతో గానవచ్చును; మఱియొకప్పుడు బుడకలు మొదలగువానిరూపములతోఁ గానవచ్చును. ఇట్లే త్రాటినిఁ జూచినప్పుడు కూడ నొకపురుషుఁడు సర్పముగాఁ దలంచును; మఱియొక్కఁడు జలధారగా భావించును. కావున ప్రపంచము కూడ భ్రాంతిసిద్ధమే యగునేని యొకప్పు డొకవిధముగాను మఱియొకప్పుడు మఱియొకవిధముగాను ఉత్పత్తి కావలయును. ఇట్లు లేదు. కావున నీప్రపంచము భ్రాంతిసిద్ధము కాదు; కాకున్న ప్రళయకాలమున వచ్చునని చెప్పఁబడిన దోష మవశ్యముగ వచ్చును. ఈ కారణమువలన నీవేదాంత మతము యుక్తము కాదు.

3. మఱియు జీవులును ప్రపంచాంతర్భూతులే యగుటచేఁ బ్రళయకాలమునఁ బ్రపంచముతోఁబాటు పరమేశ్వరునియం దేకీభవింతురు. ఆపరమేశ్వరునకు కర్మాదులు లేవు. కావున జీవులకు నవి యున్నను పరమేశ్వరరూపము కలుగగానే నశించిపోవును. అప్పుడు వారికి పునరుత్పత్తి కలుగఁగూడదు. కర్మయే కదా పునరుత్పత్తికి కారణము అది లేకున్న పునర్జన్మమెట్లుగలుగును? ఇట్లుండినను మీరు జీవులకు రెండవ సృష్టియందు పునరుత్పత్తినిఁ జెప్పుచున్నారు. ఇట్లయిన ముక్తులగువారు కూడ పునర్జన్మము నొందవలసినవారే యగుదురు. ఇది యెవ్వరికిని సమ్మతము కాదుకదా కావున నిట్టిదోషము వచ్చుచుండుటచే వేదాంత దర్శనము యుక్తము కాదు.

౪....౧. "ప్రళయకాలమునఁ గూడ నీప్రపంచము సూక్ష్మావస్థతో పరమేశ్వరునియందు ప్రత్యేకముగనే యుండును. కావున దీని గుణములతో పరమేశ్వరగుణములకు సాంకర్యము గలుగ నక్కఱలేదు. జీవులును కర్మసహితులైయే సూక్ష్మావస్థతో నుండువారే యగుటచే వారికి పునరుత్పత్తికారణము లేకపోదు. ముక్తులకును పునరావృత్తి రాదు "అనియెదవేమొ, అదియు సరికాదు. ఒకటితో నొకటి కలియకున్నది లయ మనియే చెప్పఁబడదు. కావున నీయుక్తిచే మీరు ప్రళయమునే యంగీకరింపనివార లగుదురు.

౨. "అంగీకరింపకపోయిన నేమి" అనియెదవేమొ యప్పుడు మఱియొకదోషము వచ్చును. మీరు కార్యకారణములకు భేదము లేదని యిదివఱకే చెప్పియున్నారు. ఆసిద్ధాంతమునకు విరోధము వచ్చును. స్వాభావికముగ నభిన్నము లగుపదార్థము లెప్పటికిని భిన్నములై యుండనేరవు కదా. భ్రాంతివలన నట్లు తోఁచు ననిన విరోధము లేదు; కాని భిన్నముగ నుండుట వాస్తవస్థితిలో సంభవింపదు. భ్రాంతియు ననియత మగుటచే, నీప్రపంచ మెప్పటికిని నొక్కవిధముగనే కాన వచ్చుచుండుటచే, నిది భ్రాంతిసిద్ధము కాదని యిదివఱకే చెప్పి యున్నాము. కావున ప్రపంచబ్రహ్మములకు భేదము నంగీకరించుటకు మీమతమున వీలు లేదు; అంగీకరింపకున్నఁ బరస్పరగుణసాంకర్యమును తొలఁగించుటకును వీలు లేదు. కావున నెట్లు చూచినను మీసిద్ధాంతము యుక్తియుక్తము కానేరదు.

## అ ౨. పా ౧. సూ ౯. ఆరంభము.

అవతారిక:— పైనఁ జూపఁబడినపూర్వపక్షముల ఖండించుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము:—

### ౧౪౩. నతు దృష్టాంతభావాత్. ౨. ౧. ౯.

తాత్పర్యము:—చక్కని దృష్టాంతము లుండుటచే మామతమున దోష మేమియు లేదు.

ఎట్లనిన:—౧. కారణమునందు లయమగుకార్యము తనధర్మములచే నాకారణమును చెఱుప నక్కఱ లేదు. ఈ విషయమును స్థాపించుటకై యనేకదృష్టాంతములు కలవు. మట్టినుండి జనించినకుండలు మొదలగునవియు సువర్ణమునుండి జనించినభూషణాదులును భూమినుండి జనించినచతుర్విధభూతములును స్థితికాలమున నెన్నివిపరీతధర్మములు కలిగియున్నను లయకాలమున తమధర్మములతోఁ గారణమునకు సంబంధమును కలిగించుట లేదు. వక్రత్వము, వర్తులత్వము, శ్రేష్ఠత్వము, నీచత్వము, మొదలగుభేదములు ఘటాదులయం దున్నను, లయకాలమున మృత్తికకు నివి యేవియు లేవు. ఇట్లుండ జగత్కారణ మగు

చేతనమునకు ప్రపంచధర్మము లేల రావలయును? ఇఁక మీపక్షమునకు నాధారముగ దృష్టాంతము లేవియు లేవు. "మధురరసము గలనీటి యందు లవణము కలసిన నానీరుకూడ ఉప్పగును" అంటివి. ఇందు కార్యకారణభావ మేది కలదు. నీరు ఉప్పునకు కారణముకాదు కదా! "సముద్రజలమునుండియే యుప్పు జనించుచున్నది కదా!" అనియెద వేమొ, ఆసముద్రజలమునకు లవణరసము కూడ స్వాభావికముగనే యున్నది యని మనస్సునకుఁ దెచ్చుకొనుము. "విశిష్టం శుద్ధ న్నాతి రిచ్యతే" "గుణాంతరములతో సంబంధము కలిగినను వస్తుస్వరూపము నకు భేదము రాదు." అనున్యాయము ననుసరించి చూచిన లవణరస మున్నను నీరు నీరే కదా!" అనియెదవేమొ, అప్పటికి లవణము కూడ జలవికారమే యగుటచే శుద్ధజలమే కావలసివచ్చును. అప్పుడు అది జలమునకు కలిగించినక్రొత్తమార్పు యేమియు లేదు కదా! కావున నీపక్షము నంగీకరింపఁ జనదు.

"ఇట్లయిన ప్రళయ మనునదియే లేకపోవలసివచ్చును." అని యెదవేమొ, యెప్పటికిని మామతమున దోషము లేదు. ఈప్రపంచము తనధర్మములతోఁ గూడియే సూక్ష్మరూపమున విభాగ మేర్పడకుండఁ గారణ మగుపరమేశ్వరునియం దుండవచ్చును. ఇంత యేల? కారణకార్యములు రెండు నొక్కటియే యైనను కారణమునకు కార్యధర్మములతో సంబంధ ముండవలసినపని లేదు. కార్యము కారణరూప మగును గాని కారణము కార్యరూపము కాదు కదా! కుండ మృత్తికారూప మగును గాని, మృత్తిక ఘటరూపము కాదు కదా! భూషణము సువర్ణాత్మక మగును కాని సువర్ణము భూషణాత్మకము కాదు కదా! భ్రాంతిసిద్ధము లగురజ్జుసర్పాదులును విచారించినను, సర్పము రజ్జ్వాత్మక మగును కాని రజ్జువు సర్పాత్మకము కాదు. కావున ప్రళయ ముండినను లేకున్నను కార్యధర్మములు కారణము నంటవలసినపని లేదు. "ప్రళయమనఁగా నవ్యపదార్థమునందు కలయుట" అని చెప్పినను, "ప్రళయ మనఁగా స్వరూపసంకోచము" అని చెప్పినను కార్యధర్మములు కారణముతో సంబంధపడ నక్కఱ లేదు. ఈవిషయము ఆరంభణాధికరణమున (౨. ౧. ౧౪. చూడు.) సవిస్తరముగ వివరింపఁ బోవుచున్నాము.

౨. మఱియు నీప్రపంచము మాయాకల్పిత మగుటచే దీనిధర్మ

ములతో నాత్మకు నెప్పటికిని సంబంధమే యుండదు. ఐంద్రజాలికుఁడు స్వయముగ మాయను విస్తరింపఁజేసి మరల తనయందే యడంచికొనినను దానిధర్మములవలన వికారము నొందనట్లు ఈపరమేశ్వరుఁడును ప్రపంచధర్మములవలన వికారము నొందఁడు. భ్రాంతికల్పిత మగునది వస్తువే కానేరదు కదా! వస్తువే యనినను దానిధర్మములతో నుపాదానకారణమునకు సంబంధము కలుగదని యిదివఱకే సయుక్తికముగ నిరూపించియున్నాము.

ఇదియును గాక పురుషుఁడు నిదురించునప్పుడు చూచిన స్వప్న పదార్థములు సుషుప్త్యవస్థయందును జాగ్రదవస్థయందును లేకున్నను ప్రత్యభిజ్ఞానబలముచే ("నేను రాత్రి కలగని సుఖముగ నిదురించి యిప్పుడు మేల్కొంటిని." అనుపరామర్శచే) పురుషుఁడుమాత్రము సాక్షియై యొక్కఁడే యున్నట్లు, స్వప్నపదార్థములయొక్క యుత్పత్తి స్థితిప్రళయములఁ జూచుచున్నట్లు, ఈయాత్మయే స్వప్నసదృశ మగు నీప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిప్రళయములఁ జూచుచు సాక్షియై యున్నాఁడు. "రథాన్ రథయోగాన్ పథః సృజతే" "స్వప్నావస్థయందు జీవుఁడు సంకల్పబలముచే స్వస్వరూపమునుండియే రథములను వానితో సంబంధించినవిధులను కూడ సృజించుచున్నాఁడు" అను మొదలగువాక్యముల ననుసరించిన స్వప్నప్రపంచము జీవునుండియే జనించి యందే నిలిచి సుషుప్త్యవస్థ రాఁగానే యందే లీన మగుచున్నది యని తెలియవచ్చుచున్నది. సాక్షి యగుటచే నాతనికి నాస్వప్న ప్రపంచావస్థలతో సంబంధము లేదనుటయు నిస్సంశయమే. చూచు వానితోఁ జూడఁబడునవి. సంబంధపడ వనుట ప్రత్యక్షసిద్ధము కదా! ఇట్లు అవస్థలతోనే సంబంధము లేకున్న నాయవస్థలకునాశ్రయ మగు పదార్థములయొక్క ధర్మములతో సంబంధ మెట్లు వచ్చును? విచారించిన పరమేశ్వరునివిషయము కూడ నిట్టిదియే. ఆయనయు ప్రపంచము యొక్క యుత్పత్తిస్థితిప్రళయములకు సాక్షియై యున్నాఁడు. కావున ప్రపంచధర్మములతో సంబంధపడఁడు.

"ప్రపంచము మాయామయమే యైనచో నిది పరమేశ్వరుని యందు ఏకరూపముతోనే నిలుచుననవలయును. భ్రాంతి సిద్ధములగు పదార్థములకు అధిష్ఠానమే పరమార్థరూపము కదా! అప్పుడు రెండవ

మారు సృష్టి యగునప్పుడు మరల ప్రస్తుతరూపముతోనే కావలయు ననునియమ ముండకూడదు. భ్రాంతికి నియమము లేదు కదా!" అని యెదవేమొ, అదియు సరికాదు. భ్రాంతులు అనేకము లయ్యేనేని (అనఁగా అనేకపురుషుల నాశ్రయించినవి యయ్యేనేని) ఏకపదార్థమే ఒకని కొకవిధముగను మఱియొక్కనికి మఱియొకవిధముగను తోఁప వచ్చును. మొదటిభ్రాంతికి నాశము కలిగెనేని తగినకాలమున నొక్క నికేయైనను మఱియొకభ్రాంతి కలుగవచ్చును; ప్రస్తుతముమాత్ర మట్లు లేదు. బ్రహ్మ మొక్కటియే యుపాధిభేదములవలన నానారూపము లతో కానవచ్చుచున్నది. ఆరూపములనే జీవు లనుచున్నాము. కావున ప్రపంచభ్రాంతి యొక్కటియే. ఒక్క పురుషునకు కలిగినదియే. ఇట్లుండ ప్రపంచమునకు నియమము లేకపోవలసినపని యేమి? సుషుప్త్యవస్థ యందు ఉపాధు లన్నియు క్షీణించినను మూలాజ్ఞానము నశింపక పోవుటచే, జన్మాదినుండియు "నేను మనుష్యుఁడను"అని తలంచుచుండిన కారణమువలన జాగ్రదవస్థ రాగానే జీవుండు మఱల మనుష్యుఁడే యైనట్లు ప్రళయకాలానంతరమున జీవాజ్ఞానవశమున నేకరూపము తోనే ప్రపంచ ముదయింపవచ్చును. "ఇమాః సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతం గో వా....తదా భవంతి" "సర్వజీవులును సుషుప్త్యవస్థయందు బ్రహ్మము నొందుదురు కాని ఆవిషయమును తెలిసికొనలేరు. అట్టియజ్ఞానమువలననే జాగ్రద వస్థ వచ్చునప్పటికి పులిగాఁగాని సింహముగాఁగాని తోఁడేలుగాఁగాని పురుగుగాఁగాని పక్షిగాఁగాని మారిపోవుచుందురు. జన్మము మొదలు అజ్ఞానమువలన తమ్ము ఏయే రూపములతో భావించుచుందురో ఆయా రూపములనే చెందుచుందురు." అను మొదలగు శ్రుతివాక్యములు సుషుప్త్యవస్థను గూర్చి చెప్పుచున్నవి. ప్రళయమునందు కూడ నజ్ఞానము మిగిలియే యుండుటచే నిట్లే కావచ్చును. కావున నీరెండవ పూర్వపక్షము మామతమునకు భంగము కలిగింపదు.

3. పైనిరూపణమువలననే మీమూఁడవయాక్షేపము కూడ ఖండింపఁబడినట్లయినది. ప్రళయకాలమునందును అజ్ఞానము శేషించి యుండును గావున దాని నాశ్రయించియున్న బద్ధులే పునర్జన్మము

నొందుదురుగాని ముక్తులు పొందరు. వారు అజ్ఞానమును నశింపఁజేసిన వారు కదా!

"పోయినను ఆ యజ్ఞానము మరల రావచ్చును కదా!" అని యెదవేమొ వినుము. ఏపదార్థమైనను ఒక్కమాఱు పోయినది మరల వచ్చినను రావచ్చునుగాని అజ్ఞానముమాత్ర మట్లు రాదు. తెలియని విషయము నొక్కమాఱు తెలిసికొనినపిదప నది యిఁకనెన్నటికిని తెలియనిది కానేర దనుట ప్రత్యక్షసిద్ధము. హిమవంతమున కుత్తరమున దేశము కలదా? లేదా? యని సంశయించువానినిఁ గూర్చి భూగోళశాస్త్రవేత్త యొక్కఁడు "అచ్చట దేశము కలదు" అనిచెప్పిన నిఁక నాసంశయము మరల నెన్నటికైనఁ గలుగునా? ఇట్లే గురూపదేశమువలన "ప్రపంచము బ్రహ్మాభిన్నము" అని యొక్కమాఱు గ్రహించిన మరల సంశయము జనింపదు; బంధము కలుగదు.

౪. ఇఁక మీరుచేసిన నాల్గవయాక్షేపము కూడ చెల్లదు. ఆపక్షము మాకు సమ్మతమే కాదు. "ప్రపంచము లయమునొందక పరబ్రహ్మమునందు భిన్నముగనే యుండుననిన కార్యకారణాభేదములకు భంగము వచ్చును" అని మీరు చెప్పితిరి; మాకన్నచో ఆభేదము బొత్తిగనే సమ్మతము కాదు. ఇట్లుండ మీయాక్షేపము మామతము నేమి సేయును? మామతమున కార్యకారణవిభాగము అజ్ఞానకృతము త్రికాలములయందును కార్యకారణములు పరమార్థస్థితిలో నొక్కటియే "ఇట్లయిన మీరే ఇంతకుముందొకమాఱు ప్రళయావస్థయందు కార్యము సూక్ష్మావస్థను జెంది కారణమున నుండిన నుండవచ్చును అని చెప్పి యున్నారుకదా" అనియెదవేమొ, సత్యమే. అందు దోషము లేదు. మే మెప్పటికిని కార్యకారణభేదము నంగీకరించువారము కాము. భేదముగఁ గానవచ్చుట యెల్ల భ్రాంతి యనువారమే. ఇట్లగుటచే ప్రళయకాలమునందు కూడ భ్రాంతిసిద్ధ మగుభేదము నంగీకరించితిమి. ఇందు దోష మేమి? మామతమునకు వచ్చుహాని యేమి? శూన్యమగు భేదము స్వతస్సిద్ధమగు నైక్యమునకు హానిని కలిగింపఁగలుగునా? కావున మామత మెట్లును దోషయుక్తము కానేరదు.

బాగుగ విచారించిన మీయాక్షేపమునకు నింతగా సమాధానము చెప్పవలసినపనియు లేదు. వేదాంతవాదు లందఱును ఉత్పత్తి

స్థితికాలములయందు ఈ ప్రపంచము అవిద్యామయమైమాత్రమే యున్నది యనుచున్నారు. శ్రుతియు "ఇదం సర్వం యదయ మాత్మా. సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుమొదలగువాక్యములచే ప్రపంచబ్రహ్మములకు సంపూర్ణ మగునభేదమును చెప్పుచున్నది. ఇట్లుండ ప్రళయకాలమునుమాత్రమే యాశ్రయించి యాక్షేపించుటకు మీకు నవకాశ మెట్లు కలుగును. మూఁడుకాలములయందును ప్రపంచ మొక్కవిధముగనే యున్నది. కావచ్చునని యతిసులభముగనే మేము సమాధానము చెప్పవచ్చును కదా! బాగుగ విచారించిన మీరు చూపిన దోషములు స్థితికాలమునందును గలవు.

౧. కార్యకారణములకు నభేద మగుటచే కార్యధర్మములు కారణమునందు కూడ నుండవలయును.

౨. కార్యము భ్రాంతిసిద్ధ మగునేని యొకజీవునకు ఒకవిధముగాను మఱియొకజీవునకు మఱియొకవిధముగాను ప్రపంచము కానరావలయును.

3. ఇట్లు కానవచ్చునేని జ్ఞానాజ్ఞానవిభాగము నియమము లేకపోవుటచేతను లేక జీవబ్రహ్మములొక్కటియే యగుటచే జీవుని ప్రాపంచికధర్మము లెప్పటికిని విడువకపోవుటచేతను ఎవ్వనికిని ముక్తియే రాకూడదు; ఏదియో యొకవిధముగ వచ్చినను అదియు బ్రహ్మప్రాప్తియే కావునను బ్రహ్మప్రపంచములకు నభేదమే కావునను ఆజీవునకు మరల బంధము రావలసివచ్చును.

౪. ఇట్లు కాక ప్రపంచబ్రహ్మములకు భేదమును సాధింపఁబోయిన కార్యకారణాభేదవాదమునకు భంగము వచ్చును.

వీనికి సమాధానము లేమి ప్రతివేదాంతియు "ప్రపంచము భ్రాంతికల్పిత మగుటచే దానికిని పరబ్రహ్మమునకును స్వాభావికభేదము లేదు" అనియే చెప్పి తీరవలయును. ప్రళయకాలమునందలిస్థితినిఁ గూర్చియు నీసమాధానమునే యేల చెప్పకూడదు? ఈప్రపంచమంతయు వాస్తవస్థితిలో మాయామాత్రమే; స్వప్నతుల్యమే. భ్రాంతి యనునిద్రనుండి మేల్కాంచినవానికి వాస్తవస్థితిలో నీప్రపంచమే, కానరాదు. ఈవిషయమునే మహాత్ము లిట్లు చెప్పియున్నారు. "అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే, అజ మనిద్ర మస్వప్న

మద్వైతం బుధ్యతే తదా" "అనాది యగుమాయచే నిదురించుచున్న జీవుఁ డెన్నడు మేల్కాంచునో నాఁడు ఉత్పత్తిశూన్యుఁడును నిద్రయు స్వప్నంబును లేనివాఁడును ఏకరూపుఁడు నగుపరమేశ్వరుని ఆత్మరూపునిఁగా తెలిసికొనును" అను మొదలగు మహాపురుషులవాక్యము లనేకములు కలవు. కావున నెట్లును మామతమున దోషము లేదు

## అ ౨. పా ౧. సూ ౧౦. ఆరంభము.

అవతారిక :—ఇట్లు పూర్వపక్షమును సమూలఘాతముగ ఖండించి మఱికొన్ని దోషములఁ జూపుచున్నాఁడు.

## ౧౪౪. స్వపక్షదోషాచ్చ ౨. ౧. ౧౦.

తాత్పర్యము:—ఇదియునుఁగాక మామతముపైఁ జూపినదోషము లన్నియు మీమతమునందును (సాంఖ్యమతమునందును) కలవు. ఎట్లనిన:—

మీరు జగత్కారణ మగుప్రధానమునందు శబ్దాదులు లేవనియు దానినుండి జనించినప్రపంచమునకుమాత్ర మవి కలవనియుఁ జెప్పుచున్నారు కదా! ఇప్పుడు ప్రధానప్రపంచములకు సమానరూప మెక్కడిది? చేతన మగుజగత్కారణమునకును అచేతన మగుప్రపంచమునకును మేము కార్యకారణభావమును చెప్పుచున్నాము; మీరును శబ్దాదిహీన మగుప్రధానమునకును శబ్దాదిమంత మగుప్రపంచమునకును గార్యకారణభావమును జెప్పుచున్నారు. ఇందు కార్యకారణమునకు స్వరూపభేద మేమతమున లేదు.

ఇట్లు స్వరూపభేదము నంగీకరించిన "సృష్టికిఁ బూర్వమునఁ బ్రపంచము సూక్ష్మావస్థారూపముతో కారణమున నుండకూడదు" అనుదోష మేమతమునందు రాదు.

"ప్రళయకాలమున కార్యధర్మములు కారణధర్మములతో సాంకర్యము నొందవలయును"అనుదోష మేమతమునకు సంభవింపదు! మీరును ప్రళయకాలమున కార్యకారణము లొకదానియం దొకటి కలిసిపోవు నని యంగీకరించియున్నారు కదా!

మఱియు ప్రళయకాలమున సర్వవికారములును భేదశూన్యములై కారణమునందు గలసిపోయిన నప్పుడు "ఈజీవునకు సుఖదుఃఖ కారణ మగుప్రకృతి ఇది. ఈ జీవునకు సుఖదుఃఖకారణ మిది" అని పూర్వసిద్ధము లగుభేదములు రెండవసృష్టియందు కలుగుటకు వీలు లేదు. మీరును లయకాలమునఁ గారణకార్యములను నవిభాగమునే చెప్పుచున్నారుకదా! ఇట్లుండ "సృష్టికి నియమము లేకపోవలసివచ్చును" అనుదోష మెవ్వరిమతమునందు లేదు?

కారణము లేకయే సృష్టినియమము కలుగు ననిన ముక్తినొందిన వారలకుఁ గూడ మరల నిష్కారణముగనే బంధము కలుగవలయును. కావున నీదోషము మీమతమునందును సమానమే.

ఇట్లు కాక "కొన్నిభేదములు ప్రళయకాలమునఁ బ్రధానముతో నేకీభవించును. మఱికొన్ని యేకీభవింపవు" అనినచో ఏవికారము లేకీభవింపవో అవి ప్రధానకార్యములు కాకపోవలసినచ్చును. కార్యము కారణముతో నేకీభవింపవలయు ననుట నియమము కదా!

ఇట్లు మామతముపై జూపఁబడినదోషములు మీమతమునందు గూడ నుండుటచే మీరు మమ్ముఁ గాని మేము మిమ్ముఁ గాని యాక్షేపించుటకు వీలు లేదు. అది యట్లుండ నీచూపఁబడినవి దోషములే కావనియుఁ జెప్పవలసియున్నది. ఏమతస్థునికైనను వీని నాశ్రయింపక తప్పదు గదా!

## అ ౨. పా ౧. సూ ౧౧. ఆరంభము.

అవతారిక:—మఱియొకదోషము కూడఁ జూపుచున్నాఁడు.

## ౧౪౫. తర్కాప్రతిష్ఠానా దప్యన్యథాఽను మేయ మితి చే దేవ మప్యవిమోక్ష ప్రసంగః. ౨. ౧. ౧౧.

తాత్పర్యము:—మఱియు నీపరమేశ్వరవిషయము కేవలవేదము చేతమాత్రమే నిరూపింపఁ దగినది. ఇట్లుండ దీనియందు వేదవిరుద్ధము

లగు కేవలతర్కములను ప్రయోగింపఁజూచుటకే మొట్టమొదట వీలు లేదు. మనబుద్ధికిని పరమేశ్వరకల్పిత మగు వేదమునకు నెంతయో తారతమ్యము కలదు. ఇట్లగుటచేతనే మనము కల్పించుతర్కములు నిలుకడ నొందవు. ఒకబుద్ధిమంతుఁడు ఒకదాని నొకవిధముగ నిర్ణయించిన నంతకంటె సూక్ష్మబుద్ధి గలమఱియొక్కఁడు దానినే మఱియొకవిధముగ నిర్ణయించుచుండుటను ప్రత్యక్షముగఁ జూచుచున్నాము. ఒకవేళ ప్రసిద్ధప్రభావు లగుకపిలాదులయొక్క తర్కములను ప్రమాణములుగ నంగీకరింత మన్నను అది తృప్తిగా నుండలేదు. కాణాదులు గౌతముఁడు మొదలగువారు కూడ ప్రసిద్ధులే యై యున్నారు; వారిమతములయందును పరస్పరవిరోధము గానవచ్చుచున్నది. కావున నెట్లును శుష్కతర్కముతో వేదసిద్ధాంతమునకు విరోధము రాదు. శ్రుతియు అనుకూలతర్కమునుఁ గూర్చియే చెప్పుచున్నది యని యిదివరకే సిద్ధాంతము చేసియున్నాము కదా !

పూర్వపక్షము:—ఇట్లయిన యీదోషము పోవుటకై మేము మఱియొకవిధముగ ననుమానము చేసెదము. ఎంత యూహించినను తర్కము స్థిరము కానేర దని సిద్ధాంతము చేయుటమాత్రము శక్యము కాదుకదా! వాస్తవస్థితిలో "తర్కములకు నిలుకడ లేదు." అను విషయము కూడ తర్కముచేతనే నిర్ణయింపఁబడుచున్నది. కొన్నితర్కములు నిలుకడ నొందకుండుటను జూచియే కదా. "సమానజాతి గలవి యగుటచే తర్కము లేవియును నిలుకడ నొందవు" అని సిద్ధాంతము చేసితిరి. ఈతర్కమునకుమాత్రము నిలుకడ యెటనుండి వచ్చును? లోకమునఁ గలతర్కము లన్నియు నప్రమాణములే యైనచో లోకవ్యవహారమే నిలుకడ నొందదు. లోకులు భూతవర్తమానకాలముల యందలియనుభవము నాశ్రయించి భవిష్యత్కార్యములకు సిద్ధు లగుచున్నారు. దీనికి విరోధము వచ్చును కదా ! ఇంత యేల ? వేదవాక్యార్థములయందు తాత్పర్యభేదము (మతభేదము) కలిగినప్పుడు వాస్తవార్థమును నిర్ణయించుటకుఁ గూడ నీతర్కమే తోడ్పడుచున్నది. విచార మనునదియే తర్కము కావున వాక్యవిచారము కూడ తర్కమే యనుటలో సంశయ మేమి? "ప్రత్యక్ష మనుమానం చ శాస్త్రం చ వివిధాగమం, త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధి మభీప్సతా"

"ధర్మాధర్మముల నిర్ణయింపఁగోరువాఁడు ప్రత్యక్షానుమానములను శాస్త్రమును సర్వవిధము లగునాగమములను కూడ బాగుగ నెఱుంగ వలయును." అని మనువు తర్కమును కూడ నర్థనిర్ణయోపాయములుగ నిర్ణయించియున్నాఁడు. ఇట్లుండ తర్కము నాక్షేపించుట కేమి వీలు కలదు? "నిలుకడ లేదంటిమి కదా!" యనియెదవేమొ యది తర్కమునకు భూషణమే యగును గాని దూషణము కానేరదు. అట్లు నిలుకడ లేకుండ నుండిననే కాని దురభిప్రాయముల వదలి సదభిప్రాయముల నంగీకరించుటకు వీలు లేదు. దురభిప్రాయములు నిలుకడ నొందకున్నను వానిని ఖండించి స్థిరత్వము నొందినసదభిప్రాయములు నిలుకడ కలవి కావచ్చును. కదా! పూర్వులు మూఢు లైరని మనము కూడ మూఢులము కావలయునా? వారికంటె బాగుగ నొకక్రొత్త యనుమానమును చేయవచ్చును. అదియే సిద్ధాంత మగును. కావున నిలుకడ లేకుండుట యనునది యొక్కదోషము కానేరదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పినను తర్కమువలన సిద్ధాంతము కలుగదు. కొన్నివిషయములయందు కేవలతర్కము గూడ సిద్ధాంతసాధన మగుచున్నది యనుట నిస్సంశయమే కాని ప్రస్తుతవిషయమునందు ("పరమేశ్వరుఁడే జగత్కారణము"అనువిషయమునందు) మాత్ర మట్లు కానేరదు. ఆఈశ్వరుఁడు మహాగంభీరుఁడు (వేదములకుతప్ప మఱి యొక్కదానికి గోచరుఁ డగువాఁడు కాఁడు.) అద్వితీయుఁడు. ఆయన నెఱుంగుటయు నత్యావశ్యకము. సత్యజ్ఞానానందములు స్వస్వరూపములే యని యెఱింగి ఆయనతో నేకీభవించుటయే కదా ముక్తి. ఆజ్ఞానము తర్కమువలన కలుగునది కాదు. ఆయనకు రూపాదులు లేకపోవుటచే ప్రత్యక్షమునకును * లింగము మొదలగునవి లేకపోవుటచే అనుమానమునకును గోచరుఁడు కాఁడని యిదివఱకే నిరూపించియున్నాము.

మఱియొకవిశేషము వేదాంతవాదు లందఱును మోక్షము వలదని చెప్పువా రందఱును "యథార్థజ్ఞానమువలన మోక్షము కలుగును" అని చెప్పుచున్నారు. యథార్థజ్ఞాన మనునది యందఱకు నేకవిధ

---

* లింగమనఁగా ననుమానమునకు సాధన మగుహేతువు. (అనుమానము పు. ౩౯. చూడు.)

మైనదిగానే యుండవలయును కాని భిన్నముగ నుండుటకు వీలు లేదు. యథార్థ మగునది యెప్పటికి నొక్కటియే కావలయును కదా! ఇట్లగుటచే తర్కములవలన నట్టిజ్ఞానము కలుగదు. వారు (తార్కికులు) తమబుద్ధిబలము ననుసరించి యథార్థజ్ఞానము ననేకవిధములుగఁ పరస్పర విరుద్ధములై సర్థించుచున్నారు. కొందఱు ప్రధానపురుషజ్ఞానమే యథార్థజ్ఞాన మనుచున్నారు; మఱికొందఱు పరమాణ్వాదులవిజ్ఞానమే యథార్థజ్ఞాన మనుచున్నారు. ఇట్లయిన నిర్ణయ మెట్లు? వాస్తవస్థితిలో యథార్థజ్ఞానవిషయముల వివాదమే యుండకూడదు కదా! కావున నీవాదములలో దేని నాశ్రయించినను పురుషార్థలాభము (మోక్షప్రాప్తి) కలుగదు.

"ఇట్లు చెప్ప నేల? తర్కవేత్తలలో నుత్తముఁడని ప్రసిద్ధి నొందిన వానిమతము నొక్కదానినిమాత్రమే గ్రహింపరాదా?" అని యెదవేమొ, యదియు సరిపడదు. అన్నియు బరులచే ఖండింపఁబడియే యుండ దేనిని ప్రధానముగ గైకొనఁగలము? వర్తమానకాలమున నున్న తార్కికు లందఱు గూడి యేదియో యొకదానిని సర్వోత్తమముగా సిద్ధాంతము చేసినను "మునుపటివారియభిప్రాయము కూడ నిట్లే యుండెను. రాబోవువారియభిప్రాయము కూడ నిట్లే యుండును" అని నిర్ణయించుటకు తగినయాధార మేదియైన కలదా! కావున నెట్లును తర్కముచే ప్రస్తుతసిద్ధాంతమును చేయుటకు వీలు లేదు.

తర్కమునకు నీదోషము కలిగినది శ్రుతి నాశ్రయింపకపోవుట చేతనే దాని నాశ్రయించి తదనుకూలముగ ప్రవర్తించియుండిన నా సిద్ధాంతమునకు నెప్పటికిని వికల్పము కలుగుటకు వీలు లేదు. శ్రుతి నిత్యమగుటచే సిద్ధాంతంబును నిత్యమే కావలయును. ఏవాదియు దానిని త్రిప్ప లేఁడు. కావున మామతమే సర్వవిధముల నుత్తమము. చేతనుఁడగుపరమేశ్వరుఁడే ప్రపంచమునకు అభిన్ననిమిత్తోపాదానకారణము.

---

## ౪. శిష్టాపరిగ్రహాధికరణము.

**విషయము:—** ఇందు వైశేషికాదిమతములు నిరాకరింపఁబడును,

సంగతి :—రెండవయధికరణమునకువలెనే యీయధికరణమునకును ప్రత్యేకసంగతి యుక్కఱలేదు. ఇందు ప్రత్యేకము లగున్యాయము లేవియుఁ జెప్పఁబడ లేదు.

ఇట్లు కాకున్నను, "వేదమునకు విరుద్ధము లగుటచే సాంఖ్యస్మృతి మొదలగునవి యెట్లు వేదమూలములు కావో అట్లే మహాప్రమాణము గలబ్రహ్మము ప్రపంచమునకు కారణ మగుట యుక్తివిరుద్ధము కావున నీప్రపంచముకూడ బ్రహ్మకారణకము కానేరదు" అను నాక్షేపము పూర్వాధికరణసిద్ధాంతముపై వచ్చునని చెప్పినను చెప్పవచ్చును. ఈయాక్షేపము దృష్టాంతానుసారముగ వచ్చెను; కావున యీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతసంబంధము కావచ్చును.

మఱియు "మూల మేమియు లేకపోవుటచే సాంఖ్యాదిస్మృతులును వారియుక్తులును అప్రామాణికము లైనవి. మాయుక్తిమాత్ర మట్టిది కాదు. దీనికి వ్యాప్తి మొదలగుననేకమూలములు కలవు" అనునాక్షేపమైనను రావచ్చును. ఇది ప్రత్యుదాహరణము కావున నప్పుడు దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము ప్రత్యుదాహరణసంబంధము కావచ్చును. సామాన్యముగ నీపాదాంతమువఱకు నీప్రత్యుదాహరణసంబంధము లే సర్వాధికరణములకును గలవు.

సందేహము:—"పరబ్రహ్మము రూపరహితుఁడు ; సర్వవ్యాపకుఁడు. కావున ఆకాశమువలె ప్రపంచమునకుఁ గారణము కానేరఁడు. ('బ్రహ్మ న జగత్కారణం విభుత్వాత్ ఆకాశవత్' అనునది యనుమానవాక్యస్వరూపము) అను మొదలగుయుక్తులకును పూర్వాధ్యాయమునందలి సమన్వయమునకును విరోధము కలదా ? లేదా?" అనునది సంశయస్వరూపము.

పూర్వపక్షము:—పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడై ఆకాశమువలె నిశ్లేషుఁడై *పరిణామాదులు జెందుటకు వీలులేనివాఁడై యున్నాఁడు. కావున ప్రపంచకారణము కానేరఁడు. కార్యము కారణరూపమే యనుట యెట్లును సంభవింపదు. సాంఖ్యులు సత్కార్యవాదము నొనర్చువారు కావున వారిని ఖండించుటకు మీకు నవకాశము దొరకినది. మామత

---

* పరిణామము. (పు. ౭౭. చూడు.)

మును (*వై శేషికమతమును) ఖండించుటకు నట్టియవకాశము లేదు. కార్యము కారణరూపము కాకపోవుటచే నుత్ప త్తికిఁ బూర్వమున కారణమునందు లేదు. కారణంబును మహాపరిమాణము కలదిగా నుండ కూడదు. అట్టి కారణమునుండి యల్పపరిమాణము గలకార్యములు జనింపవు కదా! కావున నత్యల్పము లని ప్రసిద్ధి నొందినపరమాణువులే ప్రపంచకారణములు. వానిసముదాయములవలన నెంతయల్పపదార్థము లైనను మహాప్రమాణము గలపదార్థము లైనను జనింపవచ్చును.

అవతారిక:—అని ఈవిధముగ వచ్చు వై శేషికపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు. ఈమతము సత్పురుషులచే కొంచెమైనను పరిగ్రహింపఁబడకున్నను కొందఱు మందబుద్ధులకు దీనియందును విశ్వాసము కలుగుననుతలంపుచే నిచ్చట నిరాకరించుచున్నాఁడు. ఆరంభణాధికరణమున (౨. ౧. ౧౪. చూడుఁ.) నివి (వై శేషికాదిమతపూర్వపక్షములు) సంపూర్ణముగ నిరాకరింపఁబడును.

## ౧౪౬. ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః. ౨. ౧. ౧౨.

తాత్పర్యము:—ఇఁక నేతర్కంబును చేతనకారణవాదమును ఖండింపనేరదు. ప్రతితర్కంబునకును వేదవిరుద్ధ మగునేని నిలుకడ కలుగనేరదు. రూపాదివిహీన మగుటచే బ్రహ్మము ప్రతితర్కమునకును గోచరము కానేరదు. ప్రతితర్కమునకును వేదవిరోధము నిస్సంశయముగ వచ్చును. కార్యము కారణములకంటె భిన్నమా? యభిన్నమా? యుత్ప త్తికిఁ బూర్వమున నది కారణమున నున్నదా? లేదా? స్థితికాలమం దైనను రెంటికిని సామాన్యము (ఏకరూపము)కలదా? లేదా? అను మొదలగువిషయములు ఆరంభణాధికరణమున సవిమర్శముగ వివరింపఁబడును.

---

* వై శేషికులు పరమాణువులే ప్రపంచకారణ మనియు నవి యొండింటితోఁ గూడి ప్రాపంచికపదార్థముల నిర్మించుననియు,నూలు వస్త్రముగ మారునట్లు అవియు వాయ్వాదిరూపముల నొందు ననియుఁ జెప్పుదురు. ఉత్ప త్తికిఁ బూర్వమునఁ గార్యము కారణమున సూక్ష్మరూపముతో లే దందురు. వారిమతము వై శేషికమతము ఇదియే తార్కికమత మనఁబడును.

సాంఖ్యయోగస్మృతులయందు పూర్వపక్షశ్రుతినైనను అవలంబించి సిద్ధాంతము చేయఁబడియున్నది. మన్వాదిమహాపురుషులును కొంతభాగమైనను వానిని నంగీకరించియున్నారు. అవియు వేదమునకు సమీపగతములై సర్వసిద్ధాంతము నంగీకరింపకున్నను సత్కార్యవాదము నైనఁ జేయుచున్నవి. ఈవిధముగ నున్నయామతములే నిష్ఫలములైన నిఁక వేదవాక్యలేశము నైన నాదరింపని వైశేషికాదిమతము లేమియగును? కావున మహాపురుషాదర మించుకయైనను లేకపోవుటయే వీనికి ధ్వంసకారణము. కావున వీరియుక్తులచే సమన్వయమునకు విరోధము రాదు.

వారు (వైశేషికులు) * ఆరంభవాదమును చేయుదురు. పరమాణువు లొకటితో నొకటి కూడి పదార్థముల కలిగించునందురు. లోకమున ఒకగొప్పరాశిగ నైనఁబడినదూదియందు అనేకపరమాణువులు కలవనుట నిస్సంశయము కదా! దానిని నూలుగ మార్చిన మిగుల నల్పపరిమాణముగలదియే యగును. పర్వతశిఖరముపై నున్నగొప్పవృక్షము కూడ క్రిందనున్నవానికి గడ్డికపోగువలెఁ గానవచ్చును. ఇప్పుడు వారి నియమ మెందుపోయినది?

"ఆపరమాణువులు దూది రాశిగా నున్నప్పుడు వికాసభావముతో నుండును; నూలుగా మాఱినప్పుడు సంకోచభావము నొందును. వృక్షదృష్టాంతమున నది యల్పముగఁ గానవచ్చుటకు పురుషునియజ్ఞానమే కదా కారణము" అని చెప్పినను వారిసిద్ధాంతము నిలువదు. సంయోగమువలన కార్యమును గలిగించుచు నేకరూపములై నిత్యములై యున్నపదార్థములకు సంకోచవికాసభావ మెట్లు వచ్చును? "సంకోచవికాసభావ మనఁగా ఘన (తరుచు) విరళ (పలుచన) సంయోగభేదములు", అనినను సరిపడదు. సంయోగ మనఁగా నొకదానితో నొకటి చేరుటయే కావున నందు విరళత్వ మనునదియే యుండుటకు వీలు లేదు కదా! విరళత్వ మనిన నొకదానిచెంత నొకటి దూరదూరముగ నుండుటయే కావున నట్టిస్థితి సృష్టికిఁ బూర్వమునఁ గూడ నాపరమాణువులయం దున్నది. దానిని సంయోగ మనుట లేదు కదా! ఇఁక రెండవ

* ఆరంభమే ప్రపంచకారణ మని చెప్పువాద మారంభవాదము (ఆరంభము, పు. ౨౨. చూడు.) ఇది వైశేషికులవాదము.

పక్షమున పర్వతశిఖరాగ్రమున నున్నవృక్షమును గఱికిపోఁగువలెఁ గావిం చినది యజ్ఞాన మనుట నిస్సంశయమే. ఇప్పుడు పరమాణువులవలన కలిగినమహత్త్వ మెందుపోయెను. పురుషునిబుద్ధి జ్ఞానాజ్ఞానముల నాశ్ర యించి యెట్లు పోవుచుండునో సర్వపదార్థములు నట్లే పోవుచున్నవి. ఇట్లుండ నిఁక పరమాణువులను ప్రత్యేకకారణములుగ గ్రహింప నేటికి? అవియే కారణము లగునేని జ్ఞానాజ్ఞానములతో సంబంధము లేకయే తా మొసంగినపరిమాణమును నిలుపవలయును. "ఇది యెట్లు సంభవించును? జ్ఞానసంతుఁ డగువానికి తోఁచినదియే కదా ప్రామా ణికము" అనినను "సూక్ష్మపదార్థమునుండియే స్థూలము జనింపవల యును" అనునియమము మాత్రము నిలువదు. సర్వమునకును జ్ఞానమే ప్రధానము గావున త్రాటియందు భ్రాంతిచేఁ జూడఁబడుసర్పముకూడ త్రాటినుండి జనించినదియే యని చెప్పఁబడుచున్నది; ఇట్లే మహావృక్షము గఱికిపోఁచవలె తోఁచుచుండుటవలన "వృక్షమునుండి గఱికి జనించెను" అనియే చెప్పవలసియున్నది. ఇది సర్వవాదిసమ్మతము "ఇది చెట్టు అని తెలిసినపిదప నాగఱికి యుండదు కదా" అనిన కారణ మేది యైనను అల్పపరిమాణము కలదైనను అధికపరిమాణము కలదైనను దాని నెఱింగినతోడనే దానికంటె భిన్నముగ గార్య ముండదు. కావునఁ గార్యము అవిద్యాకల్పితము. సూక్ష్మపదార్థములే కారణములుగ నుండ వలయు ననుట నియమము కాదు.

---

## ౫. భోక్త్రాపత్త్యధికరణము.

సంగతి:—"పూర్వమునఁ బరబ్రహ్మవిషయమునందు తర్కము ప్రవర్తింప దని చెప్పియున్నారు. అనుమానప్రమాణ మొకవేళఁ బ్రవ ర్తింపకున్నను ప్రత్యక్షము ప్రవర్తింపవచ్చును; ఆప్రత్యక్షము నాధార ముగఁ గొనివచ్చుచుండుటచే ననుమానము కూడఁ బ్రవర్తింపవచ్చును. తర్కము తన కగోచర మగువిషయమునమాత్రమే నిలుకడ నొంద కుండవలయునేగాని తనకు గోచర మగువిషయమునందుఁగూడ నట్లుండ

వలసినపని లేదు. శ్రుతియుఁ దాఁజెప్పువిషయమునఁ బ్రమాణమే యైనను నిశ్చితతర్కముతో నావిషయమునకు బాధ కలిగినప్పుడు మంత్రార్థవాదములవలె నౌపచారికార్థమును చెప్పునది కావచ్చును. కావున సమన్వయమునకు తర్క మవశ్యముగ బాధకము కావచ్చును" అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది. పూర్వమున "తర్కము నిలుకడ గలది కాదు" అని చేయఁబడియున్న సిద్ధాంతమునకుఁ బ్రత్యుదాహరణముఁ జూపుచు "అగోచరవిషయమునందు అట్టినిలుకడ లేకున్నను ప్రత్యక్షాదులయందు కలదు" అని ఈయాక్షేపము వచ్చెను. కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గల సంబంధము ప్రత్యుదాహరణసంబంధము.

సందేహము:—ప్రపంచమున అనుభవించువాఁడు అనుభవింపఁబడునది యని పదార్థములు రెండువిధములై యున్నవి. ఈరెంటికిని పరమేశ్వరుఁ డొక్కఁడే ఉపాదానకారణ మయ్యెనేని విభాగము సంభవింపదు. ఇది ప్రత్యక్షవిరుద్ధము కదా! 'భోక్తృభోగ్యభిన్నం జగత్ న అద్వితీయోపాదానకం భిన్నత్వాత్ వ్యతిరేకేణ బ్రహ్మవత్' అనునది యనుమానవాక్యస్వరూపము అను మొదలగుతర్కములచే సమన్వయమునకు విరోధము కలదా ? లేదా ? యనుట సంశయస్వరూపము. ఈసంశయమే ఈయధికరణమునకు విషయము.

పూర్వపక్షము:—పరమేశ్వరు డొక్కఁడే జగత్కారణ మనుటకు వీలు లేదు. ఉపాదానకారణమునకును కార్యమునకును భేదము లేదనుట స్వభావసిద్ధము. ఈప్రపంచమునందును అనుభవించువాఁడు జీవుఁడనియు అనుభవింపఁబడునవి శబ్దాదులనియు భేదము ప్రత్యక్షముగ నున్నది. ఈరెంటికిని పరమేశ్వరుఁ డొక్కఁడే యుపాదానకారణ మగునేని రెండు నొక్కటియే కావలయును. వీఁడు భోక్త ఇది భోగ్యము అను విభాగమే లేకపోవలయును. ఇది ప్రత్యక్షవిరుద్ధము కదా! శ్రుతి యొక్కటి కలదని ఇట్టి ప్రత్యక్షసిద్ధవిషయమును గూడ బాధింపఁజూచుట యుక్తము కాదు. శ్రుతికి నౌపచారికార్థమును చెప్పినను ప్రామాణ్యభంగము కలుగదుకాని తర్కమునకు బాధ కలిగినఁ బ్రామాణ్యము సిద్ధింపదు ; ఇదియు నేవాదికిని సమ్మతము కాదు కదా !

అవతారిక:—అనుసీపూర్వపక్షమును సూత్రమునందే యను వాదము చేసి సూత్రకారుఁడు సామాన్యముగ ఖండింపుచున్నాఁడు. పరిణామవాదము నంగీకరించుచున్నాఁడు. మాయావి యగునీశ్వరుఁడు ప్రపంచరూపము నొందె ననునప్పుడు శ్రుతికిఁ గూడ పరిణామవాదము సమ్మతమే అయినను శుద్ధబ్రహ్మప్రపంచవిషయమును వర్ణించునప్పుడు వివర్తవాదము;మాత్రమే యాశ్రయింపఁబడుచున్నది. బాగుగ విమర్శించినఁ బరిణామవాదము నంగీకరించె నని చెప్పఁబడినసమయము నందును మాయకును ఈశ్వరునకును గలసంబంధము వాస్తవము కాక పోవుటచే మాయాభాగమునఁ బరిణామంబును ఈశ్వరభాగమున వివర్తంబు నంగీకరింపఁబడినది యనియే గ్రహింపవలసియున్నది. రజ్జుసర్పము మొదలగునవి రజ్జువివర్తములుగను రజ్జువిషయకాఽజ్ఞానపరిణామములుగను ఉన్నవి కదా! ఈవిషయము "తదధీనత్వా దర్థవత్. ౧.౪౩." అనుసూత్రమున సవిమర్శముగ వర్ణింపఁబడియున్నది. మఱియు నితరవాదులు పరిణామము లనిచెప్పువానినే శ్రుతి లేక వేదాంతులు వివర్త మని సామాన్యముగఁ జెప్పుచున్నారు. మట్టి కుండయగుటయు సువర్ణము భూషణము లగుటయు మొదలగునవి యితరవాదులకు బరిణామము లైనను వేదాంతులకు వివర్తములు. కావున ప్రస్తుతము పరిణామవాద మాశ్రయింపఁబడుచున్నది.

## ౧౪౭. భోక్త్రాపత్తే రవిభాగ శ్చే త్స్యా ల్లోకవత్. ౨. ౧. ౧౩.

తాత్పర్యము:—పైనఁ జేయఁబడిన పూర్వపక్షము సరియైనది కాదు. పరమేశ్వరుఁ డొక్కఁడే ప్రపంచపరిణామోపాదానకారణ మైనను భోక్తృభోగ్యవిభాగము లేకపో నక్కఱలేదు. లోకమున నొక పదార్థముయొక్క పరిణామముచే జనించినవానియందుకూడ పరస్పర భేదము గానవచ్చుచున్నది. మృత్తికయొక్క పరిణామముచే నేర్పడిన ఘటాదులయందు "ఈఘటము దీనికంటె వేరు" అనువ్యవహారము కానవచ్చుచున్నది. సర్వఘటములు నేకరూపములే యగుట లేదు. మఱియు సముద్రము తరంగరూపముగను నురుగుగను బుడగలుగను

పరిణమించుచున్నది. అట్లయినను ఆతరంగాదులు పరస్పరభిన్నములుగనే యున్నవికాని యొకటి మఱియొకదానిరూపమునుం జెందుట లేదు. ఇట్లే పరమేశ్వరుఁడును భోక్తృభోగ్యములకు నుపాదానకారణమైనను ఆ భోక్తృభోగ్యములు పరస్పరభిన్నములుగ నుండునేకాని యొకదాని రూపము నొకటి చెందదు.

ఇట్లుకాక వివర్తవాదము నాశ్రయించినచో బొత్తుగనే యీ దోషము రాదు. త్రాటినిఁ జూచి యొకఁడు సర్పముగను మఱియొక్కఁడు జలధారగను భ్రమించినచో నారెంటికిని రజ్జు వొక్కటియే * వివర్తోపాదానకారణమైనను వానికిమాత్రము నిర్వివాదముగఁ బరస్పరభేదము కలదుకదా !.

పూర్వపక్షము:—జీవుఁడుకూడ భోగ్యపదార్థములవలె పరమేశ్వరపరిణామభూతుఁ డగునేని యప్పుడు ఘటశరావాదులకువలె భోక్తృభోగ్యములకును భేద ముండవచ్చును "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" "ఆప్రపంచమును సృజించి పరమేశ్వరుఁడు దానియందు ప్రవేశించెను." అనుమొదలగుశ్రుతివాక్యముల నాశ్రయించి మీరు జీవబ్రహ్మములకు భేదము నించుకయైన నంగీకరింపరు. ఇప్పుడు ప్రపంచమునకు బ్రహ్మ ముపాదానకారణ మనిన జీవుఁడు కూడ నట్టివాఁడే యగుచున్నాఁడు. ఇట్లయిన భోగ్యములతో నాజీవుఁ డేల యభేదము నొందఁడు ? ఉపాదానకారణమునకును కార్యమునకును భేద ముండదనుట సర్వవాదిసమ్మతము కదా !

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. జీవపరమేశ్వరులభిన్నులనుట నిశ్చయమే కాని ఆజీవుఁడుమాత్రము పరమేశ్వరునివలె ప్రపంచోపాదానకారణము కానేరఁడు. సర్వవ్యాపకమై యేకరూపమై యున్నయాకాశమునకు ఘటాద్యుపాధులవలనఁ గలుగుభేదమువలె జీవబ్రహ్మములకును అవిద్యోపాధివలనఁ గల్పితభేదము కలదు. ఆభేదమువలనఁ బరమేశ్వరుఁడుమాత్రమే ప్రపంచోపాదాన మగునుకాని జీవుఁడు

---

* వివర్తోపాదానకారణ మనఁగా వివర్తమున కధిష్ఠానమై యుండుపదార్థము. అధిష్ఠానమనఁగా: మనుష్యులు దేనియందు అన్యధర్మము నారోపింతురో యది త్రాటియందు సర్పము నారోపించిన నప్పుడాత్రాడు అధిష్ఠానము (వివర్తము పు. ౭౭. చూడు).

 

కానేరఁడు. మహాకాశము స్వర్గాదులకు నక్షత్రమండలాదులకును ఆధార మగును కాని తదభిన్నమే యైనను ఘటాకాశ మట్టిది కానేరదు కదా! కావున జీవప్రపంచములకు నెట్లును ఐక్యము సంభవింప నేరదు. మీాగు చెప్పినయుక్తిచే సమన్వయమునకు భంగము రానేరదు.

---

## ౬. ఆరంభణాధికరణము.

సంగతి:— పూర్వాధికరణమున భేదమును పరమార్థముగ నంగీకరించి పరిణామపక్షముతో సామాన్యముగ సమాధానము చెప్పఁబడెను. వాస్తవస్థితిలో వేదాంతులకు భేద మనునదియే సమ్మతము కాదు. కావున భేదనిషేధపూర్వకముగ నీయధికరణమున పైపూర్వపక్షమునకే సమాధానము చెప్పఁబడును. ఇందు సిద్ధాంతసమ్మతమగు వివర్తవాద మాశ్రయింపఁబడును. కావున దీనికిని ఫలము పూర్వాధికరణముయొక్క ఫలమే. కావున నెట్లును సమానధర్మమునుకలిగి యుండుటయే దీనికి బూర్వాధికరణముతోఁ గలసంబంధము.

అవతారిక:— పూర్వాధికరణమునందు జూపఁబడిన పూర్వపక్షమునే యీ యధికరణమున వివర్తవాదము నాశ్రయించి మరల నిరాకరించుచున్నాఁడు.

## ౧౪౫. తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః.

## ౨. ౧. ౧౪.

తాత్పర్యము:— వాస్తవస్థితిలో ఆరంభణవాక్యము మొదలగు వేదవాక్యముల ననుసరించిచూచిన కార్యకారణములకు భేదము లేదని తేలుచున్నది. శ్రుతి "ఒక్కబ్రహ్మము నెఱింగిన సర్వప్రపంచము నెఱింగినట్లే యగును" అని యారంభించి యావిషయమున దృష్టాంతముఁ జెప్పవలసిరాగా "యథా సో మ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యం" అని చెప్పియున్నది. ఇదియే యారంభణవాక్యము. దీనియర్థ

మును విచారించిన మృద్వికారము లన్నియు మృణ్మాత్రము లే యనియు, కుండ మూఁకుడు అనుమొదలగునవి నామమాత్రము లేకాని మఱియే మియు కావనియు, అచ్చట నున్నది. మృత్తిక యొక్కటియే యనియు నాఘటాదులు నామమాత్రము లే యగుటచే నూఱక గానవచ్చు నంతియ కాని వాస్తవముగ మృద్భిన్నరూపముతో లేవనియు, ఇట్లగు టచేతనే నామరూపాత్మక మగునీప్రపంచముకూడ కారణ మగుబ్రహ్మ కంటె భిన్నముగ లేదనుట సిద్ధాంత మనియుఁ దేలుచున్నది. ఇట్లు సర్వ ప్రపంచమునకును స్వరూప మైయుండిననే కదా బ్రహ్మము నెఱింగిన సర్వము నెఱింగిన ట్లగుట! కావున నీయారంభణవాక్యమునందలి దృష్టాంతముఁ బట్టిచూచిన వాస్తవస్థితిలో బ్రహ్మప్రపంచములకు భేదమే లేదు. భోక్తృభోగ్యవిభాగము మొదలగునవియన్నియు నవిద్యాకల్పిత ములే కాని పారమార్థికములు కావు.

ఈవిషయమును కేవల మీయారంభణవాక్యమేకాక యెన్నియో శ్రుతులు కూడ బోధింపుచున్నవి:—

"బ్రహ్మైవేదం సర్వం" అని ప్రపంచబ్రహ్మములకు కొన్ని శ్రుతులు భేదాభావమునుఁ జెప్పుచున్నవి. మఱికొన్ని "నేహ నానాస్తి కించన" "ఇచ్చట భేద మనునదియే లేదు" అని భేదాభాన మును (భేదము భ్రాంతిమాత్ర మనుటను) బోధింపుచున్నవి. ఇంతయేల? ఆరంభణవాక్యానంతరముననే పరమేశ్వరునుండి అగ్నిజలపృథువులు జనించుటను బోధించి వానినుండి సర్వభౌతికములును జనించె నని చెప్పి, శ్రుతి ఆభౌతికములకుఁ గూడ తేజోబన్న వ్యతిరేకముగ నిలుకడ లేదనియుఁ జెప్పియున్నది. "ఘటము గృహము మొదలగు నుపాధు లలో నున్నయాకాశము ప్రత్యేకముగ గానవచ్చి యడంగుటచే మహా కాశమునకంటె భిన్నము కానట్లు, ఎండమావులనీరును రజ్జుసర్పంబును కారణభిన్నరూపములతో నున్నట్లు కానవచ్చినను అప్పుడే నశించును కావున వాస్తవస్థితిలో కారణములకంటె భిన్నము కానట్లు, యేయే పదార్థములు ఊరక తోఁచుచు నడంగుచు నుండునో అవి కారణమున కంటె భిన్నముగ నుండవు. "ఏపదార్థము దేనియునికితో సంబంధము లేక ప్రకాశింపదో అది దానికంటె భిన్నము కాదు." అనుయుక్తియు నాశ్రుతి ననుసరించుచున్నది. (ఈ విషయమునుఁ గూర్చి నాచే వివరింపఁ

బడిన బ్రహ్మగీత అ. ౫. శ్లో. ౧. ౩౦ చూచునది) ఈ కారణమువలన నెట్లును కార్యకారణములకు భేదము లేదు.

పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట సరికాదు. కార్యకారణములకు నెట్లును అభేదము సంభవింపదు. కార్యము కారణస్వరూపముతో నున్న దనుటయు సంభవింపదు. అట్లే యుండునేని "ఇది కారణము ఇది కార్యము" అనుభేదవ్యవహార మెటనుండి వచ్చును? అప్పుడు కార్యము కార్యమే కాకపోవలయును. మఱియు నాకార్య మెప్పుడును కారణ రూపముతోనే యుండునేని క్రొత్త యేమియు లేకపోవుటచే పురుషుఁడు దేనికై ప్రయత్నింపవలయును? "నేను ఘటమును చేయవలయును" అనుమొదలగు ప్రయత్నములుమాత్రము లోకమునఁ గానవచ్చుచున్నవి. కదా! "కార్యము ఉత్పత్తికిఁ బూర్వమునఁ గారణమున లీనమై యుండును. దానిని బయలుపరుచుటకై పురుషులు ప్రయత్నింతురు" అనినను సరిపడదు. ఆప్రకాశంబును గూడ సర్వకాలములయందును కారణాత్మకమై యుండియే తీరవలయును. అట్లు లేదనినఁ గార్యము కూడ లేదనియే తీరవలయును. కార్యముమాత్ర మట్లే యున్నదియనిన కార్య కారణములకు భేదము లేకున్నప్పుడు కారణముప్రకాశించుచున్నఁ గార్య మేల ప్రకాశింపదు? మఱియు నీకార్యము కొన్నిసమయముల యందు ప్రత్యక్షముగ గానవచ్చుచున్నది. మఱికొన్నిసమయముల యందు అట్లు కానవచ్చుట లేదు. కారణముమాత్రము ఎప్పటికిని స్వస్వరూపముతోఁ గానవచ్చుచునే యున్నది కదా! కార్యముకూడఁ దదభిన్నమే యగునేని య ట్లేలకానరాదు? "ఘటము కావలయు ననిన దానికిఁ బూర్వమున ననేకపదార్థములు మృత్తికనుండి జనింపవలసి యుండును. ఇదియే ఘటతిరోధానమునకుఁ (ఘటము కొంతకాలము వఱకుఁ గానరాకుండుటకుఁ) గారణము" అని యెడవేమొ యదియు సంభ వింపదు. ఘటమునకుఁ బూర్వము జనింపవలసినపదార్థములును ఆఘటం బును సర్వకాలములయందును మృత్తికయందు తదభిన్నరూపముతో నున్నవియే కదా! ఇందు ఒకటిమాత్రము కొంతకాలమువఱకు కానరా దనుట యెట్లు సంభవించును? అన్నియు నట్లే యనిన కార్యము లని త్యము లగును. కారణము నిత్యము. అప్పుడు వీనికి రెంటికి నైక్య మెట్లు కుదురును? కావున యెట్లుచూచినను కార్యము కారణమునకంటె

భిన్నమే! కారణరూపముతో నెప్పుడును లేనిదే "ఇట్లయిన నవి రెండును కార్యకారణములే కాకపోవలయునుకదా!" అనియెదవేమొ యట్లు కానక్కఱలేదు. "ఏపదార్థములు తమకూడికచే మఱియొక్క దాని నేర్పఱుచునో అవి కారణములు. ఆకూడికచే నేర్పడునది కార్యము" అని చెప్పుటవలన దోష మేమియు నుండదు. ఈ కూడికయే కార్యకారణములకుఁ గలపరస్పరసంబంధ మగును. కావున మాసిద్ధాంతము దోషయుక్తము.

సిద్ధాంతము:—కార్యకారణములు పరస్పరభిన్నము లని సాధించుటకు మిగుల ప్రయాసపడితివి. ఇప్పుడు నీవు మామతమునందు కల్పించినదోష మేది కలదు? మేము కార్యకారణములకు పరమార్థస్థితిలో భేదము కలదనికాని, యభేదము కలదనిగాని, చెప్పువారము కాము. భేదాభేదములు కలవని విరుద్ధధర్మముల నంగీకరించువారమును కాము. ఆరంభణాదివాక్యములబలమున "కార్యకారణములకుఁ గానఁబడు భేదము పారమార్థికము కాదు" అని మాత్రమే చెప్పితిమి గాని "కార్యకారణములు పరమార్థస్థితిలో నభిన్నములు" అని చెప్పలేదు. ఇట్లగుటచే మీవాద మంతయు మాకు ననుకూలమే కాని ప్రతికూలము కాదు. మేము శ్రుతియుక్తిబలమువలన భేదమును నిరాకరించితిమి. మీరును అభేదమును నిరాకరించితిరి. మాకుఁ గావలసిన దదియే! "కార్యకారణములకు భేదము గలదని కాని లేదనికాని నిరూపించుటకు వీలు లేకపోవుటచేఁ గార్యము శూన్యరూపము. అసత్యము. అన్నివాదముల యందును కారణము సత్యమే కావున నెప్పటికి నదియే సత్యము. కార్యమును నిర్వచనముఁ జేయుటకు వీలులేదు. కావున నది భ్రాంతిసిద్ధము; హేయము" అని నిరూపించుటయే మాయుద్దేశము. దీనిలోఁ గొంత భాగమువఱకు మీరును తోడ్పడినవారే.

"ఇది యెందైనను కలదా? నిర్వచనముఁ జేయుటకు వీలు లేనిపదార్థ మొక్కటియుండునా?" అనియెదవేమొ వినుము. ప్రపంచ బ్రహ్మవిషయ మట్లుండెు. సామాన్యము లగుకార్యకారణములను గూర్చియే కొంత విచారింతము. సువర్ణము భూషణము లగుచున్నది. అనఁగా సువర్ణమునుండి భూషణములు జనించుచున్నవి. ఇచ్చట భూషణములు ఆసువర్ణమునకంటె భిన్నములా? కావా? అని విచారింప

వలసివచ్చినప్పుడు భూషణములకు ప్రత్యేకసత్త కలదా ? లేదా ? అను విషయము విచారణీయమగును. అవి ప్రత్యేకసత్త (అనఁగా: కారణభిన్నములుగ స్వస్వరూపములతో నుండుట) కలవి యగు నేని యప్పుడు కారణములకంటె భిన్నము లగును ; అట్లు కావేని కారణమాత్రములే యగును. పరమార్థవిషయ మిది. కారణముమాత్ర మెప్పటికిని సత్య మనుట సర్వవాదిసమ్మతము.

ఇకఁ జెప్పుము:— ఈ కలిమిలేములు కార్యములకు స్వభావములా ? ధర్మములా ? లేక భిన్నపదార్థములా ? ఇట్లునుఁ గాక నవి కార్యమునందు బొత్తుగనే లేవా ? ఇందు మొదటిపక్షము నాశ్రయించితి వేని, సత్స్వభావము గలపదార్థ మెప్పటికిని యేవిధముగానైనను ఎచ్చటనైనను అసద్రూపము కాఁగూడదు ; అసత్స్వభావము కలదియు సద్రూపము కాకూడదు. రూపగుణము ఎప్పటికైనను ఎంధైనను ఏకారణముచేనైనను గంధగుణముగా మాఱునా ? విరుద్ధ మగుటచే మాఱదు. అట్లే కలిమిలేములును పరస్పరవిరుద్ధము లగుటచే నొకదాని స్వభావముఁగ జెందియున్నపదార్థము మఱియొకదానిఁ గైకొననేరదు ఇక రెండవపక్షము నాశ్రయించిన కలిమియే కార్యములకు ధర్మమగు నేని యవి యొకప్పటికిని నశింపఁగూడదు. లేమియే యట్టిది యగునేని పదార్థములే లేకపోవును. కావున నిక ధర్మి (ధర్మమునకు నాశ్రయభూతుఁడు) యెవ్వఁడు ? మూఁడవపక్షము నాశ్రయించిన ఆకలిమిలేములు రెండును కార్యమునకంటె భిన్నములే యగుటచే వానివలనఁ గార్యమునకు నుపకారముగాని యపకారముగాని లేదు. ఘటమునకు నేమిమైనను దానివలనఁ బటమునకు గలుగులాభనష్టము లేవియు లేదుకదా! ఇక నాల్గవపక్షము నాశ్రయించుటకే వీలు లేదు; లోకమునఁ గార్యమునందు కలిమియు లేమియుఁగూడ గానవచ్చుచునేయున్నవి కదా ! ఇట్లుకాదు మూఁడవపక్షమునే యాశ్రయించెదము. కలిమియను నది భిన్నపదార్థ మయ్యుఁ గార్యముల నాశ్రయించియుండును. లేమియు భిన్నమే యై యొకానొకప్పుడు ఆకలిమికి విరోధము నాచరించును" అనియెదవేమొ ఇది యెట్లు సంభవించును ? లేమియనునది బొత్తుగనే లేనిదియే. అట్టిదానినుండి కార్య మెట్లు కలుగును ? ఒకవేళఁ గలుగు ననిన నదియు లేమియే కావలసివచ్చును. కావున నేపక్షము నాశ్ర

యించినను భేదాభేదములలో నొక్కటియు నిలుకడ నొందనేరదు. ఇట్లగుటచేఁ గార్యస్వరూపము నెట్లు నిర్వచనముఁ జేయుటకు వీలుపడును? లేదనినఁ గలిమియుఁ గలదనిన లేమియు వ్యవహారములో నుండక పోవలసివచ్చును కదా! కావున నెట్లు చూచినను కారణముమాత్ర మెప్పటికిని సత్య మనియు కార్యము అనిర్వచనీయసంబంధముతో మాత్రమే కారణమున నున్నది యనియుఁ జెప్పితీరవలయును. ఈ కారణమువలన మామతమున దోష మింతయును లేదు.

పూర్వపక్షము:— ఇట్లు చెప్పుటయు సరికాదు. పరమేశ్వరుఁడు ఏకరూపముతోను నానారూపములతోను గూడ నున్నాఁ డనవలయును. పరిపూర్ణముగాఁ బరమేశ్వరప్రపంచములకు భేదము లేదనిన వైదిక లౌకికవ్యవహారము లన్నియు ధ్వంసము లగును. వేదాంతశాస్త్రము నందునుఁ బరమేశ్వరునిఁగూర్చి *శ్రవణమనననిదిధ్యాసనముల నాచరింప వలయు నని చెప్పఁబడియున్నది. ఈవిధియు నిరర్థకమే యగును. బ్రహ్మ భిన్న మగుపదార్థము లేకుండిన నాబ్రహ్మమునుఁగూర్చి శ్రవణాదుల నాచరించువా రెవ్వరు? ఈకారణమువలన నొక్కపరబ్రహ్మమే యేక రూపుఁడుగాను అనేకరూపుఁడుగాను కూడ నున్నాఁడనవలయును. లోక మున నిట్టిపదార్థము లనేకములు గలవు. అనేకము లగుకొమ్మలు కలసి "ఇది చెట్టు" అని యేకరూపముతో వ్యవహరింపఁబడుచున్నవి; ఆ కొమ్మలను ప్రత్యేకముగా గ్రహించినప్పుడు "ఇవి కొమ్మలు" అని యనేకములుగ వ్యవహరింపఁబడుచున్నవి. కార్యకారణభావమునుఁ బట్టి చూచినను సముద్ర మొక్కటియే యయ్యును స్వస్వరూపముతో నేకముగాను తరంగాదిరూపములతో ననేకములుగాను కూడ నున్నది; మృత్తికయు స్వస్వరూపముతో నేకమయ్యు ఘటాదిరూపములతో ననేకములుగ నున్నది. కావున నేకానేకరూపములు రెండును సత్యములే ఇట్లయిన మృత్తికాదిదృష్టాంతములు సరిపడును. వైదికలౌకిక వ్యవహారములును నిరపాయములై నిలుచును. బ్రహ్మజ్ఞానము ఏక స్వరూపవిజ్ఞానమేయనుటయు దానివలన నేమోక్షము కలుగు ననుటయు తదర్థమై శ్రవణాదుల నాచరింపవలయు ననుటయుఁగూడ సరిపడును.

---

* శ్రవణమనననిదిధ్యాసనము (పు. ౫౨౨. చూడు.) నిధిధ్యాసన మనఁగా: తదేకనిష్ఠతో ధ్యానించుట.

ఏకరూపత్వ మనుభాగము నాశ్రయించి మోక్షవ్యవహారంబును, అనేక రూపత్వ మనుభాగము నాశ్రయించి యితరవ్యవహారములును ప్రవర్తింపవచ్చును. ఇట్లుగాక వ్యవహారసిద్ధికై భేదము నంగీకరించిన, గార్య కారణములకు సంపూర్ణభేదము కలిగి శ్రుతికి విరోధము వచ్చును; అభేదమునే యంగీకరించిన వ్యవహారలోపము కలుగవలసివచ్చును. అవస్థాభేదము లైనను లేక భేదాభేదము లొక్కస్థలమున నుండుట సంభవింపదు కదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరికాదు ఏకపదార్థము భిన్నాభిన్నరూపములతో నుండుటకు వీలులేదు. భేదాభేదములకు విరోధము స్వభావసిద్ధము ఒకటి యున్నస్థలమున రెండవది యుండదు.

"ఇట్లుకాదు. కార్యకారణములవిషయములో భేదాభేదములు సప్రమాణములై యున్నవి. తక్కినచోటుల నివి విరుద్ధములే యైనను ఈ విషయమునందుమాత్రము కానేరవు" అనియెదవేమొ అదియు యుక్తముకాదు. అప్పుడు ఘటాదికార్యములు మృత్తికారూపముచే నభిన్నము లైనట్లు శరావాదిరూపములచేఁ గూడ నభిన్నములే కావలసివచ్చును. (అనఁగా ఘటాదు లన్నియు మృత్తికయే యైనట్లు శరావములే కూడ కావలయు ననుట) కార్యకారణములే యగుటచే శరావమృత్తికలకు నభేదము కలదు గదా! భేద మున్నను దానికిని యభేదమునకును విరోధముకూడ లేదుకదా!

"ఇట్లు లేకపోవుటచేతనే మృత్తికారూపముతో ఘటాదులకభేద మున్నను స్వస్వరూపముతో భేదము వచ్చినది" అనియెదవేమొ అది యెట్లువచ్చును? శరావము మృత్తికకంటె నభిన్నమై యుండ ఘటమునం దేల యనువర్తింపదు? అచ్చట మృత్తిక యనువర్తించుచునే యున్నదికదా! మఱియు నాశరావమునకు ఘటాదులయం దనువృత్తి లేదని సాధించిన మృత్తికకుఁ గూడ నది లేకపోవలయును. అప్పుడు "మృత్తికయే ఘటాదిరూపములతో నున్నది" యనుట సంభవింపదు. మృత్తికతోఁ గూడ శరావాదులు పరస్పర మనువర్తించుట లేదు కావున నవి మృత్తికకంటె భిన్నములే కావలసివచ్చును. పుష్పమాలికను కూర్చునప్పుడు దారము సర్వపుష్పముల ననువర్తించును. ఇంతమాత్ర

మునఁ దానికిని అందుఁ గూర్పఁబడినపుష్పములకును అభేదమును సాధించుటకు వీలుకలదా?

"ఇట్లు కాదు. దారము పుష్పములకుఁ గారణము కాదు. కావున దానితోఁ బుష్పములకు సంబంధము లేదు. ప్రస్తుతవిషయ మట్టిది కాదు. ఘటశరావాదులకు మృత్తికకంటె భిన్నముగు స్వరూపము లేదు. మృత్తిక యొక్క యునికియే ఘటముయొక్క యునికి. ఇట్లగుటచే మృత్తికాసత్త యనువర్తించుచున్నది; కావున ఘటాదులకుఁ దానితో భేదము లేదు" అనియెదవేమో ఇట్లయిన వ్యవహారమునకు మిగుల విరోధము వచ్చును. "ఇది ఘటము. ఇది కాదు" అనువివేక మెట్లును గలుగుటకు వీలు లేదు. అన్నియు మృత్తికయే కదా!

మఱియు దూరమునుండి మృత్తికను చూచినవానికి మీమతము ననుసరించి చూచిన "ఇది ఘటమా? లేక శరావమా" అనువిచారము కలుగుటకు వీలు లేదు. ఆఘటాదులును మృత్తికయు నొక్కటియే కదా! "భిన్నములుకూడ నగుచున్నవి కదా!" అనియెదవేమో అభిన్నములు కూడ నగుచునేయున్నవి; కావున మాసిద్ధాంతమే యేల నిలువకూడదు? మఱియు మృత్తికాస్వరూపము నెఱుంగుటచే ఘటాదిస్వరూపములను నిర్ణయించుటకు మృత్తికాఘటాదులయభేదమే కారణము. ఆయభేదము లేకుండిన నానిర్ణయమే లేకపోవలయును. ఘటమును చూచియును "ఇది ఘటము" అని తెలిసికొనలేకపోవలయును. కావున మాసిద్ధాంతమునే యవశ్యముగ నంగీకరింపవలయును. శ్రుతియు "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం" అని మృత్తికానిర్ణయమే ఘటాదిస్వరూపనిర్ణయకారణ మని చెప్పియున్నది కదా! కావున మృత్తికాఘటముల కభేదము కూడ కలదను మీసిద్ధాంతము లోకవ్యవహారవిరుద్ధ మగుటచే నిలువదు. ఏనుఁగును చూచినవాఁడు గుఱ్ఱము నెట్లుగ్రహింపలేఁడో (అనఁగా "ఇది గుఱ్ఱము" అనియెట్లు తలంపఁడో) అట్లే మృత్తికనుచూచి "ఇది ఘటము" అని పురుషుఁడు గ్రహింపఁడు కదా! మీమతము ననుసరించి చూచిన నట్లు గ్రహించుటకు వీలు లేదని సయుక్తికముగ నిరూపించియున్నాము. కావున నేనుఁగునకును గుఱ్ఱమునకును భేద మున్నట్లు కార్యకారణములకుఁ గూడ భేదమేయున్నది యని చెప్పి తీరవలయును; భేదాభేదము లున్నవి యనుటకు నెట్లును వీలు లేదు.

"ఇట్లయిన 'ఇది సువర్ణము ఈసువర్ణమే కుండలముగ నున్నది' అనువ్యవహారమెట్లు కలుగును?" అని యెదవేమొ అది సరియే కాని భేదాభేదములు రెండు నొక్కస్థలమున నెట్లుండును? అట్లుండుటకు వీలులేదని బహువిధముల యిదివరకే నిరూపింపఁబడియున్నది కదా! కావున నెట్లు చూచినను పరస్పరవిరుద్ధము లగుటచే భేదాభేదము లొక్కచోట నుండ వనుట నిస్సంశయము. ఇట్లగుటచే నీరెంటిలో నొకదానిని పారమార్థికముగను మఱియొకదానిని కల్పితముగను అంగీకరించి తీరవలయును.

అందును అభేదమే పారమార్థికము; భేదము కల్పితము. మఱియొకవిధముగ సిద్ధాంతముఁ జేయుటకు వీలు లేదు. భేదము నిలుకడ నొందుటకు అభేదముయొక్క సహాయము కావలయును కాని అభేదమునకు భేదసాహాయ్య మక్కఱలేదు. భేద మనునది రెండుపదార్థముల నాశ్రయించిగాని యుండదు. ఆరెండుపదార్థములును మొట్టమొదట దేనికది యేకమై యుండవలయును. అట్లు లేకుండిన నీభేదమునకే యాశ్రయ ముండదు. మఱియు నేకత్వ మనుదానికి భేదములేదు. కావున నేకత్వమే ప్రధానము. ఏకత్వ మనఁగా నభేదమే కావున నభేదమే ప్రధానము. భేదము దానియం దారోపింపఁబడినది. "లోకమునందును స్తంభము కుడ్యము కాదు" అను మొదలగువ్యవహారములందు అభేదనిషేధపూర్వకముగ భేదము వ్యవహరింపఁబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. విషయము లేకుండ నిషేధము సంభవింపదుకదా! కావున కారణ మేకరూపము సత్యము. దానియందు భేద మారోపింపఁబడెను. ఈభేదము నాశ్రయించియే సర్వవ్యవహారములును బ్రవర్తించుచున్నవి.

"మృత్తికే త్యేవ సత్యం" అను మొదలగు వాక్యములచే శ్రుతి కూడ నీవిషయమునే సిద్ధాంతముఁ జేయుచున్నది. దృష్టాంతమునందు ఘటాదికారణ మగుమృత్తిక యథార్థమనియు "వాచారంభణం వికారో నామధేయం" అనుటచే ఘటాదివికారము లన్నియుఁ గల్పనామాత్రములే యనియు నిరూపింపఁబడియుండుటచే దార్ష్టాంతికమునందునుఁ బరమేశ్వరుఁడే నిత్యుఁడనియుఁ బ్రపంచ మనిత్య మనియు నిరూపింపఁబడిన ట్లయినది. శ్రుతియందును "ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం" "ఈప్రపంచమున కంతయు నీపరమేశ్వరుఁడే వాస్తవస్వరూపము.

ఆయనయే సత్యరూపుఁడు” అని ప్రత్యక్షముగనే చెప్పఁబడియున్నది. కావున పరమేశ్వరునకు ఏకరూపమే కాని నానారూప మెప్పటికిని లేదు.

మఱియు మీరు భేదవ్యవహారమును పరమార్థమునుగా గ్రహించి దానికి సార్థకత్వమును కలిగించుటకై నూతనముగఁ బరమేశ్వరునకు నానాత్మత్వము గల్పించితిరి కదా! ఆభేదవ్యవహారమే మొట్టమొదట పరమార్థము కాదు. కారణస్వరూపమును వివరించిన పిదప “స ఆత్మా తత్త్వమసి” అని శ్రుతి జీవపరమేశ్వరులకు నభేదమును చెప్పుచున్నది.

ఈవాక్యమునందు అవస్థాభేదములను చెప్పుగుఱుతు లేవియుఁ గానవచ్చుట లేదు; కావున నిది స్వభావపర మనియే నిర్ణయింపఁబడ వలసియున్నది. కావున నీజీవబ్రహ్మైక్యమును కర్మాదులచే సాధింప నక్కఱలేదు. “ఇది పాము కాదు” అని చెప్పినంతమాత్రముననే రజ్జుస్వరూపజ్ఞానము కలిగినట్లు రజ్జువు రజ్జువే యై నిలచినట్లు “నీవు జీవుఁడవు కావు” అని శ్రుతి యుపదేశింపఁగనే బ్రహ్మస్వరూపము కలుగును. అప్పుడు అజ్ఞానముచే జీవునియం దారోపింపఁబడినవ్యవహార మంతయు నడంగిపోవును. ఇట్లు మిథ్యాభూతమై ఈవ్యవహారము నిలుకడనే చెందకున్నచో దీనికై పరమేశ్వరునియందు నిరర్థకముగ భేదమును కల్పించుట యేల? “యత్ర తస్య సర్వ మాత్మై వాభూత్తత్కేన కం పశ్యేత్” అను మొదలగువాక్యములచే శ్రుతియు వ్యవహారమును కల్పితమాత్రముగఁ జెప్పుచున్నది. మఱియు చోరదృష్టాంతముచే (అనఁగా చౌర్యము చేయనివానిని చోరునిఁగా నేరము మోపి న్యాయాధికారియెదుర నిలువఁ బెట్టినప్పుడు వాఁడు తననిర్దోషిత్వమును స్థాపించుకొనుటకై యేప్రమాణము నాచరించినను హాని కలుగదు; దోషియగు వానికి హాని కలుగును. వాఁడు అసత్యము నాశ్రయించినవాఁడు కదా! ఇట్లే సత్య మగుబ్రహ్మము నాశ్రయించినవానికి సంసారదుఃఖములు బాధకములు కానేరవు; అట్లు కానివానికి నవి బాధకము లగును అనుదృష్టాంతముచే) గూడ శ్రుతిభేదవ్యవహారమును అసత్యమునుగా నిరూపించుచున్నది. భేదముకూడ వాస్తవమే యగునేని ఇట్లు చెప్పుటకు నవకాశ మెక్కడిది? యథార్థజ్ఞానము కలవానిని జ్ఞానశూన్యుఁ డనుట ఎన్నడైనఁ గలదా?

మఱియు మీపక్షము నాశ్రయించిన మోక్షము జ్ఞానమువలన కలుగు ననుట సంభవింపదు; ఏలయనిన :—జ్ఞానము పరమార్థవస్తువును నశింపఁజేయ నేరదు. అజ్ఞానముచేఁ గల్పితమై యున్నదానినిమాత్రమే యథార్థస్వరూపబోధనముచే నశింపఁజేయును. ముక్తియు భేదము కాదనుట నిర్వివాదాంశము. దానికి కైవల్యమని నామధేయమే కలదు కదా! కావున నాజ్ఞాన మీభేదమునే తొలగించు ననవలయును. ఈకారణమువలన భేద మసత్యమే. "మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను మొదలగు వాక్యములచే శ్రుతి భేదమును ప్రత్యక్షముగఁ గూడ నొందించుచున్నది.

"ఇట్లయిన భేద మనునది లేకపోయిన ప్రత్యక్షాదు లన్నియును విధినిషేధశాస్త్రములును తుదకు వేదాంతంబును కూడ నప్రమాణములు కావలసివచ్చును గురువు శిష్యుఁడు మొదలగుభేదములతో వేదాంతశాస్త్రములకుఁ గూడ సంబంధము కలదు కదా!" అనియెదవేమొ వినుము. నీవు చెప్పినది యొకదోషము కాదు. ఈప్రత్యక్షాదులు వేదముచేతను యుక్తులచేతను బాధింపఁబడు ననుట యిదివరకే బహువిధముల నిరూపింపఁబడియున్నది; భేదము మిథ్యయే యని నిర్ణయింపబడియున్నది. ఇట్లున్ననూ వ్యావహారికవిషయములును అవిరోధముగ బోధించునవి యగుటచేఁ బ్రత్యక్షాదులు ప్రమాణము లని చెప్పఁబడుచున్నవి. విధినిషేధశాస్త్రములు తుదకు వేదాంతముకూడ నిట్టివే! వీనిచే బోధింపఁబడువిషయము లన్నియుఁ బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగునంతవరకు సత్యములుగనే యుండవచ్చును. కలయందు గానవచ్చుపదార్థములు మెలఁకువ వచ్చునంతవరకు ప్రతివానికిని ప్రత్యక్షసిద్ధములవలెనే యున్నవి కదా! ఎవ్వఁడైనను కలఁ గాంచునప్పుడు "ఇది యసత్యము" అని నిశ్చయించువాఁడు కలఁడా? ఒకానొకఁడు జ్ఞానవంతుఁ డున్ననూ పామరు లెవ్వరు నట్లుండరు కదా! ఇట్లే అజ్ఞానులును చిత్తపరిపాకవశమున బ్రహ్మజ్ఞానము కలుగునంతవరకు నీసర్వపదార్థములను సత్యములనుగా భావించుచుందురు; దేహాదులను ఆత్మగాను భార్యాపుత్రాదులను ఆత్మసంబంధులుగాను తలంచుచుందురు. పరమేశ్వరుఁడే తమయథార్థస్వరూప మని గ్రహింపలేక ప్రమాణములు వానిచే నిర్ణయింపఁదగిన విషయములు ఫలములు అను మొదలగు భేదముల నభిమానించు

చుందురు. కావునఁ బరమేశ్వరునకు నీవ్యవహారసిద్ధికై నానారూపత్వము గలుగవలసినపని లేదు. జ్ఞానము కలుగుటకు ముందు ఇవి యదార్థము లుగనే తోచవచ్చును; సర్వశాస్త్రములకును అప్పుడు సార్థక్యము కలుగవచ్చును. జ్ఞానోదయ మైనపిదప నన్నియు మిథ్యాభూతములు కూడఁ గావచ్చును. అప్పటికి శాస్త్రములు నిరర్థకములు కావలసివచ్చి నను సమ్మతమే. భేదము నాశ్రయింపక నేశాస్త్రము కాని ప్రవర్తింపదు; కావున నాభేద మసత్యమైనచోఁ దానును అసత్యమే యగు ననుటలో విరోధము లేదు. పరమేశ్వరునకు శాస్త్రములతోఁ గావలసినపని యేదియు వాస్తవస్థితిలో లేదుకదా!

"ఇట్లయిన బ్రహ్మభిన్న మగుటచే వేదాంతశాస్త్రముకూడ నస త్యమే కావలయును. అప్పుడు దానినుండి సత్యమగు బ్రహ్మజ్ఞానము జనిం చుట యెట్లు? రజ్జుసర్పము కఱచి మృతి నొందినవాఁ డెవ్వఁడు" అని యెదవేమొ ఇది యొకదోషము కాదు. సత్యపదార్థమునకు నుత్పత్తియే సంభవింపదు. ఏది యుత్పత్తి యగునో అదియంతయు నిర్వివాదముగ నశించును; కావున నుత్పత్తివిషయమున నియమ మేదియు లేదు. ఏది యైనను దేనినుండియైనను జనింపవచ్చును. అట్టిదృష్టాంతములు లోక మున ననేకములు కలవు. సర్పము వాస్తవముగ కఱువకున్నను కఱచి నది యని దృఢముగ భ్రాంతి కలిగినచో దీపాదులు వికారముగఁ గాన వచ్చుటయు వేపయాకు మొదలగునవి మధురములుగ నుండుటయు తుదకు మృతి నొందుటయుఁ గూడ కానవచ్చుచున్నది. స్వప్నమునం దును 'సర్పము కఱచుట జలమునందు స్నానాదుల నాచరించుట' మొద లగునవి కానవచ్చుచున్నవి. "ఆకార్యములు కూడ నసత్యములే కదా!" యనియెదవేమొ అట్లయినను వానివలన సత్యఫలము కలుగుచున్నది. స్వప్నశాస్త్రవేత్తలు కొన్నిస్వప్నములవలన శుభఫలములును మరికొన్ని టివలన నశుభఫలములుఁ గలుగునని చెప్పుచున్నారు. శ్రుతియు నిట్లే చెప్పుచున్నది. "యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృ ద్ధిం తత్ర జానీయాత్ పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతిస ఏనం హంతి" "ఏదియైన నొకకార్యమును పూనియున్నప్పుడు కలలో స్త్రీ కానవచ్చె నేని యాకార్యము చక్కఁగా ఫలించును. కలయందు నల్లనై నల్లని దంతములుగలిగి యున్నపురుషుని జూచెనేని కొలఁదికాలములో చూచిన

వాఁడు మరణమునొందును" అనుమొదలగువాక్యము లనేకములు స్వప్నవిషయమున వేదమునందుఁ గానవచ్చుచున్నవి. స్వప్నమునందు గానవచ్చుపదార్థ మసత్యమే యైనను తద్విషయక మగుజ్ఞాన మసత్యము కాదు కదా! దీనిచే దేహాత్మవాదము ఖండింపఁబడెను. జాగ్రదవస్థ యందున్నయాత్మయే స్వప్నావస్థయందున్నాఁడు; కాని దేహము లేదు కదా! మఱియు రేఖలు ఏదియో యొకసన్నివేశముతోఁ వ్రాయఁబడి యొక్కొక్కవర్ణమునకు గుఱుతులుగ నేర్పరుపఁబడియున్నవి కదా! ఇట్లున్నను వానివలన యథార్థవర్ణజ్ఞానము కలుగుచున్నది. వాస్తవస్థితిలో నారేఖలు సత్యములు కావుకదా! అవి వర్ణములు కావుకదా! రేఖా స్వరూపము సత్యమే యైనను దానినియమము సత్యము కానేరదు. ఆంధ్రభాషయందున్నకకారమునకును ద్రావిడభాషయందున్నకకార మునకును సంబంధము లేదు కదా! కావున నసత్యమగు రేఖాసన్నివేశ మునుండి (అనఁగా: అనియత మగు రేఖాసన్నివేశమునుండి) నియత మగువర్ణజ్ఞానము కలుగుచున్నది.

కావున సత్యాసత్యముల యుత్పత్తినిఁ గూర్చి నియమ మేదియు లేదు. సత్యము పుట్ట దనియు నిరూపించియేయున్నాము. ఈకారణము వలన నొకపక్షమునఁ జూచిన బ్రహ్మసాక్షాత్కారము ఫలరూప మగు టచే వేదాంతవాక్యము లసత్యము లైనను వానినుండి జనింపవచ్చును; మఱియొకపక్షమున వేదాంతవాక్యములతోఁబాటు పరబ్రహ్మజ్ఞానము కూడ నసత్యమే యైననూ అజ్ఞానమునకు అవిద్యానివృత్తియే ఫలము; కావున నది కలుగఁగానే స్వస్వరూప మగుబ్రహ్మమే యై స్వయముగ నిలుచుటకు నెట్టిహానియు లేదు. వాస్తవస్థితిలో బ్రహ్మమునకు నవి ద్యాసంబంధ ముండుటయుఁ గొంతకాలమునకు నది నశించుటయు నను నదియే లేదు; కావున నసత్యమగుబ్రహ్మజ్ఞానమునుండి యసత్య మగునవి ద్యానివృత్తి కలుగు ననువిషయమున మాయాక్షేపముకూడ నేమియు లేదు కదా! బ్రహ్మము దానిని తెలిసికొనువాఁడు తెలిసికొనుట యను భేద ముండిననేకాని బ్రహ్మజ్ఞానము కలుగదు కావున నదియు భేదము తోఁబాటు అసత్యమే యగు ననుటలో సంశయము లేదు. బ్రహ్మజ్ఞాన మనునదియే యుండుటకు వీలులేదు. అనువిషయమునుగూర్చి నాచే

వివరింపఁబడిన (బ్రహ్మగీత అ. ౪ శ్లో. ౧౬-౩౨.) కావున నెట్లు చూచి నను భేదము నంగీకరింపవలసినపని లేదు.

మఱియు నీ వేదాంతము కట్టకడపటి ప్రమాణము దీనియందు నిరూపింపఁబడని యాత్మైకత్వమునకు మీఁద *నాకాంక్ష యేదియు లేదు లోకమున "యజేత యజ్ఞముఁ జేయవలయును" అనునప్పుడు 'ఏసమయమున నేసాధనములచే నెట్లు దానిని చేయువలయును.' అని యాకాంక్ష కలుగుచున్నది యనుట ప్రత్యక్షము. ఈపరమేశ్వరునివిషయమున మాత్ర మట్లు కలుగుటకు వీలులేదు. 'తత్త్వ మసి అహం బ్రహ్మాస్మి' అనిన పిదప నిఁక దేనిఁగూర్చి ప్రశ్నింపవలసియుండును? ఈజీవబ్రహ్మైక్యము స్వభావ సిద్ధముగాని కర్మసాధ్యము కాదని యిదివరకే నిరూపించియున్నాము. కావున నిచ్చట ప్రశ్నించుటకు విషయమే లేదు. 'ఇట్లయిన నీయేకత్వ జ్ఞానము కలుగుటయే సంభవింపదు.' అనియెదవేమొ యట్లు చెప్పుటకు వీలులేదు. "అభయం వై జనక! ప్రాప్తోఽసి" "జనకమహారాజా! నీవు ముక్తినొందితివి." అను మొదలగువాక్యములు ఆత్మవిజ్ఞానము కలిగినవారలనుఁ గూర్చి చెప్పుచున్నవి. "ఇట్లు తలంచుట (అనఁగా: నేను ఏకరూపుని తెలిసికొంటి నని తలంచుట) భ్రాంతికావచ్చును. కాకున్ననూ ఆజ్ఞానమువలనఁ బ్రయోజన ముండదు" అనియెదవేమొ అది యుక్తము కాదు. జ్ఞానమునకు అనాద్యజ్ఞాననివృత్తియే ఫలము; ఫలవంత మగుటచే నది భ్రాంతియుఁ గా నేరదు. మఱియు బ్రహ్మజ్ఞానము కలుగునంతవరకు వ్యవహార మంతయును సత్యముగనే యుండవచ్చునని యిదివరకే నిరూపించియున్నాము; కావున భేదము లేనిది తెలిసికొను వాఁడు తెలిసికొనఁబడునది శ్రవణమననాదివిధులును ఎట్లు సంభవించును?" అను నాక్షేపమునకు నవకాశము లేదు. కావున భేదవ్యవహార మాత్రసిద్ధికై పరమేశ్వరునియందు నానారూపత్వమును కల్పింప నక్కఱలేదు ఆత్మైకత్వము కట్టకడపటిప్రమాణముచే నిరూపింపఁబడెను; భేదము మొట్టమొదటిప్రమాణములచే నిరూపింపఁబడెను. ఇట్లగుటచే భేదనిరూపణము పూర్వపక్షము; ఏకత్వనిరూపణము సిద్ధాంతము. దానిని బాధించు నితరజ్ఞానము లెవ్వియు లేవుకదా! కావున ఆత్మజ్ఞానపర్యంతము కల్పితభేదముచే సర్వవ్యవహారములు ప్రవర్తింపవచ్చును.

---

* ఆకాంక్ష (పు. ౪౫౧ చూడు.)

జ్ఞానోదయ మైనపిదప నంతయును నశింపను వచ్చును. ఇంతమాత్రము నకు ఏకరూపుఁడగు పరమేశ్వరునియందు భేదమును కల్పింప నక్కఱ లేదు. "ఉపనిషత్తులయందుఁగూడ భేదాభేద శ్రుతులు సమానముగనే యున్నవి. ఇట్లుండ నభేదశ్రుతులను సిద్ధాంతముగను భేదశ్రుతులను పూర్వ పక్షములుగను చెప్పుటయేల? రెంటిని సమానముగనే గ్రహింపరాదా" అనియెదవేమొ యది విరుద్ధమగును. భేదాభేదము లొక్కచోటనుండవు. మఱియు భేదమునే ప్రధానముగ గైకొందమన్నను సరిపడదు. అప్పుడు అభేదశ్రుతులకు ప్రయోజనమే యుండదు. ఆయభేదశ్రుతు లను ప్రధానముగఁ గైకొనిన నప్పుడు లోకసిద్ధభేదానువాదముచే భేద శ్రుతులకుఁ గూడ బ్రయోజన ముండును. ఉపదేశించునప్పుడు ఆరంభ మున శిష్యునిబుద్ధి నవలంబించియే కదా! గురువు బోధింపవలయును. కావున నెట్లును అభేదమే సిద్ధాంతము; భేదమునకై పరమేశ్వరునియందు అనేకరూపత్వమును కల్పించుట యయుక్తము

పూర్వపక్షము:—ఇట్లు కాదు. మేము భేదవ్యవహారసిద్ధికై మాత్రమే పరమేశ్వరునియందు అనేకత్వమును కల్పించితిమేని మీరన్న దోషము లన్నియు వచ్చుననుట సత్యమే; మేము చెప్పునది యది కాదు. శ్రుతియందు బ్రహ్మకారణత్వమును జెప్పునప్పుడు మృత్తిక యినుము మొదలగునవి దృష్టాంతములుగఁ జెప్పఁబడియున్నవి. అవి పరిణమించు స్వభావముకలవి. ఇట్లగుటచే పరమేశ్వరుఁడుకూడ పరిణమించుస్వభావము కలవాఁడే కావలయును. దృష్టాంత దార్ష్టాంతికములు సమానధర్మములు కలవిగనే యై యుండవలయును కదా! ఇట్లగుటచే పరమేశ్వరునకు ననే కరూపములుఁ గూడ కలవనుట శ్రుతికిఁగూడ సమ్మత మనియే తోచుచు న్నది. ఏకరూపముకూడ నాయన కుండవచ్చును. పరిణామికారణము లిట్టివే కదా! మృత్తిక స్వస్వరూపముతో నేకముగను ఘటాదిస్వరూప ములతో ననేకములుగను కూడ నున్నది కదా! బాణము మొదలగు నవి పోవుచు వచ్చుచు కూడ నున్నవి కదా! కావున పరమేశ్వరునకు నానారూపము కూడ కలదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పకూడదు. *దృష్టాంతదార్ష్టాంతికము లకు అన్నివిషయములయందును పోలిక యుండవలసినపని లేదని యిది

---

*దృష్టాంతదార్ష్టాంతికములు పు. ౨౨౦-౨౨౧ చూడు.)

వఱకే నిరూపించియున్నాము. భేదాభేదము లొక్కస్థలమున నుండవనియు
నిర్ణయించియున్నాము. ఇట్లగుటచే మీరు తలంచినట్లు పరమేశ్వరుఁడు
పరిణామి యని శ్రుతికి నభిప్రాయ ముండదు. “అవికారీ వా అరేఽయ
మాత్మా అస్థూల మనణు అజరోఽమరో” “ఓమైత్రేయీ!
ఆత్మకు వికారములు లేవు. ఆయన స్థూలుఁడు కాఁడు; సూక్ష్ముఁడు కాఁడు.
ఆయన జరామరణములు లేనివాఁడు” అను మొదలగువాక్యములచే
శ్రుతి ‘పరమేశ్వరుఁడు నిర్వికారుఁడు’ అనువిషయమును స్పష్టముఁ జేయు
చున్నది. ఇట్టివాఁడు పరిణమించుటకు నవకాశ మెట్లుకలుగును? పరిణ
మించుట యనఁగా వికారము నొందుటయే కదా! శ్రుతికి విరోధము
లేకుండ ఒక్కబ్రహ్మమునకే పరిణామంబును తదభావంబునుఁ గూడ కల
దనుటయు సంభవింపదు. శ్రుతిచే స్వయముగనే ఆయనకు సర్వవికార
ములును లేవని చెప్పఁబడియున్నది. ఇట్లుండఁ బరిణామము నెట్లంగీకరింప
గలము? అది శ్రుతికి విరుద్ధమనుట నిస్సంశయమే కదా! బాణాదు లన్ననో
అవి పరిణమించుస్వభావముగలవి కావునఁ దమపరిణామముచేతనే రాక
పోకల జరుపుచున్నవి. కావున నెట్లును నిర్వికారునియందు ఏకస్వరూపు
నియందు విరుద్ధధర్మము” నారోపించుట తగనిపని. “మృత్తికేత్యేవ
సత్యం” అను మొదలగువాక్యములును కారణమమాత్రమే సత్య
మనియు కార్యము లసత్యము లనియుఁ జెప్పుచున్నవి. కారణము పరిణా
మియే యగునేని ఇట్లు కాఁగూడదు గదా! వికారములు కలుగుటచేఁ
గారణమైన నసత్యము కావలయును; కారణము సత్యమే యని సాధిం
చిన కార్యముకూడ నట్టిదే కావలయును. ఈరెండును సంభవింపదు
కదా! మఱియు కూటస్థుఁ డనఁగా నిర్వికారుఁడు; నిత్యుఁ డనఁగా సర్వ
కాలములయందు స్వాభావికరూపముతో నుండువాఁడు. ఆపరమేశ్వరుఁడు
ఇట్టివాఁడైన నాయనకు నాస్వభావమునుండి యొకప్పుడైనను భ్రంశము
కలుగుట సంభవించునా? ఏకరూపస్థితికి దద్భ్రంశముతో విరోధము లే
దని సాధించుటకు నెట్లయినను వీలు కలదా? కావున నెట్లును బరమేశ్వ
రునకు నానారూపత్వము లేదు. మఱియుఁ “బరిణామముగాని తదభావము
కాని ధర్మమునకుమాత్రమే వచ్చును. ధర్మముకలవాఁడు ఎప్పటికిని
స్వస్వరూపముతోనే యుండవచ్చును” అనియెదవేమో యదియు సంభ
వింపదు. ధర్మధర్ములకు సంపూర్ణముగ భేదమే యుండునేని స్తంభకుడ్యా

దులకువలె సంబంధమే లేకపోవలయును. అప్పుడు "పరమేశ్వరుఁడు పరిణమించెను" అనుటకే వీలుండదు. ఇఁక వారికి నభేదమే యంగీకరించిన నప్పుడు బ్రహ్మము కూటస్థుఁ డగుటచేఁ బరిణామమే సంభవింపదు. భేదాభేదపక్షము యుక్తులకు నిలుచునది కాదని యిదివరకే నిర్ణయించి యున్నాము. కావున నెట్లును బరమేశ్వరునకు పరిణామము లేదు.

"ఇట్లుకాదు. మీరు భేదాభేదపక్షమును నిరాకరించినను అభేదమును పారమార్థికముగాను భేదమును అనిర్వచనీయమునుగాను అంగీకరించియే యున్నారు. పరమేశ్వరధర్మములకుఁగూడ నిట్లే యనిర్వచనీయ భేద ముండవచ్చును; ధర్మమునకు గలుగుపరిణామాదులతో బ్రహ్మమునకు సంబంధము లేకపోవచ్చును. ఆయన కూటస్థుఁడే యై యుండవచ్చును" అనియెదవేమొ సరియే యిట్లయిన "బ్రహ్మమునకు పరిణామము కలదు" అనినను "లేదు" అనినను ఒక్కటియే యగును. శ్రుతియుఁ బరిణామిత్వమునుగూర్చి చెప్పినను అది యథార్థకథనము కాదనియు కేవలము బ్రహ్మజ్ఞానోపాయమునకై మాత్రమే యట్లు చెప్పెననియు నిర్ణయింపవలసివచ్చును. ఉపనిషద్వాక్యోపదేశమునకు బ్రహ్మజ్ఞాన మొక్కటియే ఫలమని స్పష్టముగఁ దెలియవచ్చుచున్నదికదా! "ఫలవత్సన్నిధానఫలం తదంగం" "ఫలవంతము లగువిషయములకు సమీపమున నున్నఫలశూన్యవిషయములు ఫలవంతము లగువానికి నవయవములవంటివే" అనున్యాయము ననుసరించి బ్రహ్మజ్ఞానవిధికి సమీపమున నుండుటచే నివియన్నియు (సృష్టినిఁ జెప్పుట మొదలగునవి యన్నియు) తదంగములే యని సిద్ధాంతముఁ జేయువలసియున్నది. విచారించిన నీపరిణామకథనమునకు నన్యప్రయోజన మేదియుఁ గానరాదు. "బ్రహ్మము ప్రపంచరూపముసఁ బరిణమించువాఁడని తెలిసికొనుటయే ఫలము" అనియెదవేమొ యదియు సంభవింపదు. మోక్షము బ్రహ్మరూపము కావున నిర్వికారము; సర్వకాలములయందు నేకరూపముతో నుండునది. అది తద్విరుద్ధ మగుపరిణామజ్ఞానముచే నెట్లు కలుగును? కలుగకున్న నాజ్ఞానమువలన బ్రయోజన మేమి? *పురుషార్థప్రాప్తియే కదా, సర్వమునకును

* జన్మించినందుకు సాధింపవలసినవిషయము పురుషార్థ మనఁబడును. అది ధర్మార్థకామమోక్షము లని నాలుగువిధములు. అందు ధర్మమోక్షములు ముఖ్యములు. అర్థకామములు ఆనుషంగికములు. (వమవ నాగంతుకముగ సంభవించునవి.

ఫలము. కావున బ్రమాణవిరుద్ధ మగుటచేఁ బరిణామజ్ఞానమువలన మోక్షము కలుగదు. పరమేశ్వరునకును అనేకరూపత్వము సంభవింపదు. ఇట్లగుటచేఁ బ్రపంచబ్రహ్మములకును నభేదము సంభవించినది. ప్రపంచ మనిర్వచనీయము; అసత్యము. పరమేశ్వరుఁడు కూటస్థుఁడు; నిత్యుఁడు. ఆయనయందు అజ్ఞానముచే నీభేద మారోపింపఁబడినది.

పూర్వపక్షము:—ఇట్లయిన మీసిద్ధాంతమునందే పరస్పరవిరోధము వచ్చును. "జన్మాద్యస్య యతః ౧-౧-౨" అనునధికరణమునఁ బరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియు సర్వశక్తుఁడనియు సర్వప్రపంచమును సృజించుననియు సర్వమునకును నియామకుఁడై పరిపాలించుననియు నంతమున సంహరించుననియుఁ జెప్పఁబడియున్నది. ఈ యధికరణమున నాయన నిర్వికారుఁడనియు నద్వితీయుఁడనియు జెప్పఁబడియున్నది. ఈ రెంటికిని విరోధముకదా! అద్వితీయుండగువాఁడు తనకంటె భిన్న మగు ప్రపంచము నెట్లు కల్పింపఁగలఁడు? ఎట్లుదానిని నియమింపఁగలఁడు?

సిద్ధాంతము:—ఇది యొకవిరోధము కాదు. ప్రస్తుతాధికరణము పారమార్థికవిషయమునుఁ గూర్చి చెప్పును. పరమార్థస్థితిలో పరమేశ్వరుఁడు నిర్వికారుఁడే అద్వితీయుఁడే ఆయనయందు అనిర్వచనీయములై ప్రపంచసూక్ష్మావస్థారూపము లై మాయావిద్యాదిశబ్దవాచ్యము లై నామరూపము లున్నవి. వాని నాశ్రయించుటచే ఘటాదుల నాశ్రయించినయాకాశమునలె నాపరమేశ్వరుఁడే ఈశ్వరుఁడగుచున్నాఁడు. ఆతఁడు తనకంటె నభిన్నులై యున్నజీవుల ఘటగతజలములయందు ప్రతిబింబించిన యాకాశమునుబోలు వారి వ్యవహారములయందు నియమించును. ఇట్లగుటచే నవిద్యోపాధివలననే ఆపరమేశ్వరునకు నీశ్వరత్వము సర్వజ్ఞత్వము సృష్టికర్తృత్వము పరిపాలకత్వము సంహారకత్వము మొదలగు ధర్మములు కలుగును. "ఏకం బీజం బహుధా యః కరోతి సర్వాణి రూపాణి విచింత్యధీరః నామాని కృత్వా ఽభి వదన్యదాస్తే" "ఎవ్వఁడు అతిసూక్ష్మరూపమున నున్నప్రపంచబీజమును నానాముఖముల విస్తరింపఁ జేయునో విద్వాంసుఁడై (అనఁగా: సర్వజ్ఞుఁడై) ఎవ్వఁడు సర్వరూపముల

---

వానికై ప్రయత్నింపకున్నను ఫలరూపములతో వచ్చునవి.) ప్రవృత్తిమార్గముచే ధర్మంబును నివృత్తిచే మోక్షంబును కలుగుచున్నవి. అర్థకామములు ధర్మఫలములే కావున ప్రవృత్తిమార్గముచేతనే సాధింపఁబడుచున్నవి.

విమర్శించి వానికి నామధేయములఁ గల్పించి వ్యవహరించుచుండునో" అను మొదగుశ్రుతులచే నామరూపప్రకటనమే సృష్టియని వివరింపఁబడి యున్నది. కావునఁ బరమేశ్వరునను నీయీశ్వరత్వ మవిద్యాకల్పితమే. ఇట్టియీశ్వరత్వము నాశ్రయించియే జన్మాద్యధికరణమునఁ "బరమేశ్వరుఁడే సర్వకారణము" అని వివరింపఁబడియున్నది. పరమార్థస్థితిలో నియామకుఁడుగాని నియమింపఁదగినదికాని లేదు. "యత్రత్వస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా ౧-౩-౨" అను మొదలగు శ్రుతులచే పరమార్థస్థితిలో వ్యవహార మేదియు లేదనియు "ఏష సర్వేశ్వరః" అను మొదలగు శ్రుతులచే వ్యవహారదశయందు అవిద్యాకల్పితములై సర్వంబును కలదనియుఁ జెప్పఁబడియున్నది. మఱియు గీతాస్మృతియందును "నకర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" "ఈశ్వరుఁడు కర్తృత్వమునుగాని కర్మలనుగాని కర్మఫలసంబంధమునుగాని సృజించుట లేదు. స్వభావముమాత్రమే ప్రవర్తించుచున్నది. ఓయర్జునా! ఈశ్వరుఁడు సర్వజీవులయొక్క హృదయములందు నుండి మాయాయంత్రమునధిష్టించియున్న జీవులను త్రిప్పుచున్నాఁడు" అని పారమార్థికవ్యవహారవిషయములు వర్ణింపఁబడియున్నవి. కావున నీరెండధికరణములయందుఁ గలసిద్ధాంతములను శ్రుతిసమ్మతములే; అవస్థాభేదముల నాశ్రయించినవి యగుటచే వీనికిఁ బరస్పరవిరోధము లేదు. మఱియు దీనికిఁ బూర్వమున నున్నభోక్త్రాపత్త్యధికరణమునందుఁ గూడ వ్యవహారస్థితి నవలంబించియే సముద్రతరంగదృష్టాంతముచేఁ బరమేశ్వరునిఁ బరిణామికారణముగఁ గూడ సూత్రకారుఁ డంగీకరించియున్నాఁడు. ఈవ్యవహారవర్ణనకు నంతకును సగుణోపాసనలయం దుపయోగ మని గ్రహించునది. కావున నెట్లును మాసిద్ధాంతమునకు భంగము రాదు. పరమేశ్వరుఁడు నిర్వికారుఁడే; ప్రపంచబ్రహ్మములకు నభేదమే.

అవతారిక:— కార్యకారణములకు భేదము లే దనువిషయమును నిరూపించుటకై మఱికొన్ని హేతువులఁ జూపుచున్నాఁడు.

# ౧౮౬. *భావే చోపలబ్ధేః

## ౨. ౧. ౧౫.

**తాత్పర్యము:— కార్యకారణము లభిన్నము లనుట కేవల శ్రుతి వలననే కాదు. అనుమానప్రత్యక్షములవలనగూడ స్పష్టమగుచున్నది.**

---

* సామాన్యముగ నాలోచించిన నీసూత్రమునకు నీక్రిందివిధముగ నర్థమగును. [భావే=కారణముయొక్క సత్తయందు (అనఁగా: గారణ మున్నప్పుడు,) ఉపలబ్ధేః + చ=కార్యము బుద్ధిగోచర మగుచున్నది. కావునను వానికి రెంటికిని భేదము లేదు.] ఈయర్థమున నీక్రిందిదోషములు వచ్చును.

అగ్నియు ధూమంబునుఁ గార్యకారణములు కావు. పొగ కట్టెలనుండి యగ్నిసంయోగమువలన జనించునుగాని కేవలాగ్నినుండి జనింపదు. ఇట్లున్నను పై లక్షణము నాశ్రయించినచో వానిరెంటికి నభేదము వచ్చును. అగ్నియున్నస్థలమున ధూమము కూడ నుండునుకదా! బుద్ధి గోచర మగునుకదా! ఒకవేళ నాయగ్ని తత్కాలమున లేకున్నను బూర్వమునైన నుండవలయును; కావున నెప్పటికిని యగ్ని యునికియే ధూమజ్ఞానమునకుఁ గారణ మైనది. కావున నీదోషమువలన పై లక్షణము కార్యకారణములయందుమాత్రమే ప్రవర్తించుననుట సంభవింపదు.

ఈదోషమును పోఁగొట్టుటకై పైలక్షణమునకు నిట్లు అర్థముఁ జెప్పవలయును. భావపదము సత్తాస్ఫూర్తిపరమని నిర్ణయింపవలయును. "కారణసత్తాస్ఫూర్తులవలనఁ గార్యము స్ఫురించును" అని సూత్రార్థమును నిర్ణయింపవలయును. ఇప్పటికిని దోషము వచ్చును. పురుషుఁడు ఒకపదార్థముఁ జూడవలయు ననినఁ గాంతి యుండవలయును; అది బుద్ధికిఁగూడ గోచరము కావలయును. కావున కాంతియొక్క సత్తాస్ఫూర్తులచేతనే పదార్థస్ఫూర్తి కలుగుచున్నది. కాంతికినిఁ బదార్థమునకు నభేదము రావలయును. ఇది సంభవింపదు కదా!

కావున నిర్దోషముగ నాసూత్రమునకు నీక్రిందివిధముగ వ్యాఖ్యానముఁ జేయవలయును. 'కారణముయొక్క సత్తాస్ఫూర్తులచేఁ గార్యమునకు సత్తాస్ఫూర్తులు కలుగును' అని నిర్ణయింపవలయును. అప్పుడు ఈలక్షణము కార్యకారణముల విడిచిపోదు. 'అగ్ని బుద్ధిగోచర మైనప్పుడుమాత్రమే ధూమము బుద్ధిగోచరము కావలయును' అనునియమము లేకుండుటచేఁ బైలక్షణ మగ్నిధూమములయందుఁ బ్రవర్తింపదు. 'కాంతియొక్క యునికివలననేగాని పదార్థములయొక్క యునికి కలుగదు' అనునది లేకపోవుటచే కాంతిద్రవ్యములయందుఁ బైలక్షణము ప్రవర్తింపదు.

లోకమునఁ గారణపదార్థ ముండి బుద్ధికి గోచరమై నిలచిననేకాని కార్య ముండుట లేదు; బుద్ధికిఁ గూడ గోచర మగుటలేదు. మృత్తిక యుండి బుద్ధికి గోచరమైన నే కాని ఘటము వ్యవహారమునకు రాదు కదా!

ఆవు గుఱ్ఱము అనుపదార్థములు ఒకదాని యునికివలననే కాని రెండవది తెలియఁబడక నున్నవా? ఆవున్నచోట గుఱ్ఱముకాని గుఱ్ఱమున్నచోట నావుగాని నియమముగ నుండవలయునా? కావున కార్యకారణములుగానుండుట మొదలగుసంబంధము లేకపోయిన "దీనియునికి చేతనే యిది తెలియఁబడవలయును" అనునియమ ముండదు. కుండకు కుమ్మరవాఁడు గూడఁ గారణమే యైనను వాఁడు కుండకంటె భిన్నుఁడగుటచే ఘటప్రత్యక్షమునకుఁ గుమ్మరవానియునికితోఁ బనిలే కున్నది. కావున కారణముయొక్క యునికియు జ్ఞానంబు నుండిననేకాని కార్యమునకు స్థితి సంభవింపదు కావునఁ గార్యకారణము లభిన్నములు.

"ఇట్లు కాదు. భిన్నములగుపదార్థములు కూడ నియమముగ నేక సత్తాస్ఫూర్తులచేఁ(ఒకదానియొక్క యునికిచేతను ప్రకాశముచేతను) ప్రకాశించుచున్నవి. అగ్నియొక్కసత్తాస్ఫూర్తులచే ధూమము ప్రకాశించుచున్నది కదా" అనియెదవేమొ వినుము. ఇట్టి నియమ మెచ్చటను లేదు. నీవు చెప్పినదృష్టాంతముకూడ సరియైనదికాదు. అరణ్యములయందు పశువులను కాపాడుగోపాలకులు అచ్చట గలుగు దోమల బాధను తొలఁగించుకొనుటకై తమ నివాసస్థలములయందే యగ్నిని ప్రజ్వలింపఁజేసి ఒక తోలుసంచిలోఁ బొగను సంగ్రహించి బంధింతురు; అగ్నిని చల్లార్చి యాపొగసంచినిమాత్రము పశువులకడకు దెచ్చి యవసరమైనప్పుడు సడలించి దానిలోనిపొగను వెలుపలికి విడుతురు. ఇప్పుడు ఆపొగను చూచినవాఁడు గూడ "అచ్చట యగ్ని కలదు" అనియే నిర్ణయింపవలయును కదా! ఇది సంభవింపదు. కావున నగ్నియొక్కసత్తాస్ఫూర్తుల నాశ్రయించియే ధూమ ముండవలయు ననునియమము లేదు. ఇట్లు కాక ఒకవేళ "ఇట్టి స్థలములయందు మాత్రము అగ్నిలేకున్నను ధూమ ముండవచ్చును" అని చెప్పి అగ్నిధూమములసాహచర్య మున్నస్థలము నే దృష్టాంతముగాఁ గైకొన్నను అచ్చట అగ్ని యనుమానగమ్యమే; (పొగను పట్టి యూహింపవలసినది యే) యగుటచే దానికి స్ఫూర్తి లేదు. ఒకవేళ దానిని సాధించినను

మాసిద్ధాంతమునకు భంగము రాదు. మీరును "అగ్నికి స్ఫూర్తియున్న ప్పుడే కాని ధూమమునకు స్ఫూర్తి యుండదు" అనునియమము లేదనియే యంగీకరించియున్నారు కదా! మేమును "కారణముయొక్క సత్తాస్ఫూర్తులతోఁ గూడినబుద్ధియే కార్యముయొక్క సత్తాస్ఫూర్తులఁ గ్రహించును. ఈకారణమువలననే కార్యకారణముల కభేదము "కార్యకారణా దభిన్నం కారణసత్తోప లబ్ధ్యనువిధాయి సత్తోపలబ్ధికత్వాత్ ఘటవత్" అనునది యనుమానవాక్యస్వరూపము అనియేకదా! చెప్పుచున్నాము. ఈలక్షణము ప్రస్తుతము వహ్నిధూమములయందును సమన్వయ మగుచున్నది. కావున వానికిని అభేదమే చెప్పినను చెప్పవచ్చును.

ఇది యనుమానప్రకారము. ఇఁకఁ బ్రత్యక్షము నాకర్ణింపుము. మనము వస్త్రమును చూచుచున్నాము కదా! అది నూలుపోగులకంటె నతిరిక్తముగ లేదు; కావున కారణము లగునూలుపోగులకంటెఁ గార్యమగువస్త్రము భిన్నము కాదు. ఆనూలుపోగులే పడుగు పేక యనుభేదములతో నొకవిధముగ నల్లుకొనియున్నవి. "ఇట్లయిన నూలిపోగు లనేకములైయుండ ఇది యొకవస్త్రము" అని యేకత్వవ్యవహార మెట్లువచ్చును? అనియెదవేమొ వినుము. ఆనూలుపోగు లన్నియు చేయుకార్య మొక్కటియే కావున నట్టివ్యవహార మేర్పడినది; కావున నీప్రత్యక్షమువలనఁ గూడఁ గార్యకారణము లభిన్నములే.

"ఇట్లు కాదు. దారములయందుఁ గలభేదమును వానికూడిక కప్పిపుచ్చుచున్నది. ఇట్లుఁ గాకున్న నేయకమునుపుఁ గూడ వానియందు వస్త్రము కనఁబడవలసియే వచ్చును. ఇది యసంభవము కదా!" అని యెదవేమొ వినుము. మొట్టమొదట "కూడికవలన భేదము నశించినది" అనుటయే సంభవింపదు. భేద మనునది నుండిననే కాని కూడిక కలుగనేరదు; ఏకపదార్థమునకు కూడిక యుండుటకు వీలులేదు కదా! మఱియు "ఇవి కూడియున్నవి కావున నిచ్చట భేదము లేదు" అని మొట్టమొదట నిర్ణయించిననేకాని "ఇచ్చట నట్టికూడిక లేదు కావున భేదమున్నది" అని గోచరము కాదు. కావున భేదజ్ఞానమునకంటె ముందు కూడికను తెలిసికొనవలయును; కూడికను తెలిసికొనుటకంటె ముందు భేదమును తెలిసికొనవలయును. ఇది యెట్లు సంభవించును? దీనికే అన్యోన్యాశ్రయదోష మనిపేరు. ఈదోషమువలనఁ "గూడిక భేదమును

కప్పివుచ్చును" అనుట సంభవింపదు. "ఇట్లయిన నేయకమునుపుకూడ దారములయందు వస్త్రము కానరావలయును కదా!" అనియెదవేమొ యట్లు కానవచ్చు ననిన దోష మేమి? అప్పుడుకూడ పటము సూక్ష్మావస్థతో దారములయందే యుండు ననవలయును; లేకున్న "దారములనుండియే వస్త్రము జనించును" అనునియమము రాదు కదా! కావున కారణముయొక్క యునికివలననే కాని కార్యముయొక్క యునికి సంభవింపకపోవుటచేతఁ గారణముయొక్క జ్ఞానమువలనఁగాని కార్యజ్ఞానము కలుగకపోవుటచేతఁ గార్యకారణము లభిన్నములే! ఈయర్థమును నిరూపించుటకై ఈసూత్రమును "భావాచ్చోపలబ్ధేః" అని పాఠాంతరమునఁ బఠింతురు.

## ౧౫౦. సత్త్వాచ్చాపరస్య

## ౨. ౧. ౧౬.

తాత్పర్యము:—అపర మనఁగాఁ గార్యము. అది యుత్పత్తికిఁ బూర్వమునఁ గారణరూపముతోనే యున్నది. కావున నుత్పత్త్యనంతరమునఁ గూడ నట్లే యుండి తీరవలయును.

'కార్యము కారణరూపముతో నుత్పత్తికిఁ బూర్వమున నుండెను' అనువిషయము "ఆత్మావా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్ సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అనుమొదలగువాక్యములచే శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. యుక్తితో విచారించినను ఇట్లే తెలియవచ్చుచున్నది. ఏపదార్థము దేనియందు ఉత్పత్తికిఁ బూర్వమున నుండదో అది దానినుండి జనింపదు. ఈనియమమువలననే 'కుండ మట్టినుండియే జనింపవలయును; తైలము నువ్వులనుండియే జనింపవలయును; వస్త్రము దారములనుండియే జనింపవలయును' అనుమొదలగునియమము లేర్పడుచున్నవి. ఆఘటాదులన్నియు ఉత్పత్తికిఁ బూర్వమునందుఁ గూడ మృత్తికాదులయందున్నవి. కావున వానినుండి జనించుచున్నవి. దారములు మొదలగు నితరపదార్థములయందు లేవు; కావున వానినుండి జనించుట లేదు. ఇట్లే ఈప్రపంచముకూడ నాత్మయందు లేకపోయియుండినచో నా యాత్మనుండి జనింపఁగూడదు. శ్రుతివలన నాత్మనుండియే ప్రపంచసృష్టి చెప్పఁబడియుండుటచేత నిది యుత్పత్తికిఁ బూర్వమున నాయాత్మయందే యుండి

తీరవలయును; ఉత్పత్తి యనంతరమునను తద్రూపమే కావలయును. కార్యకారణములు పరస్పర మభిన్నములే యనవలయును.

మఱియు నెన్నిమాఱులు నశించినను ఎన్నిమాఱు లుత్పత్తి నొందినను ఈప్రపంచము ఎప్పటికిని తనయునికిని విడుచుట లేదు. సూక్ష్మావస్థతోనో స్థూలావస్థతోనో నిలుచుచునేయున్నది. బ్రహ్మము కూడ నట్టిదియే "అజరో ఽమరో" అనుమొదలగు వాక్యములచేఁ బరమేశ్వరుఁడు నిత్యుఁడని చెప్పఁబడియున్నది కదా! ఉనికి యనునదియు రెండుగా నుండుటకు వీలు లేదు. "ఈయునికికంటె నాయునికి భిన్నము" అనిన వానియందలిభేదమును నిరూపింపవలసివచ్చును. అదిసంభవింపదు. సత్త (ఉనికి) కానిది యసత్త (లేమి) యే కావలయును. అప్పుడు కార్యకారణములలో నొకదానికి నభావము కలుగవలసివచ్చును. ఇది ప్రత్యక్షవిరుద్ధము. మఱియు భేదాభేదములలో నభేదమే పారమార్థిక మనియు భేదము కల్పిత మనియు నిదివరకే (పు. ౨. ౧. ౧౪. చూడు) నిరూపించియున్నాము. కావున సత్త యేకరూపముగ నుండవలయు ననుకారణమువలనఁ గూడఁ గార్యకారణము లభిన్నములే యగును.

అవతారిక:—పైసూత్రమునఁ జేయఁబడినసిద్ధాంతమును పూర్వపక్షానువాదపూర్వకముగ స్థిరపరుచుచున్నాఁడు.

## ౧౭౧. అసద్వ్యపదేశాన్నేతి చేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్ ౨. ౧. ౧౭.

తాత్పర్యము:—ఇట్లు కాదు. ఒకానొకస్థలమునందు సృష్టికిఁ బూర్వమునఁ బ్రపంచము లేదని 'అస దే వే ద మగ్ర ఆసీత్' అను మొదలగువాక్యములచే శ్రుతి చెప్పియున్నది. కావున 'పైసూత్రమునందు చేయఁబడినసిద్ధాంతము నిలువదు' అనియెదవేమొ అది సరికాదు.

ఇచ్చట ప్రపంచము శూన్యరూప మైయుండె నని కాని శూన్యమునుండి జనించె నని కాని చెప్పఁబడియుండలేదు. లోకమున నామరూపవికాసము గలిగినపిదపఁగాని పదార్థము వ్యవహారయోగ్య మగుట లేదు. అట్లయిననే కాని 'ఇది కలదు' అని చెప్పఁబడుట లేదు. ఇంద్రియగోచరము కానిదానిని లేనిదానినిగనే కదా మనము వ్యవహరించు

 

చున్నాము. శ్రుతియు నిట్టివ్యవహారము నాశ్రయించియే నామరూప ప్రకాశము లేనిప్రపంచసూక్ష్మావస్థను అసచ్ఛబ్దముచేఁ జెప్పుచున్నది.

వాక్యము సందిగ్ధమై యున్నప్పుడు వాక్యశేషమువలన దాని యర్థమును నిర్ణయింపవలయును కదా! ఇచ్చట 'తత్స దాసీత్' అను వాక్యముచే వాక్యశేషమున నసచ్ఛబ్దముచేఁ జెప్పఁబడినప్రపంచమే తచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁబడి సచ్ఛబ్దముచే వర్ణింపఁబడియున్నది. "సృష్టికిఁ బూర్వమున నసద్రూపమై యున్నప్రపంచమే పిదప సద్రూపము కలది యయ్యెను" అని చెప్పఁబడియున్నది అసచ్ఛబ్దముచే మొట్టమొదట శూన్యమే చెప్పఁబడియుండునేని దానికి సద్రూపముఁ జెప్పుట విరుద్ధము కదా! కావున నామరూపప్రకాశము లేనియవస్థతోఁ గూడిన ప్రపంచమే శూన్యమువలె నతిసూక్ష్మమై యుండును; కావున నౌపచారికముగ నసచ్ఛబ్దముచేఁ జెప్పఁబడెను. ఈవిషయము ప్రథమాధ్యాయ చతుర్థపాదమున కారణత్వాధికరణమునందు (సూ. ౧౪. ౧౫.) వివరింపఁబడియే యున్నది; కావున నెట్లును మాసిద్ధాంతమునకు భంగము లేదు. కార్యము సృష్టికిఁ బూర్వమునఁ గారణమునందు కలదు.

అవతారిక:—ఇట్లు నిర్ణయింపఁబడినసత్కార్యవాదమును మఱి కొన్ని హేతువులచే స్థిరపరుచుచున్నాఁడు.

## ౧౮౨. యుక్తేశ్శబ్దాంతరాచ్చ

### ౨. ౧. ౧౮.

తాత్పర్యము:—మఱియు లోకానుభవానుసారముగఁ జూచినను వేదవాక్యముల విమర్శించినను పైవిషయమే ("కార్యము సృష్టికిఁ బూర్వమునఁ గారణమునందు తద్రూపముతో నిలచును" అనువిషయము) సిద్ధాంత మగుచున్నది.

అనుభవప్రకార మెట్లనిన:—లోకమునఁ బెరుగు కావలయునని కోరువారు నియమముగ పాలనుమాత్రమే సంపాదించుచున్నారు; ఘటము కావలసినవారు మృత్తికనుమాత్రమే సంపాదించుచున్నారు. ఇంతియే కాని యెవ్వఁడును పెరుగుకై మృత్తికనుగాని ఘటమునకై పాలనుఁగాని సంపాదించుట లేదు. ఉత్పత్తికిఁ బూర్వమునఁ గారణమునందు కార్యము లేదనినచో నీప్రత్యక్షానుభవమునకు విరోధము

వచ్చును. ఏకార్యముగాని ఏకారణమునందుగాని లేదనుట సమానమై యుండఁగఁ బెరుగు పాలనుండిమాత్రమే యేల జనింపవలయును? మృత్తికనుండి యేలజనింపరాదు? ఏకారణమునందు ఏకార్యంబును లేదు గదా! "సర్వకారణములయందును లేమి సమానమే యైనను ఒక్కొక్క దానియందు ఒక్కొక్క కార్యమునకు సంబంధించిన యొకానొకవిశేష ముండును. పాలయందుమాత్రమే పెరుగునకు సంబంధించిన యొకానొకవిశేషము కలదు; మృత్తికయందు లేదు" అనియెదవేమొ అప్పుడు మామతమునే యంగీకరించినవాఁడ వగుదువు. కార్యమునకు సంబంధించిన విశేషము కారణమునందుఁ గల దనినను కార్యము కారణమునఁ గల దనినను ఒక్కటియే. ధర్మాధర్ములకు భేదము లేదని ఇదివరకే నిరూపించియున్నాము. (౨. ౧. ౧౪. చూడు.)

"ఇట్లు కాదు. కారణమునందు కార్యము నుత్పత్తిచేయు సామర్థ్యము కల దని మేము చెప్పుచున్నాము. ఇంతియేకాని అందు కార్యధర్మము కల దనుట లేదు" అనియెదవేమొ అప్పటికిని నియతకార్యము నియతకారణమునుండి జనించుటకు వీలు లేదు. ఈశక్తి కార్యకారణములకంటె నన్యమా? కాదా? మఱియు నది కారణమున శూన్యరూపముతో నున్నదా? సద్రూపముతో నున్నదా? ఇందు మొదటిపక్షములు రెండును (అన్యము అసద్రూపముతో నున్నది యనుపక్షములు రెండును) యుక్తములు కానేరవు. భిన్న మగుపదార్థము తనకంటె భిన్న మగుదాని నెట్లు నియమింపగలదు? లేనిపదార్థము సద్వస్తువు నెట్లు నియమింపగలదు ? ఇట్లగుటచేఁ గారణమునకంటె శక్తికిని శక్తికంటె దానిచేఁ గలిగింపఁబడుకార్యమునకు భేద ముండకూడదు. "ఏది యేపదార్థమును నియమించునో అది దానికంటె నభిన్నమై యుండి తీరవలయును" అనున్యాయ ముత్పత్తివిషయమున నియతమై యున్నది. కరిగి పోయఁబడిన లోహమును విగ్రహాదిరూపముగ నియమముతో కూర్చుచున్నమూసలు విగ్రహాద్యాకారములతోనే యున్న వనుట ప్రత్యక్షసిద్ధము కదా! కావునఁ గారణమునఁ గార్యోత్పాదన శక్తి కల దనుటకుఁగూడ 'సూక్ష్మావస్థతో కార్యమే దానియందు గలదు.' అనుటయే యర్థ మగును. పైనఁ జూపిన నియమము ననుసరించి కార్యరూపముతో నుండనిశక్తి దానిని నియతముగఁ గలిగింపనేరదు. ఏది

యో యొకశక్తి యుండిన ననియతముగా నేదియో యొక కార్యముఁ గలి
గింపవలసియుండును. సామాన్యముగఁ బ్రతికారణమునందును కార్యో
త్పాదనశక్తి యుండనే యున్నది; కావున విశేషకార్యమును సాధించు
టకై తదాకారశక్తి నవశ్యముగ నంగీకరింపవలయును. అట్లంగీకరించిన
సత్కార్యవాద మవశ్యముగ వచ్చును. కావున నెట్లును మీమతము
నిలుచునది కాదు.

మఱియు నెట్లు చూచినను స్థితికాలమునందుఁగూడఁ గార్య
కారణములకుఁ దాదాత్మ్యసంబంధమునే (అనఁగా: కాలిన యినుపము
ద్దయందు అగ్ని యుండి స్పృశించినవారిని కాల్చుచున్నను 'ఇనుమే
యగ్ని' యని భావించుచు 'ఇనుము కాల్చుచున్నది'యని చేయువ్యవహార
ములకుఁ గారణ మగుసంబంధము లేశమాత్రమైనను పదార్థభేదమును
తలంపకుండుట) నంగీకరించి తీరవలయును. ఈవిషయమునుఁ గూర్చి
"భావే చోపలబ్ధేః ౨. ౧. ౧౫." అనుసూత్రమునఁ బ్రత్యక్షమునుఁ
గూర్చి విచారించునప్పుడు చెప్పఁబడియున్నది. ఇట్లంగీకరించిన స్థితికాల
మునందే కార్యకారణము లొక్కటియైన నుత్పత్తికిఁ బూర్వమున
మాత్రము భేద మెటనుండి వచ్చును?

పూర్వపక్షము:—ఇట్లు కాదు. మీతాదాత్మ్యసంబంధములకు
లక్షణము కుదురదు; భ్రాంతియే దానిని కారణ మని మాత్రమే చెప్ప
వలసియుండును. దాని నంగీకరించుటకు వీలు లేదు. ఇఁక నేమి యనిన
*గార్యకారణములు మొదలగువానికి గలసంబంధము సమవాయసంబం
ధము. అప్పుడు ఆపదార్థములు రెండును పరస్పరభిన్నములై యుండ
వచ్చును. ఏకరూపముతో ను వ్యవహరింపఁబడవచ్చును.

సిద్ధాంతము:—ఇది సరి కాదు. సమవాయసంబంధము రెండు
పదార్థముల నాశ్రయించి యుండును కదా! అప్పుడు ఈసమవాయ
మునకును ఆపదార్థద్వయమునకును పరస్పరసంబంధము కలదా? లేదా?
కల దనిన నదియు మొట్టమొదటి సమవాయమేనా? లేక అన్యమా? లే
దనిన సమవాయమునకు పదార్థముల నేకముఁ జేయుసామర్థ్య మెట్లు
వచ్చును? ఇందు కల దని యంగీకరించి "సమవాయమునకును పదార్థ

* కార్యకారణములు మొదలగునవి సమవాయసంబంధస్థానములు. (సమవాయ
సంబంధము పు. ౪౭౭ చూడు)

ద్వయమునకును గలసంబంధముకూడ మొట్టమొదటి సమవాయమే కాని యన్యము కాదు" అనిన నన్యోన్యాశ్రయదోషము వచ్చును. అభేదవ్యవహారమును గలిగించుటకై పదార్థద్వయము నాశ్రయించు నదియు నట్టియాశ్రయము కలిగించునదియుఁ గూడఁ దానే యగుట యసంభవము కదా! కర్తయు సాధనము నేకపదార్థమే యగుట యెట్లు సంభవించును? ఇట్లు గాక రెండవపక్షము నంగీకరించి యాసంబంధము మొదటిసమవాయము కాదనిన ననవస్థాదోషము వచ్చును. ఆరెండవ సంబంధమునకుఁగూడ పదార్థద్వయముతో సంబంధము కలుగుట ఆవశ్యకము కదా! ఇఁక నట్టిసంబంధమే లేదనిన సమవాయమే లేకపోవల యును; పదార్థములును ఏకము కాకపోవలయును.

"ఇట్లుకాదు. లోకమున సత్త(ఉనికి)యనునొకపదార్థము కలదు. అది సర్వపదార్థముల నాశ్రయించియున్నది- అది స్వయముగనే సత్త కావున దానిని మఱియొకసత్తతో నావశ్యకము లేదు. ఇట్లే సమవాయమునకుఁ గూడ మఱియొకసమవాయముతో నావశ్యకము లేదు" అనియెదవేమొ యప్పటికిని మీమతమున విరోధము రాకపోదు. మీ మతమున సంయోగము (కూడిక) గుణముగను సంబంధముగనుఁ గూడ నున్నది. అది గుణము కావున దానికిని పదార్థములకును సమవాయ సంబంధము కలదని మీరు చెప్పుదురు కదా! అదియు స్వయముగ సంబంధరూపమే కావునఁ దానికిని మఱియొకసంబంధముతో నావశ్యకము లేకపోవలయును. ఇది మీసిద్ధాంతమునకు విరుద్ధము కదా! సమవాయసంయోగములు రెండును సంబంధములే యైయుండ నొక దానికి నున్నయధికారము రెండవదాని కేల యుండదు? సమవాయ మేవిధముగఁ బదార్థద్వయభేదముచే భిన్నము కాదో, దానినాశముచే నశింపదో, నిత్యమేయై యేకరూపమేయై యుండునో అట్లే సంయోగ ముకూడ నుండవలసివచ్చును. ఇదియు మీకు సమ్మతము కాదు కదా! కావున మేము చెప్పునట్లు అభేదవ్యవహారము (భిన్నపదార్థములయందు గానవచ్చు నభేదవ్యవహారము పారమార్థికస్థితిలో నభిన్నములై యుం డియుఁ గల్పితభేదముచే వ్యవహరింపఁబడుచున్నపదార్థములయందు మఱల నొకానొక కారణమునఁ గానవచ్చు నవివేకపూర్వక మగునభేద

వ్యవహారము) భ్రాంతిసిద్ధ మగు తాదాత్మ్యభావనచేఁ గలిగినదియే యని యంగీకరించి తీరవలయును. ఎట్లును సమవాయము సిద్ధింపనేరదు.

మఱియు "వీనికి సంబంధము కలదు" అని నిర్ణయింపవలయు ననిన లోకమున నట్టివ్యవహార ముండవలయును. సర్వశాస్త్రములును అనుభవమునకు ననుగుణములై యుండవలయు ననుట నిస్సంశయము కదా! లోకస్థితిని విచారింపఁబోయిన మీరు ఏయేస్థలములయందు సంయోగసంబంధము కలదంటిరో అచ్చటమాత్రము 'ఇది దీనితోఁ జేరి యున్నది' అని సంబంధవ్యవహారము కానవచ్చుచున్నది. సమవాయసంబంధము కలదని చెప్పినచోట్ల నెల్ల నట్టివ్యవహారము కానరాలేదు. మీరు కార్యకారణములకు సమవాయసంబంధము కలదంటిరి; దారములకంటె గుడ్డను భిన్నముగ నెవ్వఁడును వ్యవహరించుట లేదు. ద్రవ్య గుణములకు సమవాయసంబంధము కల దంటిరి; పుష్పమునకంటె లేక పరాగమునకంటె నెవ్వఁడును ఎప్పుడును వాసనను భిన్నముగ వ్యవహరించుట లేదు. పరస్పరభిన్నములై యున్నపదార్థములు ఒక్కస్థలమునఁ గూడుటయే కదా సంబంధము. కార్యకారణాదులయం దట్టి సంబంధమే యుండునేని యభేదమునలెనే భేదముఁగూడ కానరావలయును. దారములు వస్త్రము మొదలగువానియం దట్లు గానవచ్చుట లేదు. లోకు లందఱు "ఇది వస్త్రము" అని మాత్రమే కదా వ్యవహరించుచున్నారు. కావున నిది తాదాత్మ్యము పడుగు పేక యనుసన్నివేశభేదములచే నల్లుకొనియున్నదారములను చూచి దానికిని పటమునకును గలయనిర్వచనీయభేదము నెఱుంగిలేక వానియందు పటత్వమునే ఆరోపించి "ఇది వస్త్రము" అని లోకులు వ్యవహరించుచున్నారు; కావున సమవాయసంబంధ మనునదియే లోకమున లేదు.

'ఉన్నది' అని సాధింపఁ దలంతువేమొ ఈక్రిందిప్రశ్నమునకు సమాధానముఁ జెప్పుము.

"కారణములు అవయవములు; కార్యము అవయవి. ఆ యవయవములకూడికచే సమవాయసంబంధమున నవయవి జనించును. సమవాయసంబంధము నిత్యము" అనునదియే కదా; మీ సిద్ధాంతము. అవయవి సర్వావయవములయందు నుండునా? లేక కొన్నియవయవములయందుమాత్రమే యుండునా? మొదటిపక్షము నాశ్రయించిన

నాయవయవి కానరాఁ గూడదు. వస్త్రమును చూచునప్పుడు లోకమున
నున్నదారము లన్నియు నెదుర నుండుట సంభవింపదుకదా! లోకమున
ననేకత్వ మనునది యనేకపదార్థముల నాశ్రయించి యున్నది; ఆపదా
ర్థములలో నొక్కటి లేకపోయినను గానవచ్చుట లేదు (ఇచ్చట రెండు
పదార్థములుమాత్రమే యుద్దేశింపఁబడె ననియు వాని నాశ్రయించి
యున్నసంఖ్య యేది లేకున్నను సంభవింపదుకదా, యనియు గ్రహింపవల
యును) ఇట్లే యనేకపదార్థముల నాశ్రయించియున్న యవయవియు
నేపదార్థము లేకున్ననుఁ గానరాఁగూడదు ఇట్లు లేదుకదా! "ఇట్లుకాదు.
అవయవి స్వస్వరూపముతో నవయవములయందు వ్యాపించియుండదు;
ఒకభాగ మొకచోటను మఱియొకభాగము మఱియొకచోటనుమాత్రమే
గలిగియుండును" అనియెదవేమొ అప్పుడు కారణభూతము లగునవయవ
ములకంటె భిన్నములుగ మఱికొన్నియవయవములగల్పింపవలసివచ్చును.
ఇట్లు లేకున్నఁ గారణభూతావయవములకంటె భిన్నుఁ డగునవయవియే
లేఁడు కదా! ఇట్లే యంగీకరించిన ననవస్థాదోషము వచ్చును. కారణ
భూతము లగునవయవములందు అవయవిని భాగభాగములుగ నిలుపు
టకై మఱికొన్ని యవయవముల నంగీకరించిన వానియందును అవయవి
భాగభాగములుగ నిలువవలసినవాఁడే; కావున నప్పుడును మఱికొన్ని
యవయవములు కావలసివచ్చును కదా! ఒకవరయందు కత్తి ప్రవేశించె
ననిన నప్పుడు వరయొక్క యవయవములకంటె కత్తియొక్క యవయవ
ములు భిన్నములనుట నిర్వివాదాంశమే కదా! ఇట్లే కారణభూతము
లగునవయవములయందు భాగభాగములుగ నొకయవయవి యున్నాఁ
డనిననాయవయవికిని అవయవములకును భేద ముండవలయు ననుటయు
నిర్వివాదమే యగును; కావున నెట్లు చూచినను "అవయవి సమస్తావ
యవములయందును సమవాయసంబంధముతో నుండును" అనుపక్షము
సిద్ధాంతము కానేరదు. ఇట్లుకాక రెండవపక్షమును "అవయవి కొన్ని
యవయవములయందుమాత్రమే యుండును" అనుపక్షమును ఆశ్ర
యించిన నదియు నిలువదు. ప్రతినూలుదారమునుండియు వస్త్రము కలు
గవచ్చును; ఏస్థలమున నున్నబంకమట్టినుండియును ఘటము జనింప
వచ్చునుకదా! అవయవి కొన్నిటియందుమాత్రమే యుండు ననుట యీ
నియమమునకు హానిని కలిగించును. కావున రెండవపక్షముకూడ

యుక్తముకాదు. ఈకారణమువలన సమవాయసంబంధ మనునది లోక మున లేదు.

"ఇట్లుకాదు. అవయవి సంపూర్ణమైయే ప్రతియవయవమునందు నుండును. గోత్వము మనుష్యత్వము మొదలగుజాతులు ప్రతిపదార్థము నందును (అనఁగా: ప్రతిగోవునందును ప్రతిమనుష్యునియందును) సంపూర్ణముగనే యున్నట్లు ఈ యవయవికూడ ప్రతియవయవమునందు నుండును. గోసమూహము నొకచోటఁ గూడినప్పుడంచలిగోత్వము ప్రత్యేకముగ భేదింపక నేకమే యైనట్లు ప్రతియవయవమునందు నున్నయవయవియు అవయవసంయోగము కలిగినప్పుడు పరస్పరము భేదింపక నేకరూపమే యగును. కావున *సమవాయసంబంధ మనునది యుండియే తీరవలయును. అవయవావయవులకు నున్నసంబంధము సంయోగము వలన వచ్చినది కాదు; నిత్యముకదా" అనియెదవేమొ వినుము.

ఇందు నీయభిప్రాయ మేమి? అవయవి ఒకయవయవమునందు కొంతసేపును మఱియొక యవయవమునందు మఱికొంతసేపు నుండుననియా? లేక నన్నియవయవములయందు నొక్కసమయముననే యుండుననియా? ఇందు మొదటిపక్షము నాశ్రయించిన నాయవయవి యొకచోటఁ గానవచ్చునప్పుడు మఱియొకచోట గానరాఁగూడదు. చెన్నపట్టణమున నొక్కఁడు వస్త్రమును చూచుచుండినఁ గాశియం దున్న మఱియొక్కనికి వస్త్రమే కానరాఁగూడదు. ఒక్క రాముఁడే అనేకస్థలములయం దొక్కమాఱు కానరాఁడుకదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నవయవు లనేకములు కావలసివచ్చును. కారణము సమానమై యుండఁ గార్యము భిన్న మెట్లగును?

" గోత్వదృష్టాంతమును చెప్పితిని కదా!" అనియెదవేమొ అదియు సరిపడదు. గోత్వము †సామాన్యము; గోవ్యక్తి విశేషము. సామాన్యవిశేషములకు గలభేదము వాస్తవ మయ్యెనేని యెప్పుడు మీదృష్టాంతము నిలుచును! మేముమాత్ర మిదివరకే భేద మెప్పటికిని బరమార్థము కానేరదని నిర్ణయించియున్నాము. "అది మేమును సమ్మతింపవలయు నని నియమము కలదా!" అనియెదవేమొ వినుము. దానిని ఖండించుటకు నేయుక్తియు లేదని యిదివరకే చెప్పియున్నాము.

* సమవాయసంబంధము (పు. ౪౨౨ చూడు.) † సామాన్యము (పు.౫౪౯చూడు)

అట్లుకాక మీమాంసకమతము నే యంగీకరించి భేదము పారమార్థికమే యని యొప్పుకొనినను సామాన్యవిశేషములకును అవయవావయవులకును గల సంబంధములు ఏకవిధములు కానేరవు. గోత్వము *ప్రతివ్యక్తియందును పరిపూర్ణమై కానవచ్చినట్లు అవయవి కానవచ్చుట లేదు. ఒక్కదారమును చూచి 'యిది వస్త్రము' అని యెవ్వఁడైన ననుచున్నాఁడా? మఱి యీ ప్రతియవయవమునందును అవయవి పరిపూర్ణుఁడై యుండునేని ప్రతియవయవంబును అవయవిచేయు కార్యముల నన్నింటినిఁ జేయవలయును. కొమ్మునుండియు పాలుపితుకుటకు వీలుకావలయును. ఇది యెందైనఁ గలదా! కావున నెట్లుచూచినను కార్యకారణములకు సమవాయసంబంధము సంభవింపదు. ఇంతయేల? లోకమున సమవాయమే లేదు. ఈకారణమువలన నుత్పత్తికిఁ బూర్వమునఁ గార్యము లేదనుటయు పిదప జనించి కారణమున సమవాయసంబంధముతో నుండుననుటయు సయుక్తికము కానేరదు.

ఉత్పత్తికిఁ బూర్వమునఁ గార్యము కారణమున లేదనిన నాయుత్పత్తిక్రియ కర్తృహీనయై స్వరూపహీనయై కూడ పోవును. ఉత్పత్తి యనునది యొకపని; దానికి కర్త లేకుండుట యెట్లు సంభవించును? లోకమున 'ఘటము పుట్టుచున్నది. వస్త్రము పుట్టుచున్నది' అనుమొదలగు వ్యవహారములు గానవచ్చుచుండుటచే "ధాతూపాత్తవ్యాపారాశ్రయః కర్తా" "క్రియచేఁ బొందఁబడిన కార్య మెవ్వనియందుండునో వాఁడు కర్త" అనున్యాయము ననుసరించి యాపుట్టుకకు ఘటవస్త్రములే కర్త లని స్పష్ట మగుచున్నది. పుట్టినవి అవియే కదా! ఈకారణమువలన నవి యెప్పటికి నేదియో యొకయవస్థతో నుండియే తీరవలయును కాని శూన్యములు కాఁగూడదు. శూన్యమునుఁ గూర్చి క్రియ ప్రవర్తింపదు కదా! కావునఁ గార్య ముత్పత్తికిఁ బూర్వమునఁ గూడ నున్నదియే.

ఇట్లు కాదు. ఉత్పత్తిక్రియకు ఘటాదులు కర్తలు కావు. వ్యాకరణసిద్ధాంతానుసారముగ నట్లే యుండవలసివచ్చినను ఇచ్చట నాయుత్పత్తిక్రియ ఔపచారికముగఁ బ్రయోగింపఁబడెను. కారణము లగునవయవములును నిమిత్తకారణ మగుచేతనుండును కార్యము నుత్పత్తిఁ జేయుటకు నభిముఖులై యుండ వారివిషయమున నే యీయుత్పత్తిక్రియ

* వ్యక్తి (పు. ౨౪౫ చూడు.)

ప్రయోగింపఁబడియున్నది ; కావున నా క్రియకుఁ గర్తలు నిమిత్తోపాదానకారణములే కావచ్చును" అనియెదవేమొ ఇదియు యుక్తము కాదు. నిమిత్తోపాదానకారణములు కార్యమును పుట్టించునవి కాని పుట్టునవి కావు. ఇట్లుండ నీయుత్పత్తిక్రియ వానియం దెట్లు ప్రయోగింపఁబడును? * ఉపచారమైనను సమానవ్యాపారములు కలవానియందే కదా చేయఁబడును; కావున కారణములు పుట్టించుట యనువ్యాపారమునకు నాశ్రయములు ; కార్యములు పుట్టుట యనువ్యాపారమునకు నాశ్రయములు. ఇట్లు కాఁదనిన 'ఘటము పుట్టుచున్నది' అనుటకు మారుగా 'కుమ్మరవాఁడు పుట్టుచున్నాఁడు' అనవలసివచ్చును. లోకమున నిట్లు లేదుకదా! మఱియు పుట్టించుట యనునది †సకర్మకము. పుట్టుట ‡యకర్మకము. ఈరెంటికిని యేకపదార్థ మాశ్రయ మెట్లగును? భృత్యునిచే నొకకార్యమును చేయించుయజమానుఁడే కార్యమును చేయువాఁడుఁ గూడ కానేరఁడు కదా! కావున నెట్లుచూచినను కార్యమునకు నుత్పత్తికిఁ బూర్వమున నీభావము కలుగుటకు వీలులేదు. "ఇట్లుకాదు. ఘట మప్పటికి లేకున్నను ఇఁకఁ గలుగఁబోవును కావున నట్లు చెప్పఁబడెను. అప్పటికి లేకున్నను ఉత్తరక్షణమునందైన దానికి నునికి కలదుకదా? ఆయునికివలననే కారణముతోఁగూడ సమవాయ సంబంధము కలదు గదా!" అనియెదవేమొ యదియు యుక్తముకాదు. కార్యమే లేకున్న దానితోఁ గారణమునకుఁగాని మఱియొకదానికిఁగాని సంబంధ మెట్లు కలుగును? ఉత్తరక్షణమున జనింపఁబోవుదానితోఁ బూర్వక్షణమున నున్నదానికి సంబంధ మెట్లు కలుగును? రెండును సత్పదార్థములే యైనచో నప్పుడు పరస్పరసంబంధము కలుగుఁగాని అం

---

* ఉపచారము (పు. 333 చూడు.)

† సకర్మకము—ఒకపని నాచరించువాఁడు కర్త. ఆకార్యముయొక్క ఫలము ననుభవించునది కర్మ. రాముఁడు పాఠమును చదివెను. అనునప్పుడు చదివినవాఁడు రాముఁడు కావున వాఁడు కర్త. చదువుట యనునది క్రియ. ననుభవించినది పాఠము. కావున నది కర్మ. కొన్ని క్రియలకు కర్మ యుండును. మఱికొన్నిటి కుండదు. అందు కర్మ వేనికి నుండునో అవి సకర్మకక్రియలు. ఉ. చదివెను మొదలగునవి.

‡ అకర్మకము లనఁగా: కర్మ లేనిక్రియలు. వాఁడు వచ్చెను అనుమొదలగు వాక్యములయందుఁ గల వచ్చెను మొదలగునవి.

దొకటి శూన్యమైనచో నది యెట్లు కలుగును? కావున కార్యము ఉత్పత్తికిఁ బూర్వమునగూడ సద్రూపమే యై కారణముతో దాదాత్మ్య సంబంధమున నున్నది యనియే చెప్పి తీరవలయును.

ఇంతయేల? అభావమునకు విశేషణము లెవ్వియు నుండుటకు వీలులేదనుట స్వభావసిద్ధము. లోకమున గృహము భూమి మొదలగు సత్పదార్థములకే యెల్ల కానవచ్చుచున్నదికాని అసత్పదార్థమునకుఁ గాదు; "గొడ్రాలికొడుకు రామరాజులకంటెఁ బూర్వమున భూమిని పాలించెను" అనువ్యవహార మెందైన నున్నదా? ఇట్టి వ్యవహారము నొక్కడానిఁ గల్పించినంతమాత్రమున నభావమునకు విశేషణసంయోగము కలుగునా? అభావ మనఁగా * నత్యంతాభావమే కావున వంధ్యాపుత్త్రుఁడు కారణవ్యాపారమునలన నొకకాలమున సద్భావమునుఁ జెందునేని యప్పుడు ఉత్పత్తికిఁ బూర్వమున నభావరూప మైనకార్యము కారణవ్యాపారమువలన సద్రూపము నొందుట సంభవించును. ఎప్పటికైనను ఎన్నియుక్తులఁ జెప్పినను పరస్పరవిరుద్ధము లగుటచేఁ గలిమిలేములకు సంబంధము కలుగునా? లేమి కలిమి యగునా? ఎన్నివాదముల వాదించినను కుండ గోడకానేరదుకదా! కావున అభావమంతయు నొక్కటియే కావున కారణవ్యాపారముచే వంధ్యాపుత్త్రుఁడు సద్రూపుఁడగునేని అభావరూప మగుకార్యముకూడ † కారకవ్యాపారముచే జనింప

---

* అత్యంతాభావము—వైశేషికులు ప్రాగభావ మనియు ప్రధ్వంసాభావ మనియు అన్యోన్యాభావమనియు నత్యంతాభావ మనియు నాలు గభావములు కల వందురు. అందుఁ బదార్థములు ఉత్పత్తికిఁ బూర్వమున లేకుండుటయే ప్రాగభావము; నశించినపిదప లేకుండుట ప్రధ్వంసాభావము. రెండుపదార్థములకుఁ గలపరస్పరభేదము అన్యోన్యాభావము. ఎండమావులయందు నీరు మొదలగువానివలె నెప్పటికిని లేనిదే యై యుండుట యత్యంతాభావము. వేదాంతులు శూన్యమగుదాని యందు విశేషము లుండుట సంభవింప దనునభిప్రాయముతో నత్యంతాభావవ్యతిరిక్తము లగునభావములు లే వందురు.

† కారకవ్యాపారము—కర్త కర్మ కరణము సంప్రదానము అపాదానము అధికరణము అనునాఱును కారకము లనఁబడును. ఇవి ప్రతికార్యమునకును కావలసినవియే. వీని ప్రవర్తనమే కారకవ్యాపారము.

ఇందు కర్తకర్మలను (చూడు. పు. ౬౧౨) కరణ మనఁగా: క్రియకు సాధనము ఉ॥ 'వాఁడు గొడ్డలిచే వృక్షమును నరికెను' అనుమొదలగువాక్యములయందు నరు

వచ్చును; కాని యట్లు లేదు. కావునఁ గార్యముఁ గూడ నుత్పత్తికిఁ బూర్వమున నభావరూపము కానేర దని తలంచుచున్నాము. “ఇట్లు కాదు. అప్పుడు (మీసిద్ధాంతము నాశ్రయించిన) కారకవ్యాపారమే నిరర్థక మగును. స్వభావసిద్ధ మగు కారణమునుఁగూర్చి దాని యుత్పత్తి చేయుటకై పురుషుఁ డెట్లు ప్రయత్నింపఁడో అట్లే కార్యమునుఁ గూర్చి కూడ ప్రయత్నింపఁగూడదు. కార్యకారణములకు నభేదమే కదా! లోకమునవన్మాత్ర మట్టి ప్రయత్నములు కానవచ్చుచునే యున్నవి. కావున కారకవ్యాపారము సిద్ధించుటకై కార్య ముత్పత్తికిఁ బూర్వమున లేదనుటయే యుక్త మని మేము భావించుచున్నాము” అని యెదవేని వినుము. ఇది యొకదోషముకాదు. ఎట్లనిన:—

కార్యము కారణరూపముతో నున్నది యనుట సత్యమే. ఇంత యేల? త్రాటియందు ఆరోపింపఁబడినపాముయొక్క యథార్థరూపము త్రాడే యైనట్లు కారణమున నారోపింపఁబడినదగుటచే నీకార్యము యొక్క యథార్థరూపము కూడ కారణమే. ఇట్లున్నను ఆ కారణమునకు ఆరోపణముచేఁ గార్యాకారమును కలిగించుటకై కారకవ్యాపార మావశ్యకము. “కార్యముకూడ కారణములకు స్వస్వరూపభూతమే. అట్లు కాకున్న నీకారణమునుండి యీకార్యమే జనింపవలయును అనునియమము కలుగదు” అనువిషయమునుగూర్చి మొట్టమొదటనే

---

కుటకు సాధనముగా జెప్పఁబడిన గొడ్డలి మొదలగునవి. క్రియాఫలము సంప్రదానము. ‘ఉ॥ వాఁడు కీర్తికై ప్రయత్నించెను’ అను మొదలగువాక్యములయందుఁ గార్యఫలముగా వర్ణింపఁబడినకీర్తి సంప్రదానము. క్రియాహేతు వపాదానము. ఉ॥ ‘వాఁడు క్రౌర్యమునఁ బరులను హింసించెను’ అను మొదలగువాక్యములయందు హింసాకారణముగఁ జెప్పఁబడిన క్రౌర్యము మొదలగునవి అపాదానములు. క్రియకు నాధార మధికరణము. ఉ॥ ‘వాఁడు అయోధ్యయందు రాజ్యము పాలించెను. లేక జనులయందు ప్రీతి నుంచెను’ అను మొదలగువాక్యములయందు రాజ్యపాలనాధారముగఁ జెప్పఁబడిన యయోధ్యయుఁ బ్రీతినిలుచుటకు నాధారముగఁ జెప్పఁబడినజనులును అధికరణములు. క్రియావిషయమున నీ యాఱుకారకములలోఁ గర్త స్వతంత్రుఁడై బుద్ధిపూర్వకముగను, కర్మ వానికి మిగులఁ బ్రధానమై యభీమానవిషయముగను, కరణాదు లుపకారకములుగను ప్రవర్తించు నని తెలుసుకోవలయును. ఈకారకములనే సాధనశబ్దముచేఁ గూడ వ్యవహరించుట కలదు.

వర్ణించియున్నాము. కావునఁ గార్యకారణములవిషయమై మఱల వివాదముతో పనిలేదు. "ఇట్లయిననుఁ గార్యకారణములు భిన్నములుగఁ గానవచ్చుచుండుటచే వానికి నేకత్వము సంభవింపఁగూడదు. భిన్నములైనబైనఁ జూపినయుక్తిప్రకారము కార్య మసత్యమే కావలయును" అని యెదవేమొ ఇది యేటిమాట? భేదము కానవచ్చినంతమాత్రముననే వస్తువులకుఁగూడ పారమార్థికభేద ముండవలయునా? స్థితిభేదములవలన గూడ వస్తువులయందు భేదము కానవచ్చును. ఇంతమాత్రమువలన వస్తువుగూడ పరమార్థభిన్నము కావలయునా? చుట్టచుట్టుకొని యుండి యెక్కసర్పమే మఱల నడచుచుండిన లేక నిలుచఁబడియుండిన దాని యందు స్థితిభేదముచే భేదము కానవచ్చినను పదార్థభేదము కలదా? దినదినమునకును క్రొత్తక్రొత్తవేషముల వేయుచుండినంతమాత్రమున నిన్నటి దేవదత్తుఁడు నేడన్యుఁ డగునా? వేషము లెన్నిమారినను 'అదియే యిది' అని పదార్థముమాత్రము గుఱుతింపఁబడుచునే యున్నది కదా! 'ఇట్లు కాదు. దేవదత్తుఁడు మొదలగువారు వృత్తినొంద లేదు. జనింప లేదు కావున వానినిఁగూర్చి యట్టియభేదము కలుగవచ్చును; కార్యవిషయ మిట్టిది కాదు కదా" అనియెదవేమొ అన్నియు నిట్టివే. మనము పాలను తెచ్చి పెరుగుగా పరిణమింపఁజేయుచున్నాము; ఇప్పుడు పెరుగు క్రొత్తగా జనించినదైనను దానికిని పాలకును భేదము లేదనుట ప్రత్యక్షమే యైయున్నది. మఱియు మఱ్ఱివిత్తనము మొదలగునవి మట్టిలో గలసి కానరాకున్నను మొలక జనించినపిదప "యిది మఱ్ఱివిత్తనము నుండి జనించినమొలక" అని గుఱుతించుచునే యున్నాము. ఇట్లు కనఁబడకున్నది కనఁబడుటయే జన్మము. మఱియు కాలక్రమమున నవయవములు క్షీణించి కానరాకపోవుటయే నశించుట; కావున నెప్పటికిని కారణకార్యరూపములకు భేదము కలుగ నక్కఱలేదు. ఉత్పత్తివినాశములు సంకోచవికాసములే కాని భావాభావములు కావు; కావున కార్యకారణములకు నెట్లును భేదము సంభవింపదు. మఱియు ఉత్పత్తివినాశముల వలన లేనిది కలది యగుననిన గర్భమున నున్నశిశువుసకంటె నుత్పత్తియైనశిశువు భిన్నుఁడు కావలసివచ్చును. నీమతమున యుత్పత్తికిఁ బూర్వము కార్య మసద్రూపము పిదప సద్రూపము; సర్వమతములయందును సదసత్తులకును పరస్పరభేదము నియతము కదా! మఱియు యావ

నాద్యవస్థలు రాకపూర్వ మసత్యములే కావున బాలునికంటె యౌవన వంతుఁడు (బాల్యమునువిడిచి యౌవనావస్థనుజెందిన సమానపురుషుఁడే) భిన్నుఁడు కావలసివచ్చును. ఇది విరుద్ధము కదా!

మఱియు మీరుచెప్పినదోషము మీపక్షమునందే కలదు. ఉత్పత్తికిఁ బూర్వమునఁ గార్యము లేకపోయినచో కారకవ్యాపారము ఏవిషయమును గూర్చి ప్రవర్తించును? సత్పదార్థమును గూర్చి యేదియైన నొకకార్యము నాచరించుట కలదు; కాని యసత్పదార్థమునుగూర్చి అట్లు లేదుకదా! శత్రువుపై ఖడ్గమును ప్రయోగించుటకు పురుషుఁడు ప్రయత్నించును కాని ఆకాశముపైఁ బ్రయోగించుటకు బ్రయత్నింపఁడు కదా! * సమవాయికారణమును పుట్టించుటకై లేక సిద్ధింపఁజేయుటకై కారకవ్యాపారము కలుగవచ్చునందువేమొ అది సంభవింపదు. వస్త్రమునకై బ్రయత్నించువాఁడు ఘటము నెట్లు సిద్ధింపఁజేయగలఁడు? (పుట్టింపఁగలఁడు?) సమవాయికారణమునకును కార్యమునకును భేదము లేదని యెదవేమొ అప్పుడు మావాదమునే యంగీకరించిన ట్లయినది. "కార్యము ఎప్పటికిని కారణమాత్రమే; అజ్ఞానులకు మాత్రము అనిర్వచనీయము లగుభేదాభేదములతోఁ గానవచ్చుచున్నది" అనియే యొప్పుకొనిన ట్లయినది. నాటకములయందు ప్రేక్షకులు నటుల యథార్థస్వరూపము నెఱుంగక "రాజు వచ్చుచున్నాఁడు అని రాజాదిపదములతోనే వ్యవహరించునట్లు తద్రూపముగనే చూచునట్లు జీవుఁడును అనాద్యవిద్యావశంబునఁ బరమేశ్వరునియథార్థరూపము నెఱుంగలేక 'ఇది గృహము. వీఁడు మనుష్యుఁడు' అని వ్యవహరించుచు ఆయనను తద్రూపముతోనే వ్యవహరించుచున్నాఁడు. ఇదియే పరమార్థము; కావున లోకానుభవమును బట్టి బాగుగ విచారించిన గార్యకారణము లొక్కటియే యనియు కార్య ముత్పత్తికిఁ బూర్వమునఁ గారణమునందే యున్నది యనియు సిద్ధించుచున్నది.

ఇట్లే శ్రుతినిబట్టి చూచినను సిద్ధించుచున్నది. పూర్వసూత్రమున (౧౭. వ. సూత్రమున) నసత్కార్యవాదమును చేయునట్లు కనఁబడుచున్న శ్రుతులు చూపఁబడియున్నవి. వాని వాక్యశేషములయం దంతటను "తత్స దాసీత్" అనుమొదలగు వాక్యములచే బ్రపంచసత్వము చెప్పఁబడెను.

---

* సమవాయికారణము (పు. ౨౧౭ చూడు.)

మఱికొన్నిటియందు 'స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్' అని ప్రత్యక్షముగనే యీవిషయము వర్ణింపఁబడెను. ఇదియుంతయుఁగాక 'యేనా శ్రుతంభవతి' 'ఏయొక్క పదార్థము నెఱింగిన వినిన సర్వము వినిన ట్లగునో' అని శ్రుతి యందు చేయఁబడియున్న ప్రతిజ్ఞయు నీసిద్ధాంతమువలన గాని సిద్ధింపదు. కార్యకారణములకు నెట్లయినను భేదముండునేని కారణజ్ఞానముచేఁ గార్య జ్ఞానము కలుగుటకు వీలు లేదు కదా! కావున నీప్రతిజ్ఞాశ్రుతులును ఈ సిద్ధాంతమునకే తోడ్పడుచున్నవి. ఇట్లాలోచించినఁ గార్యకారణము లెప్పటికి నొక్కటియే యగుటచే "పదార్థములు క్షణక్షణమునందును లేక *నాల్గుక్షణముల కొకమాఱును ధ్వంసమగును" అనుబౌద్ధవైశేషిక సిద్ధాంతములు ఖండింపఁబడెను.

అవతారిక:—ఇట్లు యుక్తిశ్రుతిసిద్ధముగ వివర్తవాదముతో బ్రహ్మ ప్రపంచాభేదమును సాధించి ఈవిషయమున రెండుదృష్టాంతములను చూపుచున్నాఁడు.

## ౧౫౩. పటవచ్చ ౨. ౧. ౧౯.

తాత్పర్యము:—లోకమునఁ జుట్టఁబడియున్న గుడ్డయే పరువఁ బడెనేని యవస్థలుమాత్రమే భిన్నము లగును కాని పదార్థములు భిన్నములు కానేరవనుట యనుభవసిద్ధమైయున్నది. చుట్టఁబడియున్నసమయమున 'ఇది వస్త్రము' అని స్పష్టముగ దెలియఁబడకుండుటయుఁ బఱచిన పిదప స్పష్టమగుటయుఁగూడ ననుభవసిద్ధమే; ఒకవేళ తెలియఁబడినను అల్పముగ దోఁచుటయుఁ బఱపఁబడినపిదప సంపూర్ణము లగునాకృ

* వైశేషికసిద్ధాంతము...వైశేషికమతస్థులు నాల్గుక్షణములకు నొకమాఱు వస్తునాశము కలుగు ననుచుందురు. వస్తునాశ మనఁగా: సంపూర్ణధ్వంసముకాదు. ఇఁక నేమనిన పూర్వస్థితినుండి మార్పు. ఇది క్షణక్షణమునకును గలుగునని కూడ వారి యభిప్రాయము. నాల్గుక్షణములనుగూర్చి వారుచెప్పునది యేమనిన: బరమాణువులు నిత్యములై యున్నవి. వానినుండియే సర్వపదార్థములును జనించుచున్నవి. వానివియోగమువలననే నశించుచున్నవి. ఆవిధాన మెట్లనిన: ఏదియో యొకకారణమువలన నొకక్షణమునఁ బరమాణువులయందు చలనము జనించును. రెండవక్షణమున విభాగము కలుగును. అప్పుడు అంతకుముం దున్నసంయోగముమాత్రము నశింపదు. మూఁడవక్షణమున నాసంయోగము నశించును. నాల్గవక్షణమున నాపదార్థమే లేకపోవును. లేక మఱియొకసంయోగమైనను జనించును.

మవిస్తారములతో (పోశవు వెశల్పులతో) స్పష్టముగఁ బ్రకాశించుటయు గూడ ననుభవసిద్ధమై యున్నది. ఇట్లే కార్యముకూడ నుత్పత్తికిఁ బూర్వమునఁ జుట్టఁబడినవస్త్రమువలెఁ బ్రకాశములేక అల్పప్రకాశ మున్నను పరిపూర్ణముగఁ దెలియఁబడక నడఁగియుండును; కారణమాత్రముగనే యుండును. ఉత్పత్తి యనిన వికాసమే కావున నాసమయమునందు పరిపూర్ణధర్మములతోఁ బ్రకాశించును. ప్రపంచబ్రహ్మములవిషయము కూడ నిట్టిదే సృష్టికిఁ బూర్వమున బ్రహ్మము ప్రపంచరూపవికాసము లేనిదై యుండును; సృష్టిసమయమున తన్నాశ్రయించియున్నయవిద్యచేఁ (దానును జీవుడు నొక్కటియే కావునఁ 'దన్నాశ్రయించి యున్నయవిద్య' యనినను 'జీవు నాశ్రయించియున్నయవిద్య' యనిన నొక్కటియే) ప్రపంచరూపముతో విస్తరించును. ఈకారణమువలన మీరు వైశేషికులు కార్యకారణభేదము సాధించుటకై చేయుననుమానములు నిరాధారములైనవి. ఎట్లనిన:—

కార్యము ఉపాదానకారణమునకంటె భిన్నము. ఉపాదానకారణము కానవచ్చినను కార్యము కానరాలేదు. దారములనుచూచినవాఁడు 'ఇదివస్త్రము' అనిగ్రహించుటలేదుకదా! (''కార్యం ఉపాదానకారణాద్భిన్నం ఉపాదానకారణోపలబ్ధావపి తదనుపలబ్ధేః తంతోరుపలబ్ధావివ పటః పటవత్ అనునది యనుమానవాక్యస్వరూపము'')అని మీరు చెప్పుచున్నారు. లోకమునమాత్రము వస్త్రము చుట్టఁబడియున్నప్పుడు 'ఇది వస్త్రము' అని తెలియకున్నను పఱచినపిదప తెలియవచ్చినట్లు దారములయందును ఉత్పత్తికిఁ బూర్వము అభివ్యక్తిలేకుండ నున్నవస్త్రము, మగ్గము, సాలెవాఁడు మొదలగుకారకములు పనిచేసినపిదప నభివ్యక్తినొందుచుండుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. మఱియు ఉపాదానకారణమునకంటెఁ గార్య మధికపరిమాణము కలది యగుటచే వానికిఁ బరస్పరభేద ముండవలయును ('కార్య ముపాదానకారణా ద్భిన్నం అధికపరిమాణత్వాత్ పటవత్' అనునదియనుమానవాక్యస్వరూపము'అనియుఁజెప్పుచున్నారు. లోకమునమాత్ర మెవ్వఁడును చుట్టఁబడి యల్పపరిమాణముఁ గలిగియున్నవస్తువునకంటె పఱువఁబడి యధికపరిమాణముఁ గలిగియున్నదాని నన్యముగ గ్రహించుట లేదు. కావున మీసిద్ధాంత మెట్లును నిలువదు. కారణకార్యములు సంకుచిత విస్తృతపటమునంటివే గాని భిన్నములు కావు.

అవతారిక: "ఇట్లయినను మాసిద్ధాంతమునకు భంగము రాలేదు. కార్య కారణములు భిన్నములే. అవి సమాన కార్యములచే యాచరించుటలేదు. దారములు చేయుపనిని వస్త్రము చేయుటలేదు. 'ఉపాదానా త్కార్యం భిన్నం భిన్న కార్యకర త్వాత్ పటవత్' అనునది యనుమానవాక్యస్వరూపము" అను తార్కికయుక్తిని ఈ క్రిందిదృష్టాంతముచే దూషించుచున్నాఁడు.

## ౧౫౪. యథా చ ప్రాణాదిః. ౨. ౧. ౨౦.

తాత్పర్యము. మఱియు ప్రాణాదివాయువులు వాయుమాత్రములే యైనట్లు వాయువునకంటె భిన్నములగు కార్యముల నాచరించుచున్నను తద్భిన్నములు కానట్లు కార్యముకూడ భిన్నవ్యాపారముల నాచరించుచున్నను కారణమునకంటె భిన్నము కాదు. చూడుఁడు. ప్రాణాయామముచే * ప్రాణాదివృత్తుల నిరోధించిన నవియన్నియుఁ గారణమాత్రరూపముతోనే నిలుచును. అప్పుడు శరీరమునకు జీవము నొసంగుట యను కార్యము నొక్కదానినే యాచరించును. మఱల నిరోధము బాసినప్పుడు చాపుట ముడుచుట మొదలగు కార్యములఁగూడ నధికముగ నాచరించును. అయినను వాయురూపము లగుటచే వానికి నెప్పటికిని తద్భిన్నత్వము కలుగదు. లోకమునఁగూడ నట్టివ్యవహారము లేదు. ఎవ్వఁడైనను ప్రాణవాయువు నాసికారంధ్రములనుండి వెలికి నిర్గమించునప్పుడు వాయువు కాదనియు లేక నిరోధింపఁబడినప్పుడు శరీరమున వాయువు లేదనియు ననుచున్నాఁడా? కావున క్రియాభేదము కానవచ్చినంతమాత్రమున కారణకార్యములకు భేద ముండనక్కఱలేదు.

కావున నెప్పటికిని కార్యకారణము లొక్కటియే. ఇట్లగుటచేఁ జేతనజడరూప మగునీసర్వప్రపంచమునకును పరమేశ్వరుఁడే కారణమగుటచే నీప్రపంచమునకును ఆయనకును భేద మింత యైనను లేదు. 'పరమేశ్వరుఁడే ప్రపంచకారణము' అనువిషయము ప్రథమాధ్యాయమున బాగుగ నిరూపింపఁబడెను. యుక్తులచే నీపాదమునందును ఇప్పటికే నిర్ణయింపఁబడినది. కావున "యే నాశ్రుతం శ్రుతం భవ త్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతం" "ఏపదార్థము నెఱింగిన సర్వము నెఱుంగఁ

---

* ప్రాణాదివృత్తులు (పు. ౫౨౧ చూడు.)

బడిన ట్లగునో, దేనిని వినిన సర్వమును వినఁబడినట్లగునో దేనిని భావించిన సర్వమును (అనఁగా: స్వయముగ తెలియనిదియు విననిదియు భావింపనిదియు గూడ) భావింపఁబడినట్లే యగునో" అను మొదలగు వాక్యములచేఁ జేయఁబడిన ప్రతిజ్ఞ (కారణజ్ఞానముచే కార్యవిజ్ఞానము కలుగు నను ప్రతిజ్ఞ) సార్థక మగుచున్నది. అభిన్నము లగుపదార్థములు మాత్ర మేకదా! ఒకదానిజ్ఞానముచే రెండవది తెలియనచ్చుట. కావున నెట్లును మాసిద్ధాంతమే యుక్తియుక్తమైనది.

## ఇతరవ్యపదేశాధికరణము. ౭.

సంగతి—"పూర్వాధికరణమునఁ బ్రపంచబ్రహ్మములకు నభేదమును చెప్పుటచేఁ జీవబ్రహ్మములకుఁ గూడ నభేదము నంగీకరించిన ట్లయినది; కావున ఆబ్రహ్మమే జగత్కారణ మయ్యెనేని జీవులును జగత్కారణమే కావలయును. అప్పుడు జీవులు జరామరణాద్యనర్థముల సృజింపరు." అను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను; కావున దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధ మాక్షేపసంబంధము.

సందేహము— "పరమేశ్వరుఁడే జగత్కారణ మయ్యెనేని ఆయన తన కనిష్టము లగుజరామరణాదుల సృజింపఁడు. ఆయన సర్వజ్ఞుఁడుకదా! ('జగన్నబ్రహ్మ జనయతి దుఃఖభూయిష్ఠత్వాత్ లౌకికపురుషవత్' అనునది యనుమానవాక్యస్వరూపము') అనున్యాయముతో సమన్వయమునకు విరుద్ధము కలదా? లేదా?" అనునదియే సంశయస్వరూపము.

అవతారిక:—ఈసంశయమును నివారించుటకై సూత్రకారుఁడు మొట్టమొదట సహేతుకముగ పూర్వపక్షము ననువాదముఁ జేయుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము.—

### ౧౫౫. ఇతరవ్యపదేశాద్ధితాకరణాది దోషప్రసక్తిః. ౨. ౧. ౨౧.

తాత్పర్యము:—శ్రుతియందు 'స ఆత్మా తత్త్వమసి తత్స్వ

ష్వా త దే వానుప్రావిశత్' అను మొదలగువాక్యములచే జీవుఁడు బ్రహ్మ ముగను బ్రహ్మము జీవుఁడుగను చెప్పఁబడియున్నది. ఇట్లగుటచేఁ బ్రహ్మ మునకుఁ గలదని చెప్పఁబడియున్న జగత్కర్తృత్వము జీవునకే కల దన వలయును. అవిద్యోపాధివలన నొకవేళ జీవులు బ్రహ్మము నాత్మభూత ములుగ నెఱుంగకున్నను బ్రహ్మముమాత్రము వారి నాత్మభూతులుగ నెఱుంగును. అట్లెఱుంగకున్న నాయనకు సర్వజ్ఞత్వహాని కలుగును కదా! కావున జీవకార్యములే బ్రహ్మకార్యములు.

"ఇట్లు కాదు. శ్రుతియందు జీవబ్రహ్మభేదముకూడ చెప్పఁబడి యున్నది. 'సో ఽన్వేష్టవ్యః' 'ఆపరబ్రహ్మమును వెదకవలయును' అను మొదలగువాక్యము లనేకములు కలవు. జీవబ్రహ్మము లొక్కటియే యైనఁ బరమేశ్వరుని వెదకువార లెవ్వరు?" అని యెదవేమొ ఇట్లయినను అభేదమునే మీరు రంగీకరింపవలయును. ఒకస్థలమున భేదాభేదములు రెండునుఁ బరస్పరవిరుద్ధము లగుటచే నిలచియుండవు. రెంటిలో నొక్కటిమాత్రమే పారమార్థికము కావలయును. పైయధికరణమున మీరే 'అభేదము పారమార్థికము' అని చెప్పియున్నారుకదా!

ఇట్లగుటచే పరమేశ్వరుఁడే ప్రపంచమును సృజించునేని ఆయన జరామరణాదుల సృజింపఁగూడదు. ఒకవేళ అవి తనకు వచ్చినను ఇచ్ఛామాత్రమున బోఁగొట్టుకొనవలయును. కాకున్నను రమ్యము లగు పదార్థముల నిచ్ఛామాత్రమున సంపాదించుకొనవలయును. జీవులకుఁ గలుగుదుఃఖములు కూడ తనకు గలిగినట్లే యగుటచే నాపరమేశ్వరుఁడు దుఃఖమునే కలిగింపఁగూడదు. ఎవ్వఁడైనను పరుల నిర్బంధము లేక స్వయముగనే ఒక్కచెఱసాలను నిర్మించుకొని యందు ప్రవేశించునా? మఱియు జీవునకు స్వాతంత్ర్య ముండవలయు నని మీసిద్ధాంతమువలన నేర్పడుచున్నది. ఎంతమాలిన్యములోఁ బడవైచినను సువర్ణమునకు తేజస్సు చెడిపోవునా? ఎన్నిపదార్థములచే నాచ్ఛాదించినను అగ్ని తన యెదుట నున్నవానిని దహింపక విడుచునా? ఇట్లే జీవుఁడును తన తత్త్వము నెఱుంగలేకపోయినను సహజ మగుచేతనత్వమును విడువ నట్లే స్వాతంత్ర్యమునుగూడ విడువఁగూడదు. లోకానుభవముమాత్ర మిందుకు విరుద్ధమై యున్నది.

మఱియు లోకమునఁ బ్రతివాఁడును తా నొనర్చిన కార్యముల స్మరించుచున్నాఁడు. చేతనుఁడే సృష్టికర్త యగునేని ఆతఁడే జీవుఁడు నయ్యెనేని ప్రతిపురుషుఁడును తానే ప్రపంచసృష్టికర్త యని స్మరింప వలయును. పరమేశ్వరునకుఁ గలజ్ఞాన మెప్పటికిని కొఱఁతపడునది కాదు కదా! లోకానుభవముమాత్ర మిందుకు విరుద్ధమై యున్నది.

కావున చేతనకారణవాదము యుక్తియుక్తము కానేరదు. అనర్థకరము లగుజరామరణాదులు ప్రపంచమున నుండుటయుఁ దన్నివారణమం దైనను జీవులకు స్వాతంత్ర్యము లేకపోవుటయు మొదలగు ననేకదోషము లీవాదమున వచ్చుచున్నవి కదా! తాను అతిపరిశుద్ధుఁ డయ్యు నతిమలిన మగునీదేహమును జీవుఁ డాత్మగాఁ భావించుచుఁ గూడ నున్నాఁడు కదా!

అవతారిక:— పై పూర్వపక్షమును క్రింది సూత్రములచేత ఖండించుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము—

## ౧౫౬. అధికం తు భేదనిర్దేశాత్. ౨. ౧. ౨౨.

తాత్పర్యము: మాసిద్ధాంతమునఁ బైఁ జూపఁబడినదోషము లేవియు లేవు. సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నిత్యముక్తుఁడు నగుపరమేశ్వరుఁడే ప్రపంచమునకు కారణభూతుఁ డని మేము చెప్పుచున్నాము. ఆయనకు జ్ఞానమునందుఁగాని శక్తియందుఁగాని కొఱఁత యేమియు లేదు. నిత్యముక్తుఁ డగుటచే నాయనకు హితాహితము లనునవియే లేవు. ఇఁక నీమతమున నాదోషము లెట్లు సంభవించును?

మేము జీవులకు సృష్టికర్తృత్వముఁ జెప్పుటలేదు. 'సోఽన్వేష్టవ్యః' అను మొదలగు ననేకవాక్యములచే శ్రుతియు వ్యవహారదశయందు జీవబ్రహ్మభేదమును చెప్పియున్నది. హితాహితములును సృష్టియు మొదలగునవియన్నియు వ్యావహారికములే; అవిద్యామాత్రకల్పితములే కదా! మహాకాశఘటాకాశములవలె పారమార్థికాభేద మున్నను జీవపరమేశ్వరులకు వ్యావహారికభేద ముండవచ్చు నని యిదివఱకే పలుమాఱు నిరూపించియున్నాము; హితాహితాదిరూప మగుసంసారము కూడ పరమార్థస్థితిలో లే దనియును చెప్పియున్నాము. కావున జీవుఁడు

సృష్టికర్త యగునేని మీరుచెప్పినదోషములు వచ్చును; కాని పరమేశ్వరుఁడు కర్త యైనప్పుడు రానేరవు.

'భేద మున్నను జీవులకుమాత్రమే తత్త్వజ్ఞాన ముండదు; కాని పరమేశ్వరున కుండునుకదా! యనియు నుపాధిపరిచ్ఛిన్నుఁ డైనను జీవుఁడు చేతనత్వమునువలెనే స్వాతంత్ర్యమునుగూడ విడువరాదనియు చెప్పియున్నాముకదా!" అనియెదవేమొ వినుము. పరమేశ్వరుఁడు జీవులను స్వస్వరూపమాత్రులనుగాఁ జూచు ననుట నిస్సంశయమే! కాని ఆయన వారికిఁ గలయవిద్యోపాధిని మాత్రము చూడఁడు; ఆయుపాధి నెఱుఁగలేక 'నేను పరమేశ్వరుఁడను' అని తలంచుచు నాజీవులు భ్రాంతి కల్పితము లగుహితాహితములయందు ప్రవర్తించుచున్నా రనుటను గూడ జూడఁడు. తత్త్వజ్ఞానవంతుఁ డగుజీవన్ముక్తునకుఁగూడ నట్టి వేవియుఁ గానరావనిన నీక బరమేశ్వరునకా గానవచ్చుట? ఈకారణమువలన జీవు లెట్లుపోయినను పరమేశ్వరునకుఁ గలుగుహాని యేదియు లేదు. ఇఁక జీవులకు గలస్వాతంత్ర్యహానినిగూర్చి విచారించిన నదియు భ్రాంతికల్పితమే. జీవుఁడును సర్వసాక్షియై స్వప్రకాశుఁడై యుండియు దనకుఁ గలయుపాధిని తెలిసికొనలేక బుద్ధిమొదలగునవియే తా నని భావింపుచు స్వాతంత్ర్యహీనుఁ డగుచున్నాఁడు. 'నేను పరతంత్రుఁడను' అని భావించుచున్నాఁడు. కావున నెట్లును మాసిద్ధాంతమునకు భంగము లేదు.

మఱియు వేదమున మీ రన్నట్లు అభేదముకూడ వర్ణింపఁబడి యున్న దనుట నిశ్చయమే! ఐనను అది పారమార్థిక విషయ మనియు దానివలన వ్యావహారిక మగుసృష్టియందు దోషము నాపాదించుటకు వీలులే దనియు నిదివరకే నిరూపించియున్నాము. పారమార్థికస్థితినిఁ బట్టి చూచిన బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలిగినప్పుడు జీవునకు సంసారమే లేదు; హితాహితములుఁగాని సృష్టికాని లేదు. వ్యావహారికస్థితిని బట్టి చూచినచో నప్పుడు జీవబ్రహ్మ లేకరూపులు కారు; జీవునకు గలహితాహితాదులు సృష్టికర్త యగుపరమేశ్వరునకుఁ గలుగవు; కావున పారమార్థికస్థితి ననుసరించిన నీశ్వరుఁడు సృష్టికర్తయే కాకపోవుటచేతను, వ్యావహారికస్థితియందు హితాహితములు లేనివాఁ డగుటచేతను ఆయనకు ఎప్పటికిని మీరుచెప్పినదోషములతో సంబంధ ముండదు; ఇఁక మీ రెప్పని

నాక్షేపింతురు ? కావున నెట్లుచూచినను చేతనకారణవాదమునకు నాక్షేపము లేదు.

అవతారిక :— ఈ విషయమునందు దృష్టాంతముఁ జూపుచున్నాఁడు.

## ౧౫౭. అశ్మాదివచ్చ తదనుపపత్తిః. ౨. ౧. ౨౩.

తాత్పర్యము:—'పారమార్థికస్థితిలో సర్వమును బ్రహ్మమే యైన జడము లగు స్తంభాదులు కూడఁ జేతనములు కావలయును కదా !' అని యెదవేమొ అట్లు కాదు. లోకమున నొకకారణమునుండి జనించిన పదార్థములయందుఁ గూడ ననేకవిధము లగుభేదములు కానవచ్చుచున్నవి. ఒక్కభూమినుండి జనించినవియే యైనను పాషాణము లన్నియు నొక్కవిధముగ లేవు. కొన్ని మహామూల్యము లగువజ్రవైడూర్యాదులుగ నున్నవి. మఱికొన్ని మధ్యమములై సూర్యకాంత చంద్రకాంతాదులుగ నున్నవి. వేఱొకకొన్ని తేజోహీనములై కాకులను కుక్కలను కొట్టుటకు మాత్రమే యుపయోగించునవిగ నున్నవి. వృక్షములును ఒక్కభూమినుండియే జనించుచుండియు బహువిధగంధరసములతోఁగూడి బహుభేదములతో నున్నవి. ఇట్లే యొక్కయన్నము నుండి జనించునవియైనను రక్తము వెంట్రుకలు గోళ్లు యెముకలు మొదలగునవి భిన్నస్వభావములతో నున్నవి. కావున నిట్లే ఒక్కపరమేశ్వరునుండియే జనించినను ప్రపంచము నానారూపములతో నుండవచ్చును. కొన్ని యచేతనములుగ నుండవచ్చును. మఱికొన్ని మఱియొకవిధముగను కూడ నుండవచ్చును. కావున నెట్లును మీరన్నదోషములు మామతమున నుండవు.

వాస్తవస్థితిలో శ్రుతిని బట్టిచూచిన వికారము లన్నియు నామరూపమాత్రములే యసత్యములే కావున నిందుఁ గానవచ్చు వైచిత్ర్యమంతయు స్వప్నమునఁ గానవచ్చువైచిత్ర్యమువంటిదే కాని మఱియేమియుఁగాదు. వాస్తవమైననే కదా! మీయాక్షేపము మాకుతగులుట!

---

# ఉపసంహారదర్శనాధికరణము. ౮.

సంగతి:—'పూర్వాధికరణమున నుపాధిభేదము నాశ్రయించి మాపూర్వపక్షమునకు సమాధానముఁ జెప్పితిరి. ఇప్పుడు అట్టిభేదము నాశ్రయించినను మీకుఁ గార్యనిర్వాహకము కాదు. అద్వితీయుఁ డగు బ్రహ్మము సాధనాంతరసహాయము లేక సృష్టిని చేయనేరఁడు' అని ప్రత్యుదాహరణసందర్భముచే వచ్చినయాక్షేపమును నివారించుటకై యీ యధికరణ మారంభింపఁబడెను.

విషయము:—ఇచ్చట 'నద్వితీయబ్రహ్మమునుండి ప్రపంచము జనించెను' అని పూర్వాధ్యాయమునఁ జేయఁబడినసిద్ధాంతమే విషయము. పూర్వపక్షసిద్ధాంతములతో దీనినిగూర్చియే యిందు విచారింపఁబడును.

సంశయము:—'లోకమున నొకకార్యము నాచరించువాఁడు అనేకములను సహాయముగఁ గైకొనుచున్నాఁడు. కుమ్మరి కుండను చేయునప్పుడు చక్రము కఱ్ఱ మొదలగువానినిఁ గైకొనుచున్నాఁడు. పరమేశ్వరుఁ డద్వితీయుఁడే యగుటచే నట్టిసహాయ మాయనకు లేదుకదా! కావున నీలోకన్యాయముచే 'అసహాయం బ్రహ్మ న సృజతి అసాధనత్వాత్ వ్యతిరేకే కులాలవత్' అనున్యాయముతో విరోధము మీ సిద్ధాంతమునఁ గలదా? లేదా?' అనునది సంశయస్వరూపము.

అవతారిక:—సూత్రకారుఁడు ఈక్రిందిసూత్రమునఁ బూర్వపక్షానువాదపూర్వకముగ సిద్ధాంతముఁ జేయుచున్నాఁడు.

## ౧౫౮. ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి. ౨. ౧. ౨౪.

పూర్వపక్షము:—మీరు అద్వితీయుండగుపరమేశ్వరుఁడే ప్రపంచ కారణ మనుచున్నారు. లోకమున నిట్టిదృష్టాంత మేదియును లేదు. కుమ్మరివాఁడు మొదలగువారు దండము చక్రము మొదలగుసహాయములఁ గైకొని కాని కార్యముల నాచరించుట లేదు. లోకమున సర్వపదార్థములు నేకజాతి కలవిగా లేవు. భిన్నజాతి గలపదార్థములు ఒక

కారణమునుండి జనింపవు. 'భూమినుండి యనేకజాతులు గలవృక్షములు జనించుచున్నవికదా !' అనియెదవేమొ వానిబీజములు వేరువేరుగ నుండుటచే నిది మీయాక్షేపము సాధింపఁగలదృష్టాంతము కానేరదు. ఇట్లుఁగాక నేకజాతి గలపదార్థములే యైనను కారణ మసహాయ మగునేని యొక్కమాత్రే జనింపవలయును కాని క్రమముగ (అనఁగా: నొక్కదానివెనుక మఱియొక్కటిగ) జనించుట సంభవింపదు. సహాయ ముండినచో నాకారణభూతుం డగుపరమేశ్వరుఁడు ఒకదానివెనుక మఱియొకదానిఁగా సృజింపవచ్చును. కావున నసహాయుఁ డగుపరమేశ్వరునుండి ప్రపంచము జనింపదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. నీయాక్షేపము నిర్గుణబ్రహ్మమును గూర్చినదియా? లేక అనిర్వచనీయ మగుప్రపంచ సూక్ష్మావస్థతోఁ గూడినసగుణబ్రహ్మమును గూర్చినదియా? మొట్ట మొదటిపక్షము నాశ్రయించిన నానిర్గుణమునుండి యేదియు జనింపనే లేదు. 'న తస్య కార్యం కరణం చ విద్యతే' 'ఆపరమేశ్వరునకు కార్యముగాని సాధనముగాని లేదు' అని శ్రుతులు ఘోషింపుచున్నవి. ఇఁక రెండవపక్షము నాశ్రయింతువేని వినుము. లోకమున సాధనాంతర సహాయము లేకయే స్వయముగఁ గాలాదివశగతములై పరిణామమునుఁ జెందుపదార్థము లనేకములు కలవు. పాలు కాఁచబడికాని యూరకఁ గాని మఱుదినమువఱకు నుండిన స్వయముగనే గడ్డకట్టును జలంబును ఒకానొకదేశమున స్వయముగ మంచుగడ్డ యగును.

"వీనికిని వెలుపలి యుష్ణత్వశీతత్వముల సహాయము కలదుకదా" అనియెదవేమొ సత్యమే కాని ఆజలాదులయందు పరిణామసామర్థ్యము లేకున్న నివి వాని నట్లు పరిణమింపఁ జేయుగలవా? వెలుపలి శీతోష్ణత్వములు గాలిని గడ్డకట్టింపనుఁ గాని కరగింపనుఁగాని కలవా? కావున వీనిసహాయ మొకసహాయము కాదు. చేతనపదార్థము సహాయముగ నున్నది యని నిరూపింపఁ గలిగిన నప్పుడు దాని సహాయముమాత్రమే సహాయముగ గణింపఁబడును. శీతోష్ణములు స్వభావనియతములు కదా! మఱియు నీశీతోష్ణములు మొదలగుసాధనములు కారణ మసమర్థ మైనచో దానిసామర్థ్యమును పూర్తిఁ జేయును. పరమేశ్వరుఁడు సర్వశక్తియుక్తుఁడు విచిత్రశక్తులచే సర్వకార్యముల నాచరింపఁగలవాఁడు.

ఇట్టివానికి నితరసాధనము లేసాసుర్థ్యమును పూర్తిఁ జేయుటకై కానల యును? కావునఁ బరమేశ్వరుఁ డద్వితీయుఁ డైనను* సాధనాంతరరహితుఁ డైనను ప్రపంచమును సృష్టింపవచ్చును.

అవ:—"మీరు చెప్పినదృష్టాంతము సరిపడదు. లోకమునఁ గొన్నియచేతనపదార్థములు మీ రన్నట్లు బాహ్యాచేతనసహాయము లేకయే స్వభావనియతము లగుకాలాదులవలనఁ గార్యరూపములతోఁ బరిణమించుచున్నవి యనుట నిస్సంశయమే. అయినను పరమేశ్వరుఁ డట్టివాఁడు కాడు. చేతనుఁడు లోకమునఁ జేతనపదార్థ మేదియు నచేతన సహాయము లేక స్వయముగఁ బరిణమించుట లేదు" అనుపూర్వపక్షము మఱియొకదృష్టాంతముచే ఖండింపుచున్నాఁడు.

## ౧౪౬. సూ. దేవాదివ దపి లోకే ౨. ౧. ౨౫.

తాత్పర్యము.—చేతను లగుకులాలాదులు కొందఱు సాధనాంతరసహాయము లేక పనిఁ జేయుట లే దనినంతమాత్రమున నన్ని చేతనములు నట్లే యుండవలయు నని నియమించుటకు వీలులేదు. దేవతలును మహామునులును సిద్ధులును మొదలగుచేతను లనేకులు బాహ్యాపదార్థసహాయము లేకయే సంకల్పమాత్రమున ననేక దేహములఁ గల్పించుచున్నారు; అనేకపదార్థములఁ గూడ సృజింపుచున్నారు. (ఈవిషయము. ౧. ౩. ౨౭. చూడుఁడు) ఇది మంత్రార్థవాదములయందును వృద్ధవ్యవహారములయందును ప్రసిద్ధమై యున్నది. శ్రీకృష్ణుఁడు తనసంకల్పమాత్రముచేత నే ద్రౌపదికి వస్త్రపరంపరల నొసంగెను. పదియారువేల రాజకన్యలయిండ్లయందునుఁ బదియారువేలరూపములతో నొక్కసమయముననే నుండెను. ఇంద్రుఁడు సంకల్పమాత్రముచే నలరూపమునుఁ దాల్చెను.

మఱియు చేతన మగుసాలెపురుగు సాధనాంతరసహాయము లేకయే దారమును సృజించుచున్నది. (స్వాతి) కొంగలు శుక్రసంబంధము లేకయే గర్భముఁ దాల్చుచున్నవి 'గర్భం బలాకా దధతే ఉభ్ర యోగా న్నాకే నిబద్ధావళయః సమంతాత్' 'స్వాతికొంగలు వర్షాకాలమున నాకాశము నందంతటను బారులుతీరి పోవుచు మేఘమునుండి స్రవించినజలమువలన

---

* సాధనాంతరరహితుఁడై తన స్వరూపమునకంటె నితరము లగుసాధనములు లేనివాఁడై.

గర్భమునుదాల్చును' అని శాస్త్రము. మఱియుఁ దామరతీఁగె సాధనాంతరసహాయము లేకయే యొకసరస్సునుండి ! మఱియొకసరస్సుకు పోవుచున్నది. ఇట్లే విచిత్రశక్తివంతుఁ డగుటచేఁ బరమేశ్వరుఁడు సాధనాంతరసహాయము లేకయే ప్రపంచమును సృజింపవచ్చును.

"ఈదృష్టాంతములు సరిగా నుండలేదు. దేవతలు మొదలగువారు అచేతనము లగుతమశరీరములచేతనే శరీరాంతముల నిర్మించుచున్నారు. అచేతనవ్యతిరిక్తముగా నున్నచేతనుఁ డగునాత్మ యెట్లును పరిణమించుట లేదు. సాలెపురుగు క్షుద్రజంతుభక్షణముచే కఠినమై యచేతనమై యున్న లాలాజలమునే (చొంగనే) దారముగా నుపయోగించుచున్నది గాని స్వయముగ తంతురూపముతోఁ బరిణమించుట లేదు. స్వాతికొంగలు గర్భమునుఁ దాల్చుటకుఁ గూడ శుక్రము లేకున్నను తత్స్థానమున మఱియొకపదార్థము కలదు. తామరతీగెయుఁ జేతనయుక్తమైయే యొకస్థలమునుండి మఱియొకస్థలమునకు నచేతన మగుశరీరముతోనే పోవుచున్నది గాని చేతనసహాయము లేకయే యెట్లును చేయుట లేదు" అనియెదవేమో వినుము.

దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణమగుపోలిక యుండ నక్కఱలేదనియు మనకు నేవిషయమునఁ బోలిక కావలయునో ఆవిషయమున మాత్రమే పోలిక యుండినఁ జాలు ననియు నిదివఱకే నిరూపించియున్నాము. కావున నిచ్చట నిట్లు వాదించుటకు వీలు లేదు. మీరు చేతనుఁడగుకుమ్మరికి సాధనాంతరసహాయము కల దనియు ఆకారణమువలనఁ జేతనపదార్థముల కన్నిఁటికిని సాధనాంతరసహాయ ముండవలసినదియే యనియుఁ జెప్పితిరి. మేము దానికి విరుద్ధము లగుస్థలములఁ జూపితిమి. దేవాదులును చేతనులే యైనను వారికి శరీరాదికల్పనమునందు సహాయాంతరము లేదు కదా. మాకుఁ గావలసినపోలిక యింతియే. బాగుగ విచారించిన మేముచెప్పిన దృష్టాంతము లెట్లుసరిపడవో నీవుచెప్పిన దృష్టాంతముకూడ నట్లే సరిపడదు. కుమ్మరవాఁడు సాధనములఁ గైకొని పనిఁ జేయుచున్నాఁడనిన నచ్చట పనిచేయునది యచేతన మగు దేహమే కదా. చేతనుఁడు సర్వసాక్షి. యాయనకు నీసాధనములతో సంబంధ మేమి కలదు ? ఆయనయే దేహము నాశ్రయించి కార్యము నాచరించుచున్నాఁ డనినను ఆ మనకుఁ గలకర్తృత్వము * సాన్నిధ్యమాత్ర సాధ్య కర్తృత్వమేగాని

* సాన్నిధ్యమాత్రసాధ్యకర్తృత్వము (పు. ౭౬ చూడు.)

*సాధనసాధ్యకర్తృత్వము కాదు కదా! కావున దేహాత్మలకు గల యభేద భ్రాంతి నాశ్రయించి నీవు 'కులాలుఁడు చేతనుఁడు' అనిచెప్పితివి? నేనును దానినే ఆశ్రయించి, 'దేవతలు చేతనులు' అని చెప్పితిని. నీ వెట్లు పూర్వ పక్షముఁ జేసితివో నేను నట్లే సమాధానముఁ జెప్పితిని. ఇందు దోష మేమి? వాస్తవస్థితిలో మాయభిప్రాయ మేది యనిన 'కుమ్మరవానికిఁ గుండలు చేయునప్పుడు ఇతరసహాయములు కావలయు ననునంతమాత్రమున, చేతనుల కందఱకు నట్లే కావలయు నను నియమము లేదు' అనుటయే!

---

## కృత్స్నప్రసక్త్యధికరణము. ౯.

విషయము, "పరమేశ్వరుఁడు అవయవములు లేనివాఁ డయ్యును బ్రపంచమును సృజించును" అనుసిద్ధాంతము విషయము.

'ఇందు సంశయమునకుఁ గారణ మేది కలదు. అద్వైతులు వివర్త వాదము నాశ్రయించిరి. వారిమతమునఁ బ్రపంచమంతయు మాయాకల్పిత మే కాని పరమార్థము కాదు. మాయాకల్పిత మగువస్తు వెట్లయినను పారమార్థికపదార్థమునకు లోపము రాదు కదా! తిమిరరోగి యొకచంద్రు ని రెండుగాఁ జూచినంతమాత్రమున నాచంద్రుఁడు రెండురూపములు గల వాఁడు కానేరఁడు; ఆరెండురూపములు సంభవింపక పోయినంతమాత్ర మున నాచంద్రునకు వచ్చులోపము నేదియు లేదు కదా! ఇట్లే పరమేశ్వ రునకుఁ గూడ నేలోపంబును రాదు' అనిమెదవేమొ యది సత్యమే! అయినను పూర్వాధికరణమునఁ †బరిణామికారణములగుపాలు మొదలగు నవి దృష్టాంతములుగఁ జెప్పఁబడి యుండుటచేఁ బరమేశ్వరుఁడు కూడఁ బ్రపంచమునకుఁ బరిణామకారణ మగునేమో యని సంశయము తోఁచు ను. దానిని నివారించుటకై మజల నీయధికరణమునఁ బై విషయము విచా రింపఁబడును.

సంగతి—పై సంశయమును జనింపఁ జేయునది యగుటచేఁ బూ ర్వాధికరణము; ఆసంశయమువలనఁ గలిగినపూర్వపక్షమును నిరాక

---

* సాధనసాధ్యకర్తృత్వ మనఁగా స్వయముగనే యుపకరణములఁ గైకొని పనిచేయుట.

† పరిణామికారణము (పు. ౮౨౨, చూడు.)

రించుటకై వచ్చినది యగుటచే నీయధికరణము దానికిఁ గార్యము. ఈకార్యకారణభావమే దీనికిఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధము.

సందేహము.—"అవయవములు లేనిపదార్థము లోకమునఁ గార్యరూపముతోఁ బరిణమించుటలేదు. కావునఁ బరమేశ్వరుఁడు సావయవుఁడే కావలయును.('పరిణామి సావయవం పృథివ్యాదివత్' అనునది యనుమానవాక్యస్వరూపము) అనున్యాయముతో మీసమన్వయమునకు విరోధము కలదా? లేదా?" అనునది సంశయస్వరూపము. కారణఫలములు పూర్వమువలెనే యూహించునది.

అవతారిక:—ఈసంశయమును నివారించుటకై సూత్రకారుఁడు పూర్వపక్షము ననువాదముఁ జేయుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము.—

## ౧౬౦. కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వ శబ్దకోపో వా. ౨. ౧. ౨౬.

తాత్పర్యము:—పైయధికరణమునఁ జేయఁబడినసిద్ధాంతము యుక్తియుక్తము కానేరదు. పరమేశ్వరునకు నవయవములు లేవా? కలవా? లేకపోయినఁ బ్రపంచరూపముగఁ బరిణామము నొందునప్పుడు కొంచమైనను మిగిలియుండదు. అవయవము లుండిననే కదా కొంతభాగము పరిణమించి మఱికొంతభాగము పరిణమింపకయే యుండు నని చెప్పుటకు వీ లుండును. లోకమునను అవయవములు కలవి యగుటచే మృదాదిపదార్థములు ఒకభాగమున ఘటాదిరూపములతోఁ బరిణామము నొందినను మఱియొకభాగమున స్వస్వరూపముతో నున్నవి. ఇట్లగుటచేఁ బరమేశ్వరునకు నవయవములు కలవనియే యవశ్య మంగీకరింపవలసి వచ్చును. అట్లంగీకరింప కున్నఁ బ్రపంచము ప్రత్యక్షమే యగుటచేతను, దానికంటె నన్యముగ బ్రహ్మరూపము లేకుండుటచేతను, 'సో ఽన్వేష్టవ్యః' అను మొదలగుశ్రుతులకు విరోధము వచ్చును; అప్పుడు మీసిద్ధాంతమే నిర్మూలమగును. ప్రపంచరూపమునఁ బ్రహ్మము ప్రత్యక్షముగనే యుండ నెవ్వని వెదకవలయును?

ఇఁక సీదోషమును తొలగించుకొనుటకై యవయవముల నంగీకరించిన నప్పుడు మఱియొకదోషము వచ్చును. అనేకశ్రుతులు 'నిష్కలం

నిష్క్రియం శాంతం. అస్థూల మనణు' అనుమొదలగునవి 'బ్రహ్మమునకు నవయవములు లేవు' అని చెప్పుచున్నవి. వాని కన్నిఁటికిని మీా యంగీకారము విరుద్ధ మగును. వికారముల నొందకయే పరిణమించు ననుటకు నెట్లును వీలు లేదు కదా! కావున నెట్లును మీాసమన్వయము స్థిరపడదు.

అవ:—ఇట్లు అనువాదము చేయఁబడినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు:—

సిద్ధాంతసూత్రము—

## ౧౬౧. శ్రుతేస్తు శబ్దమూలత్వాత్. ౨. ౧. ౨౭.

తాత్పర్యము:—పై పూర్వపక్షము సరియైనది కాదు. బ్రహ్మమునకు నవయవములు లేవనియు నట్లు లేకున్నను కొంతభాగము మాత్రమే ప్రపంచరూపముతో నుండు ననియుఁ గూడ శ్రుతియే చెప్పుచున్నది. సృష్టి యెట్లు శ్రుతియందు మాత్రమే బ్రహ్మకారణకముగఁ జెప్పఁబడి యున్నదో అట్లే ప్రస్తుతవిషయము గూడ జెప్పంబడియున్నది.

ఎట్లనగ:—"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి (ఛా. ౧. ౧. ౨౭.) అనేన జీవేనాత్మనా నుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి (ఛా. ౧. ౪. ౧౪.)" అను మొదలగు వాక్యములయందుఁ బ్రత్యక్షముగఁ బ్రపంచబ్రహ్మవిభాగము చెప్పఁబడి యున్నది. మఱియు "సతా సోమ్య తదా సంపన్నో భవతి" 'ఓ శాంతుఁడా! సుషుప్తికాలమున జీవుఁడు పరమేశ్వరునితో నైక్యము నొందును' అనువాక్యముచే సుషుప్త్యవస్థయందు మాత్రమే జీవునకుఁ బరబ్రహ్మైక్యము వర్ణింపఁబడియున్నది. ప్రపంచవ్యతిరిక్తముగా నిర్వికారబ్రహ్మము లేకుండిన, సవికారబ్రహ్మముతో నైక్యము సర్వకాలములయందును సంభవించియే యుండగా 'సుషుప్త్యవస్థయందు మాత్రమే యైక్యము కలుగును' అని విశేషించి చెప్పుటకు నర్థ మేమి? కావున ప్రపంచసృష్టి మొదలగువానిని చెప్పిన శ్రుతియే యీావిషయమునుఁ గూడఁ జెప్పినది; అవయవములు లేవని కూడఁ జెప్పినది.

కావున మాామతమున దోష మేమియు లేదు. శ్రుత్యర్థము నున్నదాని నున్నట్లు గ్రహించుటయే మాకు నవశ్యకర్తవ్యము. శ్రుతిమూలకు నగో

చరుఁడు ; మనస్సునకు నగమ్యుఁడు "య ద్వాచా నాభ్యుదితం ; య న్మనసా న మను తే" "ఏపదార్థము వాక్కుచే వచింపఁబడదో మనస్సుచే భావింపఁబడదో" అను మొదలగువాక్యములచే నీవిషయము స్పష్ట మగు చున్నది. ఇట్లుండ నాయనను గూర్చి మనతర్కము లెట్లు పనికివచ్చును? "అచింత్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్ ప్రకృతిభ్యః పరం య చ్చ త దచింత్యస్య లక్షణం" "ఏయేపదార్థము సామాన్యమునకంటె మించి యుండునో అది యచింత్య మనఁబడును. అట్టియ చింత్యపదార్థములను తర్కయుక్తులతోఁ గూర్పకూడదు" అని పౌరాణికులు "అగమ్యము లగువిషయములందు తర్కము పనికిరాదు" అని చెప్పి యున్నారు. మేమును శాస్త్రయోనిత్వాధికరణమున (౧. ౧. 3.) పరమేశ్వరవిషయమున శబ్దభిన్న మగునితర ప్రమాణము కేవలముగఁ బ్రవర్తింప దని చెప్పియున్నాము. కావున వేద మె ట్లెట్లుచెప్పునో అ ట్ల ట్లెల్ల నంగీకరింపవలసినదియే. ముఖ్యముగ పరమేశ్వరవిషయముననట్లే యంగీకరించి తీరవలయును. మనస్సునకు నింద్రియములకును గోచరము కాని విషయములను తెలిసికొనవలసినప్పుడు శబ్దముకంటెఁ బ్రమాణ మెచ్చట నున్నది? సామాన్యము లగుమణిమంత్రౌషధాదులప్రభావములే తర్కమునకు గోచరములు కా వనిన నిఁకఁ బరమేశ్వరునివిషయమునుఁ గూర్చి యేమి చెప్పవలయును? కావున వేదానుసారముగ నిర్ణయించినఁ బరమేశ్వరునకు నవయవములు లేవు; ఆయన ప్రపంచమునకంటె నధికుఁడుగఁ గూడ నున్నాఁడు.

పూర్వపక్షము:—ఈసిద్ధాంతము సరి కానేరదు వేదమైనను ప్రమాణవిరుద్ధ మగువిషయముఁ జెప్పిన నంగీకరించుటకు వీలు కానేరదు. పదార్థము అవయవహీన మగునేని బొత్తుగఁ బరిణమింపకయే యైన నుండవలయును; పరిణమించిన సంపూర్ణముగఁ బరిణమింపవలయును. ఇట్లుకాకున్న నవయవసహిత మై యైన నుండవలయును. విచారించిన నీరెండుపక్షములలో నేదియో యొక్కటియే సిద్ధాంతము కావలయును గాని యింతకంటె భిన్న మగుపక్ష మేదియు లేదు. ఇది వస్తుస్వరూపకథన మగుటచే నిందు వికల్ప ముండుటకు వీలు లేదు. ఇట్లు విరుద్ధార్థమును చెప్పుచుండ నది శ్రుతి యగునుగాక ప్రమాణ మెట్లగును? ఇట్టిస్థలములయందు శబ్దమైనను మఱి యేదియైనను అప్రమాణమే యనవలయును.

సిద్ధాంతము:—ఇది దోషము కానేరదు వినుము. నీవు "ప్రపంచమునకుఁ బరమేశ్వరుఁడు పరిణామికారణము" అని భ్రాంతినొంది యీ పూర్వపక్షముఁ జేసితివి. మావాదము *వివర్తవాద మని యారంభణాధికరణమున సిద్ధాంతముఁ జేసియున్నాము. వికారము లన్నియు నామరూపాత్మకములే యని నిరూపించియున్నాము. త్రాటియందు భ్రాంతివశమున నామరూపభేదములతో నారోపింపఁబడినసర్పము వేఱుగాఁ గానవచ్చుచున్నను త్రాడే యైనట్లు యీప్రపంచముకూడ భిన్నముగఁ గానవచ్చుచున్నను బ్రహ్మమే యై యున్నది యని స్పష్టము చేసి యున్నాము. కావున బాగుగ విచారించిన మామతమున దోష మింతయును లేదు.

పరమార్థస్థితిలో బ్రహ్మ మేకరూపమే యైనను దానికి భ్రాంతికల్పిత మగుమఱియొకరూపము కలదు. అదియే ప్రపంచరూపము. ఆరూపమే సూక్ష్మావస్థయం దున్నప్పు డవ్యాకృత మనియు స్థూలావస్థయం దున్నప్పుడు వ్యాకృత మనియు (నామరూపవికాసము, కలది యనియుఁ) జెప్పఁబడుచున్నది. ఆరూపమే యనిర్వచనీయ మైనది. దాని నాశ్రయించియే. 'బ్రహ్మము ప్రపంచరూపమునఁ బరిణమించుచున్నది.' అనుమొదలగువ్యవహారములు ప్రవర్తించుచున్నవి. కావున నాయవిద్యాకల్పితరూపముతోఁ బ్రహ్మము ప్రపంచరూపుఁ డగును; పారమార్థికరూపముతోఁ బ్రపంచాతీతుఁ డగును. తిమిరరోగముచే నొక్కనికి ఇరువురుగఁ గానవచ్చినంతమాత్రమున చంద్రుఁడు పరమార్థస్థితిలోఁ గూడ నిరువురుగనే యుండవలయునా? కావున నీయవిద్యాకల్పితరూపభేదములతోఁ బరమేశ్వరునకుఁ గూడ పారమార్థికసంబంధ ముండ నక్కఱ లేదు. ఆయన స్వయముగ నేకరూపుఁడే కావచ్చును? భ్రాంతికల్పితద్వితీయరూపముతోఁ బ్రపంచరూపుఁడుగఁ గూడనుండవచ్చును. కావున మామతమున నే దోషంబును ఎట్లును సంభవింపనేరదు. శ్రుతియు నప్రమాణము కానక్కఱలేదు.

"శ్రుతి పరిణామమును గూర్చియే చెప్పుచున్నది కదా! దానికి విరుద్ధముగ మీ రీవివర్తవాదము నెట్లాశ్రయించెదరు?" అనియెదవేమో వినుము. శ్రుతి యెప్పటికిని పరిణామమును చెప్పుట లేదు. అట్ల కానవ

* వివర్తవాద మనఁగా ప్రపంచము బ్రహ్మవివర్త మనువాదము (వివర్తస్వరూపము). (పు. ౨౨. చూడు.)

చ్చుట మాత్రమే కాని దానియభిప్రాయ మది కానేర దని తోఁచు చున్న ది. 'ప్రపంచము బ్రహ్మపరిణామము'అని తెలిసికొనుటవలనఁ బ్రయోజన మేమియు గానవచ్చుట లేదు. అనేకవాక్యములయందు 'నేతి నే త్యాత్మా' అని సర్వప్రపంచాతీతుఁ డగువానినే యాత్మఁగా నుపదేశించి యావిష యమును సిద్ధాంతముఁ జేసి 'అభయం వై జనక ప్రాప్తో உసి' అని ప్రపం చాతీతబ్రహ్మజ్ఞానముచే ముక్తిని చెప్పుచున్నది. బాగుగ విచారించిన నా శ్రుతి పరిణామమునే చెప్పినచో మీ రన్నట్లు ప్రపంచాతీతబ్రహ్మమే యుండదు కదా! కావున శ్రుతికిఁ బరిణామమును చెప్పుటయం దభిప్రాయ ము లేదు. ఇఁక నేమి యనిన :—'లోకమునఁ బరిణామికారణము లగు మృత్తికాదులకంటె ఘట మెట్లు భిన్నము కాదో? భేదముతో కానవచ్చిన ను ఘటము మృత్తికామాత్రమే యె ట్లగుచున్నదో అట్లే యీప్రపంచ ము కూడ బ్రహ్మభిన్నము కాదు ; బ్రహ్మమాత్రమే' అని చెప్పుటయే దానియుద్దేశ మనవలయును. ఇట్లు చెప్పిననే కాని 'యే నాశ్రుతం' అను మొదలగుప్రతిజ్ఞ సార్థకము కానేరదు కదా! ఆప్రతిజ్ఞ సార్థక మైననే కాని 'కేవలము భ్రాంతిచేతనే ప్రపంచబ్రహ్మభేదము కానవచ్చుచున్నది. వాస్తవస్థితిలో బ్రహ్మభిన్న మగుపదార్థ మింత యైనను లేదు' అను పర మసిద్ధాంతము దృఢము కానేరదు కదా! కావున మాసిద్ధాంతమున దోష మేదియు లేదు.

అవ:—ఈసిద్ధాంతమును దృష్టాంతపూర్వకముగ స్థిరముఁ జేయు చున్నాఁడు.

## ౧౬౨. ఆత్మని చైవం విచిత్రాశ్చ హి ౨-౧-౨౮.

తాత్పర్యము:—మఱికొంత విమర్శించిన నీవిషయమున వివాద మే యక్కఱ లేదు. పరమేశ్వరుఁడు స్వస్వరూపమునకు హాని లేకయే ప్రపంచము నెట్లు సృజించుచున్నాఁ డనుసంశయమే యక్కఱ లేదు. జీవుఁ డు కలయందు తనస్వరూపమునకు హానియింతయైనను లేకుండఁగనే బహు విధప్రపంచమును సృజింపుచున్నాఁ డని వేదము చెప్పుచున్నది. 'న తత్ర రథా న రథయోగా న పంథానో భవ న్త్యథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" స్వప్నపుకాలమునందు లేక దేశమునందు రథములు గాని వానికి బంధింపఁబడున శ్వాదులు గాని మార్గములు గాని లేవు. అయినను జీవుఁడు

వానినన్నిఁటిని సృజింపుచున్నాఁడు, అను మొదలగు వాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఇట్లే పరమేశ్వరుఁడు కూడ తనస్వరూపమునకు హాని లేకుండగనే ప్రపంచమును సృజింపవచ్చును. మఱియు దేవతలు మునులు రాక్షసులు మొదలగువారు తమమాయాబలముచే స్వశరీరమునకు మార్పు లేకుండగనే క్రొ త్తక్రొ త్తవానిని సృజించుచున్నా రని పురాణేతిహాసాదులయందుఁ గానవచ్చుచున్నది. ఐంద్రజాలికుఁడు తనమాయచే స్వస్వరూపమునకు హాని లేకుండగనే తన దేహమునందు గజాశ్వాదుల సృజింపుచున్నాఁ డనుటను ప్రత్యక్షముగనే చూచుచున్నాము. సర్వశక్తుఁడగుపరమేశ్వరుఁడు మాత్ర మిట్లేల సృష్టిని చేయరాదు? ఆయనకు మాత్ర మేల యావశ్యకముగ స్వరూపహాని కలుగవలయును ?.

అవ:—ఇట్లు చేయఁబడిన సిద్ధాంతమును దృఢపరచుటకై "పూర్వపక్షమే మొట్టమొదట యుక్తము కాదు" అను విషయమును నిరూపించుచున్నాఁడు.

## ౧౬౩. స్వపక్షదోషాచ్చ. ౨. ౧. ౨౯.

తాత్పర్యము:—ఇంతయేల ? బాగుగ విచారించిన మీరు మామతముపై నాక్షేపముఁ జేయుటకే యర్హులు కారు. ఏలయనిన వాస్తవస్థితిలో నావివర్తవాదమున వస్తుస్వరూపమునకు భంగమే కలుగదు. మీవాదములయందు మాత్రమే వస్తువు పరిణమింపవలయును ఆరంభము నైననుచేయవలయును కావున నీదోషములు వచ్చును ; ఆరంభపరిణామములయందు వస్తుస్వరూపమునకు భంగము కలుగును కదా! నిశ్చయముగఁ గూడ మీవాదములయం దీదోషములు కలవు. ఎట్లనిన:—

సాంఖ్యమతస్థులు "అవయవములు లేనిదియు శబ్దాదులు లేనిదియు సర్వవ్యాపక మైనదియు నగుప్రధానము ప్రపంచరూపముగఁ బరిణమించును. ప్రపంచము మాత్ర మవయవయుక్త మైనదియే శబ్దాదులు కలదియే పరిచ్ఛిన్న మైనదియే" యనుచున్నారు. వీరిమతమునందును మామతముపైఁ (వేదాంతిమతముపై) జూపినదోషము లేల రావు ? మా మతమున బ్రహ్మంబును వారిమతమునఁ బ్రధానంబును కూడ నిరవయవమే కదా !

"వారిమతమునందు ప్రధానము అవయవహీనము కాదు. దానికి సత్వరజస్తమోగుణము లనునవయవములు కలవు. త్రిగుణములే కదా ప్రధానము" అనియెదవేమొ యదియు సరి కాదు. ఇంతమాత్రమున వారిమతమునఁ బైదోషములు పోవు. ఏలయనిన:—వారు ఆమూఁడుగుణములును కలసియే ప్రపంచరూపముగాఁ బరిణమించు నని చెప్పుచున్నారు. కాని యొక్కయవయవము (అనఁగా:సత్వగుణము కాని రజోగుణము కాని తమోగుణము కాని యొక్కటియే) మాత్రమే పరిణమించు ననుట లేదు. ఆగుణము లన్ననో అవయవహీనములే. ఇట్లుండ గుణములు మాత్రము మూఁడు ఉన్నంతమాత్రమున గలుగుసావయవత్వము దోషము నెట్లు పోఁగొట్టఁగలదు ? ఆప్రధాన మంతయు బ్రపంచరూపముగఁ బరిణమించు నని యైనను, సత్వాదిగుణములకుఁ గూడ నవయవములు కల వని యైనను చెప్పవలయును. ఇందు మొదటిపక్షము నాశ్రయించినఁ బ్రధానమే శూన్యమగును ; అంతయుఁ బ్రపంచమే యైన నిఁక మిగిలియుండునది యేది ? రెండవపక్షము నాశ్రయించుట వారికి నిష్టము కాదు. "తర్కము నిలువదు కావున నాగుణములకుఁ గూడ నవయవములు కల వనియే మనము భావింతము" అనిన నప్పుడు ప్రధాన మనిత్యము కావలసి వచ్చును. ఇది వారికి సమ్మతము కాదు. అవయవములు కలపదార్థము నిత్య మనుటయు నేవాదికిని సమ్మతము కాదు "ఇట్లయినఁ బ్రపంచము ననుసరించి బహువిధము లగువిచిత్రశక్తులు ఆప్రపంచకారణ మగుప్రధానమునందు కల వనియు నవియే యీవిచిత్రసృష్టినిఁ గలుగఁజేయు ననియు వారియభిప్రాయ మై యుండవచ్చును" అనియెదవేమొ అట్లయిన మాయభిప్రాయము కూడ నిదియే. ఇఁక వారు మ మ్మాక్షేపింప నేటికి ? దోషము కల దనిన నిరువురకును కలదులే దనిన నిరువురకును లేదు కదా !

ఇఁక వైశేషికమతస్థులయభిప్రాయమును విమర్శించిన నందునుఁ బైదోషము కలదు. వారు పరమాణువులను జగత్కారణము లందురు. వానికి నవయవములు లే వందురు. ఆపరమాణువులు రెండు చేరి ద్వ్యణుకమనుపదార్థంబును ఆద్వ్యణుకములు మూఁడు చేరి త్ర్యణుక మనుపదార్థంబు నగు నందురు. అవయవములు లేనిపరమాణువు లొండింటితో జేరు నప్పుడుఁ గూడ పరమాణువే కావలయును గాని పొడవుగా నేర్పడుటకు వీలు లేదు. ఆకాశ మాకాశముతోఁ జేరిన పొడ వగునా ? ఇట్లయిన

సృష్టియే సంభవింపదు. ఇట్లు గాక ఒకపరమాణువుకొనయందు మఱియొకపరమాణువు చేరునని చెప్పిన నప్పటికిని అవయవముల నంగీకరింపకపోవుట సంభవింపదు. అవయవములు లేనిదాని కాద్యంతము లనునవియే యుండవు కదా! అట్లే యంగీకరించిన వారిమాటకే విరోధము వచ్చును. వారు ఆపరమాణువులకు నిత్యత్వము కలుగుటకై వానికి నవయవములు లేవని సిద్ధాంతముఁ జేసియున్నారు కదా. కావునఁ బైఁ జూపినదోషము లందరి మతములయందునుఁ గలవు.

ఈకారణమువలన మామతము నాక్షేపించుటకు నెవ్వరికి నధికారములేదు. ఒకపక్షమునఁ జూచిన వారిమతములయందుఁ గలదోషములకు సమాధానమే లేదు. మేము సయుక్తికముగ మాపై వచ్చినదోషములఁ దొలఁగించితిమి కదా కావున మాసిద్ధాంతములకు నెట్లును భంగము రాదు.

---

# సర్వోపేతాధికరణము. ౧౦.

విషయము:—ఇచ్చట "పరమేశ్వరుఁడు శరీరహీనుఁ డయ్యును మాయాశక్తియుక్తుఁడై ప్రపంచమును సృజించుచున్నాఁడు" అను సిద్ధాంతము విచారవిషయము.

సంగతి:—ఇచ్చటఁ బూర్వాధికరణసిద్ధాంత మగుసర్వశక్తియుక్తత్వము మఱల నిరూపింపఁబడును. కావునఁ బూర్వాధికరణసిద్ధాంతము విషయము; దానిని మరల నిర్ణయించునది యగుటచే నీయధికరణము విషయి. కావున నీరెంటికినిఁ గలసంబంధము విషయవిషయిభావసంబంధము.

సందేహము:—"శరీరముకలవానికే కాని శక్తులు లేవు. ('బ్రహ్మ న మాయాశక్తిమత్ అశరీరత్వాత్ వ్యతిరేకే ఐంద్రజాలకాదివత్' అనునది యనుమానవాక్యస్వరూపము.) అనున్యాయముతో మాసమన్వయమునకు విరోధము కలదా? లేదా?" అనునది సంశయస్వరూపము.

పూర్వపక్షము:—మీమతమునఁ బరమేశ్వరునకు దేహము లేదు. ఇట్టివాఁడు సర్వశక్తియుక్తుఁడై ప్రపంచసృష్టినిఁ గావించుచున్నాఁ డనుట

సంభవింపదు. లోకమున దేహ మున్నవారికే సర్వశక్తులును కలవు కాని యితరులకు లేదు.

అవతారిక:—అనునీపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము—

## ౧౬౪. సర్వోపేతా చ తద్దర్శనాత్. ౨. ౧. ౩౦.

తాత్పర్యము:—ఇట్లు చెప్ప నక్కఱ లేదు. పరమేశ్వరునకు శరీరము లేకున్నను సర్వశక్తులును గల వని శ్రుతి చెప్పుచున్నది 'సర్వకర్మా సర్వకామ సర్వగంధ సర్వరస సర్వ మిద మభ్యాత్త ఉవా క్యనాదరః. సత్యకామ స్సత్యసంకల్పః' (౧. ౨. ౨. చూడు.) అనుమొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు పరమేశ్వరునివిషయము తర్కములకు గోచర మగునది కా దనియు వేద మెట్లు చెప్పిన న ట్లెల్ల నంగీకరింప వలసినదియే యనియు ఇదివఱకే చెప్పి యున్నాము.

అవ:—'ఇట్లు కాదు. యుక్తికి విరుద్ధ మైనచో శ్రుతిని కూడ సమ్మతించుటకు వీలు లేదనియు శ్రుతి శబ్దము కావున దానికి నౌపచారికముగ నైన నర్థముఁ జెప్పవచ్చును కాని తర్కమును త్రిప్పుటకు మాత్ర మెట్లును వీలు లే దనియు, ఈకారణమువలనఁ దర్కానుగుణముగ శ్రుతినిమార్పవలయును కాని శ్రుత్యనుగుణముగఁ దర్కము తిరుగ దనియు మేమును ఇదివఱకే నిరూపించియున్నాము' అనుపూర్వపక్షమును అనువాదపూర్వకముగ ఖండింపుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము—

## ౧౬౫. వికరణత్వా న్నేతిచే త్తదుక్తం. ౨. ౧. ౩౧.

తాత్పర్యము:—పైసూత్రమునఁ జేసినసిద్ధాంతము సరి కాదు. శ్రుతి చెప్పినను దాని నంగీకరించుటకు వీలు లేదు. పరమేశ్వరునకు దేహాదులు లేవు. కదా, దేహము లేనివానికి శక్తియు లేదు కదా.

సిద్ధాంతము:—ఈయాక్షేపమునకు సమాధానము పూర్వముననే చెప్పఁబడెను. ఈపరమేశ్వరవిషయము తర్కాగోచర మగుటచే వేదానుసారముగ గ్రహింపఁబడవలయు ననిమాత్రమే కాదు, ఒకనియందు దొర

విధ మగుసామర్థ్యము కానవచ్చె నని నంతమాత్రమున నందరియందు నట్టిసామర్థ్యమే యుండవలయు నని సిద్ధాంతముఁ జేయఁ బూనుట యుక్తము కా దని కూడ నిదివఱకే చెప్పియున్నాము. దేవతలును కుమ్మర వాఁడు మొదలగువారును చేతనులే యైనను సృష్టిని చేయునప్పుడు (పదార్థములను కాని ఘటాదులను కాని పుట్టించునప్పుడు) దేవతలకు మాత్రము బాహ్యపదార్థములసహాయము మక్కఱ లేదు? కుమ్మరవానికి మాత్రము కావలయును. కావున శక్తులు కల వనినంతమాత్ర ముననే పరమేశ్వరునకు దేహమును గల్పింపఁ దలంతురేని దేవతలకుఁ గూడ బాహ్యసాధనసహాయమును కల్పింపవలసినవారలగుదురు. వారును, గుమ్మరవానివలె దేహధారులేకదా కావున నొకనియందుఁ గలసామర్థ్యమే యందరియందు నుండ నక్కఱ లేదు.

మఱియుఁ బరమేశ్వరునకుఁ (పారమార్థికముగ నేదియు లేకున్నను అవిద్యాకల్పితములై సర్వశక్తులు నుండవచ్చును.) అనియు మున్నే నిరూపించియున్నాము. కావున దేవాదులకు శరీరము కల దనినంతమాత్రమున బాహ్యసాధనాపేక్షయు గల దని యెట్లు నిర్ణయించుటకు వీలు కాదో, అంతఃకరణముచేఁ గలుగు స్వప్నసృష్టితో బాహ్యసాధనములచేఁ గలుగు జాగ్రత్సృష్టికి పోలిక గల దని నిరూపించుటయెట్లు సాధ్యముకాదో అట్లే పరమేశ్వరునివిషయమునఁ గూడ శక్తు లున్నంతమాత్రమున శరీరము కూడ నుండవలయు నని నిర్ణయించుటకు వీలు కాదు. నియమ మెచ్చట నుఁ గానవచ్చుట లేదు కదా. ఇది యంతయుఁ గాక శ్రుతి 'అపాణిపాదో జవనో గ్రహీతా పశ్య త్యచక్షుః స శృణో త్యకర్ణః' 'పరమేశ్వరునకుఁ జేతులు లేవుకాని ఆయనమాత్రము సర్వపదార్థములను గ్రహించును. కాళ్లు లేవుకాని అతివేగముగాఁ బరుగిడును. కన్నులు లేకున్నను చూచును. చెవులు లేకుండియును వినును' అను మొదలగువాక్యములచేఁ 'బరమేశ్వరునకు బాహ్యాంతరసాధనము లేవియు (చక్రము దండము ఉలి మొదలగునవి బాహ్యాంతరసాధనములు శరీరేంద్రియచిత్తము లాంతర సాధనములు) లేవు' అని నిర్ణయించుచున్నది. కావున మామతమున దోషమింతయు లేదు.

## ప్రయోజనవత్త్వాధికరణము. ౧౧.

విషయము:—ఇచ్చట 'బూర్ణకాముఁడయ్యుఁ బరమేశ్వరుఁడు ప్రపంచమును సృజించును' అనుసిద్ధాంతము విచారవిషయము.

సంగతి:—"పూర్వాధికరణమునఁ బరమేశ్వరుఁడు సర్వశక్తియుక్తుఁ డనియు, ప్రపంచకర్త యనియు సిద్ధాంతముఁ జేసి యున్నారు. అట్లయినను ఈసృష్టివలన నాయనకుఁ బ్రయోజనము లేదు. కావున కర్తృత్వము సంభవింపదు" అనునాక్షేపమునకు సమాధానముగ నాక్షేపసంగతితో నీయధికరణ మారంభింపఁబడెను.

సందేహము:—"లోకమునఁ బిచ్చివాఁ డయినను ప్రయోజనము లేనిదే కార్యము నాచరింపడు. ("బ్రహ్మ జగన్న సృజతి అభ్రాంతచేతనత్వాత్ లౌకికవత్" అనునది యనుమానవాక్యస్వరూపము) అనున్యాయముచే మీసమన్వయమునకు విరోధము కలదా? లేదా? అనునది సంశయస్వరూపము. కారణఫలములను పూర్వమువలెనే యూహించునది.

అవతారిక:—ఈసంశయమును నివారించుటకై మొట్టమొదటఁ బూర్వపక్షము ననువాదముఁ జేయుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము:—

## ౧౬౬. న ప్రయోజనవత్త్వాత్. ౨. ౧. ౩౨.

తాత్పర్యము:—పైనఁ జేసినసిద్ధాంతము యుక్తము కాదు. లోకానుభవమును విచారించిన నెవ్వఁ డేకార్యము నాచరించినను దానికి నేదియో యొకప్రయోజన మవశ్యముగ నుద్దేశింపఁ బడుచున్నది. ఏకార్యము నాచరించినను సుఖప్రాప్తియు దుఃఖనివృత్తియుఁ దత్ఫలముగ నపేక్షింపఁబడుచున్నది. "ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" "ఫలమును కోరక పిచ్చివాఁడైనను ప్రవర్తింపఁడు" అని లౌకికన్యాయములు ఘోషించుచున్నవి "న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవ త్యాత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి (చూ. ౧-౪-౧౯)" అను మొదలగువాక్యములచే శ్రుతియు నీవిషయమునే యనువాదముఁ జేయుచున్నది. మఱియు లోకమున జనులు ప్రయోజనశూన్యముగ నల్పకార్యము నైననుఁ జేయ రనిన నీపరమేశ్వరుఁడు మహాప్రయాససాధ్య మగు నీ ప్రపంచసృష్టిని నిష్ప్రయోజనముగ నెట్లు కావించును?

"కొందఱు ప్రమాదమువలనఁ బ్రయోజనరహితముగఁ గూడఁ బ్రవర్తింపుచున్నారు. విలాసార్థముగను పరోపకారార్థముగను కూడఁ బ్రయత్నించుచున్నారు. ఇట్లు కాకున్నను పరమేశ్వరునకుఁ గూడ దీనివలన నేదియో యొక ప్రయోజన ముండవచ్చును" అనియెదవేని యది యుక్తము కాదు. ప్రమాదము కించిజ్జ్ఞులగుపురుషులయం దుండవచ్చును కాని సర్వజ్ఞునియం దుండదు. మఱియు విలాసార్థమై చేయఁబడుకార్యమునకుఁ గూడ నొకానొకవిధ మగుసుఖమే ఫలము కావున నదియు నిష్ప్రయోజనము కాదు. అల్లే యగు ననినను అది ప్రపంచనిర్మాణమువలె బహుప్రయాససాధ్యము కాదు. ఇదియునుఁ గాక లోకమున భేద ముండుటచేఁ "బరులు పరోపకారము" ననునవి కలుగును కాని పరమేశ్వరునియందు కలుగదు. అచ్చట భేదమే లేదు. ఉపాధిభేదము కల దనినను అది జీవదృష్టికి మాత్రమే భేద మగును కాని పరమేశ్వరదృష్టికిఁ గాదు. ఇట్లుండ నిఁక నాపరమేశ్వరుఁ డెవ్వని కుపకార మొనర్చుటకై ప్రవర్తించును? ఇఁక దీనివలన నాయనకే బ్రయోజనము కల దనవలయును. అప్పుడు "పరమేశ్వరుఁడు నిత్యతృప్తుఁడు" అని చెప్పుశ్రుతులకు విరోధము వచ్చును. కావున నెట్లును సర్వజ్ఞుఁ డగుపరమేశ్వరుఁడు ప్రపంచకర్త యగుటకు వీలు లేదు.

అవతారిక:—ఈపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము.—

## ౧౬౭. లోకవత్తు లీలాకైవల్యమ్. ౨. ౧. ౩౩.

తాత్పర్యము.—ఈపూర్వపక్షము తగదు. లోకమున సర్వసమృద్ధికలిగి నిశ్చింతులై యున్నప్రభువులు మొదలగువారు సహితము జ్ఞానవంతులయ్యుఁ బ్రమాదాదులనొందకయుఁ గేవలము విలాసార్థమై యనేక కార్యముల నాచరించుచుండుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. అట్టిక్రియలు కూడఁ గొంతఫలము నొసంగు ననుట సత్యమే యైనను ప్రవర్తించువారి యుద్దేశము మాత్ర మట్టిదిగా నుండదు. విహారార్థమై యుద్యానవనమును నిర్మించిన నందుండుఫలాదులచే లోకమునకును దనకునుఁగూడఁ బ్రయోజనము కలుగును కాని నిర్మించినవానియుద్దేశమును మాత్ర మది కాదు. వాఁడు విహరింపుటకనియే కదా దానిని నిర్మించెను. ఇట్లుండ

*నానుషంగిక మగుఫలమును ప్రధానముగ నిర్ణయించుటకు నెట్లు సాధ్య మగును ?

మఱియు లీల యను నుద్దేశము కూడ లేకయే కార్యములందు ప్రవర్తించుసందర్భములు ననేకములు కలవు. పురుషుఁడు శ్వాసను స్వాభావికముగనే విడుచుచున్నాఁడు, మఱలఁ గైకొనుచున్నాఁడు. దీనికి బాహ్యప్రయోజన మేమికలదు. జీవుఁడును ఆత్మయు (బ్రహ్మంబును) జ్ఞానస్వరూపులే యగుటచే వారల కీప్రాణసంచారము జ్ఞానమును కలిగింపదు. శరీరమును బ్రతికించు ననినను వాయువు సర్వకాలములయందు నేకరూపముగనే యుండుటచే మృతశరీరమునందును శ్వాస ముండవలయును. కావున బాగుగ విచారించిన నీయుచ్ఛ్వాసనిశ్వాసములు జీవకార్యములు; శరీరమునుఁ బ్రతికించుటయు జీవునిపనియే. ఇట్లుండ జీవుఁ డాయుచ్ఛ్వాసనిశ్వాసముల నేల యొనర్చుచున్నాఁడు? "స్వభావముగనే యొనర్చుచున్నాఁడు. స్వేచ్ఛఁగా (ఊరకనే)నొనర్చుచున్నాఁడు" అని చెప్పవలయును. స్వభావ మనినపిదప నిక ప్రశ్నించుటకు నవకాశము లేదు.

కావున పరమేశ్వరుఁడు కూడ నిట్లే లీలమాత్రముగ నైనను స్వేచ్ఛగా నైనను స్వాభావికముగ నైనను ప్రపంచసృష్టి యందుఁ బ్రవర్తింపవచ్చును. మఱియు దీనివలనఁ దనకు ప్రయోజనము లేకున్నను అవిద్యోపాధి గలజీవులకుఁ బ్రయోజనము కలుగవచ్చును. మీ రన్నట్లు బ్రహ్మదృష్టికి జీవభేదము లేకున్నను "జీవులకై ప్రపంచమునుఁ గల్పించుచున్నాను" అనునుద్దేశ మాయనకుఁ గలుగుటకు వీలు లేకున్నను, సృష్టిమాత్రము లీలాదిరూపముతోఁ గలుగవచ్చును ? దానివలన భేదదృష్టి గల జీవులకుఁ బ్రయోజన ముండవచ్చును. ఈకారణమువలన "సృష్టి జీవార్థమై కల్పింపఁబడెను" అనియుఁ జెప్పఁబడవచ్చును. "లీలార్థమై మహాప్రయాససాధ్య మగువ్యాపారమును చేయుదురా" అనియెదవేమొ అది సరి కాదు. మనకు కష్టసాధ్యముగా తోచినంతమాత్రమునఁ బరమేశ్వరునకుఁ గూడఁ గష్ట సాధ్యము కానక్కఱ లేదు. వానరులు పర్వతములు వృక్షములు మొదలగువానితో నన్యుల కసాధ్యమైనసముద్రబంధనమును కావించిరి. అర్జునుండు దానినే శస్త్రములతో నాచరించెను; అగస్త్యుఁడు సముద్రజలమునంతయును ఆచమనముఁ జేసెను. కావున నొకనికిఁ గష్ట

* అనుషంగికము. (చూ. సు. ౧-౧-౨. మునుసార్థవివరణము).

ముగఁ దోచినంతమాత్రమున నందఱకును కష్టమే కావలయునా? సామాన్యు లగుయోగులవిషయమే ఇట్లుండ నిఁక సర్వశక్తుఁ డగుపరమేశ్వరునివిషయమున నేమి చెప్పవలయును? ఈకారణమునలనఁ బరమేశ్వరుఁడు జగత్కర్త యగుటలో నాక్షేపము లేదు. సృష్టినిఁ గూర్చియు సర్వజ్ఞత్వమును గూర్చియు శ్రుతి చెప్పుచున్నది. కావునఁ బరమేశ్వరుఁడు ప్రపంచమును సృజించుచు నున్నాఁడు; సర్వజ్ఞుఁడై కూడ నున్నాఁడు కావున మామతమున దోష మేమియు లేదు. శ్రుత్యనుసారముగ బ్రహ్మమునకు దేనియందును కోర్కె గూడ నుండదు. ఇది యంతయు గాక "సృష్టిశ్రుతులు ప్రపంచబ్రహ్మాభేదమును నిరూపించుటకై ప్రవర్తించునవియే కాని యన్యములు కావు. సృష్టియే యసత్యము, అజ్ఞానమాత్రకల్పితము. బ్రహ్మ కర్తయే కాఁడు" అనువిషయమునుఁ గూడ మఱువవలదు. అప్పుడు మీప్రశ్న కేయవకాశ ముండదు కదా.

---

# వైషమ్యనైర్ఘృణ్యాధికరణము. ౧౨.

విషయము:—ఇచ్చట "సర్వసముఁ డయ్యుఁ బరమేశ్వరుఁడు విచిత్రసృష్టిని ఉత్తమమధ్య మాధమభేదములతో సృజించుచున్నాఁడు" అను సిద్ధాంతభాగము విచారవిషయము.

సంగతి:—"పూర్వాధికరణమున నెట్లో పరమేశ్వరునకు సృష్టికర్తృత్వమును సాధించితిరి కాని యది యిప్పటికిని నిలువదు. బ్రహ్మము పక్షపాతి కాక తప్పదు" అనునాక్షేపమునకు సమాధానముగ నాక్షేపసంగతితో నీయధికరణ మారంభింపఁబడెను.

సందేహము:—"ప్రపంచము ఉత్తమమధ్యమాధమభేదములతో నున్నది. ఇట్టిసృష్టిని సర్వసముఁ డగుపరమేశ్వరుఁడు ఆచరింపఁడు ('విషమకర్తా సాఽవద్యః లౌకికవత్' అనునిది యనుమానవాక్యస్వరూపము.) అనున్యాయముతో మీసమన్వయము నకు విరోధము కలదా? లేదా?" అనునది సంశయస్వరూపము. కారణఫలములను పూర్వమువలెనే తెలిసికొనవలయును.

పూర్వపక్షము:—వేదములయందుఁ బరమేశ్వరుఁడు శుద్ధుఁడనియు రాగద్వేషాదిహీనుఁడనియుఁ జెప్పఁబడియున్నది. ఆయనయే సృష్టి

కర్త యగునేని యట్టిధర్మములు సంభవింపవు. ఏల యనిన:—ఆయన యింద్రాదులఁ గొందఱి మహాభాగ్యసంపన్నులఁ గాఁ జేయుచున్నాఁడు. క్రిములు పశువులు మొదలగువానిఁ గొన్నిఁటి మహాదుఃఖవంతములుగ జేయుచున్నాఁడు. మనుష్యులు మొదలగుకొందఱి మధ్యమస్థితితో నిలుపుచున్నాఁడు. సామాన్యుఁ డగుపామరుఁడు తనకు సామర్థ్యము కలదేని మిత్రులకు సౌఖ్యము కలుగునట్లుగను శత్రువులకు నధికదుఃఖము కలుగునట్లుగను సములు సామాన్యస్థితిలో నుండునట్లుగను జేయువిధంబునఁ బరమేశ్వరుఁడును జేయుచున్నాఁడు. కావునఁ బామరునకు వలెనే ఆయనకును కొందఱియందు పక్షపాతంబును మఱికొందఱియందు ద్వేషంబునుఁ గానవచ్చుచున్నది. ఇట్లున్న నాయన సర్వసముఁ డెట్లగును ?.

మఱియొకవిశేషము లోకమున నెంతదురాత్ముఁ డైనను తాను పెంచినవృక్షమును ఛేదింపఁ బూనుకొనఁడు. "విషవృక్షో౽పి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతం" "విషవృక్షమునైనను తానే యభివృద్ధిచేసి మఱలఁ దానే త్రుంచుట యుక్తము కాదు." అని లోకజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్లుండ నీపరమేశ్వరుఁడు తాను సృజించినప్రపంచమును తానే సంహరించుచున్నాఁడు. ఇంతకంటెఁ గ్రౌర్య మేమి కావలయును? ఈకారణమువలనఁ బరమేశ్వరుఁడే సృష్టిస్థితిసంహారకర్త యనుటకు వీలు లేదు.

అవతారిక:—ఈపూర్వపక్షమును ఖండింపుచు *స్థూణానిఖనన న్యాయమునఁ బరమేశ్వరకారణత్వమును స్థాపించుచున్నాఁడు.

సిద్ధాంతసూత్రము:—

## ౧౬౮. వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథా హి దర్శయతి. ౨. ౧. ౩౪.

తాత్పర్యము:—మాసిద్ధాంతమున మీదోష మేదియు రాదు. "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" అను మొదలగు శ్రుతులకును విరోధము రా నక్కఱ లేదు.

---

* స్థూణానిఖననన్యాయము.— స్తంభమును పాతునప్పుడు అది మరింతె దృఢముగ నుండుటకై మఱలమఱలఁ గదిలించి గోతియందు మంటిని కూరుచు బిగియింతురు. ఇట్లే సిద్ధాంతముకూడ మఱింత దృఢముగుటకై మఱలమఱలఁ బూర్వపక్షములచేఁ గదలించి తత్ఖండనపూర్వకముగ వ్యాసమహాముని దృఢముచేసె ననుట.

ఆయన స్వాయముగ సృష్టిసంహారాదుల నాచరించు నేని యప్పుడు మీ రన్నదోషములు రావచ్చును. వాస్తవస్థితి మాత్ర మట్టిది కాదు. ఆయన పుణ్యాపాపముల నపేక్షించియే (అనఁగా: వాటి ననుసరించియే) సృష్ట్యాదులఁ గావించును; ఉత్తమమధ్యమాధమభేదములఁ గల్పించును. పుణ్యవంతుల ననుగ్రహించును; పాపాత్ముల నిగ్రహించును. ఇందా యనకుఁ గలుగువైషమ్య మేది కలదు? ప్రభువు అపరాధిని దండించుచు నిర పరాధిని సన్మానించుచు నుండిన వానికిఁ బక్షపాతము కల దందురా? అ అపరాధి వానిదుష్కర్మఫలము ననుభవించెను; నిరపరాధియు వాని సత్క ర్మఫలము ననుభవించెను. ఇందుఁ బ్రభువునకుఁ గలుగుదోష మేమి? ఈ కారణమువలన పరమేశ్వరునకు వైషమ్యదోషము లేదు.

మఱియు సర్వజీవులొనర్చినకర్మలు ఫలాభిముఖము లగుటకు నేసమయమున వీలు కలుగదో (అనఁగా: ఫలాభిముఖములు గాక వాస నామాత్రములై యుండునో) అదియె ప్రళయకాలము. అది కర్మస్వభా వానుగుణముగ వచ్చునది కాని పరమేశ్వరునిచే స్వతంత్రముగఁ గల్పింపఁ బడునది కాదు. కర్మానుసారముగఁ బరమేశ్వరుఁడును దాని ననువర్తింపు చున్నాఁడు. ఇం దాయనకుఁ గలుగు నిర్దయత్వ మేమి? వధార్హుఁ డగువాని ధర్మశాస్త్రానుగుణముగ వధించుట ప్రభువునకు నిర్దయత్వ మగునా? బాగుగ విచారించిన సంహారము లేకపోవుటయే యీశ్వరునకు దోషహేతు వగును. అప్పు డాయన తనస్వాతంత్ర్య బలముచే నియతిని ద్వేషించినవాఁ డగును కదా! కావునఁ బరమేశ్వరునకు సంహారమునందు ను కర్మానుసారిత్వ ముండుటచే నిర్దయత్వదోషము రాదు.

"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి య మేభ్యో లోకేభ్య ఉన్ని నీషతే ఏష ఉ ఏ వాసాధు కర్మ కారయతి య మధో నినీషతే"="ఏపురు షునిఁ బరమేశ్వరుఁ డనుగ్రహించునో వానిచేఁ బుణ్యకర్మలఁ గావింపఁ జేయును; ఎవ్వని నిగ్రహించునో వానిచేఁ బాపకర్మములఁ జేయించును" అను మొదలగువాక్యములచే శ్రుతియం దీవిషయము బోధింపఁబడి యు న్నది. 'ఇచ్చట మాత్ర మేమి చెప్పఁబడెను? 'పరమేశ్వరుఁడు తా నభిమా నించి యున్నవానిఁ బుణ్యాత్మునిఁగను ద్వేషించినవానిఁ బాపాత్మునిఁగను చేయును. అనియె కదా' అనియెద వేమొ అటు తలంపవలదు. ఈ



యర్థ మనేకశ్రుతులకు విరుద్ధము కావున దీనిని, మఱియొకవిధముగ నన్వ

యింపవలయును. ఆయన్వయంబును విరుద్ధము కాదు. క్లిష్టమును కాదు. పరమేశ్వరుని నిగ్రహానుగ్రహములు జీవకర్మానుసారు లని యిదివఱకె చెప్పియున్నాము. "జన్మజన్మ యదభ్యస్తం దాన మధ్యయనం తపః తే నై వాభ్యాస యోగేన తచ్చైవాభ్యసతే నరః," ప్రతిజన్మమునందును పురుషుఁడు ఏదానాధ్యయనతపస్సుల నభ్యసించునో వానినే అభ్యాసప్రభావముచే *నుత్తరోత్తరజన్మములయందు అభ్యసించి కృతార్థుఁడగును." అని పూర్వ కర్మానుగుణముగనే కృతార్థత నొందువానికి నుత్తరోత్తర జన్మముల యందును బుణ్యకర్మాభివృద్ధి కలుగు నని స్మృతియందు చెప్పఁబడి యున్నది. పరమేశ్వరుఁడు ఏ కార్యమునకును అసాధారణకారణ ము కాఁడు. మేఘము సామాన్యముగ వర్షముఁ గురిసినను బీజభేదముల చే వృక్షభేదములు కలుగునట్లు పరమేశ్వరుఁడు సామాన్యముగ సృజించినను కర్మభేదముచే జీవులకు సుఖదుఃఖభేదములు మొదలగునవి కలుగుచున్నవి. ఇట్లగుటచే కర్మయే యభ్యాసబలమున జీవుని నుత్తమాధమగతుల నొందించు నని పైస్మృతికి నభిప్రాయము శ్రుతికిఁ గూడ నదియే యభిప్రా యము. కర్మయే సర్వమునకును కారణమైనను పరమేశ్వరుఁడు జగద్ధే తు వగుటచే నట్లు చెప్పఁబడెను. ఇట్లు కాకున్నను ఉత్తమగతికిఁ బోవుజీవుఁ డు పూర్వజన్మమునందుఁ గూడ పుణ్యాత్ముఁడే కావున నప్పుడు కలిగినపర మేశ్వరానుగ్రహమే యాశ్రుతికితాత్పర్యమైయుండవచ్చును. 'పరమేశ్వరుఁ డు పుణ్యకర్మప్రభావమువలన నొకజన్మమున నెవ్వని ననుగ్రహించునో వానిచేత రెండవజన్మమునందును బుణ్యకర్మమునే చేయించును, (అనఁగా: రెండవజన్మమునందు వాఁ డాచరించుపుణ్యకర్మమునకు సాధారణకారణమై యుండు ననుట' అనియే యాశ్రుతికి నర్థము. ఇంతవివాద మేల ? బృహ దారణ్యకోపనిషత్తునందు. 'పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః

---

* అసాధారణకారణము.—కారణములు మూఁడువిధము లని యిదివరకే (చూ. పు. ౨౪౭.) నిరూపించియున్నాము. ఆమూఁడును సాధారణకారణమనియు నసాధారణకారణ మనియుఁ బ్రత్యేకముగ రెండువిధములు. అందు సాధారణమనఁ గా ననేకకార్యములకు నియమములేక కారణమై యుండునది. సర్వప్రపంచసృష్టికిని హేతువై యుండునీశ్వరేచ్ఛ మొదలగునవి. అసాధారణ మనఁగా నియతముగ నొక్కకార్యమునకు మాత్రమే కారణమై యుండునది. మట్టిచెట్టునకు మట్టివిత్తనము కుండ మొదలగునవి మృణ్మయపదార్థములకు మట్టి మొదలగునవి.

పావేన ' 'పుణ్యకర్మమునాచరించినఁ బుణ్యుఁ డగును. పాపకర్మము నాచరించినఁ బాపియగును' అని కర్మాధీన మగుసుఖదుఃఖస్థితి స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. గీతలయందును 'యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజా మ్యహం' 'ఓయర్జునా! ఎవ్వఁ డెవ్వఁడు నన్ను ఎట్లెట్లు సేవించునో వాని వానికి నట్లట్లే ప్రతిఫలము నొసంగుదును' అని శ్రీకృష్ణుండు చెప్పి యున్నాఁడు. కావున నెట్లునుఁ బరమేశ్వరునియందు మీారన్నదోషములు లేవు.

'ఇట్లయినఁ గర్మాధీనముగఁ బ్రవర్తించువాఁ డగుటచేఁ బరమేశ్వరునకు స్వాతంత్ర్యము లేకపోవలసి వచ్చును. అప్పుడు పరమేశ్వరుఁడు పరమేశ్వరుఁడే కాక పోవును అనియెదవేమొ' అట్లు తలంపవలదు. ఒకచక్రవర్తి తనకు మంత్రిత్వముఁ జేసినవానికి వానికష్టము ననుసరించి యధిక వేతనము నొసంగును; స్వల్పకార్యముల నాచరించినవారికి స్వల్పవేతనముల నిచ్చును. తనకొఱకై యేమియుఁ జేయనివారికి నేమియు నొసంగఁడు. ఇంతమాత్రమున నాచక్రవర్తికి గలస్వాతంత్ర్యమునకు భంగమేమి ? వానికి ధనవ్యయమునందు స్వాతంత్ర్యము లేకపోవునా ? కావునఁ బరమేశ్వరునకును ఇట్లే స్వాతంత్ర్యము లేకపోదు. ఎట్లు చూచినను మామతమున దోష మెంతయును లేదు.

అవ:—ఈవిషయమునే యాక్షేపసమాధానములచే స్పష్టపఱుచుచున్నాఁడు.

## ౧౬౯. న కర్మాఽవిభాగా దితి చేన్నా నాదిత్వాత్.

### ౨. ౧. ౩౫.

**పూర్వపక్ష తాత్పర్యము :—**

ఈసిద్ధాంతము సరి కాదు. 'స దేవ సో మ్యేద మగ్ర ఆసీ దేకమే వాఽద్వితీయం' అనుమొదలగుశ్రుతులచే 'సృష్టికిఁ బూర్వమున విభాగమే లేదు' అని చెప్పఁబడి యున్నది. ఇట్లుండ నిక మొట్టమొదట కర్మ మెక్కడనుండి వచ్చును, విషమముగ సృష్టినిఁ గావించుటకు మొట్టమొదటనే కర్మ యుండు నేని యప్పుడు పరమేశ్వరుండు దాని నాశ్రయించి సృష్టిని భిన్నస్వభావములతో గల్పింపవచ్చును గాని మొట్టమొదట నదియే లేకున్న నాయన యేమి సేయగలఁడు? సృష్టియైనతర్వాతనే

కదా! కర్మ సంభవించును. దేహాదులు లేకున్నఁ గర్మల నెవ్వ రాచరింపఁ గలరు ? ఈకారణమువలన పరమేశ్వరుఁడు. మొట్టమొదట తనరాగద్వే షములచే సృష్టిని చేయవలసినవాఁడే.

సిద్ధాంతము:—ఇది దోషము కాదు. ఈసంసారమునకు నారంభ మనునది యుండునేని యప్పుడు మీరుచెప్పినదోషము వచ్చును. అట్లు లేదు. దీనికి నారంభమే లేదు. బీజాంకురములవలె కర్మయు సంసారంబును అనాదులై పరస్పరకారణములై యున్నవి. పూర్వకల్పాంతమున నాచరింపఁ బడి జీవులతోఁ గూడ బరమేశ్వరునియందుఁ బ్రళయకాలమున సూక్ష్మావ స్థతో నడఁగి యున్నకర్మలు ఉత్తరకల్పసృష్టికిఁ గారణము లగుచున్నవి. ఇట్లే ఆసృష్టియందు చేయఁబడి యంతమునకు శేషించియున్నకర్మలు తదుత్తరసృష్టికిఁ గారణము లగుచున్నవి. ఇట్లుండ నీక నీదోష మెట నుండి వచ్చును. అనాదిత్వమునుకల్పించి సిద్ధాంతమును చేయఁ బూనుట గతిలేనిపనియే యైనను అది మిథ్యావాదుల మగుమామతమున దోష కరము కానేర దని యిదివఱకే నిరూపించియున్నాను.

అవ:—"ఈవిషయము సిద్ధాంత మగుటకు నాధార మేమి? అనాదు లగునవియు కొన్ని యుండుటకు వీలుకలదా?" అనునాక్షేపమునకు సమా ధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౧౭౦. ఉపపద్యతే చాఽ ప్యుపలభ్యతేచ.

### ౨. ౧. ౩౬.

తాత్పర్యము:—మఱియు నీప్రపంచమునకుఁ గలయనాదిత్వము యుక్తిసిద్ధమై యున్నది. శ్రుతిస్మృతులచేతఁ గూడ చెప్పఁబడి యున్నది. యుక్తి యెట్లనిన:—

ఈప్రపంచమునకు నాదియె యుండినచో నిది యాకస్మిక మగును. అప్పుడు నిరపరాధు లగుజీవులకుఁ గూడ దుఃఖము తటస్థించును. అంతే కుఁ బూర్వము కర్మ లేకపోవుటచే జీవులకు నేఫలములును అనుభవము నకు వచ్చుటకు వీలు లేకున్నను ఆకస్మికములై సుఖదుఃఖములు వారికి కలుగును. సుఖదుఃఖానుభవమే ప్రపంచము కదా! ప్రపంచ మాకస్మిక మైన నన్నియు నాకస్మికములే యనినను విరోధము లేకపోవుటచే మోక్ష

ము నొందినవారలకుఁ గూడఁ బునరావృత్తి కలుగవలసివచ్చును. ఇది యేమతమువారికిని సమ్మతము కాదు. సుఖదుఃఖములు కర్మసంబంధము లేకయే వచ్చునెడల విధినిషేధశాస్త్రము లన్నియు నిరర్థకములు కావలసి వచ్చును; మోక్షార్థమై ప్రయత్నించినను ఫలము లేకుండుటచే (మోక్షముఁగూడ ఆకస్మికముగనే వచ్చునదియుఁ బోవునదియు నగుటచే ప్రయత్నించినను ప్రయత్నింపకున్నను సమానమే యగు ననుట) మోక్షశాస్త్రములు కూడ నిరర్థకములే యగును. పరమేశ్వరుఁడు సుఖదుఃఖకారణము కాఁడనియుఁ గర్మల నపేక్షించియే నిగ్రహానుగ్రహముల నాచరించు ననియు నిదివఱకే నిరూపించియున్నాము. ఇఁక సర్వప్రపంచ కారణ మగుభ్రాంతియే యెట్టిభేదమును కల్పింపఁ గల దనవలయును. అదియు యుక్తము కాదు. కేవల మగుభ్రమసంస్కారము మాత్రమే యెట్లు చేయనేరదు. రాగద్వేషములకుఁ గారణమై 'ఇది నాది' అనుమొదలగు నభిప్రాయములె స్వరూపముగఁ గలిగియున్న యథార్థజ్ఞానమే భ్రాంతి యనఁబడును. ఈభ్రాంతి శరీరము లేక కలుగదు. శరీరంబును గర్మ లేక సంభవింపఁ గూడదు. అప్పుఁడాకస్మికత్వాదిదోషములు వచ్చునని చెప్పియుంటిమి కదా. ఆకర్మయు రాగద్వేషములు లేకున్న సంభవింపదు. అవియుఁ బైఁ జెప్పఁబడినభ్రాంతి లేకున్నఁ గలుగనేరవు. 'ఇది సుఖకరము దీనిని సంపాదింపనలయును' అనునభిమానము లేనివాఁడు కర్మనెట్లాచరించును? మొట్టమొదలఁ బదార్థమువలన సుఖము ననుభవింపనివానికి దానిపై నభిమాన మెట్లు కలుగును. భ్రాంతి లేకున్నఁ బరమానందకర మగుపరమేశ్వరరూపమును వదలి యన్యపదార్థముల సుఖకరములుగ నెట్లు భావించును? ఈకారణమువలన ప్రస్తుత దేహభ్రాంతికి పూర్వదేహభ్రాంతియే కారణము; ఆభ్రాంతియునుఁ గర్మానుసారముగ దేహములయందు భేదమును కలిగింపుచున్నది యనుట యిప్పుడే నిరూపింపఁబడెను. ఇట్లు విచారించిన దేహమునకుఁ గర్మయుఁ గర్మకుఁ బూర్వదేహంబును కారణము లగుచుండవలయును. ఈసిద్ధాంతము ప్రపంచమునకు నాది యనునది యుండినచో సంభవింపదు. మొట్టమొదటిదేహ మాకస్మికముగనె వచ్చెననవలయును కదా! కావునఁ బ్రపంచ మనాదియే యని యంగీకరింపవలయును. అప్పుడు బీజాంకురములవలె గర్మప్రపంచములు పరస్పరకారణము లగుచుండవచ్చును. ప్రతివాదియు నీసిద్ధాంతము నంగీక

రించియే తీరవలయును. అట్లు చేయకున్నఁ బైఁ జెప్పినదోషముల నెట్లును నివారించుటకు వీలు లేదు.

మఱియు నీవిషయము శ్రుతులయందును బ్రకటింపఁబడి యున్నది. 'అనేన జేవే నాత్మనా' అనువాక్యముచే సృష్ట్యారంభముననే జీవుఁడు ప్రస్తావింపఁ బడి యున్నాఁడు. జీవుఁ డనఁగాఁ బ్రాణముల ధరించువాఁడు. అప్పటికి ప్రాణములే యుత్పత్తి కాలేదు కదా! జీవునిఁ గూర్చి ప్రస్తావించుటకు నవకాశ మెట్లు కలిగెను ? పూర్వకల్పమున నాచరించినప్రాణధారణము నాశ్రయించియే యని చెప్పవలయును. ఇట్లు చెప్పినఁ బ్రపంచానాదిత్వము స్థిరపడును. 'ఇట్లు కాదు. ఆజీవుఁడు సృష్ట్యనంతరమునఁ జేయఁ బోవుప్రాణధారణము నాశ్రయించియే యీప్రస్తావము కలిగెను' అనియెదవేమొ రాఁబోవుదానినిఁ గూర్చి చెప్పుటకంటెఁ గడచిపోయిన దానిని గూర్చి చెప్పుటయే బలవత్తర మగును కదా. (బలవత్ప్రమాణ మగును కదా యనుట) ఇంత యేల 'సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్' 'సృష్టికర్త పూర్వకల్పమునందువలెనే యుత్తరకల్పమునందును సూర్యచంద్రులు మొదలగుసర్వప్రపంచమును సృజించెను' అని యీవిషయము స్పష్టముగనే చెప్పఁబడియున్నది. పురాణములయందును 'సృష్టికి నాద్యంతములు లేవు. ఎన్నియో కల్పములు పూర్వమునఁ గడచి పోయినవి; ఇక నెన్నియో కడచిపోవ నున్నవి' అని స్థాపింపఁబడి యున్నది. స్మృతియందును 'న రూప మ స్యేహ త థోపలభ్యతే నాంతో న చాఽదిః న చ సంప్రతిష్ఠా' 'భ్రాంతిసిద్ధ మగుటచే నీసంసారమునకు వాస్తవస్వరూప మేదియు లేదు. ఆద్యంతములు కాని మధ్యము కాని ఉత్పత్తిస్థితిప్రళయములు కాని లేవు' అని యీవిషయము స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. కావున సంసార మనాదియె; పరమేశ్వరుఁడును కర్మ నాశ్రయించియే యిందు భేదము కల్పించుచున్నాఁడు. ఇట్లగుటచే నాయనయందు విషమత్వము నిర్గుణత్వము ననుదోషములు లేవు.

ఇంతవివాద మేల? వాస్తవస్థితిలోఁ బరమేశ్వరునకుఁ బ్రపంచసంబంధమే లేదనియుఁ బ్రపంచము సృష్టియే కా లేదనియు భ్రాంతికి నియమను లేదు. కావున ప్రపంచ మెట్లయినను తోఁచవచ్చు ననియు వివర్తవాదము నాశ్రయించి చూచే నొసర్పఁబడినసిద్ధాంతమును మఱియొకమాఱుఁ గూడ స్మరింపుఁడు.

# సర్వధర్మోపపత్త్యధికరణము. ౧౩.

విషయము:—ఇచ్చట 'నిర్గుణుఁ డయ్యుఁ బరమేశ్వరుఁడు ప్రపంచమును సృజించుచున్నాఁడు' అను సిద్ధాంతము విచారవిషయము.

సంగతి:—'పై యధికరణమునఁ జేసినసిద్ధాంతము ననుసరించి పరమేశ్వరుఁడు విషమసృష్టిఁ జేయువాఁడు కాకపోయినఁ గాకపోవును గాక. మొట్టమొదట నాయన సృష్టినిఁ జేయుటయె సంభవింపదు. ఈసృష్టియందు న్యూనాధికభావములను లేక యుత్తమమధ్య మాధమ భావములఁ గల్పించుటకుఁ గర్మ మెట్లాధారమో అట్లే సృష్టినిఁ జేయుటకుఁ గూడ మఱియొక్కయాధారము కావలయును' అను నాక్షేపమునకు సమాధానముగఁ బ్రత్యుదాహరణసందర్భముతో నీయధికరణ మారంభ మయ్యెను. 'ప్రస్తుతాధికరణమునందుఁ జూపఁబడినయుక్తి పై యధికరణమునందలియుక్తి వంటిది కాదు'. అని వాదింపఁబడుటచే నిది ప్రత్యుదాహరణసంగతి యయ్యెను.

సందేహము:—'గుణశూన్య మగుపదార్థము మఱియొకపదార్థమునకు నుపాదానకారణము కానేరదు. ('నిర్గుణం న కస్యా ప్యుపాదానం గంధవత్' అనునది యనుమానవాక్యస్వరూపము') అను న్యాయముతో మీమతమునకు విరోధము కలదా? లేదా? అనునదియే సంశయమునకు స్వరూపము. ఈవిరోధము నివారించుటకు సాధ్యమగునది కా దనుటయే సంశయకారణము. ఈవిరోధముచే సమన్వయము చెడిపోవు ననుటయే దానికి ఫలము. ఈపాదమునఁ బ్రతియధికరణమునందు నింతయే కదా!

పూర్వపక్షము:—మీ సమన్వయము లోకవిరుద్ధము. నిర్గుణుఁ డగుపరమేశ్వరుఁడు ప్రపంచరూపముగ నెట్లు నిలువఁగలఁడు. లోకమున నిట్టియనుభవ మెందును లేదు కావున, లోకమునఁ గానవచ్చు నుత్తమమధ్యమాధమభేదములకు * నసాధారణకారణముగఁ గర్మను గ్రహించి నట్లే సృష్టివిషయమునఁ గూడఁ ద్రిగుణాత్మక మగుప్రధానమును గాని మఱియొక్కదానిఁ గాని కారణముగ నంగీకరింపవలయును. ఇంతియే కాని

* అసాధారణకారణము. (౬౬౩ వ పుట చూడు.)

పరమేశ్వరుఁడే ప్రపంచమున కుపాదానకారణము నిమిత్తకారణము నై యున్నాఁడని చెప్పఁగూడదు.

అవతారిక:—ఈపూర్వపక్షమును ఖండించుచు నీపాదమును ముగించుచున్నాఁడు.

## ౧౭౧. సర్వధర్మోపపత్తేశ్చ. ౨. ౧. ౩౭.

తాత్పర్యము:—లోకమునఁ గారణము లగు పదార్థములకు నేయే ధర్మము లుండవలయునో అవి యన్నియు నీపరమేశ్వరునియందు కలవు. అట్లుండుటకుఁ దగినంతయవకాశము కల దని బహువిధయుక్తులచే నిది వఱకే నిరూపించి యున్నాము. లోకమునఁ గుమ్మరి మొదలగువారు ఉపాదానకారణములను ప్రేరేపించుచున్నారు. అట్టివారు చేతనులుగ నుండవలయు ననుట ప్రత్యక్షసిద్ధమై యున్నది. మేమును, పరమేశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁ డని చెప్పి యున్నాము. మఱియు నుపాదానకారణము లగుపదార్థములయందు కార్యోత్పాదనశక్తి యుండవలయును. శక్తి యనఁగా సూక్ష్మావస్థతో నున్న కార్యమే! మేముఁ బరమేశ్వరుని యందు సూక్ష్మావస్థారూప మగుప్రపంచము కల దని చెప్పియున్నాము. మఱియు నాయనకు మాయ యుండుటచే నెట్టివిరోధములును రావనియు నిరూపించియున్నాము. ప్రపంచము పరమార్థమైనచో లౌకికవిరోధము లన్నియు సంభవించుట నిశ్చయమే కాని అట్లు కాదు కదా! కావున మావేదాంతమతముపై నెట్టియాక్షేపమును రానేరదు. ఏయుక్తియు విరోధమును కలిగింపనేరదు. ఇదియునుఁ గాక మీమతమునందును సగుణ మగుపదార్థమే పరిణమింపవలయు నను నియమము లేదు. పరిణామవాదమున నొకవేళ నానియమ మున్నను మామతమునఁ బ్రపంచోత్పత్తి పరిణామజాతము కాకపోవుటచే దోష మేమియుఁ గలుగదు. భోక్త్రాపత్త్యధికరణసిద్ధాంతము నాశ్రయించి "మీమతమునందును (వేదాంతమతమునందును) బరిణామసిద్ధాంతము కలదు" అని చెప్పినను అచ్చటియీశ్వరరూప మవిద్యాకల్పితమే యని చెప్పఁబడి యుండుటచే సగుణమే యగును. వాస్తవస్థితిలో నీప్రపంచమువలెనే ఆయీశ్వరుఁడు కూడ మాయు భ్రాంతికల్పితుఁడే. ఇఁక వివర్తవాదము నాశ్రయించి చూచిన నప్పుడు దోషము దైన నేదియైన సంగ పంపఁబడ వచ్చును. రక

వర్ణము గలపదార్థమును దూరమునుండి చూచినవాఁడు నీలవర్ణము గల దానినిఁగా భావించుచున్నాఁడు. ఇచ్చట రక్తవర్ణము స్వయముగ గుణ మే యగుటచే దానియందు మఱియొకగుణ ముండదు. మఱియొకగుణము లేకు న్న నొకదాని కుపాదానకారణము కానేరదు కదా. కావున నెట్లు చూచి నను మామతమునందు దోషము లేదు.

"ఇట్లు చెప్పుట సరి కాదు. మీరు మాత్రము క్రొత్తగా సాధించి నదేమి? పరమేశ్వరునకు గుణములు లే వనుచునే గుణముల నంగీకరించి తిరి. సర్వజ్ఞత్వాదులు గుణములు కావా? అనియెదవేమొ వినుము. అవి యాపరమేశ్వరునకు స్వభావములే కాని గుణములు కావు. మాసిద్ధాంత మున భేద మనునది భ్రాంతిసిద్ధమే కాని వాస్తవముకాదు. ఈవిషయము పలుమాఱు నిరూపింపఁబడెను. కావున గుణమునకును ద్రవ్యమునకును మేము భేదము నంగీకరించువారము కాము. మీ, రన్ననో భేదము నంగీ కరించి సమవాయసంబంధము నొక్కదానిఁ జెప్పుదురు. ఆసమవాయసం బంధము కూడ యుక్తియుక్తము కానేర దని నిరూపించి మేము ఇదివఱ కే అభేదరూప మగుతాదాత్మ్యసంబంధమును స్థాపించియున్నాము. ఇ ట్లగుటచే మామతమున లౌకికపదార్థములయందుఁ గూడ గుణగుణిభేదము లేదు. ఇట్లుండ వేదైకవేద్య మగుపరమేశ్వరునివిషయమున నీభేద మెట నుండివచ్చును? కావున మేము గుణముల నెప్పటికి నంగీకరించువారము కాము; అన్నిస్థలములయందును. వివర్తవాదమునే యాశ్రయించి యు న్నాము. కావున మామతమున దోష మేమియు రాదు. వాస్తవస్థితిలో నున్నది పరమేశ్వరుఁ డొక్కఁడే భ్రాంతిచే త్రాటియందు గానవచ్చుసర్ప మువలె నీవిద్యచే నాయనయం దీప్రపంచము కానవచ్చుచున్నది. అను టయే మాపరమసిద్ధాంతము.

ఇది వెన్నెలకంటిసుందరరామశర్మచే రచియింపఁబడిన బ్రహ్మసూ త్రార్థచంద్రికయందు ద్వితీయాధ్యాయమునఁ బ్రథమపాదము.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు
ద్వితీయాధ్యాయస్య ప్రథమఃపాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ద్వితీయాధ్యాయమునఁ
బ్రథమపాదము.



# ॥ బ్రహ్మసూత్రములు. ॥

## ద్వితీయాధ్యాయము, ద్వితీయపాదము.



## పాదావతారిక.

ప్రథమాధ్యాయమున వేదాంతవాక్యముల సమన్వయించుటచే స్వసిద్ధాంతము నిరూపింపఁబడెను. బ్రహ్మజ్ఞానము వలననే కాని మోక్షము కలుగ దని నిర్ణయింపఁబడెను. ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున నన్నదానికి లౌకికయుక్తులవలనను అన్యస్మృతులవలనను వచ్చువిరోధములు సయుక్తికముగఁ బరిహరింపఁబడినవి. పరులయుక్తులు స్వపక్షమును బాధింపక పోయినంతమాత్రమున పరసిద్ధాంతము లప్రమాణములుఁ కా నక్కఱలేదు కావునను, అట్లు అప్రమాణములు కాకుండిన వైదికసిద్ధాంతమునకు ప్రాధాన్యము రాదు కావునను, అట్లు రాకున్న దీని నెవ్వరు నాదరింపరు కావునను, అట్లాదరింపకున్న ముక్తి దొరకదు కావునను, "యావ త్పరమతం న నిరాక్రియతే తావ త్స్వమత మప్రతిష్ఠితం భవతి" "పరమతమును నిరాకరింపకుండునంతవఱకు స్వమతము స్థిరము కానేరదు" అనున్యాయము నాశ్రయించి యీపాదమునఁ గేవలయుక్తులచే పరయుక్తులు ఖండింపఁబడుచున్నవి.

"ఈశాస్త్రము వేదవాక్యార్థమును పూర్వపక్షసిద్ధాంతములతో నిర్ణయించుటకు ప్రవర్తించుచున్నది కాని తర్కాదిశాస్త్రములవలె శుష్కతర్కములతో నేదియైన నొకవిషయమును సిద్ధాంతముఁ జేయుటకుఁ గాని దూషించుటకుఁ గాని ప్రవర్తించుట లేదు కదా! మఱియు దీని నభ్యసించువారును కామక్రోధాదివర్జితులై యుండవలసినవారు. ఇట్లగుటచే స్వపక్షమును సూత్రము స్థాపింపవలయును గాని పరపక్ష

ముల దూషింపనేటికి? అది రాగద్వేషము లుండిననేకాని సంభవింపదు కదా" అనియెదవేమొ. వినుము. ఈశాస్త్రము మోక్షరూప మగు పరమపురుషార్థమును కలిగించుటకై ప్రవర్తించుచున్నది కాని కేవలవేదార్థనిర్ణయమునకై గాదు. లోకమునందును సాంఖ్యాదులచేఁ గల్పింపఁబడినమతములు శ్రేష్ఠములుగా నున్నట్లు గానవచ్చుటచే మహాజనులచే నాదరింపఁబడి యున్నవి. ఆకపిలాదులును సర్వజ్ఞులని ప్రసిద్ధి నొందియున్నారు. వేదము చతుర్ముఖునిచే లేక బ్రహ్మచేఁ గల్పింపఁబడినదియే కావున సర్వజ్ఞుఁడగుకపిలునిచే గల్పింపఁబడిన యాగమంబును దానితో సమానమే యగు ననీ తన్మతస్థులయభిప్రాయమై యున్నది. ఇట్లుండ వారిమతమును ఖండింపకున్న వైదికమతమునకు నిలుకడ యెట్లుకుదురును? "చేతనమే జగత్కారణము. అదియే యాత్మ దాని నెఱుంగుటవలనే మోక్షము కలుగును" అను వైదికపక్షమునకును "అచేతనమే జగత్కారణము అది యాత్మభిన్నము దాని నెఱింగిన మోక్షము కలుగును" అని చెప్పుసాంఖ్యసిద్ధాంతమునకును ఇట్టివే యగు వైశేషికాదిసిద్ధాంతములకును సమన్వయ మెట్లు కుదురును? ఇందొక్కటి ఖండింపఁబడ వలయు ననుటయు మఱియొక్కటి నిలువవలయు ననుటయు నావశ్యకము కదా! కావునఁ బరమతముల నిరాకరించుట యెట్లును ఆవశ్యకకృత్య మైనది. మఱియు నీశాస్త్రము నభ్యసించువారు రాగద్వేషాదిశూన్యులై యుండవలయు ననుట నిశ్చయమ కాని యది యెప్పుడు? సిద్ధాంతము నిర్వివాదముగ దృఢమై దాని నాశ్రయించినపిదపఁ గదా! ఇట్లుండ సిద్ధాంతదార్ఢ్యమునకై పరపక్షముల నిరాకరించుటలో నాక్షేప మేమి? జ్ఞానార్థులకు వేదాంతదర్శన మొక్కటియే యాశ్రయణీయ మనువిషయమును స్థిరముఁ జేయుట యావశ్యకము కదా! సాంఖ్యాదిదర్శనములు మోక్షమునిచ్చువానివలెఁ గానవచ్చుచున్నవి గాని వాస్తవస్థితిలో వానివలనఁ బ్రయోజనము లేదనియు వాని నాశ్రయించిన మీఁదు మిక్కిలి యధోగతి కూడ సంప్రాప్త మగు ననియు నిర్ణయింపవలయును కదా! కావున సూత్రకారుఁ డీపాదమునఁ జేయఁబూనినకార్యము నిరర్థకము కాదు.

పూర్వపాదముచే స్థిరపరుపఁ బడిన సమన్వయము దీనిచే నద్వితీయముగఁ జేయఁబడును. ఈ కారణమువలన పూర్వపాదము దీని

* ముపజీవ్యము; ఇది దాని † ముపజీవకము వీనికి రెంటికిని గలసంబంధ § ముప జీవ్యోపజీవకభావసంబంధము. ఇట్లీపాదము నారంభించుట మందమతులకు నిస్సంశయము కలిగించుటకై మాత్రమే యగుటచే దీనివలన "సూత్రకారుఁడు రాగద్వేషయుక్తుఁడు" అని తలంపవలసినపని లేదు. ఇందు పరపక్షదూషణము ప్రధానము కాదు.

"ఇట్లయినను 'ఈక్షతేర్నాశబ్దం (సూ. ౧. ౧. ౫.) కామాచ్చ నానుమానాపేక్షా (సూ. ౧. ౧. ౧౮.)' అనుమొదలగు ననేకసందర్భములచే నివి యిదివఱకే ఖండింపఁబడినవి. కదా" అనియెదవేమొ వినుము ఆసాంఖ్యాదులు కొన్ని వేదాంతవాక్యములఁ గైకొని వానికి స్వపక్షమున కనుకూలముగ వ్యాఖ్యానముఁ జేసి యున్నారు. 'ఈక్షతేః' అను మొదలగుస్థలములయందు ఆవ్యాఖ్యానములు మాత్రమే దూషింపఁబడి యున్నవి. "సాంఖ్యాదులు చెప్పునర్థము యుక్తమైనది కాదు" అని సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఈపాదమున వారియుక్తులు మాత్రము ఖండింపఁబడును. ఇదియే యిచ్చటఁ గలవిశేషము.

---

## అధికరణావతారిక.

ఈపాదమునఁ గడవఱకుఁ బ్రతియధికరణమునందును ఒక్కొక్క మతము నిరాకరింపఁబడును. కావున నిందలి యధికరణములకు నెచ్చటెచ్చట నేయేమతము నిరాకరింపఁబడునో నచ్చటచ్చట నదియే విషయము. "ఈమతము ప్రామాణికమా అప్రామాణికమా? అనునదియే సంశయస్వరూపము. ఆయామతమున నున్నయుక్తులు నిస్సారము లని యెఱుంగకుండుటయే సంశయకారణము. "ఈమత మప్రమాణము కావునవేదాంతసమన్వయము సిద్ధింపదు" అనునదియు "ఈమతము ప్రామాణికము కావున నిది సిద్ధించును" అనునదియుఁ గ్రమముగ పూర్వపక్షసిద్ధాంతఫల

---

* ఉపజీవ్య మనఁగా నొకదాని నాశ్రయించి బ్రదుకునది సేవకుఁడు మొదలగువా రిట్టివారు.

† ఉపజీవక మనఁగా నొకదానికి నాశ్రయ మిచ్చునది. ప్రభువు మొదలగువా రిట్టివారు.



§ ఈయిరువురకును గలనియతసంబంధమే ఉపజీవ్యోపజీవకభావసంబంధము

ములు. పూర్వపాదాంతమునఁ "గారణధర్మము లన్నియుఁ బరమేశ్వరు నకు సంభవించును" అని సిద్ధాంతము చేయఁబడెను. కావున "నాకారణ ధర్మములు ఆయామతములయందుఁ జెప్పఁబడినజగత్కారణములకే యేల సంభవింపకూడదు?" అని వచ్చునాక్షేపమే యిందలియధికరణములకుఁ బూర్వపాదాంతాధికరణములతోఁ గలసంబంధము. విశేషములు ఆయా స్థలములయందే చెప్పఁబడును. మఱియు నీపాదము మతదూషణమూలమున సమన్వయమునకుఁ గలవిరోధములను నశింపఁజేయుచున్నది యగుటచే నీయవిరోధాధ్యాయమునఁ జేర్పఁబడెను. అధికరణము లన్నియు నొక్కకార్యముచే యాచరించునవి యగుటచే నొక్క పాదముగఁ గూర్పఁబడెను. ఈశాస్త్రమునఁ బ్రతియధికరణమునకును శ్రుతితో సంబంధ ముండవలయు ననుట సిద్ధాంతమే యైనను ఈపాదమునకు మాత్ర మది లేకున్నను దోషము లేదు. శ్రుత్యర్థమును నిర్ణయించుట కేకదా! ఇదియుఁ బ్రవర్తించుచున్నది. ఇట్లే ఏయేస్థలములయందు ప్రత్యక్షశ్రుతివాక్యములు కానరావో అచ్చట నెల్ల నిర్ణయించుకొనునది.

---

# రచనానుపపత్త్యధికరణము. ౧.

విషయము.—అన్ని మతములకంటెను (సాంఖ్యమతము అధిక జనులచే నాదరింపఁబడుచున్నది. కావున నీపాదమున మొట్టమొదట నా మతమే నిరాకరింపఁబడును.

సాంఖ్యమతస్వరూపము:—సాంఖ్యులయభిప్రాయ మేమియనిన:— *'భేదానాం పరిమాణాత్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ కారణ

* 'భేదానాం' అనుసాంఖ్యకారిక కర్థము:— ౧ పరిమాణము, ౨ సమన్వయము, ౩ కారణశక్తివలననే కార్యము జనించుననుట. ౪ లోకప్రసిద్ధ మగునియత కార్యకారణభావము, ౫ ప్రళయకారణమున నభేదముతో లీనమగుట యను నీ కారణములవలనఁ బ్రతిపదార్థమునకును, ఉత్పత్తికారణ ముండవలయును.

౧. ఏ యే పదార్థములకుఁ బరిమాణము కలదో వానికి నెల్ల కారణ మున్నట్లు లోకమునఁ బ్రత్యక్షముగ గానవచ్చుచున్నది. ఘటాదిపదార్థములకుఁ బరిమాణము కలదు; కారణములును కలవు కదా.

కార్యవిభాగా దవిభాగా ద్వైశ్వరూప్యస్య కారణ మ వ్యక్తం' అని యీశ్వరకృష్ణుఁడు సాంఖ్యమతమునందలి హేతువులను సంగ్రహించి చెప్పియున్నాఁడు. అది యెట్లనిన:—

౧. లోకమున నింద్రియములు పంచభూతములు మొదలగునవి కొంతపరిమాణమును మాత్రమే కలిగి యున్నవి కాని సర్వవ్యాపకము లుగ లేవు ఏదేది పరిమాణము కలదియై యుండునో అది మఱియొకప దార్థమునుండి పుట్టవలయును (కాని స్వాభావికముగనుండుటకు వీలులేదు.

---

౨. సమన్వయ మనఁగా రెండుపదార్థములు సర్వకాలములయందును బరస్పర ము విడువకుండుట ఇట్టిస్థితి కార్యకారణములకుఁ దప్ప మఱివేనికిని సంభవింపదు. ఘటము మృత్తిక నెప్పటికిని విడువదు ; మృత్తికయు ఘటమును విడువదు. కావున నిట్టినియమ మేపదార్థములయందుఁ గానవచ్చునో యవి పరస్పరము కార్యకారణ ము లే యైయుండవలయును. యింద్రియాదులును సుఖదుఃఖమోహాత్మకము లగుటచే సత్త్వాదిగుణముల విడువకున్నవి. కావున వీనికి సత్త్వాదిగుణమయ మనుపదార్థము కారణము కావలయును.

3. ఉత్పత్తికిఁ బూర్వమునఁ గార్యము సూక్ష్మరూపముతోఁ గారణమునను డుననుట యుక్తిసిద్ధము. అదియే కారణశక్తి యని చెప్పఁబడును. మట్టి ఘట మునుఁ బుట్టింప గల దనిన మట్టియం దుత్పత్తికిఁ బూర్వమునఁగూడ నాఘటము సూక్ష్మ రూపముతో నున్నదనుటయే. కావునఁ గార్యము కానవచ్చినతోడనే 'ఇది యింతకు ముందు సూక్ష్మావస్థతో నేపదార్థమునందైన నుండియుండును' ; అని యూహింప వలసివచ్చును; కావునఁ బ్రతిపదార్థమునకును కారణ ముండియే తీరును.

౪. లోకమున "నిది దీనికిఁ గారణము. ఇది దీనికిఁ గార్యము" అని నియమ ముగ వ్యవహారము జరుగుచున్నది. ఎవడును పెరుగునకు మట్టిని కారణముగఁ జెప్పుట లేదు; పాలను మాత్రమే యెట్లు చెప్పుచున్నాఁడు. కావున నీవ్యవహారనియమము నాశ్రయించి చూచినఁ బ్రతిపదార్థమునకు నుత్పత్తికిఁ బూర్వమున సూక్ష్మావస్థ నియతమనియు నేదియో యొకపదార్థమున నిలిచి యుండుటయు నియతమే యని యు నాపదార్థమే దానికిఁ గారణము కావచ్చునని యు స్పష్టమగుచున్నది.

౫. ప్రళయకాలమందుఁ బ్రతిపదార్థము నశించుచున్నది. అదియు సూక్ష్మావస్థ నుజెందుటయే గాని ధ్వంసమగుట కాదు. ధ్వంసమే యైనచో మఱల జనించు టకు వీలు లేదు కదా. కావున ఏకారణమునఁ గూడ కార్యమునకుఁ గారణ మొ క్కటియుండి తీరవలయును.

ఘటము మొదలగుపదార్థములు కొంతపరిమాణముతోఁ గానవచ్చు చున్నవి; మృత్తిక మొదలగువాని నుండియు జనించుచున్నవి. ఇట్లగుట చే నేయేపదార్థమునకుఁ బరిమాణముండునో దానికి నవశ్యకముగఁ గారణ ముండవలయును. ("ఇంద్రియాదికం సకారణకం పరిమాణవత్వాత్ ఘటవ త్" అనునది యనుమానవాక్యస్వరూపము.) మఱియు నాకారణము అతి సూక్ష్మమై యుండును. కార్యము ఉత్పత్తికిఁ బూర్వమున నట్టియాకారము తోనే యుండవలయును కదా. మఱియు నది యనేకాత్మకము కూడ నగు ను. లేకున్న దానికి కార్యసంబంధ ముండదు.

౨. ఈప్రపంచమునఁ బ్రతిపదార్థమునందును సుఖము దుఃఖము ఉదాసీనభావము అనునవి కానవచ్చుచున్నవి. ప్రతిపదార్థమును చూచిన ప్పుడును కొందఱు సుఖపడుచున్నారు. మఱికొందఱు దుఃఖపడుచున్నా రు. వేఱొకకొందఱు దానివైపుననే తిరుగకున్నారు. ఇట్లగుటచే నాసు ఖదుఃఖమోహములే సర్వావస్థలయందును సర్వపదార్థముల ననుసరించు చున్నవి. ఇట్లు సర్వకాలములయందును పరస్పర మనువర్తించు పదార్థ ములు కార్యకారణము లగుచున్నవి. యనుట ప్రత్యక్షసిద్ధము. ఘట మేయవస్థయం దున్నను తదూపమున నున్నమృత్తిక దాని ననుసరించు చునే యున్నది. దానికి నుపాదానకారణ మగుచుఁ గూడ నున్నది. కావునఁ బైఁ జెప్పినవిధముగఁ బ్రతిపదార్థము ననువర్తించునవి యగుటచే నీప్రపం చమునకు సుఖదుఃఖమోహములే కారణములు కావలయును.

అందు సుఖము సత్వగుణము, దుఃఖము రజోగుణము, మోహము తమోగుణము. ఈమూఁడుగుణములును గలసి ప్రపంచకారణ మగుచు న్నది. దానికిఁ బ్రపంచరూపముతో విస్తరించునది కావునఁ బ్రధాన మని పేరు. పైఁజెప్పినగుణములు సమానస్థితిలో నుండుటయే దానికి స్వస్వరూ పము. సృష్టిసమయమున నాగుణములు పరస్పర మవయవములుగను అవ యవములుగను ఏర్పడి సర్వసృష్టిని గావించును.

"ఇట్లయిన నీప్రధాన మచేతన మైనది. దానిని చేతనుఁడు నియ మింపవలయును. అట్లయిన నది పరమేశ్వరాధీనమే యనవలయును. వేదాంతు లంగీకరించుమాట కూడ నట్టిదే కదా" అనిమెద వేమొ య ట్లు కాదు; సాంఖ్యులమతమున నీశ్వరుఁడు లేఁడు. నిర్గుణుఁడును దేనితో ను సంబంధపడనివాఁడు నగుపురుషుఁడు ఉదాసీనుఁడే యగును. తెలి

సికొనలేక ప్రపంచమునందు చిక్కి యందుఁ గలసుఖదుఃఖమోహములు తనకే గలుగుచున్న వని తలంచుచుండును. ఈతలంపే వారిమతమున బంధము. ప్రధానస్వరూపజ్ఞానంబును స్వస్వరూపజ్ఞానంబును ప్రధానమును విడిచి తనస్వరూపమును స్వీకరించుటయును వారిమతమున ముక్తి. ఆపురుషుఁడును వారిమతమున ననేకభేదములు కలవాఁడే ఇట్లగుటచే నాతఁడు ఆప్రధానమును ప్రేరేపింపఁ జాలఁడు; కావున వారాప్రధానమును గూర్చి యిట్లు చెప్పుదురు:—

ప్రధాన మచేతనము. అది పురుషులకు భోగమోక్షములను కలిగించుటకై చేతనాంతరసహాయముతో నవసరములేక స్వయముగఁ బ్రవర్తించుచున్నది. లోకమునందును ఇట్లు ప్రవర్తించునవి యనేకములు కలవు. పాలు స్వయముగ నచేతన మయ్యును శిశువుల నభివృద్ధిఁ జేయుటకై చేతనాంతరసహాయము లేకయే ప్రవర్తించుచున్నది. నీరు స్వయముగనే పాఱుచున్నది. గడ్డియు స్వయముగనే క్షీరరూపమునఁ బరిణమించుచున్నది. మఱియునేత్రాదీంద్రియములను చూచుట మొదలగుకార్యములయం దెవ్వఁడు ప్రేరేపించుచున్నాఁడు? సంపాదించుటకై యుద్దేశింపఁబడియున్న లేక రావలసియున్న పురుషార్థమే వానిప్రవృత్తికిఁ గారణము. ఇట్లే ప్రధానము కూడఁ బురుషునకు భోగమోక్షములఁ గలిగించుటకై స్వయముగనే స్వతంత్రముగనే ప్రవర్తింపవచ్చును. ఇదియునుఁ గాక *పంగ్వంధన్యాయముతోఁ బురుషప్రధానములు పరస్పరసహాయమును చేసికొనినను చేసికొనవచ్చును. కావున ప్రధానము స్వతంత్రమే.

3. మఱియు లోకమునఁ గార్యము ఉత్పత్తికిఁ బూర్వమున కారణమునందు సూక్ష్మరూపముతో నిలచియుండు నని ఇదివఱకే చెప్పఁబడి

---

* ఒకగ్రుడ్డివాఁడు ఒకయూరికి పోఁదలంచి మార్గమున దిక్కు తెలియక భ్రాంతుఁడగుచుండెను. అప్పుడు కాళ్లులేకపోవుటచే నడచుటకు మిగుల శ్రమపడుచుఁ బోవుచున్న యొకకుంటివాడు వానికి మిత్రుఁ డయ్యెను. అప్పుడు వారిరువురును బరస్పర సాహాయ్యముచే సుఖముగ గమ్యస్థానమునుఁ జేర దలంచి యిట్లు నిర్ణయించుకొనిరి. కుంటివానికి దృష్టి కలదు కావున త్రోవఁ జూపునట్లును కాళ్లు కలవాడగుటచే గ్రుడ్డివాడు వానిని భుజముపై నెక్కించుకొని నడచునట్లును వారు నిర్ణయించుకొనిరి. ఈ యేర్పాటుచే వారిరువురును అనాయాసముగ గమ్యస్థానమునుజేరిరి. ఇదియే పంగ్వంధన్యాయము. ప్రధానపురుషులు నిటే పరస్పర సహాయము నాచరించుకొనిరి [illegible]

యున్నది. ఇదియే (సూక్ష్మావస్థతో నున్నకార్యమే) కారణశక్తి యనఁబడును. ఇట్లగుటచే నాకారణ మవశ్యముగ నచేతనమే కావలయును. కార్య మగు ప్రపంచ మచేతనమే కదా! ఇది బ్రహ్మవివర్త మనువాదంబును సరి కాదు. రజ్జువివర్త మగుసర్పము శూన్యరూప మైయున్నది; ఈప్రపంచ మట్టిది కాదు కదా! కావున నవశ్యముగ దీని కొక యచేతనపదార్థమే కారణ మై యుండవలయును.

౪. ఇట్లుండినసే కాని "ఇది కారణము. ఇది కార్యము" అనువిభాగ మేర్పడదు. ఈప్రపంచమున కన్ననో సుఖదుఃఖమోహములు కారణము లని కానవచ్చుచున్నవి. "ఏది దేనిచే ననుసరింపఁబడునో అది (అనుసరింపఁబడునది) దానికి కార్యము("యత్ యే నాన్వితం తత్తస్య కార్యం మృదన్వితఇవ ఘటః" అనునది యనుమానవాక్యస్వరూపము") అను యుక్తిచే నీవిషయ మిదివఱకే నిరూపింపఁబడెను. మఱియు లోకమున నన్నిపదార్థములకుఁ గారణము కానవచ్చుచుండఁ బ్రపంచమునకు మాత్రము గారణ మేల లేకపోవును. బ్రహ్మము కారణము కాఁ గూడ దనియు నిదివఱకే చెప్పి యున్నాము.

౫. ఇదియంతయుఁ గాక ప్రళయావస్థయందు ఇంత యేల పదార్థము ధ్వంస మైనప్పుడుఁ గూడ కార్యకారణవిభాగము నొనర్చుటకు వీలు లేకున్నది. ఇట్లున్నను కార్యములు మాత్ర ముత్పత్తి యగుచున్నవి. కారణమే లేకపోయినచో నిది సంభవింపదు. కావునఁ దాఁబేలు తనయవయవముల లోనికి నడఁచికొనునట్లు ప్రళయకాలమున సర్వప్రపంచము నడఁచికొనుటకును, సృష్టిసమయమున నుత్పత్తిఁ జేయుటకును కారణ మొక్కటి యవశ్యముగ నుండవలయును. అది శూన్యరూప మగుటకు వీలు లేదు. కావున *బౌద్ధమతము యుక్తము కాదు. అది సద్రూపమే మైనను కార్యము సూక్ష్మావస్థతో దానియందు లేకున్న లేనిది యెప్పటికిని కలది యగుటకు వీలు లేదు. కావున నైయాయికవైశేషికాదిమతములు యుక్తములు కావు. (వారు సత్కారమునుండి యసత్కార్యమే సద్రూపముతో జనించు నందురు.) ప్రత్యక్షసిద్ధ మగుప్రపంచము భ్రాంతి యనుటకు వీలు లేకపోవుటచే వేదాంతమతము యుక్తము కాదు (వారు కార్యకారణములు సద్రూపములే మైనను కార్యము మాత్ర మున్నట్లు తోచు

* బౌద్ధులు అభావమునుండి భావము పుట్టు నందురు.

నదియే కాని వాస్తవము కాదందురు.) కావున మామతమే (సాంఖ్య మతమే) యుక్తియుక్తము "మహతః పర మవ్యక్తం, అజా మేకాం" అను మొదలగువాక్యములచే శ్రుతియు మామతమునే యనువాదమును జేయుచున్నది.

సాంఖ్యమతమున వేదాంతు లంగీకరించువిషయములు:—ఈవిధముగ సాంఖ్యులసిద్ధాంతము శ్రుతివిరుద్ధ మయ్యును శ్రుతిసమ్మతము వలె పలువురకు భ్రాంతిదాయకమై యున్నది. ఇందుఁ గొన్నిభాగములు వేదాంతులకును సమ్మతము. వేదాంతులవలెనే సాంఖ్యులును పురుషునకు నిర్గుణత్వముఁ జెప్పుచు స్వస్వరూపసాక్షాత్కారముచే ముక్తినిఁ జెప్పుచున్నారు; బంధము భ్రాంతిజన్య మనుచున్నారు కదా! మఱియు వారుజేయు *సత్కార్యవాదము గూడ సమ్మతమే యైనట్లు తోఁచును గాని యందు తారతమ్యము విశేషముగ గలదు. సాంఖ్యులు 'కార్య మెప్పటికిని సద్రూపమే' యందురు; వేదాంతులు "కార్యము సద్రూపముగఁ దోచుట మాత్రమే కాని వాస్తవస్థితిలో నట్లు లే" దందురు. "కారణము శూన్యరూపము కాఁ గూడదు" అనుపక్ష మిరువురకును సమ్మతమే.

ఇదివఱకే ఖండింపఁబడినవిషయములు:—ఇంతకుఁబూర్వమే ప్రథమాధ్యాయమున నాల్గవపాదమునందు ప్రథమద్వితీయాధికరణములలో నీమతమునకుఁ గలశ్రుతిబలము ఖండింపఁబడెను. 'ఈక్షతే ర్నాశబ్దం ౧. ౧. ౫.' అనునధికరణమునను మఱికొన్ని స్థలములయందును 'వీరిమతము శ్రుతిసమ్మతము కాదు' అని నిరూపింపఁబడెను. ద్వితీయాధ్యాయ ప్రథమపాదమునఁ జేతనకారణవాదముపై వచ్చువీరియాక్షేపములు ఖండింపఁబడినవి. 'కార్య మవిద్యాకల్పితమే; కారణముమాత్రమే. భేదము పారమార్థికము కాదు' అనువిషయము కూడ స్థాపింపఁబడెను. 'త్రికాలములయందును కార్యము సద్రూపము' అను, (సాంఖ్య) సిద్ధాంతము కూడ ఖండింపఁబడెను.

అవతారిక:—ఇట్లగుటచే 'సుఖదుఃఖమోహాత్మక మగుపదార్థమే ప్రపంచకారణము' అనుసిద్ధాంతభాగము నీక్రిందిసూత్రముతో ఖండించు

---

*సత్కార్యవాదమనఁగా నుత్పత్తికిఁ బూర్వమునను, లయావస్థయందును సూక్ష్మరూపముతోను స్థితిసమయమున స్థూలరూపముతోనుఁ గార్యము సద్రూపమేయై యుండునని చెప్పుట.

చున్నాఁడు. ఈయధికరణముయొక్క సంగతిమొదలగునవి యధికరణావతారికయందే సూచింపఁబడెను. మతస్వరూపనిరూపణమే పూర్వపక్షము.

## ౧౭౨. రచనానుపపత్తేశ్చ నాఽనుమానం.

### ౨. ౨. ౧.

తాత్పర్యము:—సాంఖ్యులు చెప్పుప్రకారమున నచేతనమును స్వతంత్రము నగు ప్రధానమునే జగత్కారణముగఁ గైకొనిన నది సృష్టినిఁ జేయు ననుట సంభవింపదు. అచేతనములకు స్వాతంత్ర్య మెచ్చటఁగలదు.? కావున సాంఖ్యసిద్ధాంతము యుక్తము కాదు. ఎట్లనిన:—

లోకమున నచేతనము లెవ్వియు స్వయముగఁ బ్రవర్తించుట ప్రత్యక్షముగ లేదు. ప్రతియచేతనమునకును ఒకచేతనుఁడు సహాయుఁడే యై యుండుచున్నాఁడు. కుమ్మరవాఁడు లేక మట్టి స్వయముగ ఘటరూపము నొందుట లేదు; స్వర్ణకారుఁడు లేక సువర్ణము భూషణ మగుట లేదు. మఱియు నొకనికి సుఖదుఃఖాదులఁ గలిగింపవలయు ననిన చేతనునకు సామర్థ్య ముండునే కాని యచేతనుల కుండదు. జ్ఞానవంతుఁ డైన శిల్పి మాత్రమే పురుషులకు సుఖదుఃఖకారణము లగువిచిత్రగృహాదుల నిర్మింపఁగలుగు చున్నాఁడు కాని స్తంభశిలాదులు స్వయముగనే నిర్మింపఁగలుగుట లేదు. ఇట్లుండ నెట్టివిజ్ఞానవంతులకుఁ గూడ నగోచరమై బహుకర్మఫలానుభవముఁ గలిగించుచు బహువిచిత్రపదార్థయుక్తమై యున్నయీప్రపంచము నచేతన మెట్లు సృజింపఁగలుగును? కేవలదృష్టాంతబలము నాశ్రయించియే సిద్ధాంతముఁ జేయవలయు నన్నను పైనిచెప్పిన విధముగ మతము నిలువదు. చేతనసహాయముఁ గలయచేతనములే పురుషార్థసాధనము లగుచున్నవి. యంటిని కదా!

'ఇట్లు కాదు. అచేతనమునకుఁ జేతనసహాయ ముండిన నుండును గాక నాకుఁ గావలసినది మాత్ర మది కాదు. అచేతనపదార్థము పురుషార్థసాధన మగుచున్నదా లేదా [illegible] ప్రశ్నమే అని యొకవేమొ అది

యుక్తము కాదు. * అన్వయ వ్యతిరేకములను విమర్శించిన వారిమతము నిలువదు. ఏయేపదార్థములు పురుషార్థసాధనములుగ నున్నవో అవియన్నియు నచేతనములుగ నుండునేని, యేవేవి యచేతనములు కావో అవియన్నియుఁ బురుషార్థసాధకములు కావేని యప్పుడు వారిమతమున నన్వయవ్యతిరేకములు కలుగును. దానిచే వ్యాప్తియు (పురుషార్థసాధకములగునవి యన్నియు నచేతనములే యనునియమంబును) స్థిరపడును. ప్రత్యక్షము దీనికి విరుద్ధముగ నున్నది. చేతనసహాయము లేక నచేతన మేదియు స్వయముగఁ బ్రవర్తించుట లేదు. కావున నెప్పటికిని స్వాతంత్ర్య మగు నచేతనము జగత్కారణము కాదు. కావున 'జగత్కారణ మచేతనం స్వతంత్రపురుషార్థసాధకత్వాత్ క్షీరాదివత్' 'పాలు మొదలగువానివలె స్వతంత్రముగ బురుషార్థమును సాధింపఁగలుగునది యగుటచే జగత్కారణ మచేతనమే' అనునసుమానము నిర్మూలమైనది. మఱియు నీప్రధానమునకును చేతనసహాయము కలదనినఁ గలుగువిరోధ మేదియు లేదు. విరోధ ముండిననే కదా యేదియో యొకవిధముగ నచేతనమును జగత్కారణముగ సాధింపవలసియుండుట. శ్రుతి చేతనమే జగత్కారణ మని చెప్పుచున్నట్లు ఇదివఱకే నిరూపింపఁబడియు నున్నది. చేతనసహాయము నంగీకరించిన నాశ్రుతియుఁ దోడ్పడును. ఇప్పు డదియు వారికి విరుద్ధమే యగుచున్నది కదా! కావున నచేతనమునకు స్వాతంత్ర్య ముండుటకు వీలు లేకపోవుటచే వారు చేసినయూహా దోషయుక్తము.

---

* అన్వయ మనఁగా కార్య కారణములకును హేతుసాధ్యమునకుఁ గలసాహచర్యనియమము. వ్యతిరేక మనఁగా కారణాభావ కార్యాభావములకును సాధ్యాభావ హేత్వాభావములకును గలసాహచర్యనియమము. (౩౯-౪౧)వ పుటయందు అనుప్రమాణస్వరూపము వివరింపఁబడియున్నది. అచ్చటఁ జెప్పబడిన లింగము హేతువనఁబడును. దానిచే నిర్ణయింపబడు పదార్థము సాధ్యమనఁబడును కార్యకారణస్వరూపము ప్రత్యక్షము. ఇఁక నన్వయవ్యతిరేకస్వరూప మెట్టిదనిన నెచ్చట ఘటముండునో "యచ్చట మృత్తిక యుండును." అనునది కార్యకారణముల యన్వయము. "ఎచ్చట మృత్తిక యుండదో అచ్చట ఘట ముండదు." అనునది కార్యకారణముల వ్యతిరేకము "ఎచ్చట పొగ యుండునో యచ్చట నగ్ని యుండును" అనునది హేతుసాధ్యముల యన్వయము. "ఎచ్చట యగ్ని యుండదో అచ్చట ధూమ ముండదు" అనునది హేతుసాధ్యముల వ్యతిరేకము.

౨. మఱియు 'జగత్కారణ సుఖదుఃఖమోహాత్మకం జగత్ తద
న్వితత్వాత్ మృదన్వితస్యేవ మృత్' 'మృత్తికచే ననువర్తింపఁబడుచున్న
ఘటమునకు మృత్తికయే కారణ మైనట్లు సుఖదుఃఖమోహములచే నను
వర్తింపఁబడుటవలన నీప్రపంచమునకు నాసుఖదుఃఖమోహములే కారణ
ములు' అను ననుమానము కూడ యుక్తియుక్తము కాదు. ఎట్లనిన:—
సుఖదుఃఖమోహము లనునవి మనస్సునందు దేశకాలాద్యనుగుణముగ
జనించువృత్తులే కాని పదార్థస్వభావములు కావు. మఱియు నీశబ్దాది
బాహ్యపదార్థములు వానికిఁ గారణములుగఁ గూడ నున్నవి. ఇదియం
తయుఁ బ్రత్యక్షము. ఆసుఖాదులు వస్తుస్వరూపములే యగునేని అన్నియు
నన్నికాలములయందు నేకరూపములుగ నుండవలయును. చందనము
హేమంతఋతువునందుఁ గూడ సుఖముఁ గలిగింపవలయును. కస్తూరి
మొదలగు పదార్థములు కూడ గ్రీష్మఋతువునందు సుఖకరములు కావల
యును. పదార్థస్వరూపమునకుఁ గాలభేదమువలన భేదము కలుగదు
కదా! ఇదియునుఁ గాక వారు ప్రతిపదార్థమునకును సుఖదుఃఖమోహ
ములు మూఁడును స్వరూపములే యనుచున్నారు. ఇట్లయిన ముండ్లు
విషము మొదలగునవి కూడ కొందఱకు సుఖమును కలిగింపవలయును.
ఇది యెంతయు ననుభవవిరుద్ధము కదా! కావున సుఖదుఃఖాదులు మనో
వృత్తులనియు బాహ్యపదార్థములు దేశకాలాద్యనుగుణముగ వానికి హే
తువు లగుచుండుననియు మాత్రమే చెప్పవలయును. ఇదియంతయు గాక
బాహ్యపదార్థము లేకరూపముగనే యున్నను వారివారి సంస్కారభేదముల
వలన నొకనికి సుఖమును కలిగించినదియే మఱియొకనికి దుఃఖమును కలి
గించుచున్నది. మనుష్యులచే నాదరింపఁబడు సంపెఁగపువ్వు తుమ్మెదలచే
తిరస్కరింపఁబడుచున్నది. ఇతరపశువులచే నిరాకరింపఁబడుపర్ణములు
మేకచే నాదరింపఁబడుచున్నవి. వా రన్నట్లు సుఖదుఃఖమోహములు
వస్తుస్వరూపములే యైన నీవిరోధ మేలకలుగవలయును ? వస్తుస్వరూపము
కాకున్న నవి జగత్కారణ మెట్లగును ? కావున నీహేతువు కూడ యుక్తి
యుక్తము కాదు.

౩. ఇదియునుఁ గాక పరిమాణ మనుకారణమునుఁ బట్టి సిద్ధాం
తముఁ జేయఁబోయిన నదియు సరి కాదు 'లోకమున మొలకలు ఘటము
మొదలగునవి కారణములతో సంబంధపడి యున్నవి ; పరిమాణము కలిగి

యున్నవి. కదా! యనుకారణము నాశ్రయించి మీరును ప్రపంచము నకుఁ గారణసంసర్గమునుఁ గల్పించితిరి; ఆసంసర్గంబును ఏకరూపునికి సంభవింపదు కావున 'జగత్కారణ మనేకరూప మని సిద్ధాంతము జేసితిరి. ఇట్లయిన వారు కారణములుగఁ జెప్పినసత్త్వాదిగుణములు కూడ మఱి యొకకారణముతో సంసర్గము నొందవలయును; వానికిని పరిమాణము కలదు కదా! చూడుము. వారిసిద్ధాంతము ననుసరించి చూచిన సత్త్వాది గుణములు ప్రపంచమునందు మాత్రమే సంబంధపడియున్నవి కాని తమలోఁ దాము సంబంధపడ లేదు. కార్యకారణభావ ముండిననేఁ గాని యట్టిసంబంధ ముండదు కదా! ఆత్మయును శుద్ధచైతన్యరూపుఁ డగుటచే నాతనితో వీనికి సంబంధము కలుగదు. ఇది యంతేయును గాక పరిమాణమే హేతువుగా నుద్దేశింపఁబడుటవలన పురుషుఁడును కారణసంసర్గము నొందవలసినవాఁ డగును. వారిమతమునఁ పురుషుఁ లనేకు లగుటచే వారలకునుఁ బరిమాణము కలదు కదా! కావున పరిమాణ మున్నంతమాత్రముననే వస్తువులు కారణసంసర్గము నొందవలయు ననుట నియమము కాదు; కారణము కూడ నింతమాత్రమున ననేకాత్మకము కానక్కఱ లేదు.

౩. శ్రీ. ఇట్లగుటచే కార్యకారణములకు పరస్పరసంసర్గ వాస్తవముగ నుండవలసినపనియే లే దనుట నిర్వివాద మైనది. దీనివలనఁ బరమేశ్వరుఁడే ఏకరూపుఁ డయ్యునను ప్రపంచకారణము కావచ్చును. సంసర్గయు భ్రాంతికల్పితము కావచ్చును. పైసిద్ధాంతము ననుసరించి చూచినఁ బ్రపంచమునందలి కార్యకారణభావము లన్నియు భ్రాంతికల్పితసంసర్గాపూర్వకములే యగుచున్నవి. కదా 'కావున నీప్రపంచము సృష్టికిఁ బూర్వమునను ప్రళయమునకు ననంతరమునను పరమేశ్వరునియం దిట్టి సంబంధముతోనే యున్నది. సృష్టికాలమునఁ ద్రాటినుండి సర్పము జనించినట్లు భ్రాంతిచే జనించుచున్నది' అను మనసిద్ధాంతమే మిగుల యుక్తియుక్త మైనది.

౪. మఱియును వారు కార్యకారణవిభాగము ప్రత్యక్షమైయుండుటచేఁ బ్రపంచమునకు నచేతనమే కారణ మనుచున్నారు. అచేతనము నకుఁ జేతనము కారణ మగుట సంభవింప దనుచున్నారు. ఇదియు విరుద్ధమే; లోకమున నేకార్యమును విచారించినను దానికి బుద్ధిపూర్వక

కర్తయె (సంకల్పపూర్వకముగ నాచరింపఁగలవాఁడే) కారణ మగుచున్నాఁ డనుట స్పష్టమగుచున్నది 'వాఁడు ఉపాదానకారణము కానేరఁడు. కదా' అనిమెదవేమొ అట్లయినను దోష మేమి? ఉపాదానకారణముతోఁ గార్యమునకు వాస్తవసంసర్గ యుండ నక్కఱలే దని యిదివఱకే నిరూపించితిని కదా! చేతనుఁడును సంకల్పమాత్రముచే సర్వపదార్థములఁ గల్పింపవచ్చు ననియు నిదివఱకే నిరూపింపఁబడి యున్నది; కావున నెట్లును సాంఖ్యసిద్ధాంతము యుక్తియుక్తము కానేరదు.

## సూత్రము. ౨.

అవతారిక:—ఈవిషయము (మూఁడవవిషయము) నే మఱియొక హేతువుచే ఖండించు చున్నాఁడు.

## ౧౭౩. ప్రవృత్తేశ్చ. ౨. ౨. ౨.

తాత్పర్యము:—మఱియు నీప్రధానము తనశక్తివలనఁ గార్యరూపముగఁ బ్రవర్తించుచున్నది యని సాంఖ్యులుచెప్పుచున్నారు. (మతస్వరూపము పేరా 3. 666 పేజీ.) ఆహేతువుకూడ 'ప్రధానమునకు చేతనసహాయము కావలయును' అనువిషయమును నిరూపించుచుండుటచే మనకే సహాయకారి యగుచున్నది. త్రిగుణములును సమానములై యుండుటయె ప్రధానమునకు స్వరూపము. అట్టిస్థితివలన నగుకార్య మేదియు నుండదు. ఆగుణములలో నొకటి యధిక మగుచు తక్కినవి దానికి నవయవము లగుచు నుండిననే కాని యేపదార్థంబును జనింపదు. ఇదియే యాప్రధానమునకు వ్యాపారము. ఈవ్యాపారము. అచేతనమున కెట్లు గలుగును. మట్టి రథము మొదలగునవి కుమ్మరవాఁడు గుఱ్ఱములు అనుచేతనముల యొక్క సహాయము లేక స్వయముగఁ బ్రవర్తించుట లేదు కదా. కావున వారు చెప్పిన హేతువుఁకూడ మనకే యనుకూల మైనది; వారు మాత్రము 'ప్రపంచ మచేతన మగుటచే దానిసిఁ గల్పించుకారణము కూడ నచేతనమే కావలయును' అని యభిప్రాయపడి కొన్నిదృష్టాంతములను మాత్రమే యాశ్రయించి యట్లు సిద్ధాంతముఁ జేసిరి కాని లోకప్రసిద్ధిని గమనింపలేదు. కావున నీప్రపంచము అతివిచిత్రముగ నున్నది

యనుటయే కాదు; స్వయముగ నచేతనము ప్రవర్తింపలే దనుట కూడ వారిసిద్ధాంతమునకు భంగముఁ గలిగించుచున్నది.

పూర్వపక్షము:—ఇట్లు కాదు. మనము (వేదాంతులు) కూడ సాంఖ్యమతమును నిరాకరించినపిదప శుద్ధచేతనస్వరూపుఁడును ఇతరసహాయము లేనివాఁడు నగుపరమేశ్వరునే అభిన్ననిమిత్తోపాదానకారణముగఁ జెప్పవలయును. ఇది యంతయుక్తముగా తోఁచలేదు. లోకమునఁ గేవల మగుచేతనపదార్థము కూడఁ బ్రవర్తించుటలేదు. ప్రవర్తించునది యంతయు నచేతనమే. దేహము మాత్రమే సర్వవ్యాపారముల నాచరించుచున్నది; కాని అందలియాత్మ కాదు. ఒకవేళ నాయాత్మ యుండిన నుండును గాక. ఇంతమాత్రమున నాయన ప్రవృత్తికిఁ గారణ మగునా? ఆకాశ మన్నిస్థలములయందును వ్యాపించి యున్న దనునంతమాత్రమున సర్వపదార్థములకును *నిమిత్తకారణ మగుచున్నదా? కావున అచేతనమునకే వ్యాపారము కల దనవలయును. అచేతనము నాశ్రయింపక వ్యాపారవంతుఁడై కేవలచేతనుఁ డెందునుఁ గానవచ్చుట లేదు. ఈకారణము వలననే "దేహ మున్నప్పుడు వ్యాపారము కలదు లేనప్పుడు లేదు" అను వ్యాప్తి నాశ్రయించి లోకాయతులు "దేహమే యాత్మ" యని సిద్ధాంతముఁ జేసి యున్నారు. ఇదియునుఁ గాక మనమతమున నాపరమేశ్వరుఁడు వ్యాపారశూన్యుఁడు అద్వితీయుఁడు నై యున్నాఁడు. ఇట్లుండ మనమతము మాత్రము నిలుచుట యెట్లు?

సిద్ధాంతము:—ఇట్లు సంశయింపవలదు. కేవలుఁ డగుచేతనునకుఁ గూడ వ్యాపారము లే దనుట సత్యమే. అయినను ఆచేతనుఁడు స్వతంత్రుఁడు. ఆయనయొక్క సహాయముచేఁ జేతనము ప్రవర్తించుచున్నది; కాని యచేతనముయొక్క సహాయముచే నాయన ప్రవర్తించుట లేదు. సర్వవ్యాపారముల నాచరించునదియు నచేతనమే యనుటలో వివాద మేమియు లేదు కాని ఆవ్యాపారమునకు చేతనుఁడే కారణ మనుట మన సిద్ధాంతము. ఆకాశాదులవలె చేతనుఁ డూరక నుండువాఁడు కాడనియు వ్యాపారమునకు కారణముఁ గూడ నగుచున్నాఁ డనియు మనసిద్ధాంతము. దేహము బ్రతికియున్నప్పుడు మాత్రమే వ్యాపారముల నాచరించుచున్నది; కాని చేతనము వెడలిపోయినపిదప నట్లాచరించుట లేదు. రథాదులును

*నిమిత్తకారణము ... [illegible]

అశ్వములు వాని నీడ్చినపుడు మాత్రమే కదలుచున్నవి కాని లేనప్పుడు లేదు. ఇట్లగుటచే నావ్యాపారము చేతనమువలనఁ గలిగినది యనియె చెప్ప వలయును "అగ్ని యున్నప్పుడు మాత్రమే కొఱవి యితరపదార్థమును కాల్చును; లేనప్పుడు లేదు" అని గ్రహించినవాఁడు "దాహశక్తి అగ్నివ లనఁ గలుగుచున్నది" అని నిర్ణయించుటకు సంశయించునా? లోకాయత మతస్థులును "చేతన మగుశరీరమే అచేతనము లగురథాదిపదార్థములఁ బ్రవర్తింపఁజేయును" అనియే సిద్ధాంతముఁ జేసి యున్నారు. కావున "సర్వవ్యాపారములకును జేతనపదార్థమే కారణము" అనువిషయము సాంఖ్యులకుఁ దప్ప తక్కినవారలకు నందఱకును సమ్మతమే. మనమును వాస్తవస్థితిలో నీసమయమున "జేతనమునకు వ్యాపారకారణత్వము కల దా? లేదా?" అనువిషయమునుమాత్రమే విచారింపవలసి యున్నాము; కాని పరమేశ్వరస్వరూపమును కాని జీవస్వరూపమును గాని వివరింపవల సినవారమై యుండ లేదు. ఇట్లుఁ గాక ఆవిషయమునుఁ గూడ చర్చింపవ లయు నన్నను మనమతమునందు దోషము కలుగదు. పరమేశ్వరునకు వ్యాపారము లేకున్నను తనసాన్నిధ్యమువలన నితరపదార్థములఁ బ్రవ ర్తింపఁ జేయవచ్చును. అయస్కాంత మట్లే యినుమును ప్రవర్తింపఁ జేయుచున్నది; తాను చలింపకయే దానిని చలింపఁ జేయుచున్నది. రూప ము మొదలగుగుణంబులును స్వయముగఁ బ్రవర్తింపకయే తనవైపునకు నింద్రియములు నాకర్షించుచున్నవి కదా! మఱియు నాయన అద్వితీయుఁ డే యైనను మాయామయము లగు నామరూపములు సూక్ష్మములై సృష్ట్యారంభమున ననిర్వచనీయ సంబంధముతో నాయనయందుఁ గలవని యిదివఱకే పలుమాఱు నిరూపించి యున్నాము. కావున సర్వజ్ఞుఁడును సర్వ శక్తియుక్తుఁడు నగుపరమేశ్వరుఁడే జగత్కారణ మని చెప్పిననే సిద్ధాంత ము నిలుచును లేకున్ననిలువదు.

## సూత్రము. ౩.

అవతారిక:—"ఇట్లు కాదు. పాలు స్వతంత్రముగనే వత్సము నభి వృద్ధిఁ జేయుటకై ప్రవర్తించుచున్నది. జలమును స్వయముగనే లోకోప కారార్థమై ప్రవహించు చున్నది. తృణంబును క్షీరముగ మాఱుచున్నది. ఇట్లే ప్రధానమును స్వతంత్రముగఁ బురుషులకు భోగమోక్షములఁ

గలిగించుటకై ప్రవర్తింపవచ్చును" అను పూర్వపక్షమును ఖండిం పుచున్నాఁడు.

## ౧౭౪. పయోంబువచ్చేత్తత్రాపి. ౨. ౨. ౩.

తాత్పర్యము:—ఇదియునుఁ గాక సాంఖ్యమతస్థులు చెప్పుదృష్టాంతములు గూడ యుక్తములు కావు. పాలు మొదలగువానియందు కూడ చేతనసహాయము కలదని యనుమానముఁ జేయవచ్చును. రథములు మొదలగునచేతనములు చేతనసహాయశూన్యముగ ప్రవర్తించుట లేదను విషయము సాంఖ్యులకుఁ గూడ సమ్మతమే కదా! కావున వీనిని ప్రధానమునకు దృష్టాంతములనుగాఁ జెప్పఁగూడదు. మనకును వారలకునుఁ గూడ సందిగ్ధమై(నిశ్చయింపవలసినదియై)యున్నవిషయమునే వారు హేతువుఁ గాఁ జెప్పుట యెట్లు యుక్తమగును ? లోకప్రసిద్ధియు "యో ఽప్సు తిష్ఠన్...అప అంతరో యమయతి" "ఎవ్వఁడు జలమున నుండి దానిని ప్రేరేపించుచున్నాఁడో" అను మొదలగుశ్రుతివాక్యములును మనసిద్ధాంతమునకే ("చేతనసహాయము లేక నచేతన మేదియుఁ బ్రవర్తింపలేదు" అను సిద్ధాంతమునకే) అనుకూలముగ నున్నవి. కావున వారిమతము చెల్లదు.

నీటినిఁ గూర్చి యిదివఱకే ప్రమాణమును చూపితిమి. మఱియు నది పల్లము మొదలగువాని నపేక్షించియే పాఱుచున్నది కాని స్వతంత్రముగఁ గాదు కదా ! పాలును ఆవుయొక్క యిచ్ఛవలనఁ బ్రవర్తించుననవచ్చును. లేఁగను చూచినప్పుడుగాని అది క్షీరపానముఁ జేయుటకై స్తనములను స్పృశించినప్పుడు కాని పాలను స్రవింపదు కదా ! మఱియుఁ దృణమును గూర్చి చెప్పినదృష్టాంతము మిగుల నయుక్తము; దానికి క్షీరరూపముతోఁ బరిణమించుటకు స్వతంత్రశక్తియే కలిగియున్న వృషభమహిషాదులయం దేల అట్లు పరిణమింపఁ గూడదు. "అవయవసన్నివేశభేదమే దానికిఁ గారణము కాఁ గూడదా ?" అనియెదవేమొ అప్పటికిని మనయభిప్రాయము నిర్వివాదముగనే సిద్ధించినది "అచేతనములకు నెందును స్వాతంత్ర్యము లేదు" అనువిషయము సిద్ధాంతమైనది గదా! వాస్తవస్థితిలో నాయవయవసన్నివేశమునకుఁ గూడ నట్టివ్యాపారముఁ గలిగించువాఁడు చేతనుఁడే యగుటచే సర్వమునుఁ జేతనకార్యమే యగును. కావున మనసిద్ధాంతమున నెట్టును దోషము కలుగదు.

"ఉపసంహారదర్శనా న్నేతి చే న్న క్షీరవ ద్ధి. ౨. ౧. ౨౪."
అనుసూత్రమున క్షీరమునకు స్వతంత్రకారణత్వమును మనము కూడఁ జెప్పియున్నాము కదా!" అనియెదవేమొ యట్లుకాదు. అచ్చట లోకుల యొక్క స్థూలదృష్టి నాశ్రయించి "వెలిసాధనములతో నవసరము లేకయే పాలు పెరుగుగ మారుచున్నవి" యని చెప్పితిమి కాని దానికి చేతనస హాయ మక్కఱ లే దని కాదు. "దండము చక్రము మొదలగుసాధన ములు లేక కులాలుఁడు మొదలగువారు ప్రవర్తింపలేరు కావునఁ బరమే శ్వరుఁడు కూడ తనకంటె నన్యము లగునచేతనపదార్థములఁ గొన్నింటిని సాధనములుగఁ గైకొనవలయును" అనియే కదా యచ్చట యాక్షేపము వచ్చినది. "చేతనమునకు సహాయాంతరము (అచేతనసహాయము) కావల యునా? అక్కఱ లేదా?" అనువిషయము మాత్రమే యచ్చట విచా రణీయము కాని "అచేతనమునకు స్వతంత్రప్రవృత్తికలదా? లేదా?" అనువిషయము కాదు. అప్పటికి నచ్చటిసిద్ధాంతము ప్రస్తుతసిద్ధాంత ముతో నించుకయు విరోధింపదు. అచ్చట బాహ్యసాధనములు నిషేధిం పఁబడెను; పరమేశ్వరుఁడు సర్వాంతరుఁడు కదా.

## సూత్రము. ౪.

అవతారిక:—సాంఖ్యులమతమున సత్వరజస్తమోగుణములు స మానస్థితిలో నుండుటయే ప్రధానము. దానిని ప్రవర్తింపఁ జేయుటకు గాని నివర్తింపఁ జేయుటకు గాని మఱియొకపదార్థ మేదియు లేదు. పురు షుఁడు ఉదాసీనుఁడగుటచే నాప్రధానముఁ బ్రవర్తింపఁ జేయుటకుఁ గాని నివర్తింపఁ జేయుటకు గాని సమర్థుఁడు కాఁడు. కావున ప్రధానము అన్య సాధనములయపేక్ష లేకయే ఒకమాఱు ప్రపంచరూపముగఁ బరిణమిం చుచు మఱియొకమాఱు అట్లు పరిణమింపక యున్నది యనవలయును. వా రును ఇట్లే చెప్పి యున్నారు. ఈసిద్ధాంతము విరుద్ధ మగుటచే నీసూత్ర మున ఖండింపఁబడుచున్నది.

## ౧౭౫వ్యతిరేకానవస్థితే శ్చానపేక్షత్వాత్. ౨. ౨. ౪

తాత్పర్యము:—పైసిద్ధాంతము యుక్తము కాదు. ప్రధానము స్వయముగనే యన్యసహాయముం లేకయే ప్రవర్తించునది యనుకొనినను నివ

ర్తించుటకు వీలు లేదు; నివర్తించునది యగునేని ప్రవర్తించుటకు వీలు లేదు; వస్తుస్వభావమునందు మార్పుకలుగదు కదా! అగ్ని యొకప్పుడు వేడిగను మఱియొకప్పుడు చల్లగను నుండునా? పరమేశ్వరుఁడే జగత్కారణ మైనచో నాయన సర్వజ్ఞుఁ డగుటచేతను సర్వశక్తియుక్తుఁ డగుటచేతను మాయావి యగుటచేతనుఁ బూర్వకల్పాంతమున నిలిచియున్నకర్మలు పరిపాకమునొందుస్థితి నపేక్షించి (అనఁగా: కర్మపరిపాకమువలన) స్వేచ్ఛగా నైనను విలాసార్థముగ నైనను స్వభావముగ నైనను ఈప్రపంచమును సృజింపనచ్చును; మఱలఁ గల్పాంతమునఁ గర్మలు నిరుద్ధము లైనప్పుడు (ప్రళయకాలమునకు సర్వజీవులప్రారబ్ధకర్మలును నిశ్శేషముగ ననుభవింపఁ బడును; ఆగామిసంచితములు ఫలాభిముఖములు కాక పరిపాకమునుఁ జెందవలసినస్థితిలో నుండును. ఈకారణమువలన సృష్టి జనించుటకు వీలులేకపోవుటచే సర్వము నశించి పోవును.) సంహరింప వచ్చును.

"సాంఖ్యులకు కూడ ప్రధానమునందు కర్మవాసనలు కల వందురు కదా!" అందు వేమొ వినుము. ఆకర్మ వారిమతమున సృష్టిసాధనము కాదు. ప్రధానమును సృషియందుఁ బ్రేరేపించునది కాదు. ఇఁక నేమి యనిన:—ధర్మాధర్మములు పరస్పర మధికము లైనప్పుడు పరస్పరము నిరోధించుకొనుచు మాత్రమే యుండును. ధర్మము నిరోధింపఁబడినప్పుడు సృష్టి దుఃఖమయముగను అధర్మము నిరోధింపఁబడినప్పుడు సుఖమయముగను మాత్రమే మాఱుచుండును. సృష్టిని చేయుట చేయకుండుట యనునవిమాత్రము ప్రధానస్వభావములే "కృషిఁ జేయువాఁడు ఒక వరి మడినుండి మఱియొకమడిలోనికి నీటిని నింపవలసినప్పుడు మడికట్టను మాత్రమే తొలఁగించుచు నుండునో ఆజలమునకు మాత్రము రెండవ మడిలోనికి పోవుట యెట్లు స్వభావమే యై యున్నదో అట్లే యీకర్మయును ధర్మాధర్మనిరోధములను మాత్రమే మాన్పును; సృష్టిమాత్రము ప్రధానముయొక్క స్వభావమే" యని వారు చెప్పుదురు. "నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేద స్తు తతః క్షేత్రికవత్" అను యోగసూత్రమున నీవిషయము చెప్పఁబడి యున్నది. ఇట్లుండ నీకర్మవలన వారికిఁ గలుగు ప్రయోజన మేమి?

"పరిపాకము వారిమతమునందును, ఆవశ్యకమే. అది లేకున్న నిరోధముకూడ గలుగదు కదా" అనియెదవేమో వినుము. నిరోధము

నకుఁ బరిపాకముతో నావశ్యకము లేదు. విరోధి యుదయించినంతమాత్రముననే తద్విరుద్ధద్రవ్యములు నశించుచున్నవి. సూర్యుఁ డుదయింపఁగనే చీఁకటి తొలఁగిపోవును కాని ఆయనయొక్క యభివృద్ధి నపేక్షింపదు. ఫలము నిచ్చుటకుఁ బరిపాకము కావలయును. గాని విరోధినాశమునకుఁ గాదు. కావున సర్వకాలములయందును ధర్మాధర్మములకుఁ బరస్పరనిరోధము కలుగుచునే యున్నది కావున సృష్టియు సర్వకాలములయందు నుండవలయును. నాశము నొందకూడదు. ఇది వైదికమతములకు విరుద్ధము కదా! విశేషించి సాంఖ్యులును లయము నంగీకరించియే యున్నారు. "లయకాలమునఁగార్యము కారణమునందు లీన మగును కావున' అని వారు కారణ ముండితీఱవలయు ననుసిద్ధాంతమునకు హేతువునుఁ గూడఁ జెప్పియున్నారు కదా! కావున వారిమత మెట్లును యుక్తము కానేరదు. మనమతమునం దన్ననో సృష్టి కర్మఫలరూపము. ఇట్లగుటచే దానికి పరిపాకముతో నావశ్యకత కలదు. ఆకారణమువలనఁ గర్మలు నిరుద్ధము లైనసమయము మొదలు పరిపాకము నొందునంతవఱకుఁ బ్రపంచము కారణమున లీనమై యుండవచ్చును; మఱలఁ బూర్వవాసనానుసారముగ సృష్టి కావచ్చును. "జీవులు తమకర్మలు పరిపాకము నొందినప్పుడు తమయజ్ఞానమువలనఁ దత్తద్వాసనానుగుణముగఁ బరమేశ్వరునిఁ బ్రపంచరూపముతోఁ జూచుచున్నారు" అనుటయే కదా మనపరమసిద్ధాంతము.

## ౧౭౬ అన్యత్రాభావాచ్చ న తృణాదివత్. ౨. ౨. ౫.

పూర్వపక్షము తాత్పర్యము:—లోకమున గరిక చిగురు నీరు మొదలగునవి గోవు మొదలగు వానిశరీరములయందు స్వభావముగనే క్షీర మగుచున్నవి. అప్పుడు వానికి చేతనసహాయ మక్కఱ లేదు. గోవునకుఁ గలచేతనము చేయుపని ఆతృణాదులను భక్షించునంతవఱకే కదా! కావునఁ బ్రధానము కూడ నిట్లే ప్రవర్తింపవచ్చును. తృణాదులకు క్షీరపరిణామమునందు మఱియొకసహాయమే కావలసియుండిన నప్పుడు మనముకూడ వానిని సంపాదించి యుపాయముచే వానినుండి క్షీరముఁ బుట్టింపవచ్చును; ఇది ప్రత్యక్షవిరుద్ధము కదా!

సిద్ధాంతము:—ఈపూర్వపక్షమునకు సమాధాన మీవఱకే చెప్పఁబడి యున్నది. ఈతృణాదులు గోవు మొదలగు స్త్రీజంతువులశరీరమునందే క్షీరము లగుచున్నవి; కాని పురుషజంతువులశరీరములందు క్షీరము లగుట లేదు. నిష్కారణముగనే స్వాభావికముగనే పరిణమించునేని సర్వస్థలము లయందు నట్లే పరిణమింపవలయును. నశించిన పిదపఁగూడ క్షీరరూపము నొందవలయును. గవాదిశరీరములయందు జీర్ణమైనపిదపనే కదా క్షీరము లగుచున్నవి. కావున నీతృణాదులకును స్వతంత్రపరిణామము లేదు; వారిప్రధానమునకును స్వతంత్రపరిణామము లేదు.

మఱియును గడ్డిమొదలగువానినుండి మనుష్యులు పాలను పుట్టింపలేనంతమాత్రమున నవి (తృణాదులు) స్వతంత్రములు కావలయునా? లోకమున నన్నిఁటిని మనుష్యులే పుట్టింపుచున్నారా? వారికి సాధ్యము లగువానిని వారు పుట్టించుచున్నారు; అసాధ్యము లగువానిని పరమేశ్వరుఁడు పుట్టించుచున్నాఁడు. కావున సర్వజ్ఞుఁడగుపరమేశ్వరుఁడే సర్వపదార్థముల నాయాకార్యములయందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు. అచేతనమగు గోశరీరముచే గడ్డి మొదలగువానిని భక్షింపఁ జేయుటకు నందలిచైతన్యమెట్లావశ్యకమో, అందలియవయవసన్నివేశభేదముచే దృణాదులకు క్షీరరూపపరిణామముఁ గలిగింపఁ జేయుటకుఁ గూడ నాచైతన్యమే కారణము.

## సూత్రము. ౬.

అవతారిక:—ఇట్లు ప్రధానమునకు స్వతంత్రప్రవృత్తి కలుగదని సిద్ధాంతము చేసియు మఱల నాపక్షము నంగీకరించి కూడ సాంఖ్యమతమును దూషించుచున్నాఁడు.

## ౧౭౭. అభ్యుపగమే ఽప్యర్థాభావాత్. ౨. ౨. ౬.

తాత్పర్యము:—ఇట్లుఁగాక వారిపట్టుదల ననుసరించి 'ప్రధానము స్వతంత్రముగనే సృష్టింపఁగలదు' అని యంగీకరించినను వారిమతము నిర్దోషము కానేరదు. ఆప్రధానమునకు ప్రపంచరూపపరిణామము స్వాభావికమే యగునేని దానికి సహాయాంతరములతో నెట్లు పని లేదో యట్లే ఫలము [illegible] లేదు. '[illegible] పవలయును' అను

తలంపు దానికిఁ గలుగదు కదా ! ఒకవేళ దానివలన జేతనుఁడగుపురుషు నకు ఫల ముండిన నుండవచ్చును కాని దానికి మాత్రము (ఆప్రధానము నకు మాత్రము) తదర్థమై ప్రవృత్తి యుండుటకు వీలు లేదు.

'ఇట్లు కాదు. ఆప్రధానమునకు నుద్దేశము లేకున్నను దానిప్రవృత్తి మాత్రము పురుషునకుఁ బ్రయోజనకారి యగుటచే తదర్థమే కావచ్చును' అనియెదవేమొ వినుము. ఇచ్చటనుఁ గొంతవిచారణీయాంశము కలదు. ఆప్రధానము పురుషునకు భోగము నొసంగుటకై ప్రవర్తించునా? లేక మోక్షము నొసంగుటకై ప్రవర్తించునా? కాక నారెంటినిఁ గూడఁ గలి గించుటకై ప్రవర్తించునా?

ఇందు మొదటిపక్షము యుక్తము కాదు. వారిమతమునఁ బురు షుఁడు నిత్యశుద్ధుఁడు నిర్వికారుఁడు. ఇట్లగుటచే వానికిఁ గలుగుభోగము కేవలకల్పితమే కావలయును కాని వాస్తవ మగుటకు వీలు లేదు. వాస్త వము కాకున్న దానికై సృష్టిప్రవృత్తి కలుగు ననుట యనావశ్యకము. మనమతమునం దన్ననో సృష్టియును దానివలనఁ గలుగుభోగంబునుఁ గూడఁ బరమార్థములు కాకపోవుటచే నెట్లు చెప్పినను సరిపోయినది. వారి మతమున సృష్టి పరమార్థము కావున నది కల్పితభోగమును కలిగించుటకై ప్రవర్తించు ననుట యుక్తము కానేరదు. మఱియు సృష్టి పరమార్థ మగుటచే దానితోఁ బురుషునకుఁ గలసంబంధము జ్ఞానమాత్రమున నశిం పదు. ఇట్లగుటచే వానికి నెన్నటికిని మోక్షము సంభవింపదు.

ఇఁక రెండవపక్షమును విచారించిన నదియు యుక్తము కాదు. మోక్షము పురుషునకు స్వతస్సిద్ధము కాని కర్మసాధ్యము కాదు. ఇ ట్లుండ నది ప్రధానప్రవృత్తిచే (సృష్టిచే) సాధింపఁబడు ననుట యెట్లు? అది సృష్టికిఁ బూర్వమునఁ గూడ నట్లే యున్నది కదా. మఱియు నప్పుడు లోకానుభవమే నిష్ఫల మగును. శబ్దాదు లెవ్వనికిని గోచర ములు కాకపోవలసి వచ్చును. ప్రధానము దానికై (శబ్దాదులఁ బ్రక టించుటకై) ప్రవర్తింపలేదు కదా !

మఱియు మూఁడవపక్షము నాశ్రయించిన నప్పటికిని దోషము నశింపదు. ప్రధానము ప్రవర్తింపకుండినంతమాత్రముననే మోక్షము సిద్ధించుచున్నది. అది స్వతస్సిద్ధమే కదా కావున దానికై ప్రధానము సృష్టినిఁ జేయనక్కఱలేదు. ఇఁక భోగమునకై మాత్రమే సృజింపవల

యును. అప్పుడు వచ్చుదోష మిదివఱకే చెప్పఁబడి యున్నది. మఱి యును శబ్దాదు లొక్కమాఱు అనుభవింపఁబడినంత మాత్రముననే భోగము ముగియును గాన వెంటనే ప్రధానము సృష్టిని చాలింపవలసి వచ్చును. దానికి మోక్షమును కలిగించుట కూడ నావశ్యక కార్యమే కదా! 'భోగముల నిశ్శేషముగ ననుభవింపవలయు ననుట కూడ దానికి ప్రయోజనమే' అనిన నప్పుడు దానికి (ఆప్రయోజనమునకు) అంతమే యుండదు. ప్రధానపరిణామములు నానారూపములు కదా! ఈప్రపంచ మునఁ బరిపూర్ణానుభవము కలుగుట యెన్నఁటికి? మోక్షము కలుగుట యెన్నిటికి? కావున నీపక్షము నంగీకరించినను బురుషునకు ముక్తి కలు గుట యే సంభవింపదు.

'ఇట్లు కాదు వారిమతమునఁ బ్రకృతిపురుషస్వరూపయాథార్థ్యజ్ఞా నమువలన ముక్తి కలుగు ననుట సిద్ధాంతము కావున నట్టిజ్ఞానము కలుగు నంతవఱకు నీప్రధానము భోగమును మఱల మఱల నొసంగుచుండ వచ్చును. మనసిద్ధాంతము కూడ నిట్టిదియే కదా' అనియెదవేమొ వినుము. ఎవ్వరిమతమునందును జ్ఞానము మోక్షమునుఁ గలిగించును గాని జ్ఞానమే మోక్షము కాదు కదా! ఇఁక వారిమతము నాశ్రయించిన నందు సృష్టి పరమార్థము; భోగంబును పరమార్థమే ఇట్లుండ నది జ్ఞానముచే నెట్లు పోవును? 'ఇది ప్రకృతి. నేను పురుషుఁడను. దీనికిని నాకును సంబంధము లేదు' అని తెలిసికొనినను ప్రపంచము ప్రపంచముగనే యుండును; దానిని తాను చూచుచునే యుండును. అప్పుడు ఒకానొకసమయమున భ్రాంతి మఱల వచ్చినను రావచ్చును. అట్లు రాదనిన మొట్టమొదటఁ గూడ వచ్చియుండఁ గూడదు. ఇఁక మనమతమున నన్ననో ఈదోషము లేదు మనకు సృష్టి యథార్థము కాదు; తద్భోగంబును యథార్థము కాదు. ఇట్లగుటచే జ్ఞానము కలిగినతోడనే సంసారము ధ్వంసమగును. అది మఱలఁ గానరాదు. కావున నప్పుడు జీవునకు పూర్వావిద్య నశించి ముక్తికలుగును వారు (సాంఖ్యులు) చెప్పుప్రధాన మట్లు నశించునదికాదు. కదా! కావునఁ బ్రధానము ప్రవర్తింపకుండుటయే మోక్ష మగునుకాని ప్రవృత్త్యనంతరనివృత్తి (ముందు ప్రవర్తించి పిదప నివర్తించుట) మోక్షము కానేరదు. జ్ఞానముచే ప్రధాననివృత్తి కానేర దని యిది వఱకే నిరూపించి యున్నాము. అది స్వప్నమువలెనే మోక్షార్థమై నివ

ర్తించు ననిన నప్పుడు మోక్షమునకై యెవ్వఁడు బ్రయత్నింపవలసినపని యుండదు. ఇదియు దోషమే; మఱియుఁ బురుషునకు నాజ్ఞానము కూడ వైరాగ్యానుసారముగఁ గలుగవలసినదియే. వైరాగ్యంబును భోగముల యందలి దోషదర్శనముచేఁ గలుగును. కావునఁ బ్రధానమే తనయందలి దోషముఁ జూపి పురుషునకు వైరాగ్యమును కలిగించు ననవలయును. దానికిని భోగార్థమై మాత్రమే ప్రవృత్తి కలుఁగవలయు నని యిదివఱకే చెప్పియున్నాము. ఇట్టి ప్రధానము తానుచేయుకార్యమునకు విపరీతముగ (విరుద్ధముగ) పురుషునకు వైరాగ్యపూర్వక మగుజ్ఞానము నేల కలిగించును? 'మోక్షమును కలిగించుటఁ గూడ దానిపనియె కదా!' అనినను జ్ఞానమును కలిగించినంతమాత్రముననే ఆపురుషునకు మోక్షము కలుగఁ బోదు కదా! కావున నెట్లును ప్రధానము ప్రవర్తించుటవలన ప్రయోజనమే లేదు 'ఉత్సాహమువలన వేడుకగా నీప్రవృత్తి కలుగుచున్నది' యనిన నావేడుక యెవ్వరికి? ప్రధానము స్తంభమువంటిది; పురుషుఁడు ఆకాశమువంటి వాఁడు. కావున నెట్లునుఁ బ్రధానప్రవృత్తి నిష్ప్రయోజనమే.

'ఇట్లు కాదు పురుషుఁడు చూచువాఁడు. ప్రధానము సృజించునది వీనికి దృశ్యంబును సృజింపఁబడు పదార్థంబును లేకున్న నిరర్థకత్వము వచ్చును. ఇట్లగుటచే సృష్టిని, దృశ్యపదార్థంబునుఁ గూడ స్వీకరింపవలయును.' అనిన వారిమతమునకు నదియు సరి కాదు. ప్రధానము సర్వపురుషులకును భోగమోక్షములఁ గలిగించునదియే! కావున నెట్లును ఎడతెగక ప్రవర్తింపవలయునో అట్లే పురుషుఁడును సర్వకాలములయందునుఁ బ్రధానపరిణామమును చూచుచుండవలసినవాఁడే కావున నెడతెగక ప్రవర్తించుచునే యుండవలయును. పురుషుఁడు జ్ఞానశక్తిరూపుఁ డగుటచే నెట్లు సర్వకాలములయందును అవిచ్ఛేదముగ ప్రకాశించుచుండునో అట్లే ప్రధానంబును సర్వకాలములయందు నెడతెగక సృష్టిఁ జేయుచునే యుండవలయును. ఇట్లయినఁ బురుషునికి నెప్పటికిని ముక్తి కలుగకుండ వలసి వచ్చును. ప్రధానపురుషులసంబంధ మవిచ్ఛిన్న మగును. కదా! ఇట్లుఁ గాక 'ఒక్కమాఱు చూచినపిదప నొకపురుషుఁడు విరక్తుఁ డగును' అనిన పురుషు లందఱును జ్ఞానశక్తిరూపులే యగుటచేతను ప్రధానము కూడ ప్రపంచరూపముతో నందఱకు నొక్కమాఱే తోఁచుటచేతను ఒక్కక్షణముననే సర్వ[illegible] ముక్తి [illegible] సంభవము.

మనమతమున నిట్టిదోషము లేదు 'దృశ్యము ఎప్పటికిని లేదు ; సాక్షి యెప్పటికిని స్వతస్సిద్ధుఁడై ప్రకాశించుచునే యున్నాఁడు. అనిర్వచనీయ రూపిణి యగునవిద్యచే శూన్యరూప మగుసంసారమే యున్నట్లు కాన వచ్చుచున్నది. జ్ఞానము కలుగఁగానే యది నశించును' అనునదియే కదా మనసిద్ధాంతము. అందు సృష్టి సత్యముకాకపోవుటచే దోష మేదియు రాదు. కావున సాంఖ్యసిద్ధాంత మెట్లును యుక్తము కాదు. ప్రధానమునకు స్వతంత్రప్రవృత్తి నంగీకరించినను వారిమతము నిలువదు. మొట్టమొదట నచేతనమునకుఁ బ్రవృత్తియె సంభవింపదు కదా!

## సూత్రము ౭.

అవతారిక:—'ఇట్లు చెప్పినదోషముల నంగీకరించినను సాంఖ్యమతము అప్రమాణము కానేరదు. వారు పంగ్వంధన్యాయమును *అయస్కాంతన్యాయమునుఁ గూడ దృష్టాంతముగఁ గైకొనియున్నారు కదా!' అను నాక్షేపమునకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౧౭౬. పురుషాశ్మవదితి చేత్తథాపి. ౨. ౨. ౭.

పూర్వపక్షతాత్పర్యము.—ఇట్లు కాదు. ప్రధానమునకు స్వతంత్రప్రవృత్తి లేకున్నను పురుషసహాయముతో నయస్కాంతసన్నిధానమునఁ జలించునినుమువలెఁ బ్రవర్తింపవచ్చును. పురుషుఁడును దృష్టిగలకుంటివాఁడు నడువగలగ్రుడ్డివానిపై నెక్కి వానిని ప్రవర్తింపఁజేయునట్లు తాను ఏమియుఁ జేయకున్నను ప్రధానమును ప్రవర్తింపఁ జేయువచ్చును. ఇందు దోష మేమి?

సిద్ధాంతము:—ఇట్లు చెప్పినను సాంఖ్యులమతమున దోషములు పోవు. వారు పురుషుఁడు నిష్క్రియుఁ డనియు నిర్గుణుఁ డనియు నుదాసీనుఁ డనియుఁ జెప్పుచున్నారు ; ప్రధానంబును జడమయ్యు స్వతంత్రముగనే ప్రవర్తించు ననుచున్నారు. ఇప్పుడు దానికి పురుషునిసహాయము కల దనినఁ బురుషునకును వ్యాపారము కల దనిన నాసిద్ధాంతములకు

* అయస్కాంతము అచేతనము. అది సంకల్పము లేకయే యినుమును ప్రవర్తింపఁ జేయును. ఇట్లే పురుషుఁడును స్వసంకల్పముతోఁ బనిలేకయే ప్రధానముఁ బ్రేరేపింపవచ్చును. ఇదియే యీన్యాయముయొక్క తాత్పర్యము.

విరోధము వచ్చును. కుంటివాఁడును మాటలు మొదలగు తనవ్యాపార ములచేతనే గ్రుడ్డివానిని బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు కదా! వ్యాపా రములు లేనివానికిఁ బ్రవర్తింపఁ జేయుసామర్థ్య మెట్లు వచ్చును? మఱియు నయస్కాంతము ఇనుమును తనసన్నిధానమాత్రముచేతనే ప్రవర్తింపఁ జేయును కదా యనినను పురుషుఁ డట్లు ప్రధానము ప్రవర్తింపఁజేయు టకు వీలు లేదు; అట్లే ప్రవర్తింపఁజేయు ననిన నాతఁడు నశించువాఁడు కాకపోవుటచేతను ప్రధానము కూడ నాతనిని విడిచి పోవునది కాకుండుట చేతను ప్రళయము మే యుండక పోవలసివచ్చును. ఇదియు సమ్మతము కాదు కదా! మఱియుఁ బురుషుఁడు చేతనుఁడు, ప్రధాన మచేతనము, వా రిరు వురకును సంబంధ ముండుటకు వీలు లేదు. పరస్పర విరుద్ధ స్వభావములు కలవి యొండొంటితో సంబంధపడవు కదా! వీ రిరువురికంటె నన్యుఁడై మఱియెవ్వఁడును వీరికి సంబంధముఁ గలిగించుట కూడ లేదు. ఇట్లు కాక ఆసంబంధము వీరికి స్వాభావికమే యగునేని పురుషునకు ముక్తి దొరకదు. ఇదియు వారిసిద్ధాంతమునకు విరుద్ధమే కదా! ఇట్టియాక్షేపములఁ జేయక నూరక వారిమతము నంగీకరించి ప్రధానప్రవృత్తిని సాధించినను పైసూ త్రమునఁ జెప్పఁబడినప్రకారము ప్రయోజన ముండదు. కావున నెట్లును వారిమతము యుక్తము కాదు.

'మనసిద్ధాంతమునఁ గూడ నీదోషము లున్నట్లే యున్నవి. పరమే శ్వరుఁ డుదాసీనుఁడు; అవిద్యజడరూపిణి' అనియెదవేమొ వినుము. పర మేశ్వరునకు వాస్తనస్వరూప ముదాసీన మైనదియే కాని యనాద్యవిద్యచే నాయన వ్యాపారసహితుఁడుఁగాఁ దోఁచు చున్నాఁడు. భ్రాంతివలనఁ గలి గినవ్యాపారములు యథార్థరూపమునకు నేమిహానిఁ జేయఁ గలదు? కావున మనపరమేశ్వరునియందు పారమార్థికముగ నుదాసీనభావంబును వ్యావ హారికముగ వ్యాపారంబును అవిద్యాప్రవర్తకత్వంబును తదానరణముచే జీవుఁ డగుటయునుఁ గూడ కలవు. ఇందు విరోధ మేమి? అవిద్యయు ననిర్వచనీయస్వరూప యగుటచే దానినిఁ బ్రవర్తింపఁ జేయుటయు వ్యాపార మనిపించుకొనదు. కావున మనమత మెప్పటికిని నిర్దోషమే.

## సూత్రము. ౨.

అవతారిక:——మఱియొకదోషముఁ గూడఁ జూపుచున్నాఁడు. 'సత్వరజస్తమో... ...ము... ...స్థితిఁ జెందియుండఁగా ... ... ...ను. ఆసమ

యమున నొకగుణము ప్రధానముగను తక్కినవి యంగములుగను ఏర్ప డును' అనుసిద్ధాంతభాగమును ఖండింపుచున్నాఁడు.

## ౧౭౯. అంగిత్వానుపపత్తేశ్చ. ౨. ౨. ౮.

తాత్పర్యము:—మఱియును సత్వరజస్తమోగుణములు మూఁడును న్యూనాధికభావములు లేక సమానముగ నుండుస్థితియే ప్రధానమై ఆప్రధానము నిత్యమై యుండు నేని ఆస్థితి యెప్పటికిని మాఱఁగూడదు. మాఱినఁ బ్రధానస్వరూపమునకే హాని వచ్చుటచే నది (ప్రధానము) యనిత్యము కావలసి వచ్చును. ఈగుణములకు విషమస్థితిని కలిగించుటకు మఱి యెవ్వఁడును లేఁడు కదా! ఆప్రధానంబును ప్రళయావస్థయందు స్వస్వరూపముతో (గుణసామ్యముతో) బహుకాలము నిలచియుండి సృష్టి సమయమున నాకస్మికముగ నెట్లు విషమరూపము జెందఁ గలదు? అట్లే చెందు ననిన సామ్యసంస్కారమునకంటె (గుణసామ్యరూపముతో నిలిచి యున్న వాడుకకంటె) వైషమ్యసంస్కారమే (ప్రపంచరూపముతో నిలచి యుండువాడుకయే)బలవత్తర మగు నేని, దానివలననే వైషమ్యము(గుణ ములు పరస్పరము *నంగాంగిభావమును జెందుట) కలుగునేని యప్పుడు రెండవమారు సామ్యావస్థయే సంభవింపఁ గూడదు. మఱియు మొట్ట మొదట గుణము లొకదానితో నొకటి యేవిధమగుసంబంధమును కూడ కలిగియే యుండలేదు కదా! ఈకారణమువలనఁ బ్రధానమునుండి సృష్టి కలుగుటకే వీలు లేదు. గుణములు విషమస్థితిఁ జెందకున్న సృష్టి లేదు. గుణములకుఁ బరస్పరసంబంధము కాని బాహ్యప్రేరకుఁడు కాని లేకుండు టవలన వైషమ్యము కలుగదు. కావున నెట్లును సాంఖ్యసిద్ధాంతము మోక్షసాధనము కాదు.

## సూత్రము. ౯.

అవతారిక.—'ఈదోషము లన్నియు రా కుండునట్లు మామత మును సవరించుకొనియెదము' అని వారు చెప్పినను బ్రయోజన ముండ దని నిరూపించుచున్నాఁడు.

---

* అంగమనఁగా నవయవము. అధికలవాడు అంగి. వీ రిరువురికిని గలసంబంధ మంగాంగిభావము.

## ౧౮౦. అన్యథాఽనుమితౌ చ జ్ఞానశక్తి వియోగాత్. ౨. ౨. ౯.

తాత్పర్యము:—వారు (సాంఖ్యులు ఎట్లు అనుమానము జేసినను వారిమతము నిర్దోషము కాదు. సత్వాదిగుణములు నిర్వికారములు కావనియు ఎట్టిస్వభావము కలవి యై యుండిన సృష్టి జరుగుటకు వీలు కలుగునో అట్లే యుండు ననియు వానివృత్తియుఁ జంచల మనియు నంగీకరించినను వారిమతము నిర్దోషము కానేరదు. ప్రధానమునకు జ్ఞానశక్తి కలదని మాత్ర మంగీకరించుటకు వారికి వీలు లేదు కదా! అట్లు కూడ నంగీకరింతురేని యప్పుడు వారు మనమతమునే యాశ్రయించినవారలు కావలసివచ్చును మనవలెనే వారును జేతనకారణము నంగీకరించినవారే యగుచున్నారు. కదా! ఇట్లయిన వారిమతము నిర్మూల మగును.

మఱియును విషమస్థితిఁ జెందుటకు ననుకూల మగుస్వభావముతో నున్నవి యైనను సత్వాదిగుణములు సామ్యావస్థను విడిచి ప్రపంచరూపము నొందుటకు గాని అట్లు ప్రపంచరూపము నొందినపిదప మఱల దానిని విడిచి సామ్యస్థితినిఁ జెందుటకు కాని వీలు లేదు. అవి స్వయముగ నచేతనములు వానినిఁ బ్రవర్తింపఁ జేయుటకుఁ గాని నివర్తింపఁ జేయుటకు గాని మఱియొకపదార్థము లేదు కదా! కావున నెట్లు సవరింపఁ బోయినను వారిమతము సవరణకు రాదు.

## సూత్రము. ౧౦.

అవతారిక:—ఈసాంఖ్యమతముపై మఱియొకదోషమునుఁ గూడఁ జూపుచున్నాఁడు.

## ౧౮౧. విప్రతిషేధాచ్చాఽసమంజసం. ౨. ౨. ౧౦.

తాత్పర్యము:—మఱియు నాసాంఖ్యులమతమున పరస్పరవిరోధములుకూడ ననేకములు కలవు. వారు ఒకచోట *'ఇంద్రియములు ఏడు'

---

* జ్ఞానేంద్రియముల నైదింటినిఁ బ్రత్యేకముగఁ జెప్పక నొక్కత్వగింద్రియమును మాత్రమే సర్వశక్తులు కలదానినిఁగా సాంఖ్యులు గ్రహింతురు. కావున జ్ఞానేంద్రియములకుఁ గాఁ ద్వగింద్రియ మొక్కటియుఁ గర్మేంద్రియము లైదును మనస్సునుఁ గలది ఇంద్రియములు ఏడు.

అనియు మఱియొకస్థలమున '*నింద్రియములు పదునొకండు' అనియును,
ఇట్లే ఒకస్థలమునఁ 'బంచతన్మాత్రలు మహత్తత్త్వమునుండియే జనించెను'
అనియు 'మఱియొకస్థలమున 'బంచతన్మాత్రలు అహంకారమునుండి జనిం
చెను' అనియు, మఱియు నొకప్రదేశమున †'నంతఃకరణములు మూఁడు'
అనియు మఱియొకప్రదేశమున § నంతఃకరణ మొక్కటియే' యనియుఁ
జెప్పుదురు. శ్రుతివిరోధ మట్లుండ నీపరస్పరవిరోధమే వారిని బాధించు
చున్నది. కావున సాంఖ్యమతము యుక్తమైనది కాదు.

పూర్వపక్షము:—సరియే యిట్లయినను వేదాంతదర్శనము కూడ
నంతయుక్తియుక్త మని తోఁచలేదు. మోక్ష మనఁగా సంసారరూపపరి
తాపము నశించుటయే కదా! ఇట్లుండ భేదమే లేకపోయిన సంసారనాశ
మెట్లు సంభవించును? వేదాంతులాభేదము నంగీకరింపరు కదా! ఆమత
మున నేకరూపుఁడగుపరమేశ్వరుఁడే సర్వప్రపంచరూపముతోఁ గూడ
నున్నాఁడనుటయే సిద్ధాంత మగుటచే నందు భేదము నంగీకరించుటకే
యవకాశము లేదు కదా! ఇక నేమి చెప్పవలయును? 'సంసారజీవరూప
ములు రెండును అవస్థాభేదమువలనఁ గాని మఱియొకవిధముగాఁ గాని పర
మేశ్వరునకే రూపభేదములు' అనవలయును. ఇట్లయిన వారిస్వరూప
మెప్పటికిని నశింపదు; సంసారము నశింపకున్న ముక్తియే కలుగదు.
అప్పుడు సంసారనాశముకై ఆత్మస్వరూపజ్ఞానముఁ జెప్పువేదాంతశా
స్త్రము నిరర్థకము కావలసివచ్చును. దీపమునకు స్వభావము లై యున్న
కాంతియు ప్రకాశంబును నెప్పటికైన దానిని (దీపమును) విడిచిపోవు
ననుట సంభవించునా? 'నీటియందు అలలు మొదలగునవి తద్భిన్నరూప
ముతోఁ గానవచ్చుచున్నను నశించి పోవుచున్నవి; వాస్తవస్థితిలో నభిన్న
ములుఁ గూడ నై యున్నవి. ఇట్లే యీసంసారము కూడ బ్రహ్మాఽభిన్న
మయ్యు బ్రహ్మభిన్నముగఁ గానరావచ్చును. మఱల నశింపను వచ్చును'
అనిన నదియు యుక్తము కానేరదు. ఈదృష్టాంతమునందును జలము
నకుఁ దరంగాదిసంబంధ మెప్పుడును నశింపలేదు. ఆతరంగాదులు

* జ్ఞానేంద్రియము లైదును కర్మేంద్రియము లైదును అంతఃకరణ మొక్కటి
యునుఁ గలసి పదునొకండగును.

† మనోబుద్ధ్యహంకారములు మూఁడును అంతఃకరణములు.

§ బుద్ధి మాత్రమే యంతఃకరణము.

*ఆవిర్భావతిరోభావములనుమాత్రమే చెందుచున్నవి కాని నశించుటలేదు. ఏపదార్థమునకును నాశము నంగీకరించుటయే యుక్తము కాదు కదా! కావునఁ దరంగాదులతో జలమునకుఁ గలసంబంధ మొకప్పుడు తొలంగి పోవునది కాదు. కావున బ్రహ్మసంసారములసంబంధము కూడ నట్టిదియే కావలయును. మఱియు నీయభేదము లోకానుభవవిరుద్ధము; తాపమున కును తపించువానికినిఁ గలభేదము ప్రత్యక్షసిద్ధమేయై యున్నది కదా! ఎట్లనిన:—

లోకమునఁ బ్రతివాఁడును ఏదియో యొకపదార్థముఁ గోరుచు న్నాఁడు కదా! ఇది భేదము లేకున్న నెట్లు సంభవించును? భేదము లేకున్నఁ గోరువాఁడు స్వయముగనే పదార్థరూపముతోఁ గూడ నుండవలయును; ఇట్లున్న వాఁడు దేనికై ప్రవర్తించును? దీపమునకుఁ గాంతి స్వరూప భూతమే యై యున్నది యనుట లోకసిద్ధము. ఆదీపము కాంతినిఁ గోరుచుఁ బ్రవర్తించుట నెందైనఁ గాంచితిమా? ఇట్లగుటచేఁ గోరువానికిని కోరఁ బడుపదార్థమునకును భేద మవశ్యముగ నుండవలయును. ప్రతివాఁడునుఁ దనకు లేనిదానిఁ గూర్చియే కదా ప్రవర్తించును. కావున భేదము నంగీ కరింపకుండినచో కోరువాఁడు కోరువాఁడే కానేరఁడు.

మఱియు నీయభేదమునే యంగీకరించినఁ గోరఁబడునదియు గోరఁ బడునది కానేరదు. అభేదవాదులు కోరఁబడునది యగుపదార్థమే స్వయ ముగఁ గోరునది కూడ నై యున్నది యనియే చెప్పవలయును కదా! ఇది సంభవించుట యెట్లు? కోరుట యనునది సకర్మకము. కర్మ యనఁగా కర్త నాశ్రయించియున్న వ్యాపారమునకు విషయ మైనది. ఇట్లుండ నివి రెండు (కర్తృకర్మలు రెండు) నొక్కటి యెట్లగును? కావునఁ గోరఁ బడువానికినిఁ గోరువారికిని భేద మవశ్యముగ నంగీకరింపవలయును.

'ఇట్లయిన నచ్చినలాభ మేమి? కోరఁబడువాఁడును కోరునదియు భిన్నములే కావచ్చును; తపింపఁ జేయునదియు తపించువాఁడు నొక్కటియే కావచ్చును' అనిన నది యుక్తము కాదు. లోకమునఁ గోరఁబడుచున్న పదార్థములే పురుషులను మిగుల శ్రమలపాలు సేయుచున్నవి. మొట్ట మొదట సంపాదించునప్పుడు శ్రమ. పిదప రక్షించునప్పుడును కష్టము. తర్వాత నశించిన మనోవ్యథ మఱియు సంపాదించునప్పుడు లెక్కకు

* చూ. 3౧౮ పేజీ. ఆవిర్భావతిరోభావములు.

మిక్కిలి యగుపాపకార్యముల నాచరించుటవలనఁ గలుగుబహువిధదుఃఖములు మొదలగునవి. పురుషునిఁ దపింపఁ జేయుచున్నవి. ఈకారణమువలనఁ గోరఁబడు చున్నపదార్థమే తాపహేతువు; కోరువాఁడే తపించువాఁడు. ఈకారణమువలన లోకానుభవసిద్ధమై యున్నయీభేదమును నంగీకరింపకుండుటచే మనమతము (వేదాంతమతము) కూడ దోషయుక్తమే యని తోఁచుచున్నది.

సాంఖ్యమతమునం దన్ననో యీభేదము కలదు కావున నెట్లయినను ముక్తిని సాధింపవచ్చును. వారిమతము ననుసరించినఁ బురుషుఁడు నిర్గుణుఁ డగుటచే వానికిఁ బ్రధానముతోఁ గలసంబంధము వాస్తవ మగుటకు వీలు లేదు; బంధమోక్షములును మనమతమునందువలెనే సత్యములగుటకు వీలు లేదు. ఇట్లగుటచే నాబంధమోక్షములు రెండును వారిమతమునందును అజ్ఞానకృతములే. పురుషునకు స్వస్వరూపజ్ఞానము కలుగఁగనే అదివఱకుఁ గల దని తలంపఁబడుచున్న ప్రకృతిసంబంధము తొలంగిపోవును; బంధంబును విడిచిపోవును. ఇట్లగుటచే బంధమోక్షములు రెండునుఁ బ్రధానమునకు సంబంధించినవియే. అయినను పురుషుఁడు ముఖ్యుఁ డగుటచే నవి (బంధమోక్షములు) ఆతనివి గనే వర్ణింపఁబడుచున్నవి. లోకమున నిట్టివ్యవహారము లనేకములు కలవు. 'యుద్ధమునఁ జక్రవర్తి గెలిచెను' అని గెలుపును మనము చక్రవర్తిసంబంధముగఁ జెప్పుచున్నాము; బాగుగ విచారించిన నది సైన్యమునకు సంబంధించినదియే కదా! ప్రపంచము సత్యమైనను అసత్యమైననుఁ గూడ నిర్గుణునకు దానితో సంబంధము కలుగదనుట నిర్వివాదాంశము. కావున నిప్పటికిని మనమతమునకంటె వారిమతమే యుక్తియుక్తముగఁ దోఁచుచున్నది.

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. మనమతమునకు (వేదాంతమతమునకు) దోష మెన్నటికిని రాదు 'పరమేశ్వరుఁడు ఏకరూపుఁడు' అని శ్రుతి ఘోషింపుచున్నది. కావున నాతనియందు తప్యతాపకభేదములు పారమార్థికములై యుండుటకు వీలులేదు. లోకమునందు మాత్ర మవి గానవచ్చుచున్నవి. కావున వానిని భ్రాంతికల్పితము లనియే చెప్పవలయును. శ్రుతికిని లోకమునకును విరోధము వచ్చినచో రెండును బ్రమాణములే యగుటచే వానిని ఏదియోయొకవిధముగ సమన్వయింపవలయును. కావున అం దొకదానిని ముఖ్యముగఁ బరమేశ్వరకల్పిత మని

యందఅచేత నంగీకరింపఁబడుచున్న వేదము నప్రమాణము నొనరింప కూడదు కదా! కావుననే మనము సర్వభేదములను కేవలవ్యావహారికము లను గా సంగీకరించుచున్నాము. వ్యవహారము పారమార్థికముగానే యుండ నక్కఱ లేదనియు భ్రాంతికల్పితముగఁ గూడ నుండవచ్చు ననియుఁ బలుమాఱు నిరూపించియున్నాము. పరమేశ్వరునియందు తప్యతాపక భావములు కూడ పరమార్థములే యగుచుఁ బరస్పరము విషయవిషయీ భావము నొందునేని యప్పుడు దోషము వచ్చును గాని లేకున్న రాదు. అవి భ్రాంతికల్పితసంబంధములతో నైనను పరమాత్మునియం దూరక నున్న వే కాని పరస్పరము పారమార్థిక ముగువిషయవిషయీభావము నొందుట లేదు. తాపక మని చెప్పఁబడినసంసారము పారమార్థికసత్యము కాకపోవు టచే దానికి విషయు మని చెప్పఁబడుజీవుఁడును వానితో దానికిఁ గలసం బంధంబును పారమార్థికము కానేరదు. అగ్నియందుఁ గాంతియు దహన శక్తియు నున్నను అవి పరస్పరము విషయవిషయీభావసంబంధము కలవి. కాకపోవుటచే నాయగ్నిని కాల్చుట లేదు; ప్రకాశింపఁజేయు టయు లేదు కదా! కావున నాత్మవిషయమునందును ఇవి దోషమును కలిగింపనేరవు.

'అగుఁ గాక తప్యతాపకభావ మాత్మయందు లేకున్న నింక నెచ్చట నున్నది?' అనియెదవేమొ వినుము. దేహము తపింపఁజేయఁబడు చున్నది; సూర్యుఁడు దానిని తపింపఁజేయుచున్నాఁడు. ఇచ్చట విరోధ మేమి? 'ఇట్లు కాదు తపింపఁజేయుట యనఁగా దుఃఖించునట్లు చేయుట. లోకమున నచేతనమునకు దుఃఖము కలదా, కావున దేహము మాత్రమే తపించు ననియు జీవుఁడు తపింపఁడనియుఁ జెప్పుట యసంభవము' అని యెదవేమొ వినుము. దేహములేక కేవలచేతనుఁడే దుఃఖించుటయు నెం దును లేదు. ఆ దేహచేతనులకుఁ బరస్పరసంబంధంబును (ఐక్యంబును) సంభ వింపదు. అప్పుడు చేతనునకుఁ గలనిర్మలత్వము నశించిపోవును కదా! సాంఖ్యమతమునందునుఁ బురుషుఁడు నిర్మలుఁ డగుటచే నాతఁడు దేనిచే తనుఁ దపింపఁజేయఁ బడఁడు. కావున వారిమతమునందు మాత్రము తప్య తాపకభావ మెట్లుఁ గుదురును?

'వారిమతమున సత్వగుణము తపింపఁజేయఁబడునది. రజోగుణము తపింపఁజేయునది. తమోగుణసంబంధముచే నాసత్వగుణమే తననుండి

పురుషుని వేఱుచేయక తనకుఁ గలతాపకసంబంధమునుఁ బురుషునకే యున్నట్లు భావించును. (దానికి గలరజస్సంబంధము అజ్ఞానముచేఁ బురుషునకే యున్నదానివలె నగుచున్నది యనుట.)' అనియెదవేమొ అట్లయిన దానితోఁ బురుషునకు సంబంధమే యుండఁ గూడదు. అప్పుడు వారును కేవలాచేతనమునకే తాపమునుఁ జెప్పినట్లయినది. వారిమతమునందును సత్వగుణపురుషులకు వాస్తవసంబంధము లేదు కదా 'సత్వగుణముతో సంబంధించియున్నాఁడు కావున దానితాపముచేఁ బురుషుఁడును తపించుచున్నట్లున్నాఁడని చెప్పితిని కదా! అనియెదవేమొ అప్పుడు మనమతమునకును వారిమతమునకును భేద మేమి? చేతనునకుఁ గలుగుతాపకసంబంధము కేవల మజ్ఞానకృతమే యగుచున్నది కదా. 'ఇరుదలలశిఖండి సర్పమువలె నుండును' అనిన నంతమాత్రమున నది విషము కలది యగునా? 'సర్పజాతిలో నిరుదలలశిఖండిజాతివలె నుండును' అనిన నంతమాత్రమున సర్పము నిర్విష మగునా? కావునఁ బురుషుఁడు రజోగుణతాపముచేఁ దపించుచున్నట్లున్నాఁడు' అనిన నంతమాత్రమున నాయనకు వాస్తవతాపము సంభవింపనేరదు. కావున నెట్లు విచారించినను సాంఖ్యులుకూడ మనవలెనే తప్యతాపకభావ మవిద్యాకల్పిత మని యంగీకరింపవలసినవారే.

'ఇట్లు చెప్పనేల? వారిమతమున నీతప్యతాపకభావము పురుషునియందే పారమార్థికముగ నుండవచ్చును. అజ్ఞానము నశించునంతవఱకు నట్లే యుండి పిదప నశింపవచ్చును. ప్రధానమునకును పురుషునకును సంబంధము కలుగుటకు నజ్ఞానము కదా కారణము. ఆకారణము నశించిన నిఁక బంధ మేల కలుగును? 'అనియెద వేమొ యట్లుఁ జెప్పిన వారిమతమున మోక్ష మనునదియే శూన్య మగును. వారిమతముఁ దమోగుణమే యజ్ఞానము. అదియే ప్రకృతిపురుషులకు సంబంధముఁ గలిగించునది. అది కూడ ప్రధానరూపమే యగుటచే దానికి నెన్నటికిని నాశము లేదు. ఇట్లుండ నిఁక ముక్తియెప్పుడు? మఱియు వారిమతమున సత్వాదిగుణములు నియమము లేకయే యభివృద్ధి నొందుచు క్షీణింపుచు నుండు నని సిద్ధాంతము. ఇట్లయిన నాతమోగుణ మొకప్పుడు కొంచెము క్షీణించినను మఱియొకప్పు డభివృద్ధి కావచ్చును కదా! కావున నెట్లును ఆమతమున

మోక్షము సంభవింపదు. కావున నూక్షవాదు లందఱును తప్యతాపక భావమును భ్రాంతికల్పితముగా నంగీకరింపవలసినవారే.

కావున మనమతమునందు (వేదాంతమతమునందు) దోష మింత యును రాదు. ఆత్మ యేకరూపుఁడు; నిత్యుఁడు. సర్వప్రపంచంబును నామమాత్రము; స్వరూపమున శూన్యము. ఒకపురుషుఁడు తనముఖము నిర్మలముగనే యున్నను మలిన మైనయద్దమునందుఁ గానవచ్చుమలిన ప్రతి బింబముఁ జూచి వాస్తవస్థితిలో నాపతిబింబమునకుఁ గూడ మాలిన్య ముండుటకు వీలు లేదని యెఱుంగలేక, నాముఖము మిగుల మలినముగ నున్నది' యని శోకించునట్లు పరమేశ్వరుఁడే అవిద్యోపాధియందు నిలచి (జీవుఁడై) తనకు ప్రతిబింబసమానుఁడై యున్న జీవునిఁ గాంచి 'ఇది స్వస్వ రూపమే' అని నిశ్చయింపలేక 'నేను జీవుఁడ నైతిని. శబ్దాదులు నన్ను బాధించుచున్నవి; సంతోషపెట్టుచున్నవి' యని తలంచుచున్నాఁడు. (పరమార్థస్థితిలో పరమేశ్వరునికంటె నన్యుఁడు లేకపోవుటచేతను సంసా రము శూన్యరూప మగుటచే నెట్లు చెప్పినను విరోధము లేకపోవుటచేతను ఈవిధముగఁ జెప్పఁబడె నని తెలిసికొనవలయును) సంసారము వాస్తవస్థి తిలో శూన్యమే యగుటచే ఆరోపితసర్పము భ్రాంతినివృత్తి కలుగఁగానే స్వరూపశూన్య మగునట్లు జ్ఞానోదయము కాఁగానే స్వరూపశూన్య మగును; స్వతస్సిద్ధ మగుటచే ముక్తియు దొరకును. ఇక వ్యావహారికస్థితిని విచారింత మనిన నచ్చట నొకరు చేయవలసినయాక్షేపంబును లేదు; మేము చెప్పవలసినయుత్తరంబును లేదు. ఎచ్చ టెచ్చట నెట్లెట్లు కానఁబడునో అచ్చ టచ్చట నట్లట్లు నుభయులు నంగీకరింప వచ్చును. కావున మన మతము నిర్దోషమే.

---

## మహద్దీర్ఘాధికరణము. ౨.

సంగతి:—'శబ్దాదిహీన మగుటచేఁ బ్రధానము నుండి శబ్దాది నంతే మగు ప్రపంచము జనింప నట్లే చేతన మగు బ్రహ్మమునుండి తద్విరుద్ధ మగుటచే తనప్రపంచము జనింపఁ గూడదు కదా! దీనికి సమాధాన మేమి? కారణగుణములు కార్యగుణములను సమానజాతీయగుణములను బుట్టించు

ననుట ప్రత్యక్షసిద్ధము. తెల్లనిదారములవలనఁ బుట్టినవస్త్రము నల్లనిది కానేరదు కదా' అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణమారం భింపఁబడినది. ఈయాక్షేపము దృష్టాంతసంబధము ననుసరించి వచ్చెను. కావున నీరెండధికరణములకునుఁ గలసంబంధము దృష్టాంతసంబంధము.

విషయము:—ఇచ్చట 'చేతనమునుండి యచేతన మగుప్రపంచము జనించును' అనుసిద్ధాంతభాగము విచారవిషయము. ఈవిషయముపై వచ్చునాక్షేపమును నివారించి దానిమూలమున నిందు వైశేషికమత మును ఖండించుచున్నాఁడు. ఇందును స్వపక్షముపై నచ్చినయాక్షేపమును నివారించుటయే ప్రధానకార్యము గావున వాస్తవస్థితిలో నిది రెండవ యధ్యాయము మొదటిపాదమున నుండవలసిన యధికరణమే యైనను సంబంధానుసారముగ మతఖండనము కూడ నున్నది. కావున దీని నీపాద మునందు సూత్రకారుఁడు చేర్చియున్నాఁడు. ప్రథమపాదమున శిష్టాపరి గ్రహాధికరణమున (౨.౧. ౪. అ.) నీవిషయము చెప్పఁబడియే యున్నను అచ్చట సంక్షిప్తముగ నున్నది; కావున నదియే యిచ్చట విస్తరింపఁ బడెను. ఈకారణమువలనఁ బునరుక్తిదోషము లేదని తెలిసికొనవలయును. మతస్వరూపము పూర్వపక్షమునఁ జెప్పఁబడును.

సందేహము:—'లోకమునఁ గారణములే కార్యమున నున్నవి యనుట యనుభవమున నున్నది. ఈన్యాయమునలన మీసమన్వయము (వేదాంతసమన్వయము) భగ్న మగునా? కాదా? (ఇచ్చట చూపవల సినయనుమానవాక్యము విలక్షణత్వాధికరణమునఁ జూపఁబడెను.' అను నది సంశయస్వరూపము. కారణఫలములు ప్రథమపాదమునందలి యధి కరణములకువలెనే యని తెలిసికొనవలయును.

పూర్వపక్షము:—పరమేశ్వరుఁడు చేతనుఁడు; ప్రపంచ మచే తనము. ఇవి రెండును కార్యకారణము లగుటకు వీలు లేదు. కారణము నందలిగుణములే కార్యమున గుణములను కలిగించును గాని క్రొత్తగఁ గార్యమునకు విరుద్ధగుణములు రావు. తెల్లదారములతో నేర్పడినగుడ్డ నల్లనిది కానేరదు. కావున మీసమన్వయము లోకానుభవవిరుద్ధము. మామతమున దోషము లేదు. ఎట్లనిన:—

మతస్వరూపము:—మామతమున నచేతనము లగుపరమాణువులే ప్రపంచమున కుపాదానకారణము లగుటచే ప్రపంచము కూడ నచేత

నమే కావచ్చును. ఆపరమాణువు లతిసూక్ష్మములు; నిరవయవములు. వానికిఁ గూడ నవయవములు కల వనిన ననవస్థాదోషము వచ్చుటచే నేదియో యొకసూక్ష్మపదార్థమునకు నవయవములు లే వని యంగీకరింప వలసి వచ్చును. మహాపరిమాణము కలదానినుండి సూక్ష్మపదార్థములు జనించుటకు వీలు లేదనియు నీకారణమునలనఁ గారణభూతము లగుపదార్థము లన్నిటికంటె సూక్ష్మములుగ నుండవలయు ననియు నిదివఱకే చెప్పి యున్నాము. కావున నాపరమాణువులు నిరవయవములే. అవి యొకదానితో నొకటి గూడి ద్వ్యణుకము (రెండుపరమాణువులు చేరినది) నేర్పఱచును. ఆద్వ్యణుకములును కొన్ని కూడి త్ర్యణుకము చతురణుకము (మూఁడు ద్వ్యణుకములు నాల్గుద్వ్యణుకములు కలవి) మొదలగువాని నేర్పఱచును; ఆత్ర్యణుకాదులును పదార్థమును నిర్మించును. పరమాణువునకు నవయవములు లేకుండుటచే వానివలననే పదార్థము జనించు ననినఁ బ్రపంచమంతయు నిరవయవము కావలసివచ్చును; ద్వ్యణుకము నుండియే జనించు ననిన నాద్వ్యణుకమునకుఁ గలప్రమాణ మణుప్రమాణమే అనఁగా:—హ్రస్వప్రమాణమే, కావున ప్రపంచ మంతయు నట్లే కావలసి వచ్చును. ఇట్లగుటచే 'ద్వ్యణుకసంయోగమువలన స్థూలములును దీర్ఘములు నై పరమేశ్వరేచ్ఛాధీనముగఁ ద్ర్యణుకాదు లుత్పన్నము లగును; వానినుండి జీవకర్మానుగుణముగఁ బ్రాపంచికపదార్థము లుదయించును.

ఆపరమాణువులును పృథివ్యప్తేజోవాయ్వాకాశభేదములతో నాల్గు విధములు కావున వానినుండి పైని వర్ణించినవిధముగఁ బృథివ్యాదులు జనించును. ప్రళయమును కూడ నొందును. ఆకాశమునకుఁ బరమాణువులు లేవు. అది నిత్యము. ఈశ్వరుఁడును సర్వకాలములయందును మనస్సుతో సంబంధించి, యిచ్ఛాదులఁ గలిగి పరమాణువుల బ్రవర్తింపఁ జేయుచుండును. కావున నాయన ప్రపంచమునకు నిమిత్తకారణము మాత్రమే యై యున్నాఁడు. జీవులును జడప్రాయులు ఆగంతుకజ్ఞానము (వచ్చుచుఁ బోవుచు నుండుజ్ఞానము) గలవారు సర్వవ్యాపకులు ప్రతిశరీరమునందును వేఱువేఱుగ నున్నారు. భ్రాంతివలన శరీరాదుల నాత్మఁగా భావించుచున్నారు. ఈశ్వరానుగ్రహమువలని నాభ్రాంతి తొలఁగిన ముక్తు లగుదురు. ముక్తి యనఁగా జడరూపముతో నుండుటయే. ఇట్లు సిద్ధాంతముచేసినవారో సిద్ధాంతమును లేదు.

ఈమతమున వేదాంతులకు సమ్మతము లగువిషయములు:—ఈ వైశేషికమతమునఁ గూడ వేదాంతులు కూడఁ గొన్నివిషయముల నంగీకరింతురు. ఈశ్వరుఁడు ప్రపంచమునకు నిమిత్తకారణమై యున్నాఁ డను భాగమును అజ్ఞాననివృత్తిచే జీవులకు మోక్షము కలుగు ననుభాగమును వారికి సమ్మతము. వారు పరమేశ్వరు నభిన్ననిమిత్తోపాదానకారణముగఁ జెప్పువారైనను నందు నిమిత్తకారణభాగమున నీవైశేషికులతో వివాదము లేనివారే కదా!

ఇదివఱకు ఖండింపఁ బడినవిషయములు:— 'నిరవయవము లగు పరమాణువులవలన ద్వ్యణుకము మొదలగునవి జనించుటకు వీలు లేదు' అనువిషయము విలక్షణత్వాధికరణమున నిరూపింపఁ బడెను. జీవబ్రహ్మాభేదమును నిరూపించుటచే భేదవాదము కూడ నిదివఱకే ఖండింపఁబడెను. కారణకార్యములకు సమానరూపత్వ మక్కఱ లే దనువిషయము కూడ విలక్షణత్వాధికరణమున నిరూపింపఁబడెను. అయినను అచ్చట సాంఖ్యులనుఁ గూర్చియే యది చెప్పఁబడియుండుటచే నిచ్చట వైశేషికులను గూర్చి మఱలఁ జెప్పఁబడుచున్నది.

అవతారిక:—పై వైశేషికపూర్వపక్షమును తన్మతదోషనిరూపణపూర్వకముగ (వారిమతమునందే వారిసిద్ధాంతమునకు భంగముఁ జూపుచు) నిరాకరించు చున్నాఁడు.

## ౧౧-౨. మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యాం.

## ౨. ౨. ౧౧.

తాత్పర్యము:—బాగుగ విచారించిన వైశేషికులీపూర్వపక్షముఁ జేయుటకే వీలు లేదు. వారిమతమునందే వారిసిద్ధాంతమునకు ననేకచోటుల విరోధము కలదు. నిరవయవమై * పారిమాండల్యప్రమాణముఁ గలపరమాణువునుండి ద్వ్యణుకము జనించుచున్నది. కాని దానియందు ఆనిరవయవత్వము గాని పారిమాండల్యప్రమాణము గాని లేదు. ఇట్లే అణుపరిమాణము గలద్వ్యణుకమునుండి జనించిన త్ర్యణుకాదులు

* పారిమాండల్య మనగాఁ బొడవు గాని వెడల్పు గాని లేక ఒకప్రదేశమును మాత్ర మాక్రమించియుండు అతిసూక్ష్మపరిమాణము.

అణుపరిమాణముఁ గలవి యగుట లేదు; దీర్ఘపరిమాణముఁ గలవిగానో, స్థూలపరిమాణముఁ గలవిగానో, యగుచున్నవి. ఇట్లుండ వేదాంతమతమునందు మాత్రము చేతనుఁ డగుపరమేశ్వరునుండి తద్విరుద్ధగుణముఁ గలప్రపంచము జనించె ననిన దోష మేమి? తనమతమునందే తనసిద్ధాంతమునకు నిలుకడ లేకుండుట నెఱిఁగియు వైశేషికుఁడు పరమతము నాక్షేపింప నెట్లు సాహసించుచున్నాఁడో చిత్ర మగుచున్నది.

'ఇట్లు కాదు. వారిమతమున నట్లు కారణగుణములు కార్యమునకు రాకుండుటకు హేతువు కలదు. ద్వ్యణుకము మొదలగువానియందు పారిమాండల్యాదిప్రమాణములకు విరుద్ధము లగు ప్రమాణములు కలవు. కావున నవి పారిమాండల్యాదులను రానీయవు. వేదాంతమతమున నట్లు కాదు. ప్రపంచమునందుఁ గలయచేతనత్వము చైతన్యమునకు విరుద్ధము. కాదు. అది చైతన్యనిషేధమాత్రమే కాని ప్రత్యేకగుణము కాదు కదా!' అనియెదవేమొ యట్లు కాదు. హేతువుల కేమి? ప్రతిదానికి నుండును. కారణగుణములు కార్యమునకు రాకుండ నున్నవియా? లేవా? అంతమాత్రమే ప్రస్తుతము కావలసినది. మఱియు దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణమగుపోలికయు నుండవలసినపని లే దని యిదివఱకే చెప్పియున్నాము.

మఱియు నాహేతువు మాత్రము నిలుచుట యెట్లు? ద్వ్యణుకాదులకు విరోధిగుణము కలుగుటకుఁ బూర్వమే పారిమాండల్యాదులు సజాతీయము లగుగుణముల నారంభింపవచ్చును. అట్లారంభించినపిదప విరోధిగుణము జనింపనే జనింపదు కదా! మఱియు నుత్పత్తి యైనతరువాతఁ గూడ పదార్థము క్షణకాలము గుణరహితమై యుండు ననియు వార లంగీకరించి యున్నారు.

'ఇట్లు కాదు కార్యమునందుఁ గ్రొత్తపరిమాణమును గలిగించుటకై పారిమాండల్యాదులు పనిసేయుచుండును కావున నవి సజాతీయగుణములఁ గలిగింపలేక పోవచ్చును; ఇట్లు కాకున్నను గారణమునుండి కార్యమునకు వచ్చుగుణములు కొన్ని యే యైననుఁ గావచ్చును. కదా!' అనియెదవేమొ అదియు సరి కాదు. ద్వ్యణుకాదులకు అణుదీర్ఘాదిపరిమాణములు కలుగుటకుఁ బారిమాండల్యాదులు కారణములు కావు. 'కారణబహుత్వాత్కారణమహత్వాత్ప్రచయవిశేషాచ్చ మహత్', 'కారణము లగు త్ర్యణుకాదు లనేకము లగుటవలనను, అవి పెద్దవి యగుటవలనను,

నొకదానితో నొకటి చేరుటవలనను గార్యము మహాపరిమాణము గలది యగును' అను మొదలగు సూత్రములచే వారు మహాపరిమాణము మొదలగునవి కలుగుటకు గారణాంతరములు జెప్పియున్నారు. కావున బారిమాండల్యాదులు నిర్వివాదముగ సజాతీయగుణముల నారంభింపవచ్చును. మఱియు రెండవపక్షము బొత్తుగనే సరిపడదు. అన్నిగుణములును గారణమున నొక్కసమవాయసంబంధముతోనే యుండగా దానినుండి జనించిన కార్యమునకు మాత్రము కొన్నియే వచ్చుననుట యెట్లు యుక్తియుక్త మగును? కావున నెట్లు చూచినను పారిమాండల్యాదులు తమకు సజాతీయము లగుగుణముల గల్పింపకుండుట స్వభావజన్యమే యని యొప్పుకొనక తప్పదు. చేతన మగుపరమేశ్వరునకు గూడ నిట్టిదియే స్వభావము కావచ్చును; పారిమాండల్యము తనకార్యమున బారిమాండల్యమును కలిగింపకున్న జేతనశక్తి మాత్రము తనకార్యమున జేతనశక్తిని కలిగింపవలయునా?

మఱియు సంయోగమువలన సంయుక్తపదార్థగుణములతో నించుకయైన సంబంధములేనినూతనపదార్థము లనేకములు జనించుచున్నవి. ఈ విషయము విలక్షణత్వాధికరణమున నిరూపింపబడి యున్నది. 'ద్రవ్యమునుగుఱించి మాటలాడుచుండగా గుణము నుదాహరణముగ జెప్పుట యెట్లు యుక్త మగును? సంయోగము గుణము కదా! దానికి నొకవేళ నట్టి స్వభావ ముండిన నుండవచ్చును. అని యెదవేమొ ఇదియొకనియమము కాదు. దృష్టాంతమునకు దేనినైనను జెప్పవచ్చును. వేదాంతమతమునందే కాదు వైశేషికమతమునందు కూడ నిట్టిదృష్టాంతములు పెక్కులు కలవు. 'ప్రత్యక్షాఽప్రత్యక్షాణా మప్రత్యక్షత్వా త్సంయోగస్య పంచాత్మకం నవిద్యతే' 'పృథివీజలతేజస్సులు ప్రత్యక్షభూతములు, ఆకాశవాయువుల ప్రత్యక్షములు, లోకమున బ్రత్యక్షాప్రత్యక్షభూతములకు సంయోగము కలదు కాని యది ప్రత్యక్షము కాదు. ఇట్లే శరీరము కూడ పంచభూతాత్మక మగునేని ప్రత్యక్షము కాగూడదు. కావున బంచభూతాత్మక మగుపదార్థమే ప్రపంచమున లేదు' అని వైశేషికులు చెప్పుచున్నారు. ఇచ్చట ద్రవ్య మగుశరీరమునకు గుణ మగుసంయోగము నుపమానముగ జెప్పియున్నారు. కదా! కావున నెట్లును వేదాంతసిద్ధాంతమునకు హాని లేదు. తర్కమతంబును మోక్షార్థులచే నాదరణీయము కాదు.

# పరమాణుజగదకారణత్వాధికరణము. 3.

సంగతి:—పై యధికరణమున స్వపక్షముపై వచ్చుదోషము మాత్రమే వేదాంతిచే నిరాకరింపఁబడెను; కావున నాయధికరణమునకును ఈయధికరణమునకును సంబంధ ముండుటకు వీలు లేదు. ఈయధికరణమున వైశేషికపక్షముపై దోషము చూపఁబడుచున్నది. కావున దీనికి సాంఖ్యమతదూషణ మగుప్రథమాధికరణముతోనే సంబంధముఁ జూపవలయును.

'ప్రథమాధికరణమున నచేతన మగుప్రధానము చేతనసహాయము లేక ప్రవర్తించుటకు వీలు లేదు; కావున సాంఖ్యమతమును ఖండించితిరి. వైశేషికమతమున నట్టివైపరీత్యము లేదు. వారికి నీశ్వరుఁడు నిమిత్తకారణము కదా' అని ప్రథమాధికరణముపైఁ బ్రత్యుదాహరణసంబంధముతో వచ్చినయాక్షేప మీయధికరణమున నివారింపఁబడును. సంశయపూర్వపక్షస్వరూపములు పాదావతారికయందే వివరింపఁబడెను.

విషయము:—వైశేషికమతము ప్రామాణికము కాదని నిరూపించుటయే యీయధికరణమునకు విషయము. పూర్వాధికరణమునందే మతస్వరూపము చూపఁబడెను.

అవతారిక:—ఆమతమునందు 'పరమాణువులే అదృష్టవశమునఁ జలించి పరస్పరము సంయోగమునొంది ద్వ్యణుకాదిక్రమమున సృష్టి చేయును; అట్లే విభాగము నొంది ప్రళయము గావించును' అనుట సిద్ధాంతము. దానిని ఖండించుచున్నాఁడు.

## ౧౨. ఉభయథాపి న కర్మాఽతస్తదభావః.

## ౨. ౨. ౧౨.

తాత్పర్యము:—వైశేషికులమత మెట్లును యుక్తము కానేరదు. వారియభిప్రాయ మేమి? 'పరమాణువులయందు ఉత్పత్తిప్రళయకాలములలో సంయోగవిభాగములఁ గలిగించుటకై కర్మ జనించును' అనుటయే కదా! ఇది సంభవింపదు. ఎట్లనిన:—

లోకమునఁ గర్మ యుండిననే గాని కార్య మేదియును జనింపదు. దారములు మొదలగునవి వ్యాపారములు కలవియైయే వస్త్రముగ మాఱుచున్నవి కాని కేవలముగఁ గాదు కదా! ఇట్లే పరమాణువుల యందునుఁ గర్మ యుండిన నాకర్మకు నేదియో యొక హేతువు తప్పక యుండవలయును. దానిని వార లంగీకరింతురా? లేదా? మొదటిపక్షమునఁ బ్రయత్నము (బుద్ధిపూర్వకముగఁ జేయఁ బూనుట) అభిఘాతము (కొట్టుట) నోదనము (త్రోయుట) మొదలగునవియే కర్మోత్పత్తికిఁ (అచేతనపదార్థములయందు కర్మ గలుగుటకుఁ) గారణములు కావున నవి సృష్టికిఁ బూర్వమున సంభవింపనేరవు. రెండవపక్షమునఁ గర్మయే సంభవింపదు కదా! కావున నెట్లును అచేతనము లగుపరమాణువులనుండి ప్రపంచోత్పత్తి కలుగదు. వానిని నిమిత్తకారణ మగునీశ్వరుఁడే కర్మలయందు లేక సృష్టి యందు ప్రేరేపించు ననుటను గూర్చి 'పత్యు రసామంజస్యాత్. ౨. ౨. 3౭.' అనుస్థలమున విచారింపఁబడును.

'వైశేషికమతమునఁ బరమాణుకర్మకుఁ బుణ్యపాపరూప మగున దృష్టమే హేతువు' అనిన నదియు సరి కాదు. ఈయదృష్టము జీవునకు సంబంధించి యుండునా? పరమాణువులకే సంబంధించి యుండునా?

ఇందు మొదటిపక్షము సరి కాదు. సృష్టి యైనపిదపఁ గాని దేహము జనింపదు. ఆదేహమున మనస్సు నిలచినప్పుడు కాని దానిలోఁ బ్రవేశించినజీవునకుఁ జైతన్యము కలుగదు. చైతన్యము లేకుండిన నాజీవుఁడు తనయం దున్నయదృష్టముతోఁ బరమాణువుల కెట్లు కర్మనుఁ గలిగింపఁ గలఁడు? అతఁడు స్వయముగ నచేతనతుల్యుఁడై యున్నాఁడుకదా! సాలెవాఁడు చేతనుఁడగుటచే వానివలన మగ్గము మొదలగుసాధనములయందును తంతువులయందును వ్యాపారము కలుగుటయు దానిచే వస్త్రము జనించుటయుఁ గానవచ్చుచున్నది. కర్త యచేతనుఁ డగుటకు నెప్పటికిని వీలు లేదు కదా! మఱియుఁ బుణ్యపాపరూప మగునదృష్టంబును స్వయముగ నచేతనము. చేతనసహాయము లేక నచేతనము స్వయముగ నేకార్యమునుఁ గాని యాచరింప లే దనుట సాంఖ్యమతఖండనమునందే నిరూపింపఁబడెను. ఇదియంతయుఁ గాక యదృష్టము పురుషాశ్రయ మైనచో దానితోఁ బరమాణువులకు సంబంధ మెట్లు కలుగును? కావున నంతయును విరుద్ధమే.

ఇఁక రెండవపక్షమును గూర్చి వేఱుగఁ జెప్పవలసినపనియే లేదు. అదృష్టమే కాక దానియాశ్రయములుఁ గూడ నచేతనములే కదా! మఱియు నదృష్టముతో జీవునకు మాత్రమే సంబంధ ముండుట యుక్త మగును కాని యన్యుల కుండుట యుక్తము కానేరదు కదా.

"ఇట్లయిన నదృష్టసహితుఁ డగుజీవునితోనే పరమాణువులకు సంబంధ ముండవచ్చును కదా!" అనియెద వేమొ అప్పటికిని జీవునియచే తనత్వ మెచ్చటికిని పోవదు. ఇట్లు కాక నాతనికి నొకవిశేషశక్తి నంగీక రించినను సంబంధమునకు హాని యెప్పటికిని లేకుండుటచే సృష్టి సర్వకాల ములయందు నొక్కతీరుగనే యుండవలసివచ్చును. ఇది సిద్ధాంతవిరుద్ధము కదా!

వాస్తవస్థితిలో జీవపరమాణువులకుఁ గలసంబంధమును నియమించు టకుఁ (అనగా: కలిగించుటకును మఱియొకప్పుడు తొలగించుటకును) మఱి యొక్కఁడు లేఁడు కదా! ఈకారణమువలన నెట్లువిచారించినను పరమాణు సంయోగమునకుఁ జక్కనికారణము లేదు. సంయోగములేకుండుటచే ద్వ్యణుకాదిసృష్టి లేదు. అదిలేకున్నఁ బ్రళయంబును లేదు. కర్మ యుండి నఁగాని సంయోగము లే దనియు నాకర్మకుఁ దగినకారణమే లేదనియు నిదివఱకే నిరూపించితిమి కదా! కావున నెట్లును వారిమతము యుక్తము కాదు.

మఱియుఁ గర్మనిషయ మటుండనిండు. పరమాణువులకు నవయ వములు లేవు కదా! అవి యెట్లు పరస్పరసంయోగము నొందును? సంపూ ర్ణముగ నొకదానితో నొకటి కలియునా? లేక నొకదానికి నొకపార్శ్వ మున మాత్రమే. మఱియొక్కటి కలియునా?

ఇందు మొదటిపక్షము సరికాదు. అప్పుడు పదార్థ మంతయుఁబర మాణుప్రాయమే కావలసివచ్చును. పరమాణువు నిరవయవ మగుటచే నవి యెన్ని పరస్పరముఁ గలసినను ఒక్కటియే యగును. ఆకాశ మాకస ముతోఁ గలసినఁ బొడ వగునా? లోకమున నవయవములుఁ గలపదార్థ ములు మాత్రమే యొండొంటితోఁ గూడి పొడ వగు చున్నవి. కదా! ఈయనుభవమునకును విరోధము వచ్చును.

ఇఁక రెండవపక్షము నాశ్రయించిన వారిప్రతిజ్ఞకే భంగమువచ్చును. అవయవము లున్నవానికిఁ గాని పార్శ్వము లేర్పడవు కావున, బరమా-

ణువులు సావయవములు కావలసివచ్చును. ఇది విరుద్ధము కదా! మఱియు నొక్కదానియందే సంయోగముయొక్క కలిమిలేములుండు ననుటకు వీలు లేదు. అదియే సిద్ధాంతమైన నున్మత్తవాక్యములుఁ గూడఁ బ్రామాణికములు కావలసివచ్చును. 'ఇట్లు కాదు ఆపరమాణువులకువాస్తవస్థితిలో నవయవములు లేవు. ఈశ్వరేచ్ఛవలనఁ గాని మఱి యేకారణమువలనఁ గాని వానియందు అవయవములు కల్పింపఁబడును; వాని నాశ్రయించుటచేతనే సంయోగంబును సృష్టియుఁ గలుగుచున్నది' అనిన నప్పటికి వైశేషికమతసిద్ధాంతమే నిలువదు. కల్పింపఁబడినవి. పరమార్థవస్తువులుకానేరవు కదా! వారిమతమునఁ బ్రపంచము సత్యము; పరమాణుసంయోగము దానికి సమవాయికారణము. సంయోగ మసత్య మైనచో నది ప్రపంచమునకు సమవాయికారణమెట్లగును? సత్యమగువస్త్రమునకు సత్యము లగు తంతువులే సమవాయికారణము లగుచున్నవియనుటలోకప్రసిద్ధముకదా!

కావున సృష్టియందుఁ గావలసినసంయోగమునకుఁ గారణము బొత్తుగనే లేదు. ఇట్లే ప్రళయకాలమున విభాగమునకును గారణ ముండదు. అప్పుడుఁ గూడ పరమాణువులయందుఁ గర్మ జనింపవలయును. దానికి మాత్రము కారణ మేమి యుండును? అప్పుడు ప్రపంచసృష్టిమై యుండినను బ్రయత్నము నభిఘాతము మొదలగునవి కలుగుటకు వీ లున్నను నవి విభాగకారణములు కానేరవు; పరమాణువులయందు విభాగార్థ మగుకర్మను గలిగింపనేరవు. జీవుఁడు తనకు భోగసాధనమై యున్నప్రపంచమును ధ్వంసము చేయ నేల ప్రయత్నించును? అభిఘాతాదులును ఏదియో యొకపదార్థమునకు మాత్ర మే కలుగుట సంభవించును గాని సర్వపదార్థములకు నొక్కమాఱే కలుగుట యెట్లు సంభవించును? పుణ్యాపుణ్యకర్మలును జీవులకు భోగార్థమై వచ్చినవియె కాని ధ్వంసార్థము కాదు. మఱియు నొకవేళ నవి శరీరమును మాత్రము పునర్జన్మమునకై ధ్వంసము చేసినఁ జేయవచ్చును కాని పృథివ్యాదుల నేది ధ్వంసముఁ జేయఁగలదు? అందు జీవుఁడు కల డనుట వారిమతమునకు సమ్మతము కాదు కదా! కావున నెట్లును వైశేషికులు చేయుపరమాణుకారణవాదము యుక్తియుక్తము కానేరదు. ఏవిధముగఁ జూచినను బరమాణువులయందు సంయోగవిభాగానుకూల మగుకర్మ జనించుటకు వీలు లేకపోవుటచే వారిమత[illegible] సృష్టిప్రళయ[illegible] సంభవింపవు.

అవతారిక:—'పరమాణువులు రెండు గలియుటచే వానికంటె భిన్నమై ద్వ్యణుక ముత్పన్న మగును. దానికిని ఆపరమాణువులకును సమవాయసంబంధము కలదు' అని వైశేషికులు చెప్పుదురు దాని నీసూత్రమున సూత్రకారుఁడు ఖండించుచున్నాఁడు

## ౧౨౪. సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః. ౨. ౨. ౧౩.

తాత్పర్యము:—మఱియు వారు పరమాణువులకును ద్వ్యణుకమునకును సమవాయసంబంధము నంగీకరించుటవలనఁ గూడ వారిసిద్ధాంతము నిలువదు; పరమాణువులనుండి ప్రపంచ ముత్పత్తి కాదు. ప్రళయమును సంభవింపదు. ఎట్లనిన:—

ద్వ్యణుకమునకును దానియుత్పత్తికారణములగుపరమాణువులకును సంపూర్ణ భేదము కలిగి యున్నది. అయినను వానికి రెంటికిని సమవాయ సంబంధముచే నైక్యము కలుగుచున్నది కదా. ఈసిద్ధాంతమును సమవాయసంబంధముపై వినియోగించి చూతము సంబంధము పదార్థములు కాదు; పదార్థములు సంబంధంబును కాదు. ఈవిషయము సర్వసమ్మతము కదా! ఇఁక నాలోచింపుఁడు. పరమాణువులతోఁ దద్భిన్న మగుద్వ్యణుకముఁ జేరవలసినప్పుడు దానికి నొకసంబంధము కావలసివచ్చెను.ఇట్లుండ నాపరమాణువులకంటెను, ద్వ్యణుకములకంటెనుఁ గూడ భిన్న మగుసమవాయసంబంధమునకు వానితో(పరమాణువులతోను ద్వ్యణుకము లతోను) సంబంధము కలుగవలసినప్పుడు మాత్రము మఱియొకసంబంధ మక్కఱ లేదా? అదియు (సమవాయసంబంధంబును) వానితో సంబంధింపక వానికంటె భిన్నమే యైయుండి వానినిమాత్రమే పరస్పరము సబంధింపఁజేయు ననుట యుక్తమగునా? కావున నట్టిసంబంధాంతరము నవశ్య మంగీకరింపవలయును. అట్లంగీకరించిన నారెండవసంబంధంబును పదార్థములకంటె భిన్నమే కావున దానికినిఁ బైజూపినట్లే మఱియొక సంబంధము కావలసివచ్చును.ఆమూఁడవదానికిని మఱియొక్కటి కావలసివచ్చును. ఇట్లు సంబంధపరంపరనంగీకరింప నారంభించినచో నెప్పటికి నంతమేయుండదు కావుననీ దోషముపోవుటకై మొట్టమొదటనే సమవాయసంబంధము నంగీకరింపకుండవలయును. వారిసిద్ధాంత మట్టిదికాదు కావున నదియుక్తముకానేరదు.

'ఇట్లు కాదు. సమవాయసంబంధమునకు మఱియొకసంబంధ మక్కఱ లేదు. అది స్వయముగనే సంబంధరూపము. పదార్థద్వయమునకంటె నది భిన్నముగ నుండదు; దానిని విడిచి పదార్థములు నుండవు. (సమవాయ సంబంధముఁ గలపదార్థములు నుండవు; కావున దానికి పదార్థములనొండొంటితోఁ గూర్చుట స్వభావసిద్ధమే. ఇది యంతయుఁ బ్రత్యక్షమువలననే తెలియుచున్నది. వస్త్రమునందు గల తెలుపు, ఒకప్పుడును ఆవస్త్రమునకంటె భిన్నముగ నుండదు కదా!' అనియెదవేమొ అట్లయినను వారి మతమున మఱియొకదోషము వచ్చును. సమవాయసంబంధమునకు రెండవసంబంధ మక్కఱలేదనిన సంయోగసంబంధమునుఁగూర్చి చేసినసిద్ధాంతమునకుభంగము వచ్చును. వారు, సంయోగసంబంధము పదార్థమునకు గుణమనియు నాకారణమువలన నది పదార్థములయం దుండుటకు సమవాయ సంబంధము కావలయు ననియు నది పదార్థములకంటె భిన్న మనియుఁ జెప్పుదురు. సమవాయసంబంధమునకు సంబంధాంతర మక్కఱ లేకుండిన సంయోగసంబంధమునకు మాత్ర మది యేల కావలయును. ఈసంయోగంబును సంయుక్తపదార్థములను విడచి ప్రత్యేకముగ నుండదు. దీని యునికియుఁ బ్రత్యక్షమువనే తెలియవచ్చుచున్నది. ఇదియును సంబంధ రూపమే. ఇట్లుండ సమవాయమునకును దీనికిని భేదమేమి? సంయోగము పదార్థభిన్న మగిన నిదియు సంబంధమే యగుటచే సమవాయము కూడ నట్టిదే కావలసి వచ్చును. ఒకసంబంధము పదార్థభిన్నమైన మఱియొక్కటి కా కుండుట యెట్లు? 'సంయోగము గుణము *సమవాయ మట్టిది కాదు' అనియెదవేమొ ఇది వారు చేసికొనినపరిభాష. దానిని ప్రమాణముగఁ గైకొనువా రెవ్వరు? ఇఁక నాపరిభాషను విడిచి చూచిన రెండును సమానధర్మములు కలవి యే యగును కదా! మఱియు నిప్పుడు సంబంధాంతరాపేక్షకు (తనకు సహాయముగ మఱియొకసంబంధము కావలసియుండుటకు) నావశ్యకత కలదా? లేదా? యనువిషయము మాత్రమే విమర్శింపఁబడుచున్నది; అదియు యుక్తియుక్తమై సంయోగసమవాయములకు సమానముగఁ దటస్థించినది. ఇక నిప్పుడు గుణాగుణప్రశంస యేల? సంయోగమునే గుణముఁ గానిమ్ము సమవాయము నట్లు కాక పోనిమ్ము వాదమునకు వానిస్థితిభేదములతోఁ బనియేమి?

---

* పరిభాష. (౧౯౨-వ పుట చూడుడు.)

ఈకారణమువలన సంయోగసంబంధమునకు సంబంధాంతరాపేక్ష కలదేని సమవాయసంబంధమునకుఁ గూడ నుండవలయును. సమవాయ సంబంధమునకు లే దేని సంయోగమునకుఁ గూడ లేకపోవలయును. ఇవి రెండును వారి కనిష్టములే. ఇట్లగుటచేఁ బదార్థభిన్నముగ సమవాయ సంబంధ మనుపదార్థాంతరము నంగీకరించుటవలన వారిమతము దోష యుక్తమైనది. ఆసంబంధము లేకపోయినఁ బరమాణువులనుండి ద్వ్యణుకము పుట్టదు; ఉన్నయెడల ననవస్థ తప్పదు. అనవస్థాదోషమువలన సమవాయసంబంధమునకు నిలుకడ కుదురదు. ఒకసమవాయమునకు నిలుకడ కావలసియుండిన మఱియొకసమవాయమునకుఁ గూడ కావలసి వచ్చుచుండును కదా! కావున సమవాయాంగీకారముచే వారిమతమున సృష్ట్యాదులే సంభవింపవు. వాస్తవస్థితిలో నారంభణాధికరణమున (౨.౧. ౧౮.) సమవాయ మనునది బొత్తుగ నుండుటకే వీలు లే దని నిరూపించి యున్నాము.

## సూత్రము. ౧౪.

అవతారిక:—మఱియొకకారణముఁజూపి యావైశేషికమతమునే ఖండింపుచున్నాఁడు.

## ౧౮౫. నిత్యమేవ చ భావాత్. ౨. ౨. ౧౪.

తాత్పర్యము:—వారిమతమున మఱియొకదోషము కూడ కలదు. పరమాణువులకుఁ బ్రవృత్తియే స్వభావమా? నివృత్తియే స్వభావమా? రెండును స్వభావములేనా? లేక ఏదియు స్వభావముకాదా?

ఇందు మొదటిపక్షమున నెప్పుడునుఁ బ్రవర్తించుచునే యుండవలసివచ్చుటచేఁ బ్రళయము సంభవింపదు. అది నివృత్తి కలిగినప్పుడు గాని సంభవించునది కాదు కదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నెప్పుడును నివృత్తికలిగియె యుండవలసివచ్చుటచే సృష్టి సంభవింపదు. అది ప్రవృత్తి కలిగినప్పుడు గాని సంభవింపదు కదా! ఇఁక మూఁడవపక్షము నాశ్రయించిన విరుద్ధమగుటచే నట్టిస్థితి సంభవింపదు. ఒకపదార్థమునకే విరుద్ధము లగు రెండుస్వభావము లుండుట సంభవింపదు. 'మనుష్యుఁడు నడుచుచున్నాఁడు. [illegible] విరుద్ధస్వభావములు కలవు

కదా'అనియెదవేమొ వాఁడు చేతనుఁడు; తనయిచ్ఛానుసారముగఁ గర్మల నాచరింపఁగలఁడు. పరమాణువు లచేతనములుకదా! అచేతనములకు నెందును ఒక్కస్వభావమే నియతముగఁ గానవచ్చుచున్నది. జల మెప్పటికినిఁ జల్లగనే యుండునుగాని వేడిగనుండదు. అగ్ని యెప్పటికిని యూర్ధ్వముఖముగనే ప్రజ్వరిల్లునుగాని యధోముఖముగఁ దిరుగదు. కావునఁ బరమాణువులకుఁగూడ నేదియో యొకస్వభావముమాత్రమే యుండవలయునుకాని రెంటనుండుటకు వీలు లేదు. ఇఁక నాల్గవపక్షము నాశ్రయించిన నప్పుడు పరమాణువులకుఁ బ్రవృత్తినివృత్తులు కలుగుటకై యదృష్టాదిరూపము లగునిమిత్తముల నంగీకరింపవలసివచ్చును. అప్పుడును ఆనిమిత్తములు సర్వకాలములయందునుఁ బరమాణువులకు సన్నిహితము లయ్యే యుండుటచేఁ బ్రవృత్తియే యవిచ్ఛిన్నముగఁ గలుగవలసివచ్చును. 'ఆయదృష్టాదులుఁ గూడ నొకప్పుడు పరమాణువులతో సాన్నిధ్యము నొందును; మఱియొకప్పుడు నొందవు. ఇట్లగుటచేఁ బరమాణువులునుఁ గాలానుసారముగఁ బ్రవృత్తినివృత్తులఁ జెందవచ్చును' అనిన నదియు సరి కాదు. ఆయదృష్టాదులునుఁ బరమాణువులవలెనే యచేతనములే యై యుండ వానికిమాత్రము స్వేచ్ఛాప్రవృత్తికి స్వాతంత్ర్య మెక్కడిది? కావున నెట్లునుఁ బరమాణువులవలన సృష్టి కలుగు ననుటకు వీలులేదు.

## సూత్రము. ౧౫.

అవతారిక:—మఱియు వారిమతమున 'భూతభౌతికపదార్థములు వినాశకాలమున విభాగము నొందునప్పుడు కట్టకడకు నతిసూక్ష్మములును నిరవయవములు నగుభాగములుగ నేర్పడును. అవియే పరమాణువులు; నిత్యములు. వానికి పృథివ్యప్తేజోవాయుభేదములఁ జాతుర్విధ్యము కలదు. అందుఁ బృథివీపరమాణువులకు గంధంబును జలపరమాణువులకు రసంబునుఁ దేజఃపరమాణువులకు రూపంబును వాయుపరమాణువులకు స్పర్శయుఁ గలదు. అయినను అవి నిత్యములు. అవియే సర్వకారణములు' అనునది సిద్ధాంతము. ఈసిద్ధాంతమువలన వారిమతముననే హాని వచ్చునని నిరూపించుచున్నారు.

## ౧౫౬. రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్. ౨. ౨. ౧౫.

తాత్పర్యము:—పరమాణువులకు రూపాదులు కల వనిన నవి పరమాణువులే కాకపోవలసివచ్చును; నిత్యములును కాకపోవలసివచ్చును. ఏల యనిన:—లోకమున రూపాదులు గలవస్త్రము మొదలగుపదార్థములు స్వకారణము లగుదారములు మొదలగువానికంటె స్థూలములుగను అనిత్యములుగనుఁ గానవచ్చుచున్నవి; ఆదారములునుఁ దనకుఁ గారణ మగుదూదిపింజకంటె స్థూలములై యున్నవి. అనిత్యములై యున్నవి. ఇట్లే పరమాణువులుఁ గూడ రూపాదిమంతములే యగునేని మఱియొక కారణమునుండియే జనించినవి కావలయును. ఆమూలకారణముకంటె స్థూలములు కావలయును అనిత్యములునుఁ గావలయును. కావున నీదోషముచేఁ బ్రపంచకారణములు రూపాదిమంతము లగుపరమాణువులు కానేరవు.

'ఇట్లు కాదు. పరమాణువునకు మఱియొకకారణమేలేదు *ప్రాగభావంబును లేదు. కావున నవి నిత్యములే కావలయును. ఇట్లు గాకున్న' ఘట మనిత్యము' అను మొదలగు లోకవ్యవహారములు సిద్ధింపక పోవలసివచ్చును. నిత్య మగునది యొక్కటి యుండిననే కదా తద్భిన్నముల ననిత్యములుగ వ్యవహరించుటకు వీలగును. మఱియు లోకమునఁ గార్యములు ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నవి కాని దానికారణములు గానవచ్చుట లేదు. పరమాణువులు మాత్రము కార్యములయందుఁ గానవచ్చుచునే యున్నవి; వానివలననే ఈపదార్థములు జనింపవచ్చు ననుటయు స్పష్ట మగుచున్నది. ఆపరమాణువులకు మాత్రము కారణ మున్నట్లు గానరాలేదు. కావునఁ బరమాణువులే నిత్యములై సర్వప్రపంచకారణములై యుండవలయును. మఱియు లోకమునఁ బదార్థములు నశించుటకు కారణములు రెండు మాత్రమే కలవు. కారణభూత మగువస్తువు విభాగమునైననుఁ జెందవలయును, నశింపనైనను నశింపవలయును. పరమాణువులయందు దీరెండునుఁ గలుగుటకు వీలు లేదు. వానికి నవయువములే లేవు కదా. కావున

* ప్రాగభావము (............)

నెట్లునుఁ బరమాణువు లనిత్యములు కానేరవు.' అనిన నదియును సరి కాదు' ఎట్లనిన.—

పరమాణువులకుఁ గూడ రూపాదు లుండుటచే లోకానుభవము ననుసరించి చూచినఁ గారణము కూడ నుండవలయు నని యిదివఱకే నిరూపించి యున్నాము. ఇట్లుండ వానికి నూరక కారణము లే దనిన నెట్లు సరిపడును. ప్రాగభావ మన్ననో అది వారిమతమున నున్నను సయుక్తికము కా దని యారంభణాధికరణముననే నిరూపించి యున్నాము. మఱియును లోకమున నున్నయనిత్యవ్యవహారముఁ గూడ పరమాణునిత్యత్వమును సాధింపనేరదు. ఆవ్యవహారమునకు నేదియో యొకపదార్థము నిత్యమై యుండవలయు ననుటయే కావలసినవిషయము కాని 'పరమాణువులే నిత్యములై యుండవలయును' అనువిషయము కాదు. సర్వశ్రుతిప్రసిద్ధ మగుబ్రహ్మము కూడ నిత్యమేమై యున్నది. దాని నాశ్రయించియే తద్భిన్నపదార్థములయం దనిత్యవ్యవహారముఁ బ్రవర్తింపవచ్చును కదా! ఇంతమాత్రమే కాదు కేవలము లోకవ్యవహారమును మాత్రమే యాశ్రయించి యొకవిషయమును నిర్ణయించుటకుఁ గూడ వీలు లేదు. అది భ్రాంతిసిద్ధమై కూడ నుండవచ్చును కదా! ఇదియునుఁ గాక పరమాణువులకుఁ గారణము కానరాలేదు కావున నవి నిత్యములు' అనిన దానినిఁ గూర్చి యిదివఱకే చెప్పఁబడెను. వారును చెప్పిన కారణమునే మఱియొక్కమాఱు చెప్పినవార లగుదురు. (వైశేషికసూత్రమున * రెండు సూత్రములయం దొకవిషయమే చెప్పఁబడి యున్నది. కావునఁ బునరుక్తిదోషము చెప్పఁబడియున్నది.) అప్పుడు పునరుక్తిదోషము వచ్చును. ఇది యనిష్టము కదా? మఱియుఁ "(గారణ) విభాగవినాశములు లేవు కావునఁ బరమాణువులు నిత్యములు" ననుపక్షముకూడ యుక్తిశూన్యమే. పదార్థనాశమునకు నవిరెండే (విభాగవినాశములు రెండే) కారణము లను నియమము లేదు. వైశేషికులవలె 'సూక్ష్మపదార్థము లొండొంటితోఁ గూడి పదార్థముల నేర్పరచును.' అని చెప్పినచో నానియమ మట్లే యేర్పడును గాని యది లోకవిరుద్ధము. లోకమున మట్టి సువర్ణము మొదలగుపదార్థములు సామాన్యరూపము లయ్యే యాకారభేదములతోఁ బరిణమించుచున్నవి. ఇట్లుండఁ బరమాణువుల నంగీకరింపవలసినపని యేమి కలదు?

* రెండుసూత్రములు ("సదకారణవత్ ... ") ... నవి.

'పరమాణువులే అవశ్యముగ నుండవలయును' అనిన నప్పుడు వారిమతము నందే విరోధము వచ్చును. నెయ్యి మొట్టమొదట కఠినమై యుండి పిదప నగ్నిసంయోగముచే ద్రవించుచున్నది. వారిమతమునఁ బరమాణువులకు ద్రవత్వధర్మము లేదు. అవయవవిభాగమే వస్తునాశమునకుఁ గారణ మగు నేని లేని ద్రవత్వ మెచ్చటనుండి వచ్చినది? కాఠిన్యము నశించె ననిన వారి మతము ననుసరించి సిద్ధాంతముఁ జేసినచో గఠినపరమాణువులు చెదరి పోయె నని మాత్రమే కదా చెప్పవలసి వచ్చును. కావునఁ బరమాణు రూప మని యంగీకరించినప్పటికిని ద్రవ్యము అవస్థాభేదములతోఁ బరిణ మించు ననుట మాత్రమే కానవచ్చుచున్నది. పైదృష్టాంతము ననుస రించినఁ బరమాణువులయందుఁ ద్రవత్వము లేకపోవుటచే లోకప్రసిద్ధిబల మునఁ 'బరమాణువులు కారణములే కావు' అనుటయే యుక్త మగుచు న్నది. ఇఁకఁ గారణ మిట్టిది. కావలయు ననిన, మృత్తిక సువర్ణము మొద లగువానివలె తనకార్యములయందు నిలచి స్పష్టముగఁ గుఱుతింపఁబడు చున్నదియే? సామాన్యరూప మైనదియే. వైశేషికులు కపాలములు (కుండను చేయునప్పుడు మొట్టమొదట దానికంఠము మాత్రమే యేర్ప డును. పిదప దానియుదరమును సాధనసహాయముచే నిర్మింతురు. ఆసమ యమున నుదరరూపముతో నేర్పరుపఁబడు శకలములు రెండునుఁ గపా లము లనఁబడును.) మొదలగునవి ఘటాదులకుఁ గారణము లందురు. కాని లోకప్రసిద్ధి ననుసరించిన నవి కారణములు కానేరవు; ఘటము నందు వానిని గుఱుతించుటకు వీలు లేదు కదా! కావున మృత్తిక మొద లగునవియే అవస్థాభేదములతోఁ గపాలములుగను ఘటముగను ఇసుకగను ధూళిగను ఉన్నది. యనుటయే యుక్తియుక్తము. ఈకారణమువలన 'నవయవవిభాగమే నాశము. అవయవనాశమే నాశము (వైశేషికమత మున నవయవములే అవయవులకుఁ గారణములు)' అనుసిద్ధాంతము యుక్తి శూన్యము. విశేషస్వరూపనాశముచేతఁ గూడ నాశము కలుగవచ్చును కదా! వాస్తవస్థితిలో నుపాదానకారణములకు నేవిశేషము నుండదు; విశేషములకును వానికిని గలసంబంధము రజ్జుసర్పసంబంధము వంటిదే యగును. అనిర్వచనీయ మగును. ఈవిషయముఁ గూడ పలుమాఱు నిరూపింపఁబడెను. కావునఁ గార్యము స్వరూపముతో నవయవవిభాగా దులతోఁ బని లేకయే నశించును.

ఇట్లగుటచేఁ బరమాణువులు నిత్యములనియు సూక్ష్మరూపము లనియు సాధించుటకు నెట్లును వీలులేదు. ఉత్పత్తివినాశములు గలపదార్థము లన్నియు లోకమున సామాన్యరూప మగుకారణమునుండియే యనిర్వచనీయసంబంధముతో జనించుచు నడంగుచునున్నవి. సమవాయసంబంధ మనునది. ఇదివఱకే ఖండింపఁ బడెను. ఈకారణమువలనఁ గారణకార్యములకుఁ గలసంబంధముఁ గూడ * తాదాత్మ్యరూపమే యగుచున్నది. ఈసంబంధము వైశేషికులకు నిష్టముకాదు; అప్పుడు పరమాణువులునుఁ గారణము లగుటకు వీలు లేదు. ఈకారణము వలనఁ గూడఁ బరమాణుకారణవాదము యుక్తియుక్తము కానేరదు.

## సూత్రము. ౧౬.

అవ:—మఱియు నీవైశేషికమతము లోకానుభవమునకును శాస్త్రమునకునుఁ గూడ విరుద్ధ మని చూపుచున్నాఁడు.

## ౧౮౭. ఉభయధా చ దోషాత్ ౨. ౨. ౧౬.

తాత్పర్యము:—మఱియు నీ వైశేషికమత మనుభవవిరుద్ధము; ఆగమమునకుఁ గూడ విరుద్ధము. ఎట్లనిన:—

లోకమున భూమియందు శబ్దస్పర్శరూపరసగంధము లైదును గానవచ్చుచున్నవి. జలమునందు గంధము కాక తక్కినగుణములు గానవచ్చుచున్నవి. అగ్నియందు శబ్దస్పర్శరూపములును వాయువునందు శబ్దస్పర్శములును ఆకసమున శబ్దంబునుఁ గానవచ్చుచున్నవి. గుణము లధికము లగు కొలఁది భూతములును స్థూలము లగుచున్నవి. గుణగుణులకు భేదము లేకపోవుటవలన గుణవృద్ధియే గుణివృద్ధి యనుట సుప్రసిద్ధమై యున్నది. గుణగుణులకుఁ గానవచ్చుభేద మనిర్వచనీయ మని యిదివఱకే నిరూపించి యున్నాము. వేదాదులు నీభూతములనుఁ గూర్చి యిట్లే చెప్పుచున్నవి.

వస్తుస్థితి యిట్టిది యనుటచేఁ బ్రపంచకారణము కూడ గుణసహితమే యై యుండవలసి వచ్చును. వైశేషికాదిమతముల ననుసరించిమా

---

* తాదాత్మ్య మనఁగా అభేదముగఁ గలుగు ననుభవము. త్రాటినిఁ జూచి సర్పమని భ్రాంతి నొందునప్పుడు "యీత్రాడు యిది సర్పము" అని భేదజ్ఞానములేకుండ "యిది సర్పము" [illegible] జ్ఞా[illegible]ము.

చిన వారు కారణమునం దున్నగుణములే కార్యమునకు రావలయు నందురు కదా! కావున వారు పరమాణువులకుఁ గూడ నిట్టిగుణములు కల వని చెప్పవలసినవారే యగుదురు. పైనఁ జెప్పినరీతిగా పృథివ్యాదిపరమాణువులకుఁ దారతమ్యముతో నయిదు నాలుగు మూఁడు రెండు గుణములు కల వని చెప్పవలసినవార లగుదురు. అప్పుడు వారిపరమాణువులు పరమాణువులే కాకపోవలసి వచ్చును. గుణగుణులకు నభేద మని యిదివఱకే నిరూపించి యున్నాము కదా! ఈదోషముఁ బోఁగొట్టుకొనుటకై యట్టిగుణభేదమునుఁ జెప్పకుందు రేని భూమ్యాదులయందు రూపరసాద్యనుభవము లేకపోవలసివచ్చును. 'ఒకభూతమునందే లేక పదార్థమునందే సర్వపరమాణువులుఁ జేరవచ్చును' అనియెద వేమొ వారిమతమున నట్టిసిద్ధాంతము లేదు. 'ప్రత్యక్షాప్రత్యక్షాణాం (సూ. ౨. ౨.౧౧.)' అను సూత్రముచేఁ బంచభూతాత్మక మగుపదార్థమే లే దని వారు సిద్ధాంతముఁ జేసియున్నారు. ఇది యంతయుఁ గాకవారు సర్వపరమాణువులను సూక్ష్మరూపములనుఁ గాఁ జతుర్గుణయుక్తములను గాఁ జెప్పినప్పుడు వాయువునందు కూడ రూపముండవలసివచ్చును. అగ్నియందు నురస ముండవలసివచ్చును. కావున వా రెట్లు చెప్పినను వారిమతము లోకానుభవవిరుద్ధమే యగును. కావునఁ బరమాణుకారణవాద మయుక్తము.

## సూత్రము. ౧౭.

అవ.—ఇట్లు పరమాణుకారణవాదమును నిరాకరించి సూత్రకారుఁడు అధికరణమును ముగించుచున్నాఁడు.

## ౧౭౭. అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా. ౨.౨.౧౭.

తాత్పర్యము.—మఱియు వీరిమతము నింతగా దూషింపవలసిన పనియే లేదు. వేదవేత్త లగు మహాత్ములు సాంఖ్యాదిమతముల నైనను ఏదియోయొకయంశమున (సత్కార్యవాదము మొదలగునంశములయందు) గ్రహించి యున్నారు కాని వీరిసిద్ధాంతమునుమాత్ర మించుకయైనను గ్రహింప లేదు. (వీరిమతమునందును వేదాంతులు గ్రహించునవి యని యధికరణపీఠికయందుఁ జూపఁబడినయంశములలోఁ బ్రధాన మగు 'జ్ఞానమువలన మోక్షము కలుగును' అనునంశము సాంఖ్యమతమునందుఁ

గూడఁ గలదు. కావున నెట్లుఁ జెప్పఁబడె నని తెలిసికొనవలయును) ఈ కారణమువలన వేదాంతి యీ మతమువైపు చూడ నైన నక్కఱలేదు. ఇట్లుండ దీని నాశ్రయించిన ముక్తి దొరకుట యెట్లు?

* ఉత్సూత్రముగ భాష్యకారునిచేఁ జేయఁబడిన వైశేషికమత ఖండనము:—

మఱియు వైశేషికులు వారిశాస్త్రమునకు విషయములుగ నేడు పదార్థములను అంగీకరించుచున్నారు. † ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, సమవాయము, విశేషము, అభావము అనునవి వానినామధేయములు. ఇందు సప్తమపదార్థము అభావరూపమే యగుటచేఁ దక్కిన యాఱు మాత్రమే ‡ భావపదార్థములు. కావున వీనిస్వరూపస్వభావములను గూర్చి కొంత విమర్శింపవలసి యున్నది.

---

* ఉత్సూత్రమనఁగా సూత్రములో నున్నయొకసూచన మించుక నిమిత్తముగఁ గైకొని స్వయముగనే కార్యమును నిర్వహించుట.

† ద్రవ్యములు గుణములు కర్మలు విశేషములు సామాన్యములు అభావములు. ఇవి యేడును బదార్థములు. పృథివ్యాధి పంచభూతములును కాలము దిక్కు ఆత్మ మనస్సు అనునవితొమ్మిదియు ద్రవ్యములు. శబ్దాదులైదును సంఖ్యయుఁ బరిమాణంబును సంయోగవిభాగములును పృథక్త్వంబును(వేఱువేఱుగానుండుట) పరత్వాఽపరత్వములను(పెద్దచిన్నలుగాగాని దూరసమీపస్థితములుగాగాని యుండుట) ద్రవంబును స్నేహంబును (చూర్ణాదులు ముద్దయగుటకు తగినగుణము) బరువు బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛాద్వేషములు ప్రయత్నము ధర్మాధర్మములు సంస్కారములు (వాసనలు)అనునీయిరువదినాల్గును గుణములు. ఎగురవేయుట దించుట చాఁచుట ముడుచుట నడచుట యను నీయైదును గర్మలు. మొదటినాలుగుఁ దప్ప తక్కిన క్రియలన్నియును నడచుటయందే చేరునని వైశేషికులయభిప్రాయము. విశేష మనఁగా నొకపదార్థమునకు మరియొకపదార్థమునుండి భేదమును గలిగించునతిశయము. వీనికి మితి లేదు. సామాన్యమనఁగా జాతి. యిదియు పరాపరభేదములచే రెండువిధములు. అనేకపదార్థములయందువ్యాపించి యున్న గోత్వము మొదలగుజాతి పరజాతి ఒకతెగయందు మాత్రమే వ్యాపించియున్ననీలగోత్వము మొదలగుజాతి యపరజాతి సమవాయ మనఁగా నిత్యసంబంధము అభావము (౬౧౯-వ పుట చూడుడు.)

‡ భావపదార్థము లనఁగా ఉనికి గలపదార్థములు.

వారు ఈమూరుభావపదార్థములకును బ్రత్యేకముగ లక్షణము లను జెప్పుదురు. వీనిఁ బరస్పరభిన్నములనుగాఁ గూడ నంగీకరింతురు. ఇట్లంగీకరించియు ద్రవ్యభిన్నము లగునైదుపదార్థములను ద్రవ్యపరతం త్రములను గాఁ జెప్పుదురు ఇట్లగుటచే వారిమతము విరుద్ధ మగును.

ఆపదార్థములుఁ బరస్పరము భిన్నములే యగునేని ద్రవ్యాధీన ములు కాఁ గూడదు. గోవు మహిషము కుందేలు మొదలగునవి పర స్పరభిన్నములు ; పరస్పరాధీనములు కూడఁ గావు. దేనిస్వరూపము దా నికిఁ బ్రత్యేకముగ నిరూపింపఁ బడవచ్చును. ద్రవ్యగుణాదులవిషయము మాత్ర మట్టిదికాదు. ద్రవ్య ముండిననే కాని గుణము నిరూపింపఁ బడదు. ఆగుణమునకు స్వాతంత్ర్య మెప్పటికిని లేదు; కావున ద్రవ్య మొక్కటియే గుణాదిరూపములతోఁ దాదాత్మ్యసంబంధమున నున్నది యనియు, దానికే నామభేదములు కలిగె ననియు నంగీకరించిన సరిపడును గాని లే కున్న నీసిద్ధాంతము యుక్తము కానేరదు. ఇది వేదాంతసిద్ధాంతమేకదా!

'ఇట్లు కాదు అగ్నినుండి ధూమము జనించుచున్నది. అగ్నికంటె భిన్నమే యయ్యు నది యగ్నికి నధీనమైయున్నది. దానిని అగ్ని నాశ్రయించియే కదా తెలిసికొనవలయును' అనియెదవేమొ సత్యమే. అయినను అగ్నిధూమములు పరస్పరము భిన్నములై యుండుట స్పష్టము. వానిస్వరూపముల నిరూపింపవలసివచ్చినను స్వతంత్రము గనే నిరూపింపవచ్చును. ధూమస్వరూపనిరూపణమునకు వహ్ని నాశ్ర యింపవలసినపని కలదు కదా ! యనుట యనుభవవిరుద్ధము. ఇఁక ద్రవ్య గుణములనుఁ గూర్చి విచారించిన నట్లు సంభవింపదు. 'ఇది తెల్లగుడ్డ ఇది నల్లగుడ్డ' అను మొదలగువ్యవహారములను విమర్శించి చూచిన ద్రవ్య మొక్కటియే రూపభేదములతో నున్నట్లు స్పష్టముగఁ దెలియవచ్చు చున్నది. ఇట్లుండ ద్రవ్యగుణములకు భేద మెటనుండి వచ్చును 'భేదవ్యవ హారము కలదు కదా' అనియెదవేమొ అది యజ్ఞానముచేఁ గలుగవచ్చు ను. గుణగుణులకు గలభేద మనిర్వచనీయ మని యిదివఱకే చెప్పి యు న్నాము. కావున నెట్లును ద్రవ్యగుణములకుఁ గాని ద్రవ్యమునకును కర్మా దులకునుగాని భేద ముండుటకు వీలు లేదు. ఇట్లంగీకరింపకున్న వైశేషి కమతము నిరాధార మగును. ; అంగీకరించిన నదియు వేదాంతమతమే యగును.

'ఇట్లు కాదు. గుణాదులకు వైశేషికులు తాదాత్మ్యసంబంధము తో ద్రవ్య పరతంత్రత్వముఁ జెప్పరు. వారిమతమున నయుతసిద్ధి (ఒక్క స్థానమునందే యేకాకారముతో నుండుట.) యనునది యొక్కటి కలదు. దానివలననే ద్రవ్యమునకు గుణాదులు పరతంత్రములై యున్నవి' అనియె దవేమొ వినుము. అయుతసిద్ధి యనఁగానేది? ఒక్కస్థలమున నుండుటయా ఒక్కసమయమున నుండుటయా? లేక ఒక్కస్వభావముతో నుండుటయా? ఈమూఁడుపక్షములలో దేని నంగీకరించినను వారిమతము నిలువదు.

మొదటిపక్షము నాశ్రయించిన వారిసిద్ధాంతమునకే విరోధము వచ్చును. వారు 'కారణపదార్థములు కార్యము నుత్పత్తిఁజేయును; కారణగుణములు కార్యగుణముల నుత్పత్తిఁ జేయును' అని చెప్పుదురు. ఇట్లయిన దారములనుండి పుట్టినవస్త్రము దారములయం దుండును; పటము నందలి రూపము మాత్రము దారములయం దుండదు. ఆ రూపమువస్త్రముయొక్క గుణమే కాని దారములయొక్కగుణము కాదు.కదా!ఇప్పుడు వస్త్రమునకును దానిగుణ మగుశుక్లరూపమునకును స్థలములు భిన్నములై యున్నవి కదా! వానికి నయుతసిద్ధి యెక్కడనుండి వచ్చును ? రాకున్న శుక్లరూపము వస్త్రమునకు నధీన మగుట యెట్లు సంభవించును? ఈకారణమువలన మొదటిపక్షము నాశ్రయించుటకు వీలు లేదు.

ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నంతకంటె హాస్యాస్పద మగు విషయమే వేఱొక్కటి యుండదు. గోవునకు కొమ్ములు రెండు నొక్కకాలమునందే జనించును మఱియు నొక్కకాలమునందే యనేకజంతువులు జనింపవచ్చును. ఇంతమాత్రమున నవియన్నియు పరస్పరపరతంత్రము లగుటకు వీలు లేదు. కదా!

ఇఁక మూఁడవపక్షము నాశ్రయించిన నప్పుడు ద్రవ్యమునకును గుణాదులకును స్వరూపభేద మేసంభవింపదు. లోకమునందును అవి రెండు తాదాత్మ్యసంబంధముతోనే కానవచ్చుచున్నది. సమవాయసంబంధ మనునది లే దని యిదివఱకే నిరూపించి యున్నాము. ఇట్లు తాదాత్మ్యమునే యంగీకరించిన వారిమతము బొత్తుగనే నిలువదు కదా! కావున నేపక్షము నంగీకరించినను వారికి ననర్థమే.

మఱియు వారు సంయోగసమవాయము లని రెండుసంబంధముల నంగీకరింతురు, అందు సంయోగ మనిత్య మనియు సమవాయము నిత్య

మనియు నంగీకరింతురు. ఏపదార్థములు భిన్నాకారములు కలవియై ఘట ములో నున్ననీటివలె పరస్పరము సంబంధించియుండునో వానిసంబంధము సంయోగ మందురు. భిన్నాకారము లేక నొకదానితో మఱియొకపదార్థము సంబంధించియుండెనేని దానికి సమవాయసంబంధ మని పేరుఁబెట్టుదురు. కార్యకారణములకును అవయవావయవులకును గల సంబంధము సమవాయమనియే చెప్పుదురు. ఈసిద్ధాంత మంతయు యుక్తిశూన్యము.

కారణ మున్నప్పుడు కార్యము లేదు. కారణమునుండియే కదా కార్యము జనింపవలయును. ఇట్లుండఁ గారణకార్యములకు నిత్యసంబంధ మెట్లు కుదురును? 'కార్యమునకుఁ గారణముతో నిత్యసంబంధము కలదు గాని కారణమునకులేదు' అనియెదవేమొ అదిమాత్ర మెట్లుసంభవించును? సంబంధము కలుగవలయు ననిన రెండుపదార్థములు మొట్టమొదట సిద్ధించి యుండవలయును. ఇచ్చట కార్యమునుఁ గూర్చి విచారించిన నది లేదు కదా! "కార్యము సిద్ధి నొందినపిదపనే కారణముతో సమవాయము నొందవచ్చును' అనియెదవేమొ అదియు యుక్తనుకాదు. కారణ సంబంధము లేకపూర్వమే కార్య మెట్లు స్వతంత్రముగ సిద్ధింపగలదు.? అట్లు సిద్ధించిన నికఁ బరస్పరసంబంధముతోఁ బని యేమి? మఱియు నప్పుడు కలుగుసంబంధము సమవాయ మెట్లగును? ఆకారశూన్యమై యొకపదార్థము మఱియొకపదార్థముతో సర్వకాలములయందును సంబంధించి యుండుటయే కదా! సమవాయసంబంధము. కావున నెట్లును వైశేషికవాదము దుర్వాదమే. యెంతవిచారించినను అయుతసిద్ధి యనునదియే యుండుటకు వీలు లేదు.

మఱియు 'సంయోగసమవాయములకుఁ గలభేదము లోకమునఁ బ్రత్యక్షముగనే యున్నది. ఒకవృక్షముపైఁ బక్షి వ్రాలిన నది సంయోగము. దారములకును వస్త్రమునకునుఁ గలసంబంధ మిట్టిదిగఁ గానవచ్చుట లేదు కదా!' అనియెదవేమొ యదియు సరి కాదు. వైశేషికులు ఉత్పత్తి యైనపిదపఁ గార్యము స్వరూపశూన్యమై యొక్కక్షణమందు నని యంగీకరింతురు; అప్పుడు దానికి నాకాశాదులతోఁ గలసంబంధము సంయోగమే కాని సమవాయము కా దందురు. మఱియు నొకసంయోగమువలన మఱియొకసంయోగముఁ గూడఁ గలుగు నందురు. చేతితో వృక్షమును స్పృశించినపుడు శరీరమునకుఁ గూడ సంయోగము

నొందినవాఁడే యగు నని చెప్పుదురు. ఈరెండుసిద్ధాంతములను పట్టి చూచినఁ గారణకార్యములకుఁ గలసంబంధము కూడ సంయోగమే కావలసివచ్చును. ఆకారము లేనిద్రవ్యము లొకదానితో సంయోగ సంబంధము గలిగి యుండు ననిన మఱియొకదానితో నేల కలిగి యుండదు? దారములును బరస్పరము సంయోగమును జెందినప్పుడు ఆసంయోగ మువలన నందు వస్త్రమునకుఁ గూడ సంయోగమే కలుగవలసి వచ్చును. ఒకచోటఁ జేయఁబడినసిద్ధాంతము మఱియొకస్థలమునకు నేల పనికి రాదు. దారములకంటె వేఱుగ సాకారముగాఁ గాని నిరాకారముగఁ గాని వస్త్ర మనునది యుండుట యప్రత్యక్షము కదా! కావున నెట్లును గార్యకార ణములకు సంబంధమును నిరూపించుటకు వీలు లేదు. సంయోగసంబం ధము నంగీకరింపఁ బోయినను వారిసిద్ధాంతము నాశ్రయించి చూచినను లోకప్రసిద్ధి ననుసరించి చూచినను కారణమునకంటె ముందుగాఁ గార్య మెట్లు సిద్ధించును? సిద్ధింపకున్న సంబంధ మెట్లు కలుగును? కావున నెట్లు విచారించినను గార్యకారణములకు భేదమే యుండుటకు వీలు లేదు. అవ శ్యముగ వానియందుఁ గానవచ్చుభేదము భ్రాంతిమాత్రమే యని తీర వలయును.

ఇంతయేల? సంబంధమును గూర్చి ప్రశ్నోత్తరములఁ జేయవల సినపనియే లేదు. సంబంధము గలపదార్థములకంటె భిన్నమగుసంబంధమే లేదు; అట్లుండుటకును వీలు లేదు. 'లోకవ్యవహారము కలదు కదా?' యనియెదవేమొ యది భ్రాంతిమూలము కావచ్చును; అంతమాత్రమున సంబంధిభిన్నముగ సంబంధము కలదని చెప్ప నక్కఱ లేదు; దానికి లక్ష ణములఁ గూడఁ జెప్ప నక్కఱలేదు. లోకమునఁ బురుషుఁ డొక్కఁడే యయ్యును గల్పితభేదములచే బ్రాహ్మణుఁడు యౌవనవంతుఁడు వృద్ధుఁడు తండ్రి పుత్రుఁడు మనుమఁడు అల్లుఁడు మిత్రుఁడు శత్రువు అనునానా నామభేదములతో వ్యవహరింపఁబడుచున్నాఁడు కదా. ఇట్లే పరస్పరసం బంధముఁ గలకార్యకారణాదులుఁ గూడ వాస్తవభేదము లేకున్నను వాస్తవముగ సంబంధించుట యనునదియే లేకున్నను గల్పితభేదము నాశ్రయించి సంయోగసమవాయాదిశబ్దములచే వ్యవహరింపఁ బడుచు న్నవి యనవచ్చును. కావున నెట్లును సంబంధిపదార్థములకంటె భిన్న ముగ సంబంధమే లేదు.

'ఇట్లయిన సంబంధవాచకపదములు కేవలము సంబంధులనుఁ గూర్చియే ప్రవర్తించిన సర్వకాలములయందును సంబంధ ముల్లే యుండ వలసి వచ్చును. సంబంధులు నిత్యములు కదా! మీమతమున (వేదాంత మతమున) దీనికిని నాశము లేదు కదా!' అనియెదవేమొ దానికి నిదివఱకే సమాధానము చెప్పఁబడెను. కల్పితభేదము నాశ్రయించి యీసంబంధ వ్యవహారముఁ గలుగవచ్చును. వాస్తవస్థితిలో నెందును భేద మనునదియే యుండ దని యిదివఱకే నిరూపించి యున్నాము కావున భేద మంతయుఁ గల్పితమే జనులు పదార్థమును స్వస్వరూపముతోఁ జూచునప్పుడు సంబంధ వ్యవహారము నాచరింపరు; అట్లు చూడలేనప్పుడు అనిర్వచనీయభేద ముతో సంబంధమును వ్యవహరింతురు. ఇందు విరోధమేమి?

మఱియు వైశేషికమతమునఁ బుణ్యపాపసహాయుఁ డగుజీవునకునుఁ బరమాణువులకును మనస్సునకును సంయోగము కల దని యంగీకారముఁ గలదు. అదియు సంభవింపదు. ఇందు నాత్మకుఁ ప్రదేశము లేదు. అతఁడు సర్వవ్యాపకుఁడు కదా! ఆతనితో సంబంధము కలవి యగునేని పరమాణువులును మనస్సును గూడ మహత్పదార్థములే కావలసివచ్చును. ఇది విరుద్ధము కదా! 'ఆత్మకు ప్రదేశములఁ గల్పించెదను' అనియెదవేమొ అప్పుడు నేనును (వేదాంతియును) ద్రవ్యాదిపదార్థము లాఱింటి కంటె నధికముగ వేనవేలుపదార్థములను యథేచ్ఛముగఁ గల్పింపవచ్చును. లేని వానినిఁ గల్పింపఁ బూనిన నియమ మెచ్చట నున్నది. దయామయుఁడగు నొక్కపురుషుఁడు 'దుఃఖరూప మగుసంసార మెవ్వరికిని లేదు' అని సిద్ధాంతముఁ జేయవచ్చును; దుఃఖితుఁ డగుమఱియొక్కఁడు ముక్తి యనునది యే లే దని చెప్పవచ్చును. ఎవ్వనికి నే దేది యిష్టమో వాఁ డట్లు చెప్ప వచ్చును. వానిని నివారించువాఁ డెవ్వఁడు. అట్లు నివారించుటకునుఁ గారణ మేమి యుండును?

వేదాంతులును నిత్యశుద్ధుఁ డగునాత్మునియందు జీవత్వాదులనుఁ గల్పించుచున్నారు కదా!' అనియెదవేమొ అది లేనివానినిఁ గల్పించుట కాదు. లోకప్రసిద్ధి నాశ్రయించి చూచిన నాజీవత్వాదులుఁ గానవచ్చుచున్నవి. కావునను అపౌరుషేయ మగువేదమును విమర్శించిన నాజీవత్వాదులు (పారమార్థికములు కా వని స్పష్ట మగుటచేతను వానిని (జీవత్వాదులను) కల్పితము లని వారు (వేదాంతులు) నిశ్చయించిరి. ఇందు దోష మెట్లు వచ్చును?

మఱియు నావైశేషికులు పరమాణువులు నిరవయవము లనియు వానిసంయోగముచే ద్వ్యణుకము జనించు ననియు నది యేకపదార్థమే యగు ననియుఁ జెప్పుదురు; పరమాణువులు అప్పటికిని పరస్పరభిన్నము లయ్యే యున్నను త్రాటిచేఁ గట్టఁబడినపదార్థములవలెఁ బరస్పరముఁ జేరి యుండు నందురు. ఇట్లుండక పోయినచోఁ గారణకార్యములకుఁ బరస్పర సంబంధము కలుగుటకు వీలులేదు కావున నావశ్యముగ సమవాయమునుఁ గల్పింపవలసినదే యని కూడఁ జెప్పుదురు. ఇది యెట్లు సంభవించును? పరమాణువు లాకాశతుల్యము లై యుండ వానితో నితరపదార్థమునకు సంబంధ మెట్లు కలుగును? త్రాటితోఁ గట్టఁబడినవానివలె (నాపరమాణు వులుండుట యెట్లు సంభవించును? సమవాయసంబంధము నంగీకరించినను ఈదోషము పోదు. ఆసంబంధమునకు నన్యోన్యాశ్రయదోషముఁగలదు. రెండుపదార్థము లొకదాని నొకటి సర్వకాలము నాశ్రయించి యుండినం గాని సమవాయసంబంధ ముండదు; సమవాయసంబంధ ముండిననేకాని యట్లు రెండుపదార్థము లొకదాని నొకటి యాశ్రయించి యుండుట తట స్థింపదు. సబంధమునకు భేదము కావలయును కదా! కావున నెట్లును ఈమతము యుక్తము కాదు.

'ఇట్లయిన నీదోషము వేదాంతమతమునందునుఁ గలదు. పరమే శ్వరుఁడు నిర్వికారుఁ డైనను నాతనినుండి సవికార మగు ప్రపంచము జనించు ననియు నాప్రపంచ మాయనయందే స్థితికాలమున నిలుచు ననియు వారు చెప్పుదురు కదా' అనియెదవేమొ అందు దోష మేమియు లేదు. వేదాంతమతమునఁ 'గారణమే స్థితిభేదముతోఁ గార్యరూపముగఁ గాన వచ్చుచున్నది. అది భ్రాంతి' అనుటయే సిద్ధాంతము కావున నామతమున నేదోషంబును రాదు. వారికి సమవాయసంబంధము కాని భేదము కాని సమ్మతమే కాదు కదా!

మఱియొకవిశేషము వారు పరమాణువుల నంగీకరింతురు కదా! అవి పరిచ్ఛిన్నములా? లేక సర్వవ్యాపకములా? పరిచ్ఛిన్నము లగునేని ఘటాదులవలె నవియు నవయవయుక్తములు కావలయును. ఎనిమిది యని కాని పది యని కాని చెప్పఁబడుచున్నదిక్కులు వానికి నవయవములే యగును. అప్పుడు 'పరమాణువులు నిరవయవములు; నిత్యములు' అను సిద్ధాంతమునకు భంగమువచ్చును. సర్వవ్యాపకములేయైనచో నాకాశా

దులకువలె వానికిని బ్రమాణ మధిక మగుటచే వానినుండి యల్పవస్తు వులు జనింపకుండదు; అవి యధికసంఖ్య గలవిగా నుండుటవలనఁ గూడ బ్రయోజనము లేదు. కావున బాగుగ విచారించిన మొట్టమొదటఁ బర మాణువులు కల వనుమాటయే నిరాధార మగును.

'ఇట్లు చెప్ప నేల? యాపరమాణువులకు నెట్లును నాశము కలుగు టకు వీలు లేదు. తద్భిన్నము లగుజగత్కారణములే లేవు. కదా' అని యెదవేమొ ఇట్లు చెప్పుటకు వీలు లేదు. ఆపరమాణువులకు మాత్రము వినాశ మేల లేదు? సూక్ష్మము లగుటచేతనా? లేక నిరవయవము లగుట చేతనా? ఇందు మొదటిపక్షము సరి కానేరదు. స్థూలసూక్ష్మము లకు నన్ని టికిని వినాశము కలుగుచునే యున్నది. భూమికిని దానిలోని సూక్ష్మావయ వము లగు రేణువులకునుఁ గూడ వినాశ ముండ సజాతీయములే యగుపర మాణువులకు మాత్ర మేల లేకపోవును? ఇక రెండవపక్షము నాశ్రయిం చిన నదియు యుక్తము కానేరదు. వినాశమునకు నవయవవిభాగము మాత్రమే కారణము కానేర దనియు అంతకంటె నితర మగుకార ణములే దనుట యుక్తిశూన్య మనియు నిదివఱకే చెప్పియున్నాము (చూ. ౨. ౨. ౧౫.) పిండిముద్ద యవయవవిభాగము లేకయే మర్దనా దులచే నభివృద్ధియై రొట్టెయగుచున్నది. ఘృతసువర్ణాదులును అవయవ సంయోగమును విడువకయే ద్రవ మగుచున్నవి. కావున ద్రవభావమును పొందుటచే సువర్ణాదులకాఠిన్యమవయవవిభాగశూన్యముగానే యెట్లు నశిం చుచున్నదో అట్లే యీపరమాణువులు గూడ మూలకారణ మగు బ్రహ్మ మున నిలచి యవయవవిభాగము లేకున్నను నశింపవచ్చును. కావున ని రవయవత్వమున్నది యని యంగీకరించినను పరమాణువులకు వినాశము లేకపోదు.

మఱియు కార్యోత్పత్తి కూడ నవయవసంయోగమువలన మాత్రమే కలుగవలయు ననునియమము కూడ సంభవింపదు. సువర్ణమునుండి భూషణములు జనించునప్పు డవయవసంయోగ మెక్కడిది? ఎప్పటికిని సువర్ణము సువర్ణముగనే యున్నది కదా! పాలు పెరుగుగా మారునప్పు డును నీరు మంచుగా మారునప్పుడును అవయవసంయోగ మెక్కడిది. కావున వైశేషికతర్కమున నింత యైనను బలము లేదు.

ఇట్లు నిస్సార మగుతర్కముునే యాధారముగ గొని యుండుట చేతను శ్రుతివిరుద్ధ మగుటచేతను వేదవేత్త లగుమహానుభావులచే నంగీకరింపఁబడకపోవుటచేతను ఈవైశేషికమత మాదరణీయము కాదు. దీని నాశ్రయించిన ముక్తి దొరుకదు.

---

## సముదాయాధికరణము. ౪.

సంగతి:—పై యధికరణమున వైశేషికమతము నిరాకరింపఁబడెను. వారు ద్రవ్యాదిపదార్థషట్కము నంగీకరించి యందునుఁ గొన్ని సత్యములనియు మఱికొన్ని యసత్యములనియు (యుక్తిశూన్యముగ) జెప్పుదురు. ఈకారణమువలన వారు అర్ధవైనాశికులు (కొన్నిటియందు మాత్రము వినాశము నంగీకరించువారు.) మఱియు వారిమతమున 'దేహము మొదలగుభౌతికములు కూడ పరమాణుసంయోగవియోగములచే క్షణక్షణములకు వృద్ధిక్షయముల నొందుచుండును' అను సిద్ధాంతముఁ గూడఁ గలదు. ఇదియు వినాశమే యని వారియభిప్రాయము. కావున నీయర్ధవైనాశికుల ఖండించునప్పుడు బౌద్ధులు జ్ఞప్తికివత్తురు. వారు సర్వపదార్థములును అనిత్యములనియే శూన్యము లనియే చెప్పువారు. కావున నీసంబంధము ననుసరించి (జ్ఞప్తికి నచ్చుట యనుసంబంధము ననుసరించి) బౌద్ధమతము ఈక్రింది రెండధికరణములచే నిరాకరింపఁబడుచున్నది.

విషయము:—సౌత్రాంతికవైభాషికమతములు ఈయధికరణమునకు విచారవిషయములు.

మతస్వరూపము:—సర్వంబును శూన్య మనుటయే బౌద్ధుల పరమసిద్ధాంతము. బుద్ధదేవుఁడు ఈసిద్ధాంతమునే శిష్యులబుద్ధి ననుసరించి నాలువిధములుగ నుపదేశించెను. కొందఱకు బాహ్యాంతరపదార్థములు సత్యము లని చెప్పి వానియందు క్షణికత్వమును సాధించి క్రమక్రమముగ శూన్యతత్వమునందు నిలుకడఁ గలిగించెను. మఱికొందఱకు జ్ఞానము మాత్రమే సత్య మనియు తక్కినవి శూన్యము లనియు చెప్పి యాజ్ఞానమునందును క్షణికత్వమును సాధించి క్రమక్రమముగ శూన్యతత్వమును బోధించెను. అంతకంటెను సూక్ష్మబుద్ధి గలవారలకు మొట్టమొదటనే

శూన్యతత్త్వమును ప్రకటించెను. మఱియు 'సర్వపదార్థములును సత్య ములే క్షణికములే అని యుపదేశింపఁబడినవారిలోఁ గూడ రెండు తెగలు కలవు. ఆబుద్ధదేవుఁడే ప్రపంచాసత్యత్త్వమును బోధించుటకై "బాహ్యా పదార్థములు సంపూర్ణముగ నసత్యములు" అనిన గ్రహింపలేనిస్థితిలో నుండి "సర్వమును సత్యమే" అనువిషయము నంగీకరించుస్థితి నతిక్ర మించి యున్న వారలకు మఱియొకవిధముగ నుపదేశించెను "ప్రపంచము సత్యమే బాహ్యాపదార్థములు సత్యములే అయినను అవి యాత్మయందే కలవు. ఆత్మయందు తోఁచి ప్రత్యక్షములై తద్బలమున బాహ్యమున ప్రత్యక్షములుగ దోఁచుచున్నవి" అని బోధించెను. ఇట్లగుటచే వారి మతము నాలుగు తెరంగులై యున్నది. ఇందు మొదటివారు వైభాషి కులు రెండవవారు యోగాచారులు మూఁడవవారు మాధ్యమికులు కట్ట కడపట వర్ణింపఁబడినవారు సౌత్రాంతికులు. ఇందు వైభాషిక సౌత్రాం తికమతములకు గలభేద మత్యల్ప మగుటచేతను ఇరువురకును బాహ్యాం తరపదార్థములు సత్యములే యగుటచేతను వారిమతములు రెండు నేకము గావించి సూత్రకారు డీయధికరణమున నిరాకరించుచున్నాఁడు.

వారు భూతభౌతికములను బాహ్యాపదార్థము లనియు చిత్తచై త్రముల నాంతరపదార్థము లనియుఁ జెప్పుదురు. వారిమతమునఁ బృథి వ్యప్తేజోవాయువులు భూతములు. ఆకాశము లేదు. ఈభూతములు పర మాణువులవలన జనించును. పృథివీపరమాణువులకు కాఠిన్యంబును జలపర మాణువులకు స్నేహంబును (స్నేహమనఁగాఁ జూర్ణము ముద్ద యగుటకు ననుకూల మగుగుణము=జిగురు.) తేజఃపరమాణువులకు వేడిమియు వాయు పరమాణువులకుఁ జాంచల్యంబును స్వభావములు. ఈభూతములవలననే దేహాదిభౌతికపదార్థములు జనించుచున్నవి. ఇఁక నాంతరపదార్థములు నిట్లే యైదుస్కంధములచేఁ గలుగుచున్నవి. రూపస్కంధము, విజ్ఞానస్కం ధము వేదనాస్కంధము సంజ్ఞాస్కంధము సంస్కారస్కంధము అనునివి పంచస్కంధములు. అందు శబ్దస్పర్శాదులును వానిని గ్రహించునింద్రియ ములునుఁ గలసి రూపస్కంధము. ఇంద్రియములు భౌతికము లగుటచే బాహ్యాపదార్థములందే చేర్పఁబడవలసినవి యైనను శరీరముతోను నాత్మ తోను సంబంధము కలవి కావున నాంతరపదార్థములలోఁ జేర్పఁబడెను. 'నేను నేను' అని యెడతెగక లోలోన నుదయించుచుండుజ్ఞానము విజ్ఞాన స్కంధము వారిమతమున నిదియే యాత్మ ఇదియే చిత్తము. ఇది సర్వ

పదార్థములను గ్రహించునది యగుటచే కారణపరంపరలోఁ జేరదు. సుఖ దుఃఖములు గలిగినప్పుడు చిత్తమునందు జనించువికారములు వేదనాస్కంధము 'గోవు అశ్వము' అను మొదలగు నామభేదములచేఁగలుగు *సవికల్పజ్ఞానములు సంజ్ఞాస్కంధము రాగద్వేషాదులును ధర్మాధర్మములును సంస్కారస్కంధము.

మఱియు వారిమతమున నన్నిపదార్థములతోఁ బాటు విజ్ఞానస్కంధరూపుఁ డగునాత్మయును క్షణికుఁడే. దుఃఖరూప మగునీప్రపంచము నెఱుంగలేక దీనియందే యజ్ఞానమువలనఁ జిక్కియుండుట యాతనికి బంధము 'సర్వము దుఃఖరూపము క్షణికము. ఒకదానితో నొకదానికి సంబంధము లేదు. ఇంతయేల సర్వమును శూన్యమే' అని దృఢభావన నాచరించునేని నాయాత్మయు సర్వముతోఁ బాటు శూన్యరూపుఁడే యగును; అట్లుఁ గాకున్నను విషయసంబంధమును వదలి శుద్ధుఁడగును. (అనఁగా : వారలకు నాత్మ క్షణికుఁడే కావున భావనాబలముచే విషయసంబంధము పోయె నేని యప్పుడు విషయసంబంధశూన్య మగుక్రొత్త జ్ఞానపరంపర యారంభమగును.) ఇదియే వారికి ముక్తి. ఇందు క్షణికాది భావనలను వైభాషికాదులు వారివారిమతములకు ననుకూలముగ నంగీకరింతురు. నలువురును 'సర్వం క్షణికం సర్వం దుఃఖం సర్వం స్వలక్షణం (స్వలక్షణ మనఁగా తనకుఁ దానే యుపమాన మగునది. అనఁగా : లోకమున నొకపదార్థమునకుఁ దుల్యముగ మఱియొకపదార్థ ముండదనుట') అనుభావన నాచరించుటయే మోక్షసాధన మందురు. మాధ్యమికులు మాత్రము ప్రపంచసత్యత్వమును బొత్తుగనే యంగీకరింపరు కావున 'సర్వం శూన్యం శూన్య' మనుభావనయే ముక్తిసాధన మందురు. వీరిమతముననే యాత్మనాశము ముక్తి.

ఇందు వేదాంతసమ్మతములు:—వీరు ఆత్మ గ్రహించువాఁడనియుఁ బ్రపంచము గ్రహింపఁబడునది యనియుఁ జెప్పుదురు. ప్రపంచము దుఃఖరూప మనియుఁ బుణ్యపాపములుఁ గల వనియు ధర్మాచరణము ముఖ్యమనియు యమనియమాదుల నాచరింపవలయు ననియుఁ జెప్పుదురు. దుఃఖరూపము కావున ప్రపంచమూ నాదరింపరాద నియుఁ జెప్పుదురు, ఇవియన్ని

*సవికల్పజ్ఞాన మనఁగా 'ఇది ఈపదార్థము' అని (నామరూపభేదములతోఁ) గలుగు జ్ఞానము.

యు వేదాంతులకు సమ్మతములే. ఇదివఱకు వీరిమత మింతె వైనను అను వాదపూర్వకముగ ఖండింపఁబడలేదు.

## సూత్రములు ౧౮.

అవతారిక:—అందు పరమాణువులవలనఁ గాని స్కంధములవలనఁ గాని సృష్టి యగుటకు వీలు లేదని చెప్పుచున్నాఁడు.

## ౧౮౯. సముదాయ ఉభయహేతుకే ఽపి తదప్రాప్తిః. ౨. ౨. ౧౮.

తాత్పర్యము:— ఈబౌద్ధమతము వేదాంతులకు బొత్తుగనే యంగీకరణీయము కాదు. వీరు పరమాణువులసముదాయమువలన బాహ్యపదార్థములును స్కంధసముదాయమువలన నాభ్యంతరపదార్థములును గలుగు నందురు కాని ఆయుత్పత్తి మాత్ర మెట్లును సంభవింపదు. అవి యన్నియు నచేతనములే కదా! వానికి స్వాతంత్ర్యముతో సముదాయమగుసామర్థ్య మెటనుండి వచ్చును?

'చిత్తము (వారిమతమున విజ్ఞానస్కంధమునకే చిత్త మనిపేరు.) చేతనము కదా! విషయములఁ జూడగనే యది ప్రజ్వలించును ; అచేతనముల నాశ్రయించి యథేచ్ఛముగ సముదాయమును గల్పించును' అనిన నది యుక్తము కానేరదు. సముదాయ మేర్పడిన పిదప కాని దానికిఁ బ్రకాశము లేదు కదా! పరమాణ్వాదులే తత్ప్రకాశ హేతువు లగుటకు వీలు లేదు. సామాన్యముగ భోగ్యవిషయములఁ జూచియే చిత్తము ప్రవర్తించును; పరమాణ్వాదులు సముదాయము కాకపూర్వము భోగ్యములు కావు కదా! 'ఆచిత్తమే పూర్వప్రకాశము నాశ్రయించి యుత్తరసముదాయముఁ గలిగింపఁగూడదా' అనియెద వేమొ అప్పుడు స్వసిద్ధాంతమునకే విరోధము వచ్చును. వారిమతమునందు అన్నియు క్షణికములే కదా! వెనుకటిప్రకాశము భవిష్యత్కాలమునఁ గార్యకారి యెట్లగును? వారికి నిత్యుండును చేతనుఁడు నగునాత్మ లేఁడు. అట్టివాఁ డుండిన నాతఁడు సర్వసంస్కారములకు నాశ్రయుండై పరమాణువులవలనఁ గాని మఱియొకదానివలనఁ గాని యథేచ్ఛముగఁ గార్యోత్పత్తి నాచరింపఁ గలుగును

'ఇట్లుచెప్పనేల? పరమాణ్వాదులే స్వయముగఁ బ్రవర్తించు ననిన దోష మేమి అనిన నప్పుడు ప్రళయమే. లేకపోవలసినచ్చును. మఱియు వారంగీకరించు విజ్ఞానము చేతనముయ్యు నిష్ప్రయోజన మగుచున్నది. అది క్షణిక మందురు. క్షణమునకే నశించుపదార్థము అచేతనములచేఁ గార్యము నెట్లు సేవింపగలదు. క్షణికము కాదనిన నప్పుడు ఆత్మయే యంగీకరింపఁ బడిన ట్లగును. నామము మాత్రమే భిన్నము గాని స్వరూపము భిన్నము కానేరదు. కదా! మఱియు నొకకార్యము నాచరింపవలయు ననినఁ గర్త యాకార్యమునకు నాధారభూతుండు గాను కారణభూతుండుగను నుండవలయు ననుట నియమము. సర్వంబును క్షణికమే యైన నిది యెట్లు నిలుచును? వ్యాపారంబునుఁ గర్తయు నప్పుడు (క్షణిక సిద్ధాంతమునందు) ఒక్కసమయమునందే యుండవలసినవార లగుదురు కదా! 'ఇట్టివారికిఁ గార్యకారణభావ మెచ్చటను గానవచ్చుట లేదు. కావున నీసిద్ధాంతము ప్రత్యక్షవిరుద్ధము.

ఇట్లగుటచే నెట్లును బౌద్ధమతమున బరమాణ్వాదులు సముదాయము లగుటకే వీలులేదు. అట్లు లేకున్నఁ బ్రపంచవ్యవహారమే జరుగకూడదు. సర్వవ్యవహారంబును భూతభౌతికాదుల నాశ్రయించియే కదా ప్రవర్తించుచున్నది. ఇంతకంటె విరుద్ధ మేది కావలయును ?

## సూత్రము. ౧౯.

అవతారిక:—ఇట్లు కాదు. అనుభవించువాఁడు కాని నియమించువాఁడు కాని యగు॥చేతనుఁడు లేకున్నను భూతభౌతికాదులు జనింపవచ్చును.లోకమున అవిద్యవలన ధర్మాధర్మరూపసంస్కారములు కలుగుచున్నవి. వానివలన నామరూపాదులు జనించుచున్నవి. వానివలన నుత్తరజన్మంబును మఱల నవిద్యయు నసునివి యేకమువలె దిరుగుచున్నవి. పరమాణ్వాదులసముదాయము లేకుండుటచే నివి సంభవింపనేరవు కదా! కావున వీని పరంపరచేతనే సముదాయము స్వయముగ సిద్ధింపవచ్చును. విత్తనమునుండి మొలకజనించునప్పుడు ఆవిత్తనమునందుఁ జైతన్యము కానరాలేదు. దానికి నేను మొలకను బుట్టించుచున్నాను, అనుజ్ఞానము లే దనుట స్పష్టము. మఱియు, పృథివ్యాదులును నావిత్తనమునకు బహువిధముల సహాయముఁ గావించుచున్నవి. వానికిని అట్టిజ్ఞానము లే దనుట స్వభావసిద్ధము. శరీరంబును బీజమునుండి పుట్టుమువలె పరమా

ణుసముదాయమునుండి లేక భూతములనుండి జనించుచున్నది. ఇట్లగుట
చే నాపరమాణువులకుఁ గూడ జ్ఞానము లేకపోవచ్చును. దేహమును బు
ట్టించుటయందు నీ యవిద్యాదులును బీజమునకు భూమ్యాదులవలె నా
పరమాణువులకు సహాయములు కావచ్చును. ఇందు విరోధ మేమి? ఇట్లు
సృష్టి యగుటకు వీలు కలిగిన లోకవ్యవహారము లన్నియుఁ జక్కగ ప్రవ
ర్తించును. ఇఁక విరోధ మేమి అనిన నీపక్షమును ఖండింపుచున్నాఁడు.

## ౧౯౦. ఇతరేతరప్రత్యయత్వా దితి చే న్నో త్పత్తిమాత్రనిమిత్తత్వాత్ ౨. ౨. ౧౯.

తాత్పర్యము:—ఈపక్షము యుక్తియుక్తము కాదు. అవిద్యా
దులు పరస్పరము కార్యకారణము లగుచున్న వనుట నిశ్చయమే; కాని
వానివలనఁ బరమాణ్వాదులసముదాయము జనించుట యెట్లు? ఆసము
దాయమునకుఁ దగినకారణ మేదియుఁ గానరాలేదు కదా!

'ఆయవిద్యాదులచేతనే సందర్భానుసారముగ సముదాయ మేర్పడ
వచ్చును అంటినికదా' అనియెదవేమొ యదియు సరికాదు. ఇం దభిప్రాయ
మేమి?పరమాణ్వాదులసముదాయము లేకున్న నవిద్యాదులకుఁ బ్రచార
ముకలుగదు కావున నాసంఘాత ముండవలయు ననియా? లేక నాయవి
ద్యాదులే ఆసముదాయముఁ గల్పించు ననియా?.

ఇందు మొదటిపక్షము యుక్తము కాదు. అప్పుడు సముదాయ
మే ముఖ్యము కావున దానికిఁ బ్రత్యేకకారణ ముండవలయును. పరమా
ణువులను నిత్యముఁ లని యంగీకరించినను వానియందు పరస్పర ముపకార
కత్వ ముండుటకు వీ లున్నను స్థిరుఁడై భోగముల ననుభవించుజీవుఁ డం
గీకరింపఁబడియున్నను వైశేషికమతమునందుఁ బరమాణుసముదాయ మే
ర్పడుటకు వీలు లేకపోయినది. ఇఁక నాపరమాణువులు క్షణమాత్రమునకే
నశించునవి యనిచెప్పుబౌద్ధమతమున నాసముదాయమునకుఁ గారణ
మెట్లు వచ్చును? క్షణికము లగుటచే నవి (పరమాణువులు) పరస్పర ముప
కారముఁ జేసికొను ననుటకుఁ గూడ వీలు లేకున్న సముదాయకారణ
మెటనుండి వచ్చును? పరస్పర ముపకారము జరుగవలయు ననిన నుపకర్త
(ఉపకారము చేయువాఁడు) ఉపకార్యము ... ఉండవలయును. అప్పుడు

గాని వర్తమానకాలమున నున్నపదార్థము వానినుండి యుపకారమును గ్రహింపలేదు. రెండును ఒకక్షణమునందే యుండుట తటస్థించినను ఉప కార్యము మాత్రము రెండుక్షణము లుండి తీరవలయును. అట్లులేకున్న దానియందుగానవచ్చుసామర్థ్యము స్వభావసిద్ధము పరోపకారజన్యము అని ఎట్లు తెలియును? స్వభావస్థితి యొకక్షణమునఁ గానవచ్చిననే కదా! యుప కారమువలనఁ గలిగినవిశేషము తెలియవచ్చుట. ఇదినియమము. మఱియు వారిసిద్ధాంతమున (బౌద్ధసిద్ధాంతమున) భోక్త యైనను స్థిరుఁడై లేఁడు. వాస్తవస్థితిలో నట్టివా రున్నను సముదాయోత్పత్తి కలిగినపిదపఁ గాని వానికి భోగము కలుగదు కావున సముదాయోత్పత్తికిఁ బ్రత్యేకముగఁ గారణ ముండవలసియే వచ్చును; ఒకచేతనుఁడు పరమాణువులనాశ్రయించి వానిమూలమున సముదాయమునుఁ గల్పించు ననవలయును. ఇట్లుండ వారిమతమున సముదాయోత్పత్తికిఁ గారణ మెటనుండి వచ్చును?

ఇట్లే రెండవపక్షముఁ గూడ సరిపడదు. అవిద్యాదులకు దేహాది రూపము లగుసముదాయములు లేకున్న నిలుకడ కలుగదు కదా! ఇట్లుండ నవి వానికే కారణము లె ట్లగును? మఱియు నవి యచేతనములే కదా! అచేతనములకుఁ జేతనసహాయము లేకున్న సముదాయ మేర్పడదు 'పృథి వ్యాదులు పరసహాయముతోఁ బని లేకయే పరస్పర మేకీభవించి బీజము నుండి వృక్షమునుఁ బుట్టించు చున్నవి కదా! అంకురోత్పత్తికిఁ బూర్వ క్షణముననే యవి పరస్పర మేకీభవించును; వెంటనే యంకురముఁ బుట్టిం చును అని యిదివఱకే చెప్పఁబడి యున్నది' అనియెద వేమొ అదియు సరి కాదు. చేతనసహాయము లేక నెప్పటికిని అచేతనములు కలిసికొన నేరవు. అట్లు కా నక్కఱ లే దని పట్టుఁ బట్టిన బొట్ట మొదలగువానియం దున్నవి త్తనములు కూడ మొలకల జనింపఁ జేయవలయును. ఏసహాయ ములేకయే యచేతనము స్వయముగఁ గార్యమును చేయఁగలుగు నేని యెప్పుడునుఁ జేయుచునే యుండవలయును. పృథివ్యాదిసహాయము కావ లయును కదా! యనిన నవిలేనిస్థల మెయ్యది? కావున వారిసిద్ధాంతము నను సరించిన నిట్టివిరోధము లనేకములు వచ్చును. చేతనుఁ డుండిన నిట్టివిరో ధము లెవ్వియు రావు. వీరును జ్ఞానము నంగీకరించినను అది క్షణిక మగు టచే దేనికినిఁ బనికిరాదు. ఈకారణమువలన నెట్లుఁ జెప్పినను అవిద్యాదు లవలనఁ గార్యముత్పత్తి కానేరదు.

'మఱియొకవిధముగాఁ జెప్పవచ్చును. ఈసంసారమున మొట్టమొదటినుండియు సముదాయములే యున్నవి. ఒకదానినుండి మఱియొకటి జనించుచుఁ జక్రమువలె తిరుగుచున్నది. వాని నాశ్రయించి యవిద్యాదులన్నియుఁ బ్రవర్తించుచున్నవి' అనిన నదియు విరుద్ధమే. ఇచ్చట నీయభిప్రాయమేమి? ఒకసముదాయమునుండి మఱియొకసముదాయము జనించునప్పుడు నియమముతో సమానరూపమైయ్యే జనించునా? లేక నియమశూన్యమై యథేచ్ఛముగ జనించునా? ఇందు మొదటిపక్షము నాశ్రయించిన మనుష్య పుద్గలము (స్కంధసముదాయము పుద్గల మని బౌద్ధులవ్యవహారము) సర్వకాలములయందును మనుష్యపుద్గలముగనే యుండవలసివచ్చును; కర్మానుగుణముగ పశుపక్ష్యాదిపుద్గలములుగఁగాని దేవాదిపుద్గలములుగఁగాని మాఱుటకు వీలులేదు. ఇదియు వారిమతమునకు విరుద్ధమే. వారిమతమునందునుఁ బుణ్యపాపములును జన్మలునుఁగలవుకదా! రెండవపక్షము నాశ్రయించిన మనుష్యపుద్గల మొకక్షణమున గజమై ఘీంకరింపవలసివచ్చును; మఱియొకక్షణమున దేవతయై భూమ్యాకాశమధ్యమున నిలువవలసివచ్చును. వారిమతమున నన్ని పదార్థములును క్షణమాత్రమునకే నశించును కదా! కావున నెట్లుచెప్పినను విరోధము తప్పక వచ్చును.

మఱియుఁ బుణ్యపాపములు సుఖదుఃఖములఁ గలిగించునప్పుడు వానికి సహాయము కావలయునా? యక్కఱ లేదా? కావలసియున్న నాతఁడు చేతనుఁడే కావలయును. లేకున్న గ్రుడ్డివాఁడు మఱియొకగ్రుడ్డివానికిఁ ద్రోవఁ జూపిన ట్లగును. అక్కఱ లేక పోయిన సర్వకాలములయందును సుఖదుఃఖములుఁ గలసియే యనుభవింపఁబడుచుండవలసివచ్చును. అప్పుడు పరస్పరవిరోధమువలన నేదియు సంభవింపక పోవలసివచ్చును. అట్లు కా నక్కఱ లే దని సాధించిననుఁ గర్మలకు ఫలములనియ్యక పూర్వము కొంతకాలము పరిపాకదశయం దుండుస్థితి లోకశాస్త్రప్రసిద్ధమై యున్నది. ఒకకార్యమునకై ప్రయత్నించువాఁడు కొంతకాలమువఱకు దానిఫలము ననుభవించుట లే దనువిషయము ప్రత్యక్షమే కదా! కావునఁ బుణ్యపాపములకు ఫలదానమున స్వాతంత్ర్యమే యుండె నేని యీపరిపాకావస్థ యుండక పోవలసినవచ్చును. ఇది విరుద్ధము కదా! పరిపాకము మాత్రము కావలసినదియే యనియెద వేమి ఏసహాయము నక్కఱ లేనిదానికి పరిపాకసహాయము మాత్ర మేటికి? కావున సర్వమును విరుద్ధమే.

మఱియు భోక్త యగువాఁడొక్కఁడు స్థిరుఁడై లేకపోవుటచే నీ సముదాయము సంభవింపదు. ఇది భోగార్థమైనదియే కదా! లోకానుభవముఁ బట్టి చూచిన భోగము లేనిపురుషుఁడే భోగార్థమై ప్రయత్నించుచున్నాఁడు; సాధనముల సంపాదించుచున్నాఁడు. ఇట్లే యీసముదాయములును భోగార్థము లగుటచే వీనికై ప్రయత్నించువాఁడు స్థిరుఁడుగనే యుండవలయును. అట్టివాఁడు వారిమతమున లేఁడు. ఇట్లే మోక్షార్థముగఁ బ్రయత్నించువాఁడును వారిమతమున లేఁడు. ఇట్లుండ సముదాయములు సంభవించుటవలనఁ గూడఁ బ్రయోజనమే లేదు. అవిద్యాదులకునుఁ బరస్పరకారణత్వ మున్నంతమాత్రమున సంఘాతము సిద్ధించుటకును వీలు లేదు. అవిద్యాదులు సముదాయమునకుఁ గారణములునుఁ గావు; అయినను అవి దాని నెవ్వరికై సృజించును. కావున నెట్లును వారి పక్షము యుక్తము కాదు.

## సూత్రము. ౨౦.

అవ:—ఇట్లు అవిద్యాదులవలన సముదాయము జనింప దని చెప్పి యిప్పుడు అవి తమలోఁ బరస్పరము కారణము లగుటఁ గూడ విరుద్ధమే యని నిరూపించుచున్నాఁడు.

## ౧౯౧. ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్.

## ౨. ౨. ౨౦.

తాత్పర్యము:—మఱియు వారు రెండవక్షణము జనింపఁగనే పూర్వక్షణము నశించు నందురు. కార్యము జనింపఁగనే పూర్వక్షణమున నున్నది యగుటచేఁ గారణము నశించు నందురు. ఈసిద్ధాంతము వలనఁ గూడ వారిమతము నిలువదు. ఎట్లనిన:—

వారిసిద్ధాంతము ననుసరించి చూచినఁ బూర్వక్షణము వినాశావస్థకు వచ్చినప్పుడు కాని కార్యము సంభవింప నేరదు కదా! వినాశావస్థలో నున్నపదార్థము మఱియొకదాని నెట్లు పుట్టింపఁ గలుగును? 'ఇట్లు కాదు కారణముయొక్క యునికి కార్యము జనించినప్పుడే కాని సార్థకము కానేరదు. ఈకారణమువలన నది వినాశావస్థఁ జెందకమునుపే యదికార్యకారి యగును' అనిన నదియు సరిపడదు. అప్పుడు కార్యకారణములకు

సంబంధ ముండవలసి వచ్చును. ఇది క్షణికవాదమునకు విరుద్ధము కదా! మఱియుఁ 'గార్యము జనించుటకుఁ గారణము చేయవలసినపని యేదియు లేదు. అది యుండిన నంతమాత్రమే చాలును. అది కారణ మగుటచేత తద్వినాశానంతరమునఁ గార్యము స్వతంత్రముగనే జనించును' అనిన నిదియు విరుద్ధమే లోకమునఁ గారణముతో సంబంధము లేనికార్యములు ఎచ్చటను లేవు. ఘటము మృదాత్మకముగఁ గానవచ్చుచున్నది కదా! 'అది కారణరూపత్వముఁ గాదు. కారణముతోఁ బోలికఁ గలిగియుండుటచేత మాత్రసే యట్లు గానవచ్చుచున్నది;' అనిన నప్పటికిని కారణధర్మము కార్యమున నించుకయైన నుండక తప్పదు. ఎంతయున్నను అది (కార్యము కారణముతో సంబంధించినదియే యగు నను టలో సంశయము లేదు కదా! ఇట్లు గాక కార్యకారణములకు స్వభావ సంబంధ మక్కఱ లేదనిన మృత్తికనుండి వస్త్రము కూడ జనింపవలసి వచ్చును. ఇది యత్యంతవిరుద్ధము కదా! కావున నెట్లుఁ జూచినను క్షణికవాదమున (ఉత్తరక్షణమున నున్నపదార్థము పూర్వక్షణమున నుండదు అనువాదమున) గార్యకారణభావము కుదురదు.

మఱియు నీయుత్పత్తివినాశములు వస్తువునకు స్వరూపములా? అవస్థాభేదములా? లేక భిన్నములా? ఎట్లు జెప్పినను సరి పడవు. మొదటి పక్షమున నుత్పత్తివినాశములును వస్తువులును ఒక్కటియే యగుటచే వస్తువులకు నిత్యత్వము కలుగవలయును. దానికి పుట్టుక కాని నాశము గాని లేదు కదా! రెండవపక్షమునఁ బ్రతిపదార్థంబును ఉత్పత్తియై యొక్కక్షణంబును నడుమ స్థితితో రెండవక్షణంబును పిదప నశించుచు మూఁడవక్షణంబు నుండవలసి వచ్చును. స్థితి లేకున్న నుత్పత్తివినాశములు సంభవింపనేరవు కదా! ఇది వారిమతమునకు విరుద్ధము. మూఁడవపక్షము నాశ్రయించిన నప్పుడును బదార్థము నిత్యము కావలసివచ్చును. ఉత్పత్తివినాశములకును దానికిని సంబంధమే లేదు కదా! ఇట్లు కాదు. స్వరూపముతోఁ గానవచ్చుట యుత్పత్తి; కానరాకపోవుట వినాశము' అనిన నదియు సరిపడదు. దర్శనాదర్శనములుఁ జూచువాఁ డొక్కఁ డుండిననే కదా సంభవించును. వారిమతమున నట్టివాఁడు లేడు. మఱియు నవి చూచువానిధర్మములే, కాని వస్తుధర్మములు కావు. చూచువాని దృష్టికి నిరోధ మున్నప్పుడు కాని వస్తు నాశము కాలేదు. నప్పుడు

కానవచ్చును. కావున నప్పటికినిఁ బదార్థము నిత్యమే కావలయును చూచువాఁడు చూచినను చూడకున్నను పదార్థమట్లే యుండును కదా! కావున నెట్లును బౌద్ధమతము యుక్తియుక్తము కాదు.

## సూత్రము. ౨౧.

అవతారిక:—"చిత్తమని చెప్పఁబడు జ్ఞానము కాని, దానినుండి జనించు సుఖాదిచైత్తములుగాని, నాలుగుకారణముల నాశ్రయించి జనించును. 'ఇది నలుపు' అనుజ్ఞానము కలిగినప్పుడు దానికి గోచరమగు నీలరూప మొకకారణము తెలిసికొనుసామర్థ్యమును సంస్కారములను గూడ నిచ్చుచుఁ బూర్వక్షణమున నశించిపోయి యున్నవిజ్ఞానము రెండవకారణము (విజ్ఞానమువలన మఱియొకవిజ్ఞానము జనించు ననుటయే కదా బౌద్ధసిద్ధాంతము.) మఱియు నాజ్ఞానము రూపవిషయముగ మాత్రమే ప్రవర్తింపఁ జేయునది యగుటచే నేత్రము మూఁడవకారణము; రూపము స్పష్టముఁ జేయునది యగుటచే ప్రకాశము నాల్గవకారణము' అని బౌద్ధులు చెప్పుదురు. బాహ్యపదార్థములకునుఁ బరమాణ్వాదులుఁ గారణములుగఁ జెప్పుచునే యున్నారు కదా! ఈకారణవిభాగమే వారిమతమున నిలున దని చెప్పుచున్నాఁడు.

## ౧౮౨. అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా. ౨. ౨. ౨౧.

తాత్పర్యము:—పైసూత్రమునందు 'క్షణక్షణమునకునుఁ బదార్థముత్పత్తి వినాశముల నొందు నేని వానినుండి పదార్థాంతము జనించుటకు వీలు లేదు' అని చెప్పఁబడి యున్నది. ఇఁక నీకోపమునుఁ బోగొట్టుకొనుటకై వా రేమి చేయవలయును? ఒకపక్షమున గారణము లేకయే కార్యము పుట్టు ననవలయును; లే కున్నఁ గార్యము పుట్టునంతవఱకుఁ గారణ ముండు ననవలయును. ఈరెండును వారిమతమునకు విరుద్ధములే.

మొదటిపక్షము నాశ్రయించిన వారిప్రతిజ్ఞకు హాని వచ్చును. వారు దేనికిని కారణము లేదని చెప్పుట లేదు కదా! రెండవపక్షము నాశ్రయించినఁ గార్యకారణములు రెండును నొకేసారి యుండవలసివచ్చును. వారిమ

తము ననుసరించి చూచినఁ గార్యమునకంటె బూర్వక్షణము నుండియు గారణ ముండుటకు వీలు లేదు కదా! 'వీలు కలదు' అని క్రొత్తఁగాఁ గల్పించిన క్షణికవాదము భగ్న మగును. కార్యోత్పత్తి రెండవక్షణమున నగును; కావున నప్పటివఱకునుఁ గారణ ముండినచో రెండుక్షణము లున్నది యగును కదా! కార్యములయందునుఁ గారణస్వభావము కార్యములం దుండవలయుననియు నాకారణమునఁ గారణము నిత్యమే కావలయు ననియు నిదివఱకే చెప్పియున్నాము కావున వారిమతమునందు కార్యకారణభావము కుదురదు; కుదురకపోవుటయే కాక వారిసిద్ధాంతమునకుఁ గూడ భంగము కలుగును.

## సూత్రము. ౨౨.

అవతారిక:—మఱియు బౌద్ధమతమున మఱియొక సిద్ధాంతము కలదు. 'ఈపదార్థమును నేను నశింపచేయుదును' అనుసంకల్పముతోఁ జేయఁబడునాశము ప్రతిసంఖ్యానాశము; ఇట్లు కాక స్వయముగనే కలుగునాశ మప్రతిసంఖ్యానాశము. ఈరెండును నాకాశంబు ననునవి. మూఁడును, వ్యవహారమాత్రములే కాని బుద్ధికి గోచరము లగునవి కావు. ఈమూఁడునభావములే; వీనికంటె భిన్నము లగుసర్వపదార్థములును క్షణికములు; అన్నిపదార్థములకును వీనితో సంబంధము కలిగి యుండును.

అనునీపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౧౯౩. ప్రతిసంఖ్యా ఽప్రతిసంఖ్యానిరోధా ఽప్రాప్తిరవిచ్ఛేదాత్. ౨. ౨. ౨౨.

తాత్పర్యము:—వైనాశికులు (బౌద్ధులు) చెప్పునిరోధములు రెండును ఏపదార్థమునకుఁ గాని సంభవించుటకు వీలులేదు. ఏల యనిన:— ఆ నిరోధములు పరంపరకు (ఒకపదార్థమువలన మఱియొకపదార్థము జనించుచుండు ననియు ఇట్లే యవిచ్ఛిన్నముగ పదార్థపరంపర వచ్చుచుండుననియు వారుచెప్పుదురు.) సంబంధించినవియా? లేక ప్రత్యేక పదార్థములకు సంబంధించి నవియా? ప్రతిసంఖ్యానిరోధము ప్రత్యక్షముగాఁ జేతనకార్యమే యగుటచేతను, అప్రతిసంఖ్యానిరోధముఁ గూడ పరంపరగఁ జేతనాధిష్ఠితవస్తుకార్యమే యగుటచేతను నవి (నిరోధములు)

దేనికిని సంబంధింపఁ గూడదు. అది యట్లుండె? మొదటిపక్షము నాశ్ర యించిన వారిసిద్ధాంత మెట్లు సరిపడును? వారిమతమునఁ బదార్థపరంపర లో నొకదాని కొకటి కార్యకారణములై యెడతెగక నున్నవి కదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నది లోకవిరుద్ధము. ఏపదార్థమున కును లోకమున సంపూర్ణవినాశము లేదు. ఎచ్చటఁ జూచినను రూపభేద ప్రాప్తియే. మృత్తిక నశించిన ఘటరూపముతోఁ గానవచ్చుచున్నది. ఘటరూపప్రాప్తియే దానికి వినాశము. కావున నెట్లును వారిమతము నిలువదు.

'ఆవినాశము ప్రత్యేకపదార్థమునకు సంబంధించు ననిన దోష మేమియుఁ గాన రాలేదు. కాలినరాతిపై జలబిందువు పడిన నది నశించి పోవుచున్నది. దానివినాశము, స్వరూపవినాశము కాక మఱి యేమి?' అనియెదవేమొ వినుము. అనేకపదార్థములయందు స్వరూపనాశము కానరాకుండుటచే నీజలవిషయమునందును నట్లే యూహింపఁ బడును. బాగుగ విచారించిన నాజలంబును ఆవిరియై గాలికంటె తేలిక యగుటచే మేఘమండలమునకుఁ బోయెను గాని ఇఁక నెట్లును కాలేదు కదా! 'ఉద బిందౌ చ సింధౌ చ తోయభావో న భిద్యతే? వినష్టేఽపి తతో బిందా వస్తి తస్యాఽన్వయోఽంబుధౌ' 'ఒక్క బిందువైనను సముద్రమైనను ఒక్కటియే. ఈకారణమువలన ఒకజలబిందువు నశించినను సముద్రము నశింపదు కావున స్వరూపవినాశము జలమునకు లేదు' అని ఈవిషయ మునుఁ గూర్చి మహాత్ములు చెప్పి యున్నారు. 'ఇట్లయిన మొదటిపక్ష మునే యాశ్రయింపవచ్చును. వస్తుపరంపరలో నన్యోన్యముఁ గార్యకార ణభావ మున్నను అవి యన్నియు సజాతీయములే యై యుండును. కావున విరుద్ధజాతి గలపదార్థముచే వానికి నిరోధముఁ గలుగవచ్చును' అనిన నదియు సరి కాదు ఎట్లనిన:—

పరంపరలోఁ గట్టకడపటిది యని చెప్పఁబడుపదార్థము మఱియొక పదార్థమునకుఁ గారణ మగునా? లేదా? మఱియు విజాతీయపదార్థోత్ప త్తివలన సజాతీయపరంపర నశించు ననిన నప్పుడు సజాతీయవిజాతీయజ్ఞాన మునకు నేదియో * యొకసామాన్య మాధార మై యుండవలయును. అది అపరసామాన్యమా? పరసామాన్యమా? (సామాన్యమనఁగా జాతి. అది

* సామాన్యము (౨౨౫ పుట చూడుడు.)

రెండువిధములుగఁ గానవచ్చుచున్నది. 'ఇది గోవు' అనిన నాగోజాతి సర్వగోవులయందును గలదు 'నల్లనియావు' అనిన నాజాతి నల్లనియావుల యందు మాత్రమే కలదు. ఎవ్వఁడు కాని గోవును కొని తెమ్ము అనిన దొరకినగోవును దేనినైనను దెచ్చును గాని నల్లగోవును తెమ్మనినఁ దెల్ల గోవును తేఁడు కదా. కావున నీసామాన్యములు రెండునుఁ గ్రమముగఁ బరాపరసామాన్యము లనఁబడును.) ఇందు మొదటిపక్షము నాశ్రయించి కడపటిపదార్థము కూడ మఱియొకదానినిఁ గలిగించు ననిన నప్పుడు నాశము కలుగుటకే వీలు లేదనుట స్పష్టము. ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు పదార్థపరంపరయే లేకపోవును. వారిమతమునఁ గార్యము చేయఁగలదియే పదార్థము వ్యాపారమే దానియునికి వ్యాపారము కూడ మఱియొకపదార్థమునుఁ బుట్టించుటయే. ఇట్లగుటచేఁ గనఁ బడుపదార్థము మఱియొకదానిఁ బుట్టింపదనిన దానికి వ్యాపారము లేదన వలసి వచ్చును. అప్పుడు దానికి నునికియే సంభవింపదు. సంభవింపకున్న నది శూన్యమే యగును. అది శూన్యమైనఁ బైని వర్ణించినవిధముగనే దానికిఁ గారణ మగుపదార్థము (కడపటిపదార్థమునకుఁ బూర్వక్షణమున నున్నపదార్థము) కూడ శూన్యమే యగును. ఇట్లే విమర్శించిన నన్ని యును శూన్యములే యగును. ఇది విరుద్ధము కదా!

ఇట్లుఁ గాక నీపక్షములను వదలి విజాతీయపదార్థోత్పత్తియే వస్తు నాశహేతు (పరంపరానాశహేతు) వనిన నప్పుడును యుక్తి కుదురదు. అప్పుడు 'ఈపదార్థము సజాతీయమా ? విజాతీయమా యని తెలిసి కొనుటకు నేదియో యొకపోలిక కావలయు ననియు నది సామాన్యరూపమై యుండు ననియు ఆసామాన్యము రెండువిధములు కావున నిచ్చట నేది గ్రహింతు రనియు నిదివఱకే ప్రశ్నించి యున్నాము. అందు 'పర సామాన్యమే వానిపోలికనుఁ దెలుపును' అనిన దోషము వచ్చును. జ్ఞానములు కార్యకారణభావములతోఁ బరంపరగ జనించుచున్నవి కదా! అందు జ్ఞానత్వము సర్వజ్ఞానములయందు నుండునది యగుటచే పరసామాన్యము? రూపజ్ఞానత్వము గంధజ్ఞానత్వము మొదలగునవి రసజ్ఞానాదుల యందు లేకుండుటచే నపరసామాన్యములు వాస్తవస్థితిలో జ్ఞానమువూత్రము జ్ఞానమునకు నెప్పటికిని విరుద్ధము కా నేరదు కదా ! ఇట్లయినను వారిమతము నాశ్రయించి చూచిన విరోధము స్పష్టముగ వచ్చును.

అపరసామాన్యమే సజాతీయవిజాతీయభేదమును గల్పించు నేని రూపజ్ఞానరసజ్ఞానములకే విరోధము కలుగవలసినచ్చును. ఇది విరుద్ధము కదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించి పరసామాన్యమే దానికి హేతు వనిన విజాతీయ మనునదియే యుండక పోవలసివచ్చును. సర్వపదార్థములనుఁ 'గలవు కలవు' అని వ్యవహరింపఁబడుచున్నవి కావునఁ గలిమి యన్నిటి యందును కలదు కదా! కావున నెట్లును బౌద్ధమతమున నాశము సిద్ధింపదు.

## సూత్రము. ౨౩.

అవతారిక:— మఱియు బౌద్ధులు 'ప్రతిసంఖ్యానిరోధమువలన నవిద్యాదులు నశించును. దానిచే మోక్షము కలుగును' అందురు ఇదియు వారిమతసిద్ధాంతము ననుసరించి చూచిన సరిపడదని చెప్పుచున్నాఁడు.

## ౧౬౪. ఉభయథా చ దోషాత్. ౨. ౨. ౨౩.

తాత్పర్యము:—అవిద్యాదులు ప్రతిసంఖ్యానిరోధముచే నశించు ననుటయు వారిమతమున సంభవింపదు. ఎట్లనిన:—

ఆవినాశము యమనియమాదులతోఁ గూడిన తత్వజ్ఞానమువలనఁ గలుగునా? స్వయముగనే కలుగునా? ఇందు మొదటిపక్షము నాశ్రయించిన వారిసిద్ధాంతమునకే విరోధము వచ్చును. వారు వస్తునాశమునకుఁ గారణమే యక్కఱలే దని యొప్పుకొని యున్నారు. ఇచ్చట నవిద్యానాశమునకుఁ దత్వజ్ఞానము కారణమనిన దానికి విరోధమువచ్చును కదా! (ప్రతిపదార్థము క్షణక్షణమును నూరకయే నశించు చుండు నని కదా వారు చెప్పుదురు) ఇఁక రెండవపక్షము నాశ్రయించిన వారు చేసినమోక్షమార్గోపదేశము నిరర్థక మగును. వారు సర్వపదార్థములను క్షణికములుఁ గను శూన్యరూపములుగను భావింపవలయు ననియు నదియే ముక్తి మార్గ మనియుఁ జెప్పుదురు. అవిద్యాదులు స్వయముగనే నశించు ననిన మోక్షమునకై క్రొత్తప్రయత్న మేల? కావున నెట్లు చూచినను అవిద్యాదినాశము వారిమతమునఁ గుదురదు. కావున బుద్ధమతము అయుక్తము.

## సూత్రము. ౨౪.

అవతారిక:—'బౌద్ధులు ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధములతోఁ బాటు ఆకాశమును కూడ సభావరూపముగఁ జెప్పుదురు' అని యిదివఱకే చెప్పి యున్నాము. అందుఁ బ్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధములను గూర్చి యిదివఱకే చెప్పఁబడి యున్నది. ఆకాశమునుఁ గూర్చి యీసూత్రమున విచారింపఁబడును.

## ౧౯౫. ఆకాశే చావిశేషాత్. ౨. ౨. ౨౪.

తాత్పర్యము:—మఱియు వారు ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధములను ఆకాశమును గూడ సభావరూప మందురు కదా! అందు నిరోధములు అభావములు కానేర వని యిదివఱకే చెప్పఁబడి యున్నది. వస్తువునకుఁ గలుగువినాశము అభావరూపము కా దని యిదివఱకే నిరూపించితిమి. వినాశ మనఁగాఁ దిరోభావమే (మనకు దృష్టిగోచరము కాక పోవుటయే) కాని స్వరూపాఽభావము కా దనినిర్ణయించితిమి. ఈకారణమువలన నాశము కూడ భావరూపమే కాని యభావరూపము కా దని చెప్పితిమి. ఈసిద్ధాంతమువలన నవిద్యాదినాశము కూడ భావరూపమే యనియు దానికిఁ గారణ ముండుట యావశ్యక మనియు దానివలన మోక్షమార్గము నభ్యసింపవలయు ననియు నేర్పడినది; వేదాంతమతమే యుక్తియుక్త మని తేలినది. ఇక నాకాశమునుఁ గూర్చి విచారింపఁ బోయిన నదియు నభావరూపము కానేరదు. 'ఆత్మన ఆకాశః సంభూతః' అను మొదలగుశ్రుతులు ఆ యాకాశమునకు సత్యత్వమునుఁ బదార్థత్వమునుఁ జెప్పుచున్నవి. వేదములపై విశ్వాసము లేకుండినఁ బ్రత్యక్షానుభవమున నున్నశబ్దమునుఁ బట్టి యాకాశము ననుమానముఁ జేయవచ్చును. ఎట్లనిన:—

లోకమున సామాన్యగుణములు విశేషగుణములు నని గుణములు రెండువిధములు. అందు ననేకపదార్థముల నాశ్రయించి యుండునవి సామాన్యగుణములు సంఖ్య పరిమాణము మొదలగునవి. ఇట్లుఁ గాక ఒక్కపదార్థమును మాత్రమే యాశ్రయించునవి విశేషగుణములు. గంధము రూపము స్పర్శము మొదలగునవి. గంధము భూమియందు మాత్రమే యున్నది; రూపము అగ్నియందు మాత్రమే యున్నది కదా!

కావున శబ్దము కూడ నేదియో యొకభూతము నాశ్రయించియే యుండ వలయును. విశేషగుణములు 'ఒక్కొక్క యింద్రియమునకు మాత్రమే గోచరము లగుచుండుట ప్రత్యక్షము. గంధము (వాసన) నాసిక కొక్క దానికే గోచర మగుచున్నది; రూపము నేత్రమునకు మాత్రమే గోచర మగుచున్నది. ఇట్లే శబ్దము కూడఁ గర్ణమునకు మాత్రమే గోచర మగు నది కావున విశేషగుణము. మఱియు గంధరసరూపస్పర్శము లనువిశేష గుణములు నాల్గును నాల్గుభూతముల నాశ్రయించి యున్నవి. ఆభూత ములును భావరూపములే యై యున్నవి. ఇట్లగుటచే నైదవది యగు శబ్దము కూడ భావపదార్థమునే యాశ్రయింపవలయును. అదియు భూత ముగనే యుండవలయును. లోకవేదములయందును అయిదుభూతములు సుప్రసిద్ధములై యున్నవి. అందైదవది యాకాశము కావున నీశబ్దగుణ ముతో సంబంధము కలది ఆయాకాశమే. ఈకారణమువలనఁ బృథివ్యా దులు భావరూపములైనట్లు ఆకాశముకూడ భావరూపమే కావలయును. ఒకగుణము, అందునను విశేషగుణము, అభావము నాశ్రయించునా?

'ఇట్లు కాదు. వారు ఆవరణము లేకుండుటయే యాకాశ మందురు' అనియెదవేమొ అదియు యుక్తము కానేరదు. అప్పుడు ఒకమనుష్యుఁడు సంచరించుచుండిన రెండవవానికి సంచారము కలుగఁగూడదు. ఏకకాలము నందే యనేకులయొద్ద నాకాశ మెట్లుండును. అనఁగా (అందఱికి నొక్క మాత్రే యావరణాభావ మెట్లు కలుగును? 'ఎచ్చ టెచ్చట నావరణము లేదో అచ్చట నెల్ల నీయాకాశము కలదు. మనుష్యుఁడును అచ్చట సంచ రించును' అనియెదవేమొ అప్పుడు మనుష్యసంచారమునకుఁ గారణ మెద్దియో అదియే యాకాశ మగును; కాని కేవల మావరణాభావము మాత్రమే కానేరదు. ఒకచోట నావరణ ముండుటయు మఱియొకచోట లేకపోవుటయు నందఱకునుఁ బ్రత్యక్షసిద్ధమై యున్నది. అభావమునకు పరిచ్ఛేద ముండుటకు వీలు లేకుండుటచే నది యందఱకు నేకరూపముగనే యుండవలయును కదా!

మఱియు నీవిషయము నెట్లేని సాధించినను వారిమతసిద్ధాంతము నిలువదు. ఒకస్థలమునఁ జెప్పఁబడియున్నదానికి విరోధము వచ్చును. ఎట్లనిన:—బౌద్ధాగమమునందు ఒకస్థలమున 'పృథివీ భగవః కింసంశ్రయా' 'ఓమహాత్మా! భూమి దేని నాశ్రయించియున్నది?' అని యారంభించి

భూతములయాశ్రయములనుఁ గూర్చిన ప్రశ్నోత్తరము లున్నవి. ఆస్థలమున నంతమున 'వాయుః కింసంనిశ్రయః' 'వాయువు దేని నాశ్రయించి యున్నది' అను ప్రశ్నమునకు 'వాయు రాకాశసన్నిశ్రయః' 'వాయువు ఆకాశము నాశ్రయించి యున్నది' అని సమాధానము చెప్పఁబడియున్నది. దీని నాలోచించి చూచిన నాకాశము భావపదార్థ మగుటయే యుక్త మని తోఁచుచున్నది. ఏపదార్థము కాని యభావము నాశ్రయింపదు కదా !

మఱియు వారు నిరోధములను రెంటిని ఆకాశమును గూడ నభావరూపము లైనను నిత్యములనుగఁ జెప్పుదురు. ఇది యేటియుక్తి? అభావమునకు నిత్యత్వానిత్యత్వము లెక్కడివి ? సర్వధర్మములును భావపదార్థముల నాశ్రయించును కాని అభావము గాదు కదా !

## సూత్రము. ౨౫.

అవతారిక:—మఱియు వారు సర్వపదార్థములను క్షణికములనుగా నంగీకరించి వానిని గ్రహించుపురుషునిఁ గూడ నట్టివానినిగానే యంగీకరించుచున్నారు. ఈసూత్రమున నీపక్షమును దూషింపుచున్నారు.

## ౧౯౬. అనుస్మృతేశ్చ. ౨. ౨. ౨౫.

తాత్పర్యము:—క్షణికవాద మెట్లును యుక్తియుక్తము కానేరదు. లోకమున 'నేను దానిని చూచితిని; అది యిప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది' అనువ్యవహారములు కలవు. వీనిని విమర్శించిచూచినఁ జూచినవాఁడును స్మరించినవాఁడు నొక్కఁడుగనే యున్నట్లు కానవచ్చుచున్నాఁడు. కావున నీస్మరణమును పట్టి చూచినఁ దెలిసికొనువాఁడు క్షణికుఁ డగుటకు వీలు లేకున్నది.

'ఒక్కఁడుగ నుండక పోయినను వానినుండియే రెండవవాఁడు జనించుచునున్నాఁడు; కావున నావరుసలో నొకఁడు చూచినదానిని మఱియొకఁడు స్మరింపవచ్చును. మొదటివానియందు గల సంస్కారములు రెండవవానియందు నున్నవి కదా!' అనిన నదియు యుక్తము కాదు. ఏలయనిన: లోకమున నొక్కఁడే దర్శనస్మరణకాలములయందు తన్నుఁ గుఱుతించుచున్నాఁ డనుట ప్రత్యక్షసిద్ధము. ప్రతివాఁడును "గడచినదిన

మున నేను వీనిని చూచితిని' అని గుఱుతించుట లోకప్రసిద్ధమై యున్నది. జ్ఞాత క్షణికుఁ డనిచెప్పువైనాశికుఁడు కూడ నీయనుభవమునుఁ గలిగియే యున్నాఁడు. ఇట్లు కాక అజ్ఞాత భిన్నుఁడే యగునేని యప్పుడు పూర్వ సంస్కారములు తనలో నున్నను 'అతఁడు దీనిని చూచెను; నేను స్మరించు చున్నాను' అనునసుభవ ముండవలసివచ్చును. ఇది లోకమున లేదు. ఇట్టివ్యవహార మున్నస్థలములలో నెల్ల వారి (చూచినవానిని స్మరించిన వానిని) బరస్పరభిన్నులుగనే భావించుచున్నారు. స్మరించువానిని దర్శన కాలమున నున్నవానినిఁగా గూడ నిశ్చయించుచున్నారు. అప్పు డుండక పోయిన నావిషయమును నిశ్చయించి స్మరించుటకే వీలు లేదు కదా! కావున జన్మాది మరణాంతముఁ దా ననుభవించినసర్వవిషయములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుండియు 'వీనినిఁ బదిసంవత్సరములకు ముందే నే నెఱుంగుదును' అనుమొదలగువ్యవహారముల నాచరించుచునే యుండియు బౌద్ధుఁ డిట్టిసిద్ధాంతము నెట్లాచరించెనో చిత్రముగ నున్నది.

'ఈయనుభవము పోలికవలనఁ గలుగవచ్చును. ఆత్మ నిత్యుఁడు కాకున్నను వానియందు పరంపరగా సంస్కారములు వచ్చుచున్నవి. కావున నొక్కనివంటివాఁడే. పదార్థమునకుఁ బోలిక సంభవింపవచ్చును. ఆపోలిక నాశ్రయించి అట్టివ్యవహారములు జరుగవచ్చును' అనిన నదియు సరిపడదు. పోలిక యనునది రెండువస్తువుల నాశ్రయించియుండును. ఆవస్తువులును కాలభేదముఁ గలవియే, కాని యేకకాలమున నుండునవి కాఁ గూడదు. అప్పుడు వ్యవహారము ప్రత్యక్షముగనే జరుగవచ్చును కదా! ఇట్లయిన వారిమతమున క్షణక్షణమునకు నశించునాత్మ కాలాంతరములయం దున్నవస్తువుల నెట్లు గ్రహింపఁ గలఁడు? భూతకాలమున నుపమానభూత మగువస్తువుఁ జూచినవానికంటెఁ బ్రస్తుతకాలమున నుప మేయభూత మగుపదార్థముఁ జూచువాఁడును పరస్పరభిన్నులు కదా! ఇట్లుండ సాదృశ్య మెట్లేర్పడును? ఇట్లు చెప్ప నక్కఱ లేదు. 'ఇది దాని తోసమానమై యున్నది; అనునది సంకల్పభేదమే కాని అంతమాత్రము వలనఁ బదార్థద్వయ మక్కఱ లేదు' అనియెదవేని ఈమాటయే లోకానుభవమునకు విరుద్ధము. లోకమున 'దానితో నిది సమానము' అనువ్యవహారము పదార్థద్వయము నపేక్షించునదియే యనుట వ్యవహార సిద్ధమై యున్నది. దీనికి విరుద్ధముగఁ జెప్పుట యుక్తము కాదు. ప్రతి

వాఁడును లోకవ్యవహారము నాధారముగఁ గైకొనవలసినదియే. అట్లు లేకున్న వాఁడు (ప్రతివాది బౌద్ధుఁడు.) అధికప్రసంగి యగును కాని యితరునకు వచ్చుహాని యేమియు లేదు.

మఱియు 'నేనే మొన్న చూచినవానిని నేడు స్మరించుచున్నాను' అనువ్యవహారము పోలిక నాశ్రయించి వచ్చు ననుటకును వీలు లేదు. 'వాఁడే నేను' అనుననుభవమే యిచ్చట స్పష్టమగుచున్నది. ఈవ్యవహారమును పట్టిచూచినఁ బూర్వుఁడు నశించినను నశింపకున్నను ప్రస్తుతకాలస్థితునికి వానితో బోలిక యుండుటకు వీలు లేదు. 'నేను ఆపురుషుఁడ నేనా? లేక అట్టివాడనా' అనుసంశయము కూడ కలుగవలసివచ్చును. ఇది యాత్మయందు సంభవించునా? జనసమూహమునఁ బోవుచు నెవ్వఁడైనను తనను వేఱు చేసికొనుటకై క్రొత్తగా నొకజండాను ధరించినచో వానినిఁజూచి పరులు నవ్వరా! కావున బౌద్ధమత మెట్లును యుక్తియుక్తము కాదు.

## సూత్రము. ౨౬.

అవతారిక:—మఱియు బౌద్ధమతమున స్థిర మగుకారణము లేకపోవుటచే వారు అభావమునుండి భావ ముత్పత్తి యగు ననువిషయము నంగీకరించినవా రగుదురు; వారు క్షణిక మగుకారణమునుండి కార్యము జనించునందురు కదా! ఆకారణము స్వతంత్రముగఁ గార్యమును పుట్టించునా లేక పరసహాయముచేఁ గార్యమును పుట్టించునా? ఇం దేపక్షంబును సరికాదనియు మొదటిపక్షము నాశ్రయించిన బురుషప్రయత్నము నిష్ఫలము కావలయు ననియు రెండవపక్షము నాశ్రయించిన నుపకర్త యుపకార్యునికంటెను ఉపకారములకంటెను బూర్వక్షణమునఁ గూడ నుండవలయును కావునక్షణికవాదభంగము వచ్చు ననియును ఇదివఱకే చెప్పియున్నాము. (చూ. ౨-౨-౧౯.) ఉపకార్యోపకర్త లిరువురు నొక్కక్షణముననే యుండుట సంభవించినను ఉపకార్యుఁడు (ఉపకారమున కాశ్రయభూతుఁ డగువాఁడు (రెండుక్షణము లవశ్యముగ నుండవలసినవాఁ డగుననియు నట్లుండకపోయిన 'వీనికిఁ బరులచే సహాయము కలిగినది' అను విషయము తెలియఁబడ దనియుఁ గార్యకారణసామర్థ్యమును కారణస్వభావముగనే ... కలుగుటచే

*నుపకార్యోపకారకభావము సంభవింప దనియు నిశ్చయింపఁబడదనియు నిదివఱకే చెప్పియున్నాము. కావున క్షణికపదార్థమునుండి కార్యము జనించు ననిన నభావమునుండి జనించు నన్నట్లే యగును. రెండును (క్షణికపదార్థంబును అభావంబును) కూడ కార్యము నుత్పత్తిచేయువిషయమున ననసమర్థములే కదా!

మఱియు 'నాఽనుపమృద్యప్రాదుర్భావాత్' 'కారణమును నశింపఁ జేయక కార్యమును జనించుట లేదు కావున నభావమునుండియే భావము జనింపుచున్నది' అను మొదలగువాక్యములచే వారీవిషయమును స్పష్టముగఁ జెప్పుచున్నారు. 'విత్తనము నశించినపిదపఁ గాని చెట్టు పుట్టుట లేదు. పాలు నశించినపిదపఁ గాని పెరుగు జనించుట లేదు. మట్టిముద్ద నశించిన పిదపగాని ఘటము జనించుటలేదు. విత్తనము మొదలగునవి స్వస్వరూపములతో నున్నప్పుడు వృక్షాదు లుండుట యప్రత్యక్షము కదా! మఱియు 'నిత్య మగుపదార్థమునుండి కార్యము జనించును' అనిన ననేకవిరోధములు వచ్చును. ఆపదార్థమునకు స్వతంత్రముగఁ గార్యకరణసామర్థ్య ముండునేని యప్పు డన్నిపదార్థముల నొక్కమాఱే పుట్టింపవలయును. పరసహాయమువలన మాత్రమే యట్లు పుట్టింపఁ గలుగునది యగునేని సహాయమే కార్యకారి యగును కాని పదార్థము కానేరదు. సహాయ మున్నప్పుడు సృష్టి కలుగు; లేనప్పుడు లేదు. కదా! ఇట్లు కాక స్వతంత్రసామర్థ్య ముండినను లేకుండినను సహాయముఁ గూడ నున్నను లే కున్నను సృష్టి కలుగు ననిన నప్పుడు దేనినుండి యైన నేది యైనఁ గలుగవచ్చును. మృత్తికనుండి కూడ వస్త్రము జనింపవచ్చును. కావున నిత్య వస్తువు కారణ మగు ననుటకు వీలు లేదు' అని వాదింతురు. అభావమునుండియే భావపదార్థము జనించు నని సిద్ధాంతము జేయుదురు. ఈసిద్ధాంతము సర్వానుభవవిరుద్ధ మగుటచే నీసూత్రమున ఖండింపఁబడుచున్నది.

## ౧౯౭. నాసతో ఽదృష్టత్వాత్ ౨. ౨. ౨౬.

తాత్పర్యము:—వారిమత మెట్లుఁ జూచినను యుక్తము కానేరదు. అభావమునుండి కార్యము జనించుట లోకానుభవవిరుద్ధము.

---

* ఉపకార్యుఁ డనఁగా నొకనిచే నుపకరింపఁబడవలసినవాఁడు. ఉపకారక మనఁగా ఒకనికి నుపకారముఁజేయునది. వీరికిఁ గలసంబంధ ముపకార్యోపకారకభావ సంబంధము.

వి త్తనము మొదలగునవి నశించును కదా! యనిన నచ్చటం గూడ వాని సూక్ష్మావయవములే వృక్షకారణము లగుచున్నవి యని లోకజ్ఞులచేం బామరులచేం గూడ నంగీకరింపం బడుచున్నది. అభావ మనంగా లేమియే కావున నది బొత్తుగ లే దనియే చెప్పవలయును. లేనిది యొకపదార్థమునకు నుపాదానకారణ మెట్లగును.? అట్లయిన నన్నియు లేనివే కావలయును. ఇది ప్రత్యక్షమునకు విరుద్ధము కదా! మఱియు మృత్తికనుం బ్రత్యక్షముగం జూచుచున్నాము; దానితోం గూడియుండుటచే ఘటాదులనుం గూడ మృణ్మయములనుగా నెఱుంగుచున్నాము. మృత్తికయొక్క యభావము దారములు మొదలగునితరపదార్థములయందు కలదు కదా! వానిని (దారములు మొదలగువానిని) ఎవ్వండైన ఘటమునకుం గారణములనుగ నంగీకరించుచున్నాండా? కావున నెట్లును అభావము నుండి భావము పుట్టదు.

మఱియు లోకులు 'మఱ్ఱివిత్తనమునుండి మఱ్ఱిచెట్టు పుట్టును మృత్తికనుండియే మృణ్మయపాత్రములు జనించును. పాలనుండియే పెరుగు పుట్టును' అనుమొదలగునియమములం బ్రత్యక్షముగం జూచుచున్నారు; వాని ననుసరించియే ప్రవర్తించుచున్నారు. ఫలమునుం జెందుచున్నారు. బౌద్ధసిద్ధాంతము దీనికి విరోధము నాచరించును. ఎట్లనిన:—

అభావమునందు విశేషము లుండుటకు వీలు లే దనుట లోకానుభవసిద్ధము. ఇంక వారియభిప్రాయ మేమి? అభావమునకు విశేషములు కల వనియా? లేవనియా? ఇంతకంటె మూండవపక్షము లేదుకదా! ఇందు మొదటిపక్షము నాశ్రయించిన నది భావమే కావలసివచ్చును. నలుపు తెలుపు అను మొదలగువిశేషములు సత్యము లగుపదార్థములయందు మాత్రమే కానవచ్చుచున్నవి యనుట స్పష్టము. గోవు సత్యమై యుండిన కదా 'ఇది నల్లనిది ఇది తెల్లనిది' అనువ్యవహారము కలుగుట గోవే లేకున్న దేనినిం గూర్చి యీవ్యవహారము ప్రవర్తించును? ఇంక రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు కుందేటికొమ్మునుండికూడ మొలక జనింపవలయును; వంధ్యాపుత్రునకుం గూడ వీరుండు పుట్టవలయును. అభావము లన్నియు నొక్కటియే కదా! కావున నెట్లును ఈమతము యుక్తియుక్తము కానేరదు.

'నిత్య మగుపదార్థమునుండి కూడఁ గార్యము జనించుటకు వీలు లే దని నిరూపించితిరి కదా (నిరూపింతురు కదా) ఆనిరూపణను ఖండించుట యెట్లు?' అనియెద వేమొ వినుము. మనసిద్ధాంతమునఁ (వేదాంతసిద్ధాంతమున) గారణము నిత్యము. అది అదృష్టాదికారణములు చేయుసహాయముచే క్రమముగ సృష్టినిఁ గలిగించును 'ఇది విరుద్ధము. కర్మాదులు చేయునుపకారము భావపదార్థమునకంటె భిన్నము; యభిన్నము; మొదటిపక్షమున బౌద్ధసిద్ధాంతమే వచ్చును. భావపదార్థమునకంటె భిన్న మగునది యభావమే కావున దానినుండియే కార్యము జనించు నన వలసివచ్చును. ఉపకారము జరిగినప్పుడు మాత్రమే సృష్టి కలుగుచుండుటచేతను లేనప్పుడు లేకపోవుటచేతను ఆయుపకారమునుండియే కార్యోత్పత్తి యగుచున్నట్లు స్పష్ట మయ్యె యున్నది యని యిదివఱకే నిరూపించియున్నాను. ఇఁక రెండవపక్షము నాశ్రయించిన జగత్కారణ మని చెప్పఁబడినపదార్థమే యన్యనిర్మితము కావలసివచ్చును. ఉపకారమునకును దానికిని భేదము లేకపోవుటచేతను ఉపకారము స్పష్టముగ నన్యకృతమే యగుటచేతను ఈవిషయము నిర్వివాద మగుచున్నది కదా! అప్పుడు భావపదార్థము కూడ నభావమే కావలసివచ్చును. కావున నెట్లును మన సిద్ధాంతము యుక్తియుక్తముగ నున్నట్లు కానరాలేదు' అనియెద వేమొ. ఇట్లు సంశయింప నక్కఱలేదు మనసిద్ధాంతమునఁ గర్మాదిసహాయములకును నిత్యపదార్థమునకునుఁ గలసంబంధము భేదరూపంబునుఁ గాదు. అభేదరూపంబునుఁ గాదు. అనిర్వచనీయము. కార్యకారణములకుఁ గలసంబంధము కూడ నిట్టిదియె. కావునఁ గర్మాదులనుండి యనిర్వచనీయ మగు సహాయమునుఁ బొంది భావపదార్థ మనిర్వచనీయమగు కార్యమునుఁ బుట్టించుచున్నది. ఎవ్వరైన దీని నే యంగీకరింపవలయును. ఇట్లు లేకున్న నెవ్వరిపక్షములును నిలువవు.

'ఇదియేల? బౌద్ధులు కార్యకారణములకు భేదము నంగీకరింతురు. 'ఒకదానితోఁ బోలినపదార్థము మఱియొక్కటి ప్రపంచమున లేదు. దేనిలక్షణము దానికే' అని సిద్ధాంతము చేయుదురు. ఇందు విరోధ మేమి భేదమునుఁ బరమార్థముగఁ జెప్పిన దోష మేమి?' అనియెద వేమొ వినుము. ఇట్టియిన బీజములనుండి మొలకలు మాత్రమే పుట్టనేల? మనుష్యులు పుట్టకూడదా! ఒకబీజమునకు మఱియొకబీజమునకుఁ గలభేద మెట్టిదో

మనుష్యునితోఁ గలభేదము కూడ నట్టిదే కదా! ఇట్లుండ నొకబీజము నుండి వృక్షంబును మఱియొకబీజమునుండి మనుష్యుఁడు నేల జనింపరాదు? సర్వబీజములనుండియు వృక్షును లే జనింపవలయు ననునియమ మెందుండి వచ్చెను? 'జాతి గలదుకదా' అనియెదవేమొ యది సత్యమగునేని బౌద్ధసిద్ధాంతమునకు భంగమువచ్చును. వానిమతమునసిత్యపదార్థమేదియు లేదు కదా! ఇఁక నసత్య మగునేని అప్పుడును వానిమతమునకు విరోధము వచ్చును. వ్యాపారము నాచరించుపదార్థము భావరూపమని వారలంగీకరించి యున్నారు కదా (బౌద్ధమతమున నన్నియు క్షణికములేయైనను తామున్న క్షణమునందు భావరూపము లే) కార్యోత్పత్తికిఁ బైని వర్ణించినవిధముగ జాతి లేకున్న సరిపడదు. మఱియొకవిశేషము వ్యక్తు లిన్ని నశించినను సర్వకాలములయందును జాతి నిత్యముగ నుండును. వారు ప్రతిక్షణము నందును అప్పుడప్పు డున్నపదార్థములు భావము లనినను సర్వకాలముల యందును వానియునికి నంగీకరింపరు. జాతియన్ననో క్షణిక మగుటకు వీలు లేదు. నేటిదినము బీజమునుండి వృక్షము జనించును నాలవనాడును గూడ నట్లే జనించును కదా! జాతి క్షణమాత్రమున నశించునేని యీబీజాంకురముల నెట్లనువర్తింపఁ గలదు? కావున వారుచెప్పున్యాయ మీజాతియందు పనికిరాదు.

ఇఁక నేమి చెప్పవలయును? 'ఇట్టికారణమునుండి యిట్టికార్యమే జనింపవలయును' అనునియమమును సాధించుటకై జాతినిఁ గల్పింపవలయును; అది నిత్యము కా దనియు ననిత్యముఁ గూడ కా దనియుఁ జెప్పవలయును. ఇట్లు చేయకుండినఁ గార్యకారణవిషయము లగునసుమానము లకు హాని వచ్చును. మూర్ఖుఁ డెవ్వఁడైనను 'ఈరూపాయను మొలపించి ఫలమునుఁగాంచెదను.అప్పుడు శ్రమలేకయే కాయలనుఁగోసినట్లు రూపాయలనుఁ గోయవచ్చును' అనియెనేని లోకులు వానికి దృష్టాంతపూర్వకముగ ననుమానప్రమాణముచే "నీతలంపు యుక్తముకాదు"అని చూపుచున్నారు "చెట్లు విత్తనములనుండియే జనించుచున్నవి; ఈరూపాయ విత్తనముల జాతిలోనిది కాదు కావున దీనినుండి వృక్షముజనింపదు" అని నిరూపించుచున్నారు. జాతియే లేకుండిన నీయనుమానము సిద్ధింపదు కదా! కావున వారిమతసిద్ధాంతము ననుసరించి చూచినను వారు అనిర్వచనీయము లగుజాత్యాదులఁ గల్పింపవలసినవారే. ఇట్లుండ నట్టియనిర్వచనీయ

విషయముల సిద్ధాంతముఁ జేసిన మనకుమాత్ర మేమి తప్పు? కార్యకారణ ములకు భేదాభేదములలో నేదియుఁ బరమార్థముగ నుండుటకు వీలు లే దనియు విచారించిన భేద మూరక గానవచ్చునదియేకాని మఱియేమియుఁ గా దనియు వాస్తవస్థితిలోఁ గారణవ్యతిరిక్తముగ నేదియును లే దనియు నారంభణాధికరణమున (౨. ౧. ౧౪.) సయుక్తికముగ నిరూపించియేయు న్నాము; కావున మన మతమున (వేదాంతమతమున) నెప్పటికినిదోషములేదు.

మఱియుఁ బరమాణువులనుండి బాహ్యపదార్థములును స్కంధ ములనుండి యాభ్యంతరపదార్థములునుఁ బుట్టు నని యొకచోట చెప్పి మఱల నభావమునుండియే భావము జనించు నని చెప్పుటచే బౌద్ధులు లోకము నెల్ల నిరర్థకముగఁ జికాకుఁ బెట్టుచున్నారు కావునఁ బ్రత్యక్ష విరుద్ధ మగుటచే నభావమునుండి భావము జనింపదు, బౌద్ధసిద్ధాంతము ఎట్లును దోషయుక్తమే.

## ౧౯౭. ఉదాసీనానా మపి చైవం సిద్ధిః.

## ౨. ౨. ౨౭.

తాత్పర్యము:—మఱియు నభావమునుండియే కార్యోత్పత్తి కలు గునేని యేప్రయత్నమునుఁ జేయకున్నను సంకల్పమాత్రముచే నిష్టసిద్ధి ప్రతివానికినిఁ గలుగవలసివచ్చును. అభావమును సంపాదించుటకుఁ బ్రయత్న మేమియు నవసరము లేదు కదా! సస్యములను ఫలింపఁజేసి ధనము నార్జింపఁ గోరువారు వి త్తనములు సహాయభూతము లగువృష భాదులు మొదలగువానిని సంపాదింపఁ బాటుపడుచున్నారు; కాని అభా వమే సర్వకార్యసాధన మగునేని యాశ్రమతో నిమిత్త ముండదు. ఊరకనే సస్యములు ఫలింపవలయును. మృత్తికకు సంస్కారమును చేయుటకు ప్రయత్నింపకున్నను సంకల్పమాత్రముచే ఘటాదులు జనిం పవలయును; దారములు లేకయే వస్త్రముఁ బుట్టవలయును. ఇది యెం దైనఁ గలదా? వేయియుక్తులఁ జెప్పినను ఎవ్వండైన నంగీకరించునా? కావున నభావమునుండి కార్యోత్పత్తి యెట్లును కలుగదు; పైని వివరిం చినవిధముగ లోకశాస్త్రములకు విరుద్ధ మగుటచే నీబౌద్ధమతములు (బౌద్ధమతశాఖ లగుసౌత్రాంతికవైభాషికమతములును) యుక్తియుక్త ములు కావు. ఇంక సౌత్రాంతికమతమున బాహ్యపదార్థములు వాస్తవ

స్థితిలోఁ బ్రత్యక్షములు కావనియు విజ్ఞానస్కంధమునందు ప్రతిఫలించి మాత్రమే యట్లు కానవచ్చుచున్నవి యనియు సిద్ధాంతము కలదు. ఈయంశము ఇంచుమించుగా యోగాచారమతము ననుసరించినది యగుటచే నచ్చటనే (ఈ క్రిందియధికరణమునందే) ఖండింపఁబడును.

---

## అభావాధికరణము. ౫. మొదటివర్ణకము.

సంగతి:—పై యధికరణమున 'బాహ్యపదార్థములు సత్యములు' అని యంగీకరించుసౌత్రాంతికవైభాషికులు దూషింపఁబడిరి. వాస్తవస్థితిలో నది బుద్ధదేవునియభిప్రాయము కాదు; కావున నాయనయొక్క పరమాభిప్రాయమునకు సమీపగతుఁడై యున్నయోగాచారుఁడును మాధ్యమికుఁడును ఈ యధికరణమున ఖండింపఁబడుదురు. పై యధికరణమున నారంభింపఁబడినస్వమతదూషణమును దొలఁగించుకొనుటకై యీయధికరణమున బౌద్ధుండు పరమసిద్ధాంతమును జూపెను; గావున నీరెంటికినిఁ గలసంబంధ *ముపజీవ్యోపజీవకభావము.

విషయము:—'క్షణిక మగువిజ్ఞాన మొక్కటితప్ప నితరపదార్థము లేవియు లేవు. జ్ఞానమే సర్వవిధములుగఁ దోఁచు చున్నది' అనుయోగాచారసిద్ధాంత మీయధికరణమునకు విషయము. ప్రస్తావానుసారముగ'సర్వమును శూన్యమే' అనుమాధ్యమికసిద్ధాంతము కూడ నిందు ఖండింపఁబడినట్లే యగును. సౌత్రాంతికులు బాహ్యపదార్థముల సత్యములుగ నంగీకరించినను వాని ననుమానముచేతనే నిర్ణయింపవలయు నందురు. ఇట్లగుటచే వారును గొంచె మించుమించు యోగాచారుల ననుసరించినవారే యగుదురు. వారిమతములోనిపదార్థ సత్యత్వభాగము వైభాషికమతముతోఁగూడఁ బైయధికరణమున నిరాకరింపఁబడెను. ఇచ్చట 'పదార్థములు అనుమానగమ్యములు' అనుభాగము యోగాచారమతముతోఁ జేర్చి ఖండింపఁబడును.

యోగాచారమతస్వరూపము:—యోగాచారులు తమ మతము నిట్లు స్థాపింతురు. లోకమున వెలుపల కానవచ్చుపదార్థము లన్నియు

---

* ఉపజీవ్యో[illegible] ([illegible])

శూన్యములే. జ్ఞాన మొక్కటియే కలదు* 'ప్రమాణము ప్రమేయము ప్రమితి ప్రమాత' యను నీనాల్గును బుద్ధియొక్క రూపములే. అందు సంపూర్ణముగ శూన్యమయ్యును ఎదుట నున్నట్లు గానవచ్చుఘటాదిరూపములతో నున్న జ్ఞానము ప్రమేయము. దానిని ప్రకాశింపఁజేసి 'ఇది ఘటము. నేను ఘటమును తెలిసికొంటిని' అని యేర్పడుచున్న జ్ఞానభాగము ప్రమితి. ఆప్రమేయమును ప్రకాశింపఁజేయు సామర్థ్యము గలజ్ఞానభాగము ప్రమాణము. ఆప్రమాణము నాశ్రయించి 'నేను దీనిని ప్రత్యక్షమున జూచుచున్నాను' అని యహంకారపూర్వకముగ వ్యవహరించుజ్ఞానభాగము ప్రమాత. ఇవి నాల్గును బుద్ధికి స్వాభావికరూపములు.

'బాహ్యపదార్థములు సత్యములు; పరమాణువులచే గలిగినవి' అను వారుకూడ నీవిషయము నవశ్యకముగ నంగీకరించియే తీరవలయును. వారి మతమునందును ప్రమేయ మొక్కటిమాత్రమే ప్రత్యేకము గాని తక్కినవి మామతమునందువలె బుద్ధిరూపభేదములే (జ్ఞానరూపభేదములే) కదా! అట్లు కాదనిన ప్రమాణప్రమితులు సాధనఫలములే కాకపోవలసివచ్చును. ప్రత్యక్షాదులు ప్రమాణములు; ఇవియే సాధనములు వీనిచే ప్రత్యక్షజ్ఞానాదులు ('నేను దీనిని చూచుచున్నాను' అను మొదలగుజ్ఞానములు) సాధింపఁబడును; కావున నీప్రత్యక్షజ్ఞానాదులు ప్రమాణఫలము లనంబడును. ఇట్లు చూచిన, ప్రమాణము లనంబడుసాధనములకును ప్రమితి యనంబడుఫలంబునకును ఆధార మొక్కటియే యుండి తీరవలయు ననుట నియమము. లోకమున సాధనఫలములకు నట్టిసంబంధమే (ఒక్కస్థలముననుండుట యనుసంబంధమే) కానవచ్చుచున్నది. ఒకచెట్టును నరుకవలయు ననిన దానికి గొడ్డలి సాధనము; చెట్టు రెండుగా భిన్న మగుట ఫలము. ఒకచెట్టుపై గొడ్డలి (సాధనము) యుండిన మఱియొకచెట్టు ఖండము లగుట (మఱియొకవృక్షమునందు ఫలము కలుగుట) సంభవించునా? కావున సాధన

---

† ప్రమాణాదిచతుష్టయము — ఏపదార్థమా నైనను నిర్ణయింపవలయు ననిన బ్రమాత, ప్రమాణము, ప్రమేయము, ప్రమితి అను నాల్గుపదార్థము లుండవలయును. ప్రమాతయనఁగా ప్రత్యక్షాదులచేఁ బదార్థస్వరూపమును నిర్ణయించువాఁడు. ప్రమాణమనఁగా విషయనిర్ణయమునకు సాధనము లగుప్రత్యక్షాదులు (౩౯-వ పుట చూడు). ప్రమేయమనఁగాఁ బ్రమాణములచే నిర్ణయింపఁబడు విషయము. ప్రమితి యనఁగా నిర్ణయము.

ఫలములు రెండు నొక్కచోటనేయుండితీరవలయును. ఇట్లే ప్రమాణప్రమితులు రెండునుఁగూడ నొకజ్ఞానమునందే యుండి తీరవలయును. ప్రమాణము జ్ఞానరూపమే యనుట సర్వసమ్మతము కదా! మఱియు నాజ్ఞానమునకు విభాగాదులు లేవు. అది యొకదానితో సంబంధపడునది కాదు. ఇదియు సర్వసమ్మతమే. ఇట్లుండ నీప్రమాణప్రమితులు సంయోగసంబంధముతో నాజ్ఞానమున నుండుటకు వీలులేదు. కావున * తాదాత్మ్యసంబంధముతోనే యవి (ప్రమాణప్రమితులు) జ్ఞానముననుండవలయును. అదియు నత్యంతభేదము గలపదార్థములకు సంభవించు ననుట యుక్తిశూన్యము. ఈకారణమునలన జ్ఞానంబును ప్రమాణఫలంబులు నొక్కటియే యనవలయును. ఇట్లుండ నిక ప్రమేయము మాత్రము భిన్న మని చెప్పనేల? వీనివలె నవియు జ్ఞానమాత్రములే కావచ్చును; మేము వివరించినపథమున కల్పితములే కావచ్చును.

ఇట్లు కా దనిన నాత్మభిన్నము లగుపదార్థములను గూర్చి వ్యవహరించుచున్నా రనుట యెట్లును సంభవింపనేరదు; విచారింపుడు. వెలుపల నున్నవి యని తలంపఁబడుచున్నపదార్థములు పరమాణువులా ? లేక వానిసమూహములా ? ఇందు మొదటిపక్షము సరియైనది కాదు. పరమాణువు అతిసూక్ష్మ మగుటచే నేత్రమునకు గోచర మగునది కాదు. 'ఇది నల్లనిది' "అనుజ్ఞానము మనకు కలుగుచున్నది. ఇది పరమాణుదర్శనమువలన కలుగుటకు వీలు లేదు. కదా ! ఆపరమాణువులే దట్టముగ నుండుటచే నట్టిజ్ఞానము కలుగవచ్చును. సన్ననిపదార్థము లైనను అనేకములు గుమిగూడిన నొక్కపెద్దపదార్థముగాఁ గానవచ్చుట లోకసిద్ధమే కదా"! అనిన నదియు సరికాదు. పరమాణువులు ఒకటితో నొకటి కలసి ముద్దగా నేర్పడకముందు అది యూరక నొకదానిప్రక్క నొకటి యున్నను దట్టముగ నుండనేరవు; నడుమనడుమ విజాతీయములగు పరమాణువులుకూడ నుండును. రూపపరమాణువులకు నడుమ గంధరసాదిపరమాణువులు కూడ నుండును. ఇట్లుండ వానిని రూపపరమాణుమాత్రముగ ("ఇవి దట్టముగనున్నరూపపరమాణువులేఅని") తలంచుట భ్రాంతియే యగును. కాని యథార్థజ్ఞానము కానేరదు. నడుమనడుమ నవకాశము కలిగి బహుసంఖ్యగలదియై యున్నవృక్ష



* తాదాత్మ్యసంబంధము. (౭౧౦-వ పు. చూ.)

ముల దూరమునుండి చూచినప్పుడు 'ఈవృక్షములు ఒకదానితో నొకటి కలసి యున్నవి' అనుతలంపు కలుగును; అది భ్రాంతి యనుటలో సంశయ ము కలదా! కావున బాహ్యపదార్థము పరమాణువు కానేరదు.

ఇక రెండవపక్షమునాశ్రయించి "పరస్పరము కలసి ముద్దగా నేర్ప డినపరమాణుసమూహమే బాహ్యపదార్థము" అనిన నదియు యుక్తము కాదు. ఆపరమాణుసముదాయము పరమాణువులకంటె వేఱా? కాదా? వేఱైన ఆవునకును గుఱ్ఱమునకును సంబంధము లేనట్లు పరమాణువులకును దానికిని పరమాణుసముదాయమునకును సంబంధమే యుండదు. అప్పుడు బాహ్యపదార్థములకు నుత్పత్తికారణమే లేకపోవును. ఇక వేఱు కాకపో యిన నదియు పరమాణుమాత్రమే కావలయును. ఇట్లయిన పూర్వపక్షమున చెప్పఁబడియున్న దోషములే వచ్చుననుట నిర్వివాదమే కదా! కావున నెట్లును బాహ్యపదార్థములు కల వనుటకు వీలు లేదు. కనంబడుపదార్థ మంతయు పైన వర్ణించినవిధముగ యథార్థ మగుటకే వీలు లేకున్నది కదా! మఱియు జాతి కర్మ గుణములు మొదలగునవికూడ పైన వివరిం చినట్లే పదార్థమునకంటె భిన్నములా? యభిన్నములా? యని విచారింపఁ బోయిన నెట్లును కుదురదు. భిన్నములైన నత్యంతభిన్నములే యగుటచే తాదాత్మ్య ముండుటకు వీలు లేదు; అభిన్నములే యైన నవియు పదార్థ మువంటివే యగుటచే నప్రత్యక్షములె కావలసివచ్చును.

మఱియు లోకమున జ్ఞాన మొక్కటియే యనుట సామాన్యమై యున్నది. యైనను "ఇది ఘట జ్ఞానము, ఇది పటజ్ఞానము" అని భేదవ్యవ హారము కానవచ్చుచున్నది. జ్ఞానమునందు భేదము లేకున్న నీవ్యవహార మెట్లు సంభవించును? బాగుగ విచారించిన జ్ఞానము ఇంద్రియమువలె నాత్మ భిన్నమగుపదార్థమును ప్రకాశింపఁ జేయలేదు. ఇంద్రియము మఱియొక జ్ఞానమును పుట్టించి దానిచే విషయమును ప్రకాశింపఁ జేయును. జ్ఞాన మట్లుచేయుట సంభవింపదు. ఒకజ్ఞానము మఱియొక జ్ఞానమును పుట్టించు ననిన నదియు మఱియొకజ్ఞానమును పుట్టింపవలయు నని ప్రశ్నించుటకు నవకాశ ముండుటచే ననవస్థాదోషము వచ్చును. కా వున జ్ఞానము ప్రత్యక్షమగుటయే విషయము; ప్రత్యక్ష మగుట యని ని ర్ణయించి తీరవలయును. అజ్ఞానంబును భేదములు లేని దగునేని విషయభే దము కూడ లేకపోవలయును. కావున దృశ్యముగ జ్ఞానమునకు విషయా

కారములు కలవు అని చెప్పి తీరవలయును. ఇట్లుండ జ్ఞానమునకు గల యాకారభేదములచేతనే భిన్నభిన్నపదార్థవ్యవహారములు కలుగుచుండ ఇక బాహ్యపదార్థములతో నేమిపని? కావున నీప్రత్యక్షము నాశ్రయించి చూచిన బాహ్యపదార్థములకు నునికియే సంభవింపదు.

మఱియు ఏరెండుపదార్థములలో నొకదానినివిడిచిన రెండవది బుద్ధిగోచరము కాదో? యవిరెండు నభిన్నములే కావలయును; మృత్తికను విడచిన ఘటము కానరాకపోవుటచే నామృద్ఘటములకు భేదము లేదు; తిమిరరోగముగలవానికి చంద్రుడు రెండుబింబములుగ గానవచ్చినప్పుడు ప్రధానచంద్రుడు కానరాకున్న రెండవచంద్రుడు కానరాడు; కావున నారెండుచంద్రబింబములకును భేదము లేదు. ఇట్లే జ్ఞానద్రవ్యములకును భేద ముండకూడదు. జ్ఞానము కానరాకున్న ద్రవ్యముగానరాదు కదా! కావున జ్ఞానభిన్న మగుబాహ్యపదార్థ మేలేదు.

ఈసిద్ధాంతమును విరుద్ధముగ దలంపవలదు. స్వప్నమునందును ఇంద్రజాలమునందును భ్రాంతిసమయములయందును మన కిట్టిస్థితి ప్రత్యక్షముగనే యున్నది. ఆసమయములయందు గానవచ్చుపదార్థములు బాహ్యమున లేవనుట సర్వలోకప్రత్యక్షము కదా! అట్లయినను వానిని బాహ్యములుగ తలంచుచున్నారు కదా! ఇట్లే బాహ్యపదార్థములులేకున్నను జాగ్రద్వ్యవహారము సంభవింపవచ్చును; జ్ఞానమునకు గలపదార్థాకారములే ఎండమావులయందలినీటివలె బాహ్యమున నున్నట్లు తలంపబడవచ్చును. బాగుగ విచారించిన ఎండమావులనీరు సంకల్పరూపమై మన స్సున మాత్రమే యుండును గాని వెలుపల నుండదు కదా! కావున నీ సిద్ధాంతమున దోష మేమియు లేదు.

“ఇది యెట్లు? బాహ్యమున పదార్థములు లేకున్న ‘ఇదినలుపు ఇది తెలుపు’ అని బహువిధము లగుభావన లెట్లు సంభవించును ? లోకమున ఏరెండుపదార్థములలో నొక్కటి యున్నను మఱియొక్కటి వచ్చుచు బోవుచుండునో దానికి (వచ్చుచుబోవుచున్న దానికి) నితరపదార్థమే(శాశ్వతమై యున్నపదార్థమునకంటె భిన్న మగుపదార్థమే) కారణము కావలయు ననుట నియమమైయున్నది. చేతనమునకు నడుచుట మాటలాడుట మొదలగుసర్వకార్యములను చేయుటయందు సామర్థ్య మున్నను ఒకపురుషుడు కూర్చుండియున్న  ...ను; మఱికొ

యొకఁడు మాటలాడుచున్నాఁడు; ఇట్టిసమయములయందు అందఱిచేత నము నొక్కటియే యని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు కదా! ఒక పురుషునిచేతన మల్లే యున్నను మఱియొకపురుషునియందు వ్యాపారము లుకలుగుచున్నవి; కావున వానికిఁ బ్రత్యేకచేతనమే కల దనవలయును కదా! ఇట్లే జ్ఞాన మల్లె యున్నను బహువిధజ్ఞానములు (తలంపులు) కలుగుచున్నవి కావున నాతలంపులకు జ్ఞానభిన్న మగుకారణమేదియో యొకటి యుండి తీరవలయును. ఆకారణమే బాహ్యపదార్థము లనవచ్చును. 'ఇట్లు కాదు విజ్ఞానములకు నీలాదిజ్ఞానముల జనింపఁజేయుసామర్థ్యము కలదు. అన్నియు క్షణికములే యగుటచే నొకజ్ఞానము మఱియొకజ్ఞానమును జనింపఁజేయుచునే యుండవలయును. ఈపక్షమునందు అనవస్థ రాదు; పూర్వక్షణమున నున్నజ్ఞానమునందలిసంస్కారము ఉత్తరక్షణమునందు రెండవజ్ఞానమును కలిగింపకుండిన నాత్మయే లేకపోవలసి వచ్చును. కావున జ్ఞానమునకు గల యీసామర్థ్యము వాసనయనఁబడును. ఆవాసన నీలాదిజ్ఞానములను కలిగించుటకు సిద్ధమగుట పరిపాకస్థితి. వానికిఁ గారణమగుపూర్వక్షణము ప్రత్యయము (అనాదినుండియు క్షణక్షణమునకు జ్ఞానము లుత్పన్నము లగుచున్నవి యనియు అందు నీలపీతాదిబహువిధరూపములు కలవనియు ఒకప్పుడు జనించియున్న నీలాదిజ్ఞానములసంస్కారమువలన నుత్తరకాలమునందును నీలాదిజ్ఞానములు జనించుననియు బౌద్ధులుచెప్పుదురు.) ఇట్లు వాసనయు పరిపాకంబును ప్రత్యయంబును సర్వకాలములయందు నుండునవికాకపోవుటచే నీలాదిజ్ఞానములుకూడ సర్వకాలములయందు నుండునవికానేరవు. 'ఇప్పుడు వ్యవహారసిద్ధికి భంగ మేమి వచ్చును' అనిన నిదియు యుక్తముకాదు. ఈపక్షము నవలంబించిన జ్ఞానస్కంధమునఁ గల విజ్ఞానము లన్నియు నీలాదిజ్ఞానముల కలిగించుచునే యుండవలయును. అప్పుడును ఈజ్ఞానములు 'ఒకప్పు డుండి మఱియొకప్పుడు లేకపోవును.' అనుట సంభవింపదు. మఱియొకపక్షమున జ్ఞానస్కంధమునందలి విజ్ఞానములలో నేదియు నట్టిసామర్థ్యము కలదియే కాకనైనపోవును. ఇదియు ననర్థమే కదా! 'క్షణములు భిన్నములగుటచే వానిశక్తియు భిన్నమగును' అనిన నప్పటికిని సిద్ధాంతమునిలువదు. అప్పుడు నీలాదిజ్ఞానరూప మగుక్షణ మొక్కటియు తత్కారణ మగు క్షణ మొక్కటియు మాత్రమే యా సామార్థ్యమును ( [illegible] ) [illegible] మును కలిగించు

సామర్థ్యమును) కలిగి యుండవలయును కాని తక్కినవి కావు. అనాది నుండియు పరంపరగా వచ్చుచున్న జ్ఞానస్కంధములో నీలవ్యవహారమును కలిగించుక్షణములు రెండు. పీతవ్యవహారమును కలిగించుక్షణములు మఱిరెండు ననుటకంటె హాస్యాస్పద మగు విషయము వే ఱొక్కటి కలదా! ఇట్లుగాక నన్నిటికి నట్టిసామర్థ్యము కలదనిన 'ఇది నల్లనిది' అను జ్ఞాన మెప్పటికి నుండవలసి వచ్చును; కావున నెట్లు చూచినను నీలాదిజ్ఞాన కారణములై బాహ్యపదార్థము లుండియేతీరవలయును. 'ఇప్పటికిమాత్రము బాహ్యపదార్థము లేటికి? నీలాద్యాకారములుగలది మఱియొక జ్ఞాన స్కంధము కాకూడదా! అనిన నదియు యుక్తముకాదు; మీరు(యోగాచారుఁడు) సర్వవ్యవహారములకును రెండవజ్ఞానస్కంధము కారణముగనున్నది యని యంగీకరింపరు; మేమును అంగీకరింపము; ఏపురుషుఁడుచేయు వ్యవహారములకు నాపురుషుని విజ్ఞానస్కంధమే కారణ మని చెప్పుదుము. ఇది విరుద్ధ మనియు వ్యవహారములకు బాహ్యపదార్థములే కారణములు కావలయు ననియు నిదివఱకే నిరూపించితిని. మఱియు మఱియొకజంతువు నాశ్రయించియున్నజ్ఞానస్కంధమే వ్యవహారసాధనము కావచ్చు ననియు నదియు నాంతరమే యగుటచే సర్వవ్యవహారములు నాంతరములే యగు ననియు బాహ్యపదార్థము లక్కఱలేదనియు చెప్పుట కూడ సంభవింపదు. అదియు (మఱియొకప్రాణికి గల జ్ఞానస్కంధంబును) తనజ్ఞానస్కంధమునకు నభిన్నమే యగుటచే పైన చూపినదోషము లన్నియు వచ్చును. మీమతమున జ్ఞానస్కంధములకు దేశకాలాదిరూపవ్యవధానము లేవియు లేవు; జ్ఞానమునకు స్వరూపము లేదు కదా! మఱియు ఒకక్షణమున నొక పురుషునకు సంబంధించినవిజ్ఞానంబును మఱియొకక్షణమున మఱియొకపురుషునకు సంబంధించినవిజ్ఞానంబును ఒకస్థలమునందే జనించు నేని యప్పుడు కదా! జ్ఞానస్కంధములకు కాలకృత మగుభేదమువచ్చును. ఇది మాత్ర మెన్నటికిని సంభవించుటకు వీలు లేదు. అప్పుడు సంసారమునకు నారంభ ముండవలసివచ్చును. ఇది సర్వమతవిరుద్ధము లక్షణక్షణమునకు ననేకపురుషులకు సంబంధించిన జ్ఞానము లుత్పన్నము లగు నేని యప్పుడు ప్రతివానిసంసారమునకును ఒకక్షణ మాదియై యుండుట సంభవించును కదా! కావున నీదోషముల నివారించుటకై బాహ్యార్థములు కలవనియే యంగీకరించుట యుక్తియుక్తము. అప్పుడు జ్ఞానమునకు వేదిగోచరమైన

తద్రూప మగువ్యవహారము కలుగుచుండును ; సుఖాదివ్యవహారంబులును తత్తదనుకూలవస్త్వనుభవముచే జనింపవచ్చును" అని తలంచిన వేమొ (ఈ పూర్వపక్షము సౌత్రాంతికులపూర్వపక్షము) ఇది యుక్తము కాదు.

జ్ఞానస్కంధమునందు గడచిపోయియున్న జ్ఞానము వాసన యనంబడును. దానినుండియే "ఇవినల్లనిది" అను మొదలగువ్యవహారములు కలుగుచున్నవి. ఈవ్యవహారములవలననే మఱల నట్టివాసన లుదయించుచున్నవి. ఆవాసనలు పలుతెఱంగు లగుటచే నీవ్యవహారములును పలుతెఱంగులై యున్నవి. ఆవాసనలు ఒక్కొక్కసమయమునందు మాత్రమే స్వేచ్ఛగా వచ్చునవి యగుటచే నీ వ్యవహారములును ఒక్కొక్కసమయమునందే నియమశూన్యముగ వచ్చుచున్నవి. బీజాంకురములవలె నివి రెండును సంసారమున ననాదులై యున్నవి. ఇట్లుండుటచే సర్వవ్యవహారములును అనియతములుగానే సంభవింపవచ్చును; వాసనాకారణము లగునీలాద్యాకారములును జ్ఞానమునకే స్వతస్సిద్ధములై యుండవచ్చును. ఇట్లుకాదనిన బాహ్యపదార్థముల నంగీకరించినను మీసిద్ధాంతము (సౌత్రాంతికసిద్ధాంతము) నిలువదు. ఎట్లనిన:—

బాహ్యపదార్థములు సత్యములే యైనను నీలపీతాది వ్యవహారము లెట్లు ప్రవర్తించును? ఆయావర్ణములు గలపదార్థములు సమీపమున నుండుటచే ప్రవర్తించు ననవలయును. అప్పటికిని కారణభూతము లగుపదార్థములయొక్క, (పీతాదివర్ణహేతువు లగు పసుపు మొదలగువానియొక్క) సామర్థ్యముచేతనే పీతాదివర్ణములకుఁ గూడ నట్టిసామర్థ్యము (పీతవ్యవహారమును కలిగించు సామర్థ్యము) కలిగె ననవలయును. ఇట్లు చెప్పిన వాసనాభేదముచేతను వానికిఁ గలసామర్థ్యభేదముచేతను జ్ఞానస్కంధమునందలిక్షణములకుఁ గూడ నట్టిసామర్థ్యము (భిన్నభిన్నవ్యవహారముల కలిగించుసామర్థ్యము) కలుగు నని యేల చెప్పఁగూడదు? స్కంధమనఁగా పరంపరయే కాని సమానజాతీయములును సమానస్వభావములు నగుపదార్థములను నియమముగఁ బుట్టించు నొకానొకకారణము కాదు కదా! కావున నావిజ్ఞానములలో పరస్పరము భిన్నము లగుసామర్థ్యము లుండవచ్చును. 'ఇట్లుండుటకు వీలు లేదనియు అప్పుడు రెండుక్షణములు మాత్రమే నీలవ్యవహారమును కలిగింపఁజేయునవి కావలయు ననియు పిదప నెన్నటికిని నీలజ్ఞానము కలుగుటయే సంభవింపకపోవు ననియు చెప్పితిని

కదా!' అనిన నీపూర్వపక్షము యుక్తియుక్తము కాదు. నీయభిప్రాయము (సౌత్రాంతికాభిప్రాయము) నాశ్రయించి చూచినను పైదోషమే వచ్చును. నీవును పదార్థముల సత్యములుగ నంగీకరించినను వానిని క్షణికములనుగా జెప్పుచున్నావు కదా! జ్ఞానములకువలెనే వానికిని సంతానము (ఒకదానివెనుక మఱియొక్కటి జనించుచుంట) నంగీకరించుచున్నావు కదా! ఇప్పుడు చెప్పుము. జ్ఞానసంతానమునకంటె నీలసంతాన మెట్లు భిన్నమో అట్లే నీల సంతానమునందును ఒకపదార్థమునకంటె మఱియొకపదార్థము భిన్నమే యగును. ఇట్లుండ నచ్చట మాత్రము వ్యవహారజననసామర్థ్య మెట్లుకలుగును? భేదము కానవచ్చినప్పుడు వానిస్వభావములకు నియమ మేర్పరుచుటకు వీలు లేదనియేకదా నీవు ప్రత్యేకసంతానముల గ్రహించితివి. కావున బాహ్యపదార్థము లున్నవియని యంగీకరించినను ఈదోషములు తప్పునవి కావు. కావున జ్ఞానస్కంధ మొక్కటియేయున్నను వాసనావైచిత్ర్యమువలన కొన్నిటికి నొక్కసామర్థ్యమే యుండవచ్చును. మఱికొన్నిటికి భిన్నసామర్థ్య ముండవచ్చును. నీవును ఇట్లు చెప్పవలసినవాడవే. నీలసంతానమునకుగారణ మగుపదార్థముయొక్కసామర్థ్యముచే నాసంతానమున నున్నవి యన్నియు నీలాకారజ్ఞానమునే కలిగింపఁగలవనియు పీతసంతానముననున్నవి పీతాకారజ్ఞానమునే కలిగించు ననియు జెప్పవలయును. కావున నెట్లును మాసిద్ధాంతమునకు (యోగాచారసిద్ధాంతమునకు) నెప్పటికిని హానిలేదు.

ఇదియునుగాక *అన్వయవ్యతిరేకముల ననుసరించిచూచినను జ్ఞానమే సర్వవ్యవహారసాధన మని తేలుచున్నది. స్వప్నావస్థ మొదలగు వానియందు బాహ్యపదార్థములు లేకున్నను కేవలజ్ఞానస్కంధమునలననే సర్వవ్యవహారములును ప్రవర్తించుచున్నవి యనుట మన కిరువురకును సమ్మతమే. ఒక్కస్థలమున నిట్లుండ మఱియొకస్థలమున మాత్ర మిట్లేల యుండరాదు జాగ్రదవస్థయందుజరుగు వ్యవహారమునకుమాత్రము బాహ్యపదార్థము లేల యుండవలయును? వాసన యున్నప్పుడు వ్యవహారమున్నది; బాహ్యపదార్థములు లేనప్పుడు వ్యవహారము నశింపలేదుకదా! కావున నెట్లు చూచినను బాహ్యపదార్థములు బొత్తిగనే లేవనుటయే యుక్తియుక్తమగుసిద్ధాంతము.

"ఇట్లు చెప్పినను దోషమే. వేదాంతులు పరబ్రహ్మమును సర్వాత్మకమునుగ చెప్పుదురు. నీవును అట్లే చెప్పిన వారిమతమునే యంగీకరించిన

---

* అన్వయవ్యతిరేకములు (౬౭౦-వ ఫ చూ.

నాడ వగుదువు' అనియెదవేమొ యట్లు కాదు. వారు నీలాద్యాకారము లకును పరబ్రహ్మమునకును గలసంబంధ మనిర్వచనీయ మని చెప్పెదురు; మేముమాత్ర మాయారూపమగు జ్ఞానమునకు వాస్తవ మనియే చెప్పెదము; కావున మామతములు రెండును అభిన్నములు కానేరవు.

## సూత్రము. ౨౮.

అవ:—అని యిట్లు వచ్చిన మతసిద్ధాంతమును ఈయధికరణమున విచారించుచున్నాఁడు "పరబ్రహ్మమునకు సాకారము లేకపోయిన నాయన నుండి ప్రపంచసృష్టి కలుగుటకు వీలు లేదు. అనిర్వచనీయ మని యొకసం బంధ ముండుటకు నెట్లును వీలుకలుగదు. కావున సృష్టికర్తకు నవశ్యముగ నాకార ముండియేతీరవలయును. జ్ఞానస్కంధంబును ఆకారయుక్త మగు టచే సర్వప్రపంచరూపమై వాసనాప్రభావమువలన తన యాకారములను ప్రకటించుచునున్నది. ఇదియే సృష్టి" అని యోగాచారమతసిద్ధాంతా నుసారముగ వేదాంతమతముపై వచ్చిన పూర్వపక్షమును నిరాకరింపు చున్నాఁడు. ఇట్టి పూర్వపక్షములను నిరాకరించుట ప్రథమపాదమునందుఁ జేయవలసినపనియే యైనను మతదూషణముచేతనే సర్వమును నిర్వాహ మగును. కావునను 'పరమేశ్వరుఁడు సాకారుఁడు కా నక్కఱ లేదు' అనువిషయము అనేకవిధములుగ నిరాకరింపఁబడియేయుండుటచేతను ఈ యధికరణ మీపాదమునందే చేర్పఁబడె నని తెలిసికొనవలయును.

## ౧౮౯. నాభావ ఉపలబ్ధేః. ౨. ౨. ౨౮.

తాత్పర్యము:—ఈయోగాచారమత మెట్లును యుక్తియుక్తము కానేరదు. సర్వజనానుభవసిద్ధములై సర్వప్రమాణగోచరములై యున్న బాహ్యపదార్థములు శూన్యరూపము లగుట యెట్లు సంభవించును ?

విచారించి చూడుఁడు. యోగాచారులు బాహ్యపదార్థముల శూన్యరూపములనుగాఁ జెప్పుచున్నారుకదా! దానిని సాధించుటకు హేతు వేది కలదు? బాహ్యపదార్థములు కానరాకుండుటచే నట్లు చెప్పిరా ? కాన వచ్చినను ఆదృష్టి బాహ్యపదార్థవిషయము కా దనునభిప్రాయముతో నట్లు చెప్పిరా ? లేక ఆదృష్టి కూడ బాహ్యపదార్థవిషయమే యైనను ప్రమాణాంతరములవలన బాహ్యపదార్థస్థితి బాధింపఁబడుచున్నది యను నభిప్రాయముతో నటు సిద్ధాంతము చేసిరా?

ఇందు మొదటిపక్షము యుక్తము కాదని వేఱొకవూరు చెప్ప నక్కఱలేదు. సర్వపదార్థములును ప్రత్యక్షముగా జ్ఞానగోచరము లగుచున్నవి. 'ఇది స్తంభము ఇది ఘటము ఇది గోడ' అను మొదలగుపదార్థవ్యవహారములు సర్వజనులకును ప్రత్యక్షసిద్ధము లయ్యే యున్నవి కదా! అనుభవములో నున్నవానిని శూన్యము లని చెప్ప నెవ్వఁడు సాహసించునో సంపూర్ణముగ భుజించి తృప్తిఁగొంది 'నేను భుజింపలేదు. నాకు తృప్తియుఁ గలుగలేదు' అని చెప్ప నెవ్వఁడు సాహసించును? కావున బాగుగ విచారించిన నింద్రియగోచరము లగువానిని సత్యములనుగానే యంగీకరించి తీరవలయును.

ఇక రెండవపక్షము నాశ్రయించిన నదియు యుక్తిశూన్యమే. అనుభవమున్నను అది బాహ్యవిషయములను గురించినది కాదనిన నిక దానికి విషయమెద్ది? "అనుభవము" అనినతోడనే దానికి కర్మభూతనుగు పదార్థ మొక్కటి యవశ్యముగ నుండి తీరవలయును కదా! సాక్షియగు వాఁడు తనకును అనుభవమునకును భిన్న మగుపదార్థము ననుభవించు ననుటయు అనుభవము కార్యరూప మగుటచే దానికి పదార్థాంతరముపై ప్రవృత్తి యుండవలయుననుటయు సర్వవాదిసమ్మతము. ఇట్లుండ బాహ్యపదార్థములు లేకపోవుట యెట్లు? బలాత్కారముగఁగూడ ప్రతివాఁడు నీ విషయము నంగీకరింపవలసినదియే అనుభవము తన్నుతానే యనుభవించు ననుటకాని సాక్షియైనను అనుభవమునే యనుభవించుననుట కాని యెందును సంభవింపదు 'వ్రేలు తన్ను తానే స్పృశించుచున్నది ఖడ్గము తన్ను తానే ఖండించుకొనుచున్నది.' అనువాక్యము నెవ్వరికైన యుక్తియుక్తములుగఁదోచునా? మఱియు వారును (యోగాచారులును) ఒకవిధమున నీపక్షము నంగీకరించియే యున్నారు. వారు "జ్ఞేయపదార్థములు జ్ఞానము యొక్క రూపములే. అవి వెలుపల నున్నవానివలె కానవచ్చుచున్నవి" యనుచున్నారు. వాస్తవస్థితిలో వెలుపలనున్నవి శూన్యములే యైన నీసిద్ధాంత మెట్లుసంభవించును. "ఈపురుషుఁడు గొడ్రాలికొడుకువలెనున్నాఁడు" అని యెవ్వరైన చెప్పుదురా? కావున లోకానుభవానుసారముగ నిర్ణయింపంబూనిన బాహ్యపదార్థములయందు సత్యత్వమునే యంగీకరింపవలయునుకాని వేఱొకయుపాయములేదు. 'బాహ్యపదార్థములవలె లోపల నున్న జ్ఞేయరూపములు ప్రకాశించుచున్నవి' అనుట యుక్తముకాదు.

ఇక మూఁడవపక్షము నాశ్రయించి బాహ్యపదార్థము లుండుటకే వీలు లేదనియు ఈకారణముచేతనే "సర్వాకారములును జ్ఞానముననే కలవు" అని చెప్పుటయే యుక్తియుక్త మనియు చెప్పుట సరి కానేరదు. 'లోపల నున్నజ్ఞేయపదార్థములు బాహ్యములవలె కానవచ్చుచున్నవి యనుట బాహ్యపదార్థసత్యత్వము నంగీకరించి కాదు. లోకులు భ్రాంతులై తమకంటె భిన్నము లగుబాహ్యపదార్థముల జూచుచున్నారు. కావున వారికి దెలియుటకై మాత్రమే యట్లు చెప్పఁబడెను' అనుటయు ఆదరణీయము కాదు. 'లోకమున ఈపదార్థము కలదా? లేదా?' అని నిర్ణయించుటకు ప్రమాణములు సాధనము లగును కాని ప్రమాణములను("ఈవిషయమునందు ప్రమాణములు ప్రవర్తించునా)? లేదా ?" అనువిషయమును నిర్ణయించుటకు పదార్థభావాభావములు కారణములు కానేరవు. ప్రత్యక్షాదులలో (దేనిచేతనైనను గ్రహింపఁబడువిషయము సత్య మనియు అట్లు గ్రహింపఁబడనివిషయ మసత్య మనియుఁ చెప్పఁబడును. ఇది లోకానుభవసిద్ధము. ఇట్లుండ ప్రమాణములచే గ్రహింపఁబడు బాహ్యపదార్థములు ఉండుటకు వీలు లేదనుట యెట్లు? "దానికి తగినయుక్తుల నిదివరకే నిరూపించిరి. (తిమి)" అందు కేమో ఆయుక్తులును "జ్ఞానముననే యాకారము కలదు" అనువిషయమున సహాయము చేయనేరవు. ఒకవిశాలచిత్రపటము కన్నులయెదుర నున్నప్పుడు లోకానుభవము ననుసరించి చూచిన "చిత్రపటము కన్నులకుఁ గానవచ్చుచున్నది. బాహ్యమున నున్న చిత్రపటము సత్యము. దానినిగూర్చిన యనుభవము కలుగుచున్నది." అని మాత్రమే చెప్పవలసియున్నది. వారు మాత్రము (యోగాచారులు మాత్రము) జ్ఞానముననే చిత్రపటము కలదనియు భ్రాంతివలన నదియే వెలుపల నున్నట్లు గానవచ్చుచున్నది యనియుఁ జెప్పుదురు. మనము చిత్రపటమున ననేకవర్ణముల జూచుచున్నాము. అవి పరస్పరము విరుద్ధములుగ గూడ నున్నవి. చిత్తరువునందు ఒకస్థలమున నలుపు మఱియొకస్థలమున తెలుపు కూడ నుండును కదా! మఱియు నావస్త్ర మొకవైపు వాత వేగముచే కదలుచుండ వచ్చును; మఱియొకవైపు కారణాంతరముచే నిశ్చలమై యుండవచ్చును. ఆపటమంతయు నొక్కజ్ఞానముయొక్క యాకారమేయైన నం దిన్నివిరుద్ధ ధర్మము లుండుటకు వీలుకలదా? ఇన్నిటికి నిన్ని ప్రత్యేకజ్ఞానములు కల

వనిన వానికి నైక్యానుభవము కలుగుటకే వీలులేదు. ఇట్లుండ నిక నా జ్ఞానమునందుమాత్రము స్థూలత్వ మెట్లేర్పడును? ఏర్పడకున్న "ఇది చిత్రపటము" అను స్థూలపదార్థానుభవ మెట్లు కలుగును? కావున బాగుగ విమర్శించినచో పదార్థవిషయమున వారిచే (యోగాచారులచే) జెప్పఁబడినదోషము లన్నియు "జ్ఞానమే యాకారవంతము" అను సిద్ధాంతమునగూడ వచ్చును. కావున సర్వప్రమాణములును ప్రవర్తించుచున్న బలము నాశ్రయించి సర్వలోకానుభవసిద్ధ మగురీతి బాహ్యపదార్థ సత్యత్వము నంగీకరించుటయె యుక్తమగు కార్యము.

మఱియు వారు "బాహ్యవిషయములతో సమాన మగురూపము జ్ఞానమునకు గలదు" అని చెప్పుచున్నారు. ఈ సిద్ధాంతమువలనఁ గూడ వారు బాహ్యపదార్థములయం దభావమును స్థాపింపనేరరు. బాహ్యవిషయములే లేకున్న వానితో జ్ఞానాకారమునకు పోలిక యెట్లు కలుగును? మఱియు "*ఏది దేనియొక్కజ్ఞానము నాశ్రయించియే తెలియంబడుచుండునో ఆరెంటికి నభేదమే యుండవలయును." అనియు జ్ఞానపదార్థములు

---

* యద్యేన, సహోపలభ్యతే అనునది హేత్వాభాసము. 'యద్యేన సహోపలభ్యత్తే తత్తన్న భిద్యతే' ఏది దేనితోఁ గూడ గానవచ్చుచుండునో అనఁగా ఏరెండు పదార్థములు నియతములై యొకదానితో నొకటి కానవచ్చుచుండునో ఆరెండుపదార్థములును అభిన్నములే యగును' అను హేతువు యుక్తియుక్తము కాదు. ఈనియమమును సిద్ధాంతముఁ జేయుటకు వీలు లేదు. కాంతి (లేకున్న)ఁ బదార్థములు ప్రత్యక్షములు కాకున్నవి కదా! కాంతి దృగ్గోచర మైనప్పుడే కాని పదార్థములు దృగ్గోచరము లగుట లేదు కదా కాంతికిని ఘటాదులకు నభేదముఁ జెప్పుట యుక్తియుక్తమగునా! ఇది లోకవిరుద్ధము. ఇట్లగుటచేత నే 'భావే చోపలబ్ధేః(చూ. ౨-౧-౧౫.)' అను సూత్రమున సూత్రకారుఁడు భావమునుఁ గూడ హేతువునందుఁ జేర్చెను. 'ఏ రెండుపదార్థములు ఒండొరుల యునికినిలనను ప్రకాశమునలనను ఒండొరులస్థితినిఁ జెంది ప్రకాశించుచుండునో వానికి రెంటికి నభేదము' అని చెప్పెను. ఇట్లు చెప్పిన నైదోషము రాదు. యెట్లనిన:—కాంతి దృగ్గోచర మైనప్పుడు పదార్థములును దృగ్గోచరము లగు లగుచున్నవి యనుట సత్యమే కాని వానియునికికిఁ గాంతి యొక్కయునికితోఁ నావశ్యకత లేదు. రాత్రులందును బదార్థములు కలవు కదా! కావున ఏనియమము కార్యకారణములయందుమాత్రమే యప్పుడు సంభవించును. మట్టిలేనిది కుండ లేదు; మట్టి దృగ్గోచరము కానిది కుండయు దృగ్గోచరము కాదు. కదా! వీనికి రెంటికి నభేదము కలుగుటయు వలన (వేదాంతులకు) నన్యులకును

రెండు నిట్టివే కావున వానికి నభేదము కలదనియు చెప్పుదుము. ఇదికూడ యుక్తము కాదు. జ్ఞానపదార్థములు ఒకటిగా నున్నట్లు అనుభవింపఁబడు చున్నవా? లేక ఒక్కస్థలమున ననుభవింపఁబడుచున్నవా? ఇందు మొదటి పక్షము సరికాదు. జనులందఱును జ్ఞానము నాంతరముగాను పదార్థముల బాహ్యములనుగాను గ్రహించుచున్నారు. అనుభవించుచున్నారు కదా! ఇక రెండవపక్షము నాశ్రయించిన నదియు యుక్తియుక్తము కానేరదు. ఒకస్థలమున ననుభవింపబడినవి యన్నియు నభిన్నములు కానక్కఱలేదు. కాంతియు ఘటాదిపదార్థంబులు నొక్కస్థలముననే యనుభవింపఁబడుచు న్నవి. కాంతిలేకున్న నెవ్వఁడును పదార్థములఁ జూడఁగలుగుట లేదు. ఆ రెంటికిని అభేదముకలదా? లేదు కదా! కావున ఏపదార్థము ఏయుపాయ ముచే నియమముగ గ్రహింపఁబడునో అవి (*ఉపాయోపేయములు) రెం డును కూడ నొక్కస్థలమునందే యనుభవింపఁబడును. కావున సాక్షి లేక పదార్థానుభవము కలుగదు కావున నివిరెండు నొక్కస్థలమున ననుభ వింపఁబడుచున్నవి. లోకానుభవము ననుసరించి చూచిన నిదియే నిశ్చయ మగును. కావున జ్ఞానపదార్థములకు గల సహానుభవమునకు వాని యభేద ము కారణము కానేరదు. మఱియు రెండుపదార్థములు గోచరము లైనప్పు డు ఆపదార్థములకుమాత్రమే భేద మున్నట్లును జ్ఞానముమాత్ర మొక్క టియే యైనట్లును లోకు లనుభవించుచున్నారు. "ఇది ఘటజ్ఞానము ఇది పటజ్ఞానము" అను మొదలగుస్థలములయందు "ఇది నల్లనియావు ఇది తెల్లనియావు" అను మొదలగు స్థలములయందువలె విశేషణము లగు ఘటములకే భేదము గానవచ్చుచున్నది యనుటయు విశేష్య మగు జ్ఞాన మునకు భేదము లేదనుటయు ప్రత్యక్షసిద్ధములై యున్నవి కదా! ఈపదార్థములు జ్ఞానాకారభేదములే యగునేని ఇది సంభవింపఁదనుట నిర్వివాదము. మఱియు "ఘటదర్శనము ఘటస్మరణము" అను మొద లగు స్థలములయందును "క్షీరరసము క్షీరగంధము" అను మొదలగు స్థలములయందువలె జ్ఞానభేదము లగు దర్శనస్మరణములకే భేదము

గూడ సమ్మతమే. కావున ఈ 'యద్యే సహోపలభ్యేతే' యనుహేతువు కార్యనిరావ హార్థమై యుపయోగింపదు.

* ఉపాయ మనఁగా నొకదానిని సంపాదించుటకుగాని నిర్ణయించుటకుఁగాని సాధనమగునది యుపాయము. దానిచే సాధింపఁబడునది యుపేయము.

గానవచ్చుచున్నది గాని ఘటమునకు లేదు. కదా! కావున పదార్థభేద మున్నప్పుడు కూడ జ్ఞానమొక్కటియే యగుచుండుటచేతను జ్ఞానవృత్తి భేదమున్నప్పుడు కూడ పదార్థ మొక్కటియే యగుచుండుటచేతను జ్ఞాన పదార్థములకు నభేదము సంభవింపదు; బాహ్యపదార్థములు శూన్యరూప ములనుటయు యుక్తియుక్తము కానేరదు.

మఱియు నీసిద్ధాంతము నాశ్రయించిన వారిమతమునందు చేయఁ బడిన సర్వప్రతిజ్ఞలును నిర్మూలములు కావలసివచ్చును. వారిమతమున విజ్ఞానస్కంధము కూడ క్షణికమే కదా! అట్లయిన నెప్పుడు పుట్టినజ్ఞాన మప్పుడే నశించును. ఇట్లయిన రెండుపదార్థముల నొక్కమాఱు బుద్ధిగో చరము చేసికొనుటకే వీలు కలుగ దనుట నిస్సంశయమే కదా! ఇది సర్వ వ్యవహారములకును విరోధి యగును. ఇతరమతస్థులమాట యట్లుండెఁ. వారే 'జ్ఞానములు పరస్పరభిన్నములై యుండును. ఈకారణమువలననే లోకమున పదార్థములయందు భేదవ్యవహారములు కలుగుచున్నవి.' అని చెప్పియు న్నారు. జ్ఞానములు క్షణక్షణమునకు నశించునవియగునేని యీభేద మెట్లు తెలియవచ్చును? మఱియు 'సర్వపదార్థములకును ప్రత్యేకలక్షణములు కలవు. అన్నియు బరస్పరము భిన్నములే' అని చెప్పుదురు; 'అన్నియు' అను మాటయే లేకున్న నిది యెట్లు సంభవించును? క్షణికవాదము ననుసరిం చిన నెప్పటికి కప్పు డుండునది యొక్కపదార్థమే కదా! ఇట్లే వారంగీకరిం చుబంధమోక్షములు కూడ క్షణికవాదమున నిలువవు. బంధ మనిన బంధిం చునది బంధింపఁబడువాఁడు బంధము అనుపదార్థములు మూఁ డుండిన గాని సంభవింపదు; మోక్షంబు నట్టిదియే. కావున సర్వము జ్ఞానాకారభే దములే యనుసిద్ధాంతము యుక్తిశూన్యమే.

మఱియు లోకానుభవానుసారముగ జ్ఞానము నంగీకరించుచున్న ప్పుడు బాహ్యపదార్థముల మాత్ర మేల యంగీకరింపఁగూడదు? జ్ఞానము వలెనే యవియు ననుభవములోనే యున్నవి కదా! 'అట్లే యున్నను జ్ఞానము దీపమువలె స్వయముగనే యనుభవింపఁబడుచున్నది (తన్నుతా నే యనుభవించుచున్నది) పదార్థము లట్లులేవు. కావున జ్ఞాన మొక్కటియే సత్యము కాని పదార్థములు కావు.' అనిన నది యుక్తము కాదు. ఒకఖడ్గ ము తన్ను తాను కోసికొననేరదు. ఒకవ్రేలు తన్ను తాను స్పృశించుకొన నేరదు. ఇట్లే ఏపదార్థముకూడ తనవిషయమై తానే కార్యము నాచరించు

కొననేరదు. ఇట్లయినను జ్ఞానమునందు మాత్ర మిట్టివిరుద్ధధర్మము నంగీకరించుట కెట్లు వీలుకలుగును? ఇంత విరుద్ధమైనను ఇదిసమ్మతమగువారికి లోకానుభవసిద్ధమై యవిరుద్ధమై యున్న బాహ్యపదార్థప్రకాశనము (జ్ఞానము తనకంటె భిన్నము లగుబాహ్యపదార్థముల ప్రకాశింపఁజేయు ననుట) సమ్మత మేల కాదో చిత్రముగ నున్నది. బాగుగ విచారించిన బాహ్యపదార్థములు లేకున్న జ్ఞానము ప్రత్యక్ష మగుటకే వీలు లేదు. అప్పుడు దానికి విషయమే యుండదు; ఏపదార్థమునకుఁ గాని ఆత్మవిషయ మగుప్రవృత్తి సంభవింప దని యిదివరకే నిరూపించియున్నాము. కావున నెట్లు చూచినను ప్రత్యక్షానుభవానుసారముగ బాహ్యపదార్థములు కల వనియే యొప్పుకొనకతప్పదు. 'ఇట్లు కాదు విజ్ఞానము తనకంటె భిన్నమగు పదార్థమునే గ్రహించునది యగునేని యనవస్థాదోషము వచ్చును; ఒకపదార్థమును నేత్రము చూచుచున్నప్పుడు మొట్టమొదట నానేత్రము పురుషునకు ప్రత్యక్షము కావలయును. ఇట్లు కాకున్న 'నాకు పదార్థము కానవచ్చుచున్నది' అనుజ్ఞానము కలుగుటకు వీలులేదు. ఈవ్యవహారమును విమర్శించిన పదార్థ మొక్కటియు దానిని చూచుటకు సాధన మగునేత్ర మొక్కటియు ఆనేత్రమునకుఁ గూడ సాక్షి యగునాత్మరూప మొక్కటియు నున్నట్లు గానవచ్చుచున్నది. ఇట్లు విచారించిన నావిజ్ఞానమునకు మఱియొకసాక్షి సంగీకరింపవలసివచ్చును. అప్పుడు ఆసాక్షియు నిట్టివాఁడే కావున వానికిని మఱియొకసాక్షి కావలయును. ఇట్లు సాక్షుల నంగీకరింపఁదలంచిన నెప్పటికిని ముగింపు కలుగదు. మఱియు నొకజ్ఞానమునకు నొకసాక్షి కలదనిన నారెంటికి స్వభావ మొక్కటియే యగుటచే రెండుదీపము లొండొంటిని ప్రకాశింపఁజేయలేనట్లు అవియు నొండొంటిని ప్రకాశింపఁ చేయనేరవు. కావున నీయనవస్థాదోషము పోవుటకై వారట్లు సిద్ధాంతము చేసియుండవచ్చును. విజ్ఞాన మొక్కటియే కల దనియు అది తన్ను దానే ప్రకాశింపఁజేసికొను ననియు చెప్పి యుండవచ్చును;' అనిన నదియు యుక్తముకాదు. వినుము.

పదార్థముతోఁబాటు తదనుభవము కూడ సాక్షికి (పురుషునకు) ప్రత్యక్ష మగుచున్నది యనుట లోకానుభవసిద్ధము. ఈయనుభవము నెట్లయినను సమర్థింపవలయును కాని దీనికి విరుద్ధముగ సిద్ధాంతము చేయఁబూనుట యుక్తము కాదు. లోకానుభవము భ్రాంతిరూపముగఁ గూడ

నుండవచ్చు ననుట సత్యమే యైనను సాధ్యమగునంతవరకు ననాదిసిద్ధ మగువ్యవహారమును త్రోసివేయఁగూడదు. సర్వానుమానములకును ఇంత యేల సర్వసిద్ధాంతసంస్థాపనలకును లోకవ్యవహారమే కదా యాధారము. మఱియు లోకవ్యవహారమును భ్రాంతిసిద్ధ మని విడుచుట మనమతమునకు (వేదాంతమతమునకు) యుక్తమగును కాని యన్యులకుఁ గాదు. మనకు నద్వితీయ మగు బ్రహ్మమే పరమార్థము; కావున తద్భిన్నములగునవి యన్ని యు నసత్యములే కావలసివచ్చుటచేతను సత్యములుగ దోచుచుండుటచే తను భ్రాంతికల్పితము లని యేర్పడుచున్నవి. వేదాభిప్రాయ మగుటచే దీని నిట్లంగీకరింపవలసి వచ్చినది. యుక్తికిని విరుద్ధము కాకుండుటచే నిదియే చక్కని సిద్ధాంతమగుచున్నది. ఇక నన్యులవిషయ మిట్టిది కాదు. వారికి పరమార్థదశయందును ఉత్పత్తివినాశములు మొదలగునవి కలవు కదా! కావున నెట్లును లోకవ్యవహారమునకు విరోధము రాకుండున ట్లే సిద్ధాం తము చేయవలయును ; అనవస్థాదిదోషాదులనుకూడఁ బోఁగొట్టవల యును. వారిమతమునందు విజ్ఞానమునకంటె భిన్న మగుచేతనమే లేకపోవు టచే నాదోషములను పోగొట్టుకొనుటకు వారిమతమున వీలులేదు. నిత్యుఁ డగుసాక్షి నొక్కని నంగీకరించియుండిన నీదోషములు రాకపోవును. అ ట్లంగీకరించుటచేతనే మనమతమున (వేదాంతమతమున) నాదోషములు రావు. ఎట్లనిన:—

మనమతమున "విజ్ఞానమనఁగా చిత్తవృత్తి; అది జడము; అద్దము వలె మిగుల నిర్మల మైనది. సాక్షి నిత్యుఁడు;సర్వవ్యాపి. ఆయన యాచిత్త వృత్తియందు ప్రతిబింబించును. తత్క్షణమే యదియు చేతనముచే నాక్ర మింపఁబడినది కావున చేతనసదృశమై బాహ్యపదార్థముల ప్రకాశింపఁ జేయును." అనుటయే సిద్ధాంతము, ఇప్పు డనవస్థాదోష మేల వచ్చును? చిత్తవృత్తిరూప మగువిజ్ఞానమునకును సాక్షికిని తాదాత్మ్యసంబంధము కలదు కావున విజ్ఞానము ప్రకాశించుటయే సాక్షి ప్రకాశించుటయగును. మఱియు చేతనుఁడగుసాక్షికిని అచేతన మగుచిత్తవృత్తికిని స్వభావభేదము కలదు; కావున నాసాక్షి చిత్తవృత్తిని విషయమును కూడ గ్రహింప వచ్చును. ఆచిత్తవృత్తియు స్వచ్ఛమగుటచే దానికి సాక్షి ప్రతిబింబగ్రహ ణమునందు (సాక్షికి గోచర మగుటయందు) మఱియొకదానిసహాయ మక్కఱ లేదు. 'సాక్షికి మఱియొక సాక్షి యుండవలసినదియే కదా'

అనియెద వేమొ యట్లు చెప్పనక్కఱ లేదు. సాక్షి నిత్యుఁడు; స్వతస్సిద్ధుఁడు. ఇట్లగుటచే వానికి మఱియొకసాక్షి యక్కఱ లేదు. ఉత్పత్తివినాశములు గాని మఱి యేవికారములు గాని యుండెనేని యప్పుడు వానిని గ్రహించుటకు మఱియొకసాక్షి యుండవలయును. కాని మనమతమున సాక్షికి నట్టివికారములు లేవు, కదా! లోకానుభవము ననుసరించి చూచిన నీపక్షమే సిద్ధాంతమగును. ఎచ్చటను చేతనసహాయము లేక కేవలక్రియలు కార్యము నాచరించుట లేదు. వంటచేయునప్పుడు ఒకచేతనుఁడు (పురుషుఁడుగాని స్త్రీగాని) వండుట యనుక్రియచే వండబడవలసిన పదార్థము నాక్రమించును; ఒకవృక్షమును ఖండింపవలసినప్పుడు ఖండనక్రియతో దాని నాక్రమించును. ఇంతయే కాని క్రియ స్వయముగగాని మఱియొకదాని సహాయముతోఁగాని యొకకార్యము నాచరించుట లేదు. ఆచేతనులకును మఱియొకసాక్షు లుండవలసినపని లేదు. లౌకికులు దేహాత్మాభిమానముచే బద్ధులై భేదభావనకలిగి యున్నారు. కావున వీరియం దొకానొకచోట స్వాతంత్ర్యభంగము కానవచ్చినను నిరంజనుఁ డగుపరమేశ్వరునకు నట్టిది గలుగ నక్కఱ లేదు. అనుభవమునందును 'నేను ఘటమును చూచుచున్నాను' అను మొదలగు వ్యవహారములయందు దృశ్యదర్శనములకంటె భిన్నుఁ డగుద్రష్ట యున్నట్లు తెలియవచ్చుచున్నది; కాని వానికిని మఱియొకసాక్షి కలఁడని తెలియవచ్చుట లేదు. "కొన్నిస్థలములయందు 'నేను ఘటమును చూచుచున్నా ననుట ప్రత్యక్షముగానే యున్నది' అను వ్యవహారముకూడ కలదు కదా" యనియెద వేమొ వినుము. అప్పుడు చిత్తవృత్తిరూప మగువిజ్ఞానమునకును అందలిప్రతిబింబమునకును భేదము గ్రహింపఁబడలే దని తెలిసికొనవలయును. ఆప్రతిబింబంబును చిత్తవృత్తి యుదయించినప్పు డుదయించుచు నస్తమించునప్పు డస్తమించుచు నుండుటచే భ్రాంతిమూలక మగుజ్ఞానాజ్ఞానవ్యవహారము ప్రవర్తించుచున్నది. కావున నెట్లుచూచినను సాక్షిస్వతస్సిద్ధుఁడగుటచే నాతనికి మఱియొకసాక్షి యుండవలసినపని లేదు. వేదాభిప్రాయ మిదియే యనువిషయము ప్రథమాధ్యాయమున వివరించియున్నాను కావున నిచ్చట మఱలఁ జెప్ప నక్కఱ లేదు. ఇట్లు సిద్ధాంతము చేసిన లోకానుభవమునకు విరోధము కలుగదు; వేదమునకును సమ్మతి కలుగును. ఇట్లుండ నీమార్గమును విడిచి విజ్ఞానస్కంధమే చేతన మనియు నది క్షణిక మనియు బాహ్యపదార్థములు దానికంటె

భిన్నము లగునేని యది (విజ్ఞానము) మఱియొకసాక్షికి ప్రత్యక్షము కావ లసివచ్చుటచే ననవస్థాదోషము దుర్నివారమై సంభవించుటచే దానిని నిరాకరించుటకై, జ్ఞానపదార్థముల కభావము నంగీకరింపవలయు ననియు చెప్పనేటికి? కావున నిర్వివాదముగ బాహ్యపదార్థములు సత్యములే.

మఱియు వారిమతమున (యోగాచారమతమున) విజ్ఞానము క్షణ క్షణమునకును నశించునదియగుటచే దానికి సాక్షి యుండవలయునని యిది వరకే చెప్పితిమి. వారుమాత్రము "జ్ఞానము దీపమువంటిది దానిని మఱి యొకసాక్షి ప్రకాశింపఁజేయనేరఁడు" అని చెప్పుచున్నారు కాని యది పైనఁజూపిన సిద్ధాంతమువలననే యుక్తము కాదు. లోకమునందు దీపము కూడ పురుషదృష్టి నాశ్రయించి ప్రకాశించుట స్పష్టముగ తెలియవచ్చు చున్నది. విజ్ఞానంబును క్షణిక మగుటచే తత్ప్రకాశన మన్యులచే జేయఁ బడవలయుననుట యుక్తిసిద్ధమై యున్నది. ఆవిజ్ఞానము నిత్యమైనచో ను త్పత్తివినాశములు మొదలగువికారములులేవు; కావున నప్పుడు సాక్షిలేక పోవచ్చును గాని అట్లు కానిచో దానిని చూచుసాక్షి లేకున్న నదికలదో? లేదో? యనువిషయమే సంశయాత్మక మగును; అప్పుడు ఏప్రమాణము లును దానివిషయమున ప్రవర్తించుటకు వీలులేదుకదా! ప్రమాణ ముండిన సాక్షియు నుండవలసినవాఁడే యనువిషయ మిదివరకే సిద్ధాంత మైనది. కావున నెట్లును బాహ్యపదార్థములు సత్యములే. విజ్ఞానము జడ మగునేని యప్పుడు సర్వమును సిద్ధించు నని పైన నిరూపించియే యున్నాము కదా!

## సూత్రము. ౨౯.

అవతారిక:—ఇట్లు యోగాచారమతప్రమాణము లన్నిటిని ఖం డించి వారిదృష్టాంతమును ఖండింపుచున్నాఁడు.

## ౨౦౦. వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్.

## ౨. ౨. ౨౯.

తాత్పర్యము:—మఱియు వారు (యోగాచారులు) తమమతము నిలుచుటకై స్వప్నాదుల దృష్టాంతములుగఁ జెప్పుచున్నారు. స్వప్నాదు

లయందు గలుగుజ్ఞానమువలెనే జాగ్రదవస్థయందు కలుగుజ్ఞానము కూడ జనింపవచ్చు ననుచున్నారు. స్వప్నాదులయందు దోచుపదార్థములవలెనే జాగ్రదవస్థయందలిపదార్థములును శూన్యరూపములే కావచ్చు ననుచున్నారు. ఇది యుక్తిశూన్యము. స్వప్నాదులయందలిపదార్థములకును జాగ్రదవస్థయందలిపదార్థములకును భేదము కలదు. స్వప్నాదులయందలిపదార్థములు జాగ్రత్పదార్థములచే బాధింపఁబడుచున్నవి. జాగ్రదవస్థ నొందిన ప్రతిపురుషుఁడును "నేను నిదురయందు ఒకమహాజనసమూహమును చూచితిని. అప్పుడు ఆసమూహ మెక్కడిది? మనస్సునందు నిద్రాదోష ముండుటచే నట్లు గానవచ్చినది" అని స్వప్నమునుగూర్చి వ్యవహరించుచున్నాఁడు కదా! కావున స్వప్నజాగ్రత్పదార్థములు సమానధర్మములు కానేరవు. జాగ్రత్పదార్థములు స్వప్నపదార్థములను బాధించుచున్నవి. ఇట్లుండ నవియు బాధితము లగుట యెట్లు సంభవించును? వినాశోన్ముఖ మగునది యన్యమును నశింపఁజేయగలదా! మఱియు నవి (జాగ్రత్పదార్థములు) ఏయవస్థయందు గాని బాధ నొందవనుట సర్వానుభవసిద్ధము.

మఱియు స్వప్నావస్థయందు మనస్సు మాత్రమే శేషించియుండు ననుట సర్వానుభవసిద్ధము. ఈకారణమువలన నప్పుడు సంస్కారములు మాత్రమే నిలచి యున్నవి; వానినుండియే పదార్థజ్ఞానముకలుగుచున్నది. ఇట్లగుటచే నది స్మృతి యగును. జాగ్రదవస్థయందు కలుగుజ్ఞానమన్ననో అనుభవము. ఇచ్చట నింద్రియములు మొదలగునవి గూడ గలవు కదా! ఇట్లగుటచే స్వప్నజాగ్రదవస్థలును అందలివిజ్ఞానములు నొక్కటి కానేరవు. పదార్థములు లేకున్నను స్మృతి కలుగవచ్చును; నిద్రాదోషమువలన నాపదార్థములు ప్రత్యక్షములుగ నున్నట్లు తోచవచ్చును. అనుభవము మాత్ర మట్లు కలుగునది కాదు. దానికి పదార్థము లెదుట నుండవలయును. ఇంద్రియములవలనగాని గుఱుతువలనఁగాని పోలికవలనఁగాని ఆప్తవాక్యమువలనఁ గాని గలుగుజ్ఞానమే కదా! యనుభవ మనఁబడును. ఇట్లగుటచే "జాగ్రజ్జ్ఞానము కూడ స్వప్నజ్ఞానమువంటిదే" అనుట యుక్తియుక్తము కానేరదు. తానే వానిలోనిభేదమును ప్రత్యక్షముఁగా ననుభవించుచుండియు దానిని(అభేదమును)నిరాకరింపఁజూచుట ఏటియుక్తి ?

మఱియు నాయోగాచారులు బాహ్యపదార్థముల శూన్యము లని చెప్పఁదలఁచి యది లోకానుభవవిరుద్ధ మగుటచే స్వప్నాదుల దృష్టాంత

మునుగాఁ జెప్పిరి;జాగ్రత్పదార్థములయందు స్వప్నపదార్థధర్మముల నారో
పించిరి. యిది యెట్లు సంభవించును? యేపదార్థమునకుఁ గాని స్వాభావి
కము గాని ధర్మము ఆరోపమాత్రమున వచ్చునా? "అగ్నిజలములు రెం
డును భూతము లగుటచే నగ్ని జలమువంటిది" అని యగ్నియందు జల
త్వము నారోపించి చెప్పిన నంతమాత్రమున నాయగ్నికి స్వాభావిక మగు
వేడిమి పోయి చల్లఁదనము వచ్చునా? కావున నెట్లు చూచినను యీవిష
యమున (బాహ్యపదార్థము రసత్వము లనువిషయమున) ననుమానప్ర
మాణము పనికిరాదు. అనుమానము యితర ప్రమాణవిరోధము లేనప్పు
డుమాత్రమే ప్రవర్తించు ననుట సర్వవాదిసమ్మతము. అనుమానమే ఏల?
సర్వప్రమాణములు నట్టివే. ఒకదానికి విరుద్ధ మగువిషయమున రెండవది
ప్రవర్తింపదు. ఒక్క విషయమునందే సర్వప్రమాణములును సంభవించు
ననుట లేకున్నను ఆవిషయము ప్రమాణాంతరములచే బాధింపఁబడక
మాత్ర ముండవలయు ననుట నియమము. కావున ప్రస్తుతానుమాన
ము ప్రత్యక్షబాధిత మగుటచే నిలువనేరదు. స్వప్నజాగ్రత్పదార్థములకు
గలభేద మిదివరకే నిరూపింపఁబడెను కదా!

## సూత్రము. ౩౦.

అవతారిక:—ఇదియునుగాక వారుమతస్థాపనకై 'బాహ్యపదార్థములు
లేకున్నను వాసనాభేదమువలన వ్యవహారభేదము కలుగనచ్చును. స్వప్నా
దులయందు బాహ్యపదార్థములు లేకున్నను కేవలసంస్కారము వలననె
సర్వవ్యవహారములు బహుభేదముతోఁ జరుగుచున్నవి కావున జాగ్రదవస్థ
యందుఁగూడ నట్లే జరుగవచ్చును. *అన్వయవ్యతిరేకముల నాశ్రయించి
చూచిన పైనవర్ణించినవిధముగా వాసనలవలననే సర్వవ్యవహారములును
జరుగుననుట స్పష్టమైనది' అని చెప్పిరి. ఈరెండు యుక్తుల నీక్రిందిసూత్ర
ముచే ఖండింపుచున్నాఁడు.

## ౨౧౧. నభావోఽనుపలబ్ధేః. ౨. ౨. ౩౦.

తాత్పర్యము:—పదార్థములతోఁ బనిలేకయే కేవలసంస్కారం
బును బహువిధరూపములతోఁ బదార్థవ్యవహారమును కలిగించు ననుసిద్ధాం
తంబును యుక్తము కాదు. బాహ్యపదార్థములు లేకుండిన సంస్కార

* అన్వయవ్యతిరేకములు ([illegible] పుట చూడుడు)

ము:లే మొట్టమొదట జనింపవు. బహువిధము కాపదార్థములగుపదార్థము లుండినచో చిత్తమునందును బహువిధరూపములలో సంస్కారములు జనింపవచ్చును; కాని లేకున్న వానిలో పరస్పరము భేదము కలుగుటకుఁ గారణ మేది యుండును? కావున వారిమతమునందు బాహ్యపదార్థములే లేకపోవుటచే సంస్కారములేయుండవు. 'విజ్ఞానస్కంధ మనాది యగుటచే నీదోషము రా దని వారు చెప్పిరి కదా' అనియెదవేమొ వినుము. అప్పటికిని సంస్కారకారణము లగునర్థములైన నుండవలయును; వాని నంగీకరింపకున్న వ్యవహారలోపమునైన నొప్పుకొనవలయును. యింతయేకాని మతము బొత్తుగనే నిలువదు. ఒకపురుషునకు ఘటజ్ఞానము కలిగె ననిన నాజ్ఞానమునకు తత్పూర్వవాసనయుఁ దానికి తత్పూర్వవాసనయు దానికిఁ గూడఁ దత్పూర్వవాసనయుఁ గారణము లగుచుండవలసివచ్చును. యిట్లు అంగీకరించిన ననవస్థాదోషము దుర్నివారమై వచ్చును;దీని అనాదిత్వకల్పనచే నివారింపఁబోయినసర్వమును అంధపరంపరయేయగును. సంస్కారము జనించుటకే మూలకారణము లేదు కదా! కారణ మగుపదార్థమునకును కార్య మగుసంస్కారమునకును అనాదిత్వ ముండవచ్చును; బీజాంతరన్యాయము కూడా గలుగవచ్చును కాని నిష్కారణ మగుసంస్కారమునకును పదార్థజ్ఞానమునకును అది యెట్లు సంభవించును? కారణము లేకుండుటచే సంస్కారములేదు; సంస్కారము లేకుండుటచే పదార్థజ్ఞానంబును లేదు కదా!

"వానిమతమున పదార్థమే లేదు కదా! యిక మనమతము నాశ్రయించి వారిని దూషించినఁ బ్రయోజన మేమి?" యనియెదవేమొ వినుము. యిది మనమతము కాదు; సర్వజనులును సర్వప్రమాణములకు మూలముగా గ్రహించులోకానుభవము. యీయాచార్యుఁడును తమ యభిప్రాయమును సిద్ధాంతము చేయుటకై యంతటను ముఖ్యముగ ప్రస్తుతవిషయమునందును కూడ లోకానుభవమునే యాధారముగ గ్రహించి యున్నాఁడు. 'పదార్థము గోచర మగుచున్నప్పుడు జాగ్రదవస్థయేయుండును; జాగ్రదవస్థ లేనప్పుడు పదార్థము గోచరము కాదు. కావున స్వప్నావస్థయందు పదార్థములేదు. యీకారణమువలన నప్పుడు సంస్కారములే పదార్థముల కనఁబడుచుచున్నవి యనవలయును' అని లోకులు స్వప్నావస్థనుగూర్చి చెప్పుచున్నారు. ఆయోగాచారుఁడును యీయనుభవమునే

యాశ్రయించి స్వప్నపదార్థములు వాసనామాత్రజన్యములుకావున జాగ్రత్పదార్థములు కూడ నట్లే కావచ్చు నని పోలికను చూపుచున్నాఁడు. ఇట్లుండ నన్నిస్థలములయందు నాలోకానుభవము నేల గ్రహింపరాదు? ప్రస్తుతవిషయమున లోకానుభవమును విమర్శించి చూతము. లోకులందఱును సంస్కారమునకు బాహ్యపదార్థమే కారణ మనుచున్నారు. స్వప్నమునందు పదార్థములఁ గల్పించుసంస్కారములకుఁ గూడ జాగ్రత్పదార్థానుభవమే కారణ మనుచున్నారు. కేవల బాహ్యపదార్థము వలనగాని తదనుభవముచే గలిగిన సంస్కారమువలనగాని వ్యవహారము కలుగు ననుచున్నారు. యిట్లుండ దీనినేల యంగీకరింపఁగూడదు. కావున నెట్లుచూచినను పదార్థరహిత మగుసంస్కారముచే వ్యవహారము జనింపదు; 'వారుచూపినయన్వయవ్యతిరేకములు గూడ వారిపక్షమును నిలుపఁజాలవు. స్వప్నములందలిసంస్కారములకుఁ గూడ పదార్థములే కారణము లైయుండవలయు నని యిదివరకే నిరూపించితిమి కదా! ఈ కారణమువలన కేవలసంస్కారములచే నెప్పటికిని వ్యవహారము సంభవింపదు.

మఱియు వాసనయనఁగా సంస్కారము. ఇది గుణ మగుటచే దీనికి నాధార మొకటియుండవలయును. ఇట్టియాధారము వారిమతమున నేదియు లేదు. విజ్ఞానస్కంధము కలదు కదా! యనియెదవేమో అది క్షణిక మగుటచే సంస్కారమునకు నాశ్రయ మగుటకు వీలు లేదు. క్షణక్షణమునకు నశించుచుండ నొకదానికి నాధార మెట్లగును? ఒకపక్షమున సంస్కారవిజ్ఞానములు రెండు నొకసమయమునందే పుట్టు నని యైనను చెప్పవలయును. మఱియొకపక్షమున విజ్ఞానము నిత్యమని యైన నంగీకరింపవలయును. ఇవి రెండును వారికనిష్టము లే. మొదటిపక్షము నాశ్రయించిన సమానకాలమున జనించినవానికి నాధారాధేయభావసంబంధ ముండుటకు వీలు లేదు. ఒక్కమారే జనించిన వగు గోశృంగములు మొదలగునవి ఆధారాధేయభావసంబంధములో నుండలే దనుట స్పష్టమే కదా! ఇక రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు నిత్యమగు చేతన మంగీకరింపఁబడుటచే వారిమతము మనమతమే యగును; 'సర్వపదార్థములును క్షణికములు' అను ప్రతిజ్ఞ నిర్మూల మగును; కావున నెట్లును వారిమతము (బాహ్యపదార్థము లేవని చెప్పుమతము) నిలువదు.

## ౨౦౨. క్షణికత్వాచ్చ. ౨. ౨. ౩౧.

తాత్పర్యము:—మఱియు వారిమతము ననుసరించిన నెట్లును విజ్ఞానమే వాసనాధార మనవలసి వచ్చును. అది క్షణికము కదా! క్షణమున కొక్కొకవిజ్ఞానము నశించుచుండిన దానియందు వాసన యెట్లు స్థిరముగ నిలువగలదు? నిలువకున్న పదార్థస్మరణము ధ్యానము మొదలగునవియెట్లు సంభవించును? ఈకారణమువలన లోకానుభవము నాశ్రయించి సిద్ధాంతము చేయఁబూనిన ప్రతివాఁడును స్థిరుఁడగుటచేతను నవశ్య మంగీకరింపవలయును. విజ్ఞానమే యట్టిది యనిన వారిసిద్ధాంతమునకు భంగమువచ్చును. మఱియు ఈయోగాచారులమతమునందును క్షణికవాదము కలదు కావున పై యధికరణమునందు (సముదాయాధికరణమునందు) క్షణికవాదముపై చూపఁబడినదోషము లన్నియు నిందును కలవు; కావున నెట్లును వీరిమతము యుక్తియుక్తము కాదు. ప్రత్యక్షప్రమాణసిద్ధము లగుబాహ్యపదార్థముల ననుమానగమ్యములనుగాఁ జెప్పుటచే సౌత్రాంతికమతముకూడ నిట్లే యుక్తియుక్తము కాదు. కావున నెట్లు చూచినను ఈముగ్వురిమతములును యుక్తిశూన్యములే.

## ౨౦౩. సర్వథానుపపత్తేశ్చ. ౨. ౨. ౩౨.

తాత్పర్యము:—ఇంత చెప్పనేటికి ఈబౌద్ధమతమున కొంచెమైనను సారము కలదేమో యని విమర్శింపఁబోయిన నడుగడుగునకును ఇసుకయందు త్రవ్వఁబడు బావివలె విరిగిపడుచునే యున్నది. గ్రంథమునందుఁ జూడంబోయిన "చూపు" అని చెప్పవలసివచ్చినప్పుడు సంస్కృతభాషలో "దర్శనం" అనుపదము వ్యాకరణశుద్ధమైయుండ దానికిమారుగా *"పశ్యనా" అని ప్రయోగింపఁబడియున్నది. "నిలుచుట లేక స్థితి" అనుటకు సంస్కృతభాషయందు "స్థానం" అనుపదము వ్యాకరణశుద్ధ మైయుండ *"తిష్ఠనా" అనుపదము ప్రయోగింపఁబడియున్నది. ఇట్లే "తడుపఁబడి

---

*'పశ్యనాతిష్ఠనా' వ్యాకరణశాస్త్రమునఁ బ్రత్యయములను గుఱితించుటకై కొన్ని హల్లులు వానితోఁ జేర్చి చెప్పఁబడియున్నవి. రెండు సందర్భములయందుఁ నకారమే ప్రత్యయమై రావలసివచ్చినప్పుడు వానిలోనే పరస్పర భేదముఁ గూడఁ గలుగవలసివచ్చినప్పుడు ఈ హల్లులు గుఱుతులగును 'క్ష్ కన్' అనుస్థలమున నొక్క

నది" అనునర్థమునందు "నీథం" అనుపదము వ్యాకరణశుద్ధమై యుండ "నిధం" అనుపదము ప్రయోగింపఁబడియున్నది; "ఉపవాసము" అను నర్థమునందు లోకప్రసిద్ధము గాని "పోషధః" అనుపదము ప్రయోగింపఁబడియున్నది. ఇట్లే వారిగ్రంథములయం దెన్నియో యపశబ్దములు కలవు. ఇక నర్థమును విచారించిన నెచ్చట చూచినను వారి సిద్ధాంతములు పరస్పరవిరుద్ధములుగనే యున్నవి. సర్వపదార్థములును శూన్యములే యనుట పరమాభిప్రాయముగ గలిగియు విజ్ఞానము నొకచోటను బాహ్యపదార్థములను కూడ మఱియొకచోటను క్షణికములుగ నంగీకరించియున్నారు. ఆవిజ్ఞానములే అనాదిసంస్కారములకు నాధారములనుటచే దానిని స్థిరమునుగ మఱియొకస్థలమున నంగీకరించి యున్నారు. సంస్కారము లనాదు లైన తదాధారము కూడ ననాది యయ్యే యుండి తీరవలయును కదా! ఇంత యేల మఱియొకచోట వారు స్వయముగనే ధర్మాధర్మములకు సత్యత్వమును చెప్పుచు తమక్షణికవాదమునకు తామే భంగమును కలిగించుకొనిరి. బాగుగ విచారించిన పరస్పరవిరుద్ధము లగుమూఁడుసిద్ధాంతముల నుపదేశించుటయే మతదోషముల వెల్లడించుచున్నది. విచారించిన నాబుద్ధదేవునకు వేదబాహ్యులపై విరోధముండవలయు ననుటయే యుక్తియుక్తమగుచున్నది. ఇట్టి విరుద్ధ

ककారరూప ప్రత్యయమే పరస్పరభిన్నము లగుహల్లులతోఁ కలిపి యుచ్చరింపఁబడియున్నది కావున నీప్రత్యయములు పరము లైనప్పుడు వచ్చుకార్యభేదములను సులభముగా తెలిసికొనవచ్చును. ఇట్లు వ్యవహార సౌకర్యార్థమై యుచ్చరింపఁబడు హల్లులకు ననఁగా—ననుబంధములకు ఇత్తులు అనిపేరు.

ప్రకృతము 'పశ్యతి తిష్ఠతి' అని చెప్పఁబడుక్రియలకు 'దృక్ స్థా' అనునవి యాదిరూపములు. వానికి శకారము ఇత్తుగాఁ గలప్రత్యయములు శప్ మొదలగునవి (శప్ప్రత్యయమునందు శకారపకారములు రెండును కార్యార్థమై యేర్పరుపఁబడిన యిత్తులే యనియు అకారమమాత్రమే కార్యకాలమునందు శేషించుననియుఁ దెలిసికొనవలయును)పరము లైనప్పుడు 'పశ్య తిష్ఠ' అనుపదములు ఆదేశముగ (ఆదిరూపములకు మాఱుగ) వచ్చును. ఇఁక వ్యాకరణసిద్ధరూపము లగు దర్శనస్థానపదములయందన్ననో యుచ్ ప్రత్యయము మాత్రమే కలదు. దీనియందు శకారము లేకుండుటచే నిది పరమగునప్పుడు ఆదిరూపములు మాఱవు. కావున పశ్యనా తిష్ఠనా పదము లపశబ్దములు.

సిద్ధాంతముల నవలంబించి వారు చెడవలయు ననియె యీమతమును పుట్టించినట్లున్నది. కావున మోక్షార్థు లగువారు దీనియందు శ్రద్ధ నుంపఁ గూడదు.

---

## అభావాధికరణము. ౫. రెండవ వర్ణకము.

సంగతి, విషయము:—అధికరణారంభమునందే సంగతి వివరింపఁ బడెను. సందేహస్వరూపాదులు అధికరణావతారికయందే వివరింపఁబడి నవి. ఇందు మాధ్యమికమతము ఖండింపఁబడును; వీఁడు సర్వశూన్యవాది యని యిదివఱకే చెప్పితిమి. బుద్ధదేవుని పరమాభిప్రాయము.

పూర్వపక్షము:— విజ్ఞానవాదముపై చేయఁబడిన దూషణము బౌద్ధమతమునకు తగులనేరదు. ఆమతమునకు 'సర్వమును శూన్యము' అనుటయే పరమసిద్ధాంతము. ఈసిద్ధాంతమున దోష మేమియు లేదు. ఎట్లు విచారించినను పదార్థములు కాని దానిని గ్రహించుజ్ఞానము కాని సద్రూపము కానేరదు. ఎట్లనిన: —

ప్రపంచ మంతయు పదార్థరూపముతోను జ్ఞానరూపముతోను మాత్రమే యున్నది కదా! ఈరెండుపదార్థములును సత్యములే యనిన స్థూలములా? లేక సూక్ష్మములా? పదార్థములు స్థూలము లగుటకు వీలు లేదని యిదివరకే (యోగాచారమతస్వరూపమునందే) నిరూపింపఁబడి యున్నది; జ్ఞానమునకు స్థూలాకారము సంభవింప దనియు పైననే ("నా భావ ఉపలబ్ధేః" అనుసూత్రవ్యాఖ్యానముననే) మాచే (వేదాంతులచే) వివరింపఁబడినది. ఇట్లు రెండును స్థూలములు కాకపోయిన లోకమున నున్నస్థూలానుభవము విరుద్ధ మగును. ఇక నివి సూక్ష్మము లన్నచో నప్ప టికి నిదియె దోషము వచ్చును. స్థూలములును సూక్ష్మములును గాక నీద్రవ్యజ్ఞానము లిక నేరూపముతో నుండగలవు. కావున ద్రవ్యజ్ఞానములు ఎట్లును సద్రూపము లగుటకు వీలు లేదు. ఇక నసద్రూపములుగాఁ గాని సదసద్రూపములుగాఁ గాని సత్వాసత్వాభావరూపములుగఁ గాని యుం డుటకు బొత్తుగనే వీలు లేదు; అసద్రూప మైన నది లేనిదే యగుటచేఁ బ్రకాశింపఁగూడదు. విరుద్ధమగుటచే నీపదార్థంబును సదసద్రూపం

బుగాఁ గాని (ఉన్నదియు లేనిదియు నగురూపముతోఁ గాని) సత్త్వా సత్త్వాభావరూపముతోఁ గాని (ఉన్నదియు లేనిదియు గాని రూపముతోఁ గాని) యుండుటకు వీలులేదు. కదా! కావున నెట్లుచూచినను ప్రపంచము యొక్క యునికిని సిద్ధాంతముచేయుటకు వీలు లేదు. కావున సర్వము నభావమే యనుట యుక్తియుక్తము.

అవతారిక:—అను నీమాధ్యమికపక్షమును ఖండింపుచున్నాఁడు. ఇది సర్వప్రమాణవిరుద్ధ మగుటచే సూత్రకారుఁడు దీనిని ఖండించుటకు ప్రత్యేకసూత్రముల రచింపలేదు. కావున నాసూత్రములే మఱల వ్యాఖ్యానము చేయఁబడుచున్నవి.

## సూ. నాభావ ఉపలబ్ధేః.

తాత్పర్యము సిద్ధాంతము:—జ్ఞానజ్ఞేయములు రెండును సర్వప్రమాణసిద్ధములై యున్నవి. లోకమున ప్రత్యక్షాదిప్రమాణములు కలవానిని కల వనియు లేనివానిని లే వనియు స్థాపించుచున్నవి యనుట స్పష్టము. ఈరెండును సంభవింప దనియు విచారింపఁబోయిన నేపదార్థమునకును కలిమిలేము లుండ వనియుఁ జెప్పిన సర్వప్రమాణములకును విరుద్ధమగునర్థమే చెప్పఁబడిన ట్లగును. ఇది యందఱకు నసమ్మతము, అయుక్తము. కావున మాధ్యమికమతము నిలువదు.

## సూ. వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్.

తాత్పర్యము:—"కలయందు లేనిదే యున్నట్లు గానవచ్చు విధమున జ్ఞానజ్ఞేయములును గానవచ్చుచున్నవి ; ఇంతయే కాని వాస్తవస్థితిలో నవి శూన్యములే అని చెప్పిన నది యుక్తము కానేరదు. స్వప్నజాగ్రతలకు తారతమ్య మధికముగఁ గలదని యిదివరకే నిరూపించియున్నాము. మఱియు సుషుప్త్యవస్థయందువలెనే పదార్థము లభావరూపములై సర్వకాలములయం దున్నవి. అనిన నదియు యుక్తము కాదు. జాగ్రస్వప్నసుషుప్తులకు గలభేదము ప్రత్యక్షసిద్ధము. కావున నీశూన్యమతమునకు దృష్టాంత మేదియు నుండదు. యిందు రెండవపక్షమున స్వప్నాదిపదమునకు స్వప్నావస్థ యాదిగా గలసుషుప్తి యని యర్థము.

అవతారిక:—"ఇట్లుగాదు మాధ్యమికులయభిప్రాయము సర్వ ప్రమాణములును భ్రాంతిగనే ప్రవర్తింపవు; అనుట కాదు. అవి వ్యవహారమున మాత్ర మట్లే యున్నవి; కాని పరమార్థమున లేవు అనుటయే అనిన నాపక్షమును ఖండింపుచున్నాఁడు.

## సూ. న భావో౽నుపలబ్ధేః.

తాత్పర్యము:— ఏ పదార్థమునైనను బాధింపవలసినచో లేదని చెప్పవలసినచో మఱియొక ప్రమాణముచేత దాని యదార్థతత్వమును చూపవలయును; మీరు ప్రత్యక్షముగ నున్నట్లు చూచుచున్న పదార్థము భ్రాంతికల్పితము, దానివాస్తవస్వరూప మిది, యని తెలుపవలయును. మాధ్యమికమతమునందు యిట్టితత్వ మేదియు లేదు; యిట్టితత్వమును స్థాపించు ప్రమాణంబును లేదు. కావున వారిమతము యుక్తియుక్తము కాదు.

మఱియు లోకానుభవము ననుసరించి చూచిన అజ్ఞానముచే నారోపింపఁబడు రజ్జుసర్పాదులకే బాధ కానవచ్చుచున్నది; త్రాడు మొదలగునవి వానియథార్థస్వరూపము లగుటచే విచారముచే గ్రహింపఁబడుచున్నవి. సర్వపదార్థములును శూన్యములేయైన దేనిని దేనియం దారోపించెదరు? కావున నెట్లును వారిమతము యుక్తము కాదు.

"శూన్యమే వానితత్వము కావచ్చును."అనియెదవేమొ యది సరికాదు. శూన్య మనగా: నభావమే కదా! అభావము కూడ నుండుటకు వీలు లే దని వారే మాధ్యమికులే చెప్పియున్నారు కదా! యీకారణమువలన వారిమతము యుక్తిశూన్యమే. వేదాంతమతమునందును సర్వాభావమే యంగీకరింపఁబడియున్నది కదా! అనియెదవేమొ. వేదాంతమతమున సర్వాధిష్టానంగభూతుండగుపరమేశ్వరుఁడు కలడు గదా! ఈప్రపంచంబును ఆయనయందు అనాద్యవిద్యచే నారోపింపఁబడినదనియుఁ జెప్పుచున్నారు కదా (వేదాంతులుచెప్పుచున్నారు కదా.) కావున శూన్యమతమెట్లును యుక్తియుక్తము కానేరదు.

## సూ. క్షణికత్వాశ్చ.

తాత్పర్యము:— మఱియు నొకచోట సర్వపదార్థములును క్షణికములుగ నంగీకరించుటవలన మఱియొకచోట దానికి విరుద్ధముగ సర్వపదార్థముల శూన్యములుగ జెప్పుట విరుద్ధము, కావున మాధ్యమికమతము కాదు.

## సూ. సర్వథానుపపత్తేశ్చ.

తాత్పర్యము:—ఇంతయేల నేవిధముగ జూచినను బౌద్ధమతము యుక్తియుక్తము కానేరదు కావున సుఖమునుగోరువారు దీని నాదరింపఁగూడదు.

---

# ఏకస్మిన్నసంభవాధికరణము. ౬.

సంగతి. విషయము:— పై యధికరణమున బౌద్ధమతము ఖండింపఁబడెను. వారు వెంద్రుకలు లేనివారు (శిరోముండనంబును కాషాయవస్త్రంబును మొదలగునవి బౌద్ధసన్యాసి కుండును) కావున వారిమతమునుఁగూర్చి ప్రస్తాపించునప్పుడు *వస్త్రహీనులగుజైనులమతము బుద్ధికి స్ఫురించును. మఱియు బౌద్ధమతమున పంచస్కంధములు కలవు. జైనమతమునందును అయిదు అస్తికాయములు (అస్తికాయమనఁగా ఉన్నదియనిచెప్పఁబడుపదార్థము) కావున వారిమతమునుఖండించునప్పుడు వీరిమతముబుద్ధిస్థ మగును. కావున నీయధికరణమున జైనమతము నిరాకరింపఁబడుచున్నది. కావున నీరెండధికరణములకును గలసంబంధము బుద్ధిస్థలక్షణసంబంధమే. మఱియు పై యధికరణమున "సర్వప్రమాణగోచరములగుటచే బాహ్యపదార్థములు కలవు" అని నిరూపింపఁబడెను. కావున దానినాశ్రయించియే "ప్రమాణగోచర మగుటచేతనే పదార్థములయందు ఉనికిగాని లేమిగాని మఱి యేదికాని యుండుటకు వీలు లేదు. విచారించిన

---

* వారి సిద్ధాంతమున వస్త్రముల విడువవలయు ననియే యున్నవి కాని వారు మాత్రము లజ్జచే రంగుబట్టలఁ గప్పుకొనుచున్నారు.

నన్నివిషయములయందును ప్రమాణములు కలవు" అని జైనపూర్వ పక్షము దృష్టాంతసందర్భముతో వచ్చును. అది ఈయధికరణమున నిరాకరింపఁబడును కావున నీరెండధికరణములకును గలసంబంధము దృష్టాంతసంబంధము కూడ నగును.

జైనమతస్వరూపము:—జైనులును ప్రపంచసృష్టికి పరమాణువులే కారణము లని చెప్పుదురు. వారిమతమునందు ప్రపంచము జీవులనియు అజీవు లనియు రెండువిధములు. జీవులు చేతనులు సర్వప్రపంచము ననుభవించువారు. ఎప్పటికిని పైకి పోవుచుండుటయే స్వభావముగఁగలవారు ప్రతిశరీరమునందును ప్రత్యేకముగ నుండువారు. వారికి ననుభవయోగ్యములగుసర్వజడపదార్థములును అజీవు లనఁబడును. ఇది సంక్షేపము. విస్తరముగ వారు మఱియైదుపదార్థములను గూడ నంగీకరించుచున్నారు. ౧ ఆశ్రిమము. ౨ సంవరము. ౩ నిర్జరము. ౪ బంధము. ౫ మోక్షము. జీవుని దేహమునందు నిలిపి విషయములపై వానికి నభిమానమునుకలిగించునింద్రియవృత్తులు అశ్రవ మనఁబడును. యమనియమాదులచేఁ గలిగినయింద్రియనివృత్తి సంవరము. సర్వపాపంబులును నశించుటకై యుపయోగింపవలయు నని వారిమతమున కాలినరాతిపై నెత్తుట మొదలగుకొన్నివ్రతములు చెప్పఁబడియున్నవి. ఇవియే నిర్జరములు *ఎనిమిదివిధములని వారిమతమున వర్ణింపఁబడియున్నకర్మ బంధము. జీవస్వభావ మని

---

* యెనిమిది విధములు కర్మ.—

జైనమతమున కర్మ సామాన్యముగ ఘాతికర్మయని అఘాతికర్మయనియు రెండువిధములు. పరమపురుషార్థమగు మోక్షమును జెఱచునది ఘాతికర్మ; అట్లుచేయనిది అఘాతికర్మ. ఇవి రెండునుఁ గూడఁ బ్రత్యేకముగ నాల్గువిధములు, 'జ్ఞానావరణీయము దర్శనావరణీయము మోహనీయము అంతరాయము' అని ఘాతికర్మ నాల్గువిధములు. 'వేదనీయము నామికము గోత్రికము ఆయుష్కము' అని అఘాతికర్మయు నాల్గువిధములు. వీనిస్వరూప మెట్టిదనిన:—

'జ్ఞానమువలన మోక్షము సిద్ధింపదు. మోక్షము పదార్థము కావున దానిని కర్మచేతనే సాధింపవలయును. లోకమున నెవ్వనికిని జ్ఞానమాత్రముచేఁ బదార్థము సిద్ధించుటలేదు.' అను విపరీతజ్ఞానము జ్ఞానావరణీయ మనుకర్మ. 'జైనమతము నాశ్రయించుటవలన మోక్షము రాదు.' అనుతలంపు దర్శనావరణీయ మనుకర్మ. ఆచార్యులనేకు లనేకవిధములుగ మోక్షమార్గములను జూపియున్నారు; కావున వానియందు గలతారతమ్యములనెఱుంగలేక భ్రాంతినొందుట మోహనీయమనుకర్మ. మఱియు మోక్షమార్గమునఁ

చెప్పఁబడినయూర్థ్వగమనమే మోక్షము. యిది యథార్థస్వరూపజ్ఞానము వలన కర్మబంధము నశించినప్పుడు యీమోక్షము కలుగును. అహింస మొదలగుసదాచారములు కూడ మోక్షకారణములే. యీవర్ణింపఁబడిన యేఁడుపదార్థములును జైనులలో గొందఱకు సమ్మతములు.

మఱికొందఱు యీపదార్థముల నైదుగా మాత్రమే చెప్పుదురు. వానికి వారిమతమున *హస్తికాయము లని వ్యవహారము. ౧ జీవాస్తికాయము. ఇది జీవుఁడే. దీనిస్వరూప మిదివరకే వర్ణింపఁబడినది. యిది బద్ధమనియు ముక్తమనియు నిత్యసిద్ధమనియు మూఁడువిధములు. సంసారి జీవులు బద్ధులు, యథార్థస్వరూపజ్ఞానము సదాచారము మొదలగువాని చే ముక్తిని సంపాదించినవారు ముక్తులు. మతకర్త యగుసర్వాత దేవుఁడు నిత్యముక్తుఁ డగుటచే స్వతస్సిద్ధుఁడు. ౨ పుద్గలాస్తికాయము. పుద్గల మనఁగా పరమాణుసముదాయమువలన నేర్పడినదేహమని యిదివరకే వైభాషిక మతఖండనమునందే చెప్పియున్నాము.అదియే పుద్గలాస్తికాయము; అదియుపృథివ్యప్తేజోవాయుభేదములచేతను జంగమస్థావరభేదములచేతను ఆఱువిధములు. వీరిమతమునందును బౌద్ధవైశేషికమతములయందువలె నాల్గుభూతములుమాత్రము పరమాణములనుండి జనించుననుటయే సిద్ధాంతము. వీరిమతమునందు మాత్రము పరమాణువులు క్షణికములు కావు. 3 ఆకాశాస్తికాయము. ఇది యాకాశమే బౌద్ధమతమునందువలెనే వీరి మతమునందును ఆవరణమును తొలఁగించుటయే యాకాశము నకుపని. ఈఆకాశంబును లోకాకాశ మనియు, అలోకకాశ మనియు

---

బోవుచున్నప్పుడు దానికి నేదియైన సంసారజ్ఞానమువలన విఘ్నము కలుగునేని యప్పుడాసంసారజ్ఞానము అంతరాయ మనుకర్మ యగును. ఈ నాల్గును మోక్షవిఘ్నకరము లగుటచే ఘాతికర్మలు.

ఇట్లే శుక్లశోణితములుఁ జేరినపిదప నవి (పరిపాకమును జెందునట్లు చేయు కర్మ వేదనీయ మనఁబడును. దానికి సహాయముఁ జేయుచు కలలము బుద్బుదము మొదలగువానిఁ గలిగించునది నామిక మనుకర్మ. గోత్రికకర్మ శక్తిరూపముతో నీశంటికంటె మున్నే యుండును. అయుష్కరకర్మ దేహమునుఁ బుట్టించి యాయువు నొసంగును. ఇట్లగుటచే నివి జ్ఞానమునకు విఘ్నమునుఁ జేయవు కావున నఘాతికర్మలు. జీవునకు శరీరమే బంధహేతు వగుటచే నీకర్మలును బంధములే యై యున్నవి.

* 'అస్తీతి కాయతే ఇత్యస్తికాయః' 'ఉన్నది' యని చెప్పఁబడును కావునఁ బదార్థమునకు నస్తికాయ మని పేరు అని జైనుల పరిభాష.

రెండువిధములు. ఒకదానిపై నొకటి దొంతివలె నుండునీపదునాల్గులోక ములకును నడుమనడుమ నుండునాకాశము లోకాకాశము. సర్వలోకముల కంటెను మీఁద నున్నయాకాశము అలోకాకాశము. ఇదియే మోక్షస్థానము. ముక్తజీవుఁ డిచ్చటఁ జేరి యెప్పటికిని పైకిపోవుచునేయుండును. ౪ ధర్మాస్తికాయము. ఇది పుణ్యసంస్కారము ప్రస్తుతజన్మమున జీవుఁడు చేయుచున్న సత్కార్యముల నాధారముఁ జేసికొని దాని నూహింపవచ్చును; పుణ్యసంస్కారము లేకున్న పుణ్యముల నాచరించుటయందు యుద్దేశమే కలుగదు కదా. ౫ అధర్మాస్తికాయము. యిది పాపసంస్కారము జీవుఁడు శరీరమున నిలిచియుండుట నాశ్రయించి దీని నూహింపవచ్చును. మోక్షస్థితియే జీవునకు స్వాభావికమై యుండ పాపసంస్కారము లేకపోయిన నీదేహమునందు బద్ధుఁడై నిలచి యుండుట యెట్లువచ్చును?

ఇది వారిపదార్థవిభాగము. వారిమతమున నీజెప్పఁబడిన సర్వపదార్థములును సత్యములును కావు; అసత్యములును కావు; సత్యాసత్యములును కావు; అనిర్వచనీయములును గావు. వానికి నియమమేలేదు. *స్యాదస్తి యేపదార్థములకైనను కలిమిని స్థాపింపవలయుననిన నెట్లో యొకట్లు స్థాపింపవచ్చును. స్యాన్నాస్తే లేమిని స్థాపింపవలయు నన్నను యెట్లైన స్థాపింపవచ్చును. 'స్యా దస్తి చ న్నాస్తిచ' యొక్కదానియందే కలిమిలేముల రెంటిని గూడ స్థాపింపవచ్చును. స్యా దవక్తవ్యః (ఒకదానియందే రెండుధర్మములును లే వనియు చెప్పవచ్చును. స్యా దస్తిచావక్తవ్యః) ఉన్నదనియే చెప్పి కూడ ననిర్వచనీయ మనవచ్చును. స్యాన్నాస్తి చావక్తవ్యః లేదనిచెప్పియు ననిర్వచనీయమనవచ్చును. స్యా దస్తిచ న్నాస్తిచావక్తవ్యః (ఉన్నదియు లేనిదియు నగు నని చెప్పియు ననిర్వచనీయ మనవచ్చును) అని వారు యేడువిధములుగ కలిమిలేములనీమమును భంగము గావింపఁజూతురు. దీనికి వారిమతమున సప్తభంగీన్యాయమని పేరు. వారు ప్రతివిషయమునందును యీన్యాయమునే యుపయోగింతురు. స్యా దేకః స్యా దనేకః స్యా దేక స్యానేక శ్చ స్యా దవక్తవ్యః స్యాదేక శ్చావక్తవ్యః స్యా దనేక చావక్తవ్యః స్యా దేక శ్చానేశ్చావక్తవ్యః (యేపదార్థము)నైనను యేకమనియు ననేకమనియు రెండువిధములుగ



*'స్యాత్' అనుపదమునకు 'కథంచిత్' 'ఏదియో యొకవిధముగా' నని యర్థము.

గూడ నున్న దనియు నన్నివిధములుగ గూడ ననిర్వచనీయమనియు బొత్తుగనే లేదనియుఁగూడ చెప్పవచ్చును) స్యాన్నిత్యః స్యా దనిత్యః" అని సర్వవిషయములందును వారిచే నిట్టిసిద్ధాంతమే చేయఁబడును.

మఱియు వీరిమతమునందును పునర్జన్మముకలదు. జీవుఁడు యేయే దేహమునందుండునో అంతంతపరిమాణము కలవాఁడే యైయుండును. గజ దేహమున నున్నజీవుఁడు పాపప్రభావమువలన చీమయొక్క దేహమును ప్రవేశింపవచ్చినచో నప్పు డాదేహమునకే సరి యైనంతప్రమాణము కల వాఁడే యగును; చీమయొక్క దేహమునుండి పుణ్యప్రభావమువలన గజ దేహమును ప్రవేశింపవలసివచ్చినప్పుడును దానికి తగినంతప్రమాణము కలవాఁడే యగును.

వేదాంతులకు సమ్మతములును ప్రస్తావాంతరమున ఖండితములు నగు విషయములు:—

వీరిమతమునందు పరిమాణువులు క్షణికములు కాకపోవుటచే బౌద్ధమతమునందు చూపఁబడినదోషము లిచ్చట రావు. కావున పరమా ణువుల నిత్యములుగ నంగీకరించునవై శేషికమతమునందు జూపఁబడినదోష ములు వీరిమతమునందును కలవు. మఱియు పుణ్యాపాపములును కర్మయే బంధ మనుటయు యథార్థస్వరూపజ్ఞానమువలన దానికి నాశము కలుగు ననుటకు వేదాంతునకును సమ్మతము లగునంశములే పదార్థవిభాగము నందును మోక్షజీవస్వరూపములు తప్ప తక్కినవియు సమ్మతములే. కావున నీయంశములు తప్ప తక్కినవి మాత్ర మీయధికరణమున ఖండిం పఁబడును.

## సూత్రము. ౩౩.

అవతారిక:—"పదార్థములకు నియమము లేకపోవుటచేఁ బరమే శ్వరుఁడును సన్మాత్రరూపుఁడై యుండు ననుటకు వీలు లేదు. కావున వేదాంతసమన్వయము దోషయుక్తము" అని పై మతస్థులవాదము నాశ్రయించి పూర్వపక్షము రాఁగా దాని నీయధికరణమున నిరాకరించు చున్నాఁడు. అందు మొట్టమొదట నీక్రిందిసూత్రముచే "పదార్థములకు కలిమిలేములలో నేదియు నియతముగ లేదు" అను జైనసిద్ధాంతభాగ మును ఖండింపుచున్నాఁడు.

## ౨౦౮. నైకస్మిన్నసంభవాత్. ౨. ౨. ౩౩.

తాత్పర్యము:—ఈజైనమతము యుక్తియుక్తము కానేరదు. వీరితలంపు యుక్తిశూన్యము; సర్వప్రమాణవిరుద్ధము. చల్లఁదనమును వేఁడిమియు నొక్కపదార్థమున నుండనట్లు కలిమిలేములు రెండు నొక్కపదార్థమున నుండనేరవు. కావున వారి సత్వభంగీన్యాయము నిర్మూలము.

“ఇట్లు కాదు పదార్థములకు నెట్లును నియమ ముండుటకు వీలు లేదు. అవి సత్యరూపములే యగునేని సర్వకాలములయందును సర్వవిధములుగాను సత్యము లయ్యే యుండవలయును. అట్లయిన దానినిఁ గూర్చి యెవ్వఁడును ప్రవర్తింపవలసినపనియే యుండదు.(ఆపదార్థము ఎప్పటికిని లభించియే యుండును. అప్పుడు విడువవలసినదానిని విడచుటకే వీలులేదు. ఇట్లున్న ప్రయత్నముమాత్ర మక్కఅలేదు కదా! ఇది లోకవిరుద్ధము, కావున పదార్థములకు నియమము లే దనుటయే యుక్తము. అప్పుడు ఏదియో యొకకాలమున నేదియోయొక పదార్థ మెట్లో యొకవిధముగ నుండును కావున దానిని సంపాదించుటకుఁగాని విడుచుటకుఁగాని ప్రయత్నము కావలసివచ్చును. కావున జైన సిద్ధాంతమే యుక్తియుక్తముగ తోఁచుచున్నది” అనియెదవేమొ వినుము. ఇది యుక్తియుక్తము కానేరదు; పారమార్థికస్థితిలో నేదియైన నొకటి సత్యముగ నుండకపోయిన వీలు లేదు. అన్నియు నసత్యము లనుట సంభవింప దనియు అధిష్ఠానము నొకదాని నంగీకరింపకున్న దేనినిగాని బాధించుటకు వీలు లే దనియు మాధ్యమికమతఖండనమున వివరించియున్నాము. “సత్యాసత్యత్వములు రెండును కలవనికదా! జైనులు చెప్పిరి” అనియెదవేమొ యవి యొక్కపదార్థమునఁ గూడి యుండనేర వనుట సర్వవాది సమ్మతము. ఇట్లయిన వారిమతము ననుసరింతునేని “ఈపదార్థము కలదా? లేదా?” అని వికల్పము మాత్రమే యేర్పడును. సమానబలములు కల రెండువిషయములకు నొక్కచోట ప్రసక్తి కలిగినప్పుడు వికల్పమునే యాశ్రయింపవలయు ననుట సర్వవాదిసమ్మతము కదా! ఇక ప్రస్తుతమున నట్లాశ్రయించుటకు వీలు లేదు; మనము వస్తువునుఁ గూర్చి మాట్లాడుచున్నాము; కాని క్రియను గూర్చి కాదు; వస్తువుయందు వికల్పము సంభవింపదు. కావున సత్యాసత్యములు రెండు నొక్కదాని

ధర్మము లగుననుట యుక్తియుక్తము కానేరదు. అది పారమార్థికము కానేరదు.

ఇక మనమతమును (వేదాంతమతమును) జూడుము. పరమేశ్వరుఁడు నిత్యసిద్ధుఁడు; పారమార్థికసత్యరూపుఁడు అనిర్వచనీయుఁడు. (లోకమున నింద్రియములకు గోచరము లగుపదార్థములనే గోచరము లైనప్పుడు సత్యము లనియు కానప్పుడు అసత్యము లనియుఁ జెప్పుచున్నాము. ఇంద్రియగోచరుఁడు కాకపోవుటచేఁ బరమేశ్వరునియందీరెండువ్యవహారములును సంభవింపవు కావున నాయన యనిర్వచనీయుఁ డగు నని తెలిసికొనవలయును) ఒకనికి దొరకకుండువాఁడును కాఁడు ఒకనిచే విడువఁబడువాఁడును కాఁడు. ఆత్మరూపుఁడు. ఇక ప్రపంచ మన్ననో యది వాస్తవస్థితిలో బ్రహ్మభిన్నముగ లేనిదే అయినను ఉన్నట్లు కానవచ్చుచున్నది. కావున వ్యవహారమున్న నిదియు సత్యమే: ఈసిద్ధాంతమున దోష మేదియు లేదు. 'సత్యభావన యుండినచో పరమార్థస్థితిలోఁ గూడ సత్యమే కావలయును'అనియెదవేమొ అట్లుకాదు. అప్పుడు ఎండమావులలోఁ గానవచ్చిన నీరు కూడ సత్యమే కావలసివచ్చును. ఇది విరుద్ధము కదా! ఇక వారిమతమును విచారింపుము. అన్నిపదార్థములును సత్యములు శూన్యములు కూడ నగునేని యప్పుడు దేహంబును దేహాత్మాభిమానంబును గూడ సత్యమే యగుటచే నొకపక్షమున నాస్తికవాదము వచ్చును ; మఱియొక పక్షమున నసత్యములే యగుకర్త్రాదులను బాధించుటకై విద్వాంసులును మఱియొకసూఱు ప్రయత్నము చేయువలయు ననుట నిరర్థక మగుటచే మోక్షసాధనోపదేశము వ్యర్థమగును. కావున వారిమత మెట్లును యుక్తియుక్తము కాదు.

మఱియు అన్నిపదార్థములయందును నియమమే లేదనిన వారికి స్వశాస్త్రమునందు స్వరూపస్వభావములతో వర్ణింపఁబడిన జీవాజీవాదిసప్తపదార్థములకు నైన నియమము కలదా? లేదా? లేదనిన సిద్ధాంతమునకే భంగము వచ్చును; పదార్థనిర్ధారణయే లేకపోవును. యీదోషము పోవుటకై 'నియమము కలదు' అనిచెప్పిన నప్పు డన్నిపదార్థములకును ఆనియమ మవశ్యముగా నుండును; ఇందు విరోధ మేమి? 'ఇట్లు చెప్పుట సరిగా నుండలేదు. నియమ మనఁగా మనయభిప్రాయమున (వేదాంతుల యభిప్రాయమున) 'పదార్థ మనగ తత్వము లేదనుట లేదని యొక్కటి

మాత్రమే యుండును' అని సిద్ధాంతముఁ జేయుట దోషమైయున్నది. వారి మతమునఁ గూడ బాగుగ విచారించిన 'పదార్థము అనేకరూప మైనది' అని సిద్ధాంతము చేయఁబడియే యున్నది. పదార్థములకు నియమము లేకున్నను కలవిగా గాని లేనివిగాఁ గాని యుండకపోయినను 'ఇవి యనేకరూపములు' అని జనించుతద్విషయజ్ఞానమునకుమాత్రము నియమ ముండవచ్చును కదా! కావున నాజ్ఞాన మప్రమాణము కానేరదు' అనియె దవేమొ ఇది మాత్ర మెట్లు సరిపడును? వారు సర్వపదార్థములకును నియమము లే దని చెప్పియుండ పదార్థనిర్ధారణకు నొక్కదానికి మాత్రము నియమము యెక్కడనుండి వచ్చును? ఇదియు (పదార్థనిర్ధారణయు పదార్థవిషయికజ్ఞానంబును) వస్తువే యగుటచే దీనియందుఁ గూడ సప్తభంగీన్యాయము నుపయోగింపవచ్చును కదా!

ఇట్లు విచారించిన జైనమతమునందు పదార్థనిర్ణయము చేయువాఁడుఁగాని అట్లు నిర్ణయించుటవలన కలుగుఫలముగాని నియతముగ నుండనేరదు. అవి యొకపక్షమున నున్నవియును మఱియొకపక్షమున లేనివియునుఁ గూడఁ గావచ్చును కదా! ఇ ట్లయిన ప్రమాణప్రమేయప్రమాతృప్రమితులను నిర్ణయింపకయే శాస్త్రకారుఁ డేవిషయమునుగాని యెట్లు నిర్ణయింపఁగలఁడు? శిష్యులకు నెట్లు బోధింపఁగలఁడు? శిష్యులును నిర్ణయము లేనియాయనమతము నె ట్లనుసరింపఁగలరు? ఫల మొక్కటి నియతమై సత్యరూపమై యుండినఁ గదా! దానినిగూర్చి పురుషులు ప్రవర్తించుట సంభవించును! ఫలంబును ఫలార్థమై చేయుప్రయత్నంబును పురుషుండును ఫలోపదేశంబును ఉపదేశకుండును శాస్త్రంబునుఁ గూడ ననియతములే యైనచో నిఁక నెవ్వఁడు దేనికై ప్రయత్నించును? దేనిని పొంది సుఖించును? ఎవ్వనియుపదేశము నాదరించును. ఎవ్వనినాశ్రయించును. ఈకారణమువలన జైనసిద్ధాంత మున్మత్తప్రలాపమే.

మఱియు వారు పదార్థములకు సప్తసంఖ్యను చెప్పుచున్నారు. అస్తికాయములకుపంచసంఖ్యనుచెప్పుచున్నారు. ధర్మాధర్మములు బంధమోక్షములు ననువాని నంగీకరించుచున్నారు. యథార్థస్వరూపజ్ఞానము మోక్షసాధనమనుచున్నారు; అజ్ఞానము బంధహేతు వనుచున్నారు. ఈవిషయములయం దంతటను సప్తభంగీన్యాయము నుపయోగించిన దేనికిని నియమము లేక [illegible] పదార్థములు [illegible] అస్తికాయములుగాని

వారు చెప్పినసంఖ్యతో నిలువ నక్కఱలేదు. తక్కువైనను గావచ్చును. ఎక్కువైనను గావచ్చును. బంధమోక్షాదులను ఉండిన నుండవచ్చును; లేకున్న లేకపోవచ్చును. ఉన్నవో? లేవో? అనుసంశయముమాత్ర మెన్న టికిని తీరదు. మఱియు వారు సప్తభంగీన్యాయమునందు "ఏపదార్థమును గూర్చియు చెప్పుటకు వీలు లేదు" అనుచున్నారు. ఇట్లయిన వారుమాత్ర మీపదార్థములను గూర్చి యెట్లు చెప్పిరి? జీవాదులస్వరూపస్వభావముల నెట్లు వర్ణించిరి? వానికిఁ గూడ నియమము లేదుకదా! వారుచెప్పినజీవుఁడు జీవుఁడో? కాఁడో? ఎవరికి తెలియును? విచారించిన నింతకంటె నున్మత్త ప్రలాపమేదికలదు ? ఈ కారణమువలన నీమత మెవ్వరికి నాశ్రయణీయము కాదు.

## సూత్రము. ౩౪.

అవతారిక:—ఇట్లు సప్తభంగీన్యాయమును ఖండించి జీవవిషయక మగుసిద్ధాంతమును (జీవుఁడు శరీరముతో సమానప్రమాణము కలవాఁ డనుటను) ఖండించుచున్నాఁడు

## ౨౦౫. ఏవం చాఽఽత్మాఽకార్త్స్న్యం.

## ౨. ౨. ౩౪.

తాత్పర్యము:—మఱియు పైన చేసినవాదము నాశ్రయించి యేప దార్థమునందును సప్తభంగీన్యాయము నుపయోగించుట దోషమని తేలినది. ఈకారణమువలన వారిమతమున నొకపక్షమున సర్వభోక్త యగుజీవుఁడు శూన్యరూపుఁడే కావలసివచ్చును. వారిమతమున సప్తభంగీన్యాయ మన్నిపదార్థములయందును కల దని యిదివరకే నిరూపించియున్నాముకదా ! ఇది యట్లుండ వారు చేయు (జీవ) స్వభావవర్ణనము ననుసరించి చూచినను జీవుఁడు శూన్యప్రాయుఁడే అప్రామాణికుఁడే యగును. ఎట్లనిన:—

లోకమున 'నేయేపదార్థములు పరిచ్ఛిన్నములై (అల్పదేశమున నుండునవియై) యుండునో అవి యవశ్యముగ నశించును' అనునియమము కలదు. ఘటాదిపదార్థములయందు ఈవిషయము ప్రత్యక్షమే యైయున్నది. వారును (జైనులును) జీవులకు శరీరపరిమాణము కలదనియు ప్రతి

శరీరమునందును ఆతఁడు వేఱువేఱుగఁ బరిచ్ఛిన్నుఁడై యున్నాఁడనియుఁ జెప్పుదురు. ఇట్లున్న నాతఁడును నశించువాఁడే కావలసివచ్చును. ఇదియు వారికి సమ్మతము కాదు.

మఱియు దేహపరిమాణము లన్నియు సమానములు కావు. ఒకదాని దేహమునకంటె మఱియొకదాని దేహము విశాలముగను అల్పపరిమాణముగలదిగను కూడ నున్నది. ఇట్లున్న మనుష్యదేహమున నుండి తత్సమానప్రమాణము కలవాఁడగుజీవుఁడు కర్మపరిపాకభేదమువలన గజదేహమును ప్రవేశింపవలసి వచ్చినప్పుడు ఆదేహమునం దంతటను వ్యాపించి యుండలేదు; గజదేహస్థితజీవుఁడును దోమయొక్క శరీరమును ప్రవేశింపవలసినప్పుడు సమగ్రముగ నా దేహమునం దిముడఁడు. ఇంతయేల నొక్క మనుష్యశరీరమునందే యున్నజీవుఁడును బాల్యమునుండి యౌవనమునకు వచ్చినప్పుడు దేహ మభివృద్ధి నొందిన దానిలో నిండియుండనేరఁడు. బాలశరీరమునకు సరిపోయినజీవుఁడు యౌవనవంతుని శరీరమునకు నెట్లుసరిపోవును? అదియే (యౌవనవంతునిశరీరమే) యాతనికి పరిమాణమైనయెడల మొట్టమొదట బాలునిశరీరమున కెట్లు సరిపోయెను? కావున జీవునివిషయమున నాలోచించినను వారిసిద్ధాంత మయుక్తమే యగుచున్నది.

'ఇట్లు కాదు జీవునకు ననేకావయవములు కల వనియు నవి ప్రదేశమల్పముగ నున్నప్పుడు సంకోచమును జెందు ననియు అధికముగ నున్నప్పుడు వికాసమును జెందుననియు మాపక్షమే యుండవచ్చును. దీప మిట్లే యున్నది. కాంతిరూపము లైన దానియవయవములు చిన్నకుండలో నుంచినప్పుడు సంకోచమును జెందుచున్నవి. గొప్పగృహమునం దుంచినప్పుడు వికాసమును జెంది సర్వగృహము నాక్రమించుచున్నవి కదా!' అనిమెదవేమొ యాపక్షంబును యుక్తియుక్తము కాదు. దీపము అనిత్యము; దాని యవయవములు నట్టివే జీవుఁడు కూడ నిట్టివాఁడే యనుట యెవ్వరికిని సమ్మతము కాదు కదా! కావున జీవావయవములకును దీపావయవములకును భేద మనంతముగ గలదు. ఈకారణమువలన దీపదృష్టాంత మిచ్చుట పనికిరాదు. ఇక విచారింపుము జీవావయవము లు ఒకదానితో నొకటి యొరయునా? లేదా? ఒరయునేని యధికసంఖ్యా గలయవయవము లల్పప్రదేశమున నుండనేరవు. ఒక్క మనుష్య [illegible] మాత్రే నిలు

చుటకు వీలు లేదు కదా ! ఇక రెండవపక్షము నాశ్రయించిన నవి (జీవావయవములు.) యాకాశతుల్యములై పరిమాణరహితములై యాకారశూన్యములై పరమాణువులవలె నుండవలసివచ్చును. అప్పుడు వాని సంఖ్య యెంతయైనను పరమాణుమాత్రమే యగును. అట్టిపదార్థము లెన్ని చేరినను స్థౌల్యము సంభవింపదని యిదివరకే (వైశేషికమతఖండనమునందే) చెప్పియున్నాము. ఆకాశ మాకాశముతో జేరినయెడల నాకాశమే యగును; కాని స్థూల మగుపదార్థాంతరము కానేరదు కదా! కావున నప్పుడు జీవుఁడు అణుమాత్రుఁడే కావలయును. ఇదియు వారికి (జైనులకు) సమ్మతము కాదు. మఱియు "జీవుఁడు శరీరపరిమాణము కలవాఁడు" అని చెప్పినప్పుడు ఆశరీరమున నెన్ని యవయవములిముడునో అన్ని యవయవములుమాత్రమే (జీవునకు) యుండవలయును కాని యనంతావయవము లెక్కడనుండి వచ్చును ? కావున నెట్లును జైనమతము యుక్తిశూన్యమే.

## సూత్రము. ౩౫.

అవతారిక:—ఈయాక్షేపమునకు వారుచెప్పుసమాధానము ("జీవునకు స్థూలశరీరప్రాప్తి కలిగినప్పుడు కొన్నియవయవములు చేరును; సూక్ష్మపిపీలికాదిశరీరప్రాప్తి కలిగినప్పుడు కొన్నియవయవములు పోవును" అనుసమాధానమును) ఇదివరకే వివరించి యున్నాము. అది యిప్పుడు ఖండింపఁబడుచున్నది.

## ౨౦౬. న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః. ౨. ౨. ౩౫.

తాత్పర్యము:—పైన చూపిన జైనసమాధానము యుక్తియుక్తము కానేరదు. అవయవములు వచ్చుచుఁ బోవుచుండి జీవునకు క్షణక్షణమునకును వృద్ధిక్షయములు కలుగుచుండునేని వాఁడు వికారములు కలవాఁడగును. వికారి యైన ననిత్యుఁడగును. అప్పుడు బంధమోక్షముల నంగీకరించుట వ్యర్థ మగును. మోక్షమనఁగా జీవుఁడు స్వస్వరూపముతో నలోకాకాశమున నూర్ధ్వగమనముఁ జేయుచు సర్వకాలములయందును వినాశరహితుఁడై యుండుటయే కదా! అనిత్యునకు నిది యెట్లు సంభవించును?

వారిమతమున నీమోక్షస్థితియు జీవునకు స్వాభావికమే కాని యాగంతుకము కాదు. నీటిలో నదిమిన నట నిలువక దానిపైభాగమునకు వచ్చుటకే ప్రయత్నించుసొరకాయబుఱ్ఱవలె నెప్పటికిని యీజీవుఁడు సంసారసముద్రమునుండి పైకి పోవుటకే ప్రయత్నించుచుండును. అయినను యెనిమిదివిధము లగుకర్మ వానిని బంధించి బలాత్కారముగ బరువు కట్టినసొరకాయబుఱ్ఱనువలె సంసారసముద్రమున ముంచియున్నది.ఇట్లగుటచే స్వరూపజ్ఞానమువలన నాకర్మబంధము తెగవలయు నంతియ కాని మోక్షము మాత్రము స్వతస్సిద్ధమే. ఇట్లగుటచే వృద్ధిక్షయముల జెందువానికి నిట్టిమోక్షము సంభవించుటకు వీలు లేకపోవుటవలన వారిమతము నందు దోషము వచ్చును; పూర్వాపరవిరోధము సంభవించును.

మఱియు ఈయవయవములకు వచ్చుచుఁ బోవుచుండుటయే స్వభావము గావున నివి యాత్మభిన్నములే యగు ననుటలో సంశయము లేదు. ఇట్లయిన నాత్మ యెవ్వఁడు ? ఏ యవయవము లన్నిశరీములయందు నేకరూపముతోఁ బ్రవేశించుచు స్థిరమైయుండునో అదియే యాత్మ యన వలయును; దానిని నిరూపించుటకు మాత్రము వీలులేదు. వచ్చుచుఁ బోవుచుండుటలో నేదిపోవునో యెవ్వరికి తెలియును?

మఱియు నీయవయవములు వచ్చుచుఁ బోవుచుండునేని యవి యెచ్చటనుండి వచ్చును ? ఎచ్చటికిబోవును ? జైనమతమునందును జీవుని కంటె భిన్నముగ భూతములు మాత్రమే కలవు; కాని మఱి యేవియు లేవు. ఈయవయవము లందుండియే జనించి యుండే యడంగు ననుటకు వీలులేదు. ఇవి జీవావయవములు జీవుఁడును భూతములనుండి జనించినవాఁడుకాడు. ఇట్లుండ భూతసంబంధము లగునవయవములు విజాతీయుఁడగుజీవునకు వృద్ధిక్షయముల నెట్లు కలిగింపఁగలవు ?

ఇదియునుఁ గాక నీపక్షము నాశ్రయించిన నాత్మయొక్క స్వరూపమే నిర్ణయము కానేరదు. వచ్చుచుఁ బోవుచున్నయవయవములకు పరిమాణము నియతముగ లేదు కదా ! ఇట్లు లేకున్న నాత్మ యణుపరిమాణముగలవాఁడో ? లేక మహత్పరిమాణముగలవాఁడో మధ్యమపరిమాణముగలవాఁడో ? యెట్లు నిర్ణయింప నగును ?

ఇదియంతయునుఁగాక మఱియొకగొప్పదోషము కలదు. ఈయవయవము లన్నియు గొప్పసంఘముగఁ జేరినపిదప వానికి చైతన్యమువచ్చునా?

లేక ప్రత్యేకముగనే చైతన్యముకలదా? ప్రత్యేకముగ నున్నచో నవి స్వతంత్రములు కావున నన్నియు నొక్కచోఁ జేరునో? చేరవో చెప్పలేము. చేరినను ఒక్క దేహమున ననేకజీవు లున్నా రని యంగీకరింపవలసివచ్చును. ఇదియు విరుద్ధమే కదా! ఇకి నన్నియునుఁ జేరియే చైతన్యము నొందు ననిన నప్పుడు దోమ మొదలగుసన్నశరీరములు నిర్జీవములే కావలసి వచ్చును. ఆ దేహములయందు ఒకటిరెం డవయవములకంటె నెక్కువగా నిముడవు కదా! గొప్పసంఘ మైనపిదప రావలసినచైతన్యము రెండు కూడినంతమాత్రముననే యెట్లు వచ్చును? “ఒకదానితో మఱియొకటి చేరఁగానే చైతన్యము వచ్చును” అందువేమొ అప్పటికిని ఒకపక్షమున దోమకంటె సన్ననిశరీరములు నిర్జీవములు కావలసివచ్చును. అందు రెండవయవయవముకూడ నుండుటకు వీలు లేదు కదా! మఱియొక పక్షమున స్వయముగ నచేతనము లగువానికి పరస్పరసంబంధముచేఁ జైతన్యము కలుగు ననుటయే సంభవింపదు కదా! కావున నెట్లు బహుదోషగ్రస్త మగుటచే ‘‘అవయవసంయోగవియోగములవలన జీవుఁడు సర్వశరీరములయందును శరీరపరిమాణుఁడై ప్రవర్తించుచుండును” అను పక్షము యుక్తియుక్తము కాదు.

ఈసూత్రమునకు రెండవవ్యాఖ్యానము. —

అవతారిక:—పైసూత్రమునందు (3౪. వ. సూత్రమునందు) “పరిచ్ఛిన్నుఁ డగుటచే జీవుఁడు అనిత్యుఁడు కావలసివచ్చును” అని యాక్షేపము చేయఁబడియున్నది. దానికి సమాధానముగ జైనులు బౌద్ధమతము నవలంబించి “దేహభేదమువలన పరిమాణభేదము కలుగుచున్నను ఆత్మమాత్రము నిత్యుఁడే కావచ్చును. బౌద్ధులు జ్ఞానములు నిత్యములు కాకున్నను తత్సంతానము నిత్య మగునని చెప్పుచున్నారు కదా! కావున నదీప్రవాహము పురాతనజలము పోయి నవీనజలము వచ్చుచున్నను సంతానరూపమున నిత్యమే యగునట్లు ఈయాత్మయు పరిమాణములు మారుచున్నను నిత్యుఁడు కావచ్చును” అని చెప్పినను వారిమతము [illegible] సూత్రమున [illegible]

# న చ పర్యాయా దప్యవిరోధో వికారాదిభ్యః.

తాత్పర్యము:—ఈసమాధానము కూడ యుక్తియుక్తము కాదు; ఎట్లన:—ఆయాత్మసంతానము వస్తువా? కాదా? మొదటిపక్షమున దానికి పరిణామము కావలసివచ్చును. మూసయందు కరగిపోసిన రాగి వలె నాయాత్మయు దేహమున ప్రవేశించినప్పుడెల్ల దానితో సమానపరిమాణము కలుగునట్లు పరిణమించుచుండవలసివచ్చును. అప్పుడు ఆయన యనిత్యుఁడే కావలసివచ్చును. ఇక నాసంతానము వస్తువు కాకపోయిన యెడల నాత్మయే లేకపోవలసివచ్చును; బౌద్ధులు చెప్పినవిధమున శూన్యమే యుండవలసివచ్చును. ఇది వారిమతమునకు విరుద్ధము కావున నెట్లును వారిమతము యుక్తిశూన్యమే.

## సూత్రము. ౩౬.

అవతారిక:—మఱియు జైనులు ముక్తికలుగుజన్మమున నున్నజీవపరిమాణము నిత్య మగునందురు. ఆజన్మమునకు పిదప నుత్తరజన్మము కలుగకపోవుటచే పరిమాణము మారదని వారియభిప్రాయము. ఈపక్షమును క్రిందిసూత్రమున ఖండింపుచున్నాఁడు.

# ౨౦౭. అన్త్యావస్థితే శ్చోభయనిత్యత్వా దవిశేషః. ౨. ౨. ౩౬.

తాత్పర్యము:— జైనమతమునందు మఱియొకదోషము కూడ కలదు. ముక్తి కలుగఁబోవుసమయమున నున్నపరిమాణము నిత్య మని జైనులు చెప్పుచున్నారు కదా! దాని నాశ్రయించి చూచిన మొట్టమొదటను నడుమను గలసర్వపరిమాణములును నిత్యములే కావలసివచ్చును. అన్నియు నాత్మపరిమాణములే కదా! ఇట్లుండ నొక్కటి నిత్య మైన తక్కినవి మాత్రము నిత్యములు కాకుండుట యెట్లు? దీని నంగీకరించినచో నప్పుడు జీవుఁడు ఏదేహమునకు పోయిన నొక్కరూపముతోనే యుండవలసినది... నెచ్చట

నున్నవాఁ డచ్చటనే యైన నిలువవలసినవాఁ డగును. ఈరెండును విరుద్ధ ములేకదా !

మఱియొకవిశేషము:—ఏపదార్థ మైనను నిత్యము కావలయునన్న సర్వకాలములయందు నొక్కరీతిగనే యుండవలయును. కొంతకాలము లేక నడుమ జనించునేని యప్పుడు ఘటాదులవలె ననిత్యమే కావలసి వచ్చును. ఇది నియమము. కావున జైనసిద్ధాంతము ననుసరించి చూచిన వారు కట్టకడపటి జీవపరిమాణమును నిత్య మనుచున్నారు కదా! అట్లయి న నది త్రికాలములయందు నేకరూపముతో నుండవలసినది యగును. అప్పుడు జీవునకు శరీరానుసారముగ పరిమాణములు మారుటకు వీలుం డదు. ఒకయణుపరిమాణమో లేక మహాత్పరిమాణమో మాత్రమే యాతని కుండవలసివచ్చును. మధ్యమపరిమాణ మైన శరీరానుసారముగ పరిణమింపవలయును కదా ! కావున 'జీవునకు మధ్యమపరిమాణమే కల దు' అనుసిద్ధాంతమునకు (జైనసిద్ధాంతమునకు) భంగము వచ్చును. 'ఒక పరిమాణమే త్రికాలములయందు నున్నను కారణాంతరములచే నితరప రిమాణములు వచ్చుచుఁ బోవుచుండవచ్చును కదా' అనియెదవేమొ అది సంభవింపదు. అప్పుడు పదార్థముననే భేదము కలుగవలసివచ్చును. 'అదియే ఇది' అని గుఱుతించుటకు నప్పుడు తగినయవకాశము లేదు కదా! కావున బౌద్ధమతమువలె వీరిమతముకూడ శ్రేయస్కాములచే నాదరణీయము కాదు.

---

# పత్యధికరణము. ౭.

సంగతి:—పూర్వాధికరణమున లుంచితకేశు (వెంట్రుకల కత్తరిం చినవారు) లగుజైనులు ఖండింపఁబడిరి. అప్పుడు శైవులు బుద్ధికి స్ఫురించి రి. వీరు జటాధారులు. కావున బుద్ధిసన్నిధానరక్షణసందర్భముచే వీరిమత మీయధికరణమున నిరాకరింపఁబడును; మఱియు పైయధికరణమున 'కలి యులేము లొక్కస్థలముననుండుట యుక్తము కాకపోవుటచే జైనసిద్ధాం తము యుక్తిశూన్యము' అని చెప్పఁబడెను. దాని నాశ్రయించి 'ఒక్క పరమేశ్వరుఁడు అభిన్నోపాదాననిమిత్తకారణమగుటకు వీలులేదు. కావున వేదాంతమతము యుక్తము యుక్తము కాదు' అని దృష్టాంతపూర్వకముగ

వచ్చినయాక్షేప మీయధికరణమున నిరాకరింపఁబడును కావున దీనికిఁ బూర్వాధికరణముతో గలసంబంధము దృష్టాంతరూపసంబంధము కూడ నగును.

విషయము, శైవమతము వేదాంతమునకు సమీపము:— ఈయధికరణమున ఖండనార్థమై ముఖ్యముగ శైవమత ముద్దేశింపఁబడెను కాని దీనికి విషయము కేవల మదియే యని చెప్పుటకు వీలు లేదు. వాస్తవస్థితిలో శైవమతమునందలి యంశములు దాదాపుగా నన్నియు వేదాంతులకు సమ్మతములే. ముఖ్యముగ వీరు చేయువాదములలో నొక్కటి యగు 'పరమేశ్వరుఁడు కేవలము నిమిత్తకారణమే యై శక్తిని ప్రేరేపించి ప్రపంచమును సృజించుచున్నాఁడు' అనుభాగము మాత్రమే యిందు ఖండింపఁబడును. ఈ యీశ్వర నిమిత్తకారణవాదము సాంఖ్యమతస్థులలో గొందఱియందును (సేశ్వరసాంఖ్యులయందును) వైశేషికులయందును గూడ కలదు. వారియభిప్రాయమంతయు నిట ఖండింపఁబడును; ప్రధానముగను ద్దేశింపఁబడుటచే శైవమతస్వరూపము మాత్ర మిచ్చటనిరూపింపఁబడును. తక్కినవారి మతస్వరూపములు యిదివరకే నిరూపింపఁబడినవి. ప్రస్తుత విషయము ను (ఈశ్వరనిమిత్తకారణవాదమును) మాత్రము విడిచి తక్కిన యంశములన్నియుం దు ఖండింపఁబడియు నున్నవి.

పాశుపతమతస్వరూపము:—శైవులకందఱకును పాశుపతాగమమే ప్రమాణము. ఆయాగమమునందు అయిదుపదార్థములు వర్ణింపఁబడినవి "౧. కార్యములు, ౨. కారణములు, 3. యోగము, ౪. విధి, ౫. దుఃఖాంతము" అను నీయైదును వారిపదార్థములు. ఇందు పృథివ్యాదిభూతము లైదును శబ్దాదిగుణము లైదును గలసి పదియుఁ గార్యములు. పరమేశ్వరుఁడు కేవలనిమిత్తకారణము ప్రధానము లేక శక్తి యుపాదానకారణము. జ్ఞానకర్మేంద్రియములు పదియు మనోబుద్ధ్యహంకారములుమూఁడును గలసి యీపదమూఁడును వానివానికార్యములకుఁ గారణములు. యమనియమాదరూప మగునది యోగము. సదాచారవిధానము విధి మోక్షమే దుఃఖాంతము.

వీరిమతమునందును బంధము అజ్ఞానకర్మాదులవలన కలిగినదియే మోక్షంబును తత్త్వజ్ఞానమువలన జనించునదియే. మోక్షకాలమున జీవేశ్వరైక్యమునకుఁడా నంగీకరింతురు. అయినను వ్యవహారకాలమున మాత్ర

ము జీవులు పరస్పరభిన్నులే; మఱియొకవిశేషము మోక్షకాలమునందు సంపూర్ణముగ నైక్యము నంగీకరించియు భేదమును కూడ సత్యల్పముగ జెప్పుచునే యుందురు. జీవుఁడు కొంతకాలము సంసారియైయుండెను కావున నిత్యశుద్ధుఁ డగుపరమేశ్వరునితో నైక్యము నొందినను భిన్నుఁడుగా భావింపవలసినవాఁడే యని చెప్పుదురు. వీరిశాస్త్రమున నీశ్వరునకు పతియనియు జీవునకు పశువనియు బంధమునకు పాశమనియు పేరు.

## సూత్రము. ౩౭.

అవతారిక:—ఈశ్వరుఁడు కేవలనిమిత్తకారణ మగుటకు నెట్లును వీలు లేదని యీ క్రిందిసూత్రమున నిరూపించుచున్నాఁడు.

## ౨౦౮. పత్యురసామంజస్యాత్. ౨.౨.౩౭.

తాత్పర్యము:—ఈశ్వరుఁడు కేవలనిమిత్తకారణ మనుపక్షము సరియైనది కాదు. అందు బహుదోషములు కలవు. ఎట్లనిన:—

ఈశ్వరుఁడు స్వతంత్రుఁడు దయామయుఁడు కదా! ఆయన జనుల నుత్తమాధమమధ్యభేదములతో నేల సృజించును? ఆయనకు రాగద్వేషము లుండఁగూడదు కదా! రాగద్వేషములు కలవాఁడైన నాయన యీశ్వరుఁడే కాకపోవలసివచ్చును.

"ఇట్లు చెప్పనేల? అన్నియు లోకానుసారము లయ్యేయుండవలయు ననునియమము కలదా? పూర్వమీమాంసాదిశాస్త్రములయందు స్వర్గము దేవతలు మొదలగునవి యనేకములు లోకవిరుద్ధస్వభావములు కలవి యంగీకరింపఁబడుట లేదా?" అనియెద వేమో సత్యమే అవియన్నియు వేదము నాధారము చేసికొని యంగీకరింపఁబడుచున్నవి. వేదము స్వతంత్రముగనే ప్రమాణ మగుటచే దానియందు చెప్పఁబడినవిషయములకు ప్రత్యక్షాదిసహాయ మక్కఱలేదు. అది లోకమునకంటె విరుద్ధముగ నున్నను అంగీకరింపవలసినదియే అట్లు కూడ దనిన ననేకవాదిసమ్మత మగుశబ్దప్రమాణమే లేకపోవలసివచ్చును. శబ్దమున సిద్ధాంతము చేయఁబడినవానిని దృఢపరుచుటకై యన్యప్రమాణములు కావలయు నేని యా యన్యప్రమాణములతోనే కార్యసిద్ధి యగుచుండ నిక శబ్దమును ప్రమాణముగ నంగీకరించి ప్రయోజన మేమి? ఇట్లగుటచే పూర్వమీమాంసాది

కర్తలు కేవల వేదమునే యాశ్రయించి స్వర్గాదుల నంగీకరించిరి. "వారును లోకదృష్టాంతముల నచ్చటచ్చట చూపియే యున్నారుకదా!" అనియెదవేమొ అదియంతయు వేదప్రామాణ్యమును స్థిరపరుచుటకై కాదు. ప్రత్యక్షాదులు కూడ సాధ్యమైనంతవరకు మాసిద్ధాంతమునకు ననుకూలముగనే యున్నవి యని చూపుటకే. ఇక శైవమతసిద్ధాంత మన్ననో ఇట్టిది కాదు. వారు కేవలవేదము నాశ్రయించి యీశ్వరుని నిరూపించుట లేదు. వేదము పరమేశ్వరునభిన్ననిమిత్తోపాదానకారణముగ జెప్పుచున్నదిగాని కేవల నిమిత్తకారణముగఁ జెప్పుట లేదు. ఈవిషయము పలుమాఱు నిరూపించియే యున్నాము కావున వారికి వేదముతో నించుకయైనను సంబంధములేని యనుమానాదులే ప్రమాణములు. ఇట్లయిన లోకదృష్టమునకు నించుకయైనను విరుద్ధము రాకూడదు. అనుమానము లోకానుసారముగనే కదా ప్రవర్తింపవలయును. కావున లోకము నాశ్రయించిన రాగద్వేషములు కలవారే విరుద్ధకార్యముల నాచరించుచున్నారు కాని యితరు లట్లుచేయుట లేదు. మఱియు యోగమతమున నీశ్వరుఁ *డుదాసీనుఁడు; మధ్యస్థుఁడు. ఇట్టివాఁడు కార్యముల నెట్లాచరించును?

"ఇట్లుకాదు జీవులొనర్చుపుణ్యపాపకర్మముల నాశ్రయించి యీశ్వరుఁడు వారియందు భేదములఁ గల్పించును. మనపక్షము (వేదాంతపక్షము)కూడ నిట్టిదియే కదా! కర్మయు ననాదియగుటచే నన్యోన్యాశ్రయదోషము రానేరదు." అనియెదవేమొ యట్లుకాదు. మనమతమునందు (వేదాంతమతమునందు) పరమేశ్వరునకు వాస్తవప్రవృత్తి లేదు. సర్వమును మాయామయము. ఇట్లగుటచే మనము చేయుసిద్ధాంతములతో మఱియొకరు పోలిక పెట్టుకొనుటకు వీలు లేదు. శైవమతమునందును స్వేశ్వర

---

* యోగమతమున నీశ్వరుఁ డుదాసీనుఁడు.—'క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః'='అవిద్యాదులతోను పుణ్యపాపమిశ్రకర్మలతోను వానిఫలములతోను వాని ననుసరించిన సంస్కారములతోను ఇంచుకయైనను సంబంధములేని పురుషశ్రేష్ఠుఁ డీశ్వరుఁ డనఁబడును.' అని యోగు లీశ్వరుని బురుషునిఁగ నంగీకరించియున్నారు. వీరిసిద్ధాంతము కూడ సాంఖ్యసిద్ధాంతమే యగుటచే నిందును పురుషుఁ డుదాసీనుఁడే. అతనికి భోగాదులతో వాస్తవసంబంధము లేదు; కావున నీశ్వరుఁడుఁ గూడ నుదాసీనుఁడే కావలయును. ఏకార్యముల నైన నాచరించువాఁడు కాఁ గూడదు.

సాంఖ్య వైశేషికాదిమతములయందునుగూడ నీశ్వరునకు ప్రవృత్తి వా స్తవము. ఈ కారణమువలన వారికి నెట్లును దోషపరిహారోపాయము లేదు. ఈశ్వరుఁడు స్వతంత్రుఁడు; పురుషులు (పశువులు జీవులు) ఆయనకు నధీనులు. ఇట్లుండ నాయనయొక్క ప్రేరణ లేక వార లధర్మము నెట్లా చరింపఁగలరు; హీనభావము నెట్లు పొందఁగలరు? ఒకవేళ నాయనకువిరుద్ధముగ నధర్మము నాచరించినను దయామయుఁ డగునాపరమేశ్వరుఁడు ఆకర్మ నెట్లు ప్రేరేపించును? జీవునకు ననిష్టము నెట్లు సంపాదించును? "ప్రభువు సర్వసముఁడైనను ప్రజలధర్మాధర్మముల నాశ్రయించి నిగ్రహానుగ్రహములఁ జేయునట్లు పరమేశ్వరుఁడు కూడ చేయవచ్చును." అనియెదవేమొ వినుము. ప్రజలును ప్రభువునకు స్వాధీనమునందే యున్నను వారికి కర్మాచరణమునందు స్వాతంత్ర్యము కలదు; రహస్యముగనైనను పరుల హింసింపవచ్చును. దొంగలింపవచ్చును; రాజాధికారులకుఁ దెలియకుండ నేకార్యమునైన నాచరింపవచ్చును. దానికై తెలిసినపిదప ప్రభువుచే దండింపఁబడవచ్చును. ప్రస్తుతవిషయము మాత్ర మట్టిది కాదు కదా! జీవుఁడుగాని కర్మాచరణమునందు సాధనము లగునింద్రియాదులు కాని యీశ్వరప్రేరణ లేక ప్రవర్తింపనేరవు; ఒకవేళ ప్రవర్తించు నని యంగీకరించినను సర్వశక్తుఁ డగుపరమేశ్వరునను ప్రతిఘటింపనేరవు. ప్రతిఘటించుటకు నెట్లు వీలు కలదు? ఇంద్రియాదులవలన జనించినకర్మకూడ నీశ్వరప్రేరణ లేక ఫలము నొసంగజాలదు కదా! కావున నెట్లుచూచినను ఈశ్వరుఁడు కేవల * నిమిత్తకారణము పరమార్థస్థితిలో నగునేని ప్రపంచమున హీనాధికభావ ముండుటకే వీలు లేకపోవలసివచ్చును.

మఱియు కర్మ నాశ్రయించి యీశ్వరుఁడు ప్రవర్తించునేని అన్యోన్యాశ్రయదోషము వచ్చును. "వారిసంబంధ మనాది కదా" అనియెదవేమొ అట్లయినను దోషము పోదు ఎప్పటికి నింతియే కదా! ఈశ్వరుఁడు ప్రేరేపింపకున్న కర్మ ప్రవర్తింపదు; కర్మ ప్రేరేపింపకున్న నీశ్వరుఁడు ప్రవర్తింపఁడు. ఇట్లు యిరువురును ప్రేరేపింపఁబడవలసినవారే యైన నెవ్వని నెవ్వరు ప్రేరేపింతురు? ఇరువురును గ్రుడ్డివారే యైన నెవ్వని నెవ్వరు నడిపింతురు? కన్నులు కలవాఁ డొక్కఁడైన నుండవలయును కదా! కావున

---

* కేవలనిమిత్తకారణము = నిమిత్తకారణముగా మాత్రమే (నిమిత్తకారణము ౨౧౭.-చూడుఁ)

నెప్పటికిని ఈయన్యోన్యాశ్రయదోషము పోవునది కాదు. బెదరకుము; మనమతమున (వేదాంతమతమున) నన్నియు మాయామాత్రములే యగుటచే నేదోషములును రావు. వంధ్యాపుత్రుఁడు యెఱ్ఱనివాఁడైన నేమి? నల్లనివాఁడైన నేమి?

మఱియు లోకమున నెవ్వఁడును స్వప్రయోజనాపేక్ష లేక ప్రవర్తించుట లేదు. కొందఱు దయాప్రధానులై పరోపకారము చేయఁబూనుచున్నారనుట నిశ్చయమే కాని యందును స్వప్రయోజనము లేకపోలేదు; పరులు చెందుచున్నదుఃఖమును చూడలేకపోవుటచేఁ దనకు సంభవించినదుఃఖవేగమును నివారించుకొనుట నైహికఫలము. తనచే నుపకారమును పొందినవారిపుణ్యమునుగూడ నపహరించి స్వర్గలోకమున దీర్ఘకాలము సుఖ మనుభవించుట యాముష్మికఫలము. కావున కర్తలలో స్వప్రయోజనాపేక్ష లేనివార లెవ్వరును లేరు. ఈశ్వరునకుఁగూడ నిట్టియపేక్ష యుండునేని యాయన యీశ్వరుఁడే కాకపోవలయును కదా! కావున నీ యీశ్వరనిమిత్తకారణవాదము యుక్తియుక్తము కాదు.

## సూత్రము. ౩౮.

అవతారిక:—ఈశ్వరుఁడు లేకుండిన నచేతన మగుప్రధానము స్వయముగ ప్రవర్తింపనేర దనుతలంపుతో సాంఖ్యులలోఁగూడ నొకతెగవారును యోగులును పరమేశ్వరు నిమిత్తకారణముగ జెప్పుచున్నారు. ఆయనకును ప్రధానమునకును జీవు లని చెప్పఁబడుపురుషులకును పరస్పర భేదము కల దనుచున్నారు. ప్రధానపురుషులు కూడ సర్వవ్యాపకు లనుచున్నారు. వీరిమతమున పరమేశ్వరుఁ డుదాసీనుఁ డగుటచే కర్త కానేరఁడని పైసూత్రమునందే చెప్పఁబడియున్నది. ఇక నైయాయికవైశేషికులును పరమాణువుల నీశ్వరుఁడు కేవలనిమిత్తకారణమై తనయిచ్ఛచే ప్రేరేపించునందురు. వీరి యందఱిమతములు నీక్రిందిసూత్రమున మఱియొక హేతువుచే ఖండింపుచున్నాఁడు.

## ౨౦౯. సంబంధానుపపత్తేశ్చ. ౨. ౨. ౩౮.

తాత్పర్యము:—మఱియొకవిశేషము ఈశ్వరుఁడు ప్రధానపురుషులనుగాని పరమాణువులనుగాని ప్రేరేపించు ననిన నీయీశ్వరునకు

ప్రధానాదులతో సంబంధ ముండవలయును. ఇది యెట్లును సంభ వింపదు.

లోకమున సంయోగసమవాయము లని రెండుసంబంధములు మాత్రమే కలవు. అందు సంయోగసంబంధము కొంతకాలము చేరక దూరదూరమున నున్నపదార్థములకుఁ గాని కలుగదు. ప్రధాన మైనను పురుషు లైనను పరమాణువు లైనను సర్వవ్యాపకము లే కాని యొకప్రత్యే కస్థలమున నుండునవి కావు. ఇట్లుండ సర్వవ్యాపకుఁ డగుపరమేశ్వరు నకు వానితో సంయోగసంబంధము కలుగు ననుట యెట్లు? ఇక సమవా యము నాశ్రయింపఁబోయిన నది యిదివరకే పలుమాఱు యుక్తియుక్త ముగ ఖండింపఁబడెను. ఒకవేళ నంగీకరించినను ప్రస్తుతవిషయమున నది సంభవింపనేరదు. ఇందు (ఈశ్వరాదులయందు) ఏది దేని నాశ్రయించి యుండునో యావిషయ మింతవరకును నిరూపణ కాలేదు. ప్రధానాదు లీశ్వరునకు గుణములు కావు. క్రియలును కావు. కార్యములును కావు. అన్నియును స్వతంత్రములే యనియు ప్రధానమువలన ప్రపంచోత్పత్తి కలుగు ననియుఁ గదా వారు చెప్పుదురు. కావున నెట్లును పరమేశ్వరు నకు ప్రధానాదులతో సంబంధ ముండదు. "ఏసంబంధము నుండకుండిన ప్రధానాదులనుండి ప్రపంచము జనించుటకు వీలు లేదు కావున నేదియో యొకవిధముగ నాయీశ్వరునకుఁ బ్రధానాదులతో సంబంధమును కల్పింతము" అనిన నదియు యుక్తము కాదు. ప్రపంచము ప్రధానాదు లనుండియే జనించె ననువిషయము మొట్టమొదట సిద్ధాంత మైనఁ గదా! యట్టిసంబంధమును కల్పింపవలసివచ్చుట అదియే యిప్పటికి సిద్ధాంతము కాకున్న నిక కల్పనలతో పని యేమి? ఈకారణమువలన నెట్లును వీరి మతము యుక్తియుక్తము కాదు.

"ఇట్లయిన మనమతముమాత్ర మెట్లు యుక్తియుక్త మగును? పరమేశ్వరప్రపంచములకుమాత్రము సంబంధ మెట్లు కలుగును? ఆయన యవయవరహితుఁడు ప్రపంచ మవయవసహితము గదా!" అనియెద వేమో? ఇట్లు సంశయింపవలదు. మనమతమున (వేదాంతమతమున) నన్నియు ననిర్వచనీయములే యని పలుమాఱు చెప్పియున్నాము. బ్రహ్మప్రపం చములకు గలసంబంధము కూడ తాదాత్మ్యరూపము. అనిర్వచనీయము. మఱియు మనము కేవలవేదము నాశ్రయించియే జగత్కారణమును

నిర్ణయించుచున్నాము. కావున మనకు లోకదృష్టాంతముల నాదరింపవల సినపని లేదు. ఇతరు లన్ననో వేదమును విడిచి యనుమానమును మాత్రమే యాశ్రయించి సిద్ధాంతముల నొనర్చువారు. కావున వారు ప్రత్యక్షము నించుకయైనను తొలఁగఁగూడదు. ఈవిషయము కూడ నిదివరకే నిరూపించియున్నాము. "సాంఖ్యాదులకుఁ గూడ సర్వజ్ఞులు కల్పించినయాగమము లున్నవి కదా!" అనియెదవేమొ? అది సంభ వింపదు. ఆగమములు యుక్తిసిద్ధములైనచోఁ దత్కర్తలు సర్వజ్ఞు లగు దురు. తత్కర్తలు సర్వజ్ఞులైనచో నాగమములు ప్రామాణికము లగును. కావున నన్యోన్యాశ్రయదోషము వచ్చును కదా! ఈకారణమువలన నెట్లును సాంఖ్యాదులయీశ్వరకల్పన యుక్తియుక్తము కాదు. వేదమును విడిచి చేయునీశ్వరవాదము లన్నియు నింతయే.

## సూత్రము. ౩౮.

అవతారిక:— ఈ విషయమున మఱియొక కారణమును జూపు చున్నాఁడు.

## ౨౧౦. అధిష్ఠానానుపపత్తేశ్చ. ౨. ౨. ౩౮.

తాత్పర్యము:— మఱియు ప్రధానాదులకుఁ బరమేశ్వరుఁడు ప్రేరకుఁ డగుటకే వీలు లేదు. లోకమున మట్టిమొదలగునవి ప్రత్యక్ష ములై యున్నవి; కుమ్మరవాఁడును వానికిఁ బ్రేరకుండై యున్నాఁడు. ఈకారణమువలనఁ బ్రత్యక్షము లగుపదార్థములను గాని యెవ్వఁడును ప్రేరేపించుటకు వీలు లేదని తేలుచున్నది. ప్రస్తుతవిషయమున విచా రించిన నీ నియమము సంభవింపదు. ప్రధానాదు లప్రత్యక్షములు కదా! మనమతమునందును మాయ యప్రత్యక్షమే కదా! దాని నీశ్వరుఁ డెట్లు ప్రేరేపించునో అనియెదవేమొ? మనది యనిర్వచనీయవాద మనియు వేదానుసారిసిద్ధాంతమనియు వారు వేదమును విడిచినవారగుటచే లోకానుభవము నించుకయుఁ దొలఁగఁగూడదనియు జ్ఞప్తికిఁ దెచ్చు కొనుము.

## సూత్రము. ౪౦.

అవతారిక:—"శ్రోత్రము నేత్రము మొదలగు నింద్రియములు కూడ నప్రత్యక్షములే యనుట స్పష్టము. వానిని జీవుఁడు ప్రేరేపించు చున్నాఁ డనుటయు స్పష్టమే. ఇట్లే యీశ్వరుఁడును అప్రత్యక్షము లగుప్రధానాదుల ప్రేరేపింపవచ్చును" అనిన దీనిని ఖండించుచున్నాఁడు.

## ౨౧౧. కరణవచ్చేన్న భోగాదిభ్యః. ౨. ౨. ౪౦.

తాత్పర్యము:—మఱియు జీవుఁ డింద్రియములను ప్రేరేపించునట్లు పరమేశ్వరుఁడు ప్రధానాదులఁ బ్రేరేపించుటకు వీలు లేదు. ఏలయన, *భోగార్థమై మాత్రమే జీవుఁ డింద్రియములఁ బ్రేరేపించుచున్నాఁడు. కాని మఱియొకవిషయమునకై కాదు. ఇతరవిషయములయం దంతటను వానికిఁ బ్రత్యక్షము లగుపదార్థములే సాధనములై యున్నవి. చెట్టు నరుక దలంచిన నప్పుడు సాధనముగ నుపయోగింపఁబడుగొడ్డలి ప్రత్యక్షమే యగుచున్నది కదా! కావునఁ బరమేశ్వరుఁడు కూడ నింద్రియములవలెఁ బ్రధానాదుల "బ్రేరేపించునేని యాయనకును జీవునివలెనే భోగ ముండ వలసి వచ్చును. ఇచ్చటఁ గూడ "వీరు † (తార్కికులు) కేవలానుమానముచే నీశ్వరుని స్థాపింపఁబూనుచున్నారు కావున లోకానుభవము నించుక యైనఁ గలుగఁగూడదు" అనువిషయమును జ్ఞప్తికి దెచ్చికొనవలయును. ఈకారణమువలన నీశ్వరుఁడు ఈశ్వరుఁడే కాకపోవలసి వచ్చును. ఇది విరుద్ధము కదా!

౩౯, ౪౦ సూత్రములకు రెండవవ్యాఖ్యానము:—

## అధిష్ఠానానుపపత్తేశ్చ.

తాత్పర్యము:—పైఁ జూపినకారణములే (౩౮. సూత్రమువరకు చూపినకారణములే కాదు. లోకమున శరీరము కలవాఁడే కాని, దేనినిఁ

---

* భోగ మనఁగా ననుభవము. తన కెదుట నున్నవాని గ్రహించుట, చూచుట, వినుట, మూర్కొనుట, రుచిచూచుట.

† తార్కికులు—వేదమునువిడిచి యుక్తులచేతమాత్రమే సిద్ధాంతముఁ జేయఁ దలంచువారు.

బ్రేరేపించుట లేదు. పరమేశ్వరునకన్ననో యట్టిశరీర ముండుట సంభవింపదు.

## కరణవచ్చేన్న భోగాదిభ్యః.

తాత్పర్యము:—"ఆయనకును సంకల్పరూప మగు దేహ ముండవచ్చును" అనిన నదియు యుక్తము కాదు. శరీర ముండిన దానితో సర్వసంసారము నుండవలసివచ్చును. ఇది విరుద్ధముకదా! కావున నీశ్వరు నిమిత్తకారణవాదము యుక్తియుక్తము కాదు. మనమతమున (వేదాంతమతమున) నీదోషము లేవియుగా వని యిదివరకే నిరూపించియున్నాము.

## సూత్రము ౪౧.

అవతారిక:—మఱియు సాంఖ్యులును యోగులును పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియు ప్రధానము ఆద్యంతములు లేనిదనియు పురుషులును సంఖ్యయందనేకులే యైనను ఆద్యంతములు లేనివారే యనియు నంగీకరింతురు ఈయంగీకారమువలన వారిమతమునకు వచ్చుదోషమును జూపుచున్నాఁడు.

## ౨౧౨. అంతవత్త్వ మసర్వజ్ఞతా వా.

## ౨. ౨. ౪౧.

తాత్పర్యము:—వారు (సాంఖ్యాదులు) పరమేశ్వరుని సర్వజ్ఞునిఁగా జెప్పుదురు కదా! ఆయన తనయొక్కయు ప్రధానపురుషులయొక్కయు పరిమాణసంఖ్యల నెఱుంగునా? యెఱుంగఁడా? మొదటిపక్షమునఁ బ్రధాన పురుషేశ్వరులకు ముప్వురకును ఆద్యంతము లుండవలసివచ్చును. లోకమున నట్లే యనుభవ మున్నది. వస్త్రములు మొదలగువానికిఁ గల ప్రమాణాదుల మన మెఱుంగుచున్నాము. ఆవస్త్రాదులకును ఆద్యంతములు ప్రత్యక్షముగనే యున్నవి. ఆద్యంతము లున్నవానికి నెల్ల వినాశము గూడ నున్నది. కావునఁ బ్రధానాదులకు బరమేశ్వరునకునుఁ గూడ వినాశ ముండవలసివచ్చును. ఎట్లనిన:—

ప్రధానపురుషేశ్వరులకుఁ బరిమాణము కల దనుట యనుమానప్రమాణసిద్ధము. వారికి ననుమాన మొక్కటియే కదా ప్రమాణము. మనము (వేదాంతులు) వేదమును మాత్రమే యాధారము చేసికొని యున్నవారము కావున ననుమానప్రమాణము మనసిద్ధాంతము నేమియుఁ జేయనేరదు. వారి కట్లు కానేరదు కదా! ఇక వినుము. అపరిమాణము లును పరమేశ్వరునకు గోచరములు. జీవులును బహుసంఖ్య గలవారు. వారిలోఁ బ్రత్యేకముగ ప్రతివానికిని గలపరిమాణములను కాలనియమములనుఁగూడ నీశ్వరుఁ డెఱుఁగును. ఇట్లగుటచే క్రమక్రమముగ జీవులకు వినాశము కలుగును. వారి నాశ్రయించియుండునది కావున వారిసంసారములకును వారితోఁ గూడనే నాశము సంభవించును. సంసార మనఁగా ప్రధానమే కావున సర్వజీవనాశముతోఁ బ్రధాననాశము కూడఁ గలుగును. అంతముగలపదార్థము లన్నియు నశింపవలయు ననుట నియమము కదా! ఇట్లు ప్రధానము నశించెనేని దానిని నియమించుపనికై యున్నయీశ్వరుఁడుమాత్ర మేల నిలుచును? ఆయనకును అంతము కల దనుమాట యటుండ ప్రధాననాశానంతరమున నాయన చేయవలసినకార్యము కూడ నేమియు లేదు కదా! వారు(సాంఖ్యాదులు)కార్యము ననుసరించియే సర్వము ననుమానము చేయువారు కావున నప్పుడు వారిమతమునందే యీశ్వరసిద్ధి కలుగదు.

ఇక రెండవపక్షము నాశ్రయించి 'ఈశ్వరునకుఁ దనపరిమాణము కాని ప్రధానపురుషపరిమాణములు కాని తెలియవు' అనిన నప్పుఁ డాయన సర్వజ్ఞుఁడే కాకపోవలసివచ్చును ఇది విరుద్ధముకదా! 'పరిమాణముండి దానిని తెలిసికొనలేకపోయిన నప్పు డీదోషము వచ్చుట నిశ్చయమే కాని ప్రకృతమునఁ బరిమాణమే లేదు కదా' అనియెదవేమొ యది నిలువదు. లోకము ననుసరించి చూచిన ద్రవ్యముల కన్నిటికిని పరిమాణ ముండవలయు ననుటయే సిద్ధాంత మగుచున్నది అని యిదివరకే చెప్పితిమి. కావున నెట్లును ఈశ్వరనిమిత్తకారణవాదములు యుక్తియుక్తములు కానేరవు.

# ఉత్పత్త్యసంభవాధికరణము. ౮.

సంగతి, విషయము:—పైయధికరణమున నీశ్వరనిమిత్తకారణవాదము ఖండింపఁబడెను కావున 'నీశ్వరుఁడు ప్రపంచమునకు నుపాదానకారణము అని చెప్పుభాగవతమతము స్మరణకు వచ్చెను. కావున దానియందుండువిరుద్ధాంశము లిచ్చట స్ఫురణసంగతిచే ఖండింపఁబడుచున్నవి.

భాగవతమతస్వరూపము:—భాగవతు లిట్లు చెప్పుదురు. భగవంతుఁడగు వాసుదేవుఁడు శుద్ధవిజ్ఞానస్వరూపుఁడు స్వప్రకాశుఁడు. అద్వితీయుఁడు ఆయన స్వేచ్ఛముగనే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపములతో నాలుగువిధము లయ్యెను. వాసుదేవుఁ డనగా పరబ్రహ్మము. సంకర్షణుఁడు జీవుఁడు. ప్రద్యుమ్నుఁడు మనస్సు. అనిరుద్ధుఁ డహంకారము. ప్రపంచ మంతయు నీపదార్థములలోనే చేరిపోవును. కావున నావాసుదేవుఁడే సర్వమునకు నుపాదానకారణము. చేతనుఁ డగుటచే నిమిత్తకారణముగఁ గూడ నున్నాఁడు. సర్వాత్మకుఁ డగునీనారాయణుని అభిగమనము ఉపాదానము. పూజ, స్వాధ్యాయము, యోగము అనువానిచే యావజ్జీవము. సేవించినయెడల నానారాయణునే చెందును; త్రికరణశుద్ధిగా దేవార్చనాగృహముకడకుఁ బోవుట యభిగమనము పూజాద్రవ్యముల సంపాదించుట యుపాదానము. స్వాధ్యాయమనఁగా జపము. యోగమనఁగా ధ్యానము.

వేదాంతులకు సమ్మతము లగువిషయములు:—వాసుదేవుఁ డద్వితీయుఁ డనుటయు ప్రపంచమునకు నుపాదాననిమిత్తకారణము లాయనయే యనుటయు అభిగమనాదులచే నాయనను సేవింపవలయు ననుటయు వేదాంతులకును సమ్మతములే. కావున నీయధికరణమున నీవిషయముల నిరాకరించుట లేదు.

పూర్వసందేహము:—ఇట్లయిన పాంచరాత్రాగమము వేదసమ్మతము. దాని రచించినవాసుదేవుఁడును పరబ్రహ్మము. కపిలాదులవలె జీవుఁడు కాఁడు. వేదమునందే వాసుదేవుఁడు సర్వజ్ఞుఁడు అని చెప్పఁబడియున్నది కావున వారియాగమమునందు చెప్పఁబడినవన్నియు యథార్థములే. ఇక చూడుఁడు. వారు సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులు ఒకరినుండియొకరు జనింతు రనియు సంకర్షణులు వాసుదేవునుండి జనించుననియుఁ జెప్పుదురు.

అప్పుడు జీవబ్రహ్మాలకు భేద ముండవలసివచ్చును. ఇది వేదాంతులకు సమ్మతము కాదు కదా! వేదమునకును దేనికిని విరోధము కలదందురేమొ అట్లు పరమాత్మకృతము లగువానికే పరస్పర విరోధ ముండు ననుట యుక్తియుక్త మగునా? అట్లుండిన రెండు నప్రమాణామే కావలయును కదా! కావున నెట్లు చూచినను ఈపాంచరాత్రాగమసిద్ధాంతమువలన వేదాంతసమన్వయము బాధింపఁబడు ననియే చెప్పి తీరవలయును. వేదాంతమతమున జీవబ్రహ్మాలకు భేదము లేదు; పాంచరాత్రమతముఁ గలదు కదా!

## సూత్రము. ౪౨.

అవతారిక:—అనిన నీసంశయము నీయధికరణమున నివారించుచున్నాఁడు. బాగుగ విచారించిన నిందు సమన్వయవిరోధమే పరిహరింపఁబడుటచే నిది ప్రథమపాదముననే జేరవలసినది యగును. అయినను మొట్టమొదట జూపినసంగతి బాగుగ కుదురు ననుకారణమువలన నీపాదమునందు వ్రాయఁబడెను. ఇట్లగుటచే నీయధికరణమునకు "పాంచరాత్రాగమము విషయము" అనుటకంటె "జీవాభిన్న మగు బ్రహ్మమునుండి ప్రపంచము జనించును" అను వేదాంతసిద్ధాంతము విషయము అనుట యుక్తియుక్తముగ నుండును. అందుకు జీవునకు నుత్పత్తి లేదనువిషయమును మొట్టమొదట ఖండించుచున్నాఁడు.—

## ౨౧౩. ఉత్పత్త్యసంభవాత్. ౨. ౨. ౪౨.

తాత్పర్యము:—ఎట్లు చూచినను జీవునకు నుత్పత్తి సంభవింపదు. ఆతఁడు మఱియొకపదార్థమునుండి జనించునేని యనిత్యుఁడు కావలసివచ్చును. అనిత్యుఁడైన పరలోకనివాసము సంభవింపదు; కావున పరలోకమే (స్వర్గనరకములే) లేకపోవలసివచ్చును. మఱియు మోక్ష మనఁగా భగవత్ప్రాప్తియే కదా! భగవంతుఁడు జీవునకు నుత్పత్తికారణమే యగునేని తత్ప్రాప్తి జీవునకు వినాశమే కావలయునుగాని స్వస్వరూపస్థితికానేరదు. ఏకార్యముగాని కారణమును జెందునప్పుడు లయించుచునేయున్నది. యనుట ప్రత్యక్ష సిద్ధము. ఇదియును గాక "నాత్మాఽ శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః ౨. ౩. ౧౭." అనుస్థలమున సూత్రకారుఁడు స్వయము

గనే యీవిషయమును (జీవునకు నుత్పత్తి లే దనువిషయమును) నిరూపింపఁబోవుచున్నాఁడు. కావున నెట్లును జీవోత్పత్తిని కల్పించుట యుక్తి యుక్తము కాదు.

## సూత్రము. ౪౩.

అవతారిక:—ఇప్పుడు సంకర్షణనామము గలజీవునుండి ప్రద్యుమ్ననామము గలమనస్సు జనించు ననువిషయమును ఖండింపుచున్నాఁడు.

## ౨౧౪. న చ కర్తుః కరణం. ౨. ౨. ౪౩.

తాత్పర్యము:—మఱియు కర్త యగుజీవునుండి సాధన మగుమనస్సు జనింపదు; దీనికి లోకమున దృష్టాంతము లేదు. ఒకఁడు గొడ్డలితో వృక్షమును నఱుకవలసినప్పు డాగొడ్డలి వానినుండి జనించుట లేదు కదా! కావున లోకవిరుద్ధ మగునీసిద్ధాంతము నంగీకరించుటకు నేదియైన నొక ప్రబలదృష్టాంతమును చూపిననే కాని సరిపడదు. చూడఁబోయిన నిట్లు చెప్పుశ్రుతియు నెందును గానరాదు. ఈకారణమువలన నీసిద్ధాంతము దోషయుక్తము.

'ఇట్లు కాదు. లోకమున దీనికి దృష్టాంతము కలదు. పురుషుఁడు వివేకి యయ్యెనేని స్వయముగనే గొడ్డలిని చేసికొనవచ్చును. బాగుగ నాలోచించి చూచిన జీవుఁడును తనప్రయత్నముచే శబ్దాదివిషయములతోఁ జేరి సంకల్పించుచున్నాఁడు. (విషయములు ఇంద్రియములకు గోచరము కాఁగానే జీవునకు ప్రయత్నబలముచే సంకల్ప ముదయించును. కావున సంకల్పరూప మగుమనస్సు జీవునుండి జనించె నని వారియభిప్రాయము). "ఇదియే కదా మనసృష్టి" అనియెద వేమొ సత్యమే. అయినను స్వతస్సిద్ధ మగుమనస్సునకును (ఇచ్చట స్వతస్సిద్ధపదమునకు 'జీవునుండి జనింపని' అని మాత్రమే యర్థ మని తెలిసికొనునది.) జీవునకును ప్రయత్నమువలన గాని నిత్యముగఁ గాని సంబంధము కలుగును గాని జీవునుండి మనస్సు జనింపదు. అట్లే జనించు ననిన దానిని జనింపఁజేయుటకై జీవునకు నన్యసాధనములు కావలయునా? యక్కఱ లేదా? యనువిషయము విచారింపఁబడవలసియున్నది. ఇం దేపక్షము నాశ్రయించినను పాంచరాత్ర

సిద్ధాంతము నిలువదు. మొదటిపక్షము నాశ్రయించిన మనస్సును జనింపఁజేయుటకై గైకొనఁబడినసాధనమే సర్వకార్యముల నాచరింపవచ్చును కావున నప్పుడు మనస్సును పుట్టింపవలసినపనియే యుండదు. పరమాత్మజీవులు తప్ప తక్కినవి యచేతనములే యగుటచేతను తనప్రకాశముచేత మాత్రమే (జీవప్రకాశముచేత మాత్రమే) ప్రకాశింపవలసినవి యగుటచేతను వాస్తవస్థితిలో సంకల్పరూపకార్యమునకు మనస్సయిన నొక్కటియే; ఇతరమైన నొక్కటియే కదా! ఇక రెండవపక్షము నాశ్రయించిన నాజీవునకు మనస్సుతోఁ బనియే లేదు. అసహాయుఁడై క్రొత్త సృష్టిని సహితము చేయఁగలవాఁడు సుఖిమొకవిషయమున నన్యసహాయము నపేక్షించు ననుట యుక్తియుక్త మగునా? కావున నెట్లును జీవునుండి మనస్సు జనింపదు. ఇట్లే మనస్సునుండియు నహంకారము పుట్టదు.

"ఇట్లు చెప్పుట సరికాదు. జీవునకు మనస్సును నిర్మించుటయందు సాధనముకలదు. అన్నియు నచేతనములే యగుటచే జీవునకు మనోనిర్మాణసాధనముచేతనే కార్యనిర్వాహముఁ జేయుటకు వీలున్నను మనస్సు శుభ్రము తన్నిర్మాణసాధన మశుభ్రమునగుటచే నది (మనోనిర్మాణసాధనముచేతనే కార్యమును నిర్వహించుట) సంభవింపదు. కావున మనస్సు ఎప్పటికిని ప్రత్యేకముగ నుండవలసినదియే" అనియెదవేమొ అది యుక్తము కానేరదు. అశుభ్రపదార్థమునుండి శుభ్రపదార్థము జనింపనేరదు. చెప్పుము జీవునకుకలదని చెప్పఁబడినసాధనము మనోనిర్మాణమునకు నిమిత్తకారణమా? లేక, యుపాదానకారణమా? ఇందు మొదటిపక్షము నాశ్రయించుట విరుద్ధము. కేవలనిమిత్తకారణముచేఁ గార్యోత్పత్తి కలుగనేరదు. మృత్తిక లేక దండము మాత్రమే యుండిన దానిచే ఘటమును నిర్మింపఁగలమా? ఇక రెండవపక్షమునే యాశ్రయించి తీరవలయును. అప్పటికిని ఆయుపాదానము ఆరంభోపాదానమా? లేక పరిణామోపాదానమా? ఈ రెండుపక్షములయందును అశుభ్రోపాదానమునుండి శుభ్రపదార్థము జనింపనేరదు. మృత్తిక సువర్ణభూషణరూపమున పరిణమించునా? నల్లదారములతో నేయఁబడినగుడ్డ తెల్లనిది యగునా? "నివర్త్తోపాదానము కూడ కావచ్చును కదా" అనియెదవేమొ? అదియు విరుద్ధమే. ఎవ్వఁడు గాని త్రాటిని చేకొని బుద్ధిపూర్వకముగ "నేను దీనిని సర్పమును చేసెదను" అని యట్లు చేయనేరడు. ఇది లోకానుభవసిద్ధము. "ఒకవేళ న[illegible]వేమో? ఒక

నికి లేకున్నను మఱియొకనికి నట్టిశక్తియుండవచ్చునేమో?" అనియెదవేమొ యది సంభవింపదు. వివర్తమువలన జనించినపదార్థములు స్వస్వరూపజ్ఞానముకలిగినతోడనే శూన్యరూపము లగుచున్నవి యనుట యనుభవసిద్ధము. త్రాటిని తెలిసికొనినపిదప దానిని సర్పమునుగా నెవ్వఁడును తలంచుట లేదు. ఇట్లుండ ఆరంభముననే 'ఇది త్రాడు' అని తెలిసినప్పుడు ఇక సర్పజ్ఞాన మెట్లు జనించును? యథార్థజ్ఞానమునకును భ్రాంతిజ్ఞానమునకును గల విరోధము దుర్నివారము కదా! కావున మనోనిర్మాణసాధనము వివర్తోపాదాన మగుటకు బొత్తుగనే వీలు లేదు. కావున నెట్లుచూచినను మనోనిర్మాణసాధనము ఆరంభపరిణామోపాదానములలోనే తప్పక చేరవలయును; అప్పుడు అవశ్యముగ మనస్సునకంటె శుభ్రమైనది కావలయును. ఇట్లయిన జీవునకు దానితోనే నిర్వాహ మగును కావున మనస్సును పుట్టింపవలసినపనియే యుండదు.

"ఇదియు నంతయుక్తముగా నుండలేదు. కార్యమునకును ఉపాదానకారణమునకును సమానధర్మము లుండవలసిన పని లేదని మనమే (వేదాంతులే) విలక్షణత్వాధికరణమునఁ జెప్పి యున్నాము. ఈసిద్ధాంతము నాశ్రయించి చేతన మగు బ్రహ్మమునుండి యచేతనప్రపంచ ముత్పత్తి కావచ్చు నని నిరూపించియున్నాము. కావున నీపాంచరాత్రమతమునందును ఇట్లే మనోనిర్మాణసాధన మశుభ్రంబును కావచ్చును; దానితోఁ గార్యనిర్వాహము కాకుండుటచే జీవుఁడు మనోనిర్మాణమునకై ప్రయత్నింపను వచ్చును." అనియెదవేమొ యదియు యుక్తము కాదు. మనము చేయునది యనిర్వచనీయవాదము. మనమతమున వాస్తవస్థితిలో నుత్పత్తియే లేదు. "న నిరోధో న చోత్పత్తిర్న వంధ్యో న చ శాసనం న ముముక్షు న ముక్తిశ్చ ఇత్యేషా పరమార్థతా"="ప్రళయము, ఉత్పత్తి నమస్కారార్హుఁడు, ఆజ్ఞ, మోక్షేచ్ఛ, ముక్తి, అనునవి యేవియు విచారించినచో నుండవు. ఇదియే పరమార్థస్థితి" అనుటయే కదా మనసిద్ధాంతము. కావున మనము దృష్టాంతములపై యాధారపడవలసినపని లేదు; లోకము ననుసరింపవలసినపనియు లేదు. మఱియు మనము కేవలవేదమునే ప్రమాణముగఁ గైకొని సిద్ధాంతము చేయువార మగుటచే అనుమానప్రమాణము (మనకు) హానిని కలిగింపలేదు; తద్భంగము (అనుమానప్రమాణము నిరుపమై చెడిపోవుట) వృద్ధిని కూడఁ

గలిగింపనేరదు. కావున నితరులకు మనతో పోలిక రాదు. వారు వేదవిరుద్ధముగ ననుమానప్రమాణబలముచే సిద్ధాంతము చేయువారు కావున దృష్టాంతముపై నాధారపడియుండవలసినవారే. దృష్టాంతమున నించుక విరోధము వచ్చినను వారిసిద్ధాంతమునకు భంగము వచ్చును. కావున లోకన్యాయము ననుసరించిన కార్యకారణములకు సమానస్వభావములే కలవుకావున, అందును ముఖ్యముగ నారంభోపాదానములకును కార్యమునకును నియతముగనే సమానస్వభావ ముండుటవలనను అశుభ్రము నుండి శుభ్రము కూడి జనింపఁగూడదు. ప్రకృతమున మనస్సు పంచభూతావయవజనిత మగుటచే దీనికి పంచభూతావయవము లారంభోపాదానములే యగు ననుటయె యుక్తియుక్తము కదా! ఆసూక్ష్మభూతావయవములును సాత్వికములే యగుటచే రజస్తమోగుణసంబంధము కల మనస్సునకంటె పరిశుభ్రము లనుటలోను సంశయము లేదు. మఱియు నొకకరణమును పుట్టించుటకై సాధనము కావలయునేని యాసాధనమును పుట్టించుటకుఁ గూడ మఱియొకసాధనము కావలసివచ్చును. దానిని పుట్టించుటకు వేఱొకసాధనంబును దానిని పుట్టించుటకు మఱియొకసాధనంబును కూడ కావలసివచ్చును. ఇట్లయిన లెక్కలేనిసాధనముల నంగీకరింపవలసివచ్చుటచే ననవస్థాదోషము వచ్చును. కర్తనుండి సాధనము జనించు నన్నప్పుడు ఒకటిమాత్రమే జనించి మఱియొకటి జనింపకుండునా? కావున నెట్లును జీవునుండి మనస్సు జనించుటకు వీలు లేదు; ఇట్లే మనస్సునుండియు నహంకారము జనింపదు. అదియు మనఃప్రతిబింబితుఁడగుజీవునకు సాధనమే కదా! కావున నీపాంచరాత్రసిద్ధాంత మీయంశమున వేదవిరుద్ధము.

"ఇదియెట్లు? వాసుదేవుఁడు సర్వజ్ఞుఁ డని వేదము చెప్పుచున్నది. ఇప్పుడు విచారింపఁబడునంశ మొక్కటి తప్ప తక్కిననన్నియు వేదసమ్మతములే యనియు మనమంగీకరించుచునే యున్నాము. ఇట్లుండ నీయొక్కయంశమును మాత్ర మప్రామాణికముగ నెన్నుట యేల? మనయభిప్రాయమే (వేదాంతులయభిప్రాయమే) వేదవిరుద్ధముగనుండఁగూడదా?" అనియెదవేమొ; అట్లుకాదు. ఈశాస్త్రమున నారంభముననందే యీసంశయము నివారింపఁబడినది; వేదవాక్యసమన్వయముచే తదభిప్రాయ మంతయు జీవబ్రహ్మైక్యపరము యని [illegible] జీవుఁడు

బ్రహ్మాభిన్నుఁడే యైనను భిన్నునివలెఁ దోఁచుచున్నాఁడు కావున గౌణ వృత్తితో "జీవుఁడు పరమేశ్వరునుండి జనించెను" అనిచెప్పుటను అవకాశ మున్నది. ఇట్లుండ జీవోత్పత్తిని సత్యమునుగాఁగాని నిరర్థకముగ వాసు దేవు నేల కించిజ్ఞుని చేయవలయును. సర్వమును వేదసమ్మతముగఁ జెప్పి యీయల్పవిషయమున నాయన యేల భ్రాంతి నొందును? జీవుని యుత్ప త్తియే యథార్థ మగునేని యనేకదోషములు వచ్చుననియు నిదివరకే నిరూపించి యున్నాము. కావున మనమతమును (వేదాంతమతమును) ప్ర మాదసిద్ధ మని తలంచుటకంటె పాంచరాత్రాగమమున గానవచ్చుజీవో త్పత్తిని గౌణమునుగాఁ గల్పించుట యుక్తియుక్తము గ నుండును.

## సూత్రము. ౪౪.

అవతారిక:—"ఇట్లు చెప్పుట సరికాదు. పాంచరాత్రులకు గల యభిప్రాయము లిపరెండు 'వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులునలు గురును పరమేశ్వరులే. సమానులే. అవిద్యాదిదోషవర్జితులే. స్వతస్సిద్ధులే. మఱియు వీరు నలువురుమాత్ర మే పరమేశ్వరుని యంశములు (వాసు దేవునియంశములు') ఈయభిప్రాయముల నాశ్రయించి చూచిన నంద ఱును సమానులే యగుటచే నుత్పత్తియున్నను అనిత్యత్వము యెవ్వరికిని లేదు; ఇట్లయిన నిక వారిమతమున దోష మేమి?" అనిన మఱియొకవి ధముగ వారిమతమును దూషించుచున్నాఁడు.

## ౨౧౫. విజ్ఞానాదిభావే వా తద ప్రతిషేధః. ౨. ౨. ౪౪.

తాత్పర్యము:—ఎట్లు చెప్పినను సంకర్షణాదులు వాసుదేవునివలె జ్ఞానైశ్వర్యాదిసంపన్నులనినను వుత్పత్తిని సాధింపఁబోయినచో దోషము తప్పదు. ఒకవిధముగాఁ గాకున్నను మఱియొకవిధముగా వచ్చును. అభి ప్రాయముల వివరించుటవలన వారు వారిమతములకు (పాంచరాత్రమత మునకు) వచ్చునాధిక్య మేమి? "ఏయేవస్తువునకు జన్మము కలదో అవి యని త్యములు. కావున జన్మముకలదేని జీవుఁడునిత్యుఁడే,అనివాసనము (వేదాం తులు) చెప్పితిమి. వారి యభిప్రాయము ననుసరించి చూచిన వారును

దీని నంగీకరించినట్లే యేర్పడుచున్నది. మనము చూపిన నియమమునకు భంగ మేమియుఁ జూపక జీవునిస్వభావమును మాత్రమే భిన్నమునుగ గనపరచిరి. కావున వారు జీవునియందు మాత్రము ఒకవిశేషము నంగీక రించి రనుటయే సిద్ధాంత మగుచున్నది. మనముకూడ నావిశేషము నట్లే యంగీకరించినను వారిమతమున మాత్ర మాదోషము పోవదు; ఎట్లును జీవాదులకు నుత్పత్తి సంభవింపదు యెట్లనిన:—

వాసుదేవాదులు నలుగురును యీశ్వరులే యైన నందఱును పరి పూర్ణకాములే కావలయును. ఎవ్వరికిని కొఱత యుండఁగూడదు. కొఱతలే కున్న నొకరినుండి మఱియొక్కరు జనించుటకు వీలు లేదు. అట్లు జనింపకు న్న నీశ్వరుఁడు దేనిని నియమించును? మఱియు నందఱును సంపూర్ణకా ములే యగుదురేని యప్పుడును మఱియొకదోషము వచ్చును. ఒక్క యీశ్వరునిచేతనే సర్వకార్యములును నిర్వహింపఁబడుచుండ నలుగురే టికి? అందఱును కలసియే కార్యనిర్వాహము చేయుదు రనిన నప్పుడె వ్వఁడును స్వతస్సిద్ధుఁడు స్వతంత్రుఁడు కాకపోవలసివచ్చును. ఇది యంత యు విరుద్ధమే. మఱియు వాసుదేవుఁ డొక్కఁడే సర్వాత్మకుఁడై యున్నాఁ డనియు నాయనయే పరమార్థతత్వ మనియు గదా వారిసిద్ధాంతము! దీని కిని నలుగురీశ్వరుల నంగీకరించిన విరోధము వచ్చును.

మఱియు "వాసుదేవాదులు నలువురును ఒక్కపరమాత్మయొక్క యంశములు సమానధర్మములు కలవారు యింతయే కాని వారు ప్రత్యే కముగ నీశ్వరులు కారు అనునభిప్రాయము నాశ్రయించి చూచిన నప్ప టికిని యీదోషము పోదు. ఈశ్వరుఁడు మాత్రము నలువురు లేకపోవు దు రంతియే కాని వారికిమాత్రము పరస్పర ముత్పత్తి యెట్లును సంభవిం పదు వారిలో తారతమ్యము లేదు కదా! తారతమ్యములేకున్నఁ గార్య ములును. జనింపనేరవు. ఇది లోకానుభవసిద్ధము కావున నెట్లును పాం చరాత్రాగమమున నీదోషమునకు భంగము లేదు. ఇదియంతయును గాక బ్రహ్మాదిపిపీలికాంతము గలప్రపంచ మంతయుఁ బరమేశ్వరాకారమే మైయుండ నీనాలుగుమాత్రమే యాయనరూపములనియు తక్కినవికావని యుఁ జెప్పుట యెట్లు? కావున సర్వవిధములఁ బాంచరాత్రాగమసిద్ధాంత మీవిషయమున నప్రమాణము.

## సూత్రము. ౪౫.

అవతారిక:— మఱియొకదోషమును చెప్పుచున్నాఁడు.

## ౨౧౬. విప్రతిషేధాచ్చ. ౨. ౨. ౪౫.

తాత్పర్యము:—మఱియు నాయాగమమునందు అనేకస్థలములలోఁ బరస్పర విరోధములు గానవచ్చుచున్నవి. జ్ఞానము ఐశ్వర్యము బలము తేజస్సు మొదలగునవి యొకస్థలమున వాసుదేవాదులకు గుణము లనియు మఱియొకస్థలమున వాసుదేవరూపములే యనియుఁ జెప్పఁబడి యున్నవి. మఱియు ప్రద్యుమ్నానిరుద్ధు లిరువురును మనోహంకారములు రెండును ఒక్కటియే యని యొకస్థలంబునను భిన్ను లని మఱియొకస్థలంబునను చెప్పఁబడియున్నది. నాల్గువేదములును పరిశీలించియు తత్వము నెఱుంగలేక శాండిల్యుఁడీశాస్త్రము నవలంబించెను అని యొకస్థలమున వేదదూషణము కూడ గలదు. కావున నీయంశమున నీయాగమ మప్రమాణమే.

ఇట్లు వెన్నలకంటి సుందరరామశర్మచే రచియింపఁబడిన బ్రహ్మసూత్రార్థచంద్రికయందు ద్వితీయాధ్యాయ ద్వితీయపాదము.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు
ద్వితీయాధ్యాయస్య ద్వితీయఃపాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ద్వితీయాధ్యాయమునఁ
ద్వితీయపాదము.





# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము - తృతీయపాదము.



## పాదావతారిక.

పై రెండుపాదములయందును రెండువిధములుగ వేదాంతసమన్వయమునకు మతాంతరసిద్ధాంతములవలన వచ్చువిరోధము పరిహరింపఁబడెను. వేదవిరుద్ధము లగుటచేతను స్వపక్షమునందే పూర్వోత్తరవిరోధము కలవియగుటచేతను పరమతములు మోక్షార్థులకు స్వీకరణీయములు కావని నిరూపింపఁబడెను. వేదమునందు గూడఁ గొన్నికొన్ని వాక్యములలోఁ బరస్పరవిరోధ మున్నట్లు కానవచ్చుచున్నది; కావున "వేదాంతసమన్వయము కూడ నప్రామాణికమే కావలసి వచ్చునేమో ?" యని సంశయమురాగా దానిని నిరాకరించుటకై తృతీయ చతుర్థపాదము లారంభింపఁ బడుచున్నవి. పై పాదములయందు చేయఁబడినసిద్ధాంతమువలన వచ్చునాక్షేపమును నివారించునవి కావున వీనికిని పూర్వపాదములకునుఁ గలసంబంధ మాక్షేపసంబంధము. సర్వవిరోధ నిరాకరణపూర్వకముగ సమన్వయమును దృఢము చేయఁబడును కావున వీనికి నవిరోధాధ్యాయమునందు చేరిక కలిగెను. ఈపాదములయం దున్న యధికరణములకు నన్నిటికిని "వేదవాక్యములయందు విరోధము కలదు కావున సమన్వయము సిద్ధింపదు" అనునది పూర్వపక్షఫలము; వేదవాక్యములకు విరోధము లేదు కావున సమన్వయము సిద్ధించును" అనునది సిద్ధాంతఫలము. ప్రతియధికరణమునకునుఁ గొన్ని వేదవాక్యములు *విషయవాక్యములుగ నుండును. వానికిఁ బరస్పరవిరోధము కలుగునో లేదోయనుటయే సంశయస్వరూపము.

---

* అధికరణమందు దేనినిఁ గూర్చి విచారింపఁబడునో దేనియర్థము విమర్శింపఁ బడునో లేక దేనివిరోధము పరిహరింపఁబడునో ఆవాక్యము విషయవాక్యము.

అందుఁ దృతీయపాదమునఁ బంచభూతములయొక్కయు జీవుని యొక్కయు నుత్పత్తిని గూర్చి చెప్పుశ్రుతివాక్యములు విచారింపఁబడును. ఇందలియధికరణములకు నన్నిటికిఁ గూడ పూర్వపాదములతో నాక్షేపమే సంబంధము.

---

## అధికరణావతారిక.

అందు మొట్టమొదట నాకాశాదిగా పంచభూతములను గూర్చి యుఁ బిదప జీవోత్పత్తినిగూర్చియు విచారింపఁబడును.

## వియదధికరణము. ౧.

**విషయము పూర్వపక్షము:—**

ఛాందోగ్యోపనిషత్తునందు "త త్తేజో ఽసృజత" అని మొట్ట మొదట నగ్నిభూతముయొక్క సృష్టి చెప్పఁబడెను కాని యాకాశసృష్టి చెప్పఁబడలేదు. తైత్తిరీయోపనిషత్తునందు "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" అని యాకాశసృష్టి కూడఁ జెప్పఁబడి యున్నది. ఈ రెంటికినిఁ బరస్పరవిరోధము. కావున వేదాంతసమన్వయము కూడ ప్రామాణికము కాదు.

## సూత్రము. ౧.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమునకు వేదాంతమతస్థులలోఁ గొందఱియభిప్రాయము నాశ్రయించి సమాధానమును చెప్పుచున్నాఁడు.

## ౨౧౭. న వియ దశ్రుతేః. ౨. ౩. ౧.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము సరియైనది కాదు. "ఆకాశము జనించెను" అనువిషయము వేదమునకు సమ్మతమే కాదు. తైత్తిరీయోపనిషత్తునందును మఱికొన్నిస్థలములయందును మాత్రమే యాకాశోత్పత్తి కానవచ్చుచున్నది. అది యనేకశ్రుతులకు విరుద్ధమై యున్నది. మఱియు నది నిత్యమగుటచే దాని కుత్పత్తియే యుండఁ గూడదు; నిత్యమున నుత్పత్తి యుండుట సర్వప్రమాణవిరుద్ధము. కావున నాకాశ

మును గూర్చి చెప్పు శ్రుతుల * గౌణములనుగాఁ జెప్పవలసినదియే. కావున శ్రుతులకుఁ బరస్పరవిరోధ మెట్లును రాదు.

## సూత్రము. ౨.

అవతారిక:—ఇట్లు చేసినసిద్ధాంతమును (వేదాంతులలోఁ గొందఱుచేసిన సిద్ధాంతము) బూర్వపక్షి ఖండింపుచున్నాఁడు.

పూర్వపక్షము సూత్రము:—

## ౨౧౫. అస్తి తు. ౨. ౩. ౨.

తాత్పర్యము:— ఇట్లుచెప్పుట యుక్తముకాదు. ఛాందోగ్యోపనిషత్తునందు "అగ్నియే మొదట జనించెను" అనియు తైత్తిరీయోపనిషత్తునందు "ఆకాశము మొదట జనించెను" అనియు జెప్పఁబడియుండ విరోధ మెట్లు లేకపోవును? ఒక్కఁడు రెండుపదార్థముల నొక్కమాఱు సృజింపలేఁడు కదా! "ఒకదానిని సృజించి రెండవదానిని సృజింపఁ గూడదా" అనియెదవేమొ ఇచ్చట నట్లు లేదు. ఛాందోగ్యోపనిషత్తునందు నగ్నియు తైత్తిరీయోపనిషత్తునందు నాకాశంబును మొదట జనించినట్లు చెప్పఁబడియున్నది కాని యొకదానివెనుక మఱియొకటి జనించినట్లు చెప్పఁబడియుండలేదు. "ఇట్లయిన నాకాశసహిత మగునగ్ని కాని యగ్నిసహిత మగునాకాశము కాని మొట్టమొదట జనించియుండవచ్చును" అనిన నదియు సరికాదు. ఆకాశాగ్నులు ప్రత్యేకముగనే జనించినవని శ్రుతి చెప్పుచుండ వానికి సంబంధమును కల్పించుట యెట్లు యుక్తమగును? ప్రత్యక్షముగఁ గూడ తైత్తిరీయోపనిషత్తునందు "ఆకాశాద్వాయుః వాయో రగ్నిః" అని యగ్నిసృష్టి ప్రత్యేకముగనే చెప్పఁబడికూడ నున్నది. ఇట్లుండ నిఁక వానికి సంబంధము నెట్లు కల్పింతురు? శ్రుతివిరోధముఁ బరిహరించుటకై చేయుకార్యము దానినభివృద్ధిఁ జేయుటకై యేర్పడుచున్నది. కదా! "ఇట్లయిన నీయాకాశాగ్నులలో నేదియో యొక్కటి సృష్ట్యాదియందు జనించియుండవచ్చును. లేక ఒకకల్పమున నాకాశంబును మఱియొక కల్పమున నగ్నియు సృష్ట్యాదియందు జనించియైన నుండవచ్చును" అనియెదవేమొ అదియు యుక్తము కాదు.

---

* గౌణము. ( [illegible] )

ఏదిమైన నొక్కకార్య ముద్దేశింపఁబడియుండినచో దానియందు వికల్పము వచ్చును కాని పదార్థములయందు రానేరదు. స్తంభమును చూచి "ఇది స్తంభముగా నైన నుండవచ్చును మనుష్యుఁడుగానైన నుండ వచ్చును" అనువికల్పము జనించిన నది నిలచు చున్నదా! మఱియుఁ గల్పభేదము నాశ్రయించి సృష్టిభేదము కలుగు ననుటయు యుక్తము కాదు. పాలనుండి పెఱుగు ఒకకల్పమునందును పెఱుగునుండి పాలు మఱి యొకకల్పమునందును జనించుననుట విశ్వాసయోగ్య మగునా? కావున నెట్లును శ్రుతివాక్యములయందు పరస్పరవిరోధము తప్పక నున్నది కావున నీవిషయమునందు వేదము ప్రమాణము కాదు. ఎట్లును శ్రుతిని గౌణి యనుటకును వీలు లేదు.

## సూత్రము. 3.

అవతారిక:—ఈయాక్షేపమునకు * నేకదేశిమతము నాశ్రయించియే సమాధానమును సూత్రకారుఁడు చెప్పుచున్నాఁడు.

ఏకదేశిసిద్ధాంతసూత్రము.—

## ౨౧౯. గౌణ్యసంభవాత్. ౨. 3. 3.

తాత్పర్యము:—పైసూత్రమునఁ జేయఁబడినపూర్వపక్షము సయుక్తికము కాదు. శ్రుతి యాకాశోత్పత్తిని చెప్పుటయే లేదు. "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" అని యుదాహరింపఁబడిన శ్రుతి గౌణి యనియే చెప్పవలయును. ఆశ్రుతి ప్రత్యక్షాదిరూపబహుప్రమాణములకు విరుద్ధము; బహుశ్రుతు లాకాశోత్పత్తినిఁ జెప్పక పోవుటచే వానికిని విరుద్ధము. ఎట్లనిన:—

లోకమున నేపదార్థము జనించినను సమవాయ్య † సమవాయినిమిత్తకారణములచే జనించుచున్నది. వస్త్రమును దారములు తమసంయోగముచేఁ బుట్టించునట్లు ప్రతిపదార్థమును సజాతీయము లగుననేకసూక్ష్మ

---

* ఏకదేశిమత మనఁగా సిద్ధాంతము నంగీకరించినవారలలోఁ గొందఱిమతము. (అనఁగా వారికి సిద్ధాంతవిషయమునందుఁ గాక తక్కినవిషయమునందు గల యభిప్రాయభేదము).

† కారణత్రయము (౨౧౭-వ పుట చూడు).

పదార్థములు తమసంయోగముచేఁ బుట్టించుచున్నవి. ఈసూక్ష్మపదార్థ సముదాయమే సమవాయికారణము వానిసంయోగ మసమవాయికారణము. ఇవి రెండు నుండినచో నప్పుడు వీనికి సహాయముగ మగ్గములు చక్రిములు మొదలగునిమిత్తకారణములు పనిచేయును. ఇది తార్కికసిద్ధాంతము. ప్రత్యక్షము దీనికి నాకాశోత్పత్తిశ్రుతి విరుద్ధ మగుచున్నది. ఆకాశమును పుట్టించుటకు సమవాయికారణములు కాఁ దగిన సజాతీయసూక్ష్మపదార్థము లేవియు నెట్లుఁ జూచినను లేవు. అవి లేకుండుటచే వానికి సంయోగము కలుగదు; కావున నసమవాయికారణంబును లేదు. ఈరెండును లేకపోవుటచే నీవిషయమున నిమిత్తకారణంబును పని చేయ నేరదు. ఇట్లగుటచే నీయాకాశోత్పత్తిశ్రుతి ప్రత్యక్షప్రమాణములకు విరుద్ధము.

మఱియు నేయేపదార్థమున కుత్పత్తి యుండునో వానియం దెల్ల పూర్వాపరకాలములయందు (పుట్టకమునుపును పుట్టినతర్వాతను) విశేష ముండవలయు ననుట నియమము. ఏపదార్థముకాని పుట్టకమునుపు కానరాకుండును పుట్టినపిదపఁ గానవచ్చుచుండును కదా! ఇట్టి విశేష మాకాశమునఁ గానవచ్చుట లేదు. యేపదార్థము కాని యొక్కసమయమున నవకాశశూన్యమై రంధ్రశూన్యమై యున్న దనుటకు వీలు కలుగునా? ఈకారణమునలన నాకాశోత్పత్తి స్థితి యనుమానమునకుఁ గూడ విరుద్ధము.

మఱియును ఉత్పత్తి కలవి యని ప్రసిద్ధము లైయున్న భూమ్యాదులకును ఆకాశమునకును భేద మనంతముగఁ గలదు. భూమ్యాదులు పరిచ్ఛిన్నములు. ఆకాశము సర్వవ్యాపకము. భూమ్యాదులను స్పృశించుటకు వీలు కలదు. ఆకాశమును స్పృశించుటకు వీలు లేదు. కావున ఆత్మవలె నాకాశము నిత్యమే యని తేలుచున్నది. దీనికిని ఆకాశోత్పత్తి స్థితి విరుద్ధమే. నిత్యము లగువానికి నుత్పత్తి యెక్కడిది?

ఇది ప్రమాణవిరోధప్రకారము శ్రుతివిరోధమును గూర్చి యంతగాఁ జెప్ప నక్కఱలేదు. అది సుప్రసిద్ధమే. అనేకశ్రుతులు ఆకాశోత్పత్తిని చెప్పుటయే లేదు కదా! కావున నా శ్రుతి (ఆకాశోత్పత్తిశ్రుతి) గౌణియే యై తీరవలయును. లోకమున నాకాశమునుగూర్చి గౌణప్రయోగము న[illegible] ? ఆకాశ

మును (శూన్యము ననుట) అది యాకాశ మయ్యెను (శూన్య మయ్యె ననుట) ఘటాకాశము, గృహాకాశము" అను మొదలగు వ్యవహారము లీవి షయమున దృష్టాంతములు. వేదమునందును "అరణ్యా నాకాశే ష్వాల భేరన్"="అరణ్యజంతువులను * సంజ్ఞపదముఁ జేయునప్పు డాకాశముల యందుఁ జేయుదురు (వెలుపలనావరణములేనిస్థలమునఁ జేయుదురనుట)" అను మొదలగు వాక్యములయందు గౌణప్రయోగము కానవచ్చు చున్నది. ఆకాశ మొక్కటియే నైయుండ బహువచనమును ప్రయో గించుట గౌణమే కదా! కావున నీయుత్పత్తి శ్రుతియు నట్టిదియె కావ చ్చును.

## సూత్రము. ౪.

ఈవిషయమునందే యేకదేశమతము నాశ్రయించియే మఱి యొక్క హేతువును జూపుచున్నాఁడు.

### ౨౨౦. శబ్దాచ్చ. ౨. ౩. ౪.

మఱియు శ్రుతి స్వయముగనే యాకాశమున కుత్పత్తి లే దని కూడఁ జెప్పుచున్నది. ఎట్లనిన:—

"వాయు శ్చాంతరిక్షం చైత దమృతం"—వాయువును ఆకా శంబును కూడ అమృతస్వరూప మైనది అని ప్రత్యక్షముగనే శ్రుతి చెప్పుచున్నది. అమృతస్వరూప మగుదానికి నుత్పత్తి యెట్లు సంభవిం చును మఱియు (ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః—పరమేశ్వరుఁడు ఆకా శమువలె సర్వవ్యాపకుండు, నిత్యుఁడు అని యాకాశమును పరమేశ్వరున కుపమానముగ శ్రుతి చెప్పుచున్నది. దీనిని బట్టి చూచిన సర్వగతత్వని త్యత్వము లాకాశమునకుఁ గూడ నుండవలయు నని తేలుచున్నది. అట్టి దానికి నుత్పత్తి సంభవింపదు కదా! మఱియు శ్రుతియందు ఆకాశ బ్రహ్మములకు నుపమానోపమేయభావమును కల్పించువాక్యము లనే కములు కలవు. సమానము లగువానికిఁ గాని పోలిక సంభవింపదు కావున నాకాశము బ్రహ్మతుల్యమే యని చెప్పుటయే యుక్తియుక్తముగనున్నది. కావున నాకాశోత్పత్తిశ్రుతి యెట్లు నప్రమాణమే.

---

* సంజ్ఞపద మనఁగా యజ్ఞమునందుఁ జేయఁబడు పశుహింస.

## సూత్రము. ౪.

"ఇట్లు చెప్పుట యుక్తము కాదు. తస్మా ద్వా ఏతస్మా దాత్మనఆ కాశస్సంభూతః" అని యారంభించి వాయువు అగ్ని మొదలగు వాని యుత్పత్తికూడ చెప్పఁబడియున్నది. అగ్ని మొదలగు వానియుత్పత్తిని మాత్రము మీరు ముఖ్యముగ నంగీకరించుచున్నారు. ఇట్లుండ నా కాశోత్పత్తి మాత్ర మెట్లపభిధానమగును? సంభూతశబ్ద మెట్లు గౌణ మగును ? అనినసమాధానము జెప్పుచున్నాఁడు.

## ౨౨౧. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్ ౨. ౩. ౪.

ఈపూర్వపక్షము యుక్తియుక్తము కాదు. పద మొక్కటియే యున్ననువిషయభేదముచే నర్థభేదము కలుగవచ్చును. విషయము ప్రమా ణాంతరవిరుద్ధము కాకపోయిన పదార్థము ముఖ్యము కావచ్చును. ప్రమాణవిరుద్ధ మైన నది గౌణమే యగును. ఇట్టి దృష్టాంతము కూడఁ గలదు. తైత్తిరీయోపనిషత్తునందు భృగువల్లియందు "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మ"="తపస్సుచే బ్రహ్మము నెఱుంగుము. తపస్సే బ్రహ్మ" అని బ్రహ్మశబ్దము తపస్సునందు అభేదోపచారములచేఁ బ్రయో గింపఁబడియున్నది. మఱియు నాప్రకరణమునందే "అన్నం బ్రహ్మ. ప్రాణో బ్రహ్మ" అను మొదలగు వాక్యములచే నన్నాదులయందు బ్రహ్మ శబ్దము గౌణముగనే ప్రయోగింపఁబడియున్నది. ఆ ప్రకరణమునందే "ఆనందో బ్రహ్మ" అని ముఖ్యముగ బ్రహ్మశబ్ద మానందమునఁ బ్రయో గింపఁబడియున్నది. కావున ఇట్లే సంభూతశబ్దము కూడ నొక్కప్రకర ణమునందే గౌణముగ నొక్కచోటను ముఖ్యముగ నొక్కచోటను గూడ బ్రయోగింపఁబడియుండవచ్చును. కావున నాకాశోత్పత్తి శ్రుతి నిరా క్షేపముగ గౌణియే.

"ఇట్లయిన పూర్వోత్తరవిరోధము వచ్చును. ఆకాశము కూడ జన్మనాశశూన్యమై పరబ్రహ్మమువలె నుండునేని బ్రహ్మము సద్వితీయము గును. అప్పుడు 'ఏక మే వాద్వితీయం' అని చేయఁబడిన ప్రతిజ్ఞ యెట్లు నిలుచును?మఱియు 'ఒక్క బ్రహ్మము నెఱింగిన సర్వము నెఱుంగఁబడును' అని చేయఁబడిన ప్రతిజ్ఞయు నెట్లు నిర్వాహ్యమునకు వచ్చును. పరమే

శ్వరుఁ డాకాశమున కుపాదానకారణ మైననే కదా తజ్జ్ఞానముచే నాకాశ మెఱుంగఁబడవలయును. ఈకారణమువలన నాకాశోత్పత్తి శ్రుతిని గౌణి యనుటకు వీలు లేదు" అనిమెదవేమొ వినుము.

"ఏకమే వాద్వితీయం" అను ప్రతిజ్ఞ "సర్వపదార్థములును ఉత్పత్తికిఁ బూర్వమున పరబ్రహ్మమే యై యుండెను" అను విషయమునే చెప్పవలయు నని నియమము లేదు. ఆకాశము బ్రహ్మకార్యము కాకపోవుటచే దానిని విడిచితక్కినపదార్థములనుమాత్రమే యెట్లు (బ్రహ్మరూపము లని) చెప్పవచ్చును. కావున నింతమాత్రమున నా ప్రతిజ్ఞ నిరర్థకము కానక్కఱ లేదు. ఒక కుమ్మరవానియింటియందు ఒకదినమున మృత్తికారాశిని చక్రము దండము మొదలగు సాధనములనుఁ గూడఁ జూచినవాఁడు మఱునాఁడు మృణ్మయపాత్రముల జూచినప్పుడు "ఇవి యన్నియు గడచిన దినమున మృత్తికామాత్రముగనే యుండెను." అని చెప్పిన నప్పుడు 'మృణ్మయపదార్థములుమాత్రమే మృత్తికారూపములుగా నుండెను.' అని మాత్రమే యర్థమగును కాని "దండము చక్రములు మొదలగు నవికూడ మృత్తికారూపము లయ్యే యుండెను" అని యర్థముకాదు కదా! ఇట్లే ప్రస్తుతప్రతిజ్ఞయు నాకాశ భిన్నవిషయపరము కావచ్చును. "ఆకాశభిన్నము లగునను స్తపదార్థములకును పరమేశ్వర భిన్న మగును. పాదానకారణము గాని నిమిత్తకారణము గానిలేదు కావున నవి యన్నియు తదూపములై న్మాత్రమే యుండెను" అని చెప్పునది కావచ్చును. ఇందు విరోధ మేమి ?.

మఱియు నాకాశమున్నను పరమేశ్వరుఁడు సద్వితీయుఁడు కానేరఁడు. రెండుపదార్థములు పరస్పరభిన్నములు కావలయు ననిన వానికి లక్షణములు భిన్నములై యుండవలయును. సృష్టికిఁ బూర్వమున నాకాశ బ్రహ్మలలో నట్టి లక్షణములు లేవు. రెండును సర్వవ్యాపకములే? రెండును ఆకారరహితములే కదా! ఉత్పత్తిసమయమున నన్ననో పరమేశ్వరుఁడు ప్రపంచమును సృజించు విషయమునఁ బని చేయుచుండును; ఆకాశ మూరక యుండును. ఇట్లగుటచే నప్పుడు వానికి భేదము కలుగును. ఈకారణము వలననే శ్రుతియు "ఆకాశశరీరం బ్రహ్మ" అని బ్రహ్మాకాశములకు నభేదమును చెప్పుచున్నది. కావున నెట్లును "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" అను ప్రతిజ్ఞకు విరోధము కలుగదు.

మఱియు పైన నిరూపించిన కారణములవలననే "ఒక్క బ్రహ్మము నెఱింగిన సర్వము నెఱింగినట్లగును" అను ప్రతిజ్ఞకుఁ గూడ హాని లేదు. ఈసర్వప్రపంచంబును పరబ్రహ్మమునకు సమదేశమై (పరబ్రహ్మ మున్న స్థలమునందే యున్నదై) సమకాలమై (పరబ్రహ్మముతో సమాన మగు కాలము కలదియై) జనించునట్లే యాకాశమునకుఁగూడ సమదేశమై సమకాలమై జనించుచున్నది యనుట ప్రత్యక్షసిద్ధము. ఇట్లగుటచే పరబ్రహ్మము నెఱింగిన దత్కార్యము లగు ప్రాపంచికపదార్థములును వానితోఁ గూడ తత్సమదేశ తత్సమకాల మగునాకాశంబును కూడ గ్రహింపఁబడును. ఒక పాలకుండయందు కొన్ని నీటిబిందువుల వైచిన పాలను తెలిసికొనినతోడనే వానినిఁ గూడ తెలిసికొనిన ట్లగు నంతియ కాని దానికై (జలబిందువులను తెలిసికొనుటకై) ప్రత్యేక ప్రయత్నమక్కఱ లేదు కదా! కావున నెట్లును పై ప్రతిజ్ఞలకు విరోధము రా నక్కఱ లేదు. ఆకాశోత్పత్తి శ్రుతి నిర్వివాదముగ గౌణియే కావచ్చును.

## సూత్రము. ౬.

అవతారిక:—ఇట్లు వచ్చిన పూర్వపక్షము సూత్రకారుఁడు స్వమతముతో ఖండింపుచున్నాఁడు.

పరమసిద్ధాంత సూత్రము:—

## ౨౨౨. ప్రతిజ్ఞాఽహాని రవ్యతిరేకా చ్ఛబ్దేభ్యః. ౨. ౩. ౬.

తాత్పర్యము:—"యే నాశ్రుతం శ్రుతం భవతి" అను మొదలగు వాక్యములచే నన్నియుపనిషత్తులయందును "బ్రహ్మము నెఱింగిన సర్వము నెఱింగినట్లే యగును" అని ప్రతిజ్ఞ చేయఁబడి యున్నది. దీనికి భంగము రాఁగూడదు కదా! ఇది యెట్లు సంభవించును? సర్వప్రపంచంబును బ్రహ్మమునకంటె భిన్నము కాకుండునేని బ్రహ్మమునుండియే జనించినది యగునేని యప్పుడు సంభవించును. వేదంబును "యథా సో మ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యం" అను మొదలగుదృష్టాంతములచే

* ప్రకృతి వికారభావము నాశ్రయించియే ప్రతిజ్ఞను దృఢపరుచుచున్నది కాని మఱియొకన్యాయము నాశ్రయింపలేదు. ఆద్యంతములయందును "స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్. ఐతదాత్మ్య మిదం సర్వం" అని ప్రపంచబ్రహ్మములకు నభేదమును గూడ బోధించుచున్నది. ఇట్లుండ నాకాశము మాత్రము బ్రహ్మకార్యము కా దనుట యెట్లు సంభవించును? పాలు నీరు కలసినట్లు సృష్టికిఁ బూర్వమున బ్రహ్మాకాశములు కలసియుండె ననియు నాకారణమువలన శ్రుతి వాని నేకముగ జెప్పె ననియు సిద్ధాంతము చేయుట యెట్లు యుక్తియుక్త మగును? భిన్నలక్షణము లేకున్నను సమానదేశకాలములయందున్నను ఆకాశము మాత్రము పరబ్రహ్మము కానేరదు కదా! కావున నెట్లును ఆకాశమునకుఁ గూడ నుత్పత్తి కల దనియే యంగీకరించి తీరవలయును.

"శ్రుతియందు లేకపోవుటచే నట్లు చెప్పుటకు వీలు లే దని యిదివరకే చెప్పితిమి కదా!" అనియెదవేమొ అది సంభవింపదు. ఆకాశోత్పత్తిశ్రుతి యిదివరకే చూపఁబడియున్నది. దానినిగూర్చి నీవు చెప్పిన విరోధము యుక్తియుక్తము కాదు. "త త్తేజో ఽసృజత" అని చెప్పు ఛాందోగ్యశ్రుతియు తైత్తిరీయశ్రుతియు నేకవాక్యములే యగును కాని విరుద్ధము లగుభిన్నవాక్యములు కానేరవు. బాగుగ విచారించిన ఛాందోగ్యశ్రుతికంటె తైత్తిరీయశ్రుతి బలవంతము. ఏల యనిన: ఛాందోగ్యశ్రుతియొక్క యర్థమును మఱియొకవిధముగ మార్చినను విరోధము రాదు; తైత్తిరీయశ్రుతియొక్క యర్థమును మార్చుటకు నెట్లును వీలు లేదు. తైత్తిరీయశ్రుతి నాశ్రయించి "పరమేశ్వరుఁడు ఆకాశవాయువుల సృజించినపిదప నగ్నిని సృజించెను" అని ఛాందోగ్యశ్రుతికి నర్థమును చెప్పుటకు వీలు కలదు కాని, ఛాందోగ్యశ్రుతి నాశ్రయించి "పరమేశ్వరుఁడు తేజస్సునే మొట్టమొదట సృజించెను" అని తైత్తిరీయశ్రుతికి నర్థము చెప్పి ప్రత్యక్షముగ గానవచ్చుచున్న యాకాశవాయుసృష్టుల శూన్యరూపములఁ జేయుటకు వీలు లేదు కదా! కావున ఛాందోగ్య తైత్తిరీయశ్రుతు లేకవాక్యములే; మొట్టమొదట నాకాశంబును దానినుండి వాయువును అందుండి యగ్నియు జనించె ననుటయే సిద్ధాంతము.

---

* ప్రకృతివికారభావము, (౭౬౦-వ పుట చూడు).

"ఛాందోగ్యోపనిషత్తునందు అగ్నియే మొట్టమొదటజనించినట్లును తైత్తిరీయమునందు ఆకాశమే మొట్టమొదట జనించినట్లును చెప్పఁబడి యుండుటచే పరస్పరము విరోధము వచ్చును" అని చెప్పితిని కదా యని యెదవేమొ వినుము. ఏయుపనిషత్తునందుగాని భూతసృష్టి మాత్రమే వినవచ్చుచున్నది గాని భేదము వినవచ్చుట లేదు. ఇట్లున్నను ఛాందోగ్యశ్రుతియొక్క యర్థము ననుసరించి యాకాశసృష్టి లేదనుట కేవలము బుద్ధిచేత మాత్రమే కల్పింపఁబడుచున్నది. లేకున్న నొక్కవాక్యము రెండు వ్యాపారములను (అనఁగా: అగ్నిసృష్టిని ఆకాశసృష్ట్యభావమును కూడ నొక్కమాఱే చెప్పుటను) ఏకకాలమునందే చేయుట సంభవించునా? వాక్యవ్యాపార మనఁగా వాక్యతాత్పర్యమే కావున నొకవాక్యమునకు రెండుతాత్పర్యము లుండుట సంభవింపదనుటలో విరోధము లేదు. ఈకారణమువలన అర్థానుసారముగ మనచే నూహింపఁబడిన యాకాశసృష్ట్యభావమును బలవత్తర యగుతైత్తిరీయశ్రుతి బాధించినది; తేజస్సృష్టి యన్ననో అపౌరుషేయ వేదోక్త మగుటచే బాధింపదు. ఈకారణమువలన రెండుశ్రుతుల నేకవాక్యముగ నన్వయింపవచ్చును. "ఇట్లయిన వాక్యమునకువలెనే సృష్టికర్తకుఁ గూడ నొక్కమాఱే రెండుభూతముల సృజించుటకు వీలు లేదు కదా!" అనియెదవేమొ యది సరి కాదు. ఎన్నిఁటినైనను క్రమముగ నొక్కకర్తయే చేయుచుండుట లోకప్రసిద్ధమై యున్నది. శబ్ద మన్ననో యట్టిది కాదు. ఒకప్పు డొకయర్థమునే చెప్పవలయు ననుట దానికి నియమము. కావున నెట్లు చూచినను ఆరెండు శ్రుతులు నేకవాక్యమే యనుటయు ఆకాశాదిక్రమముననే సృష్టి జనించె ననుటయు సిద్ధాంతమే.

మఱియు క్రమ మనునది గుణము పదార్థముల నాశ్రయించి యుండునది. ఇట్లగుటచే శ్రుత్యనుసారముగ దానిని ఆకాశాదిగానే గ్రహించుట యుక్తము. ఛాందోగ్యశ్రుతియందు తేజస్సృష్టి మాత్రమే చెప్పఁబడెను కాని దానికి క్రమము చెప్పఁబడలేదు. కావున నది తైత్తిరీయశ్రుతిప్రసిద్ధ మగుక్రమమును నివారింపనేరదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుశ్రుతియందు "ఈసమస్తము పరమేశ్వరునుండి జనించెను" అని చెప్పఁబడియున్నది; అది ఛాందోగ్యశ్రుతియందలి సృష్టిక్రమమును నిరోధించుచున్నదా? ఇట్లే ఛాందోగ్యశ్రుతియు తైత్తిరీయమునందలి

సృష్టిక్రమమును నిరోధింపుట లేదు. * వికల్పము గాని † సముచ్చయము గాని యాకాశాగ్నులకు నుండఁగూడ దని నీవే యిదివరకు చెప్పి యున్నావు. కావున నెట్లును శ్రుతులు లేకవాక్యములే యగును గాని పరస్పరవిరుద్ధములు కానేరవు.

ఇంతయేల. ఛాందోగ్యోపనిషత్తు మొదలగు వానియందుఁ జేయఁబడిన ప్రతిజ్ఞ నాశ్రయించి చూచిన నేశ్రుతియందును లేక పోయినను ఆకాశోత్పత్తి ప్రతిజ్ఞానిర్వాహార్థమై కల్పింపఁబడవలయు ననిన నది (ఆకాశోత్పత్తి) యొక శ్రుతియందును చెప్పఁబడె ననిన నిక దాని నంగీకరించుటయందు సంశయ మేల ? "ప్రతిజ్ఞను మఱియొకవిధముగ నిర్వహింపవచ్చు నంటిని కదా ! ఆకాశము బ్రహ్మసమాన దేశకాల మగుటచే బ్రహ్మజ్ఞానముచేఁ దజ్జ్ఞానము కూడ క్షీరోదకన్యాయమున కలుగవచ్చు నని చెప్పితిని కదా !" అనియెదవేమొ దీనికి సమాధాన మిదివరకే చెప్పియున్నాను. శ్రుతి చూపిన దృష్టాంతముల నాశ్రయించిన దానిచే ప్రకృతివికారభావమే యుద్దేశింపఁబడినట్లు తెలియుచున్నది కాని యన్యము కా దని నిరూపించి యున్నాము. మఱియు క్షీరోదకన్యాయమున గలుగునేకత్వజ్ఞానము భ్రాంతియే యగునుకాని యథార్థజ్ఞానము కానేరదు. సామాన్యజనులవలె వేద మిట్టిభ్రాంతిసిద్ధార్థము నుపదేశించునా ? ఇంతమాత్రమే కాదు. ప్రత్యక్షముగఁ గూడ శ్రుతియందు "ఏక మేవ" అని ‡ యవధారణము చేయఁబడియున్నది. ఇదియు తగినయుపపత్తి కలిగియుండగా భేదముతో నిర్వహింపఁబడుటకు వీలు కాదు. "ఆకాశ ముత్పత్తి నొందకున్నను ఇతరపదార్థము లన్నియు బ్రహ్మనిర్మితములే యగుటచే వాని నాశ్రయించియే యీప్రతిజ్ఞ చేయఁబడియుండవచ్చు నంటిని కదా !" అనియెదవేమొ వినుము. ఇది న్యాయము కాదు. "న్యాయమే" అని పట్టు పట్టిన నీమతము నిలువనేరదు. నీవు చెప్పినస్థితి మృత్తిక మొదలగుసామా

* వికల్పము. (౮౭౭-వ పుట చూడు).

† సముచ్చయమనంగా నొకదానితో నొకటి కలసియుండుట. ఇట్లు పదములనుఁ గాని వాక్యములను గాని యొకదానితో మఱియొకదానినిఁ గూర్చునవి గనుకనే చకారాదులకు వ్యాకరణమున సముచ్చయనామము పెట్టఁబడెను.

‡ అవధారణ మనఁగా నిశ్చయము 'ఆపదార్థ మదియే మఱియొక్కటిఁ కాదు' అని చెప్పుట.

న్యపదార్థములయందుఁ గూడఁ గలదు. ఇట్లుండ పరమేశ్వరవిషయము నపూర్వముగ నుపదేశించుట కేమికారణ ముండును? కావున మృత్తికాదులకంటె బ్రహ్మమునం దేదియొ యొకవిశేష ముండవలయు ననియు దానిని గుఱుతించుటకై కొంచెమించుమించు దానితో (బ్రహ్మముతోఁ) బోలిక గలమృదాదులు దృష్టాంతములుగ చెప్పఁబడెననియు సిద్ధాంతము చేయవలసియున్నది. సర్వపదార్థములును తనకు కార్యములై యుండు ననుటయే యాబ్రహ్మమునకు గలవిశేష మనియు నొప్పుకొనవల యును. కారణత్వవిషయమును నిర్ణయించునప్పు డితరవిశేషముల (ఇతర విషయములందుఁ గలవిశేషముల) గ్రహించుట యుక్తము కాదు కదా! కావున శ్రుతియందలి ప్రతిజ్ఞ సర్వప్రపంచమును గుఱించినదియే యగును కాని ఆకాశమును విడువనేరదు. "యేనాశ్రుతం" అనువాక్యమును విమర్శించిన నట్టిసంకోచ మేదియుఁ గానవచ్చుట లేదు. మఱియు బృహదారణ్యకాద్యుపనిషత్తులయం దున్న ప్రతిజ్ఞావాక్యములఁ బట్టి చూచిన నీ సంశయమున కే యవకాశ ముండదు. "ఆత్మని ఖల్వరే దృష్టేశ్రుతే మతే విజ్ఞాత ఇదం సర్వం విదితం" "ఓమైత్రేయి ! ఆత్మ నెఱింగితివేని సాక్షాత్కరించితి వేని విచారించితివేని యీసర్వంబును తెలిసికొనఁబడినట్లే యగును" అని బృహదారణ్యకోపనిషత్తునందును "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం" "ఓమహాత్మా! ఎవ్వని నెఱింగిన నీసర్వము నెఱుంగఁబడిన ట్లగును" అని ముండకోపనిషత్తునందును ప్రతిజ్ఞావాక్యములయందు సర్వశబ్దమై ప్రయోగింపఁబడియున్నదిః దానికి నిరర్థకముగ తగినంతయుపపత్తి యుండగనే సంకోచము కలిగించుట యుక్త మగునా? ఈకారణమువలన నుత్పత్తిశ్రుతులకుఁ బరస్పరవిరోధము లేదు; ఆకాశమునకును నిర్వివాదముగ నుత్పత్తి కలదు.

## సూత్రము. ౭.

అవతారిక:—ఈవిధముగ శ్రుతులయందలిపరస్పరవిరోధమును నిరాకరించి ఈ క్రింది సూత్రముచేఁ బ్రత్యక్షాదులవలన కలుగునని చెప్పఁబడినవిరోధమును నిరాకరించుచున్నాఁడు.

## ౨-౨౩. యావద్వికారం తు విభాగో లోకవత్. ౨. 3. ౭.

తాత్పర్యము:—ఆకాశ ముత్పత్తి యయ్యె ననుటలో నేప్రమాణంబును విరుద్ధము కాదు. నీవుచూపిన ప్రత్యక్షాదులు యుక్తములుకావు వానికే యన్యప్రమాణములతో విరోధము కలదు. ఎట్లనిన:—

లోకమునందు కుండ, చట్టి, మూకుడు, కడియము, కుండలములు, కిరీటములు మొదలగువికారములుమాత్రమే పరస్పరవిభాగముకలిగియున్నది. యనుట నియమముగ గానవచ్చుచున్నది. ఏయేపదార్థములు వికారములు కావో యవి విభక్తములు కా వనుటయు నట్లే నియమముగ నున్నది. కావున నాకాశము కూడ భూమ్యాదులకంటె భిన్న మగుటచే నొకానొకపదార్థమునకు వికారమే కావలయునని తేలుచున్నది. కాలము, దిక్కు, మనస్సు, పరమాణువులుఅనునవిగూడ విభాగముకలవియగుటచే నేదియో యొకపదార్థమునకు వికారములే కావలయు నని తేలుచున్నది. కావున యీ నియమము నాశ్రయించి చూచిన నీవుచూపినప్రమాణములన్నియు నిర్మూలము లగును.

"ఇట్లయిన నాత్మయు నేదియోయొకపదార్థమునకు వికారమే కావలసివచ్చును. ఆతఁడును ఆకాశాదులనుండి విభక్తుఁడయ్యేయున్నాఁడు. కదా!" అనియెదవేమొ వినుము?. శ్రుతియందు "ఆత్మనఆకాశఃసంభూతః" అని చెప్పఁబడియుండుటచే సర్వమునకు నాయనయే యుపాదానకారణమని చెప్పఁబడియున్నది కదా! ఇట్లుండ నాయనకు మఱియొకకారణ మెందుండి వచ్చును? మఱియు నెట్లు విచారించినను ఆత్మకు నుత్పత్తియే సంభవింపదు. శ్రుతి నాశ్రయించి చూచిన నాయనకంటె భిన్న మగుపదార్థ మేదియుఁ గానవచ్చుటలేదు కావున సర్వపదార్థములు నప్పుడు కారణరహితములే కావలసివచ్చును, ఇది శూన్యవాదమే కదా! దీనినిగూర్చి యనేకవిధములుగ నిదివరకే ఖండింపఁబడెను. "వేదమును విశ్వసించువారెవ్వరు?" అనియెదవేమి? వినుము. ఆత్మ యనఁగా తాను. తనస్వరూపము. ఇట్లుండ దానియందు సందేహము గాని విపరీతభావన గాని యుండుటకు వీలు కలదా ? అది యెప్పటికైనను తనకు ప్రత్యక్షము కాకుండ

నుండనేర్చునా? ఇట్లు సర్వవిధముల ప్రత్యక్షమై యున్నయాత్మను లేదని యెవ్వరు చెప్పఁగలరు?

"లేఁడని చెప్పవలసినపని యేమి? ఆయాత్మకు నుపాదాన కారణ ముండిన నంతయే చాలును." అనియెదవేమొ? వినుము. మృత్తిక మొదలగు వానినుండి (జనించు ఘటాదిపదార్థము లొకసమయమున నుండుటయు మఱియొకసమయమున లేకుండుటయుఁ గూడ ననుభవసిద్ధమై యున్నది. కావున నాత్మయు నట్టివాఁడే యగునేని యాయనకు నుపాదానకారణ మగుపదార్థమే సత్యముగ నుండవలయును. కాని యాయన యట్టివాఁడై (నిత్యుండై) యుండుటకు వీలు లేదు. ఈ కారణమువలన నేయేపదార్థము ఒక కారణమునుండి జనించునో అది యెల్ల నాగంతుకమే (వచ్చుచుఁ బోవుచుండునదియే) కావలయును. కావున నాత్మయు నొకదానికిఁ గార్య మగు నేని యాగంతుకుఁడే కావలయును. ఆయన మాత్ర మట్టివాఁడు కానేరఁడు. ఆయన స్వతస్సిద్ధుఁడు.

మఱియొక ప్రమాణముతో నవసరము లేకయే ప్రకాశించుటయు సర్వకాలములయందు నేకరూపముతో నుండుటయు స్వతస్సిద్ధి యనఁబడును. బాగుగ విచారించిన నాత్మస్వరూపమును గూర్చి ప్రమాణము లేవియు ప్రవర్తించుటకు వీలు లేదు. స్వస్వరూపము నెఱుంగు విషయమున నే ప్రమాణము నుపయోగించుటకు వీలుకలదు. ప్రమాణము ప్రవర్తింపనలయు ననిన ప్రమాతయు ప్రమేయంబు నుండవలయును; అవియుఁ బరస్పరభిన్నములు కావలయును కదా! ఇట్లుండ నవిరెండును తానే యగుట యెట్లు సంభవించును? మఱియు విచారింపఁబోయిన సర్వప్రమాణములును ప్రమేయముల సిద్ధి నొందించుటకై యాత్మనే యాశ్రయించుచున్నవి యనుట స్పష్టముగ నున్నది. ఇట్టివాఁడు లేఁడని నిరాకరింపఁబడుటకు నెట్లర్హుఁడగును. నిరాకరించుటయు నొక ప్రమాణమువలనఁ గాని సంభవింపదు. కావున నాప్రమాణమునకు నాశ్రయుఁడును తానే యగుటచే నిరాకరించువాఁడును, నిరాకరింపఁబడువాఁడును నొక్కఁడే కావలసివచ్చును. ఇది విరుద్ధముకదా! కావున నాత్మ స్వతస్సిద్ధుఁడు. ఆత్మవంటివి కాకుండుటచే నాకాశాదు లాగంతుకములు వానిని గ్రహించుటకుఁ బ్రమాణములు కావలయు ననుట నిర్వివాదాంశమేకదా!

మఱియు లోకమున "నేను వర్తమానకాలమునందలి విషయముల నెఱుంగుచున్నాను. గడచిన విషయముల నెఱింగితిని; రాబోవు విషయముల నెఱుంగబోవుచున్నాను." అని యొక్కపురుషుఁడే స్వస్వరూపము త్రికాలములయందు నున్నట్లు వ్యవహరింపుచున్నాఁడు. ఈ వ్యవహారము నాశ్రయించిచూచిన నాత్మ నిత్యుఁ డనువిషయము స్పష్టమగుచున్నది. తెలియఁబడువిషయములు మాత్రమే భిన్నములగుచున్నవి కాని తెలిసికొనువాఁ డట్టివాఁ డగుట లేదని పై వ్యవహారమువలన స్పష్టమగుచున్నది కదా! ఈ కారణమువలననే దేహము నశించినపిదపఁగూడ నాత్మవినాశము కలుగు నని చెప్పుటకు వీలు లేకున్నది. సద్రూపమని యనుభవబలమువలన నేర్పడిన పదార్థము నశించు నని చెప్పఁబడుటకు నెల్లును శక్యము కాదు. అట్లు చెప్పుట యనుభవవిరుద్ధము కదా! సర్వసాక్షియగుటచే నాతఁడు దేహవినాశమును కూడఁ జూడవలసినవాఁడు. మాత్రమే యగు ననుటయు సుప్రసిద్ధము "నాశ మవశ్యముగ కలుగవచ్చును" అని పట్టు పట్టిన దానిని సాధించుటకు ప్రమాణమే లేదు. తానే సర్వప్రమాణములకు నాశ్రయుండై యుండ తన నాశమును తెలిసికొనువాఁడెవ్వఁడు? ఈ కారణమువలన నాత్మ స్వతస్సిద్ధుఁడు. మఱియొక కారణమునకుఁ గార్యమాతఁడు కాఁడు. ఆకాశాదు లిట్టివి కావు. గావున కార్యములు "ఆకాశకాల దిఙ్మనః పరమాణవః అన్యకార్యాణి విభక్తత్వాత్ ఘటవత్" అనునది యనుమానవాక్యస్వరూపము. యీ యనుమానముచే "ఆకాశో న జాయతే నిత్యత్వాత్ ఆత్మవత్" "ఆకాశో నిత్యః స్పర్శానాశ్రయత్వాత్ ఆత్మవత్" అను ననుమానములు ఖండింపఁబడినవి యని తెలిసికొనవలయును. ఆకాశభిన్నము లగునాలుగు భూతములయందును స్పర్శకలదు కావునను ఆకాశాదులయం దది లేదు కావునను అది లేనివి (ఆకాశాదులు) నిత్యము లని వైశేషికసిద్ధాంత మగుటచేతను నిత్యత్వమును సాధించుటకు తదభావమే (స్పర్శాభావమే) హేతువుగఁ జెప్పఁబడెనని తెలిసికొనవలయును.

మఱియు సమానజాతీయము లగుననేక పదార్థములు మాత్రమే మఱియొకపదార్థము సృజించుచున్నవియనియు నాకాశమునకు నట్టిపదార్థ లేవియుఁ గారణములుగ లేవనియుఁ జెప్పితివి. ఇదియు యుక్తియుక్త మగుమాట కాదు. వైశేషికసిద్ధాంతమే నీసిద్ధాంతము కదా కావున వినుము. వైశేషికులు పదార్థమునుండియే పదార్థగుణముజనించునందురు.

వీనికి సమానజాతిమెక్కడిది. పదార్థము *ద్రవ్యముతత్సంగయోగాదులు గుణములు కదా! మఱియు నిమిత్తకారణములు పదార్థములతో సజాతీయములై యుండవలయు ననునియమము బొత్తుగనే లేదు. "సమవాయికారణములే యట్టివి (సమానజాతీయములు) కావలయును కాని యితరము లక్కఱ లేదు" అనియెదవేమొ? యప్పటికిని పైసిద్ధాంతము (సమానజాతీయము లగుపదార్థములే మఱియొకదాని నుత్పత్తి చేయును అనుసిద్ధాంతము)నిలువదు. ఒక్కత్రాడే నూలుపోగులచేతను, నారచేతను, వెంట్రుకలచేతనుఁ గూడఁ జేయఁబడుచున్నది. ఒక్కవస్త్రమే నూలు చేతను, నారచేతను, వెంట్రుకలచేతను నేయఁబడుచున్నది. ఇట్లుండ నాని యము మెక్కడనుండి వచ్చును? నూలుపోగులు మొదలగునవియన్నియు సమానజాతీయములు కావు? వస్త్రాదులు మాత్ర మట్టివి. (సమానజాతీయములు కానివి) కావు కదా ! లోకమున నన్నిటిని (నూలుపోగులు మొదలగువానితో నేయఁబడినవాని నన్నిటిని) "నూలుగుడ్డ, నారగుడ్డ, ఉన్నిగుడ్డ" అని వస్త్రశబ్దముతో సమానజాతీయములనుగనే వ్యవహరించుటకలదుకదా! కావున నెట్లును నీసిద్ధాంతము నిలువదు. "అన్నియు ద్రవ్యములే కావున సమానజాతీయములగును" అందువేమొ? అప్పుడు ఈ నియమముతో పనియేలేదు. అగ్నికి జలము కూడ సమానజాతీయమే కావలసివచ్చుటచే జలమునుండి గూడ యగ్నిజనింపవచ్చును కదా! కావున సమానజాతీయములనుండియే పదార్థములు జనింపవలయు ననునియమ మనుభవవిరుద్ధము.

మఱియు ననేకద్రవ్యములు కలసియే యొక్కదానిఁ బుట్టింపవలయు ననుటయు నియమము కాదు. వైశేషికులు పరమాణువునుండియు మనస్సునుండియుఁ గూడ సృష్ట్యారంభమునఁ జలనాదిరూప మగుకర్మ జనించు నని యంగీకరించియున్నారు. అవి యొక్కొక్కటియే కదా! వానినుండి మఱియొకపదార్థ మెట్లుపుట్టెను? "కర్మకును ద్రవ్యమునకును భేదముకలదు కావున ద్రవ్యమును పుట్టించునప్పుడు మాత్రమే సమవాయికారణము లనేకములు కావలయును కాని మఱియొకసమయమున గాదు" అనియెదవేమొ అదియు నిలువదు. వైశేషికులకు పరిణామము కూడ సమ్మతమే. పరిణామమునందు అనేకపదార్థములే యేకరూపముతో బరిణమించుననుట

* ద్రవ్యము (౭౧౨-వ పుట చూడు).

నియమము లేదు. కొన్నికొన్ని స్థలములలో నొక్కపదార్థము కూడ ద్రవ్యాంతరరూపముతోఁ బరిణమించుచున్నది. పాలు ఒక్కటిగనుండియే పెరుగుగమారుచున్నది. కావున ద్రవ్యము జనించుటకు ననేకపదార్థములే గారణములుగ నుండవలయు ననునియమము లేదు. అనేకపదార్థములు పరస్పరము కూడి మఱియొకరూపమును జెందినప్పుడు వానిని ద్రవ్యాంతర నామముతో పిలుచుట సంభవించును; "వీనివలన నీపదార్థము జనించెను" అనియుఁ జెప్పుట సంభవించును కాని లోకమున నన్నిద్రవ్యములు నిట్లే జనించె ననుట లేదు కదా! కావున నెట్లును శ్రుతి నాశ్రయించి యేక రూపుఁడగు పరమేశ్వరునుండియే యాకాశాది సర్వప్రపంచము జనించె నని యంగీకరింపవలయును. "ఉపసంహారదర్శనాత్. ౨. ౧. ౨౪." అనుస్థలమున నీవిషయము అసహాయుఁడగుపరమేశ్వరునుండియే ప్రపంచ ముత్పత్తి యగుననువిషయము) వివరింపఁబడియే యున్నది.

మఱియు ఉత్పత్తియగుపదార్థమునకు పూర్వాపరకాలములయందు విశేషము గానరావలయు ననియు పూర్వమున లేనిగుణ ముత్పత్త్యనంతర మున రావలయు ననియు నిట్టివిశేషము ఆకాశమున గానరాకపోవుటచే దానికి నుత్పత్తి లేదనియుఁ జెప్పితివి. ఇది యుక్తియుక్తము కానేరదు. ప్రస్తుతసమయమున నేశబ్దగుణమువలన నాకాశమును పృథివ్యాదుల కంటె భిన్నములుగ గ్రహించుచున్నామో యాశబ్దగుణమే యుత్పత్తికి బూర్వమున దానికి లేదనవచ్చును. ఇందు సంశయ మేమి? మఱియు శ్రుతియందు సృష్టికిఁ బూర్వమున పృథివ్యాదిధర్మము లగుస్థూలత్వాదు లులేవని "అస్థూల మనణు" అనుమొదలగువాక్యములచే జెప్పఁబడి యున్నట్లె "అనాకాశం" అనువాక్యముచే నాకాశముకూడ లేదని చెప్పఁ బడి యున్నది. కావున సృష్టికి బూర్వమున నాకాశము లేదనుటయే సిద్ధాంతము.

ఈకారణమువలననే "పృథివ్యాదులకంటె భిన్నస్వభావము కలది యగుటచే నాకాశము జనింపలేదు." అనుపక్షముకూడ యుక్తియుక్తము కానేరదు. "ఆకాశమున కుత్పత్తి లేదనువాదము యుక్తిశూన్య" మని యిదివరకే ఖండింపఁబడి యున్నది. శ్రుతికి విరుద్ధ మగుటచే నది యాదరింపఁబడదగినది కాదని చెప్పఁబడినది. "ఆకాశమునకు గూడ నుత్పత్తి కలదు" అనువిషయమున ననుమానప్రమాణము కూడ ప్రకటింపఁబడినది.

"ఆకాశ మనిత్యము" అనువిషయమునఁగూడ ననేకప్రమాణములఁ జూప వచ్చును. అదికూడ ననిత్యము లగుగుణములకు నాశ్రయమే కదా ("ఆకాశ మనిత్యం అనిత్యగుణాశ్రయత్వాత్ ఘటవత్" అనునది యనుమాన వాక్యస్వరూపము.) ఈకారణమువలన నాకాశమున కెట్లును యుత్పత్తి కలిగియే యుండవలయును. "ఇట్లు కాదు. ఆకాశము ననిత్య మని చెప్పుటకు వీలు లేదు. గుణములు జీవునకు నీశ్వరునకుఁ గూడ గలవు. వారు అనిత్యులు కానేరరు కదా" అనియెద వేమొ వినుము. వేదాంతమతమున నీదోషము రాదు. ఆమతమునకు వేదమే యాధారము. "అట్లనను ఆకాశమునకుఁ గూడ సర్వవ్యాపకత్వము మొదలగునవి కలవు కావున నదియు ననిత్య మగుటకు వీలు లేదు అనియెద వేమ్మొ? అది యెట్లు సంభవించును. ఆకాశమునకు నాగుణములు మీామతమునందు కలవు. దానికి నుత్పత్తిని చెప్పుమతమున నవి యెట్లు వచ్చును. కావున నెట్లును ఆకాశము శ్రుత్యనుసారముగ బరమేశ్వరకార్యమే!

మఱియు "శబ్దాచ్చ. ౨.౩.౪." అనుసూత్రమున నీవుచూపినశ్రుతులన్నియు నీమతమును నిలుపనేరవు ఎట్లనిన:—"అమరా నిర్జరా దేవాః" అనుస్థలమున దేవతులయం దమరశబ్దము ప్రయోగింపఁబడి యున్నను వారికి నిత్యత్వము నెట్లు చెప్పదో యట్లే బృహదారణ్యకోపనిషత్తునందు ఆకాశవాయువులయం దమృతశబ్దము ప్రయోగింపఁబడియున్నను వానికి నిత్యత్వమును చెప్పనేరరు. ఇక బ్రహ్మమునకు నాకాశము నుపమానముగఁ జేయుట "లోకమున నాకాశ మెట్లు సర్వభూతములకంటెనధికపరిమాణము గలదియై యంతటను నిండి దేనితోను సంబంధపడక నున్నదో అట్లే పరమేశ్వరుఁడు కూడ సర్వప్రపంచమునకంటె నధికపరిమాణము కలిగి యంతటను వ్యాపించి యుండియు దేనితోను సంబంధపడకనున్నాఁడు" అని నిరూపించుటకే గాని "ఆకాశము పరమేశ్వరునివంటిది" అని చెప్పుటకు గాదు. "జ్యాయా నంతరిక్షాత్" అని మఱియొకశ్రుతి పరమేశ్వరు నాకాశము నకంటె నధికపరిమాణము కలవానినిఁగా జెప్పుచున్నది. "న తస్య ప్రతి మా స్తి" "ఆపరమేశ్వరునకు పోలికయే లేదు" అని శ్వేతాశ్వతర శ్రుతి ఘోషింపుచున్నది కావున నెట్లును ఆశ్రుతులవలన మీామతము సిద్ధింపదు. ఈకారణమువలన నాకాశము బ్రహ్మకార్యమనుమతముసిద్ధించినది.

ఇట్లగుటచే "స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్ ౨. 3: ౫." అనుస్థలమునఁ జేయఁబడినసిద్ధాంతము కూడఁ బ్రయోజనకారి కానేరదు.

---

## ౨౨౪. మాతరిశ్వాధికరణము. ౨.

విషయము:—ఇందు వాయువుయొక్క యుత్పత్తి సిద్ధాంతము చేయఁబడును.

సంగతి పూర్వపక్షము.—

పూర్వాధికరణమున "ఏకం ఏవ అద్వితీయం" అని మూడు పదములచేఁ బరమేశ్వరుఁడేకరూపము వర్ణింపఁబడెను కావున నది వాస్తవమే కావలయుననియు, నౌపచారికము కారా దనియుఁ జెప్పఁబడెను. బృహదారణ్యకోపనిషత్తునందు ఆకాశ వాయువు లమృతరూపము లని చెప్పఁబడినపిదప మఱల వాయువును గూర్చి "సైషా నాస్తమితా దేవతా" ="ఈవాయువు ఎప్పటికి నస్తమానము నొందని దేవత" అని చెప్పఁబడి యున్నది. ఇట్లు రెండుమాఱులు చెప్పఁబడి యుండుటచే వాయువు నిత్యమే కావలసివచ్చును. ఈశ్రుతికి విరుద్ధ మగుటచే ఛాందోగ్యోపనిషత్తునందు బొత్తుగనే లేకపోవుటచేతను తైత్తిరీయమున నున్న "ఆకాశాద్వాయుః" అనువాయూత్పత్తి శ్రుతిగౌణియే కావలసివచ్చును. కావున నెట్లును వాయువున కుత్పత్తి లేదు.

## సూత్రము. ౮.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసందర్భముచే వచ్చినయాక్షేపము *నతిదేశముచేఁ బరిహరించుచున్నాఁడు.

## ౨౨౫. ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః. ౨.౩.౮.

తాత్పర్యము:—ఈవాయువిషయమున నేపూర్వపక్షములును పనికిరావు. పైయధికరణమునందుఁ జేయఁబడినసిద్ధాంతముతోనే వాయువును గూర్చినసిద్ధాంతము కూడఁ జేయఁబడినట్లే యైనది. సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు విరోధము వచ్చు ననుటయుఁ బరస్పరవిభాగములు గలపదార్థము

---

* అతిదేశ మనఁగా నొకస్థలమునఁ జూపఁబడిన న్యాయమును మఱియొక స్థలమునందు నట్లే ప్రయోగించుట. ఉపపదవిభక్తి

లన్నియు నొకదానికి కార్యములే యై యుండవలయు ననుటయు నీవిష యమునందును సమానములే. రెండవసూత్రము కూడ వాయువునుగూర్చి "సైషా నాస్తమితా" అని శ్రుతియందు చెప్పఁబడుట యుపాసనావిధా నార్థ మగుటచే నౌపచారికమే యనుటలో సంశయము లేదు. కావున నెట్లును వాయూత్పత్తివిషయమునందుఁ గూడ క్రమము ననుసరింపవలసి నదియే. ఛాందోగ్య, తైత్తిరీయశ్రుతులకు విరోధము ఎప్పటికిని లేదు.

సర్వవిషయములును ఆకాశవాయువులయందు సమానములే యైనను వాయువునుగూర్చి రెండవయధికరణము నారంభించుట "సైషా" అను మొదలగు శ్రుతుల నాశ్రయించివచ్చిన క్రొత్తసందేహమును నివారిం చుట మాత్రమే యని తెలిసికొనవలయును.

---

# అసంభవాధికరణము. 3.

విషయము:— ఇందు ప్రస్తానసంబంధముతోఁ "బరమేశ్వరునకు నుత్పత్తిలేదు." అనువిషయము నిర్ణయింపఁబడును.

సంగతిపూర్వపక్షము:— "పై రెండధికరణములయందును అమృత త్వాది శ్రుతుల నౌపచారికములుగమార్చి యెన్నఁడును తలంపఁ బడని యుత్పత్తిని యాకాశవాయువులకుఁ జెప్పితిరి. ఇట్లే బ్రహ్మమునకుఁ గూడ నుత్పత్తిని జెప్పవచ్చును. 'త్వం జాతో భవసి విశ్వతోముఖః' అని యీ విషయమును శ్రుతియే ప్రత్యక్షముగఁ జెప్పుచున్నది. "అగ్నినుండి మిడుగు రులు జనించునట్లు ఆత్మనుండి యాత్మ జనించును" అని దృష్టాంతమునుఁ జూపుచున్నది. లోకమునను సరించి చూచినను ఆకాశాదివికారములనుండి యే ఘటాదులు జనించుచుండుటచే నాయాకాశాదులు కూడ మఱియొక వికారమునుండియే జనింపవలయునని తోఁచుచున్నది. ఈకారణమువలనఁ బరమేశ్వరునకుఁగూడ నుత్పత్తి కలదనియే చెప్పవలయును" అను పూర్వ పక్షము పైయధికరణముల నాశ్రయించి దృష్టాంతసంబంధముతో వచ్చును.

## సూత్రము. ౯.

అవతారిక.—దీనిని సయుక్తికముగ నీయధికరణమున నిరాకరించుచున్నాఁడు.

### ౨౨౯. అసంభవస్తు సతోఽనుపపత్తేః. ౨. ౩. ౯.

తాత్పర్యము:—ఆకాశాదిదృష్టాంతములవలనఁ బరమేశ్వరునకు నుత్పత్తి కల దనుట యుక్తియుక్తము కాదు. "సకారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చి జ్జనితా"="ఆపరమేశ్వరుఁడు సర్వకారణము సర్వేంద్రియములకు నధీశ్వరుఁడు ఆయనకు నుత్పత్తికారణము లేదు" అని శ్రుతి స్వయముగఁ జెప్పుచున్నది. "అగ్నినుండి మిడుఁగురులు జనించినట్లు" అనుదృష్టాంత మొకచోఁ జెప్పఁబడియున్నను దాని నౌపాధిక జీవపరముగా మార్చుకొనవచ్చును "త్వం జాతః" అనుశ్రుతియు జీవబ్రహ్మాభేదపరము కావచ్చును.

ఇట్లు కాక "అవశ్యముగఁ బరమేశ్వరునకు నుత్పత్తియే కలదు" అని పట్టుఁ బట్టిన నది సర్వప్రమాణవిరుద్ధ మగును. వేదమున "సత్యం జ్ఞానం" అని పరమేశ్వరుఁడు సత్తామాత్రస్వరూపుఁడుగాఁ జెప్పఁబడెను. తగినప్రమాణము లేక దానిని త్రోసివేయుట యుక్తియుక్తము కానేరదు. అట్టిప్రమాణము మాత్ర మేదియుఁ గానరాదు. ఎట్లనిన:—లోకమునఁ గానవచ్చుప్రతిపదార్థంబునుఁ గొంతకాలము సద్రూపమునయ్యేయున్నను మఱికొంతకాలమునకు నశించుచున్నది. ఆత్మ యట్టివాఁడు కాఁడనుట ప్రత్యక్షముచేతను శ్రుతిచేతనుఁ గూడ స్పష్ట మగుచున్నది. "'నేను వర్తమానభూతభవిష్యత్కాలముల యందలివిషయముల గ్రహింతును' అని ప్రతిపురుషుఁడును వ్యవహరించుచున్నాఁడు కావున నాత్మనిత్యుఁడే కావలయును" అని యిదివఱకే (౨. 3. ౯.) నిరూపించియున్నాము. ఈకారణమువలన నాయాత్మ యేపదార్థమునుండి గానిఁ జనించువాఁ డగుటకు వీలు లేదు. జనించిన వినాశ మవశ్యముగ నుండవలయును కదా! ఉత్పత్తినాశము లావిర్భావతిరోభావము లైనను మఱి యేమియైనను పదార్థమునకు వికారములను గలిగించు ననుటలో సంశయము లేదు కదా! వికారము లుండిన నది పారమార్థికము కానేరదని

యిదివఱకే (ఆరంభణాధికరణమునందే) నిరూపించి యున్నాము ? రజ్జుసర్పమువలె ననిర్వచనీయము మాత్రమే (ఉన్నట్లు మాత్రమే కానఁబడి పరమార్థస్థితిలో శూన్యరూపమై మాత్రమే) యగుననియు నిరూపించి యున్నాము. ఇట్టిస్థితి పరమేశ్వరునకు సంభవింపదు. సంభవించిననే గాని యేపదార్థమునకు నైన నుత్పత్తి కలుగదు. ఏవేవి జనించునో అవి స్వకారణములయం దారోపింపఁబడినవే యని యిదివఱకే నిరూపించి యున్నాము. ఆరోపవ్యతిరిక్తముగ నుత్పత్తియే సంభవింప దని నిరూపించి యున్నాము. మామతమున నేపదార్థము జనింపవలయు నన్నను దానికి వివర్తమే కదా కారణ మగును.

బాగుగ విచారింపుము. పరమేశ్వరుఁడు సద్రూపుఁడయినను పరునుండి జనింప వచ్చు ననుటకు నేదియైన వీలు కలదా ? సత్పదార్థమునుండియే జనించు ననిన కారణకార్యములకు (బ్రహ్మమునకును తత్కారణ మగు సత్పదార్థమునకును) భేద మేమియుఁ గానరాకుండుటచే నది సరిపడదు. భేదము (ఆధిక్యము) లేకపోయినఁ బ్రకృతివికారభావము సంభవింప దని పలుమాఱు నిరూపించి యున్నాము. ఇక సత్పదార్థజాతిలో నొకానొక విశేషమునుండి (ప్రత్యేకపదార్థమునుండి) యాయన జనించు ననుటయు సంభవింపదు. లోకమున నేపదార్థము జనించినను సామాన్యరూపము లగుకారణముల నుండియే [వేదాంతవాదము ననుసరించి కారణము ఒక్కటి యయ్యునుఁ గార్యనామరూపములతో ననేకముగ వ్యవహరింపఁ బడుచున్నది కావున వానికి (కార్యకారణములకు) విశేషసామాన్యభావము కల దని తెలిసికొనవలయును. ఆరంభపరిణామవాదులపక్షమున నిది సంభవింపదు. వారిమతమునఁ గార్యకారణములు భిన్నపదార్థములే] జనించుచున్నది కాని మఱియొకవిధముగ జనించుట లేదు కదా ! ఇక నసత్పదార్థమునుండియే యాయన జనించు ననుట బొత్తుగ సంభవింపదు. అసత్పదార్థ మనఁగా శూన్యమే కదా ! దానినుండి సత్పదార్థ మెట్లు పుట్టును? "కథ మసతః సజ్జాయేత" అని శ్రుతియందే స్వయముగ నీవిషయమాక్షేపింపఁబడి యున్నది. కావున నెట్లును సత్పదార్థమున కుత్పత్తి సంభవింపదు.

"ఇట్లు చెప్పిన 'నొకపదార్థముపై నారోపింపఁబడినపదార్థము నందు మఱియొకవిధార్థము నారోపించుటకు వీలు లేదు' అని చెప్పిన ట్ల

గును. వేదాంతిమతమునఁ గార్యము లన్నియు నారోపితములు నసత్యములు నై యున్నవికదా! ఇది సంభవింపదు. బ్రహ్మకార్య మగుమృత్తిక నుండి ఘటము జనించు ననుట యెప్పుడు సంభవింపకపోవలసి వచ్చును." అనిమెదవేము యట్లు కాదు. త్రాటియం దారోపింపఁబడినసర్పము త్రాడే యగునట్లు బ్రహ్మమున నారోపింపఁ బడినపదార్థము బ్రహ్మమే యగును. కావునఁ బ్రతికార్యమునందు నాయాయాకారముతో బ్రహ్మమే కల దనియు దానియందే యితరపదార్థములు (ఘటాదులు) నారోపింపఁ బడుచున్నవి యనియు తెలిసికొనవలయును. కావున నెట్లును ఆరోపిత పదార్థమున నుజల నారోపము లేదు. ఈ కారణమువలన సత్యమై యుత్పత్తిశూన్యమై యుండుకారణము నొక్కదాని నవశ్య మంగీకరింప వలయును. అంగీకరింపకుండిన ననవస్థాదోషము దుర్నివారమై వచ్చును. అనవస్థ యనఁగా నిలుపు లేకపోవుటయే కాదు ఇచ్చట పదార్థములకు నిలుకడయే సంభవింప దనునదీ కూడ నై యున్నది. కార్యస్వరూపము కారణమే యగుటచే నది సత్యము గాకున్న కార్యమే యుండదు, కదా! కావున మీరు దేనిని కారణముగ నంగీకరింతురో యదియే మాకు బ్రహ్మము. ఇట్లుండ దానికి నుత్పత్తి నెట్లు సాధింపఁ గలరు. కారణ మసత్య మైనచో గలుగుదోషము లిదివఱకే చెప్పఁబడెను. కావున శ్రుతుల నౌపచారికముగ నన్వయించుటలో విరోధ మేమియు లేదు.

---

## తేజోఽధికరణము. ౪.

విషయము:—ఇచ్చట నగ్న్యుత్పత్తి నిర్ణయింపఁ బడును.

సంగతి సంశయపూర్వపక్షము.— "ఛాందోగ్యశ్రుతియందు అగ్ని పరమేశ్వరునుండియే జనించినట్లును, తైత్తిరీయశ్రుతియందు వాయువునుండి జనించినట్లును చెప్పఁబడియున్నది. ఇందు నిర్ణయముఁ జేయఁబోయిన రెండువిధములుగఁ గూడ నగ్నికి నుత్పత్తి కలుగవచ్చు ననిషే తేలుచున్నది. సామాన్యమునుండివిశేషము జనించు నని సిద్ధాంతము చేయఁబడి యున్నది కదా! ఇచ్చట వాయువును బ్రహ్మంబును గూడ సామాన్యములే. అందు దేనినుండి యైనను అగ్ని జనింపవచ్చును

కదా కావున నగ్నిజన్మస్థానమును నిర్ణయించుటకు వీలు లేదు" అని పై యధికరణసిద్ధాంతము ననుసరించి ప్రత్యుదాహరణసందర్భముతో వచ్చు నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁ బడుచున్నది.

ఈ యేకదేశిమతానుసారముగ సిద్ధాంతము. —ఈయాక్షేపమున కు నవిచారపూర్వకముగ వేదాంతులతో గొంద ఱిట్లని సమాధానము చెప్పుచున్నారు.

పై యాక్షేపము యుక్తియుక్తము కాదు. ఛాందోగ్యోపనిషత్తు నందు చెప్పినట్లు అగ్ని ప్రత్యక్షముగ పరబ్రహ్మమునుండియే జనించెను. అనేకశ్రుతులయందిట్లే సర్వంబును పరబ్రహ్మమునుండి యే జనించె నని చెప్పఁబడి యున్నది. తైత్తిరీయోపనిషత్తునందును "ఇదం సర్వం మసృజత" అని సర్వసృష్టి చెప్పఁబడి యున్నది. కావునఁ బ్రతిపదార్థంబును ప్రత్యక్షంబుగఁ బరమేశ్వరునుండి యే జనింపవచ్చును. అట్లే జనించు ననవలయును. లేకున్న సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగము కూడఁ గలుగును. ఏపదార్థమున కాపదార్థము పరబ్రహ్మమునుండి జనించిన నప్పుడు మాత్రమే బ్రహ్మజ్ఞానము వలన సర్వజ్ఞానము కలుగవచ్చును కాని మఱియొక విధమున నట్లు కలుగుటకు వీలు లేదు. కార్య మనఁగా వేదాంతమతమున నారోపితపదార్థమే యగుటచే నది పరమార్థస్థితిలో నసత్యము; దాని యందు మఱియొకపదార్థ మారోపింపఁ బడుటకు వీలు లేదు. కావునఁ బ్రత్యక్షముగ బ్రహ్మమునుండియే ప్రతిపదార్థంబును జనించుచున్నది అనవలయును గాని యెప్పటికిని బ్రహ్మకార్య మగుపదార్థమునుండి మఱి యొకపదార్థము జనించునని చెప్పుటకు వీలు లేదు. ఆరోపిత మగునానిపై మఱియొక యారోప ముండుటకు వీలు లే దనియే కదా అసంభవాధికర ణమున (మూఁడవ యధికరణమున) సర్వకారణ మగుపదార్థమునకు (బ్రహ్మమునకు) నుత్పత్తి సంభవింప దని సిద్ధాంతము చేయఁబడి యున్నది యిట్లగుటచే ఛాందోగ్యశ్రుతియే ప్రధానము. తైత్తిరీయశ్రుతియందు "వాయో రగ్నిః" అని యున్నను దానిని మఱియొకవిధముగ నన్వయింప వలయును. * ఉపపదవిభక్తికంటెఁ * గారకవిభక్తి బలవత్తర మైనదియే యై

* ఉపపదవిభక్తి—వ్యాకరణమునఁ బ్రథమావిభక్తులన్నియు నుపపదవిభక్తులనియుఁ గారకవిభక్తు లనియు [illegible] ప్రయోగింపఁబడుచున్నవి.

నను ఇచ్చట హేతువాచక మగుకారకవిభక్తి బహుశ్రుతులకు విరుద్ధ మగుటచే బరిత్యజింపఁ బడవలసినదియే! "వాయోః=వాయువునుండి" అను పంచమీవిభక్తి కారణమును చెప్పునది యైనను (వాయువునుండి యగ్ని జనించె ననుటయే శ్రుత్యర్థమైన) శ్రుతివాక్యములలోఁ బరస్పరవిరోధము వచ్చును. ఇది యనిష్ట మగుటచే నీయర్థము నాశ్రయింపఁ దగదు. "వాయోః" అనుశబ్దమునకు "వాయువునకంటెఁ బిదప" అని మాత్రమే యర్థముఁ జెప్పవలయును. కావున నెట్లును శ్రుతులకు విరోధము లేదు.

## సూత్రము. ౧౦.

అవతారిక:— అనియిట్లు చేయఁబడిన ఏకదేశసిద్ధాంతమును ఖండింపుచు నీయధికరణమున స్వమతమును స్థాపించుచున్నాడు.

## ౨౨౭. తేజోఽత స్తథా హ్యాహ. ౨. ౩. ౧౦.

తాత్పర్యము:— అగ్నిభూతము వాయువునుండియే జనించెను. తైత్తిరీయశ్రుతియే దీనికిఁ బ్రమాణము. "వాయోః" అను పదమునకు "వాయువునుండి" యని యర్థమును చెప్పవలసినదే కాని మఱియొక విధముగా నర్థముఁ జెప్పుట యుక్తియుక్తము కానేరదు. "ఆత్మన ఆకాశ స్సంభూతః" అని యారంభమునందును "పృథివ్యా ఓషధయః" అని యంతమునందును హేతువాచకపంచమీవిభక్తులు స్పష్టముగఁ గానవచ్చుచుండ నడుమ నాకస్మికముగ మఱియొకయర్థమున నాపంచమి యేల ప్రయోగింపఁబడును? "ఛాందోగ్యశ్రుతికి నీయర్థము విరుద్ధము కదా" యనియెద వేమో? నెట్లైనను సమర్థింపవచ్చును. పరబ్రహ్మము

---

అంగుపపదవిభక్తులు స్వతంత్రములుకాక తమయర్థమును చెప్పుటకై మఱియొకపదము నపేక్షించును. ఉ. 'తస్మా ద్ధన మాచకర్ష' అనువాక్యమునకు 'వానినుండి ధనము నాకర్షించెను' అని యర్థ మేర్పడుచున్నను అందలి 'తస్మాత్' అనుపంచమీవిభక్తి 'సమీపమునుండి' అనుపదము లేక సంపూర్ణముగ నర్థమును చెప్పనేరదు. 'వృక్షాత్పపాత' అనువాక్యమునందలిపంచమి మాత్రము 'వృక్షమునుండి పడెను' అని పడుటకుఁ గారణముగ వృక్షమును స్వతంత్రముగనే కదా చెప్పుచున్నది.

కారకవిభక్తి:— కారకవిభక్తి యనఁగా కారకములయందు విధింపఁబడిన విభక్తి కారకములు (౭౨౦-వ పుట చూడు).

"త దాత్మానం స్వయ మకురుత"="ఆ బ్రహ్మము తననే ప్రపంచరూప ముగఁ జేసికొనియెను" అను మొదలగుశ్రుతుల ననుసరించి చూచిన సర్వ రూపములతో స్వయముగనే యున్నాఁ డనియు నీకారణమువలన మొట్ట మొదట నాకాశరూపము నొంది యట్టి తననుండియే వాయువును పుట్టించి వాయురూపముతో నున్న తలనుండియే యగ్నిని జనింపఁజేసె ననియుఁ జెప్పవచ్చును. యిట్లే "సర్వమును బ్రహ్మమునుండియే జనించెను" అని చెప్పుశ్రుతులకు నన్నింటికిని వ్యాఖ్యానముఁ జేయవచ్చును. ఆరోపిత పదార్థమునందు మఱియొకపదార్థ మారోపింపఁబడఁగూడ దనుదోషము కూడ నీవ్యాఖ్యానముచే నివర్తించును. ఆకాశాదు లన్నియు నీవ్యాఖ్యా నము ననుసరించి చూచిన బ్రహ్మమాత్రములే. దేనియం దేది యారోపిం పఁబడినను తత్తద్రూపముతో నున్న బ్రహ్మమున నారోపింపఁ బడినట్లే కదా! కావున నెట్లును ఛాందోగ్యాదిశ్రుతులకు నేవిధముగా నర్థముఁ జెప్పినను సరిపడును కాని క్రమమును చెప్పునది యగుటచే తైత్తిరీయ శ్రుతికి మాత్ర మట్లే యర్థముఁ జెప్పకపోయిన సరిపడదు. ఈకారణము వలన ఛాందోగ్యాదిశ్రుతులకంటెఁ దైత్తిరీయశ్రుతి బలవంతము. కావున దాని ననుసరించి సృష్టి నాకాశాదిక్రమముగనే చెప్పవలయును. ఇట్లు చెప్పుటవలన సర్వవిజ్ఞానప్రతిజ్ఞకును హాని యేమియు రాదు. సర్వమును బ్రహ్మమయ మగుటయే దానికిఁ గావలయును గాని అన్నిపదార్థములును ప్రత్యక్షముగనే బ్రహ్మమునుండి జనింపవలయు ననుట యక్కఱ లేదు. కావున నెట్లును ఈయేకదేశిసిద్ధాంతము యుక్తియుక్తము కాదు. అగ్ని భూతము ప్రత్యక్షముగ బ్రహ్మమునుండియే జనింపలేదు; యీసిద్ధాంత మువలన శ్రుతులకుఁ బరస్పరవిరోధముకూడ రాదు.

---

## అబధికరణము. ౫.

విషయము: —ఇందు జలోత్పత్తి నిర్ణయింపఁబడును.

పూర్వపక్షములు.

"ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ। ఖం వాయు ర్జ్యోతి రాపహ పృథివీ విశ్వస్య ధారిణీ" "బ్రహ్మమునుండియే సూక్ష్మశ రీరంబును మనస్సును ఇంద్రియములును ఆకాశాది పంచభూతములును

జనించుచున్నవి" అను మొదలగు శ్రుతివాక్యములవలన జలమునకుఁ గూడ పరబ్రహ్మమునుండి ప్రత్యక్షముగనే సృష్టి చెప్పఁబడి యున్నది. తైత్తిరీయఛాందోగ్యోపనిషత్తులయందు దాని కగ్నినుండియే సృష్టి చెప్పఁబడి యున్నది. ఈపరస్పరవిరోధము తొలఁగిపోవుట యెట్లు?" అని పైయధికరణసిద్ధాంతముపై *స్ఫురణలక్షణసందర్భముతో వచ్చిన యాక్షేపమును ఖండించుటకై యీయధికరణ మారంభింపఁబడెను.—

**ఏకదేశసిద్ధాంతము.**

ఈయాక్షేపము తగదు. వేదమునకు పరస్పరవిరోధ మెప్పటికిని రాదు. అగ్నిజలములకుఁ గలవిరోధము లోకమునఁ బ్రత్యక్షసిద్ధమైయున్నది నీటిబిందువు లగ్నిచేఁ బోల్పఁబడుచున్నవి ఇట్లుండ నివి కార్యకారణము లెట్లగును? ఈకారణమువలన తైత్తిరీయ ఛాందోగ్యశ్రుతులు గౌణములు. జలము బ్రహ్మమునుండియే ప్రత్యక్షముగ జనించెను.—

## సూత్రము. ౬.

అవతారిక:—ఈసిద్ధాంతము దోషయుక్త మగుటచే దీని నతిదేశమున సూత్రకారుఁడు ఖండించుచున్నాఁడు.

## ౨౨౭. ఆపః. ౨. ౩. ౧౧.

తాత్పర్యము:—ఈసూత్రమున "అతః తథా హ్యాహ" అనుభాగమును పూర్వసూత్రమునుండి తెచ్చికొనవలయును. "జలము అగ్నినుండి జనించును. దీనికి 'అగ్నే రాపః' అను తైత్తిరీయశ్రుతి ప్రమాణము. ఛాందోగ్యశ్రుతియు నీవిషయమున విరుద్ధముకాదు" అని యీసూత్రమున కర్థము చెప్పవలయును.—

---

* స్ఫురణ మనఁగా ఒకవిషయము ప్రసంగింపఁబడుచున్నప్పుడు దానితో నేదియో యొకవిధముగఁ బోలిక గల మఱియొకవిషయము మనస్సునఁ దోఁచుట. ఇదియే స్వరూపముగఁ గలసంబంధము స్ఫురణలక్షణసంబంధము (అనఁగా పూర్వాధికరణము నందలి విషయమును విమర్శించు నప్పుడుత్తరాధికరణమున లేక ప్రస్తుతాధికరణమున విమర్శింపఁబడవలసినవిషయము సాదృశ్యబలముచే జ్ఞప్తికి వచ్చె ననుట.)

"సర్వమును బ్రహ్మమునుండియేజనించును" అనిచెప్పువాక్యములు పైయధికరణమునందే సమన్వయింపఁబడినవి. పంచీకరణముచే స్థూలము

పంచీకరణము:—పంచీకరణ మనఁగా నొక్కొక్కదాని నైదైదుగఁ జేయుట ఈపదము సాధారణముగా భూతములవిషయమునందు మాత్రమే రూఢిఁ బ్రయోగింపఁబడుచున్నది. భూతము లైదైదును వానియందుఁ బ్రతిదానిని ఐదైదుగాఁ జేయుట పంచీకరణ మని చెప్పఁబడెను అది యెట్లనిన.—

ప్రతిభూతమును మొట్టమొదట రెండేసిభాగములుగ విభాగించి యందొక భాగము నట్లే నిలిపి తక్కినదానిని మఱల నాల్గుభాగములుగ విభాగింపవలయును. ఇట్లు చేసినఁ బ్రతిభూతము నైదుభాగములు కలది యగుచుండుటచే పంచీకృత మనఁబడును. దీనికిఁ బ్రయోజనము మొట్టమొదట సూక్ష్మములుగ నున్నభూతములు పరస్పరసంయోగమువలన స్థూలము లగుటయే ప్రతిభూతమునంగును రెండవసగభాగమునఁ గావింపఁబడు నాల్గుభాగములును తత్తద్భూతవ్యతిరిక్తము లగునాల్గుభూతములయందునుఁ జేరుచుండును. ఇదియే పరస్పరసంయోగప్రకారము దీనివలనఁ బ్రతిభూతముయొక్కయు రెండవసగము తక్కినభూతములయష్టమాంశముల నాల్గింటిచేఁ బూరింపఁబడును ఆకాశమునందు ఒకయర్థము మాత్రమే యాకాశ ముండును కాని తక్కినయర్థము మాత్రము వాయుతేజోజలపృథువులలోనియష్టమాంశములచే నేర్పఱుపఁబడినది యగును. వాయుభూతమునందును స్వకీయ మగుభాగ మర్థమే యుండును గాని సంపూర్ణముగ నుండదు. రెండవసగము ఆకాశతేజోజలభూములయష్టమాంశములచేఁ బూరింపఁ బడును. ఇట్లే సర్వభూతములును పంచాత్మకము లగును; స్థూలము లగును.

ఛాందోగ్యోపనిషత్తునందు మాత్రము భూతత్రయసృష్టి మాత్రమే చెప్పఁబడియుండుటచేఁ దదనుగుణముగఁద్రివృత్కరణము మాత్రమే చెప్పఁబడెను. త్రివృత్కరణ మనఁగా నొక్కొక్కదానిని మూఁడుగా విభాగించుట దీనిసిఁ గూడ పూర్వపుపంచీకరణమువలెనే గ్రహించునది. ప్రతిభూతమును రెండుసగములుగ విభాగించి యందొకసగము నట్లే యుంచి తక్కినసగమును మఱల రెండుసగములుగ విభాగింపవలయును; పిదప ప్రతిభూతమునందును రెండవసగమును తక్కినభూతములయందలిచతుర్థాంశములచేఁ బూరింపవలయును. ఇట్లయిన నగ్నిభూతమునందు స్వాంశమొకయర్థంబును జలపృథువులచతుర్థాంశములుఁ గలసి రెండవయర్థంబు నగుచుండును. అయితే ఇది సిద్ధాంతము కాదు. ఛాందోగ్యశ్రుతికూడ తైత్తిరీయశ్రుతితో నేకవాక్యమనియు నచ్చటనుఁ బంచభూతసృష్టియే యంగీకరింపఁ బడె ననియు సూత్రకారుఁడు సిద్ధాంతముఁ జేసి యుండుటచేత నీత్రివృత్కరణము కూడ పంచీకరణమునకు గుఱుతుగాఁ జెప్పఁబడినదియే కాని యన్యము కాదని సిద్ధాంత మగుచున్నది.

నగునంతవఱకు నగ్ని జలములకు విరోధంబును లేదు. ఉన్నది యని పట్టుపట్టి నను కార్యములకు కారణమున వినాశము స్వాభావికమే యగుటచే నావిరోధ ముత్పత్తికి భంగకరము కానేరదు కావున నేకదేశమతము యుక్తిశూన్యము శ్రుతులకు విరోధము లేదు; జలము అగ్నినుండియే జనించును. వ్యావహారిక భేదము నాశ్రయించి యిట్లు చెప్పఁబడెనని తెలిసికొనవలయును పారమార్థికస్థితిలో సర్వమును బ్రహ్మమేకదా.

---

## పృథివ్యధికారాధికరణము. ౬.

విషయము:—ఇందు పృథివీసృష్టి నిర్ణయింపఁబడును.

సంగతి సంశయపూర్వపక్షము:—"'తా ఆప ఐక్షంత బహ్వ్యః స్యామ ప్రజాయేమ హీతి తా అన్నమసృజంత' = 'ఆజలము స్వయముగనే విస్తారమునొంది సృష్టిఁజేయఁదలంచి యన్నమును సృజించెను' అని యొకశ్రుతియందును 'అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యో ఉన్నం' = 'జలమువలన భూమియు నందుండి యోషధులును అందుండి యన్నంబును జనించెను' అని మఱియొకశ్రుతియందును చెప్పఁబడియుండుటచే నీరెంటికినిఁ బరస్పరవిరోధము వచ్చెను. అన్న మనఁగా నాహారపదార్థము లగుగోధుమలు మొదలగునవి కాని *భక్ష్యభోజ్యాదులే కాని యగును. ఇవి జలమునుండియే జనించెనని యొకచోటను జలమునుండి జనించినది పృథివియే యని మఱియొకచోట నుండుట విరుద్ధము కదా! మఱియు 'తా ఆప' అను ఛాందోగ్యశ్రుతియందు వాక్యశేషమున 'తస్మాద్యత్ర క్వ చ వర్షతి త దేవ భూయిష్ఠ మన్నం భవతి' = 'ఆకాశమువలన వర్ష మెచ్చట కురియునో అచ్చట నధిక మగునన్న మేర్పఁడును' అని చెప్పఁబడి యున్నది. ఇది పృథివికి సంభవింపదు కదా ఆహారపదార్థము లగుగోధుమలు మొదలగునవియన్నవో వర్షమునకు నభివృద్ధి

---

* భక్ష్యము లనఁగా దంతములతో కొఱికి తినఁదగినవి. భోజ్యము లనఁగా చప్పరించి మ్రింగఁ దగినవి. లేహ్యము లనఁగా నాకఁ దగినవి. పేయము లనఁగా పానము చేయఁ దగినవి, ఈనాలుగును ఆహారభేదములు.

నొందవచ్చును. 'అన్నము నలుపు' అని యందు (ఛాందోగ్యశ్రుతియందు) జెప్పఁబడి యున్న నది విరుద్ధము కానేరదు. ఆహారపదార్థములయందును ఏదియో యొకటి నల్లనిదై యుండవచ్చును కదా! కావున నెట్లును అన్నశబ్దమునకు భూమి యనునర్థముఁ జెప్పుటకు వీలు లేదు." అని స్ఫురణలక్షణ సంగతిచే వచ్చిన యాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను.

## ౨౯. పృథివ్యధికారరూప శబ్దాంతరేభ్యః. ౨. ౩. ౧౨.

తాత్పర్యము:—ఛాందోగ్యశ్రుతియందుఁ జెప్పఁబడినది భూమి నిగూర్చియే * అధికారము లింగము శ్రుతి యనునవి మూఁడును దీనికి ననుకూలములుగ నున్నవి. మొట్టమొదటినుండియు మహాభూతసృష్టిని చెప్పుచుండి యంతమున మాత్రము పృథివీభూతమును విడిచి యితరపదార్థమును శ్రుతి యేల చెప్పును? నిరర్థకముగఁ బ్రకరణమును బాధించుట యుక్తము కాదు కదా! మఱియు 'నన్నము నలుపు' అని చెప్పఁబడి యుండుటచే నన్నశబ్దార్థము పృథివియే యని తేలుచున్నది. ఆహారపదార్థములకు నల్లనివర్ణ మున్నను నియతముగ లేదు కదా! 'భూమికిఁ గూడ నట్లే లేదు కదా తెల్లనిభూమియు నెఱ్ఱనిభూమియు గూడఁ గానవచ్చుచున్నది' అనియెదవేమో. అట్లయినను విశేషభాగము (భూమియందు) నలుపే కలదు. మఱియు పౌరాణికులు "భూచ్ఛాయయే చీకటి" యనుచున్నారు. కావున దానివర్ణము నాశ్రయించి భూవర్ణమును నిర్ణయింపవచ్చును. వస్తువర్ణము ననుసరించి నీడయు స్వచ్ఛాస్వచ్ఛభేదములతో నుండుట యనుభవసిద్ధమై యున్నది. నల్లనిపదార్థములనీడ మిగుల నల్లనై యుండుటయు శుభ్రములగు స్ఫటికాదులనీడ కొంత తేటగ నుండుటయుఁ బ్రత్యక్షసిద్ధమే ఇది యంతయు గాక "తద్యద్ అపాం శర ఆసీత్త త్సమహన్యత సా పృథివ్యభవత్"="ఆనీటిపై నేర్పడినమీఁగడవంటి భాగ మేది కలదో అది యంతయు నొక్కచోఁ జేర్పఁబడెను. అదియే

* అధికారము ... ప్రకరణము (... పు. చూ.)

పృథివి యమ్యైను" అని బృహదారణ్యకశ్రుతియందు జలమునుండి భూమి జనించినవిధము స్పష్టముగ వర్ణింపఁబడి యున్నది.

ఈకారణములవలన అన్నశబ్దమునకుఁ బృథివియే యర్థ మనవల యును. ఆహారపదార్థములు భూమినుండియే జనించు ననుట శ్రుతికి సమ్మతము. తైత్తిరీయశ్రుతియం దీవిషయము స్పష్టముగనే కలదు కదా కావున నీకారణము నాశ్రయించి యైనను భూమిని చెప్పుటకై తత్కార్యవాచక మగునన్నశబ్దమును ప్రయోగింపవచ్చును. ప్రకరణాదులబలముచే ప్రసిద్ధియు అన్నశబ్దమునకు నాహారాదులయందు గలప్రసిద్ధియు బాధింపఁబడును. వాక్యశేషంబును ఇట్లే బాధింపఁబడును. దానికి మఱియొకవిధముగఁ గూడ నర్థము చెప్పవచ్చును. కార్యకారణములకు భేదము లేక పోవుటచే వ్రీహ్యాదులవృద్ధియే భూవృద్ధి యని యైననూ దేనిచే జనించిన పదార్థము దానిచేతనే సమృద్ధి నొందుట సహజము కావున జలముచే భూమి సమృద్ధి నొందు నని (సమృద్ధి యనఁగా సస్యాదిసంపద) యైనను దాని కర్థము చెప్పవచ్చును కావున దానికంటె ప్రకరణాదిసహిత మగు శ్రుతి బలవంతము. ఈకారణమువలన నన్నశబ్ద మన్నకారణ మగుభూమి యందే ప్రయోగింపఁబడె నని తెలిసికొనవలయును.

---

# తదభిధ్యానాధికరణము. ౭.

అవతారిక:—"ఆకాశాదిభూతముల నభిమానించు దేవతలు స్వతంత్రముగనే వాయ్వాదుల సృజించునా? లేక పరమేశ్వరాధీనములయ్యే సృజించునా?" అనువిషయ మీయధికరణమున విచారింపఁబడును.

విషయము:—వాస్తవస్థితిలో నీయధికరణమునకు విషయమే లేదు. "పరమేశ్వరసహాయము (అంతర్యామిరూపముతోఁ బ్రవేశించుట) లేక భూతములు సృజింపనేరవు" అనువిషయము ఈక్షత్యధికరణమునందును (౧. ౧. ౧౫.) "భూతములయందు తత్తద్రూపముతో నిలచి బ్రహ్మమే యవ్వలికార్యములకు నుపాదానకారణ మగుచున్నాఁడు" అనువిషయము తేజోధికరణమునందును (౨. ౩. ౧౦.) నిర్ణయింపఁబడియే యున్నది. అయినను ఇచ్చట సృష్టిప్రస్తావము వచ్చి భూతసృష్టియందలివిరోధములు

పరిహరింపఁబడినవి కావున దానినాశ్రయించి యాశ్ర *యాశ్రయిభావ సంగతిలో "దేవతలకు (భూయభిమానదేవతలకు) నైననూ స్వాతంత్ర్య మున్నదా? లేదా?" యనువిషయ మిచ్చటఁ జర్చింపఁబడుచున్నది. "పర మైశ్వర్యసంపత్తి కలదేవతలకుఁ గూడఁ బరమేశ్వరసహాయము లేక గర్త లయందు స్వాతంత్ర్యము కలుగదు" అనువిషయ మిచ్చట సిద్ధాంతము చేయఁబడును.

"ఇట్లయిన మఱియొకస్థలమున విరోధము వచ్చును. 'పరాత్తు తచ్ఛ్రుతేః. ౨.౩. ౪౧.'అనుస్థలమున 'జీవకర్తృత్వ మీశ్వరాధీనము' అని సిద్ధాంతము చేయఁబోవుచున్నారు. దేవతలకే యట్టికర్తృత్వము లేకున్న నిఁక జీవులకది బొత్తుగనే సంభవింపదుకదా! ఇట్లుండ దానికై మఱియొక యధికరణ మారంభించుట యేల?" అనియెదవేమొ యట్లుకాదు. గొప్ప గొప్పకార్యములయందు దేవతలకుఁ గూడ స్వాతంత్ర్యము లేకున్నను జీవులకు నట్లుండ నక్కఱ లేదు. వారు (జీవులు) చేయునవి క్షుద్రకార్యములు కదా! మేలని చెప్పినదానిని నాచరించుట కీడనినదానిని విడచుట యనునిదియే కదా వానికృత్యము! కావున నిట "దేవతలకు స్వాతంత్ర్యము లేదు." అనువిషయము సిద్ధాంతమైనను జీవవిషయ మగుసంశయము మఱల కలుగవచ్చును.

పూర్వపక్షము:—ఎట్లు చూచినను ప్రపంచము నాకాశాదులు స్వయముగనే సృజించు నని చెప్పవచ్చును. "ఆకాశాద్వాయుః. తత్తేజ ఐక్షత" అను మొదలగుశ్రుతులయందు ఆకాశాదులకు స్వాతంత్ర్యము చెప్పఁబడి యున్నది; "ఆకాశాదులు చేతనములు" అని కూడఁ జెప్పఁబడి యున్నది. ప్రతిభూతమునకును అభిమానిదేవత కలదుకదా!ఆదేవత చేతన మనుట యందుగాని స్వాతంత్ర్యము కలది యనుట యందు గాని సంశయ మేమి కలదు? జడమునకుఁ జేతనసహాయము కావలయును గాని చేతనము నకు నది యక్కఱ లేదు కదా! కావున నెట్లు చూచినను ఆకాశాదులు వాయ్వాదులను స్వయముగనే నిమిత్తములై సృష్టించు ననవలయును.

---

* దేనియందు మఱియొకపదార్థము నివసించునో అది (ఆమొదటిపదార్థము) రెండవదానికి నాశ్రయము. రెండవది యాశ్రయి. యీరెంటికిని గలయన్యోన్య సంబంధ మాశ్రయాశ్రయిభావసంబంధము.

ఇట్లుచెప్పిన "ప్రపంచము బ్రహ్మమువలన (బ్రహ్మ మనునిమిత్తకారణముచే) జనించెను" అని చేయఁబడినసిద్ధాంతమునకు హాని వచ్చును.

"ఇట్లును రాదు. శ్రుతియందు 'సోఽకామయత' అని పరమేశ్వరుఁడు ప్రస్తావింపఁబడి యున్నాఁడు. 'యః పృథివ్యాం తిష్ఠన్' అని 'పరమేశ్వరుఁడే సర్వాంతర్యామి' యనువిషయముగూడ నిరూపింపఁబడియున్నది కావున నెవ్వరికిని స్వాతంత్ర్యము లేదు. మఱియు 'పరమేశ్వరుఁడే ప్రపంచరూపముతో స్వయముగ నున్నాఁడు' అని బహుశ్రుతులయందు చెప్పఁబడి యుండుటచే నాయనయే యీప్రపంచమునకు నభిన్ననిమిత్తోపాదానకారణము పంచమీవిభక్తియు హేతువాచకమే యగును కాని యన్యార్థమును చెప్పనేల దీని యిదివఱకే నిరూపించియున్నాము కదా" అనిన నిది యుక్తము కాదు ప్రస్తావంబును "పరమేశ్వరుఁడు సర్వాంతర్యామి"యని చెప్పఁగుఱుతునుకూడ పరంపరగా నన్వయింపవచ్చును. పరమేశ్వరుఁడు తనసంకల్పముచే మొట్టమొదట నాకాశభూతమును తదభిమానిదేవతతోఁగూడ జనింపఁజేసెననియు తర్వాత నాయాకాశాభిమానిదేవతయె స్వతంత్రముగ నితరభూతముల సృజించెననియు ఈకారణమువలన పరంపరగాఁ బరమేశ్వరుఁడే సర్వసృష్టికర్త యగు ననియు నర్థము చెప్పవచ్చును. ఆకాశాభిమానిదేవతయందు అంతర్యామిరూపముతో నున్నాఁడు గావున పరంపరగా నాయనయే సర్వాంతర్యామియు నగు నన వచ్చును. ఇఁక విభక్తి నాశ్రయించి చూచిన నచేతనము, చేతనమునుండి జనింపదు కావున నాకాశాదుల నభిమానించు దేవతలనుండి వాయ్వాదులు జనింపనేరవు. ఈకారణమువలన నాపంచమీవిభక్తికి నిమిత్తకారణపరముగానే యర్థమును చెప్పవలయును కావున నెట్లు చూచినను భూతములు స్వతంత్రములుగనే కార్యములఁ బుట్టించుచున్నవి యనవలయును.

## సూత్రము. ౧3.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౨3౦. తదభిధ్యానాదేవతు తల్లింగాత్సః.

## ౨. 3. ౧3.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తియుక్తము కాదు. పరమేశ్వరుఁడే స్వస్వరూపముతో ప్రపంచమునకు సర్వప్రేరకుఁడై నిమిత్తకా—

మగుచున్నాఁడు? భూతరూపములతో నుపాదానకారణ మగుచున్నాఁడు. ఈవిషయమును "సో ఽకామయత యః పృథివ్యాం తిష్ఠన్" అనుశ్రుతులు స్పష్టముచేయుచున్నవి. ఈవాక్యములయందు"ఆత్మయే సర్వమునకును ప్రేరకుండు"అనువిషయము దెల్పఁబడియున్నదికదా! "తదాత్మానం స్వయమకురుత"="ఆబ్రహ్మము తనస్వరూపమునే ప్రపంచమునుగా మార్చుకొనియెను" అను శ్రుతి "పరమేశ్వరుఁడే భూతరూపములజెంది ప్రపంచమునకుపాదానకారణ మగుచున్నాఁడు" అని స్పష్టము చేయుచున్నది. కావున నీశ్రుతులబలము నాశ్రయించి పరమేశ్వరుఁడే సర్వమునకు నభిన్ననిమిత్తోపాదానకారణ మని నిర్ణయింపవలయును. "త త్తేజ ఐక్షత" అను మొదలగు శ్రుతులకును ఈసిద్ధాంతము నాశ్రయించి "తేజస్సునందు అంతర్యామిరూపుఁడై ప్రవేశించి నీబ్రహ్మమే జలసృష్టికి సంకల్పించును "అనియే యర్థము చెప్పవలయును. ఇంతయే కాని యిచ్చట భూతాభిమానిదేవతలకు స్వాతంత్ర్యము కల దనుటకు దగినయుక్తియే యేదియు లేదు.

యుక్తి యననేల మొట్టమొదట దేవతలనుగూర్చియే యచ్చట చెప్పఁబడె ననుటకు వీలు లేదు. పైన నిరూపించినవిధముగ నాకాశాదిశబ్దములకు స్వాభావికార్థమే ("భూతములు" అనునర్థమే) సంభవింపుచుండ నన్యార్థమును కల్పింపనేటికి? అట్లు కల్పించినను మీపక్షము నిలువదు. చేతను లందఱును స్వతంత్రులే కావలయు నని నియమ మెందును లేదు. భృత్యుఁడు శిష్యుఁడు మొదలగువారు చేతనులయ్యును స్వామిగురువాదిపరతంత్రులగుచున్నారు. కదా కావున! నెట్లుచూచినను దేవతలకుఁగూడ స్వాతంత్ర్యము లేదు. వారు నిమిత్తకారణములు కానేరరు. పంచమీవిభక్తియు నీకారణమువలన నిమిత్తకారణవాచకము కానేరదు. దేవత లిచ్చట ప్రస్తాపింపఁబడినచో వారికి స్వాతంత్ర్యము నియతమైనచో మాత్రమే కదా వారియం దచేతనములు జనించుటకు వీలు లేకపోవుటచే పంచమికి నిమిత్తవాచకత్వమును కల్పింపవలసి వచ్చుట. ఇచ్చట నది లేదని నిరూపింపఁబడెను. కావున నాకాశాదులకు స్వాతంత్ర్యము లేదు.

# విపర్యయాధికరణము. ౮

విషయము:—ఇందు ప్రళయక్రమము విచారింపఁబడును. ఈవిచారమువలన సర్వప్రపంచము బ్రహ్మమే యని స్పష్టముగసిద్ధాంతమగును. కావున దీనికి బ్రహ్మధ్యానమే ఫలము.

సంగతి:—ఈయధికరణమున శ్రుతివిరోధము నిరాకరింపఁబడకపోవుటచే నీయధికరణ మీపాదమునఁ జేరఁ గూడదు. అయినను ఇందు సృష్టి నిరూపింపఁ బడెను. కావున దాని ననుసరించి ప్రళయము స్మరణకు రాఁగా బ్రసంగసంగతితో నది యిందు విచారింపఁబడుచున్నది.

పూర్వపక్షము:—వేదమునందు కేవలప్రళయము మాత్రమే వినవచ్చుచున్నది గాని దానినియమము వినవచ్చుటలేదు. దానికి నియమముకలదా? లేదా? లేక సృష్టినియమమే దానికి నియమమా? నియమము లేదనుట యుక్తియుక్తము కాదు. ఏకార్యమునకుఁ గాని నియమ ముండి తీరవలయును. ఇఁక నానియమ మేది యని విచారింపఁబోయిన వేదమున నుత్పత్తినియమము మాత్రమే కలదు. లోకమున మాత్రము కార్యములు కారణములందు లీనములగుచుండుట కానవచ్చుచున్నది గాని దాని నిచ్చట నన్వయించుకొనుటకు వీలు లేదు. ఏలయనిన వేదమును విచారించునపుడు అందలి నియమములే బుద్ధికి స్ఫురించును గాని యన్యములు స్ఫురింపవు కదా? ప్రతిపదార్థమునకును సజాతీయము సమీపము విజాతీయముదూరము ననుటలో సంశయము లేదు కదా! కావున నుత్పత్తి నియమమే ప్రళయనియమము.

## సూత్రము. ౧౪.

అవతారిక:— అనిన నీపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

### ౨౩౧. విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ. ౨. ౩. ౧౪.

తాత్పర్యము:—పూర్వమున సృష్టిక్రమము వివరింపఁబడెను. లయక్రమము దానికి విరుద్ధముగ నుండు నని తెలిసికొనవలయును. లోకమున

నిట్లే గానవచ్చుచున్నది. మట్టినుండి జనించినకుండ మట్టియందే లీనమగు న్నది. ఉత్పత్తిక్రమమే లయక్రమమైనకార్యము. స్వస్వరూపముతో నుం డగనే కారణము దానియందు లయము నొందవలసివచ్చును. ఇది సర్వ ప్రమాణవిరుద్ధము. కారణవినాశమునకుఁ బిదప గార్య ముండుట యెందు నుగానవచ్చుట లేదు కదా? కావున లోకానుసారముగ కార్యములు కార ణములయందు లీనము లగును. "పృథివ్యప్సు ప్రలీయతే"="భూమి జల మున లీన మగును" అను మొదలగు వాక్యములచే స్మృతియు నిట్లే చెప్పు చున్నది.

---

## అంతరావిజ్ఞానాధికరణము. ౯.

విషయము:—ఇప్పటికి భూతములసృష్టిప్రళయములు నిరూపింపఁ బడినవి. పరబ్రహ్మముమొదలుకొని ఆకాశాదిక్రమముచే సృష్టి యగు న నియు పృథివ్యాదివ్యుత్క్రమముచే పరబ్రహ్మాంతముగ బ్రళయము కలుగు ననియుఁ జెప్పఁబడెను. ఇచ్చట నింద్రియోత్పత్తి విచారింపఁబడును.

సంగతి:—సృష్టిప్రళయముల నిరూపించుటకు నేయద్వితీయబ్ర హ్మధ్యానము ఫలమో అదియే యింద్రియసృష్టినిరూపణమునకుగూడ ఫల మగుటచే నీయధికరణమునకుఁ బూర్వాధికరణములతోఁ గలసంబంధము *సమానఫలత్వసంబంధము.

సంశయము:—ముండకోపనిషత్తునందు "ఏతస్మా జ్జాయతే ప్రా ణో మన స్సర్వేంద్రియాణి చ ఖం వాయుః" అనిపరమేశ్వరునకును భూ తములకును నడుమ బుద్ధీంద్రియమనస్సులసృష్టి చెప్పంబడియున్నది. ఇతర శ్రుతులయందు వీనిసృష్టియేలేదు. కావుననీ రెండుస్థలములకును విరోధము కలదా? లేదా?

## సూత్రము. ౧౫.

అవతారిక:—అను నీసంశయమును నిరాకరించుటకై పూర్వ పక్షము వాదపూర్వకముగ సిద్ధాంతము చేయుచున్నాఁడు.

---

* సమానఫలత్వసంబంధ మనఁగా, రెండుకార్యములకు నొక్కటియే ఫలము కలిగియుండుట.

## ౨౩౨. అంతరావిజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చేన్నావిశేషాత్. ౨. ౩. ౧౫.

తాత్పర్యము:—బుద్ధీంద్రియమనస్సులు కల వనుటయందు వివాద మేమియు లేదు. "ఇంద్రియాణి హయా నాహుః" అను మొదలగుకఠోప నిషద్వాక్యములు ఈవిషయమునఁ బ్రమాణములై యున్నవి. ఇట్లుండఁ వీనికిని సృష్టిప్రళయము లెచ్చటనో యొకస్థలముననేదియోయొకక్రమము నాశ్రయించి గ్రహింపవలసియుండును. ఇవిభూతకార్యము లనుటకును వీలు లేదు "అన్నమయం హి సౌమ్య మనః"="ఓశాంతుఁడా! మనస్సు అన్న మయ మైనది" అను మొదలగువాక్యములు కానవచ్చినను వానిని ప్రమాణ ముగ గైకొనుటకు వీలు లేదు. అది యౌపచారికము కావచ్చును? అం దలిమయట్ప్రత్యయమునకు *ప్రాచుర్యార్థ ముండవచ్చును. కావున పైన చూపఁబడిన సృష్టిలయక్రమములు దోషయుక్తములు. ముండకశ్రుతి న నుసరించి యాత్మనుండి మనోబుద్ధీంద్రియములును అందుండిభూతము లునుఁ జనించె ననుటయే సిద్ధాంతము.

సిద్ధాంతము:—ఈపూర్వపక్షము యుక్తియుక్త మైనది కాదు. ఇంద్రియములు భూతములనుండియే జనించె ననుట వేదవాక్యములమూ లముననే తెలియవచ్చుచున్నది. "అన్నమయం హి సౌమ్య మనః" అను మొదలగుశ్రుతులే యీవిషయమున తగినంతసాక్ష్యము నిచ్చుచున్నవి. విచారింపుము. మనోబుద్ధీంద్రియములు పరస్పరమువిభక్తములగుటచేవానికి గారణ మేదియో యొకటి యుండవలయు ననుట స్పష్ట మైనది. విభక్త మగుప్రతిపదార్థంబును ఒకదానినుండి జనింపవలయు ననువిషయమును వియదధికరణమునందు నిరూపించి యున్నాము. కావున దానిని గూర్చి చెప్పు "అన్నమయం" అను మొదలగువాక్యముకావలసినవిషయమునువిడిచి యక్కఱలేనిదాని నేల చెప్పును. ఏకారణము నడిగినదానిచే చెప్పవలయునుగదా! కావున నావాక్యమువలన "మనస్సునకు నన్నము కారణము" అను విషయమే స్పష్టమగుచున్నది యని నిర్ణయింపవలయును. ఈవిషయము కూడశ్రుతియందే చూపఁబడియున్నది. అన్నమునుభుజించుటవలన మనస్సు

---

* ప్రాచుర్యార్థము (౧౦౦-వ పుట చూడు.)

వృద్ధియగుచనియు భుజింపకపోవుటవలన క్షీణించుననియుఁగూడ †సదృష్టాంతముగ జెప్పఁబడి యున్నది. కావున నిర్వివాదముగ మనస్సు మొదలగునవి భౌతికములే. ప్రాచుర్యార్థము చెప్పుటకుఁ గూడ నెట్లును వీలులేదు. మనస్సునం దన్న ముండదు కదా! కావున భౌతికము లగుటచే నింద్రియములును ఘటాదులవలె భూతములనుండి పుట్టి యందే యడఁగుచుండును. ఇట్లగుట నీ వీనియుత్పత్తిప్రళయములఁ గూర్చి ప్రత్యేకముగ విచారింప నక్కఱలేదు.

ఒకవేళ నివి భౌతికములు కావని పట్టుఁ బట్టినను భూతోత్పత్తిలయక్రమములకు వీనియుత్పత్తిలయములవలన భంగము రా నక్కఱలేదు. పరబ్రహ్మమునుండి యవియు నివియుఁ గూడఁ జనింపవచ్చును. ముండకోపనిషత్తునందు ఊరక నామధేయములు మాత్రమే చెప్పఁబడెను గాని క్రమము చెప్పఁబడలేదు కదా! కావున నెట్లును భూతోత్పత్తిప్రళయములకు భంగము లేదు. మఱియొకశ్రుతియందు భూతోత్పత్తితో సంబంధము లేకుండఁ బ్రత్యేకముగనే "ప్రజాపతి ర్వా ఇద మగ్ర ఆసీత్స ఆత్మాన మైక్షత స మనో ఽసృజత"="ఈస్థూలప్రపంచమంతయు మొట్టమొదట *సూత్రాత్మస్వరూపముతోనే యుండెను. ఆసూత్రాత్మ సంకల్ప

† సదృష్టాంతముగా:=అనుభవనిదర్శనపూర్వకముగ మనస్సు అన్నమయమని నిరూపించుటకై శ్వేతకేతునితండ్రి వానిని పదియారుదినములు జలమాత్రాహారముతో నుండునట్లు నియోగించెననియుఁ బిదప నొక వేదభాగము నందిచ్చి పఠింపుమనఁగా నది యాతనికి స్ఫురింప లేదనియు బిదప నన్నమును భుజింపఁగానే యథాపూర్వముగ స్మరణశక్తి కలిగె ననియు శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. మనస్సునకు పదియాఱుకళ లనియు నన్నము లేకున్న క్రమక్రమముగ నవి క్షీణించుననియు అన్నముచేత నేయభివృద్ధి యగుననియు నీకారణమువలన మృత్తికాజలములచే నభివృద్ధి నొందు గోడ (మట్టిగోడ) మృత్తికాజలమయమేయైనట్లు అన్నముచే నభివృద్ధి నొందు మనస్సు కూడ నన్నమయమే యగుననియు నిరూపింపఁబడియున్నది. ప్రాణములు జలమయము లగుటచే జలాహారముతోఁ బ్రాణములు నిలుచుననియుఁ జెప్పఁబడి యున్నది. ఇదియే యనుభవపూర్వక మగునిరూపణము.

* సూత్రాత్మ యనఁగా మణులయందు దారమువలె సర్వదేహములయందును వ్యాపించి యుండుసమిష్టిసూక్ష్మశరీరాభిమాని యగు హిరణ్యగర్భుఁడు లేక పరమేశ్వరుఁడు మాయోపాధియుం దీశ్వరుఁడును మలినసత్త్వప్రధాన మగునవిద్యయందు జీవుఁడును అనచ్చిన్నులై ప్రతిబింబించి కొని యున్నారు కావున సమి

పూర్వకముగ మనస్సును సృజించెను" అని ప్రత్యక్షముగనే చెప్పఁబడి యున్నది. కావున నెట్లును పైసిద్ధాంతమునకు భంగము లేదు.

---

## చరాచరవ్యపాశ్రయాధికరణం. ౧౦.

అవతారిక :—ఇదివఱకు సర్వాత్మకము బ్రహ్మమే యనుజ్ఞానము కలిగి * తత్పదార్థముసిద్ధించుటకై సృష్టిప్రళయనిరూపణమూలమున బ్రహ్మప్రపంచాభేదము వివరింపఁబడెను. ఇఁక నిచ్చటనుండి పాదాంతము వఱకు † త్వంపదార్థము సిద్ధించుటకై జీవస్వరూపవిచారము చేయఁబడు ను. "అందు జీవునకు జన్మమరణములు కలవా? లేవా?" అనునది యీయధికరణమున విచార్యవిషయము.

విషయము:—"పైయధికరణమున నింద్రియోత్పత్తి యున్నను భూతోత్పత్తికి భంగము కలుగదని సిద్ధాంతముచేసియున్నారు. జీవోత్పత్తి యేనిశ్చయ మగునని యెట్లు సిద్ధాంతముఁ జేయుటకువీలు లేదు. జీవుఁడు చేతను డగుటచే నన్నిటకంటె మొట్టమొదటనే పరబ్రహ్మమునుండి జనిం పవలసినవాఁ డగును. అప్పుడు దృఢముగ నుత్పత్తిక్రమమునకు భంగము వచ్చును." అనిప్రత్యుదాహరణ సంగతిచే వచ్చినయాక్షేపమునకు సమా ధానముగ నీయధికరణ మారంభింపబడుచున్నది.

పూర్వపక్షము:—జీవునకు నుత్పత్తిమరణములు కలవనుట లోకవ్యవహారమునుఁ బట్టియు జాతకర్మాదులను విధించుశాస్త్రములనుఁ బట్టియు స్పష్ట మగుచున్నది. కేవలదేహమునకే యవి (ఉత్ప త్తివినాశములు) యుండినచో నాశాస్త్రమంతయు నిరర్థకమే యగును.

---

ష్టిసూక్ష్మశరీరాభిమానిజీవుఁడు హిరణ్యగర్భుఁడనియు నీశ్వరుఁడు సూత్రాత్మ యనియుఁ జెప్పఁబడును. ప్రపంచసూక్ష్మావస్థరూపిణి యగునవ్యక్త మొక్కటియే యైనను శుద్ధ సత్త్వోపాధిచే మాయ యనియు రజస్సత్త్వోపాధిచే నవిద్య యనియుఁ జెప్పఁబడును.

* 'తత్త్వమసి' యనుమహావాక్యములోని తత్పదమునకు నర్థము తత్పదా ర్థము—ప్రపంచాభిన్న మగుబ్రహ్మము.

† ఆవాక్యములలోని 'త్వం' పదము యొక్కయర్థము 'త్వం' పదార్థము. (జీవుఁడు.)

ఇచ్చటనే భస్మమై పోయిన శరీరమునుగూర్చి శ్రాద్ధాదుల నాచరించుటవలన బ్రయోజన మేమి యుండును? ఈకారణమువలన లోకానుభవానుసారము లగునీకర్మవిధులకును "జీవుఁడు నిత్యుఁడు" అనిచెప్పు వేద వాక్యములకును పరస్పరవిరోధము కలదు. నిర్వివాదముగ జీవుఁ. డుత్పత్తివినాశములు కలవాడే.

## సూత్రము. ౧౬.

అవతారిక:—అనునీభ్రాంతి నీయధికరణమున నివారించుచున్నాఁడు.

## ౨౩౩. చరాచరవ్యపాశ్రయస్తుస్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావభావిత్వాత్.

## ౨. ౩. ౧౬.

తాత్పర్యము:—లోకమున నున్నజన్మమరణాదివ్యవహారము జంగమస్థావరరూప మగుశరీరము నాశ్రయించినదియే కాని జీవు నాశ్రయించినది కాదు. దేహోత్పత్తివినాశముల నాశ్రయించియేయావ్యవహారము ప్రవర్తించు చున్నది యనుట సర్వానుభవ సిద్ధము. అది జీవునకే సంబంధించునేని యప్పుడు జీవుఁడు దేహముతోఁ గూడ నుత్పత్తివినాశముల నొందువాఁడు కావలసి వచ్చును. అప్పు డాతనికి జన్మాంతరప్రాప్తి కాని స్వర్గనరకాదిభోగములు కాని యుండుటకు వీలు లేదు. యీకారణమువలన నప్పుడు రెండవజన్మమునందు సుఖము కలిగించు నని చెప్పఁ బడిన పుణ్యకర్మలును పరలోకమున సౌఖ్యము కలిగించు నని విధింపఁబడిన యజ్ఞాదులును నిరర్థకములు కావలసి వచ్చును. కావున జీవుడు నిత్యుఁ డనియే యంగీకరించి తీరవలయును. శ్రుతియు దీనికి ననుకూలమయ్యె యున్నది యనుట మీకును సమ్మత మగువిషయమే. "జాతకర్మాదివిధులు ఆశ్రుతిని బాధించు నంటిని కదా" అనియెదవేమో అదియు దేహమునుఁ గూర్చినదియే. భ్రాంతివలన లోకులు జీవదేహములకు నభేదము నెన్నుచున్నారు కావున వారియభిప్రాయము ననుసరించి యావేద మట్లు చెప్పుచున్నది. ఏకర్మల నాచరించినను దేహమే యాచరించు ననుటయు దానివలన కలుగు సుఖదుఃఖములను మనస్సే యనుభవించుననుటయు నందరకును స్పష్ట

మగువిషయమే కావున నీవిషయమున విశేషముగ వివాదము చేయ నక్కఱ లేదు. సర్వమును భ్రాంతిమూలమేకాని వాస్తవముగ జీవునకు సంబంధించునది యేదియు లే దని యధ్యాసభాష్యమున (శాస్త్రావతారిక యందు) వివరించి యున్నారు. "ఏవ మేన శ్శమం యాతి గర్భబీజసము ద్భవం"="జాతకర్మాదిసంస్కారముల నాచరించినచో శుక్లశోణితసంబంధ మువలన వచ్చినపాపము నశించును." అను మొదలగు స్మృతియు జాతక ర్మాదులవలన దేహసంబంధజనిత మగుపాపము మాత్రమే పోవు ననియు అనాద్యవిద్యావశమునఁ బ్రతిదేహమునందు నాచరింపఁ బడుచు * సంచి తాదిరూపములతో మనసునందు సంస్కారరూపమై యున్నకర్మ మాత్ర ము నశింప దనియు స్పష్టముగ జెప్పఁబడి యున్నది. యీకారణమువలన జాతకర్మాదులు దేహోత్పత్తినిమిత్తములే కాని జీవోత్పత్తినిమిత్తము లు కావని స్పష్ట మగుచున్నది. శ్రాద్ధాదులుకూడ దేహనాశానంతరమున పరలోకనివాసి యై జీవు డుండిననే కాని సంభవింప వనుట నీకునుఁ దెలి సిన విషయమే. కావున జీవునకు నుత్పత్తివినాశములు కల వనుట భ్రాం తియే.

---

* కర్మత్రయము:—అగామి సంచిత ప్రారబ్ధము లని కర్మలు మూఁడు విధములు. అగాము లనఁగా రాబోవునవి? ఉత్తరజన్మమున ఫలము ననుభవింపఁజేయు టకు నుపక్రమింపఁ బోవునవి. సంచితము లనఁగా జన్మాంతరములయందును ప్రస్తుత జన్మమునందునుఁ గూడ నాచరింపఁబడి ధనమువలె భోగార్థమై దాఁచియుంచఁ బడు నవి. అందుండియే కాలక్రమమున పరిపక్వములై కొన్నికొన్ని కర్మలు తత్తజ్జన్మముల యందు వానిఫలముల ననుభవింపఁ జేయును. అట్టికర్మలలో ప్రకృతజన్మమున ఫల ముల నిచ్చుట కారంభించినకర్మలు ప్రారబ్ధము లనఁబడును. ఈమూఁడువిధము లగు కర్మలును మనస్సున సంస్కారరూపములతో మాత్రమే నిలచి యుండును. పరి పాకావస్థ కలుగకమునుపు మూఢములై కలిగిన పిదపఁ బ్రకాశము నొందియవి (వాస నలు) స్వానుగుణముగ మనస్సునుఁ బ్రేరేపించును? అప్రేరణవ లోనై యాయాకర్మల నాచరించి మనంబునుఁ దత్తత్ఫలము లగు సుఖదుఃఖముల ననుభవించును. ఒక్కొక్క వేళఁ బ్రేరణాప్రభావమున నిష్టసాధనాదుల విపరీతములుగ గ్రహించి విపరీతఫలము లను గూడఁ జెందుచుండును. ఇదియే కర్మఫలానుభవప్రకారము.

# ఆత్మాధికరణము. ౧౧.

విషయము:—పై యధికరణమున జీవునకు దేహోత్పత్తివినాశములతోఁగూడ నుత్పత్తివినాశములు సంభవింపవని సామాన్యముగనిరూపింపఁబడెను. ఈయధికరణమున "జీవునకు పరమేశ్వరునుండికూడ నుత్పత్తి సంభవింపదు" అని నిరూపింపఁ బడెను.

సంగతి:—"పూర్వాధికరణమునఁ బరలోకానుభవాదులసిద్ధించుటకై దేహనాశముతోఁగూడ జీవనాశము కలుగఁగూడదని సిద్ధాంతము చేయఁబడెను గాని ప్రస్తుతాధికరణమున నట్లుచేయుటకు వీలులేదు. జీవోత్పత్తి శ్రుతిప్రమాణములచే సిద్ధించుచున్నది కావున దాని నవశ్యమంగీకరింపవలయును. ఒక్కకల్పాంతమువఱకు జీవుఁడేకరూపముతో నుండుననిసఁ బై యధికరణమునఁ జూపినదోషము లేవియు రావు కదా" అని ప్రత్యుదాహరణసంగతిచే వచ్చినయాక్షేప మీయధికరణమున నివారింపఁబడును.

సందేహము:—కొన్నిశ్రుతులు "ఏతస్మా దాత్మన స్సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతి"="ఈపరమేశ్వరునుండి యీజీవు లందఱును జనించుచున్నారు" అను మొదలగువాక్యములచే జీవోత్పత్తినిఁ జెప్పుచున్నవి. మఱికొన్ని "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" పరమేశ్వరుఁడు ఆప్రపంచమును సృజించి దానినే ప్రవేశించెను; అని జీవపరమేశ్వరులకు భేదమే లేదని చెప్పుచున్నవి. యీరెంటికిని విరోధము కలదా లేదా?" అనునది సంశయస్వరూపము.

పూర్వపక్షము:—పైనఁ జూపఁబడినశ్రుతులకు విరోధ మవశ్యముగ వచ్చును. జీవున కుత్పత్తి కల దనుట యెట్లును సిద్ధాంతమే. ఒక్కబ్రహ్మము నెఱింగినచో సర్వపదార్థముల నెఱుంగవచ్చు నని శ్రుతియందు ప్రతిజ్ఞ చేయఁబడి యున్నదికదా. జీవునకు నుత్పత్తి లేకపోయిన దీనికి విరోధము వచ్చును. అన్నిపదార్థములకును పరమేశ్వరుఁ డుపాదానకారణ మగునేని యప్పుడు కదా యాయన నెఱుంగుటచే సర్వము నెఱుంగఁ బడినట్లగును. జీవుఁ డనువాఁ డొక్కఁడు భిన్నుఁడై యుండునేని యప్పు డీప్రతిజ్ఞ సార్థక మగుట యెట్లు? యీకారణమువలన జీవుఁ డవశ్యముగ నాకాశాదులవలె బ్రహ్మమునుండి జనించియే తీరవలయును.

"ఇట్లు కాదు జీవబ్రహ్మలకు భేదమే లేదు. నిర్వికారుఁడగు పరమేశ్వరుఁడే ప్రపంచమునఁ బ్రవేశించి జీవుఁడయ్యెను. ఈ కారణమువలన బ్రహ్మజ్ఞానముచే జీవుఁడు గ్రహింపఁబడను వచ్చును. బ్రహ్మకార్యము కాకను పోవచ్చును." అనియెద వేమో అదియు సరి కాదు. బ్రహ్మమునకును జీవునకును భేద మనంతముగఁ గలదు. బ్రహ్మమునకుఁ గర్మసంబంధము లేదు. జీవునకుఁ గలదు. బ్రహ్మము నిర్వికారము; జీవుఁడు సవికారుడు. ఇట్లుండ నిరువురకుకు నభేద మెట్లు కలుగును?

"మఱియు ఏయేపదార్థములకు విభాగము కలదో అవి యొకదాని నుండి జనించినవియే" అని మీరే సిద్ధాంతముఁ జేసి యున్నారు. ఆకాశమునకు నీసిద్ధాంతము వలననే యుత్పత్తిని స్థాపించియున్నారు. విచారించిన జీవుఁడు కూడ నట్టివాడే. ఆతనికిని శరీరసంబంధమువలనభేదముకలదు. ఏపురుషునకు జూచినను వానివాని కర్మలును వానివాని సుఖదుఃఖభోగములును ప్రత్యేకములే యై కానవచ్చుచున్నవి యిట్లుండ నందఱియందు నున్నయాత్మ యొక్కఁడే యనుట యెట్లు సంభవించును? ఆతనికి విభాగములు కలవనియే యంగీకరించిన నాతఁడును ఒకదానినుండి జనించినవాఁడే కావలసి వచ్చును. కావున నెట్లును జీవున కుత్పత్తి తప్పదు. "యథా సుదీప్తాత్పావకా ద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః తథాక్షరాద్వివిధాః సౌమ్య భావాః ప్రజాయంతే తత్ర చైవాపియంతి" బాగుగ మండుచున్న యగ్నినుండి సమానాకారములు కల మిడుగురులు వెలికి వచ్చునట్లు పరమేశ్వరునుండి జీవజడరూపము లగు సర్వపదార్థములును వెలికివచ్చును; అచ్చటనే మఱల నడంగును; అని కొన్ని శ్రుతులయందు దృష్టాంతపూర్వకముగ జీవోత్పత్తి చెప్పఁబడియున్నది. కావున నిస్సంశయముగ జీవున కుత్పత్తి యున్నదియే.

'ఇట్లైన ప్రవేశశ్రుతి (పరమేశ్వరుఁడు స్వయముగనే ప్రపంచమునఁ బ్రవేశించి యున్నాఁడని చెప్పుశ్రుతి) విరుద్ధమగును కదా! దానిని సమన్వయించుటయెట్లు?' అనియెద వేమో దానికి వికారపరముగ నర్థముఁ జెప్పవచ్చును. 'పరమేశ్వరుఁడు జీవరూపముగ మార్పునొంది ప్రపంచమున బ్రవేశించెను' అని యర్థము జెప్పవచ్చును. 'తదాత్మానం స్వయమకురుత'='ఆపరమేశ్వరుఁడు తనరూపమునే ప్రపంచముగ మార్చెను' అను శ్రుతికి నిట్లే యర్థముఁ జెప్పితిరి కదా. పరమేశ్వరునకుఁ బ్రపంచరూప మగు

మార్పు కలిగె నని యంగీకరించితిరి కదా. కావున నెట్లును జీవుఁ డుత్పత్తి యయ్యె ననియే యొప్పుకొనవలయును. శ్రుతికి పైనఁజెప్పినవిధముగ నన్వయముఁ జేయు కున్న విరోధము దుర్నివారమే యగును.

## సూత్రము. ౧౭.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షము నీయధికరణమున ఖండింపుచున్నాఁడు.

## ౨౩౪. నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః. ౨. ౩. ౧౭.

తాత్పర్యము:—ఎట్లును జీవునకు నుత్పత్తిలేదు. సృష్టిప్రకరణము నందు జీవోత్పత్తి వినవచ్చుట లేదు. ఒకానొకస్థలమున వినవచ్చినను దాని నాశ్రయించి సిద్ధాంతముఁ జేయుటకు వీలు లేదు. "న జీవో మ్రియతే; అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో" అను మొదలగుశ్రుతు లనేకములు జీవుని నిత్యునిగాఁ జెప్పుచున్నవి. "అనేన జీవే నాత్మనాం ఽనుప్రవిశ్య" అను మొదలగు శ్రుతులు "పరబ్రహ్మమే జీవరూపముతో సర్వబాధలయందును ప్రవేశించెను. "అని చెప్పుచున్నవి. దీనిచే జీవబ్రహ్మముల కభేదమని తెలియవచ్చుచున్నది. మఱియు మైత్రేయీబ్రాహ్మణమునందు "ప్రజ్ఞాన ఘన ఏవైతేభ్యో భూతేభ్య స్సాముత్థా య తాన్యే వానువినశ్యతి న ప్రేత్యసంజ్ఞాస్తి"="జ్ఞానమాత్రరూపుఁ డగు నాబ్రహ్మము శరీరాదిరూపము నొందిన భూతములయందు ప్రవేశించి యందుండి సమముగనే వ్యుత్థానమును జెంది వానితోఁ గూడ నశించును. (నశించునట్లు కానఁబడు నని యభిప్రాయము) మృతిజెందినపిదప సంజ్ఞయే లేదు" అని చెప్పిన యాజ్ఞవల్క్యునిఁజూచి తదభిప్రాయము నెఱుంగ లేక దేహముతోఁ గూడ జీవునకును వినాశమును జెప్పెనేమో యనితలంచి మైత్రేయి తన సంశయమునుఁ దెలుపఁగా యాజ్ఞవల్క్యుఁడు "నవా అరేఽహం మోహం బ్రవీ మ్యవినాశీ వాఽరేఽయమాత్మా ఽనుచ్ఛిత్తిధర్మా మాత్రాసంసర్గ స్త్వస్య భవతి"="ఓ మైత్రేయీ! నేను మోహకర మగువాక్యము ను చెప్పలేదు. జీవుఁడు, స్వభావముగ వినాశరహితుఁడు బ్రహ్మరూపుఁడే

యగుటచే నాతని కెట్లును విచ్ఛేదము లేదు. ఇఁక నేమి యనిన; దేహాది రూపముగఁ బరిణమించిన భూతములతో మాత్రమే యూరకసంబంధము కలదు. కావుననే వాని వినాశముతోఁగూడ జీవవినాశము కలిగె నని భావింపఁబడుచున్నది. మరణకాలానంతరమున దేహానుసారముగ వచ్చిన రామకృష్ణాదిసాంజ్ఞలు లేవు కాని స్వరూపము లేకపోలేదు. ఇదియే నావాక్యమునకు నభిప్రాయము" అని సమాధానముఁ జెప్పెననియు నిరూపింపఁబడియున్నది. వీని నన్నిఁటిని విమర్శించిచూచిన జీవబ్రహ్మాభేదము ఉపాధుల నాశ్రయించి వచ్చినదియేకాని వేఱు కా దని తెలుచున్నది. ఆకాశ మొక్కటియయ్యును ఘటగృహాద్యుపాధులవలన ఘటాకాశగృహాకాశనామములతో భిన్నముగ వ్యవహరింపఁబడుచున్నట్లు బ్రహ్మంబును ఒక్కటియేయయ్యును శరీరోపాధులవలన జీవశబ్దముతో వ్యవహరింపఁబడుచున్నాఁడు. కావున లోకమున సర్వకాలములయందును ధనవిషయిక మగునభిమానము కలవానిని "వీఁడు ధనమయుఁడు" అని వ్యవహరించునట్లు స్త్రీవిషయిక మగు చింత కలవానిని "స్త్రీమయుఁడు" అని వ్యవహరించునట్లు దేహాదివిషయక మగునభిమానముఁ గలిగియుండుటచే జీవుని "దేహమయుఁడు మనోమయుఁడు ప్రాణమయుఁడు" అని లోకవేదములు వ్యవహరించుచున్నవి. ఏచింతయున్నను పురుషుని స్వస్వరూపమునకు భంగము లే నట్లు దేనితో సంబంధపడియున్నను జీవునకు స్వస్వరూపభంగము లేదు. కావునఁ జీవునకు సుఖదుఃఖాదులు తనయుపాధుల నభిమానించుటచేఁ దనస్వరూపము నెఱుంగలేక పోవుటచే వచ్చినవియే కాని స్వాభావికములు కావు. పుణ్యపాపములు కూడ నిట్టివే. కావున విచారించిన జీవునకు నీ వన్నట్లు విభాగముఁ గూడ లేదు. "ఏకో దేవః సర్వభూతేషుగూఢః"="ఒక్కపరమేశ్వరుఁడే సర్వభూతములయందును జీవరూపముతో నున్నాఁడు" అను మొదలగుశ్రుతులు నీవిషయమునఁ బ్రమాణము. ఈకారణమువలన నాజీవుఁడు మఱియొకపదార్థమునకుఁ గార్యము కా నక్కఱ లేదు. ప్రతిజ్ఞయు భంగము కా నక్కఱ లేదు. జీవబ్రహ్మ లొక్కటియే యైనప్పుడు బ్రహ్మజ్ఞానముచే జీవజ్ఞానము కలుగు ననుటలో సంశయము లేదు కదా. ఇట్లు బహుశ్రుతులచే నేకవాక్యముగ జీవనిత్యత్వము ప్రతిపాదింపఁబడుచుండుటచే నొకానొకస్థలమున తత్సృష్టి వినవచ్చినను దాని నౌపాధికభేదపరముగానే వ్యా

ఖ్యానముఁ జేయవలసియుండును. కావున నెట్లును జీవునకు నుత్పత్తివినాశములు లేవు.

---

## జ్ఞాధికరణము. ౧౨.

విషయము, సంగతి:—పూర్వాధికరణమున జీవునకు నుత్పత్తి లే దనుట సాధింపఁబడెను. ఇప్పుడు దాని నాధారముగఁ గైకొనియే "జీవుండు విజ్ఞానస్వరూపుండు" అనువిషయము సాధింపఁబడును. ఈకారణమువలన వీనికి రెంటికిని *హేతుఫలభావసంగతి.

సందేహ:—కొన్నిశ్రుతులయందు "ఆత్మై వాఽస్య జ్యోతిర్భవతి"="ఆత్మయే సూర్యాదులు లేనప్పుడు పురుషునకుఁ జ్యోతియగును" అని జీవునకు స్వప్రకాశస్వరూపత్వము చెప్పఁబడి యున్నది. మఱికొన్నిటియందు "పశ్యం శ్చక్షుః"="చూచునప్పుడు అనఁగా జూడఁబడుపదార్థము సమీపమున నున్నప్పుడు జీవుఁడు నేత్ర మగును" అని జీవునకు చైతన్యము నిత్యము కా దనియు వచ్చుచుఁ బోవుచుండు ననియుఁ జెప్పఁబడి యున్నది. సాంఖ్యులును వైశేషికులును క్రమముగ నీసిద్ధాంతములనే గైకొని వివాదముఁ జేయుచున్నారు. ఈశ్రుతులకుఁ బరస్పరవిరోధము కలదా ? లేదా ?

పూర్వ.—అను నీసంశయమువలన నిట్లు పూర్వపక్షమువచ్చును. చైతన్య మనఁగా జ్ఞాన మగుటచే దానికి నెప్పటికిని కర్మతో సంబంధముండవలయును. జ్ఞానకర్మ జ్ఞేయ మగుటచే జ్ఞానరూపుఁ డగువానికి నెప్పుడును పదార్థములు గోచరము లగుచుండవలయు ననుట నియమము. జీవునివిషయమున నీనియమముఁ గానవచ్చుట లేదు. ఆతనికి నింద్రియసంబంధము కలిగినప్పుడు పదార్థస్వరూపజ్ఞానము కలుఁగుచున్నది. లేనప్పుడు లేకున్నది. నిదుర మూర్ఛ మొదలగునవస్థలయందు పదార్థజ్ఞానము లే దనుటలో వివాదము లేదు కదా ! ఈకారణమువలన వైశేషికుల

---

* హేతుఫలభావసంగతి యనఁగా పూర్వాధికరణమునఁ గారణములు నిరూపింపఁబడి యుత్తరాధికరణమున నిరూపణఫలము చెప్పఁబడి యుండుట ప్రకృతమున జీవబ్రహ్మస్వరూపముల చైతన్యమాత్రములనుగా నిరూపించుటకు దద్వైక్యమే కదా ఫలము.

యభిప్రాయమే యుక్తియుక్తము ? జీవునకుఁ గలజ్ఞాన మనిత్య మయ్యే యుండవలయును. మఱియు నిట్లు సిద్ధాంతముఁ జేసిననే గాని యింద్రియ ములకు సార్థకత్వము కలుగదు. జీవునకు జ్ఞానము స్వాభావికమే యయ్యె నేని యప్పుడు సర్వపదార్థములును సర్వావస్థలయందును దెలియవచ్చు చునే యుండవలయును ? ఇంద్రియము లున్నను లేకున్న నొక్కటియే కావలయును కదా! ఇంద్రియము లాయనకు జేయఁగలవిశేష మప్పు డేది కలదు. కావున మనస్సు మొదలగువానిసంయోగముచే జీవునకు జ్ఞానము కలుగును. సుషుప్త్యాద్యవస్థలయందు మనస్సు లయము నొం దును. లేక నిద్రాదోషమువలన మూఢమై ప్రచారశూన్యమై యుండును కావున జీవుఁడును జ్ఞానశూన్యుఁడే యగును. జీవుని నిత్యవిజ్ఞానరూపునిఁగా జెప్పుశ్రుతులకును ఈసిద్ధాంతమువలన విరోధము రాదు. మనస్సంయో గము కలిగినను ఆకాశాదులయందు జ్ఞాన ముత్పత్తి యగుట లేదు ? ఒక జీవునియందుమాత్రమే యది యుత్పన్న మగుచున్నదికదా! కావున జ్ఞాన మున కాధార మగుసామర్థ్యము జీవునియందు మాత్రమే కల దనునభి ప్రాయమున శ్రుతి యెట్లుచెప్పవచ్చును. కావున నెట్లును జీవుఁడు నిత్యవిజ్ఞా నరూపుఁడు కానేరడు ? నిత్యవిజ్ఞానరూపుఁడు కాకున్నఁ బరమేశ్వరునకు నభిన్నుఁడును కానేరఁడు. పరమేశ్వరుఁడు విజ్ఞానమయుఁడు కదా! అట్లు కాకపోయినఁ బ్రతిజ్ఞకు భంగము వచ్చు నని పైయధికరణమునందేఁ జెప్ప బడి యున్నది.

## సూత్రము. ౧౮.

అవతారిక:—అని ఇట్లు వచ్చినపూర్వపక్షమును పూర్వాధికరణ హేతువులతోనే ఖండించుచున్నాఁడు.

## ౨౩౫. జ్ఞోఽత ఏవ. ౨. ౩. ౧౮.

తాత్పర్యము:—జీవుఁడు నిత్యవిజ్ఞానరూపుఁడే యనుటలో సంశయ ము లేదు. దీనికిఁ గారణము పూర్వాధికరణమునందే నిరూపింపఁబడి యు న్నది. జీవుఁడు పరమేశ్వరునికంటె భిన్నుఁడు కాఁడనియు నాపరమేశ్వరుఁడే జీవరూపముతో సర్వదేహములయందును వ్యాపించి యున్నాఁడనియు నచ్చట నిరూపించియే యున్నాము. "విజ్ఞాన మానందం బ్రహ్మ. సత్యం

జ్ఞాన మనంతం బ్రహ్మ" అను మొదలగుశ్రుతులు "పరమేశ్వరుఁడు నిత్య విజ్ఞానస్వరూపుఁడు" అని చెప్పుచున్నవి. ఇట్లుండఁ బరమేశ్వరాఽభిన్నుఁడగుజీవుఁడుమాత్ర మట్టివాఁ డేల కాకపోవును.

జీవునిఁ గూర్చి చెప్పునప్పుడును శ్రుతులయందు "అసు_ప్త స్సుప్తా నభిచాకశీతి"="జీవుఁడు స్వయముగ నిదురింపకయే (జ్ఞానలోపమును జెందకయే) స్వకారణములయందు లీనములైనయింద్రియాదులఁ జూచుచుండును" అని జీవునకు నిత్యజ్ఞానమేచెప్పఁబడియున్నది. "నిదురయందు నేమియు లేకుండెను. మనస్సు లేదు. సంకల్పములును లేవు" అను మొదలగు వ్యవహారముల నాశ్రయించి చూచిన సుషుప్త్యవస్థయందుఁ గల సర్వాభావ మాత్మకుఁ దెలియవచ్చుచున్నది యనుట సర్వానుభవసిద్ధమగువిషయమే యగుచున్నది. "య ద్వై త న్న పశ్యతి పశ్య న్వై త న్న పశ్యతి న హి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాత్ న తు త ద్ద్వితీయ మ స్తి త తోఽన్య ద్విభ_క్తం య  త్పశ్యేత్"="సుషుప్తిమూర్ఛాద్యవస్థలయందు జీవుఁడు విషయముల గ్రహింపకున్నాఁడనుట యేది కలదో అది జ్ఞానాభావముచేఁ గలిగినది కాదు. వస్తువు లున్నను లేకున్నను చూచువానిచూపునకు హాని యెప్పటికి నుండదు. చూచువాఁడు చూడఁబడుపదార్థములవలె నశించువాఁడు కాఁ గూడదు కదా! (చూచువానికిఁ జూడఁబడుపదార్థములయొక్క యాద్యంతములు తెలియవలయును కావున నాతఁడు పదార్థమునకంటెఁ జిరకాల ముండవలయు ననుట. మన మట్లుండుట లేదు కదా యనియెదవేమొ మనకును దేహము మాత్రమే నశించుచున్నది కాని స్వరూపము అట్లు కా దని పైయధికరణమునందే నిరూపింపఁబడెను). కావున నిర్ణయింపవలసిన దేమి యనిన సుషుప్త్యాద్యవస్థలయందు సర్వపదార్థములును స్వకారణములయందు లయము నొందును కావున జీవునకు చూడఁబడవలసిన రెండవపదార్థ ముండ దనుటయే. రెండవపదార్థమే లేకున్న దృష్టి యుండిమాత్రము దేనిని చూచును" అని కొన్నిశ్రుతులయందు సుషుప్త్యాదుల విషయము స్పష్టముగనే వర్ణింపఁబడి యున్నది? ఎట్లయినను జీవునకు నిత్యజ్ఞానమే కల దనువిషయము స్థాపింపఁబడినది.

మఱియు జీవుఁడు ఆగంతుకవిజ్ఞానము (వచ్చుచూఁ బోవుచున్న విజ్ఞానము) కలవాఁడే యగునేని యనేకదోషములు వచ్చును. జ్ఞాత

వలనే జ్ఞేయముకూడ జ్ఞానమునకు నాశ్రయ మనుట లోకప్రసిద్ధము? జ్ఞేయము నిత్యజ్ఞానాశ్రయము కా దనుటయుఁ బ్రసిద్ధమే కావున జ్ఞాతయు నట్టివాఁడే యైన నాయనకును జ్ఞేయమునకు నున్నస్వభావము లే యుండవలసి వచ్చును. జ్ఞేయము లగుఘటాదులు కొన్నిసమయముల యందుఁ బ్రత్యక్షములుగను మఱికొన్నిసమయములయందు పరోక్షములుగను వేఱొకకొన్నిసమయములయందు విపర్యస్తములుగ (భ్రాంతిచే నన్యపదార్థములుగ గ్రహింపఁబడినవయ్యు) నున్నవి. ఆత్మ యిట్టివాఁడు కా డనుట సర్వానుభవసిద్ధము కదా ! ఆయన "నేను" అనుచు సర్వకాలములయందును ప్రసిద్ధుఁడై ప్రత్యక్షుఁడయ్యే యున్నాఁడు. త్రికాలములయందును పదార్థము లెట్లుమారినను వానితో మార్పు నొందక నిత్యుఁడై యున్నాఁడు. సాక్షి సర్వపదార్థములయొక్కయు నాద్యంతములకు గూడ సాక్షియే కావున త్రికాలములయందు నేకరూపముతో నుండవలసివాఁ డగును కదా! మఱియు నాత్మ జ్ఞానాశ్రయుఁ డని చెప్పుటయే సంభవింపదు. జ్ఞానాశ్రయుఁ డనిన జ్ఞానభిన్నుఁడు కావలసివచ్చును. జ్ఞానభిన్నపదార్థము జడమే కదా కావలయును. జ్ఞానమే యనిన వానికి రెంటికిని భేద ముండుటకు వీలు లేదు. జడమే యైన దానిని తద్విరుద్ధ మగుజ్ఞాన మెట్లాశ్రయింపఁగలదు? కావున బాగుగ విచారించిన నాత్మ జ్ఞానరూపుఁడే కావలయును గాని జ్ఞానాశ్రయుఁ డగుటకు వీలు లేదు. మఱియు జ్ఞానభిన్న మగుపదార్థము లేవియు నిత్యములగుట కూడ సంభవింపదు. బాగుగవిచారించిన లోకము జ్ఞానజ్ఞేయభేదములతో రెండు విధములే యై యున్నది. జ్ఞానంబును జ్ఞేయరూపపదార్థములయొక్క యాద్యంతముల నెఱుంగవలసినది యగుటచేఁ ద్రికాలములయందు నుండవలసినది యగుచున్నది. ఇట్లుండ నిఁక నిత్యుఁడని సర్వానుభవప్రసిద్ధుఁడై యున్నజీవునకు నిత్యజ్ఞానస్వరూపము కల దనుటలో సంశయ మేమి? "అథ యో వే దేదం జిఘ్రాణీతి స ఆత్మా"="దీనిని వాసనచూచుచున్నానని యింద్రియజ్ఞానము నెవ్వఁ డెఱుంగునో వాఁడే యాత్మ" అని శ్రుతియు నీవిషయము స్పష్టముగఁ జెప్పుచున్నది. ఎఱుంగనది జ్ఞానమనుట లోకప్రసిద్ధము కావున నదియే యాత్మ యనుట సిద్ధ మగుచున్నది.

"ఇట్లయిన నింద్రియములు నిరర్థకములు (కావలసి వచ్చును)" అనియెదవేమొ? అట్లు చెప్ప నక్కఱ లేదు. జీవునకు స్వరూపభూత మగు

జ్ఞానము సామాన్యజ్ఞానము. విశేషజ్ఞానమునకై చిత్తవృత్తులును వానికి నిర్గమనద్వారము లగునింద్రియములును కావలసినదియే. 'గంధాయ ఘ్రాణం' గంధమును గ్రహించుటకు ప్రవర్తించు చిత్తవృత్తి ప్రసరించుటకై ఘ్రాణేంద్రియము కావలయును" అని శ్రుతియందు ఇంద్రియప్రయోజనము స్పష్టముగనే చెప్పఁబడియున్నది. దీని నాశ్రయించియే "పశ్యం శ్చక్షుః" అను మొదలగు శ్రుతులకు నన్వయము జెప్పవలయును. ఆత్మయే సర్వవ్యాపకుఁ డగుటచే చిత్తవృత్తియందు నిలిచి దృశ్యమగురూప మెదుట నున్నప్పుడు నేత్రేంద్రియమూలము నిర్గమించును. కదా! ఈచిత్తవృత్తివలన (దర్శనరూపచిత్తవృత్తివలన) గాని, నేత్రేంద్రియసంబంధమువలనఁ గాని, తద్రూపమువలన (పరమార్థస్థితిలో నేత్రేంద్రియము కూడ నాయనకంటె భిన్నము కాదు. కావున గాని) గాని యాయాత్మయే నేత్రశబ్దముతోఁ జెప్పఁబడవచ్చును. ఇంతమాత్రమున "నేత్రేంద్రియసంబంధముచేఁ గాని, తద్రూపచిత్తవృత్తిసంబంధముతోఁ గాని యాత్మకు దర్శనాజ్ఞానము కలుగును" అని యర్థముఁ జెప్ప నక్కఱ లేదు. కావున నెట్లును శ్రుతులకుఁ బరస్పరవిరోధము రాదు. జీవునకును నిత్యవిజ్ఞానస్వరూపము పోదు. జీవబ్రహ్మలకును ఐక్యభంగము లేదు. వైశేషికసిద్ధాంతంబును శ్రుతివిరుద్ధ మగుటచే యుక్తము కాదు. వారియుక్తులన్నియు లోకమునకుఁ గూడ విరుద్ధములే యని ద్వితీయపాదమున స్పష్టముగ వివరించియే యున్నాము. ఈకారణమువలన వారిపక్షము నాశ్రయించి "ఆత్మైవాఽస్య జ్యోతిః" అను మొదలగు వానికి క్లిష్టముగ నర్థమును కల్పింప నక్కఱలేదు. జ్ఞానభిన్న మగుపదార్థమునకు జ్ఞానోత్పత్తిహేతు వగుశక్తియు నుండుట సంభవింపదు. లేనిది జనించుటకు వీలు లేదు కావున జ్ఞానోత్పాదనశక్తి యనఁగా సూక్ష్మరూపముతో నున్నజ్ఞానమే యగుటచే నది తనకు విరుద్ధ మగుజడపదార్థము నాశ్రయింపదు కావున నెట్లును మాపక్షమే సిద్ధాంతము.

---

## ఉత్క్రాంతిగత్యధికరణము. ౧౩.

విషయము, సంగతి, సంశయము:—ఇచ్చట "జీవుఁడు సర్వవ్యాపకుఁడు" అనువిషయము నిర్ణయము చేయఁబడెను. ... స్థితిలో నైరెండధి

కరణములయందును జీవబ్రహ్మాభేదము వర్ణింపఁబడియుండుటచేతను బ్రహ్మ స్వరూప మనంత మనుట శ్రుతిప్రసిద్ధ మగుటచేతను జీవుఁడుకూడ నట్టి వాఁడే యగుననుటలో సంశయ ముండదు. అయినను కొన్నిశ్రుతులు "మహాంతం విభు మాత్మానం" అని జీవుని సర్వవ్యాపకునిగను మఱి కొన్ని "ఏషో ఽను రాత్మా చేతసా వేదితవ్యః"="జీవుఁ డణుస్వరూపుఁడు వానిని మనస్సుతోఁ దెలిసికొననలయును" అని యణుస్వరూపునిఁగను చెప్పుచుండుటవలన నీశ్రుతుల కర్థ మేది? వీనికి విరోధ మున్నదా? లేదా? యని సంశయము కలుగును. కావున నది యీయధికరణమున నిరాకరింపఁబడును. పూర్వాధికరణములందు జీవబ్రహ్మాభేదము సిద్ధించు టకై * యంతరంగము లగునిత్యత్వస్వప్రకాశత్వములు నిరూపింపఁబ డెను. ఈయధికరణమున నాజీవబ్రహ్మాభేదమును సాధించుటకే వానికంటె (నిత్యత్వాదులకంటె) † బహిరంగ మగుసర్వవ్యాపకత్వము స్థాపింపఁబడు ను. ఈక్రిందియధికరణములు మూఁటియందును ఇంతకంటె బహిరంగ ము లగుకర్తృత్వాదులు స్థాపింపఁబడును. కడపటియధికరణమునందు ఫలభూత మగునైక్యము వర్ణింపఁ బడును. కావున నిచ్చటనుండి పాదాం తమువఱకు బూర్వాధికరణములతోఁ గలసంబంధము ‡ అంతర్బహిర్భా వసంబంధము. కట్టకడపటిదానికి మాత్రము పూర్వాధికరణములతో హేతుఫలభావసంబంధము వచ్చును.

## సూత్రము. ౧౯.

అవతారిక:—పైని నిరూపించిన సంశయమువలన జీవప్రమాణము విచారింపవలసి రాగా జైనమతఖండనమునందు "జీవుఁడు దేహపరిమాణ ము (ఇదియే మధ్యమపరిమాణము) కలవాఁడు కాఁడు" అని నిర్ణయిం

---

* అంతరంగము లనఁగా; స్వరూపమునకు సంబంధించినవి.

† బహిరంగము లనఁగా; స్వరూపస్థితికి సంబంధించినవి. అనఁగా 'స్వరూప మెట్టిది?' యనువిచార మంతరంగవిచారము. 'ఆ స్వరూపమునకు నితరపదార్థముతోఁ గలసంబంధ మెట్టిది?' అనువిచారము బహిరంగవిచారము.

‡ పూర్వాధికరణ మంతరంగవిషయములనుఁ గూర్చియు; నుత్తరాధికర ణము బహిరంగవిషయములను గూర్చియు విచారించుచు నొక్కపదార్థమునే ప్రతిపా దించుట యంతర్బహిర్భావసంబంధము,

పఁబడి యుండుటచే తద్విషయమైనవివాదము లేదు. కావున "జీవుఁడు అణుమాత్రుఁడా! సర్వవ్యాపకుఁడా!" అను విషయమును మాత్రమే యిందు సూత్రకారుఁడు విచారింపఁ బోవుచున్నాఁడు. జీవునివిషయము లో కొందఱు వాదు లణువనియు, మఱికొందఱు మధ్యమపరిమాణు వనియు, వేఱొకకొందఱు మహాపరిమాణు వనియు మాత్రమే చెప్పుచు న్నారు. కాని మఱియొకవిధముగ చెప్పుట లేదు. కావునఁ బైనిఁ జూపిన రెండుపక్షములను యుక్తులచే విచారించి "జీవుఁడు సర్వవ్యాపకుఁడు" అనువిషయమును సిద్ధాంతముఁ జేయువాఁడై మొట్టమొదట యెనిమిది సూత్రములలో పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౨౩౮. ఉత్క్రాంతిగత్యాగతీనాం. ౨. ౩. ౧౮.

పూర్వతాత్పర్యము:—ఇరువది యొకటవసూత్రమునుండి 'అణుః శ్రుతేః' అను రెండుశబ్దములను యీసూత్రములోనికి దెచ్చికొనవలయును. అప్పు డీక్రింది యర్థ మేర్పడును.

వేదములందు జీవునకు శరీరమునుండి నిర్గమనంబును పరలోకప్రాప్తియుఁ గర్మఫలభోగానంతరమున నటనుండి మఱల భూమికి వచ్చుటయు ననునవి కల వని చెప్పఁబడి యున్నది. "స యదా౽స్మా చ్ఛరీరా దుత్క్రామతి స హై వై తైః సర్వై రుత్క్రామతి"="ఆజీవుఁడు యీశరీరమునుండి యెప్పుడు నిర్గమించునో అప్పుడు యింద్రియాదులతోఁ గూడ నిర్గమించును" అని యుత్క్రమణంబును "యే వై కే చాస్మా ల్లోకా త్ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి"="ఈలోకమునుండి యెవ్వరు పోవుదురో (మృతినొందుదురో వారు చంద్రలోకమునకే పోవుదురు." అని లోకాంతర గమనంబును "తస్మా ల్లోకా త్పున రై త్యస్మై లోకాయ కర్మణే" "పరలోకము నొందినవాఁడు మఱలఁ గర్మల నాచరించుటకై యీలోక మునకు వచ్చును" అని పునరాగమనంబును గూడ శ్రుతులయందు స్పష్టముగఁ జెప్పఁబడి యున్నవి. ఇట్లగుటచే జీవునకు నణుపరిమాణ ముండవలసివచ్చును. మధ్యమపరిమాణమును జైనమతఖండనమున నిదివఱకే ఖండించి యున్నారు. సర్వవ్యాపకుఁడే యైనచో నాతనికి చాంచల్య ముండుటకు వీలులేదు. గమన మనఁగా నున్నస్థలమును విడచి మఱియొకస్థలమును

జేరుట. ఆగమన మనఁగా తానుచేరియున్నస్థలమును వదలి మొట్టమొదట నున్నస్థలముననే చేరుట. సర్వవ్యాపకునకు నివి రెండును సంభవింపవు. అతఁడు సర్వదేశములయందు సర్వకాలములయందు నేకరూపముతోనే నుండువాఁడు కదా. ఏస్థలమును విడచి యేస్థలమునకుఁ బోవును? యెం దుండి యెటకు వచ్చును. కావున నిర్వివాదముగ జీవుఁ డణుమాత్రుఁడే!.

## సూత్రము. ౨౦.

అవతారిక:—"ఇట్లుకాదు. ఉత్క్రమణమనఁగా మరణముకాని చలనము కాదు. ఆమరణమునకు సంచారముతోఁ బని లేదు. అనాదికర్మ వశంబున 'యీ దేహము నాది' అని జీవుఁడు తనను దేహమునకు ప్రభువునుఁగా భావించును; దానికిఁ గలుగుభోగములఁ దనవి గాఁ దలంచును. ఈదేహాభిమానమేజీవనత్వము. యిదియే జీవనము. (బ్రతుకు) 'బ్రతికియున్నాఁ డు' అనఁగా 'దేహమును తనదానినిఁగా భావింపుచున్నాఁడు' అనియే య ర్థముఁ జెప్పవలసి యున్నది. ఇట్లగుటచే దేహాభిమానపరిత్యాగమే మ రణము కావలయును. దేహాభిమానము జీవనమైనఁ దత్పరిత్యాగము మ రణ మగుటలో సంశయ మేమి? కావున నీమరణము శరీరమునుండి నిర్గ మింప కున్నను కలుగవచ్చును. ప్రారబ్ధకర్మము అనుభవముచే నశించిన దానివలనఁ గలుగు దేహాభిమానము కూడ నశింప వచ్చును కదా." అనిన నీపక్షము నంగీకరించియుఁ దక్కినవానిపై (గత్యాగతులపై)నాధారపడి పూర్వపక్షి మఱల నాక్షేపించుచున్నాఁడు; ఉత్క్రమణముకూడ నిర్గమమే కావలయు ననియు సాధింపుచున్నాఁడు.

## ౨3౭. స్వాత్మనాచోత్తరయోః. ౨. 3. ౨౦.

పూర్వపక్షసూత్రము:—

తాత్పర్యము:—ఒకవేళ నుత్క్రమణమును గూర్చి మీరు చెప్పి నట్లే యంగీకరించినను గత్యాగతులను మాత్ర మెట్లును త్రిప్పుటకు వీలు లేదు. వానికిఁ జాంచల్యమే యర్థము. వానికి గ_ర్త యెవఁడో యొక్కఁడుండ వలయును కదా! ఆకర్త జీవుఁడే యని వేదము బోధించుచున్నది. ఇట్లైన నీక నాతనికి పరిమాణ మేది యుండవలయును? సర్వవ్యాపకుఁడు చరించు

ననుటకు వీలు లేదు. మధ్యమపరిమాణ మాతనికి లే దని ఖండింపఁబడి యున్నది. కావున నణుపరిమాణమే యాతని కుండి తీరవలయును.

బాగుగ విచారించిన నుత్క్రమణమును గూర్చియు మీరు చేసిన సిద్ధాంతము నిలువదు. ఒకవేళ వానికిఁ (జాంచల్యమని నర్థము లేకున్నను ప్రస్తుతవిషయమున నట్లే చెప్పవలసి వచ్చును. జీవుఁడు పరలోకమునకు బోయి మఱల భూలోకమునకు వచ్చు ననుట సిద్ధాంత మైనపుడు వుత్క్రమణము మాత్రము శరీరమున నిశ్చలుఁడై యున్నవానికే కలుగుననుట యెట్లు యుక్తియుక్త మగును? శరీరమునుండి నిర్గమింప కుండినఁ బరలోకమునకుఁబోవుట యెట్లు సంభవించును. "జీవుఁడు సర్వవ్యాపకుఁడగునేమో" అనునాశ గత్యాగతుల విచారించి నప్పుడే పోయినది. గత్యాగతులను గూర్చి నిర్ణయించుటచే జీవుఁడు ప్రాదేశమాత్రుఁ డయ్యెను.(జిట్టెడు ప్రమాణము కలవాఁడు; లేక అణుమాత్రుఁడు). ఇఁక శరీరమునుండి నిర్గమించుననుటలో సంశయ మేమి. "యీకారణమువలన నుత్క్రాంతియుఁ గత్యాగతులతోఁ గూడఁ జననరూపమే" యనుటయే యుక్తియుక్తము.

ఇదియునుఁగాక శ్రుతియందు "చక్షుష్టో వా మూర్ధ్నో వా"= "జీవుఁడు కంటినుండిగాని బ్రహ్మరంధ్రమునుండి కాని నిర్గమించును" అని ప్రత్యక్షముగ నుత్క్రాంతికి మార్గములుఁగూడఁ జెప్పఁబడియున్నవి. "స హైతా స్తైర్వ రుత్క్రామతి" అని "జీవునితోఁ గూడ దేహమున గలయింద్రియాదులునుకూడఁ బోవును" అని కూడఁ జెప్పఁబడియున్నది. ఇట్లుండ నుత్క్రమణము చలన మెట్లుఁ గాక పోవును? దేహమున్నుండి జీవుఁ డెట్లు పోకపోవును? పోవునేని యందును అనేకపదార్థములతోఁ గలసి యతిసూక్ష్మము లగునాడీద్వారములనుండి పోవునేని యణుస్వరూపుఁ డెట్లు కాకపోవును ?

మఱియు జీవించియున్నప్పుడు సహితము స్వప్నజాగ్రదవస్థల యందు క్రమముగ జీవుఁడు సర్వేంద్రియములను గైకొని హృదయ కమలములోనికిఁ బోవుచు మఱల వచ్చుచుండు నని శ్రుతి చెప్పుచున్నది. "స యేతా స్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయ మేవాన్వవక్రామతి శుక్రమాదాయ పున రైతి స్థానమ్"="ఆజీవుఁడు భూతకార్యము లగుసర్వేంద్రియములను గైకొని సుషుప్త్యవస్థయందు హృదయకమలమును జేరును. మఱల ప్రకాశమానము లగు నాయింద్రియములనే

గైకొని జాగ్రదవస్థాస్థానమును (జాగ్రదవస్థకు భ్రూమిమధ్యము స్థాన మని చెప్పుదురు) నకాలమున జేరును." అను వాక్య మీవిషయమునఁ బ్రమాణము. ఇట్లు విచారించిన జీవించినకాలమునందును మృతి నొందిన తర్వాతను గూడ జీవునకు రాకపోకలు స్వాభావికము లయ్యే యున్నవి కావున నుత్క్రమణము కూడ స్వాభావికము. అదియు నుత్క్రమణంబును చాంచల్యరూపమే. కావున నెట్లును జీవుఁ డనుస్వరూపుఁడే.

## సూత్రము. ౨౧.

అవతారిక:—ఇట్లు జీవునకు నణుపరిమాణము కల దని సాధించి శ్రుతివిరోధము వచ్చు నని సందేహించి తత్ప్రతివాదపూర్వకముగ పూర్వపక్షి స్వసిద్ధాంతమును స్థాపించుకొనుచున్నాఁడు.

## ౨౩౭. నాణురతచ్ఛ్రుతేరితి చే న్నేత రాధికారాత్. ౨. ౩. ౨౧.

తాత్పర్యము:—"ఇట్లు చెప్పుట సరి కాదు. జీవుఁడు అణుప్రమాణము కలవాఁ డనిన బహుశ్రుతులకు విరోధము వచ్చును. 'స హివేష మహానజ ఆత్మా యో ఽయం విజ్ఞానమయః, ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'="ఈజీవుఁ డుత్పత్తిశూన్యుఁడు. మహాపరిమాణము కలవాఁడు. ఆకాశమువలె సర్వవ్యాపకుఁడు నిత్యుఁడు సత్యరూపుఁడు జ్ఞానరూపుఁడు ఆద్యంతములు లేనివాఁడు" అని యనేకశ్రుతులు జీవుని మహాప్రమాణముఁ గలవానినిఁగా జెప్పుచున్నవి. కావున నీ మతము యుక్తిశూన్యము కాదు" అనియెదవేమో ? అది యుక్తము కాదు.

జీవుఁడు నిత్యుఁ డైనను నిత్యవిజ్ఞానస్వరూపుఁడైనను అణుమాత్రుఁడగు నని శ్రుతిబలముచేతనే నిరూపింపఁబడి యుండుటచే బ్రహ్మముతో నభిన్నుఁడు కానేరడు. యీకారణమువలన మహాపరిమాణశ్రుతులకు విరోధ మింత యైనను లేదు. వేదాంతశాస్త్రమునందు ముఖ్యముగా "పరబ్రహ్మమును స్వస్వరూపమునుగాఁ దెలిసికొనవల యును" అని చెప్పఁబడి యుండుటచే దాదాపు సర్వస్థలములను తత్పరములుగానే

యుండును. ఈకారణమువలన మీచేనుదహరింపఁబడిన శ్రుతులన్నియు బ్రహ్మవిషయములైన వే. కావున మాసిద్ధాంతములకు నెట్లును భంగములేదు.

'యోఽయం విజ్ఞానమయః' అని శ్రుతి జీవునిఁగూర్చి ప్రత్యక్షముగఁ జెప్పెను కదా." అనియెదవేమొ యది పరమార్థదృష్టి ననుసరించి చెప్పి యుండవచ్చును జీవుఁడు పరమేశ్వరునుండి జనించినప్పటికిని ఘటము యొక్క యథార్థతత్వమును మృత్తికయే యైనట్లు ఆతనియొక్క యథార్థతత్వముఁ బరమేశ్వరుఁడే యగును కదా. కావున నెట్లును మాపక్షము శ్రుతివిరుద్ధ మైనది కాదు. మామతము నంగీకరింపకపోయిన మీపక్షమునందే యీశ్రుతివిరోధము దుర్నివారమై వచ్చును.

## సూత్రము. ౨౨.

అవతారిక:—మఱియు జీవుఁ డణుపరిమాణము కలవఁ డను విషయమున శ్రుతి ప్రమాణమే కలదని పూర్వపక్షి చూపుచున్నాఁడు.

## ౨౩౮. స్వశబ్దోన్మానాభ్యాం చ. ౨. ౩. ౨౨.

పూర్వపక్షసూత్రము:—

తాత్పర్యము:—జీవపరిమాణవిషయమున నింతగా వివాదము చేయ నక్కఱయేలేదు. కొన్నిస్థలములయందు "ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ప్రాణః పంచధా సంవివేశ"="ఎవ్వనియందు ప్రాణవాయువు ఐదువిధములుగ నిలచియున్నదో అట్టియీయాత్మ యణుపరిమాణముఁ గలవాఁడు" అను మొదలగు వాక్యములచే జీవపరిమాణము అణువని స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. మఱికొన్నిస్థలములయందు "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ, భాగో జీవః స విజ్ఞేయః" "వెంట్రుకయొక్క కొనను నూరుభాగములుగఁ జేసి యందొక్కభాగమును మఱల నూరుభాగముల గావించిన జీవుఁ డందలి యొక్కభాగముతో సమానుఁ డగును" అని కల్పనాపూర్వకముగఁ బ్రమాణము చూపఁబడి యున్నది. ఇట్లగుటచే జీవుఁ డణుమాత్రుఁ డణుటలో వివాదమే లేదు.

## సూత్రము. ౨౩.

అవతారిక:—"ఇట్లు చెప్పుట యుక్తము కాదు. జీవుఁ డణుమాత్రుఁడైన శరీరమున నేవిధమో యొకభాగమునమాత్రమే యొరికి

యుండవలసినవాఁడగును. అప్పుడు సర్వాంగమునకును సంబంధించిన చలువవేడిమి అనువాని నాతఁడు తెలిసికొనలేకపోవలసి వచ్చును. ఇది సంభవింపదు. ప్రతివానికిని 'నాకు దేహమంతయు పాపముగ నున్నది' అను మొదలగు వ్యవహారములు ననుభవములును స్పష్టములై యున్నవి. కావున జీవుఁడు మహత్పరిమాణము కలవాఁడే యనవలయును. సూక్ష్మమ పరిమాణమునుగూర్చి యిదివఱకే చెప్పఁబడి యున్నది కదా" అనిన పూర్వ పక్షి. దీనికి సమాధానమును చెప్పుచున్నాఁడు.

పూర్వపక్షసూత్రము:—

## ౨౪౦. అవిరోధశ్చందనవత్. ౨. ౩. ౨౩.

తాత్పర్యము:—పై పూర్వపక్షము యుక్తమైనది కాదు. జీవుఁడు అణువైనను శరీరమున నొక్క ప్రదేశమునందు మాత్రమే యుండువాఁడైనను సర్వశరీరమునకును సంబంధించిన శైత్యాదులఁ దెలిసికొనవచ్చును. జీవుఁడు త్వగింద్రియముతో సంబంధించి యున్నాఁడు. ఆ త్వగింద్రియంబును సర్వశరీరముతో సంబంధించి యున్నది. కావున దానిసహాయము వలన జీవుఁడు సర్వమును తెలిసికొనవచ్చును. మంచిగంధముయొక్క బిందువు శరీరములో నొక్క ప్రదేశమున మాత్రమే యున్నను సర్వశరీరమునకును ఆహ్లాదమును కలిగించుచున్నవి కదా! ఇట్లే జీవుఁడును ఒక స్థలముననే యున్నను జ్ఞానమును మాత్రము సర్వశరీరమునందును ప్రసరింపఁ జేయవచ్చును కదా!

## సూత్రము. ౨౪.

అవతారిక:—పై సూత్రమున జేయఁబడిన సిద్ధాంతమునే పూర్వపక్షి మఱల నాక్షేపసమాధానములతో దృఢము చేయుచున్నాఁడు.

పూర్వసూత్రము:—

## ౨౪౧. అవస్థితివైశేష్యాదితి చేన్నాఽభ్యుపగమాద్ధృది హి. ౨. ౩. ౨౪.

పూర్వతాత్పర్యము:—"పై సూత్రమునఁ జూపఁబడిన దృష్టాంతము సరియైనది కాదు. చందనబిందువువిషయమున సర్వవిషయములును(అనఁగా

చందనబిందు వొక్క స్థలముననే యుండుటయు శరీరమున కంతయు నాహ్లాదము గలుగుటయు నను రెండువిషయములును) ప్రత్యక్షములై యున్నవి. జీవునివిషయమున మాత్ర మట్లు లేదు. అచ్చట సర్వదేహములకును సంబంధించినశైత్యాదుల దెలిసికొనుటయే ప్రత్యక్షమై యున్నది కాని 'జీవుఁ (డణుమాత్రు) డై శరీరమున నొక్కస్థలమందే యున్నాఁడు' అను విషయము ప్రత్యక్షముగ లేదు. అనుమానముచే దానిని సాధింపవలయు నని ప్రయత్నించినను కుదురదు. ఈసర్వదేహసంబంధిజ్ఞానము సర్వదేహవ్యాపి యగుత్వగింద్రియమునకువలె సర్వదేహవ్యాపి యగు జీవునకు గలుగుచున్నదో ఆకాశమువలె నంతటనిండి దేహముతోఁ గూడ సంబంధపడి దాని (దేహమును) నంతటను వ్యాపించి యున్నయాత్మకే గలుగుచున్నదో లేక మీ రన్నట్లు అణువై చందనబిందువువలె నొక్క స్థలముననే యున్నయాత్మకే కలుగుచున్నదో యెట్లు నిర్ణయింపఁ గలము. ఈకారణమువలన మీసిద్ధాంతము యుక్తము కాదు.'' అనిన సరిపడదు.

సిద్ధాంతము:—శ్రుతి యీవిషయమును ("జీవుఁ డణువు" అను విషయమును) బాగుగ నంగీకరించి యుండుటచే పైన జూపఁబడినసంశయ మెట్లును కలుగదు. ఈవిషయ మిదివఱకే నిర్ణయింపఁబడి యున్నది. అణు వైనచో నేదియో యొక్కస్థలమున మాత్రమే యుండవలయు ననుట సర్వసమ్మతమే. ఈవిషయమును కూడ శ్రుతియే నిర్ణయించుచున్నది. జీవుఁడు హృదయమున నున్నాఁ డని చెప్పుచున్నది. "హృది హ్యేష ఆత్మా స వా ఏష ఆత్మా హృది కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృ ద్యంత ర్జ్యోతిః పురుషః"="ఆత్మ హృదయమున నున్నాఁడు. ఆయాత్మ హృదయమునందే యున్నాఁడు. పరమేశ్వరుఁడును నేను అనువాఁడును ఇరువురు లోకమునఁ గానవచ్చుచున్నారు. ఇం దాత్మ యెవ్వఁడు? ప్రాణమధ్యమున హృదయమున నిలిచి యెవ్వఁడు స్వప్రకాశరూపముతోఁ బ్రకాశించుచున్నాఁడో వాఁడు" అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. కావున జీవుం డణు వనియు నొకస్థలమున నున్నాఁ డనియు ఒక్క స్థలముననే యున్నను చందనబిందువు సర్వశరీరమునకు నాహ్లాదమును కలిగించునట్లు సర్వశరీరమునందును, కలుగుశైత్యాదుల నెఱుంగుచున్నాఁ డనియు చేసిన సిద్ధాంతము నిర్దోష మైనదియే.

## సూత్రము. ౨౫.

అవతారిక:—“ఇప్పటికిని జందనబిందుదృష్టాంతము యుక్తియుక్తము కానేరదు. చందనబిందు వెంత యల్పమైనను దానికి నవయవములు కలవు. కావున నాడీద్వారములగుండ దానిసూక్ష్మావయవములు శరీరమునం దంతటను వ్యాపించి యాహ్లాదము కలిగింపవచ్చును. జీవునకు నట్టియవయవములు లేవు కదా! వీనికి సర్వశరీరసంబంధిశైత్యాధిజ్ఞాన మెట్లుకలుగును?” అనిన దీని నంగీకరించి తనసిద్ధాంతమును పూర్వపక్షి మఱియొకవిధముగ సమర్థించుచున్నాఁడు.

పూర్వసూత్రము:—

## ౨౪౨. గుణాద్వా లోకవత్. ౨. 3. ౨౫.

తాత్పర్యము:— కేవలము పై దృష్టాంతము నాశ్రయించియే మేమీసిద్ధాంతమును చేయవలసినపని లేదు. అల్పపరిమాణముకలవియయ్యును అవయవములు లేనివయ్యును అనేకపదార్థములు తమగుణముచే విశేష ప్రదేశము నాక్రమించుచున్నవి. ఇనుట లోకానుభవసిద్ధమై యున్నది. ఒకగృహమున నొక్కస్థలమున మాత్రమే దీపము నుంచినను దానికాంతి నలుగడల వ్యాపించుచున్నది. ఒకరత్నము నొక్కస్థలమున నుంచినను దానిప్రకాశము అన్నివైపుల నాక్రమించుచున్నది. ఇట్లే జీవుఁడు కూడ నల్పపరిమాణము గలవాఁడై యొక్కస్థలముననే యున్నను ఆతనికిఁ గల జ్ఞానశక్తిమాత్రము శరీర మంతయును వ్యాపింపవచ్చును.

## సూత్రము. ౨౬.

అవతారిక:—“ఇదియు యుక్తియుక్తము కాదు. గుణముగలవానిని విడిచి గుణము స్వతంత్రముగ భిన్నప్రదేశమున నుండదు. వస్త్రమునం దున్న తెలుపు వస్త్రమును విడిచి మఱియొకస్థలమున నుండుట యెందైనను ప్రత్యక్షముగ నున్నదా? అనుమానముననైనను గోచరమగుచున్నదా? ‘దీపకాంతులకువలె నీస్థితి సంభవింపవచ్చును. దీప మొకచోట నున్నను దానిగుణ మగుకాంతి నలుగడల నున్నది కదా’ యనుట యుయుక్తియుక్తము కానేరదు. కాంతి యనునదియు పదార్థమే. (ద్రవ్యమే) కాని గుణము కాదు. తేజోభూతముయొక్క అవయవములు దట్టముగ

గూడిన దీప మనియు పలుచగ నుండిన కాంతి యనియుఁ జెప్పఁబడును. కావున నెట్లును మీదృష్టాంతము యుక్తియుక్తము కాదు" అనినఁ బూర్వ పక్షి మఱియొకదృష్టాంతముచేఁ దనసిద్ధాంతమును స్థాపించుకొను చున్నాఁడు.

## ౨౪౩. వ్యతిరేకో గంధవత్. ౨. ౩. ౨౬.

తాత్పర్యము:—ఈయాక్షేపముతగదు. అన్నిగుణములును రూప మువలె గుణినివిడువక యే యుండ నక్కఱ లేదు. సుగంధ దుర్గంధములు గుణము లేయైనను తమ కాశ్రయ భూతము లగు ద్రవ్యముల విడిచి స్వతం త్రముగనే వ్యాపించుచుండుటను ప్రత్యక్షముగఁ జూచుచున్నాము. పుష్పా దిపదార్థము లెంతదూరముననో యుండఁగనే వానివాసన మనసమీపము నకు వచ్చుచున్నది యనుట యనుభవసిద్ధమే యైయున్నది. యిట్లే జీవు డును అణుమాత్రుఁడే యైనను ఆతనిగుణ మగుజ్ఞానము దేహమంతటను వ్యాపింపవచ్చును. కావున మాసిద్ధాంతమునకు భంగము లేదు.

పూర్వపక్షము:—ఇట్లుకాదు గుణము లెప్పటికిని తమయాశ్రయ మును విడచిస్వతంత్రముగ నుండవు. ఈవిషయము యేగుణమునుగూర్చి విచారించినను స్పష్ట మగుచునే యున్నది. దీనిబలము నాశ్రయించి లేని స్థలములందు (లేదని తలంపఁబడు స్థలములందు) గూడ నీస్వభావమును(ఆ శ్రయమునువిడువకుండుట యను స్వభావమును) అనుమాన ప్రమాణము చేనైనను కలిపింపవలయును. సమానజాతి గలవానిలో నొక్కదానినె మాత్రము భిన్నస్వభావము కలదానినిగాఁ బరిగణింపఁబోవుట యుక్తి యుక్తము కానేరదు కదా. వాస్తవస్థితిలో బాగుగ విచారించి చూచిన సుగంధదుర్గంధములు స్వతంత్రముగా వానియాశ్రయములను విడిచి వెలికి వచ్చుట లేదు. ఆగంధమునకు నాశ్రయము లగునతిసూక్ష్మము లైన పరమాణువులే ఆయాపుష్పాదిపదార్థములనుండి వాయువశమున వెలికి వచ్చి నలుగడలఁ బ్రసరించుచున్నవి. అవి యతిసూక్ష్మము లగుటచేతను వానివియోగకాలమునకు సరిగా నితరపరమాణువులు (పదార్థమునందు) చేరుచుండుటచేతను మూలపదార్థమునందు (గంధపరమాణువులకు నాధార మగుపుష్పాదిపదార్థసమూహమునందు) మార్పేమియుఁ గలుగదు. ఈకార ణమువలన గంధము కూడ వెలికి వచ్చునప్పుడు తన కాశ్రయభూతము

లగుపరమాణువులతో జేరియే వచ్చుచుండుటచే మీసిద్ధాంతము నిలువదు. స్వతంత్రముగ ప్రసరించు స్వభావము గుణమునకు బొత్తుగ లేదు.

సిద్ధాతము:—ఇట్లుఁ జెప్పుటకు వీలు లేదు. ఒకగుణమునకు నొక స్వభావము కల దనినంతమాత్రమున సమాన జాతీయము లగు నన్నిటికి నదియేస్వభావ ముండవలయు నని నియమ మెందును లేదు. రసమునకు (రుచికి) నాలుకచే గ్రహింపఁబడుస్వభావము కలదు కదా యని రూపాదులకుఁ గూడ నట్టిస్వభావమే కలుగవలయు నని సాధించుటకు వీలు కలదా! కావున ననుభవవిరుద్ధముగ నేవిషయమునుఁ గాని సిద్ధాంతముఁ జేయఁదలంచుట వెఱ్ఱితనము. విచారింపుడు. గంధము పరమాణువులతోఁ గూడియే వెలికి వచ్చునేని యప్పుడు మూలపదార్థము క్రమక్రమముగ క్షీణింపవలసి వచ్చును. అతిసూక్ష్మ మగుటచే నొకవేళ నాశయము గానరాకున్నను మొట్టమొదట నున్న బరువు మొదలగునవి యైనను తగ్గిపోవలయును. అప్పు డనుమానముచే క్షయము నూహింపగలుగుదుము కదా! మఱియుఁ బరమాణువులే గంధములకు నాశ్రయము లైనచో నది (గంధము) ప్రత్యక్షమే యగుటకు వీలు లేదు. "నాకు విశేషముగ సువాసన వచ్చుచున్నది" అను ననుభవము లోకమున నుండఁగూడదు. పరమాణువులయం దున్నరూపాదులు నేత్రాదీంద్రియములకు గోచరములు కా నప్పుడు గంధ మొక్కటి మాత్రము ఘ్రాణమునకు గోచర మగు ననుట యెట్లు? ఇది లోకవిరుద్ధము కదా! కావున "గంధపరమాణువులు వాయువశమున నెగిరి పోయినను మూలపదార్థములకు నాశము సంభవింపదు" అని ప్రయత్నపూర్వకముగ సిద్ధాంతము చేసినను ప్రయోజనము లేదు. "గంధపరమాణువులు నాసికారంధ్రమును ప్రవేశించినప్పుడు వాని పరమాణువులుగా నెఱుంగలేక 'నాకు వాసన వచ్చుచున్నది' అని లోకులు భ్రాంతి నొందుచున్నారు" అని సిద్ధాంతముఁ జేయుటకును వీలు లేదు. పరమాణువు లింద్రియగోచరము లగుకా వనుట సర్వవాదసమ్మతము కదా. ఇది యంతయుఁ గాక రూపాదులు ప్రత్యక్షము లైనప్పుడు "నేను తెలుపును చూచుచున్నాను" అని యెవడును చెప్పుట లేదు. "నేను తెల్లని పదార్థముఁ జూచుచున్నాను" అని దానినాశ్రయముతో (తెలుపుయొక్క నాయాశ్రయముతో) గూడనే ప్రతివాఁడును వ్యవహరించుచున్నాఁడు. గంధ

విషయమునమాత్ర మిట్టివ్యవహారము లేదు. ప్రతివాదును "నాకువాసన వచ్చుచున్నది. నేను పుష్పగంధము నాఘ్రాణించుచున్నాను"అనిమాత్రమే చెప్పుచున్నాఁడు కాని "నా నాసికయందు గంధపరమాణువులు ప్రవేశించి నవి. నేను గంధపరమాణువులను ఆఘ్రాణించుచున్నాను" అని చెప్పుట లేదు. కావున గంధమునకును తక్కినగుణములకును భేద మనంతముగ నున్నది. అందఱును లోకానుసారముగ దేనిస్వభావమును దానికి నంగీక రింపవలయునే గాని యందు స్వప్రజ్ఞను జూపుటకు వీలు లేదు. కావున నెట్లును మామతమునకు హానిరాదు. గంధదృష్టాంతము మిగుల యుక్తి యుక్త మగుటచే నాగంధమువలెనే జీవుని జ్ఞానముకూడ జీవవ్యతిరిక్తముగ సర్వదేహమునందును వ్యాపింపవచ్చును.

## సూత్రము. ౨౭.

అవతారిక:—పై సిద్ధాంతమునకుఁ బ్రమాణముగ శ్రుతిసిఁ గూడ పూర్వపక్షి చూపుచున్నాఁడు.

## ౨౮౪. తథా చ దర్శయతి. ౨. ౩. ౨౭.

తాత్పర్యము:—పైసిద్ధాంతమునకు శ్రుతియు మిగుల నను కూలముగ నున్నది. జీవునకు నణుపరిమాణము కల దనియు హృదయము నివాసస్థాన మనియు శ్రుతి యంగీకరించి యున్న దని యిదివఱకే నిరూ పించి యున్నాము అట్లంగీకరించియు "ఆత్మానపశ్యావ ఆలోమభ్య ఆన ఖాగ్రేభ్యః"="మేమిరువురమును గోళ్లతోను వెంట్రుకలతోను గూడ చూచితిమి" అని యాత్మకు సర్వవ్యాపకత్వము చెప్పియున్నది. కావున నిది జ్ఞానమును గూర్చినదియే యై యుండవలయు నని తోఁచుచున్నది. లేకున్న బరస్పరవిరోధము సంభవించుటచే శ్రుతి యప్రమాణము కావ లసి వచ్చును కదా! కావున నెట్లు చూచినను మామతమునకు విరోధము రాదు; జీవుఁ డణువే యాతని జ్ఞానముమాత్రమే సర్వశరీరమును వ్యాపించు చున్నది.

## సూత్రము. ౨౮.

అవతారిక.—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. పై నుదహరింపఁ బడిన శ్రుతి జీవసర్వ[illegible] వ్యాపకత్వమును చెప్పినది. [illegible]? అనిన

నప్పటికిని మాపక్షమునకు విరోధము గలుగదని పూర్వపక్షి శ్రుత్యంత రోదాహరణ పూర్వకముగా సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౪౫. పృథగుపదేశాత్. ౨. ౩. ౨౮.

తాత్పర్యము:—మాపక్షమున శ్రుతుల కేమియుఁ గొదువ లేదు. పై నుదహరించిన శ్రుతిని మాత్రమే గ్రైకొని సంశయ యుక్తముగ సిద్ధాంతముఁ జేయ నక్కఱ లేదు. ఇతర శ్రుతులయం దీవిషయము జీవజ్ఞానము మాత్రమే సర్వవ్యాపకమై యున్నది (యనువిషయము) స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య తత్ దేహం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ"="జీవుఁడు జ్ఞానముచే శరీరము నాక్రమించి జీవుఁడు యింద్రియములందు గలజ్ఞానశక్తిని తనవిజ్ఞానముచే గ్రహించి" అను మొదలగువాక్యములయందు జీవుఁడు కర్త యనియు శరీరమును వ్యాపించుట మొదలగు కార్యములయందు ఆతనికి తనగుణ మగుచైతన్యము సాధన మనియు స్పష్టముగ బోధింపఁబడియున్నది. యిట్లుండ జీవుఁడణురూపుఁడైనను సర్వదేహసంబంధు లగు శైత్యాదుల నెఱుంగుట జ్ఞానవ్యాప్తివలనఁ గలుగు ననుటలో సంశయ మేమి? యీకారణము వలన మాపక్షమే మిగుల యుక్తియుక్తమైనది. మీరును మాపక్షమునే యాశ్రయించి జీవసర్వవ్యాపకత్వమును గూర్చి చెప్పునట్లు కానవచ్చు శ్రుతుల బ్రహ్మపరములుగా సమన్వయించిన సరి లేకున్న మీపక్షమునందు శ్రుతివిరోధము దుర్నివారమై వచ్చును.

## సూత్రము. ౨౯.

అవతారిక:—ఇట్లు వచ్చిన పూర్వపక్షమును ఖండించి సూత్రకారుఁడు "జీవుఁడు మహత్పరిమాణము కలవాఁడు" అనువిషయమును నాల్గు సూత్రములచే స్థాపించుచున్నాఁడు.

## ౨౪౬. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్. ౨. ౩. ౨౯.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్తమైనది కాదు. భూతాదులయొక్క యుత్పత్తినిఁ గూర్చి చెప్పునప్పుడు వేదము జీవోత్ప

త్తినిఁ జెప్పలేదు. మఱియు పరమేశ్వరుఁడే స్వస్వరూపముతో ప్రపంచము నందుఁ బ్రవేశించి జీవశబ్దముచేఁ బిలువఁబడుచున్నాఁడని చెప్పుచున్నది. ఇట్లుండ పరస్పరము సభిన్నులగు జీవబ్రహ్మములు భిన్నప్రమాణములు కలిగియుండు రనుట యెట్లు? బ్రహ్మము సర్వవ్యాపకమై యున్న జీవుఁ డణు వగుట యెట్లు? శ్రుతివాక్యముల విమర్శించిన జీవబ్రహ్మములకుఁగల పరిమాణము సమానమే యగుచున్నది. "మహా నజ ఆత్మా యో యం విజ్ఞానమయః ప్రాణేషు" అను మొదలగు శ్రుతు లన్నియు నీవిషయమునఁ బ్రమాణములు. మీమతము ననుసరించి సిద్ధాంతము చేసిన జీవబ్రహ్మభేదమును చెప్పు బహుశ్రుతులకు విరోధము వచ్చును. కావున జీవుఁడు సర్వవ్యాపకుఁ డనియే సిద్ధాంతము చేయుట యుక్తము.

"జీవుఁడు అణుమాత్రరూపుఁడు" అని చెప్పునట్లు కానవచ్చుశ్రుతు లన్నియు సగుణోపాసనములయందు ఆయాయుపాధుల నాశ్రయించి నిర్వికారునకుఁ గూడ నొకవిధ మగురూపమునుఁ బరిమాణమును గల్పించుశ్రుతులవలె నుపాధిభేదము నాశ్రయించియే చెప్పుచున్నవి. ఆకాశ మొక్కటయ్యును ఘటాదులయందు నిలచి ప్రత్యేకముగ వ్యవహరింపఁ బడునట్లు పరమేశ్వరుఁడు నొక్కఁడయ్యును బుద్ధులలో నిలిచి జీవశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఆబుద్ధిచేతనే సర్వవ్యవహారముల నాచరించుచు శరీరమును నియమించుచున్నాఁడు. కర్తృత్వము భోక్తృత్వము కామక్రోధాదులు మొదలగునవి యన్నియు నాత్మకు బుద్ధిసంబంధమువలన వచ్చినవియే?నిత్యముక్తుఁడై యున్న యాతఁడు సంసారియైనది బుద్ధివలననే. విచారించిన నీగుణము చేతన యగుటచే బుద్ధికిఁ గాని నిరంజనుఁ డగుటచే కేవలాత్మునికినికిఁ గానికలుగవు.అయినను పరస్పరాధ్యాసమువలన గలుగుచున్నవి యనియు జీవునియం దారోపింపఁబడుచున్న వనియు' తెలిసికొనవలయును. ఈవిధముగ బుద్ధిగుణములే యాత్మకు ప్రధానములు కావునఁ బరిమాణము కూడ నట్లే చెప్పఁబడి యున్నది. బుద్ధి యణుపరిమాణము కలది కావున జీవునకుఁ గూడ నదియే పరిమాణము చెప్పఁబడినది. బుద్ధి దేహమునుండి యుత్క్రమించును కావున జీవునకుఁ గూడ నుత్క్రమణము చెప్పఁబడియున్నది.ఉత్క్రమణములేకున్న గమనాగమనములుసంభవింపవు కావున నవియు జీవునకు సంబంధించినవి కా వనుట స్పష్టమే. కావున మీవాదముల భ్రాత్మగనే నిలుచును. ... జీవుని ... సాధిం

చుటకై చూపినవాక్యములే పై జెప్పినవిషయమును ("జీవునకుఁ జెప్పఁబడిన యణుపరిమాణము తదుపాధి యగుబుద్ధికి సంబంధించినదియే" యనువిషయమును) తెలుపుచున్నవి. యెట్లనిన—

"వాలాగ్రశతభాగస్య" అనువాక్యమునందు మొట్టమొదటఅణుత్వము చెప్పఁబడినను కడపట "స చానంత్యాయ కల్పతే"="ఆ జీవుఁడు ఆద్యంతములు లేనివాఁడుగాఁ గూడ నున్నాఁడు" అని చెప్పఁబడియున్నది. మాపక్షము నవలంబించి ఉపాధిపరిమాణము నాశ్రయించి యణుత్వము చెప్పఁబడె ననియు స్వాభావిక మైనది సర్వవ్యాపకత్వమే యనియుఁ జెప్పిననే యావాక్యమునకు నర్థము కుదురును కాని మఱియొక విధముగఁ జెప్పినఁ గుదురదు. వేదాంతమంతయు నేకవాక్యముగ జీవబ్రహ్మాభేదమును స్థాపించుచున్నది యని సమన్వయాధ్యాయమునందే నిరూపించియున్నాము కదా! ఇట్లుండ నణుపరిమాణమే జీవునకు స్వాభావిక మగుట యెట్లు? రెండును స్వాభావికములే కావచ్చు ననుటయు పరస్పరవిరుద్ధము కదా? కావున నెట్లును ఈ శ్రుతి మాపక్షమునకే యనుకూల మై యున్నది. మఱియు "ఆరాగ్రమాత్రః"="ములుకోలయొక్క కొనయంత ప్రమాణము జీవునకు గలదు" అని చెప్పువాక్యమున పూర్వభాగమునందు "బుద్ధేర్గుణేన" = "ఆసూక్ష్మపరిమాణము బుద్ధిగుణముచే (పరిమాణముచేఁ) గలిగినది" అని నిస్సంశయముగనే చెప్పఁబడియున్నది. వీని నాశ్రయించి "ఏషో ఽణురాత్మా" అనుశ్రుతికిని అర్థము చెప్పవలయును. వాస్తవస్థితిలో నీవాక్యము జీవపరిమాణమునుగూర్చి చెప్పు సందర్భమున లేదు. జీవస్వరూపపరిజ్ఞానము చెప్పుసందర్భమున నున్నది. అణుపరిమాణంబును బహుశ్రుతుల విమర్శించిన జీవునకుసంభవింపదు. ఈకారణముల వలన నీశ్రుతియందలి యణుపదమునకు "ఇంద్రియములకుఁ గోచరుఁడు కాకపోవుటచేతను మనశ్శుద్ధివలనమాత్రమే గోచరుఁ డగుటచేతను జీవుఁడు అణువువలె గ్రహింప నశక్యమైనవాఁడు" అని కాని "ఉపాధి యగుబుద్ధి యణువు కావున జీవుఁడును తత్సంబంధమువలన నణువు" అని కాని యర్థమగును. "ప్రజ్ఞయా శరీరం" అను మొదలగు జీవబుద్ధిభేదశ్రుతులకును పై సిద్ధాంతము ననుసరించియే "ఉపాధిభూత యగుబుద్ధిచే శరీరము నాక్రమించి" యనియే యర్థము చెప్పవలయును. ఇట్లు కాకున్నను "శాతిబొమ్మయొక్క దేహము" అనుమొదలగు వ్యవహారములయందువలె శిష్యు

లకు తెలియుటకై యూరక (బోధనాసౌకర్యమునకై లోకానుసారముగ) నట్లు చెప్పఁబడె నని యైనను నిరూపింపవలయును. జ్ఞాన మనునది జీవునకు స్వరూపమే కాని గుణము కాదని బూర్వాధికరణమునందే నిరూపించి యున్నాము కదా! దీనిని బట్టి విచారించిన "జ్ఞానము దేహమంతటను వ్యాపించును. జీవుఁడు మాత్ర మణుస్వరూపుఁడై దేహమున నొక్కభాగమునందే యున్నాఁడు" అనుటయే సంభవింపదు. కావున నెట్లును జీవవిషయమునఁ గానవచ్చు నుత్క్రాంత్యాదు లన్నియు బుద్ధిసంబంధము నాశ్రయించి చెప్పఁబడినదే. "కస్మి న్నహ ముత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామికస్మిన్ ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామీతి స ప్రాణ సృజత"="ఏపదార్థ మీశరీరముననుండి నిర్గమించిన నేను నిర్గమింతును? ఏది యిందు నిలచిన నేను నిలుతును" అని విచారించి పరమేశ్వరుఁడు సూక్ష్మశరీరరూప మగు బుద్ధిని సృజించెను. అని యీవిషయము శ్రుతియందు స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. కావున నెట్లును జీవుఁ డణుపరిమాణము కలవాఁడు కానేరఁడు.

ఇట్లు మీపక్షమునందు గలశ్రుతిబల మెల్లను నిర్మూలము చేయఁబడెను. కొంత విచారించిన యుక్తియు నట్టిదే యగును. జీవుఁ డణుమాత్రుఁ డయ్యెనేని సర్వశరీరసంబంధు లగుశైత్యాదులు అనుభవమునకు రాకపోవలసి వచ్చును. వానికి త్వగింద్రియముతో సంబంధ మున్ననూ ప్రయోజనము లేదు. ఆతఁ డెచ్చట నున్నాఁడో యచ్చట జనించు శైత్యాదులుమాత్రమే తెలియఁబడవచ్చునుకాని తక్కినవి తెలియఁబడకూడదు. "చర్మము సర్వదేహమునందును వ్యాపించియున్నది కావున నట్లు తెలియఁబడవచ్చును" అనుటయు విరుద్ధమే. అప్పుడు కాలికి ముల్లు గుచ్చుకొనిన నాబాధ సర్వశరీరమునందు నుండవలసివచ్చును? చర్మము దేహమంతటను వ్యాపించియే యున్నది కదా! ఇది యనుభవవిరుద్ధము. కావున నొక గొప్ప పదార్థమునకు చిన్నపదార్థముతో సంబంధము కలిగినప్పుడు అన్ని యనుభవములును చిన్నపదార్థము ననుసరించియే యుండును కాని గొప్ప పదార్థమును కాదు. కావున జీవుఁ డణు వగునేని యాతని ననుసరించియే దేహమున నొకానొక ప్రదేశమునందు మాత్రమే శైత్యాదిప్రత్యక్షము కలుగవలయును కాని యంతటను కలుగఁగూడదు. "జీవునికి యుపాధి యై యున్నబుద్ధి మీమతమునందును [illegible] సర్వవ్యాపారములును

దాని నాశ్రయించియే యున్నవి కదా! జీవుఁడు సర్వవ్యాపకుఁ డైనను బుద్ధి లేక నేకార్యమును గూడ చేయలేనివాఁ డగుటచే పైనచూపఁబడినదోషములు మీామతమునందును వచ్చును" అనియెద వేమొ యది యుక్తము కాదు. వాస్తవస్థితిలో బుద్ధి యచేతనము ; దానికిని జీవప్రవేశమువలననే చైతన్యము కలుగవలయును. జీవుఁ డన్ననో జ్ఞానస్వరూపుఁడు. స్వతంత్రుఁడు ఇట్లగుటచే నాతఁడు బుద్ధియందును దేహమునందును గూడ వ్యాపించి యుండును. దేహమునందు గలుగుసర్వవిశేషముల నెఱుంగుచుండును. బుద్ధియు చర్మముతో సంబంధపడి జీవప్రకాశముచే నాక్రమింపఁబడి యున్నది కావుననల్పపరిమాణము గల దైనను సర్వమును గ్రహించును. జీవుఁడు సర్వజ్ఞుఁడు కదా. "ఇట్లయినఁ బ్రతివానిబుద్ధియు లోకవార్తల నన్నిఁటినెఱుంగవలయును. జీవుఁడు సర్వప్రపంచమునందు నేకరూపము తోనేయున్నాఁడు కదా!" అనియెద వేమో? అట్లు కాదు. జీవుఁ డొక్కఁడే యైనను కర్మవాసనాద్యనుసారమున బుద్ధుల నేకములు. కావున వానికి తా మాశ్రయించియున్న దేహమునకు సంబంధించిన విషయముల మాత్రమే గ్రహించుటయందు సామర్థ్యము కలదు గాని సర్వవిషయగ్రహణము నందు లేదు. ఈకారణమువలననే లోకులు ఆత్మపరభేదము నెన్నుచున్నారు.

మఱియు "గుణము తనయాశ్రయమును విడిచి స్వతంత్రముగఁ బ్రసరించును" అనుటయు యుక్తియుక్తము కాదు. చందనబిందుదృష్టాంతము పూర్వముననే ఖండింపఁబడెను గదా! ఇఁక ప్రకృత విషయమును గూర్చి విచారింతము. గుణమునకు నొకదాని నాశ్రయించి యుండుటయే స్వభావము. ఆస్వభావమును విడిచిన నది గుణమే కాకపోవును. "గుణాశ్రయము లగుపరమాణువులు వెలికి వచ్చిన పదార్థము క్షీణింపవలయును. పరమాణువు లతిసూక్ష్మము లగుటచే సందున్నగుణంబును ఇంద్రియగోచరము కాకూడదు." అనుటయుఁ జెల్లదు. పరమాణువులు సర్వవ్యాపకము లగుటచే కొన్ని బోయిన మఱికొన్ని యందు జేరుచు నుండును; పదార్థమును పూర్తి చేయుచు నుండును. లోకమున గంధవంతము లగుపుష్పాదులు చిరకాల ముండినచో వానియందలి గంధము నశించిపోవుటను ప్రత్యక్షముగఁ జూచుచున్నాము కదా! దీనికిఁ గారణ మేమి? క్రమక్రమముగ గంధగుణాశ్రయము లగుపరమాణు

వులు వాయువశమున నలుగడలకుఁ బోవుటయే ; శ్రోత్రపరమాణువులు వచ్చి ద్రవ్యమును పూరించుటయే కదా ! మఱియు నాపరమాణువు లతి సూక్ష్మము లైనను గుణములయొక్క యాధిక్యముచేఁ బ్రత్యక్షగుణజ్ఞానము కలుగవచ్చును. ఒక్కగుణమువలెనే యన్నిగుణములు నుండవలయు ననునియమము కూడ లేదు. నీరు నేలలో గలసి యున్నప్పుడు గాని మంచు కురియుచున్నప్పుడు గాని శీతస్పర్శ మాత్రమే స్పష్టముగ ప్రత్యక్షమగును గాని రూపముఁ ప్రత్యక్షము కాదు కదా ! ఇట్లే గంధము ప్రత్యక్ష మైనను అందలిరూపము ప్రత్యక్షము కా కుండవచ్చును. రూపములకు కావలసినపరమాణు సన్నివేశమునకంటెఁ గంధమునకు గావలసిన పరమాణసన్నివేశము భిన్నముగనే యుండవచ్చును. ఈకారణమువలన పరమాణువు లతిసూక్ష్మము లైనను గంధప్రత్యక్షమునకు హాని లేదు. ఇట్లగుటచేతనే "నాకు వాసన వచ్చుచున్నది" అను మొదలగులోకప్రసిద్ధిని మాత్రమే యాధారముచేసి సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. ఇంతయేల? జ్ఞాన మనునది జీవునకు గుణమే కానేర దనిన నిక నందు భేద మెట నుండి వచ్చును ; స్వభావ మెప్పు డైనను తనయాశ్రయమును విడిచి పోవు ననుట సంభవించును; స్వభావ మనఁగా; తనయునికి; దానికి నాశ్రయము తానే. ఇట్లుండ తన్ను తానే విడిచి పోవు ననుట సంభవించునా? కావున బాగుగ విచారించిన జ్ఞానము వ్యాపించు ననినను జీవుఁడు వ్యాపించు ననిన నొక్కటియే యగును. ఇట్లుండ నిరర్థకముగ జీవజ్ఞానభేదమును సాధించి సిద్ధాంతము చేయుటకు (జీవుఁడు అణుమాత్రుఁడని సిద్ధాంతము చేయుటకు) నంతప్రయాస యేల ? మఱియు జీవుఁడు గాని జ్ఞానము కాని దేహసమానపరిమాణముగ నుండుటకు వీలు లే దని జైన మతఖండమునం దే నిరూపింపఁబడెను. కావున విమర్శించిన జీవుఁడు సర్వ వ్యాపకుఁ డనుటయే సిద్ధాంత మగును. శ్రుతియందు ఆతనినిగూర్చి చెప్పఁబడి యున్నహృదయాదిస్థానములును బుద్ధి నాశ్రయించి చెప్పఁబడినవియే ? బుద్ధికి నివాసస్థానము హృదయమే యని తెలిసికొనవలయును. ఎట్లు చూచినను మాసిద్ధాంతమునకు భంగము లేదు ; జీవనిత్యత్వశ్రుతులకును అణుత్వశ్రుతులకును పైన వర్ణించినవిధముగా జూచిన విరోధము రాదు.

## సూత్రము. ౩౦.

అవతారిక:—"బుద్ధిజీవులకు సంబంధ మెప్పటికి నుండునెడల వివాదము యథార్థ మగును కాని యది యట్లుండుటకు వీలు లేదు. 'సంయోగాశ్చ వియోగాంతాః'='సంయోగము గలపదార్థములకు నెప్పటికైనను వియోగము నియతముగఁ గలుగును' అనున్యాయము ననుసరించి యీజీవబుద్ధులకు నెప్పటికైనను వియోగము కలుగవలసివచ్చును. అట్లు వియోగము కలుగునేని యప్పు డాత్మను గ్రహించుటకే వీలు లేకపోవుటచే నాతండు శూన్యరూపుఁడైనను కావలసివచ్చును లేక సంసారి యైనను కాకపోవలసి వచ్చును. అప్పుడు ఆకస్మికముగనే బుద్ధిసంయోగముతో నున్నప్పుడు చేయఁబడినకర్మము లన్నియు ఫలము నొసంగకయే నశించు ననవలసి వచ్చును. మఱియొకదేహమున మఱియొకప్పుడు బుద్ధి సంయోగము కలిగినప్పుడు క్రొత్తఫలము లూరకయే జనింపవలసి వచ్చును. ఇవి రెండును విరుద్ధములే కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౪౭. యావదాత్మ భావిత్వాచ్చ న దోష స్తద్దర్శనాత్. ౨. ౩. ౩౦.

తాత్పర్యము:—పైన జూపఁబడినదోషము మామతమున రాదు. ఆత్మకు జీవత్వ మెంతవరకు నుండునో యథార్థజ్ఞానమువలన భ్రాంతిజ్ఞాన మెంతవరకు నశింపకుండునో యెంతవరకు సంసారమునందలి యభిమానము తొలంగకుండునో అంతవరకు బుద్ధితోఁ గలసంయోగము పోవదు; పోయినపిదప నది మఱల రాదు. ఘటాకాశమనఁగా నేకరూప మగునాకాశమునందు ఘటోపాధిచేఁ గల్పింపఁబడినభేదము మాత్రమే యైనట్లు జీవుఁడనఁగా నేకరూప మగుపరబ్రహ్మమునందు బుద్ధ్యుపాధిచేఁ గల్పింపఁబడినభేదము మాత్రమే యైయున్నాఁడని యిదివరకే చెప్పియున్నాము. వాస్తవస్థితిలో నీతఁడును నిత్యముక్తుఁడే యనియు సంసారము మొదలగునవి లేనివాఁడే యనియుఁ బూర్వముననే నిరూపించి యున్నాము. వేదాంతవాక్యముల బాగుగ విమర్శించిన పరమేశ్వరునికంటె భిన్నుఁడగుచేతనుఁడే కానరాఁడు. ''నాన్యోఽతో ఽస్తి ద్రష్టా నాన్యోఽతో

స్తి శ్రోతా॥="ఈజీవునికంటె భిన్నముగ వినువాఁడు కాని చూచువాఁడు కాని లేఁడు" అనుమొదలగువాక్యము లీవిషయమును స్పష్టము చేయుచున్నవి. కావున సంసారిత్వమే బుద్ధిసంయోగమువలన కలిగినబుద్ధిగుణసంబంధమే (బుద్ధిగుణము లగుకామక్రోధాదులతో సంబంధమే) జీవునకుఁ గలజీవత్వము. ఈకారణమువలన జీవత్వము నశించినప్పుడు మోక్షము కలిగినప్పుడు స్వస్వరూపవిజ్ఞానము సంభవించినప్పుడు మాత్రమే బుద్ధిసంయోగము నశించును గాని మఱియొకప్పుడు నశింపదు. "నేను కర్మలను చేయుచున్నాను వానిఫలముల ననుభవించుచున్నాను" అను మొదలగుతలంపు లన్నియు నజ్ఞానకల్పితములు మాత్రమే యగుటచేతను వాస్తవస్థితిలో కర్తృత్వభోక్తృత్వములు జీవునకు లేకపోవుటచేతను స్వస్వరూపజ్ఞానము కలుగఁగానే సర్వము నశించును? కర్మలు తత్ఫలభోగములు నుండవు. కావున నెట్లును పైన చూపఁబడినదోషము మాసిద్ధాంతమున రాదు. బుద్ధిసంయోగము-వచ్చుచు బోవుచు నుండుస్వభావము కలది యగునేని యప్పుడు కదా మీరు చెప్పినదోషములు రావలయును. పూర్వబుద్ధినాశముతో పూర్వకర్మ నశింపవలయును; ఉత్తమబుద్ధిసంయోగముచే నపూర్వము లగుసుఖదుఃఖములు రావలయును. మాసిద్ధాంతమున నిట్టిది లేదు. కదా!

శరీరమునుండి నిర్గమించినప్పుడును ఆతనికి బుద్ధిసంబంధము పోవదు. బుద్ధినిష్క్రమణమే యతనినిష్క్రమణ మని యిదివరకే నిరూపించియున్నాము. ఈవిషయమునే శ్రుతి యిట్లు చెప్పుచున్నది. "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః స సమాన స న్నుభౌ లోకా వనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ" అని చెప్పుచున్నది. ఇచ్చటఁ విజ్ఞానమయుఁ డనఁగా బుద్ధిమయుఁ డని యర్థము. "విజ్ఞానమయో మనోమయః" అని మఱియొకసందర్భమునందు మనస్సుతోఁ గూడ విజ్ఞానశబ్దము పఠింపఁబడియున్నది కావున దానికి బుద్ధి యనియే యర్థము చెప్పుట యుక్తియుక్త మగుచున్నది. ఇట్లర్థముచెప్పిన "బుద్ధిసంబంధముచే దానిగుణములే తనగుణములును గలవాఁడు" అని తాత్పర్య మేర్పడును. "వాఁడు ధనమయుఁడు" అని చెప్పినప్పుడు "వానికి నెప్పటికిని ధనమే ప్రధానము" అనియే కదా తాత్పర్య మగును. ఇట్లు విజ్ఞానమయశబ్దమునకు నర్థము నిర్ణయింపఁబడినప్పుడు వాక్యమును సమన్వయిం

పంభోయిన "హృదయమధ్యమునఁ బ్రకాశరూపుఁడై బుద్ధ్యుపాధియం దున్న యేపురుషుఁడు కలఁడో ఆతఁడు (ఆబుద్ధితోఁగూడి యిహపరలోక ములయందు సంచరించును. స్వయముగ ధ్యానించువాఁడు కాకపోయి నను బుద్ధి ధ్యానము చేయునప్పుడు ధ్యానము చేయునట్లును అది (బుద్ధి) చలించునప్పుడు స్వయముగ చలింపకున్నను చలించుచున్నట్లును గానఁ బడుచుండును" అని యర్థ మేర్పడును. దీనివలన మృతినొందినప్పుడును జీవించునప్పుడును కూడ బుద్ధిసంబంధము జీవునకు వదల దనియు జీవుని యందు గానవచ్చుసర్వధర్మ లును బుద్ధికి మాత్రమే సబంధించినవి యనియు స్పష్టముగ దెలుచున్నది కదా. కావున నెట్టిమార్పు లున్నట్లు గానవచ్చినను జీవునకు జీవత్వవిముక్తి కలుగునంతవరకు బుద్ధిసంయోగము నశింపదనుట శ్రుతిప్రసిద్ధ మగువిషయమే యైనది.

ఇంతయేల ఈబుద్ధిసంయోగము భ్రాంతివలనకలిగినది యేయనుట నిస్సంశయము. ఏప్రమాణముచేత నైనను ఏయుక్తిచేత నైనను దీనిని "పరమేశ్వరునకు బుద్ధిసంయోగము కలదు" అనువిషయము నిరూపించు టకు వీలు లేదు కదా! ఇట్టిది జ్ఞానము కలిగినంతవరకు నివర్తింపకుండు ననుటలో సంశయ మేమి? యథార్థజ్ఞానము కలుగునంతవరకు భ్రాంతి యట్లే యుండు ననుటను గూర్చి వివాదము చేయువారుకలరా? మఱియు భ్రాంతి తొలఁగుటయే ముక్తి యగుటచే నాబుద్ధిసంయోగము ఒక్క మాఱు పోయినను మఱియొక్కమాఱు వచ్చు ననుటయు సంభవింపదు. ఏపదార్థమైనను ఒక్కమాఱు పోయిన మఱల రావచ్చునుగాని భ్రాంతి మాత్ర మట్టిది కాదు. ఒక్కమాఱు తొలఁగిపోయినపిదప మఱల రాదు. "మనము ఒక్క పదార్థమును జూచియే పలుమాఱు భ్రాంతి నొందుచు గూడ నున్నాము కదా" అనియెద వేమో? దీనికిని ప్రకృతవిషయమున కును భేదము కలదు. మనకు బుద్ధిసంయోగవిషయకభ్రాంతి పరమార్థ స్థితిలో నేమియు లేకున్నను "నేనును బుద్ధియు నొక్కటియే" అని తలంచుభ్రాంతి తొలఁగలేదు కావున నాబుద్ధియం దున్నసత్వరజస్త మోగుణభేదములవలన నట్లు కలుగవచ్చును. పరమేశ్వరుని విషయమున నట్లులేదు కావున (భ్రాంతి తొలఁగినపిదప బుద్ధిసంయోగముండదుకావున) నది (భ్రాంతి రెండవమాఱు కలుగుట) సంభవింపదు. ఈకారణమువలన ష్పుడు సంసారత్వము లేదు; కర్మఫలములయందలి వైషమ్యంబును

లేదు. సంసారమే నశించిన నిక గర్మలను గూర్చి చెప్పవలయునది యేమి? శ్రుతియు "త మేవ విది త్వాతిమృత్యు మేతి నాన్యః పంథా విద్యతేఽ యనాయ"="ఆపరమేశ్వరు నెఱింగిననే అజ్ఞానము నతిక్రమించును గాని ముక్తిని జెందునుగాని దీనికి రెండవమార్గము లేదు" అని చెప్పుచున్నది. కావున జ్ఞానముకలుగునంతవరకు నజ్ఞానకార్య మగుబుద్ధిసంయోగము నశింపదు. ముక్తి దొరకునంతవరకు బుద్ధి జీవుని విడువదు.

## సూత్రము. ౩౧.

అవతారిక:—"ఇప్పటికిని మీసిద్ధాంతము నిలువదు. మరణవిష యమున నెట్లో యొకట్లు సమర్థించినను సుషుప్తిప్రళయములను గూర్చి యెట్లు చెప్పుటకును వీలు లేదు. 'సతా సౌమ్య తదా సంపన్నో భవతి' ='శాంతుఁడా! జీవుఁడు సుషుప్త్యవస్థయందుఁ బరమేశ్వరునితో జేరును' అని శ్రుతియే చెప్పుచున్నది. దీనిని విమర్శించిన సుషుప్త్యవస్థయందుఁ బుద్ధిసంబంధము లేదని తెలియుచున్నది. ప్రళయమునందును వికారము లన్నియు బ్రహ్మమున లీనము లగు నని మీరే యంగీకరించి యున్నారు. బుద్ధియు వికారమే కావున నది యప్పుడు నశించునుకదా! ఈకారణము వలన ముక్తి కలుగునంతవరకు బుద్ధిసంయోగ మెల్లే యుండు నని చెప్పు టకు వీలు లేదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౪౮. పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తి యోగాత్. ౨. ౩. ౩౧.

తాత్పర్యము:—పై సూత్రమున చేసిననిర్ణయమునకు సుషుప్తి ప్రళయములను బట్టి విచారించినను భంగము కలుగదు. అందును సూక్ష్మ రూపముతో బుద్ధిసంబంధము కలిగియే యుండవలయును. లేకున్న క్రొత్తది యాకస్మికముగ జనించు ననుట విరుద్ధము కదా! లోకమున నిట్టిదృష్టాం తము లనేకములు గలవు. పురుషశక్తి యవ్వనమునందుమాత్రమే తెలియ వచ్చును కాని బాల్యమునందు తెలియరాదు కదా! ఇంతమాత్రమున నప్పుడు పురుషశక్తి లేదన వచ్చునా? అప్పుడు బొత్తుగనే లేకుండి యవ్వన మున మాత్ర మాకస్మికముగఁ గలుగునేని నపుంసకునకుఁ గూడ నట్లే కలుగవలసి వచ్చును. ఇది విరుద్ధము కదా! కావున నెల్లను లేనిది

మెప్పటికిని సంభవించుటకు వీలు లేదు కావున సుషుప్తిప్రళయముల యందుఁ గూడ బుద్ధిసంబంధ మాత్మకు కలదు. స్పష్టము కాకపోవుటచే లేదని లోకమున వ్యవహారము కలుగుచున్నది. ఈవిషయమున "సతిసంపద్య న విదుః సతి సంపద్యామహ"="జీవులు సుషుప్తికాలమునందు పరమేశ్వరునితో నేకీభవించినను ఆవిషయము నెఱుంగలేరు" అను మొదలగు శ్రుతి వాక్యములును ప్రమాణములు. బ్రహ్మప్రాప్తి కలిగినను దానిని తెలిసికొనలేకుండుట యజ్ఞానావరణమువలననే యనుటలో సంశయ మేమి? ప్రళయమునందు నిల్లే బ్రహ్మప్రాప్తి కలిగినను వారు తెలిసికొనలేకపోవచ్చును; అప్పుడును సుషుప్త్యవస్థయందువలె సూక్ష్మ నుగుబుద్ధ్యావరణ ముండవచ్చును. జాగ్రదవస్థయందు వలెనే పునస్సృష్టియందు నది యభివ్యక్తము కావచ్చును. కావున మాసిద్ధాంతమున లోపము లేదు.

## సూత్రము. 3౨.

అవతారిక:—"ఇంతే చెప్పనేటికి? మొట్టమొదట బుద్ధియొక్కటి కల దనుటయే యుక్తియుక్తము కాదు. జీవుని యుపాధియంతఃకరణమా లేక బుద్ధియా? అంతకరణమైన నది యనేకవిధములుగనుండుటచే జీవుఁడు ననేకవిధములుగ నుండవలసివచ్చును. వారందఱును స్వతంత్రులే కావున భేద మౌపాధికమే యైనను వ్యవహారమునఁ బరస్పరవిరోధము రావలసి వచ్చును.ఇక బుద్ధియే వానియుపాధి యనిన నది నిశ్చయరూపిణీమాత్రమే యగుటచే నెవ్వనికిని సంశయమే యుండకపోవలసి వచ్చును. ఇవి రెండును విరుద్ధములే. మఱియు బుద్ధ్యుపాధి నంగీకరించినను అది సర్వకాలముల యందును తుదకు సుషుప్త్యవస్థయందుఁ గూడ జీవునితో సంబంధించియే యుండుటచే సర్వకాలములయందును పదార్థజ్ఞానము కలుగుచునే యుండవలయును "కర్మపరిపాకభేదమువలన దానికి నొకప్పుడు సామర్థ్యముండి మఱియొకప్పుడు లేకపోవు ననినచో నాత్మకు నైన నింద్రియమున కైన నీస్థితి సంభవింపవచ్చును. ఇట్లుండ నడుమ బుద్ధి యొక్కటియుండవలసిన పని యేమి? కావున బుద్ధియే యక్కఱ లేదు; జీవునకు నది యుపాధియు కాదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

# ౨౪౯. నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసంగో ఽన్యతరనియమో వా ఽన్యథా. ౨. ౩. ౩౨.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. బుద్ధ్యంతఃకరణములు పరస్పరభిన్నములు కావు; అంతఃకరణము లచ్చటచ్చటఁ జూపఁబడుభేదములు వృత్తుల నాశ్రయించినవియే కాని పదార్థముల నాశ్రయించినవికావు. ఒక్క యంతఃకరణమునే సంశయరూప మగువృత్తి జనించినప్పుడు మన స్సనియు నిశ్చయరూప మగువృత్తి జనించినప్పుడు బుద్ధియనియు నభిమానరూప మగువృత్తి జనించినప్పు డహంకార మనియు వ్యవహరించుచున్నాఁడు. ఇట్టి యీయంతఃకరణమే జీవునకు నుపాధి. అది సర్వకాలములయందును ఆయనతోఁ జేరియేయున్నను ప్రారబ్ధపరిపాకము కాలభేదము నపేక్షించునది యగుటచే దాని ననుసరించి దానికి (ఉపాధి యగునంతఃకరణమునకు) శక్తిభేదములు కలుగుచుండును. ఒకక్షణమున పదార్థములవైపు ప్రసరించుటయు మఱియొకసమయమున లేకుండుటయు సంభవించుచుండును. ఈకారణమువలననే లోకానుభవము సరిపడుచున్నది. "నామనస్సు అన్యాయత్త మగుటచే నేను దీనిని వినలేదు" అను మొదలగువ్యవహారములకు నిదియే మూలము శ్రుతియు "మనస్సే సర్వ వ్యవహారమూలము" అనువిషయమును "మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి"="పురుషుఁడు మనస్సుతోనే వినుచున్నాఁడు చూచుచున్నాఁడు" అను మొదలగువాక్యములచే నిరూపించుచున్నది. ప్రత్యక్షము ననుసరించి చూచినను పదార్థవిజ్ఞానము తదిచ్ఛయు నింద్రియాదులకంటె లోపల జనించుచున్నట్లు స్పష్టముగనే గానవచ్చుచున్నది కదా! కావున నేది యభిముఖముగా నున్నప్పుడు విషయములు గానవచ్చుచున్నవో, యేది యెట్లు లేనప్పుడు పదార్థజ్ఞానము కలుగదో అదియే యంతఃకరణ మని యంగీకరించి తీరవలయును.

ఇట్లు కాక పదార్థవిజ్ఞానము ఇంద్రియాత్మసంయోగమువలననే కలుగు నని చెప్పిన నప్పుడు మీరుచెప్పినదోషములే తటస్థించును. ఇంద్రియములతోను పదార్థములతోను జీవునకు సంబంధ మెప్పటికి నున్నది. కావున సర్వకాలములయందును సామాన్యముగ పదార్థజ్ఞానము కలుగుచునే యుండవలయును. అట్లున్నను పదార్థజ్ఞానము కలుగదనిన నెప్ప

టికిని కలుగక నేర్పైన నుండవలయును. కర్మపరిపాకము కాలభేదము నపేక్షించును కావున దానిచే శక్తి యొకప్పుడు నిరోధింపఁబడుననిన నదియు సరిపడదు. ఆత్మ నిర్వికారుఁ డగుటచే నాయనయొక్క శక్తికి దేనివలనఁ గూడ బ్రతిబంధము కలుగదు. ఇంద్రియశక్తికి (నట్టి) ప్రతిబంధము కలుగుననిన నది యాకస్మికము కావలసి నచ్చుటచే నప్రామాణిక మగును. పూర్వోత్తరకాలములయందుగలశక్తి నడుమ నాకస్మికముగ ప్రతిబంధింపఁబడు ననుట యుక్తికి విరుద్ధము. అనుభవమునకును విరుద్ధమే. బాగుగ నడువఁ గలిగినమనుష్యుఁ డొక్కక్షణమునకుంటివాఁడై మఱియొకక్షణమున చక్కనివాఁడగుట యెందైనను ప్రత్యక్షముగనున్నదా? వినగలవాఁ డెవ్వఁడైన నున్నట్లుండి చెవిటి యగుచున్నాఁడా? వ్యాధ్యాదులవలన యొకానొకచోట నట్టిది కానవచ్చినను అది సహేతుక మగుటచే నాకస్మికము కానేరదు. "మేమును కర్మపరిపాకమును హేతువునుగా జెప్పుచునే యున్నాము కదా" అనియెదరేమొ? అప్పుడును ప్రత్యక్షమునకు విరోధము వచ్చుటచే నీయనుమానము చెల్లదు. జ్ఞానము జ్ఞానేచ్ఛయు నింద్రియమున కంటె లోపల జనించు ననుటయు మనస్సునకువలె వ్యాధ్యాదికారణాంతరములతో పనిలేకయే యింద్రియములకు కేవలకర్మవిపాకమాత్రముచే శక్తిప్రతిబంధము కలుగుట లేదనుటయు సర్వలోకప్రత్యక్షమై యున్నది కదా. ఈకారణమువలన మనస్సు లేకున్న శక్తిప్రతిబంధ మెవ్వరికిని కలుగుటకు వీలులేదు. లోకానుభవంబును సరిపడుటకు వీలులేదు. అంతఃకరణమునకు గూడ కర్మవిపాకమువలన శక్తిప్రతిబంధము కలుగు ననినప్పు డీదోషములేలరావు అనియెదవేమొ? వినుము. అంతఃకరణము కర్మవాసనలకు నన్నిటికి నాశ్రయమై యున్నది. అవియు సంస్కారరూపములై మనస్సున నున్నవి. అందీసంస్కార మెప్పుడు ఫలించునో అప్పుడు దానికి ననుగుణమగు వృత్తి చిత్తమున జనించును? ఎప్పుడేదియు ఫలింపకుండునో అప్పుడు ఏవృత్తియు జనింపదు. ఇదియే చిత్తమునకుఁ గల దని చెప్పఁబడిన శక్తిప్రతిబంధమునకు స్వరూపము. ఇందు విచారించి చూడుఁడు. మనస్సు ఎప్పటికిని వస్తుగ్రహణమునందు సమర్థము కాకపోవలేదు; దానిశక్తియు నెప్పటికిని నశింపలేదు. ఇక నేమియనిన; తత్తద్వాసనాపరిపాకములు మనస్సును బాహ్యాంతరములలో నేదియో యొకవైపునకు త్రిప్పుచు మాత్రమే యున్నవి. "ఇది సత్త్వాది గుణకార్యము కదా" [illegible] విరోధము లేదు. సత్త్వా

దులు చిత్తమునకు గారణములే యగుటచే వానికిని దానికి భేదమేలేదు. అవి వ్యాధ్యాదులవలె భిన్నములు కానేరవు కదా! కావున చిత్తమునకు గలుగుశక్తిప్రతిబంధమునుగూర్చి మాటలాడిన నాదోషములు రావు. ఇది యంతయు గాక జ్ఞానేచ్ఛలు లోపల జనించు ననుటయు మనస్సు ఒకప్పుడు విషయాభిముఖముగాను మఱియొకప్పుడు మఱియొకవిధముగాను ఉండు ననుటయు ననుభవసిద్ధమే యై యున్నది. కావున నంతఃకరణము కలదనియు నదియే జీవునకు నుపాధి యనియు దాని నాశ్రయించియే యా యనకు నణుపరిమాణము గమనాగమనములు ఉత్క్రాంతి చెప్పఁబడె ననియు విచారించిన నాయనకు కలది మహత్పరిమాణమే యనియు నవ శ్యముగ నంగీకరింపవలయును. మనస్సు చిత్తము బుద్ధి అహంకారము అంతఃకరణము అను నివి యన్నియు పర్యాయనామములే యని తెలిసి కొనవలయును.

---

## కర్త్రధికరణము. ౧౪.

విషయము: సంగతులు:—ఈయధికరణమునందు "జీవుఁడే కర్త" యనువిషయము ప్రకటింపఁ బడును. "తద్గుణసారత్వాత్. ౨. ౩. ౨౯" అనువాక్యము యొక్కయర్థమే వివరింపఁబడును. దీనికి 'బూర్వాధికరణ ముతోఁ గలసంగతి యంతర్భహిర్భావసంగతి యని యిదివఱకే చెప్పి యున్నాము.

సంశయ పూర్వపక్షము:—"అసంగో హ్యాయం పురుషః" = "ఈపురుషునకు దేనితోను సంబంధము లేదు." అనుమొదలగువాక్యము లచే జీవునకుఁ గర్తృత్వము లే దని కొన్నిశ్రుతులును "యజేత"="య జ్ఞము చేయవలయును" అని మఱికొన్నిశ్రుతులును చెప్పుచున్నవి. కర్త లేకున్న నీవిధివాక్యములు నిరర్థకములు కావలసివచ్చును. కదా! ఈరెం టికిని పరస్పరవిరోధము కలదా? లేదా? సాంఖ్యమతస్థులు బుద్ధిమాత్రమే *కర్త్రి (కార్యముల నాచరించునది) యని యుఁ జీవుఁడు అసంగుఁ డనియు కేవలము భోక్తయే యనియుఁ జెప్పుచున్నారు. ఆపక్షము నవలంబిం చిన వీనికి విరోధముండ దని తోఁచుచున్నది.

---

* 'కర్త్రి' [illegible]

## సూత్రము. ౩౩.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

### ౨౫౦. కర్తా శాస్త్రార్థవత్త్వాత్. ౨. ౩. ౩౩.

తాత్పర్యము:—ఈజీవుఁడు బుద్ధ్యుపాధివలనఁ గర్తగాఁగూడ నై యున్నాఁడు. ఇట్లయిననేగాని విధిశాస్త్రములు సార్థకములు కానేరవు. సాంఖ్యమతము దోషయుక్తము. శాస్త్రము బుద్ధినిఁగూర్చి యేవిధినిఁ గాని చెప్పుట లేదు; ఏఫలము నుపదేశించుట లేదు. ఫలము దానినిఁ గూర్చియే యుపదేశించె ననినఁ బ్రయోజనము లేదు. బుద్ధికి ఫలము ననుభవించుశక్తి లేదు కదా! అనుభవించువాఁడు జీవుఁడనుట వారికిని సమ్మతమే కదా! ఇఁక విధిని మాత్రము బుద్ధిని గూర్చియు ఫలమును మాత్రము జీవునిఁ గూర్చియు యుపదేశించు ననిన నది విరుద్ధము. ఒకడు చేసినపనికి మఱియొకఁడు ఫలము ననుభవించు ననుట యుక్తిశూన్యము కదా! కావున జీవుఁడు భోక్తయైనట్లే కర్తయు నగుచున్నాఁడు.

### ౨౫౧. విహారోపదేశాత్. ౨. ౩. ౩౪.

తాత్పర్యము:—మఱియు శ్రుతియందు స్వప్నావస్థను వర్ణించు నప్పుడు "స ఈయతే" ఆజీవుఁడు, సంచరించును అని జీవునకు సంచారము కూడఁ జెప్పఁబడి యున్నది. కర్త కాకున్న నీసంచారరూపక్రియ కూడ సంభవింపదు కావున జీవుఁడు కర్తయే.

### ౨౫౨. ఉపాదానాత్. ౨. ౩. ౩౫.

తాత్పర్యము.—ఇదియునుఁ గాక జీవునిఁగూర్చి చెప్పునప్పుడు "తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ (చూ ౨. ౩. ౨౮) ప్రాణాన్గృహీత్వా" "ప్రాణములను (యింద్రియములను) సహాయము లనుగాఁ గైకొని" అని సాధనస్వీకారమునుఁ గూర్చి శ్రుతి బోధించు చున్నది. ఇదియు గర్తృత్వము లేనివానికి సంభవింపదు కావున జీవుఁడే కర్త. అచేతన మగుటచే బుద్ధికిఁ గార్యకరణసామర్థ్య ముండు ననుటయు సాధనముల గ్రహించు సామర్థ్యముండు ననుటయుఁ గూడ నసంభవమే!

## ౨౫౩. వ్యపదేశాచ్చ క్రియాయాం న చే న్నిర్దేశపర్యయః. ౨. ౩. ౩౬.

తాత్పర్యము.—ఇంతియే కాదు. స్పష్టముగ వేదమున నొక్కచో "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" "జీవుఁడు (యిచ్చట విజ్ఞానశబ్దముచే జీవుఁడు చెప్పఁబడెను). వైదికకర్మములను లౌకికకర్మములనుఁ గూడ నాచరించుచున్నాఁడు" అని జీవకర్తృత్వము స్వయముగ శ్రుతిచే జెప్పఁబడియున్నది.

"ఇచ్చట జీవుఁడు చెప్పఁబడలేదు. విజ్ఞాన మనఁగా బుద్ధియే కదా" అనియెదవేమొ? యది యుక్తము కాదు. ఆశబ్దముచే బుద్ధిని చెప్పదలచినప్పుడు "తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ" అను మొదలగువాక్యములయందువలె *కరణవాచక మగుతృతీయావిభక్తియే ప్రయోగింపఁబడి యున్నది. యిచ్చట నావిభక్తి లేకుండుటచే దీనికి బుద్ధిమయుఁడగు జీవుఁడే యర్థము కావలయునని తోఁచుచున్నది. కావున జీవుఁడు కర్తయే. సాంఖ్యులు చెప్పినట్లు బుద్ధిమాత్రమే కర్త్రి కాదు.

## సూత్రము. ౩౭.

అవతారిక.—"ఇట్లు చెప్పుట సరి కాదు. జీవునకు స్వాతంత్ర్యముండినయెడల నాతఁడు తనకనిష్ట మగుదాని సంపాదింపఁగూడదు. లోకమున నట్టివైపరీత్యము కూడ గానవచ్చుచున్నది. కర్త యగువానికి స్వాతంత్ర్య ముండ దనుటయు నసంభవమే. ఈవిరోధమునకుఁ బరిహారమేమి? బుద్ధియే కర్త్రియనినచో నది సర్వసంస్కారసమన్విత, కావున కర్మానుగుణముగ జీవసాన్నిధ్యపుభావముచే నిష్టానిష్టకర్మలయందు ప్రవర్తింపవచ్చును; అస్వతంత్రుఁ డగుటచే జీవుఁడు తత్ఫలము ననుభవింపవచ్చును." అనిన దీనికి సమాధానమును చెప్పుచున్నాఁడు.

## ౨౫౪. ఉపలబ్ధివదనియమః. ౨. ౩. ౩౭.

తాత్పర్యము:—మాసిద్ధాంతమునఁ బైన చూపినదోషము కలుగదు. మార్గమున నడుచువాడు అనిష్టవస్తుదర్శనమునుఁ గోరి ప్రయ

---

*కరణవాచక [illegible] కరణము చెప్పబడెను. (కరణము ౬-౫౦-వ పు. చూ.)

త్నించువాఁడు కాకపోయినను అనియతముగ నిష్టానిష్టముల జూచునట్లు జీవుఁడును అనిష్టములకై ప్రయత్నింప కున్నను అనియతముగ నిష్టానిష్టకార్యముల నాచరించి తత్ఫలముల నొందవచ్చును. "నేత్రాదిసాధనములు కావలసివచ్చుటచే వస్తుగ్రహణమునందును జీవునకుస్వాతంత్ర్యము లేదు. కర్మానుసారముగ బుద్ధిప్రేరణచే నింద్రియములు ఆయాపదార్థములఁ జూచుచుండ జీవుండు నస్వతంత్రుఁడై వానిననుసరించుచున్నాఁడు" అనియెదవేమొ? యని సరికాదు. ఇంద్రియములకు విషయసమీపమునకుఁ శబ్దాదులసమీపమునుఁ జేరునట్టి సామర్థ్యము కాని పివప లేదు. జీవుఁడు స్వయముగ చేతనుఁ డగుటచే వానిద్వారమునఁ బ్రసరించి యాయావిషయమును స్వయముగనే గ్రహించును. విచారించిన నింద్రియము లచేతనములే. కదా! కావున నిష్టానిష్టదర్శనశ్రవణాదులు తదర్థము లగుప్రయత్నములు లేకయే కలుగునట్లు నిష్టానిష్టఫలంబులును తదర్థప్రయత్నములు లేక యే కలుగును. ఎట్లనిన;

జీవుఁడు కర్మల నాచరించుటయందు సంపూర్ణస్వాతంత్ర్యము కలవాఁడు సాధనసహాయములతో నాతనికి నావశ్యకత కలదు. దేశము కాలము పదార్థములు నింద్రియములు మొదలగునవి యనేకము లాతనికిఁ గర్మాచరణకాలమున సహాకుభూతములై యుండవలయును. ఈసాధనముల నుపయోగించుటయందు మాత్రమే యాతనికి స్వాతంత్ర్యము కలదు కాని దానిఫలమును నిర్ణయించుటయందు స్వాతంత్ర్యము లేదు. సర్వవిషయములయందును వీని పూర్వకర్మ ప్రేరేపించుచుండును. దానివలన వీఁడు భ్రాంతుఁడై పూర్వపాప మనుభవింపవలసినసమయమున నిష్టసాధనము లగువాని ననిష్టసాధనములుగాను అనిష్టసాధనము లగువాని నిష్టసాధనములుగాను తలంచి కార్యము నాచరించును; అనిష్టఫలము నొందును. ఇట్లే పూర్వపుణ్యఫల మనుభవింపవలసిన సమయమున భ్రాంతి లేక నున్నదాని నున్నట్లు గ్రహించి యిష్టఫలము నొందుచుండును. ఇంతమాత్రమువలన వీనికర్తృత్వమునకు హాని రాదు. కట్టెయలు జలము బియ్యము మొదలగుపదార్థములు పాత్రములు ప్రొయ్యి అసుమొదలగు ననేకసాధనములు కావలసి యున్నను వంటవాఁడు వంటవాఁడు కాకపోఁడు కదా! అన్నియు సాధనములే కాని కర్తలు కావు కదా! కావున నెట్టును విరోధము లేదు. జీవుఁడు కర్తయుఁ గావచ్చును.

కర్మవశమునఁ గలుగుభ్రాంత్యాదులమూలమున సాధనములను విపరీతములను గా నుపయోగించి యనిష్టఫలమునుఁ బొందను గూడవచ్చును. అచేతన యగుటచేఁ గేవలబుద్ధికిఁ గర్మప్రేరణయు సాధనముల బహువిధములుగ నుపయోగించుసామర్థ్యంబును కలుగుటకు వీలు లేదు. అచేతనము లేదియో యొకవిధముగఁ గార్యముల నాచరింపఁగలుగునేని యందు మార్పు కలుగఁగూడదు. [అచేతనకర్తృత్వమునుగూర్చి సాంఖ్యమతఖండనమున (౨- ౨.౧) వివరింపఁబడియున్నది] కావున నెట్లును మామతమునకు భంగములేదు.

# సూత్రము. ౩౮.

అవతారిక:—పూర్వము (౨-౩.౩౬.) "విభక్తి వ్యతిరేకముగా నుండుటచే (అనఁగా సాధనమునుఁ గూర్చి చెప్పుతృతీయావిభక్తి ప్రయోగింపఁబడక కర్తనుఁగూర్చి చెప్పుప్రథమావిభక్తి మాత్రమే ప్రయోగింపఁబడి యుండుటచే) 'విజ్ఞానం యజ్ఞం తనుతే' అనుశ్రుతియందు విజ్ఞానశబ్దముచే జెప్పఁబడినది బుద్ధి కాదు" అని నిరూపింపఁబడెను. ఇప్పు డీవిషయమున మఱియొకహేతువునుకూడఁ జూపుచున్నాఁడు.

## ౨౪౪. శక్తివిపర్యయాత్. ౨. ౩. ౩౮.

తాత్పర్యము:—ఇట్లుఁ గాక బుద్ధియే కర్త్రియైనచో దానికి సాధనముగ నుండుసామర్థ్యము పోయి కర్తగా నుండుసామర్థ్యము రావలసి వచ్చును. అప్పుడు "నేను" అనుప్రత్యయమునకు నాబుద్ధియే యర్థము కావలసి వచ్చును. ప్రతికర్తయు నహంకారపూర్వకముగఁ గార్యముల నాచరించుచున్నాఁ డనుట ప్రత్యక్షసిద్ధము. "నేను వచ్చుచున్నాను. నేను పోవుచున్నాను. నేను భుజించుచున్నాను" అనుమొదలగువ్యవహారము లీవిషయమునఁ బ్రమాణములు కదా. ఈవిషయము (బుద్ధియే యస్మచ్ఛబ్దార్థ మనువిషయము) ఎవ్వరికిని సమ్మతము కా దనుట నిర్వివాదము. సాంఖ్యులును అస్మచ్ఛబ్దార్థము పురుషుఁడే యనుచున్నారు కదా!

మఱియు కర్తృశక్తి బుద్ధికే యుండునేని యప్పుడును మఱియొకసాధనము కావలసియే యుండును. ఎంతసామర్థ్యము గలవాఁడైనను

సాధనములు లేకుండ గార్యముల నాచరించుట లేదు కదా! కావున బుద్ధి వ్యతిరిక్త మగుసాధనము నవశ్యముగఁ గల్పింపవలసియే యుండును. అట్లు చేయఁబూనిన నప్పుడు నామమాత్రమునందే వివాదముగాని పదార్థమున లే దనుట అందఱకును స్పష్టమే. మీరును గర్తృకరణములు భిన్నములుగ నుండవలయు ననుచున్నారు? మేము నట్లే యనుచున్నాము. ఇఁక జీవుఁడు కర్తయైన నేమి? బుద్ధి కర్త్రియైన నేమి? విశేషించి బుద్ధి కర్త యనినచో నది యచేతన కావున దానికి నాసామర్థ్య ముండునో యుండకపోవునో యనుసంశయము కూడ గలుగుటకు వీలు కలదు. లోకానుసారముగఁ జూచిన నచేతనములకు నట్టిసామర్థ్య ముండ దని నిర్ణయించుటకుఁ గూడ నవకాశము కలదు. జీవుఁడు చేతనుఁ డగుటచే నట్టిభావన కైన నవకాశము లేదు కదా! ఇక మామతమునకంటె భిన్నముగఁ జెప్పవలయు ననిన నేమి చెప్పవలయును? "ఒక్కబుద్ధియే కర్తయు సాధనంబునుఁ గూడ నగుచున్నది" యని చెప్పవలయును. ఇది విరుద్ధము. ఎచ్చటనైనను తన్ను తానే సాధనముగఁ గైకొని కార్యముల నాచరించువానిఁ జూచితిమా? "పరమేశ్వరుఁ డట్టివాఁడే కదా!" అనిమెద వేమొ? యది వివర్తవిషయము. భ్రాంతివశమున నేపదార్థ మేవిధముగ నైనఁ దోఁచ వచ్చును. వస్తువునకు స్వరూపహానియే యక్కఱ లేదు సాధనమును గైకొనుట ప్రపంచరూపముతో నేర్పడుట యనుమొదలగు నవి యన్నియు లోకభ్రాంతి ననుసరించి చెప్పఁబడునవియే కాని వస్తువునకు హానియే లేదు కదా! కావున పరమేశ్వరునివిషయమున కర్తయు లేఁడు; సాధనంబులును లేవు. కార్యము నాచరించుటయు లేదు. మఱియు పరమేశ్వరునియంతటిసామర్థ్యము మఱియొకదానికి అందును అచేతనమునకుఁ గల దనుట * యీశ్వరవాదుల కెవ్వరికిని సమ్మతము కాదు. ప్రకృతవిషయ మన్ననో వివర్తము కాదు; తనస్వరూపమును మఱియొకవిధముగ మార్చుకొనుట కాదు. తాను ప్రత్యేకముగ నుండి మఱికొన్ని పదార్థములతో సంయోగవియోగములనుఁ గలిగించుకొనుటకు ప్రయత్నించుచున్నాఁడే. కావున నీవిషయమున సాధనాంతరములు లేకున్న జరుగదు. ఇట్లగుటచే నిర్వివాదముగఁ గర్తృకరణములు భిన్నములుగ నుండ

---

* ఈశ్వరుఁడు కలఁడని యేవిధముగా నైన నాతనిస్వరూపము నంగీకరించి వాదించువారు.

వలయు ననియు బుద్ధి యచేతన కావున జీవుఁడు కర్త యనుటయే యుక్తి యుక్తమనియు విచారించిన బుద్ధినే కర్త్రి యని చెప్పువారు కూడ మామతము నంగీకరించినవారే యగుదు రనియు సిద్ధాంత మైనది.

## సూత్రము. ౩౯.

అవతారిక:—జీవకర్తృత్వమును సాధించుటకు మఱియొక హేతువును గూడఁ జూపుచున్నాఁడు.

## ౨౪౬. సమాధ్యభావాచ్చ. ౨. ౩. ౩౯.

తాత్పర్యము:—మఱియు జీవుఁడు కర్త కాఁ డనిన వేదాంతవాక్యములయం దుపదేశింపఁబడిన *ధ్యానధారణాసమాధులు నిరర్థకము లగును. "ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః"= "ఆత్మస్వరూపమును గూర్చి వినవలయును. విచారముఁ జేయవలయును. పిదపఁ దత్పరుఁడై అన్యవిషయములందు మనస్సును పోనీక ధ్యానింపవలయును. తరువాత మనస్సు నాపరమేశ్వరునియందే లయముఁ జేసి స్వస్వరూపముతో నిలువవలయును" అని చెప్పఁబడియున్నది కదా! ఇది జీవునకుఁ గర్తృత్వము లేకున్నచో సంభవింపదు. ఈయుపదేశము

*ధ్యానధారణసమాధులు:—ధ్యానధారణసమాధులస్వరూపము యోగశాస్త్రమునఁ జెప్పఁబడి యున్నది. 'దేశబంధ శ్చిత్తశ్చ ధారణా. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం. త దే వార్థమాత్ర నిర్భాసంస్వరూపశూన్యమివసమాధిః'= 'మనస్సును హృదయము నాభి మొదలగుస్థలములయందుఁ గాని ఏదియో యొకపదార్థమునందుఁ గాని సామాన్యముగ నిలుపుట ధారణ మనఁబడును. ఆపదార్థమునే పలుమారు భావించుచు మఱియొక భావనను చిత్తమునకుఁ గలుగనీకుండుట ధ్యాన మనఁబడును. ఇట్టి ధ్యానము నాచరింపఁగ నాచరింపఁగ మనస్సు ధ్యేయపదార్థమాత్రమై స్వరూపనాశము నొందినదానివలె నిలుచును. ఇదియే సమాధి' అనుసూత్రములచే వానికిఁ బ్రత్యేకలక్షణములు చెప్పఁబడినవి. ఇవియే శ్రవణమనననిదిధ్యాసనములుగ భాష్యమున వర్ణింపఁబడినవి. ఇందు వేదాంతవాక్యములచేతను దదనుకూలము లగుయుక్తులచేతను పరమేశ్వరుని సర్వాత్మకునిఁగ నెఱింగి యందుఁ జిత్తమును నిలుపుటయే శ్రవణమననప్రయోజనము కావున నది ధారణయగును; ఇతరసంకల్పముల విడిచి పరమేశ్వరుని గూర్చియే భావించుట స్వరూపముగఁ గలది యగుటచే నిదిధ్యాసనము ధ్యానమగును. దానివలనఁ గలుగుచిత్తలయము సమాధి యగును.

బుద్ధినిఁగూర్చియే చేయఁబడె ననుటకు వీలు లేదు. అజ్ఞానమువలన బుద్ధికి గలుగుసుఖదుఃఖాదుల నెల్లఁ దనవిగా భావింపుచు దుఃఖించు చున్నజీవునకు నప్పుడు ముక్తియే లేక పోవును. ఆతఁడు తనస్వరూపము నిత్యపరిశుద్ధ మని శ్రవణాదులవలన నెఱింగిననే కదా ముక్తి నొందఁ గలుగుట ఈకారణమువలన నాయుపదేశము జీవునిఁ గూర్చియే చేయఁబడి యుండవలయు ననుట స్పష్ట మగుచున్నది. కర్తృత్వము లేకున్న నాజీవుఁడు తదుపదేశానుసారముగ ప్రవర్తించి ఫలము నొందనేరడు కదా! కావున నవశ్యముగ బుద్ధివ్యతిరిక్తుఁ డగుజీవునకే కర్తృత్వము కల దనుటయే సిద్ధాంతము.—

---

## తక్షాధికరణము. ౧౯.

విషయసందేహములు:—పై యధికరణమునందు చేయఁబడిన జీవకర్తృత్వసిద్ధాంతమునుఁ గూర్చియే యీయధికరణమున మఱల విచారింపఁబడును. "ఈకర్తృత్వము జీవునకు నౌపాధికమా? స్వాభావికమా?" అనువిషయము చర్చింపఁ బడును. పూర్వాధికరణమునఁ జూపఁబడిన శ్రుతివిరోధమే నివర్తింపఁ జేయఁబడును.

సంగతి:—సామాన్యముగఁ బాదాంతమువఱకు నధికరణములకుఁ గలపరస్పరసంగతులు పూర్వమే (౨. ౩. ౧౯.) నిరూపింపఁబడి యున్నవి. అయిననుఁ బ్రస్తుతాధికరణమున విచారింపఁబడఁబోవుకర్తృత్వము పూర్వాధికరణమునందే నిర్ణయింపఁబడియుండుటచే వీనికి రెంటికిని విషయవిషయీభావసంగతికూడ కలదు.

పూర్వపక్షము:—పై యధికరణమున బుద్ధివ్యతిరిక్తుఁ డగుజీవునకే కర్తృత్వము కల దని సిద్ధాంతముఁ జేసితిరి గాని అంతమాత్రమున శ్రుతివిరోధము పోలేదు. "జీవుఁడు అసంగుఁడు" అని చెప్పుశ్రుతులకును "జీవుఁడు కర్త" యని బోధించువిధివాక్యములకును విరోధ మట్లే యున్నది. ఇందు మీరు విధివాక్యములపక్షమును మాత్రమే యవలంబించిన ట్లయినది గాని శ్రుతుల సమన్వయించినట్లు కా లేదు. మీరు చూపినహేతువులనుఁ బట్టి చూచిన జీవునకుఁ గర్తృత్వము స్వాభావికమే యని తోఁచుచున్నది. బాధకప్రమాణ మేదియు లేకున్నప్పుడు శ్రుతియందు

ప్రత్యక్షముగాఁ జెప్పఁబడి యున్న విషయమును ఊరక మార్చుట యుక్తి యుక్తము కాదు కదా! "'జీవుఁడు అసంగుఁడు' అని చెప్పు శ్రుతులు మోక్షావస్థను గూర్చి చెప్పును. మోక్షావస్థయందు జీవునకుఁ గర్తృత్వ ముండుటకు వీలు లేదు. కావున జీవుని కర్తఁ గాఁ జెప్పు శ్రుతు లన్నియు నౌపాధికకర్తృత్వమును బోధించునవియేయై యుండవలయును. స్వాభావికకర్తృత్వ మెుకప్పుడు లేకపోవు ననుట సంభవింపదు కదా!" అనియెదరేమెు అదియు సరి కానేరదు. మోక్షావస్థయందు కార్యములు లేకపోవచ్చును; గాని యంతమాత్రమువలన కర్తృత్వము కూడ లేక పోవలసినపని లేదు. "జ్ఞేయపదార్థములు లేకున్నను జ్ఞాన ముండవచ్చును కావునను జీవుఁ డెప్పటికిని సర్వజ్ఞుఁడే" యని యిదివఱకు (౨. ౩. ౧౮.) మీారే సిద్ధాంతముఁ జేసి యున్నారు. ఇట్లే కార్యములు లేకున్నను స్వాభావికకర్తృత్వ ముండ వచ్చును. ఈకారణమువలననే శ్రుతులకు వచ్చువిరోధము తొలంగదు; తొలంగకున్న మీాసిద్ధాంతంబును ప్రామాణికము కాదు.

## సూత్రము. ౪౦.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచూ జీవునకుఁ గలకర్తృత్వ మౌపాధికమే యని నిరూపించుచున్నాఁడు.

## ౨౫౭. యథా చ తక్షోభయథా.

## ౨. ౩. ౪౦.

తాత్పర్యము:—పై పూర్వపక్షము యుక్తము కాదు. లోకమునఁ గర్తృత్వ మెచ్చట గానవచ్చుచున్నదో యచ్చట నెల్ల దుఃఖముఁ గాన వచ్చుచున్నది. వడ్రంగి ఉలి మెుదలగుసాధనములఁ గైకొని దారువులతో బహువిధపదార్థముల రచించుసమయములయందు మిగుల శ్రమ నొందుచున్నాఁడు; ఆసాధనముల విడచి యూరక గృహమున నున్నప్పుడు సుఖించు చున్నాఁడు ఇట్లే జీవవిషయమునందును నిర్ణయింపవలయును. ఆతఁడును మనస్సు మెుదలగుసాధనములఁ గైకొని బహువిధవ్యాపారముల నాచరించు నప్పుడు కష్టపడును. ఇదియే కదా సంసారము. ఆసాధనములను విడచి స్వస్వరూపమున కర్తృత్వము లేకుండ నిలిచినప్పుడు

సుఖపడును. ఇదియే మోక్షము. మోక్ష మనఁగా సర్వదుఃఖరాహిత్య
మని యందఱకును తెలియును. ఇట్టిమోక్షమును చెందినప్పుడు దుఃఖ
హేతు వగుకర్తృత్వ ముండుటకు నెట్లు వీలు కలుగును? జీవునకు నిది
స్వాభావికమే యైనచో నెప్పటికిని పోవుటకే వీలు లేదు కదా! ఈకారణ
మువలన నది (జీవకర్తృత్వము) ఔపాధికమే యని నిర్ణయింపవలసి
యున్నది. అజ్ఞానవశమున బుద్ధ్యాత్మలకు పరస్పరాధ్యాసము కలుగుటచే
వచ్చినది యనియే నిశ్చయింపవలసి యున్నది. అచేతన యగుటచే బుద్ధికిఁ
గాని నిత్యముక్తుఁ డగుటచే జీవునకుఁ గాని యుండుటకు వీలు లేని దగు
టచే కేవల మధ్యాసధర్మమే యని నిరూపింపవలసి యున్నది. శ్రుతుల
కును ఇట్లు చెప్పినచో పరస్పరవిరోధము కలుగదు. విధివాక్యములు ఔపా
ధికకర్తృత్వమును గూర్చియు "అసంగో హ్యయం పురుషః" అను మొద
లగునవి పారమార్థిక మగునిర్వికారత్వమును గూర్చియుఁ జెప్పునవి కావ
చ్చును గదా "సర్వశాస్త్రములును భ్రాంతికల్పితభేదము నాశ్రయించి
చెప్పునవియే" యనువిషయము పూర్వముననే (శాస్త్రావతారికయందే)
నిర్ణయింపఁబడి యున్నది.

"ఈదృష్టాంతమే మొట్టమొదట యుక్తియుక్తము కాదు. వడ్రం
గికి హస్తపాదాద్యవయవములు కలవు కావున వాఁడు వానితో ఉలి
మొదలగుసాధనములను ఒకసమయమునఁ గైకొనవచ్చును. మఱియొక
సమయమున విడువ వచ్చును గాని నిరవయవుఁ డగుజీవుఁ డట్లు చేయఁగ
లఁడా? తనతో సంబంధపడి యున్నమనస్సు మొదలగువాని నొకప్పుడు
త్రోసి వేయఁగలఁడా? సాధనములతో సంబంధము కలవాఁ డైనను లేని
వాఁ డైనను సర్వకాలములయందు నొక్కరీతిగనే యుండవలయును గాని
యేవిధ మగుమార్పునుఁ జెందుటకు వీలు లేదు కదా!" అనియెదవేమొ
వినుము. ఉపమానోపమేయములకు సంపూర్ణ మగుపోలిక యుండనక్కఱ
లే దని పలుమాఱు వివరించియే యున్నాము. "వడ్రంగి సాధనములతో
పని చేయునప్పుడు శ్రమఁ జెందుచు నుండి వానిని విడచిన నెట్లు సుఖం
చునో అట్లే జీవుఁడును మనస్సు మొదలగు సాధనములచే గార్యముల
నాచరించునప్పుడు దుఃఖితుఁ డై యుండి వానిని విడువఁగనే పరమానంద
రూప మగుమోక్షమును జెందును" అనునింతమాత్రమునందే వడ్రంగి
దృష్టాంతముగఁ జెప్పఁబడెను కాని సర్వవిషయములయందును గాదు.

మఱియు నీపక్షము నాశ్రయించియే వచ్చినను దోషము రాదు. వడ్రంగికిఁగూడ శరీరభిన్నము లగుఉలిమొదలగుసాధనముల నుపయోగించుటకు హస్తాదులు కలవు కాని హస్తాదుల నుపయోగించుటకు మఱికొన్ని హస్తాదులు లేవు కదా! కావున వడ్రంగియొక్క జీవుఁడు వానిదేహమును స్వయముగనే యెట్లు స్వవ్యాపారములయందు ప్రవర్తింపఁజేయునో అట్లే జీవుఁడు మనస్సు మొదలగుసాధనములఁ బ్రవర్తింపఁ జేయు ననిన నిందు విరోధ మేమికలదు? ఈకారణమువలన జీవునకుఁ గలకర్తృత్వము మోక్షమున నుండుటకు వీలు లేకపోవుటచే నౌపాధికమే.

"అగుగాక కర్తృత్వము మోక్షమున నుండినమాత్ర మేమి? అప్పుడు హేతువు లేమియు లేకపోవుటచే వ్యాపారము మాత్ర ముండదు. వ్యాపారము లుండుటయే కదా దుఃఖకారణము. అగ్నియందు దహనశక్తి యట్లే యున్నను దహనవ్యాపారమునకు హేతువు లగుకట్టెయులు లేకున్న దహనము సంభవింపనట్లు జీవునకును క్రియ లేకున్న కర్తృత్వంబును లేనియట్లే యగును." అనియెదవేమొ వినుము. అగ్నికిఁ గల దహనశక్తి స్వాభావికము. దహనక్రియాహేతువు లగుకాష్ఠాదులయొక్క గాని తజ్జన్య మగుదహనక్రియయొక్క గాని సంబంధమువలనఁ గలుగునది కాదు. పరమేశ్వరునకు జీవునకును కల దని చెప్పఁబడినజ్ఞానము కూడ నిట్టిదే కావున నాజ్ఞానమువలె నీకర్తృత్వము స్వాభావిక మగుటకు వీలు లేదు. ఇది క్రియాసంయోగమువలన కాని కలుగునది కాదుకదా! "హేతువులు లేకపోవుటచే క్రియ యెప్పుడు లేకపోవును" అనుటయు యుక్తిశూన్యము. క్రియ యనునదియే కర్తృత్వశక్తికి విషయము కావున నాశక్తి యుండిన దీనిని (క్రియను) విడువదు. లోకమున సర్వశక్తులు నిట్టివే. ఒకపదార్థమును ఆశ్రయించియు మఱియొకపదార్థమును విషయవిషయీభావసంబంధముచే నవలంబించి యుండును. అర్థశక్తి శబ్దము నాశ్రయించియు తద్వాచ్య మగుపదార్థమును విషయవిషయిభావసంబంధముచే నవలంబించియేయున్నది. ఇట్లే యీకర్తృత్వశక్తియు మోక్షకాలమునందుఁ గూడ నుండునేని యవశ్య మప్పుడును తనకు విషయ మగు క్రియ నవలంబించియే యుండును. ఆక్రియయు విషయశూన్యమై యుండుట సంభవింపదు. కావున తద్ధేతువులను కూడ నవలంబించియే యుండును. ఈకారణమువలన నవస్థాభేద మగుటచే నివి కొంతవఱకు

నల్పములై యుండిన నుండవచ్చును కాని బొత్తుగ మాత్రము లేకపోవు; ఎంతమాత్ర మున్నను మోక్షమునకు మాత్రము హానివచ్చును. కావున నెట్లును కర్తృత్వశక్తి జీవునకు స్వాభావిక మై యుండుటకు వీలు లేదు. స్వభావము నశించు ననిన స్వయముగనే నశించు ననవలయును. ఇది యుక్తము కాదు కదా! ఈకారణమువలనఁ గర్తృత్వ మౌపాధికమే.

"మోక్షమునకు వేదమునందు శ్రవణాదిసాధనము లుపదేశింపఁబడి యున్నవి. వాని ననుష్ఠించి మోక్షమును సంపాదింప వచ్చును. అనుష్ఠానమునకుఁ గర్తయే కావలయును కదా! జీవునకు గర్తృత్వము లే దనిన నది యెట్లు సంభవించును? 'ఔపాధికకర్తృత్వము కలదుకదా' అనియెదవేమొ యాత్మదర్శనకాలమున నాయుపాధి యుండుటకు వీలు లేకపోవుటచే కర్తృత్వము కూడ నుండుటకు వీలు లేక పోవలసివచ్చును. కర్తృత్వము లేకపోయిన నాత్మదర్శనము సంభవింపదు కావున ముక్తియే లేకపోవును. "ఈకారణమువలన జీవునకుఁ గర్తృత్వము స్వాభావికమే కావలయును" అనియెదవేమొ వినుము. మోక్షము సాధనములచే సంపాదింపఁబడవలసినది యగునేని నీవు చెప్పినదోషము వచ్చుట నిశ్చయమే కాని మామతమున నది యట్టిది కాదు. 'ఏపదార్థము సాధనసహాయములచే సంపాదింపఁబడుచున్నదో అది యెల్ల నశించుచున్నది యనుట లోకానుభవసిద్ధము. మోక్ష మిట్టిది కాదు కదా! మఱియు నిత్యుఁడును జ్ఞానరూపుఁడును ముక్తుఁడు నగుపరమేశ్వరుఁడే మోక్ష మని వేదాంతవాక్యములయందు ఘోషింపఁబడుచున్నది. జీవుఁడును వీని కభిన్నుఁడే యని స్పష్టము చేయఁబడుచున్నది. ఇట్లుండ నీమోక్షవిషయమునఁ గర్తృత్వ మేల? * శ్రవణమనననిదిధ్యాసనము లగునంతవఱకు మనస్సు మొదలగువానితో సంబంధ ముండుటచే నంతవఱకు నౌపాధిక కర్తృత్వము కూడ నుండును; దర్శనకాలమునందు సర్వార్థంబును నిశ్చితమే యగుటచే మనస్సు స్వయముగనే నశించును కావున జీవుఁడును స్వయముగనే బ్రహ్మరూపుఁ డగును. అప్పు డేకర్తృత్వంబును లేదు. ఇట్లగుటచే జీవునకు గర్తృత్వము స్వాభావికము కానేరదు. సమాధి నుండి మేల్కాంచినపిదప మఱల వ్యవహార మున్నను కర్తృత్వ మెప్పటికిని కల్పితమే కావున నాతని బంధింపనేరదు.

---

* శ్రవణమనన నిదిధ్యాసనము (చూ. ౨౨౨.)

ఈవిషయమును శ్రుతి స్పష్టముగనే చెప్పుచున్నది. "ధ్యాయతీవ లీలాయతీవ. బృ. 3. ౭౦. ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః"="దేహము యింద్రియములు మనస్సు అనువానితోఁగూడిన పరమేశ్వరుని భోక్త యందురు" అను మొదలగువాక్యములయందు ఈ విషయము స్పష్టముగ నున్నవి. కర్తృత్వభోక్తృత్వములు జీవునకు నుపాధిసాన్నిధ్యమువలన కలుగునవియే కాని స్వభావసిద్ధములు కావని వీని వలన దోఁచుచున్నది గదా. మఱియు విచారించిన పరమేశ్వరునికంటె భిన్నముగ గర్తయు భోక్తయు నగువాఁడే లేఁడు కదా! "ఇట్లయిన పరమేశ్వరుఁడే సంసారియు ముక్తుఁడును కావలసివచ్చును. అప్పుడు ఆయన సర్వాత్మకుఁ డగుటచే నందఱకు బంధమోక్షము లొక్కమాఱే కలుగవలసి వచ్చును. ఇది విరుద్ధము కదా!" అనియెదవేమొ యట్లు కాదు. ఈకర్తృత్వాదులు, అచేతన యగుటచే బుద్ధికిఁ గాని, ముక్తుఁ డగుటచే బరమేశ్వరునకుఁ గాని సంభవింప వనియు నివి * పరస్పరాధ్యాసమువలన కలిగినధర్మములే యనియు నిదివఱకే నిరూపించి యున్నాము. బుద్ధియం దారోపింపఁబడుటవలన లేక ప్రతిబింబించుటవలన లేక దానిచే నావరింపఁబడుటవలన పరమేశ్వరుఁడే శుద్ధుఁడయ్యు నపరశుద్ధుఁడు గను ముక్తుఁడయ్యు బద్ధుఁడు గను గానవచ్చు చున్నాఁడు. ఆబుద్ధు లనేకము లగుటచే నాయనయు ననేకరూపములతోఁ దోఁచుచున్నాఁడు ఒకబుద్ధియజ్ఞాననివృత్తిచే నాయనను విడచిపోయిన నప్పుడు ఆభాగమున (అనఁగా ఏభాగమున నావరించియున్నబుద్ధి తొలఁగిపోయెనో యాభాగమున) ముక్తుఁడుగను తక్కినభాగములయందు బద్ధుఁడుగను తోఁచుచున్నాఁడు. సర్వవ్యాపక మగుచైతన్యము దేహములయం దారోపింపఁబడి యేదేహము నశించిన నచ్చట మాత్రము నశించినట్లునుఁ దక్కినచోట్ల దేహరూపముతో నున్నట్లును భావింపఁబడువిధంబున నాబ్రహ్మంబును భావింపఁబడుచున్నాఁడు. అద్దము జలము స్వచ్ఛమగు నితరపదార్థములు రత్నములు వీనియందు ప్రతిబింబించినచంద్రుఁడు స్వచ్ఛుఁడయ్యు మలినుండుగను, చాంచల్యరహితుఁడయ్యు చంచలుండుగను ఒక్కఁడయ్యు ననేకులుగాఁ దోఁచుచు నొక్కపదార్థము నశించి గాని తీసివేయఁబడి కాని యున్నప్పుడు

---

* పరస్పరాధ్యాస మనఁగా రెండుపదార్థములలో నొకదానిపై మఱియొకదాని నారోపించుట.

అచ్చటమాత్రము లేనివాఁడుగను ఇతరస్థలములయం దట్లే బహుభేదములతో నున్నవాఁడు గను తలంపఁబడునట్లు పరమేశ్వరుఁడునుఁ దలంపఁబడుచున్నాఁడు. ఒక్కఁడయాకాశమే ఘటగృహాదులచే నావరింపఁబడి భిన్ననామములతో భిన్నధర్మములతో ("ఈరంధ్రము పొడవుగ నున్నది ఇది వర్తులముగ నున్నది" అనురూపభేదములతో) వ్యవహరింపఁబడుచు నొకయావరణము నష్టమైన నచ్చట మాత్రము మహాకాశమునకంటె నభిన్నముగ భావింపఁబడుచు నితరస్థలములయందు భిన్నముగనే చూడఁబడుచు నున్నట్లే పరమేశ్వరుఁడును చూడఁబడుచున్నాఁడు. కావున ఉపాధిసంబంధమువలన వ్యావహారికమై కలుగుబంధమోక్షములు సర్వజీవులకు నొక్కమాఱే కలుగ నక్కఱ లేదు. పరమేశ్వరుఁడే జీవుఁడు. కావున నాయనకుఁ గర్తృత్వంబును స్వాభావికముకాదు. "నాన్యోతోఽస్తి ద్రష్టా (౨. 3. 30.)" అనుశ్రుతియందు జీవవ్యతిరిక్తుఁడగుపరమేశ్వరుఁడే లేఁడని చెప్పఁబడి యున్నది. మఱియు 'యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్"="ఎచ్చట నవిద్యాకల్పితమగుభేద ముండునో యచ్చట నొక్కఁడు మఱియొక్కనిఁ జూచును. ఎచ్చట నవిద్య నశించి సర్వము నాత్మరూపమే యగునో యచ్చట నెవ్వఁడు దేనిని దేనితో జూచును" అని యవిద్యాదశయందు మాత్రమే కర్తృత్వాదులు కల వనియు జ్ఞానదశయందు లేవనియు స్పష్టముగ జెప్పఁబడియున్నది. ఇదియును గాక జాగ్రత్స్వప్నావస్థలయందు ఉపాధిసంబంధముచే నాత్మకు శ్రమ కలుగు ననియు సుషుప్త్యవస్థలయందు ఉపాధినాశ మగుటచేఁ బరమేశ్వరప్రాప్తి కలుగుటచే నది యడంగు ననియు బృహదారణ్యకోపనిషత్తున నాల్గవయధ్యాయము మూఁడవబ్రాహ్మణమున ౨౧ మొదలు 3౨వ, వాక్యమువఱకు వివరింపఁబడి యున్నది. కావున జీవునకుఁ గలకర్తృత్వము ఉపాధ్యారోపమువలన కలిగినదియే కాని స్వాభావికము కాదు.

పూర్వాధికరణమున జీవకర్తృత్వనిర్ణయార్థమై చూపఁబడినహేతువు లన్నియు నీసోపాధికకర్తృత్వమును గూర్చియే చెప్పును కాని స్వాభావికకర్తృత్వముసుఁ గూర్చి చెప్పవు. అట్లు చెప్పవలసినపనియు లేదు. ఏదియైనను లోకప్రసిద్ధ మగుకర్తృత్వము నాశ్రయించి చేయవలసినకార్యములను వానికి గావలసినసాధనములను మాత్రమే చెప్పును గాని

ఆకర్తృత్వమును ప్రతిపాదింపవు; స్వాభావికమా? అస్వాభావికమా? అనువిషయమును గూర్చి నిర్ణయింపఁ బ్రయత్నింపవు.

"మీరు చెప్పినదాని ననుసరించి చూచిన పై యధికరణమునఁ జూపఁబడిన మొదటిహేతువు (౨-3-33.) సమర్థింపఁబడిన ట్లయ్యెను. విధివాక్యములకుఁ గర్తృత్వమునుఁ గూర్చి క్రొత్తఁగా నిర్ణయింపవల సినపని లేదనుట సత్యమే కాని తరువాత జెప్పఁబడిన రెండుహేతు వులును (౨-3-3౪, 3౫.) ఎట్లును సమన్వయము కావు. స్వప్నావస్థ యందు సర్వేంద్రియములును నిదురించుచుండ జీవుఁ డొక్కండు మాత్ర ము దేహమున నంతటను సంచరించునని శ్రుతియందు చెప్పఁబడియున్నది కదా! దీనిని విచారించిన సంచారము జీవునకు స్వాభావికమే యని తేలు చున్నది. బుద్ధియున్నప్పుడు మాత్రమే సంచారముండునేని యప్పు డది యౌపాధిక మగును కాని బుద్ధి లేనప్పుడు కూడ నుండినచో నౌపాధికము కానేరదు కదా! ఇఁక మూఁడవహేతువు కూడ నిట్టిదియే. శ్రుతియందు 'జీవుఁడు తనవిజ్ఞానముచే నింద్రియశక్తులను గ్రహించి స్వప్నావస్థకుఁ బోవును' అని చెప్పఁబడియుండుటచే నావిషయమున జీవునకు సాధనాం తరసహాయ మక్కఱ లేదని తోఁచుచున్నది; ఉపాధియు ననావశ్యక మని తోఁచుచున్నది. సాధనముగఁ జెప్పఁబడినబుద్ధినే కదా మీ రుపాధి యనుచున్నారు. కావున నెట్లును జీవునకుఁ గర్తృత్వము స్వాభావికమే యని తోఁచుచున్నది" అని యెదవేమో వినుము. ఈరెండు హేతువులు కూడ మొదటిదానివలెనే సమన్వితము లగును. విధివాక్యములు కర్తృ త్వమును గూర్చి చెప్పనట్లే. యీస్వప్నవర్ణనవాక్యములును సంచారా దులను గూర్చి చెప్పను. ఎట్లనిన:—

స్వప్నావస్థయందు జీవవ్యతిరిక్తము లగునన్నియు నశించుట లేదు. అప్పుడును బుద్ధి కలదు. "సధీః స్వప్నో భూ త్వేవం లోక మతిక్రామతి. ఇంద్రియాణా ముపరమే మనో ఽనుపరతం యది, సేవతే విషయా నేవ తద్విద్యా త్స్వప్నదర్శనం"="బుద్ధితోఁగూడి జీవుఁడు స్వప్నరూపుఁడై యీలోకమునుఁ గడచి పోవును. ఇంద్రియములు లయము నొందినను మనస్సు మాత్రము లీనము కాకుండునేని యాయుపాధివలన జీవుఁ డప్పుడును శబ్దాదివిషయములనే యనుభవించును; ఇదియే స్వప్నము" అనుశ్రుతిస్మృతులు లీవిషయమును స్పష్టముఁ జేయుచున్నవి. మఱియుఁ

గామక్రోధాదులు మనోవృత్తు లగుట లోకవేదములయందు ప్రసిద్ధమై యున్నది. ఆవృత్తులు స్వప్నమునఁ గానవచ్చుచున్నవి. కావున వాని కాధార మగుమనస్సు కూడ నెం దుండవలయును. కావున నిర్వివాదముగ జీవుఁడు మనస్సుతోఁ గూడియే స్వప్నమున విహరించు ననవలయును. ఇట్లయిన నిది స్వాభావికము కానేరదు కదా! శ్రుతియు స్వప్నవ్యాపారము ను వర్ణించునప్పుడెల్లదానియపారమార్థికత్వమును సూచించుటకై సాదృశ్యవాచకము లగుఇవమొదలగుశబ్దములఁ బ్రయోగించుచునే యున్నది. "ఉ తేవ స్త్రీభి స్సహమోదమానో జక్షదు తే వాపి భయాని పశ్యన్"= "ఆజీవుఁడు స్త్రీలతో క్రీడించుచున్నట్లును భుజించుచున్నట్లును భయంకరము లగుపదార్థములఁ జూచుచున్నట్లును స్వప్నమున సంచరించును." అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు లోకులుకూడ కలను చెప్పునప్పుడు "కొండనెక్కినట్లును అరణ్యములఁజూచినట్లును దూర దేశమునకు పోయినట్లును నాకు కల వచ్చినది" అని మాత్రమే చెప్పుచున్నారు. ఈకారణమువలనఁ గర్తృత్వమువలెనే స్వప్నావస్థయందలివిహారము కూడ నౌపాధికమే; శ్రుతియు నిట్టియౌపాధికవిహారము ననువాదముఁ జేయుచున్నది కాని స్వాభావిక మని విధించుట లేదు. ఇట్లు విమర్శించిన రెండవహేతువు కూడ సమన్వితమగును.

ఇఁక మూఁడవహేతువును గూర్చి వినుము. అచ్చటకూడ బుద్ధి సాధనముగా జెప్పఁబడినను అది జీవున కుపాధి యగు ననుటలో విరోధమేమియు లేదు. కేవలజీవునకుఁ గర్తృత్వము సంభవింప దని యిదివరకే నిరూపించి యున్నాము కదా! "ఇట్లయిన నొక్కొక్కసమయమున సాధనములు కూడఁ గర్తనుఁగా జెప్పఁబడవలయును వానిసహాయము లేక జీవునకుఁ గర్తృత్వము లేదు కదా" అనియెదవేమొ వినుము. ఒకానొక స్థలమున నట్లును గలదు. "యోధులు యుద్ధముఁ జేయుచున్నారు. రాజు యోధసహాయముతో యుద్ధముఁ జేయుచున్నాఁడు" అను మొదలగు వ్యవహారములు పెల్లుగఁగలవు. కావున నెట్లును జీవునకు స్వాభావికకర్తృత్వమే యుండవలయునని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. సాధనసహాయ మావశ్యక మనుట బహుశ్రుతియుక్తిసమ్మతముగ నిరూపింపఁబడెను; సాధనసహాయముతో కార్యము నాచరించువాఁడు స్వతంత్రముగఁ గూడ కర్త కానక్కఱ లేదు. అవసరము కలిగినప్పుడు గొడ్డలితో వృక్షమును

నరికినవాఁడు సర్వకాలములయందు నట్టివాఁడే కావలయునా? కాలాను సారముగ సాధనానుసారముగ నొక్కఁడే భిన్నభిన్న కార్యముల నాచరింప వచ్చునుకదా! "కర్తృత్వశక్తి యొక్కటి మొట్టమొదట నుండినగదా ఇది సంభవించును." అనియెద వేమొ వినుము. బుద్ధ్యుపాధివలన జీవునకు నా శక్తి గలదని యిదివరకే చెప్పి యున్నాము. అది య ట్లుండె. ఈదృష్టాం తమునకును దార్ష్టాంతిక మగుజీవవిషయమునకును గలపోలిక ఇంతమాత్ర మే. "దేహమెట్లు సాధనాంతరసహాయమువలనఁ దత్తత్కార్యముల నా చరింపుచు స్వయముగ నేమియు నాచరింపనదియై యున్నదో యట్లె జీవుఁ డును బుద్ధిసాన్నిధ్యముచే దత్తత్కార్యముల నాచరింపుచు స్వయముగ నేమియునాచరింపఁడు." అనుట మాత్రమే వీనికిఁ గలపోలిక. విచారించిన దేశకాలానుగుణముగ సాధనసహాయముచేఁ గార్యము నాచరించుటకు చైతన్యముమాత్ర ముండినఁ జాలును. జ్ఞానము గలవాఁడు కాలానుగుణ ముగ సర్వమునాచరింపవచ్చు ననుటలో సంశయమేమి? ఈకారణమువలన సాధనముగఁ జెప్పఁబడియున్నను బుద్ధి జీవులకుపాధియే యని తెలిసికొన వలయును. మఱియు నాశ్రుతి యింద్రియవిరామమునుఁ గూర్చి మాత్రమే చెప్పుచున్నది కాని జీవునకుఁ గలకర్తృత్వమును గూర్చి చెప్పుటలేదు. ఇంద్రియాదివిరామంబును బుద్ధిపూర్వకముగనే (అనఁగా సంకల్పపూర్వక ముగనే) కావలయు నని నియమము లేదు "నదీతీరము పడదలంచు చున్నది" అను మొదలగువ్యవహారములను విమర్శించిన నచేతనము లగు వానిని గూర్చియు నిట్లు చెప్పుట గానవచ్చుచున్నది. పడుట యనఁగా నింద్రియవిరామమే యనియు నది యచేతనములకుఁ గారణాంతరముల వలన (ఇంద్రియము లని చెప్పఁబడినవి యవయవములే యని తెలిసికొన వలయును. మనుష్యాదిచేతనములకును అవి యవయవమాత్రములే అయి నను అంతఃకరణాదిసంబంధమువలన నాత్మప్రకాశము బాగుగ వ్యాపించు టచే వానికిఁబదార్థగ్రహణశక్తి కలిగినది.) కలుగునే గాని బుద్ధిపూర్వక ముగఁ గలుగదనియు సర్వజనులు నెఱింగియే యున్నారు. ప్రస్తుతజీవవిష యము కూడ నిట్టిదే కానచ్చును. కేవలజీవునకుఁ గర్తృత్వము సంభ వింప దని యిదివరకే నిరూపింపఁబడెనుకదా! కావున నీమూఁడవహేతువు కూడ నౌపాధికకర్తృత్వము ననువాదము చేయునదియే కాని స్వాభావిక కర్తృత్వమును చెప్పునది కాదు.

మఱియు ముప్పదియారు ముప్పదియెనిమిది సూత్రములయందుఁ జెప్పఁబడిననాల్గవ హేతువు గూడ పారమార్థిక మగుకర్తృత్వముఁ జెప్పదు. వాస్తవస్థితిలో నాహేతువు బుద్ధికర్తృత్వమును మాత్రమే నిరూపించుచున్నది. దీనిచే జీవకర్తృత్వమును తొలఁగించుచున్నది. జీవుఁడు కర్తయైనట్లు తోఁచుటయే కాని యట్టివాఁడు వాస్తవస్థితిలోఁ గాఁడని చెప్పుచున్నది. ఎట్లనిన:—

"విజ్ఞానంయజ్ఞం తను తే" అనుశ్రుతి బుద్ధికే కర్తృత్వమును చెప్పుచున్నది. విజ్ఞానశబ్దము బుద్ధివాచకమనుట ప్రసిద్ధము. ప్రస్తుతప్రకరణమునందును(తైత్తిరీయోపనిషత్తునందును)మనస్సునుగూర్చి చెప్పఁబడినపిదప నీవాక్యము చెప్పఁబడి యున్నది. మఱియు "తస్యశ్రద్ధైవశిరః"="ఆవిజ్ఞానమయాత్మకు శ్రద్ధయే శిరస్సు" అని చెప్పఁబడి యుండుటచేతఁ గూడ విజ్ఞానపదమునకు బుద్ధియే యర్థమని తోఁచుచున్నది. నిత్యశుద్ధుఁడగుపరమేశ్వరునకుఁ గాని తదభిన్నుఁ డగుజీవునకుఁగాని శ్రద్ధాదు లవయవములుగ నుండుటకు వీలు లే దనుటయు, నవి (శ్రద్ధాదులు) బుధ్యవయవములే యనుటయు సర్వజనవిదితమే కదా! "స ఏష వాచ శ్చిత్తస్యోత్తరోత్తరక్రమో య ద్యజ్ఞః"="యజ్ఞ మనునది బుద్ధియొక్కయు వాక్కుయొక్కయు వ్యాపారభేదమే" అని మఱియొకశ్రుతియందును "యజ్ఞమునందు బుద్ధికిఁ గర్తృత్వము కలదు"అని స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది కావున బుద్ధికిఁ గర్తృత్వము కల దనుటయే శ్రుత్యభిప్రాయము. " 'బుద్ధిని చెప్పఁదలంచినప్పుడు తృతీయావిభక్తిమాత్రమే ప్రయోగింపఁబడి యుండును. ఇచ్చట నట్లు లేదు కావున నిది జీవునిఁ గూర్చి చెప్పునదియే' అని ముప్పదియాఱవసూత్రమున జెప్పియుంటిరి కదా!" అనియెదవేమొ యంతమాత్రమున నీసిద్ధాంతమునకు భంగమురాదు. అది యౌపచారికప్రయోగముగఁ గూడ నుండవచ్చును కదా! "ఇట్లయినచోఁ బారమార్థికస్థితిలో జీవకర్తృత్వమును జెప్పవలయు ననియే కదా శ్రుతికి నభిప్రాయము" అనియెదవేమొ యది సరి కాదు. బుద్ధి యచేతన యగుటచే దానికి స్వాభావికముగఁ గర్తృత్వ ముండుటకు వీలు లేకపోవుటచే తత్కర్తృత్వమునుబట్టి యౌపచారికముగ నది (కర్తృత్వము) చెప్పఁబడె నంటిమి కాని యిచ్చట జీవప్రస్తావ మేమి కలదు? మఱియుఁ గేవల జీవునకు కర్తృత్వము లుండుటకు వీలు లేదనియు బుద్ధికే నిరూపించి

యున్నాము. కావున నాశ్రుతి బుద్ధికర్తృత్వమును చెప్పు ననుటలో సంశయము లేదు.

"ఇట్లయినను ముప్పదియెనిమిదవసూత్రమున నిర్ణయింపఁబడిన సందర్భమునకు విరోధము వచ్చును. అచ్చట 'బుద్ధియే కర్త యగునేని దానికి మఱియొకసాధనము కావలసివచ్చును; దానికి కరణశక్తి పోవును కదా!' అని చెప్పియున్నారు" అనియెదవేమో యదియుఁ గార్యభేదము ననుసరించి సరి పడును. "అన్నము ఉడుకుచున్నది కొఱవులు మండుచున్నది" అను మొదలగులోకప్రసిద్ధవ్యవహారముల ననుసరించిచూచిన సాధనము లగుపదార్థములకు మాత్రమే కాక సర్వ*కారకములకునుఁ గూడఁ దమతమవ్యాపారములయందుఁ గర్తృత్వము కానవచ్చుచున్నది. ఇట్లగుటచే బుద్ధికిఁ గూడ యజ్ఞాదికార్యములయందు కర్తృత్వము కలుగవచ్చును. అవి (యజ్ఞాదులు) సంకల్పరూపములే యగుటచేతను సంకల్పములచే ప్రేరేపింపఁబడినయింద్రియములచేత నిర్వహింపఁబడునవియే యగుటచేతను వానియందు నిరాటంకముగా బుద్ధికిఁ గర్తృత్వ ముండవచ్చును. వస్తుగ్రహణవిషయమున నది (బుద్ధి) సాధనంబును కావచ్చును.

"ఇట్లయిన నావస్తుగ్రహణవిషయమునందే జీవునకును స్వాభావికకర్తృత్వ ముండవచ్చును కదా" అనియెదవేమో వినుము. జ్ఞానము జీవునకు స్వరూపమే యగుటచే నందుఁ గర్తృత్వ మాతనికి సంభవింపదు. యేపదార్థము కాని తనస్వభావమునఁ దాను కర్త కానేరదు కదా! చందనము తనకు స్వభావ మగుశైత్యమునుఁ దాను పుట్టించుకొనఁగలుగునా? "ఇట్లయిన వస్తుగ్రహణవిషయమునందు ఆత్మకు గల దని చెప్పఁబడుకర్తృత్వము కూడ బుద్ధిచేతనే యారోపింపఁబడినది కావచ్చును. ఆబుద్ధి యాత్మకు నుపాధి యగుటచే తనవ్యాపారము లగుసంకల్పాదుల నాయనయం దారోపించుచున్నది కదా!" అనియెదవేమో యదియు సరిపడదు. ఇట్లుచేయవలయు ననిన సంకల్పాదులవలెనే వస్తుగ్రహణకర్తృత్వంబును బుద్ధియం దుండవలయును. సర్వమును గ్రహించుదానిని మఱియొక్కటి గ్రహించు ననుట లోకవిరుద్ధ మగునని సర్వజనులు నెఱిఁగియే యున్నారు బుద్ధివిషయమును విమర్శించిన నది యాత్మకు గోచర మగుచున్నది యనుట స్పష్టము. "నాకు సంకల్పము కలుగుచున్నది" అను మొదలగు

---

* కారకములు (ఉ. అం. పు. పా.)

వ్యవహారము లీవిషయమునఁ బ్రమాణములు. ఇట్లుండ దానికి వస్తుగ్రహణశక్తి యెటనుండి వచ్చును? సంకల్పనిశ్చయాదు లన్ననో దానివృత్తులే యగుటచే వానిని జీవునియం దారోపింపవచ్చును. బుద్ధివలెనే సంకల్పనిశ్చయాదులు కూడ నాత్మగోచరము లగుచుండుటయే దీనికి (సంకల్పాదులు బుద్ధివృత్తులు అనువిషయమునకు) దృష్టాంతము. వస్తుగ్రహణ మట్లు మఱియొకయాత్మకుఁ బ్రత్యక్ష మగుట లేదు కదా! "నేను ఘటమును చూచు చున్నా ననుట నాకుఁ బ్రత్యక్షమై యున్నది" అను మొదలగు వ్యవహారములు వస్తుగ్రహణసాక్షి యగు మఱియొక యాత్మకూడ నున్నట్లు బోధించుచున్నది కదా! యనిన నదియు యుక్తము కాదు. ఇచ్చట 'నేను' అనుశబ్దము విషయాభిముఖమై సంకల్పరూపమునఁ బ్రవర్తించుచిత్తవృత్తియందు ప్రతిబింబించినచైతన్యమును బోధించును; "నాకు" అనుపదము సర్వవ్యాపకశుద్ధచైతన్యమును బోధించును. వీరే జీవపరమేశ్వరులు వీరికి భేదము లేకపోవుటచే వస్తుగ్రహణమునకు రెండవసాక్షియుండదు కావున వస్తుగ్రహణవిషయమున జీవునకుఁ గాని బుద్ధికిఁ గాని కర్తృత్వము లేదు. కర్త లేకుండుటచే సాధన ముండియుఁ బ్రయోజనము లేదు ఉండను కూడ నక్కఱ లేదు. కావున బాగుగ విచారించిన వస్తుగ్రహణవిషయమున జీవుఁడుగాని బుద్ధికాని కర్త కాదు; బుద్ధి కరణంబును కాదు. ఇది పారమార్థికస్థితి యగుటచే "బుద్ధికి కర్తృత్వ మున్న దనినయెడల మఱియొకసాధనము ఉండవలసి వచ్చును; అప్పుడు నామమాత్రమునందే వివాదము కాని పదార్థమున లేదు." అని ముప్పదియెనిమిదవసూత్రమున చేయఁబడిన సిద్ధాంతమునకు విరోధము లేదు.

ఈవిధముగ ముప్పదియారు ముప్పదియెనిమిది సూత్రములయందు చెప్పఁబడినహేతువును సమగ్రముగ విమర్శించిన "బుద్ధికి సంకల్పాదులయందుఁ గర్తృత్వము కలదు కాని వస్తుగ్రహణమునందు లేదు; జీవునకును వస్తుగ్రహణమునందుఁ గర్తృత్వము లేదు" అని తేలినది. ఇప్పుడు ఇతరవ్యాపారవిషయమును గూర్చి విమర్శించిన నందు సాధన మగుబుద్ధికే కర్తృత్వము కలదు కావున నది యజ్ఞానప్రభావమున జీవునియం దారోపింపఁ బడుచున్నది యనవచ్చును. బుద్ధికిఁ జెప్పఁబడుకర్తృత్వముఁ గూడ నౌపచారికమే కాని స్వాభావికము కాదని బుద్ధివలనకే చెప్పి

యున్నాము కావున "అచేతనయగుటచే బుద్ధికి స్వాభావికముగఁ గర్తృత్వ ముండకూడదు" అనున్యాయమునకు నీసిద్ధాంతము విరుద్ధముకాదు. ఇఁక వస్తుగ్రహణవిషయమును పట్టి చూచిన నచ్చట మాత్రము కొంత విశదీకరింపవలసి యున్నది. జీవుఁడుగాని బుద్ధిగాని యేదియుఁ గర్త కాకుండిన నాయనుభవము ("నేను ఘటమును గ్రహించుచున్నాను" అనునను భవము) కలుగుట యెట్లు? పైన వివరింపఁబడినహేతువులను పట్టిచూచిన వానికి (జీవబుద్ధులకు) కర్తృత్వము సంభవించుట మాత్ర మెట్లు? ఈ విరోధమును సమకూర్చుటకై "కర్తృత్వము పారమార్థికముగ లేకున్నను వ్యావహారికముగ నున్నది" అని కల్పింపవలయును. ఆకర్తృత్వంబును అచేతన యగుబుద్ధికిఁ గల్పించుటకంటెఁ జేతనుఁడగుజీవునకే కల్పించుట యుక్తియుక్తము కదా! ఇఁక బుద్ధి యీవిషయమున వ్యావహారికముగనే సాధన మగును. జీవుఁడు చైతన్యరూపుఁడును సర్వవ్యాపకుఁడు నగుటచే సర్వదేహములయందును సర్వపదార్థములయందు నేకరూపముగ వ్యాపించి యున్నాఁడు. బుద్ధియు సహజముగఁ బ్రతివిషయముపై సంకల్పాదిరూపములతోఁ బ్రసరించుచున్నది. ఆ వృత్తులయందు వ్యాపించియున్నజీవుఁడే (పరమేశ్వరుఁడే) ప్రమాణ మనియు వస్తుగ్రహణసాధనమనియుఁ జెప్పఁబడును. అందు బుద్ధివృత్తియే ప్రధానము కావున "బుద్ధి సాధనము" అని చెప్పఁబడు చున్నది. ఇట్లు సర్వము వ్యావహారికమే యైయుండుటచేత నాల్గవహేతువు కూడ మాసిద్ధాంతమునకు భంగముఁ జేయనేరదు.

మఱియు ముప్పదితొమ్మిదవసూత్రమునఁ జూపఁబడినయైదవహేతువునుఁ గూర్చి క్రొత్తఁగా విచారింపవలసినపని లేదు. అదియు విధివాక్యరూపమే యగుటచే మొదటిహేతువును సమన్వయించుటతోనే సమన్వయింపఁబడిన ట్లయినది. కావున జీవునకుఁ గలకర్తృత్వ మౌపాధికమే ఇట్లగుటచే నాతనికి సంబంధాభావముఁ జెప్పుశ్రుతులు మోక్షవిషయములు; తక్కినవి బంధవిషయములు. కావున వానికిఁ బరస్పరవిరోధము లేదు.

---

# పరాయత్తాధికరణము. ౧౬.

విషయము, సంగతి:—ఇందు "జీవునకుఁగలసాధకకర్తృత్వము కూడ నీశ్వరాయత్తమే కాని స్వతంత్రము కాదు" అనువిషయము విచారపూర్వకముగ సిద్ధాంతము చేయఁబడును. సంగతి యిదివరకే (చూ. ౨-3-౧౯.) నిరూపింపఁబడెను.

సందేహము:—"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష హ్యే వాసాధు కర్మ కారయతి తం య మధో నినీషతే" ="ఏజీవుని యీలోకమునుండి యూర్ధ్వగతిని పొందింపఁదలంచునో వానిచేతనీపరమేశ్వరుఁడు మంచికార్యములఁగ జేయించును; ఎవ్వని నధోలోకమునకు నడప దలంచునో వానిచే నశుభకర్మలఁ జేయించును"అని కొన్నిశ్రుతులయందు జీవకర్తృత్వము సంపూర్ణముగ నీశ్వరాధీనమే యని చెప్పఁబడియున్నది. మఱియొకస్థలమున ననేకవేదవాక్యములు జీవునిఁగూర్చి "నీ వీకార్యమును చేయవలయును; దీనిని చేయరాదు" అని విధినిషేధములఁ జెప్పుచున్నవి. జీవుఁడు సంపూర్ణముగ పరాధీనుఁడే యగునేని యిట్లు చెప్పుటవలనఁ బ్రయోజన ముండదు. కావున నీశ్రుతులకు పరస్పరవిరోధము వచ్చునా? లేదా?

పూర్వపక్షము:—అను నీసంశయముపైఁ బూర్వపక్ష మిట్లు వచ్చును. బాగుగ విచారించిన జీవునకు సాధనసహాయ మపరిమితముగఁ గలదు కావున నాతండు స్వయముగనే సర్వకార్యములనాచరింపవచ్చునని తోఁచుచున్నది. నాఁగలి యెద్దులు మొదలగుసర్వసాధనములసంపాదించి వ్యవసాయము చేయుచున్ననడుమ యీశ్వరుఁ డెవ్వని ప్రేరేపింపవలయును? సాధనము లున్నవాఁడు తత్తత్కార్యముల జేయఁగలుగుచున్నాఁడు; లేనివాఁడు చేయ నేరకున్నాఁడు. ఇం దీశ్వరుఁ డేమిచేయును? మఱియు నాయీశ్వరుఁడు జీవులను ప్రేరేపించు ననుటకే మొట్టమొదట వీలు లేదు. ఆయన దయామయుఁడు; సర్వసముఁడు. ఇట్టివాఁడు అందఱను తనకు స్వాధీనులుగ నుంచుకొని వారలచేఁ గార్యములఁ జేయించునేని ధర్మము నే చేయింపవలయును. అప్పుడు అందఱును సుఖవంతులే కావలయును. ఆయీశ్వరునకు నొకరియందు వైరంబును మఱియొకనియందు ప్రీతియు కల దనుటకు వీలు లేదు కావున [illegible] లేదు. సుఖవం

తులకంటె నధికముగ దుఃఖితులే కానవచ్చుచున్నారు. ఇట్లు కాక జీవునకే స్వాతంత్ర్య ముండునేని యప్పు డాతఁడు రాగద్వేషాదియుక్తుఁడగుటచే ధర్మాధర్మముల నన్నిటి ననియమముతో నాచరింపవచ్చును; సుఖదుఃఖఫలములను గూడ నొందవచ్చును. ఇట్లయిననే కాని విధినిషేధశాస్త్రములకుఁ గూడ బ్రయోజన ముండదు. అత్యంతపరాధీనుని గూర్చి యేమిచెప్పిన నేమిప్రయోజనము? వాఁడు తనయధికారి (యీశ్వరుఁడు) యెట్లు చెప్పిన నట్లు చేయవలసినవాఁడే కదా! మహాప్రవాహమధ్యమున బడిపోవువానివిషయమున నుపదేశము లేమిపనికివచ్చును? ఈకారణముల వలన సర్వదోషపరిహారార్థమై జీవునకుఁ గలకర్తృత్వము పరాధీనమైనది కా దనియే నిర్ణయింపవలయును. "ఏష హ్యేవ" అను మొదలగు శ్రుతివాక్యములకుఁ బరమేశ్వరప్రశంసయే యర్థ మని చెప్పవలయును.

## సూత్రము. ౪౧.

అవతారిక:—అనిన నీపక్షమును నిరాకరించుచున్నాఁడు.

## ౨౫౮. పరాత్తు తచ్ఛ్రుతేః. ౨. ౩. ౪౧.

తాత్పర్యము:—ఇట్లు చెప్పఁగూడదు. జీవునకుఁ గలకర్తృత్వమీశ్వరాధీనమే కావలయును; బంధమోక్షములును ఈశ్వరప్రేరణవలననే కలుగవలయును. ఇదియే యుక్తము ఏలయనిన:—జీవుఁడు స్వయముగ బ్రహ్మాభిన్నుఁడే యైనను అనాద్యవిద్యచే నావరింపఁబడినవాఁ డగుటచే సాధనము లగుబుద్ధిమొదలగువానికిని తనకును గలభేదము నెఱుంగలేక గ్రుడ్డివానివలె నవియే తా నని భావించుచున్నాఁడు; వానికిఁ గల యస్వాతంత్ర్యము జడత్వము మొదలగునవి తనకే కల వని భావించుచున్నాఁడు. ఇట్టివానికి స్వతంత్రకర్తృత్వ మెట్లు కలుగును? చేతనుఁడైనను భ్రాంతివశమున నచేతనునివలె నుండుటచే వానికిఁ గర్తృత్వాదులీశ్వరానుగ్రహమువలననే రావలసి యుండును. ఆయీశ్వరుఁడు సర్వకర్మలకు నధిపతి (అనఁగా ఆయనయొక్క సన్నిధానమువలననే చిత్రాదులన్నియుఁ బ్రవర్తించు ననుట) సర్వజీవులయందును నివసించువాఁడు భ్రాంతిచే నచేతనసదృశ్యులై యుండుటచే జీవులకు చైతన్యము నొసంగఁ గలవాఁడు. (అనఁగా తనసాన్నిధ్యముచే జీవులను ప్రవర్తింపఁజేయువాఁ డనుట) ... నుత్తర

కర్మలయందు ప్రవర్తింపఁజేయువాఁడనుట.) కావున జీవులకు నవశ్యముగ నిట్టివానియనుగ్రహ ముండవలయును.

ఇందలిగహస్య మిట్లు గ్రహింపవలయును. అంతఃకరణ మనునది (మనస్సనునది) సర్వానుభవసిద్ధమై యున్నది. దానినుండి సంకల్పవికల్ప నిశ్చయాదులు జనించుచుండును. ఈసంకల్పాదులు దానికిఁ గార్యములు కావు. ఆమనస్సే ఈరూపములతో విషయాభిముఖమై వికాసమును జెందును. కావున ఆమనస్సునకును వీనికిని భేదము లేదు. మఱియు నామనస్సు జడము. సర్వవ్యాపకుఁడగుటచే పరమేశ్వరుఁడు ఘటాకాశమువలె నందుఁ జేరియున్నాఁడు. ఇట్లు చేరుటవలననే యది (మనస్సు) లోకమునకు చేతనమువలె దోఁచుచున్నది; సంకల్పాదులును చేతన కార్యములవలె దోఁచుచున్నవి. ఇట్లు మనస్సునకును అందలియీశ్వ రాంశకును భేదము గ్రహింపఁబడకుండుటచే మనస్సాక్షి యగుకూట స్థుఁడే జీవసాక్షిగాఁ గూడఁ బరిగణింపఁబడుచున్నాఁడు. అంతఃకరణమున నున్నచైతన్యమే జీవుఁడని చెప్పఁబడును. మనోవృత్తులు కూడ నంత కంటె లోపల నున్న మఱియొక్కనికి గోచరము లగుచున్నవి యనుటయు సర్వానుభవసిద్ధ మగువిషయమే కదా! ఈకారణమువలన లోకదృష్టి ననుసరించి "అంతఃకరణము చేతనప్రేరణ లేక నెట్లు స్వయముగ సంక ల్పింపనేరదో అట్లే తదభిన్నుఁడగుజీవుఁడును పరప్రేరణ లేక స్వయ ముగ నేకార్యము నాచరింపనేరఁడు" అని నిర్ణయింపఁబడినది. సర్వోప దేశములును లోకదృష్టి ననుసరించియే కదా ప్రవర్తించుచున్నవి. పర మార్థస్థితిలో నెవ్వనికిని కర్తృత్వము లేదు కదా! కావున నీవిషయమున వివాదము చేయ నక్కఱ లేదు.

ఈయభిప్రాయముచేతనే శ్రుతియు "ఏష హ్యేవ" అని చెప్పు చున్నది. "య ఆత్మని తిష్ఠన్నాత్మాన మంతరో యమయతి"="ఏపరమేశ్వ రుఁడు జీవునిలోపల నుండి యాజీవుని ప్రేరేపించుచున్నాఁడో" అనియు జెప్పుచున్నది. జీవుఁడు రాగద్వేషాదిదోషయుక్తుఁడైనను సాధనసమృద్ధి కలవాఁడైనను లోకమున కృష్యాదులయందు జీవాతిరిక్తుఁడగుకర్త గానఁబడకుండుటచే సర్వవిషయములయందు నట్టే సిద్ధాంతము చేయ వచ్చునని నిర్ణయ మగుచున్నను "సర్వవిషయములయందును పరమేశ్వ

రుఁడె *"హేతుకర్త" యని సిద్ధాంతము చేయుచున్నది. కావున వ్యావహారికవిషయమును చెప్పు నీశ్రుతితో నట్టివియే (వ్యావహారికవిషయమును చెప్పునవియే) యనువిధినిషేధవాక్యములకు విరోధము లేదు. "ఏష హ్యేవ" అను శ్రుతి హేతుకర్తను చెప్పును; విధినిషేధవాక్యములు †ప్రయోజ్యకర్తను గూర్చి చెప్పును.

## సూత్రము. ౪౨.

అవతారిక:—" 'ఇట్లయిన జీవుఁడు సంపూర్ణముగ నస్వతంత్రుఁడయ్యెను. ఈశ్వరుఁడు ప్రేరేపించునేని దయామయుఁ డగుటచే ధర్మమునందే ప్రేరేపింపవలయును. లేకున్న నిర్దయత్వంబును రాగద్వేషములును సంభవించును. మఱియు సృష్ట్యాదియందు ఈశ్వరుఁ డూరకనే కొందఱ సుఖవంతులుగాను మఱికొందఱ దుఃఖవంతులుగాను చేసె నన వలసివచ్చుటచే ‡ నకృతాభ్యాగమదోషము వచ్చును' అంటిని కదా!" అనిన నది యుక్తము కా దని చెప్పుచున్నాఁడు.

## ౨౪౯. కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః. ౨. ౩. ౪౨.

పైఁజెప్పినదోషములు మాసిద్ధాంతమున నెల్లను రావు. ఈశ్వరుఁడు జీవుని స్వకార్యములయందు ప్రవర్తింపఁజేయుచున్నాఁ డనుట సత్యమే కాని గాలి జలము మొదలగువానివలె వారిని (జీవులను) బలాత్కారముగఁ ద్రోసికొని పోవుట లేదు. ఇఁక నేమి యనిన వారికి గలసాధనసామగ్రికిని వారికిని గలకర్తృత్వము ననుసరించుచునే నిమిత్తమాత్రుఁడై యున్నాఁడు. వారు పూర్వజన్మములయం దాచరించినపుణ్యపాపకర్మముల ననుసరించియే వారిని ప్రేరేపించుచున్నాఁడు. లోకమున వడ్లు

---

* హేతుకర్త యనఁగాఁ జేయించువాఁడు.

† ప్రయోజ్యకర్త యనఁగా చేయువాఁడు. ఆచార్యుఁడు శిష్యునిచేతఁ బాఠమును చదివించెను అనువాక్యమునఁ జదివించినయాచార్యుఁడు హేతుకర్త; చదివినశిష్యుఁడు ప్రయోజ్యకర్త.

‡ అకృతాభ్యాగమ మనఁగా తాఁ జేయనిదే యనుభవమునకు వచ్చుట.

గోధుమలు మఱ్ఱి జువ్వి మామిడి మొదలగువృక్షములు ఆకారమునం దును రుచియందును వాసనయందును బహుభేదములు కలిగి వానివాని వి త్తనములనుండి మాత్రమే జనించుచున్నను వాని కన్నిటికిని మేఘుఁడు నిమి త్తకారణ మైనట్లే, జీవుఁడును పరస్పరము నానాభేదములు కలిగి తమతమకర్మల నాశ్రయించియే జనించుచున్ననూ వాని నాశ్రయించియే తమతమ కార్యములయందుఁ బ్రవ ర్తించుచున్ననూ ఈశ్వరుఁడు వానికి నిమి త్తకారణమై యున్నాఁడు. వృక్షములకు వానిబీజములే కారణము లైననూ మేఘుఁడు లేకపోయిన జన్మము కలుగనట్లు జీవులకును కర్మలే కారణము లైననూ పరమేశ్వరుఁడు లేకున్న వ్యాపారములు కలుగవు. మేఘుఁడున్నను బీజములు లేకున్న వృక్షమునకు రసాదిభేదములు కలుగు నట్లు పరమేశ్వరుఁ డున్ననూ కర్మలు లేకున్న జీవులకును సుఖదుఃఖభేద ములు కలుగవు. కావున కర్మల నాశ్రయించియే యీశ్వరుఁడు జీవులను ప్రవ ర్తింపఁజేయుచున్నాఁడు. సంసార మనాది యగుటచే నీకర్మలకును ఆద్యంతములు లేవు. ఈజన్మమున పూర్వకర్మానుసారముగ ప్రవ ర్తింపఁ జేయవచ్చును; పూర్వజన్మమున తత్పూర్వకర్మానుసారముగ ప్రవ ర్తింపఁ జేసి యుండవచ్చును. ఈకారణమువలన నవతారికయందుఁ జూపఁబడిన దోషము లేవియును రావు. జనులకు నుపకారమును గావించినవానిని గౌరవించుచు నపకారము చేసినవానిని శిక్షించుచు నుండుప్రభువు దయా హీనుఁడును రాగద్వేషయుక్తుఁడును కానేరనట్లు, జీవకృతపుణ్యాపుణ్యము లవశమున తత్తదనుగుణఫలంబుల నొసంగునీశ్వరుఁడును దయాహీనుఁడు గాని రాగద్వేషయుక్తుఁడుగాని కానేరఁడు. కర్మ యనాది యగుటచే నకృ తాభ్యాగమదోషంబును రాదు. ఈశ్వరుఁడు కేవలనిమి త్తకారణము మాత్రమే యగుటచే నిష్టమును సంపాదించుటయందు ననిష్టమును తొలఁగించుకొనుటయందును జీవుఁడు స్వయముగనే కర్త కావచ్చును.

ఇట్లుండిననే కాని పరమేశ్వరుఁడు కర్మాధీనుఁడై జీవుని ప్రేరే పించునేని యప్పుడు మాత్రమే విధినిషేధశాస్త్రములును పురుషప్రయ త్నములును సార్థకము లగును. అప్పుడు జీవునకు కర్మాచరణమునందు కొంతస్వాతంత్ర్యము కలదు కావున వానినిఁ గూర్చి విధినిషేధముల జెప్పవచ్చును. సజ్జనసాంగత్యాదిసాధనములచే పూర్వవాసనాదృష్ట మగు చిత్తమును త్రిప్పి చక్కఁజేయ ప్రయత్నింపు మని బోధింపవచ్చును;

యోగాదుల నైన నాచరించి యాకార్యమును సాధించుటకు పురుషులును దృఢప్రయత్నము నాచరింపవచ్చును. ఈశ్వరుఁడే స్వతంత్రించి సర్వమును చేయునేని యప్పుడివియన్నియు వ్యర్థములుకావలసివచ్చును; ఈశ్వరునకుఁ గూడ రాగద్వేషాదు లుండుట కూడ లోకానుభవము ననుసరించి సిద్ధించుటచే పాపకర్మ నాచరించినవానికిఁ గూడ సుఖంబును పుణ్యము నాచరించినవానికిఁ గూడ దుఃఖంబును రావలసి కూడ వచ్చును. మఱియు జీవునకు బొత్తుగనే స్వాతంత్ర్యము లేకున్నను విధినిషేధశాస్త్రములకు సార్థకత్వము ను చెప్పవలయు ననిన నావిధినిషేధములుపరమేశ్వరునిఁగూర్చియే చెప్పఁబడె ననవలయును. ఇవి యన్నియు ననిష్టము లే కదా! ఈకారణము వలన నీశ్వరున కవశ్యము జీవప్రేరణమునందుఁ గర్మాపేక్ష కలదు. "ఇట్లయిన సర్వస్వాతంత్ర్యము జీవునకే కల దని యేల చెప్పరాదు" అనియెద వేమొ యదియు లోకానుభవవిరుద్ధమే. జీవునకే సర్వస్వాతంత్ర్య మున్నయెడల ననిష్టఫలము నశక్తునివలె నేల యనుభవించును? పరమేశ్వరాంశభూతుఁ డగుటచే నాతఁడును సర్వశక్తుఁడే; కర్మయు నాతనికంటె హీనవీర్య మగునదియే కదా! పరమేశ్వరుని పుణ్యపాపములు బాధించుట లేదు కదా! ఈకారణమువలన భ్రాంతిమయ మగుభేదమువలన జీవునకు సర్వస్వాతంత్ర్యము లే దనియు నీశ్వరునకు కలిగియున్నను కర్మ నాశ్రయింపకపోయిన రాగద్వేషములు సంభవించుటచే నట్లాశ్రయించియుండు ననియు సిద్ధాంతము చేయవలయు.

ఇందలిరహస్యము నెట్లు తెలిసికొనవలయును. జీవునిస్వరూపము గూర్చియు వానిని పరమేశ్వరుఁడు ప్రవర్తింపఁజేయవలసినయావశ్యకతను గూర్చియు పైసూత్రమునందే వివరించి యున్నాము. పూర్వకర్మలు సంస్కారరూపమున నంతఃకరణమునం దుండును. శుభకర్మల నాచరించిన వానికి శుభసంస్కారములును పాపకర్మల నాచరించినవానికిఁ బాపసంస్కారములును అంతఃకరణమున నిలిచి యుండును. ఇది లోకానుభవసిద్ధము. పరహింసల నాచరించుచోరాదులకు గారణానంతరమువలన మఱియొక పని దొరకినను వారిచిత్తమెప్పుడును క్రూరముగానే యుండుటయు క్రూరసాంగత్యాదులుకలిగినను బహుకాలమువరకు సజ్జనచిత్తములు పెడత్రోవల ద్రొక్కకుండుటయు నను నిర్వివాదము నెల్లవారికిని ప్రత్యక్షముగ

జూచుచున్నాము. అన్నిజన్మములయందు నంతఃకరణ మొక్కటియే కావున ననాదినుండియు నీకర్మసంస్కారములు దానియందు (అంతఃకరణమునందు) నిలచియే యుండును. వీని నాశ్రయించియే యది శుభపాపసంకల్పములఁ జేయుచు తత్తత్కార్యములయం దింద్రియముల ప్రవర్తింపఁ జేయును. ఇది నియతము జీవుఁడును అంతఃకరణాభిన్నుఁ డగుటచే నిట్లే ప్రవర్తించును; ఈశ్వరుఁడును ప్రవర్తింపఁ జేయును. ఇదియే యీశ్వరునికర్మసాపేక్షత్వము. ఆయన నియతిని మాత్రమే రక్షించువాఁ డని తెలిసికొనవలయును. ఈకారణమువలననే మనము సర్వశాస్త్రముల విమర్శించి జాగరూకులమై ప్రమాదము నొందకుండ సకలకార్యముల సాధించుటకు ప్రయత్నింపవలయును; సజ్జనసాంగత్యాదులచే మనస్సును నిర్మలము చేయఁ బూనవలయును. ఒకజన్మమున ప్రారబ్ధకర్మబలమువలన సిద్ధింపకున్ననూ నదీప్రవాహమధ్యమునఁ బోవుదూలమును త్రాటితో కొంచెముకొంచెముగ నీడ్చిన కొంతసేపటికి నది తీరము జేరునట్లు సర్వసంకల్పములును కాలక్రమమున సిద్ధి నొందును. “న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. పూర్వాభ్యాసవశే నైవ నీయతే హ్యవశోఽపి తత్”=“యర్జునా మంచిపని చేయఁబూనినవాఁడు దుర్గతిని చెందఁడు. పూర్వజన్మమున నాచరించినయభ్యాసముయొక్క బలమున బలాత్కారముగ నైనను రెండవజన్మమున నామార్గమునకే వచ్చును” అనుభగవద్వాక్యము ననుసరించి యేప్రయత్నముగాని యెంతమాత్రము చేయఁబడినను నిరర్థకముగ పోవదు; ముఖ్యముగ మనశ్శుద్ధిని గూర్చి చేయఁబడిన దట్లు పోవదు.

---

## అంశాధికరణము. ౧౭.

విషయము:—ఇప్పటికి జీవస్వరూపము నిర్ణయింపఁబడెను. * త్వంపదార్థనిర్ణయము ముగిసినది. ఇఁక నీయధికరణమునందు జీవబ్రహ్మైక్యము బోధింపఁబడును.

---

* త్వంపదార్థనిర్ణయ మనఁగా జీవస్వరూపస్వభావనిర్ణయము.

సంగతి:—"పూర్వాధికరణమున నీశ్వరుఁడు * ప్రయోజ్యకర్త యనియు జీవుఁడు ప్రయోజ్యుఁ డనియుఁ జెప్పఁబడెను. అది యుక్తము కాదు. ప్రయోజ్యప్రయోజకుల కేదియో యొకసంబంధ ముండవల యును; మీమతమున (వేదాంతమతమున) నభేదమే యంగీకరింపఁబడి యుండుటచే నట్టిసంబంధ ముండుటకు వీలు లేదు. ఏసంబంధ ముండ వలయు నన్నను బదార్థభేద ముండిననే కాని యుండను కదా" అను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁ బడుచున్నది. ఈరెంటికిని ఆక్షేపమే సంబంధము.

సందేహము:—వేదమునందు "య ఆత్మని తిష్ఠన్" అనుకొన్ని వాక్యములు జీవబ్రహ్మభేదమును జెప్పుచున్నవి. "తత్త్వమసి" అను కొన్ని వాక్యములు అభేదమును చెప్పుచున్నవి. ఈరెండును సమానబల ములే జీవేశ్వరులు ప్రయోజ్యప్రయోజకులై యుండుట యనుభవసిద్ధ మగువిషయము కావున, నిది భేదము లేకున్న సంభవింపదు కావునను భేదశ్రుతులును ప్రామాణికములే. మీమతము ననుసరించి చూచిన నభే దశ్రుతులును ప్రామాణికములే కదా! మీరు ఆయభేదమునే పరమార్థ ముగ నంగీకరించుచున్నారు కదా!

పూర్వపక్షము:—ఈకారణమువలన నీశ్రుతులకు గలవిరోధ మెట్లునుఁ బోవదు. ఏదియో యొకసంబంధము లేకున్నఁ బ్రయోజ్య ప్రయోజకభావ ముండుటకు వీలు లేదు కదా! ఇక నాసంబంధ మెట్టిది? యజమానునకును భృత్యునకునుఁ గలసంబంధమువంటిదా? (అత్యంత భేదము) లేక అగ్నికిని మిడుఁగురునకునుఁ గలసంబంధము వంటిదా? † (అం శాంశీభావసంబంధమా) ఇందేసంబంధమును నిర్ణయించుటకును మీమ తము నాశ్రయించిన వీలు లేదు. మీరు అభేదమును జెప్పుదురు; పర మేశ్వరునకు నవయవములు లేవందురు. అవి లేకున్న నీరెండుసంబంధ ములుఁగూడ నుండుటకు వీలు లేదు కదా! కావున భేదపక్షమునే యవశ్య మంగీకరింపవలయును. పరమేశ్వరుఁడు జీవుని ప్రేరేపించు ననియు జీవుఁడు పరమేశ్వరరూపమును వెదకవలయుననియు జీవుఁడు పరమేశ్వరునియందే

---

* ప్రయోజ్యకర్త యనఁగా హేతుకర్త (చూ. ౯౦౬. పు.)

† అంశమనఁగా భాగము అంశి యనఁగా నాభాగములోఁగూడిన పదార్థము. ఈరెంటికిని గలసంబంధ మంశాంశీభావసంబంధము.

నిలచి యున్నాఁడనియు ననేకవిధములుగ శ్రుతి చెప్పుచున్నది కదా! ఇది యెల్ల భేదము లేకున్న నెట్లు సిద్ధింపఁగలదు?.

"ఇట్లు కాదు సమానబలములై భేదాభేదశ్రుతులు రెండును గలవు కావున వానికి విరోధము లేకుండ 'జీవుఁడు పరమేశ్వరుని యంశము' అని సిద్ధాంతముఁ జేసితిమి. ఇట్లయిన భేదంబును అభేదంబునుం గలుగ వచ్చును. అగ్నినుండి వెలికి వచ్చిన మిణుఁగురులు ఆయగ్నికంటె భిన్నంబు నభిన్నంబు నగునట్లు జీవుఁడును బరమేశ్వరునికంటె భిన్నుఁడు నభిన్నుఁడు గూడ నగును. ఘటాకాశము మహాకాశమునకంటె భిన్నము నభిన్నముఁ గూడ నగునట్లు జీవుఁడును పరమేశ్వరునికంటె భిన్నుఁడు నభిన్నుఁడుఁ గూడ నగును." అనియెదవేమొ ఇదియు యుక్తము కాదు. భేదాభేదము లొక్కస్థలమున నుండవు. మీసిద్ధాంతము నిలచినచో నప్పుడు "హీనోపాధియందున్నతనయంశము నీశ్వరుఁడు ప్రేరేపించుచున్నాఁడు" అనిచెప్పుటకు వీలుకలుగును కాని అదిమాత్రము (మీసిద్ధాంతముమాత్రము)నిలువదు. పరమేశ్వరునకు నవయవములే లేవుకదా! అట్టివానికి నంశము లెటనుండి వచ్చును? వచ్చుననినను మఱియొకవిరోధము కలుగును. అప్పుడు జీవుఁడు పరమేశ్వరునకు నవయవరూపుఁడే యగుటచే నవయవములయందున్న బాధ శరీరికి నుండునట్లు జీవునకుఁ గలబాధ యీశ్వరునకుఁ గూడ నుండవలసివచ్చును. అప్పుడు ముక్తుఁడై యీశ్వరరూపము నొందినవానికి సర్వజీవులకునుఁ గలబాధ లన్నియుఁ గలుగవలసివచ్చును. బద్ధుఁడుగా నున్నప్పు డొక్కనిబాధయే ముక్తి నొందినప్పుడు మాత్ర మొందని బాధయుఁ గలుగుటచే మహాదుఃఖము కలుగు ననవలసివచ్చును. అప్పుడు ముక్తి మిగుల ననర్థకారిణి యగుటచే దానినిఁగూర్చి యెవ్వఁడును ప్రయత్నింప కుండవలసివచ్చును. ఇది యంతయు ననర్థమేకదా! ఇట్లుకాక "పరమేశ్వరుఁడే సత్యరూపుఁడు జీవుఁ డసత్యరూపుఁడు కల్పితుఁడు" అనిన నది సర్వానుభవవిరుద్ధము. ప్రతివాఁడును సంసారదుఃఖము ననుభవించుచున్నాఁడు కదా! కావున నెట్లును భేదమే పరమార్థము; భేదశ్రుతులే ప్రామాణికములు అభేదశ్రుతులు జాతినిఁ గూర్చి చెప్పును. చేతను లగుటచే జీవేశ్వరులకు జాతి యొక్కటియే కదా! కావున బ్రహ్మ మెప్పటికి నేకరూపము కాదు.

## సూత్రము. ౪౩.

అవతారిక:—అనునీపూర్వపక్షము నీయధికరణమున ఖండించు చున్నాఁడు.

## ౨౬౦. అంశో నానావ్యపదేశా దన్యథా చాపి దాశకితవాదిత్వ మధీయత ఏకే. ౨. ౩. ౪౩.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్తమైనదికాదు. వేదమునందు భేదశ్రుతులును అభేద శ్రుతులును గూడ పెల్లుగఁగలవు. వానికి విరోధము కలుగకుండవలయు ననిన నేదియో యొకవిధముగ భేదాభేదముల రెంటి నంగీకరింపవలసినదియే. కాని యందొకపక్షమును మాత్రమే యంగీకరించుటకు వీలు లేదు. అందును అభేదమునే పరమార్థముగ నంగీకరించుట యుక్తము. ఏలయనిన:—

లోకప్రసిద్ధములు కానివిషయములను నయుక్తికముగ బోధించుటయే శాస్త్రమునకుఁ బ్రయోజనము. ప్రమాణములచే నిర్ధారణ చేయవలసినది యప్రసిద్ధవిషయములనే కదా! ఇట్లగుటచే సర్వప్రసిద్ధ మగు భేదమును క్రొత్తగ వేదము నిరూపింప నక్కఱ లేదు. అభేద మట్టిది. (లోక ప్రసిద్ధ మైనది) కావున దానిని 'అవశ్యముగ నిరూపింపవలయును. మఱియు సర్వోపనిషత్తులయందును ఆదిమధ్యాంతములలో నాయభేదమే ప్రతిపాదింపఁ బడుచున్నది. "ఏక మే వాద్వితీయం" అని యారంభించి "ఐతదాత్మ్య మిదం సర్వం" అని శ్రుతి యుపసంహరించుచున్నది. "బ్రహ్మదాశా, బ్రహ్మదాసా, బ్రహ్మై వేమే కితవాః"="మత్స్యాదులచే హింసచే జీవించుచు నీచులై యున్నచెంబడివాండ్రును, దమజీవితమును స్వాతంత్ర్యము నంతయుఁ బరులకై వినియోగించుదాసులునుఁ, బాపమనక ద్యూతమునందుఁ బ్రవేశించి వంచనచేఁ బరధనముల హరించు జూదరులును, ఎవ్వరెవ్వరు కలరో వా రందఱును బ్రహ్మమే" అని నీచులనుఁ గూడఁ బరమేశ్వరరూపులనుగఁ జెప్పుటచే సర్వమును బ్రహ్మమే యని శ్రుతి బోధించుచున్నది. ఇట్లుండ నాద్యంతమధ్యములయం దేకవాక్యముగఁ జెప్పఁబడియున్నవిషయము [illegible] చెప్పఁబడె నను

టయు, లోక ప్రసిద్ధి ననుసరించి యనువాదమాత్రముగఁ జెప్పఁబడినవిషయ మే గ్రంథతాత్పర్య మనుటయు యుక్తియుక్త మగునా? లోకులు అనాదిగ నుండియు భేదబుద్ధి కలవా రగుటచే మొట్టమొదట దాని ననువాదముఁ జేయకుండిన నభేదమును బోధించుటకు వీలు లేదు. కావున శ్రుతి కొన్ని స్థలములయందు భేదమునుఁ జెప్పుచున్నది. మఱియు భేదమునే పరమార్థ ముగఁ గైకొనిన నభేద శ్రుతులకు నర్థ ముండదు. అభేద శ్రుతులనుఁ బర మార్థముగఁ గైకొనినచో భేదశ్రుతుల ననువాదమాత్రములను సమర్థిం చుటకు వీ లుండుటచే వానికి (భేదశ్రుతులకు) నిరర్థకత్వము కలుగదు.

ఈకారణమువలన జీవేశ్వరులయందు కానఁబడుభేదము కల్పితమే యని సిద్ధాంతముఁ జేయవలసి యున్నది. అగ్నికి మిడుఁగుఱువలె నీశ్వరు నకు జీవుఁ డంశభూతుఁడై యున్నాఁ డని చెప్పవలసి యున్నది. పరమేశ్వ రుఁడు నిరవయవుఁ డగుటచే నాయనకు పారమార్థిక మగునంశము సంభ వింపదు కదా!

## ౨౬౧. మంత్రవర్ణాచ్చ. ౨. ౩. ౪౪.

ఈవిషయము మఱియొకమంత్రమునఁ బ్రత్యక్షముగనే చెప్పఁబడి యున్నది. "ఏతావా నస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాద స్యాఽమృతం దివి"="ఈప్రపంచ మంతయు సహస్రశిరస్సుఁ డగునాపురుషునియొక్క విభూతియే. ఆయనకు సర్వభూతములును స్థావరజంగమపదార్థములు నొక్కభాగము వీనికంటె మీఁదఁ గూడ నాపురుషుఁడు మూఁడుభాగములతో నున్నాఁడు" అను వాక్యమున జీవుఁ డీశ్వరునిపాద మని చెప్పఁబడి యున్నది. భూతశబ్దము నకు జీవసహితము లగుస్థావరజంగమములే యర్థ మనుటయుఁ బాద మన్నను భాగమనినను అంశ మనిన నొక్కటియే యనుటయు సుప్ర సిద్ధము కదా! కావున జీవుఁడు పరమేశ్వరునియంశము; కల్పితాంశము.

## ౨౬౨. అపి చ స్మర్యతే. ౨. ౩. ౪౫.

తాత్పర్యము:—మఱియు "మమైవాంశో జీవలోకే, జీవభూత స్సనాతనః"="ఈలోకమునందు లేక జంతుజాలమునందు నాయంశమే యనాదియై జీవరూపమునుఁ జెందియున్నది." అని గీతయందును, ఈవిష

యమే స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. ఇట్లగుటవలన జీవుఁడు నిర్వివాదముగఁ బరమేశ్వరునియొక్క కల్పితాంశమే. ఈకల్పితభేదము నాశ్రయించియే పూర్వాధికరణమున వర్ణింపఁబడినతెఱంగునఁ బరమేశ్వరుఁడుఁ దన కంశభూతుఁ డగుజీవునిఁ బ్రేరేపింపవచ్చును. తాను శుద్ధుఁడు; సర్వశక్తుఁడు. జీవుఁడును తనతో నభిన్నుఁడే యైనను ఉపాధివశమునఁ దనకంటె హీనుఁడై శక్తిహీనుఁడై యున్నవాఁడు (భ్రాంతివశమున నట్లు తోఁచుచున్నవాఁడు) కదా! కావున మాపక్షమున విరోధము లేదు.

# సూత్రము. ४౬.

అవతారిక:—"ఇట్లయిన జీవునకుఁగలుగు బాధలు పరమేశ్వరునకుఁ గలుగవలయు ననియు నప్పుడు మోక్షము సర్వదుఃఖమయము కావలసి వచ్చుటచే సంసారమునకంటె ననర్థకర మగు ననియు జ్ఞానము నిష్ప్రయోజక మగు ననియుఁ జెప్పితిని కదా!" అనియెదవేమొ అట్లు కాదని సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౨౬౩. ప్రకాశాదివ న్నైవం పరః. ౨. ౩. ४౬.

తాత్పర్యము:—పై పూర్వపక్షము యుక్తము కాదు. జీవునకు గలుగుదుఃఖములతోఁ బరమేశ్వరునకు సంబంధము కలుగ నక్కఱలేదు. జీవుఁడు పరమేశ్వరునితో పరమార్థస్థితిలో నభిన్నుఁడే యైనను ఉపాధివశమున భిన్నుఁడై యున్నాఁడు. అవిద్యావశమున దేహాదులనే యాత్మగా భావించుచు, దేహాదులే స్వరూపముగఁ గలవానివలెఁ బ్రవర్తించుచు, వానికిఁ గలుగుదుఃఖములఁ దనవిగా భావించుచు నున్నాఁడు. వానికిఁ గూడఁ బరమార్థస్థితిలో దుఃఖమే లేదు. వానికిఁ బరమార్థస్థితిలో దుఃఖ ముండిననే కదా తదభిన్నుఁ డనుకారణమువలన నది యీశ్వరునకు నుండవలసివచ్చును. మొట్టమొదట వానికే యది లేకున్న నిక నీశ్వరునకు నెటనుండి కలుగును?.

దుఃఖము అభిమానమువలననే కలుగును కాని స్వాభావికముగ నెవ్వనికి నుండదు. ఇది లోకప్రసిద్ధము. ప్రతివాఁడును తనశరీరమునందు జనించుబాధను అభిమానవశముచే శరీరమునకంటె భిన్నుఁ డగుతనయం దారోపించుకొను చున్నాఁడు. తనస్వరూపమునకు శరీరమునుండి భేదము

కలదో? లేదో? యని సంశయమున్నను సర్వలోకప్రసిద్ధ మగుభేదము కలస్థలములయందుఁ గూడ నిట్లు గానవచ్చుచున్నది. పుత్త్రుఁడు భార్య మిత్త్రుఁడు మొదలగువారియందు ప్రేమ మాత్రమే యధికముగ నుండును కాని భేదము మాత్రము లేకపోదు కదా! తనకంటె వారు (పుత్త్రాదులు) భిన్ను లనుటలో సంశయ మొందువాఁ డెవ్వఁడును లేఁడు. ఇట్లున్ననూ పుత్త్రుఁడు వ్యాధిగ్రస్తుఁ డైనచో "నేను బాధపడుచున్నాను నాప్రాణము నిలుచునట్లు లేదు" అని జనులు వ్యవహరించు చున్నారు. ఆబాధ పుత్త్రునకుఁ గలుగుచున్నది కాని తనకు లేదు కదా! ఇట్టివ్యవహార మేల కలిగినది? పుత్త్రునియం దున్న యభిమానాతిశయమువలననే కదా! కావున నీయనుభవము ననుసరించి చూచిన 'ఎచ్చట నభిమాన మధికముగ నుండునో దానికి సంబంధించినసుఖదుఃఖము లన్నియుఁ దనకే కలిగిన ట్లుండును' అని సిద్ధాంతముఁ జేయవలసి యున్నది. తనకు వ్యాధ్యాదులచే బాధ యున్ననుఁ బుత్త్రాదులకు నభివృద్ధి కలిగినచో స్వస్థునివలె సంచరించు వారుఁ గూడ లోకమునఁ గలరు. మఱియుఁ బుత్త్రమరణము మొదలగు దుఃఖవార్తల నెవ్వరైననుఁ జెప్పుచుండిన నప్పుడు పుత్త్రాదులయం దభిమానము కలవారికే మనస్సు చివుక్కురుమనును. కాని యట్టియభిమానమును పరిత్యజించినసంన్యాసి మొదలగువారికి చివుక్కురుమనదు. ఇట్లు విచారించిన నభిమాన ముండిన సుఖదుఃఖము లుండు ననియు లేకున్న లేవనియుఁ దేలుచున్నది. దేహాత్మవిషయముకూడ నిట్టిదే ఆత్మకు దేహాభిమాన మున్నంతకాలంబును దానికి సంబంధించినసుఖదుఃఖములుఁ దనకే కలిగిన ట్లుండును; తత్త్వజ్ఞానమువలన నది నశించిన యాసుఖదుఃఖసంబంధములును లేనిదియే యగును. అజ్ఞానమువలనఁ గలిగినది పారమార్థికము కానేర దనుటయు స్పష్టమే. ఇట్లుండ జీవునియసత్యసుఖదుఃఖములు పరమాత్మకు నేల సంబంధింపవలయును?.

సూర్యచంద్రప్రకాశములు సర్వవ్యాపకములై యుండ నొకస్థలమున వలయాకారముగాఁ గాని మఱియొకవిధముగాఁగాని యొకయావరణము నేర్పరచినచో నందలిప్రకాశము పొడవుగనో వర్తులముగనో చతురస్రముగనో యుండును. ఇంతమాత్రమున "సూర్యప్రకాశము పొడవు" అని చెప్పుటకు వీలు కలదా? ఉపాధివశమున నొకచోట వచ్చిన పొడవు సర్వప్రకాశమునకును సంభవించు ననుట యుక్తియుక్త

మగునా? అద్దమునందుఁ బ్రతిబింబించిన ముఖప్రతిబింబము ఆ యద్దముయొక్క మాలిన్యముచే నల్లనై యుండిన దానిబింబ మగుముఖ ముకూడ నల్లనిది కావలయునా? ఘటమందు నిండియున్నయాకాశము ఘటచలనముచేఁ జలించునట్లు కానఁబడినంతమాత్రముననఁ దదభిన్న మగుమహాకాశము చలించుచున్నదా? ఇవి యేవియు ననుభవసిద్ధములు కాకపోవుటచే వీనివలెనే యౌపాధికభేదము నాశ్రయించి జీవునకుఁ గలుగు సుఖదుఃఖము లీశ్వరునకుఁ గలుగవు. కలుగవలసినపని కూడ లేదని దృఢ ముగ సిద్ధాంతముఁ జేయవచ్చును. ఒకయుపాధి పోయిన నందలిప్రతిబిం బము లేక, ఆయావరణమున నున్నయంశము (అవచ్ఛిన్నము) మాత్రమే బింబభూతపదార్థమునందు, లేక యనవచ్ఛిన్నపదార్థమునఁ జేరును కాని తక్కినవి (తక్కిన ప్రతిబింబములు లేక యవచ్ఛిన్నములు) చేర వనియు నీకారణమువలన నొకజీవునకు ముక్తి కలిగినను దానితో నందఱును ముక్తి నొందవలసినపని లేదనియు నిదివఱకే చెప్పియున్నాము. ఈకార ణమువలన భ్రాంతినివృత్తికై తత్వజ్ఞాన మావశ్యకము. సామాన్యులకే, (సంసారులకే) మహాదుఃఖసమయములయందుఁ బుత్రమిత్రాదినాశకాల ములయందుఁ గూడ నించుకంత సంబంధవివేచనము ("మనకునుఁ బుత్రు లకును సంబంధ మేమి? త్రోవఁ బోవువా రొకరితో నొకరు చేరునట్లు నీవు త్రాదులును మనతోఁ జేరి వారిఋణము తీరగనే మఱియొకస్థలమునకుఁ బోవుచుందురు" అని తనకునుఁ బుత్రాదులకునుఁ గలసంబంధమునుఁ గూర్చి కొంచెము విచారమునుఁ) గావించిన దుఃఖశాంతి యగు ననిన నిఁకఁ బరిపూర్ణవిజ్ఞానమువలనఁ గలుగుఫలమునకు మితి కలదా? ఇట్లు పర మపురుషార్థహేతు వగుతత్వజ్ఞాన మనర్థక మేల యగును? మోక్షమున సర్వజీవదుఃఖములును కలుగవలయు ననునది (యుక్తిశూన్య మనియు జీవునకును పరమార్థస్థితిలో సుఖదుఃఖసంబంధము లేదనియు నిదివఱకే నిరూపించి యున్నాము కదా! కావున నెట్లును జీవదుఃఖము లీశ్వరు నకు రావు.

## ౨౬౪. స్మరంతిచ. ౨. ౩. ౪౭.

తాత్పర్యము:—"తత్ర యః పరమాత్మా హి స నిత్యో నిర్గుణః స్మృతః, న లిప్యతే ఫలై శ్చాపి పద్మపత్ర మి వాంభసా, కర్మాత్మా త్వ

పరో ధ్యేయో౽సౌ మోక్షబంధైర్న సంయుజ్యతే, స సప్తదశకే నాపి రాశినా యుజ్యతే పునః"="ఈజీవాత్మపరమాత్మలలో పరమాత్మ యని చెప్పఁబడినపరమేశ్వరుఁడు నిత్యుఁడు నిర్గుణుఁడు తామరయాకును నీటు అంటనట్లు ఆపరమేశ్వరునిఁ గర్మఫలము లంటవు. మనకుఁ బ్రత్యక్షము గా సర్వకర్మకర్తమై కానవచ్చు జీవుఁ డెవ్వఁడు కలఁడో వాఁడు బంధమోక్షములతో సంబంధపడును. *పదునేఁడవయవములతోఁ గూడిన సూక్ష్మశరీరముతోఁగూడ వానికి సంబంధము కలదు" అని స్మృతుల యందును పైవిషయమే నిరూపింపఁ బడి యున్నది. శ్రుతులయందును "ఏక స్తయోః పిప్పలం స్వా ద్వ త్త్య నశ్న న్నన్యో౽భిచాకశీతి (ము. ౧-౨-౧౨.) ఏక స్తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః"="పరమేశ్వరుండును సర్వభూతములలోపల నున్నను వానితో సంబంధపడక వానికి విడిగా నుండువాఁ డగుటచే వాని సుఖదుఃఖములతో సంబంధపడఁడు" అని పైవిషయమే నిరూపింపఁబడి యున్నది. కావున జీవుఁడు పరమేశ్వరుని కల్పితాంశమే.

## సూత్రము. ౪౮.

అవతారిక:—ఇట్లైన లోకమునఁ గానవచ్చుజీవు లందఱు నొక్కఁడే కావలసివచ్చును ఆయొక్కఁడును పరమేశ్వరుఁడే యగుటచే నాయ ననుఁ గూర్చి విధిప్రతిషేధము లుండుట సంభవింపదు. ఆయన సర్వజ్ఞుఁడు నిష్క్రియుఁడు కదా! 'జీవుఁడు పరమేశ్వరునియంశము' అని చెప్పఁ బడెను కదా యనియెదరేమొ అదియు సంభవింపదు. 'తత్త్వమసి' 'అహంబ్రహ్మాస్మి' అనుమొదలగుననేకశ్రుతుల జీవబ్రహ్మాభేదమునుఁ జెప్పుచున్నవి. 'ఇట్లు భేదాభేదశ్రుతు లుండుటచేతనే జీవుని బ్రహ్మాంశముగ నిర్ణయింపవలసివచ్చెను' అనియెదరేమొ అదియు యుక్తము కాదు. ఆ భేదాభేదములు రెండును శ్రుతికిఁ దాత్పర్యము లగునేని యప్పుడు తత్సిద్ధి కలుగుటకై జీవునకు బ్రహ్మాంశత్వమునుఁ గల్పింపవలసి యుండును గాని యిచ్చట నట్లు లేదు. వేదము నకు నభేదప్రతిపాదనమే యుద్దేశము. లోకసిద్ధ మగుటచే భేదము నూరక యనువాదముఁ జేయుచున్నది. ఇట్లుండ

* పంచప్రాణములును పంచకర్మేంద్రియములును పంచజ్ఞానేంద్రియములును మనోబుద్ధులు ననునవి సూక్ష్మశరీరముయొక్క పదునేఁడవయవములు.

భేదము నాశ్రయించి ప్రమాణముగ నంగీకరించి తత్సిద్ధికై నంశత్వము నుఁ గల్పించుట యెట్లు యుక్త మగును? పరమేశ్వరుఁడును నిర్గుణుఁ డగుటచే నాయనకు దేహాదులతో సంబంధ మెట్లు కలుగును? ఈకారణము వలన జీవుఁడే లేఁడు. ఉన్నవాఁడు పరమేశ్వరుఁడే ఆయనను గూర్చి విధి నిషేధములు సంభవింపవు. దీనికి సమాధాన మేమి? 'లోకవ్యవహార మే రీతో సిద్ధింపఁగలదు' అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౨౬౫. అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధా జ్జ్యోతి రాదివత్. ౨. ౩. ४౮.

తాత్పర్యము:—ఈ పూర్వపక్షమువలన మామతమునకు వచ్చు హాని యేమియు లేదు. పరమేశ్వరుఁ డొక్కఁడేయైనను దేహసంబంధము వలన భేదము కలుగవచ్చును. యిట్లు భిన్నము లైనభాగములే జీవశబ్ద ముచేఁ బిలువఁబడుచున్నవి. "నేను నడచు చున్నాను గ్రుడ్డివాఁడను దుః ఖితుఁడను ఆఁకలిఁగొన్న వాఁడను" అను మొదలగువ్యవహారములే యీ సంబంధమునుఁ జూపుచున్నవి. యీసంబంధము సంయోగరూపము కాదు; సమవాయరూపంబును కాదు; తాదాత్మ్యరూపమే. తాదాత్మ్య సంబంధము భ్రాంతిసిద్ధ మగుటయు నిర్వివాదము. అనాది యగునవిద్య వలన నీసంబంధము కలుగుచున్నది. ఆకాశ మొక్కటియయ్యును ఘటా దులతో సంబంధించినప్పుడు ఘటాకాశాదినామములతోఁ బిలువఁబడు నట్లు పరమేశ్వరుండును దేహాదులతో సంబంధపడినప్పుడు జీవనామము లతోఁ బిలువఁబడు చున్నాఁడు. ఇదియే మాసిద్ధాంతము. ఇప్పుడు చూ డుఁడు పరమేశ్వరుఁ డొక్కఁడే కావచ్చును. వేదమునకును అభేదము నందే తాత్పర్య ముండవచ్చును. జీవులు పరమేశ్వరునియంశములునుఁ గావచ్చును. జీవులకు బ్రహ్మాంశత్వమునుఁ గల్పించుట లోకానుసార ముగ మాత్రమే కాని పరమార్థస్థితిని నిరూపించుటకై కాదు. లో కులు అజ్ఞానవశమున దేహాదుల నాత్మఁగా భావించుచు, దానినే (ఆదేహాత్మత్వమునే) సత్యముగఁ దలంచుచు దానిహేతువుల విచారించు చున్నారు కావున వారికై యెట్లు చెప్పఁబడెను. ఈకారణమువలన వేద మునకు భేదమునందునుఁ బారమార్థికాభిప్రాయ ముండవలయునని నిర్బం

ధము లేదు. భేదాభేదముల రెంటినిఁ బ్రతిపాదింపఁదలఁచిన,వానికి రెంటికిని విరోధము. కావునను అవి రెండు నొక్కస్థలమున నుండవు కావునను వానిని చెప్పు వేదమే యప్రమాణము కావలసి వచ్చును; దాని ననుసరించి చేయఁబడినయంశత్వసిద్ధాంతంబు నప్రమాణమే యగును కావున నంశత్వము కల్పిత మనుటయే యుక్తియుక్తము.

ఈకారణమువలన నీదేహసంబంధము నాశ్రయించి విధినిషేధములు ప్రవర్తింపవచ్చును. మిత్రుఁడు స్వభార్య మొదలగువానిని స్వీకరించుటయు శత్రులు పరభార్య మొదలగువారినిఁ బరిత్యజించుటయు మొదలగునవి కలుగవచ్చును. అగ్ని యొక్కటియే యైనను శ్రోత్రియుని యింటిలో నున్నప్పుడు పవిత్రముగ బరిగణింపఁ బడి మహాజనులచే స్వీకరింపఁబడుచున్నది స్మశానమున నున్నప్పు డపవిత్రముగ భావింపఁబడి పరిత్యజింపఁ బడుచున్నది. మలమూత్రములును గోదేహమునకు సంబంధించినప్పుడు పంచగవ్యాది పుణ్యక్రియలలో నుపయోగింపఁబడుచున్నవి యితరజంతుదేహములకు సంబంధించినప్పుడు తిరస్కరింపఁ బడుచున్నవి కదా!

“ఇట్లయినఁ దత్వజ్ఞానము గలవానికి విధినిషేధములు లేకుండవలయును. ఆవిషయమునందు వేద మప్రమాణ మగును.” అనియెద వేమొ వినుము. వేదము వానినిఁగూర్చి విధినిషేధములనుఁ జెప్పదు. చెప్పవలసినపనియు లేదు. ఎవ్వఁడు తనకంటె భిన్నములనుగాఁ బదార్థములను చూచుచు నందుఁ గొన్నింటిని అంగీకరింపఁ దగినవిగను మఱి కొన్నిఁటిని విడువఁ దగినవిగను భావించు చుండునో అట్టివానినిఁ గూర్చియే కదా హితాహితముల బోధించుటకైయును అశుభకరముల శుభకరములుగాను శుభకరముల నశుభకరములుగాను తలంచు భ్రాంతిని తొలంగించుటకయ్యును వేదము విధినిషేధములఁ జేయవలసి యుండును; ఇట్లు కాక సర్వము నాత్మమాత్రముగా భావించువానినిఁ గూర్చి యేలవిధినిషేధములఁ జెప్పవలయును? వాఁడును ఏవిధినిషేధముల ననువర్తింపవలయును? అట్లనువర్తించి యేలాభమును చెందవలయును? “‘ప్రతివాఁడును శరీరమునకంటె నాత్మభిన్నుఁడు’ అనువిషయము నెఱింగియేయున్నాఁడు కావున తత్వజ్ఞానియే. ఈకారణమువలన నెవ్వనివిషయమునందును విధినిషేధము లుండఁగూడదు” అనియెద వేమొ యట్లుకాదు.

అందఱకును సామాన్యముగ దేహాతిరిక్తాత్మజ్ఞానముకలిగియున్నను ప్రయోజనము లేదు. ఎవ్వఁడును "పరమేశ్వరునకును నాకును భేదము లేదు." అనువిషయమునుఁ దెలిసికొనుట లేదు కదా! దీనికిఁ గారణ మేమి? "దేహమునకంటె నాత్మ భిన్నుఁడు" అనువిషయము మాత్రమే వారికిఁ దెలియును గాని "బుద్ధికంటెఁ గూడ నాత్మ భిన్నుఁడు" అని తెలియదు. ఈకారణమువలన వారు, ఆత్మను పరిచ్ఛిన్నునిఁగా భావించుటచే బదార్థములఁ దద్భిన్నములుగఁ జూచువారే. కావున వారికిని విధినిషేధము లుండవలసినదియే. "అగుఁగాక! తత్వజ్ఞానికి విధినిషేధములు లేకున్న వాఁడు యథేచ్ఛముగ సుకృత మనక దుష్కృత మనక ప్రవర్తింప వచ్చును కదా" అనిమొదవేమొ అది సంభవింపదు. అచ్చటఁ గూడ నాత్మయును స్వేచ్ఛయు ననుపదార్థద్వయ ముండవలయును; స్వేచ్ఛావర్తనమున నభిమాన ముండవలయును కదా! కావున నెట్లును మావాదమున దోషము లేదు.

## సూత్రము. ౪౮.

అవతారిక:—"అగునుఁ గాక! దేహసంబంధభేదమువలన నొక్క పరమేశ్వరునకే విధినిషేధములు కలిగినను కర్మలతోను ఫలములతోను కలుగుసంబంధమునందు (అనఁగా కర్మల నాచరించుటయందును వానిఫలముల ననుభవించుటయందును) సాంకర్యము కలుగును. ఒకఁ డాచరించిన కర్మకు మఱియొకఁడు ఫలము ననుభవింపవలసియే వచ్చును. ఇది సంభవింపదు కదా" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౬౯. అసంతతేశ్చాఽవ్యతికరః. ౨. ౩. ౪౮.

తాత్పర్యము:—ఇట్టిదోష మేల నచ్చును? పరమేశ్వరుఁడు సర్వవ్యాపియే యైనను జీవుఁడు సర్వవ్యాపి కాఁడు. అన్నిశరీరములయందు నొక్కజీవుఁడే వ్యాపించి యుండలేదు. మహాకాశము సర్వవ్యాపక మైనను ఘటాకాశముఁగూడ తదభిన్నమగుటచే సర్వవ్యాపకము అయినను ఉపాధికృతభేదమునలన ఘటపరిమాణముఁ గలిగి ఘటముతోమాత్రమే సంబంధపడి యున్నట్లు, జీవుఁడును బరమేశ్వరాభిన్నుఁ డగుటచే సర్వవ్యాపకుఁడే యైనను ఉపాధివశమున బరిచ్ఛిన్నుఁడై యున్నాఁడు ఇట్లగు

టచే నెవ్వనియభిమానము ననుసరించి వాఁడే కర్మ నాచరింపనచ్చును తత్ఫలమునుఁ గూడ ననుభవింపవచ్చును. ఒకఘటము చలించు చున్న మఱియొకఘటము నిలచి యుండఁ గూడదా? ఉపాధ్యనుసారముగ నొకఘటాకాశము చలించుచున్న మఱియొకఘటాకాశము నిలచి యుండఁగూడదా?.

## సూత్రము. ౫౦.

అవతారిక:—ఈవిధముగ *నవచ్ఛిన్నవాదము నాశ్రయించి సర్వ విషయమునకును సమాధానముఁ జెప్పి ఇంతకంటెను విస్పష్టముగ సర్వ విషయంబును గోచర మగుటకై †ప్రతిబింబవాదము నాశ్రయించు చున్నాఁడు.

## ౨౬౭. ఆభాస ఏవ చ. ౨. ౩. ౫౦.

మఱియు జీవుఁడు బ్రహ్మప్రతిబింబ మనియుఁ జెప్పవచ్చును. ఇట్లు చెప్పిన ప్రతిబింబ మెట్లు బింబభూతపదార్థంబును తద్భిన్నంబునుఁ గూడఁ గాదో యట్లే జీవుఁడునుఁ బ్రత్యక్షపరమేశ్వరుఁడు కాని తద్భి న్నుఁడు కాని కానేరఁడు. ఇట్లు చెప్పుట యవచ్ఛిన్నసిద్ధాంతమునకంటె లోకదృష్టికిఁ గొంత చేరువ యై యున్నది. ఈసిద్ధాంతమున జీవుఁడు పర మేశ్వరభిన్నునియట్లు సకలభోగముల ననుభవింపవచ్చును; వానితోఁ బరమేశ్వరునకును సంబంధము లేకపోవచ్చును. అద్దముయొక్క మాలి న్యమువలనఁ బ్రతిబింబమునకు మాలిన్యము కలిగినను బింబభూత మగు ముఖమునకు మాలిన్యము కలుగ నక్కఱ లేదు కదా! మఱియు బింబ మొక్కటి యైనను ప్రతిబింబము లనేకము లై యుండవచ్చును. కావునఁ

---

* అవచ్ఛిన్న మనఁగా నొకయావరణముచే నావరింపఁబడి యుండుట. మహా కాశము ఘటాదులయందుఁ బ్రవేశించినట్లు ప్రవేశించి యుండుట పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డయ్యు నంతఃకరణమున నిట్లు (ఆకాశము ఘటాదులయందు వలె) ప్రవేశించి జీవుఁ డయ్యె ననువాద మవచ్ఛిన్నవాదము.

† ప్రతిబింబవాద మనఁగా అద్దమునందు ముఖమువలెఁ బ్రపంచసూక్ష్మావస్థా రూపిణి యగుకవిద్యయందుఁ బరమేశ్వరుఁడు ప్రతిబింబించి జీవుఁ డయ్యె నను వాదము.

బరమేశ్వరుఁ డొక్కఁడైనను జీవు లనేకులు కావచ్చును; అనేకులగుటచే నొకరికర్మఫలములు మఱియొకరికిఁ గూడ రా నక్కఱ లేదు. కావున నెట్లు చూచినను కర్మఫలములకు సాంకర్యము కలుగవలసినపని లేదు.

ఈ ప్రతిబింబవాదమునందును బింబప్రతిబింబములకు పారమార్థిక భేదములేకపోవుటచే జీవుఁడును బరమేశ్వరునివలెసర్వవ్యాపకుఁడు(విభువు) కావచ్చును. ప్రపంచసూక్ష్మావస్థ యని చెప్పఁబడినయవిద్యయే (చూ. ౧-౪-౩.)జీవరూపబ్రహ్మప్రతిబింబమునకు నాశ్రయము. ప్రతిబింబమాత్రుఁ డగునాజీవునకు భోగ్య మగుటచే సంసారము కూడ నవిద్యాకృతమే. సత్యాసత్యములకుఁ బ్రత్యక్షవిరోధము. కావున జీవుఁడు సత్యసంసారము నాశ్రయించుననుటకును వీలు లేదు; అసత్యసంసారము సత్యజీవు నాశ్రయించు ననుటకును వీలులేదు కదా! ఈకారణమువలన నీభ్రాంతినిఁ దొలఁగించుటకై వేదము జీవయథార్థస్వరూపమును బోధించుటయు విరుద్ధము కానేరదు. కావునఁ బ్రతిబింబవాదము నాశ్రయించినను సర్వవిషయములును సరియే యగును. కావున శిష్యులయధికారము ననుసరించి యెట్లయినను బోధింపవచ్చును.

విచారించి చూచిన నెవ్వరు జీవు లనేకు లనియు సర్వవ్యాపకు లనియుఁ జెప్పుదురో వారిమతమునందే కర్మఫలములకు సాంకర్యము వచ్చును. ఎవ్వరు జీవులకు సుఖదుఃఖములు సత్యములుగనే కల వనియు నొకనిసుఖదుఃఖములతో మఱియొకనికి సంబంధము కలుగదనియుఁ జెప్పుదురో వారిమతమునందే యీకర్మఫలసాంకర్యము కలుగును. ఎట్లనిన:—

జీవు లనేకు లనియు అందఱును సర్వవ్యాపకులే యనియుఁ బ్రధానము సాధారణముగ వారల కందఱకును భోగమోక్షములఁ గలిగించు ననియు వారు చేతనులనియు నిర్గుణులనియు నిర్వికారులనియు సాంఖ్యులు చెప్పుదురు. వీరిమతమున నొకపక్షమును విమర్శించినచో నిర్గుణు లగు వారికిఁ బ్రధానముతోఁగాని తత్కృతము లగుభోగమోక్షములతోఁ గాని సంబంధ ముండుటయే తటస్థింపదు. కల దని యంగీకరించి నను జీవు లందఱును చేతనులే యగుటచేతను సర్వవ్యాపకు లగుటచే నొక్కప్రదేశముననే యుండువా రగుటచేతను, అవయవశూన్యు లగుటచే నేకాత్మకులే యగుటచేతను, ఒకనికిఁ గలిగినసుఖదుఃఖము లందఱకును కలుగవలయును. వారిమతము ననుసరించియే చూచిన

పురాకృతకర్మభేదమువలనఁ గూడ సుఖదుఃఖభేదము (ఒకనికి సుఖదుఃఖము లున్న మఱియొకనికి నవి లేకుండుట) కలుగనేరదు. ఆకర్మలునుఁ బ్రధానమునకు సంబంధించినవి యే కాని జీవులకు సంబంధించినవి కావు. ఇట్లుండ నిఁక వ్యవస్థ యెట్లు కలుగును? "ఇట్లు కాదు. ప్రధానము సర్వసమాన మైనను పురుషులకు భోగమోక్షముల నిచ్చుటకై మాత్రమే ప్రవర్తించు చున్నది కాని తనసామర్థ్యముఁ జూపుటకై ప్రవర్తించుట లేదు కదా! ఈకారణమువలన సుఖదుఃఖవ్యవస్థ కలుగవచ్చును. ఒకపురుషునికి భోగమోక్షములఁ గలిగించినపిదపఁ బ్రధాన మాతనికడనుండి మఱలి మఱియొకపురుషు నాశ్రయించును. ఇట్లగుటచే బద్ధులు ముక్తులు నేర్పడుచున్నారు. ఇట్లే యొకనికి సుఖదుఃఖములఁ గలిగించి పిదప మఱియొకనికిఁ గూడఁ గలిగించు ననవచ్చును కదా!" అనిన నదియు యుక్తము కాదు. అట్లు కలిగించుననుటకు తగినహేతు వెద్దియులేదు. సర్వవ్యాపకులై నిరవయవులై యేకాత్మకులై యున్నవారికి సర్వసమానమై యేకరూపమై యున్నపదార్థము భిన్నభిన్న ఫలముల నొసంగు ననుట యెట్లు సిద్ధాంత మగును? అది యొసంగినఫల మెవ్వనికో తెలిసికొనుటయే యశక్యము కదా! అందఱు నొక్కటియే మై యుండ నెవ్వరికి దేని నొసంగెనో నిర్ణయించుట కేమి వీలు కలదు? ఇక నీదోషము పోవుటకై యేమి చెప్పవలయును? "లోకానుభవము ననుసరించి చూచిన నాప్రధానము సర్వమును సరిగనే చేయుచున్నది. కారణ మేది యైనను కావలసినపని మాత్రము సరిగనే యగుచున్నది" అనవలయును. ఇది యెట్లు యుక్తాయుక్త మగును? హేతువు లేకున్న నామతమే యప్రామాణికము కాఁగూడదా? కావున నెట్లును సాంఖ్యమతవాదమునఁ గర్మఫలసాంకర్యము నివర్తింపదు.

మఱియు జీవు లచేతను లనియు సర్వవ్యాపకు లనియు నచేతనము లగుపరమాణువులును మనస్సును వారికి సాధనము లనియు మనస్సునకును వారికిని సంబంధము కలిగినప్పుడు ఇచ్ఛ మొదలగు *తొమ్మిదిగుణములు విశేషముగఁ (బ్రత్యేకముగ నెవ్వనికి మనస్సుతో సంబంధము కలుగునో,

---

* జీవుని తొమ్మిదిగుణములు:—'బుద్ధ్యాదిషట్కం సంఖ్యాదిపంచకం భావనా తథా। ధర్మాధర్మౌ గుణా ఏత ఆత్మనః స్యు శ్చతుర్దశ' 'జ్ఞానము సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము అనునీయాఱును, సంఖ్యయు పరిమాణంబును పృథక్త్వము సంయోగవిభాగములును అనునియైదును, సంకల్పరూపమగు భావనాసంస్కారంబును

వానికిఁ) గలుగు ననియు నిదియే సంసార మనియు నీగుణోత్పత్తిఁ బొత్తిగ లేకపోవుటయే ముక్తి యనియు వారివారిపుణ్యపాపకర్మములు వారితోనే సంబంధపడి యుండు ననియు నీకారణమువలనఁ గర్మఫలసాంకర్యము కలుగ దనియు వైశేషికులు చెప్పుదురు. ఇదియు సరిపడదు. వారిమతము నందును జీవు లనేకులు ఆకాశమువలె సర్వవ్యాపకులు నిరవయవులు నగుటచే నేకాత్మకులే. వారుమాత్రము ఒక్కొక్కజీవునితోఁ బ్రత్యేకముగ మనస్సు సంబంధపడు నని చెప్పుదురు కాని యది యెట్లు సంభవించును? నిరవయవు లగువా రెందఱుఁ గలసినను ఒక్కఁడే యగుదురు కదా! వారితోఁ జేరినమనస్సు ప్రత్యేకసంబంధము కలది యగు ననుట యెట్లు? మనస్సంయోగ మీవిధమున సర్వజీవసాధారణ మైనచో ఫలభేదము మాత్రము కలుగు ననుట యెట్లు?

## సూత్రము. ౫౧.

అవతారిక:—'వారిమతమునఁ గర్మ జీవులకు ప్రత్యేకముగ సంబంధించినదియే కదా! తద్భేదమువలన సుఖదుఃఖభేదము కలుగఁ గూడదా?' అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౨౬౮. అదృష్టానియమాత్. ౨. ౩. ౫౧.

తాత్పర్యము:—వీరిమతమునందును కర్మల ప్రత్యేకముగ సంబంధించు నని చెప్పుటకు వీలు లేదు. పైనఁ జూపినవిధముగ మనస్సు ప్రత్యేకముగ సంబంధించు ననుటకు వీలు లేకపోవుటచేతనే కర్మలునుఁ బ్రత్యేకముగ సంబంధింపనేరవు. మనస్సంయోగము లేక కర్మల నాచరించుటకు వీలు లేదు కదా! ఆత్మ లందఱును నిరవయవులే సర్వవ్యాపకులే యగుచుండ వారితో సంబంధించినమనస్సు ఆసమూహములో నెవ్వనితో సంబంధించునో ఎట్లు చెప్పలేమో అట్లే లోకమున ననుభవింపఁ బడు కర్మలలో నెవ్వఁడు దేని నాచరించెనో నిరూపింపలేము. లోకానుభవము

---

ధర్మాధర్మములు ననుమూఁడునుకలసి యాత్మకు పదునాల్గుగుణములుకలవు.' అనువాక్యముచేతఁ దర్కశాస్త్రమున నాత్మకు పదునాల్గుగుణములు చెప్పఁబడి యున్నవి. ఇందు సంఖ్యాదు లైదును సామాన్యగుణములు; తక్కినతొమ్మిదియు మనస్సంయోగమువలన జనింపవలసిన గుణము లని తెలిసికొనవలయును.

నాశ్రయించి నిర్ణయింపవచ్చు ననిన నప్పుడు మతమే యప్రామాణికముఁ గూడఁ గావచ్చును గదా! "ఇట్లు కాదు. మొట్టమొదటఁ గర్మలు ప్రత్యేకముగ నుండెను. దాని ననుసరించి సుఖదుఃఖములు ప్రత్యేకముగఁ గలుగును. ఈకారణమువలన మనస్సంయోగము ప్రతిజీవునకునుఁ బ్రత్యేకమే కావలయును." అనుటకును వీలు లేదు. కర్మాచరణమునకు మనస్సంయోగమే హేతు వగుటచే మొట్టమొదట నది ప్రత్యేకముగ నుండు నని సిద్ధించినఁ గాని కర్మలు ప్రత్యేకములు కానేరవు. ఇప్పటియుక్తి నాశ్రయించినఁ గర్మలు ప్రత్యేకము లైనఁ గాని మనస్సంయోగము ప్రత్యేకము కానేరదు. కావున దుర్నివారమై యన్యోన్యాశ్రయదోషము వచ్చును. కావున నెట్లును వైశేషికమతము యుక్తియుక్తము కాదు.

## సూత్రము. ౫౨.

అవతారిక:—"ఇట్లు కాదు లోకమునఁ బ్రతివాఁడును 'నేను ఈఫలమును పొందెదను దీనికై ఇట్లు ప్రయత్నించెదను దీనినిఁ బరిత్యజించెదను' అని భూతభవిష్యద్వర్తమానకాలములయందు తననుఁ గర్తగను కర్మఫలభోక్తగను వ్యవహరించు చున్నాఁడు. ఈవ్యవహారము నాశ్రయించి చూచిన జీవులకును నదృష్టమునకునుఁ(కర్మలకును)గలసంబంధము స్వామిభృత్యరూప మైనది యని తేలును. ఆత్మ లెట్టివా రైనను ఎవని కర్మలు వానికే సంబంధించి యుండును. ఇతరులతోఁ గూడ వానికి (నాకర్మలకు) సంబంధ ముండవలసి వచ్చినను సామాన్యసంబంధ ముండును. కాని, తమప్రభు వగునాత్మతో గలసంబంధమువంటిసంబంధ ముండనేరదు. ఒకగోడపై నల్లనివస్త్రమును వైచిన దానినలుపుతో గోడకుఁ గూడ సంబంధము సామాన్యముగ నున్నను ఆసంబంధము వస్త్రముతోఁ గలసంబంధమువంటిది కాదు కదా! (ఆనలుపునకు, వస్త్రముతోఁ గల సంబంధ మెట్టిదో యట్టిది కాదు కదా!) ఇట్లే స్వప్రభు వగుజీవునితోఁ గర్మలకు గలసంబంధంబును అన్యజీవులతో గలుగుసంబంధమున కంటె భిన్నరూప మైనదియే ఈకారణమువలనఁ గర్మహేతు వగు మనస్సంయోగంబును భిన్నరూప మైనదియే ఇట్లయిన సుఖదుఃఖవ్యవస్థ వైశేషికమతమున [illegible] చున్నాఁడు.

## ౨౯౯. అభిసంధ్యాదిష్వపి చైవమ్ ౨. ౩. ౫౨.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. లోకదృష్టము లగుసంకల్పాదుల ననుసరించి యీవిషయమును (కర్మజీవులకును మనో జీవులకును నియతముగ స్వామి *భృత్యభావసంబంధము కల దనువిష యమును) నిర్ణయించుటకు వీలు లేదు. దానిచే సుఖదుఃఖవ్యవస్థ యేర్పడు నని చెప్పుటకును వీలులేదు. ఏకర్మకు నేజీవునితో సంబంధము కలదో, ఏమనస్సునకు నేజీవునితో సంబంధము కలదో, ఏసుఖదుఃఖము లకు నేజీవునితో సంబంధము కలదో ఎట్లు తెలియును? జీవు లందఱును సర్వవ్యాపకు లగుటచే నొక్కచోటనే యేకరూపులుగనే కదా యున్నారు. రాముఁడు చేయుచున్నసంకల్పములును కర్మలును సుఖదుఃఖానుభవము లును గృష్ణునికో గోవిందునికో లేక కేశవునికో యెవనికిఁ దెలియును? కర్మభేదము నాశ్రయించి జీవభేదమును సిద్ధాంతముఁ జేయఁ బూనినను అన్యోన్యాశ్రయదోషము వచ్చును. జీవభేద ముండిననే గాని కర్మభేద ముండదు; కర్మభేద ముండిననే గాని జీవభేద ముండదు కదా! ఇం దేది మొదలు? అనాది యని దీనిని (ఈదోషమును) పరిహరించినను సుఖదుఃఖ వ్యవస్థ కుదురదు. జీవునకు మనస్సంయోగమాత్రమున నిచ్ఛాదిగుణములు జనించు నని కదా వైశేషికులు చెప్పుదురు. అప్పుడు స్వామిభృత్యసంబం ధమైన నేమి? కాకున్న నేమి? ఒకజీవునితో నామనస్సునకు స్వామిభృత్య భావసంబంధ మున్నను, దక్కినవారితో సామాన్యసంబంధ మైన నుండును కదా! ఇఁక వారియందును ఇచ్ఛాదిరూపసంసారము జనింపవచ్చును. కర్మ లును తత్ఫలానుభవములును జనింపవచ్చును. ఇఁక సాధించినక్రొత్తవిష య మెయ్యది? "స్వామిభృత్యసంబంధము కలిగినప్పుడు మాత్రమే మన స్సంయోగమువలన నిచ్ఛాదులు జనించును. ఇతరసంబంధము కలిగినప్పు డు జనింపదు" అనిన నదియు యుక్తము కాదు. ద్రవ్యమునకు స్వభావ సిద్ధమై యున్నసామర్థ్యము సంబంధమాత్రమువలన భేదించునా? కావున నెట్లును లోకవ్యవహారము ననుసరించి సిద్ధాంతముఁ జేయుటకును వీలు లేదు. వైశేషికమతమున నెట్లును సుఖదుఃఖాదివ్యవస్థ కుదురదు.

---

* ప్రభువునకును సేవకునకును గలసంబంధము స్వామిభృత్యభావసంబంధము.

## సూత్రము. ౫౩.

అవతారిక:—పూర్వపక్షానువాదపూర్వకముగ మఱియొకయంశ ము ను ఖండింపుచున్నాఁడు.

## ౨౬౯. ప్రదేశభేదాదితి చేన్నాన్తర్భావాత్.

### ౨. ౩. ౫౩.

తాత్పర్యము:—'ఇట్లు కాదు. ఆత్మ సర్వవ్యాపకుఁడైనను మన స్సుమాత్రము శరీరము నాశ్రయించి యుండునదియే. కావున దానితో నాశరీరమునందు మాత్రము ఆత్మకు సంయోగము కలుగును. శరీరభే దము ననుసరించి సుఖదుఃఖాదివ్యవస్థయు సంభవించును.' అనిన నదియు యుక్తము కానేరదు. ఆత్మ లందఱును సర్వవ్యాపకులే యగుటచే ప్రతి శరీరమునందు నుందురు కదా! ఇట్లుండ 'నీయాత్మది యీశరీరమే యని' నిర్ణయించుటకు నవకాశ మేది కలను. కలిగినను అది కల్పితము మాత్రమే యగును కావున పారమార్థికము లగుమనస్సంయోగాద్యులను నియమింప నేరదు. కల్పితమగునది యూరక యున్నట్లు భావింపఁబడుటయే కాని విచారించిన శూన్యమే యగును కదా! వేదాంతమతమున నన్ననో శరీ రంబును కల్పితమే సుఖదుఃఖాదులును కల్పితములే కావున నేదోషంబును రాదు.

మఱియు దేహముకూడ సర్వజీవులసమీపముననే సృజింపఁబడినది కావున నెవ్వరికై సృజింపబడునో యెట్లు నిర్ణయింపవచ్చును? "ప్రదేశ ముల విభాగించి 'ఇచ్చట నున్న దేహము రామునిది ఇది కృష్ణునిది' అని నిర్ణయింపవచ్చును". అనిన నదియు సరిపడదు. అప్పుడు సమానసుఖదుఃఖ ముల ననుభవించు నిరువురుజీవులకు నొక్క దేహమునందే కూడ యా యనుభవము సంభవింపవలసి వచ్చును. వారిరువురియదృష్టము నొక్క స్థలమునందే జనించినదిగా నుండవలయును కదా! రాముఁడు మార్గ మధ్యమున నొకయరణ్యమున చోరులచే బాధ నొందెనేని మఱియొక సమయమున కృష్ణుఁడును అది యేస్థలమున చోరబాధనొందుటయు ఘట స్థించుచున్నది. వారిరువురియదృష్టంబు నొక్కస్థలమున జనించినది కాకుం డునేని ఇట్టి సమానసుఖదుఃఖములు సమానప్రదేశమునందే యెట్లు కలు

గును? ఈకారణమువలన నొకానొకప్పుడు వారికి సమానప్రదేశమునందు వలెనే సమానదేహమునందును సుఖదుఃఖములు కలుగు ననవచ్చును కదా! మఱియు నీవాదమున స్వర్గాదిభోగములు కూడ సంభవింపవు. అదృష్టము బ్రాహ్మణాదిశరీరప్రదేశమున నుత్పన్న మయ్యెను; స్వర్గాదులు భిన్నప్రదేశమునఁ గదా యున్నవి. కావున నెట్లును వైశేషికమతమున సుఖదుఃఖవ్యవస్థ కుదురదు. వేదాంతమతమున నన్ననో దేహానుసారముగ నాత్మకుఁ గల్పితభేదము కలదు కావునఁ దదనుసారముగ సర్వవ్యవస్థలును గుదురును. అంతఃకరణోపాధియే జీవత్వమునకుఁ గారణ మగుటచే దానితోఁ గూడ జీవునకుఁ బరలోకగమనాగమనములు సంభవించును.

ఇంత యేల మొట్టమొదట సర్వవ్యాపకు లగునాత్మ లనేకు లున్నారనుటయే యుక్తిశూన్య మగుసిద్ధాంతము. అట్టిదృష్టాంత మేదియును లోకమున లేదు. సర్వవ్యాపకుఁ డొక్కఁడే యుండవలయును కాని యనేకు లుండుటకు వీలు లేదు. అనేకపదార్థములు పరస్పరభిన్నములై యుండిన నం దొక్కటొక్కటియు సర్వవ్యాపక మగుట యెట్లు? "రూపాదులు సర్వవ్యాపకములై యనేకములై కూడ నున్నవి కదా" యనిన నదియుఁ జెల్లదు. వానికి *లక్షణములు ప్రత్యేకములై యున్నవి; వానికిని వానియాశ్రయములకును భేదము కూడ లేదు. ఈకారణమువలన నవి యనేకములైనను పదార్థాభిన్నము లగుటచే సర్వవ్యాపకములు. కానేరవు; పదార్థములవలె కొన్నిస్థలములయందు మాత్రమే యుండునవి యగును. "ఆత్మలు కూడ నిట్టివారే కావచ్చును. వారు అవయవములు లేకుండుటచే సర్వప్రదేశమునుఁ గూడ వ్యాపింపవచ్చును" అనిన నదియు యుక్తము కాదు. వారనేకులో యొక్కఁడో నిర్ణయించుటకు గుఱుతేమియు లేదు. †"విశేషమే ('వీఁడు రాముఁడు వీఁడు గోవిందుఁడు' అని యీశ్వరునిచే నుద్దేశింపఁబడినభేదమే) వారికి భేదమునుఁ గలిగింపఁగలదు అనుటయు నసంభవము. భేద ముండిన గాని విశేష ముండుటకు వీలు లేదు; విశేష ముండిన గాని భేదముండుటకు వీలు లేదు. ఈయన్యోన్యాశ్రయమునకుఁ బరిహార మెట్లు? "సంసార మనాది యగుటచే నిదియు (పరమేశ్వరుఁడు జీవులనుఁ బ్రత్యేకముగ గ్రహించుచుండుటయుఁ, దదను

---

* లక్షణము లనఁగా నొకపదార్థమును తక్కినవానినుండి విభాగించుగుఱుతులు.

† విశేషము. (౫౦౩-వ పుట. చూడు.)

సారముగ జీవభేదము కలుగుచుండుటయు) ననాదియే" యని చెప్పుటకును వీలు లేదు. అనాదిత్వ మనునది యుక్తియుక్త మగుహేతువు కాదని పూర్వముననే (చూ. ౧-౪-౫.) నిరూపించియున్నాము. కావున నెట్లును వైశేషికపక్షమున సుఖదుఃఖవ్యవస్థ కుదురదు.

బాగుగ విచారించిన వేదవిరుద్ధ మగుపక్షమును సాధించుటకై వైశేషికు లంతగాఁ బ్రయాసము నొందనేటికి ? ఏకాత్మపక్షమున నీసుఖ దుఃఖవ్యవస్థాదులు కుదురకుండినఁ గదా! ఎట్లయిననుఁ బక్షాంతరమును సాధింపఁ బూనవలయును. ఆవిషయమును గూర్చి (యేకాత్మపక్షము నందును సర్వముఁ గుదురు ననువిషయమును గూర్చి (యిదివఱకే చాలి నంత వివరింపఁబడి యున్నది. ఆకాశకాలదిక్కు లనేకము లైననూ సర్వ వ్యాప్యము లై యున్నట్లు జీవులును అనేకు లైనను సర్వవ్యాపకులు కావచ్చు నని యొకవేళ వారిమతము నాశ్రయించి చెప్పినను వేదాం తులకు నావిషయము సమ్మతము కాదు. ఆదృష్టాంతము వేదాంత మతానుసారముగ సిద్ధింపదు. వేదాంతిమతమున నాకాశాదులును బ్రహ్మకార్యములే యని కదా సిద్ధాంతము. దృష్టాంత మనునదియు నుభ యవాదిసమ్మతముగ నుండవలయును గాని యేకవాదిసమ్మతముగ నుండఁ గూడదు. కాదని పట్టుఁబట్టినను "సంయోగమాత్రమున మనోఽదృష్ట ములు కార్యకారు లగును. స్వామిభృత్యభావసంబంధమువలనఁ గలుగు నాధిక్య మేమియు లేదు" అని పైన వివరింపఁబడినయాక్షేపమునకు (చూ. ౨-3-౫౨.) సమాధాన మెద్దియు లేదు కదా! కావున నెట్లును వేదాంతపక్షమే యేకాత్మపక్షమే యుక్తియుక్త మైనది ; అంతఃకరణో పాధియందున్న పరమేశ్వరుఁడే (అవచ్ఛిన్నుఁడై కాని, ప్రతిబింబితుఁడై కాని ఉన్నపరమేశ్వరుఁడే) జీవుఁడు.

ఇది వెన్నెలకంటి సుందరరామశర్మచే రచింపఁబడిన బ్రహ్మసూత్రార్థ చంద్రికయందు ద్వితీయాధ్యాయమునఁ దృతీయపాదము.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు
ద్వితీయాఽధ్యాయస్య తృతీయః పాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ద్వితీయాధ్యాయమునఁ
దృతీయపాదము.



# బ్రహ్మసూత్రములు.

## ద్వితీయాధ్యాయము - చతుర్థపాదము.

---

## పాదావతారిక.

"తృతీయచతుర్థపాదములయందు శ్రుతులలోఁ గానవచ్చుపరస్పరవిరోధములు పరిహరింపంబడును" అని తృతీయపాదారంభముననే చెప్పితిమి అందు (తృతీయపాదమునందు) పంచభూతోత్పత్తినిఁ గూర్చియు జీవస్వరూపాదులనుగూర్చియు నున్నవిరోధములు పరిహరింపఁబడెను. ప్రస్తుతపాదమున సూక్ష్మశరీరోత్పత్తినిఁగూర్చినశ్రుతులయందలివిరోధములు పరిహరింపఁబడును. ఈపాదమునందును "శ్రుతులయందే పరస్పరవిరోధముండుటచే వాని నాధారముగఁ గైకొని చేయఁబడినసమన్వయము సరికానేరదు" అనునది పూర్వపక్షము. "వేదవాక్యములయం దట్టివిరోధము లేకుండుటచే వేదాంతసమన్వయమునకు భంగము లేదు" అనునది సిద్ధాంతము. వేదాంతమతము మోక్షార్థులకు నాదరణీయ మనుటయు కా దనుటయుఁ గ్రమముగ సిద్ధాంతపూర్వపక్షములకు ఫలములు.

---

## ప్రాణోత్పత్త్యధికరణము. ౧.

విషయము సంగతి.—ఈయధికరణమున నింద్రియోత్పత్తినిఁ గూర్చినశ్రుతివిరోధములు పరిహరింపఁబడును. పూర్వపాదాంతమున జీవుఁడే కర్త యని నిర్ణయింపఁబడెను కావున వానికి నింద్రియములు సాధనములగుటచే స్ఫురణసందర్భముచే నీవిచార మీయధికరణమునఁ గలిగెను.

సందేహము పూర్వపక్షము.—ఆకాశాదిపంచభూతములకు నుత్పత్తి చెప్పినట్లు డేయుపనిషత్తునందు కాని యింద్రియములకు నుత్పత్తి చెప్పఁబడి యుండలేదు. ఇంద్రియోత్పత్తిని నిర్ణయించుటకు ప్రత్యక్షాదులకు సామగ్ర్యము లేదు కదా! ఇట్లుండ దాని నెట్లు నిర్ణయింపఁగలము.

మఱియు కొన్ని స్థలములయందు "ఋషయో వావ తేఽగ్రే, ప్రాణా వా వ ఋషయః"="సృష్టికిఁ బూర్వమున ఋషులే యుండిరి, ఋషు లనఁగా ప్రాణములు (ఇంద్రియములు)" అను మొదలగువాక్యములచే వేదమున సృష్టికిఁ బూర్వమునఁ గూడ నింద్రియము లున్నట్లు చెప్పఁబడి యున్నది. దీనిని బట్టి చూచిన 'నింద్రియములు సృష్టింపఁ బడలేదు' అని తేలుచుండుటచే వానికి నుత్పత్తి కల దనుటయే యసంభవము. ఇట్లున్నను 'ఏతస్మా జ్జాయతే ప్రాణః' అను మొదలగుకొన్ని వాక్యములు 'ఇంద్రియములు పరమేశ్వరునుండి జనించెను.' అనియుఁ జెప్పుచున్నవి. ఈశ్రుతులకుఁ బరస్పరవిరోధము కలదా? లేదా? విచారించి చూచిన *అన్యథాసిద్ధి నొందుటకు వీలు లేనిశ్రుతి యొక్కటి యైనను పెక్కుశ్రుతుల బాధింపఁగలదు. కావునఁ బ్రాణనిత్యత్వశ్రుతి ప్రాణోత్పత్తిశ్రుతులను బాధించు నని తోఁచు చున్నది. (ఇచ్చట వియదధికరణమునఁ ౨-౩-౧-౪. జూపఁబడిన పూర్వపక్షముల సంయోజనఁ జేయవలయును.)

## సూత్రము. ౧.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

## ౨౭౧. †తథా ప్రాణాః. ౨. ౪. ౧.

తాత్పర్యము:—"ఏతస్మా దాత్మన స్సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే దేవా స్సర్వాణి భూతాని వ్యుచ్చరంతి"="ఈపరమేశ్వరునుండియే సర్వప్రాణములును(ఇంద్రియములును సర్వలోకములును సర్వదేవతలును సర్వభూతములును) జన్మించును" అను మొదలగువాక్యముల ననుసరించి చూచిన భూతాదు లెట్లుజన్మించుచున్నవో ఇంద్రియములుకూడ నట్లే

---

* అన్యథాసిద్ధి (పు. చూ. ౫౭౯).

† తథా ప్రాణాః.

"ఇది పాదమునకు నారంభసూత్రము. దీనికిఁ బూర్వమున నేవిషయంబును ప్రశంసింపఁబడలేదు. ఇట్లుండ 'తథా' అనునుపమావాచకశబ్దమును బ్రయోగించుట సంభవింపదు. పూర్వపాదాంతమున జీవాత్మస్వరూపముఁ బ్రస్తావింపఁబడెను. దానితోఁ బ్రాణములకు నుపమానము సంభవింపదు. జీవులు నిత్యులు ప్రాణము లనిత్యములు ఇట్లు కాక నదృష్టముతో వీనికిఁ బోలిక గల దనిన నదియు సంభవింపదు. వైశేషిక మతము ననుసరించి చూచిన సర్వజీవులను ప్రతిదేహమునందు నుండుటచే వారిసమీప

జనించుచున్నవియని తోఁచుచున్నది. ఒకానొకయుపనిషత్తునందు నింద్రియోత్పత్తి చెప్పఁబడకున్నను అనేకస్థలములయందుఁ జెప్పఁబడియున్నది కావున నదియే(ఉత్పత్తి కలదనుటయే)ప్రామాణికము.ఒకవిషయ మొక్క స్థలమున లేకున్నను మఱియొకస్థలమునుండి తెచ్చికొనుట యుక్తియుక్త మగుఁ విషయము కాని యొక్కదానికై పెక్కుస్థలములయందుఁ జెప్పఁబడినదానిని నిరర్థకముఁ జేయుట యుక్తియుక్తము కాదు కదా! కావున నింద్రియములకు నుత్పత్తి యవశ్యముగఁ గలదు.

"సృష్టికిఁ బూర్వమునఁ గూడఁ బ్రాణములు కలవు." అని చెప్పినట్లు కానవచ్చుచున్నశ్రుతులు ప్రాణనిత్యత్వమును బోధించునవి కానేరవు. అప్పుడు ప్రాణములును పరబ్రహ్మంబు నని రెండుపదార్థము లుండవలసి వచ్చుటచే నద్వైతశ్రుతులకును దానికిని (ప్రాణనిత్యత్వశ్రుతికిని)విరోధము

---

మున జనించినయదృష్టమునకు నియమము కలుగదు. ఇట్లే ప్రాణములకుఁ గూడ నియమము లేకపోవు ననియు నీకారణమువలన వైశేషికమతము యుక్తిశూన్య మనియు సిద్ధాంతము చేయఁ బ్రయత్నము కల దేని యప్పుడును పునరుక్తిదోషము వచ్చును. పూర్వపాదాంతమునందే 'సర్వవ్యాపకు లగుజీవు లనేకు లుందురేని వారియదృష్టములను గాని దేహములను గాని నియమించుటకు (ఇదియే వీనిదేహము వీనికర్మ అని నిర్ధారణ చేయుటకు) వీలు లేదు' అని సిద్ధాంతము చేసి యున్నారు. ఈసిద్ధాంతముతోనే ప్రాణములను గూర్చినసిద్ధాంతముఁ గూడ చేయఁబడి నట్లే యయ్యెను దానినే మరలఁ జేసినఁ బునరుక్తిదోషము వచ్చును కదా! కావున నెట్లు విచారించినను ఈ సూత్రమునందు 'తథా'యనుపదమును ప్రయోగించుట యసంబద్ధమనితోఁచుచున్నది". అని ఈసూత్రముపై సంశయము వచ్చును కాని ఇది నిలుచునది కాదు.

శ్రుతియందు 'ఏతస్మా దాత్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరంతి. ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ' అను మొదలగుశ్రుతులయందు ప్రాణసృష్టికి ననేకము లను పమానములుగఁ జెప్పియున్నది. లోకములు మొదలగు వానివలెను ఆకాశాదులవలెను ప్రాణములు కూడ సృష్టి యైనవియే యని సూత్రమునకు నర్థముఁ జెప్పవచ్చును. మఱియుఁ దృతీయపాదారంభమున భూతసృష్టి చెప్పఁబడి యున్నది దానితో నైనను ప్రస్తుతప్రకరణమునకుఁ బోలిక యుండవచ్చును. ఒకానొకస్థలమున దూరమునం దున్నవానితోఁ గూడ ప్రకృతమునకుఁ బోలికఁ జెప్పుట కలదు. పూర్వమీమాంసాశాస్త్రమున 'పానవ్యాప చ్చ తద్వత్' అనుస్థలమున జైమిని మహాముని యిట్టిపోలికనే చెప్పియున్నాఁడు.

దుర్నివారమై వచ్చును. ఇట్లు వచ్చిన వేదప్రామాణ్యము నశించును కావున దానికిఁ బ్రాణనిత్యత్వపరముగ నర్థముఁ జెప్పఁగూడదు. అది * యవాంతరప్రళయములనుఁ గూర్చి చెప్పి యుండవచ్చును. ఆసమయమునందు సర్వలోకములును నశించును గాని సూక్ష్మశరీరాభిమాని యగుహిరణ్యగర్భుఁడు లేక సృష్టికర్త యని చెప్పఁబడుచతుర్ముఖుండు నశింపఁడు కదా! ఈకారణమువలన నాయనకుఁ గలయింద్రియములును నశింపవు దీనిఁ బట్టి యాశ్రుతి అట్లు చెప్పి యుండవచ్చును ; ఇందు విరోధమేమి కలదు? ఈకారణమువలన నెట్లును ఇంద్రియము లుత్పన్నము లైనవియే.

## సూత్రము. ౨.

అవతారిక:—"సృష్టికిఁ బూర్వమున నింద్రియములుఁ గల వని శ్రుతియందే జెప్పఁబడి యుండుటచే ప్రాణోత్పత్తిశ్రుతి † గౌణియే కావలయును" అనుపక్షమును ఖండించుటకై మఱియొక హేతువునుఁ జూపుచున్నాఁడు.

## ౨౭౨. ‡గౌణ్యసంభవాత్. ౨. ౪. ౨.

తాత్పర్యము:—ప్రాణోత్పత్తిశ్రుతి యెట్లును గౌణి కానేరదు. అట్లు "గౌణియే కావలయును" అని చెప్పిన సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగము వచ్చును. సర్వపదార్థములునుఁ బరమేశ్వరునివిచారము లైననే కదా పర

* అవాంతరప్రళయము లనఁగా సృష్టిమొదలు బ్రహ్మప్రళయము జరుగుటకు ముందు కలుగుయుగప్రళయాదులు. (పంచప్రళయములు చూ. పు. ౩౭౭.)

† గౌణి (పు. చూ. ౨౨౨).

‡ గౌణ్యసంభవాత్. ౨ ౪. ౨.

ఈసూత్రము మూడవపాదమునందు వియదధికరణమునఁ బూర్వపక్షసూత్రముగ వచ్చియున్నది అచ్చట "గౌణీ, అసంభవాత్" అని పదచ్ఛేదముఁ జేసి "ఆకాశోత్పత్తిశ్రుతి ఇతరశ్రుతులకు విరుద్ధ మగుటచే ముఖ్యమగుటకు వీలు లేదు కావున గౌణియే" యని వ్యాఖ్యానము చేయఁబడి యున్నది. "సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు హాని వచ్చును కావున ... యున్నది. ఇచ్చట నిది సిద్ధాంతసూత్రమే కావున నేకపదముగనే పరిగణింపఁబడి "సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు రోధ

మేశ్వరజ్ఞానముచే సర్వవిజ్ఞానమునుఁ గలుగును? ఇట్లు కాక ఇంద్రియము లుమాత్రము నిత్యములై, యుత్పత్తిరహితములై యుండిన నా ప్రతిజ్ఞ యెట్లు సిద్ధించును? ముండకోపనిషత్తునందు "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" (చూ. ౧-౨-౨౧-౨౩.) అని సర్వవిజ్ఞానప్ర తిజ్ఞ నాచరించి దానిని సమర్థించుటకై "ఏతస్మా జ్జాయతే ప్రాణో" అను మొదలగువాక్యము చెప్పఁబడి యున్నది. స్పష్టముగాఁ గూడ "బ్ర హ్మైవేద మమృతం పురస్తాత్" = "ఈపూర్వభాగ మంతయును బ్రహ్మమే" అను మొదలగువాక్యములచే బ్రహ్మభిన్న మగుపదార్థమే లే దనియుఁ జెప్పఁ బడి యున్నది. ఇట్లుండఁ బ్రాణోత్పత్తిశ్రుతి గౌణి యగుటకు నేమి వీలు కలదు? అదియుఁ బరమేశ్వరున కభిన్న మైనదియే కావలయును. అట్ల గుటకును అది (ఇంద్రియసమూహము) పరమేశ్వరునుండియే జనించియుం డనలయును కదా! ఈకారణమువలన నెట్లును ప్రాణోత్పత్తిశ్రుతి గౌణి కానేరదు.

## ౨౭౩. తత్ప్రాక్ఛ్రుతేశ్చ. ౨. ౪. ౩.

తాత్పర్యము:—మఱియు "ఏతస్మా జ్జాయతే" అను మొదలగువా క్యములయందు మొట్టమొదట గల "జాయతే" యనుపదము ప్రాణాదు లతోను భూతములతోఁ గూడ సంబంధపడి యున్నది. భూతములవిష యమున నది ముఖ్యార్థమునే చెప్పు నని యిదివఱకే స్థాపించితిమి కదా! ఇట్లుండఁ బ్రాణములవిషయమున మాత్రము గౌణార్థము నెట్లు చెప్పును? సమానవాక్యమున నొక్కస్థలముననే యుండి యనేకపదములతో సంబం ధపడి యున్నపదము కొన్నిటితో ముఖ్యముగాను మఱికొన్నిటితో గౌ ణముగాను సంబంధించు ననుట యెట్లు యుక్తియుక్త మగును? అప్పుడు

---

ధము వచ్చును కావున నీప్రాణోత్పత్తిశ్రుతి గౌణి యగుటకు వీలు లేదు' అని వ్యాఖ్యాలి నము చేయఁబడి యున్నది. వియదధికరణమునందువలెనే యిచటఁ గూడ నీసూత్రము నకు నర్థముఁ జెప్పినచో సర్వవేదాంతశాస్త్రమునకు నది విరుద్ధ మగును. ప్రాణములు జీవునివలె శుద్ధబ్రహ్మరూపములా? లేక బ్రహ్మభిన్నము లగునిత్యపదార్థములా? అవి యచేతనము లగుటచే బ్రహ్మరూపములు కానేరవు. సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు హాని వచ్చుటచే బ్రహ్మభిన్నములును కానేరవు. కావున నీయర్థమును చెప్పువారు సర్వవిజ్ఞానప్రతిజ్ఞ నలక్ష్యము చేసినవార లగుదురు. కావున నిది యుక్తము కాదు.

వాక్యమే వికారరూపము కలది యగును కదా! మఱియు ఈ 'జాయతే' యనుపదము మొట్టమొదట ప్రాణములనుఁ గూర్చియే చెప్పఁబడియున్నది. ఈయొక్కస్థలముననే గాక "స ప్రాణ మసృజత ప్రాణా చ్ఛ్రద్ధాం"= "ఆ పరమేశ్వరుఁడు ప్రాణమునుసృజించెను ప్రాణమునుండి శ్రద్ధనుసృజించెను" అని మఱియొకస్థలమునందుఁ గూడఁ జెప్పఁబడి యున్నది. పూర్వమువలెనే యిచ్చటఁ గూడ "అసృజత" యనుపదము మొట్టమొదట ప్రాణముఁ గూర్చియే చెప్పఁబడి శ్రద్ధాదులతో సంబంధపడుచున్నది. ఇట్లే యితర స్థలములయందును "భూతాని వ్యుచ్చరంతి" అని వాక్యాంతమునఁ గల 'వ్యుచ్చరంతి' యనుపదంబును ప్రాణాదులతో సంబంధపడియే యున్నది. ఇట్లగుటచే ననేకశ్రుతులయందు ప్రాణోత్పత్తి ముఖ్యముగనే చెప్పఁబడె ననుటలో సంశయము లేదు.

## ౨౨౪. తత్పూర్వకత్వా ద్వాచః. ౨. ౪. ౪.

తాత్పర్యము:—ఇంతమాత్రమే కాదు. తైత్తిరీయశ్రుతియందు ప్రత్యక్షముగాఁ గాకున్నను అర్థానుసారముగ నింద్రియసృష్టియుఁ జెప్పఁబడియే యున్నది. "అన్నమయం హి సోమ్య మన ఆపోమయాః ప్రాణా స్తేజోమయీ వాక్"="ఓశాంతుఁడా! మనస్సు అన్నమయము ప్రాణములు జలమయములు వాగింద్రియము తేజోమయము" అని వాగాదులస్వరూపము వివరింపఁబడి యున్నది కదా దీనిని పట్టి విచారించిన నీవిషయము స్పష్టమగుచున్నది. ఎట్లనిన:—

ఈఅన్నమయత్వాదులు ప్రాణాదులకు ముఖ్యములా? లేక గౌణములా? ముఖ్యములైన మనస్సు మొదలగువారితోఁబాటు సర్వేంద్రియములసృష్టియుఁ జెప్పఁబడె ననవలయును. అన్నమనఁగా పృథివి కావున మనస్సు దానినుండి జనించె ననియు ప్రాణములు జలమునుండి యుత్పన్నము లయ్యె ననియు వాగింద్రియ మగ్నినుండి సంభవించె ననియు నా శ్రుతివలనఁ ("అన్నమయం హి సోమ్య మనః" అనుమొదలగు శ్రుతివలన) దేలుచున్నది కదా! ఇట్లుఁ గాక నది (ఆయన్నమయత్వాదిశ్రుతి) గౌణమైననూ ఈసిద్ధాంతమునకు భంగము రాదు. అప్పటికిని ఆశ్రుతియందలి యుపక్రమాదుల విమర్శించిన "ఈశ్వరుఁడు సర్వపదార్థములయందును జేరి వారినామరూపములఁ బ్రకటించుచున్నాఁడు కావున నీమనస్సు మొద

లగునవి కూడ భూతమయములే కావలయును. లేకున్న బరమేశ్వరుఁడు దీనియందు బ్రవేశించుననుట సంభవింపదు. ఈకారణమువలన నివి భూతమయము లైననుఁ గాకున్నను శ్రుతి యట్లు (మనస్సు అన్నమయము అను మొదలగురీతులతో) చెప్పుచున్నది. దీనికి 'పరమేశ్వరుఁడు ప్రాణాదుల యందుఁ బ్రవేశించి వానినామరూపములఁ బ్రకటించుచున్నాఁడు.' అనుట మాత్రమే కాని 'ప్రాణాదులు భూతమయములు' అనుట కాదు" అని మాత్రమే చెప్పవలసి యుండును. వాస్తవస్థితిలో "ప్రాణాదులు భూతమయములే" అని యిదివఱకే సయుక్తికముగ సిద్ధాంతము చేయఁబడి యున్నది. కావున నెట్లు చూచినను ఇంద్రియములకు నుత్పత్తి నిర్వివాదముగ సంభవించును. "ఉత్పత్తికిఁ బూర్వమున బ్రాణములు గలవు" అని చెప్పుశ్రుతికి అవాంతరప్రళయపరముగ నర్థము చెప్పవలయు నని యిదివఱకే సిద్ధాంతము చేసియున్నాము. ఏవిధముగ జూచినను ఆసిద్ధాంతమును భంగము చేయుటకు వీలు లేదు. ఇంద్రియము లనునవి యెప్పటికి నొకరి నాశ్రయించి యుండునవియే కాని స్వతంత్రముగ నుండునవి కావు. సృష్టికిఁ బూర్వమున నవి కల వనిన నప్పుడు వానికి నాశ్రయ మెయ్యదియో నిర్ణయింపవలసి యుండును. అప్పుడు (సృష్టికిఁ బూర్వమున) పరమేశ్వరుఁ డొక్కఁడు మాత్రమే కలఁ డని సర్వశ్రుతులయందును ఘోషింపఁబడుచున్నది. "అప్రాణో హ్యమనాః"="ప్రాణములు (ఇంద్రియములు) లేనివాఁడు మనస్సు లేనివాఁడు నిత్యపరిశుద్ధుఁడు" అని యాయనకు నింద్రియాభావము కూడ పలుమాఱు చెప్పఁబడి యున్నది. ఇట్లుండ నింద్రియములు సృష్టికిఁ బూర్వము నిరాశ్రయములై యుండుట యెట్లు? ఈకారణమువలన నాశ్రుతి యవాంతరప్రళయవిషయమే' యనియు ఇంద్రియములును హిరణ్యగర్భు నాశ్రయించి యుండు ననియుఁ జెప్పవలయును. కావున నెట్లును ప్రాణాదుల కుత్పత్తి కలదు. ప్రాణ నిత్యత్వశ్రుతి పైన వర్ణించినవిధముగ గౌణి యగుటచే ప్రాణోత్పత్తిశ్రుతులతో దానికి విరోధము లేదు.

---

## సప్తగత్యధికరణము. ౨.

విషయము సంగతి:—పైయధికరణమున నింద్రియములకు నుత్పత్తి కల దనువిషయము సాధింపఁబడెను. ఇప్పుడు దాని నాశ్రయించి

ఆశ్రయాశ్రయిభావసంగతితో నింద్రియసంఖ్యనుఁగూర్చి విచారింపఁబడును. "జీవుఁడు ఇంద్రియములకంటె భిన్నుఁడు" అనువిషయము సిద్ధాంతముఁ జేయుటయే ఈవిచారమునకు ఫలము.

సందేహము:—కొన్ని శ్రుతులయందు "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్" అనువాక్యముచే "నింద్రియములు *సప్తసంఖ్య కలవి" అని చెప్పఁబడి యున్నది. మఱిఁ గొన్నిటియందు "అష్టౌ గ్రహాః" అనుమొదలగు వాక్యములచే ఇంద్రియము †"ఎనిమిది ‡తొమ్మిది §పది §పదునొకండు ¶పండ్రెండు **పదుమూఁడు" అని పరస్పరవిరుద్ధముగఁ జెప్పఁబడియున్నది. ఈసంఖ్యాశ్రుతులకుఁ బరస్పరము విరోధము కలదా? లేదా?

## సూత్రము. ౫.

అవతారిక:—అను నీసంశయమును ఏకదేశిమతముతో నిరాకరించుచున్నాఁడు.

---

* ఉపనిషత్తులయందు గొన్నిస్థలములలో నేత్రము; నాసిక; నాలుక; వాక్కు; శ్రోత్రము; మనస్సు; చర్మము; అనునీయేడు మాత్రమే ఇంద్రియము లని చెప్పఁబడెను.

† శ్రుతియందు ఇంద్రియశబ్దమునకు మాఱుగా గ్రహశబ్ద ముపయోగింపఁ బడియున్నది. గ్రహ మనఁగా బంధించునది. జీవుని సంసారమున బంధించును కావున నింద్రియముల కీపేరు వచ్చినది. మఱియు నాగ్రహము ఎనిమిది. జ్ఞానేంద్రియము లైదు. మనస్సు వాక్కు హస్తములు అనునీమూఁడునుఁ గలిసి యెనిమిది.

‡ మఱియొకచోట నవరంధ్రములు నుఁ దొమ్మి దింద్రియములనుఁగ శ్రుతి చెప్పుచున్నది.

§ మఱియొకచోట నవరంధ్రములును నాభితోఁ గూడఁ బది యింద్రియము లని చెప్పఁబడెను.

§ జ్ఞానేంద్రియము లైదును కర్మేంద్రియము లైదును మనస్సొక్కటియునుఁ గలసి పదునొకం డింద్రియము లని మఱియొక్కచోఁ జెప్పఁబడెను.

¶ పైఁ జెప్పినయింద్రియములతో హృదయమును (బుద్ధిని) చేర్చుకొని కొన్నిచోట్ల పండ్రెండింద్రియములు చెప్పఁబడెను.

** మఱి కొన్నిస్థలములయందు యీపండ్రెండింటితో నహంకారమునుఁ గూడఁ జేర్చి పదుమూఁడుగాఁ జెప్పఁబడెను.

## ౨౭౫. సప్తగతే ర్విశేషితత్వాచ్చ. ౨. ౪. ౫.

తాత్పర్యము:—పైనఁ జూపినవిరోధము ఎట్లును గలుగనేరదు. ఇంద్రియములు ఏడనియే నిర్ణయింపవలసి యున్నది. శ్రుతి యీవిషయమును జెప్పుచున్నది యనుట నిస్సంశయమే కదా! సామాన్యముగఁ జెప్పుటయే కాదు మఱియొకస్థలమున "సప్త వై శీర్షణ్యాః"="శిరస్సుననున్నవి యేడు" అని విశేషముగఁ గూడఁ జెప్పి యున్నది. శిరస్సుననున్నవి మాత్రమే ప్రాణములైనఁ దక్కినవి కావని స్పష్టముగఁ దెలియుచున్నది. "వాఁడు కుడికంటితోఁ జూడఁగలఁడు" అనిన "వాఁడు ఎడమకంటితోఁ జూడలేఁడు" అని ప్రత్యేకముగఁ జెప్పవలయునా? ఈకారణమువలన నింద్రియములు సప్తసంఖ్య కలవియే యని తేలుచున్నది. "ఇంద్రియము లెనిమిది తొమ్మిది" అని యనేకశ్రుతు లున్నను వానికి ప్రస్తుతశ్రుతివాక్యముతో ("సప్త ప్రాణాః" అనుశ్రుతివాక్యముతో) విరోధము కలుగదు. అనేకస్థలములయం దనేకవిధములుగ సంఖ్యలు చెప్పఁబడి యుండుటచే "ఇందు దేనినినిర్ణయింపవలయును" అని సంశయము రాఁగా, *లఘు వగుటచేతను బహువాక్యసమ్మత మగుటచేతను సప్తసంఖ్య నిర్ణయింపఁబడెను కావున దానికి ననుకూలముగ సర్వశ్రుతులును (సంఖ్యను చెప్పుశ్రుతులును) సమన్వయింపఁ బడవలయును. ఆయాయింద్రియముల వ్యాపారభేదముల ననుసరించి సంఖ్యాభేదము వర్ణింపఁబడె ననవలయును. ఈకారణమువలన నిచ్చట శ్రుతివిరోధము లేదు.

## సూత్రము. ౬.

అవతారిక:—ఇట్లు పైసంశయమును ఏకమతానుసారముగ నివారించి ఈసూత్రమున స్వమతమును చెప్పుచున్నాఁడు.

## ౨౭౬. హస్తాదయస్తు స్థితే ఽతో నైవమ్. ౨. ౪. ౬.

తాత్పర్యము :—ఈసిద్ధాంతము యుక్తియుక్తమైనది కాదు. హస్తములు మొదలగునవికూడ నింద్రియములే. "హస్తౌ వై గ్రహః స

* లఘు—చులకన. (౨౫౭ పు. చూ.)

కర్మణా ఽతిగ్రహేణ గృహీతో హస్తాభ్యాం హి కర్మ కరోతి॥ "హస్తములు జీవుని బంధించునట్టిపదార్థములు (ఇంద్రియములు) వానికిఁ బుచ్చికొనుట, విడుచుట అనుకర్మలతో సంబంధము కలదు. ప్రతిపురుషుఁడును ఒకపదార్థము నీయవలయు ననినను దీసికొనవలయుననినను హస్తములతోడనే కదా వ్యాపారము నాచరించును" అనుమొదలగు బృహదారణ్యవాక్యములఁ బట్టి చూచిన నింద్రియములసంఖ్య యధికమగును. ఈకారణమువలన నధికసంఖ్యనే గ్రహింపవలయును కాని యల్పసంఖ్యను కాదు. అధికాల్పములకు విరోధము వచ్చెనేని యధికసంఖ్యను గ్రహించి యల్పమును విడుచుటయే యుక్తియుక్తము. ఎప్పటికిని అధికమున నల్పసంఖ్య యంతర్భావము నొందును కాని యల్పమున నధికసంఖ్య యంతర్భావము నొందనేరదు కదా! కావున "దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశ"="పురుషునియందు ఇంద్రియములు పది మనస్సు పదునొకండవది" అను శ్రుతి నాశ్రయించి యింద్రియములు పదునొకండనియే గ్రహింపవలయును. శ్రుతివాక్యములకు స్వాభావికముగనే ప్రామాణ్య మున్నను, వానియర్థమును నిర్ణయించుటకు మఱియొక ప్రమాణము సహాయముగ నుండ నక్కఱ లేక పోయినను, వానిలోఁ బరస్పర విరోధము వచ్చినప్పుడును, వికల్పమునకు నవకాశము లేకపోయినప్పుడును సిద్ధాంతమునకై లోకన్యాయము ననుసరింపవలసియే యుండును. ఇచ్చట నింద్రియములు పదార్థము లగుటచే వానివిషయమున వికల్ప ముండుటకు వీలు లేదు; లోకము ననుసరించి చూచిననుఁ బదునొకండుకార్యములకంటె నధికము లెట్లును సిద్ధింపవు. కావునఁ దదనుసారముగఁ బదునొకం డింద్రియములు మాత్రమే కల్పింపఁబడవలసి యున్నవి. ప్రత్యక్షానుభవమున శబ్దాదివిషయము లైదును మాటలాడుట మొదలగు కర్మ లైదును వేఱువేఱుగఁ గానవచ్చుచున్నవి. ఈపదిక్రియలకును జ్ఞానేంద్రియము లైదును కర్మేంద్రియము లైదునుఁ గలసి పదింద్రియములు కల్పింపఁబడవలయును. సంకల్పము నిశ్చయము మొదలగువానికి నొక్కయంతఃకరణము చాలును. అది యొక్కటియే దీపమువలె సర్వతోముఖమై సర్వేంద్రియములవై పునకును సంచరింపవచ్చును. ఇంతకంటె నధికసంఖ్యలను జెప్పు శ్రుతులును అంతఃకరణవృత్తిభేదములు మొద

లగువాని నాశ్రయించి సమన్వయింపఁబడవచ్చును ; అల్పసంఖ్యా ఈసంఖ్యా యందే యంతర్భావమును జెందవచ్చును.

మఱియును శిరస్సున నేడింద్రియములు లేవు. ఉన్నవి నాల్గే. నేత్రములురెండుగా గానవచ్చుచున్ననూ అందున్నది యొకయింద్రియమే. రెండు కన్నులును తెఱచి యున్నప్పుడుఁ గానవచ్చునంతవిశదముగ నొకకన్ను మూసినప్పుడు కానరాదనుట సర్వానుభవసిద్ధమే ఆరెండునుఁ బరస్పరభిన్నము లగునింద్రియములే యయ్యోనేని యీయనుభవ మెట్లు సంభవించును ? ఇట్లే కర్ణములు నాసికలుఁగూడ రెండుగఁగానవచ్చుచున్న ను అందు కలయింద్రియము మాత్ర మొక్కటియే. సర్వవ్యాపార ములును ఈనాల్గింద్రియములచేతనే నిర్వహింపఁబడు ననుట శక్య మగు నా ? కావున నెట్లును ఇంద్రియములు ఏడే యనుటకు వీలులేదు. యెనిమిది యని వర్ణించినస్థలమునందును సంచారము విసర్గము (మలవిస ర్జనము) ఆనందము అనులోకప్రసిద్ధకర్మలు మూఁడును విడువఁబడి యున్నవి యనుట విస్పష్టమే. తొమ్మిది పది యని చెప్పఁబడియున్నస్థల ములయందు కేవలరంధ్రములే యుద్దేశింపఁబడెను కాని యింద్రియ ములు కావు. పది యని చెప్పినస్థలమున 'నాభి ర్దశమీ' అని కేవల రంధ్రమే పదియవదిగాఁ జెప్పఁబడెను. నాభి యనునొకనింద్రియము లోకప్రసిద్ధమై లేదు కదా * ప్రాణవాయువునకు నొకస్థాన మగుటచే నాభియుఁ బదియవరంధ్రముగా నుద్దేశింపఁ బడెను. 'ఇంద్రియములు పదునొకండు' అనిచెప్పినశ్రుతినిఁగూర్చియు 'పంద్రెండు పదుమూఁడు' అని చెప్పినశ్రుతులనుఁ గూర్చియు ఇదివఱకే వివరించితిమి. ఉపాసనార్థమై కూడ శ్రుతి యిన్నివిధములుగఁ జెప్పుచున్నది. కావునఁ బైన వివరించినవిధ ముగ లోకప్రసిద్ధము లగు కృత్యముల నాశ్రయించియే ఇంద్రియముల నేకాదశసంఖ్యఁ గలవానినిఁగా నిర్ణయింపవలయును; శ్రుతివిరోధంబును లే దని యిదివఱకే నిర్ణయింపఁ బడి యున్నది కదా!

---

* నాభి సమానవాయువునకు స్థాన మైనను అది ప్రాణవాయువుయొక్క రూప భేదమే కావున నట్లు చెప్పఁబడెను. శరీరములోపల సంచరించువాయువునకు సామా న్యముగ ప్రాణవాయువు అని పేరు. అది యైదువిధము లగుకార్యముల నాచరించు టచే దానికి ప్రాణాపానాదు లగునైదుపేర్లు వచ్చినవి. అందు ప్రాణవాయువు హృదయ మునందును అపానవాయువు గుదమునందును వ్యానము సర్వశరీరమునందును సమానము నాభియందును ఉదానము కంఠమునందును ఉన్నది.

అవతారిక:- ఈయధికరణమునకే మఱియొకవిధముగ వ్యాఖ్యానమును జేయుచున్నాఁడు. విషయసంగతి సందేహము లన్నియుఁ బూర్వమువలెనే యని తెలిసికొనవలయును.

## సూ. సప్తగతే ర్విశేషితత్వా చ్చ.

తాత్పర్యము:—ఇంద్రియములు ఏడే. "త ముత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి" = "వాయువు నిర్గమించునప్పుడు ఇంద్రియము లన్నియు నిర్గమించును" అని బృహదారణ్యకోపనిషత్తునందు * ఏడింద్రియములకు మాత్రమే నిర్గమనము చెప్పఁబడి యున్నది. 'సర్వశబ్దము కలదుకదా' యనియెదవేమో యచ్చటఁ బ్రస్తాపింపఁబడినవి యేడే కావున నంతకంటె నధికసంఖ్య నెట్లును గ్రహించుటకు వీలు లేదు. † విజ్ఞానప్రస్తావముఁగూడఁ గలదు కదా! అది యెనిమిదవది యగుచున్నదే" అనియెదవేమో యది మనస్సుకంటె భిన్నము కాకపోవుటచే నేడుపదార్థములయందే జేరును. అది సంకల్పరూపము కాకపోయినను మనోవృత్తియే కదా.

అవతారిక: —ఈపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు.

## సూ. హస్తాదయ స్తు స్థితేఽతో నైవమ్.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. యేడింద్రియములకంటె నధికములై హస్తాదు లున్నవి అవియు జీవుని బంధించునవి కావున శ్రుతియందు గ్రహము లని చెప్పఁబడుచున్నవి. ముక్తిదొఱకునంతవఱకు నవి జీవుని బంధించు నేని యప్పుడు కాని యానామధేయమునకు సార్థకత్వము గలుగదు కదా! ఈ కారణమువలన

---

* ముఖమున నున్నరంధ్రము లేడును యేడు ప్రత్యేకేంద్రియములుగ నుపాసనార్థమై బృహదారణ్యకోపనిషత్తునఁ జెప్పఁబడియున్నవి.

† విజ్ఞానప్రస్తావము=మరణకాలమునందు మోహము వచ్చునప్పుడు విజ్ఞానము కూడ జీవునితోఁ జేరు ననియు నికారణమువలన జీవుఁడు తనకంటె భిన్న మగుపదార్థమును తెలిసికొన నేరఁ డనియు జేయఁబడిన ప్రస్తావము. ఇది 'ఏకీభవతి న పశ్యతీత్యాహుః' అని యారంభించి 'ఏకీభవతి న విజానాతీత్యాహుః' అనుమొదలగు శ్రుతిచే వివరింపఁబడెను.

'ద శేమే' అను మొదలగు శ్రుతి నాశ్రయించి యేకాదశేంద్రియములే కల వని సిద్ధాంతము జేయవలసి యున్నది. 'పుర్యష్టకేన లింగేన ప్రాణాద్యేన స యుజ్యతే, తేన బద్ధస్య వై బంధో మోక్షో ముక్తస్య తేన చ' 'పంచప్రాణములు జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు అంతఃకరణము శబ్దస్పర్శాదులు అజ్ఞానము కామము కర్మ అనునీయెనిమిదింటితో జీవునకు నెప్పటికిని సంయోగము కలదు. వానిసంయోగ మున్నంత కాలము నాతఁడు బద్ధుఁ డగును; విడువఁగానే ముక్తుఁ డగును' అని స్మృతి యీ విషయము స్పష్టముగనే చెప్పుచున్నది. లోకమునందును సర్వజీవులకును సప్తేంద్రియములచేతనే గాక హస్తాదులచేతఁ గూడ బంధ ముండుట స్పష్టముగ గాన వచ్చుచున్నది. 'హస్తౌ చాదాతవ్యంచ'="హస్తములును గ్రహింపవలసినదియును" అను మొదలగువాక్యములచే ప్రశ్నోపనిషత్తునందు పదునొకండింద్రియములును గ్రహింపఁబడి యున్నవి; జీవునితో నన్నియు నిర్గమించు ననియుఁ జెప్పఁబడియున్నది. కావున నూరక నిదర్శనమునుఁ జూపుటకై మాత్రమే బృహదారణ్యకమున సప్తేంద్రియములు ప్రస్తాపింపఁబడెను కాని మఱి యేమియుఁ గాదు. అచ్చటి సర్వశబ్దార్థంబును నిరర్థకముగ సంకోచించుట యుక్తము కాదు; *ప్రకరణ మున్నను †శ్రుతి దానికంటె బలవంతము కావునఁ బ్రకరణానుసారముగ ద్రిప్పఁబడుటకు శక్యము కాదు. కావున నింద్రియములు పదునొకండె.

---

## ప్రాణాణుత్వాధికరణము. 3.

విషయము:—ఇచ్చట 'నింద్రియములు శరీరమునందు మాత్రమే వ్యాపించి సూక్ష్ములై (నేత్రాదుల కగోచరములై) యాకాశతుల్యములై యున్నవి' అనువిషయము నిరూపింపఁబడును.

సందేహ పూర్వపక్షము:—పైయధికరణమునఁ బదునొకండింద్రియములును జీవునితోఁ గూడ నిర్గమించును అని సిద్ధాంతము చేయఁబడెను. 'ఈనిర్గమనము ముఖ్యమా? లేక గౌణమా' యని సంశయము రాఁగా దానికి సాంఖ్యు లిట్లు సమాధానముఁ జెప్పుదురు. ఇంద్రియము

---

*ప్రకరణము (౧౦౨ పు. చూ.)

†శ్రుతి (౧౦౨ పు. చూ.)

యహంకారమునవలనఁ జనించినవి. అహంకారము సర్వవ్యాపకము. కావున నివియు నట్టివే కావలయును. ఇట్లున్నను ఆయింద్రియములు దేహ మధ్యమునందు మాత్రమే ప్రకటము లగును; దీనిచేతనే వానికి రాకపోక లు గౌణముగ సంభవించును. ఇంతియగాని అపిప్రధానముగానే పరలోక మునకుఁ బోవు నని చెప్పుట యుక్తిశూన్యము. శ్రుతియైనను అనుభవ విరుద్ధముగఁ జెప్పిన నంగీకరింపఁ జనదు కదా!

## సూత్రము. ౭.

సంగతి అవతారిక:—అని యాక్షేపసంగతితో వచ్చినయీపూర్వ పక్షమును ఖండించుటకై యీయధికరణ మారంభ మైనది.

## ౨౭౭. అణవశ్చ. ౨. ౪. ౭.

తాత్పర్యము:—ఈయింద్రియములు సర్వవ్యాపకము లగుటకు వీలు లేదు. అహంకారము సర్వవ్యాపక మనుటయు విరుద్ధమే. ప్రతిశరీ రమునందును "నేను నేను" అని యహంకార మనుభవమునకు వచ్చు చున్నది. ప్రత్యేకముగ నున్నట్లును తోఁచుచున్నది. సర్వవ్యాపకమై మఱి యొక యహంకారము ఈపరిచ్ఛిన్నాహంకారములకు మూలమై యున్న దనుటకునుఁ బ్రమాణము గానరాలేదు. ఒకవేళ దానినిఁగూడ ("అహం కారము సర్వవ్యాపకము." అనుదానినిఁ గూడ) సాధించినను ఆయహం కారము ఇంద్రియములకు గారణ మగు ననుట సంభవింపదు. మొట్టమొ దట నట్టియహంకారమును (ఒకదానికి నుత్పత్తికారణ మగునహంకార మును) కల్పించుటయే శ్రుతివిరుద్ధ మని స్మృత్యధికరణమునందే (చూ. ౨. ౧. ౨.) నిరూపింపఁబడి యున్నది. ఈకారణమువలన నింద్రియ ములు ఎట్లును సర్వవ్యాపకములు కానేరవు.

ఇంద్రియములు అణువులే; పరిచ్ఛిన్నములే. అణువులనఁగా సూక్ష్మ ము లనియు నాకాశతుల్యము లనియు నేత్రాదులకు నగోచరము లనియు నర్థమే కాని పరమాణువు లని కాదు. ఇట్లు కాకున్న (ప్రాణములు పరమాణువులే యైన) ప్రాణవృత్తి సర్వశరీరమునందును ప్రత్యక్షము కాఁ గూడదు. "ఇట్లు కాదు, ఇంద్రియములు పరమాణువు లైనను లోకానుభవమునకు విరోధము రాదు. శ్రుతివిరోధమునందునుఁ బ్రత్యే

కముగఁ బరమాణురూపము లగునింద్రియము ఉండవచ్చును. త్వగింద్రియము మాత్రము సర్వశరీరము నాశ్రయించి యుండవచ్చును" అనిన నది యుక్తము కాదు. సర్వశరీరమునందు నున్నయింద్రియ మొక్కటియే యనియు నాయాయుపాధుల నాశ్రయించి యాయాకార్యములఁ జేయు ననియుఁ గూడ జెప్పవచ్చును కదా! కావున నింద్రియములు పరమాణువులు కానేరవు. ప్రత్యేకముగనే యాయింద్రియము లున్న వనినను వానికాశ్రయము లగుగోళకముల నంతటను వ్యాపించి యుండవలసి వచ్చుటచే పరమాణువులు కానేరవు. గోళకములయందును వానిస్థానములు నిర్ణీతములే యైనను అస్థానములయందైన సమగ్రముగ వ్యాపింపవలసి యుండుటచే వానికిఁ (ఇంద్రియములకు) బరమాణుపరిమాణము సంభవింపనేరదు.

"ఇట్లయిన నాయింద్రియములు మహాపరిమాణము కలవియే యగుటచే దుర్గోచరములు కావలసివచ్చును" అనియెదవేమొ యది యుక్తము కాదు. పరమాణువు కాకున్నను దుర్గోచరములు కాక సూక్ష్మములై యుండునాకాశాదిపదార్థము లనేకములు ప్రత్యక్షములో నున్నవి కదా! ఈదృష్టాంతమువలన నింద్రియములకును సూక్ష్మత్వము కల దనవచ్చును. లేకున్నఁ బురుషుఁడు మృతి నొందునప్పుడు వానిపార్శ్వమున నున్నవారికి నాయింద్రియములు వెలికి నిర్గమించునప్పుడు పుట్టలోనుండి వెలుపలికిఁ బోవుసర్పమువలె ప్రత్యక్షములు కావలసివచ్చును. ఇది యనుభవవిరుద్ధము కదా!

మఱియు నింద్రియములు సర్వవ్యాపకము లైన తన్నిర్గమనమును గూర్చి చెప్పుశ్రుతులకు విరోధము వచ్చును; అప్రామాణ్యము కలుగును. "సర్వవ్యాపకము లైనను అవి శరీరమునందు మాత్రమే యభివ్యక్తి నొందు నని చెప్పితిమి కదా!" అనియెదవేమొ ఇది సంభవింపదు. ఇంద్రియములకు శరీరమునందు మాత్రమే యభివ్యక్తి కలుగు ననిన నవి సర్వవ్యాపకము లగునో? కావో? నిర్ణయ మెట్లు మీరు దేని నభివ్యక్తి యందురో మేము దానినే యింద్రియము లందుము. అభివ్యక్తి కాని మఱి యేది కాని కార్యసాధన మైన నింద్రియ మని చెప్పవచ్చును కదా! అప్పుడు నామమాత్రమునందే తప్ప వస్తువునందు వివాద ముండదు. కావున నింద్రియములు మాత్రము సూక్ష్మములే పరిచ్ఛిన్నములే యని సిద్ధాం

తము చేయవలసి యున్నది. మఱియు సర్వవ్యాపకము లగుపదార్థముల కుఁ గూడ గమనాగమనము లుండునేని జీవునకుఁగూడ * తద్గుణసారత్వ ము (చూ. ౨-౩-౨౯.) సిద్ధింపనేరదు. ఆయనకూడ యథేచ్ఛముగ గమనాగమనముల నాచరింపవచ్చును కదా! ఇది బహుశ్రుతులకు విరుద్ధ ము. ఆకాశాదులకు సంచారము లేకపోవుటచే ప్రత్యక్షాదులకుఁ గూడ విరుద్ధమే. కావున నెట్లును మాసిద్ధాంతమే యుక్తియుక్త మని తోఁచు చున్నది.

---

## ప్రాణశ్రైష్ఠ్యాధికరణము. ౪.

విషయము సంగతి.—ఈయధికరణమునందు "ప్రాణవాయువుఁ గూడ నింద్రియములవలెనే పరబ్రహ్మమునుండి జనించినదియే" యను విషయము సిద్ధాంతముఁ జేయఁబడును. ప్రాణవాయువునందును ఇంద్రి యములయందును గూడఁ బ్రాణశబ్దము వ్యవహరింపఁబడుచుండుటచే బూర్వాధికరణమున నింద్రియరూప మగుప్రాణమును విచారించునప్పుడు వాయురూప మగుప్రాణము కూడ స్మరణకు వచ్చెను. ఈసంబంధముచే నావిషయమును (ప్రాణవాయువుయొక్క విషయమును) ఈ యధికరణ మున విచారించుచున్నారు. యుక్తులన్నియుఁ బూర్వాధికరణమునందే జూపఁబడెను కావున నాన్యాయములనే యిచ్చట నతిదేశించుచున్నారు.

సందేహము పూర్వపక్షము:—"కొన్నిశ్రుతులు 'ఏతస్మా జ్జాయ తే ప్రాణో' అను మొదలగువాక్యములచే సర్వప్రాణములకును (అనఁగా ఇంద్రియములకును ప్రాణవాయువునకునుఁ గూడ) సృష్టి చెప్పఁబడి యున్నది.. మఱికొన్నిశ్రుతులయందు 'న మృత్యు రాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీ త్ప్రకేతః ఆసీ దవాతం స్వధయా త దేకం' 'ఆప్రళయకాలమునందు మృత్యువుగాని అమృతముగాని సూర్యచంద్రులు

---

*సద్గుణసారత్వ మనుపదమునఁ దచ్ఛబ్దముచే బుద్ధిని గ్రహింపవలయును. జీవు నకు బుద్ధికి సంబంధించినగుణములే ప్రధానములు కావున సద్గుణసారత్వము (తత్= అబుద్ధియొక్క, గుణ=గుణములే, సారత్వము=ప్రధానముగాఁ గలిగియుండుట) కల దని నిర్ణయింపవలయును. పరమార్థస్థితిలో జీవబ్రహ్మలకు భేదములేదు కావున జీవునకు గమనాగమనములు మొదలగునవి సంభవింపవు కదా!

గాని పితృదేవతలకు నొసంగఁబడునాహారము మొదలగునవి కాని లేవు. ఏకరూపమై సర్వప్రపంచరహితమై యున్నపరబ్రహ్మ మొక్కటి మాత్ర మే యప్పుడు జీవించి యుండెను.' అనుమొదలగువాక్యములచే సృష్టికిఁ బూర్వమునఁ గూడ నొకపదార్థము జీవించి యుండె నని చెప్పఁబడుటచే ప్రాణము కల దని చెప్పఁబడిన ట్లయినది. ప్రాణము లేక నెవ్వరును జీవిం పరు కదా కావున నీశ్రుతులకుఁ బరస్పరవిరోధముకలదా? లేదా?" అను నది సంశయమునకు స్వరూపము. ప్రాణవ్యాపారము ప్రళయకాలమున నున్న దని చెప్పఁబడి యుండుటచే ప్రాణము కూడ నప్పుడు కల దనవల యును. ఉత్పత్తిశ్రుతి కేవల మింద్రియపరమే కావచ్చును. ఈకారణము వలన నింద్రియముల కుత్పత్తి యున్నను ప్రాణములకు లే దని తోఁచుచు న్నది.—

## సూత్రము. ౫.

అవతారిక:—అనునీపూర్వపక్షము అతిదేశముచే ఖండింపుచు న్నాఁడు.

## ౨౭౫. శ్రేష్ఠశ్చ. ౨. ౪. ౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ప్రాణవాయువు కూడ నింద్రియములవలెనే పరమేశ్వరునుండి జనించినదియే. "తస్మా జ్జాయతే ప్రాణః" అనుమొదలగుశ్రుతి సామాన్యముగ సర్వప్రాణములనుగూర్చియే చెప్పుచున్నది యనవలయును. మఱియొకశ్రుతియందు "స ప్రాణ మసృజత" అని యింద్రియములకంటె భిన్నముగ ప్రాణ ముద్దేశింపఁబడెను. దీని వలన ప్రాణవాయువునకుఁ గూడ ప్రత్యేకసృష్టి కల దనుట నిర్వివాదముగ దెలియవచ్చుచున్నది కదా! ఇఁక "న మృత్యుః" అనుమొదలగుశ్రుతియు "పరమేశ్వరుఁడు జీవించి యుండెను" అనినంతమాత్రమున "ప్రళయ కాలమునందు ప్రాణములు కలవు" అని యంగీకరింపవలసినపని లేదు. ఆ శ్రుతియందే "అవాతం=గాలిలేనిది '(గాలి మొదలగుప్రపంచముతో సంబంధము లేనిది యనుట)" అని జగత్కారణమును గూర్చి చెప్పఁబడి యుండుటచేతను ప్రాణములు వాయువులే యగుటచేతను ప్రళయకాల మున నవి యుండవు. ప్రత్యక్షముగఁ గూడ 'అప్రాణో హ్యమనా శుభ్రః'

అని శ్రుతియందు "పరమేశ్వరునకు ప్రాణబంధము లేదు" అని చెప్పఁబడి యున్నది. కావున నా శ్రుతికి "పరమేశ్వరుఁడు కలఁడు" అని మాత్రమే యర్థము చెప్పుట యుక్తియుక్తము. లేకున్న బహుశ్రుతులకు విరుద్ధ మగుటచే నిది (ఈ శ్రుతి) యప్రమాణము కావలసి వచ్చును. ఒకవాక్య మప్రమాణ మైనను సర్వవేదము నట్టిదే కావలసి వచ్చును. కావున నౌపచారిక మగునీశ్రుతితో "ఏతస్మా జ్జాయతే ప్రాణః" అను మొదలగు వానికి విరోధము లేదు.

"ఇట్లు 'న మృత్యుః' అను శ్రుతికి నన్వయము కుదిరినను 'ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ'='ఈప్రాణమే అన్నిటికంటె పెద్దది శ్రేష్ఠమైనది' అను శ్రుతికి మాత్ర మన్వయము కుదురదు. అన్నియు నొక కారణమునుండి యుత్పన్నములే యగు నేని ప్రాణమునకుఁ గలుగుశ్రేష్ఠత్వ మేది ?" అని యెదవేమొ యదియు యుక్తము కాదు. ఉత్పత్తి యున్నను ప్రాణ వాయువు జీవనాధారము ; శుక్లశోణితసంయోగము కలిగినక్షణము మొదలు మరణము కలుగునంతవఱకు దేహము నాశ్రయించియే యుండు నది. తక్కినయింద్రియములు వానివానిగోళకము లేర్పడునంతవఱకు పని చేయవు గాని ప్రాణవాయువుమాత్ర మట్టిది కాదు. శుక్లశో ణితసంయోగసమయమున ప్రాణవాయువు లేకుండిన నవి పిండము ను త్పత్తి చేయుటకే వీలు లేదు కదా! కావున పైనిరూపించినకార ణములవలన ప్రాణవాయువు సర్వేంద్రియములకంటె శ్రేష్ఠము; శ్రు తియు నీశ్రేష్ఠత్వము నాశ్రయించియే యట్లు చెప్పెను. ఇంతమాత్ర మున "ప్రాణవాయువునకు నుత్పత్తిలేదు" అనుట యేటికి? "న వై శక్ష్యా మస్త్వదృతే జీవితుం"= "మేము నీవు లేకున్న జీవింపనేరము (ఇది ప్రాణ వాయువునుఁ గూర్చి యింద్రియములు చెప్పినవాక్యము)" అను మొదలగు శ్రుతులును ప్రాణమునకు శ్రేష్ఠత్వమును ప్రకారాంతరముతో (ఉత్పత్తి లేకపోవుటవలన గాక జీవనాధార మగుటచే మాత్రమే ప్రాణమునకు శ్రేష్ఠత్వము కల దని) చెప్పుచున్నవి కావున నీశ్రుతికిని "ఏతస్మాత్" అను మొదలగు శ్రుతితో విరోధము లేదు. ఎట్లును ప్రాణములకుఁగూడ నుత్పత్తి కల దనుటయే సిద్ధాంతము. దేని కుత్పత్తి లేకపోయినను సర్వవిజ్ఞానప్రతి జ్ఞకు విరోధము వచ్చు ననుట పలుమారు నిరూపింపఁబడెనుకదా! కావున ప్రాణోత్పత్తివిషయమున సందియము లేదు.

# వాయుక్రియాధికరణము. ౫.

విషయము సంగతి :—పై యధికరణమున ముఖ్యప్రాణమునకుఁ గూడ నుత్పత్తి కల దని నిరూపింపఁబడెను. ఈయధికరణమునందు దాని నాశ్రయించి యాశ్రయాశ్రయిభావసంగతితోఁ బ్రాణస్వరూపము నిరూపింపఁబడును.

సందేహము:—" 'యః ప్రాణః స వాయుః సఏష వాయుః పంచవిధః ప్రాణోఽపానో వ్యాన ఉదానః సమానః'='ప్రాణ మనునది వాయువే. ఈవాయువు ప్రాణాపానవ్యానోదానసమానభేదములతో నైదువిధములై దేహమున నున్నది' అని శ్రుతియం దొక్కచోట యీప్రత్యక్షవాయువే ప్రాణ మని చెప్పఁబడి యున్నది. మఱియొకస్థలమున 'ప్రాణ ఏవ బ్రహ్మణ శ్చతుర్థః పాదః స వాయునా జ్యోతిషా భాతి చ తపతి చ' = 'ప్రాణను మనోరూపబ్రహ్మమునకు నాల్గవపాదము. అది వాయువుచేతను తేజస్సుచేతను ప్రకాశించును. స్వవ్యాపారముల నాచరించును.' అని ప్రాణములకును వాయువులకును పరస్పరభేదము చెప్పఁబడి యున్నది. ఈరెంటికిని పరస్పరవిరోధము కలదా? లేదా?" అనునది సంశయమునకు స్వరూపము. ఇందు " 'వాయువే ప్రాణమగుటచే వాయువునకంటె జీవుఁడు భిన్నుఁడు' అనిమాత్రమే సిద్ధాంతము చేయవలయును. మఱియు సాంఖ్యమతస్థులయభిప్రాయముల నింద్రియవ్యాపారమే ప్రాణము గావున దానికంటెఁగూడ జీవుఁడు భిన్నుఁడని చెప్పవలయును" అనుట పూర్వపక్షమునకు విశేషఫలము. " 'ఈవాయువుగాని యింద్రియవ్యాపారములు కాని ప్రాణము కాకపోవుటచే నీరెంటికంటెను వీనికంటె భిన్నమైయున్న ప్రాణమునకంటెను గూడ జీవుఁడు వేఱగువాఁడే' అనియే సిద్ధాంతము చేయవలయును" అనుట సిద్ధాంతమునకు ఫలము. వీనిసామాన్యఫలములను గూర్చి పాదావతారికయందే వివరించియున్నాము.

పూర్వపక్షము:—పై నజూపఁబడినశ్రుతులకుఁ గలవిరోధ మెట్లును పోవుటకు వీలుగానరాలేదు. కావున నేదియోయొకశాస్త్రమునననుసరించి ప్రాణస్వరూపమును నిర్ణయించి పిదప శ్రుతుల నేదియోయొకవిధముగ సమన్వయింపవచ్చును. ఈవిషయము సాంఖ్యదర్శనమున స్పష్టముగనే నిరూపింపఁబడి యున్నది. ఇంద్రియవ్యాపారమే ప్రాణ మని యచ్చట

చెప్పఁబడి యున్నది. అదియే యుక్తియుక్తమని తోఁచుచున్నది." 'ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ' అనుమొదలగుశ్రుతుల యందు యింద్రియములకంటెఁ బ్రాణములు భిన్నములుగఁ జెప్పఁబడెను. ఇంద్రియవృత్తులే ప్రాణము లగునేని యెట్లు చెప్పఁబడుటకు వీలు లేదు కదా! వృత్తులకును ఆవృత్తులు గలపదార్థములకును భేదమే లేదుకదా!" అనియెదవేమొ యది యుక్తము కాదు. వృత్తికిని యావృత్తి గలపదా ర్థమునకునుఁ గూడ నొకవిధముగ భేదమును చెప్పవచ్చును, కావున సాంఖ్యసిద్ధాంతమున దోషము కానరాలేదు.

## సూత్రము. ౯.

అవతారిక:— అనిన నీయంశమును మొట్టమొదట ఖండింపు చున్నాఁడు.

## ౨౭౯. న వాయుక్రియే పృథ గుపదేశాత్.

### ౨. ౪. ౯.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. విచారించి చూచిన ప్రాణము వాయుమాత్రంబును కాదు; ఇంద్రియవ్యాపారంబును కాదు. శ్రుతియందు "ప్రాణ ఏవ బ్రాహ్మణశ్చ". అని వాయుభిన్నముగాను 'స ప్రాణ మసృజత' అని యింద్రియభిన్నముగాను "ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణిచ ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ" అని యింద్రియవాయుభిన్నముగానుఁ గూడ ప్రాణ మనేకచోట్ల వర్ణింపఁ బడి యున్నది. మనకు గానవచ్చువాయువే ప్రాణ మగునేని యట్లు (వాయుభిన్నముగ) చెప్పుటకు వీలు గలుగునా? ఇంద్రియవ్యాపారమే యయ్యేనేనియు నింద్రియభిన్నముగ వ్యవహరింపఁ బడుటకు వీలు కలుగునా? 'వృత్తికిని దానియాశ్రయమునకును భేదము కలదు కావున నట్లు (ఇంద్రియములకంటె ప్రాణమును భిన్నముగా) చెప్పుటవలన విరోధము రాదు.' అనుటయు యుక్తియుక్తముకాదు. వృత్తికిని తదాశ్రయమున కును భేదము లేదనుట యిదివఱకే బహుయుక్తులతో నిరూపింపఁబడి యున్నది.

* ఏదియోయొకవిధముగ నట్టిభేదమును సాధించినను ప్రయోజనము లేదు. ప్రాణ మింద్రియ వ్యాపారరూప మగుటకే వీలులేదు. ఏలయనిన:—అప్రాణము ఇంద్రియసమూహముయొక్క వ్యాపారమా? లేక ప్రత్యేకముగ నొక్కొక్క ఇంద్రియముయొక్క వ్యాపారమా? ఇందు మొదటిపక్షము నాశ్రయించినచో, గన్ను, కాలు, మొదలగు నింద్రియములు లేనివారలకు ప్రాణము కూడ లేకపోవలసి వచ్చును. బహుపదార్థములు పరస్పరసంబంధముతో నాచరింపవలసినపనిని ఆసమూహములో నొక్కటి తక్కువ యైనను తక్కినవి యాచరింపనేరవు. అనేకులు మోయవలసినపల్లకీని యిరువురుముగ్గురు మాత్ర ముండిన మోయగలరా? ఈ దోషము పోవుటకై రెండవపక్షము నాశ్రయించిన నదియు యుక్తము కానేరదు. అప్పుడు ఒక్కొక్క యింద్రియమునకు నొక్కొక్క ప్రాణమునంతున నుండవలసి వచ్చును. ఇది యుక్తివిరుద్ధమును అనుభవవిరుద్ధము కదా! కావున నెట్లును ఇంద్రియవ్యాపారము ప్రాణములకు స్వరూపము కానేరదు.

"ఇట్లు కాదు ఒక్కపంజరమున ననేకపక్షు లున్నప్పుడు అవి తమ యిచ్చవచ్చినట్లు సంచరింపుచున్నను ఆపంజరము కదులును. ఇట్లే యింద్రియములు యథేచ్ఛముగ వారివారివ్యాపారములయందుఁ బ్రవర్తించుచున్నను ప్రాణ ముత్పన్నము కావచ్చును. అది శరీరమును బ్రతికించునది యగుటచే శ్రేష్ఠంబును కావచ్చును" అనిన నదియు యుక్తము కాదు. పక్షులు ఎట్లు సంచరించినను అందు (వానిసంచారమునందు) చాంచల్యము కలదు. ఆకారణమువలన పంజరంబును చలించుచున్నది. చలనమంతయు సమానజాతి కలదియే కదా! ప్రస్తుతవిషయము మాత్ర మట్టిది కాదు. ఇంద్రియాదులు వినుట మొదలగుకార్యముల నాచరించుచున్నవి; ప్రాణము శరీరధారణము నొనర్చుచున్నది. ఈరెండుకార్యము

* వృత్తులకును వృత్తులుగలపదార్థములకును గలపరస్పరసంబంధము అనిర్వచనీయము. (౩౭౫ చూ.) కావున "భేదము లేదు" అని చెప్పుటకు నెంతటి యాధారము కలదో "భేదము కలదు" అని చెప్పుటయందును అంతటి యాధారము కలదు. కావునఁ బ్రాణములు నింద్రియములకంటె భిన్నములు కావనుట యెంతటి ప్రామాణికమో భిన్నము లనుటయు నంతటి ప్రామాణికమే. ఇదియే ప్రాణేంద్రియభేదమును సాధించు తెఱంగు.

లును సమానజాతి కలవి కావు; ఇట్లుండ నింద్రియ సంచారమువలన ప్రాణ మెట్లు జనింపఁగలదు. మఱియు శ్రుతియందు ప్రాణము సర్వేంద్రియములకంటె నుత్తమ మనియు ప్రాణము లేకున్న నింద్రియములకు నాధారము లేదనియు చెప్పఁబడి యున్నది. (చూ. ౨-౪-౮.) దీనికిఁ గూడ నీ సిద్ధాంతము విరుద్ధమే యగును.

కావునఁ బ్రాణ మింద్రియవ్యాపారము కాదు; వాయువును కాదు. ఇఁక నేమి యనిన వాయువుయొక్క వికారము (అనఁగా వాయువునుండి జనించినపదార్థము.) ఇట్లగుటచేతనే శ్రుతియు "వాయువే ప్రాణము" అని చెప్పి యున్నది. అది శరీరమునఁ బ్రవేశించి ప్రాణాపానాది భేదములతో నైదువిధములుగ నున్నది. ఇది వాయువికారమే యగుటచే మృద్వికార మగుఘటమువలె వాయువునకంటె భిన్నంబును కాదు; అభిన్నంబును కాదు. (ఉపాదానకారణమునకును కార్యమునకును పరమార్థస్థితులు భేదము లేదు. వ్యావహారికముగ కలదు అనువిషయమును గూర్చి చూ. ౨-౧-౧౪.) ఈకారణమునలన భేదశ్రుతులు వ్యావహారిక విషయమును చెప్పును. అభేదశ్రుతులు పారమార్థికవిషయమును చెప్పును. కావున నానికి విరోధము లేదు.

## సూత్రము. ౧౦.

"ఇట్లయిన మఱియొకదోషము వచ్చును శ్రేష్ఠుఁడగుటచేతను ప్రధానుఁడగుటచేతను జీవుఁ డెట్లు స్వతంత్రుఁడో అట్లే ప్రాణము కూడ స్వతంత్రము కావలసి వచ్చును. అది లేకున్న నెన్ని యింద్రియములున్నను శరీరజీవనము సంభవింపదు కావునను శ్రేష్ఠ మని శ్రుతియందు ఘోషింపఁ బడుచున్నది. కావునను అదియు (ప్రాణము) స్వతంత్రము కావలయును కదా? 'సుప్తేషు వాగాదిషు ప్రాణ ఏకో హి జాగర్తి ప్రాణ ఏకో మృత్యునా నా ఒనాప్తః'='వాగాదు లగుసర్వేంద్రియములును నిదురించుచుండఁ బ్రాణము మేల్కాంచి యుండును. దేహములకు మృత్యువువలన భయము కలదు గాని ప్రాణమునకులేదు.' అని ప్రాణప్రభావమును వేదము కూడ స్వతంత్రముగనే కొనియాడుచున్నది. ఈకారణమువలన ప్రాణము కూడ స్వతంత్రమైనదియే యనుట నిస్సంశయము. ఇట్లయిన నొక్కదేహమునకు నిరువురుస్వతంత్రు లధికారులు కావలసి వచ్చును.

ఇట్లయిన దేహస్థితికే నిలుకడ సంభవింపదు. ఇరువురును స్వతంత్రులే యైన వారేకాభిప్రాయముతో నుందు రనుట సంభవింపదు కద్హా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౮౦. చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః.

## ౨. ౪. ౧౦.

తాత్పర్యము.—ఇట్లు కాదు. ప్రాణము స్వతంత్రము కాదు. చక్షురాదీంద్రియములవలె నస్వతంత్ర మైనదియే. రాజులకు కింకరులనలె జీవునకు చక్షురాదులు పరతంత్రములై యుండును; వానికంటె శ్రేష్ఠ మైనది యగుటచేఁ బ్రాణము మంత్రివలె పరతంత్రమై యుండును. ఈప్రాణమునకుఁ గూడ నింద్రియాదులతోఁ జేర్చియే సృష్టిఁ జెప్పఁబడి యున్నది సమానధర్మములు కలవానినిఁ గూర్చి కాని యట్లు చెప్పుట తటస్థింపదు కదా! కావున నింద్రియము లెట్లు పరాధీనములో ప్రాణములు కూడ నట్లే పరాధీనములు. ఇదియునుగాక ప్రాణము అచేతనములు. ఇంద్రియములతోఁ గలసికాని పనిఁ జేయగలవి కావు. ఇట్లుండ వానికి స్వాతంత్ర్య మెటనుండివచ్చును? "జీవునకుఁగూడ ప్రాణాదిసంబంధము లేకున్నఁ గర్తృత్వభోక్తృత్వాదులు సంభవింపక పోవుటచే నాతఁడు నిట్టిహాఁడే యగును" అందువేమొ అది యుక్తము కాదు. నిత్యజ్ఞాన స్వరూపుఁ డగుటచే నాతనికి నెప్పటికి నస్వాతంత్ర్యము కలుగదు. సంసార దశయం దట్లు కలుగు నినిను అది వ్యావహారికము కావున మాకు సమ్మతమే. పరమార్థస్థితిలో కర్తృత్వభోక్తృత్వము లాతనికి బొత్తుగనే లేవు కదా! కావున నెట్లును ప్రాణములకు స్వాతంత్ర్యము లేదు.

## సూత్రము. ౧౧.

అవతారిక:—"ఇప్పటికిని దోషము తొలఁగి పోవదు. ఇప్పుడు 'ప్రాణము జీవునకు నేత్రాదులవలె సాధనము' అని యంగీకరించిన ట్లయినది. ఇదియు దోషమే. యిదివఱకు (౨-౪-౫. సూత్రమునందు) 'ఇంద్రియములు పదునొకండు' అనియు పదునొకంటికంటె నధికము లగుకార్యము లెవ్వియు నాగరాలేదు కావున పదునొకండు యింద్రియము ముందు

టకు నీలు లే దనియుఁ జెప్పియున్నారు కదా! దానికి ప్రస్తుత సిద్ధాంతము విరుద్ధ మగును. పంచ్రెండవ కార్యమే లేకపోయిన పండ్రెండవసాధన మెటనుండి వచ్చును? ప్రాణమువలన జీవునకు నేదిన్వైన నొకయుపకార మున్న నప్పుడు కదా యది (ప్రాణము) ఆయనకు సాధన మగుట; ఇంద్రియతుల్య మగుట. అప్పుడు కదా యది యస్వతంత్ర మగుట" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౨౪౧. అకరణత్వా చ్చ నదోష స్తథా హి దర్శయతి. ౨. ౪. ౧౧.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపఁ బని లేదు. ప్రాణము ఇంద్రియములవంటిది కాదు; ఏదియోయొకవిషయమును నిర్వహించుచు జీవునకు నింద్రియములవలె *సంసారభోగమునందు సాధన మగునది కాదు. నేత్రము రూపమును మాత్రమే గ్రహింపఁ గలదు; శ్రోత్రాదులును తమ తమవిషయములను మాత్రమే గ్రహించును కాని ప్రాణ మట్లు విషయములను గ్రహించునది కాదు. ఇది ప్రత్యక్షసిద్ధము. ఈకారణమువలన పంచ్రెండవవిషయమునుఁ గల్పింపవలసినపని కాని పంచ్రెండవయింద్రియముః నంగీకరింప వలసినపని కాని లేదు.

ఇఁకఁ బ్రాణవ్యాపారమునుఁ గూర్చి విచారింపవలసినపనియే లేదు. అది లోకవేదములయందు బహువిధములుగ ప్రసిద్ధ మయ్యే యున్నది. లోకులు బ్రతికియున్న వానికిఁ బ్రాణము కల దనియు మృతినొందినవానికి లే దనియుఁ జెప్పుచున్నారు కదా! వేదమునందు నిట్లే చెప్పఁబడియున్నది. "అహం శ్రేయసి వ్యూదిరే"="ఇంద్రియములును ముఖ్యప్రాణంబును కలసి 'మనలో నెవ్వ రధికులు' అని యొకప్పుడు వివాదపడినవి" అనియారంభించి "యస్మి న్వ ఉత్క్రాంతే శరీరం పాపిష్ఠతర మివ దృశ్యతే స వః శ్రేష్ఠః"="ఆవివాదమును తీర్చుటకై బ్రహ్మదేవుడు 'మీలో నెవ్వరు వెడలిపోయిన శరీరము నీచమైపోవునో వాఁడే మీలో శ్రేష్ఠుఁడు' అని యుత్తర మిచ్చెను" అనిచెప్పి పిదప సర్వేంద్రియములును తమతమ శ్రేష్ఠత్వమును

* సంసారభోగ మనఁగా సంసారానుభవము. ఎదుట నున్న పదార్థములఁ జూచుట ఆఘ్రాణించుట మొదలగునవి.

స్థాపించుకొనఁ దలంచి యొకటొకటిగా శరీరమునుండి నిర్గమింప నారంభిం చిన వనియు అప్పుడు ఏయేయింద్రియము వెడలిపోయెనో ఆయావృత్తి మాత్రమే లేకుండెను గాని శరీరమునకు నితరహాని యేదియు లేకపోయె ననియుఁ బిదపఁ బ్రాణవాయువు నిర్గమింపఁ బోయిన నన్నియింద్రియము లును సర్వదేహంబును శిథిలము కా నారంభించె ననియు*ప్రాణసంవాదము నందు శ్రుతి చెప్పుచున్నది. దీనిని విమర్శించిన శరీరంబును ఇంద్రియము లును ప్రాణముచేత మాత్రమే నిలుచు చున్నది యనుట స్పష్ట మగు చున్నది కదా! "ప్రాణేన రక్ష నవరం కులాయం"= "ప్రాణముచేత దేహ మనుగృహమును రక్షించుచు" అని మఱియొకస్థలమున శ్రుతిచే నీవిష యము స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. కావున ప్రాణవ్యాపారము శరీ రాదిధారణమే కాని వస్తుగ్రహణము కాదు. కావునఁ †పంచవిధప్రత్యక్ష ములకంటెను ‡వచనాదానాదికర్మలకంటెను §సంకల్పవికల్పాదివృత్తుల కంటెను భిన్నముగఁ గార్యమును గల్పింప నక్కఱ లేదు. ఎదుట నున్న విషయములను గూర్చినవ్యవహారమునకు పనికివచ్చునవి యింతకంటె లేవు. ఇవియే యేకాదశేంద్రియవృత్తు లగుటచే నాయింద్రియములు వ్యవహార సాధనము లని నిరూపింపఁ బడెను. ప్రాణవృత్తికి మాత్ర మిట్లు వ్యవహా

---

* ఇంద్రియములకును ముఖ్యప్రాణములకునుఁ దమతమయాధిక్యముకొఱకై జరి గిన వివాదమును వర్ణించుకథ ప్రాణసంవాద మనఁబడును.

† పంచవిధప్రత్యక్షములు:—చూచుట వినుట అఘ్రాణించుట రుచిచూచుట శీతోష్ణాదిస్పర్శముల గ్రహించుట యనుజ్ఞానేంద్రియములకార్యము లైదును ప్రత్యే క్షము లనఁబడును. సుఖదుఃఖాదివిషయములయందు మానసిక ప్రత్యక్షము కలుగుచు న్నను దానిముఖ్యవ్యాపారములు సంకల్పవికల్పాదులే కావున నది (మనస్సు) ఇందుఁ (ప్రత్యక్షసంఖ్యయందు) జేర్పఁబడలేదు. 'మనస్సు పదునొకండవ యింద్రియము' అని ప్రత్యేకముగ గ్రహింపఁబడి యున్నది కదా!

‡ మాటలాడుట ఇచ్చిపుచ్చుకొనుట సంచరించుట మలమును విసర్జించుట ఆనందించుట అనునైదును వచనాదులు. ఇవి కర్మేంద్రియములకార్యములు.

§ సంకల్పవికల్పములు నిశ్చయము సంశయము అహంకారము అభిమానము అనునివి సంకల్పవికల్పాదులు. ఇందు సంకల్పవికల్పములఁ జేయునప్పు డంతఃకరణము మన స్సనియు నిశ్చయించునప్పుడు బుద్ధి యనియు సంశయించునప్పుడు చిత్త మనియు నభిమానించునప్పు డహంకార మనియుఁ జెప్పఁబడును.

రోపయోగము లేదు. అది శరీరాదుల బ్రతికించుటను మాత్రమే కాని యితరము నాచరింపదు; ఇంద్రియములవలె పదార్థములను గ్రహింపదు. కావున నిది జీవునకు వ్యవహారసాధనము కాదు; పూర్వపక్షమునఁ జూపినదోషము లెట్లును మాసిద్ధాంతమున రావు.

## సూత్రము. ౧౨.

అవతారిక:—'ప్రాణవ్యాపారములకును ఇంద్రియవ్యాపారములకును భేదముకలదు' అనువిషయమును మఱియొకవిధముగఁ గూడ సిద్ధాంతముఁ జేయుచున్నాఁడు.

## ౨౧౨. పంచవృత్తిర్మనోవ ద్వ్యపదిశ్యతే.

## ౨. ౪. ౧౨.

తాత్పర్యము:— మఱియు నీప్రాణమునకు ప్రాణాపానాదినామభేదములతో నైదువృత్తులు చెప్పఁబడి యున్నవి. ఆముఖ్యప్రాణమే ఉచ్ఛ్వాసరూపముగ బ్రవర్తించునప్పుడు ప్రాణనామముతోను నిశ్వాసరూపముగను అధోపేతరూపముగను ప్రవర్తించునప్పు డపాననామముతోను ఊర్ధ్వాభిముఖమై జీవనిర్గమనకారణ మగునప్పు డుదానానామముతోను జఠరాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసి యాహారమును పచనముఁ గావించి దానిరసము నన్నియవయవములకును పంచి యిచ్చునప్పుడు సమాననామముతోను సర్వశరీరమునందును వ్యాపించి బలవంతము లగుకార్యముల నాచరించునప్పుడు వ్యాననామముతోను వ్యవహరింపఁ బడుచున్నది. మనస్సుకూడ చూచుట వినుట మొదలగు కార్యములచే నిట్లే వ్యవహరింపఁబడుచున్నది కదా! సూక్ష్మభూతముల యొక్క సాత్వికాంశము లైదును ప్రత్యేకములుగ నింద్రియము (జ్ఞానేంద్రియము) లనియు సముదాయరూపముతో నున నస్సనియుఁ జెప్పఁబడుచున్నవి యనుట విస్పష్టమే కదా! మఱియు యోగశాస్త్రమునందును *"ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః పంచ వృత్తయః" అని

---

*ప్రమాణ విపర్యయ అను మొదలగు యోగసూత్రము:—

యోగశాస్త్రమునందు మనస్సున కయిదు వృత్తులు కలవని చెప్పఁబడి యున్నది. 'ప్రత్యక్షమూ అనుమానము ఉపమానము శబ్దము అను ప్రమాణములు (శ్లో. పు. చూ.)

మనస్సునకు నైదు వృత్తులు చెప్పఁబడి యున్నవి. ఇవియు వేదాంతులకు సమ్మతములే. ఈవృత్తుల నాశ్రయించియును మనస్సునందు లోకులచేఁ బ్రమాణాదినామములు వ్యవహరింపఁ బడుచున్నవి కదా! ఇట్లు కాకున్నను అనేకవృత్తులు గలది యగుటచే మనస్సు ప్రాణముతో తుల్య మనవచ్చును కావున నెట్లును ఈప్రాణమునకు మనస్సునకువలెనే ఇంద్రియములనుండి భేదము కల దనుటయే చక్కనిసిద్ధాంతము. మఱియు *మనస్సు ప్రత్యక్షముగఁ బదార్థములను గ్రహింపకున్నను ఆయాయింద్రియములనుఁ బ్రేరే

---

మనస్సుయొక్క ప్రమాణవృత్తి శుక్తియందు రజతమువలె నొకపదార్థమునందు మఱియొకపదార్థమును గ్రహించుభ్రాంతిజ్ఞానము విపర్యయవృత్తి సంశయముం గూడ దీనియందే చేరును. శబ్దజ్ఞానము ననుసరించి లేనిదానినిఁ గూడ నున్నట్లు భావించుట వికల్ప మనఁబడును. 'రాముని వస్త్రము' అనునప్పుడు రామునకును వస్త్రమునకును భేదము గ్రహించినట్లే 'రాహువుయొక్క శిరస్సు' అనునప్పుడు రాహువునకును శిరస్సునకును భేదము కల దని తెలంచుటయే వికల్పము. వాస్తవస్థితిలో రాహువునకు తలకంటె భిన్న మగు దేహమే లేదు. ఇదియే చిత్తముయొక్క మూఁడవవృత్తి. దీనియందును విపర్యయవృత్తియందువలెనే లేనివస్తువే గ్రహింపఁబడుచున్నను అది వ్యవహారయోగ్య మగుచుండుటచేఁ బూర్వవృత్తికంటె దీనికి భేదము కల దని గ్రహింపవలయును. తమోగుణాధిక్యముచే నేపదార్థము నెఱుఁగక నుండుస్థితి నిద్రావృత్తి. పూర్వమున ననుభవింపఁబడినవిషయముల జ్ఞప్తికి దెచ్చుకొనుట స్మృతివృత్తి. వృత్తి యనఁగా 'చిత్త మాయాయాకారములతోఁ బరిణమించుట' అని (యోగశాస్త్రమున) వివరింపఁబడి యున్నది. ఇవి యన్నియు వేదాంతులకుఁ గూడ సమ్మతములే. సుషుప్త్యవస్థయందు మాత్రము మనస్సు లయించుననియు నీకారణమువలన నిద్ర మనోవృత్తి కా దనియు వేదాంతులు చెప్పుదురు కాని అప్పుడును ఆమనస్సునకు సంపూర్ణలయము లేదు కావున నెట్లు చెప్పిన నొక్కటి యే యగును. సంపూర్ణలయ ముండిన జీవునకు బంధము కలుఁగదు కావున నావేదాంతులును దాని (సంపూర్ణచిత్తలయము) నంగీకరింపరు. ఈకారణమువలనఁ 'దమోగుణాధిక్యముచేతఁ జిత్తము మూఢ మయ్యెను' అనినను 'స్వకారణ మగు మలినసత్వప్రధానమందు చిత్తము సావశేషముగ లయము నొందెను' అనినను ఒక్కటి యే యగు నని తెలిసికొన వలయును.

*మనస్సు ప్రత్యక్షముగఁ బదార్థముల గ్రహింపదు:—

లోకానుభవము ననుసరించి చూచిన సంకల్పాదులు మాత్రమే మనస్సునందు కానవచ్చుచున్నవి గాని దర్శనాదిశక్తులు గానవచ్చుట లేదు. నేత్రేంద్రియము లేకున్న మనస్సు స్వయముగ పదార్థములఁ జూడ నేరదు; శ్రోత్రేంద్రియము లేకున్న

పించుటచే జీవునకు సాధన మైనట్లు ప్రాణముకూడ స్వయముగ విషయ ముల గ్రహింపకున్నను సర్వేంద్రియములకును మనస్సునకును గూడ జీవనము నొసంగుటచే పురుషునకు సాధన మగు నని తెలిసికొనవలయును.

---

## శ్రేష్ఠాణుత్వాధికరణము. ౬.

సంగతి విషయము:—పూర్వాధికరణములయందు ముఖ్యప్రాణము యొక్క యుత్పత్తియు స్వరూపంబును వర్ణింపఁబడెను. ప్రస్తుతము బహిరంగ మగుపరిమాణము వర్ణింపఁ బడును. కావున నీరెంటికిని గలసందర్భ మంతర్బహిర్భావసంబంధము.

సందేహము పూర్వపక్షము:—"శ్రుతులయం దనేకస్థలములయందు జీవుఁడు మొదలగువానితోఁ బ్రాణములకుఁ గూడ శరీరనిర్గమనము జెప్పఁ బడి యున్నది. అది ప్రాణమున కణు పరిమాణ ముండిననేగాని సంభవింపదు. ఇట్లయినను మఱికొన్నిస్థలములయందు 'సమః ప్లుషిణా సమో మశకేన సమో నాగేన సమ ఏభి స్త్రిభి ర్లోకై స్సమో ఽనేన సర్వేణ'= 'ఆప్రాణము ప్లుషితోను (ప్లుషి యనఁగా దోమకంటె సన్నటిజంతువు) దోమతోను ఏనుఁగుతోను ఈత్రిలోకముతోను సర్వబ్రహ్మాండముతోనుఁ గూడ సమానమై యున్నది' అనుమొదలగువాక్యములచేఁ 'బ్రాణము

---

వట్లే విన నేరదు. ఈకారణములవలన మనస్సునకు విషయాదిగ్రహణమునందు ఇతరస హాయము కావలయును. అది ఆయాకార్యములయందు యింద్రియములను మాత్రమే ప్రేరేపించును. 'ఇంద్రియములద్వారా మనస్సే విషయగ్రహణముఁ జేయు నందురు కదా!' అనియెదవేమొ అచేతన మగుమనస్సునకు స్వయముగఁ గాని మఱియొకయచే తనముయొక్క సహాయమువలనఁ గాని విషయజ్ఞానము కలుగుట యసంభవ మగుటచే నచ్చటిమనశ్శబ్దమునకు (ఇంద్రియములద్వారా మనస్సు విషయముల గ్రహించు నను వాక్యమునందలిమనశ్శబ్దమునకు) మనోఽవచ్ఛిన్నచైతన్యమే యర్థ మని తెలిసికొనవలయును. 'మనోవృత్తియే చైతన్యసహితమై నేత్రాదీంద్రియములమూలమున వెలికిఁ బ్రసరించి విషయములను గ్రహించును' అనినను మైసిద్ధాంతమునకు (ఇంద్రియమనస్సులు పరస్పరభిన్నములు అనుసిద్ధాంతమునకు) హాని లేదు. అప్పటికినిఁ జిత్తవృత్తి వ్యాపించుటకు మనోభిన్న మగుమఱియొకయింద్రియము కావలసినదియే కదా! కావున నెట్లును ఇంద్రియమనస్సులు పరస్పరభిన్నములే.

సర్వవ్యాపకము' అని చెప్పఁబడియున్నది. ఈరెండుశ్రుతులకును బరస్పర విరోధము కలదా? లేదా?" అనునది సంశయస్వరూపము. దీనిపైఁ బ్రాణము కూడ సర్వవ్యాపకమే కావచ్చు ననియు జీవునకు బుద్ధ్యుపాధి నాశ్రయించి చెప్పఁబడినట్లే ప్రాణములకును ఏదియో యొకయుపాధి నాశ్రయించి గమనాగమనములఁ జెప్పఁబడవచ్చు ననియు నోకానోకస్థలమునఁ బరిమాణము నల్పమునుగా జెప్పుట దేహపరిమాణము నాశ్రయించియే యనియుఁ బూర్వపక్షము వచ్చును.

## సూత్రము. ౧౩.

అవతారిక.— దానిని "అణవశ్చ. ౨. ౪. ౭." అనుస్థలమున నిరూపింపఁబడిన న్యాయముతోనే ఖండించుచున్నాఁడు.

## ౨౮౩. అణుశ్చ. ౨. ౪. ౧౩.

తాత్పర్యము.—ఈవిషయము ఈపాదమున మూఁడవయధికరణమునందే సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇంద్రియములవలె ముఖ్యప్రాణము కూడ నణువే. అణువనఁగా నేత్రాదుల కగోచరమై దేహమధ్యవర్తి యై యుండునది యనియే యర్థముకాని పరమాణురూపమైనది యని యర్థము కాదు. ప్రాణాదివృత్తులచే నది (ముఖ్యప్రాణము) సర్వదేహము నందును వ్యాపించియున్న దనుట లోకవేదప్రసిద్ధమై యున్నదికదా! మఱియు శరీరముననుండి నిర్గమించునప్పుడు ప్రక్కనున్నవారికి గానరాకపోవుటచే నది సూక్ష్మము; ఉత్క్రమణము రాకపోకలును వర్ణింపఁబడి యుండుటచే బరిచ్ఛిన్నము (సూక్ష్మశరీరముచే[నింద్రియాదులచే]నావరింపఁబడినది) 'ప్రాణము సర్వవ్యాపకము' అని చెప్పుశ్రుతులు హిరణ్యగర్భునిప్రాణముల నుద్దేశించి చెప్పుచున్నవి. మఱియు 'సమః ప్లుషిణా' ఇత్యాదివాక్యములు ప్రాణమునకు దేహపరిమాణమునుఁ జెప్పుచున్నవి. గాని ఘటాకాశాది పదములవలె (సర్వవ్యాపక మగు పదార్థమునకు) పరిచ్ఛేదమునుఁ జెప్పుట లేదు. అట్లు చెప్పిన 'ఇంద్రియములు సర్వవ్యాపకములు. శరీరమునందు మాత్రమే వ్యభివ్యక్తము లగును' అనుసాంఖ్యవాదమునందుఁ జూపఁబడినదోషము లన్నియు వచ్చును. కావున శ్రుతికి నట్టియర్థమును (పరిచ్ఛేదార్థమును) కల్పించి నిరర్థకముగ శ్రుతికి నప్రామాణ్యమునుఁ గల్పింప

నక్కఱ లేదు. ఇంద్రియములును ప్రాణములునుం గూడ శరీరానుసార ముగ ప్రత్యేకములే; సూక్ష్మములే యనుటయే సిద్ధాంతము

---

## జ్యోతిరాద్యధికరణము. ౭.

విషయము సంగతి:—పూర్వమున దేహస్థితము లగుప్రాణములు సర్వవ్యాపకములు కావనియు ఆప్రాణములకు నధిదేవత యగువాయువు (సమష్టిజీవుం డగుహిరణ్యగర్భుని ప్రాణములును ఇంద్రియములును వ్యష్టి జీవులప్రాణేంద్రియములకు నధిదేవత లని తెలిసికొనవలయును.) మాత్ర మట్టి దనియు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఆసిద్ధాంతమును చేయు నప్పుడు "ప్రతిప్రాణములకును ఇంద్రియమునకునుఁగూడ నధిదేవతలు కల రు" అనువిషయము స్మరణకు వచ్చెను. దాని నాశ్రయించి "ప్రాణాదులు తమతమకార్యములయందు స్వయముగనే ప్రవర్తించునా? లేక అధిదేవ తలయొక్క సహాయమువలనఁ బ్రవర్తించునా?" అనువిషయ మీయధికర ణమున స్ఫురణలక్షణసంగతితో విచారింపఁబడును.

సందేహ పూర్వపక్షము:—" 'చక్షుషా రూపాణి పశ్యతి'='కంటి తో రూపములనుచూచును.' అని కొన్నిశ్రుతులు ఇంద్రియాదులకుస్వతం త్రముగనే తమతమవ్యాపారములయందు సామర్థ్యము కల దని చెప్పు చున్నవి. మఱికొన్ని 'ఆదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్'='సూ ర్యుఁడు నేత్రేంద్రియమై కంటినిఁ బ్రవేశించెను' అని 'ఇంద్రియములకు దేవతాసహాయము లేకున్నఁ బ్రవృత్తి సంభవింపనేర దని చెప్పుచున్నవి. వీనికిఁ బరస్పరవిరోధము కలదా? లేదా?' అని సంశయించి "పరస్పరవి రోధము స్పష్టముగనే గానవచ్చుచున్నది" యని పూర్వపక్షము రాఁగా దానికి వేదాంతులలో గొంద ఱీవిధముగ సమాధానమును చెప్పుదురు.

ఏకదేశిసిద్ధాంతము:—ఇట్లు సంశయింపఁ బనిలేదు. సామాన్య ముగ నెవ్వ రేకార్యము నాచరించినను స్వతంత్రముగనే యుచ్చరించు చున్నా రనుట సహజము. తక్కిన విషయములు అనఁగా 'వీరు పరసహా యముచేతఁ గాని యీకార్యము నాచరింపలేరు' అనుమొదలగువిష యములు తగినన్ని ప్రమాణము లుండినచేఁగాని సిద్ధాంతముఁ జేయుటకు

వీ లగునవి కావు. ఈకారణమువలన నింద్రియాదులకును ఈసామర్థ్యము (తమకార్యముల నాచరించుసామర్థ్యము) స్వాభావికమేకావచ్చును. మఱియు నేచేతనపదార్థ మెద్దాని ప్రేరేపించి కార్యము చేయించునో ఆకార్యఫలము నాచేతనపదార్థమే భుజించు ననుట నియమము. మనుష్యుఁడు ఎవ్వనిచేతనైన నొకకార్యమును జేయించినచో దానిఫలము నాతఁడేయనుభవించుచున్నాఁడు కదా! ఈకారణమువలన నింద్రియాదులకుఁ గూడఁ జేతను లగుదేవతలు ప్రత్యేకముగ నధిదేవతలై యుందురేని యాయింద్రియవ్యాపారములవలనఁ గలుగుఫలముల వారే యనుభవింపవలయును సర్వసుఖదుఃఖముల ననుభవించుజీవుఁ డొక్కఁడున్నాఁ డనువిషయమిదివఱకే యంగీకరింపఁ బడినది. దానికి భంగము వచ్చును. మఱియు నొక్క దేహమునకు ననేకులు ప్రభువులుగ నుండినచో యింద్రియవ్యాపారఫలముల ననుభవించువా రనేకులైనచో వారియందలియభిప్రాయ మొక్కటిగ నే యుండు నని నియమించుటకు వీలు లేకపోవుటవలన నేకార్యంబును గలుగఁ గూడదు. ఇట్లు బహుదోషయుక్త మగుటచే "ఆదిత్యశ్చక్షు ర్భూత్వా" అనుమొదలగుశ్రుతి ముఖ్యార్థమును చెప్పునది యనుటకు వీలులేదు. కావున నింద్రియాదులకు తమతమవ్యాపారములయందు స్వాతంత్ర్యము కలదు.

## సూత్రము. ౧౪.

అవతారిక:—అనిన నీయేకదేశిసిద్ధాంతమును ఖండించి స్వసిద్ధాంతమును స్థాపించుచున్నాఁడు.

## ౨౫౪. జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్.

## ౨. ౪. ౧౪.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఇంద్రియములు అధిదేవతలసహాయముచేతనే తమతమకార్యముల నాచరించు చున్నవి. కాని స్వతంత్రముగఁ గాని కేవలజీవునిప్రేరణవలనఁ గాని యట్లు చేయుట లేదు. స్వయముగ నవి యచేతనములు; జీవుఁడు చేతనుఁడైనను వానినిఁ బ్రేరేపించుసామర్థ్యముఁ గలవాఁడైనను వానిని ప్రేరేపింప నేరరు. ప్రేరేపించువానికిఁ దనచేఁ బ్రేరేపింపఁబడువానియొక్క స్వరూ

వంబును వానిని ప్రేరేపించుటచే తనకుఁ గలుగుఫలంబును మొట్ట
మొదట తెలిసి యుండవలయును. మఱియు బుద్ధిపూర్వకముగ వానినిఁ
బ్రేరేపింపవలయును. జీవున కన్ననో యివి లేవు. సాక్షిమాత్రుఁడై యుండు
టయే యాయనకు స్వాభావికస్థితి కావున నివి యేవియు సంభవింపవు
కదా! ఉపాధివశమున గలిగినకర్తృత్వాదులచే నాయనయు నింద్రియ
ప్రేరకుఁడే యైనను దోషము లేదు; ఒక్కశరీరమునకు ననేకులగు యజ
మానులు సంభవించినను దోషము లేదు వారికి నభిప్రాయభేదములు కలుగ
నవసరములేదు. అందఱకును * సాధారణనియామకుఁడై బరమేశ్వరుఁ
డొక్కఁ డున్నాఁడు కదా! ఈకారణమువలన పూర్వజన్మసంస్కార
యుక్త మగుబుధ్యుపాధి కనుగుణముగ నేకరూపములయ్యె సర్వేం
ద్రియకార్యములును జరుగవచ్చును. కావున జీవుఁ డున్నంతమాత్ర
మున నింద్రియములకు నధిష్ఠానదేవతలు లే రని జెప్పవలసిన పని
లేదు; శ్రుతిని విపరీతముగ నన్వయింపవలసినపనియు లేదు. ప్రాణాదులకు
నాయాకార్యముల నాచరించుటయందు సామర్థ్య మున్నను స్వతంత్ర
ముగఁ బ్రవర్తింపవలయు ననుట నియమము కాదు. శకటాదులకు నడు
చుట మొదలగువానియందు సామర్థ్య మున్నను వృషభములు మొద
లగువానిసహాయము కావలసియే యున్నది. శకటము నడుచుట దానికిఁ
గల చక్రములు మొదలగువానిసహాయముచేతనే కాని కేవలవృషభ
సామర్థ్యముచే కా దనుట స్పష్టమగువిషయమే. చక్రము లేకున్న వృష
భములు బండిని నడిపింపఁ గలవా? ఈకారణమువలన స్వయముగ
సామర్థ్య మున్నవస్తువు కూడ స్వభావముగ మాత్రమే ప్రవర్తింప
నక్కఱ లేదు. ఈకారణమువలన వేదానుసారముగ నధిదేవతల నంగీక
రించిన విరోధ మేమి ?.

వేదమున నన్ననో ఈవిషయము మిగుల స్పష్టముగఁ జెప్పఁబడి
యున్నది; అనేకస్థలములయం దనేకవిధములుగ వివరింపఁబడి యున్నది.
"ఆదిత్య శ్చక్షు ర్భూత్వా" అనుమొదలగుశ్రుతి ఇదివఱకే యుదహరింపఁ
బడెను. దానికి ''సూర్యుఁడు నేత్రమునకు నధిదేవత'' అనునర్థమునే నియ

* సాధారణనియామకుఁడు = మేఘము అన్నిస్థలములయందును సమానముగ వర్షించునట్లు సూర్యుఁడు అందఱకును సమానముగఁ గాంతి నిచ్చునట్లు అందఱను వానివానికార్యములయందు సమానముగఁ బ్రేరేపించువాఁడు

తముగఁ జెప్పి తీరవలయును. లేకున్న నాసూర్యునకు దృష్టితోఁగాని నేత్ర గోళముతోఁగాని మఱియొకవిధ మగుసంబంధ మున్నట్లు కానవచ్చుటలేదు కదా! దృష్టిసూర్యులకు నేదియో యొకసంబంధమును కల్పించినను "అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"="అగ్ని వాగింద్రియమై ముఖము నుప్రవేశించెను" అను మొదలగు శ్రుతివాక్యములను విమర్శించునప్పు డట్టి యవకాశ మింత యైన నుండదు కదా! కావున నిట్టి శ్రుతివాక్యములయం దెల్ల ప్రాణాదులకు నధిష్ఠాన దేవతలు చెప్పఁబడియే యున్నారు మఱియొక స్థలమున *"వాగింద్రియ మగ్ని యయ్యెను" అని ప్రత్యక్షముగనే చెప్పఁబడి యున్నది. దీనినిఁ గూడ మఱియొకవిధముగ సమన్వితముఁ జేయుటకు వీలు లేదు. స్మృతియు "వా గధ్యాత్మ మితి ప్రాహు ర్బ్రాహ్మణా స్తత్త్వదర్శినః, వక్తవ్య మధిభూతం చ వహ్ని స్తత్రాధిదైవతం" 'వాగింద్రియము అధ్యాత్మము (శరీరమునకు సంబంధించినది) మాట అధిభూతము (మాట శబ్ద మగుటచే నాకాశభూతమునకు సంబంధించినది) అగ్ని దానికి నధిదైవతము (అధిదేవత).' అని స్పష్టముగ నే యీవిషయముఁ జెప్పుచున్నది. కావున వేదానుసారముగ నింద్రియాదులకు నభిమాని దేవతలు కలరు అని మాత్రమే సిద్ధాంతముఁ జేయుట యుక్తాయుక్త మై యున్నది.

## సూత్రము. ౧౫.

"'ఇట్లయిన నాయధి దేవతలే భోక్తలు కావలసివచ్చును.' అంటిమి కదా!" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౮౫. ప్రాణవతాశబ్దాత్. ౨. ౪. ౧౫.

తాత్పర్యము:—జీవభిన్నముగ నింద్రియములకు నధిదేవత లున్నను వారికి భోక్తృత్వ ముండవలసినపని లేదు. శ్రుతి జీవునకు మాత్రమే

* 'స వై వాచ మేవ ప్రథమా మత్యవహ త్సా యదా మృత్యు మత్యముచ్యత సోఽగ్నిరభవత్' 'ఆప్రాణము మొట్టమొదట వాగింద్రియమును ఉద్గాతగా (ఉద్గాత యనఁగా యజ్ఞమునందు సామగానముఁ జేయువాఁడు) నియమించెను. ఆయింద్రియ మెప్పుడు దానిదోసము నతిక్రమించునో అప్పుడు అగ్నిదేవత యయ్యెను. (అసత్య మాడుట పరుషములఁ బలుకుట మొదలగునవి వాగింద్రియదోషములు)' అనుశ్రుతి యందును వాగింద్రియమునకు నగ్ని యభిమాని చెప్పఁబడి యున్నది.

యింద్రియములతో సంబంధము కల దని చెప్పుచున్నది. "అథ య త్రైతదాకాశ మనువిషణ్ణం చక్షుః స చాక్షుషః పురుషో దర్శనాయ చక్షు రథ యో వే దేదం జిఘ్రాణీతి స ఆత్మా గంధాయ ఘ్రాణం"= "నేత్రేంద్రియము నేత్రగోళకమునఁ బ్రవేశించినప్పుడు దాని నభిమానించువాఁడు జీవుఁడు. ఆయనకు విషయమును గోచరముఁ జేయుటకై నేత్రేంద్రియము పనికి వచ్చును. 'నేను దీనిని ఆఘ్రాణించుచున్నాను' అని తెలిసికొనువాఁడు జీవుఁడు. ఆయనకు గంధమును చూపుటకై ఘ్రాణము పనికి వచ్చును" అను మొదలగు వాక్యములను విచారించిన నీవిషయము స్పష్ట మగుచున్నది. మీ రన్నట్లు దేవతలె భోక్తలగునేని యధియనేకము లగుటచే విషయానుభవమున లోకమునకు విరోధము వచ్చును. ప్రతియింద్రియమునకునుఁ బ్రతిప్రాణవాయువునకును నధిదేవతలు వేఱువేఱుగా నుండుటచే సర్వేంద్రియములవలన సంపాదింపఁబడు ఫలము లొక్కనియనుభవమునకు రాకపోవలసి వచ్చును; "నేను చూచుచున్నాను వింటిని సంపాదింపఁ బోయెదను" అని యొక్కండే సర్వేంద్రియఫలముల ననుభవించుచున్నట్లు వ్యవహారములు బ్రవర్తించు చున్నవి కదా! ఇదియునుఁ గాక, నియమించువాఁడే ప్రేరేపించువాఁడే తనచే ప్రేరేపింపఁబడుదానిఫలము ననుభవింపవలయు ననుట నియమము లేదు. సారథి రథమును నడపుచున్నను ఆరథగతివలనఁ గలుగుఫలము ననుభవించువాఁడు రథికుఁడే గాని సారథి కాఁడు కదా! కావున నింద్రియములకు నధిదేవతలు కల రనుసిద్ధాంతమున దోష మింత యైనను లేదు.

## ౨౫౬. తస్య చ నిత్యత్వాత్. ౨. ౪. ౧౬.

తాత్పర్యము:—మఱియు జీవుఁడు శరీరమున భోక్తయై పుణ్యాపాప సంబంధము నొందుచు స్థిరుఁడై ముక్తిపర్యంతము సమానరూపముతో నున్నాఁడు. దేవత లట్టివారు కారు. వారు నింద్రియముల నాశ్రయించి యున్నను పుణ్యాపాపాదులతో సంబంధపడువారు కారు. "పుణ్య మే వాముం గచ్ఛతి న హ వై దేవాన్ పాపం గచ్ఛతి"="పుణ్యము మాత్రమే (అనఁగా శుభముమాత్రమే) దేవతలకు కలదు గాని పాపము లేదు. (పాప మనఁగా క్షణకాలము దుఃఖము; క్షణకాలము సుఖము కలిగించుపుణ్యాపాపములు)" అని [illegible] శ్రుతియే వర్ణించుచున్నది. ఇట్లు పర

మైశ్వర్యసంపన్నులై యుండు దేవతలు మనుష్యాదిశరీరముల నొంది యతినీచము లగుభోగముల ననుభవింతు రనుట యుక్తియుక్త మగువిషయము కాదు, మఱియుఁ బ్రాణాదులతో జీవునకు మాత్రమే సంబంధము కలదు. దేవతలు తమయోగదృష్టిచే సర్వముఁ గ్రహించి తమయద్భుతశక్తిచే వానినిఁ (ఇంద్రియాదులను) బ్రవర్తింపఁ జేయుచుందురు. "త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణ ముత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి"="ఆజీవుఁడు శరీరమునుండి నిర్గమించునేని యాయనతోఁ గూడ ముఖ్యప్రాణము నిర్గమించును; ఆముఖ్యప్రాణముతోఁ గూడ తక్కినయింద్రియములన్నియు నిర్గమించును." అను మొదలగువాక్యములచే శ్రుతియందే జీవప్రాణములకుఁ గలసంబంధము ముఖ్యముగఁ జెప్పఁబడి యున్నది. కావున నింద్రియములకు నధిదేవత లున్నను జీవునిభోక్తృత్వమునకు హాని లేదు. కావున నింద్రియములకు నధిష్ఠాన దేవతలును కలరు; "చక్షుషా రూపాణి పశ్యతి" అను మొదలగుశ్రుతియు దేవతాసహితము లగునింద్రియములను గూర్చి చెప్పునేకాని స్వతంత్రములను గూర్చి కాదు. కావున నేకదేశిమతసిద్ధాంత మెట్లును యుక్తియుక్తము కాదు. శ్రుతులకు పరస్పరవిరోధము లేదు.

---

## ఇంద్రియాధికరణము. ౮.

విషయసంగతులు:—పూర్వాధికరణమున నింద్రియాదులకు నధిదేవతలు కల రనువిషయము విచారించి నిర్ణయింపఁబడెను. దానిపై "ఇంద్రియములు ముఖ్యప్రాణముయొక్క వృత్తులేకాని భిన్నములు కావు ఈకారణమువలన నింద్రియములే లేవు. ఉన్నది ప్రాణ మొక్కటియే. ఇట్లుండ వానినిఁ గూర్చినవిచార మేల?" అనునాక్షేపము రాఁగా నది యిందు పరిహరింపఁ బడును. ముఖ్యప్రాణములకును నింద్రియములకునుఁ గలభేదము స్థాపింపఁబడును. ఈకారణమువలన నీరెండధికరణములకునుఁ గలసందర్భ మాక్షేపసందర్భము.

సందేహ పూర్వపక్షము:—" 'ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ' అను మొదలగుశ్రుతులవలన ముఖ్యప్రాణమునకును ఇంద్రియములకును పరస్పరభేద మున్నట్లు గానవచ్చుచున్నది. 'హం తా

నైవ సర్వే రూప మసామ' 'మన మందఱమును ఈప్రాణమునకే రూపము లయ్యెదము (ఇది ఇంద్రియవాక్యము.)' అను మొదలగు మఱికొన్నిటివలనఁ బ్రాణేంద్రియములకు నైక్యముఁ గానవచ్చుచున్నది. ఈరెండు సందర్భములకును పరస్పరము విరోధము కలదా? లేదా?" అనునది సంశయస్వరూపము. 'ఇందు దేనిని నిర్ధారణ చేయుటకును వీలు లేకపోవుటచే నీవిరోధమునుఁ బరిహరించుటకు నెట్లును వీలు లేదు.' అనునది పూర్వపక్షము. దీనికి నేకదేశి యిట్లు సమాధానమును చెప్పెను:—

ఏకదేశిమతసిద్ధాంతము:—వేదమునందుఁ బ్రత్యక్షముగ నింద్రియప్రాణముల కభేదము చెప్పఁబడి యున్నది కదా! ప్రాణశబ్దముకూడ నొక్కటియే వానియందు సమానముగ (సమానార్థముతో) బ్రయోగింపఁబడి యున్నది కదా! ఈరెండుకారణములవలనను ప్రాణవృత్తిభేదములే యింద్రియము లనుట తేలుచున్నది. ప్రాణశబ్దమునకు ప్రసిద్ధార్థమును విడిచి నిరర్థకముగ రెండవయర్థమునుఁ గల్పించుట యెట్లు యుక్తియుక్తమగును? ముఖ్యప్రాణమునందాశబ్దము ముఖ్య మనియు నింద్రియములయందు గౌణ మనియు మాత్ర మెట్లు చెప్ప నొప్పును? ముఖ్యార్థము సంభవించుచుండ గౌణార్థమును స్వీకరించుట న్యాయము కాదు కదా!

యుక్తి నాశ్రయించి చూచినను ఈవిషయ మిట్లే తేలుచున్నది. సూర్యుఁడున్నప్పుడు సూర్యకిరణములు భూమిపై వ్యాపించి యుండి యాయన యస్తమింపఁగానే యవియు నడఁగునట్లు ఈఇంద్రియములన్నియుఁ బ్రాణ మున్నప్పుడు మాత్రమే సర్వకార్యముల నాచరించుచుండి యది దేహమునుండి నిర్గమింపఁగనే కానరాకున్నది కదా! ఈయనుభవమును విమర్శించిన నెట్లు తేలును? ఇంద్రియములు ప్రాణవృత్తు లగునేని యిట్లు సంభవించును గాని మఱియొకవిధముగ సంభవింప నేరదు కదా! కావున నొక్కముఖ్యప్రాణమే యుచ్ఛ్వాసాదివృత్తిభేదములవలనఁ బ్రాణాపానాదిశబ్దములతో నెట్లుచెప్పఁబడుచున్నదో నట్లే శ్రవణాదివృత్తిభేదమువలన శ్రోత్రాదిశబ్దములతోఁ జెప్పఁబడుచున్నది యనుటయే సిద్ధాంతము. "ఏతస్మా జ్జాయతే ప్రాణః" అనుమొదలగు కొన్నివాక్యములయందు భేదము చెప్పఁబడినట్లు కానవచ్చుచున్నది కాని యది పారమార్థికము కాదు. ఆశ్రుతి నామమాత్రమునే చెప్పెను గాని భేదమును కాదు.

"భేదమునే చెప్పెను" అని పట్టుఁబట్టిన మఱియొకవిరోధము కూడ వచ్చును. మనస్సు పదునొకండవయింద్రియము కదా! అది యింద్రియముల లోఁ జేరకపోవలసి వచ్చును. ఆశ్రుతియందే "మన స్సర్వేంద్రియాణి చ" అని యింద్రియములకంటె మనస్సు భిన్నముగఁ జెప్పఁబడి యున్నది. కావున బాగుగ విమర్శించిన నాశ్రుతికి భేదముఁ నభిప్రాయము లేదు. మనోవిష యమున నెట్లు భేదాభిప్రాయము దానికి లేదో ప్రాణవిషయమునఁ గూడ నట్లే లేదు. కావున నింద్రియములు పదునొకండును ప్రాణవృత్తిభేదములే కాని తద్భిన్నములు కావు.

## సూత్రము. ౧౭.

అవతారిక:— అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండింపు చున్నాఁడు.

## ౨౮౭. త ఇంద్రియాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రేష్ఠాత్. ౨. ౪. ౧౭.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఇంద్రియము లు ప్రాణవాయువునకంటె భిన్నములే కాని తద్వృత్తులు కావు. శ్రుతి యందుఁ బ్రాణేంద్రియములు రెండును పరస్పరభిన్నములుగ జెప్పఁబడి యున్నవి. "ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః" అను మొదలగువాక్యముల యందీవిషయము స్పష్టముగనే యున్నది కదా! "ఆశ్రుతినే ప్రధాన ముగఁ గైకొనిన మనస్సు గూడ యింద్రియము కాకపోవలసివచ్చు నని చెప్పితిని కదా" అనియెదవేమొ యట్లుకాదు. శ్రుతియందొకవేళ నట్లు గానవచ్చినను ఈవిషయమును (మనస్సు ఇంద్రియ మనువిషయమును) నిర్ణయించుటకు స్మృతియందాధారము కలదు. "మనష్షష్ఠా నీంద్రియా ణి"="జ్ఞానేంద్రియములు మనస్సుతోఁ గూడ నాఱు" అని గీతాస్మృతి యందు స్పష్టముగాఁ గలదు. దీని ననుసరించి భేదశ్రుతికి (మనస్సునకును ఇంద్రియములకును భేదమునఁ జెప్పుశ్రుతికి) నర్థము నేదియో యొకవిధ ముగఁ గల్పింపవలయును. మనస్సునకుఁ ద్రికాలజ్ఞానము కలదు. ఇంద్రి యములకుఁ గేవలవర్తమానజ్ఞానమే కలదు. ఈభేదము నాశ్రయించి యెనను శ్రుతి భేదమును జెప్పియుండవచ్చును కదా! ప్రాణవిషయ

మున నన్ననో యిట్టికల్పనకు నవకాశ మింతయైనను లేదు. శ్రుతిస్మృతు లలో నంతటను ప్రాణములును ఇంద్రియములు పదునొకండును ప్రత్యే కముగనే జెప్పఁబడుచున్నవి; ప్రాణాదివృత్తిభేదములతో నున్నవాయువు ప్రాణశబ్దముతోను శ్రోత్రాదులింద్రియశబ్దముతోను జెప్పఁబడుచున్నవి. సామాన్యస్థితి యిట్టిదే యగుటచే ప్రాణశబ్దమునకు వాయువునందును ఇం ద్రియశబ్దమునకు శ్రోత్రాదులయందును రూఢి గలదని నిర్ణయింపవలసి యున్నది. ఇట్లగుటచే నొకానొకస్థలమున నింద్రియములయందును ప్రాణశబ్దము ప్రయోగింపఁబడి యున్నను అది గౌణ మనియే నిర్ణయిం పఁబడవలసి యున్నది. ప్రత్యక్షముగ భిన్నము లని ప్రమాణాంతరము లచే నిర్ణయింపఁబడినవిషయములయందు ఏకపదప్రయోగము గానవచ్చి నంతమాత్రమున వానికి (భిన్నము లగువిషయములకు) నైక్యమును నిర్ణ యించుటకు వీలు లేదు కదా! ఈకారణమువలన నింద్రియములు ప్రాణ మునకంటె భిన్నములే.

## ౨౧౮. భేదశ్రుతేః. ౨. ౪. ౧౮.

తాత్పర్యము:—ఇంతమాత్రమేకాదు అనేకసందర్భములయందు ఇంద్రియప్రాణములకు స్పష్టముగ భేదము చెప్పఁబడి యున్నది. *ప్రాణ సంవాదమునందు ముఖ్యప్రాణము శ్రేష్ఠమయ్యె యింద్రియములు కా వనియు వానికి రెంటికిని వివాదము కలిగె ననియుఁ జెప్పఁబడి యున్నది కదా! మఱియొకస్థలమునందును (బృహదారణ్యకము మొదటియధ్యా యము మూఁడవబ్రాహ్మణము) వాగాదీంద్రియములను గూర్చి కొంత విషయమునుఁ జెప్పి యాప్రకరణమును ముగించి పిదపఁ బ్రాణవిషయము వర్ణింపఁ బడెను. ఇట్లగుటచే నింద్రియములకునుఁ బ్రాణములకును భేద ము కలదు.

## ౨౧౯. వైలక్షణ్యాచ్చ. ౨. ౪. ౧౯.

తాత్పర్యము:—ఇది యింతయునుఁ గాక ప్రాణేంద్రియములకు భేదము కూడ ననంతముగఁ గలదు. సుషుప్త్యవస్థయందు ఇంద్రియములు నిదురించును; ప్రాణములు మేల్కాంచును. ఒకటిరెండింద్రియములు ఒక పక్షమున సర్వేంద్రియములును లేకున్నను దేహమునకు నాశము గలు

* ప్రాణసంవాదము (ఛా. ఉ. పం.)

గదు; ప్రాణము లేకున్నఁ గలుగును. ఇంద్రియములపని విషయముల గ్రహించుటయు నాలోచించుటయు నై యున్నది; ప్రాణములపని దేహేంద్రియాదులకు బ్రతుకును కలిగించుట మాత్రమే యై యున్నది. ఇట్లు ఇంద్రియప్రాణములకు నపరిమిత మగుభేద ముండుటచే నవి రెండు నొక్కటి కానేరవు. "ప్రాణవాయువుయొక్క కలిమిలేముల నాశ్రయించి యింద్రియములయొక్క కలిమిలేములు సంభవించుచుండుటచే వానికి (ఇంద్రియప్రాణములకు) నైక్యము కలుగవలయు నని నిరూపించితిని కదా" అనిన నది సరి కాదు. రెండుపదార్థములు పరస్పరము కలిమిలేముల నాశ్రయించినంతమాత్రమున నవి యొక్కటి కా నక్కఱ లేదు. దేహము సురక్షితముగ నున్నంతకాలము ప్రాణాదు లుండును; అది నశించినప్పుడు ప్రాణాదు లుండవుకదా! దేహమునకును అప్రాణాదులకును ఐక్యముకలదు. ఈకారణమువలన నెట్లును ప్రాణేంద్రియములు పరస్పరము భిన్నములే. ఇంద్రియప్రాణములకు నభేదమును చెప్పునట్లు గానవచ్చు శ్రుతియు బాగుగ విచారించిన నౌపచారికమే యగును; భేదమును చెప్పు నదియే యగును. ఎట్లనిన:—

బృహదారణ్యకోపనిషత్తునందు ప్రథమాధ్యాయమున పంచమ బ్రాహ్మణమున * ఇరువదియొకటవవాక్యమున నింద్రియాదులను గూర్చి

---

* బృహ (౧-౫-౨౧.) 'ప్రజాపతిర్హ కర్మాణి ససృజే తాని సృష్టా న్యన్యోన్యే నాస్పర్ధంత వదిష్యా మ్యే వాహ మితి వాగ్దధ్రే ద్రక్ష్యా మ్యహ మితిచక్షుః శ్రోష్యా మ్యహ మితి శ్రోత్ర మేవ మన్యాని కర్మాణి యథాకర్మ తాని మృత్యుః శ్రమో భూ త్వోపయేమే తా న్యాప్నో త్తా న్యాప్త్వా మృత్యు రవారుంధ త్తస్మాచ్ఛ్రామ్య త్యేవ వాక్ శ్రామ్యతి చక్షుః శ్రామ్యతి శ్రోత్ర మ థేమ మేవ నాప్నో ద్యో౽యం మధ్యమః ప్రాణ స్తాని జ్ఞాతుం దధ్రిర అయం వై నః శ్రేష్ఠో యః సంచరగ్ శ్చా సంచరగుంశ్చ న వ్యథ తే౽థో న రిష్యతి హం తా స్యైవ సర్వే రూప మసా మేతి త ఏత స్యైవ సర్వే రూప మభవగ్ స్తస్మా దేత ఏతే నాఖ్యాయంతే ప్రాణా ఇతి' — 'హిరణ్యగర్భుఁడు నానావిధకర్మల నాచరించుటకై ఇంద్రియములఁ బ్రాణములనుఁ గూడ సృజించెను. ఇట్లు సృజింపఁబడిన యా యింద్రియములు పరస్పరముఁ గలహించెను. మాటలాడుసామర్థ్యము నాకుమాత్రమే కలదు కదా ఈ దేహమును నేనే ధరించుచున్నా నని వాగింద్రియము తలంచెను. చూచు దానను నేనే కదా ఈశరీరధారణ నావలననే జరుగుచున్నది యని నేత్రేంద్రియము తలంచెను. విను వానను నేనేకావున ఈసర్వము నావలననే నిలచియున్నది యని శ్రోత్రము భా[illegible] నాశ్రయించి

యిట్లు చెప్పఁబడెను. వాగాదీంద్రియములును ప్రాణములును బ్రహ్మచే సృష్టింపఁబడినపిదప గౌరవమునకై తమలోఁ దాము కలహించిన వనియు నందు మొట్టమొదట వాగాదీంద్రియము లన్నియు తామే శరీరమును బ్రతికించుచున్నారని ప్రత్యేకముగ గర్వించెననియు మృత్యుదేవత శ్రమయనుస్వరూపముతో వాని నాక్రమించె ననియు అవి (వాగాదులు) తమ తమ కార్యముల నధికముగఁ జేసినప్పుడు అలయుటయే దీనికి దృష్టాంతమనియు ప్రాణమునకు మాత్ర మట్టియలుపు కేకపోవుటచే దానిని ఆ యింద్రియము లన్నియు తమలో నుత్తమముగ భావించిన వనియుఁ జెప్పఁబడి యున్నది. ఈసందర్భమునుఁ బట్టి చూచిన "ఇంద్రియములు ప్రాణరూపము లయ్యెను". అనుట "ఇంద్రియములు ప్రాణవాయువునకు నధీనము లయ్యెను" అనుట మాత్రమే యని తోఁచుచున్నది; ప్రాణశబ్దంబును ఈకారణమువలన *లక్షణావృత్తిచేత మాత్రమే యింద్రియములయందుఁ బ్రయోగింపఁ బడె నని తోఁచుచున్నది. ప్రత్యక్షముగఁ గూడ నాయిరువదియొకటవవాక్యమునకు నంతమున "త ఏత స్యైవ సర్వే రూప మభవన్ తస్మా దేత ఏతే నాఖ్యాయంతే ప్రాణాః" ="ఇట్లు ప్రాణ

శరీరధారణము తమకార్యమే యని భావించినవి. ఇట్లుండ మృత్యుదేవత శ్రమయనుస్వరూపముతో నాయింద్రియముల నెల్ల నిగ్రహించెను. కార్యములు చేయుసమయములయందు వాని నాశ్రయించెను. ఆశ్రయించి శక్తిహీనముల గావించెను. ఆకారణమువలననే కొంతకాల మధికముగ మాటలాడిన వాగింద్రియ మలసిపోవును అధికముగ జూచిన నేత్రేంద్రియంబును అలసిపోవును అధికముగ వినిన శ్రోత్రేంద్రియంబును అలసి పోవును (విశేషదృష్టి ప్రసరించుటవలన గ్రుడ్డితనంబును అధికధ్వనుల నాలకించుటవలన చెవిటితనంబును వచ్చుననుట వైద్యశాస్త్రప్రసిద్ధము.) ఇట్లామృత్యువు సర్వేంద్రియముల నాక్రమించెను కాని ముఖ్యప్రాణమును (ప్రాణవాయువును) మాత్ర మాక్రమింపలేదు. ఈవిషయమును తెలిసికొని ఆయింద్రియము లన్నియు నిట్లు నిశ్చయించెను. ఆహా మనలో నీముఖ్యప్రాణమే శ్రేష్ఠమైనది సంచరించినను సంచరింపకున్నను దీనికి నాయాసము లేదు. ఇట్లగుటచేతనే ఇది మనలఁ బోషించుచున్నది. ఆహా మన మందఱమును దీనిరూపభేదములవలె నున్నాము. అని యిట్లు నిశ్చయించి ఆయింద్రియము లన్నియు ముఖ్యప్రాణరూపములే యయ్యెను. ఇట్లగుటచేతనే యవి కూడ ప్రాణశబ్దముచే వ్యవహరింపఁబడు చున్నవి' అనువాక్యమునందు ప్రాణేంద్రియభేదము స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది

* లక్షణావృత్తి (పూ. ౫౦౦ చూ.)

వాయువును తమలో నధికమునుఁగా నిర్ణయించి యింద్రియము లన్ని యుఁ బరస్పరవైరమును మాని తద్రూపములే యయ్యెను (తదధీనము లయ్యె ననుట). ఇట్లగుటచేతనే వానియందునుఁ బ్రాణశబ్దము ప్రయో గింపఁబడుచున్నది'' అని చెప్పఁబడి యున్నది. కావున నెట్లును ఇంద్రి యప్రాణములు పరస్పరభిన్నములే.

ఈయధికరణమునకు మఱియొక వ్యాఖ్యానము:—

"భాష్యకారుఁడీయధికరణమునకుఁ జేసినవ్యాఖ్యానము యుక్తి యుక్తముగ నుండలేదు 'త ఇంద్రియాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రే ష్ఠాత్ ౨-౪-౧౭.' అనుసూత్రమునకు చేయఁబడినవ్యాఖ్యానము తృప్తి కరముగ నుండలేదు సామాన్యముగ నాలోచించిన 'ఇంద్రియము లని ప్రత్యేకశబ్దముతోఁ బిలువంబడు చుండుటచే శ్రోత్రాదులు ప్రాణము నకంటె భిన్నములు' అని మాత్రమే యాసూత్రమునకు నర్థ మేర్పడును. ఈయర్థము నే యాశ్రయించుట యుచిత మగును కాని నూతనము లగు నధ్యాహారాదులఁ గల్పించుట యుక్తము కానేరదు కదా! భాష్యకారు లన్ననో యీసూత్రమునకు 'శ్రుతియందు ప్రాణము లని చెప్పఁబడిన పదార్థములలో ముఖ్యప్రాణును తప్ప తక్కిన వన్నియు నింద్రియశబ్ద ముచేఁ జెప్పఁబడి యున్నవి. ఆకారణమువలన నవి ప్రాణమునకంటె భిన్న ములు శబ్దముచే భేదము చెప్పఁబడి యున్నది కదా!' అని యర్థము చెప్పి యున్నారు. ఈయర్థ మాసూత్రమున నెట్లు వచ్చును? 'తద్వ్యపదే శాత్' అనుపదమున నున్నతచ్ఛబ్దముచే సూత్రోక్త మగుశబ్దమునుఁ జెప్పవచ్చును గాని శ్రోత్రశబ్దమునుఁ జెప్పుట యెట్లు? మొట్టమొదటఁ జూపినవ్యాఖ్యానమునందు సూత్రగత మగునింద్రియశబ్దమునే తచ్ఛబ్ద ముచేఁ జెప్పియున్నాము. భాష్యకారు లన్ననో 'తత్త్వాంతరాణి' యను భేదవాచకపదమునుఁ గ్రొత్తఁగా నధ్యాహారముఁ జేసి 'త యింద్రియాణి తత్త్వాంతరాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రేష్ఠాత్' అని సూత్రమును కల్పించి, 'శ్రేష్ఠాత్ =ముఖ్యప్రాణమునకంటె, అన్యత్ర =తక్కినచోట్ల (చెప్పఁ బడిన), తే=ప్రాణములు, ఇంద్రియాణి=ఇంద్రియశబ్దముచేఁ జెప్పఁబడుచు న్నవి. తద్వ్యపదేశాత్ =ఇట్లు అభేదముతో చెప్పఁబడుటవలన, తత్త్వాం తరాణి=ప్రాణములకంటె నవి భిన్నపదార్థములే' యని యర్థముఁ జెప్పి యున్నారు. ఇట్లు చెయుటవలన నధ్యాహారము చేయవలసివచ్చుచున్నది. ఊర

కనే సమన్వయ మగుటకు వీలు కలిగియుండ శ్రోత్రపదమునుఁ దెచ్చికొ నుట యయుక్తము కదా! ఇదియునుఁ గాక 'భేదశ్రుతేః ౨-౪-౧౮.' అనుసూత్రమునందును భేదమే విచారింపఁబడుటవలనఁ బునరుక్తియు వచ్చుచున్నది. 'ఇట్లు కాదు. ౧౭-వ సూత్రమునఁ బ్రాణశబ్దమునకును ఇంద్రియశబ్దమునకును గలభేదము మాత్రమే యుద్దేశింపఁబడెను. ౧౮-వ సూత్రమున సందర్భభేదము కూడ నుద్దేశింపఁబడెను. కావున పున రుక్తి లేదు.' అనిన నదియు యుక్తము కాదు. ఇంద్రియప్రాణశబ్దమునకు భేద మున్నంతమాత్రముననే వానిచే జెప్పఁబడుపదార్థములు భిన్నము లని నిర్ణయించుటకు నెట్లు వీ లగును? ఇంద్రియశబ్దము సామాన్య ముగ ప్రాణభిన్న మగునేదియో యొకపదార్థమును చెప్పునా? లేక ప్రాణ భిన్న మయ్యు స్వతంత్ర మగుపదార్థమును చెప్పునా? మొదటిపక్షము నాశ్రయించిన ప్రాణవృత్తులు గూడ నొకపక్షమున ప్రాణభిన్నములే యగు టచే వానినిఁగూడ నింద్రియశబ్దముఁ జెప్పవచ్చును. పూర్వపక్షమునందు ఏకదేశి 'ఇంద్రియములు ప్రాణవృత్తులు' అనియే సిద్ధాంతము చేసి యుం డుటచే నాపక్షమునే యంగీకరించిన ట్లగును. ఇఁక రెండవపక్షము నాశ్ర యించిన నది నిలువదు. భిన్నపదములచే జెప్పఁబడినపదార్థము లన్నియు స్వతంత్రములుగ నుండవలయు నని నియమము లేదు. ప్రాణశబ్దమున కంటెఁ బ్రాణవృత్తిశబ్దము కూడ భిన్నమే. వృత్తులు ఆప్రాణమునకంటెఁ బరమార్థస్థితిలో భిన్నములు కావు కదా కావున నెట్లును శబ్దభేదమును మాత్రమే హేతువునుఁగా నాశ్రయించినఁ బ్రయోజనము లేదు. ఈకా రణమువలన నచ్చటఁ (చూ. ౧౭-వ సూత్రమునందు) గూడ శ్రుతిసంద ర్భములనే భాష్యకారులు వర్ణించియున్నారు; ౧౮-వ సూత్రమునందును మఱల దానినే సూత్రానుసారముగ వర్ణించిరి. ఇట్లగుటచే నావ్యాఖ్యాన మునఁ బునరుక్తి దుర్నివారమై వచ్చును. కావున వేఱొకవిధముగ నీయ ధికరణమునకు వ్యాఖ్యానము చేయుట మిగుల యుక్తియుక్త మని తోఁచు చున్నది. వాస్తవస్థితిలో 'ఇంద్రియములు ప్రాణవృత్తులు' అని మాత్రమే కాక 'ఇంద్రియములే ప్రాణములు' అని కూడ సంశయము మందబుద్ధు లకు సంభవింపవచ్చును కదా దానినిఁగూడ నిరాకరించిన మిగుల బాగుగ నుండును. 'త ఇంద్రియాణి' అనుసూత్రమునకు మొట్టమొదట చెప్పిన యర్థము న[illegible] ('ప్రాణేంద్రియ[illegible]యే' అనుసంశ

యమును పోఁగొట్టుట) కూడ సంభవించును" అని తలంచి కొందఱు "త ఇంద్రియాణి" అను ౧౭.వ సూత్రమునకు మాత్రము మఱియొకవిధముగ వ్యాఖ్యానము చేయుదురు.

"'ఇంద్రియములు ప్రాణవృత్తులు' అని మాత్రమే కాక 'ఇంద్రియములే ప్రాణములు' అని కూడ నీయధికరణమున పూర్వపక్షము రావచ్చును. పాణినిసూత్రము ననుసరించి చూచిన 'ఇంద్రునియొక్క చిహ్నమింద్రియము' అని తెలుచున్నది. ఇంద్రుఁ డనఁగా పరమేశ్వరుఁడు. ఇంద్రియముల నాశ్రయించి విమర్శించిన వాని కధిష్ఠాత యగుజీవుఁడు కానవచ్చును గావున జీవస్వరూపముతో పరిచ్ఛిన్నుఁడై యున్నపరమేశ్వరుఁడే యిచ్చట నింద్రశబ్దముచే గ్రహింపఁ బడవలయును. ఇట్టియింద్రియత్వము ప్రాణమునందుఁ గూడ కలదు; దాని నాశ్రయించియు జీవు నూహింపవచ్చును. ప్రాణములు గలవాఁడే బ్రతికియున్నవాఁ డనుటయు లేనివాఁడు జీవశూన్యుఁ డనుటయు లోకవ్యవహారసిద్ధము కదా! 'విషయముల గోచరములఁ జేసికొనుటకుఁ గాని యాలోచించుటకుఁ గాని సాధన మగుపదార్థము మాత్రమే యింద్రియము' అని చెప్పుటకును వీలు లేదు. కాంతియు విషయదర్శనమునకు సాధనమగును గావున నింద్రియము కావలసివచ్చును. కావున 'ఏయేపదార్థము భూతజన్యమై జీవుని గుఱుతింపఁ జేయునదియై యుండునో అది యెల్ల నింద్రియ మగును' అని మాత్రమే సిద్ధాంతముఁ జేయవలయును. ఇట్లు చేసినఁ బ్రాణము కూడ నింద్రియమే యగును. ఈకారణమునలన ప్రాణేంద్రియము లభిన్నములే కావలయును కదా! ఇప్పుడు పైఁజూపినసంశయము (ప్రాణేంద్రియము లభిన్నము లనుసంశయము) కలుగుటలో విరోధము లేదు కదా" అనియు పూర్వపక్షమును మఱియొకదానినిఁ (అధికరణారంభమున ఏకదేశిమతసిద్ధాంత మని చూపఁబడినపూర్వపక్షమునకంటె భిన్న మగుదానిని) జూపుదురు.

అవతారిక:—దాని నీక్రిందివిధముగ నిరాకరింతురు.

## సూ. త ఇంద్రియాణి తద్వ్యపదేశా దన్యత్ర శ్రేష్ఠాత్.

ప్రతిపదార్థము:—'తద్వ్యపదేశాత్' తత్ = ఆయింద్రియశబ్దముచే, వ్యపదేశాత్ = [illegible] ఇంద్రియాణి=

ఇంద్రియములు, శ్రేష్ఠాత్ =ముఖ్యప్రాణమునకంటె, అన్యత్ర=భిన్నములే.

తాత్పర్యము:—ఎచ్చట జూచినను ఇంద్రియశబ్దము వాగాదుల యందే ప్రయోగింపఁ బడుచున్నదిగాని ప్రాణమునందు లేదు. ఈకారణమునలనఁ బ్రాణేంద్రియములు భిన్నములే కావలయును. శబ్దమునకు *రూఢియే ప్రధానముగాని †యోగము కాదు. రూఢి గలపదములకు నిమిత్తమాత్రముగ వ్యుత్పత్తి కల్పింపఁబడు నంతియ కాని యంతమాత్రమున నాయోగమునుఁ బ్రధానము చేసికొనుటకు వీలు లేదు. "గచ్ఛతీతి గౌః"="నడచునది గోవు" అని వ్యాకరణమున గోశబ్దమునకు వ్యుత్పత్తి చెప్పఁబడి యున్నది. ఇంతమాత్రమున మనుష్యులయందు గోశబ్దమునుఁ బ్రయోగించుటకు వీలు కలదా? ఇట్లే యింద్రియశబ్దముఁ గూడఁ బ్రాణమునందుఁ బ్రయోగించుటకు వీలు లేదు.

మఱియు విషయదర్శనాదులకు సాధనము లగునవి మాత్రమే యింద్రియము లని మేము చెప్పము. "ఏపదార్థములు దేహము నాశ్రయించి దానియొక్క వృద్ధిక్షయములతో వృద్ధిక్షయముల నొందుచు విషయదర్శనాదులకు సాధనము లగునో యవి యింద్రియములు" అని మాత్రమే చెప్పుదుము. ఇప్పు డేదోషంబును రాదు; కాంతి యిట్టిది కాదు కదా! కావున నెట్లును ప్రాణేంద్రియములు భిన్నములే.

N. B. ఈవ్యాఖ్యానమునందును తక్కిన రెండుసూత్రములకును పూర్వమునందువలెనే యర్థము చెప్పుకొనవలయును.

---

# సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము. ౬.

విషయసంగతులు:—పై యధికరణమున "నామరూపభేదము లుండుటచే ప్రాణేంద్రియముల కైక్యము లేదు." అని సిద్ధాంతము చేయఁబడెను. ఆప్రస్తావమున "నామరూపవ్యవహారము లోకమున నెట్లు జరుగుచున్నది?" అని సంశయము రాఁగా నది యిందు ఆక్షేపసమాధానములతో

* రూఢి (చూ. పు. ౧౬౩.)

† యోగము (చూ. పు. ౧౬౩.)

నిర్ణయింపఁబడును. ఈకారణమువలన వీనికి రెంటికిని గలసంగతి ప్రస్తావ సంగతియే. "న వియ దశ్రుతేః ౨-౩-౧." అని యారంభించి పై యధికరణమువఱకు సృజింపఁబడిన విషయములనుఁ గూర్చి విచారింపఁబడెను; అందు గానవచ్చుశ్రుతివిరోధములు పరిహరింపఁబడెను. ప్రస్తుతాధికరణమున సృష్టినిఁగూర్చినవిరోధములు పరిహరింపఁబడును; అందును "సూక్ష్మభూతములు పరమేశ్వరునిచేత సృజింపఁబడెను" అనువిషయము నిస్సంశయముగ నిదివఱకే నిరూపింపఁబడియుండుటచే నిప్పుడు భౌతికపదార్థములజన్మముమాత్రమే విచారింపఁబడును. ఈభౌతికసృష్టికి *త్రివృత్కరణమే మూలము కావున నదియే యిందు విచారింపఁబడునని తెలిసికొనవలయును.

సందేహము:—"ఈత్రివృత్కరణము నాచరించినవాఁడు జీవుఁడా? లేక పరమేశ్వరుఁడా?" అనుసంశయ మొక్కటి కలదు. 'ఆకాశో హ వై నామరూపయోర్నిర్వహితా' 'ఆకాశశబ్దవాచ్యుఁ డగుపరమేశ్వరుఁడే నామరూపములను నిర్వహించుచున్నాఁడు (నామరూపములు త్రివృత్కరణానంతరమునఁ గాని సంభవింపవు. కావున నామరూపనిర్వాహము నాచరించువాఁడే త్రివృత్కరణము నాచరించువాఁడు కావలయుననుట).' అను మొదలగువాక్యములు పరమేశ్వరునే త్రివృత్కరణకర్తఁగాను "సేయం దేవ తైక్షత హంతాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీ తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణీ తి" = "సృష్టికర్త యగునాపరమేశ్వరుఁడు సూక్ష్మభూతముల సృజించి వానివలన వ్యవహారము సంభవింపకుండుట నెఱింగి వానిని స్థూలములఁ జేయఁదలంచి యిట్లు నిశ్చయించెను. ఆహా ఇఁక నేను జీవరూపముతో నీపృథివ్యాదులఁ బ్రవేశించి వానినామరూపములఁ బ్రకటించెదను వానిని త్రివృత్కృతములు గావించి స్థూలములఁ జేసెదను" అను మొదలగువాక్యములు జీవునే సత్కర్తఁగాను చెప్పుచున్నవి కదా!

పూర్వపక్షము:—సర్వంబును పరమేశ్వరకృత్యమే యగుటచే నీ త్రివృత్కరణము కూడ నట్టిదియే యని నిశ్చయించిన నిశ్చయింపవచ్చును గాని దానికి కొన్ని యాటంకములు గలవు. లోకమున రామకృష్ణాది నామముల నేర్పరచుటయందును ఘటపటాదిపదార్థరూపముల గల్పించుటయందును జీవునకే స్వాతంత్ర్యము కానవచ్చుచున్నది. ఇట్లగుటచే

* త్రివృత్కరణము (పుట ౧౦౩౮.)

నీత్రివృత్కరణమునందుగూడ నాతని కట్టి స్వాతంత్ర్యమే యుండవచ్చు నని తోఁచుచున్నది. సామర్థ్యముగలపదార్థమును నిరర్థకముగ సామర్థ్య హీన మని నిశ్చయించుట దోషయుక్తము కదా! మఱియు "అహం చారేణ పరసైన్య మనుప్రవిశ్య సంకలయామి" = "నేను చారునిమూలమున (చారరూపమున) శత్రుసైన్యమును ప్రవేశించి వారిమర్మములఁ దెలిసికొందును" అను మొదలగువ్యవహారములయందు సాధనభూతులుగా వర్ణింపఁబడి యున్నచారుఁడు మొదలగువారే మర్మజ్ఞానము మొదలగుక్రియలయందు కర్త లగుచున్నారుకాని కర్తలుగా చెప్పఁబడినరాజాదులు కారు. ఇట్లే యిచ్చట గూడ జీవుఁడు ముఖ్యకర్త కావచ్చును. పైనఁజూపినవాక్యమునందు రాజు యెట్లు *ప్రయోజకకర్త యగుచున్నాఁడో అట్లేశ్రుతివాక్యమునందును పరమేశ్వరుఁడు ప్రయోజకకర్త కావచ్చును. ఈనిర్ణయము నంగీకరింపకున్నచో మఱియొకదోషము వచ్చును. శ్రుతియందున్న "జీవేన" అను †కరణవాచకపదము నిరర్థకమగును. పరమేశ్వరుఁడే స్వతంత్రముగ కర్త యయ్యె నేని చేతనుఁ డగుజీవుఁ డాయనకు సాధనభూతుఁ డగుట యెట్లు? జీవుఁడు కార్యము నాచరించువాఁడై యీశ్వరుఁ డాతని ప్రేరేపించువాఁడై యుండునేని యప్పుడు ప్రభువునకు చారుఁడు సాధనమైనట్లు పరమేశ్వరునకు జీవుఁడు సాధనము కావచ్చును. వాక్యము నన్వయించుప్రకారము గూర్చి విచారించినను ఈనిర్ణయమే తేలును. వాక్యమునందలిపదము లన్నియు ముఖ్యక్రియతోనే సంబంధింపవలయు ననుట సామాన్యవిధి. అట్లు సంబంధించుటకు వీలు లేనియొకానొకచోట మాత్రమే విధిలేక నన్యపదములతో ‡(క్రియార్థము గలవిశేషణములతోఁ గాని §యసమాపకక్రియలతోఁ గాని) నవి యన్వయింపఁబడుచున్నవి. ఇచ్చట నట్టినిర్బంధము లేదనియు నట్లన్వయించిన విరోధము కూడ వచ్చు ననియు నిదివఱకే నిరూపించితిమి కదా కావున నిచ్చట త్రివృత్కరణమునకుఁ బరమేశ్వరుఁడు ప్రయోజనకర్తయే కాని స్వతంత్రకర్త కాఁడు; స్వతంత్రకర్త జీవుఁడే యని

---

* ప్రయోజకకర్త (చూ. పు. ౬౦౭.)

† కరణవాచకపదమనఁగా కరణమును చెప్పుపదము. (కరణము చూ. ౭౨౦.)

‡ క్రియార్థము గలవిశేషణములు చేయఁబడిన వచ్చుచున్న మొదలగునవి.

§ అసమాపకక్రియలు వచ్చి పోయి మొదలగునవి.

తేలుచున్నది. ఇట్లు "సేయం దేవ తైక్షత" అను మొదలగుశ్రుతివాక్యములకు జీవపరముగ నర్థ మేర్పడుచున్నది కావున వానికి "ఆకాశో హ వై" అను మొదలగువాక్యములతో నవశ్యముగ విరోధము కలదు. ఈవిరోధమునకు పరిహార మెట్లు ?

## సూత్రము. ౨౦.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౨౯౦. సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్. ౨. ౪. ౨౦.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. బాగుగ విమర్శించిన "సేయం దేవ తైక్షత" అను మొదలగువాక్యమునందు త్రివృత్కరణవిషయమున సంశయ మింత యైనను లేదు. "నామరూపములఁ బ్రకటించినవాఁ డెవ్వఁడు?" అనువిషయమునందు మాత్రమే "జీవేన" అనుకరణవాచకపద ముండుటచే సంశయము కలుగు చున్నది. "నామరూపే వ్యాకరవాణి" అని సంపూర్ణముగ నొకవాక్యభాగమును ముగించి పిదప నందలిముఖ్యకర్తను మాత్రమే యాకర్షించుకొని కదా "తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణి" అనియితరభాగ మారంభింపఁ బడెను. ఈకారణమువలన త్రివృత్కరణము జీవకార్యమగునేమో యను సంశయమే యక్కఱ లేదు.

విచారించినచో నామరూపప్రకటనవిషయమునఁగూడ నిట్లే సంశయము సంభవింపదు. జీవునకు రామకృష్ణాదినామముల నేర్పరచుటయందును ఘటపటాదిరూపముల కల్పించుటయందును సామర్థ్య మున్నను పర్వతనదీసముద్రాదిరూపములఁ గల్పించుటయందు సామర్థ్యములేదనుట యనుభవసిద్ధము కదా! సామర్థ్యము కల దనిన నది సంపూర్ణ మయ్యో యుండవలయును కాని కొలఁతగా నుండుటకు వీలు లేదు. ఏదియో యొకకారణమునవలన నట్టికొలఁతను సాధించినను అట్టివానికి నామరూపప్రకరణశక్తి కల దనుట సిద్ధాంతము కానేరదు. సర్వశక్తియుక్తుఁ డగుపరమేశ్వరుఁ డుండ నసమర్థులకు నల్పశక్తులకు వానిని (నామరూపప్రకటనకర్తృ

త్వమును) కల్పించుట యేటియుక్తి. ఘటాదిరూపకర్తృత్వము మొదలగునవి కూడ పరమేశ్వర ప్రధానమువలన వచ్చినవియే యైనను కావచ్చును కదా! మఱియు 'వ్యాకరవాణి' అనునది *యుత్తమపురుషక్రియ; దానికి "నేను" అనుపదముతోనే సంబంధ ముండవలయును కాని "జీవుఁడు" అనుపదముతో కాదు. ఇట్లగుటచే జీవునకే నామరూపప్రకటనకర్తృత్వమును చెప్పినచో నీయుత్తమపురుష నౌపచారికమునుగా గణింపవలసివచ్చును. తగినయుపపత్తి యుండ నిరర్థకముగఁ బ్రయోగమునకు నౌపచారికత్వమును కల్పించుట యుక్తమగునా? కావున "జీవేన" అనుపదమునకు సమీపమున నున్న "అనుప్రవిశ్య" అను నసమాపకక్రియతోనే సంబంధము కలదు కాని "వ్యాకరవాణి" అను ముఖ్యక్రియతో కాదు.

"ఇట్లు కాదు. వ్యాకరణసిద్ధాంతము ననుసరించి చూచిన అసమాపకక్రియకు నెవ్వఁడు కర్తయో †సమాపకక్రియకుఁ గూడ వాఁడే కర్త కావలయును. ఇట్లుండ నొకదానికి జీవుఁడు కర్త యనియు మఱియొకదాని కీశ్వరుఁడే కర్త యనియు నెట్లు చెప్పనగును?" అనియెద వేమొ వినుము. జీవేశ్వరులకుఁ గలభేదము పారమార్థికము కాదనియు అవ్యావహారిక భేదము నాశ్రయించియే సర్వవ్యవహారములును శాస్త్రములును ప్రవర్తించుచున్నవి యనియు పలుమాఱు చెప్పియున్నాము. ఇచ్చట గూడ నట్లే చెప్పఁబడియున్నది. పారమార్థికాభేదము నాశ్రయించి శ్రుతి సమానకర్తృత్వమును(రెండుక్రియలకును కర్త యొక్కఁడే యగుటను) సమర్థించినది; కల్పితభేదము నాశ్రయించి "జీవునకు నామరూపప్రకటన

---

* ఉత్తమ పురుష మధ్యమపురుష ప్రథమపురుష యని పురుషలు మూఁడు కలవు. నేను మేము అనుపదములు కర్తలుగా నేకాలమునందైనను ప్రయోగింపఁబడు క్రియ యుత్తమపురుషక్రియ. ఇట్లే నీవు అనుపదము కర్తగా నుపయోగింపఁబడునది మధ్యమపురుషక్రియ. వాఁడు అనుపదము కర్తగఁ బ్రయోగింపఁబడునది ప్రథమపురుషక్రియ. వాఁడు అనుపదమును కర్తగాఁ బ్రయోగించినప్పుడు మాత్రమే కాదు. నీవు నేను అనుపదమునకంటె భిన్నమగు నేపదమును కర్తగా ప్రయోగించినను అప్పటి క్రియ ప్రథమపురుషక్రియయే యగును.

† సమాపకక్రియ యనఁగా వాక్యమును ముగించుక్రియ. వచ్చెను పోయెను చేసెను మొదలగునవి.

మున స్వాతంత్ర్యము లేదు'' అనువిషయమును స్థాపించినది. కావున నిచ్చట వ్యాకరణవిరోధ మేమియు లేదు. కావున నెట్లు చూచినను త్రివృత్కరణము నాచరించినపరమేశ్వరుఁడు నామరూపప్రకటనమును గూడ గావించె ననుటయే సిద్ధాంతము. "ఆకాశో హవై" అనుమొదలగు శ్రుతులనేకము లీవిషయమునఁ బ్రమాణములు.

ఇచ్చట భౌతికము లగుపదార్థములయొక్క నామరూపప్రకటనమును గూర్చి మాత్రమే విచారింపఁబడెను కాని తక్కిననామరూపప్రకటనమును గూర్చి విచారింపఁబడలేదు. సూక్ష్మభూతములు సృజింపఁబడినప్పుడు కూడ వానినామరూపప్రకటన ముండియే తీరవలయును కదా! విచారించిన నది సృష్టిని చెప్పుటచేతనే చెప్పఁబడినట్లయ్యె ననవలసి యున్నది. పరమేశ్వరుఁడే దానికి (సూక్ష్మభూతనామరూపప్రకటనకు) కర్త యనుట శ్రుతికి నభిప్రాయ మని నిర్ణయింపవలసి యున్నది. సూక్ష్మభూతములు మనకు గానరాకున్నను పరమేశ్వరునకు గానరావచ్చు ననుటలో సంశయము లేదు కదా! ఈకారణమువలనఁ గూడ భౌతికనామరూపప్రకటనము పరమేశ్వరకృతమే యని సిద్ధాంతమగుచున్నది. ఆత్రివృత్కరణమువలననే భూతత్రయస్వభావము లొక్కచో గలసి స్థూలములై మననేత్రమునకు గోచరము లగుస్థితికి వచ్చియున్నవి. త్రివృత్కరణమునందు ప్రతిభూతమునందును స్వకీయ మగునర్ధభాగ మొక్కటియును తక్కినభూతములలోని పాదాంశములు రెండును గలసి యుండును. ఇట్లగుటచేతనే మనకు దోఁచుప్రతిపదార్థంబును సర్వాత్మకముగ తోఁచుచున్నది. ఇట్లు తోఁచుట రూప ముండిననే కాని సంభవింపదు కావున నిదియే రూప ప్రకటనప్రకారము. మనకు తోఁచినదానిని యితరపదార్థములనుండి వేఱు సేయుటకై యేదియో యొకపేరుతో పిలుచుచున్నాము కదా ఇదియే నామప్రకటనప్రకారము. పరమేశ్వరుఁడు త్రివృత్కరణమును గావించెను కావున భూతత్రయరూపముల నొక్కచో జేర్చి రూపప్రకటన కర్త యయ్యెను? జీవరూపముతో సర్వనామముల వ్యవహరించుచున్నాఁడు కావున నామప్రకటన కర్తయు నయ్యెను. జీవేశ్వరులకు పారమార్థికభేదమును భావించి "పరమేశ్వరుఁడు జీవునిచే నామరూపప్రకటనమును చేయించును'' అని చెప్పుటయే పూర్వపక్షుసార మరియు వారలకు కల్పితభేదము నాశ్రయించి "స్వయముగ

త్రివృత్కరణముచే రూపప్రకటనము నాచరించినవాఁడును జీవరూపముతో నామరూపప్రకటనము నాచరించినవాఁడును కూడఁ బరమేశ్వరుఁడే" యనుట సిద్ధాంతసార మనియును తెలిసికొనవలయును. ఈఛాందోగ్య శ్రుతియందు మూఁడు భూతములు మాత్రమే చెప్పఁబడి యుండుటచే త్రివృత్కరణము చెప్పఁ బడె ననియు ద్వితీయాధ్యాయతృతీయపాదము నందుఁ దైత్తిరీయశ్రుతి ననుసరించి తక్కిన రెండుభూతములు కూడ జనించినవియే యనువిషయము సిద్ధాంతము చేయఁబడి యుండుటచే భూతము లైదు కాని వాస్తవస్థితిలో మూఁడు కా వనియు నీకారణమువలన నన్నిభూతములును స్థూలము లగుట యావశ్యక మగుటచే * పంచీకరణమే యాచరింపఁ బడవలయును కాని త్రివృత్కరణము కా దనియు ని ట్లగుటచే శ్రుతియందును పంచీకరణప్రకారమును గ్రహించుటకై మాత్రమే త్రివృత్కరణ ముపదేశింపఁ బడె ననియును తెలిసికొనవల యును.

## సూత్రము. ౨౧.

అవతారిక:—"'ఇమా స్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్త్రివృ దేకైకా భవతి'='త్రివృత్కరణముచే స్థూలములైన యీపృథివీ జలతేజస్సులు మూఁడును †ఆహారపదార్థరూపముతో శరీరమును ప్రవేశించి ప్రత్యేకముగ మూఁడువిధములుగ భావింపఁబడును; అని లోపల కూడ భూతములకు మఱియొకత్రివృత్కరణము శ్రుతియందుఁ

---

* పంచీకరణము (చూ పు. ౧౩౫. డు.)

†పృథివ్యాదిమయము లగు నాహారపదార్థములు:—

ఏ యే యాహారపదార్థములు పృథివ్యాదులనుండి జనించి నీటిలోఁ జివికిపోవుచున్నవో అవి పృథివీసంబంధమైన యాహారపదార్థములు; ధాన్యములు ఫలములు ఆకులు కాడలు మొదలగునవి. ఏయాహారపదార్థము లెప్పుడును ద్రవరూపము లై యుండునో అవి జలమయపదార్థములు; జలము మద్యము మొదలగునవి. ఏయాహారపదార్థములు అగ్నిసంయోగమువలన మాత్రమే కఱఁగి యెంతకాలమున కైనను ఇనికిపోవకుండునో అవి అగ్నిసంబంధ మగు పదార్థములు; ఘృతము మొదలగునవి. కేవల మాహారపదార్థములు మాత్రమే కాదు. ఈలక్షణములచే సర్వద్రవ్యములను పృథివ్యాదిమయములుగా నెఱుంగవలయును.

జెప్పఁబడెను. యవలు గోధుమలు మొదలగు భూసంబంధము లగునా హారపదార్థములు భుజింపఁబడినపిదప పచనమై మూఁడువిధములుగ నేర్పడు ననియు అందు మిగుల స్థూలమగుభాగము మలరూపముతో వెలికిఁ బోవు ననియు మధ్యమ మగుభాగము మాంస మగు ననియు మిగులసూక్ష్మ మగుభాగము మనోరూప మగుననియుఁ జెప్పఁబడియున్నది. యిట్లే జలమునందును అతిస్థూలభాగము మూత్ర మగుననియు మధ్యమ భాగము రక్త మగుననియు సూక్ష్మభాగము ప్రాణ మగు ననియు నిర్ణ యింపఁబడి యున్నది. ఈవిధముగనే ఘృతము తైలము మొదలగు తైజసపదార్థములయొక్క యతిస్థూలభాగము యెముకలుగాను మధ్యమ భాగము క్రొవ్వుగాను సూక్ష్మభాగము వాగింద్రియముగను మాఱు నని యు జెప్పఁబడెను. ఇది యంతయు విరుద్ధము. మలమాంసములు భూసం బంధము లైనవే యైనను మనస్సు మాత్ర మట్టిది కాదు. అది నిత్యము జలభూతముచే జనించిన వని చెప్పఁబడినపదార్థములలోను మూత్రరక్త ములు మాత్ర మట్టివే కాని ప్రాణము కాదు. అది వాయువికార మని యిదివఱకే సిద్ధాంతముఁ జేసియున్నాను. తైజసపదార్థములయందును వాగింద్రియము చేరదు. అది యహంకారమువలన జనించెను కాని తేజ స్సు వలన కా దని సాంఖ్యులు చెప్పుదురు. మనస్సు కూడ వైశేషికమత మున మాత్రము నిత్యమే కాని సాంఖ్యమతమున నహంకారజన్యమే. యిం దేది యథార్థము" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.—

## ౨౯౧. మాంసాది భౌమం యథాశబ్ద మితరయో శ్చ. ౨. ౪. ౨౧.

తాత్పర్యము:—ఈవిషయమున సంశయ మక్కఱ లేదు. శ్రుతి యందుఁ జెప్పఁబడి యున్నయట్లు సర్వమును నిరాటంకముగ నంగీకరింప వచ్చును. మాంసాదు లెట్లు పృథివీసంబంధము లనుటలో సంశయము లేదో అట్లే మనస్సుకూడ పృథివీసంబంధ మనుటకు సంశయింప నక్కఱ లేదు. కానాదమతము యుక్తిశూన్య మనియు పరమేశ్వరునికంటె నన్య మగునిత్యపదార్థ [illegible] నిరూ

పించియే యున్నాము. ఒక్కపదార్థమైనను పరమేశ్వరునుండి జనింపనిది యగునేని సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగము వచ్చునని యనేకస్థలములయందు చూపియున్నాము. ఇట్లే మూత్రాదులు జలభూతమువలన జనించినవి యైనట్లు ప్రాణముకూడ జలభూతమువలననే జనించినది యగును. అది వాయువికారమగుట నిస్సంశయమే, కాని దానివృద్ధిక్షయములు మాత్రముజలాధీనములై యున్నవి. ఈకారణమువలననే శ్రుతియం దది జలకార్యముగాఁ జెప్పఁబడెను. ఇట్లే యెముకలు మొదలగువానితోపాటు వాగింద్రియముకూడఁ దేజోభూతమువలన జనించినదియే. సాంఖ్యమతమునఁ గల్పింపఁబడినయహంకార మప్రామాణికమనియు దానివలన నేదియు జనించుటకు వీలు లేదనియు యిదివఱకే చెప్పఁబడెను. కావున శ్రుతిసిద్ధాంతమే మిగుల యుక్తియుక్తము.—

## సూత్రము. ౨౨.

అవతారిక:—"ఇప్పటికిని దోషము పోవదు. అన్నిభూతములును త్రివృత్కరణముఁ జేయఁబడినవే యైనచో 'నిది భూమి; ఇది భూమివలన జనించినపదార్థము.' అనుభేదజ్ఞానము కలుగుట యెట్లు వచ్చును?" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.—

## ౨౯౨. వైశేష్యాత్తు తద్వాద స్తద్వాదః.

### ౨. ౪. ౨౨.

తాత్పర్యము:—త్రివృత్కరణమువలనఁగలుగబోవు వ్యవహారలోపమేదియు లేదు. ప్రతిభూతమునందునుఁ దక్కినవాని యంశములకంటె స్వాంశమే యధికముగ నుండు నని యిదివఱకే చెప్పి యున్నాము. లోకానుభవము కూడ నిట్లే యున్నది. ప్రతివాఁడును ప్రతిపదార్థంబును సర్వభూతమయమునుగా గ్రహించుచునే యున్నాఁడు. అందు దేనిభాగము విశేషముగ నుండునో దాని దాని ననుసరించి తత్తత్కార్యమునుఁగ వ్యవహరించు చున్నాఁడు. యెఱ్ఱనిరాతిని చూచినప్పుడు దానియందు ప్రత్యక్షముగ తేజోభూతముయొక్క వర్ణమగురక్తత్వము కానఁబడు చున్నను అందు భూభాగ మధికముగ నుండుటచే "ఇది పృథివీభూతము

వలన జనించినది" యనుచున్నాఁడు. మనస్సు మొదలగువాని విషయము లందును నిట్లే నిర్ణయింపవలెను. అన్నియు నన్నిభూతములవలనను జనించినవే యైనను ఒక్కొకదానియం దొక్కొక్కభూతముయొక్క భాగము మాత్రమే యధికమై ప్రధానమై యుండును. మనస్సునందు భూభాగ మధికము. ప్రాణమునందు వాయుభాగమే యధికమైనను జలభాగము ప్రధానము. జలభూతమువలన జలభాగ మభివృద్ధి నొందినప్పుడు మాత్రమే ప్రాణమున కభివృద్ధి కలుగు నని సదృష్టాంతముగ శ్రుతియందు నిర్ణయింపఁ బడి యున్నది. ఇట్లే వాగింద్రియము కర్మేంద్రియమే యైనను జ్ఞానప్రధానమగుటచే నందునుఁ దేజోభాగమే ప్రధానమని యంగీకరింపవలయును. ఈకారణమువలనఁ ద్రివృత్కరణ మంతటను సమానముగానే యున్నను వ్యవహారభేదము కలుగవచ్చును. త్రివృత్కరణ మని ప్రస్తావింపఁ బడినస్థలములయందెల్ల పంచీకరణమే ప్రస్తావింపఁబడెననియు భూతములు ప్రస్తావింపఁబడినచోట్ల నెల్లపంచభూతములే ప్రస్తావింపఁబడెననియు నూహింపవలయును. ఆకాశవాయువులు మిగుల సూక్ష్మములగుటచే వానికిసంబంధించినకార్యములు గూడఁ బ్రత్యేకముగ విభాగించుటకు నశక్యము లనుతలంపును శ్రుతి వానిని జెప్పలేదు. ఆయుర్వేదమునందు *నాకాశవాయుసంబంధము లగుపదార్థములు కూడ లక్షణసహితముగ వర్ణింపఁబడి యున్నవి కాని వానివలనఁ గలుగుకార్యభేదములు

---

* ఆకాశవాయుసంబంధము లగుపదార్థములు:—

వాయవ్యం రూక్షవిశదం లఘు స్పర్శగుణోల్బణం, రౌక్ష్య లాఘవ వైశద్య విచార గ్లానికారణం. నాభసం సూక్ష్మవిశదలఘు శబ్దగుణోల్బణం, సౌషిర్యలాఘవకరం' 'వాయుసంబంధ మగుపదార్థము చమురు లేనిదిగను స్వచ్ఛమైనదిగను సులభముగ జీర్ణమగునదిగను ఉష్ణశీతస్పర్శములు లేక సమానముగ నుండునదిగను ఉండును. దానిని భుజించిన మార్దవము లేకపోవుటయుఁ జాలకదనంబును స్వచ్ఛత్వంబును మనస్సునకు స్వాస్థ్యము లేకపోవుటయు బలహీనతయుఁ గలుగును. ఆకాశసంబంధమగుపదార్థము సూక్ష్మముగను స్వచ్ఛముగను సుఖముగ జీర్ణమగునదిగను ధ్వనించు స్వభావముగలదిగను ఉండును. దానినిభుజించిన శరీరమునకు చులకదనంబును మార్దవంబును లేక ధాతుక్షయంబును గలుగును' అని యాకాశవాయుపదార్థముల లక్షణగుణములు ఆయుర్వేదమున నున్నవి.

కూడ పృథివ్యాదిభూతత్రయకార్యములందే యంతర్భావమును జెందును కాని విభాగించుటకు వీలు పడవు. సూక్ష్మబుద్ధిచేత వానిని కూడ విభాగించి చెప్పవచ్చును కాని శ్రుతికి నది ముఖ్యోద్దేశము కాదు కదా! పరమేశ్వర రూపమును నిర్ధారణఁ జేయుటకై యీసృష్టిని చెప్పుచున్నది కాని సృష్టి స్వరూపమును పదార్థతత్వమును నిర్ణయించుటకై కాదని యిదివఱకే నిరూపించి యున్నాము. "మృల్లోహవిస్ఫులింగాద్యైః సృష్టిర్యా చోదితాన్యథా, ఉపాయస్సోఽవతారాయ నాస్తి భేదః కథంచన"= "మృత్తిక యినుము మిడుఁగురులు మొదలగువానిదృష్టాంతములచే ననేక విధములుగ సృష్టి చెప్పఁబడుట యెల్ల జీవబ్రహ్మైక్యమును తెలిసికొనుట కుపాయము మాత్రమే. ఎట్లు చూచినను భేద మనునది బొత్తుగనే లేదు." అని ఈవిషయమునందు మహాత్ములవాక్యములను కూడఁ బ్రమాణముగ నుదహరించి యున్నాము. కావున నాకాశవాయువులవిషయము గాని వానినుండి జనించినపదార్థములయొక్క విషయము గాని ఛాందోగ్య శ్రుతియందు లేదని సంశయింపఁ బని లేదు.

## అధ్యాయతాత్పర్యము.

సమన్వయాధ్యాయమునఁ జేయఁబడినసిద్ధాంత మీయధ్యాయ మున నాక్షేపసమాధానములచే బాగుగ స్థిరపరుపఁబడెను. చేతనుఁడగు పరమేశ్వరుఁడే జగత్కారణ మనియు మాయావైచిత్ర్యమువలన రజ్జువు నందు సర్పమువలె నాపరమేశ్వరునియందే చేతనజడాత్మక మగునీ ప్రపంచము గానవచ్చుచున్నది యనియు ఈకారణమువలన ప్రపంచబ్రహ్మ ములకు భేదమే లేదనియు జీవబ్రహ్మ లొక్కటియే యనియు నాజీవుఁడు స్వాభావికముగ శుద్ధుఁడే. కావున శాస్త్రవిచారాదులచే నావృత్తాంతమును తెలిసికొనిన స్వస్వరూపముతో నిలచు ననియు బంధ మెప్పటికిని లేదు కావున నదియే ముక్తి యనియు యెట్లు విచారించినను ముక్తికి నింతకంటె మార్గాంతరము లేదనియు జేయఁబడి యున్నసిద్ధాంత మీయధ్యాయ మున స్థిరపరుపఁబడెను. ప్రథమపాదమున మొట్టమొదటి రెండధికరణ

ములయందును సాంఖ్యయోగస్మృతులు కేవలమోక్షార్థమనియే ప్రవర్తించునవి యైనను వానియందలిసిద్ధాంతము యుక్తియుక్తము కాదనియు నది వేదమతమును తిరస్కరింప లేదనియు నిరూపింపఁబడెను. పిదప పాదాంతమువఱకు సర్వమతసాధారణము లగు కొన్నికొన్ని యుక్తుల ననువాదముఁ జేసి వానివలన వేదాంతసిద్ధాంతమునకు విరోధము లేదని నిర్ణయింపఁ బడెను. పరమేశ్వరుఁడు చేతనుఁడైనను నిత్యశుద్ధుఁడైనను అద్వితీయుఁడైనను సహాయాంతరరహితుఁడైనను జీవాభిన్నుఁడైనను శరీరరహితుఁడైనను ఆప్తకాముఁడైనను నిర్దోషుఁడైనను నిర్గుణుఁడైనను సర్వశక్తుఁడగుటచేమాయాప్రభావమువలన జడచేతనాదిభేదముల తోను ఉచ్చనీచభేదములతోను నానావిధములై యున్నయీప్రపంచమును యోగసిద్ధి గలదేవతలు మొదలగువారు తమదేహమున ననేకవిధములుగ నాచరించునట్లు సృష్టించుచున్నాఁడనువిషయము బహుయుక్తులచే నిరూపింపఁబడెను. ఇట్లు వేదాంతసిద్ధాంతముపై వచ్చుపూర్వపక్షముల ఖండించి రెండవపాదమున సాంఖ్యాదిపరమతముల సూత్రకారుఁడు దూషించెను. ఒకానొకసమయమున పరబోధవలన వేదాంతికిఁ గూడ బరమతములయం దాదరము జనించి ముక్తికి విఘ్నకారి యగునేమో యని యామతములయందలిదోషములఁ గొన్నింటి జూపెను. భ్రాంతిచే నామతములయందుఁ బ్రవేశింప రాదు అనువిషయమును స్థాపించెను. తరువాత మూఁడవపాదమున భూతోత్పత్తి జీవస్వరూపస్వభావములు మొదలగు వానివిషయమున శ్రుతులలో బరస్పరవిరోధ మున్నట్లుఁ గానవచ్చుచున్న నాసంశయమును నిరాకరించెను. ఆకాశాదిపంచభూతములును బ్రహ్మము నుండి జనించినవియే యనియుఁ బరమేశ్వరుఁడు నిత్యుఁ డనియు జీవుఁడు పరమేశ్వరునకు ప్రతిబింబము కాని ఘటాకాశమువలె నొకపదార్థముచే నావరింపఁబడినస్వస్వరూపమే కాని యైయున్నాఁడనియు నిరూపించెను. నాల్గవపాదమున నింద్రియప్రాణసృష్టులను గూర్చియు వానిస్వభావములను గూర్చియుఁ గొంతవఱకు విచారించి యంతమున నామరూపనిర్వహణము మొదలగుకార్యము లన్నియుఁ బరమేశ్వరకార్యములే యని నిర్ణయించెను. "పూర్వోత్తరవిరోధముండుటచే సాంఖ్యాదిమతము లప్రమాణము

లైనట్లే శ్రుతులయందును బరస్పరవిరోధ ముండుటచే వేదాంతమతము కూడ నప్రమాణమే కావలయును." యనుసంశయము సంపూర్ణముగ తృతీయచతుర్థపాదములయందు నిరాకరింపఁబడెను. ఈకారణము వలన వేదాంతసమన్వయ మిప్పటికి నిర్దుష్టమై సర్వజనసేవ్యమై స్థిరపడినది.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామశర్మచే రచియింపఁబడిన బ్రహ్మసూత్రార్థచంద్రికయందు ద్వితీయాధ్యాయము చతుర్థపాదము.

ఇతి శ్రీభగవద్వేదవ్యాసప్రణీతేషు బ్రహ్మసూత్రేషు
ద్వితీయాధ్యాయస్య చతుర్థః పాదః.

ఇది బ్రహ్మసూత్రములందు ద్వితీయాధ్యాయమునఁ
జతుర్థపాదము.

---

# సూత్రానుక్రమణిక.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1921.

## శ్రీ మహాభక్తవిజయము.

ఇదివఱకు మన ఆంధ్రభాషలో సర్వాంగసుందరమైన భక్తవిజయము ప్రకటింపఁబడియుండలేదు. శ్రీపాద. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వ్రాయించి ఈ మహాభక్తవిజయమును ప్రకటించినారము. శ్రీశాస్త్రిగారి మృదుమధురమగుశైలి, ముద్దులు మూటగట్టు పదరచన, మనోహరమగు వర్ణనాక్రమము ఆంధ్రదేశీయులకు తెలియునివిగావు.

ప్రతి 1-కి రూ. 4.0.0.

## శ్రీ వివేకానందవిజయము.

ఇందు శ్రీ స్వామివారిజీవితము, ఉపన్యాసములు, జాబులు విపులముగ వ్రాసి ప్రకటించినారము. ప్రతి 1-కి రూ. 1.12.0.

## సీతారామాంజనేయసంవాదము, సటీక.

అనేకనూతనవిషయములఁ జేర్చి చిన్నసైజున చక్కఁగముద్రించినారము. ఇదివఱకు ప్రకటితములైన గ్రంథములకన్న ఈకూర్పు బాగుగనున్నదని గ్రంథము చూచువారికి తెలియకపోదు.

సాధారణప్రతి 1-కి రూ. 2.8.0.
మేలుప్రతి 1-కి రూ. 3.8.0.

## పెద్దబాలశిక్ష.

చక్కఁగ పరిష్కరించి అనేకనూతనవిషయములు, భూగోళచరిత్రాంశములు, పటములుఁ జేర్చి మంచికాగితములపై పెద్దయక్షరములతోఁ జక్కఁగఁ బ్రకటించియున్నాము. సాధారణప్రతి 0.8.0.

మేలుప్రతి 0.12.0.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.